చ . పలుకవు నిన్నువంటి కులభామలఁ గానవు వారి కాత్మనాథులపయి జాలి లేదొ తమి దొట్టిన పట్టున మట్టుపెట్టరో కువల 3 43

సీ నూఁబూవువంటినాసికయు హార 3 23

**వంటి(టయి)ల్లు** వి బొ (వంట + ఇల్లు) మహానసము, వంటచేసికొను గృహము

సీ వంటిల్లు యామినీశ్వరకలామౌళికిఁ దరిచోటు నిఖలబృందారకులకు భీమ 3 51

ఉ బుద్ధికి జూడ్కికిన్ వెలుగుఁబూన్పె గృహాంతుని వంటయిల్లనన్. ఉ రా 3 385

శా ... డాఁగఁబోయినఁ దలారిల్లయ్యె వేఁడేడకుం, బోనాఁ జిక్కితి వంటయింటికళమై బోనంపుఁ జెన్గూటికిన్ దశా 1 297

ఉ .. వంటయింటి కుం,దే లిది యెందుఁబోఁ గలదు విజ. వి 1 6

సీ వంటయిల్లనఁగను బొనఁగ చుండును మహానస సమాఖ్య అం భా 2 242

**వంటు** వి అనుకూల్యము

ఆ వంటుదప్పువేళ వంటకము విషంబు, కంటఁ జూడఁగానె కంటగించు (బ్రౌ ని, శ ర)

**వంటుఁడు** నం విజ (అ ఆ అ) పెండ్లి కానివాడు

వి అ పుం బ్రహ్మచారి

**వంటెము** వి సీమైకదేశము

సీ వంటెమంచనఁ గను సీమైకదేశమై చెలగు చుండు (అం భా 2 7)

('తాలూకా' అని బ్రౌ ని)

**వంరము** నం వి అ పుం చిన్న యూఁటె

**వంతరము** నం వి అ పుం 1 లేఁతవెదురు పైనుండెడిపొర 2. తాటిచెట్టుమొలక 3 మేఁకను గట్టెడు త్రాడు 4 కుక్క 5 కుక్కతోఁక 6 మేఘము 7 స్తనము

**వంతుఁడు** నం విజ (అ ఆ అ) 1 పెండ్లి కాని వాడు అవివాహితుఁడు 2. మఱుగుజ్జు పొట్టి వాడు 3 కుంటివాడు

వి, అ పుం 1 బ్రహ్మచారి 2 సేవకుడు, భృత్యుఁడు 3 మఱుగుజ్జువాడు

**వండ** – వండలి, వండు[1] వి 1, చెఱువు లోనగు వానియం దడుగున నుండెడి యేడిన బురద. (శ ర)

2 ఆపద, కష్టము (శ ర)

**వంద** నం వి ఆ స్త్రీ రండ వ్యభిచారిణి యగుస్త్రీ (మే ని)

**వండము** నం వి అ పుం తోఁకలేనియెద్దు

**వండరుఁడు** నం వి అ పుం 1 లోభి పిసినారి నపుంసకుడు

**వండఱు** అ క్రి. (వండు[1] + అఱు.) బురద విఱుగు, తేఱు, నిర్మలమగు.

వ. దోన దోరగిలం జాలెఁ బయ్యెర విసరె వారి వండఱియెఁ గరిమదంబుఁ గురిసె కాశీ 3 23

**వండలి** వి చెఱవు లోనగువాని యడుగున నుండెడి బురద, వండ (శ ర)

**వండు[1]** – వండ వి బురద

సీ తురగఖురోద్ధూతధూళి తన్పెరసిన వననిధి పిండలి వండుగాఁగ భార విరా 3 156

సీ వానకాలమునాఁడు వండు వట్టిన నీటి కాలువ్యముడిపెడు కతకఫలము ... కాశీ 160

గీ అతని తపమున లోకంబు లడరె గిరులు, వడఁకె జలధులు పిండలివండులయ్యె, ధరణి కంపించె సూర్యచంద్రరుచు లడఁగెఁ, దారకంబులు రాలె దిక్తటులు ప్రీలె చిత్ర భా 2 53

జ వాండఱు

**వండు[2]** అ క్రి పాకముచేయు, వంటచేయు

శా సేవాదక్షత యొండుమై నెఱుఁగ నీచిత్తంబున న్మెచ్చున, క్లేవండం గడునేర్తు భార. విరా 1 218

గీ, వఁడనలయందు వేవురు పచ్చిరేని, నన్నపూర్ణకు నుద్దియా నతనిగృహిణి . మనుచ 1. 56

వండినకుడుము – ఇది భోగ్యపదార్థము సిద్ధముగా నున్న దనుట కుపమానముగా గ్రహింపబడినది

క తిండి కతఁబునఁ గఁడలు, మెండుగఁ దాఁ జెంచి మగఁడు మెదలఁ డనుచు ను,ద్దండత నది మిండనికిన్, వండినకుడు మనఁగ దుడ్డువెఖరి మెలఁగున్ శుక. 2 102

జ వంట, వంటకట్టె, వంటకత్తియ, వంటకము వంటకూతి, వంటకొట్టము, వంటచమురు, వంట చలిమిడి, వఁటచెఱకు, వంటపని, వంటపూట వాఁడు, వంట పూటిల్లు, వంటయుప్పు, వంట

రాంబు, వంటరి, వంటలక్క, వంటలక్కతనము, వంటలవాఁడు, వంటవాఁడు, వంటసరకు, వంట సాల, వంటిల్లు

**వండుఁడు** సం విణ (అ ఆ అ) 1 వికలాంగుఁడు, అంగవైకల్యము గలవాడు 2 పెండ్లికానివాఁడు 3 నపుంసకుఁడుఁగాఁ జేయఁబడినవాఁడు 4 లింగాగ్రచర్మము లేనివాఁడు

**వంత**[1] వి ఏఱు, నది

క వంతలఁ బొంతలఁ బడిపలు, వంతలఁ గాసిలఁగఁ దగునె వలిగొజ్జఁగిపూ,బంతీ యింతీ సొగసుల, దొంతీ మము నింతఁ గలఁప దోసముగాదే అచ్చ. రా. అర 99

క సుడివడి యడలుచు బన్నము, వెడచూపక పాదమవంత వెలయఁగఁ గడు లో,నుడుకుచు నుండెడివారల,యెడ దొరలకుఁ గనియఁబోలునే యొకమీఁడా అచ్చ రా యు 77.

(ఇట 'మనోవ్యథ' యని రెండవ యర్థము.)

ద్వి వాఁగువంతల నోరవరలు నీరంబు నవ, 2 102 పా. 10 పం

**వంత**[2] వి 1 సంతాపము చింత.

సీ సంతోషయుతుఁడనై వంతయు భయమును శీతాతపంబును వాతగతియు, నెఱుగక భార. ఆది 5. 60

సీ వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి ... నైష. 3 36

చ . పెల్లలము వియోగవహ్ని భవదంతర సైకతపంక్తిపొంత వం,తలఁ బొరలించి తొదు శమనప్పన పుగ్రమయూఖనందనీ ఆము 5 70

2 బాధ

క . మి,క్కుటమగు వంతలఁగుందుచు నీలా 2 71

సీ. వంత,గాసి వెతారము కాఱియ వెత చను వ్యథ ఆం భా 1 150.

3 వడుపు

గీ వంతఁ బొందుచుఁ ,,,,,,, వ్యత్యాంతమల్ల, నెఱుఁగఁ జెప్పుటయును మృపాకృప దలిర్ప, నాసవహోదరి వీవు కాంతాలలామ, యేద్వఁగా నేమిటికి నీకు నివ్విథమున పారిశ్ర 5 114

(ఈ యర్థ మితరగ్రంథములయందుఁ గానరాదు) (శ ర)

జ వంతచేయు

**వంతచేయు** అ క్రి (వంత[2] + చేయు) దుఃఖపడు

చ ఆ తపసి పాల్పడి మిక్కిలి వంతచేయు దో, యని యనిశంబు దద్దయు భయంపడు చున్నది లోకమింతయున్, కు సం 7 23

**వంతు** వి భాగము

సీ పంపు పాల్ వంతు నా భాగంబు విలసిల్లు . ఆం భా 2 275.

ఉ కొంతని కాదు చాలఁ దొడుఁగుల్ మడుఁగుల్ గొడుగుల్ సువర్ణముల్, దొంతిగ నుప్పుతోఁ గలుగు తొమ్మిదియుం గొని యేఁటికేఁటికే, వంతుగ నాపెచే మనని వారలు లేరు నిజం బుగా . . ఘటికా 1 43.

క అంత నొకవారమునఁ దన, వంతగుటయు నిశితబుద్ధివహనము ధీర, స్వాంత మొక ధూర్త శకకము,దంతి| పతిపతికడకుఁ దనియించుటకున్ వేం పంచ 1 345

2 పోటి, స్పర్ధ

ఉ . పతిఁ గూర్పుదాన నా,యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్, వంతున వచ్చు సత్య గరువం బిఁకఁ జెల్లదటంచు మానినీ పారి 1. 80

రగడ. వంతేఁటికి గోరంతే మల్లెల, వంతున కానే వంతులఁ జెల్లెల, . యయా 4 25

గీ, మాచిపత్రియుఁ గురువేరు మరువకంబు, దవన మును గగ్గెరయు బిల్వదళము లాది, యైన పూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంతులకుఁ గొండపాడవుగా వైచుటయును. ఉ రా 3 204.

3 సామ్యము.

వ . వంతుమీఱు చేమంతుల చెంత వండ గొన్న బొండుమల్లియలం గలసి ఉ. రా 6 24

వింతలె నిన్ను వంటియవివేకిను లెందఱు లేరు వారినే, వంతుకుఁ దేను నా మనసు వచ్చినజాణ యొకర్త తారయే, కాంతుని పజ్జమాని వగకాఁ డగు చంద్రునిఁ గూడ నేల ,,, దశా. 7, 83

4, వరుస,

గీ చిగురువిలుకాని జాతర సేయఁబూని, కోలము సాములనందఱఁ గూడఁబెట్టి, వంతుగలయంగ బువ్వంపుబంతివిందు, పెట్టి రెలమిఁ జకోరపుఁ బేరఁటాండ్రు పారి 2, 48

రగడ బంతులాడుదము వంతుల గట్టుక, చెంతతు రమ్మిఁ చెలిఁజేపట్టుక బిల్హ 2 29

వంతువోవు - భాగముతెగు

చ ఇల నిజసామ్యవర్తులవయిం దమవారిఁగదల్చు సాత్మహ, స్తలలితభర్మకుంభముల దంభ మణం పఁగ వంతువోక య,స్యులగతి నీవు నీవనుచు నొంటక గుబ్బలురాయిడింపఁగా, జలకముదేల్చి రిద్ద అలిజాలకనీలకచా శిరోమణుల్ రా వి 5 54

జ వంతువడు

**వంతువడు** అ క్రి. (వంతు + పడు) వంతులు వేసికొను

గీ దివిజరాజాదిదిక్పాలదేవతాక, విశిఖముల నిట్లు దైతేయవిశసనంబు, సలిపి రిక్ష్వాకు సుకుమారు లలయ కెలమిఁ గొంతవడి వంతువడి మరు తోక్కటి వొగడ కకు 2 118

**వంతెన** వి ఏఱులోనగు వానికి నీళ్ళుపోవుటకు తూములు విడిచి మీఁద నడచిపోవుట కనువుగాఁ గట్టిన కట్ట (శ ర)

**వంద**[1] – **వందె, వదియ వదె** వి ఒక విధమగు తృణసముదాయము, తృణతతివిశేషము

సీ వంద వదియ వదె వందె యంచనఁ దృణతతి విశేషంబొప్పు . ఆం భా 2 77

**వంద**[2] న నూఱు, శతము (శ ర., బ్రౌ, వా)

**వంద** నం వి ఆ స్త్రీ 1 యాచకురాలు. 2. వేఱొక చెట్టుపై మొలచెడు తీఁగ బదనిక

**వందకము** నం ,వి అ పుం. చిఱుతేఁకు. (వ్వ వి) (శ ర)

**వందకుఁడు** నం వి అ. పుం, 1 స్తోత్రపాఠకుడు, వంది

**వందథుఁడు** నం వి అ పుం 1 స్తోత్రపాఠకుఁడు, వంది, బట్టు 1 స్తోత్రపాత్రము, స్తుతింప నర్హుఁడె నవాడు. (విల్లమ్సు)

**వందన** నం. వి అ పుం 1 పూజ 2 స్తుతి, స్తోత్రము

**వందనమాల** (వికి) నం వి ఆ స్త్రీ తోరణము ఉత్సవములందు గుమ్మముల కడ్డముగాఁ గట్టు తోరణము (వాలా ని)

**వందనము** నం వి అ న 1 నమస్కారము, పాదములను స్పృశించుచుఁ జేయు నమస్కారము, దండప్రణామము 2 గౌరవము 3 స్తోత్రము 4 ఒక విధమైన చర్మరోగము గండమాల వ్యాధి

**వందని** నం. వి ఈ స్త్రీ 1 పూజ, 2 స్తోత్రము. 3 ప్రార్థన 4 సంజీవని, చనిపోయినవారిని బ్రతికించెడి నోషధి

**వందనీయ** నం. వి ఆ స్త్రీ గోరోచనము,

**వందనీయము** నం. వి అ పుం వచ్చగుంట గలిజేరు. (వృ. వి)

**వందనీయుఁడు** నం విశ (అ ఆ అ) నమస్కరింపఁ దగినవాఁడు

**వందఱ** వి ఖండము

(ఇది వాక్యమున 'చిందఱ' శబ్ద పూర్వకముగానే కన్పడుచున్నది. చూ చిందఱ వందఱ)

జ. వందఱలాడు.

**వందఱలాడు** న క్రి (వందఱలు + ఆడు) చెల్లాచెదరు కావించు.

(ఇది 'వ్రచ్చు' ధాతువుతోఁ గలసియే కానవచ్చుచున్నది.

క. ర,తులఁ గులిశనిశాతనఖా,వలిఁ బఱిం ద్రుండు వ్రచ్చి వందఱలాడెన్ భార ఆది 1 100

సీ ప్రబలబలాహకప్రకరంబు వ్రచ్చి వందఱలాడుఁ బటుమారుతంబు మాడ్కి . నృసిం, 2 126

సీ. వారలఁ గరచక్రధారల వ్రచ్చి వందఱలాడె హరి వరాహ 6. 117

ద్వి. అచ్చుగా నార్చుచు హరుఁ డిభదైత్యు, వ్రచ్చిన గతి వ్రచ్చి వందఱలాడు. బస, పు, 4 99. వం

**వందాక – వందాకము.** నం వి ఆ స్త్రీ.

**వందాకము** నం వి, అ. పుం. వంద, బదనిక.

**వందాకి** నం. వి. ఈ స్త్రీ. వంద

**వందారము** – వందాకము,

**వందారు(ఁడు)వు.** సం విశ ఉ 1 స్తోత్రము చేయువాఁడు 2 గౌరవపాత్రము. వి. ఉ స. స్తోత్రము, పొగడ్త.

వుం బట్టువాఁడు, స్తోత్రపాఠకుడు

**వంది** సం వి. న్ వుం 1 స్తోత్రపాఠకుఁడు, బట్టువాఁడు (శూద్ర స్త్రీయందు క్షత్రియునకుఁ బుట్టినవాడు)

2 ఖైదీ, చెఱలో నుంచఁబడినవాడు

**వందించే** సం స క్రి. 1. నమస్కరించు. 2. స్తుతించు.

క. ఇంద్రాంక వాఁడు బ్రదికిన, సందేహము లేదు దేహచాతుర్య వయస్సౌందర్యంబుల లోకులు వందింపఁగ నితని యంతవాఁడఁగుఁ జుమ్మీ. భాగ 10 ఉ 33

**వందితుఁడు** సం. విశ. (అ అ అ) 1. నమస్కరింపఁబడినవాఁడు 2, స్తుతింపఁబడినవాఁడు.

**వంద** అ క్రి. 1 సంతాపించు.

క. మనమున సహింపనోపక, వనరుచు ధృతరాష్ట్రసుతులు వందిరి తమలోన్ భార ఆది 5 247

క. ఇదియేమి శోకమున వం,దెదు పుట్టినవారికెల్లఁ దెరువారయఁగా, నిదియ భార శాం. 4 8

చ దుష్టరాక్షసా,వలియెడ నిర్భయుండు మది వందకు నీ సుతువజ్రవర్ష్మమై, యలవడఁగాచి తెచ్చెద నమగ్రతరం బగు మేలు నిచ్చెదన్ భా. రా బాల 177

2 దుఃఖపడు.

ఉ చచ్చె ఘటోత్కచుడు మన సైన్యములెల్లఁ గరంగి నల్గడ, న్విచ్చుటఁ జూచి యేము వగసెక్కొన వందెద మిప్పు డెమ్మెయి,న్వచ్చెఁ బ్రమోదము . భార, ద్రో 5. 138

క అని వందుచు లంగనదెస, వనటకు సామ్రాజ్య వివిధ రత్నమునకున్, దనచిత్తము పొక్కఁగ న,మ్మనుజేంద్రుఁ డుదాత్తవృత్తి మహి నేలు నెడన్ నిర్వ 9 93

సీ కొడుకు సుద్యుమ్నుండు ఘోరాటవులకేఁగ వందుచు మనువు పై వస్వత్సుండు, దనకు బిడ్డలు గల్గఁ దపమాచరించెను .. భాగ 9 స్కం 33

చ. .. విరక్తచిత్తుఁడై,యనుదినమున్ ధనంబుఁ గలయ న్వెదచల్లుచు నొయ్యనొయ్య ని,ర్ధన దశనొంది వందియును దాపమునొందుచుఁ గంది కుందుచున్ ద్వా 5 288

3. వాడు మ్లానమగు

చ దినమునవెల్ల నుష్ణకరదీప్తులు పర్వి రసంబుఁ బీర్వ వం,దిన సకలౌషధిప్రవితతిం దెలివొందఁగ జేయునేర్పు గల్గిన తనరశ్మిజాలమున శీలఁ జకోరముల న్మనింపఁజే,యనుదయమై వెలింగె నమృతాంశుఁడు సేనకుఁ దన్పు సేయుచున్ భార శాం 2 126

సీ కొంకక క్రొమ్మెఱుంగుంబోడిగావున జాత నిర్ఘాంతజీమూతవేళ వందక శీతాంశువదన గావున దీర్ఘ యామినీఘోరనీహారవేళఁ, గీదపముగావిఁప వెడలె వత్సరసహస్రములు .. వరాహ 6 16

4 వివర్ణమగు, వెలవెలఁబాఱు

గీ చిరిమివైచిన నెత్తమ్మిఁ జెనసి వాడి, వందినది నీముఖంబు వివర్ణతారకంబులై యొప్పునెడినవి కన్ను లిట్టి, శూన్యభావమే మెమ్మెయిఁ జూతు మనఘ హరి పూ 9 148

5, చచ్చు

వ కందర్ప దర్పంబున నలందురి వందుదుననిన నవ్వెలంది వెండియు నిట్లనియె భార విరా 2 63

శ్లో "యదీయమనవద్యాంగీ, న మామద్యాపి కాంక్షతే, చేతసాభిప్రపన్నేన, గతోస్మి యమసాదనమ్" సం భార విరా 13. 6

**వందురు** అ క్రి 1 దుఃఖపడు

క శాపభయమునన్ మాద్రి కడున్, వందురి వారింపఁగ బలిమిం దత్సంభోగసుఖసమీహితుఁడయ్యెన్ . భార ఆది 5. 145.

క కొడుకులందెన నెవ్వగఁజే,డ్పడి వందిరియున్న యానృపాలునడుగులం,బడి .. భార. భీష్మ 1 45

క ఎందునుగానక తద్దయు, వందురి యెలుఁగెత్తి పిలిచి వనజముఖి నీ, వెందున్నదానవే యా,

చందంబునఁ బిల్వఁ బల్కఁజనదే నీకున్. భోజరా. 5 54

చ. మనమునఁ జింతనొందక యమానములోఁ జనుతార నీవు నీ, వనితలు నన్ను వందురుచు వాలినిఁ గాఁగిటఁజేర్చు భా రా కిష్కిం. 216.

2 సంతాపించు, పరితపించు

క బాలలుఁ దరుణులుఁ ప్రౌఢలు, మూలెడు వికలాంగకములతో డెందములన్, వాలిన విరహానలమున,పాలై వందురెద రొక్క భంగిన యకటా భార స్త్రీ 2 51

ఉ వారలు శౌరిఁ గానమికి వందురుచున్ దురపిల్లి యక్కటా, శ్రీరమణీమనోహరుఁ డశేషజనావనతత్పరుండు మా, కోరిక నీయఁడయ్యె ఘటికా 2 239.

3 క్లేశపడు

ఉ తల్లి మొగంబు గాన కటు తండ్రికి దవ్వయి గంటలోఁ గడుం, దల్లడమంది పుర్యుల విధంబున వందురుచున్న మమ్ము న,త్ఫుల్ల దయామతి న్విగతదుఃఖులఁ జేసితి . మార్కం 1 62

గీ. . ధరిత్రి, యఱువదేడు లనావృష్టియైన కతన, దద్ద వందురి కడు నుపద్రవము నొందె కాశీ 5 266

క. వందురి వగలన్ దేహము, పొం దెడలఁగఁ జూచు నన్నుఁ బొడగని దివిఁ దా, నెందుల కేఁగుచునో గిరి,నందన దిగి వచ్చి కరుణ నా కిట్లనియెన్ మనుచ 6 55

వి వ్యథ నొగులు

సీ వంత గాసి వెతారము కారియ వెత, బారి సెంగులు నొప్పి బాధ నెగులు నొవ్వి వందురు దురపిల్లు కొందలంబు, ఎలుపు నోవి యనంగఁ జను వ్యథ . ఆం, భా 1 150,

**వందె** — వంద[1] వి తృణతతివిశేషము.

సీ వంద వదియ వదె వందె యంచనఁ దృణతతి విశేషం బొప్పు ... ఆం భా 2. 77

**వందొందు** వి మత్స్యవిశేషము (శ ర)

**వంద్య** నం. వి. ఆ స్త్రీ 1 వంద, బదనిక 2 గోరోచనము

**వంద్యుఁడు** నం. విణ (అ ఆ అ ) 1 గౌరవింపఁ దగినవాఁడు 1 నమస్కరింపఁ దగినవాఁడు 2 శ్లాఘ్యుఁడు, కొనియాడఁదగినవాఁడు

**వంధ్య** నం వి ఆ స్త్రీ గొడ్రాలు

**వంధ్యము** నం విణ (అ ఆ అ ) నిష్ప్రయోజనము, నిష్ఫలము, వ్యర్థము

వి అ పుం పండ్లుపండనిచెట్టు

**వంధ్యా(ధ్య)కర్కోటకి** నం. వి ఈ స్త్రీ గొడ్డుఁ దనమును పోఁగొట్టునది, గొడ్డుఁగాఁకర (రా ని)

**వంపు** న క్రి (√వంచే ) వంగునట్లుచేయు. నమ్రముగాఁ జేయు, వంచు

సీ పరువంపుమంకెన విరివంపు నరవంపు వాతెఱ చెంద్రంపు వాన గురియు.. ఆము 5 67

వి 1 వంగుట

సీ తలకొన్న ధారుణీస్థల మెడవంపులఁ బడ నుల్కిపడి మ్రొగ్గిపడ నహీంద్రుడు కు. సం. 11 3

2 వంకర, వక్రత

వ. ధనుర్లతలవంపుదింపులకుఁ దెచ్చు కొనురు గల కనుబొమలును గమలదళవిదళనాకహ చరిత్రంబులగు నేత్రంబులును ... చం రా. 3 98

చ. నీరుకోళ్, కొలకొలమంచుఁ గ్రుంకు మెడగుంపులవంపులుదోఁప . పురాతన తీర్థ కుండముబ్ ఆము 1 71.

3 పార్శ్వము, ప్రక్క.

ఉ వాచపులీఁగడంగి నలువంపులఁ దుంపురులీను తేనెఁ జెల్వొ చలివాకచే వనపుటాకునఁ గాంతులఁ బొల్చి పూఁచి పెల్లేచినగుజ్జు మావికడ నెల్లెడ నీడలు గానవచ్చు రేరాచ మెఱుంగుఱాఁజగతిఁ గ్రమ్మిన కమ్మని తమ్మి పాన్పునన్. రా వి. 4. 76

విణ వంగినది.

గీ వంపుగుడిసెల సామగ్రి దంపురోళ్ళు, కురచ రోఁకండ్లు చిన్నదాఁగరులు మొదలుగాఁ గలుగు వస్తుజాతంబు గార్దభములు, మోచితే వెంట నూకరములు చనంగ చెన్న. 2 204.

**వంపుడు** విణ (√వంపు) వంగినది

ఉ వెచ్చనితీర్థమాడి నులివెచ్చపదార్థము లారగించి
బల్పచ్చడము ల్మనుంగులిడి పైఁ జలిసోకని
కమ్మటిండ్లలో, ముచ్చుముడింగి యింటిపని
ముమ్మరమెల్లను దీర్చి పక్కకున్, వచ్చిన
ప్రోడయాంధ్రకురువంపుడు బల్పను గొండలూస
లొమ్మిక్కచ్చి కవుంగలించి సుఖయించిరి ప్రౌఢ
గృహస్థు లయ్యెడన్ కవిరాజ 4 29

**వంశకరినము** సం వి అ పుం వెదురుడొంక, వెదురు పొద

**వంశకఫము** సం వి అ పుం గాలిలో నెగిరెడి యొక జాతి దూదిగల గింజ.

**వంశకము** సం వి అ పుం. 1 ఒకజాతి చెఱకు 2, వెదురుగనువు 3 ఒకజాతి చేఁప స అగరు

**వంశకరుఁడు** సం విణ (అ ఈ అ) 1 వంశకర్త, వంశస్థాపకుఁడు 2, వంశమును శాశ్వతముగా నిలుచునట్లు చేయువాఁడు. వి అ పుం 1 పుత్త్రుఁడు 2 పూర్వికుడు, ప్రాచీనపురుషుఁడు

**వంశకర్పూరరోచన** సం వి ఆ స్త్రీ. వంశరోచన, వెదురులో నుండెడి కర్పూరమువంటి వస్తువిశేషము. (వెదురు బియ్యము.)

**వంశకృత్తు** సం వి త్ పుం వంశకర్త, వంశస్థాపకుఁడు

**వంశక్రమము** సం వి. అ పుం వంశపరంపర, తరతరము

**వంశక్షీరి** సం వి ఈ స్త్రీ — వంశరోచన

**వంశచింతకుఁడు** సం వి అ పుం వంశపరంపరను (వంశ వృక్షమును) విమర్శించు పురుషుఁడు

**వంశచ్ఛేత్త** సం విణ (ఋ. (తీ ఋ) వంశమునకు తుదివాఁడు

**వంశజ** సం వి ఆ స్త్రీ — వంశరోచన

**వంశజము** సం విణ (అ ఆ. అ.) 1 వెదురునఁ బుట్టినది 2 వెదురుతోఁ జేయబడినది 3 మంచి వంశమునఁ బుట్టినది
వి అ పుం 1 సంతతి, 2 వెదురువిత్తనము 3. వెదురుబియ్యము.

**వంశతుండులము** సం వి. అ. పుం. వెదురుబియ్యము

**వంశధరుఁడు** సం విణ (అ ఆ. అ) 1 కుటుంబమును స్థిరపఱచువాఁడు 2. కుటుంబపోషకుఁడు.

**వంశనర్తి** సం వి న్ పుం. హాస్యగాఁడు, పరిహాసకుఁడు

**వంశనేత్రము** సం వి అ న చెఱకువేరు

**వంశపత్త్రికము** సం వి అ పుం 1. రెల్లు 2 తెల్ల చెఱకు 3 మత్స్యవిశేషము 4 ఒక జాతిచేఁప
న తాళాకము

**వంశపత్త్రపతితము** సం వి. అ పుం (ఛంద) ఒకానొక వృత్తము
(దీనికి ప్రతిపాదమందును భ, ర, న, భ, న, లగములతోఁ బదునే డక్షరము లుండును.)

**వంశపత్త్రము** సం వి అ న వెదురాకు పుం రెల్లు

**వంశపరంపర** సం వి ఆ స్త్రీ వంశక్రమము, వంగడమువరుస

**వంశపూరకము** సం వి అ న చెఱకువేరు.

**వంశభోజ్యము** సం విణ (అ అ అ) వంశపరంపరగా ననుభవింపవలసినది తరతరములనుభవింపఁ దగ్గది.
వి అ న వంశపరంపరగా వచ్చెడి యాస్తి

**వంశము** సం, వి అ పుం 1 వెదురు 2 అన్వయము, వంగడము 3 అమ్ము, బాణము 4 పిల్లనగ్రోవి వాద్యభేదము 5 సజాతి వస్తు సమూహము.

**వంశరో(లో)చన** సం వి ఆ. స్త్రీ. వంశ కర్పూర రోచన, వెదురుబియ్యము

**వంశవితతి** సం వి ఈ స్త్రీ 1 వంశపరంపర 2 వెదురుపొద

**వంశవృక్షము** సం వి అ పుం వంశపరంపర,

**వంశశర్కర** సం వి ఆ, స్త్రీ వంశక్షీరి, వెదురు బియ్యము

**వంశశలాక** సం వి ఆ. స్త్రీ 1. వెదురుచీల, వీణ క్రింది తుదను వేయఁబడు చిన్నవెదురుచీల 2 ఆవురుగంటివేరు, ఉశీరము

**వంశాంకురము** సం. వి. అ. పుం వెదురుమొలక, కరీరము

**వంశానుచరితము.** సం వి అ. పుం. 1. వంశము యొక్కచరిత్రము. 2. పురాణములందు వర్ణింపఁబడు ప్రాచీనరాజవంశముల చరిత్రము

**వంశి** నం. వి. ఈ. స్త్రీ. 1. పిల్లనగ్రోవి 2 రక్త నాళము. 3. వెదురుబియ్యము. 4. పరిమాణ విశేషము. (క.) నాలుగు కర్షముల యెత్తు, (చ.) నాలుగు స్తోమముల పరిమాణము, 384 అంగుళముల పొడవుగల పరిమితి

**వంశిక** నం వి ఆ. స్త్రీ. పిల్లనగ్రోవి.

**వంశికము** నం విణ.(అ. ఆ. అ ) వంశసంబంధమైనది, వంశపరంపరగా వచ్చునది.

వి. అ న. అగురుచెక్క

**వంశీధరుడు** నం వి. అ పుం 1 కృష్ణుఁడు. 2. పిల్లనగ్రోవి యూఁదువాఁడు.

**వంశీధారి** నం వి. న్. పుం — వంశీధరుడు

వి. అ. న. అగురుచెక్క.

**వంశ్యము** నం విణ. (అ. అ అ.) 1 వెన్నుబద్దకు సంబంధించినది. 2. వెన్నెముకతోఁ గలసియున్నది. 3 సద్వంశమునకుఁ జెందినది 4. వంశపరంపరకు సంబంధించినది.

వి అ పుం. 1. వాసము. 2 చేతియెముక, కాలి యెముక, 3. కనుపాప.

**వంశ్యుఁడు** నం. విణ (అ ఆ అ ) సద్వంశమునఁ బుట్టినవాఁడు

వి అ పుం వంశస్థుడు, సంతతివాఁడు, 2 పూర్వుఁడు 3, ఏడుతరముల వెనుక వాఁడును, ఏడుతరముల ముందువాఁడును నగు జ్ఞాతి.

**వకవకలు—పికపికలు, పికాపికలు, పకాపకలు**

వి బ 1 చెదరుటలు.

క ఒక మొగము గాక దివిజులు, తికమక గొని వైరులెల్ల దీకొని తమ్ముం, బకపక నగ వక వకలై, లుకలుకఁ బరువెత్తి రోడి లోఁగొను భీతిన్. భాగ. 8. 285 (శ ర. పా )

2 బ్రద్దలు, ముక్కలు

ద్వి. ...నోరు శిరము, వకవకలై పోవ వాపోయి... ధర్మా. 1. భా. (శ. ర.)

సీ కరికాండతుండద్రుఘనతాడనంబుల వకవకలై కృకాటికలు పగుల...రంగా. 3 219

**వకారుడు** విణ. వగ్గు (నామైక దేశగ్రహణము)

ఉ. మిన్నక యిట్లు భర్త తనమీఁద విరాళి వహింప కున్న నా,కన్నియ చూచి యీ ముదివకారునితోఁ బనియేమి నా కటం, చు న్నిరసించి పంచశరసుందరరూపుల జారవీరులన్, గ్రొన్నన వింటివాని మొనకుం గదియించెద నంచు నెంచుచున్. హంస. 3 208.

**వకాలతు** వి. (హిం. వకాలత్.) న్యాయవాది, వకీలు

సీ ...వరుస బకీచిత్త వైకల్యుఁడైనను గడు దీర్ఘవర్తి వకాలతైన . వేణు శ. 46

**వకావకలు — పికపికలు, పికాపికలు, వకవకలు**

వి బ. 1 బ్రద్దలు

మ. కకుబంతంబులు మూసె మ్రోపె సకలాకాశావకాశంబులఁ, శకునంబుల్ శకునంబులయ్యెఁ గులటాచంద్రాస్య కజ్జంబు కో,రకమయ్యెన్ రకమయ్యెఁ గైరవము చక్రశ్రేణి గుండెల్ వకా,వకలయ్యెఁ సెకలయ్యెఁ బాంధజనతాస్వాంతంబు లంతంతకున్. బహు. 3 48

2. చెదరుటలు.

సీ. ఘణి ఘణిల్లని పాదకటక నిక్వణనముల్ ప్రతులధైర్యము వకావక లొనర్ప . . ఘటికా. 2 213.

ఉ. ఆ నగినాఁకి నవ్వుటయు నంతట నా మహిమంబు తూలెనో, కాని వసుంధరాధిప వకావకలై చెడిపోయె బ్రహ్మవి,జ్ఞానము వేద శాస్త్రసరన ప్రతిభావిభవంబు గానవి, ద్యానిపుణత్వముం దపము ధర్మవిధిజ్ఞతయుఁ వివేకముఁ. వరాహ 1 95

సీ క్రొవ్వాఁడికొమ్ములకొనల చిమ్ముచు నవలాహకసమూహము వకావకలు గాఁగ అని 4. 35

చ దురితలవానుసారి భవదుఃఖకదంబము రామనామభీ,కరతరహేతిచేఁ దెగి వకావకలై చనకుండ నేర్చునే .. దశ 81.

జ. వకావకలు సేయు

**వకావకలుసేయు** స క్రి (వకావకలు చేయు.) బ్రద్దలు సేయు.

సీ. తనశతకోటి పర్వనితాంతమహిమ యంతిక
నగంబుల వకావకలుసేయు .. వసు. 6 45.

**వకానుకుట్టు** వి. ఒకవిధమగు కుట్టుపని.

ఉ. పట్టుగుడారముల్ చికిలిబంగరుబ్రాతల చిక్కు
బిగవుం, బెట్టెలుఁ పచ్చరావలక పీటలు
మేలిన కానుకుట్టు మేల్కట్టులుఁ గ్రొత్తనెత్త
పలకల్ తెరలుం బిక దారిఁబారువా,పిల్లల
గూండ్లుఁ గ్రొమ్మెలుఁగుబిం దెలుఁ గొందఱు
తెచ్చి రయ్యెడన్. వాల్మీకి. 3 84.

**వకీలు** వి 1 న్యాయవాది

సీ. . వెంటనే కేలుమొగిడ్చి వకీలు చెప్పు వేణు
శ, 16.

2. వాదము.

ఉ ఏలనెజాలి సర్వజగదీశ్వరుఁడైన సురేశ్వ
రుండు ని, న్నేలఁదలంచె మేలుగనవే
వినవే యఱచేతి కబ్బు లి, బ్బేలను బేలనుంబలె
బలేవలుకం దొరకంటి వైన నీ, కీలువొకిం
తెఱుంగుదు వకీలొనరింతు వికీలు వేటుకే. ఆహ
3. 30

**వకులము** సం. వి. అ. పుం. పొగడ (వృ వి)

**వకోటము** సం. వి అ. పుం వక్కుకొంగ,
బకము (త్రి. ని)

**వక్క** వి (సం వల్కమ్) పూగఖండము,
పోఁకచెక్క

ద్వి. వక్కనేయని లేకివాఁడని నన్ను, లెక్క
నేయక కరాళించె నీరాజు ద్వి హరిశ్చ ఉ.
1474 పం.

సీ హెచ్చువాసవ వక్కలిచ్చి చుట్టిన యాకు
ముడుపు లీఁదివిరెడు నడపదాని ... ఉ. రా.
4 228

క వక్కాకు.

**వక్కణ(ము)** — వక్కాణము, వి. (సం. వ్యాఖ్యా
నమ్ (ప్రా. వక్ఖాణమ్.)

1 వ్యాఖ్యానము, వివరణము.

గీ. మఱియు నొకకొందరకు సుధామధుర వాక్య.
సమితి భారత రామాయణములు దెలియ,
వరుస వక్కణ మొనరించు వ్యాస శిష్యు, వాగ్వి
రాజితు నుగ్రశ్రవసునిఁ జూచి రుక్మా. 1, 52.

గీ పంచమపుఁ దంతి బయకాడు సట్టిమీట,
గమ్మనమనునాదమును గ్రమ్మకరంబిఁ గాంగ,
వెలితిఁ బోసీక రసికులు వినుచు మెచ్చ,
వక్కణలువెట్టి యేర్చె నప్పణఁతి యిట్లు
పార్వ 3. 57.

2 జాబునందు మొదట వ్రాయుపద్ధతి, మతలబు,

శా వ్రాయుం గమ్మల వక్కణల్ వరుసనే
పద్దెంబు లౌనట్లుగాఁ, జేయున్ సత్కృప
శాంభవా ప్తసుజన శ్రేణుల్ ప్రహర్షిం
పఁగా . భోజసుతా. 1 41

గీ. తనయులును దాము రావలె ననచుఁ జాలు,
మానుసలు దశరథరాజమౌళితోడఁ, దెలి
పెడిదియను వక్కణ కలిగినట్టి, యుత్తరంబును
వినిపింప నుత్సహించి దశా 7 225

3 జాబునందలి వృత్తాంతము.

గీ ఇపుడు భవదీయ నందను నిటకుఁ బంప
వలయు శీఘ్రముమ్మగ వివాహవైభవంబు,
దనరు ననియున్న వక్కణ విని ప్రహర్ష, మలర
మంత్రులతోడ నిట్లనియె నతఁడు ఇందు
5 16

**వక్కణించు** అ క్రి (√ వక్కణము) వచించు,
పలుకు

సీ మ్రొక్కుదు నీ పాదములకు జిహ్వావీథి నీనామ
ములు వక్కణింతు నెపుడు పాండు 4 92

(శ ర పా 'వక్కాణింతు' ముద్రి. పా)

**వక్కరము** విశ (సం వక్రమ్) వంకరైనది

వి వంకర (శ ర)

జ వక్కరాలు, వక్కరించు

**వక్కరాలు** వి (వక్కరము + ఆలు) కుటిలబుద్ధి
కలది, వంకరబుద్ధిగల యాఁడుది

చ .. ఆ, వెనుపరివక్కరాలు మొఱ పెట్టుచు
నీడిగిలంగ నందలం,బున వడిఁ గట్టువైచికొని
పొండని చెప్పె సుదేవుఁ డంతటన్ వై. భా
2. 111

క. అని యచ్చటి పైకావలి, వెనురక్కసి వక్క
రాంద్రఁ బిలిచి తినుం డి,వ్వనిత నీఁక రెండునెల
లగు,దనుకం జూచి యని చెప్పి దైత్యుడు
పోయెన్. రామా. 6.171

**వక్కరించే - వక్కళించే** (√ వక్కరము)

అ క్రి ప్రతిఘటించు, మాఱుమలయు

సీ కరికుంభముల మీఁదఁ గాలు ద్రవ్వుటగాక ఱక్కవకవతోడ వక్కరించు విక్ర 8 44

గీ. మృదులగోధూమసరులతో మేళవించి, వన్నె కుచ్చుల పేరుతో వక్కరించి, పుష్పదుండు భకంబుతోఁ బొత్తువచ్చు, పడఁతి పాలిండ్ల పైనొప్పు పసిఁడిపేరు శివరా 2 61.

ద్వి. వలదన్న మానవు వక్కరించెదవు . పండితా. పురా 116 పొ.

స. క్రి విడుచు

గీ, ఆత్మవంశపరంపరాయాతమైన, వైదికాచార మార్గంబు వక్కరించి, యారజము రాచటిక మును నలవరించి, నగరివీథులఁ జరియించుఁ బ్రగడ సుతుడు శివరా. 2 90

**వక్కళము** వి. ప్రతిఘటించుట, మాఱుమలయుట

వ .... వక్కళంబు గానీక ఉ హరి 3 64.

జ వక్కళించే.

**వక్కళించే - వక్కరించే** అ. క్రి (√ వక్కళము). ప్రతిఘటించు, మాఱుమలయు

సీ చాలనిగ్గులుగుల్కు పాలచెక్కల కుచ్చు వామ కర్ణంబుతో వక్కళింప... క్రీడా 1 223.

సీ కరులతొండములసంగడి నిక్కి తాలాంకు వలుద నాఁగటితోడ వక్కళింప... ఉ హరి 6 60

**వక్కాకు** వి వక్క+ఆకు తాంబూలము

క. వక్కాకిడి సద్భక్తిని, మ్రొక్కి కనుంగిటి శకునములు చూడు వరుం, డెక్కార్యంబున కేఁగెనొ, యక్కార్యము లెసఁగ సఫలమౌనో కావో. హంస 4 53

క. నీ కీవఱకెన్నఁడు వఁక్కాకున కీలేదు నిర్దయా మతి వేలా, కోకొమ్మా యని పిడికెడు, రూక లొడిం జల్లి యాతురుండై మఱియున్ శుక 2 25

సీ వేల్మివేల్చినచేత వెస నీకు వక్కాకు లిచ్చినఁ గాదషే యిందువదన శుక 2 476

**వక్కాణ** వి. - వక్కాణము (శ ర)

జ వక్కాణించు

**వక్కాణము** — వక్కణము, వక్కాణ.

వి. 1 జాబునందు వ్రాయఁబడు వృత్తాంతము.

క. దేవరయానతిఁ దప్పిన, యావివరం బేదియని స్వహస్తలిఖితలేఖావాచికంబుఁ జూపిన, నా వక్కాణంబుఁ జూచి యద్భుతపడఁగన్ జై. భా. 8. 89.

2 వైఖరి, రీతి.

క చూపులవక్కాణంబున, నాపుష్పకరండకాఖ్యుఁ డరుదెంచిన మా, యోపాయపుఁ గార్యస్థితి, దీపించినఁ బరిణమించి తిలకించి మదిన్. విక్ర. 8 26.

**వక్కాణించే** స క్రి. (√ వక్కాణ) 1. వ్యాఖ్యానముచేయు, వివరించి చెప్పు.

గీ, పట్టియేదర్శనంబైనఁ బ్రతిభకలిమి, పలసినట్లు వక్కాణింప వచ్చియుండు. నైష. 7 78.

శా గంధర్వోపనిషద్రహస్యములు వక్కాణింతు రాలావ సంబంధప్రస్ఫుటఝుంటఝుంట పద గుంభస్థాపవర్గావళీ, సంధానక్రమ దివ్య మంత్ర కములన్ సాయాహ్నకాలంబులన్, గంధర్వా ప్సరసల్ పురోపవనికాకల్పద్రుమచ్ఛాయలన్. భీమ 1 90

2 వచించు, చెప్పు

మ బలుమీసల్ వడిఁగొల్పుచున్ బిగువుతోఁ బౌలస్త్యుఁ డేమంటివో, వలసల్ దీసెదె యూర్ధ్వ లోకములు దేవర్షీంద్రయక్షైన నంధులకేఁగం బనియేమి శౌర్యమున నన్నుం దాఁకి పోరాఁ డఁగాఁ, గలవాఁ డెక్కడ నుండు నిక్కముగ వక్కాణింపవే నావుడున్ ఉ రా. 5. 200.

3. ప్రకటించు

వ .. దాని దేవలోకంబునందు వక్కాణింప నారదుం బనిచె. . భార. ఆది. 1 66

సీ పరమార్థతత్త్వానుభవము వక్కాణించు సమధిక బ్రహ్మవర్చసమువాని కృ శకుం 3 73.

4. స్తుతించు, వర్ణించు.

మ కవులం బంకజగర్భసన్నిభుల వక్కాణింతు వల్మీకసంభవునిన్ వ్యాసునిఁ గాళిదాసు భిలహణున్ బాణున్ మయూరున్ శుకున్ జై. భా 1 6.

సీ. శాకపాకంబులచవులు వక్కాణించుగతి గంకణం బులు గల్లుమనఁగ... పారి. 2. 19

వక్కి విశ బక్క, కృశము. (శ. ర.)
జ వక్కికట్టె.

వక్కికట్టె(ట్టియ) విశ (వక్కి+కట్టె) బక్కటిల్లిన వాఁడు, కృశుఁడు (శ. ర)

వక్కు[1] — వగ్గు[1] అ క్రి 1 లోఁబడు, అధీనుఁడగు.
క... సీ, దిక్కెటిఁగిన దృఢభక్తుఁడు, వక్కం డెవ్వరికిఁ గార్యభారమున శివా శివ సా.163.
2 బక్కటిల్లు, కృశించు.
ఆ. మునిఁగి మునిఁగి మునిఁగి ముద్దయై ముద్దయై, వనరి వనరి వనరి వక్కివక్కి, తిరిగి తిరిగి తిరిగి దిమ్మరై యుండును వేమ 2 413

వక్కు[2] — వగ్గు[2]. వి. (నం బకః) ఒకజాతి కొంగ.
గీ. బకము విలసిల్లు వారణపక్కి వక్కు, వగ్గ టంచన.. ఆం, భా 2.93

వక్కుపులుఁగు వి. వక్కుకొంగ బకము. (శ ర)

వక్త నం విశ (బు త్రీ ౯. బు) 1. మాటలాడెడు వాఁడు, చక్కఁగా మాట్లాడువాఁడు 2. వాగ్ధాటి గలవాడు 3. బోధించువాఁడు, బోధకుఁడు

వక్తవ్యత నం వి స్త్రీ ఆ. నింద, అపవాదము. నిందింపఁదగియుండుట

వక్తవ్యత్వము నం వి అ. న — వక్తవ్యత

వక్తవ్యము నం. విశ. (అ ఆ అ) 1. చెప్పదగినది, పలుకఁదగినది, ప్రకటింపఁదగినది 2. నింద్యమైనది, నిందింపదగినది. 3. నీచమైనది, కుత్సితము. 4 ఉత్తరవాది, పూచీపడినది 5 దుష్టము, చెడ్డది
వి. అ న 1. పలుకుట, పలుకు, మాట 2. శాసనము, రాజాజ్ఞ. 3. నింద, దూఱు.

వక్త్రఖురము నం వి అ. పుం దంతము, పల్లు

వక్త్రజము నం వి అ పుం నోటఁబుట్టినది. పల్లు, దంతము

వక్త్రజుఁడు నం. వి. అ పుం. బ్రహ్మముఖమునఁ బుట్టినవాడు. బ్రాహ్మణుడు

వక్త్రతుండుఁడు నం వి. అ. పుం. గణపతి, విఘ్నేశ్వరుఁడు.

వక్త్రదలము నం. వి. అ. న అంగుడు

వక్త్రభేది నం. విశ. (న్. నీ. న్) 1. తీవ్రమైనది. కారముగలది 2 చేఁదైనది.
వి న్ పుం. చేఁదు, తిక్తరసము.

వక్త్రము నం వి అ న. 1 నోరు. 2. ముఖము. మోము. 3. పంది మొదలగువాని ముట్టె 4 పిట్ట ముక్కు. 5 ప్రారంభము, మొదలు. 6. అమ్ము మొన 7 నీరుపోవుగొట్టము 8 ఒక విధమైన వస్త్రము 9 అనుష్టుప్పుతో సమానమైన యొక ఛందస్సు, ఛందోభేదము 10 (గణిత) శ్రేఢులలో మొదటిది (చూ శ్రేఢి)

వక్త్రరంధ్రము నం వి అ. న ముఖద్వారము.

వక్త్రవాసము నం వి అ పుం 1. నారంగము. నారింజ (వ్య. వి.) 2 ముఖమువాసన

వక్త్రశోధనము నం వి అ న 1. నోరుశుభ్రపరచుట. 2 తాంబూలాదికము 3. నిమ్మకాయ, దబ్బకాయ.

వక్త్రశోధి నం. వి న్. న 1. తాంబూలము మొదలగునవి 2. దబ్బకాయ, నిమ్మకాయ పుం. దబ్బచెట్టు, నిమ్మచెట్టు

వక్త్రాస్రవము నం వి. అ పుం. అధరరసము (త్రి ని)

వక్రకంటకము నం వి అ, పుం 1 ఖదిర వృక్షము చంద్రచెట్టు, బదరీ వృక్షము. (రా. ని)

వక్రఖడ్గము నం. వి అ పుం మిక్కిలి వెనుకకు వంగిన మొనగల పట్టాకత్తి వంపుకత్తి.

వక్రగతి నం. విశ ఇ 1 వంకరగా బోవునది. వంకరయైన గమనముగలది 2 మోసముచేయునది.
వి ఇ స్త్రీ వంకరనడక, చుట్టువడక.

వక్రగ్రీవము నం వి అ పుం. వంకర మెడ గలది- ఉష్ట్రము ఒంటె. (త్రి.ని)

వక్రచంచువు నం. వి ఉ. పుం. వంకర ముక్కుగలది శుకము చిలుక.

వక్రత నం. వి. ఆ. స్త్రీ. 2 వంకర. 2. అంగారకాదిగ్రహముల వక్రగతి, వెనుకకు నడచుట 3. తప్పిపోవుట. 4 వంకరబుద్ధి, కుటిలస్వభావము.

వక్రతుండము. నం వి. అ పుం. శుకము, చిలుక.

వక్రతుండుఁడు నం. వి. అ. పుం. విఘ్నేశుడు, గణపతి.

వక్రత్వము నం. వి. అ న. — వక్రత

వ(క్రదంష్ట్రిము సం. వి. అ. పుం. వరాహము, అడవి పంది

వ(క్రదృష్టి సం విశ ఇ. 1 మెల్లకన్ను గలవాఁడు, వంకరచూపు గలవాడు. 2 చెడుదృష్టిగలవాడు. 3 సహానము లేనివాడు, చూపోపనివాడు

వి ఇ. (స్త్రీ మెల్లచూపు, వంకరచూపు.

వ(క్రనాసికము సం వి అ పుం. గుడ్లగూబ, ఉలూకము

వ(క్రపుచ్ఛ (చ్ఛిక)ము సం వి అ పుం కుక్క. (త్రి ని)

వ(క్రపుష్పము సం. వి. అ. పుం. పలాశము. మోదుగుచెట్టు

వ(క్రమము సం. వి.అ పుం అవ(క్రమము. (క్రిందికి దిగుట.

వ(క్రము సం విశ (అ ఆ అ) 1. వంకరయైనది 2 చుట్టు తిరిగినది 3 చుట్టుకొన్నది. 4. మర్యాద లేనిది, అనార్జవము 5. (క్రూరము

వి అ పుం. 1 అంగారక (గ్రహము 2 శని (గ్రహము

న. 1 ఏటివంపు 2 (గ్రహముల వ(క్రగమనము

వ(క్రయము - అవ(క్రయము 1. వెల. 2 అద్దె 3 అద్దెకిచ్చుట. 4 రాజునకిచ్చుపన్ను. 5 కూలి, జీతము

వ(క్రవ(క్త్రిము సం. వి అ పుం. అడవిపంది. వరాహము

వ(క్రాంగము సం వి అ న వంకరదేహము వంకర యవయవము.

పుం 1. బాతు. 2. రాజహంస, రాయంచే 3. సర్పము

విశ (అ. ఆ ఈ. అ) వంకర యవయవములు గలది

వ(క్రాంగి సం.వి ఈ. (స్త్రీ కటుకరోహిణి (వృ. వి) (శ. ర).

వ(క్రి సం. విశ (న్ జీ న్.) 1. వంకరయైనది. వంపుగలది

2. వెనుకకు నడచునది. (కుజాది(గ్రహము.)

వి (న్) పుం జైనుడు.

విశ (ఇ) 1. సందిగ్ధముగా మాటలాడువాడు. 2. అసత్యము చెప్పువాడు.

వ(క్రించే సం. అ. (క్రి 1. వెనుకకు నడచు, మఱలు

ద్వి. వ(క్రించె గుళికసంభవ రాహు విపుడు... ద్వి. హరిశ్చ ఉ. 869. పం,

ఆ. నెఱయ గురుడు రోహిణీమధ్యమున నుండి, వ(క్రయు క్తుడైన వాన లేదు, వాయుతారలందు వ(క్రించి నిలిచిన, వారిమయముచేయు వసుధ యెల్ల సస్యానందము 4 16 పా

2 (ప్రతిఘటించు, మార్కొను

మ ధరణీమండలి నెందునుం దొడరి దోర్దర్పోద్ధతిం (గాలు భూవరులం బలువ్వర నుక్కడంచితి గడున్ వశ్యాత్ములై వారు నా, కరిగా నాత్మ ధనావళుల్ వరుస (బత్యబ్దంబు నర్పింతు రె, వ్వరు వస్మత్పటువి(క్రమస్ఫురణకున్ వ(క్రింప రెక్కాలమున్ హరి ఉ 6 89

వ(క్రితము సం.విశ (అ ఆ అ) వంకరగాఁ జేయ బడినది, వంపబడినది.

వ(క్రిమ(ము) సం. వి న్. పుం 1. వంకర, వంపు 2 రెండర్థము లగునట్లు చెప్పుట, సందిగ్ధముగా జెప్పుట 3. కాపట్యము, వంచన 4 డొంక తిరుగుడు

వ(క్రుడు సం వి. అ పుం 1 అంగారకుడు 2 శనైశ్చరుడు (శ. ర.)

విశ 1 వంకరయినవాడు 2. (క్రూరమైనవాడు.

వ(క్రోక్తి సం వి ఇ (స్త్రీ. 1. ఒకానొక అర్థాలంకారము.

శ్లో. వ(క్రోక్తిః శ్లేష కాకుభ్యా మపరార్థ(ప్రకల్పనమ్ చం(ద్రాలోకము.

2. సందిగ్ధముగాఁ జెప్పుట, సూచన 3 అపహాస్యము వేళాకోళము

వ(క్రోష్ఠి సం. వి. ఇ, (స్త్రీ చిఱునవ్వు.

వ(క్రోష్ఠిక సం. వి అ (స్త్రీ – వ(క్రోష్ఠి

వక్షణ సం వి ఆ (స్త్రీ 1 కుక్షి, కడుపు, జీర్ణకోశము 2 పార్శ్వము, (ప్రక్క. 3 నదీగర్భము, 4. నది, ఏఱు.

వక్షణము సం వి అ. న 1 వక్షస్సు, ఱొమ్ము. 2 వి(శ్రాంతి, అలసట దీర్చుకొనుట 3 అగ్ని.

వక్షము(స్) సం వి న్ న ఱొమ్ము, హృదయము.

పుం వృషభము, ఎద్దు, (విల్సన్స్)

వక్షోజము సం వి. అ. పుం. కుచము, చన్ను

వక్షోరుహము సం. వి. అ. పుం. – వక్షోజము,

వగ వి. (√ వగచే) 1 దుఃఖము

సీ కుందంగ నడలుట మందబుద్ధిత్వంబు వగఁ గీడు మానునే వలవ దబల. భార. శాం 1. 118

ఆ కాలకల్పుఁడైన కౌశికుఁ దేతెంచి, శిశిరవారి వారి సేన దేర్చి, యేల నేలఁ బడఁగి లేలెమ్మె నృప యీగ, రాని యప్పు వగల నీనకున్నె మార్క. 1. 204.

గీ. పెక్కువగ లొందెద వదేమి బిసరుహాప్త, చిన్న వోయెద వదియేమి శీతకిరణ... దశా 2. 75

ఉ. రోదన మాచరించు వగఁ గ్రోధమనోభవ కామ లోభమో, హాదుల గూడి తీరములయం దఘముల్... కాశీ 5. 43,

2. సంతాపము

సీ. ...నారదుఁగని భక్తితోడ, మ్రొక్కిన మమ్ము నమ్మని సూచి యుల్లేల వగఁబొంది కందిన వార లనియు, వడిఁగి.. భార. ఆది. 8. 161.

3. వలవంత.

క. ఆ తనువుల వేరుగదా, నాతులు మఱికాక కలిగినన్ వగ తిర్యగ్జాతికి నీజాతికిఁ గల, యీ తీవ్రత గలదె. ఆము. 5. 42.

4. శోకము

ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజవగ, లార్పఁ బనిచి. ఆము. 3 72.

క. ఇది నాకయ్యెం గాఁగల, యదియై యను గాధ నిశ్చయం బెవ్వనికెమ్మదిఁ గలుగు నబ్బు వగ సంపద యాపద గలుగ వట్టి పుణ్యున కింద్రా భార. శాం. 4. 414.

5. ఆలోచన, తలఁపు

క. వరపుత్త్రుఁ గలసి తనయులు, పరువడిఁ దుడువంగఁ గృష్ణుఁ బనుచు వగన్ భా.సురరాజ్యదర్ప మెప్ప విదురుఁ జెప్పెరఁ బంచె దానిఁ దోడ్కొని తేరన్. భార. సభా 2. 200

6. అభిలాష.

ఉ. వారలఁ జూచి కేశవుడు వచ్చినకార్యము సెప్పఁ డన్న నక్కౌరవనాథుఁడిట్లనియెఁ గయ్యము వేయువగన్ సహాయమునుం, గోరి భవత్సకాశము నకుం జనుదెంచితి... భార. ఉద్యో. 1. 69

7. విలాసము.

చ. గగనము దాఁకి చిత్రగతకావవసంహతిఁ బొల్చు హర్మ్యముల్, నగములు సావి యూఁగిన మనంబులఁ బూర్ణసరోవరంబులన్, వగ జలకేళి సల్పనని వచ్చి యెఱింగి వియచ్చరాంగనల్, మగుడుట చూచి నవ్వుదురు మాడువులందు రమించు దంపతుల్. కు. సం. 7 948.

8. ఉపాయము

క. ఏవంక మనము సీతా,దేవిని వెదుకఁదగు నెవ్విధిన్ ఖలుని దశ, గ్రీవు వధింపుద మీవగ, యేవగ మాన్పెదవు తెలుపు మివు డినతనయా రామా 5 286.

9 విధానము.

సీ మును ధాత కల్పాంతమున నిద్రదెలిసి లోక వినిర్మితికి వగ గానలేక, సంక్షుబ్ధుఁడైన రజస్తమోగుణము లుద్రేకంబుఁజూపె... వరాహ. 7. 36

10 గతి, దిక్కు.

క వెలయాలివలపు గడు కో,వెలకున్ వగ లేక వాఁడు వెసఁ జీకటులన్, గలవారియిండ్లఁ దెలులకుఁ, గలవారపుసొమ్ము వెరఁజి గైకొనఁ జొచ్చెన్. శేష. 4. (శ ౦)

11. విధము.

క. అవ్వల నొకనికి మీదుఁగ, జవ్వన మిటు గట్టియున్న జలజేక్షణలో, నెవ్వగఁ బలుకులు పలికిన, నెవ్వగయే కాని చేరవేరవు కోర్కుల్. కువల 3 39

క తోఁచినవగ రచియించెదఁ, దోఁచనిచోఁ జలువ గట్టుదొర తోడై వ్యాయాఁచ కనె యాన తియ్యగఁ, దోఁచ దసాధ్యంబు కవన ధోరణి పట్లన్ ప్రబంధ. 2 25.

12. రకము

ఉ మైనపుటంటు పల్వగల మచ్చులచా లొరగల్లు కట్టెలున్. శుక 1 421.

13. రసము, రుచి.

తే. ఉప్పనైనట్టి చక్కెరలప్పలీదె, చేఁదువగ గల యమృతంపుఁజెలమ యెవరో, పుల్లమందెడు తేనెకరుళ్ళు నరియో, వనిత కడుఁ దియ్యనౌ నీదు వాతెఱకును. సారంగ. 2. 206.

14. వర్ణము, గుంపు.

వ. ఒక్కవగ ఘంటాకర్ణమహోదరులును..
కాశీ. 6 35

15 ఒద్ద, దగ్గఱ

ఉ ...ఈ, ముద్దియ నాదుకోడలిట ముందట నావగ నెమ్మినుండనీ. హర 1 9.

16. యోగ్యత.

ద్వి వగదప్పి మృతిఁబొందు వారికి రాజ, మొగి సముద్రము చూడ మోకాలిబంటి... ద్వి. శ సా 1 857 పం.

17 శక్తి సామర్థ్యము.

సీ పందెమొగ్గినఁగూడఁ బగఱగెల్చు కటారి యిది దీనివగ నిశ్చయింపఁగలిగె... కువల 2. 45

విఱ విలక్షణము, ఒకవిధమైనది.

క. ...పురిన్, దగఁ గోటకొనలఁ గట్టిన, వగ జిగిముత్తెముల చందువాచందమునన్ అని 1 57

వగకత్తె విఱ (వగ+కత్తె) విలాసిని, (శ ర)

వగకాడు విఱ. (వగ+కాడు) 1. విలాసవంతుఁడు

ఉ ...తారయే, కాంతుని పజ్జమాని వగకాఁడగు చంద్రుని దక్కనేల. దశా 7 83

క ఎన్నడోకద వగకాని కింపుమెఱయఁ, గంతు కేళిని వింతలు గానుపించి, హావుసు చెల్లింతు అహల్యా 3. 52.

చ చూచుచున్, గదియఁగఁ గొంకు వీధివగకాఁ డెవఁడైన మెలంగెనేనియున్. ఉ హరిశ్చ 4 17

2. వల్లభుడు.

ఆ ఇరులగొంగ తమ్మివిరిబోఁడి వగకాఁడు, ప్రొద్దు తూర్పుమలను బొడమె నపుడు. నీలా. 3. 45.

వగచే అ. క్రి. 1 దుఃఖించు.

సీ. శుభలక్షణాఁగి యీ సుందరి సైరంధ్రియగు కెట్లొకోయని వగచువారు.. భార. విరా 2 146.

గీ చెన్నుదఱిగిన సొగసుతో విన్ననైన, దేవయావఁ గనుంగొని తెగచి వగచి. యయా 3 83.

2, ఏడ్చు, విలపించు.

ఆ. ఎఱిఁగి నాకుఁ జెప్పు మిదియేమి యెవ్వరి, వలన నింత యయ్యె వగవనేల భార. ఆది. 6 243

గీ. ఇంక నెవ్వరి వేఁడుదు నేది దిక్కు, హో విధీ యెంతచేసితి వనుచు వగచి.. దశా 2 48

క కీనాశునిసమ్ముఖమునఁ, దా నూనివ ప్రతినఁ దలఁచి దశరథసూనుం, డాననము వంచి ధైర్యావిహీనుండై దీనవృత్తి నిట్లని వగచెన్. ఉ. రా 8. 213.

3. పశ్చాత్తాపపడు

తరలము. వగవనేటికి నింకనైనను వారలం బిలి పించి యీ, జగతి నెప్పటియట్ల యేలుచు... భార సభా 2 314.

క మదిమఱపునఁ జాపము తన, కొదవుటయును బిదప వగచి యొకనగమును నే, నిదినేయ నింక ననియెడు, నుది పెఱ నగమునుగ నరుఁడు మలపు నఘంబున్ భార. ఆర 5 41.

చ వగవకు మీయఘంబు చన వాసవ వైష్ణవ యాగ మంచితం,బుగ నొనరింపు. ఉ రా 4 34

4. సంశయించు, సందేహపడు

చ వగవక మాకు నేవురకు వారిజలోచనఁ గృష్ణ నీఁదగున్. భార ఆది 7 250

స క్రి 1 భావించు

క నీ, వారకములుగాఁగ మమ్ము వగవుము బుద్ధిన్ .. భార ఆది. 3 152.

గీ. అన్న డాజంత పలుకు వాక్యంబులెల్ల, మనము లోపల నిక్కంబు అనుచు వగచి విప్ర. 3. 8

2. తలఁచు, తలపెట్టు.

క. తనవగచిన కార్యము దొర, కొనుటకు ధృత రాష్ట్రపుత్రకుఁడు పొంగి.. భార. ఆది 6. 137

3. ఆలోచించు

సీ అసుర, గీ. వలను నూద కొండు వగవక యెప్పటి, యట్ల కుడుచుచున్న నలిగి బకుఁడు భార ఆది 6 292.

చ వగవఁక నద్రిరాజు హిమవంతుడు తండ్రి... కు. సం. 7. 852.

క. తగువగుని బిలిచి కన్యకఁ, దగనయిలంకారమిచ్చి ధారాపూర్వం, బుగఁ బెండ్లి సేయుటయు నిది, వగవఁగ బ్రాహ్మంబనెడి వివాహం బయ్యెన్ విజ్ఞా. అచా 95.

4 విమర్శించు, పరిశీలించు.

క. అగు దేశకాలబలయుత,ముగఁ జేసిన పోర వర్థములు మోఅకులై, తెగఁబాటి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుదిన్. భార. విరా 4 208.

క. తగు నిది తగదని యెదలో, వగవక సాధులకుఁ జేదవారల కెగ్గుల్... భార ఆది. 1. 85

ఱ, వగ, వగకత్తె, వగకాఁడు, వగదెంచు, వగదెగు, వగపించు, వగపు, వగలాఁడి, వగలాఁడు

వగదెంచు² స క్రి (√ వగదెగు) పరిష్కరించు, నిర్ణయించు

చ. పరుఁ డిపుడే వధూటిఁ జెఱపెట్టిన వాని వధించి సాధ్వి యీ,తరుణి యటంచుఁ జేకొనుట ధర్మువుగా వగదెంచె రాఘవే, శ్వరుఁడు.. ఉ రా 6. 211 (శ ర. పా.)

క అని రట్టు సేయ నచ్చుటి, జనములు పొమ్మనియ కునికి చన దని వగదెం,చిన దానిఁ దోడుకొని పో,యె నంత డింటికిని రొక్క మిచ్చెదవనుచున్ శుక 3 41.

వగదెగు అ. క్రి (వగ+తెగు) పరిష్కృతమగు, నిర్ణీతమగు (శ. ర బ్రౌ)

వగపించు స. క్రి (√ వగచు.) 1 ఏడిపించు, విలపింపఁజేయు.

వ. ... వనాంతసఖులగు కిన్నరరాజకన్యల వగపించుచు...

2 దుఃఖింపఁజేయు.

గీ. వృద్ధవేశ్యల వగపింతు రుద్ధతప్రవర్త లగు ధూర్తవిటులు దుర్వారనటులు వైజ 3. 72.

వగపు వి. (√ వగచు) 1. దుఃఖము, వగ

క వగ పుణ్యగతికి మూలమె, వగ పెల్లవిధముల నుడుగవలయు నరేంద్రా భార. స్త్రీ 1. 20.

ఉ, ... దైవమె యిట్లు చేసినన్, విన్నఁదనంబుఁ జెందఁ దగునే వగపేటికిఁ బామరుండవే, యన్న గళంకదేహ వతఁ డర్కకులేశ్వర వారిమాటలన్. ఉ. రా. 2. 208

2 శోకము.

క జననీజనకులును సుహృ,జ్జనులును దెగునపుడు గావఁజనమి తెలియదే, ధనములు వారలకంటెనె, మనుజేశ్వర వగపు వాని మగిడించునొకో భార శాం. 3 29.

3. కీడు.

ఉ. ఈ కరుణాకటాక్ష మొకయించుక నాపయి నిల్పియున్నచో, నేకడ మేలుగాక వగ పేటికిఁ గల్గెడు దానవేంద్ర... దశా 2. 127.

4. విధము

వ .. ఊడిగంపుచేడియలు బలువగపులఁ దమ్మారడింపుచు మరందంబు లాను మిళిందబృందంబుల యందంబున విరివడుపునం బొలలు పెన్నెరులు సందెల్లం బట్టి. మృ. వి 2 84.

వగరము - వగరు వి. (వగర్చు) వగరుపు, శ్వాసరోగము.

చ. పలుకనిమోముఁ దొట్రుపడుపాదములున్ వగరంపుటూర్పులన్, వలవలనైన దంతములు వంగిన మేను వణంకు మస్తమున్, నిలుపఁగరాని యుక్కిసయు నెమ్మొయి నెక్కొను దప్పివెంపుఁ జే,వెలుఁగునఁజూచు చూపుఁగల వృద్ధమహీసురుఁ దమ్మహీశ్వరున్. విక్ర 2. 155.

వగరించు అ క్రి (√ వగరు) వగర్చు, నిట్టూర్చు.

సీ, వేఁటకుక్కలుదస్సి వివృతాస్యములు నిల్పి వగరించుచున్నవి దగలుదొట్టి ... పి శకుం. 1. 128.

వగరు - వగరము వి శ్వాసరోగము, ఉచ్ఛ్వసము, శ్వాసము.

క .. వళి, పలితంబు లయ్యె వగరును, దలయేరుము నుక్కిసయును దలకొనుదెంచెన్. భార. ఆది. 3. 191

ఆ. వగరు పుట్టె వంతఁ దెగలె దంతంబులు, ముక్కిసయును దగ్గు బిక్కటిల్లె, శిరమునొవ్వఁ దొడగెఁ జెదరె మనం బంతఁ, గడిచియైన ముప్పుకాలము నకు భాగ. 6. 61.

ఛ. అటఁ బరదేశికుల్ ... దప్పినోమనం...

వాడఁగా వగరు పుట్టఁగవచ్చిరి వెచ్చనూర్పు చున్. . . ద్వా 11 10.

వ. ... ఏచినమహాతపోష్ణంబునం దృష్ణపాడమి దగ నిగుడ వగరడరి ... తూలు కౌలేయ కమ్ముల ... మనుచ. 4. 60.

వగరుపు(ర్పు) వి (√ వగరుచే) 1. శ్వాసము.

సీ. రెండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసమౌ ఆం. భా. 2 127.

2. శ్వాసరోగము (శ ర.)

వగర్చు(రుచే) అ క్రి నిట్టూరుచు

ఉ. కొమ్మ మెఱుంగుఁజన్నుఁగవకోత్తల భిన్నము లైన యాత్మకుం,భమ్ములఁ జూచియా సతి సొబంగుఁ దొడల్ దొడరన్ వగర్చు హ,స్త మ్ములఁజూచి తన్మృదుపదమ్ములు పుష్కర మూన వ్రాలు నా,గమ్ములఁబ్రోవ బాల గజ గామినియ న్విరుదంబుఁ గైకొనెన్. కృ. శకుం. 2. 16.

చ. అనుజునిఁ జూడ శోకము దశావముఁజూడ వగర్చురోషముం, బెనఁగొన రామభూవిభుఁడు పేర్చి ... దశా 7. 146

జ వగరము, వగరించు, వగరు, వగరుపు.

వగలాఁడి వి (వగలు + ఆఁడి) విలాసములుగల యాఁడుది, విలాసవతి, ఒయారి.

సీ. వగలాఁడి యిచట సువర్ణము ల్గలుగునే . ఉ. రా. 1 72.

ఉ పవగఁ ద్రోచిన న్విడువ దీ వగలాఁడి బళారె . శశాం. 3. 75.

గీ ఎఱుక వగలాఁడి కోరినవెల్ల నొసఁగి, . . శుక 1 111.

ద్వి. వగలాఁడి బహుమాయవాద మూహించి, వగ డంపుఁ గంబంబు పట్టుకలేచి ... ద్వి. శ సా. 1 39, పా. 15. పం.

వగలాఁడు వి (√ వగ) విలాసములుగల పురుషుఁడు. (వా ) విణ. వగకాఁడు (శ. ర.)

వగవగ వి (ఇది "వగ"కు ఆమ్రేడిత రూపము ) పలువిధములు, రకరకములు

సీ. వగవగ కూరలు వరుగు లప్పడములు నొలుపుఁ బప్పునుమించు టోగిరములు ... ఉ. రా. 6. 121.

విణ రకరకములుగల, పెక్కురకముల.

సీ. ... క్రొత్త, రంగుల అవికెలు బంగారుఁ బూఁగొప్పు నవరముల్ వగవగ సన్నచీర,

గీ. అద్దముల్ పరిమళములు నాదిగాఁగ ... దశా. 6. 34.

వగాహము సం. వి. అ. పుం. — అవగాహము.

వగ్గము వి (సం వర్గః=ఋగ్వేదము నందలి యధ్యా యముయొక్క యొకభాగము — ఆ ని.) వేద భాగము

మ. పిగ దువ్వున్ ముడివైచు దువ్వు మఱియుం జేఁదోయి బిట్టెత్తుచున్, బిగియు న్నిక్కుచుఁ బెక్కుచేష్ట లొలయన్ బిట్టావలించున్ నఖా, గ్రగతిం జీరి తటుక్కునం బయిఁబడన్ ఘుర్ఘాం బువుల్ చిమ్ముచున్, వగగా వగ్గము నుగ్గడించు ఘనరావస్ఫూర్తి కంఠధ్వనిన్...ఘటికా 2. 30

వగ్గు[1]-వక్కు[1] అ క్రి బక్కటిల్లు, కృశించు (శ ర )

విణ బక్కటిల్లినవాఁడు, కృశుఁడు, బక్కటిల్లినది, కృశము.

గీ ఉగ్గడించి మమ్ము నొంటివగ్గులఁ గనుం, గొనుము వంత దీర్పు మనియె నధిప.... భార. అశ్వ. 1 6

చ అలన యొకర్తు వగ్గుకృకలాసముఁ జేరఁగఁ దెచ్చి వంచనన్, వలునకుఁ గుంచెవట్టు నెలనాఁగ పదద్వయమధ్యమంబునన్, నిలిపిన... నైష. 6 111.

క జననాథ యేమిచెప్పుదుఁ, గనలుచు నవ్వగ్గుతపసి కటము లదరఁగాఁ, దనచేతి నాగబెత్తముఁ, గొని పసరముఁ గొట్టినట్టు గొట్టె నదయుఁడై . మనుచ 4. 85.

సీ. ... ఓసిచెల్లి యిమ్ముసలివగ్గు, నీకుఁ దోడై వచ్చునో కలదో మఱియేమైన ననుచు .. కళా 3. 127

జ వగ్గుఁదనము, వగ్గుపడు.

వగ్గు[2]-వక్కు[2] వి. (సం బకః ) 1 ఒకజాతి కొంగ. తే బకము విలసిల్లు నారణపక్కి వక్కు, వగ్గ టంచన ... ఆం భా 2 93.

వగ్గుఁదనము వి. (వగ్గు[1]+తనము) కృశత్వము, బక్క టిల్లుట.

ఉ వగ్గుఁదనంబునంజనెడు వాయుసుతుం గని నీవు నవ్విననో, భగ్గునమండి నన్నుఁగని పల్కె నతం డతిరూక్షవీక్షణన్ .. సమీర 2 21

**వగ్గువడు** అ క్రి. (వగ్గు$^1$ + పడు స్వార్థమున) వగ్గగు, బక్కటిల్లు, కృశించు

వ . జిగిదెగి బిగి వదలి స్రగ్గి వగ్గువడి తరం గితాయమానంబైన సర్వాంగీణ చర్మంబును కవిక 6 110

**వగ్గెర** వి వల.

క. పులుఁగులఁ తినుఁగుకిరాతుఁడు, వలఁదపులఁగఁ దిగిచి తగ్గి వగ్గెరవగ్గం, బలఘుతరకీలమున నం, వలనముఁ గావింపుచుండె వలసిన భంగిన్. వేం. పంచ 2 12

**వగ్రహము** సం వి అ పుం అవగ్రహము.

**వచ** సం వి అ. స్త్రీ 1 మనుష్యునివలె మాటలాడెడి పక్షివిశేషము, ఒకజాతి పిట్ట 2 పరిమళముగల యోషధివిశేషము, వస (వృ) వి

**వచనకరుఁడు** సం. విశ (అ ఈ అ) విధేయుఁడు, పనిచినదానిని చేయువాఁడు

వి అ. పుం సూత్రకారుఁడు. ధర్మనిబంధన గ్రంథ కర్త,

**వచనకారి** సం. విశ (న్ ఈ. న్)—వచనకరుఁడు.

**వచనగ్రాహి** సం విశ. (న్. ఈ న్) విధేయుఁడు, ఆజ్ఞాప్రకారము చేయువాఁడు

**వచనమాత్రము** సం వి అ న మాటమాత్రము, నిరాధారవాక్యము

**వచనము** సం వి అ న. 1 కథనము, చెప్పుట. 2. మాట, పలుకు, వాక్యము 3 అవృత్తిచేయుట 4 సిద్ధాంతము (శాస్త్రవచనము, శ్రుతివచనము, స్మృతివచనము మొ) 5 ఆజ్ఞ.

క. నావచనమున నపత్యముఁ. గావించును గుంతి నీకుఁ గడునెయ్యముతోన్ . భార. ఆది. 5. 181

క వసునిభుఁడు పైతృకంబగు, వసుధారాజ్యంబు భీష్మువచనమున గత,వ్యసనుఁడయి తాల్చెఁ తేజం, బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధయశుండై. భార. అది. 4. 196.

6 ఉపదేశము, ఆలోచన, సలహా 7 ప్రకటన 8 వర్ణోచ్చారణము, అక్షరముల పలుకుబడి 9 (వ్యాక) ఏకవచనాది, (ఏకవచనము, ద్వివచనము, బహువచనము) 10 సొంటి, శుంఠి 11 చెప్పినపని చేయుట

తరలము చెడకు నా వచనంబు సేయుము వెచ్చెరన్ ధరణీశులన్, విడిచిపుచ్చుము . భార వభా 1 192.

**వచనవిరోధము** సం వి అ పుం శాస్త్రాది వాక్యములకుఁ బరస్పరవిరోధము - అసంగతత్వము

**వచనీయము** సం విశ (అ ఆ అ) 1. చెప్పఁదగినది, పలుకఁదగినది 2 నింద్యమైనది, నిందింపఁదగినది వి. అ న నింద, దూఱు

**వచనే(న)స్థితుఁడు** సం. విశ (అ. ఆ. అ) విధేయుఁడు, చెప్పినట్లు చేయువాఁడు

**వచనోపక్రమము** సం వి అ పుం. ఉపోద్ఘాతము, అవతారిక.

**వచరము** సం వి అ పుం కోడిపుంజు

**వచరుఁడు** సం. వి. అ పుం. శఠుఁడు, దుష్టుఁడు

**వచసాంపతి** సం వి. ఇ పుం బృహస్పతి, బృహస్పతి గ్రహము

**వచస్సు** సం వి న్ న 1 మాట, వాక్యము 2. ఆజ్ఞ, శ్రుత్యాదివచనము 3 ఆలోచన, ఉపదేశము, 4. వేదమంత్రము 5 పక్షిగానము. 6. (వ్యాక.) ఏకవచనాది

**వచించు** సం న క్రి 1. పలుకు, భాషించు, వాక్రుచ్చు

మ. సముఖాయంచును వేత్రహస్తులు వచించన్ డిగ్గినన్ లేచి దశా. 2. 124.

2 చెప్పు, వర్ణించు

క హరిదినమున కే ధర్మము, పరిగా దే తీర్థములును సరిగావు గుణాకర యొందునుపోషణ జాగరములనగుపుణ్య మలవిగాదు వచింపన్. జాహ్నవీ. 3 93

**వచోగ్రహము** సం వి. అ. పుం చెవి, శ్రవణము.

**వచ్చె** వి 1 చెట్టునకు పట్టి బొత్తిగా నాశముచేసెడి యొక దినుసు చీడ. 2. ఇచ్చ, కోరిక. (శ. ర.)

వచ్చు అ క్రి (క ఖర్ త వరు)
(దీనికి ప్రార్థనాద్యర్థమునందు రమ్ము, రారండు అనురూపములును, తుమున్నాద్యర్థము నందును, వ్యతిరేకార్థమునందును రాన్, రాఁడు, రాక, రామి మున్నగు రూపములును గలుగును)
దరిచేరు, దగ్గఱు, ఏతెంచు

- క నారదుఁడువచ్చుఁ దద్వచ,నారంభుల రగుఁడు మీర లని కఱపి మహో,దారుఁడు వారల వీడ్కొని, నారాయణుఁ డరిగెఁ దక్షిణమ తవపురికిన్ .. భార ఆది 8 88
- క దేవర యావతి యిచ్చిన, యీ వాక్యము లెస్స నాఁడు నీవ యుపేక్షం, బో విడిచితి నింకను నీ, చేవత్తురు వారు వీరిచే టొప్పదురే భారం ఉద్యో 2 202
- ఉ అంతట నొక్కనాడు ధవళాంబుజ నేత్రుడు వచ్చి పారి 1. 43
- గీ అనుచు నడలెడుతల్లి నూరార్చి యంప, దొనలు విల్లును గయికొని చనఁ దలంచు, నెడల నడ్డం బుగా వచ్చి పుడమికాన్పు, వలపుగులుకంగ మెల్లనఁ బలికె నపుడు అచ్చ రా అయో 69
- చ ఈ యఘమయాత్ముని ఘోరవిధి న్వధించి ర, మ్మనవుడుఁ బూరుపార్థముగ నవ్విభుతోడ ఁవచ్చు క్రతుం డనున్ విక్ర 3 62,
- సీ వ్రాసి పంపితిమి భూవరులకు మత్పురంబునకు వేవేగరమ్మనుచు వేడ్క... ఇందు 5 16
- రగడ వేమాకందము లేమాకందము, రామా మెల్లన రామా కందము. . ఇందు 3 35

(ఇందు 'రమ్మా' యనుటకు మాఱుగా 'రామా' యని ప్రయోగింపబడెను)

- మ . ఎల్లరున్, వినఁగాఁబల్కి కుమారునిం దెలసి రండీయంచు రా బంపినన్... సారంగ 3 8
- శా .. ఇం,దేలా యాటలు సాలుపాలు నిఁక రారేయంచు వా రేఁగుచున్ . ఉ రా 1 173.
- ఉ సోరణగండ్ల రాఁగొాదమచుక్కలు పట్ట నతు ల్కవాటముల్, చేరప... ఆము 2 13

2. సంభవించు, తటస్థించు.

- ఉ .. నపుంసకజన్మ మవశ్యభోగ్యమై, వాఁడిమి గల్గుశాపమున వచ్చె.. భార విరా. 1, 238
- శా. లోకాలోకనగంబు దాపలకుఁ గల్లోలాహతాం భోధి వే,లాకుంజంబులకుం జవంజవఁగ నాలా వెంత చింతాభరం,బాకంపంబు మనంబునం బెను పఁగా నైరావతోచ్చైశ్శ్రవ, స్వీకారంబున దిక్కులం దిరుగ వచ్చెన్ దేవకీనందనా. ఉ హరి. 1. 133.

3 లాభించు,

- గీ దుష్కరంబైన తప మిట్లు దొడరి చేసి, మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చె.. హర 4 23,

4 కలుగు, ఉద్భవించు

- క ఆ సాత్యకి వేఱొకవి, ల్లాసురగతి నెత్తి యు గ్రమగు నారాచం, బేసిన నాతఁడు కేతు వ్యాసక్తుండయ్యె మూర్ఛవచ్చి నరేంద్రా. భార భీష్మ. 3 210.
- సీ ఇట్టి బంధులఁ బాసి యేనొకండ, రాబుద్ధి రాదు తారకరాజశేఖర... హర 2 139
- క తమతల్లి పురంధ్రీ జా,తమతల్లి గదా తదీయ తనుజుఁడనఁట హో, రమణీ యేతఱినైనను, రమణీయేతరగుణంబు రానేర్చు నొకో సారంగ 2. 104
- మ బెరసెన్ మేన నిగిడ్చినట్లు వళులు... వృద్ధా లికిన్, మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచల న్మందానిలా సంగతిన్... పారి 5 46
- గీ విబుధనాయక నీ వెంత వేఁడికొనిన నాకు దయ రాదు దశా 2 39

5. (పండ్లు) మొలచు, అంకురించు

- సీ పలు రాకమును వచ్చి బాలువేలుఫు మన్నఁ బండ్లు లేకుంట నభావ్యుఁ డనియె, బండ్లు రాఁజూచి డింభకుని వేలుపుమన్నఁ బడిపండ్లు రామి నభావ్యుఁ డినియె భాగ 9. 196
- క అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లువచ్చి నప్పుడు మమ్ముం, గఱచెదవుగా వి తగునెడ, మెఱయిడు మది యెట్టి దైవములు వినియెడినో. కళా. 3 230.

6 లభించు, దొరకు.

ఆ. ఆభిచారిఘవగరాంబు దూషితరుజ్నీ రంత రాద్రిగహవ దంతురోగ్ర, కీకటోర్వి మేరుగిరి సమాఘముమవచ్చు, నేని చొరకు పంపె యిడుము కొనగ అము 4 268

చ. వెలుపల వడ్డికిచ్చినను వీసము వచ్చుననట్టు లాయెనో శుక 2. 579

క. కోపమునఁ జూచి యపుడా, భూపాలకుమారుఁడను సుబుద్ధికి నానా, పోపో మ్మూర్ఖరకవలవని, పాపముఁ గట్టెదవు చాలుఁ బదివేల్ వచ్చెన్. సారంగ. 2. 17,

7. చెందు, ముట్టు

ఆ. కాన విష్ణుఁడైనఁ గానిమ్ము రాముతో, నిగ్రహంబెకాని వినయమెల్ల, ననికిఁ జాలు దేని చను చాలవేని నీ, పోటు వచ్చె నిదురవోవఁ బొమ్ము భా రా యు 895.

ఉ అండజయాన నీయొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె... మనుచ 2 48.

8. (గ్రహాదులు) ఆవేశించు, పూను.

గీ అట్టియెడ వేల్పు వచ్చిన యట్లమేను, వొంగ నలిరేగి పాండవపుంగవుండు, మత్స్య నృపనందనుని బలుమాటతోడి, యేపు నెవికిని జూడ్కికి నింపునొసఁగ. భార విరా 5 40

చ. ... అ, వ్వనరుహలోచనల్ నివమువచ్చిన యందముఁ జూపి రందఱు న్ శుక 3 119

9. ఇష్టమగు, అనుకూలమగు

(ఈ యర్థమున నీశబ్దమునకుఁ బూర్వము 'మనసు' అను నర్థముగల నదము వచ్చును )

గీ. ఏను వంటల వాడనై యా నరేంద్రు, గొలిచి గరగరగాఁ గూడు గూర చిత్తమునకు వచ్చిన చందంబునవ యొనర్చి. నేర్చి మెలఁగుదుఁగరము వినీతి మెరసి. భార. విరా 1 76

చ. . రెండుదిక్కుల హితంబును బెంపును గల్గునట్టి చొప్పున విదురాది సజ్జనుల బుద్ధికిరానుచితంబుతోడి మెచ్చువఁ బఱుపసందనంబునను భూపతులెల్ల నెరుఁగ నాడుమా భార ఉద్యో. 3. 23.

వ అది యొఱిఁగి పసిష్ఠుండు గనలి యోరి నీవు తండ్రి చిత్తంబునకు రామియు గురుదోగ్ధి వధంబును నప్రోక్షితసూంసోపయోగంబును నను మూడు తెరంగుల హృదయ శంకువులు గావించితివి త్రిశంకుండ వయితివి... హరి పూ 2. 45

గీ వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామతంత్రంబునకు సంచకర్వుగాఁగ, జుంబనము సేయని మ్మోష్ఠబింబ మిపుడు, గండుఁ గోయిల చిగురాకుఁ గమిచినట్లు శివరా 3. 68

ఉ . ఆ నృపతి పాలికిఁ బోయెదవేమొ పొమ్మునీ యిచ్చకు వచ్చినట్లు రమియింపుము... శుక 2 67

10 ప్రసన్నమగు

చ సరసతరోక్తి నేఁగి మునిసత్తముఁ జిత్తము వచ్చునట్లుగా, వరుఁకులఁ బెట్టి తెచ్చెదరు వారవిలాసిను లెన్నిభంగులన్... భా రా బాల 63

సీ .. భార్గవులచే బలి యెట్ట కేలకు బ్రదికి వారి. చిత్తంబు రాఁ గొల్చి శిష్యుఁడై వర్తింప .. భాగ 8 439

సీ. హెచ్చుమాటల కేమి యింక నొక్కటి మనేరాలు దారినఁ ద రసిలినఁ, బంపుచేతనె పారఁ బట్టించినపుడుగద స్వామివారి చిత్తంబువచ్చు. . రా వి 5, 49

క ఆ యోగవిద్య మెరులకు, నో యామున లే దొకింతయను గావున నీ, వాయనచిత్తము రాఁ బ్రజ్ఞాయుక్తిం గొలిచి దాని సాధింపఁ దగున్. పరమ 5. 193.

11. అలవడు, అభ్యస్తమగు

గీ వాని కిరేడువిద్యలు వచ్చియుండు నైష. 6 25

ఉ . విద్యలు వచ్చునంచు నేఁ, గ్రొవ్వున విప్రులక్ సరకుకోక తిరస్కరణంబు చేసినన్. వరాహ 7 84

ఉ అక్కట పొట్టచించిన నొకఅక్షరమైనను రాదు లెక్కలుం, దక్కులె కాని యమ్మనిన ధమ్మన నేరఁడు.... శుక. 2 437.

12. అగు.
చ. ఇతని కితండె సాటియగు నీతని కీతఁడె సాటి వచ్చు.. హ్రీఉ పారి 4. 257
చ ...నిర్నొరసి తా రెనరాక కదా నిలింప భూ, జములు వహించు దుర్యశము.. ఆము 1 43.
చ. దు,ర్జయుఁడగు నా నృపాలుని పరాక్రమ శీలకు రాజులెల్ల నా,రయ సరి షోడశాంశమును రారు జై భా. 8 34
13 సాటియగు
సీ కడుమృదురీతి నీనడపాడుగతికిరా నని క్రాలి నడచు రాయంచ లివియు. కు సం 1 687.
14 ప్రవర్తించు, నడచుకొను.
క నేరిచిన నేరకున్నను, గూరుచుకొని రాక మీరె కోపించిన దశా. 2 37
ఉ నారదమునీంద్రుడు .. పలికెన్...బతిఁ గూర్చుదాన నా, యంతటివారు లేంని యహం కృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్, వంతున వచ్చు సత్యగరువం బిఁక జెల్లదటంచు మానినీ. పారి 1 80
15 ప్రసక్తమగు.
వ. . ఇంకఁ బ్రకృత కథ వచ్చుచున్నది యాక ర్ణింపుము. కళా 4 40.
16 వర్ధిల్లు
క వరుసన యెడతెగక యిట్లువచ్చిన వంశం, బురుభుజ భార. ఆది 4. 221
17 సమర్థమగు
సీ భ్రూభంగములు లేవె యాఖీల వింధ్యగర్వ స్తంభకమునకు రావుగాక పాండు. 5 176
18 నెఱవేఱు, సిద్ధించు
మ, ... ప్రపితామహప్రతతుల న్నాకంబు నొందగ దె,చ్చితి నాకాపగ నింక నీ ప్రతిన వచ్చెన్. భా రా బాల. 461
19. కాఱు, స్రవించు.
సీ ఇందాఁక నెఱుగక యేమి యంటినొ మిమ్ము వనుచుఁ గన్నీళ్ళురా నడచుకొనుచు, కళా 4. 171.
20. పొంగు, నిండిప్రవహించు.
వ్యవ. గోదావరి వచ్చినది

ఆ, ఎందుఁ జనఁగరాని యిక్కట్టు ప్రాప్తించె గృష్ణ రాఁ దొడంగెఁ గృష్ణరాయ, లివలఁ దఱుమఁ జొచ్చె...కృష్ణ 3. 43
21 తగు, యుక్తమగు
(ఈ యర్థములందు అన్నంత క్రియలతోఁ గూడి కానవచ్చును
అ ఎల్లభూములను నేలుటకైనను, నిట్టి క్రూరకర్మ మెట్టు సేయ, వచ్చుఁ గడఁగి యెదిరి వా రేమి సేసిన, మాఱుసేయ నాకు మనసురాదు భార భీష్మ 1. 185.
క అనవుడు మునివాయకుఁ డి,ట్లనియె నృపతి నిన్నుఁ బంపునఁట వినుము విరో,చన పరులకు నిది యీవ,చ్చిన విచ్చెద దాఁచనేల చెప్పు మట న్నన్ వరాహ 5, 11
(ఈవచ్చున్ – ఈయఁదగును )
ఉ బుద్ధియ కల్గెనేని కొనిపోకుడు ధర్మము సూక్ష్మమీ యసం,బద్ధములైన న్యాయముల బంతము వచ్చునె మేము దెంపుమై, యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి నెంత చెప్పిన, న్నిద్ధరణీతలామరువి నీరు చలంబున మీకుఁ దక్కునే శివరా, 4 62
ఉ రాజు లే,పార ననేకమార్గముల నప్రియులం, దగఁజూతు రేర్పడన్, వారి నెఱుంగఁగా వలయు వచ్చునె నమ్మగ నెందు రాజులన్ భా రా కిష్కిం 11.
గీ శివకళత్రమునకు శివక్షేత్రమునకు, శివుని మూర్తికి శ్రీసదాశివునికీర్తి, కితరతీర్థంబు సరి పోల్ప నెట్లు వచ్చు, దక్షవాటంబునకు మహా స్థానమునకు భీమ 3 129.
ఉ. అచ్చుపుబ్రహ్మచర్యము ప్రయత్నమునం జరి యించుచుండి నేఁ,డొచ్చెల శూద్రభామినికి నువ్విళులూరి పథంబు దప్పఁగా, వచ్చునె తెడ్డునాకి యుపవాసము మాన్పికొనంగ నేటి కిన్ విక్ర 1. 150
ఉ .. ఇం, దుండఁగరాదు, పోవలయు నూరికి నింటికి . మనుచ. 2 48.
22 శక్యమగు, వలనుపడు

గీ ఇమ్మహాస్త్రంబుఁ గడిమిమైఁ గ్రమ్మరింప, నెవ్వరికి రామిఁజేసిఁగా కేము శక్యమైన నూరక యుండుదుమయ్య .. భార. ద్రో. 5. 387,

క. కావున వంచన బాహిం,పోనకయుండంగ మన రిపుం బరిమార్పం,గావచ్చునేని యట్టిద, నా వలపటుగాక తక్కినను పలదు సుమీ భార. శాం 2. 287,

గీ దురితకరముల యని వానిఁ దొడరకుండ, వలదె లెస్సగ నెఱిఁగిన వచ్చుఁ దొలఁగ భార శాం 5 600.

ఉ ఎవ్వరికైనఁ జేరఁ జొర నెన్నఁడురాని నిశాచరా స్పదం, బివ్వన భూమి... హరి. పూ. 7 89.

క. మిహిరలవంబులఁ దారా,గ్రహ నక్షత్రముల వచ్చు గణుతింప భవ,న్మహిమార్ణవ గుణ రత్నము, లహిభూషణ యెవరికైన నలవియె పొగడన్ భీమ. 5 127

గీ తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ, దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ, జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు· భర్తృ. నీతి. 5

23 సిద్ధముగనుండు

గీ. నీ పంతెమాడుకొ మేమ్మల యాల,సింప నీ యాట యోడవచ్చినది యనియె కళా 6 117

క తనరాష్ట్రము చెడవచ్చిన, ననిమిషపతి విప్రుఁ డనక యాచార్యుఁ ద్రిశీ,ర్షునిఁ దునుమఁడె... అము. 3, 37.

24, పూను, ఉద్యమించు, యత్నించు

(ఈ యర్థమున నిది తుమున్నంతమునకును ప్రయుక్తమగును )

ఉత్సాహ ఎన్న సేవరించు నురుసమిన్మహోవనం బులో, నన్నగారి గినిసినను ఘనాతిచండ కాండ వృ,ష్టి న్నలంపవచ్చు జగదజేయ దండ నుండు మా,యన్న బ్రాహ్మణునకు విరచితాంజలియగు భక్తితోన్ రాఘవ 2. 105

పంచచామరము ... త్రిమ్మరి మఱిట్లు వ,చ్చి సారె సారె నన్నుఁ గెర్లఁజేయ రాక పొ మ్మిఁకన్ విప్ర. 4 59.

క అతివా ముదియఁగ ముదియఁగ, మదిదస్సెనొ కాక నీకు మనమున నియమ,వ్రతపరుల శూద్ర రమణీ,రతికై బోధింపవత్తురా యిదితగవా విక్ర 1 144.

గీ. మాకు, బుద్ధిచెప్పఁగ వచ్చితే ప్రోడయనఁగ నలిగి... దశా. 4 201

25 తొడఁగు ఉపక్రమించు.

సీ. . ...న గర్వ ముదయింపవచ్చిన నుడుపంగ వలయు గర్వంబున గురుసమారాధనంబు, వదలిన... భార అను 3 321.

26 తలఁచు.

గీ, కోరి తొలుమేనఁ దనకైన కొడువలెల్ల. మాన్పుకొనవచ్చి భువనైకమాన్యలీల. పారి 1.17.

27 ఇది కను, విను మొదలగుధాతువుల కను ప్రయుక్తమగుచోఁ గర్మార్థక 'పడు' ధాతువు నర్థమిచ్చును

కానవచ్చెన్ - కనబడెను

గీ. ఎడపఁదడపఁ దనూభవుం డెచట మండుఁ, గాన రాఁడని గృహభర్త కాంత నడుగ, నింతదడవును నాయొద్ద నిచట నుండి, యరిగెఁ జదువంగ నని భర్తకతివ మొఱఁగు కాశీ. 4 85.

సీ హరిబహిఃప్రాణంబ వగట నేఁ డెఱుగంగ వచ్చె నీ కిపు డిది యిచ్చెఁగాన .. పారి. 1. 58

(ఎఱుఁగంగవచ్చెన్ – ఎఱుఁగంగఁ బడెను.)

మ. అందొక్క గలస్వనంబు వినవచ్చెన్ మాధురీ ధుర్యమై వసు 2 13.

28 ఇది కొన్నిపట్ల 'పోవు' మున్నగు ధాతువు లకు వాక్యాలంకారముగా నను ప్రయుక్త మగును

సీ పరమ కల్యాణి యో భాగీరథీగంగ వార్ధి భామిని పోయివత్తునమ్మ కాశీ 2 136.

గీ మీ రిరువురు, నీ యెఱుక మరచెదరు సూ పోయివత్తు ప్రభా. 3 64

సీ. ... అందుఁ ద్రేతాయుగమునకు సమకాలి ధర్మముల్ జరిగివచ్చుఁ, గీ గృతయుగాద్య వస్థలు లేవు సతతమును మ,నోహరములైన రాజధానులు వనములు, నంబుజాకరములు నెన్నియైనఁ గలవు వి పు. 8 51.

గీ అంతకంతకు గతివేగ మగ్గలింప, రాక వాగె యెచ్చరిక పరాకు, జియ్యా యను జనులు ఱిచ్చ వడి తమపని మఱవఁగఁ, బఱఁగు నమ్మేటి నెఱ రౌతు ప్రౌఢికతన ప్రభా 2.33.

వాడుకలోని విశేషప్రయోగములు

1. ప్రొద్దు క్రుంకవచ్చినది
2 మొత్తములో కొంతసొమ్ము లోటు వచ్చినది
3. వారికి ఓ అన్న న రాదు
4. వానికి భూములమీఁద పదివేల రూపాయిలు వచ్చును
5 నిష్కారణముగా నూఱు రూపాయిలు దండుగ యిచ్చుకోవలసి వచ్చినది
6. మాటమీఁద మాట వచ్చును.
7 వానికి జ్వరము వచ్చినది
8. ఎందుకు వచ్చిన గొడవ యిది?
9. ఈ పిల్లవాడు తప్పక పనికివచ్చును

విశే. విపులము

ఉ. ఒయ్యన వెల్లు వూపి జడి నుబ్బరవో యెడి ప్రాణికోటికిన్, దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగఁ దూరుపు తెల్లవాఱె తెల్పయ్యెను నీరవీథిఁబడి యంబుధి కేఁగె నదీ ముఖంబు నన్, బయ్యరవట్టె మేఘములు వచ్చుగఁ బాజె నుదజ్ముఖంబులై హార 2 24

జ రప్పించు, రాఁబట్టు, రాక, రాకడ, రాకా పోక, రాకొట్టు2, రాబడి, రావించు, రావెడలు వచ్చుబడి, వచ్చురాములు.

**వచ్చేబడి** వి. ధనాగమము, ఆయతి, (శ ర)

**వచ్చేరాములు** వి బ (వచ్చుట + రామి), వచ్చుటయు రామియు

గీ వాఁడు మఱునాడు నవ్విప్రనందనుండు, ధాత మాటలచందంబు దానవారి, తనకడకు వచ్చురాములుఁ దలఁచి తలఁచి, ముచ్చటల యేటి తరగల మునిగి మునిగి పాండు 4. 66

**వజె** వి (సం. వచా క. వజె. బజె) వస, ఓషధీవిశేషము.

గీ వసయన వజెయనంగ, వచకుఁ బేరు చెలఁగు ఆం భా 2. 55

**వజీరు (ఁడు) - వజ్జీరు(ఁడు)** వల్జీడు, వి. (హిం. వజీర్. బ వజీరులు, వజీర్లు.)

1. యోధుడు, శూరుడు.

గీ చిల్క సామ్రాణి తేజివజీరుఁ గేరు, కృష్ణమంత్రీంద్రు చెలువు వర్ణింపఁదర మె దశా 1 71

సీ. జగమెల్ల గెలువఁ గెంజిగురుటాకుజిరా వజీరున కిదిగదా జీవగఱ్ఱ చం. రా 3 45.

గీ పచ్చవన్నియచిల్క బాబావజీరుఁ, డుల్ల ముల్లోలముగఁ జేయఁ దల్లడించు శుక. 1 113

ఉ ముంగు పసిండి తమ్మిబలు మొగ్గల మొగ్గరమాచరించు మేల్చెందెడు వేల్పు గుబ్బలి వజీరునిజీరు నధఃకరింపఁగాఁ, గ్రొందలిరాకుబాకు దొరకున్ దొరకించు భవంబు చెల్లరే చందన గంధి చన్నుఁగన చంద్రుఁడో యింద్రుఁడో యాయుపేంద్రుఁడో కృ శకుం 2 12

2 మంత్రి, సచివుఁడు

మ ...నిజామాదుల్ వజీరుల్ భజింతురు వమ్రత్వముఁ గానలో మునలిమానుల్ గా వితర్కింపగన్. వసు 1 44

సీ కలువలదొర చల్లగాలి వజీరులు పూనిరాస్తాను చసాను గొలువ.... గీ. . మదనుపాదుషహా దండుగదలె నపుడు అని 3 19,

3 సామంతరాజు

క గడి దుర్గంబులకోటల, నిడురాణవుదొరల కెల్ల నెప్పుడు జెల్లే, ఫుడమియు మన్నెవజీర్లకు, నడుచు ముఖాసాలుగాక నగరి ధరిత్రిన్ ఉ. హరిశ్చ 1. 66.

**వజా** విశే ఇంపైనది, మనోహరము

మణిమాల. అజపాత్పయోదధి ఘృతమ్ము లమ్మచు మురారిఁ బాడి రెలమిన్, వజాఁగాఁ దదీయ చరణాబ్జనస్యమ్మాదయారవింద లగుచున్ అప్ప 4 155

**వజ్జ** వి 1 ఉపాయము, వెరవు. (శ ర)

2 ఉపమ, పోలిక (శ ర)

**వజ్జెము** వి (సం వర్జ్యమ్) విషఘటికాక్రాంత సమయము

ద్వి. వజ్జంబొ వారంబొ వారిసాజంబొ, వెజ్జుఁ జూపించరు వేల్పుల కిడరు . ద్వి, పరమ. 3 154 పా 19-20 పం

**వజ్జిరము** వి. సముద్రపు మత్స్యవిశేషము. (శ. ర)

**వజ్జీరు(ఁడు)** - వజీరు.

గీ .. ఎల్లరు వెఱఁగంద నలరు నెపుడు, మేలు వజ్జీరు గమికొండ గోలకొండ. యయా. 1. 3

గీ ఎట్టవజ్జీర్లు నెన్నంగ నీడుగారు. . యయా. 1 19

**వజ్ర** నం. వి. అ స్త్రీ. 1 చెముడు, ఒకజాతిచెముడు (వృ వి.) 2. తిప్పతీఁగ. 3 దుర్గాదేవి.

**వజ్రకంటుఁడు** నం. వి అ. పుం. హనుమంతుఁడు

**వజ్రకము** నం వి అ న 1. చర్మరోగములను బోఁగొట్టెడు వలుతెఱఁగుల మూలికలతోఁ జేసిన తైలము 2. కంటి కగపడు నొకానొక యాగాళ భాగము

**వజ్రకాలిక** నం వి. ఆ. స్త్రీ బుద్ధునితల్లి పేరు.

**వజ్రకీటము** నం. వి. అ పుం. సాలగ్రామము లోపల నుండి తొలిచెడు పురుగు (శ. ర)

**వజ్రకీలము** నం వి. అ పుం పిడుగు.

**వజ్రకూటము** నం వి. అ. న. వజ్రములు శిఖర మందుఁగల యొకానొక పర్వతము

**వజ్రకేతువు(ఁడు)**. నం. వి. ఉ. పుం. నరకాసురుఁడు.

**వజ్రగార** – వజ్రగారె (వజ్రము+గార[1])

ద్వి గోమేదకంబుల కొణిగలు బవిరి, గా మల్చి పై వజ్రగారం యొసంగి. రం రా బాల 73 పా 8 పం)

**వజ్రగారె** - వజ్రగార (వజ్రము+గారె) మి. వి వజ్రము పొడి కలిపి తయారుచేసినగారం

మ వజ్రగారెలఁ జెన్నొ నొకగట్టిచప్పరములో రేరాచరాతిన్నెపై . . దశా 4 49.

**వజ్రగోపము** నం. వి అ పుం ఇంద్రగోపము, ఆరుద్రపురుగు

**వజ్రచంచువు** నం వి ఉ పుం రాపులుఁగు

**వజ్రచర్మము** నం. వి న్. పుం గండకము. ఖడ్గ మృగము

**వజ్రజిత్తు** నం వి. త్ పుం. గరుడుఁడు. గరుత్మంతుఁడు.

**వజ్రజ్వాల** నం వి. ఆ. స్త్రీ విద్యుత్తు. మెఱుపు

**వజ్రతుండము** నం. వి. అ పుం. 1 రాబందు, రాపులుఁగు 2 మశకము, దోమ

**వజ్రతుండుఁడు** నం. వి అ పుం 1. గరుత్మంతుఁడు. 2 విఘ్నేశ్వరుఁడు

**వజ్రదండము** నం వి అ. పుం వ్రణములో పుట్టెడు పురుగు. (శా, ని)

**వజ్రదంతము** నం వి అ పుం, 1. సూకరము, పంది, అడవిపంది 2 ఎలుక.

**వజ్రదంష్ట్రము** నం వి అ పుం. కీటభేదము ఒక జాతి పురుగు

**వజ్రదశనము** నం. - వజ్రదంతము.

**వజ్రదేహుఁడు** నం విఙ (అ ఆ. అ) కఠినమైన (గట్టి) దేహము గలవాఁడు,

**వజ్రద్రుపు** నం వి. ఉ పుం. ఆకుజెముడు (వృ వి.) (శ. ర)

**వజ్రధరము** నం వి అ. పుం గుడ్లగూబ.

**వజ్రధరుఁడు** నం. వి. అ. పుం ఇంద్రుఁడు

**వజ్రనాభము** నం వి అ పుం కృష్ణుని చక్రము, సుదర్శనము

**వజ్రనిర్ఘోషము** నం. వి అ. పుం పిడుగు యొక్క ధ్వని.

**వజ్రనిష్పేషము** నం – వజ్రనిర్ఘోషము.

**వజ్రపట్టులు** (వజ్రము+పట్టులు) మి వి బ వస్త్రవిశేషము. ఒక విధమగు పట్టుబట్ట.

వ .. ఉదయరాగపట్టులును నేత్రపట్టులును వజ్ర పట్టులును నను పేళ్లుగల పుట్టంబులు గట్టు కొని ద్వా. 3 168.

**వజ్రపాణి** నం వి ఇ. పుం 1. ఇంద్రుఁడు. 2. గుడ్లగూబ

**వజ్రపుఁదళుకులు** వి బ (వజ్రము+తళుకులు) ధాన్యవిశేషము.

సీ. వజ్రపుఁదళుకులు వాసనరాజనాల్ జవ్వాజి వంకెలు గన్నెసరులు.. హంస 4 128

**వజ్రపుటము** నం వి. అ. న. ఔషధములు వండెడి యొక విధమగు పాత్రము

**వజ్రపుష్ప** నం. వి. ఆ స్త్రీ. శతపుష్ప. సదాప (వృ. వి)

**వజ్రపుష్పము** నం వి. అ. న 1 నువ్వు పువ్వు. 2. ప్రశస్తమైన పుష్పము.

**వజ్రభృత్తు** నం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

వజ్రమయము సం. విణ అ. ఈ. అ. 1 వజ్రములతోఁ బ్రచురమైనది 2 వజ్రమువలె కఠినమైనది, కఠిన హృదయము గలది 3 క్రూరమైనది.

వజ్రము సం. విణ అ ఆ అ 1. కఠినమైనది 2. క్రూరమైనది 3 పాయలైనది 5 అడ్డముగా నున్నది.

వి అ పుం 1. వ్యూహభేదము, ఒక విధమైన మొగ్గరము 2. ఒక జాతివరళ (వృ వి ) 3 ఒక విధమగు స్తంభము 4 ములుగోమిడి. (వృ వి )
పుం న 1 వజ్రాయుధము, పిడుగు 2 వజ్రాయుధము వంటి వినాశకరమైన యాయుధము. 3 రత్నములకు బెజ్జములు వేయు వజ్రపుసూది 4 నవరత్నములలో నొకటియగు వజ్రమణి 5 పులిగంజి 6 కట్టెల నతికించు బంక, సర్వీసు
న 1 ఉక్కు. 2 ఒక విధమైన అభ్రకము 3 పరుషభాషణము 4 బాలకుడు. 5 ఉసిరి కాయ, ధాత్రీఫలము 6 మువ్వ పువ్వు 7 (జ్యోతి) ఇరువదియేడు యోగములలో నొకటి. 8 ఒక విధమగు గట్టి సున్నము

వజ్రరదము సం వి అ. పుం సూకరము, పంది, అడవి పంది

వజ్రలేపము సం. వి అ పుం ఒక విధమైన గట్టి సున్నము

వజ్రలోహ(క)ము సం వి అ పుం. సూదంటురాయి, అయస్కాంతము.

వజ్రవల్లి స వి ఈ స్త్రీ. నల్లేరు (వృ వి )

వజ్రవ్యూహము సం వి అ పుం ఒక విధమైన మొగ్గరము, యుద్ధమున సైనికులను వరుసగా నిలుపుటలో నొక భేదము.

వజ్రసారము సం విణ అ ఆ అ. వజ్రమువలెఁ గఠినమైనది

వజ్రహృదయము సం. వి అ న వజ్రము వంటి మనసు, కఠిన హృదయము.

వజ్రాంగము సం వి. అ పుం. సర్పము, పాము.

వజ్రాంగి సం వి న్. పుం. వజ్రమయ కవచము. (శ ర )

వజ్రాంగిజోడు (వజ్రాంగి+జోడు) మి వి. వజ్రమయమయిన కవచము

గీ. వత్స నీవు పదాతివి వారు రథికు, లెట్టు పంపుదు నిను మదిగట్టిచేసి, యనిన నీ కృప నాకు వజ్రాంగిజోడు, చింత వలవదు పనుపు మాజికిని ననుచు జై. భా. 2. 52.

వజ్రాఘాతము సం వి అ పుం 1 పిడుగుదెబ్బ 2 అకస్మికదుఃఖము.

వజ్రాభ్యాసము సం వి. అ పుం (గణిత ) ఒక విధమగు గుణకారము

వజ్రాసనము సం. వి అ న (యోగ ) ఆసన విశేషము, యోగులు కూర్చుండు విధములలో నొక భేదము.

వజ్రి సం. వి న్ పుం 1 ఇంద్రుఁడు 2 గుడ్లగూబ.

వజ్రిక సం వి ఆ స్త్రీ ములుతెముడు (వృ వి ) (శ ర ).

వజ్రీఁడు—వజీరుఁడు వి 1 వజ్జీరుఁడు, యోధుఁడు.

గీ కవుల ముంగొంగు హొన్ను లోకముల కన్ను, వచ్చగుజ్జుపు వజ్రీఁడు పగటిఱేడు .. ఇందు 4 31.

2. ప్రభువు, ఱేఁడు

శా . విదేహాత్మజా, కాంతుం గోసలమాత్ర ధాత్రికిఁ బతింగావింప రా జాత్మలోఁ,జింతించెన్ జగమెల్లఁ దాల్పఁగల జేజేగట్టు వజ్రీనినై, కాంత స్తంభధురంధరత్వ మెనయించంబూను చందంబునన్ చం రా 5. 3.

వటకము సం. వి అ పుం 1 భక్ష్యవిశేషము, గారె 2 గుండ్రని చిన్నముద్ద, ఉండ, మాత్ర

వటగ విణ. నేర్పరి సమర్థుఁడు (శ ర )

వటపత్ర సం. వి ఆ స్త్రీ బొండుమల్లె త్రిపురమల్లి (వృ వి )

వటపత్రము సం వి అ న సితార్జకము. తెల్ల తులసి (వృ. వి )

వటము సం. వి అ పుం 1 మఱ్ఱిచెట్టు 2 గవ్వ 3 చిన్నగోళము, ఉండ, మాత్ర 4 పూర్ణబిందువు, నిండు సున్న. 5 గారె 6 జనప త్రాడు 7 ఆకారసామ్యము, పోలిక 8 (చదరంగములో) బంటు

వటర విణ 1 వదరుఁబోతు, వాచాలుఁడు, వాచాల

ద్వి. మటుమాయలాడి ద్రిమ్మరిగబ్బితొత్తు, వట రమై చంచలవాణి నాఁబరఁగు ... పరమ. 4 322. పా. 20 పం

2 సమర్థుడు, నేర్పరి.

సీ. వటర యంచనఁగ నేర్పరి యన రవ రన దంటనా జాణనాఁదగు సమర్థుఁడు .. ఆం. భా. 8. 3

('వటగ' శ. ర. - ప్రాఁత ఆం భా)

**వటరము** నం వి అ పుం. 1 కోడిపుంజు 2. చోవ 3 తలపాగ, శిరస్త్రాణము. 4 కవ్వము 5 సువా సనగల తృణవిశేషము

**వటరుఁడు** నం. విశ. అ. అ అ దురాత్ముఁడు, దుష్టుఁడు

వి అ పుం దొంగ, చోరుఁడు, బందిపోటు దొంగ.

**వటవట1** వి ఱీఁడించుటయం దగు ననుకరణము (చూ వటవటనగు).

జ వటవటనగు.

**వటవట2** వి వాఁగుటయం దగు ననుకరణము వ్యవ ఎందు కట్లు వటవట వాఁగెదవు

**వటవటనగు** అ క్రి (√వటవట1) తగ్గు, ఱీఁడించు.

చ కిటకిటనయ్యె వెన్నడుము కేసరిమధ్యకు నాఁడు నాఁటికిం, బుటపుట నయ్యె నారు కడుఁబొల్పు వహించెఁ దనూలతాద్యుతుల్, నిటనిటనయ్యె సోలము జనించి విశాలవిలోచనంబులున్, వటవట నయ్యె సొంపుగల వాతెఱ కెంపును బూఁటపూఁటకున్ పి శకుం. 4 54

**వటాకరము** నం వి అ పుం దారము, త్రాడు

**వటారము–వటారు** వి. నగరు

క అని వర్ణించుచు నజ్జా, సమఁడు సుధాంధసులుఁ దాను సపులకకలికా,తనులై తత్కుధరాగ్రం, బునకు నరిగి హరువటారము గనుంగొనుచున్ వరాహ 6. 88.

ద్వి వడి బ్రేయ వచ్చినవారి వారించి, పుడ మీశుఁ డాతనిపోలికఁ దెలిసి, దరహాసమిగు రొత్తఁ దనవటారముకు, నరిగి మంత్రులు మొద లగువారి ననిపి. నవ 4. 131 పా. 16 సం.

**వటారి–వరారి** విశ సమర్థము.

వ . . వటారితనంబునం గటారుల వెటికి కొని... ఉ హరి 6. 129.

(శ ర పా 'వరారితనము' - వీరేశ పా)

**వటారు–వటారము** వి నగరు, రాజభవనము

ద్వి తల్లి చెప్పినమాట తన మదిలోన, తలపో యప్పుడు తన వటారునకు, వచ్చిన పరువడి Pal 200 (బ్రౌ)

సీ ఆవారణాసీపురాధీశ్వరువటారు గన్నఁబెట్టి చొచ్చి హరిశ్చ 5. 112

(శ ర పా 'ఆవారణాసీపురాధీశునగరిలో' ముద్రి పా)

**వటారుబంటు** వి నగరు సేవకుఁడు

ఉ. ... రమణీయ విశాలవిలోచనంబులు, నక్క మించు రాసుతుఁడు వాదుకవుంగిటఁ గావు రంబున, నిక్కిల నేల నేముకరచిహ్నము వాని వటారుబంటుగఁ ... తపతి. 3 52

(వతారు పట్టుగన్. ముద్రి పా.)

**వటి** నం వి ఈ స్త్రీ 1 త్రాడు, దామము. 2 ఉండ, మాత్ర, పెద్దమాత్ర

**వటించు** అ క్రి వస్తుపడు, ఉపవసి చే. (శ ర. బ్రౌ)

**వటిక** నం వి ఆ స్త్రీ 1 ఉండ, మాత్ర. 2 చేద రంగపుబంటు 3 భక్ష్యవిశేషము, వడ

**వటికము** నం వి అ పుం చదరంగపు బంటు

**వటివేరు** వి వట్టివేరు, ఉశీరము.

రగడ ఏకాంత మని తొలఁగె దిండు నీవఁటె వేఱు చేకొనవె మున్నాడి చెలువ యీవటివేరు... మనుచ. 3. 84.

సీ వటివేళ్ళనురటి జవ్వాది పక్కెనతట్టు పునుఁగుఁ బిల్గాణి కప్పురపుఁగ్రోవి . వైజ 3 74.

**వటుకుఁడు** నం వి అ పుం 1. బాలుఁడు, కుఱ్ఱ వాఁడు 2 బ్రహ్మచారి 3 అవివేకి, మూర్ఖుఁడు

**వటువు** నం వి ఉ పుం 1 బాలుఁడు, కుఱ్ఱవాఁడు. 2 బ్రహ్మచారి

**వట్టి1** వి చెఱకు గానుఁగకు వేసెడి అడ్డమ్రాను.(శ ర)

**వట్టి2** వి జ వృషణము, అండకోశము. (బ్రౌ)

**వట్టము** వి 1. తక్కువతనము, న్యూనత.

సీ ...ఏడు వాడలవార మేముగలసి, వర్తిల్లుదుము వాసి వట్ట మేమియు లేక... హర 2. 139.

గీ దానివెమ్మేని మెఱుఁగుఁదాఁబూనఁగడఁగి,పుత్తడి వెలంది చిద్రుపలైముద్రవోసి, యొఱసి వట్టంబు వడికాఁగి నెఱయఁజిమిడి, కరఁగి నీరయిపోవును గలువకంటి హంస 3. 195

ద్వి అట్టును గా కుత్తమాధమనదులు, వట్టంబు దోఁచువే వారాశిఁగలయ .. పండితా దీక్షా 74 పొ

2. చిల్లర మార్పునపుడు పెట్టునష్టము, తరుగు

గీ. .. వట్టమంచనఁగ వెలయు, హేయ దీనా రముఖ భాగధేయసంజ్ఞ .. ఆం భా 2 192

గీ క్రొత్తతిరువాదిఁగని ప్రాంతరూక యంచుఁ బ్రాఁతపణఁ జూచి తాడెంపుఁబణమటంచు నాణెమొరయంచు నొరయైన నాగరంబు, ధవళి నెడ వెట్టటంచు వట్టంబుఁదివియు బహు 5 14

**వట్టి** విశే. (√ వట్టు) 1 రిక్తము, శూన్యము, ఏమియు లేనిది

ద్వి. కలకంఠ శ్రీపాదకమలంబు మీఁద, తెఱ గొప్ప నీ మౌళి తేఁటియై వ్రాలు, వట్టి నీమస్తకం బకట యిచ్చోట, వట్టినేలను గూలవలసె నేమందు. రం. రా కిష్కిం. 215 పొ 20 పం

గీ తజ్జ్ఞనం దెర్గ నగుఁ గవితావిశేష, మజ్ఞనందేమి యొఱుంగఁగ నగు సమస్త,కనకవర్ణోత్కరంబునఁ గానవచ్చు, వన్నె తెఱఁగంగఁ బోలునే వట్టి రాత కు సం 1 32

గీ రమణి మఱికొంతవడిదాఁక రథముఁజూచుఁ, దరుణి మఱికొంత సేపు కేతనముఁజూచుఁ, గాంత మఱిమీఁద రథపరాగంబుఁజూచుఁ, బడఁతి మఱి యంతటను వట్టి బయలుసూచు. ఉ రా 6 299

2 ప్రయోజనము లేనిది, నిష్ఫలము, వ్యర్థము

ఉ హృదయము తెప్పుడు న్గదియకే తఱచౌ వెడ కౌఁగిలింతలున్, గదిసెడు మేలు కార్యములఁ గల్గక మాటలయందె కల్గు పె, న్గదురులు వట్టి శైత్యములుఁ జాలఘనంబయి మందువేసవిన్, బొదలఁగ నిల్చె దంపతుల పొందు నలనార్యల పొందుకై వడిన్ . ఆము 2. 62

గీ అని పలికి రెండుమూఁడునా లట్ల యనిపె, నల్లనొద్దకుఁ బుత్రిక నవుడతండు, నాది నేత్రావమునఁజూచె నట్ల చూచె, వట్టిరాకపోక లొనర్చె వానిసతియు కళా 4 64

ద్వి. వడుగు చేసినభక్తి వట్టి పాటగునె, నొడువరి తనమునఁ గడువనాడెదవు .. బస. పురా. 1. 219.

గీ గర్వితారాతిరాజన్యకాండకరిన, కంఠరలుంఠన జాతరక్తాంబుపూర, మజ్జన వ్రతదీక్షాభిమాన ఘనులు, రావువారలు వట్టివారా తలంప రంగా 2 107.

3 కారణముమూలినది, నిష్కారణము.

గీ వెదలిపోయితి నిర్విధి వెంటనరుగు, పెండ్లి వారలఁజూడ నా పిన్నతనము, గూల నింతటిలో వట్టికోపమెత్తి, తలుపు బిగియించె మగఁడేమి తలఁచినాఁడొ శుక 2 131

గీ మొలకసిగ్గులు వట్టి కొంకులును వలపు, చాటు నిలుకడ లలఁతివేసములుఁ జూపు, గడియలో వాని దారునఁ గన్నయపుడు, కొమ్మ మాయని జంత్రంబుబొమ్మకరణి శుక 2 434

4 శుష్కము, ఎండిపోయినది

గీ. ఎలమిఁ గూర్చుండి యొలుఁగెత్తి యింపు మిగుల, వట్టి మ్రాఁకులు చివురులు పెట్ట నతివ, పాడె . మార్కం. 1. 26

వ అనికిం దనివిసనక వెనుకం దవిలి వట్టియడవి ముట్టి యేర్పు కార్చిచ్చుచందంబునం జతురంగ బలంబులు బారినమరిన .. భార ద్రోణ. 2. 60

ద్వి కనుఁగొని బసవయ్య కన్నుల నగుచు, వట్టి యాకులు గాలివడిఁ దూలుఁగాక, మెట్టలు తూలునే మేటిగాడ్పునను . బస పు 192. పొ 20 పం.

5. పాలుడిగినది

ఉదా వట్టిగొడ్డు

సా వట్టిగొడ్డుతాకట్టు, వట్టిగొడ్డు ఆర్పులచేటు.

**వట్టికాలు** వి (వట్టి + కాలు) పిక్క వెలుపటి కాలు (శ. ర, బ్రౌ)

**వట్టిపోవు** అ క్రి (√ వట్టి) ఎండిపోవు, వాడిపోవు

సీ చెక్కుపైఁ జేర్చనచిగురు కెంగేలును వట్టిపోయిన యట్ల వాతెఱయును ... హరిశ్చ. 5. 71.

వట్టిమాట వి. (వట్టి+మాట) లేనిమాట, అపవాదము. (శ ర)

వట్టివరి వి (√ వట్టి) సస్యవిశేషము, అడవి గోధుమ (వృ వి)

జ ధాన్యవిశేషము, అడవిగోధుమలు (శ ర.)

వట్టివేరు వి ఉశీరము (వృ వి)

గీ. వట్టి, వేరునాఁగ నుశీరంబు వెలయుచుండు. ఆం భా 2 75

సీ మరు వమ్ము నొందింపుమా నన్నుఁ జేపట్టి వట్టివే రేటికే వనరుహాక్షి. రామా 1 148

ఉ.. నేలుపుమీఱఁగ వట్టివేళ్ళ గావించిన తాళ వృంతమున వీచుచునుండె .. నైష 6 117

వ తమతమ మేనితాపు కుదాపలంబగు వట్టి వేళ్ళ సురఁటుల కమ్మనెత్తావులు తాళవృంతా నిలంబుల నోలయింప . ఉ రా 7 248

వట్టు అ క్రి 1 ఇఁకు

క బలరిపుఁడు నాకు నిచ్చిన, యఘునిశాత ముఖశోషణాస్త్రమ్ము విని, గ్గళదవిరళజల ధారా,వళిసెల్లం దత్క్షణంబు వట్టఁగఁ జేసెన్ భార అర. 4 67

ఆ వరము వడసినయైన శరము ప్రయోగించి, వట్టఁ జేసినయైనఁ గట్టియైన, వనధిదాట నెట్లు వచ్చుఁబో . భా రా యు 14

ద్వి. మడుఁగులు గడువట్టె మణిగె లోకములు, నిడుములు దఱుచయ్యె నెల్లవారలకు . రం రా ఉ. కాం 164 పు 25 పం.

2 శుష్కించు , ఎండు

క ఏన చని వట్టిపోయిన, కానలఁ గార్చిచ్చు గాల్పు కైవడి జాడా, నలమున నావరులమ భా రా యు 762.

వ విప్రయోగ వేదనాదూయమానమానసు డై వదనంబు వఱువట్లు వట్టఁ కాశీ 2 141

3 కృశించు

ఉ దు, ర్వారవిచార భావమున వట్టుచుమోమున దైన్యమొందఁ బూ, జారిపధూటి వచ్చి జల జాయతలోచనఁ జేరి యిట్లనుఁ విక్ర 6 124

క అతుల నిరాహారంతపో, వ్రత దారుణనియతి వొడల వట్టివరము లు,న్నతిమై తోఁపగ మరణే ప్సితమతి నయ్యబల దొట్టి పెద్దయునార్తిఁ. మార్క౦. 8 139.

క. మెట్టక పెట్టక వట్టక, గిట్టక తీర్థముల ముక్తికిం జనరాదే, తొట్టక పోరక యిమ్మెయిఁ, గట్టెదు టను శ్రీనగంబుఁ గన్నం జాలుఁ ద్వా 8 140.

ఉ పయ్యరవట్టె మేఘములు వచ్చుగఁ జాఱె నుద బ్బుఖంబులై హం 2 24

4 (పశువు) పాలు లేనిదగు

లయవిభాతి వినరెఁ బెనుగాడుపులు మసలె జల దాగమము పసిమిచెడె సస్యములు కసవు దిస లేమిం, బసరములు వట్టె . వరాహ 10 28.

వి 1 పక్కు

ద్వి. మెదటి వట్టులుగట్టి మెలికలు గొన్న, ముదురు జుంజుఱు మీసముల నులికొల్పి హరిశ్చ పూ 2062 పం

2 వరుగు, శుష్కఫలాటువు, ఎండుకాయ

గీ మనును శుష్కఫలాటునామంబు వట్టు, వరుగనం గను ఆం భా 2 39

3 దూలము లోనగువానికి బలమునకయివేసెడు కట్టు (శ ర)

బ వట్టి, వట్టికాలు వట్టిపోవు, వట్టిమాట,వట్టివరి, వరువట్టు, వఱువట్టులు, వఱువట్లుగొను

వట్నము వి ధాన్యాదులు నించిన గోనె (శ ర)

వట్ట విఅ (సం వర్తులమ్ శ వట్ట) వర్తులము గుండ్రము (శ ర)

జ వట్రన, వట్రించు, వట్రలు

వట్రన వి (√ వట్ర) వర్తులత్వము గుండ్రన (శ ర)

వట్రుపడు (వట్రము + పడు) అ క్రి తక్కువగు.

చ సరియగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ నన్నరుఁడు దృఢత్వలాఘవ గుణంబులఁ దక్కువ దూరపాతవి, స్ఫురణఁ గరంబు వట్రు పడు భూవర సౌష్ఠవరేఖ నేమియుం, దొర యఁడు ధైర్యశౌర్యపటు దోర్విభవంబుల హీనుఁ డెంతయున్ భార కర్ణ 1 231.

గీ సిద్ధమునికోటి గొనియాడ జిష్ణుబలము, వర్ధ నము నొందెఁ దమలోన వట్రుపడక ... హరి. ఉ 10 182.

క జననాథ యిదె శకుంతల, యనసూయారుం ధతులకు వణుమాత్రం బైనను వ్రతుపడదు శీలం,బున నీయెడకింతి ననిచి పుత్తెంచుటయున్ పి శకుం. 4 109

**వ్రతుపెట్టు** స క్రి (వ్రతుము + పెట్టు) 1 తక్కువ పఱచు, తగ్గించు 2 లక్ష్యపెట్టు

ఉదా వాఁడు నామాట వ్రతుపెట్టఁడు (శ. ర)

**వ్రతుము** వి వక్కాకుతిత్తి.

ఉ మైనపుటంటుపల్వగల మచ్చులచాలొరగల్లు కట్టెలున్, దూనిక నాలుగేన్పొరలతోఁ దగు వ్రతుములోన నున్న నా,నానగరోద్భవంబులగు నాణెము లుండెడు సంచిఁ గొంచు బే,రానకు వచ్చు నన్నయధురంధరుఁ డంగడికిన్ గణింపఁ గన్ శుక 1 420

చ మెలివడు తీఁగచుట్ల జిగిమించినపాగ జినుంగ పచ్చడం, బలవడు చల్వదోవతి యొయారపుగంద పుఁబూఁతడొల్లు పో,గులు మణిముద్రిక ల్వలపు గుల్కెడుపీడ్యము చంకవ్రత మం,త్రములతుద ముచ్చెలున్ వెలయు గుప్తగుణుండను వైద్యుఁ డొప్పగున్. హంస 1. 233

విణ. హ్రస్త్వము, పొట్టిది. (చూ వ్రతుపడు)

జ వ్రతుపడు, వ్రతుపెట్టు

**వ్రతించే** అ క్రి (√ వ్రతు) తిరుగు,పరాఙ్ముఖమగు.

గీ వాహనము నెక్కి కైదువవలమ మిగులఁ, బట్టి మొనతల నెంతయు భయరసంబు, గదిరి వ్రతించు నృపులకుఁ గలుగు భ్రూణ, హత్యఁ బోలుపాపం బవి రాదిమునులు. హరి ఉ 1 105

**వ్రతిలు (ల్లు)** అ క్రి (√ వ్రతించే.) 1 ప్రవర్తిల్లు.

చ. నినుఁ గొనియాడనేర్తు నన నిక్కువ మెవ్వఁడు శక్తియుక్తుఁ డె,వ్వనిమనము న్మనీషయును వ్రతిలు నెవ్వనిజిహ్వాసాగు నే, యనువు ప్రశంస చెప్పు సకలార్థ సహిష్ణుఁడ వీవు ... హరి ఉ 6. 50

ద్వి వంగకాయలు కట్టుకొంగులఁ బొదివి, లింగ సన్నిహితుల భంగి వ్రతిల్ల! బస పు. 2. 391.

ద్వి. అక్కజం బ్రొలయ నుదాత్తత వెలయ, నిక్కంబు సంధిల్ల నియతి వ్రతిల్ల .. పండితా. పురా. 137 పొ.

2 కలుగు, జనించు

క. దమఘోషసుతుఁడు తద్విభవము సూచి సహింప కలుక వ్రతిలఁగాఁ బీ, రముడిగ్గి నిలిచి నిజహస్తము లెత్తి మనోభయంబు దక్కిన వాఁడై భాగ 10 ఉ 786

ద్వి. అనవుడు హర్షించి యాశివద్విజుని, వనిత పుత్రులునాకు వ్రతిల్లి రేని, నంబిపేరిడుదు దానవి నెందరైన పండితా మహిమా. 287 పొ

ద్వి పువ్వు వ్రతిల్లనోపునో కంటిపోటో... బస. పు 66 పొ. 30 పం

3 తిరుగు

ఉ వ్రతువగుబ్బలుం దొగయువాతెఱయుం జిఱునవ్వువెన్నెలల్, దొంట్రిలుముద్దుమోమును దళుక్కనుమేను పెడందసోగయై, వ్రతిలు కన్నుఁ దోయి నిడువాలుఁగురుల్ .. విజ. వి 2. 46.

**వ్రతువ** వి. వ్యంజనముతోఁ జేరిన ఋకార చిహ్నము.

గీ వ్రతువయు ద్విత్వమును గల వ్యంజనంబు, ప్రాసమై యుండునెడఁ బెఱప్రాసములకు, వ్యంజనంబు సమాక్షరంబై నఁజాలు, వాని పై నేస్వరం బైనఁ బూనవచ్చు అప్ప. 3. 293

విణ గుండ్రము, వర్తులము

సీ. నడుము వ్రతువగాఁగ వెడఁదయై కఱకెక్కి యొప్పార వెలసి పేరురము దనర హరి. పూ. 6 177

క తూమెఁడు రసమునకుం దగ, వామెఁడు పుండ్రేక్షులతలు వ్రతువగలతా, చామములఁ గట్టి హర 2 9

క అనుటయు రసలింగము నిడు, తనవ్రతువ ప్రేఁపసజ్జ దంతవుబరణిన్ . మనుచ. 1. 78.

క్రి విణ గుండ్రముగా, వర్తులముగా.

ద్వి మరఁటి వ్రతువగాలి సుడియంగఁ ద్రిప్పు హరిశ్చ. పూ 782

**వ్రతువముస్తై** వి చక్రల (వృ. వి.) (శ ర)

**వ్రతువసుడి**—వ్రతువ, వ్రతుసుడి (శ. ర.)

**వ్రతుసుడి**—వ్రతువ వి వ్యంజనముతోఁ జేరిన ఋకారమునకు గుర్తు

గీ కొమ్ముమ్రక్కారలు మఱి ద్విఆర్ణమ్ము లగుట, వానియెడమవి గురువులు వ్రతుసుడులు, ప్రాణములు గాన వానిడాపలను గల్గు, నక్కరములెల్ల లఘువులు నిక్కముగను. అప్ప 4 49.

వటర విశే. (వటరః?). సమర్థుడు, నేర్పరి.

ద్వి వటరవై కొంచెపువారిపైఁ జూపు, వటన మామ్ముందఱ నడవ దెల్లపుడు .. ద్వి భాగ. 8 స్కం.

('రవర' కు మాఱు రూపము. శ. ర.)

వరరము సం వి అ పుం నీటికుండ.

వరరుఁడు సం విశే అ ఆ అ 1 మొద్దు, మంద బుద్ధి, మూఁఢుడు 2... దుష్టుఁడు

వి అ పుం 1 బుద్ధిహీనుఁడు, అవివేకి, మూర్ఖుఁడు.

2 శఠుఁడు, దుష్టుఁడు. 3 వైద్యుఁడు

వరారి–వటారి విశే సమర్థము.

సీ. మకరంద మాని మైమఱచిన గొనయంబు వెడ ల్మ్రోయఁ గడిఁవోనివింటితోడ, జలజ కేసరరాజిఁ జల్లెడు మూఁకగా దాఁటు వరారిరథ్యముల తోడ, . . గీ ... నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు, సఖకు వేతెంచె భుజబలోత్సాహ మెసఁగ ఉ హరి. 2 194

వడ[1] వి 1 వేఁడిమి, పరితాపము

సీ అడరునిట్టూర్పులు వడచల్లఁగా ముక్కు పుటము లొండొంట నుప్పొంగి తనర . హరి ఉ. 9. 225.

వ సత్యభామ సానూయంబుగ వాసుదేవున కిట్లని యె.

క కలిగె నొక జాంబవతి వెన్నెల వడఁబడె దేల వలపు నీతల వేగెన్, బులియకు వేసవతులుగల, పొలఁతులచే పాటుపడక పోరా దనియెన్. ఉ. హరి 3. 115.

సీ ఉడివోనివేఁడినిట్టూర్పుగాడుపుల బల్ వడలఁ గెంజిగిమోవి వాడువాఱ . నీలా 2. 83.

మ. కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగం బులం గ్రమ్మినం, గుముదాంతఃస్థితలక్ష్మి యొండ వడనోఁకుల్ సైఁపఁగాలేక పత్రముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెన్ ... పారి. 2. 68

2 వేఁడిగాలి

మ. స్ఫురదారణ్య మహీధరాపరసముద్భూతోగ్ర జీవానలోత్కరవిస్ఫారశిఖాలిఁగూడి ... వ్రీచ్చె వడ... లోకుల్ భీతిఁ గంపింపఁగన్ కు. సం. 6 793

3 తాపము.

ఉ ...నృపాలతనూజుఁడు చిన్నవోయి మధ్యం దిన వేళ ... అగళపూరిత తోయమందుఁ దృప్తిం దురగంబుఁ దాను వడఁదేఱి మహా తపభీతి నయ్యెడన్. విక్ర 3 77.

సీ వేఁడిమి వెదచల్లు వెన్నెల వడకునై చెయ్యి మోమున మాటు చేసికొనుచు .. యయా. 5 118.

ఆ వేల్పుగట్టుగవుల వెలువడి వడదేఱఁ జదలు వాఁకనీట జలకమాడి ... పారి. 4 44.

4 శ్రమము, బడలిక

క .. కవేర దుహితృ మరాళిధ్వను లెపఁగు గాడ్పు ప్రతివడ యుడిపెన్ ఆము 6 92

ఉ తేలెడు కన్నుదోయి వడదేఱెడు ముద్దుమొగంబు సారెఁ గై, వ్రాలెడు గొప్పకొప్పు వసివాడెడు నన్నువగౌను కాఁకలం, దూలెడు లేఁతమేను నయి తొట్రిలు నమ్మగవాలు . పాండు. 3 65.

వ. వెండియు నక్కుండలిశశయనుండు ... భీతుల వడఁదీర్పుచు సూతులఁగడతేర్చుచు .. ఉ రా 2 61.

5 ఆఁకటిబాధ, తుద్బాధ

చ .. ఇప్పుడొక కాటియచే వెతఁ జెందివాఁడ వి,ద్దినమున నీకుఁ గల్గు వడఁదేఱఁగఁ గర్కరికా ఫలావళుల్. శుక 3. 417.

6 దప్పి, దాహము.

చ. తొడిఁబడ నమ్మ యక్క యని తూలుచు దీనత దోయిలొగ్గుచున్, వడమఱి తేఱఁ దేఱ వల వాక్యము లెన్నక ఆము 2. 59.

చ చెలిమనమోవిపానకముచే వడఁదేఱక మోము మోమునం, బలుమఱు జేర్చి.. ఉ రా 3. 122.

రగడ కొడిసె తింత్రిణీకులము విరిర్చె, వ్వడవింది జనావళివడఁ దీర్చెన్ ... బహు 2 13.

7 హిమము, మంచు

ద్వి. మడువులలోన హేమంతకాలమున, వడఁజల్లు తఱిఁ బంచవహ్నిమధ్యమున ,.. ద్వి. పరమ. 2 50 పా. 16 వం.

విశే ఉష్ణము, వేఁడియైనది (చూ వడగాలి)
జ వడంబలి, వడగాలి, వడగోము, వడదాఁకు, వడఁదేలు, వడపప్పు, వడపింజె, వడముడి,

వడ² వి గారె
సీ పొల్పు మాషాపూపము వడయనంగను అం భా 2, 255
సీ ఖండశర్కర జున్ను కఁడచక్కెఁరలు దోసెలు వడలేఁ మెపాసెములతోడ భీమ 1 60
2 మిరెపకాయలు లోనగు సంబారువులుచేర్చి చేసిన గారె.
సీ కలవంటకము లిడ్డెనలు వడ లప్పము లతిర సమ్మెలు తేనియలు ఫలములు ఉ రా, 6 122
మ కలమాన్నంబులు పప్పు లప్పడములున్ గారెల్ వడల్ బూరెలున్, ఫలముల్ చక్కెర లుక్కెరల్ సిగరలుం బచ్చళ్లు సద్యోఘృతం, బులుఁ దేనెల్ పరమాన్నముల్, పలురసంబుల్ కూరలు న్మన్నుగాఁ, గల నానావిధభక్ష్యభోజ్యములు వేడ్కన్ సీతవడ్డించినన్ సమీర 5 115

వడ నం వి అ స్త్రీ భక్ష్యవిశేషము, గారె

వడంబలి వి (వడ1+అంబలి) ఒక విధమైన అంబలి, తాపమును పోఁగొట్టునట్టి అంబలి
వ ...పుండ్రేక్షురసపావకంబులు వడంబలి బేడలు వేపుడుసెనగ లనుపగుగ్గిళ్లు .. ప్రబంధ 112

వడఁకాడు అ క్రి (వడఁకు+అడు స్వార్థమున) కంపించు, వడఁకు
క సమరాంగణంబు కడుఘోరముగా నిరువాఁగుఁ బోరు రథసంబున ది, క్రమిత వడఁకాడె భార. భీష్మ 2 290
క వెడవిలుతుకీర్తిజాలము, వడువునఁ జంద్రాతపంబు వాలుటయును ముమ్మడుకె తీవడెంత ముతో, వడఁకాడెడుధైర్య మెడల వగలఁ బొగులుచున్ భా రా. యు 38.
క వెలఁదికి మన మొనరించెడు, చలువలు రవి మేసినైన శైత్యము నొందున్, బలుకులు వేయును నేఁటికి, వలిగొని వడఁకాడుచుండు వైశ్వానరుఁడున్ పి శకుం 3 45
శా . వహ్నియ, త్యంతంబున్ శిశిరత్వ మొంది నను గోత్రాళుల్ వడంకాడినం, గుంతీసూనుని చేతఁ గర్ణున కనిం గోత్పాటు వాటిల్లునే భార కర్ణ 3 275,

వడఁకు-వణఁకు (రూ వడంకు) అ క్రి. కంపించే
సీ పడఁతి నీకరములుపట్టఁగఁ దివిరి శంకించి వడంకెడుఁ గేలుసూడు భార విరా 2 47
ఉ ధాక నరాతు తెల్లను వడంకుచుఁ గప్పము లీక యానతు, ల్గాక విప్ర 1 43
క మేను గరుపాఱఁ దమి న,మ్మోని జపముఁ దపముఁ దన్ను మఱచి యనంగ, గ్లానిఁబడి కదిసి వడఁకుచు, హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్నను చున్ మనుచ 6 34
క. ఉసు రసురంనుచుం బొరలును, గసరును బస దఱిఁగి వెసను గడగడ వడఁకున్ ... నీలా 2. 84
వి 1 కంపము
సీ వైవర్ణ్యములు సెంది వడఁకులు దొడరి యశ్రులు జాటి గద్గదికలు కడంగి .. హరి పూ 8 183
సీ చిలువమేపరి పుల్గు బలు చట్టు పలఁబుట్టు గాడ్పుచే నొదవిన కాళ్లవడఁకు ... ఉ రా 2 214
మ బెరపె స్నేన నిగిడ్చినట్లు వళు లుబ్బెన్ దుర్బలాంగంబు లం, కురము ల్వాపె రదంబు లంఘ్రులవడంకు ల్దిత్తె నాలారులై ... పారి 5. 46
క. శిశిరమరుదెంచె నంతట, నిశలాయతగతివహించె నెత్తమ్మిగ్నె తెగల్, కుశలత డించె దినంబులు, కృశియించె వడంకుముంచె నెల్లజనములన్. ఉ. రా 5 279
సీ వడఁ కనఁ గంపాఖ్య యడరును ... అం భా 1 143
2 హిమము, మంచు.
(చూ వడఁకుగుబ్బలి, వడగల్లు.)
జ వడఁకాడు, వడఁకుఁగొండ, వడఁకుమల, వడఁకుగుబ్బలి, వడఁకుమెట్టు, వడగల్లు, వడగవ్వ, వడవడఁకు, వడవడఁకులుగొను

వడఁకుఁగొండ వి (వడఁకు+కొండ) చలిమల, హిమవత్పర్వతము

ఉ ...కయ్యపుం, బబ్బము లాచరించు మునిఁ
శాఱఁగఁబట్టివడంకుఁగొండ పే,రుబ్బడఁగించి ...
రామా 1 26

**వడఁకుమల** వి (వడఁకు+మల.) చలిమల, హిమ
వత్పర్వతము

మ త్తకోకిల .. మరుమేపుకందొర మామగా, నేటి
నీటి తపంబుచేసెనొ యీవడఁకుమలంచుఁ దా,
మాటికిం గొనియాడుచుంజని మన్న జేఁడట
ముందటన్ యయా 2 41

**వడఁకుగుబ్బలి** వి (వడఁకు+గుబ్బలి). చలిమల,
హిమవత్పర్వతము

సీ కలశ పారావారకన్యకామణి వాఁగఁ గమ్మ
దమ్మివసించు గట్టువట్టి,వడఁకుగుబ్బలి రాచవారి
కుమారి నా సింగంబు నెక్కెడు సింధుతనయ..
వరాహ 9 58

సీ తనమేను గరుపారఁ దమి మీఱ శశిధారి వడఁకు
గుబ్బలికన్నె వడఁకుఁదీర్ప. ఉ రా 2 28

క ఉడుగక పొడమెడుభయమున, వడఁకుల
గుబ్బలికుమారి వడవడ వడఁకెన్. హర 7 78.

**వడఁకుమెట్టు** వి హిమగిరి.

మ. పడవాలున్ ఘటియింపు మంచు దివిజుల్
ప్రార్థింప నవ్వహ్నియుం, దొడుకుంద త్తడి
జోదుతేజము సుధాంధోవాహినీవారి ని,ల్పుడు
నయ్యేఋవడంకుమెట్టకడ ఉల్లుందార్ప నా
ఉల్లునం, బొడమెన్ చం. రా 3. 6

గీ చారు లెఱిగింప వింటి దుర్వారభయద, మైన
యీ వార్త నీవుఁనా యాజ్ఞవడసి, తడయకించుక
యిప్పుడివ్వడఁకుమెట్ట, దొర గడియ వేఁగి నీ
నేర్పు కరము మెఱయ. పి. శకు 1. 236.

**వడఁబోయు** సం క్రి (వడియన్+పోయు,) వడిఁ
గట్టు, వడియఁగట్టు (శ. ర)

**వడగల్లు** వి జా (వడకు+కల్లు) బ వడగండ్లు, వడ
గండులు. వర్షోపలము, వానకురియునపుడు పడెడి
రాయి, వానరాయి

మ వడి నమ్మేఘచయంబులం దొరఁగు దుర్వా
రాద్భుతాసారముల్, వడగండ్లుం బెరయంగఁ
దీవ్రవిసరద్వాతూలుతోఁగూడి... హరి.పూ 7,
164

చ తరుణులు చంచలాలతలు తత్కరఖాండని
కాయ మంబుదో,త్కరములు పాలుఁ దేనెలు
ఘృతంబులు వాన లఖండ ఖండ శ,ర్కర
లును ద్రాక్షపండ్లు వడగండ్లును శోభనభుక్తి వేళ
దో,ల్కరినమయంబు పేరెలమిఁ గైకొనకుండునె
భో క్తృసస్యముల్ నైష 6 121.

వ అప్పటప్పటి కుప్పతిల్లు కప్పురంపుటురవడి వడ
గంటి చాలునేలుకొన ... సమీర 6 152.

క పుడమిఁ దనయాజ్ఞ సేకొని, నడపిన దంపతుల
మీఁద నలి మరుఁ డింపే,ర్పడఁ బుష్పవృష్టిఁ
గురిసిన, వడువునఁ దొలువాన గురిసె వడగండుల
తోన్. కు. సం 8 855

సా దరిద్రుఁడు తలఁగడిగిన వడగండ్లవాన

**వడగవ్వ** వి (వడఁకు + గవ్వ ) మత్స్య విశేషము.
(శ ర )

**వడగాలి** వి (వడ[1] + గాలి) వేసవియందు పడమర
నుండి వీచు నిప్పుగాలి

సీ వడగాలియైన నప్పడఁతియూర్పులచెంతఁ బరఁ
గిన మలయాద్రి పవను బోలు భా రా
అర 278

సీ తనలోన బడబాగ్ని దరికొని మండియు వడగాలి
మీలపై సుడియనీక .. ద్వా. 2. 190

సీ పగలింటి . , వేసవి వడగాలి నోసిన లేఁదీఁగ
క్రొక్కారుఁ గని మవ్వమెక్కునట్లు. కు సం
7 897

**వడగొను** అ క్రి (వడ + కొను ) వేసవిని వీచు
నిప్పుగాలిచే తాపమునొందు

ఆ. అకట మనము వచ్చినది గడుదవ్వు నేఁ,డప్పు
రంబు సొత్తమని తలంచి, తఱిమి నడచిఱిమి
లతాతన్వి యిది వడ,గొనియె మోచితెమ్ము
కొంతదవ్వు. భార. విరా. 1 151

**వడచే–వడుచే** స క్రి. (√ వడియు) పోయు,
కార్చు (శ ర.)

**వడదాఁకు** అ. క్రి (వడ + తాఁకు) నిప్పుగాలి
సోఁకు

క కొండవడ దాఁకి వాడి యొ,కొండును దెస లేక
యేడ్చు కోమలతను నా,ఖండలసమానుని
శిశువు, నిండినకృపగోరి చేరి నెఱినంబుదముల్,
హరి. ఉ 9 9

క ఉడురాజదీధితులఁ దిరు, గుడువడి తపియించు చును శకుంతల యుండెన్, బుడమి జనంబులు వెన్నెల, వడదాఁ కనుమాట నిక్కువం బై యుండెన్ పి శకు 3 174

**వడఁదేఱు** అ. క్రి (వడ1 + తేఱు) శ్రమనొందు.

ఉ తేఁకువ దప్పి దప్పి వడదేఱెడుఁ గన్నులు మున్ను వంటియా, తూఁకువ లేక మేను గడుఁ దూలియయున్నది పి శకుం 3 69

**వడదోలు** వి (వడము + తోలు) 1 గవుండ్లవాఁడు మొలకు కట్టుకొనెడు నిడుపుతోలు.

క మోకును నిచ్చెనయును దా, టాకులబందంబు మెత్తనగువడదోలున్, జొకగు కత్తుల దొన యును, దూకంబునఁ బూని నిల్చెఁదొయ్యలి యెదుటన్. సురాభాం 58

మ మొలచుట్టున్ వడదోలు .. తనరఁ బ్రాతః కాలమం దెప్పుడున్ . చెన్న 5 252

2. వేఁటకాఁడు శరీరమునకుఁ గప్పుకొనెడు నిడుపు తోలు.

క. వడతోళ్లును ముప్పిళ్లును, నడిదంబులు వెడఁద వాతియలుఁగుల పొదలున్, దడవిండ్లుఁ బంది గోళ్లును, గెడలుం ధరియించి భటులు కెలఁ కులఁ గొల్వన్ భల్లా 3 (శ ర)

**వడప** వి కొబ్బరి మొ చెట్ల మొదళ్ళను చుట్టియుండు వలవంటికప్పు (బ్రౌ ని)

**వడపప్పు** (వడ1 + పప్పు) శ్రమపరిహారార్థమై నానఁబెట్టిన పెసరపప్పు

సీ . కప్పులేటిన వడపప్పుతోడ .. అము 2. 73.

సీ బడలినవారికి వడపప్పు పానకా లనఁటి పం డ్లొసఁగినయన్ని గలవు ప్రబంధ 57.

**వడపిందె** వి (వడ1 + పిందె) 1 తాపము తీఱుటకై వాడెడు ఊరఁబెట్టిన మామిడిపిందె.

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ, జెరుగును వంటకంబు వడపిందెలునుం గుఱువంగఁబెట్టి . . కాశీ 4 114.

(వడపిందెలను విశాఖమండలమున నీరు కాయ లందురు)

చ. పలుచని యంబళుల్ చెఱకుపా లెడనీళ్లు రసా వళుల్ ఫలంబులును సుగంధి శీతజలమ్ముల్ వడ పిందెలు నీరుఁ జల్లయున్ . . అము. 1. 81

రగడ కొడిసె తింత్రిణీకులము విదిర్చెన్, వడపిందె జనావళి వడఁ దీర్చెన్ బహు 2 13

2 వేఁడిచేత రాలిపోవు పిందె.

క వల పలుమాట లనిమిషపాలక యెల్లింట వేఁట ఫలియించు తఱిఁ, త్రాలతపఃకల్పకమున, రాలెడు వడపిందె నీదు రాజ్యం బనఁగన్. కవిక. 6 42

**వడపు** వి కొండపై పఱుపు క్రింద నుండు గుహవంటి చోటు (బ్రౌ ని)

**వడపోయు** స క్రి. (√ వడియు) వడియఁగట్టు, నీళ్ల లోనగునవి గుడ్డతో తేర్చు

వ వడపోసినట్లున్న వెన్నెలనిగ్గు నాటుకొన్నట్లు విరహపాండురంబగుతనువు తనపయిం జేర్చు కొని మృ వి 2 84

**వడభి** నం వి ఇ ఈ స్త్రీ - వలభి.

**వడము** వి దండ

సీ ముత్తియములు, కట్టువడంబులు గట్టినూళ్లను సుద్ది సరితీఁగె మినుకులు సందిదండలు దశకు 3 77

ద్వి తిరముగా నిడుపట్టైతిరునామములును, దిరుమణి వడములుఁ దిరుచూర్ణములును,... ద్వి పరమ 3 187 పా

జ . వడదోలు.

**వడముడి** వి (వడ1 + ముడి) (శత్రువులకు) తాపము కూడించుచోటు, భీముఁడు

సీ. వడిముడియును నీవు వాయువాసవుల శక్తులు ధరియించిన దుర్జయులరు భార శాం. 1 140

క. వడముడి యరిగినతెరు వేర్పడఁ గని వేవేగ రథము వఱపెం గదియన్

వ ఇట్లు భీమసేనుఁ జేరంబోయి ... భార భీష్మ 2 368, 369.

సీ పెనఁగి వాయుతనూభవుని నివ్విధమ్మునఁ బడ వేయ నవ్వడముడియుఁ గినిసి . జై . భా. 2. 85

**వడలు** అ క్రి పుష్పాదులువాడు. (శ ర , బ్రౌ. ని)

**వడవడ** వి. వడఁకుటయం దగు ననుకరణమ్ము

గీ. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి, వడఁగఁ బనుమూఁకఁగని వడవడ వడంకి... భార విరా 5 286

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగులపై వ్రాలి యో మహామతి యే నెక్కడ కర్ణ శేష మెక్కడ, నెడలింపఁ గదయ్య దురిత విషనిధి వలనన్. భోజ రా 3 87.

గీ. గొఱగొఱం బను పందుల ఘుర్ఘురంబు, జెడిదములఁ బుడమియు వడవడ వడంక, నెపుడు నెడయాని చీకట్ల నివము గొనుచు, నొంటిఁ జోర రానియట్లుగా నుండె మఱియు యయా 1 44

వడవడఁకు వి (వడఁకు+వడఁకు) మిక్కిలివడఁకుట.

సీ వడఁకనఁ గంపాఖ్యయడరును వడవడఁ కిన నతి కంపంబు దనరుచుండు ఆం. భా. 1 153

(చూ వడవడఁకులుగొను)

వడారము క్రి విఱ బొత్తిగా (శ ర)

వడవడ(ఱ)కులుగొను అ క్రి. (వడఁకు+వడఁకు+కొను) మిక్కిలి వడఁకు.

క కుడిచేత మాంసఖండము, లెడకేలను మద్యరస సహితమగు కంచం, గుడుక యు ధరించి ముద మున, వడవడఁకులు గొంచు నతఁడు వచ్చెం గుడికిన్. శివరా. 4 38

వడసాలె వి తంతువాయభేదము, సాలీలలోనొక తెగ

వ .. కమ్మరి వడ్రంగి కాసె కంచర యగసాల వారును అడికారి వడసాలె సాలె సాతుసాతిన సాతాని కటికవారును ... హంస 3 28

వడి[1] వి 1 వేగము.

చ. . వడిగొని వార్ధి నిట్లు దరువం దరువన్ విష ముద్భవిల్లి ... భార ఆది. 2 15

క. ఆ రథనివహంబులు న, వ్వారణములుఁ బెరలి మరలి వడిఁ బఱచుటయున్, భార. భీష్మ 2 294

ఉ ... కృతాభ్యసనలౌలను దంతపుమెట్ల వెంబడిం, జేవడి వీణె మీటుటలు.. ఆము 1 62.

(చేవడి—చేతివేగము.)

క. కావేరి దరులు గట్టంగ, వేవే పల్లవుండు దవదు వెట్టికి రామినిం, ధా ఘానినుదుటి కనునోం,గా వడిం గరికాలవిభుండు గాలం దుడిచెను కొంచిదెనళాసనము శ స. 1146

2. శౌర్యము

చ ... ఎంతయు భీతిఁబొంది రా, హరియు నరుండు గర్వపడి కంత విధాతృఁడు దప్పె వానికిన్ . భార కర్ణ 3 377

క. ఉడుపతి దరమిన వడిచెడి, గుడిగుండంబుల మరుంగుగొని యలశశియున్, బడమటి కరిగిన వెనుకను బడి చను తమమనఁగ నీడ ప్రాగ్దిశఁ దిరిగెన్ రా వి 3 22.

సీ విభవంబు గలనాఁడె వెనువెంటఁ దిరుగుట వడి యున్న నాఁడె మావార లనుట రామ శ 77.

3. శక్తి, సామర్థ్యము

క తడిగంట నెపుడుఁ దఱుఁగక కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి గాసిం బుడమిం, బడినఁ గన రాక మంచపుఁ, దొడుగల్లె రట్టె రుజలతో నేమందున్ మనుచ 3 131

శా అన్నా నే ముదివాఁడ లేవ వడి లే దెందెందొ నీ వేఁగఁగా, సన్నాహంబున వచ్చినాఁడవు గదా .. సమీర 7 65

ద్వి దడదడఁ దాఁకుచుఁ దగులుచు మతికి, వడి దెచ్చుకొనుచుఁ బోవక నిల్చు కొనుచు .. పండితా వాద. 202

4 తైక్ష్ణ్యము

క ఎండవడిచేత వాతెఱ, యెండ వడి న్నడచి మూరు శేరితలహరీ, మండలతాండవఖండన, పాండిత్యమునం దనర్చుపాలేటదరిన్ పరమ 4 223

5 కాలము

సీ వడిసావి యెఱుకు విన్బడి గంటబలుమబ్బు కొక్కు గుంపుల కిడ్డ కొఱుకులవఁగ . చంద్రా 5 52

క ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీరెఱుఁగక మోహా, క్రాంతంబు లయ్యె .. భార విరా 5 215

సీ పల్లవ చూచితే వైధవ్య మొక్కింత వడియైనఁ గైకొన వలసె నాకు .. భా రా. యు 392,

క. వెడఁగు వడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలంచుకొని యవశ్యంబును నిప్పు డితనిఁ దెగఁ జూడక చొప్పడునే యావిప్రశిశువు ప్రాణం బనుచున్ నిర్వ 10 78

సీ ఇందిరాధిప నాకు నింక నొక్క విచిత్ర రూప విలాసంబు చూపుమనినఁ, దాపసోత్తమ వన్నుఁ దప్పక యుంచుకవడిఁ జూడు మన మౌనివరుఁడు నట్లు, చూడంగ... వరాహ 9 111.

(కాల మనునర్థమునం దిది ఇంచుకాదిశబ్ద పూర్వకముగానే ప్రయోగింపఁబడు ఉదా ఇంచుకవడి )

6 దారము మొదలగువాని పిరి.

సీ నులిగొన్న చెలఁది పుర్వులనూలివళ్లనా నమరెడు ముడుతకన్బొమలవలన... కళా 3 83

క. వడి దారము చెవులుం ద్రొక్కుడు పలకయు దిండు కదురు గుంజులుమం ద్రొక్కుడు బొమ్మయునుం ద్రిప్పుడు, పుడకయునుం గలుగు రాట్నములు గైకొనుమన్ శుక. 2 419.

చ కాటినెన్నడుము బిగించి పొగజతనంబునఁ గైఁగరమంటి మీనముల్, వడినిడి యంగి చేతు లెగవైచుచు వచ్చి రమాత్య లత్తరిన్ ... రా వి 5 37.

7. పురిబిగువు. (శ ర.)

8. పురిబిగువునఁ బడుచిక్కు. (శ. ర.)

9. వడియఁబోఁత

ద్వి కడివోనిపస్నిటఁ గడుఁబెక్కుమార్లు, వడులు దేరిచి మించ వాసనంగట్టి, నవనీతంబు చాయఁ, గలిగి వెన్నెలసోగకణికలో యనఁగఁ, దెలివొందు నిడువాలు తిరుమ ణుల్. . ద్వి పరమ 188. పా. 10. పం

10. కొన్నియెడల నిది వాక్యాలంకారముగా నుప యోగింపఁబడును.

సీ వాహినియగు దానివడి మూఁట గుణియింపఁ బృతననాఁ బరగు . . భార. ఆది 1 80

విశేష ప్రయోగములు

1. వడిగుప్పిగంతులు. బ బాలక్రీడా విశేషము

సీ వామనగుంటలు వడిగుప్పిగంతులు చెఱకుల పందెముల్ చిమ్మబిల్లాయి . హంస. 3 146.

క్రి. విశ. వేగముగా.

చ కడుపున శూలమెత్తి వడి గానిలి ప్రాణము లేఁగువట్లయై, తొడిఁబడ హంస 1 254

జ వడికట్టు, వడికాఁడు, వడికాలము, వడిగల తనము, వడిగలవాఁడు, వడిగొను, వడిగొలుపు, వడిచుట్టు, వడిపెట్టు, వడియెక్కు, వడిపడు, వడివేయు

వడి$^{2}$ వి (సం వళి. – ఛంద) – యతి.

చ వడియును బ్రాసము న్గణము వర్ణ వ లర్థము శబ్ద మొప్పునే, కడమయు లేదు మత్కృతికి రుక్మా 1 27

వడిఁగట్టు స క్రి (వడియన్ + కట్టు,)(క ఒడిఁగట్టు) (ఒక పాత్రముఖమున గుడ్డకట్టి నీళ్లలోనగు ద్రవ పదార్థములను) వడియుఁబోయు (శ ర ) సిద్ధపడు అనునర్థమున ఒక కవి 'ఒడిఁగట్టు'నకు అపరూపముగా దీనిని ప్రయోగించినాఁడు

క గడిదేటి జారవిద్యకు, వడిఁగట్టి దురంత కంతు వనజశరాళిన్, బడఁజాలనికతమున నా, వడువున నత్తొగటి బోటి వర్తిలఁ దొడఁగెన్ హంస 2 25.

వడిఁబెట్టు స క్రి (వడియన్ + పెట్టు) పాత్ర ముఖమున గుడ్డకట్టి నీళ్లలోనగువానివి వడియఁగట్టు

చ మానసంబున నెలకొన్న క్రోధరసమున్ వడిఁబెట్టుచు నున్నకైవడిన్ . పారి 1. 113.

క మడుగులు బావులు కొలఁకులు, వడిఁబెట్టిన యమృతరసము వడువున నిండా, రెడు నిర్మల జలములచేఁ గడు రమ్యంబయి జగతి నెగడు పొగడొందెన్ భోజరా 3 185.

సీ. వడిఁబెట్టి లోఁ జెఱకడము సాఁబాలూన్పఁ జెలఁగు సంబారంపుఁ జింతపండు... ఆము 2 97

వడకట్టు వి (√వడి1 ) కుండలపై నిర్మించు నకిషీపని.

గీ తీర్తిపూదెలు కులుకులు త్రేటగట్లు, గెఱల మురుపులు వడికట్లు కిఱుదుకట్లు, బొద్దు టీనలు నునుపులు మొదలుగాఁగఁ, బనులు నిర్మించుఁ గుండలపై నతండు హంస. 5 18

వడిఁకాడు విశ (వడి$^{1}$ + కాఁడు.) 1. వేగవంతుఁడు 2. శౌర్యము కలవాఁడు. (శ. ర.)

వడికాలము వి. (వడి$^{1}$ + కాలము ) వేసవి.

క తొడిగినపాముల విసమును, మెడవిసమును నొసలిచిచ్చు మెట్టులవడియున్, ముడివడఁగా వడికాలము, గడపుట కడునరిదియయ్యెఁ గఱకంఠునకున్ ద్వా 9 13

**వడిగలతనము** వి (√వడి[1]) శౌర్యము, శూరత్వము

క. వడిగలతనాన నీగిన, విడిముకిపసఁ బ్రాభవమున విజయనగరిలోఁ, గడునెన్న నేర్చఁగలమేల్, నడకలఁ బెదవేంకటాద్రినరవరుఁ డొప్పున్ రాఘవ పీఠి 1 37

**వడిగలవాఁడు** వి (√ వడి[1],) శూరుఁడు.

సీ వడిగలవారిని బడబాది బలమిట్లుగడలఁబోవఁగనీక నడపుదాత . రా వి 5 8.

(ఇచట సముద్రపరముగాను రాజును శ్లేషించినాఁడు.)

**వడిగొను** అ క్రి (వడి[1]+కొను.) 1 వేగముగలుగు, త్వరపడు

చ. వనజాయతేక్షణునిమట్టఁదలంచి మహోగ్రహుంకృతుల్, వడిగొనఁ గొమ్ము లొడ్డికొని వాతులువిచ్చి ఖురాగ్రపాతనం, బుడమిఁ బగుల్చుచున్ హరి. పూ 6. 87.

క ఎడఁబడక యహోరాత్రులు, వడిగొని చదివింప నిట్లు వలయునె శిష్యుల్, గడునిద్ర లేమి వెంతయు, జడమతులై చదువుదప్పఁ జదువుచు నుండన్ భార. అర 3 288

2. మెలిగొను.

'వడిగొన్న సరులతో' క్షేత్రయ (శ ర.)

3 వడియు, కాఱు, స్రవించు

వ మృదుదళపుటాంతరంబుల వడిగొనిన తేట తేనియన్ . వసు. 4 23.

**వడిగొలుపు(ల్పు)** స క్రి. (వడి[1]+కొలుపు) వడిగొనఁజేయ, మెలిపెట్టు, వడివేయు.

మ బలుమీసల్ వడిగొల్పుచున్ బిగువుతోఁ జాలస్త్రుల్పుఁడు. ఉ. రా. 5 200

సీ వడిగొల్పి యొక కేల ముడిచిన క్రొమ్ముడి గొబ్బునఁ గటిఁ జుట్టుకొన్న చేలము ... కాశీ 1. 47

**వడిచుట్టు** వి. (√ వడి[1]) చిక్కు, ఇక్కట్టు

ఉదా. ఈమధ్యవానికి చాలవడిచుట్లు వచ్చినవి,

**వడిపె(వె)ట్టు** స క్రి 1 మెలిపెట్టు

ద్వి గొనకొని వడిపెట్టు కోకచందమునఁ, బని లేని నెఱసులు వట్టఘొడఁగె . హరిశ్చ పూ 1423

చ. చెలఁగికటారి బిత్తరము చిమ్మ వికారపు నవ్వునవ్వుమీసలు వడిపెట్టు నూరక మజాయనుఁ దన్నునయంబు విక్ర 8 18

సీ తలితీపు పుట్టించి తక్కిచేకానెల్ల వడివెట్టిరాఁ దీయువారిఁ బూచి విప్ర 4 16

వ కొాటికత్తెలు పుడికినం దేఁటిదాఁటునకు నెరసు లేకుండ నొడికంబుగా వడివెట్టిన తావికుప్పలం బోలె నొప్పి పూచినయశోక భూజాత పోతంబులును కేయూర. 4. 50

2. నులుము

సీ గీ అలుకచేనుండ బుగ్గలు నులిమి తిట్టి, తొడలు వడిపెట్టి కోదండ మడరఁ గట్టి, రెట్టలెగఁ బెట్టఁ బట్టించు ఉపుమాపుఁ, గొట్టిబెట్టుగ సజ్జన కోల దెగను హంస, 3. 141

**వడియఁగట్టు** స క్రి (వడియన్+కట్టు ఠ ఒడిఁ గట్టు ) వడియఁబోయు. వడిఁగట్టు

సీ తగువాసనావాసితములై స పచ్ఛ్లు వడియఁ గట్టిన యానవాల పెరుఁగు విక్ర 4. 188

**వడియఁబోఁత** వి (√ వడియఁబోయు) వడియఁ బోయుట (శ. ర)

**వడియఁబోయు** స క్రి (వడియన్+పోయు.) బియ్యములోనగువానిని కడిగి నీళ్లుపోవునట్లుంచు. (శ ర)

**వడియము** వి (సం వటకః) (ప్రా వడయ) వటకము, భోనములో నంజుకొను వ్యంజన విశేషము

చ నాలుగేన్, పొగపిన కూరలు వ్వడియముల్ వరుగుల్ పెరుఁగుల్ ఘృతప్లుతిన్ ఆము 1 80

వ . పచ్చడులుం గిచ్చడులును బజ్జులుం గిజ్జులును వడియంబులు గిడియంబులును. . కాశీ 7 185

వ వఱుగులు వడియంబులు పెరుఁగువడి ఘంబులు .. హంస 1. 105

**వడియు** అ క్రి. 1 కాఱు, స్రవించు

క. అ త్తఱిఁ గడుఁ బెల్లుగఁ గ్రొ, న్నెత్తురు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా,యత్తుఁ డగుడు .. భార కర్ణ 1 196

చ కడఁక దలిర్ప నీవు మధుకైటభదైత్యులఁ జక్రధారచే, మెడలు దెగంగ వ్రేయుచెడ మిక్కుటమైన తదీయరక్తముల్, వడిసిన యోడికల్ నెరయ వ్రాసిన లత్తుకభంగిఁ జోద్యపుం, దొడవుగ నొప్పు నీతొడవు తోరపు టొప్పుఁ దలంతు మీశ్వరా నృసిం 3 33

క ఆడినఁ గూడినకినుకన్, వీడినజడముడియుఁ బొగలువెడలినచూపుల్, పోఁడిమి గొను నిట్టూర్పులు, వాడినడెందమును మేనవడియు చెమరునై. పాండు 5 204

సీ కుచసురాద్రి గరంగె ఘోర తాపాగ్నినా వడియు పుప్పొడి తోడివలపుఁజెమట వసు 3 110

క గడగడ వడఁకుచు నశ్రులు, వడియఁగఁ జేదోయి మొగిచి స్వామీ కోపం, బుడుగుము శాపంబునకున్, విడుమర యెన్నఁడగుఁ జెప్పవే కృపతోడన్ భోజరా. 6 249

క. తలిరులతుదఁ జినుకులు జల,జల వడియఁగఁ దడిసి మెలఁగు చలికరువలి ను,న్నొలపమున విరియు పరువపుఁ, దొలుమొగడల వలపుదెలుపు తోటలలోనన్ పారి 5 103

2 ఇంకు, శోషిల్లు

సీ దళితారిరక్తాపగలు నిండి పాఱమి వారిధులిట మీఁద వడియకున్నె ... రాజ చ 2 12

3 కృశించు, చిక్కు

సీ గీ వడియు నెమ్మేని కొక వింత బెడఁగు నెఱపు, సరిగచెంగావిపావడ చలువవలువ, చెలువు గులుకంగ దశా 8 278

జ వడఁబోయు, వడచు, వడపోయు, వడిఁగట్టు, వడిఁబెట్టు, వడియఁగట్టు, వడియఁబోఁత, వడియఁబోయు, వడుచు, వడుపు

**వడియెక్కు** అ క్రి (వడి[1]+ఎక్కు.) వడిగొను, మెలిపడు

క విడువని యభ్యసనంబున, వడియెక్కిన స్నేహసూత్ర వల్లులఁ బెనుపం,బడిన ఘన మోహపాశము, విడిపించుకొనంగలేక వేఁగెద ననినన్ ప్రబోధ 5 27

**వడిలము** సం వి అ న - బడిశము

**వడివడు** అ క్రి (వడి+వడు) వేగముచెడు

మహాస్రగ్ధర పాండురంగా,వనిఁ బోవః పున్య జన్య వ్యవహృతిఁగన వేవంక దుష్పంకశంకన్, నరరాశింజొచ్చు నేలై వడి వడియడఁగున్ వారిజభ్రూణసూతీ. పాండు 3 128

**వడివేయు** స క్రి (వడి+వేయు) వడిపెట్టు వ్యవ. వాఁ డూరక మీసలు వడివేయుచున్నాఁడు. (శ ర)

**వడిసెల**-ఒడిసెల

చ వడిసెలచేతఁ బట్టుకొని వావిరి చక్కని పైట జాఱఁగా. దొడదొడ మంచమెక్క నొక దొడ్డ మిటారపు రెడ్డి కూతురున్. వీథినాటకము 30 ప్ర.

**వడుకు** స క్రి కదురు మున్నగువానిని త్రిప్పి దూదిని నూలుగా తీయు

సీ కాలచక్రముఁ ద్రిప్పు కమలనాభునిశక్తి నానూలు వడుకు రాట్నంబుఁ ద్రిప్పు . . శుక 2 410

ఉ ప్రత్తినిఁ బ్రోఁజుమున్ వడికి బ్రాహ్మణుఁడిచ్చు పవిత్రతంతువుల్ . . ఉ హరిశ్చ 4. 70

సీ సంతలోఁ బ్రత్తిలిచ్చుముల్త్తి నూఱాలు వగల జన్నిదములు వడికివడికి . శుక 4 109

జ వడుకుడు

**వడుకుడు** వి (√ వడుకు) వడుకుట (శ ర)

గీ వడుకు డనఁగను దంతుసంభవనహేతు,క్రియ ఆం భా 2 294.

**వడుగఁడు** వి (సం వటుకః ప్రా వడుఅ) బ్రహ్మచారి.

ఆ గోఁచి బిగియఁగట్టుకొనిన యావడుగని, మత్తికాని రతికి మరపవలయు .. భాగ. 9 688

క వడుగఁడవై మూఁడడుగులు, అడిగితివౌ భళిర భళిర . కృష్ణ శ 41,

**వడుగు** వి. (సం వటుః) 1 వడుగయిన బాలుఁడు. బ్రహ్మచారి

క ఒడల ననలుకొను నెత్తురు, గడిగి రఘూద్వ
హుని సమ్ముఖముచేయుదు ని,వ్వడుగు నని తన
రథముపై, నిడుకొని చనియె న్మఖాళ్వ మేఁ
గెడు దెసకున్ జై భా 6 128.

గీ. దబ్బ వ్రేలి యుంగరము మేధావిబొట్టు,
మడుఁగు పేలిక తన కెడమడుగుగాఁగ ...
హరి. ఉ. 10 283

ఆ. బ్రహ్మమైనఁ గూఁతుఁ బట్టకమానఁడు, వడుగు
కింతి పొత్తు వలదు వలదు . భాగ 7 422.

గీ. వలుగుదామెనఁ బెనచిన గళముతోడ, జంట
వెన్నాడు క్రేపుతోఁ జాల నలసి, నడచు ధేనువు
నొకచిన్న వడుగురొప్ప, నయుతు న్నాశ్రమవాట
మయ్యతిథికాసి. పాండు 5 190

2. ఉపనయనము

సీ. పంద్రెండు మొదలు నిర్వదినాల్గుతుదగాఁగ
వడుగు చేయఁగఁ దగు వైశ్యులకును విజ్ఞా
ఆచా. 18

ద్వి వడుగని యిదియేమి గడియించె దీవు, ఐడుఁడ
వెల్లెశివీశ్వరునిఁ గొల్చియును . బస. పు
1. 428

ఆ ముద్దుకొమరు లెలమిఁ బ్రొద్దు ప్రొద్దున కొక్క,
వన్నె యలరఁ బెరుగుచున్న వడుగు లదను
మెఱయఁజేసి చదువుసాములు మొద,ల్గలుగు
విద్దె లెల్లఁ గఱపి యంత. అచ్చ రా బాల 86.

వడుచే-వడచే న క్రి (√ వడియు) 1 నూనె
లోనగు వాని దించి

సీ అలఁతి దంతంపుఁ గాములపీలి సురంటులు శోధించి
వడిచిన జుంటితేనె . పి శకుం 1 98

సీ కలువపువ్వాళ్ళచేఁ గసమైన వెన్నెల వలిప
వెన్నెలలోన వడిచితేర్చి పారి 2 48.

2 కార్చు, స్రవింపఁజేయు,

సీ తళుకు నిద్దంపుటద్దపు మోము కళదప్పె వలవల
కన్నీరు వడువకమ్మ . అని 2 66

వడుపు వి (√ వడియు) వడియుట

గీ బుగులుకొను తావి సిరము కప్పురముతోడ,
వడుపు దివ్వని ఘుసృణ ద్రవంబుతోడఁ,
బొందుగామేళవించిన చందనంబు, నాతి
కొండొక కలకంఠి నలుగుఁబెట్టె. వేం పంచ.
4. 310

చ. కరఁగినడెందముల్ వడువుఁగానని కోర్కులు
పారవశ్యమున్, బొరసిన మిట్టచూపులు ...
పాండు 3. 69

(విడువుఁగానని - ముద్రి పా)

వడువు[1] వి విధము, రీతి.

క ఉరగమవై యుండి మునీ,శ్వర వేషము దాల్చి
యున్న వడువెంతయున,చ్చెరువిది . . భార
ఆది. 1 15.

క అడవులదవశిఖదరికొను, వడువున నిట్టరి బలం
బవారణఁబొడిగా, వడరియతఁడాత . భార
ద్రోణ. 1. 77

క. తొడిగిన కుప్పస మూడ్చిన, వడువున నా
రాజు భోజరా 1 137

సీ వేలాపనమునందు విలసిల్లు విద్రుమవల్లిక యుద
యించు వడువువోలె కు సం. 3. 272

క. బొత్తెంచి రాముపడువ,చ్చొత్తిన చందమునఁ
దనువులొప్పఁగ రూపా, యత్తంబులైన జన
ముల, చిత్తములు వికాసమొంద సీతా తన
యుల్. నిర్వ 10 118

క వనవాసము సేసియుఁ ద్రిభు,వన రాజ్యము
చేయునట్టి వడువున సంతో,షనిబద్ధబుద్ధియగు
యమ, తనూజునకు భక్తినెఱఁగి తానిట్లని
యెన్ భార అర 1 66.

సీ కడుఁజిట్టినట్టి బంగరుపూఁత పొక్కిళ్ళ వడువుఁ
జూపెడు మేనివళులవలన . కళా 3 91

వ ఫణిభూషణున కద్దురవస్థ నడువన్ బరువు
విడుచున్న వడువున దవ్వుల మిడిసిపడ ఉ.
రా 3 78

గీ .. వాసవుఁడు బలుఁడును బోరువడువుదోఁప,
నట్లు గదిసి జయోల్లాస మతిశయిల్ల ఉ.
హరి 1 34

క వడిఁజాముద్రేఁలఁగట్టిన, వడువున వలుగడల
మునరి వార్వాహంబుల్ జడివడిఁ గురియం
దొడఁగెను, వెడవెలువును లేక పాండవేయుని
మీదన్ హర 7. 168

వ. బిలంబు తెఱచిన వడువునఁగురిసె హార
2. 23.

వ తుదముట్టంజదివె నేనియు సముత్పన్న విజ్ఞానుండై . అలబ్ధమధుండు సిక్థకంబును విడుచువడువున విడువవలయు .. అము. 1. 78.

వ మిన్నువిఱిగి పయింబడిన వడువున . . మనుచ. 3 9.

క. జడియక యిపు డా సతి యే, వడువున బొంకంగ వలయు వనరుహగంధీ, యడుగుందప్పిన యప్పుడె, పిడుగుందప్పు వనుమాట పేర్కొన వినవే హంస 1 247.

క గడిదేటి జారవిద్యకు, వడిఁగట్టు దురంతకంతు వనజశరాశిన్, బడఁజాలనికతమున నా, వడువున నత్తొగట బోటివర్తిలఁ దొడఁగెన్ హంస 2 25.

వ పులియడుగు తపసికొడుకు వెనుకొనెడు పాలకడలి వడువన వసంతసమయంబు ననుసరించు కుసుమసముదయ సమృద్ధిపగిది చంపూ. రా 3 25.

గీ. వఱదఁగాష్ఠముల్ గూడిన వడువె బంధు, సంగమంబ విహాసిన చాడ్పు తద్వియోగ మింత చూచినవాని నుమ్మలికము, వొరయనేరదు దానవవరతనూజ భార శాంతి 4. 56.

గీ .. మురువురీవియు నామోదమును జవంబు వడువునొప్పఁగ గంగమ్మ నడువుమమ్మ ... భీమ. 4 175

సీ వలరాజు సచివుల వడువున బెడఁగగు కర్కశ వృత్తనములఁగగ ముహాడి, చూడ్కులు. భార ఆది 8. 74

సీ ఉడుపతి సంగతి నెడపి తాఁజనలేని వడువున నడలందు జడనుదోఁప శశాం 5 121.

క వారుగదా గణములుపతి, వారలలోఁగలసి మెలఁగు వడువున నయ్యో, వారి తెఱఁగెఱుఁగ వలయును భార శాం 3 39

**వడువు**[2]**—వడుగు** వి (సం. వటుః) 1 బ్రహ్మచారి.

సీ. ధర్మాభి వృద్ధిగాఁదగు వడువునకు నీ నిల్లడ బ్రహ్మచే నిడఁగఁబడిన, యిక్కన్య . భార ఆది. 6 248.

గే ఒనఁగి యెడ పేర్పులోఁగాఁగు చున్నయాల, పాలువడ్డించుటయు మౌని పాలవేళ, మనవి వారలచేతికి నంది యిచ్చు, వడువున భుజించెవడు విపుర్వంటకంబు . పాండు. 4. 174

వ . . వాచంయమవంశకంఠీరవంబ యీ శరీర సాదంబునకు నాదికారణంబగు నీ హృదయంబని యుచ్చరించుటన నోరుపొక్కుచున్నయది. ఉన్నయట్ల నొడువు మనవుడు న వ్వడు విట్లనియె. పాండు 5 198

2. కుమారుఁడు

ద్వి. జడియుచు వచ్చియుఁ జాలకాలెంత, వడువున నందుని వడువు నీక్షించి . అ. మ క. 1. 27. పొ 1 పం

**వడుసు** వి మోటుతనముగా చలువ చేయుటచే వస్త్రమునందు వడుగుపేకలు సందిచ్చి వంకరగా తొలఁగుట (శ ర)

జ వడుసుపోవు.

**వడుసుడి** వి (వడుసు + సుడి) (రాజులకిచ్చు) దండువు (శ ర)

**వడుసుపోవు** అ క్రి (√ వడుసు) వస్త్రము వడుసు కలదియగు

వ్యా వ చాకలి యీ క్రొత్త బట్టను వడుసు పోవునట్లు చేసినాఁడు.

**వడె(డియ)** వి చిలుకకొయ్య, నాగదంతకము

గీ చిలుక కొయ్యన వడెనాఁగఁ కెలఁగుచుండు, నాగదంతకము ఆం భా 2 50

**వడ్గు—వడుగు** వి బ్రహ్మచారి

ద్వి తెఱఁగొప్పఁ జంద్రమతీ దేవితోడ, గుఱుతులు సెప్పి వడ్గులు చనిరంత ద్వి హరిశ్చ ఉ 1839. పం

**వడ్డగి** వి. వడ్రంగి

వడ్డగికి ఖ 2 (వృత్తి) చే శా శ. 1185

**వడ్డన—వడ్డెన** వి (√ వడ్డించు) వడ్డించుట

క జిడ్డుంగడలిదొరల్లుం, దొడ్డుకొనం దొడఁగెఁ గేలి యొడ్డున్నవలా, లిడ్డ తెలినిగ్గు టిడ్డెర, వడ్డనకున్ దొడ్డులడ్డు వాల్ వంచుటకున్ . బహు 4 81.

సీ అన్నాదిహ్యాన మలరు వడ్డనయన . ఆం భా 2. 260.

**వడ్డవారము** వి మందవారము, శనివారము

చ. . ప్రాప్యమున సితేతరార్కాధికౌ (సౌ)8 దినంబువ .

వ. . . నేంటి పౌష్య బహులసప్తమి వడ్డవార మున (1061) నా శా 666 (1050) చే. శా 747

వడ్డవి–వ్రడంగి.

వ వడ్డవిపేరు 1ట్టికిచి 8కు 47 దా. శా 1384.

వడ్డి వి. (సం వృద్ధి క బడ్డి) అప్పిచ్చినవానికి అప్పు పుచ్చుకొన్న వానివలన నెలకు నూటి కింత యని పెచ్చుగావచ్చు ధనము

క. కాలంబు జనంబుల వడ్డికిచ్చు వాతని, వల వల వడఁ బొదివి తనకు వశ్యులఁ జేయున్ .. భార శాం 4. 448

ఉ ఆ సభలోనఁ గొన్న ఋణమంతయు నీఁగఁగఁ గంటి వడ్డితో . భార కర్ణ 3 195

గీ నిచ్చ నిచ్చ ఎడ్డి నెల నెల వడ్డొడఁ, బాటి వడ్డి వడ్డిపైపైని వడ్డి, యనఁగ నాల్గుదెఱఁగుల య్యో నా వడ్డి దాఁ, దగవుతోడ నెక్కుఁ దరతరంబ. విజ్ఞా వ్య 66.

గీ ఆనితంబవిలంబి కాలాహికల్ప, ఘనకచ గ్రంథి నచటి శృంగముల కసిత, దీధితులు వడ్డికొనఁ గుచు దేవపూజ,విరులుచిది మెడి కపటభూసురునిఁ గనియె మనుచ 3 88

సీ గీ వడ్డి తేమాన మనఁగను వఱలు వృద్ధి ... ఆం భా 2. 227

జ · వడ్డికాసులస్వామి, వడ్డిబ్రతుకు.

వడ్డించే న క్రి 1 భోజ్య పదార్థములను పాత్రము నందుంచు

ఉ సంచిత బాహుమూల రుచి సంపద పొంపిరి పోఁ గెలఁకులఁ, గుంచె యొకర్తువైవనొక కోమల పల్లవ పాణిలీల వడ్డించె నృపాల మౌళికిఁ గటీతట హాటక మేఖలానమ,శ్వంచిత కింకిణీ రవము నందియ మ్రోఁతలు సందడిం పఁగన్ రాజ చ. 2 130

ద్వి పాలుమాలింగంబు పళ్లెరంబునను, వడ్డించు కొన నమ్రవతము నావుడును . . పండితా మహిమా 289. పా 5 పం.

సీ ఏ తల్లి వడ్డింప నింపుతో భుజియించు జనులకు మాతృవిస్మరణ మొదవు .... దశా 1 50

సా · వడ్డించువాఁడు తన వాఁడైన కడపంక్తిని గూర్చుండు మన్నాఁడు

1 కట్టులోనగు వానితోఁ గొట్టు

క. కాదేని జేతిరోఁకట, వాదులు వారించి లెస్స వడ్డించినచో,నీ దిక్కున నీ కెవ్వరు, రా దిక్కని పల్కి నవ్వి యతఁడిట్లనియెన్ ... విప్ర 4 60.

జ వడ్డన, వడ్డించుకొను

వడ్డించుకొను న క్రి (√ వడ్డించే) భాజనము నందుంచుకొను

ద్వి. కుడువఁజిక్కిన కాయకూరం లన్నంబు, వడఁకక మఱిమీఁద వడ్డించుకొనిన ; పండితా దీక్షా 33 పా 11. పం.

వడ్డికాసులస్వామి వి (√ వడ్డి) వేంకటేశ్వరుఁడు.

వ తలక్రిందఁ జేతు లిడుకొని యోవడ్డికాసుల స్వామీ యీమాఱు గాచిన బిడ్డలంగని మీ పేరుఁ బెట్టెద మని మ్రొక్కుచుఁ గన్నులు మోడ్చు కొని యుండువారును ప్రబంధ 788

వడ్డిబ్రతుకు వి (వడ్డి+బ్రతుకు) వృద్ధిజీవిక, వడ్డికిచ్చి బ్రతికెడు బ్రతుకు, సొమ్ము వడ్డికిచ్చి యా వడ్డి వలన జీవించుట. (శ ర)

వడ్డెన–వడ్డన వి (శ ర, బ్రౌ.)

వడ్డోలగము ("ఒడ్డోలగము" నకు అపరూపము.) వి నిండు కొల్వు

ద్వి. ఆరుదగు శ్రీ మల్లికార్జును దివ్య, వర మంటప స్థలి వడ్డోలగమున . పండితా దీక్షా. 3 పా 23. పం.

వ్రడంగము వి వ్రడంగిపని. (శ. ర, వా)

వ్రడంగి–వడ్లంగి వి (సం వర్ధకి) 1. కట్టుపని చేయువాఁడు

ద్వి. కీలువొందించి యాక్రియ రాటనముల, వాలి యాడించు నా వ్రడంగి యతఁడు బస పు. 4 65.

2 ద్వారాఘాటము, వ్రడంగిపిట్ట

సీ జిట్టగొబడి డాబజీను వ్రడంగి ఆం భా 2 98

జ వ్రడంగి పిట్ట

వ్రడంగిపిట్ట వి (వ్రడంగి+పిట్ట) పక్షి విశేషము ద్వారాఘాటము

**వ్రద్రము** వి కఱ్ఱపని, వడ్రంగిపని
గీ . వ్రద్రమునఁగఁ బరగు వర్ధకి కరమ్రంబు
ఆం భా 2 284
జ వడ్రవాఁడు
**వ్రద్రము** సం విణ (అ ఆ అ) పెద్దది, గొప్పది (వాచ విల్యమ్సు)
**వ్రద(డ్ల)వాఁడు** వి (√ వ్రద్రము) కఱ్ఱపని చేసి జీవించు కులమువాఁడు, వర్ధకి
సీ. వడ్రవాఁడనంగ
గీ వర్ధకి విరాజిలుచునుండు ఆం భా 2 284
**వడ్ల** వి కఱ్ఱపని (శ. ర)
**వడ్లంగి**=వ్రద్రంగి వి 1 పక్షి విశేషము
సీ పిచ్చుక కేరిజ జెగ్గురు వడ్లంగి చీడ చెమరుగాకి చిల్క . ప్రబంధ 234
2 వర్ధకి
సీ వడ్లంగి వడ్రవాఁడవంగ
గీ వర్ధకి విరాజిలుచునుండు ఆం భా 2 284
**వడ్లకంకణము** వి (√ వడ్లు) ఒకజాతి కొంగ (శ ర.)
**వడ్లచిలుక** వి (√ వడ్లు) ఒకజాతి ఊక్కి పురుగు. (శ ర, వా)
**వడ్లత** వి వర్ధకి స్త్రీ, వడ్లది (శ ర)
**వడ్లు** వి బ (ప వరి) శాలిధాన్యము
సీ . . వ్రీహిసామాన్యంబు వరివడ్లు నాఁగను వఱలుచుండు ఆం భా 2 238
వ వడ్లుడంచ్చెడు ఆణ్డువా_ణ్డు (కు 36)
చా శా 1288
వ .. వడ్లుం బ్రాలునుండంచ్చి యొంగ్లిల్లెత్తి దా. శా 1015.
సా వడ్లను పెరుగును గలుపుట
గీ కణఁగివడ్లును పెరుగును గలుపుళంగి, వకట వికటంబులగు ప్రశ్నలడిగె నదియు వాసిష్ఠ 2. 132.
సా వడ్లతోఁ దట్ట యెండుట=ఒకరితోపాటు మఱియొకరు బాధపడుట
గీ ఇట్టివానికి మావారలిచ్చినపుడె, వడ్లతోఁ దట్ట యెండఁగావలసి వచ్చె కలువాయిశ 86.
జ . వడ్లకంకణము, వడ్లచిలుక.

4

**వణఁకాడు** అ క్రి. (వణఁకు + ఆడు స్వార్థమున) కంపించు.
క వాలిక మెఱుఁగుఁ దూపులు, నాళీకాసనుఁడు గినుక నారాయణుపైఁ, గీలుకొనఁజేసి యార్చెను, నాలుగు మోములను ద్రిభువనము వణఁకాడన్ శివరా 1 86
గీ మిగులనలముట తప్పని మేటి తరఁగ, గలుఁగునను మాటికిని వణఁకాడఁజొచ్చె అచ్చ భా 3 42 పా
**వణఁకు**=వడఁకు అ క్రి (క ఒణఁకు) 1 చలించు, కంపించు
క అరచెందురుడెందములోఁ, జొరఁబాటి వణంకు తోఁకఁచేక్కయపోలెన్, నరకుండేసిన బాణము, హరినిటలతటంబు నాఁటి యల్లలనాడెన్ ఉ హరి 1 153
గీ పాఱుఁదెంచి కీరంబులు పండ్లుగఱవ, వణఁకు దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క నైష 1 96
వ వలవల నైన దంతములు వంగిన మేను ..ంకు మస్తమున్ విక్ర 2 155
2 భయపడు
సీ లేదువో గృహిణిపై మోదంబు లోకాప వాదంబునకునైన వణఁకవలదె నిరం 2 98
వి 1 కంపము, వేపథువు
ఉదా అతనిని చూడఁగనె శరీరమున వణఁకు పుట్టినది
ఉ కగ్గినచెక్కులుం జెమటగారెడు మోములు వాడి వస్త్రలై, తగ్గినమేనులున్ వణఁకు దార్కొను కొనులు సారెసారెకున్ విన్ననిమోములు గానిపించినన్ విప్ర 2 58
2. భయము
ఉదా . రణరంగమును జూడఁగనే వీరులకు వణఁకు గలిగినది. ఎవరితోఁ జెప్పినను నాకు వణఁకు లేదు
3 మంచు, హిమము (చూ. వణఁకుగుబ్బలి)
జ వణఁకాడు, వణఁకుగుబ్బలి

**వణఁకుగుబ్బలి** వి (వణఁకు + గుబ్బలి) హిమ వత్పర్వతము

చ. విరచితభోగభాగ్యముల విశ్రుతి కెక్కిన యాది శక్తికిన్, గురుతరమైన యావణఁకుగుబ్బలి పట్టికిఁ గోరి మ్రొక్కెదన్... ధనాభి 1. 6

వణఁకుగుబ్బలిపట్టి = హైమవతి, పార్వతి

వణఁకుగుబ్బలిరాచేవారు = హిమవంతుఁడు.

సీ వణఁకుగుబ్బలిరాచేవారికూరిమికన్య భీమయ్య శుద్ధాంతభామఁ గొలిచి భీమ 3 184

**వణికము** విశ ఒప్పిదమైనది, మనోహరము

సీ వణికమౌ మాణిక్యకొణిగలఁ జెన్నొందు పుష్య రాగపు వలభుల నెసంగి ... ఉ. హరిశ్చ 2 149.

**వణిక్కర్మము** నం వి న్ న వాణిజ్యము, బేహారము

**వణిక్కు** నం. వి క్ పుం 1. బేహారి, వర్తకము చేయువాఁడు 2. తులారాశి,

స్త్రీ వాణిజ్యము. బేహారము

**వణిక్క్రియ** నం వి. అ స్త్రీ వాణిజ్యము, బేహా ఁ ర

**వణిక్పథము** నం వి అ పుం 1 వాణిజ్యము, వర్తకము. 2 అంగడి, దుకాణము 3 తులారాశి

**వణిక్సార్థము** నం. వి అ పుం. వర్తకసమూహము బేహారులగుంపు

**వణిజము** నం వి అ పుం తులారాశి

**వణిజుఁడు** నం వి క్ పుం (ఋత్విగాదిగణ మందలిది) వర్తకుఁడు

క ఆ వణిజుఁడు ధర్మస్థితి, దేవతలును మెచ్చునట్లు తెలియఁగఁ బలికెన్,. భార శాం 5 278

**వణిజ్య** నం వి అ స్త్రీ = వణిజ్యము

**వణిజ్యము** నం. వి. అ. న వర్తకము, బేహారము

**వణితము** వి. 1 రాజ్యభాగము, జిల్లా, తాలూకా మొ

క. ఈ రీతిఁ జిత్రసేనధ, రారమణుం డల్లునకు వర్ణన మొనఁగి కుమా, రిఁ తన్నమునకుఁ బసుపున, కారసి యొక వణితమొసఁగి యనిచెన్ పతికిన్ చంద్రా. 6 53.

2. సీమైకదేశము.

సీ .. వణిత మం చనఁగను సీమైకదేశమై చెలఁగుచుండు ... అం. భా. 2 7

**వతంసము** నం వి అ పుం = అవతంసము

**వతువు** నం వి ఊ స్త్రీ ఆకాశగంగి పుం 1 బాట, దారి 2 నేత్రరోగము (విల్సమ్సు)

**వతోక** నం = అవతోక 1 ఆకస్మిక ప్రమాదమువలన గర్భస్రావమైన యావు, లేక అట్టి స్త్రీ 2 గొడ్రాలు (వాచ)

**వత్త** వి వరుగు (ఇది "వాడి" పదపూర్వకముగనే ప్రయోగములఁ గానవచ్చుచున్నది)

ఉ. కగ్గినచెక్కులుం జెమటగాఱెడు మోములు వాడివత్తలై, తగ్గినమేనులున్. విన్నని మోములుఁ గానిపింపఁగన్ విప్ర 2 53

ఉ ఎన్నిభవంబులం గలుగు నితుశరాసనసాయకవ్యథా, ఖిన్నత వాడివత్తలయి .. మనుచ. 2 57

గీ మంచిగందంబు కమల, నాళములు వాడివత్తలై డీలు వడియె....రసిక. 4. 155.

ద్వి. వాడివత్త యిదేమి వాంఛచేసితివి .. విష్ణు. ఉ. 5. (శ ర)

**వత్తి** వి (నం. వర్తి, వర్తిః) దీపపువత్తి, దీపము వెలుఁగుటకై దూది మొదలగువానితోఁ జేసి యుపయోగించువస్తువు, దశ

సీ. వానలేనికతాన వాడివత్తులవలె సకల సస్యంబులు సమసిపోయె ... వరాహ. 7. 52

ఉ చిత్తజుపువ్వుఁదూపులరచించిన తుమ్మెద ఱెక్కగాలిచే, నత్తఱినేకువత్తియగు నంగన దూలినఁ దూలెఁ గాక... నైష. 6 9.

సీ. బద్దెయంచవఁగను వత్తియనంగను జేక మంచనఁగను జెలఁగుదశలు ... అం భా 2. 153

ద్వి ఆనందభరితహృదబ్జంబె వత్తి,గా నొనరించి... ద్వి పరమ 1 45 పొ 11 పం

**వత్స** నం, వి అ. స్త్రీ 1. ఆఁడుదూడ. పెయ్య. 2. కన్నె, బాలిక.

**వత్సకము** నం వి అ పుం 1 లేఁగ, దూడ. 2 శిశువు. 3 కుటజము. కొడిసెచెట్టు న పుష్పకాసీసము అన్నభేది.

**వత్సకామ** నం వి అ. స్త్రీ లేఁగకై యత్యాశ పడునట్టి యావు. 2 బిడ్డపై మిక్కిలి ప్రేమముగల స్త్రీ.

**వత్సతంత్రి** సం వి ఈ స్త్రీ దూడలనుగట్టెడు త్రాడు, కన్నెత్రాడు పలుపు

**వత్సతరము** సం వి అ పుం మోయుటకును, దున్నుటకును వనుపఱుపఁదగిన వయసుగలకోడె, దమ్యము, పాలు విడిచిన దూడ.

గీ రత్నములుఁబోని వత్సతరంబులకట, వ్రేలు చున్నవి లోల్లెన్గువెంటఁ దగిలి . భార శాం. 4 40

**వత్సతరి** సం వి ఈ స్త్రీ అవుపడ్డ, ఆఁబెయ్య

**వత్సదంతము** సం వి అ పుం బాణవిశేషము, లేఁగ పంటివంటి మొనగలబాణము

**వత్సనాభము** సం వి అ పుం 1 వృక్షవిశేషము. 2 ఒకానొక విషము, విషభేదము

**వత్సనాభి** సం వి ఈ స్త్రీ వసనాభి, విషభేదము

**వత్సపాలుఁడు** సం వి అ పుం. 1 దూడలను గాచు వాఁడు 2 కృష్ణుఁడు. 3. బలరాముఁడు.

**వత్సము** సం. వి అ పుం 1 లేఁగ, దూడ 2 సంవత్సరము - ఏఁడాది 3 దేశవిశేషము కౌశాంబీపురము రాజధానిగాఁగల దేశము, న రొమ్ము,వక్షస్థలము

**వత్సరము** సం వి. అ పుం ఏఁడాది, పండ్రెండు నెలల పరిమితిగల కాలము

**వత్సరాంతకము** సం. వి అ పుం ఫాల్గున మాసము (రా ని)

**వత్సల** సం వి ఆ స్త్రీ తన దూడపై అత్యాసక్తిగల యావు 1 బిడ్డలను మిక్కిలి ప్రేమించు స్త్రీ

**వత్సలము** సం వి అ పుం గడ్డినిప్పు పుం న ప్రేమము

**వత్సలుఁడు** సం విణ (అ ఆ అ) 1 బిడ్డలపైఁ బ్రేమ గలవాఁడు 2 ప్రేమము గలవాఁడు, దయగల వాఁడు.

**వత్సశాల** సం వి అ స్త్రీ పసులసాల

**వత్సాదనము** సం. వి అ పుం తోడేలు

**వత్సాదని** సం వి. ఈ స్త్రీ తిప్పతీఁగ

**వత్సిమ(ము)** సం వి న్ పుం శైశవము బాల్యము

**వత్సీయుఁడు** సం వి అ. పుం పసులకాపరి.

**వత్సుఁడు** సం వి అ. పుం 1 శిశువు, పసిబిడ్డ 2. బాలుఁడు, కుఱ్ఱవాఁడు. 3. కుమారుఁడు, పుత్త్రుఁడు,సంతానము, సంతతి. 4 వాత్సల్య సూచకముగా సంబోధనాంతమై ప్రయోగింపబఁడుపదము ఐ వత్సదేశ నివాసులు.

**వద** = వద్ద వి సమీపము

చ పలితమిషంబునన్ ముదిమి భానుకులాగ్రణి యైనరాజుపీ, నులవదఁ గేకయాధిప తనూజ భయంబున నల్లఁజేరి నీ, పలలిత రాజ్యలక్ష్మిని నొసంగుము .. రఘు 7 3

ఉ భూరివిరాడ్వికారగతిఁ బూర్వకుభృచ్ఛరమాద్రులన్ బదాం, భోరుహముల్ ఘటించుకొని పోకల రాకలమేన్ మలంచి వి,ద్యాద్యరుచిఁ జొక్కుచోఁ జెవివదన్ రవి పోఁగునఁ గెంపు వోలెఁ జె,న్నారు మహోన్నతిన్ మెఱయు నక్షరు నక్షరిపున్ భజించెదన్ వేం. పంచ 1 8

చ ఇది నిజమిందు కాఋనెల లిమ్మొద మిట్లొవరింపకున్న నీ,వదఁబదమూన కేను వనవాస మొనర్చెద నన్న రాజు స,మ్మదమువహించి యోవిమలమానన. వేం. పంచ 1 84

**వదంతి** సం వి ఈ స్త్రీ 1. సంభాషణ, మాటలాడు 2. జనశ్రుతి, జనప్రవాదము (విల్యమ్సు)

**వదనము** సం. వి అ న 1 ముఖము, మోము. 2. నోరు, వచనేంద్రియము 3 ముఖవికారము, మోముజోడ 4 ముందుభాగము- అగ్రము 5 పరంపరలో మొదటి వస్తువు 6 (గణిత.)త్రిభుజములోని మీఁదికొన 7.కథనము, చెప్పుట, పలుకుట.

**వదనాసవము** సం వి. అ. పుం. చొంగ, చొల్లు.

**వదనిక** = బదనిక వి (శ. ర.)

సీ బదనిక వదనిక బవనిక యనవందచను... ఆం భా 2 54

**వదన్యుఁడు** సం విణ = వదాన్యుఁడు

**వదర** విణ (√ వదరు. సం. వద) 1. వదరుబోతు, ప్రేలరి.

క. అనిన నౌడుగఱచి యమరద్విషుం డోరి,వదుచ నాకుఁబుట్టి చెడుగవైతి, పేర్చినోరు మూయు పెడతల వాపోయె, దిట్టవదర గఱచె యెచట నైన నృసిం 4 37

క పదునాలుగు లోకంబులు.... వదరలఁ జేయుదురు భేదవాదులనెల్లన్... ఉ. హరి. 2. 69

2 నీచుఁడు, దుష్టుఁడు

గీ వావివర్ణంబు మాలిన వదర యతఁడు, శాస్త్రములఁ జెప్పఁబడిన దోషంబులెన్ని,యన్ని యును జేసె. శివరా 4 16

వదరు[1] అ క్రి (సం వద్ ) 1 వ్యర్థవచనములు పలుకు, ఉపయోగములేనిమాట లాడు, ప్రేలు

క అది యట్టులుండె నీతో,వదరం బనిలేదు నాకు. భార. శాం 4. 409.

ద్వి కందుచుఁ గుందుచుఁ గళవళింపుచును, వందుచు వదరుచు వడిఁగొట్టికొనుచు .. ప్రభు లిం 2. 56 పొ. 18 పం

2. చెప్పు, పలుకు

ఉ ...భాపఁడా, యిచ్చటఁ జల్లువిత్తు ఫలియించునె వేళ గుణం బెఱింగి నా, యిచ్చకు మెచ్చుగా వదరు మిప్పు డన న్విని యాతఁ డుబ్బుచున్ శుక. 2. 443

మ వదరుంద త్తడి సానిచెంతఁ గడురేవన్ వచ్చు లేమావిక్రొం, బదనుం గెందలి రాకుడాల్వ లవు బాబా యెక్కుడుం గందుదేఁటిదునే ద ం ల వెండిగండిగమిసూటిన్ మించు పూఁదేఁనెస., పద వాక్కించుక విచ్చు క్రొంబొగడ కొంపం బుల్ వనీవీథులన్. చంద్రాం. 4 86.

3. డంబములుకొట్టు, దంభవాక్యములు పలుకు

క. బ్రదుకొల్ల కున్న రార,మ్మెదురుగ నిటువంటి మాట లిమ్మెయి నేలా,వదరఁగ... కళా. 6 22.

4 అఱచు, కూయు

రగడ వదరెఁ గడుఁ గ్రొవ్వి పికవారములుఁ గీర ములు.. రాఘవ. 2 6

వి. 1 వ్యర్థవచనము, ఉపయోగములేనిమాట, ప్రలాపము, ప్రేలుడు

సీ. ... పైబుప్రల్లదము వదరువదావళి నాఁగఁ జెలఁగ నొఁబ్రలాపాభిధ.. ఆం భా 1 116.

తే అట్టి కాంతాజనాంతకు వట్టిశైల, జాధిపద్రోహి వట్టిమహోఘచిత్తుఁ, జెప్పనే మున్న దీఁక నీవు చేరినట్టి, వార్త వినిపింపఁ గద రోరి వదరు బేల.. సీతావి. 8 56

2 దంభవచనము, డంబము.

చ వదరులు పల్కినంతటనె వచ్చెనె ధైర్యము శౌర్యవృత్తినీ, కొదవినఁ జక్కనై నిలువు మోరి నిశాచర యిన్నగంబునన్ రుక్మాం 5 33

3 పక్షివిశేషము, ఒకజాతిపిట్ట

గీ పికి నేలనెమిలి పెనుగువ్వ ఒకదారి పాళురాయి సివదు పలువరింత, చేదలుకోడి గువ్వ వదరు తోఁకలవేడి, యాదియైన పక్షులతఁడుదీర్చు హంస 3 13

వదరుపల్కులు = ప్రలాపములు, అర్థములేని మాటలు

సీ వదరుపల్కులు గాక తుది సాటివచ్చునే కన్నెర కాయలీ చన్నుఁగవకు... హంస 1 210.

వదరుమాటలు = ప్రలాపములు, అర్థములేని మాటలు

సీ. వదరుమాటలు గాక వచ్చునే సరిచేయఁ గన్నెర కాయలీ చన్నుఁగవకు.. వరాహా 9 101

జ వదర, వదరుఁబోతు, వదరుకొను, వదావళి.

వదరు[2] అ క్రి అడరు, అతిశయించు.

సీ. వదరుచీఁకట్లలో వ్రాలుచుక్కలు వోలె వేణి భరమ్ములో విరులువ్రాల ఉ. హరి 5 276 (శ ర. పా ("వలుద చీఁకట్లలో"), వావిళ్ల పా "వఱలు చీఁకట్లలో", వీరేశ. పా )

వదరు[3] వి 1. చేఁతిసొర (వృ వి ) (శ ర )

2 సొరకాయ, అలాబువు

ఆ. వదరుఁడైన యీశు వరమున నిదియొక్క, వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, దానిఁబార వైచఁగానున్న నాకాశ,వాణి యిట్టు లనియె వసుమతీశ భార అర 3 54

ఆ. శకనరేంద్రచంద్రచరణాబ్జసంసేవ, విడిచి యా విదర్భవిభునిఁ గలసి, వచ్చుటోడ విడిచి వదరు పట్టుటసుమీ. విక్ర 4. 64.

తే అనిన మనుజేంద్రుఁ డిట్లను మునివరేణ్యా, మత్కులాచార మెడలి యా మానవతులఁ, గూడియుండుట వివరింప నోడవిడిచి, వదరు పట్టిన యట్లపో త్రిదశవంద్య.హరిశ్చ 2. 182.

జ వదరుకాయ, వదరులాఁడు

వదరుఁబోతు (వదరు[1] + పోతు ) విశే ఊరక ప్రేలు వాఁడు, ప్రేలరి (శ ర.)

**వదరుకాయ** వి (వదరు³+కాయ) సొరకాయ.

ఆ గానభిక్షు వేడ హీనస్వరంబున, వదరుకాయ లందివచ్చినట్టి, పీడియలకు లయలు విప్పి చెప్పిన భంగి, నందు ముగురువాడి రందముగను ద్వా 8 168

**వదరుకొను** అ క్రి (వదరు¹+కొను స్వార్థమున)

1 ప్రేలు

సీ. ఫలపరంపరం బెల్ల నులిచివైచితి మింకఁ గొదమ చిల్కల వెంత వదరు కొనునొ ... వసు 3 151

2 చెప్పుకొను

గీ. ఎడమ దెవ దొడ్డుగా వైచి యేకులెల్లఁ, గెలనఁ బలువగ వేఁపుడుగింజ లునిచి, చేవ పీటలమీఁద నాసీనలైన, వారలై వావివరుసలు వదరికొనుచు శుక 2 420

**వదరులాఁడు** విశే (వదరు³లు+వాఁడు) సొర కాయలూఁదెడువాఁడు

గీ జెన్నిదంబుగఁ బెనుఁబాము నవదరించి, యంఘ్రి కటకంబు ఘల్లుఘల్లనుచు మొరయ, నాహితుండికగళకవిద్యాధిరాజు, వచ్చెఁబాముల మెంగఁడు వదరులాఁడు క్రీడా 223

**వదలించే** స క్రి. (√ వదలు) విడునట్లుచేయు

సీ చేయింతు నిరతంబుఁ జిత్త సంభవు పూజ వద లింతు నితర దేవతల పూజ.. చంద్రా 3 82.

ద్వి ఓపినరీతిఁ బ్రియోక్తుల నెదిరి, కోపము వద లించి కుశలంబు మీఱ హరిశ్చ పూ 127

వ ... నరంబుల వదలించుచు. ఉ రా 2 61

**వదలు** అ. క్రి 1 శిథిలమగు, పట్టువీడు, సడలు.

క తల వడఁకఁ దొడఁగె నింద్రియ,ముల గర్వ మడంగె నంగములు వదలె వళీ,పలితంబు లయ్యె... భార. ఆది 3 191

క మది రోష మొదవ దోవలి, వదలిన బిగియించు కొనుచు భాగ 10 ఉ 408

సీ అంగదాభరణంబులందుఁ గీలించిన వజ్రాలకీలన వదలకుండ . హర 9 45

2 వీడిపోవు

గీ ... కొమరు మేనొప్పు సారెకుఁ గొప్పువదల, నేమిటికినైనఁ దాముస్న యేఁగి యేఁగి, యెల్ల నులు నొవర్చె నిం పెనక మెసఁగ .. కళా. 4. 99

చ వదలినకేశపాశములు వాడిననిద్దపు మోము దమ్ములుం, బదనెరవైన వాతెఱలుఁ బైకొను నూర్పులు నుల్లసిల్లఁగాఁ, గదిసిన యయ్యనంగ వతి గాదిలిబోటులతోడ నిట్లనున్ .. విక్ర. 5 37

మ లజ్జఁ బోవిడిచి యేకాంతంబుగా వల్దెసల్, గనుచుం బైఁటదోలంగ నీవి వదలన్ గామాంధ కారమ్ము నెమ్మనముం గప్పినఁ గమ్మగానక. సారంగ 2 89

3 జాఱు

సీ కదలెడు నెఱివేణి వదలెడు పువ్వులుఁ జెమటఁ గరంగు కుంకుమపు బొట్టు ..

గీ ... పుంభావ సురతమయ్యతివసలిపె. హంస 2 53

4 క్షీణించు, తగ్గు, నశించు

గీ అమృతధారారసాస్వాదసముపజాత, తృప్తి యును బోలె నాహార తృష్ణవదలె... కాశీ 4 207.

క. ఈ భవోద్యానంబుల, .... నందన, వైభవ మంచెట్లు ప్రేమ వదలదొ నీకున్... కళా 2 171

సీ. ... వలకాఁక పెనుదప్పి వదలు టెట్లు. . నీలా. 2 36

సీ వరవంశవైఖరి వదలెనే రవిసుతాపతి యైన దైతేయభంజనునకు వసు. 2 137.

5 ఎడతెగు

(ఈ యర్థమున దీనికి వ్యతిరేకమునందు మాత్రమే ప్రయోగమున కనఁబడుచున్నది.)

చ. వదినొక్కటఁ గ్రుంకిడి వత్తురెందఱే, వద లక యాతనింట శనివారమునం బరదేశి వైష్ణవుల్ . ఆము 1 83

చ మదకలకుంభికుంభ నవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై, వదలక కృష్ణరాయ కరవాలము నందగు ధారనీట నభ్యుదయము నొంది . మనుచ. 1. 41,

చ వదలక మీచిత్రములు వర్ణనచేసిన సంస్మరించినన్, జదివిన వ్రాసినన్ విని ప్రసంగవశంబునఁ జేరుకొన్న విక్ర 2 65

(స క్రి, 1 విడుచు, త్యజించు

సీ. సాధుబృందావనసఃణి నాఁడును నేఁడు వంశానురాగంబు వదలఁడయ్యె .. పారి పీఠ. 18

సీ వీరమాహేశ్వరాచారంబు వదలక . హం 2. 139

సీ తమఁబాసి చను మెఱుంగని క్షీరపానంబు వదలి వెన్గొనుసీలవనద మనఁగ దశా 2 267

2. శిథిలముగావించు, సడలించు

వ ఆ భూపాలుండు హస్త పల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండుమని విడిచి పుచ్చె .. నైష 1 108.

విణ శిథిలము, బిగువుకానిది.

క అంగన యీ తొడవులునీ, యంగములకుఁ జాల వదలులై యుండినవే, మంగళముగఁ దాల్పఁగ ఘా, రంగమునను వైచిచనితె రయమున నకటా భా రా కిష్కిం 63

క. లేఁగౌఁ దీఁగె నితంబము, వ్రేఁగునఁ ద్రెవ్వు టయ్యెఁగని విరించి బిగింపన్, లోఁగ్రిముడి యిడియె వదలుగ, నా ... ఆము 5 28.

వి శైథిల్యము, విడుపు

ఉ దానికి వద్దశాననుఁడు . బాణహతి నాతని ఫాలమునొంచె మూర్ఛకున్, లోనయి చాప ముష్టి వదలుం గనుమూఁతయుఁగల్గు నట్లుగన్, భా రా యు 837

జ వదలించు, వదల్చు

**వద(లుచే)లుచ్చు** స క్రి (√ వదలు) 1 వీడునట్లు, చేయు

గీ . . మ్రొక్కుచు వదల్చినను పోకముడి వదల్చి కరఁగఁజేసిన యటుమీఁదఁ గౌఁగలించు కువల 4 194

ఉ కుప్పసముల్ వదల్చి రిఱిగుబ్బలనొత్తిలి హత్తి వేగుజా, మిప్పుఁడలర్చు గాద్పునకధీశు ఆము 5 104.

చ .. కమ్మదా,మరలఁ గదల్చి వారిచర మండలి సొంపు వదల్చి రంగనల్ . వేం, పంచ 4 141.

మ . సుదతీ చిక్కితి వెందుఁ బోయెద వటంచుం గంచుకంబున్ వద,ల్పఁదొడంగన్ ఉ రా 6 48

వదపద వి వణఁకుట యందగు ననుకరణము

క మృదులతరచంద్రహాసముఁ, గదలించు చళుక్య విభునిఁగని భీరువులై, మదవిమతులు వదపద వణఁ,కుదు రాతఁడుపేంద్ర పుత్రకుఁడు గానఁ జమీ కావ్యా 1 40

**వదాన్యుఁడు** సం. విణ (అ ఆ అ) 1 వాగ్ధాటి గలవాఁడు, వాగ్మి 2 మర్యాదగా మాటలాడు వాఁడు 3 ఔదార్యవంతుఁడు, దానశీలుఁడు వి అ పుం గొప్పదాత

**వదామము** సం వి అ పుం బాదముకాయ

**వదాలము** సం వి అ పుం 1 నీటిసుడి, జలావర్తము 2 మత్స్యభేదము, పాఠీనము, ఒకజాతి చేఁప

**వదావదుఁడు** సం విణ (అ ఆ అ.) 1 వాగ్ధాటి గలవాఁడు బహువక్త 2 వదరుఁబోతు, వాగు వాఁడు

**వదావళి** వి (వదర + అవళి) వదరుఁబోతుతనము (శ ర)

సీ రోఁజుడు రొంజుడు రొడ్డుడు రొండుడు రొల్లుడు రజ్జుప్రేలుడు పలుము ప,లవరింపు పైజు ప్రల్లదము వదరువదావళి బజారమునాఁగఁ జెలఁగనొఁ ప్రలాపాభిద ఆం. భా 1 116

వది వి 1. పసుఁగులోనగు వానిని బట్టుటకై త్రవ్వఁబడి ముండ్లు మున్నగువానిచేఁ గప్పఁబడిన పల్లము (శ ర, చి. ని, ప్రౌ.)

సీ వదులనోదాలఁ ద్రోవక దేవకరిఁ బట్టి యొరిజవైవక యెక్కు నుదుటుఁదనము. రా వి 3 46

(శ. ర పా వసులనోదాల, ముద్రి పా)

2 పల్లము.

క ఇది హలాణమండలంబ,వ్వది నున్నది చెంచుపల్లె వనమధ్యమునన్, మదవనిభ యూపులిందా, స్పదంబు వెలివాడ . . శివరా 3 56

(పసులను బట్టుటకై త్రవ్వఁబడి ముండ్లులోనగు వానిచేఁ గప్పఁబడిన పల్లము ఇట "వల 'యను పాఠము శ ర ములో "పసగరిగొను" శబ్దము చూచినఁ గనుపట్టును )

క పసులకు నొడ్డిన వదియై, మసంగిన యవ్వాన పశుసమాజము సెల్లన్, బసగరగొని .. హరి పూ 7 167.

3. మఱుఁగు, మాటు.

మ ఇదె వీక్షింపు చకోరశాబకనిభాక్షీ దీర్ఘికాహంసయు,ప్పదకాంతః ప్రతిబింబితున్ గగన మధ్యోపస్థితుం జంద్రునిన్, వది నీక్షించి నిజాధినాథుఁ డనుచున్ వాత్సల్య మేపారఁగాఁ, బదు రొప్పం బరిచుంబనం బొనరుచుం జంచూపుటాగ్రంబునన్ వైష. 8 191

విశ అధికము, మిక్కుటము

క వదరెడి మేనును జెక్కునఁ, గదిసిన కెంగేలు గ్రాలఁగా విప్రుఁడు రే, నిదురెఱుఁగని నికంటం బడి, వదియగుదురు మంటమంటపమ్మున నుండెన్ వేం పంచ 4 144

జ వదిగొను

**వదిగొను** అ క. (వది+కొను) వెలకొను, కడఁగు.

ద్వి అదిగాక హరుఁ డిరువదియొక్కదినము, వదిగొని కంచిలో వాన గుర్పింప . బస పు 4 599 పం

ద్వి తుది యత్పరాత్పరతో శివయనఁగ, వదిగొను నుపనిషద్వాక్యముల్ వినరె. పండితా వాద. 234 పా.

చ మృదుగతి మంచి తావులకు మెచ్చు సదా వనీభావనాళి దా, వదిగొని రోయు వంకలను వంచకసంచయ మట్టిదే కదా, చదురు ఘటిల్లఁ జూచు సరసప్రసవంబులఁ జంచరీక పుం, గదుపులు నిచ్చలున్ వెదకుఁగా కుణపంబుల నక్కలేర్పడన్ వేం పంచ 1. 17.

**వదిన—వదినె** వి. 1 భార్యయక్క

ఉ. నావుడు సంతసిల్లి వదినం దగులాగుల బుజ్జగించి లీలావతితో ... విక్ర 8. 98

2 అన్నభార్య (సం. వధూని)

ఉ అన్నయశాలి వానిహృదయం బలరంగ బహూకరించి మా, యన్నకు నెమ్మె వదిన హర్షముఁ గాంచునె పుత్రులెల్ల సౌఖ్యోన్నతులే కదా , ఉ. రా 2. 401,

**వదినె(నియ)** వి (సం వధూనికా, వదూనీ )

1 అన్నభార్య, జ్యేష్ఠుని భార్య

ఆ అనఘ వశముగాదు మనసు గోడంద్ర మీ, వదినెఁ జుట్టములను సదనములకుఁ, బుచ్చు మనియె . భార శల్య. 1. 11.

సీ. వదినె యంచు నొకింత వాత్సల్యముంచక పౌలోమి ముందలఁ బట్టువారు ... రశా. 3 96

క నన్నుఁగని కోడలనుచును, గన్నులఁ గప్పుకొని ప్రియము గావింతురు మీ, యన్నయు వదినెయు నటువలె, మన్నింపఁగఁ దగదె నీవు మామవు గావే .ఉ రా 4 209

2 భార్యకు అక్క (శ ర)

3 తనకంటె పెద్దదియగు మేనత్త మేనమామల కూఁతురు (శ ర)

**వదియ(దె)** వి తృణశవిశేషము, ఒక విధమగు గడ్డి మోపు

సీ వందవదియ వదెవందె యంచనఁ దృణశవిశేషం బొప్పు ... అం భా. 2. 77

**వదుఁడు** సం విశ (అ అ అ.) మాటలాడువాఁడు, చక్కఁగా మాటలాడువాఁడు

**వదులు** అ. క్రి బిగువు తప్పు,సడలు.

ఆ. భాగ్యహీనునకును బరుసవేది దొరుక, వదియు నిల్వ దపుడు వదులు గాక, వానతోడవచ్చు వడగండ్లు నిల్చునా, విశ్వ ... వేమ. 3 26.

విశ బిగువుతప్పినది, సడలినది

మ మదిరాపానమదాంధుఁడాత్మపటమున్ మైనుండినన్ జాఱినన్, వదులై ప్రేలినఁ జూడఁడు .... సీతారా. 8. 171.

జ . వదులుడి

**వదులుడి** వి. (వదులు+ఊటి సంధిని వర్ణవికారము ) బీటిక, స్ఫోటము. (శ ర.)

**వద్ద** వి శౌ. ఒద్ద, సమీపము.

ద్వి అంత దూషణుఁడు మత్తారిభీషణుఁడు, వంత నొందుచుఁ దనవద్ది యోధులను .. రం. రా. ఆర 164 పా 10 పం.

ఉ . . మద్గురుండు . కడకాలమైనఖ, ట్వాగతుఁడై తనూభవుల వద్దికి నల్వురఁబిల్చి యిట్లనున్ ... ద్వా 9. 102.

క గద్దియ వడి డిగ్గుమఁ దన వద్ద సభాసదులులేచి వాఁ నిభక్తిన్,సద్దడక నతులొనర్పన్ , దద్దయు వందనముఁ జేసెఁ దా మును కొనుచున్
ఉ. హరిశ్చ ౧ 8

ఉ అగలి వజ్రదంతుఁ కెగటార్చిన దైవతమల్లు వద్దకున్, వేగమె చక్రముఖ్యులగు వేల్పులు కిన్నరసిద్ధసాధ్యర, ఖోగరుడాహిదేవ ఋషి కోటులు కల్పకపుష్పవృష్టిన, భ్యా గతులై రి మల్లుపు ౭ 50.

వద్దు1—వలదు అ క్రి ('వలయు' ధాతువ్యతిరేకార్థక రూపము ఇది సామాన్యముగా అన్నంతక్రియల కనుప్రయుక్తమై కానవచ్చుచున్నది ఉదా చేయవద్దు, చూడవద్దు మొ )

ఉ చక్కని వారిలో మిగులఁ జక్కని దానవటంచు వేడ్కతోఁ, జొక్కుచుఁ జెప్పి రందులకుఁ జూచిన యందుకు నా మనోరథం, బక్కట సిద్ధమయ్యె ఫలమబ్బెను హోయిటులుండ వద్దెయో, చక్కెర బొమ్మ యంచు సంసప్రతిభాషల నిచ్చగింపుచున్ హంస. 1. 84

ఉ భార్గవరామ నీవు నొక పౌరుషశాలివి బోలె మచ్చమూ, వగ్గముతోడఁ బోరెదవు వద్దిఁక సాహసము దశా. 6 117.

వద్దు2 విశ మొద్దు, లావు, స్థూలము

ద్వి వద్దుమొగంబులు వలిపెంపుజెముక, బద్దెలఁ గూర్చినపచ్చడంబులును .. పండితా. పర్వ 344 పొ 3 పం

ద్వి వద్దు మొగంబును వలుదచేతులును, బ్రద్ద చిరుదొడలు బరదుప్రక్కలును పండితా దీక్షా 40 పొ. 9 పం

వద్యము నం విశ, (అ ఆ అ ) 1. చెప్పఁదగినది, నిద్యముగానిది 2 వల్లనిది
ఉదా వద్యపక్షము=కృష్ణపక్షము
న మాట, ఒకదానిని గుఱించి చెప్పుట

వధ(ము) నం వి అ పుం (ఇయ్యాది చరిత్రాది గణములలోనిది ) 1 చంపుట - మారణము, హత్య.

క. దోషమరసి కామంబును, రోషంబును లేక తగిన రూపునఁ జేయన్, భోషకమగు ధర్మమునకు, వైషమ్యవిహీనమైన వధము గుమారా భార. శాం 5 297

2. దెబ్బ, ఘాతము 3 పక్షవాతము 4 అంతర్ధానము, మాయమగుట 5. (గణిత ) కూడిక, కలుపుట

వధకుఁడు నం విశ. (అ. ధికా అ ) చంపెడివాఁడు, ఘాతుకుఁడు, హంతకుడు, అపాయకరుఁడు.
వి అ పుం. 1 ఉరితీయు తలవరి
2 రోగము 3 మృత్యువు

వధజీవి నం వి న్ పుం 1 వేఁటకాఁడు 2 కసాయివాఁడు

వధదండము నం. వి అ పుం 1 దెబ్బలశిక్ష, చేబుకుతోఁ గొట్టుట మొదలగు శరీరసంబంధమైనశిక్ష 2 ఉరిశిక్ష

వధాంగకము నం వి అ న చెఱ, కారాగృహము

వధావధ నం వి అ పుం. పలువిధములుగఁ జంపుట

వ మఱియు ద్రమ్యాదిననవిధదంతవధలను చతుర్బలంబు లిట్లు ప్రచ్చి వధావధ సేయుచుండె . కు సం 11 708

ద్వి తలపడి పోరుచోఁ దపనుండు గ్రుంకెఁ, గ్రుంకినఁ బోక యుక్కున సేన రెండు, వంకలఁ దెగి వధావధలుగాఁ బెనచి ద్వి భార. విరా 1 22 పొ.

వధించే నం న క్రి మారణముచేయు, చంపు. (శ ర )

వధువు నం వి ఉ స్త్రీ 1 పెండ్లికూఁతురు 2 భార్య ౩ కోడలు 4 స్త్రీ ఆఁడుది 5. తనకంటెఁ జిన్నవాఁడైన జ్ఞాతిభార్య. చిన్నదియైన స్త్రీ బంధువు 6 పశుపక్ష్యాదులలో ఆఁడుది 7 సుగంధి (వృ వి ) 8 చిన్న కచ్చోరము (వృ వి ) 9 సుగంధద్రవ్యము (మే ని )

వధూజనము నం వి అ. పుం భార్య స్త్రీ జనము

వధూటి నం వి ఈ స్త్రీ 1 ఆఁడుది 2 కన్యక

ద్వి ఈ విధి రంగమహీనాయకుఁడు, రివిమైనల వధూటిని వరియించి ద్వి పరమ 5 483 పొ 12 పం
3 కోడలు

వధూపక్షము నం వి అ పుం పెండ్లికూఁతు పక్షమువారు, పెండ్లికూఁతు వైపువారు

**వధూ(గృహ(ప్రవే)శము** నం వి అ పుం పెండ్లి కూఁతు రిత్తవారింటఁ బ్రవేశించెడి మహోత్సవము

**వధూవస్త్రము** నం వి అ న పెండ్లికూఁతు వస్త్రము (మధుపర్కమని వాడుక.)

**వధోదర్కము** నం విశ (అ ఆ అ) చావు ఫలితముగాఁగలది, ప్రాణాంతకమైనది

**వధోద్యతుఁడు** నం విశ (అ ఆ అ) ఘాతుకుఁడు 2 రహస్యముగాఁ జంపువాఁడు

**వధ్య** నం వి ఆ స్త్రీ చంపుట, మారణము, హత్య

**వధ్యపటహము** నం వి అ పుం. ఉరితీయునపుడు వాయించెడు వాద్యము

**వధ్యభూమి** నం వి ఇ స్త్రీ ఉరితీయు చోటు

**వధ్యమాల** నం వి ఆ స్త్రీ ఉరితీయఁ దగిన జనుని మెడలో వేసిన పూలదండ

**వధ్యము** నం విశ (అ ఆ అ) 1 చంపదగినది, చంపవలసినది 2 ఉరిశిక్ష వేయఁదగినది 3 గాయపఱుపఁదగినది, దెబ్బలు మొ శరీర శిక్షకుఁ దగినది, ఛేద్యమైనది

వి అ పుం బలి, దేవతకుపహారము,

**వధ్యశిల** నం వి ఆ స్త్రీ ఉరితీయుట కేర్పఱిచిన శిల

**వధ్యుఁడు** నం వి అ పుం శత్రువు, చంపఁదగినవాఁడు

**వ(ధ్రము** నం వి అ న 1 తోలువాఱు, చర్మరజ్జువు 2. సీసము

**వ(ధ్రి** నం వి ఈ స్త్రీ తోలువాఱు చర్మరజ్జువు.

**వ(ధ్ర్యము** నం వి అ పుం చెప్పు, పాదరక్ష

**వనకణ** నం వి అ స్త్రీ అడవిమిరియము (వృ వి)

**వనకోలి** నం వి ఇ స్త్రీ అడివిరేఁగు (వృ వి.)

**వనఖం(షం)డము** నం వి అ న అడవి, చిట్టడవి

**వనగవము** నం వి అ పుం అడవియెద్దు. వనవృషభము.

**వనగహనము** నం వి అ న అడవియందు దట్టముగాఁ జెట్లుగలచోటు

**వనగుప్తుఁడు** నం వి అ పుం గూఢచారుఁడు (విల్యమ్సు)

**వనగుల్మము** నం. వి అ. పుం, అడవిపొద.

**వనగోచరుఁడు** నం వి అ పుం 1 వేఁటకాఁడు. 2 వనౌకసుఁడు, అరణ్యవాసి

**వనచందనము** నం వి అ న 1 దేవదారు వృక్షము. 2 అగురు చందనము (వృ వి)

**వనచం(ద్రిక** నం వి. ఆ స్త్రీ ఒక జాతి మల్లెతీఁగ. (రా ని)

**వనచరము** నం విశ (అ ఆ అ) అడవిలో సంచరించునది

వి అ పుం. 1 శరభమృగము, ఎనిమిది పాదములుగల జంతువు

2 అడవి జంతువు, వన్యమృగము.

**వనచరుఁడు** నం విశ (అ ఈ అ) అరణ్యమున సంచరించువాఁడు, బోయజాతివాఁడు

**వనచర్య** నం వి ఆ స్త్రీ అడవిం దిరుగుట, అరణ్యసంచారము

**వనచ్ఛాగము** నం వి ఆ స్త్రీ 1 అడవి మేఁక, వరాహము, అడవిపంది

**వనజ** నం వి ఆ, స్త్రీ 1 అడవియల్లము. (వృ వి) 2 అడవి(ప్రత్తి (వృ వి) 3 చిన్న కచ్చోరము (వృ వి) 4 పెన్నేరు (వృ వి) 5. పెద్దసోపు (వృ వి) 6 అడవి మట్టుబచ్చలి (వృ.వి) 7 అడవి పెసర (వృ. వి)

**వనజము** నం విశ (అ. ఆ అ) 1 అడవిలోఁ బుట్టినది

వి అ పుం 1 అడవి యేనుఁగు 2. తుంగముస్త. (వృ వి) 3 అడవి మాదీఫలము (వృ వి.)

న పద్మము, తామర పువ్వు.

**వనజీవి** నం వి న్ పుం ఆటవికుఁడు, అడవి మనుష్యుఁడు

**వనజ్యోత్స్న** నం వి ఆ స్త్రీ ఒక జాతి మల్లెతీఁగ. (వృ వి)

**వనట** వి (√ వనరు) 1. దుఃఖము, శోకము.

చ. నీమనంబునఁ గల చింతయంతయును బుచ్చెద నాకడఁ జేరి తింక నీ, వనటఁ దొలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీని మూలమున్. భార ఉద్యో 4 295

గీ అనిన మునియట్ల చేసెద నధిప చెపుమ, వగవఁగత మేమి నీకు నెవ్వండ నేను, వనట యెవ్వని దగునొక్కొయని వివేక, దృష్టిఁ బరికింపు నిను నీవె తెలిసికొనుము. మార్క. 3 293.

క. సుతులు మును నాకు లేమిని, మతి నెంతయు వనటఁ బొందె భా రా బాల 46.

2 బాధ, కష్టము

క చని కందమూలఫలములు, తిని వనటలఁ జాల డస్సి ధీరాత్మకులై, వనములఁ దపములు సలిపెడు, వనవాసులు వెఱ్ఱులమ్మ వారిజనేత్రా. వీర. 2 231

ద్వి వ్రతములఁ గడుడస్సి వనటలఁ గ్రుస్సి, యతి దుఃఖములఁ గుంది యాత్మలోఁగంది . రం రా సుం 247 పొ. 6 పం

సీ పటువనాటక వింభట మహోర్వటులచే వనమార్గ మార్గముల్ వనటఁజెంద . ఉ రా 1 111

**వనధి** నం వి ఇ పుం సముద్రము, కడలి.

**వనతిక్త** నం. వి ఆ స్త్రీ పార, చిఱుబొద్ది (వృ వి)

**వనతిక్తము** నం. వి. అ పుం 1 అడివియుసిరిక (వృ వి) (విల్వమ్ము) 2 కరక చెట్టు

**వనదము** నం వి అ పుం మేఘము జలదము

**వనదీపము** న వి అ పుం వనచంపకము, ఎకవి సంపంగి

**వనదేవత** నం వి ఆ స్త్రీ. అరణ్యాధిష్ఠాన దేవత.

**వనధార** నం. వి ఆ స్త్రీ రెండు చెట్లవరుసల మధ్య భాగము

**వనధేనువు** నం వి ఉ స్త్రీ 1 ఆఁడు గవయ మృగము. 2 అడవియావు

**వనపల్లవము** నం వి. అ పుం శోభాంజనము మునఁగ. (వృ వి)

**వనపాంసులుఁడు** నం వి అ పుం వేఁటకాఁడు, వ్యాధుఁడు

**వనపు** వి (√ వనరు) వనరుట, పరిదేవనము (శ ర.)

**వనపూరకము** నం వి అ పుం అడవిదబ్బ (వృ వి)

**వనప్రవేశము** నం వి. అ పుం వానప్రస్థాశ్రమమువఁ బ్రవేశించుట

**వనప్రస్థుఁడు** నం విశ (అ అ అ) వనవాసి జీవితము గడపువాఁడు, గృహస్థాశ్రమమును విడిచి యడవిలో భార్యతోఁ గూడికాని, భార్య లేక గాని, నివ్వరి ధాన్యపుటన్నమును గాని కందమూల ఫలములనుగాని భుజించుచు తపస్సు చేయువాఁడు

**వనప్రియము** నం వి అ పుం. 1 కోకిల 2 భాఖ (వృ. వి)

స దాల్చినచెక్క, లవంగపు పట్ట

**వనబీజ(క)ము** నం వి అ పుం అడవిదబ్బ (వృ వి)

**వనమక్షిక** నం వి అ స్త్రీ. దంశము అడవి యీఁగ

**వనమాల** నం వి ఆ స్త్రీ ఎల్ల ఋతువుల పుష్పములతోఁ గూర్పఁబడి మోఁకాళ్ళవఱకును వ్రేలుచు నడిమిభాగమున నించుక స్థూలముగా నుండు పూలదండ

**వనమాలి** నం విశ (న్ సి న్) వనమాల ధరించినవాఁడు.

వి న్. పుం శ్రీకృష్ణుఁడు, విష్ణుదేవుఁడు

**వనమాలిని** నం వి ఈ స్త్రీ 1 ద్వారకాపురము 2 పాచితీఁగ, వారాహీలత

**వనము** నం వి అ న 1 అడవి, చెట్లగుంపు 2 తామరతీగలు మున్నగువాని గుంపు 3 నివాసస్థలము, ఇల్లు 4. సెలయూట 5 జలము 6 కలప 7. అరణ్యావాసము. 8. వెలుఁగు, కిరణము. 9 పూజించుట

**వనము(క్కు)చము** నం విశ (చ్) నీటిని విడుచునది

వి చ్. పుం. మేఘము.

**వనముద్గము** నం వి అ పుం 1 అడవి పెసరు (వృ. వి) 2 పిల్లపెసరు (వృ వి)

**వనమూర్ధజ** నం వి ఆ. స్త్రీ వృక్షవిశేషము, కర్కటశృంగి, మాచికాయచెట్టు (వాచ)

**వనరాజము** నం వి అ పుం సింహము, మృగరాజము

**వనరాజి** నం. వి ఇ. ఈ స్త్రీ 1 వృక్షపఙ్క్తి, చెట్లవరుస 2 అడవిలోని త్రోవ

**వనరు** అ. క్రి 1 శోకించు, దుఃఖించు,

క. అనిలాత్మజుబలమును, ... మనమున సహింపక, వనరుచు ధృతరాష్ట్రసుతులు వందితమలోన్ .. భార ఆది. 5 247.

ఆ నీకు నితరులట్ల శోకింపఁదగునె యెవ్వరి దలఁచి యింక వనరువాఁడ, వీవు ... భాగ స్త్రీ 1 9

గీ, చచ్చినకబంధుఁ డేటికి శబరి తెలిఁగుఁ, జెనది యేటి కినసూనుచెలిమిఁ దెల్పె, వాలి పనేల సుగ్రీవుఁ డేల నేల, మనము రావేల ఋ నేల వనరనేల చంపూరా. 6 84.

2 విలపించు

గీ. అనుజుఁ బొడఁగాన కెంతయువడవివెదుకఁ, బోవునప్పుడు కానలోఁ బొగిలిపొగిలి, తండ్రిఁ బేర్కొని వనరుచు ధరణిఁ బొరలుచున్న తమ్ముని౯ బొడగాంచి యుమ్మలించి వాసిష్ఠ 4 39

గీ. కొడుకుఁగుజ్జులపీనుగుల్ కుంభకర్ణు, మొండెమును బంధుతనుఖండములును బడిన, పొలికలని లోన మూర్ఛలు పోవుకొనుచు, వచ్చి నిజనాథుపై వ్రాలివనరిచనియె రామా 8 233

3 దీనాలాపములాడు

ఆ. శరణ మగుఁడు సుతులఁ గరుణతో రక్షింపుఁ, డనుచుఁ గుంతి వగచి వనరుచుండె. భార ఆది 7 207

గీ వనరు శాకాయ లవణాయ వాయటంచు .. పాండు 5 149

4 ఒప్పు

గీ సకలభూషణమణిరుచినికరకిరణ,రాజి గడుమించ నిజమందిరంబు వెడలి, పొడుపు గుబ్బలి నడుమను వెడలువట్టి, వనజ బాంధవ వైఖరి వనర నపుడు ప్రబంధ 178

5 ఉండు, వర్తిల్లు

క తనగుణము తనకు నుండఁగ, నెనయంగా నొరునిగుణము నెంచును మదిలోఁ, దనగుణముఁ దానుదెలియక, వనరియొరుని ననెడువాఁడు భ్రష్టుఁడు వేమా వేమా 1 65.

వి 1 శోకము, దుఃఖము

సీ కందర్పశరవృష్టి నందనోపక ఘృష్టి వనవాసమునఁ గ్రుస్సి వనరుచూపె మొ రా బా 22.

2 వీలు, అవకాశము

గీ వనరు గలిగెను మనకు రావణునిఁ జంప, వినుఁడు మీరెల్ల నామాట వేడ్కమీఱ, దశరథుండను రాజు సంతానకాంక్ష, నొనర జన్నంబు గావించు చున్నవాఁడు మొ. రా బాల 32

ఱ. వనట, వవవు.

వనలక్ష్మి సం వి ఈ స్త్రీ. కదళి, అరఁటిచెట్టు (వృ వి)

వనవహ్ని సం వి ఇ పుం దావాగ్ని, కార్చిచ్చు

వనవాసనము సం వి అ పుం పునుఁగుపిల్లి

వనవాసము సం వి అ పుం 1 అడవియందలియునికి 2 వన్యజీవనము ఊరూరు తిరిగెడు బ్రతుకు

వనవాసి సం వి ఇ (న్ సీ న్) అడవిలో నివసించువాఁడు, అరణ్యవాసి
న్ పుం వానప్రస్థుఁడు

వనవృంతాకి సం వి ఈ స్త్రీ 1 అడవి నీరువంగ 2 వాకుడు 3 నేలమునఁగ (వృ. వి)

వనవ్రీహి సం వి ఇ పుం నివ్వరి ధాన్యము

వనశృంగాటము సం వి అ పుం పల్లేరు (వృ వి)

వనశోభనము సం వి అ న పద్మము, తామరపువ్వు

వనశ్వానము సం. వి న్ పుం 1. గుంటనక్క 2 పెద్దపులి 3 పునుఁగుపిల్లి

వనసంకటము సం వి అ పుం కాయధాన్య విశేషము, మసూరము

వనసమూహము సం వి. అ పుం దట్టమైన యడవి.

వనసరోజిని సం వి ఈ స్త్రీ 1 అడవి ప్రత్తిచెట్టు. 2 వన్యపద్మలత (వృ వి)

వనస్థ సం వి అ స్త్రీ అశ్వత్థ వృక్షము రావిచెట్టు. (వృ వి).

వనస్థి సం వి ఈ స్త్రీ రావిచెట్టు

వనస్పతి సం వి ఇ. పుం 1 పూవులు పైకిఁగనఁబడక ఫలించెడు వృక్షము, పూవక కాచెడు చెట్టు. 2. చెట్టు (మట్టి మొ) 3 చెట్టు మొదట నుండి కొమ్మల మొదళ్ల వఱకు ముండెడి భాగము, స్కంధము 4 స్తంభము. 5 యూప స్తంభము, 6 కట్టుతాయెత్తు 7 పరవంజా 8. సన్యాసి యతి

వనాంతకము సం వి అ పుం 1 అరణ్యప్రాంతము 2 అరణ్యప్రదేశము

వనాఖుకము సం వి అ పుం ముద్గము, పెసరు(వృ వి)

వనాఖువు సం వి ఉ పుం చెవులపిల్లి, కుందేలు

వనాటము సం వి అ. పుం వనమునందు చరించు జంతువు (శ్రా ని)

వనాబ్జిని నం వి. ఈ స్త్రీ నీటితామరతీఁగ
వనాయుజము నం విశే (అ ఆ ఆ) వనాయు దేశ
మునఁ బుట్టినది,
వి ఆ పుం వనాయుదేశమునఁ బుట్టిన గుఱ్ఱము, ఉత్తమాశ్వము
వనాయువు నం. వి ఉ పుం దేశ విశేషము, ఒకానొక దేశము
వనారిష్ట నం వి ఆ స్త్రీ అడవిపసుపు మ్రాను పసుపు
వనార్చకుఁడు నం వి అ పుం పూల దండలు గ్రుచ్చువాఁడు, మాలాకారుఁడు
వనాలక్తము నం. వి అ న ఒకవిధమైన యెఱ్ఱ మన్ను
వనాలిక నం వి ఆ స్త్రీ 1 ప్రొద్దుతిరుగుడు చెట్టు, సూర్యానువర్తిని (విల్యమ్సు) 2 హస్తిశుండి (వృ వి) (వా చ)
వనాశ్రమము నం. వి అ పుం వనవాసము, వానప్రస్థాశ్రమము
వనాశ్రయము నం వి అ పుం ఒకజాతి కాకి, కాకోలము, మాలకాకి
వని నం వి ఇ. పుం 1 అగ్ని 2 రాశి, ప్రోగు. 3 యాచన, వేఁడికోలు
స్త్రీ ఇచ్ఛ, కోరిక.
ఈ స్త్రీ అడవి, చెట్లగుంపు
న్ పుం. 1. వనప్రస్థుఁడు, వానప్రస్థాశ్రమమున నున్నవాఁడు, యతి 2 చెట్టు
విశే ఇ యాచించువాఁడు, అడుగువాఁడు (వాచ)
వనిక వి పత్రిక, చీటి, జాబు
సీ రతి చిల్క తనకుఁ దత్పతి ముద్దుచిల్కలో వనికె వ్రాయించుట వినవె హారిణి .. చంద్రా. 3. 67
వనిక నం వి ఆ స్త్రీ చిన్నయడవి
వనిత నం వి ఆ స్త్రీ 1 ఆఁడుది స్త్రీ 2 భార్య, ఇల్లాలు గృహిణి 3 ప్రియురాలు, వలచినకాంత 4 పశుపక్ష్యాదులలో నాఁడుది
వనితము నం. విశే. (అ. ఆ అ) 1. యాచింపఁబడినది, అడుగఁబడినది. 2 సేవింపఁబడినది,కొలువఁబడినది.
వనిష్ణువు నం విశే (ఉ) యాచించువాఁడు, అడుగునట్టివాఁడు
వనీ(య)కుఁడు నం వి అ పుం యాచకుఁడు, బిచ్చగాఁడు
వనీపకుఁడు నం వి అ పుం యాచకుఁడు, బిచ్చగాఁడు
వనీపుఁడు నం వి అ పుం వనమును పాలించువాఁడు, తోఁటమాలి
వనేకింశుకములు నం వి. అ పుం బ వ "అడవిలోని కింశుక వృక్షములు" యాదృచ్ఛికముగాఁ గనఁబడిన పదార్థము ఇట్లే, "వనే బిల్వకములు" (విల్యమ్సు)
వనేచరము నం వి అ. పుం 1 అడవి మృగము. వన్యజంతువు 2 వనదేవత
వనేచరుఁడు నం. విశే (ఆ ఈ. అ) వనము నందు సంచరించువాఁడు (బోయ మొ)
వి అ. పుం 1 వనవాసి, కిరాతుఁడు 2 వనప్రస్థుఁడు, తృతీయాశ్రమమున నున్నవాఁడు
వనోత్సాహము నం వి అ పుం ఖడ్గమృగము
వనోద్భవ నం వి. ఆ స్త్రీ అడవి ప్రత్తి (వృ వి)
వనోపప్లవము నం వి అ పుం. దావాగ్ని కార్చిచ్చు
వనౌకసము నం వి స్ పుం క్రోఁతి అడవి జంతువు
వనౌకసుఁడు నం విశే న్ అడవియందు వసించువాఁడు,
వన్నియ[1] = వన్నె వి (నం వర్ణః,) 1. శ్వేతాది వర్ణము, రంగు.
గీ. వేలుపుల ఱేఁడు తనకొక వెల్లమొదవె, కలదనుచు నిక్కు నింతియకాని యిట్లు, కలవె పలువన్నియలగిడ్డిశదపులనుచు, నీలా 1 48
2 కాంతి, శోభ
గీ వినుఁడు. దచ్చికడల, నెన్నదఁగి వన్నియలకెల్ల నిక్కయగుచు,. నీలా. 1 26
ఉ . మృదుపల్లవకోమలతత్పదద్వయీ, పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ, న్నాటక సూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్ పారి 1 120.
సీ. ... నెఱిమించుచుండు వన్నియచెక్కడపు బొమ్మచికిలి దంతపుఁబాదుకలు దొడగి...దశా, 1,98.

3 చెక్కఁదనము, ఒప్పిదము

ఉ కిన్నరసిద్ధసాధ్యముని ఖేచర భూచర దేవ దైత్యులం,బన్నగ... మానసస్పష్టియందుఁ దా, వన్నియగా సృజింప... వి పు. 2 260

క. . వనజంబుల కెంపుగలసి వన్నియ మిగులం, దనుఁగని లోకం బలరఁగ... దశకు 6. 64

4 ఇంపు

ఉ కిన్నర మీఁటు వీణఁ బలికింపఁగ గీతములుం బ్రబంధముల్, వన్నియఁ బాడఁజెప్ప నని వారిత చాతురిగల్గుసట్లుగాన్ వసు 3 33

5 రంగుపూఁత (శ ర)

6 వస్త్రవిశేషము, రంగుచీర

గీ సర్వశృంగారముల జిరుజౌకములును, చిన్ని కస్తూరిమల్లను జిలుకజార్లు, వన్నియలు మంచి బొమ్మంచువన్నియలును, మొదలుగాఁ గల చీరలు ముదముతోడ దసావి 3 38

సీ నిండారు బ్రాఁత వన్నియఁ దాల్చునొక వేళ జిగి పట్టుబొమ్మంచు చీరఁగట్టు. ఉ. హరిశ్చ. 4 16

7 బంగారము యొక్క మేలిమి, నిగ్గు

సీ. పదివన్నియలకోట పసిఁడి యొడ్డణముగా సౌధ శృంగములు రోజములుగాఁగ. దశా 3 116

8 ప్రసిద్ధి

మ. శ్రుతులన్ వన్నియ కెక్కె శాస్త్రములచే సొం పగ్గలించెన్ ... విక్ర 1 35

ఉ తన్నిసవాఁడు తచ్చరణతామరసంబుల వ్రాలి సిగ్గుపోవునా,వన్నియ సన్నమౌ. వేం పంచ 4. 463

గీ . . శూర్పణఖ మేనగోడలౌ చూడ లంక, ణీతనూజయొ యవఁగ వన్నియకు నెక్కె. శుక 3 20.

9. ప్రశస్తి, ఉత్కర్ష.

వ. ...మరాళకులాధ్యక్షవళక్షపక్షంబులకు వన్నియ పుట్టించి ... ఉ. రా 4 163

10 వర్ణన.

సీ. పాలింతు నేఁగటిసప్తర్క్ష వైభవమునా నేత్రా వ్యాయంబు వన్నియకు నెక్క. వసు. 6 85

ఉ. . వన్నియ మీఱఁ జిల్కరా, తేజి యవాళిఁ దోలిగడి దీటివదారి మిటారి . . దశా 2. 300

11 రీతి, విధము

ఉ ఎన్నఁడుఁ గాసు వీసమొక టిచ్చినవాఁడవుగావు వీట నీ, వన్నియ కోడెగాండ్రు తగ వారవధూటులకై యొసంగునా, చిన్నెలు నీవు చూచియు నిసీ తలవంపఁగ నేర వన్నిఁటం, బిన్నతనంబు దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాడనేటికిన్ విప్ర. 4 27

12. (వ్యాక) ప్రత్యయము

(వ్యతి.) ప్రకృతి (శ ర)

13. అలంకారము (శ ర)

వన్నియ[2] వి అంకవన్నె (శ ర.)

వన్ను వి (సం వర్ణః) రంగు

సీ మణిభూషణప్రభ దరహాసరుచివరాధర కాంతి మాన్పున న్వడుపునఁ గెమ్మోవి వన్ను పూన్చి .. కు సం 9 209.

వన్నువ వి విధము, రీతి

ద్వి అలరుచుఁ జెందుచు వలచినవన్ను, వలఁబ్రసాదామృతవనధి నోలాడి జన పు 7 167

అ క్రి (√ వన్నువ) రంగువేయు.

వ అంతం దనుపంతాపంబు వాపనోపక పరమేశ్వరు రూపు చిత్రించి చూచిన నైన నూఱటయగునో యని సలక్షణంబుగాఁ జిత్రించి వన్నువ గొలిపి కందెఱ దెఱచిన కు. సం. 5 597

వన్నువు వి (సం. వర్ణః) వన్నె, రంగు

చ అలకలకాంతిఁ గప్పె లలితాక్షవిభూతి . . అన్నిఁటికి వన్నువు పెట్టినమాడ్కిఁ బొల్పుగాన్ కు సం 9 210

చ జలనిధులేడు నీకొలనిఁ జాలవు .. నెలవు వన్నువు నీరనివాదు సేయుపే,రులివవఁ జెల్లువం జెలఁగుచుండు మదాళివిహంగ సంగముల్ . కు సం 10 392

వన్నె[1]=వన్నియు వి. శ్వేతాదివర్ణము, తెలుపు మొ. రంగు

సీ ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెజ్జ వన్నె యొసఁగి . భార ఉద్యో. 2 114

సీ చెంద్రిక పూవన్నె జిలుగు దువ్వలువను దడి యొత్తె నొక్కకాంతాలలామ . పారి 2. 12.

వన్నె¹

మ జిలుగుంజెంద్రికవన్నెచేలలును గాశ్మీరాంగ
రాగంబులున్, మెఱయఁగా వేల్పుం
జకోరేక్షణల్, లలి భీమేశ్వరు రాజశేఖరునిఁ
గొల్వన్వచ్చి రొక్కుమ్మడిన్ భీమ 5 108

2 కాంతి, శోభ.

సీ విమలవర్తనమున వేదశాస్త్ర పురాణ వాక్యార్థ
సరణికి వన్నెవెట్టె ... విక్ర 1 44

సీ అనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు వన్నె
వెట్టుననార్తవంపుఁబువ్వు మనుచ 1 18.

3 చేకూఁదనము, ఒప్పిదము.

వ. మెఱుంగుఁ జన్నులఁ గన్నెతమ్మిమొగ్గల వన్నె
నటమటంచి మనుచ 5 101

క వన్నె మెఱయంగ నానతి,యున్న గృహంబప్పు
డరసి యుచితస్థితితో, విన్ననువునఁజని యచ్చో.
సొన్నాటంకంబువోలుసుదతిని గాంచెన్ విక్ర
8. 50

ఉ. తల్కి యోచితాహారము నెమ్మినిచ్చుచు
ననామయధన్యులఁ జేసె వన్నెగాన్. మనుచ
6. 13.

4 రంగుచీర

సీ. తవ్వంగి వలిపంబుఁదాల్చి వచ్చినరివి వన్నెగట్టిన
నాఁటి చెన్నుఁదన్ను. విజ వి 3 13.

5 బంగారముయొక్క మేలిమి, నిగ్గు

గీ తజ్జనందేరనగు కవితా విశేష, మజ్జనందేమి
యెఱుఁగంగనగు సమస్తకనక వర్ణోత్కరంబునఁ
గానవచ్చు, వన్నె లెఱుఁగంగఁ బోలునే వట్టి
రాత కు. సం. 1 32

ఉ .. నిద్దపుఁజాయ మెఱుంగువం బదార్వన్నె
పసిండితోడ నోరవచ్చు నృపాలుని యంగ
కమ్ములన్ .. నైష 6 50

చ . మేలిపదియాఱవవన్నెపసిండితోడ వేల్పుల
దొరమానికంపు రవఁ బొందుగఁ గూర్చిన చంద
మౌఁజుమీ... నీలా. 2 30

వ. ... కడవన్నె పసిఁడి గద్దియ నధివసించి.. దశా.
1 14.

6 విలాసము, శృంగారచేష్ట.

గీ. వారిచొక్కులు చెక్కులువారివగలు, వారి
వన్నెలు చిన్నెలు వారినటలు, వారి హరువులు
మురువులు వారి కళలు, వారి వరపులు సొల
పులు వళమె పొగడ. ఉ రా 6 166

సీ వన్నెలు పచరించి కన్నుసన్నలుచేసి వెడ మాట
లను ప్రేమ గడలు కొలిపి... ప్రబోధ. 1 75.

8. అలంకారము

గీ గరగరికగాఁగఁ దర్పోన్నమఁ గలుగుటయును,
ప్రేమ మీఱఁగ వన్నెలు పెట్టుటయును, కురులు
గొప్పునఁగూడెడు కొమరు వయసుఁ, దెలిపె
నానాటగన్యకాతిలకమునకు దశా 8 82

8 ప్రశస్తి, ఉత్కర్షము

సీ దీనిపాలిండ్లుబ్బఁగానె కారతచేతి కిన్నెర
మ్రోఁతకు వన్నెగలిగె... ఆము, 6 105

గీ అమ్మ భవదీయ చిత్రగుణాతిశయము, వలన
మాకెల్ల వన్నెరామెలఁగవమ్మ వసు 6 56

గీ పడగ లెత్తక పడుకులఁ బట్టి యడఁగి యున్న
ఫణిజాతి కిప్పుడు వన్నె గలిగె ఉ రా 1
150

9 ప్రసిద్ధి

సీ కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనకచుట్టరికము. మనుచ 2 73

చ యౌవన భరరూప సంపదల వన్నెకు
నెక్కుటఁ జేసి ... రాజ చ 3 54.

ఉ. . కన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పు
కొనంగ నుండి యా, వన్నెయు వాసియుం
దఱిఁగి వారు ననుం దలలెత్తి చూడఁగా .
పారి. 1 88

రగడ. తనువలగ్న మీఁదఁ దేఁటి దాఁటు దాఁటి
జెట్టువంప, వనిత యెట్లువచ్చె వన్నె వాసి
వాసినం జరింప వరాహ 3. 92

10. వర్ణన, పొగడ్త

క. సుబలతనయ గుణమహిమన్, బలి తనకు
దారధర్మపాలనలీలన్, సొబగొంది వన్నెఁ
దేఁగా, విబుధస్తుతుఁ డవ్విభుండు వెలసెన్ ధర
ణిన్. రాఘవ 1. 4.

క చ్చిన యింటికిఁ దగని, న్నిచ్చిన యింటికిని
వన్నె యేచందమునన్, దెచ్చెదవో చూచెదఁ
గా,నిచ్చలు మవవంగడంబు నిన్నుం బొగడన్,
యయా 5 131

11. విధము, రీతి.

సీ ఫణిరాజతల్పంబుపైఁ బద్మనాభుండు తిన్నఁగా
 శయనించు వన్నెఁ దెగడి హంస 5 313.

అవ్య విధము, రీతి

ఉ క్రొన్నెలతాల్పు ముద్దియను గూర్చి యొన
 ర్చిన నోము లిప్పుడే,వన్నెను బండునో నలువ
 వ్రాఁత తెఱంగిఁక నెట్టులుండునో సీలా
 1. 106

విశ. అందమైన

గీ రార నా వన్నెవడుగ రారా తనూజ హర
 2 133.

జ వన్నెకత్తె, వన్నెకాఁడు, వన్నెకారి, వన్నెకుఁ
 దెచ్చు, వన్నెకెక్కు, వన్నెకోక, వన్నెగుడ్డ,
 వన్నెచెట్టు, వన్నెపులుఁగు, వన్నెపూలు, వన్నె
 మణుంగులు, వన్నెమీఁలు, వన్నెలాఁడి, వన్నె
 లాఁడు, వన్నెవెదరు

**వన్నె[2]=వన్నియ** వి అంకవన్నె, గుఱ్ఱమునెక్కుట
 కిరుప్రక్కల నమర్చిన యినుపమెట్టు

ఉ ఉక్కడమైన మంచితనువొప్పెడు నా హయ
 రత్న మెక్కినన్, గక్కసమేమి లేక రవగాలును
 జోడన యడ్డ వేడెముల్, లుక్కుడు వాళి జంగ
 వడలుం గనిపించుచుఁబోయి పోయి రా,జక్కడ
 వన్నెసోఁక నటిపోయనినఁ గదలెన్ జరిలువన్
 సారంగ 1 82

**వన్నెకత్తె** విశ (వన్నె[1]+కత్తె) విలాసవతి

ద్వి వన్నెకత్తెలు వారవనితలు మఱియు, చప
 లముల్ తగులముల్ చంచలత్వములు,
 పండితా పురా 116 పొ 20 పం

**వన్నెకాఁడు** విశ (వన్నె[1]+కాఁడు) 1 అంద
 గాఁడు, సౌందర్యవంతుఁడు.

మ. మా,విజయుం జేరెడు వన్నెకాఁడు మది
 నావేశించు నెల్లప్పుడున్ భాగ 1 218

2. విలాసవంతుఁడు.

సీ ఏ వన్నెకాని కీలావణ్యవతిగోటిచెనకులు గళ
 లూరఁ జేయునొక్కొ. ఉ రా. 4 194.

సీ వంగడిశాఁ డిందుఁ జనుదెంచెనా యని వాకిలి
 ద్రొక్కని వన్నెకాఁడు హంస 5 217

గీ. వాని యిల్లాలికై ధనవంతుఁడనెడి, వన్నె
 కాఁడట్టి మదివట్టి వలపుఁ జెందు శుక. 2 64,

3 నేర్పరి

గీ మహతి నారాయణాత్మక మహితమంత్ర, వర్ణ
 ములు సారెఁ బల్కించు వన్నెకాఁడు రంగా
 1 69

**వన్నెకారి** విశ (వన్నె[1]+కారి) విలాసవంతుఁడు

గీ చిలుక యిట్లనునప్పు డచ్చెలువమోస,కారి పెని
 మిటియో వన్నెకారి మగఁడ, యేల చూపితి
 విప్పుడ యీ ధనంబు, ధనపిశాచమ్ము లివి
 యథార్థమ్ము సుమ్ము శుక 3 223

**వన్నెకుఁదెచ్చు** స క్రి (వన్నెకు+తెచ్చు) ప్రసిద్ధి
 కెక్కించు, ప్రఖ్యాతికలిగించు

ఉ. రంగయరాఘవమంత్రి నిచ్చలుఁ, వన్నెకుఁ
 దెచ్చు నిచ్చ నభివాంఛితవస్తు ప్రలర్థికోటికిన్ . .
 పాండు 1 54

(ఇట 'వంశమును'' అర్థావార్యము)

**వన్నెకెక్కు** అ క్రి (వన్నెకు+ఎక్కు) ప్రఖ్యాతి
 వడయు

సీ భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు వాగ్దేవి
 దానయై వన్నెకెక్కె . వరస 1 8.

**వన్నెకోక** వి (వన్నె[1]+కోక) చిత్రవర్ణము గల
 వస్త్రము, పలురంగులచీర

సీ అరుదైనతిపిరికిన్నెరతమ్మపడిగంబు వన్నెకోకల
 చందువాపిరంగి ప్రబంధ. 623

**వన్నెగుడ్డ** వి (వన్నె[1]+గుడ్డ) రంగువేసిన గుడ్డ

ఉ దట్టపువన్నెగుడ్డ కటిదట్టిపొరన్ సవరించి
 పట్టెపై, గట్టి కటారిజల్లి మడికాసుల కట్టుల
 యెుక్కవిండ్లుపె,న్నెట్టెపుగట్ట నెట్టుకొను నిద్దపు
 వీఁపుదొనల్ నటింప మై, పుట్టిన నల్ల బెబ్బులు
 లెపోయనఁ బోయిరి బోయబల్లిదుల్ రా వి.
 2. 55

**వన్నెచెట్టు** వి (√ వన్నె[1]) వర్ణపుష్పము, ఒక జాతి
 చెట్టు (వృ. వి) (శ. ర.)

**వన్నెపులుఁగు** వి. (√ వన్నె[1]) జీవంజీవము, చకో
 రము (శ. ర.)

**వన్నెపూలు** వి బ (√ వన్నె[1]) శాలి ధాన్య విశే
 షము (శ ర)

**వన్నెమణుంగులు** వి. (√ వన్నె[1]) వస్త్రవిశేషము.

వ పీతాంబరములు నీరాదులు బురుసాలు వన్నె మణుంగులు చందురుకావులు ప్రబంధ. 605

**వన్నెమీఱు** అ క్రి (వన్నె¹+మీఱు) ప్రకాశించు, ఒప్పు.

సీ. కన్నెగేదఁగి కన్నఁబొన్న చాయనెయున్న సన్నజాజులచెన్ను వన్నె శా.శె. దశా 3. 8

క మిన్నేటి పసిఁడి తామర, క్రొన్ననలను వన్నెమీఱఁగోయుదు రెపుడున్ నీలా 1. 33

**వన్నెలాఁడి** వి (వన్నెలు¹+ఆఁడి) విలాసవతి, విలాసములు కలది

ఉ వెన్నెల వన్నెలాఁడి సెలవిన్నెల కొల్పెడు నవ్వుఁ బువ్వుచాల్, క్రొన్నెల కున్నెలాగునఁ దళుక్కను నిక్కినయన్ను నెన్నొసల్ రా వి. 4 91.

సీ నీ ప్రాణనాథుఁడై నినునేలు భాగ్య మెవ్వానికిఁ గల్గెనే వన్నెలాఁడి ఉ రా. 3 109

**వన్నెలాఁడు** వి (వన్నెలు¹+వాఁడు.) అందగాఁడు.

గీ ..., మీఁగడ పెరుఁగు పాల్వెన్న జున్ను, అన్నియును గొల్లలాడు నవ్వన్నెలాఁడు .. నీలా 1 76

సీ కలికిరో యీతఁడే కులుకుఁ బ్రాయపు గొల్ల కన్నెల వలపించు వన్నెలాఁడు ..

**వన్నెవెదురు** వి (√ వన్నె¹) వృత్తపత్రము, వృక్ష విశేషము

గీ వన్నె వెదురన మను వృత్త పత్త్రి మళవ ఆం. భా 2 73.

**వన్య** నం. వి అ స్త్రీ. 1. అరణ్యా సమూహము 2. నీటివెల్లువ 3 ముద్గపర్ణి, పిల్లపెసర (వృ వి.) 4 పెద్దసోపు (వృ వి) 5 గురివెంద (వృ వి) 6. తుంగముస్త (వృ వి) 7 అడవికచోరము (వృ. వి.) 8. బుడమ (వృ వి.)

**వన్యము** నం. విశ (అ. అ అ) 1. వనసంబంధమైనది వనమందుఁ బుట్టినది 2. ఆరణ్యకము, పెంపఁబడినది 3 కట్టది

వి అ. పుం అడవి మృగము, అడవిచెట్టు

న 1 దాల్చిన చెక్క, లవంగపు పట్ట 2 అడవి కంద

**వప** నం వి అ స్త్రీ 1 అస్థిసారము, మజ్జ 2 రంధ్రము, కన్నము 3 పుట్ట, వల్మీకము 4 ఆంత్రము (ప్రేగు) పైనుండు పలుచని పొర, కడుపులో బొడ్డుక్రింద నుండెడి యుల్లిపొరవంటి పలుచనిపొర

**వపనము** నం వి అ న 1 విత్తులుచల్లుట 2 ముండనము, గొఱుగుట 3 శుక్రము, రేతస్సు

**వపని** నం వి ఈ స్త్రీ 1 మంగలికత్తి. 2 క్షౌరశాల, వపనశాల 3 నేఁత పనిముట్టు, తురి, నాడె 4 తంతుశాల, నేఁతశాల

**వపము** నం వి అ పుం 1 విత్తులుచల్లుట 2 ముండనము, గొఱుగుట 3 నేఁత,నేయుట

**వపునము** నం వి అ పుం దేవత (వాచ)

**వపుర్ధరుఁడు** నం. విశ (అ అ అ) 1 శరీరము ధరించువాఁడు, 2. సుందరుఁడు అందగాఁడు

**వపుష్మంతుఁడు** నం విశ (త్ తీ త్) 1. శరీరము గలవాఁడు, శరీరముధరించినవాఁడు, అవతరించినవాఁడు 2 సుందరుఁడు, అందగాఁడు.

వి. త్ పుం. విశ్వేదేవులలో నొకఁడు

**వపుస్సు (వు)** నం విశ (స్) సుందరము, చేక్కనిది

వి. స్ న 1 దేహము, ఒడలు.

క శ్రుతియును నిన్ను మృగేంద్రా, కృతియని కీర్తింపఁగలదు కేశవమృగసం, తతికి మృగాధిపు క్రియదే,వతలకు నెల్లను నృసింహవపు వెక్కువగుఁగా హరి. ఉ 9. 227.

2, తత్త్వము, స్వభావము 3 సుందరాకారము.

**వప్త** నం విశ (ఋ ప్త్రీ. ఋ) విత్తులు చల్లువాఁడు,

వి ఋ పుం 1 కృషీవలుఁడు, సేద్యగాఁడు 2 జనకుఁడు, తండ్రి 3 గొఱుగువాఁడు, మంగలి.

**వప్పు** 1 గంటు, గాయము.

ద్వి కలయంగఁబులి నీళ్ళు గ్రమ్ముచునున్న, వలుద చన్నుల మీఁది వప్పులు చూసి ... వన 2 91. పా 22 పం

2. శకలము, తునక,

వ దుప్పులు కుప్పించి తత్కోటర కుటీరంబుల నున్న పన్నగంబులఁ గొమ్ములం గ్రుమ్మి వెడల నుమియ రెఱయుతత్ఫణామణిగణంబు గ్రొవ్వాడి వప్పుల గొప్ప కుప్పలంబఱచు నెడల మెత్తగాలువడి ... (ఇది యాఖేట వర్ణనము) . చంద్రా 2 84

**వప్రకము** సం వి. అ పుం చక్రము ప్రాకారము (చుట్టుకొలత)

**వప్రక్రియ** సం — వప్రక్రీడ

**వప్రక్రీడ** సం వి ఆ స్త్రీ, గజవృషభాదులు ఏటి యొడ్డు మున్నగువానిని ఉత్సాహమునఁ గొమ్ములతోఁ గ్రుమ్మి యెగఁజిమ్ముట

**వప్రము** సం వి అ పుం న 1 అగడ్తలో నుండి యెత్తి ప్రాకారమునకు చుట్టును బలకరముగా పోయు మట్టిదిబ్బ 2 గజవృషభములు కొమ్ములతోఁ బొడిచెడు మట్టిదిబ్బ 3 పర్వతమునం దేటవాలుగా నుండెడి స్థలము 4 పర్వతశిఖరము, కొండకొన 5 నదీతీరము, తీరము 6 ఇంటి పునాది 7 కోట మొదలగు వానిచే సంరక్షింపబడు పట్టణము యొక్క ద్వారము 8 కందకము 9 గోళము యొక్క చుట్టుకొలత 10 విత్తులు చల్లిన పొలము, పొలము 11 గజవృషభాదులు తటము మున్నగువానిని గ్రుమ్మట, 12 రేణువు, దుమ్ము

న సీసము

**వప్రాభిఘాతము** సం వి అ పుం నదీతీరమునుగాని, పర్వత ప్రదేశమును గాని, క్రుమ్మట, తటాఘాతము

**వప్రి** సం వి ఇ. పుం 1 పొలము, క్షేత్రము 2 సముద్రము 3 దుర్గతి, దుస్థితి, కష్టదశ

ఈ స్త్రీ — మంటిదిబ్బ

**వప్రుఁడు** సం వి అ పుం 1 జనకుఁడు, తండ్రి 2 ఒక ప్రజాపతి

**వమథువు** సం. వి. ఉ పుం 1 క్రక్కుట, ఉమ్మివేయుట 2 ఏనుఁగు తొండమునుండి పైకిఁ జిమ్మబడిన నీరు

**వమనము** సం వి అ న 1 బయటికి పంపుట 2 క్రక్కుట 3. తినికొనుట 4 మర్దించుట 5 వమనము చేయించుమందు 6 బలి యిచ్చుట 7 నొప్పి, బాధ.

పుం గంజాయి చెట్టు (వృ వి)

**వమని** సం వి ఈ స్త్రీ జలగ, జలూక

**వమనీయ** సం వి ఆ స్త్రీ ఈఁగ

**వమనీయము** సం విశ (అ ఆ అ) 1 క్రక్కఁదగినది 2 వెళ్లఁగొట్టఁదగినది

**వమి** సం వి ఇ పుం 1 అగిత 2 ఉమ్మెత (వృ వి) 3 దుష్టుఁడు.

స్త్రీ 1 వమనము, వమనేచ్ఛ 2 వమనములు చేయించుమందు.

ఈ స్త్రీ డోకు, వమనము, వమనేచ్ఛ

**వమ్ము** విశ 1 వ్యర్థము

గీ అధిప సర్వాస్త్ర ఘాతియై యతిశయిల్లు, నస్త్రమునఁ జిత్రముగఁ దెగయందతునిమె, వమ్మ హోస్త్రంబు నట్లది వమ్ముగాఁగ, నెఱిఁగి వెఱఁగంది హరికతఁ డిట్టులనియె భార ద్రోణ 3 205

సీ. రహినివహ పర సుఖప్రదుఁ బుత్రు నెత్తని వర పుణ్యహీను భవమ్ము వమ్ము... రాఘవ. 1 43.

ఉ ఆ సమయంబునన్ జకితమై మెక మెవ్వని మీఁదఁ బాఱె వాఁ, డేసిన యమ్ము వమ్మయి మహింబడకొక్కటి కొండ చాలి వీ, తాసులఁజేయ ... మనుచ 4 49

2 నష్టము, చెడినది

ఉ మానవకోటి నిట్టవినుమానవుఁ భీమఁగులైన వారి నెం, దైనను గంటిమే యకట యాఱడి వమ్మయి పోయె దుర్జయం, బైనబలంబు ... భార విరా 3 7

చ అనఘ కుడుచుఁ గట్టుదొడుం దనయిచ్చ నొక్కుఁడున్, దనయ నతిస్నుపాదులకుఁ దానిడఁ దెన్నడుఁ గూడుచీరయే, జనులకుఁ బెట్టఁడన్నరుని సంపద యాతని తోనవమ్ము గుణ మాం్క 5 119

ఉ . తునిసి వమ్మగు ఛత్రము లాడునట్టులున్, దూలెడి రూపులున్ దొరఁగుతోరపు నెత్తురు చేటులందుఁ బైఁ, దేలెడు పీనుఁగుల్ గలిగె ధీరతఁ బోరెడు రెండు సేనలన్ ఉ రా. 3 12

వి. 1. నాశము.

క ఇమ్మైఁ, బలుకఁ దగునె యక్కృట నా, వలనం గల శక్తియెల్ల వమ్మునఁ గలయఁగా శార. భీష్మ 3 175

ఉ ఇమ్మెయి వర్ధమెల్లను వ్యయింపఁ బురింగల వైశ్యులందఱున్, నెమ్మిఁ బురందరుంగదిసి నీవు వణిక్కుల వర్తనంబు సర్వమ్మును వమ్మునం గలిపి . విక్ర 2 166

2 వైయర్థ్యము

ఉ వమ్మొకయింత లేక నిడువాలిక బాగుమ సోగ లాగుమన్, గమ్మ నవీనకాంతి గతిఁ గ్రమ్మఁగఁ జేసి దివానిశంబులున్, నెమ్మి లతాంతసాయకుఁడు నిక్కముగా నవరించు వింటికిన్, బొమ్మలఁ బెట్టునట్టి కనుబొమ్మలు చూడఁగ బొల్పె బాపురే చిత్ర భా 3. 67

జ. వమ్మపఱుచు, వమ్మవోవు, వమ్ముసేఁత, వమ్ముసేయు

**వమ్మపఱుచు** న క్రి. (వమ్ము+పఱుచు)

సీ. . గీ. మమ్మువనందలఁ బోరిలో వమ్ముపఱిచి, దుష్ట రావణుఁ బ్రాణంబు తోడడించి, పావ మండైన తమ్ముఁడు నీవుఁగూడి, పోయి తటవయ్య రాజువ మాయఁదగిలి. మై 2 48

**వమ్మవోవు** అ క్రి (వమ్ము+పోవు)

1 నష్టమగు, చెడు

సీ మాతండ్రి కొలువులో మానినీ తిలకంబ రమ్మను నాపేరు వమ్మవోయె ఉ హరి 5 72

2. వ్యర్థమగు (శ ర)

**వమ్మసేఁత** వి (√ వమ్ముసేయు) వ్యర్థపుచ్చుట.

గీ. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, వ్రల్లదంబును దండంబు పరుసదనము సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్మసేఁత, యనెడు సప్తవ్యసనములఁ జేనదు తగుల భాం. ఉద్యో 2. 44.

**వమ్మసేయు** న క్రి (వమ్ము+చేయు) వ్యర్థము చేయు. చూ. వమ్ముసేఁత.

**వమ్రకూటము** నం. = వమ్రీకూటము

**వమ్రము** నం. వి అ. పుం = వమ్రి

**వమ్రి** నం. వి. ఇ. స్త్రీ. చెదలు

**వమ్రీకూటము** నం. వి అ. పుం. వల్మీకము, పుట్ట

**వయఃపరిణతి** నం వి ఇ స్త్రీ వయస్సు ముదురుట, పెద్దవయస్సు

**వయఃప్రమాణము** నం వి అ న 1. జీవిత పరిమితి 2. జీవితకాలము, బ్రదికెడుకాలము

**వయనము** నం. వి అ న వేయుట

**వయస్కరము** నం విశ (అ ఈ అ) బలారోగ్యములను గలిగించునది ఆయుస్సును వృద్ధిచేయునది

**వయస్థ** నం వి ఆ స్త్రీ 1 వయస్య, చెలికత్తె, సఖి 2 కరకచెట్టు 3 చిన్న యేలకికాయ

**వయస్థుఁడు** నం విశ (అ ఆ అ) 1. యువప్రాయమువాడు, పడుచువాఁడు (పదియాఱేండ్లు మొదలు ముప్పది యేండ్లవఱకునుగల వయసు గలవాఁడు) 2 ఈడువచ్చినవాఁడు, బాల్య మతిక్రమించిన వాఁడు 3 సహజమైన దేహదార్ఢ్యము గలవాఁడు

వి అ పుం స్నేహితుఁడు, చెలికాఁడు.

**వయస్య** నం వి అ స్త్రీ స్నేహితురాలు, చెలికత్తె

**వయస్యుఁడు** నం విశ (అ ఆ అ) 1 సమాన వయస్సు గలవాఁడు 2 సమకాలికుఁడు

వి అ పుం మిత్రుఁడు, నెయ్యుఁడు

**వయస్సంధి** నం వి ఇ పుం 1 జీవితమున బాల్యాది దశలలో నొకదానినుండి మఱొకదానికి మాఱెడి కాలము 2 బాల్యము వదలి యౌవనము వచ్చు కాలము, యౌవనారంభము.

**వయస్సు(సు)** నం వి స్ న 1. ఈడు (బాల్యాదికము) 2 యౌవనము, పడుచుఁదనము. 3. పక్షి పిట్ట. (ఈ యర్థమునఁ దెమఁగున వ్యస్త ప్రయోగము కానరాదు) 4 (సహజమైన) దేహదార్ఢ్యము 5 ఆరోగ్యము

**వయారము** వి ఒయ్యారము

క. మెలఁగున్ దలఁగున్ భయమునఁ, గలఁగు మలఁగున్ లతాంగి కపటారభటిన్, జెలఁగు వలగొను నెవరున, వలఁగున్ దొలఁగున్ నగు వయారము మీఱన్. కృ శకుం 2 136

**వయాళి** వి. (నం. వాహ్యాళి) విహారము, అనివాఱు

చ .. మహీతలేశ్వరుఁడు రథస్థుఁడై కుసుమాలి వనాళివయాళి వెల్వడెన్ కృ. శకు 1 59.

ఉ. , గిబ్బవయాళి తేజి దుమికించుచు వచ్చె మహేశుఁ డత్తఱిన్ దశా 2 69

సీ మొసలి తేజి వయాళి మురిపంపు జగరౌతు సామిగా వోఁచు నాళకునుషేణు చంపూరా 6 73

**వయిచే**= వైచే న క్రి 1 త్రోయు

శా ఆరూఢోన్నత వప్రవార్మృతతితో నవ్వీడు దుర్వారగ, ర్వారథంబున గంగలో వయిచువాఁడై . హరి ఉ 4 10

2 విసరివైచు

చ మఱదల రావె యంచు నొక మానిని యొక్కతెఁ జీరవచ్చున, త్తఱి విరిచెండ్లు చమ్మఁగన దాఁక వడిన్ వయిచుం దటాలునన్... కవిరా 4 75.

ద్వి. వయిచుఁ డాయయగారి వాకిట శవము, దయసేయ కదియెట్లు తప్పింపవచ్చు పండితా పురా 149 పు. 12 పం

**వయినము**—వైనము (సం వ్యాఖ్యానం )

వి 1 వివరణము

క దేవర సృజియించితిరే, యీ విశ్వము దీనిఁ ద్రోవ నింద్రుని యణఁపన్, గావ బ్రదంతు నది సరి, యీవయినము దెలియలేక యమరులు గడకున్ మల్లుపు 2 57.

మ వయినం బింతయె బాలనె మ్మెయిని దావం బొంద సౌమ్మచ్చపుం, బయిఁడౌటన్నసితం బుగా వయనసేవం జేయమామ న్నిజ, ఉయ మంచున్ విరహాగ్ని మీఱ శశి జ్యోత్స్నల్ నించె నల్దిక్కులన్. పార్వ. 5 16

2 క్రమము

ద్వి దయ మవదేశించి తగ సృష్టిసేయు, వయినంబు బోధించి, వాక్సిద్ధి నొసగి . విష్ణు పు 3 (శ ర)

**వయునము** సం వి. అ. న 1 జ్ఞానము, తెలివి, గ్రహణ శక్తి. 2 గుడి, దేవాలయము. 3. శాసనము, ఆజ్ఞ, 4 ఆచారము, సంప్రదాయము, 5 పరిశుభ్రత, శుచిత్వము

**వయోగతము** సం విశ. (అ ఆ అ ) 1. వయస్సును పొందినది, వయసునకు సంబంధించినది. 2. సంవత్సరములో ముందైనది, వయసులో ముందైనది వి. అ. న పడుచుఁదనము పోవుట

**వయోతిగుఁడు** సం విశ (అ ఆ అ.) 1. వయసుచే నతిక్రమించినవాఁడు, వయస్సునఁ బెద్దవాఁడు 2. వయస్సు దాఁటినవాఁడు, వృద్ధుఁడు ఇట్లే వయోతీతుఁడు

**వయోధికుఁడు** సం విశ (అ అ అ ) వయసుచే బెద్దవాఁడు

వి అ పుం వృద్ధుఁడు, ముసలివాఁడు

**వయోరంగము** సం అ న సీసము

**వయోవృద్ధుడు** సం విశ (అ ఆ అ ) వయసుచేఁ బెద్దవాఁడు

**వయోహాని** సం వి ఇ. స్త్రీ ప్రాయము కడచుట 2 యౌవనోత్సాహము పోవుట

**వయ్యంది** వి కుంపటి, అంగారధానిక (శ ర )

**వయ్యము**—వాయము విశ. వ్యర్థము

క ఎయ్యది కర్తవ్యమొకో, యియ్యెడ నాలోచన మున కెవ్వఁడొకో తో, డయ్యెఁడు వాఁ డీ కార్యము, వయ్యము గాకుండఁ జేయవలయు వెరవుతోన్ భోజరా 4 272

ఉ తియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చినయమ్ముల శౌర్యసంపదల్, వయ్యముగాఁగ భూమిఁ బడవైచె నిలింపులు చూచి బెగ్గిలన్ హర 3 66

**వయ్యారము** వి. ఒయ్యారము, విలాసము.

గీ ఎండచేఁ గంది దండనాథుండుదాను, వందనము నకు వెడలి యానందలీల, వచ్చి వనిఁజొచ్చి చల్లని వసతులందు, బడలికలఁదేలి వయ్యారమడర నపుడు ప్రబంధ 282

**వయ్యాళి** వి (సం వాహ్యాళిః ) స్వారి, విహారము.

ఉ మాళవదేశవల్లభుఁ డమానుషతేజుఁడు లీలతోడ వయ్యాళికి వచ్చునట్లు మగధాధిపుపై వెసనెత్తి వచ్చినన్ .... దశకు 7 9

ఆ వినుము ధర్మరాజు మనములో దాచక, తెలియఁ జెప్పవలయుఁ దేటపడఁగ, వాజిచచ్చుదాఁక వయ్యాళి గలుగునే, మొదపి వీరి కింక ముక్తి యెపుడు .. సానందో. 4 117

ద్వి మేలిమితురగంబు మీఁదట నెక్కి, లీల వయ్యాళిఁ దోలిన బడలికయొ ద్వి పరమ. 2 124 పు. 9 పం.

క ... గయ్యాళి చిలుకతేజీ, వయ్యాళి పిసాళి యాలి వలెనున్నంతన్ . సారంగ 1 136.

**వర** వి 1 సస్యవిశేషము
ద్వి కట్టెండకావర కావరంబడఁగె విష్ణు పూ 3 (శ ర.)

**వర** నం వి ఆ స్త్రీ 1 త్రిఫలవృక్షములు కరక తాడి, ఉసిరికచెట్లు 2 పరిమళ ద్రవ్యవిశేషము 3 పసుపు

**వరండ** నం. వి. ఆ స్త్రీ 1 బాకు, కటారి, కత్తి. 2 దీపపువత్తి 3 గోరువంక.

**వరండకము** నం విజ (అ ఆ అ) 1 పెద్దది, విశాల మైనది, విరివియైనది 2 భయపడినది. 3 దుఃఖ కరమైనది 4 చెడ్డది, దుష్టమైనది 5 వర్తులము, గుండ్రనిది
వి అ పుం 1. మంటిదిబ్బ 2 ఏనుగుపై యంబారి 3. గోడ 4. మొగము మీఁది పొక్కు.

**వరంతకము** నం వి అ పుం 1 సమూహము, గుంపు 2 మొగము మీఁది మొటిమ, పొక్కు. 3 . వసారా, ఇంటిపంచాది 4 గడ్డి మేటి. 5 గాలము త్రాడు 6. వస్తువుల కట్ట. 7 అతర వేది, ఏనుఁగుల పోరాటము నందేర్పరచిన నడిమి దిబ్బ. (వాచ)

**వరండాలువు** నం. వి ఉ. పుం ఆముదపుఁ జెట్టు

**వరఁకు**=**వరను**

**వరఁగలించే** న క్రి ప్రకాశించు, వరలు. (శ.ర.)

**వరఁత** వి. త్రంత, పేటు (శ ర)

**వరకము** వి. కఠినముగా పనిచేయించు శిక్ష. (శ. ర, వా.)

**వరకము** నం వి అ పుం 1 కోరిక. ప్రార్థన 2. (దేవుఁడిచ్చు) వరము. 3 ఉత్తరీయము, పైబట్ట 4. వనముద్గము, అడవి పెసరు
న. పడవ పై కప్పుగా నుపయోగించు వస్త్ర విశేషము, 2 తుండుగుడ్డ.

**వరకు** వి 1 బంగారులోనగు వాని రేకు (శ ర) 2 (శ. వరకు) మొలాము. (శ ర)

**వరకుఁడు** నం. వి అ పుం కన్యార్థి, తన్నుఁ బెండ్లాడుమని కన్నెను గోరువాఁడు.

**వరగ** వి. 1. పెద్దారుగు పైరు.
ద్వి వెలువడం బుడివోయె వెరఁగయ్యె వరగ విష్ణు పూ 3 (శ ర) 2 బ ఆ ధాన్యము. (శ ర.)

**వరగోఁగు** మి. వి వృక్ష విశేషము, ఒక జాతిగోఁగు (వృ వి)
సీ కాకి తూకందుగు కానుగ వరగోఁగు గోఁగు బొట్టుగు చిక్కిగోగుకొండ, గోగు హంస 4 11

**వరచందనము** నం వి అ న 1 ఒక జాతి సుగంధ వృక్షము, ద్రామి పసుపుచెట్టు 2 దేవదారు వృక్షము. (వృ వి)

**వరట** వి పేఁడ యెండిన చెక్క (శ ర, బ్రౌ)

**వరటము** నం వి అ పుం. 1 హంస 2. ఒక దినుసు ధాన్యము, కుసుమ ధాన్యము 3 ఒక జాతి కందు రీఁగ
న కుంద పుష్పము, మొల్లపువ్వు

**వరటలు** వి బ తికమకలు, చిక్కులు.
ద్వి పసిఁడి, వాపులు దుష్టులు వరటలు గుత్తి, రూపులు బరులువిరోధులు మృత్యు, కన్నెలు వంగుల గద్దరుల్ రిత్త, వన్నెకత్తెలు వారవని తలు పండితా పురా 116

**వరణ** నం. వి. ఆ. స్త్రీ కాశీపట్టణమున కుత్తరపు దిక్కున గంగానదిలోఁ గలియు నొకానొకనది

**వరణమాల** నం వి ఆ స్త్రీ పెండ్లి కూఁతురు పెండ్లి కుమారుని మెడలో వేయు పూలదండ ఇట్లే వరణ మాలిక
ద్వి వర పశ్చిమాంగన వరుణుపై వైచు, వరణ మాలిక పోలె వజ్రి ధర్మంబు అ. మ. క. 2 70 పా 8 పం

**వరణము** నం వి అ న 1 ఎన్నుకొనుట, ఎంచుట 2 యాచించుట, ప్రార్థించుట, వేఁడుకోలు 3 చుట్టువాఱుకొనుట, పరివేష్టించుట 4. కప్పుట, మూయుట. 5 కన్యను వరించుట 6 (బుత్విగాదు లను) పూజించుట. 7. నివారించుట, నిషేధించుట
పుం 1 ప్రాకారము, ప్రహరి, చుట్టుగోడ. 2 వంతెన 3 వరుణ వృక్షము. 4 వృక్షము, చెట్టు 5 ఒంటె 6. ధనుస్సుపై నుండెడి యలంకార విశేషము.

వరతనువు నం విణ ఉ ప్రశస్తమైన (చక్కని) దేహముగలవాఁడు.

వి ఉ. స్త్రీ. సౌందర్యవతియగు స్త్రీ, అందకత్తె

వరత్ర నం వి అ స్త్రీ 1 వాఱు, పట్టె 2 గుఱ్ఱమునకుఁ గాని యేనుఁగునకుఁ గాని నడుము క్రింది నుండి కట్టెడి జీను, అంబారి కట్టెడి వాఱు, టంగువాఱు

వరత్వచము నం వి అ పుం నింబవృక్షము, వేఁప చెట్టు (వృ వి)

వరద నం వి ఆ. స్త్రీ 1 నదీవిశేషము, ఒకానొక నది. 2 కన్యక 3. పెన్నేరు 4. దుర్గ

వరదక్షిణ నం వి ఆ స్త్రీ కన్యాదాత వరునకిచ్చెడు ధనము

వరదాచతుర్థి నం వి ఈ స్త్రీ మాఘ శుద్ధ చతుర్థి

వరదుఁడు నం విణ (అ ఆ అ) 1 వరము నిచ్చువాఁడు 2 ప్రసన్నుఁడు, అనుగ్రహము గలవాఁడు

వి అ పుం 1 ఉపకారి 2 శాంతి హోమములు చేసెడి యగ్ని

వరద్రుమము నం. వి అ పుం అగరు గంధపు చెట్టు. (వృ వి)

వరను=వరకు వి ఔ (బ. వరఁకులు దీని నువర్ణమునకు ఏక వచనమునందు నిత్యముగాను బిందుపూర్వక 'కు' వర్ణ మాదేశముగా వచ్చును) చిక్కు.

చ స్థిరమతి ఋష్యశృంగు వరఁకుల బెట్టి తెచ్చెదరు, వారవిలాసిను లెన్నిభంగులన్ భా రా. బాల 63

వరప్రద నం వి ఆ స్త్రీ లోపాముద్ర

వరప్రస్థానము నం వి అ న వరుఁడు కన్యాదాత యింటికి తరలివెళ్లుట, పెండ్లికిఁ దరలి వెళ్లుట

వరఫలము నం వి అ పుం నారికేళము, కొబ్బరి చెట్టు (వృ వి)

న శ్రేష్ఠమైన ఫలము

వరబడి వి కఱవు, క్షామము (శ ర)

వరము నం విణ (అ ఆ అ) 1 శ్రేష్ఠమైనది, ఉత్తమమైనది.

2 ఒక దానికంటె మంచిది, ఒక దానికంటె మేలైనది.

వి. అ పుం 1 ఎన్నుకొనుట 2 ఎన్నిక 3. దేవాదులవలనఁ బొందఁబడిన కోరిక 4 బహుమానము, కానుక, పారితోషికము 5 ఇచ్ఛ, కోరిక 6 ప్రార్థన, వేఁడికోలు 7 బిచ్చము, ఈవి, దానము. 8. చుట్టువాఱుట, పరివేష్టించుట. 9 ఆటంకపఱుచుట. 10. అరణము 11 ఊరఁబిచ్చుక

న 1 కుంకుమపువ్వు 2 అల్లము 3. కురువేరు

వరయాత్ర బం వి. ఆ స్త్రీ వరప్రస్థానము

వరయిత నం వి ఋ పుం తన్నుఁ బెండ్లాడు మని కన్నెను ప్రార్థించువాఁడు

వరరుచి నం. వి. ఇ పుం 1 పాణిని సూత్రాలపై వార్తికములు వ్రాసిన కాత్యాయనుఁ డనెడి యొక ముని 2. విక్రమార్కుని సభలోని నవరత్నములలో నొకడగు పండితకవి.

వరల నం వి ఆ స్త్రీ ఆఁడుహంస 2 ఒకజాతికందిరీఁగ.

వరలబ్ధము నం విణ (అ. ఆ అ) 1 పొందఁబడిన వరముగలది, వరమును బొందినది 2. వరమువలెఁ బొందఁబడినది

వి. అ పుం చంపక వృక్షము

వరలము నం వి అ పుం. ఒక జాతి కందురీఁగ

వరవ వి నీళ్లు వచ్చుట కేర్పఱచిన కాలువ.

వ. జాహ్నవీ సమావ్వయంబు మెఱయఁదరిగి సాగరుల బయింబఱవ నయ్యేటి వరవ నమ్మేటి యఱువదివేవురు వరేంద్రనందనులు సంక్రందనపురంబుఁ జెందిరి చం రా 7 25

సీ నవ రసంబులకు దానవుదానజాలంబు పరసులకునునైన వరవగాఁగ. . బహు 1 59.

వరవత్సల నం వి ఆ. స్త్రీ. అత్త భార్య తల్లి

వరవర్ణము నం వి అ న బంగారము

వరవర్ణిని నం వి ఈ స్త్రీ 1 శ్రేష్ఠమైన శరీరకాంతి గల స్త్రీ 2 పతివ్రతయగు స్త్రీ (మే ని) 3 స్త్రీ 4 పసుపు 5 లక్క 6 లక్ష్మి 7 దుర్గ 8. సరస్వతి 9 గోరోజనము 10 ప్రియంగులత 11. పీతవర్ణము పచ్చవి రంగు

వరవాళులు వి. ప్రవాహములు

తరువోజ . బలువిడిగొని జాలు బాదోపదకముల, బాలకన్నవ వేఁడి వరవాలు లొప్పు. . శు సం. 5. 588

**పరవు**=పరవుడు వి. (సం. భరటః) సేవకుఁడు, దాసుఁడు, సేవకురాలు, దాసి

గీ. కడిమి మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు, రథముఁ గముగొని కడఁగి విరాట విభుఁడు, పరవునకు నల్గినట్టుల సరకు గొనక, యతుల రథ సాతిరేకత వతనిఁ దాకె భార విరా 3 185

గీ ఒనరఁ బాథేయములు మోవనోపు వట్టి, పరవు నొక యూర విలిచి మువ్వురును గూడి దశకు 10 128

ద్వి సురభిచింతామణి సురభూరుహములు, పర వులై యుండంగ పరమీగియంత . బస. పు 2 375

ద్వి. రాజులు వాటించు రాణి వాసముల, నోజతో నూడిగంబొనరింపఁ దమకు, పరవులఁగాఁజేసి పరున వర్ణింపఁ, బురిలోనఁ బలుకాసి పురుపుల తరమె ద్వి. హరిశ్చ ఉ 462

**పరవుదానికి**— సేవకురాలికి, దాసికి

చ ఈ పడుచు దక్కకపోయిన గన్న మాకు,ను స్త్రరుపు గదమ్మ నీపరవుదానికి నిట్టియవస్థ వచ్చుట,చ్చెరువు గదమ్మమమ్మ దరిఁ జేరువు మమ్మ త్రిలోకమాతృకా... వేం పంచ. 1. 123

జ . పరవుంబడు, పరవుఁదనము

**పరవుంబడు** అ క్రి (పరవు+పడు. వృత్తిని వర్ణాగమము.) ప్రాణాచారముపడు, అనశన వ్రతము పూను.

వ .. అడుగులొత్తు నింతివరకు పరవుంబడియున్న రాహులవనన్ ... ఆము, 6 98

**పరముపడు**— పరవుపడు పరవు—దాసుఁడు అ క్రి. ప్రాణాచారము పడు (శ ర) 'పరముం బడియున్న' వే వ్యా పా ఆము. 6 98.

**పరముపడు**=ప్రాణాచారముపడు గుం. మం. వ్యా.

ఇందిరకుం బరము పడియున్న (వ్రాఁత ప్రతి.)
పరముం బడియున్న (ముద్రి.)
పరము బండియున్న (ముద్రి వ్యాఖ్య.)
దండము పెట్టుచున్న (వ్రాఁతప్రతి వ్యాఖ్య.)
ప్రాణాచారము పడియున్న (ముద్రి వ్యాఖ్య)

**పరముపడు**— అనశన వ్రతమాచరించు. (అని బ్రౌన్)

**పరవుఁదనము** వి (√ పరవు) 1 సేవకత్వము, దాస్యము

చ అనిలుఁడు నర్కుఁడున్ శశియు నైనను గానరు మున్ను దన్నన, త్యనుపమ రాజ్య భోగమహిమాతిశయంబున నట్టికాంత నే, దిన కుల రత్నమై వెలుఁగు నిట్టి సుతుండును దాను సాకతంబున పరవుందనంబునకుఁ బోయెనె యేగతిఁ బోదు దైవమా మార్క 1 219

**పరవుడము** వి (√ పరవుడు) దాస్యము

చ .. నీ చెలియల్ చరించుని,వ్వరవుడపుం జరి త్రమున వచ్చునె నీకొక పేర్మి భార అను 1 209

చ పరవుడమోసి చేయుదునో వారికి మాధవ నిశ్చయింపుమా . భార ఉద్యో 3 112

గీ పరవుడంబనఁ బనుపన బానిస మన, దాస్య నామంబులై యుండు... ఆం. భా. 2 288,

**పరవుడు**=పరవు వి (సం భరటః) 1 దాసుఁడు, సేవకుఁడు, దాసి, సేవకురాలు

చ పరమున కేమఁ దాసుఁడని పల్కఁగఁ బ్రాపుఁ డఁగాను మత్సుతన్, హరువకు నిత్తు నా వెఱవ నయ్యె సపుత్ర కళత్రమేను మీ పరవుడ మిమ్ముఁ గొల్వ గలవాఁడ కు నం. 7 970

బ పరవుడులు, పరవుళ్లు

చ అరుదగు నీ తపమ్మునకు నమ్మెదువోయితి నేలు కొమ్మునీ, పరవుడనంచు భూలి ప్రియ వాక్యము లందగ గారవింపఁగా ... హర. 4. 36.

క పరవుళ్లగలసి తనయులు. పరువడిఁ దుడువంగఁ గృష్ణఁబనుచు వగన్ భాసురరాజ్య దర్ప మొప్ప వి,దురుఁజెచ్చరఁ బంచెదానిఁ దోడ్కొని తేరన్ . భార. సభా 200

గీ పరవుడుల నూర్వురను మేలివాజు లిరువ, దింటి నూళులుపదునాల్గు నిత్తునీకు . భార కర్ణ. 3 149.

సీ. వాఁటి తప్పునకు నీనవలోండ్లతో నాకు పరవులై యున్న దీవాలుగంటి .... యయా. 4. 56.

ఆ. ఇచ్చెదేని చయ్యవవెలచెప్పు, వరపుడెట్లు, మాకు వలయునని ... మార్క 1. 213

2. దాస్యము.

ద్వి. భక్తుఁడై లింగంబు ప్రకృతిఁ జేకొన్న వ్యక్తిగా బసవన్న వరవుడు సేయు బస. పు 1. 110.

జ వరవుడము, వరవుడుపని

**వరపుడుపని** వి (వరవుడు+పని) దాసీ కృత్యము దాస్యము

సీ జాములఁబడి సంజె జాముపోయినదాఁక వర వుడు వనులు సర్వంబుఁ దీర్చి హరిశ్చ. 6. 55

**వరసంది** వి ఒక జాతిగట్టు

సీ వరసంది చేరువ కట్టకత్తువ కరగనిమయనఁగ, సేతువిశేషంబు చెలఁగును అం భా 2 8

**వరసము** వి అశ్వశిక్షాభేదము

సీ వరసంబు నొందించి వల్లంబు కల్పించి నిగు డంబు సమకొల్పి నెఱపు నెఱపి పి శకుం 1 112

**వరసురతుడు** సం విశ (అ ఆ అ) 1 మిగులఁ గామము గలవాఁడు 2 రతిరహస్యము లెఱిఁగిన వాఁడు

**వరహా**=**వరా** (సం వరాహః) వరాహ ముద్రగల యొక బంగారు నాణెము

ఉ వ ట్టంచుల పచ్చడాలు వరహాలు నరాలు గుఱ్ఱాలు పల్లకీల్ యయా 1 28

వరహా—దీనికి ద్వితీయయందు ని ఆగమము.

గీ కాటికేనికి మీఁదుగాఁ గట్టియున్న, గట్టివర హాని వరహానిగాఁగఁజూడ, కాడఁ బోఁగూడ కొక్కమాటాడకుండ, గుండనికి రంగుబంగారు గోరు సేసె శుక 3 50.

**వరా**=**వరహా** వి వరాహ ముద్రగల ఒక బంగారు నాణెము

చ . వార వనితామణి పిల్చిన నీటు వెట్టుచుం, బలుకదు తొంటి పైఁడి తన పాతిక మాటకు మాటలాడ ర్యూ,కలు పదియైదు నిద్దురకు గట్టి వరాయను నట్టి దండునన్ రా వి 2 72

మ పొరుగూళ్లం దిరునాళ్లు సాగిన భరంపు స్నానిసి స్నోంటు నిష్ఠుర వృత్తిన్ననుఁ జూపి సుంకముల టంచున్ గూలియంచున్వరాలు రయం బారఁగ మోచి శుక 3 404

**వరాంగ(క)ము** సం విశ (అ (ఆ) ఈ అ) శ్రేష్ఠమైన యవయవములు గలది

వి అ పుం ఏనుఁగు

న 1 తల 2 శ్రేష్ఠమైన భాగము 3 సుందరాకారము 4 స్త్రీ గుహ్యము, యోని 5 లవంగపు పట్ట దాల్చిన చెక్క

పుం యేనుఁగు (శ. ర)

**వరాంగుఁడు** సం వి అ పుం 1 విష్ణువు. 2 మన్మథుఁడు.

**వరాకము** సం వి ఆ న యుద్ధము, పోరు.

**వరాకుఁడు** సం విశ (అ ఈ అ) 1 దరిద్రుఁడు, 2 దీనుఁడు, దురదృష్ట వంతుఁడు 3 నీచుఁడు, అల్పుఁడు 4 అపవిత్రుఁడు, అపరిశుద్ధుఁడు

వి అ పుం శివుఁడు

**వరాటకరజస్సు** సం వి స్. పుం. నాగ కేసరము (వృ వి)

**వరాట(క)ము** సం వి. అ పుం 1. గవ్వ 2. తామర పువ్వులోని దుద్దు. 3 రజ్జువు, త్రాడు

**వరాటిక** సం వి ఆ స్త్రీ గవ్వ.

**వరాణసి**=**వారాణసి** సం వి. ఈ స్త్రీ

**వరానన** సం వి ఆ స్త్రీ మనోజ్ఞమైన ముఖముగల స్త్రీ, స్త్రీ,

**వరారకము** సం వి అ న వజ్రము, నవరత్నము లలో వొకటి (విల్యమ్సు)

**వరారోహ** సం వి ఆ స్త్రీ ప్రశస్తమైన జఘనము గల స్త్రీ, సుందరి, అందకత్తె.

**వరారోహము** సం వి. అ పుం బాగుగా స్వారి చేయుట

**వరారోహుఁడు** సం విశ (అ ఆ అ) 1. అందమైన తుంట్లు గలవాఁడు 2 బాగుగా స్వారి చేయు వాఁడు

**వరార్హము** సం విశ (అ. ఆ అ) 1 వరమునకుఁ దగినది. 2 చాలఁ బ్రశస్తమైనది 3. చాల విలువ గలది

**వరాల(క)ము** సం వి వి. అ పుం. లవంగము

**వరాళి** వి. రాగవిశేషము, ఒకానొక రాగము

ఉ తుంబురుండు హా, గౌళవరాళి నాటలను గాయవరూధికి నాటి చూపినన్ ... శ్రీరం మా 4 153

ఉ. భైరవినాటతోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా, గౌరిబిళావులిరి లలిత కన్నడ గౌళముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధనాసరి ఘూర్జరి పూరిబేగడా, యారభిరామఖిల్లి మొదలై తగు రాగము లింపు మీఱఁగాన్ . చెన్నబ 2. 238.

సీ .. నలలి, త్రిబలహరి కురంజి ధన్యాసి పూర్వ గౌళవరాళినాట భల్లాతకి . హంస 5 123

2 శోకము, ఏడుపు.

క అడుగక మెల్లిగ వరాళి కారంభించెన్ పార్వ 3. 74

వరాశి (సి) నం వి ఇ పుం ముదుగుబట్ట

వరాసనము నం వి అ న 1 శ్రేష్ఠమైన పీఠము, కుర్చీ మొ సింహాసనము 2 ముఖ్యాసనము, గౌర వాసనము 3 జపాపుష్పము

వరాననుఁడు నం వి. అ పుం 1 ద్వారపాలకుఁడు 2. విటుఁడు, ప్రియుఁడు

వరాహకందము నం వి అ పుం ఒక జాతి యాహార యోగ్యమైన దుంప

వరాహకర్ణము నం వి అ పుం. బాణ విశేషము, ఒక విధమగు బాణము.

వరాహకల్పము నం వి. అ పుం విష్ణువు వరాహావ తార మెత్తిన కాలము

వరాహకాంత నం వి అ స్త్రీ ఒకజాతి యాహార యోగ్యమగు పెండలపు దుంప

వరాహకూర్చము నం వి అ పుం న. (వా వరా కట్ట) అడవిపంది వెండ్రుకలతో కట్టబడి ఆభరణ ములను తోముటకు వాడుకొనుకుంచె (బ్రౌ ని )

వరాహక్రాంత నం వి అ స్త్రీ నేఁకుడు మునుఁగు చెట్టు, అత్తపత్తిమొక్క (వృ వి )

వరాహద్వాదశి నం వి ఈ స్త్రీ విష్ణుప్రీతికై మహో త్సవము చేయఁబడెడు మాఘ శుక్ల ద్వాదశి

వరాహమిహిరుఁడు నం వి అ పుం. బృహత్సం హితా గ్రంథకర్తయగు ప్రసిద్ధజ్యోతి శ్శాస్త్రవేత్త విక్రమార్కుని సభలో నుండిన నవరత్నములలో నొకఁడు

వరాహము నం వి అ 1 పంది, అడవిపంది. 2 పొట్టేలు, గొఱ్ఱెపోతు 3 ఎద్దు 4 మేఘము 5 మొసలి 6 పంది యాకారముగా నేర్పఱుపఁ బడిన సేనా వ్యూహము 7 పరిమాణ భేదము, ఒక విధమైన కొలత (మే ని ) 8. పదునెనిమిది పురాణములలో నొకటి వరాహపురాణము 9 పెండలమువంటి యాహారయోగ్యమైన యొక జాతిదుంప 10 ద్వీప విశేషము పదునెనిమిది ద్వీప ములలో నొకటి

వరాహుఁడు నం వి అ పుం 1 విష్ణువు, వరాహావ తారుఁడు

2 వరాహమిహిరుఁడు.

వరి వి 1 శాలిసస్యము

సీ చామల కెందు నీ నరసత గలదె తొయ్యలి యన వరియింపు నిలిచి చూడు రసి 1 58

2 శాలి ధాన్యము.

సీ పిడెంపు బలుకెంపు విరిసి వెన్నెల గాయ వరి గింజ నొకటఁ బల్వరునఁ దోమ ... ఆము 1 60.

జ . వరి మడి, వరి వంటకము

వరి నం వి. ఈ స్త్రీ 1 సూర్యుని భార్యయగు ఛాయాదేవి 2 శాఖా వరి (వృ వి )

వరి(యి)ంచు నం న. క్రి 1 పరిగ్రహించు

ఉ . వి, ఖ్యాతుఁ బురోహితప్రవరుఁగా వరి యించిరి భక్తితో భార ఆది 7 157

గీ అసుర కింకర కోటిచే నతులకనక, శిబిక లందుఁ దెప్పించిన విబుధ కన్య, లందఱను వృష్ణివృద్ధుల యనుమతమున, దాను వరి యించి నాఁడయ్యెఁ దత్క్షణంబ హరి ఉ 4 218

2 అడుగు, వాంఛించు, ప్రార్థించు

ఉ నావిని వటునాథుడు దా నవనాథుఁజూచి మెచ్చితిన్ సుకృత వర్ధన- వేడు వరం బొసంగె దన్, వావుడతండు . నిన్ను వరింప నెద్దియున్ జాహ్నవి 2 34

వరిగ వి (నం. వరకః) 1 సస్యవిశేషము

వ . వరిగె వెరిగె కాశీ 3 23

ద్వి. వరిగలు కొఱ్ఱలు పాలు నేతులును, విరివిగాఁ దెప్పించి వివిధరూపముల ... ప్రభు, 4. 162

సీ గోధుమల్ వరిగలు కొఱ్ఱలు నెయ్యిని గొని. రెట్టమతము 3 42

**వరిబీజము** వి వృషణవ్యాధివిశేషము, ఒక ప్రక్క వాఁచిన వృషణము. (శ ర., బ్రౌ)

**వరిమడి** వి (వరి+మడి) కేదారము, వరిపండు భూభాగము

సీ వాహినీ నాథుతో వరిమళ్ళ కాలువ వ్యాళ నాయకునితో వానకట్టె చెన్నబ 5 71

వ తిరుమలం మంగారి చెర్వుక్రింద వరిమడి కా శా 702.

**వరిమము** నం వి న్. పుం ప్రాశస్త్యము, శ్రేష్ఠత

**వరివంటకము** వి (వరి+వంటకము) శాల్యన్నము

ఉ పుట్టుగు దెల్పుకొన్న గతిఁగాని సఖుండని చూడ వచ్చినన్, వట్టి ప్రియంబులాడి వరివంటక మించుక పెట్టెఁగాని నా, యొట్టినలేమిఁ జూచి తడి యొత్తుల దోవతియైన యీఁడయే, పట్టునఁ బేదవారలకు బాంధవు లెక్కడివారు చూడఁగన్ పద్మ 10 246

**వరివసి(స్యి)తుఁడు** నం విణ (అ అ అ) పూజింపబడినవాఁడు, గౌరవింపఁబడినవాఁడు

**వరివస్య** నం వి ఆ స్త్రీ 1 పూజ, అర్చన 2 సేవ, ఉపచారము

**వరిష్ఠము** నం విణ (అ అ అ) 1 శ్రేష్ఠమైనది, మిక్కిలి ప్రశస్తమైనది 2 మిక్కిలి పెద్దది. 3 మిక్కిలి విశాలమైనది 4 మిక్కిలి బరువైనది. 5 అతి హీనమైనది, అతిదుష్టము

వి అ పుం 1 ఒకజాతి కముజు 2 నారింజ చెట్టు. (వృ వి) 3 తిత్తిరి పక్షి, తీతువు,

న 1 రాగి, మిరియము

**వరీయము** నం విణ (న్. యసీ స్) 1 ఒక దానికంటె మేలైనది. ప్రశస్తతరము 2 మిక్కిలి మంచిది 3 ఒక దానికంటె పెద్దది, ఉరుతరము, విశాల తరమైనది

వి న్ పుం (జ్యోతి) విష్కంభాది 27 యోగములలో నొకటి

**వరీవర్దము—బలీవర్దము** నం వి అ పుం వృషభము, ఎద్దు

**వరుఁడు** నం వి అ పుం 1. పెండ్లికుమారుఁడు. 2. భర్త, పెనిమిటి 3. తన్నుఁ బెండ్లాడుమని కన్నెను గోరువాఁడు ప్రార్థయిత 4. అల్లుఁడు. 5 విషయాసక్తుఁడు. భోగలంపటుఁడు 6 విటుఁడు. 7 జారుఁడు, ఉపపతి 8 ప్రభువు, ఱేఁడు.

ద్వి వరుఁడు లోపల నమ్మవారితో వంతి, పురమున నేకాంతమున నున్నవాఁడు ద్వి పరమ. 3 189 పా 5 పం,

ద్వి ఇంచొంద నీ కార్య మెలిఁగింపకున్న, వరునిచే వడి నాజ్ఞ వచ్చుఁబొమ్మనుచు ద్వి పరమ 3 180 పా 18 పం

**వరుగు** వి 1. తఱిగి యెండవేసిన కాయదినుసు, ఎండిన మాంసపుముక్క మొ

గీ మనుసు శుష్కశలాటు నామంబు వట్టు, వరుగనంగను ఆం. భా 2 39

గీ చెలిమి మీతోడఁ జేయుట చెట్టతనము, దానఁ గీడెంత పుట్టినఁ దగిలెనాకు, ననుభవింపక పోవునే యక్కటకట, వరుగుతో దాఁగరయు నెండవలసివట్లు ఉ హరి 4 54

గీ శ్వాపదంబుల పదహతి స్రస్సిపలచు, వరుగు దఱచగు ముఱుత్రోవ వరిగి యెదుట ... ఆము. 6 17.

(ఇట నొకజాతి గ్రద్దయర్థమని శ. ర)

2 చమురులో వేయించి పొగపిన యెండిన కాయముక్క.

చ . నాలుగేన్, పొగపిన కూరలున్ వడియముల్ వరుగుల్ పెరుఁగున్ ఘృతప్లుతిన్ .. ఆము 1 80.

సీ వగవగకూరలు వరుగు లప్పడములు నొలుఁపు బప్పును మించుటోగిరములు ఉ రా. 6 122

మ. తిరువారాధన మిట్లొనర్చి ధరణీదేవాన్వయశ్రేష్ఠుఁ డా, హరి కర్పించుటఁ బావనంబులగు శాలన్నంబులున్ నేతులున్, వరుగుల్ చేరులు పప్పులప్పడములున్ దాలింపులుం బూపముల్ , పరమాన్నంబులుఁ బెట్టు నెట్టన భుజింపం దల్లికిం దండ్రికిన్ పాండు 2 24

విణ సారహీనముగునది, బలహీనముగునది.

గీ. ననవకృతంబులడఁగిన వవసినవసి, వానవాదికు వర్పులు వరుగులై బ,గల్లతామూల కందంబు గమలనాథుఁ,డున్న కడ కేగి యాదళ విన్నవింప. వరాహ. 7. 52,

ఱ వరుగుఁ జేఁప.

**వరుగుఁజేఁప** వి (వరుగు + చేఁప) శుష్క మత్స్యము; ఎండుచేఁప

**సీ.** అలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప.

**సీ.** అలరును శుష్కమత్స్యం బుప్పుఁజేఁప నా వరుగుఁ జేఁపన . భా 1 160.

**వరుజు** వి మడియొక్క గనిమ, మడికిఁజుట్టును నేర్పఱచిన చిన్నకట్ట

క వరుజు బడి రొంపిద్రొక్కన్, జరణంబులఁ బెనఁగి పసిఁడి చాయకడుపులన్, బొరి నీరు కట్టె లమరెను, బిరుదులు పోలికలు దున్నఁ బెట్టిరొయనఁగన్ ఆము 4 125

**వరుటు** అ క్రి కృశించు, చిక్కిపోవు.

**సీ.** అశ్వగోమహిషరూప్య సువర్ణ వస్త్రంబులెన్ని పెచ్చించిన నేమిఫలము, సంతతంబును గృచ్ఛ్ర చాంద్రాయణాదుల వరుటుచునుంట యెవ్వరికి మెచ్చు భీమ 4 32

**సీ** అరరాగ్ని నెల్లను జల్లార్చి మిక్కిలి వరిటినాఁడు మహోపవాసములను కుచేల 1. 27

**సీ** మిగుల వరిటిన కొకివికి మేనివాఁడు, మన కుచేలుఁడు కుచేల 3 11

**వరుడము** నం వి అ పుం నీచ జాతి భేదము, నిమ్న జాతులలో నొక తెగ.

**వరుణదైవతము** నం వి అ న శతభిష నక్షత్రము

**వరుణపాశము** నం వి అ పుం 1 మత్స్య భేదము, సొఱచేఁప 2 వరుణుని చేతనుండెడి పాశము

**వరుణము** నం వి అ పుం 1 సముద్రము 2 ఖగోళము 3 వరుణవృక్షము, ఉలిమిరి 4 నీరు (**మే.** ని) 5 అష్టాదశ ద్వీపములలో నొకటి 6 పగటి పదునైదు భాగములలోఁ బదునాల్గవ భాగము పేరు

**వరుణాత్మజ** నం వి అ స్త్రీ వారుణి, మద్యము (సముద్రమునఁ బుట్టినది)

**వరుణాని** నం వి ఈ స్త్రీ 1 వరుణుని భార్య

**వరుణాలయము** నం వి అ పుం సముద్రము ఇశ్లే వరుణావాసము.

**వరుణుఁడు** నం. వి అ పుం 1. మిత్రునితోఁ గలసి యుండు రాత్ర్యభిమానియైన అదిత్యుఁడు 2 పశ్చిమదిగధిపతియు సముద్రాధి పతి యునగు దిక్పాలకుడు. 3 సూర్యుఁడు

**వరుత్రము** నం వి అ న ఉత్తరీయము, పైబట్ట.

**వరుమానము** వి రాఁబడి, ఆదాయము (శ ర, వా)

**వరువట్టు** వి (వట్టు + వట్టు) అధికముగాఁ దడియారుట

సీ వలవంత వరువట్టువట్టిన నాలుక తలముద్దు మాటల మెలఁగియాడ కు సం 5 634

క విరులఁ జిగుళ్లమ జొరువుగ, సిరిగంధ పుటసలోకింత చిలచిలమనివే,గిరమ వరువట్లు గొనఁగఁడుఁ, బొరలెడు తరలాతీ తాపముం గని కలఁకన్ కళా 6 255.

ద్వి. తటితటి తనువులఁ దాపంబు దోఁప, వరలుచు నధరముల్ వరువట్టు పట్ట పండితా మహిమా 280 పు.

ద్వి వావిరి నూతులు వరువట్లు పట్టె .. బస. పు. 7 889

**వరువరువులు** వి 1 బ (వరువులు + వరువులు) మిక్కిలి వరుగులు, అధికముగ ఎండినవి

క ఎరవలి పట్టిన కొండల, కురువడిఁ జనికాకి మూఁక లొక్కటఁ గొఱవుల్, వరువరువులైన పిడకలు, తటిఁ గైకొని పోయి ధీరతన్ దరి కొల్పన్ వేం పంచ 3 297

**వరు(ఱు)వాత** వి (నం ప్రభాతః) ప్రాతః కాలము

సీ కంపించి శేషునికడ కేగియో భోగికుల నాథ యీ యద్రికూట మొకటి, వైనవే యీ మహావాతూల వరువాత వరువాత నినుఁ బ్రతివాస రంబుఁ, దలఁచి యేము భుజించెదము గాని... రామా 8 82

క వరువాతలేచి యీ బుధ, వరువరవుడుఁ బోల్పఁ దగిన వారివలన శ్రీ, వరుఁ గీర్తింపుచు వాకిలి, వరుసన్ ముంగిళ్ళు దుడిచి వారని భక్తిన్ ఘటికాచల 2 20

క. వఱువాత లేచి నీతగు, కొఱగాములు చక్కఁ ద్రోచికొనఁ బోయెదినం, బఱుగు వడిపోయె నీ పమ, లఱజాతివి నిన్ను నేమి యననేర్తు సుతా. హరి పూ 5 239.

"కొట్టి" అరువు వరువు పుట్టి 1 జ్ఞికి చి 6 ద. శా 4 1884.

జ . వరువరువులు

వరున వి 1 క్రమము

గీ. మణిమయమ్ములుఁ గలధౌత మయములును సువర్ణ మయములు సాదిగా వలయునట్టి, యడ్డ పాళులు గలవు నా కభిమతముగ, వానిఁగొని పోయిచూవుదు వరునతోడ భార విరా 1 72

చ వరుసను బ్రాహ్మణోత్తముఁడు వర్ణచతుష్టయ జాతికన్యలం, బరిణయమౌట ధర్మమని పల్కుదు రాది మునీంద్ర ముఖ్యులు . విక్ర 1 155

గీ విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలము లకుఁ బాశపాణి వేల్పులకు నింద్రుఁ, డసుర కోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృ సమూ హంబునకు నధిపతులు వరున హరి పూ 1 92

2 పంక్తి.

ఆ వార లట్లు సేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడి పళ్లెరములు పన్నికొనఁగ హర 6. 116

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగ, గరములు క న్నావి యవుడు కఱచిన నుమవా, తెరమీఁదఁ గాన నగు పలు, వరుసయనన్ వనలు పల్లవము పై మొనసెన్ పారి 3 48, ఆము 1 60.

క పలువరుస చక్కఁదనమే, పలువరుస మెచ్చ వచ్చు బాలామణికిన్

3 వంతు

సీ ఇందుల శాఁవుల నందఱఁ దొల్లి యిల్వరున మ్రింగుచు మన్న . భార ఆది 6 264

క తనకు నెలవరుస వచ్చిన, నినరథవహనమున కాతఁడేఁగినవాఁడు భార శాం. 6 586

సీ వరుసలు వెట్టి దువాళింప సుడివడి వెలిమావు మోపడు వెనుక కాలు . వరాహ 10 15

క తరుణీశతకము బింబా,ధరమాధుర్యంబు లాను తఱిఁ దమలోనన్, బర మేష్ఠినాల్గు మోములు వరుసలు వెట్టుకొనుఁ జెప్పవశమే కూర్మిన్ కాశ. 2 19

4 పరంపర

క నిరతంబు బ్రహ్మమొదలుగ వరుసవ యొకతెకక యిట్లు ... భార. ఆది. 4 221.

సీ. వరున వేనుంగులు గురిసిన దానధారావళిదగు కలయంపిగాఁగ భార విరా 74

5 బంధుత్వక్రమము

క అరుదెంచి వలికె నిట్లని, గురువుల సతిచెట్టు వేసి కొంటివి నీకున్, వరుసా కటకటదోషా,కర యీ పాతకము సేయఁగాఁ గాదు సుమీ వరాహ. 7 25

చ మిమ్మువంటి పెద్దలై తగు వావియున్న రుస దప్పిచరించిన నమ్మచెల్లగా ఉ రా 4 205.

6 పర్యాయము, తడవ

క పదియగు వరుస వినిన య,భ్యుదయఫలమున కు గొలంది యూహించి నిజం, బిదియన హరి. ఉ 1ᐢ 309

7. సామ్యము, సాటి, తుల్యత

సీ . గోవు సద్విప్రునకు నీగితద్రోమనికర సంఖ్య, ఆ వరుస నాకలోకవాసంబు గావించు . భార అను 5 191

చ తనరు నిజాన్వవాయగురుధర్మదవృత్తి నరుంధతీ సువా,సిని వరుసమ్మతుల్ బుధ విశిష్టసభం గను నట్టి నద్గుణై,కనిధినిజాగ్రధార రాఘవ 1 43

గీ వాఁడు నిమత్శేశ్వరుండు మా వరుసవాఁడు, కలి మహారాజ మన్నింతుగాక వాని . నైష 7.105

8. నియమము

గీ వర్ణములు నాశ్రమంబులు వరుసఁ దప్పె, వేద ములు నాగమంబులు విన్నఁబోయె కాశీ 6 86

9 (రాగముల) వరుస, పాటలోని స్వరముల భేదము

సీ తాన వరుసలు పెంచు గంధర్వగాయ,కులను జతగూడు వట్టువకులము హరి దశా. 1 264

10 విధము, రీతి.

క. నరనారీ సంబంధము, వరుసగదా పురుషునకును బ్రకృతికి నన్యో,న్యరమణము... భార శాం. 6 25

సీ .. యవ్వసుదేవుఁ డుంౘెడు విధమును నర
యుచు నయ్యింతియంటకుండ, వాౘెడు
వరుసలు సాధానసమయంబు మొదలుగా
గర్భంబు మోచు నెలలు, నెఱిఁగి హరి. పూ
5 94

౨ మల్లురుచేయు సాధన విశేషము

వ .. సురటిపల్లటి మొదలగు లాగు వరుసలును
ఖాలసంగడపు వరుసలును వింటాౘెవు మొదల
గుగాతాము వరుసలును మల్లుపు 3 69

విణ మంచిది, యుక్తము

క అనుటయుఁ బ్రవరుం డిట్లను, వనజేక్షణ యిట్లు
వలుక వరుసయె వ్రతులై, దినములు గడపెడు
విప్రుల, జను నె కామింపమది విచారము వలదే
మనుచ 2 52

జ వర్సుసగొను, వరుస మొగ్గరము

**వరుసగొను** అ క్రి (వరుస+కొను) జారుదీరు,
పంక్తిగా నేర్పడు

వ. . . నిండాఁర బూఁచిన కనక చంపక శాఖల
వైఖరిని వరుసగొని బిఱుసులు మెఱుపు నెఱ
పఁగొడిగొని నలుగడల తెగక నిగిడించు బహు
విధ కౌతుకాగ్ని యంత్రచిత్రంబులకు ఆశ్చ
వి 5 74

**వరుసము** వి (సం వర్షః) సంవత్సరము

ద్వి వేయేండ్లు ధరియించి వెసదానిఁ బుచ్చి, నా
యతి నా కిచ్చెనట నేను వేయు, వరుసముల్
ధరియించి వారకయున్న తఱినీవు పుత్ర సంతా
నేచ్ఛ వన్నుఁగుఱిచి వేఁడితి గానఁ గోర్కి
దైవాఱ రం రా ఉ 92 పా 10 పం

**వరుస మొగ్గరము** వి (√ వరుస) దండ వ్యూహము,
పంక్తులుగా నేర్పడిన సైన్యము (శ ర)

**వరూథము** నం వి అ వుం రథమును గాపాడుటకై
వ్యాఘ్ర చర్మాదులతో నిర్మించిన రథముపైకప్పు,
రథగుప్తి 2 కోకిల 3 సమయము, వేళ

న 1 కవచము 2 డాలు, కేడెము. 3 సమూ
హము, గుంపు 4 ఇల్లు, గృహము

**వరూథి** నం విణ. (న్ ని న్) 1 కవచధారి, కవచము
గలవాఁడు 2 కప్పుగలది (రథాది) 3. సంరక్షిం
చునది, కాచునది 4 సేవచేఁ బరివేష్టింపఁ బడినది
5 రథము మీఁదనున్న వాఁడు, రథికుఁడు.

వి న్ వుం 1 సారథి 2 అపాయమునుండి
రక్షించు పురుషుఁడు

**వరూథిని** నం వి ఈ స్త్రీ, సేన

**వరే** అవ్య "కదా" అనునర్థము నిచ్చును, ప్రశ్నా
ర్థకము

క మీకింత వందికంద థ,యాకులతం బొంది నిర్గ
తైశ్వరు లరై, రాకకుఁ గారణమేమిత్రి,లోకా
హిత దనుజ తతికి లోబడరు వరే కు సం
4 365

**వరేణ్యము** నం విణ (అ అ అ) 1 కోరఁదగినది,
అభిలషింపఁదగినది 2 శ్రేష్ఠమైనది, ప్రశస్త
మైనది 3 ప్రధానమైనది, ముఖ్యమైనది,

వి అ న కుంకుమ పువ్వు

**వరేణ్యుఁడు** నం విణ (అ అ అ) ముఖ్యుఁడు,
శ్రేష్ఠుఁడు (శ ర, ప్రౌ)

**వరోటము** నం వి అ వుం మరువము (వ్యు. వి)

న మరువక పుష్పము, మారువపు పువ్వు

**వరోరువు** నం వి (ఉ. ఊ) స్త్రీ, ప్రశస్తమైన
తొడలుగలది సుందరాంగన, అందకత్తె

**వరోలము** నం వి అ వుం ఒక జాతి కందురీఁగ.

**వర్కరకర్కరము** నం వి అ వుం తోలు, వాఱు,
తోలుత్రాడు మేకపిల్లనుగాని గొఱ్ఱెపిల్లనుగాని
కట్టెడు తోలుత్రాడు.

**వర్కరము** నం వి అ వుం. 1 పశు శాబకము (గొఱ్ఱె
పిల్ల, మేఁకపిల్ల, జింకపిల్ల, లేఁగదూడ మొ)
2 మేఁక 3 వినోదము, క్రీడ, ఉల్లాసము 4 పరి
హాసము, వేళాకోళము

**వర్కరాటము** నం వి అ వుం 1 ఓరచూపు 2
నఖక్షతము 3 పూర్వాహ్ణమందలి సూర్యకిరణము.

**వర్కుటము** నం వి అ వుం 1. కొయ్యచీల, అడ్డు
గడియ

**వర్గఘనఘాతము** నం వి అ వుం

(గణిత) ఒక వర్గమును ఆ వర్గమూలముయొక్క
ఘనముచే గుణింపఁగా వచ్చిన మొత్తము,
ఉదా $4 \times 8 = 32$

**వర్గఘనము** నం వి. అ వుం (గణిత) ఒక వర్గమును
ఆ వర్గముచేత ముమ్మాఱు గుణింపఁగా వచ్చు
సంఖ్య

ఉదా $4 \times 4 \times 4 = 64$

**వర్గణ** సం వి అ స్త్రీ (గణిత) గుణనము గుణకారము, హెచ్చవేయుట

**వర్గపదము**=**వర్గమూలము** సం వి అ న

**వర్గప్రకృతి** సం వి అ స్త్రీ (గణిత) బీజగణితము నందలి ఒక విధమగు గణనము

**వర్గము** సం వి అ పుం 1 సజాతీయ సమూహము, సంఘము 2 పక్షము, వైపు 3 తరము, పురుషాంతరము 4 ఒక గుంపుగాఁ జేర్పఁబడిన పదముల సమూహము (మనుష్య వర్గము, వనౌషధి వర్గము మొ) 5 వర్ణసమామ్నాయమున సవర్ణములగు హల్లుల సమూహము (ఉదా కవర్గము చవర్గము మొ.) 6 గ్రంథభాగము, అధ్యాయము 7 ఋగ్వేదమున నధ్యాయమునందలి భాగము 8 (గణిత) ఒక సంఖ్యను దానిచేతనే గుణింపఁగా వచ్చు సంఖ్య (ఉదా $2 \times 2 = 4$ 9. బలము శక్తి. 10 మండలము, గోళము. 11 త్యాగము, విడుచుట

**వర్గమూలము** సం వి అ న (గణిత) ఒక సంఖ్యను ఆ సంఖ్యచేతనే గుణింపఁగా వచ్చిన సంఖ్యవర్గము ఆ వర్గమునకు మూలము (మొదల) యినట్టి సంఖ్య. ఉదా 9 కి 3 వర్గమూలము, 16కు 4 వర్గమూలము

**వర్గవర్గము** సం వి అ పుం (గణిత) ఒక వర్గమును ఆ వర్గముచేత గుణింపఁగా వచ్చిన సంఖ్య ఉదా $2 \times 2 = 4$, $4 \times 4 = 16$.

**వర్గాంత్యము** సం వి అ న కవర్గాదుల తుదివర్ణము, అనునాసికము

**వర్గి** సం విశ (న్ ఈ న్)
ఒక జాతికి సంబంధించినవాఁడు, ఒక పక్షమునకు సంబంధించినవాఁడు

**వర్గించే** సం న క్రి వర్గముగా నేర్పఱుచు.
వ. మరణభాజులగు భూభుజుల కర్హంబులగు వగర్హిత స్వర్గంబులు వర్గించి దివిజపతి విభజించుచున్నాఁడు హరి పూ 8 121.

**వర్గీణము** సం విశ (అ ఆ అ) వర్గమునకు సంబంధించినది ఒక జాతికి లేక ఒక పక్షమునకు సంబంధించినది.

**వర్గీయుఁడు** సం విశ (అ ఆ అ) 1. ఒకజాతికి సంబంధించినవాఁడు 2 ఒక తరమునకు సంబంధించినవాఁడు
వి అ పుం సజాతీయ పురుషుఁడు

**వర్గు(వు)** సం వి (ఉ పుం న) సమూహము, గుంపు.
క ఇది దేవస్గు దీపి, ఇదివిన వ్రాసినను వినిన జనులకు నిత్యా భ్యుదయమ్ము లొసఁగుచుండును, వదలక కాశీనివాస వాసుఁడు పేర్మిన్ ...ఆం సం దేవ 43
క నవముగథరలో నీమా, నవవర్గువు వేడ్కఁ జదివినను వ్రాసిన మానవులకు ననవరతంబును, శివుఁ డవిముక్తేశ్వరుఁడు చెలువం బొసఁగున్. . ఆం సం. మాన 81

**వర్గోత్తమము** = **వర్గాంత్యము** సం. వి అ వ. (జ్యోతి) పుం నవాంశభేదము

**వర్గ్యుఁడు** సం విశ (అ ఆ అ) సజాతీయుఁడు, సమానజాతివాఁడు
వి అ పుం 1 సజాతీయుఁడు 2 సహాధ్యాయుఁడు, సహపాఠి

**వర్చస్కము** సం వి. అ న 1 ప్రకాశము, తళతళ కాంతి 2 శక్తి, బలము, వీర్యము 3 మలము, పురీషము

**వర్చస్వి** సం విశ (న్ ఈ న్) 1 శక్తిగలవాఁడు, బలము గలవాఁడు, చురుకైన వాఁడు. 2 ప్రకాశముగలవాఁడు, కాంతిగలవాఁడు.

**వర్చస్సు** సం వి న్ న 1 బలము, శక్తి 2 తేజము, కాంతి, ప్రకాశము, తళతళమను 3 రూపము, ఆకారము 4 మలము, పురీషము. 5 శుక్రము, వీర్యము

**వర్చోగ్రహము** సం వి అ పుం రోగవిశేషము, మలబంధము, విరేచనము కాకపోవుట

**వర్జకము** సం విశ (అ ఆ అ.) 1 చేరకుండఁజేయునది, త్రోసివేయునది బహిష్కరించు వట్టిది 2 విడుచునది, తప్పించుకొనునది (సమాసమునందుత్తర పదముగానే యుండును)

**వర్జనము** సం వి అ న 1 విడుచుట, వదలిపెట్టుట. 2 వినాయించుట. 3 గాయపఱుచుట 4 హాని కలిగించుట 5 చంపుట

వర్జనీయము సం విణ (అ ఆ. అ) వర్జింపఁదగినది
వర్జము సం వి అ పుం విడుచుట, వీడుట
వర్జించు సం స క్రి విడుచు, పరిత్యజించు
గీ విద్యచే భూషితుండయి వెలయుచున్నఁ, దొడరి వర్జింపదగు సుమీ దుర్జనుండు, చారు మాణిక్య భూషితశ స్తమ స్త, కంబయినపన్నగము భయంకరము గాదె భ ర్తృ 1. 43
వర్జితము సం విణ (అ ఆ. అ.) 1. వర్జింపఁబడినది, విడువఁబడినది 2 విసాయింపఁబడినది 3 మానబడినది 4 బహిష్కరింపఁ బడినది, 5 లేకుండఁ జేయఁబడినది
వర్జ్యము సం విణ (అ. ఆ అ) 1 విడువఁదగినది, వర్జింపఁదగినది. త్రోసివేయఁ దగినది లేకుండఁ జేయఁదగినది
వి అ న చాంద్రమాన ప్రకారము నక్షత్ర కాలమున కార్యారంభమునకు విడువఁదగిన కాలము
వర్ణక సం వి ఆ స్త్రీ 1 వేషము 2 హరిదళము. 3, చిత్తరువు వ్రాయుట కుపయోగపడు రంగు 4 సిందూరము 5 ఇంగిలీకము 6 మేలిమి బంగారము 7. ఉత్తరీయము, పై బట్ట 8 మంచి గంధము 9 పిండి 10 స్త్రీలుపయోగించు పరిమళ ద్రవ్య విశేషము.
వర్ణకము సం వి. అ పుం 1 నటుని వేషము, వేధము. 2 చిత్తరువు వ్రాయుట, చిత్తరువు వ్రాయుట కుపయోగించెడి రంగు 3 రంగు పదార్థము 4 సిందూరము 5 చందన వృక్షము, మంచి గంధపు చెట్టు 6 అక్షరము, వర్ణము 7. (ఆం వ్యాక) ప్రత్యయము, డు ము. వు.
న 1 చాయ, వన్నె, రంగు 2 చందనము, మంచి గంధము 3 అధ్యాయము, గ్రంథములో భాగము 4. గోళము, మండలము
వర్ణకుఁడు సం వి అ పుం స్తోత్ర పాఠకుఁడు, బట్టు.
వర్ణకూపిక సం. వి అ. స్త్రీ మసిబుడ్డి, సిరాబుడ్డి
వర్ణక్రమము సం వి అ. పుం 1 బ్రాహ్మణాది వర్ణముల క్రమము, 2 రంగుల క్రమము 3. అక్షరముల క్రమము
వర్ణచారకుఁడు సం. వి. అ పుం చిత్రకారుఁడు, ముచ్చి.
వర్ణజ్యేష్ఠుఁడు సం వి. అ పుం బ్రాహ్మణుఁడు
విణ (అ ఆ అ) తన వర్ణముకంటె పైవర్ణమునకు సంబంధించిన వాఁడు
వర్ణతూలి సం వి ఇ ఈ స్త్రీ లేఖిని, పేనా, కలము, రంగులు వేయుకుంచె
వర్ణతూలిక వర్ణతూలి, సం. వి ఆ స్త్రీ
వర్ణదము సం విణ (అ ఆ అ) రంగు గలిగించునది రంగు నిచ్చునది
వి అ. న కాలీయకము నల్ల అగలు, లేక పీత చందనము
వర్ణదాత్రి సం వి ఈ స్త్రీ పసుపు (వ్య వి)
వర్ణదూత సం వి అ పుం (అక్షరరూపమగు దూత.) 1 జాబు, వార్తా పత్రిక 2 లిపి (వాచ)
వర్ణదూషకుఁడు సం విణ (అ. ఆ అ) వర్ణభేదముల నుల్లఘించు వాఁడు
వర్ణధర్మము సం వి అ పుం. బ్రాహ్మణాది వర్ణముల కేర్పరుపఁబడినధర్మము
వర్ణన=వర్ణనము సం వి ఆ స్త్రీ
1. చిత్తరువు వ్రాయుట 2 వర్ణించుట, ఒక యంశమును వివరించి చెప్పుట. 3. వ్రాయుట. 4. చెప్పుట 5 స్తోత్రము.
వర్ణనకెక్కు అ క్రి (వర్ణనకున్+ఎక్కు) ప్రసిద్ధినొందు
సీ వర్ణనల్లెచో వర్ణన కెక్కంగ రసములు దలుకొత్తి రాలు వాలు కు సం 1 36.
వర్ణనము సం వి అ న 1 చిత్తరువు వ్రాయుట 2 ఒక యంశమును వివరించి చెప్పుట 3. వ్రాయుట 4 చెప్పుట 5 స్తోత్రము
వర్ణపాతము సం వి అ పుం అక్షరము లోపించుట
వర్ణపుష్పము సం వి. అ పుం. వన్నెచెట్టు (శ ర)
వర్ణమాత సం వి. ఋ స్త్రీ లేఖిని, కలము
వర్ణమాతృక సం వి. ఆ స్త్రీ సరస్వతి.
వర్ణమాల సం వి ఆ స్త్రీ 1. అక్షర సమామ్నాయము.
2. (మంత్ర) అంతర్యాగమునందు పంచాశ ద్వర్ణాత్మకమైన వర్ణ రూపాక్ష మాల.

**వర్ణము** సం వి. అ పుం 1 నీలాది వర్ణము. వన్నె 2 చిత్తరువుల రంగు, చాయ 3 కాంతి, దేహచ్ఛాయ, ఒడలిరంగు 4 బ్రాహ్మణాద్యదిజాతి (చాతుర్వర్ణ్యము) 5 రకము, విధము 6 అక్షరము 7 పదము 8. ప్రఖ్యాతి, కీర్తి 9 మంచిగుణము, సుగుణము 10 స్తుతి, పొగడ్త 11 అలంకారము 12 ఆకారము, రూపు. 13. ఉత్తరీయము, పైబట్ట 14 మూఁత, కప్పు 15 సంగీతక్రమము 16 శీలము, స్వభావము, లక్షణము 17 మత సంబంధమైన కర్మానవరణము 18 తెలియని పరిమాణము, తెలియని మొత్తము. 19. ఏక సంఖ్యకు సంకేతము. 20 అంగరాగము, ఒడలికి పూసికొను పరిమళద్రవ్యము 21 బంగారము 22 తాళభేదము (వాచ.)

న 1 కుంకుమపువ్వు 2 రంగుగల యంగరాగము 3 రంగుల తైలము

**వర్ణరే(లే)ఖ** సం వి ఆ స్త్రీ కఠిని, బలపము.

**వర్ణవర్తి** సం వి. ఇ స్త్రీ 1 రంగువేయుకుంచె 2 లేఖని, పేనా, కలము

**వర్ణవర్తిక**=వర్ణవర్తి వర్ణవర్తి, సం వి ఈ స్త్రీ

**వర్ణవిపర్యయము** సం వి అ పుం వర్ణవ్యత్యయము, అక్షరముల తారుమారు

**వర్ణవిలాసిని** సం. వి ఈ స్త్రీ పసుపు. (వృ వి.) ఇశ్లే వర్ణవతి

**వర్ణవిలోడకుఁడు** సం వి అ పుం 1. కన్నగాఁడు. 2 శ్లోకముల నపహరించు వాఁడు, చోర కవి.

**వర్ణశ్రేష్ఠుఁడు**=వర్ణజ్యేష్ఠుఁడు సం.

**వర్ణసంకరము** సం వి అ పుం 1 వివాహముల ద్వారమున భిన్న వర్ణములు కలియుట, జాతుల సాంకర్యము

2 రంగులు కలియుట

**వర్ణసమామ్నాయము** సం వి అ. పుం అక్షరమాల, వర్ణమాల.

**వర్ణస్థానము** సం వి అ న అక్షరముల యుచ్చారణ స్థానము (కంఠాది)

**వర్ణహీనుఁడు** సం. విశ. (అ ఆ అ.) 1 జాతిభ్రష్టుఁడు. 2 తక్కువ జాతివాఁడు

**వర్ణాంక** సం వి. ఆ స్త్రీ లేఖని, కలము, పేనా

**వర్ణాటుఁడు** సం. వి. అ పుం 1 చిత్రకారుఁడు. 2 గాయకుఁడు 3. స్త్రీకృతాజీవుఁడు, భార్య సంపాదనచే జీవించువాఁడు 4. వల్లభుఁడు, ప్రియుఁడు (విల్యమ్సు)

**వర్ణాపేతుఁడు** సం విశ (అ ఆ అ) వర్ణమునుండి తొలఁగిన వాఁడు. జాతిబాహ్యుఁడు

**వర్ణార్హము** సం వి అ పుం ముద్గము, పెసరు (వృ వి) (శా ని)

**వర్ణి** సం విశ (న్ నీ న్) (సమాసాంతమునందు.) 1 రంగు గలది 2 జాతికి (వర్ణమునకు) సంబంధించినది

వి న్ పుం 1 చిత్రకారుఁడు 2 వ్రాయసకాఁడు, వ్రాతగాఁడు. 3 బ్రహ్మచారి 4 బ్రాహ్మణాది చతుర్వర్ణములలో నేవర్ణమునైనఁ బుట్టిన వాఁడు

**వర్ణించె** సం న క్రి స్తుతించు, పొగడు

క అనఘా పరునిందించుట, దనువర్ణించుకొనుటనుచితము లెయ్యెడలన్ ... భార శాం. 5 453

శా వాచాగోచర మప్రతర్క్యము వినిర్ద్వంద్వంబసాధారణం, బాచోద్యం బతిలోకి మప్రతిమ పర్యాయంబు వర్ణింపఁగా, నీ చెల్వంబు శ్రీ కాళ 2 13

**వర్ణిక** సం వి ఆ స్త్రీ 1 నటుని వేషము 2 రంగు, చాయ 3 మసి, సిరా 4 లేఖని, కలము 5. కఠిని, బలపము

**వర్ణితము** సం విశ (అ ఆ అ) వర్ణింపఁబడినది 1 రంగువేయఁబడినది 2. వివరముగాఁ దెలుపఁబడినది 3 స్తుతింపఁబడినది

**వర్ణిని** సం వి ఈ స్త్రీ పసుపు (చూ వర్ణి).

చ అనుడు బ్రలంబ వైరికి మురాంతకుఁ డిట్లను సిగ్గిరివ్రజం,బను నగరంబు గాచికొని యాహవనీయము మండుచుండు న,య్యనలము చాయఁ జూవె మనమందఱము న్వరవర్ణినీ ఘన, స్తనవర వర్ణినీద్యుతికిఁ దావల మైతిమి ప్రీతి మీఱఁగన్, ఉ హరి 6 30 (రెండర్థములకు నిదియే యుదాహరణము)

**వర్ణిలింగి** సం వి న్ పుం ఉదరపోషణమునకు బ్రహ్మచారివలె వర్తించువాఁడు, కపట బ్రహ్మచారి.

**వర్ణువు** సం. వి. ఉ పుం. 1 సూర్యుఁడు 2 ఒకానొక నదము (వాచ)

**వర్ణ్యము** సం విణ (అ ఆ అ) 1 వర్ణింపఁదగినది 2 అలంకార శాస్త్ర గ్రంథములయందు 'ప్రస్తుతము' అను నర్థమునఁ బ్రయోగింపఁ బడును

వి అ న కుంకుమ పువ్వు

**వర్తక** సం వి అ స్త్రీ వెలిచె పిట్ట.

**వర్తకము** వి వాణిజ్యము, క్రయ విక్రయ వ్యాపారము

(శ ర. దీనిని సం. గా గ్రహించెను)

మ తమకుం జాలినవర్తకం బతనిచేతం గామినోశంఖ పద్మమహాపద్మములర్థపున్ విడిచి ప్రేమం దత్పురివైశ్యస_త్తములం జేరెననంగ. కవిరా 1 72

అ పైరువలన మనము బ్రతికెడు వారము, గామువిపణివర్తకంబుచేత, జీవనంబునడప మావులేదైవంబు, లనుచునుండు వారమగుటఁజేసి వి పు 7 22

**వర్తకము** సం విణ (అ ఆ. అ) 1 జీవించుచున్నది. 2 అభినివేశము గలది

వి అ పుం 1 వెలిచెపిట్ట 2 గుజ్జుపుడెక్క 3. వాణిజ్యము, వణిగ్వ్యాపారము

ఆ పైరువలన మనము బ్రదికెడువారము, గాము విపణి వర్తకంబుచేత, జీవనంబునడప మావులేదైవంబు లనుచునుండు వారమ గుటఁజేసి వి పు. 7 229

న లోహవిశేషము

**వర్తకుఁడు** సం. వి అ పుం వణిజుఁడు, క్రయ విక్రయ వ్యాపారము చేయువాఁడు

(వ్యవ) ఈ యుద్ధకాలమునఁ జాలమంది వర్తకులు మంచిలాభమును బొందినారు

**వర్తనము** సం విణ (అ ఈ అ) 1 వసించుచున్నది. జీవించుచున్నది ఉన్నది 2. స్థిరమైనది, నిలకడ కలది, చలనము లేనిది

వి అ న (ఇది చరిత్రాదులలోనిది కావున మువర్ణకలోపము వైకల్పికము)

1 జీవనము, బ్రదుకు 2 ఉనికి, స్థితి 3 వృత్తి, జీవిక, వ్యాపారము 4 జీవనాధారము, జీవనోపాయము 5 గుజ్జుము ధూళిలో దొర్లుట, గుజ్జుము దొర్లెడు తావు (విల్యమ్సు) (కే ని) 6 చుట్టచుట్టుకొనుట 7 ఏర్పఱుచుట, పని పెట్టుట 8 నడవడి, ప్రవర్తనము, నడచు పద్ధతి 9 బత్తెము, జీతము, కూలి 10 వాణిజ్యము 11 నూలువడకు కదురు మొదట నమర్చెడు బిళ్ల, తర్కుపిండము 12 గోళము, మండలము 13 తఱచు పలుకు మాట (కే.ని)

**వర్తని** సం. వి ఇ పుం 1 భరతఖండమునఁ దూర్పువైపు దేశము, తూర్పుదేశము ౨. (మంత్రరూప) స్తోత్రము

ఈ స్త్రీ 1 బాట, మార్గము, కాలిజాడ. 2 పత్మ్మము కనుఱెప్ప వెండ్రుకలు 3 చక్రము పోయినజాడ 4 పేషణము, నూరుట, చూర్ణీకరణము (వాచ) 5. నూలు వడకెడు కదురు బిళ్ల

**వర్తముఁడు** సం వి అ పుం మఱుగుజ్జువాఁడు, వాముఁడు

**వర్తనుఁడు** సం విణ (అ అ అ) 1. పొట్టివాఁడు 2 వర్తించువాఁడు (శ ర)

**వర్తమానము** సం విణ (అ అ అ) 1 ఉండునది 2 జీవించియున్నది 3 చుట్టు తిరుగుతున్నది 4 నివసించుచున్నది

వి అ పుం 1 (వ్యాక) జరుగుచున్న కాలము ప్రారబ్ధాపరిసమాప్తక్రియాశ్రయమగు కాలము 2 వృత్తాంతము, సమాచారము

చ. విను మిటులుండంగాఁదిమిరవేణి కుబేరుఁడు కమ్మ పంపఁగా, దినసరి చీటులందుగడిదేరు జయంతునివర్తమానముల్, విని నలకూబరుండు . . కువల 4 169.

న సాన్నిధ్యము

**వర్తము** సం వి అ పుం (ప్రాయికముగా సమాసాంతమున నుపయుక్తము

ఉదా కలవ్యర్తము) జీవిక, జీవనాధారము

**వర్తరూకము** సం వి అ పుం 1 పల్వలము, పడియ, నీరుగల చిన్నగుంట 2 నీటి సుడి, జలావర్తము. 3 కాకిగూడు 4. ఒకానొకనది

**వర్తరూకుఁడు** సం వి అ పుం ద్వారపాలకుఁడు.

వర్తి నం విశ (న్ సి న్) (ప్రాయికముగా సమాసాంతమున నుండును)
1 నివసించుచున్నవాఁడు, ఉన్నవాఁడు. 2. ప్రవర్తించువాఁడు
(క.) వెల్లుచున్నవాఁడు
(చ.) పనిచేయుచున్న వాఁడు ప్రవర్తించుచున్న వాఁడు
(ట.) ఆచరించుచున్న వాఁడు
వి ఇ ఈ స్త్రీ 1 చుట్టచుట్టుకొనిన వస్తువు,చుట్ట 2 పలువిధములగు సువాసన ద్రవ్యములతో తయారుచేయఁబడిన అంగరాగము, మేపూఁత 3 అంజనము 4 దీపపు వత్తి, 5 బట్టయంచు, బట్ట చివరజాలరు, వస్త్రాంచలముగా నుండు దారము 6 పాత్రముల అంచు 7 ఇంద్రజాల సంబంధమైన దీపము 8 శస్త్రవైద్యమునం దుపయోగించు సాధన విశేషము 9. రేఖ, గీఁత 10 కంఠమువాపు 11 లోపలఁ బగులుటచే పైని వాచుట

వర్తించే=వర్తిల్లు నం అ క్రి 1 ఉండు.
గీ నేల నాలుగుచెఱఁగుల నృపులకొలువు, లందు నేను వర్తించితి నవనినాథ, యగ్గలించి నా యెదుర బాహాప్ఫళించి, కడఁగఁజాలెదు మల్లుఁ గాన నెందు. భార విరా 2 7
2 నడచు, సంచరించు
వ కౌంతేయులంగానక సంకేత స్థలంబునంగూడి కొని మావర్తించిన తెఱంగుదేవరకు నెఱిం గించి . భార విరా 3 87

వర్తిక నం వి ఆ స్త్రీ 1 చిత్తరువు వ్రాసెడి కుంచె 2 దీవపువత్తి 3 రంగు 4 మీలవల్లంకి పిట్ట 5. జుట్టుపు మొక్క (రా. ని)

వర్తిధూపము నం వి అ వుం అగురువత్తి (శ ర)

వర్తిల్లు=వర్తించు నం అ క్రి 1 ఉండు
వ శుక్ర మతంబునఁ బంచమోపాయంబైన యుపేక్ష వర్తిల్లుదానిం బ్రయోగించు భంగి యుం జెప్పెద భార శాం ,2 417
2 సంభవించు, కలుగు
క అగుదేశ కాలబలయుత,ముగఁజేసిన పోర నర్థములు మోఁకువైౖ, తెగఁబాటి తమ్ము నెదిరిని వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుదిన్. భార విరా 4 208
3 నిలఁబడు, ఆధారపడు.
ఆ వార్తయందు జగము వర్తిల్లుచున్నది, యదియు లేని నాఁడ యఖలజనులు, వంధకార మగ్నులగుదురు . భార సభా 1 50

వర్తిష్ణు(డు)వు నం విశ (డ) వర్తించు స్వభావము గలవాఁడు, వర్తనశీలుఁడు

వర్తులము నం విశ (అ ఆ అ) గుండ్రనిది, వట్రువైనది
వి అ వుం 1 ఒక విధమగు కాయధాన్యము, బటాణి. 2 కందుకము, బంతి.
న 1 మండలము, గోళము 2.వెల్లుల్లి (వృ వి)

వర్తులాభరణము నం వి అ న (బవిర) వర్తులాకారమైన కర్ణాభరణ విశేషము

వర్త్మని నం వి ఇ. ఈ స్త్రీ మార్గము, బాట (వాచ)

వర్త్మపాతము నం. వి అ వుం త్రోవ తప్పుట

వర్త్మబంధ(క)ము నం వి అ వుం కను ఱెప్పల జబ్బు, ఱెప్ప లంటుకొనుట

వర్త్మము నం వి. న్ న 1 మార్గము, బాట. 2 పద్ధతి, వాడుక, మామూలు 3 అవకాశము, సందు, ఎడము 4 పక్ష్మము, కనుఱెప్ప వెంట్రుక. 5 అంచు, అంచలము

వర్ధకము నం విశ (అ ఆ అ) 1 వృద్ధి పఱుచునది, పెంచునది 2 నిండించునది 3 నఱకునది, ఖండించునది
వి అ వుం బ్రాహ్మణయష్టిక, గంటు బారంగి (వృ వి) (వాచ.)

వర్ధకి నం వి ఇ న్ వుం వడ్రంగి

వర్ధకుఁడు=వర్ధకి నం వి అ వుం.

వర్ధనము నం విశ (అ ఆ అ) 1 పెరుగునది, వృద్ధిపొందునది 2 వృద్ధిపొందించునది, పెంచునది
వి అ వుం 1 పంటిమీదఁ బుట్టెడి రెండవ పల్లు, దొంతరపండ్లలోఁ బైది
న 1. పెరుఁగుట, వృద్ధిపొందుట. 2 అభ్యుదయము 3 ఔన్నత్యము, ఉన్నతి 4 ఉత్సాహము 5 విద్య నేర్పుట 6 పోషించుట

7. ఖండించుట, త్రుంచుట, ఛేదనము, నాభివర్ధనము. 8. బలకరమైన మందు. 9 నిండించుట.

**వర్ధని** నం వి ఈ స్త్రీ 1 చీపురుకట్ట 2. పాడె, శవవాహనము 3 మూతి సన్నముగా నుండెడి యొక విధమయిన పాత్రము, జారి

**వర్ధనుఁడు** నం వి అ పుం 1. ఐశ్వర్యమిచ్చువాఁడు, అభివృద్ధి గలిగించువాఁడు 2 శివుఁడు 3. విష్ణువు

**వర్ధమాన** నం. వి. అ. స్త్రీ ప్రకృతము బర్ద్వాన యనఁబడెడి మండలము

**వర్ధమానకము** నం వి అ. పుం శరావము, మంటి మూఁకుడు.

**వర్ధమానము** నం. వి (అ ఆ అ) పెరుఁగుచున్నది, వృద్ధిపొందుచున్నది

వి అ పుం 1 ఆముదపుఁజెట్టు 2 గూఢప్రశ్న, ఒక విధమైన పొడుపుకథ 3 ప్రకృతము బర్ద్వాన యనఁబడు దేశభాగము

**వర్ధమానుఁడు** నం వి అ పుం 1 విష్ణువు 2 అర్హతులలో (జైనమతావలంబులలో) నొకఁడు

**వర్ధము** నం. వి. అ పుం 1 నఱకుట, ఛేదించుట 2. వృద్ధిపొందించుట, వృద్ధి పొందుట 3. వృద్ధి 4 నిండించుట.

న 1 సీసము 2 సిందూరము

**వర్ధాపనము** నం వి అ న. 1 ఛేదనము, ముక్కలు చేయుట 2 నాభిచ్ఛేదము, బొడ్డుకోయుట 3. జన్మదినోత్సవము, పుట్టిన దినము పండుగ 4 అభివృద్ధి కాముఁడై హోమాదికము చేయు సంస్కార విశేషము.

**వర్ధితము** నం విఙ (అ ఆ అ) 1 పెంపఁబడినది వృద్ధిపొందింపఁ బడినది 2 విరివి చేయఁబడినది 3 ఖండింపఁబడినది 4. నిండింపఁబడినది

**వర్ధిల్లు** నం అ క్రి వృద్ధిపొందు

క. క్రేపులు వర్ధిల్లుటయును, నోపి పసులు పాలు గురియుచునికియు నన్నం,బే సారమునకుఁ గలిమియు, నా పరమేశ్వరుని యోగి యని యెఱుఁగుమనా హరి పూ 7. 127

**వర్ధిష్ణువు** నం విఙ (ఉ) అభివర్ధనశీలమైనది, వృద్ధిపొందునది

**వర్ధ్రము** నం వి అ న 1 తోలు 2 సీసము

**వర్ధ్రి** నం. వి. ఈ స్త్రీ తోలువాఱు, టెఁగువాఱు

**వర్ధ్రిక (=వర్ధ్రి)** నం వి ఆ స్త్రీ

**వర్మణము** నం వి అ పుం నారింజ (వృ వి)

**వర్మము** నం వి న్ న 1 కవచము, బొందలము, 2 కాపు, రక్షణము 3 చెట్టుపట్ట

పుం 1 క్షత్రియుల నామాంతమునఁ జేర్పఁబడెడి పదము.

ఉదా ఇంద్రవర్మ, సింహవర్మ మొ

**వర్మహరుఁడు** నం విఙ (అ ఆ అ) 1 కవచధారి, కవచము ధరించువాఁడు 2 కవచము ధరించుటకుఁ (అనఁగా యుద్ధము చేయుటకు) దగిన వయస్సు గలవాఁడు

**వర్మి** నం విఙ (న్ ఈ న్) కవచి, కవచము ధరియించువాఁడు

వి ఇ పుం ఒక జాతిచేప.

**వర్మితుఁడు** నం విఙ (అ ఆ అ) 1 సన్నద్ధుఁడు, చేయఁబడ్డ సన్నాహము గలవాఁడు 2 ఉద్యుక్తుఁడు, పూనుకొన్నవాఁడు

**వర్య** నం వి ఆ స్త్రీ 1 తనంతట మగని వరించునట్టి కన్యక 2 పెండ్లికానిది

**వర్యుఁడు** నం విఙ (అ ఆ అ) 1 వరింపఁదగినవాఁడు, ఎన్నుకొనఁ దగినవాఁడు 2 శ్రేష్ఠుఁడు, ప్రశస్తముఁడు 3 ముఖ్యుఁడు

(కడపటి రెండర్థములయందును సమాసాంతమునఁ దఱచుగా నుపయుక్తమగును)

వి అ పుం మన్మథుఁడు

**వర్వటము=బర్బటము** నం వి అ పుం రాజమాషము, బొబ్బరలు

**వర్వణ** నం వి ఆ స్త్రీ నీలమక్షిక, నల్ల ఈఁగ

**వర్వర** నం. వి ఆ స్త్రీ 1 మక్షికా భేదము, ఒక విధమైన యీఁగ 2 ఒక విధమైన తులసి, నల్ల తులసి

**వర్వరము** నం విఙ (అ ఆ అ) చుట్టలు చుట్టలుగా నున్నది

వి అ పుం 1 ఉంగరాల జుట్టు. 2. ఆయుధములు ఒకదాని కొకటి తగులుట వలనఁ గలిగిన శబ్దము 3 నాట్యవిశేషము 4 కృష్ణార్జక వృక్షము

న 1 పీతచందనము పచ్చ మంచిగంధము 2 సిందూరము 3 జాలెంత బోళము

వర్వరి=వర్వర నం వి ఈ స్త్రీ

**వర్వరికము** నం వి అ పుం 1 చుట్టలుగాఁ జుట్టుకొనిన జుట్టు 2 తులసీ భేదము, ఒక విధమైన తులసి 3 ఒక జాతి మొక్క, గంటుబారంగి (వృ వి ) 4 వాయింట మొక్క (వాచ )

**వర్వరుఁడు** నం విణ (అ ఆ అ) 1 నత్తిగా మాట లాడెడి వాఁడు 2. అరణ్యకుఁడు, అనాగరకుఁడు, మోటువాఁడు 3 బుద్ధిహీనుఁడు, మూర్ఖుఁడు 4 జాతిభ్రష్టుఁడు, వర్ణభ్రష్టుఁడు

వర్వుపని=వరవుడుపని వి దాస్యము

సీ (శ్రీ) వాక్సుధీసురసిద్ధ విద్యాధరదనుజాంగనల వర్వుఁ బనులు గొనఁగ . కు. సం 7 882

వర్ష నం వి ఆ స్త్రీ (సంస్కృతమున బహువచనము) 1 వానకాలము, వర్ష ఋతువు

వర్షకరి నం వి ఈ స్త్రీ ఇలకోడి, కీచుఁబాయి.

**వర్షకోశము** నం. వి అ పుం మాసము, నెల (వాచ )

**వర్షకోశుఁడు** నం వి అ పుం జ్యోతిశ్శాస్త్రజ్ఞుఁడు.

వర్షగిరి నం వి ఇ పుం వర్ష పర్వతము

ప్రపంచమున వేఱువేఱు భూభాగముల నొక దానితో నొకటిని విభజించు సరిహద్దు కొండ ఇవి యేడు

1 హిమవంతము 2 హేమకూటము 3 నిషధము 4 మేరువు 5 చైత్రము 6. కర్ణి 7 శృంగి అనునవి

శ్లో. హిమవాన్ హేమకూటశ్చ నిషధో మేరు రేవచ, చైత్రః కర్ణీచ శృంగీచ సప్తైతే వర్ష పర్వతాః.

**వర్షణము** నం వి అ న 1 వర్షించుట, కురియుట, వర్షము 2 పుష్పములు మొ చల్లుట 3 ధారాళముగా నిచ్చుట

ఉదా ద్రవ్య వర్షణము.

**వర్షణి** నం వి ఇ స్త్రీ 1 వర్షము, కురియుట, వాన. 2 యజ్ఞము, యజ్ఞక్రియ 3. కార్యము, పని. 4. వర్తనము, ఉనికి (విల్యమ్సు)

**వర్షధరము** నం. వి అ. పుం 1 మేఘము 2 వర్ష పర్వతము

**వర్షపర్వతము**=వర్షగిరి నం వి అ పుం

**వర్షపాకి** నం వి న్ పుం. 1 మారేడు (వృ వి ) 2 ఆమ్రాతకము. అంబాళము. (వృ. వి )

**వర్షప్రతిబంధము** నం వి అ పుం. అవగ్రహము, వాన లేమి, వఱపు

**వర్షప్రియము** నం వి అ పుం. చాతకపక్షి

**వర్షము** నం వి అ పుం న. 1. వాన, వాన కురియుట 2 (పుష్పాదులను) చల్లుట (ఉదా) శర వర్షము, శిలావర్షము, లాజవర్షము మొ 3 వీర్య స్రావము, శుక్రము కాఱుట 4 ఏఁడాది, సంవత్సరము. 5 ప్రపంచ భాగము (కురు, హిరణ్మయ, రమ్యక, ఇలావృత, హరి, కేతుమాల, భద్రాశ్వ, కిన్నెర, భారతములను తొమ్మిది వర్షములు) 6 జంబూ ద్వీపము, భారత వర్షము (మే ని ) 7 మేఘము మబ్బు.

**వర్షవ(ధ)రుఁడు** నం వి అ. పుం నపుంసకుఁడు, కంచుకి, అంతఃపురపుఁ గావలివాఁడు

**వర్షవృద్ధి** నం వి ఇ స్త్రీ జన్మదినము, పుట్టిన దినము

**వర్షాంగము**=**వర్షాంశము** నం వి. అ. పుం

**వర్షాంబుదము** నం వి అ పుం వర్షించు మేఘము.

**వర్షాంబువు** నం వి ఉ న వాననీరు

**వర్షాంశ(క)ము** నం వి అ పుం మాసము, నెల

**వర్షాకాలీనము** నం విణ (అ ఆ అ ) వర్షాకాలము నకు సంబంధించినది వర్షాకాలమునఁ బుట్టినది

**వర్షాప్రభంజనము** నం వి అ పుం ఝంఝా మారుతము

**వర్షాభువు** నం వి ఊ స్త్రీ 1. ఆఁడుకప్ప, చిన్నకప్ప. 2 గజ్జెరుపల్లిక (వృ వి )

పుం 1. కప్ప. 2 ఆరుద్ర పురువు 3 ఎఱ్ఱ, వాన పాము

**వర్షాభ్వి** నం వి ఈ స్త్రీ ఆఁడుకప్ప, భేకి

**వర్షామదము** నం వి అ పుం నెమిలి, మయూరము

**వర్షారాత్రము** నం. వి అ పుం 1 వానకాలపు రాత్రి. 2. వానకాలము

వర్షార్చిస్సు నం వి స్ న అంగారక గ్రహము.

వర్షావసానము నం వి అ న శరత్కాలము

**వర్షాశనము** నం వి అ న రాజులు మున్నగువారు పండితులు మొదలగు వారికి సంవత్సరమున కొక మారిచ్చెడి సంవత్సర గ్రాసద్రవ్యము

**వర్షించు** సం అ. క్రి కురియు

సీ. ఎచట నెవ్వరుఁగోర నచటనే వర్షించుఁ **బడు** గింజలనె పండుఁ బుడమి యెల్ల .. దశా 4. 121

ద్వి గడలతాఁకుల మౌక్తికములు చిట్టెగసి, వడిఁ దదంగణ భూమి వర్షించుచుండ . . ద్వి. పరమ. 3 144

**వర్షితము** సం వి అ న వర్షము, వాన

**వర్షిష్ఠుఁడు** సం విశ (అ ఆ. అ) అందఱకంటెఁ బెద్ద వాఁడు.

**వర్షీయుఁడు** సం విశ న్ (యస్) న్ 1 ఒకని కంటె ఎక్కువ యేండ్లు గడచినవాఁడు 2 మిగుల వృద్ధుఁడు

**వర్షుకము** సం విశ (అ ఈ అ) వర్షించునది, కురియునది.

**వర్షోపలము** సం వి అ పుం కరక వడగల్లు

**వర్ష్మము** సం వి. న్ అ న 1 శరీరము, ఒడలు 2 చక్కని రూపము, మనోజ్ఞరూపము 3. ఎత్తు, ఉన్నతి 4 వైశాల్యము

**వర్స** వి. "వరుస" యొక్క రూపాంతరము

1. క్రమము. వర్సవెంబడి గ్రద వంతుల ప్రకారముగా, క్రమానుసారముగ

గీ రాజకులవర్యుఁ డాత్మభార్యాచతుష్క-, సీ యముల వర్సవెంబడి నిద్ర సలుపు శు 3 540

2. పంక్తి

ద్వి తెలుపారి మెఱుఁగెక్కు పలువర్సఁ దలఁచు . పండితా పురా 123 పొ

ద్వి ఇలువర్స దప్పుట యెగ్గు బొమ్మనక పండితా దీక్షా. 43 పొ

**వర్హణము=బర్హణము** సం వి అ న.

**వర్హము=బర్హము** సం వి అ పుం న

**వర్హి=బర్హి** వి బర్హిన్ సం వి ఇ పుం న్ పుం

**వర్హిణము=బర్హిణము** సం వి అ పుం

**వర్హిస్సు=బర్హిస్సు** సం వి న్. పుం

**వఱ** వి (క వరె త వరై) మేర, హద్దు

సీ. ఈ వఱకును సామియిచ్చలోఁ జరియించు మన్ననఁ బురుషులు మాన్యచరితు, లలభర ద్వాజ కశ్యప గౌత మా।త్రికౌశిక జమదగ్ని వసిష్ఠమునులు ... ఘటికా. 2 99.

**వఱకు** అవ్య. దనుకన్.

క. దేవరకంటెను మించువొ, దేవఁకు సమానుఁ డగునొ తెలియఁబడదు మే, మీవఱ కావిభుఁ బోలిన, భూవరుఁ గని యెఱుఁగ మనిన బుద్ధి చలింపన్. ఉ. రా 3. 226

కొన్ని తావులఁ బర్యంతార్థమున దనుక దాఁక శబ్దములతో చేరియుఁ బ్రయోగింపఁ బడుచున్నది.

క కావరమునఁ గానవు నీ, కావర మఱాఁడిచ్చె ననుచు నది చెల్లెను నీ, కీవఱకును విడువు మిఁకన్, నీవరదర్పము నణంగ నేఁడు మృగాంకా. శశాం 5 61.

జ వఱగొడ్డెము

**వఱగొడ్డెము=ఒఱగొడ్డెము** వి. (వఱ+గొడ్డెగము) మర్యాదమీఱిన మాట, వంకర మాట

సీ వరునితో నేప్రొద్దు వఱగొడ్డె మాడుట భర్తమర్మంబు లేర్పఱచు చుంట . భల్లా 4. (శ ర)

**వఱడు**[1] వి ముదినక్క, నక్క

క ధృతరాష్ట్రు నగ్నిహోత్రా, యతనంబున వఱచె వఱడు లగ్నులు శాంత, ద్యుతులయ్యెఁ గాంచె విప్రు, లతిహృదయము లధికశోక తప్తము లయ్యెన్ భార సభా 2. 251.

బ వఱడులు, వంగ్లు

క వఱడులు మన చెరువఁ బెల్లఱచుట బెట్టెదురు గాలి యడరుట గ్రద్దల్, తఱచయి యాడుట విపరీతపు, టఱపులతో రేఁగికాకు లఱచుట గంటే

భార కర్ణ 2 116 ఆం భా 2 83

గీ అశ్వకరికలభాదుల యందుఁ గానఁ, బడుగ వంకుల వాపోవుఁ బట్టపగలు, మొగి వఱళ్ళ మహోత్పాతములకు శాంతి, చూడనద్దేవి మరలఁ బుచ్చుటయ తెస్స భా రా యు 84

క వఱడు లఱచె నుల్కలు వడె, నెఱిచెడి సురగాలి విసరె నిలువక పెలుచన్ ఉ హరి 2 24

చ ఇనుఁ డుదయంబు సేయ వఱ డెవ్వనికై యెదు
రేఁగు నిష్ఠుర, ధ్వని సెలఁగఁగ వాఁడు
యమాలయగామి భూవరా . మార్క-
3 351

ద్వి. వయసెల్ల దిగజాఱి వఱడు చందమున, భయ
పెట్టు పెంపుడు పడుచుల తోడఁ, గలహించి
కొన్ని వెక్కసము లాడినను . సారంగ 2
68 పా 16 పం

**వఱడు²** న క్రి మలాముచేయు

వ వహించి నీరు వఱడిన కొ(ము)ల వెంజామరలు
2 ఙు దా శా 11 90

**వఱద** వి ప్రవాహము

గీ వఱదఁ గాష్ఠముల్ గూడిన వడువబంధు, సంగ
మంబవి నాసివ చాడ్పు తద్వి, యోగము
భార శాం 4 56

మ నెఱయం బున్నమచందురుం జెనయునీ .
వఱదం ద్రోవఁగఁ జేసెనే యకట దైవం బెందుఁ
జొత్తున్ సుతా . భార అర 7 342

ఆ పఱవ పఱద వఱద పఱతి పఱత వట్టు నాఁగ
నిటు ప్రవాహనామ మొప్పు ఆం భా.
1 156

**వఱదఁగలియు**—1. చెడు

సీ జడియక కానేపు జాబిల్లి నీరూపు పదియాఱు
తునియలై వఱదఁగలియ . . కలువాయిళ
14

2 వ్యర్థమగు

సీ నిష్ఠించి యిఖ్ఖంగి నీ కేమ సెప్పిన వాక్యంబు
లెల్లను వఱదఁగలసి, పోయెనే భార అశ్వ
1 12.

**వఱదఁగలుపు**=పాడుచేయు (వఱదన్+కలుపు )

గీ తనకు నదనైన మెయిమెయిఁ జనఁగనిచ్చు,
నయ్య యితరుల ననఁగ నయ్యవనివిభుని,
వ్రతము లన్నియు గొనిపోయి వఱదఁ గలిపి,
చిత్తమంతయు గసిబిసి చేసి విడిచె భోజరా
7. 100.

**వఱదఁగూర్చిన చింతపండగు**=చెడు,నశించు.

సీ చింతింప వఱదఁ గూర్చిన చింతపండయి నీటఁ
గూడె హిమాంశు నేర్పులెల్ల ... చంద్ర.
2 168

**వఱదగొను** అ క్రి (వఱద+కొను) ప్రవహించు,
వఱదవాఱు.

లయవిభాతి తఱుచు రుధిరచ్ఛటలు వఱద గొనఁ
గుంభములు పఱియలయి కుంజరము లొఱ
లుచుఁ బడన్ భా. రా యు 661

**వఱదపాలగు**=నశించు

సీ నాయెల్లి నీడననరలోక మేలుదు ననులావువఱద
పాలయ్యె నన్న ... ఉ హరి. 4. 300

సీ వర్ణాశనంబులు వఱదపాలై పోయె మలవ
శీలను ప్రజల్ మాసి చనిరి .. రామలిం. 89

**వఱదపాల్ చేయు**=పోగొట్టు, చెఱుచు

ద్వి అరయంగవగు సూర మవ్వక యనఁగ, సాధు
మార్గమున నిచ్చట నుండియుండి, వైధవ్యవర్త
వల్ వఱదపాల్చేసి...పండితా దీక్షా 39 పా

**వఱదఁబోవు**=పోవు (వఱద+¹పోవు)

సీ విడువమా యిన్నాళ్లు విడిచిన నది పోయి
యేటికిఁ జిక్కాఁగి యుంట వ్రాలె, వ్రాలిననది
యట్టె వఱదఁబో నిమ్మని యూరక యేమిటి
కుండనైతి. సారంగ 2 145

జ , వఱదగుడి, వఱదవాఱు, వఱదలుగట్టు.

**వఱదగుడి** వి (వఱద+గుడి) సూర్యాదిపరి
వేషము (శ ర )

**వఱదవాఱు** అ క్రి (వఱద+పాఱు) ప్రవహించు

ఆ త్రిప్పి నేలపైవ డిగ్గన రక్తంబు, వదనగహ్వ
రమున వఱదవాఱ... భాగ 10 పూ 1368

గీ అంత నచ్చట రాచూలి వంత బెరయఁ, దోడఁ
బుట్టువుగాఁడివ తూపు వెటికి, వైచి క్రొవ్వేఁడి
కన్నీరు వఱదవాఱఁ, బలు తెఱంగుల నిట్లని
పలువరించె . అచ్చ రా యు 391.

**వఱదలుగట్టు** అ క్రి (వఱదలు+కట్టు) వఱదలు
వాఱు, ప్రవహించు

చ మఱియు బహుప్రకారముల మర్మము లెత్తుచు
నత్త దిట్ట ని,వ్వెఱఁగువ నాశ్రమ స్థలము
వెల్వడి సత్వరయానలీలఁ గ్రిక్కిఱిసిన చన్ను
దోయిచలియింపఁగ వచ్చె దృగంబుపూరముల్,
వఱదలు గట్ట నేడ్చుచు విలాసవతీమణి పుట్టి
నింటికిన్ వరాహ 2 186

**వఱపు** వి వానలేమి, అవగ్రహము

సీ వహ్నియు భయమును వఱపును గఱవును నాది గాఁగల యెగ్గు లడఁగెఁ బుడమి భార సభా 1 2 71.

క వఱపున సస్యము లొదవమి, వఱిముఱి దైవంబు చెద్దు వాతేఁడులు పెన్, కఱవైన భూమిఁ గల ప్రజ . దశకు. 10. 75, నా పంచ. 2 144

వఱల వి. వృద్ధతపప్వి అ ప్ర (శ. ర)

వఱలు అ క్రి 1 ప్రకాశించు, ఒప్పు.

సీ. మెఱుపునుం బోలెను వఱలు నుత్పలగంధి బహుతరతను సౌరభంబు గలుగు . భార ఆది 7 159

సీ వంది కందిన నింత వఱలెడు ముఖరోచు లెల మిన నెంత సల్లలిత మగునొ ... కు సం. 7 838 హరి పూ 1 131.

2 ప్రవర్తించు

క. గుఱు తెఱిఁగి వస్తుచయమున, కొఱఁగెడు నా దీపవర్తి యనుబోలె నిజం, బెఱిఁగి కృత వస్తు సమితికి, వఱలఁగ మదినెఱుఁగు విబుధ వర్గముఁ దలఁతున్ కు సం. 1 26.

సీ పలుమఱుఁ జలువతావులఁ జేరి పొరలుచు వంకర నడలచే వఱలియరిది. అచ్చ. రా బాల. 106.

3. వ్యాపించు

క ఉఱుములతో మెఱుములతో, వఱచెడు పెను గాలితోడ వడగండులతోఁ, దఱచగు పిడుగుల తోడను, వఱదలపై వఱద లెగయ వర్షము గురిసెన్ పరమ 1 81.

4 కొన్నిపట్ల వాక్యాలంకారము.

క ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు, వఱలఁ గనలు గడలఁ బడ నవారిత వృష్టుల్ భార ఆది 8 270. భార, ఆది. 6 114., భార. సభా 1 211

వఱువట్లు వి బ (వట్టులు + వట్టులు) మిక్కిలి యెండుటలు

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె . . భార విరా 2 88

సీ. వాతెఱ తడిలేక వఱువట్లు వట్టంగఁ బెదవులు దడుపుచు బెదరి చూచు విజ్ఞా వ్య కాం. 45

క. విరులుఁ జిగుళ్లును జోరువుగ, సిరిగందపుటన లొకింత చిలచిలమని వే,గిరము వఱువట్లు గొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముంగని కలఁకన్. కళా 6 255

వఱువట్లుగొను అ. క్రి (వఱువట్లు + కొను) మిక్కిలి యెండు

క విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగంద పుటన లొకింత చిలచిలమని వే,గిరము వఱువట్లుగొనఁ గడుఁ, బొరలెడి తరలాక్షి తాపముం గని కలఁకన్ కళా 6 255. (శ. ర)

వఱ్ఱియ(ఱ్ఱి) వి కీటిక (శ ర)

వఱ్ఱు వి ఔ అనౌ ప్రవాహము, వెల్లి

ఉ. . ప్రేటులఁ గ్రీడసల్పి వృథివిం బడు పీరులఁ ద్రొక్కికొంచు నె,చ్చోటుల నైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱుసేయుచున్ భార విరా. 3 163

క హీనప్రజ్ఞుఁ డకార్యము, లైనవి సేసి తుది వగచు నతులప్రజ్ఞా, సానుమచారూఢుఁడు వగ, మానఁడు దురితమనువఱితి కోడక యునికిన్ భార. శాం 3 352

వ మిన్నేటి పెన్నీటి వఱ్ఱున మునుంగ కుండ ... మనుచ. 3. 9

విజ అధికము, మిక్కుటము

ఉ గొట్టెలు పాడిపైరములు కోకలుదూకలు ముందు ముందుగా, వఱ్ఱుగనిచ్చి వచ్చి తల వాకిలిఁ గాతురు రేతిరింబగల్, గుఱ్ఱ వయస్సు మల్లరపుఁగోఁడెలు సైరికరాట్కుమారకుల్. వైజ 2 72

క పూనివడిఁ దిగిచి యష్టమ,హా నాగమ్ములను మిద్దియలుగా బ్రేళ్ళన్, మానుగఁ గొందఱు దాల్తురు, వాని ఫణామణుల రుచులు వఱ్ఱుగఁ బ్రమథుల్ శివతత్వ 336 వ

వఱితిపాలు = ప్రవాహాధీనము, వ్యర్థము

ఉ సీదుసం, భావన లన్నియున్ వఱితి పాలుగఁ జేయుట నాకు మంచిదే, జీవిత కాంతు గాదు .. భా రా యు 1619

వఱితఁగలయు = ప్రవాహమునఁ బడిపోవు, చెడు, నశించు

క కనుఁగొని సింహద్వీపా, వనినాథుఁడు తన తపంబు వఱుతం గలయన్, మనసిజభీషణ సమ్మోహనశాణపరంపరాభిహతమానసుఁడై వరాహ 8 123

క మున్నొనరించిన పాపము, లన్నియుఁ బెను వఱుతఁ గలయు నవగాహన సం,పన్నులకు . విక్ర 2 214

జ వఱ్ఱేఱు, వఱ్ఱోడి, వఱ్ఱోడు

**వఱ్ఱేఱు** వి (వఱ్ఱు+ఏఱు) మంచి ప్రవాహముగల నది

ద్వి ఒదవంగ వఱ్ఱేట నోడ యుండంగ, వద రూఢి నట్టు శివసుమతిలోన బస పు 201 పా 20 పం

ద్వి చక్కడ్చి రారోటఁ ద్రొక్కి దేహంబు, గ్రక్కున వఱ్ఱేటఁ గలుపంగఁ జూచు .. పండితా పురా 144. పా

**వఱ్ఱోడి(డ్డి)**=వఱ్ఱోడి వి ప్రవాహము

ఉ వారణ దానవాహినులవఱ్ఱోడిఁ దేలుచు నున్న వాఁడు . కు సం 11. 671

ఆ అతిరయమునఁ బఱచు నయ్యేటివఱ్ఱోడి, పోయె దవ్వుగాఁగ ఘూవిభుండు మార్క. 6 230

**వఱ్ఱోడి**=వఱ్ఱోడి (√ వఱ్ఱోడు) ప్రవాహము

సీ. బెడిదంపు వఱ్ఱోడిఁ బడిన పేరడవి చందంబున ఒహుల పదాతిచయము .

గీ వికటముగఁ ద్రెళ్లె వలుగడ విచ్చె నొక్క, పెట్ట వెస డొల్లె నిజఁ జాఁపకట్టుబడియె భార ద్రోణ 3 62

గీ విలసితోత్తుంగశశికాంతశిలలఁ గదిసి,యరుగు శశిఁ గని శిలలెల్లఁ గరంగి పెరిగి, తెరలి పర తెంచు వఱ్ఱోడిఁ దేలిపాఱు, నుడుగణేశుండు వెండి పేరోడవోలె. కు సం 3 253., భార అను 2 446 , భార. శాం 3 307

**వఱ్ఱోడు** అ. క్రి (√ వఱ్ఱు) ప్రవహించు

క తేనియమునురో యమృతవు, వానయొ పుండ్రేక్షురసము వఱ్ఱోడిన పెల్లో నాఁ దుంబురునారద, గానరసం బతవు నోలగంబునఁ బర్వెన్ కు. సం 9. 285.

**వల¹** వి (క బలె త బలై ) 1 జాలము, చేఁపలఁ బట్టు సాధన విశేషము
(దీని భేదములు—అనుకువల, ఎడవల, డొంకవల, త్రోపుడువల, దాఁటుడువల, మెడవల, సన్నవల మొ (శ ర.)

ఆ వానినెల్లఁ ద్రుంచి వల ద్రవ్వికొని శీల, నిగుడు చోఁబవోలె వెగడు వడక, తటిమి రక్తనదులు వఱపె భార కర్ణ 3 158

క నీవలకుఁ జిక్కె లోకము, శివల నీవలకుఁ జిక్కదే జలరాశిన్ దశా 1 160

2 గాలము.

ఉ ధీవరులార గాలము తుదిం బదిలంబుగ నెఱ్ఱ గ్రుచ్చి మీ,రీ వగవై చివం దగులనేటికి నాకిది వింత మాంసముం, గావలె నంచు వచ్చితిని గావున నీవలనేఁడు మీహాయ, గ్రీవుని గ్రుచ్చి వైపుఁడు దశా 1 280

3 మృగములు పక్షులులోనగు వానిని పట్టెడు వాగుర, ఉచ్చు

క వెలివాఱును గాలురులును, వలలుఁ దెరలు దీమములును వడిఁదీరిన కు,క్కలు నారెగోలలును నుం,డల గ్రోవులు వేఁట కారడంబుఁ దెను పఁగన్. ఉ హరి 4 22

ఆ ... మూతి నరప మీనముల బోయముదుసళ్లు, పంది వలలు మోచిపరచిఅపుడు మనుచ. 4 36

4 మాయ

క నీ వలకుఁ జిక్కె లోకము,శివల నీ వలకుఁ జిక్కదే ... దశా. 1 160

**వలఁబడవైచు** = మోసముచేసి వశపఱచుకొను.

గీ తరుణులందెల్ల సముఁడైన దక్షిణుండు, నేరములుచేసి పెక్కు నివారణంబు, లొందియును జేరుధృష్టుండు సుందరులను, వలఁ బడవైచు వాఁడెందు వెలయు శరత. గంధ. 1 180

జ వలత్రాడు, వలరాయఁడు², వలవాఁడు.

**వల²** వి కామము, వలపు

క కాదంబరిఁ ద్రావింతును, జూదం బాడింతు వలఁ జొక్కులఁ బెట్టం, బైదలుల నియోగింతును, వైదర్భతనూజమీఁది వలపుడిగింతున్. నైష. 7. 120.

క ల్రావాలని నీ చన్నులతో, ల్రావాలెదు జక్కవలు సరియె వలలం బెట్టం, జాలెదు నీ కన్నులతో, బాలకి సదృశములె వలలఁ బడు మత్స్యంబుల్. ల్రీడా 1 91

క ఈ రీతిఁ గొంతకాలం, బారామమహా మహీధ రారణ్యములం,దారామవలలఁ దగిలి వి,హారము సలుపంగ గర్భమై తటియగుడున్. మనుచ 6 37

జ . వలకాఁక, వలకాఁడు, వలకారి, వలకారి తనము

వల[3] విశ కుడి, అపసవ్యము.
(వలనుశబ్దమునకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము )
చూ వలకన్ను, వలకేలు మొ

వలంబము = అవలంబము సం వి అ పుం.

వలఁకు = వలను వి 1. దిక్కు.
క నాలుగువలఁకుల నవఘన, జాలంబులు ల్రావి కురిసె ఝుంఝూనిలవే, గాలోలములై బహుళ, స్థూలపయోధార లోలిఁదుములంబులుగాఁ భార. అర 4. 135
చ కొలఁకులు దేఱెఁ బద్మినులకుం గనువేఁదురు దీఱె మేఘముల్, వలఁకులఁ జేఱె డొంకలను వంకలఁ బంకములాఱె ... కృ. శకుం 1 44
క పొంకించుఁడు మీ యిట్టులఁ, గొంకుల సీసంపుగుండ్లఁ గొమ్ములు నురులం, బొంకించి దిగువ గాలివలంకుల బండంగి బండ్లు వఱ పుండనుచున్ ... కకు. 4 73.
2. పార్శ్వము
ద్వి వలఁకుల ల్రాసిన వన్నె చిత్రములు, దలలు గదల్చెఁ జైతన్యముం బొరసి . . ద్వి హరిశ్చ పూ 972
3 ఒప్పిదము
చ వలకుఁగ మిన్ను మానికపువంగడపుం దొర లెన్నఁడేనిఁ బాటులయెడ వల్గబోదురె యెటుంగ మిసైన బెడంగుడాల్గనీ . . అచ్చ రా. బాల. 205

వలఁతువు వి వలఁకు, దిక్కు (శ ర )

వలఁతి విశ 1 ల్రవీణుఁడు, నేర్పరి.
మ హిత మిళ్ళంగిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నంచేను నీ, మతి బోధింప వలంతివే... భార ఉద్యో 3 80
ఆ . వలఁతివి నా తోడ, నాడు మనిప భాగి యను మతమున దశకు 5 68
2. సమర్థుఁడు, సమర్థురాలు.
మ కురువీరాగ్రణి బాహ్లికుం డలిగినం గోదండ పాండిత్య మెవ్వరుఁ జూపంగవలంతులే . ఉ హరి 4. 128
గీ ఇతని కియ్యమకును విను మేనచువ్వె, వలఁతి శుశ్రూషసేయంగ వత్స భార ఆశ్ర 1 148
3 అనుకూలము
గీ వరుణునకు డాఁగికొనఁ బోటు వలఁతియగుట నుదధి నాయక భావంబు నుపకరించె పారి 5 12
జ వలఁతితనము, వలఁతియీఁటె

వలఁతితనము వి (వలఁతి+తనము) ల్రావీణ్యము, నేర్పు
గీ . అజ్జన్నిగట్టుఁ, గొలము తలమానికము తన వలఁతితనము, గనఁబడఁగ నిట్టులని తెల్పఁగాఁ దొడంగె ...

వలఁతియీఁటె వి (వలఁతి+ఈఁటె) ఒక విధమగు ఈఁటె, కుంతవిశేషము
గీ. వలఁతియీఁటెలు ధరియించి వచ్చి రలర, రక్షకులు శాతతరముల ల్రాఁతవారు పి శకుం 1 113

వలకట్టు స ల్రి (వలను+కట్టు) అనుకూలపఱచు కొను
వ. అతఁడు దాను విద్యాధికుండు కాకుండుటంజేసి నిజగౌరవశైథిల్యభయంబున నితరులగు విద్యాధికులకు రాజగృహంబునఁ బ్రవేశంబులేక యుండ దౌవారికాది సకల పరిజనచక్రంబును వలకట్టుకొని యుండుటయు.. కళా 6 155

వలకడ వి (వలను+కడ) దక్షిణపు దిక్కు. (శ. ర )

వలకన్ను (వల[3]+కన్ను) కుడికన్ను, దక్షిణ నేత్రము.

సీ పచ్చవార్వపుఁజోదు పచ్చవార్వపుఁజోదు వలకను కొడుకునై వలపు గులుక అచ్చ రా జాల 3

**వలకాఁక** వి (వల$^2$+కాఁక) మన్మథాగ్ని, విరహ తాపము

సీ సకియనుం గెమ్మోవిచక్కెర జుఱ్ఱక వలకాఁక పెనుదప్పి వదలు టెట్లు . నీలా 2 36

**వలకాఁడు** విఙ (వల$^2$+కాఁడు) కాముకుఁడు (శ ర)

**వలకారి** విఙ (వల$^2$+కారి) కాముకుఁడు, వలపించు వాఁడు, వలపించునది.

వ .. నారులంబు నారతరంబులకు వెలయించి కొనిపోవువలకారుల జారుకొప్పుల దొరఁగు విరి గుత్తులతో .. వసు 4 23

సీ ఎఱుగు నాయనఁ గూడ దివ్వుడిప్పుడు కొంత గడిదేఱలే వలకారి వగల ... కువల 3 92

గీ తలిరులకటారి వలకారి ఘాటిఘోటి, చిలుక చిలుకలకొలికి ముంగలను నిలిచె అచలా 2. 94

సీ వక్రభావంబులు వలకారి బాగులు వలసి యొల్లములును వట్టిపసలు పాండు 3 43

**వలకారితనము** వి (వలకారి+తనము) కాము కత్వము

సీ పలుమాఱుఁ దనమ్రోల కలికి చేఁతుల కోడి వలకారి తనమున వన్నెఁ బెట్టు ... వి పు 6 19

**వలకేలు** వి (వల$^3$+కేలు) కుడిచేయి

మ వలకేల్దాపలికిం గుచస్తబక సేవాలోలతం బోవ కళా 1 3

**వలక్షము** సం విఙ (అ అ అ) తెల్లనిది, శుక్లము వి అ పుం తెలుపు, శుక్లవర్ణము

**వలగండ** వి. శూద్రులలో నొక తెగ

వ వెలమ వేకరి పట్రగొల్ల బలిజ కుమ్మర వల గండ బెస్తల చిప్పె తొగట గాండ్ల వారును... హంస. 3 29

**వలగాక** అవ్య (వలనగు ధా. వ్యతిరేకక్త్వార్థకము) వ్లలమపడక, వీలుపడక

మ దనుజాధీశ తపోనలంబు త్రిజగద్దాహంబు గావింప నెం,దును నిల్వన్ వలగాక వచ్చితిమి తోడ్తో వహ్నివారింపుము .. దశా 4 76

**వలగొను** స క్రి (వలను+కొను) 1 ప్రదక్షిణించు, చుట్టుతిరుగు

క వినయంబున మ్రొక్కి బంధువితతిం బ్రీతిన్ భా రా సుంద 20

క వలగొని యాలింగనముల, నలరించుచు వారి చేత నాశీర్వాదం, బులు గైకొనుచును. భా రా సుంద 21

చ చెలఁగి వివాహ వైభవముచేకొని రాముఁడు సీతయున్ శిఖన్, వలగొని వచ్చి సప్తముని వందనమున్ గురువృద్ధబంధు మం,డల యుగ పత్ప్రణామము నొనర్చి పరస్పరలజ్జ జాత్సరం, జెలఁ దగువారితోడుత భుజించిరి బువ్వమునన్ వధూవరుల్ రామా 4 127

క అని పలికి యపుడ యనలము, ఘనముగ దరి కొల్పి మది వికాసముఁ బొందన్, దన వల్లభుఁ దలఁచుచు వల,గొని లీలం జొచ్చి యతనిఁ గూడం జనియెన్ .. భార శాం 3 336

2 చుట్టుకొను, పరివేష్టించు

సీ ప్రతిరోధి వరణవర్గముఁ ద్రోచి తన్మహా భోగ శాలి క్షేత్రములు హరించు, వలగొన్న బహు రాజ వంశ గుల్మంబులఁ బలుదెఱంగుల గ్రుచ్చి పాఱవైచు . వసు 1 68

సీ మినువాఁక వలగొన్నగొనబువిన్నొప్పువైఁ గలిగి కొన్నెల వంక వెలయువాఁడు పె శకుం 1 13

క చెలువెల్లఁ దల్లడిల్లుచు, వలగొని దరినిలిచి యకట వలవంత నెకల్, బలువయ్యె ... నీలా 3 31

**వలగొల్పు(లుపు)** స క్రి (√ వలగొను) వలగొను, వలగొనఁజేయు, వలయాకారముగ మంచు

చ ఉవిద తదుక్తి కంత చెవియొగ్గక పోఁబెనఁగ న్విభుండు కేల్దవిలిచి చుట్టునించుక యొడన్ భుజముల్ వలగొల్పి పొమ్మనన్, సువదన వెల్వ డందిరుగ శ్రోణిభుజ స్తన వేణికాధర, శ్రవణక పోలముల్ పతిని సారెకు సోఁకుచుఁ దేల్చె ద్దివులన్ ప్రభా. 5 41

వలగ్నము=అవలగ్నము సం వి. అ పుం. న. మధ్యము, నడుము

వలచు¹ స అ క్రి (సం. వల్) 1. అపేక్షించు. కోరు.

క వేవురఁబోలెడు వాని మహావీర్య గుణాఢ్యు నొక్క యాత్మజుఁ బడయంగా వలతు నపేత గుణుల్, వేవురు సుతులయ్యు నెందు విఫలము కాదే . భార ఆర 2 350

ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు, జేల నీకుఁ జెప్పనేల వలసె భార సభా 2 228

గీ నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య, రహిత చిత్తులు మగవారు రాజు దీనిఁ, దలఁచి భయ మంది నిన్ను నీ వలఁచు నెడకు, నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె .. భార విరా 3. 69

వలచు, కోరు, ఇచ్చించు దీనికి వ్యతిరేకార్థము లందు 'ఒల్ల' అనునది విభాష నాదేశం బగును

ఉదా. వలవఁడు=ఒల్లఁడు

చ ఉరవడిఁ బోరికై కవచమొల్లరు మంత్రము లందుఁ దక్క ఆము. 2 34

చ . . పవినయత్వము ధైర్యము చిత్రమయ్యె నీ, వలచినకోర్కులిత్తు వనివార్య బలోజ్జ్వల వేఁడు మిచ్చెదన్ . బ్రహ్మోత్తర 4 289

చ వలచినయేని నభ్రువనవంద్యునకున్ శివయోగి నేతకున్, బొలకయిగారవం బయిన పుత్రకుఁ డొక్కఁడ .. పార. 2. 68.

2 కామించు, మోహించు.

క. సుందరి మా యిద్దఱలో, నందెవ్వరి వలతు నెప్పుమా యనవుడు .. భార ఆది 8. 110.

చ తన మది వల్చుభామినికి దక్కిన నిక్కఁపు మోహిఁ బోలెనే, మనుజుఁడు బుద్ధి నిల్పు మురమర్దన దివ్యకథానుభూతిపై, వనిశము మత్రి యుం డతఁడ యట్లగుటన్ వినుపింతు నీకునేఁ, గని వినియున్న గోప్యమున గమ్యమునైన యథఃప్రపంచమున్ . పాండు 2 219

మ తొలుతన్ మేణావ కింతసేవు పెనఁగున్ దోడ్తోడ నా నక్తిమై, నలువున్ సిబ్బితి వల్పి యున్ వలభమిన్ నైరించి యంతన్ ధృతిన్, దొలగించున్ బ్రియముప్పతిల్ల రతులన్ సొక్కించి, మల్లభూ 2. 24

చ . . వలవఁగఁ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్ పారి పీరి 22

ద్వి ధర్మమా జగతిలోఁ దనయుని వలచు, దుర్మార్గురాలని దూషించువారు . సారంగ. 3 107 పా 1 పం

అ క్రి 1 తగు, యుక్తమగు

గీ వనమునకు వచ్చి నవయంగవలవ దుడుగుఁ డనిన నుడుగక మీతోన యరుగుదెంతు, మనిరి, బ్రాహ్మణుల్ భార ఆర 1 36

క వలవని ప్రేలరిమాటల, నలిగింపకు నన్ను నేమి యాడిన నింకం, దల ద్రెవ్వ నేయుదున్ భార ద్రోణ 5 370

చ. వలవదు తల్లి నీకుఁ దగువాని వయోగుణ రూపవంతు నీ, వలచిన వానిఁ జేసెద నవశ్యము నీవు దపంబు సేయఁ బోఁ,దలపకు మమ్మ ... కు సం 6 664

2 అక్కఱయగు, ఆవశ్యకమగు

వ్యతిరేకములందే యీ యర్థమున దీనికిఁ బ్రయోగము

క ... ఇందులకై, నీయత్నము వలవ దవల నేను న్నాఁడన్ ... ఆము 2 93

సీ గజరాజగమవసింగారంబుఁ గనుగొనవలవదే కన్నులు గలుగు ఫలము . . దశా 2 307

క ఇక్కడ నిను వీఁ డెవ్వఁడో, యిక్కరణిన్ మోసపుచ్చి యేలుకొనంగా, నక్కట వలవని శంకల, నక్కడనే పాడుకాపు లాగతినుంటిన్... కళా 3 260

3. సమర్థుఁడగు

ఆ ద్రోణకర్ణశల్యదుర్యోధనులుఁ గృప, బాహ్లికులును జముఁడు పట్టికొన్న, వానినైనఁ గావ వలతురు వలచిన, నొల్లకున్న నెట్టులొకొ యెఱుంగ ... భార ద్రోణ 2. 290

(వలఁతులు భా ల వ్యా. పా )

సీ మనలోన నెవ్వరే మాత్రంబు దాటఁగా వలతురో కనుఁగొన వలయు దశా. 9 10

4. ప్రియపడు.

గీ. చాల వలచితి వతని నే సత్యమిదియ ...
నైష 2 26

గీ వలతునే భక్తకోటికి పారిజాతి, లలన యా
భక్త కోటియు వలచు నాకు హర 2 13

ఒల్లనయ్యెద అ క్రి ఒప్పనైతి.

చ . అ, న్నవచనవృత్తి నాదగు మనంబున
నెక్కొని యున్కిఁ జేసి యా,హవమున కొల్ల
నయ్యెదఁ బ్రియంబులు గావొకొ మీకుఁ
బ్రాణముల్ భార అశ్వ 4 7

జ వల², వలదొర, వలపించు, వలపు¹, వలపు
గోలుపు, వలపుకత్తియ, వలపుకాఁడు, వలపు
కీలు, వలపుటిక్క, వలపుదేవర, వలపు
రాయఁడు, వలపులరాచజోదు, వలపులరాజు,
వలపులఱేఁడు, వలపులాఁడి, వలరసము, వల
రాకటారి, వలరాచపని, వలరాచరాచవాఁడు,
వలరాచలచ్చి, వలరాచవాఁడు, వలరాజు, వల
రాసెక్కెము, వలరాయఁడు, వలఱేఁడు, వల
వంత, వలవంతతనము

వలచు²(లు్చ) అ. క్రి 1 (వాసన) గొట్టు

క పొలవలచు నేమికిడొకో, కలిగెదు వని తలఁచి
మనసు గలఁగఁగ . భార శాం 3 500

తరలము తనువు మీన్పొల వల్చు జాలరి దావ
నట్లును గాకయే, ననఘ కన్యక .. భార ఆది
3 40

సీ. పఱిచుంచుఁ దలలును ..

ఆ . . గదురు వలచు కంపుగాలిమచ్చాయయుఁ,
గలుగు నెఱుకు ముసిఁడి గనిరి సతులు ... కు
సం 6. 694

చ. . లే జవరాలు చెక్కుగీఁ,టిన వసవల్చు జాల
కుఁడు డెందమునం గలఁగంగ నేర్చునే నైష
1 17

సీ ... త్రోళ్లు ప్రేలాడెడు తుంటిపై బ్రహ్మ
కమ్మల చింపి దోవతి ముటికి వలవ,

గీ. ముసలిబ్రాహ్మణుఁడై వేదములు చదువుచు . .
వరాహ 6. 17

వల్వమి వి వల్చుధా వ్య భా.

ద్వి కాయధూపం బొండుగంపు వల్వమియుఁ,
గ్రాయంబుతోడన కైలాసమునకు ... అరుగు
చెంతయును జోద్యము గాదె ... పండితా.
పురా. 137 పా

2 పరిమళించు, సువాసన గొట్టు

గీ వలచుఁ గస్తూరి నిగరాల తలుపు దెఱవ, గాజు
టోవరిలో ధూపగంధలహరి ... నైష.
7 154

సీ కసటువో బీఱెండఁ గరఁగి కఱ్ఱల వంటి గమగమ
వలచు చొక్కపు జవాజి . మనుచ 2 55

ద్వి .. బుగ బుగ వలచు కర్పూరంబుఁ
బునుఁగు ద్వి హరిశ్చ పూ 683. పం

3 దుర్వాసనవేయు, దుర్గంధముఁగొట్టు

గీ పదహతి బ్రస్నివలచు, వరుగుఁ దఱచగు
ముఖుబ్రోవ వరిగి యెదుట, .. అము 6. 17.

ప వలపు², వలపురాల్పరి, వలపుమోపరి, వలపు
కొండ.

వలచుట్టు న క్రి (వలను+చుట్టు) పరివేష్టించు, చుట్టు
కొను

క. సురకామిని దన నయనము, లరుదుగ వల చుట్టి
వచ్చుననుట నిజముగాఁ, దిరుగుచుఁ బరిమండలి
తాం,బరపల్లవయై నటించె మరుగొడుగు
క్రియన్ ద్వా. 1 134

(వృత్తిని వర్ణలోపము )

ద్వి అలమౌనిసుతుఁ డున్నయట్టి కుంజంబు, వల
చుట్టియుండిరి వలచుట్టినట్లు . ద్వి పరమ.
2 66 పా. 15 పం

అ క్రి

ఉ నావలచుట్టి హర్షకలనావలమానమనోంబుజం
బుతో, నావలవైరిఁ బల్కు వచలాగ్రణి ...
వసు 5 26

ద్వి చనుదెంచి యాహస్తిశైలవాసునకు, వలచుట్టి
రాఁగ యాళ్వంరారు వారిఁ, దెలియంగఁ
గన్గొని .. ద్వి పరమ 8 591. పా 5 పం

వి వలగొనుట. (శ. ర )

వలచూడ్కి వి (వల³+చూడ్కి) కుడికన్ను

సీ అలిగి బలారి సౌరాష్ట్రంబు నిగిడింప నదికారి
వలచూడ్కియందు డించె ... పారి. 5. 30

వలచే=వలచేయి వి. (వలను+చే) కుడిచేయి.

చ. ... అదరుచు నట్టహాసముఖుఁడై వలచే గదఁ
ద్రిప్పుచున్ హరిన్ ... భాగ. 10 ఫ 916,

ఉ ... వరాధమున్ సమరకుంభినికిన్ బలియిత్త మంచుఁ గా,ర్చిచ్చునబోలె మండి వలచే భిదు రంబు ధరించి సాహిణుల్, దెచ్చిన కత్తలాని జవధిక్కృతగంధవహంబు నెక్కినన్ వరాహ. 3 40

**వలచేయి**=వలచే వి (వలను+చేయి) కుడిచేయి.

మ వలచేతన్ వరిగింజ గిల్లి సదయత్వంబొప్ప నా విప్రము, ఖ్యులపై నాతఁడు వైచె . పర. 2 119

**వలజ** సం వి అ స్త్రీ 1. చక్కని చూపుగల అఁడుది. 2 భూమి (శ ర.)

**వలజము** సం వి అ న 1 వరిమడి 2 పైరు 3 ధాన్యరాశి 4. పురద్వారము 5. యుద్ధము (శ ర)

**వలతి** వి స్థానము

ద్వి వసువులు ధరియించి వారకకొల్చి, వసుపదం బది దమవలతిగా గొనిరి . పండితా దీక్షా 18. పా

గీ వచ్చె వలకూబరుండున్న వలతి కతివ ... యయా 2 99.

(శ ర పా "వలని కతివ" ముద్రిపా )

**వలతీరు** వి (వలను+తీరు) కుడివైపుగా వెడలుట

గీ గొనకొనంగో(?) యేట్రింత కొంకినక్క, నెమిలి యీ నాలుగిటిదర్శనంబు లిస్స, వీని వలతీరుఁ బలుకు నుర్వీజనులకుఁ, గొంగు బంగారమంద్రు శాకునికవరులు క్రీడా. 52

**వలత్రాడు** వి. (వల+త్రాడు) వల్లెత్రాడు, పశు బంధనరజ్జువు

క వలత్రాళ్ళు వైచి యయ్యెడఁ, బలుమాఱును దఱిమి ... నీలా 2 65

**వలదిక్కు** వి (వలను+దిక్కు) దక్షిణ దిక్కు.

ద్వి అమితతపోధనుండగు కుంభతనయుఁ, గ్రమ మొప్ప వలదిక్కుకడకుఁ బంచినను . ద్వి పరమ. 1 27 పా

**వలదిరుగు** అ క్రి (వలను+తిరుగు) ప్రదక్షిణము చేయు (త్రా ని )

**వలదు** విశ 1. అధికము.

ఉ చక్కిలిగింత పెట్టినను సారెఁ గిలాకిక నవ్వుచున్ బయిం, బక్కఁబడంగఁ జక్కని కుమారుని ...

నక్కట ముద్దులాడ వలదా వలదా యిటువంటి భాగ్యముల్ సారంగ 1 11

(శ. ర 'కలదా యిటువంటి భాగ్యమున్' తాళ పత్ర ప్రతిపా )

**వలదొర** వి (వలపు[1]+దొర[1]) కాముఁడు, రతి పతి.

చ కొలుకుల కెంపు సొంపు రహిగుల్కెడు తారల నీలిమంబు కన్, బెళుకు మెఱుంగులుం గలసి పెంపమరెన్ హరిణాక్షి చూపు ల,వ్వలదొర ముజ్జగంబు గెలువన్నవ చూతదళంబు మేచకో, త్పల మరవింద మొక్క మొగిఁ బట్టి ప్రయో గము సేయు కైవడిన్ అని 2 29

చ వలదొర మెచ్చఁగా ఘన సువర్ణ పలాశక వాస నాగతిన్, గలసి రజస్స్ఫులింగములు గ్రక్కుచు నీవలివేగ చేరిరా, నలినిభయానఁ దా జెనసి నెమ్మది పూనికంటివే, నలినిభయాన దా రెనసి నవ్వలతల్ తెలిపూల చాలుచేన్ చంద్రి 4 68

**వలన** ప్ర ప్రు పంచమీ విభక్తి ప్రత్యయము

1 విశ్లేషము, ప్రభవము, ప్రమాదము

క ఒక్కచూత ఫలంబ,య్యవనిజము వలన నమ్మౌని, ప్రవరుపృథూత్సంగ తలముపై వడిఁ బడియెన్ భారం సభా 1 142

ఆ మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు, వలనఁ బాయవలయు వసుమతీశ .. భార సభా 2 259

ద్వి తనరుగంగామహాత్త్వంబు గౌతముని, వనితను శాపంబువలనఁ బాపుటయు . . రం రా బాల. 7. పా 1. పం

క దీని తెఱఁ గెఱిఁగి నట్లమ,హానిపుణుఁడు విదురుఁ డురువిషాగ్నులవలనన్, మానుగ నేమఱకుండని . భార ఆది 6 151

చ నరవరుఁడైన భీమువలనం ప్రభవించె హిడింబ కున్ సుతుం, డురుతర భీమరూపుఁడు . భార ఆది 6 232

2 భయము

చ . . దేవతా,దుల వలనన్ భయంబు ద్రుపదుం డెఱుఁగండు తదీయ దేశముల్, దలరక యొప్పె . భార ఆది 8 8

క. ... అర్జును వలన భయము నెడి యొ,మ్మనం జేయిడి నిద్రవోయె ముదితాత్మ్మండై ... భార. ఆది 6 72

3 త్రాణము.

క పరికించుచు బాహాళ్యం, తరజనములవలన సంతతము నిజరక్షా, పరుఁడవయి పరమహీశుల, చరితము వీక్షించె నిపుణచర నేత్రములన్. భార సభా 1. 48

గీ ఇంద్రియంబులు దమయిచ్చ నిట్టునట్టు, దిరిగె నేనియు దుఃఖముల్ దెచ్చు నవియ, కట్టువడి సుఖ మొనరించుఁ గానసాత్మఁ గావవలయు నింద్రియ చోరగణమువలన భార శాం 4 186

4. గ్రహణము

చ ... దేవనీ. వలన వరంబు లిట్లుగొని . హరి పూ 4 22.

క బహుభాషల బహువిధముల, బహుజనముల వలన వినుచు భారతబద్ధ, నృపహులగు వారికి నెప్పుడు, బహుయాగంబుల ఫలంబు పరమార్థ మగున్ భార ఆది. 1 17

ఆ. . అతని, వలన నాదుకూర్మి చెలి శుభాశుభములు, గోరి వినుట నా మనోరథంబు దశకు 5 6

5 ఉపయోగము

క. కావున మృతసంజీవని, దేవలయును శుక్రు వలన ధృతిఁ బడసి తప, శ్శ్రీవిభవ భార ఆది 3 105

సీ భీష్మకుఁ డవంగఁ, దనరారు నృపతికిఁ దనయుఁడు రుక్మియనోర్వ ధైర్యుఁడు ద్రుముఁడను నరేంద్రు, వలనఁ గృతాస్త్రుఁడై వెలసి బ్రహ్మాస్త్రంబు జమదగ్ని సూనుచే నమరఁ బడసి, గీ శౌరితో నెల్లనాఁడు మచ్చరము సేయు, చుండు . హరి ఉ 2 5

6 పైశ్వర్యము

గీ కనకభూషణ జాలంబు కతన గజము, లెరవులు వోవుకొండల నెనసి యొప్పె, వల్గనంబుల హేషల వలనలబ్ధి, ఘనతరంగంబులనఁ దురంగములు వొలిచె భార భీష్మ 1 83

గీ ఆలమందలో నునిచి నిత్యార్చనంబు, సేయు చుండంగ నప్పుర స్త్రీయొకర్తు, గోప కామినీ రూపయై కోరి యతని,వలన గర్భంబు దాల్చె నీశ్వరుని యాజ్ఞ హరి ఉ 2 112

సీ. సంధిల్లి

గీ చొక్కుమిగిలి, విటజనంబులపైఁ బరిపెడలు నట్లు, కొలను వెడలిరి జలకేళి వలనఁ దనిసి... కు సం 9 290

7 అధికరణార్థము

ఉ చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నా లతాంగి య,చ్చొత్తిన యట్లు నాకుఁ దన యుల్లము దెల్లము సేయకున్కి... భార విరా 2 84

సీ వారిద మార్గంబు వలన మహానీల వైజయంతీ విభవంబు వెలయ . భార అర 1. 345

మ అరయం దప్పొకయింత నావలన లేదా ధర్మపుత్రుండు భూఁ,దరి వెంటం దమకించి సౌబలుని చేతం భూమి గోల్పోయి భార ఉద్యో 3. 358

గీ ఆ నృసింహప్రభుండు దిప్పాంబవలన, నాగమాంబిక వలవ నందనులఁ గాంచె ఆము. 1 31

8 విషయము, ఎడ

గీ, బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు, వలన హీనులు రూపసివలనఁ గొనటి, వార సూయలు సేయుదు రీంసమున . భార శాం 3 70

**వలనగు** ఆ. క్రి. (వలను+అగు) వీలుపడు, వలను పడు

మ. దనుజాధీశ తపోనలంబు త్రిజగద్దాహంబుఁ గావింప నెం,దును నిల్వన్ వలగాక వచ్చి తిమి దశ 4 76

**వలనము** వి అశ్వశిక్షాభేదము

సీ వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి రేవఁ జూపి . వి శకుం 1 112.

**వలనము** సం వి. అ న 1 కదలుట, చలించుట. 2 వలయాకారముగాఁ దిరుగుట. 3 (జ్యోతి ) దృక్కర్మాది సంస్కారాంగమగు సంవరణము. 4. కలఁత, సంక్షోభము

**వలను** = వలఁతు, వల్ల వి జొ 1. దిక్కు, వైపు

గీ .. సమీరణపుత్రుఁ డగ్రజుండు వోయిన దెస దప్పఁ బొందువలన, సమదవారణ పతిగమనమున మత్స్యధరణి వల్లభు సభచేర నరుగుటయును. భార. విరా 1 211

ఆ. . అసుర వలనుసూడ కొండువగవక యెప్పటి, యట్ల కుడుచుచున్న నలిగి బకుఁడు ... భార. ఆది 6 292

క కావున నింద్రియ చేష్టల, నేవలనికిఁ బోవనీమి యింతకు ముఖ్యంబు ... భార శాం 6. 87

చ .. ఇదె పావని పోవుచున్నవాఁడుడుగణ వీథి లంక వల నొక్కఁడు ... భా. రా సుం 26

2 ప్రక్క, పార్శ్వము

క. తలుగుల పొది యొకదెసఁ బయ్యెలదా మెన యొక్కవలన నమవై యుండన్, మొలమోపి పెక్కుచుట్లం, బలుద్రాటం జుట్టి గోపభావం బమరన్ ... భార విరా 1. 275

సీ కెలన సాత్తని వైష్ణవులు ద్రోపుద్రోపాడ వలన సంకీర్తన పరులు చనఁగ విప్ర 5. 10

3. పక్షము

క . ఎవ్వలనఁ గలుగు ధర్మం బవ్వలనికి జయ మంగళము లవశ్యముఁ గలుగున్ ... భార. ద్రోణ 5 266

క. ... పఁగురుపతి కిచ్చిన ప్రాణం బొందు వలనఁ జేర్పందగునే ... భాం భీష్మ 1 165

4 ఎడ, విషయము

సీ అమ్మెయి నడపెడు నప్పాండవాగ్రజు వలన నిజాత్మజువలనికంటె, నక్కురురాజు ప్రియం బందు భార ఆశ్ర 1 16

మ. . చెంతం బొంచి వీక్షించి పోయిన పాత్రా జితిబోటి నా వలనఁ దా నే మేమి కల్పించెనో. పారి 1 103.

క ... మనమున వగవకు మిట్టిట్టని సొలవకు రాజువలనఁ గైకేయి దెసెన్ . భా రా అయో. 86 , భార. అను 5 43

5. అనుకూల్యము.

సీ. ఎక్కుఁడు వలనైన యెడలడ్డగించిన చఱు లనుగ్గడపుడు సక్కఁద్రాఁక, రానితిప్పలు చొఱఁ ద్రవ్వఁ డీరములైన మ్రాకులు బొద లును మ్రగ్గఁబొడుపుఁడు .. హరి ఉ. 1 83.

గీ శుకముఁ జదివింప నందంబు చూడ గంద, మలఁదఁ బయ్యెద సవరింప వలనులేక . విక్ర. 7. 68

సీ. మొగమోట తెగఁజూచి తగవు దూరము వేసి కులము గీటునఁబుచ్చి వలనుదప్పి దశకు.. 3 9.

9 ఉపాయము.

క వలనుగలమంత్రివరులం, బిలిచి పృథా నందను లకుఁ బ్రియముగ మీరు . భార ఆది. 6 131

క తెలియనివి గొన్ని సెప్పితి, తెలియంగలవెల్ల నింకఁ దెలుపుము కృష్ణా, వల వెటిఁగి మెలఁగ వలయును, నలినాసనజనక భక్తనతపద యుగళా భాగ. 11 108

గీ నడుమ విఘ్నంబుగాకుండ నడిచెనేని, జయము చేకురు ననయంబు సంగరముల, వనియెఁగావున నేఁడు నా కట్లు చేయ, వలయు నీపగ దీర్పంగ వలను గలుగ భార. యు 15 75

7 నేర్పు

సీ వంజలవైనను వల నేర్పడఁగ నొక భంగిఁ జేపఁగఁ జేసి పాఁడి గొనఁగ ... భార విరా 1 101

గీ భువనవాసులఁ బిలిచి మీ రవికలముగ, వల యునని వేలువేఱ మీవలను మెఱయ, నిద్ధరా దోగ్ధ్రిఁ గ్రేపుల నెలమిఁ జేర్చి, పితికి కొమ్మఁడని వనిచె సమ్మతము మిగుల హరి పూ 1 131.

క అవలచించుక వెడలిన, నావలఁ బోనీక చెంచు లపు డడ్డంబై, యావల నుఱుమాడినఁ గని, యావలను విభుండు మెచ్చి హర్షము నొందెన్. పారంగ 1 104.

8 శకునము

గీ వలను లెస్సైన మిక్కిలి నలరుకొనుచు, వచ్చి యెలుకులు వేఁటాఁడఁ జొచ్చిరపుడు యయా 2. 3

9 ప్రదక్షిణము
ద్వి అమరేంద్రుడు దెస విరూపాక్షుంబు గాంచి, ప్రమదంబు మీఱంగ వలనుగా వచ్చి . ద్వి రం. రా బాల 41. పా 10 పం
10 ఒప్పిదము
సీ వలరాచతూపులవలను మొక్కలువోవ వాలు గ్రేఁగన్నుల వాడిమియును, బాల పల్లవముల లీలలు పొలివోవ మించారు కెంగేలి మేలిమి యును. హరి ఉ 7 47
గీ అనుఁగుఁదల్లికి వందనం బాచరించి, వరుస నిలువేల్పులకు మ్రొక్కి వలను మిగుల, బ్రాహ్మణులచేత దీవెనల్ వడసి పుణ్య, భామలిచ్చు హేమాక్షతప్రతతిఁ దాల్చి నైష 3 107
సీ వలనంది దరుల క్రేవల నొందికొనుచు నావల వగల్చు మహోర్మి వలవ మరయ వసు 6 61.
ఇది కొన్నిపట్ల వాక్యాలంకారముగ నుపయోగింపఁ బడును
చ ఒంటి పాటునన్, వలనుగఁ గంటి కింప యినవానిఁ గనుఁగొని ప్రేమ హెచ్చుఁగా, బలిమిని జేరు జారవలెఁ బై కొనఁ గోరెదు నీకు మేరయే దశా 3 69
క. పలు తెఱఁగుల దీవనలిడి, వలనుగ నత్తమ్మి చూలివంగడపుంజా, బిలియల జేనింగని . నీలా 1 86
11. విధము
క ఆ వంతయైన వరలకు, మేవలనను దేవ విప్రహితకార్యంబుల్ హర 7 146
సీ వలఁ జక్కవలు చిక్కువల నొప్పు మృదువల్కలంబునఁ గుచలికుచంబు లొరయ ఉ రా 3 103
క ఆ విభుఁ డిట్లను దుఃఖం, బేవలనను గలుగ వేర దిహపరసౌఖ్య, శ్రీ విభవంబులకెల్లను. దావక పందర్శనము నిదానం బగుటన్ జై భా 5 93
గీ ... జననాథ యెవ్వరి నెచటనుండు, వారలను వార మమ్మాట వలను నెపును . . భార శాం 6 195
12 శక్తి, సామర్థ్యము
గీ. ... తెలిసి యుత్తర మీ నాకు వలనులేమి ... నైష. 3 21.
క కులగిరులు జిట్టఁ దిరిగిన, జలరాసులు మేర దప్పి చనుదెంచిన నీ, వలనెఱఁగిన దృఢ శక్తుఁడు, చలియింపఁడు శివతత్వ 62.
సీ జంబైదుతలలరాక్షసునిఁ గూల్చిన వాఁడు వాని తమ్మునిఁ బ్రోచు వలనువాఁడు . . కృష్ణ 1 14.
13 కారణము
ఆ ... ఇదియసుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి, వొసఁగ నీదువలనఁ బొందు పడియె భాగ 6 223
14 వివేకము.
క కార్యము తెలఁ గిట్టిది నీ,వార్యచరితమునకుఁ జొచ్చి యాడెదు నీకా. దుర్యోధను నవినయ మని, వార్యంబని యెఱుఁగరామి వలనో వెడగో భార ఉద్యో. 1 318.
15 మర్యాద
చ తల్లిదండ్రుల రుచిమాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్, వల నతి నక్కలాంగవలు వత్తురె లోకులు నూచి మెత్తురే భాగ. 10 పూ 977.
16 ఉచితము
గీ వాచ్చి వాజ్నియతితో వలను గలిగి, ఉత్తరం బొందెఁ దూర్పు దిక్కొండె జూచి, జాను మధ్యంబునందు హస్తంబు లుండఁ, గుడుచునది పవిత్రాన్నంబు గుణవరేణ్య మార్క 3. 228
విణ 1 కుడి, దక్షిణము
సీ పంద్రెండు రూపులై పగలింటి రాజుగా వలఁతి యేదేవుని వలమఁ గన్ను . ఉ. హరి. 2. 144
"వలనౌ హస్తంబునన్" భద్రా 1 (శ ర)
2 యుక్తము.
అ . జానకీధవుండు సంతసిల్లి, వారి నాదరించి వలనైన సత్కృపఁ, జూచి మందహాసశోభి యగుచు . భా. రా యు 2. 471
చ వలనగు నమ్మహోతటినివారి నవారితకేళి నల్పు శాంతల ... వసు 1. 112.

ఉ. నామొగమోటకై వలని నాటకముల్ ఘటియించి .. పారి 1. 89.

మ పెలయేఱుల్ గడలొత్తఁ జేయుచు లతాసీమంతినీనర్తనం,బులు గల్పించుచు మత్తబర్హిరుతముల్ పాలొప్పిందగాఁ జేయుచున్, వలనై శాపవమారుతంబు దనకున్ వాంఛామురూపంబుగా ... పారి ఉ 1 57

3. శక్యము, సాధ్యము

గీ అంధువుల సంఖ్య లెక్కింపనలవి గాదు, కుండములసంఖ్య లెక్కింపఁ గొలఁది గాదు, వాపికల సంఖ్య లెక్కింప వలను గాదు, పద్మలోచన కాశికాపట్టణమున కాశీ. 7. 205.

4 శరణ్యుఁడు

మ చెలివై చుట్టమవై మనస్విసుఁడవై చిన్మూర్తివై యాత్మవై, వలనై కోర్కుల పంటవై విభుఁడవై వర్తిల్లు నిన్ను .. భాగ. 8. 728

క వల², వలకట్టు, వలకడ, వలకన్ను, వలకేలు, వలగొను, వలగొల్పు, వలచుట్టు, వలచూడ్కి, వలచే, వలచేయి, వలతిరు, వలదిక్కు, వలదిరుగు, వలవగు, వలను పఱచు, వలను మించు, వలను మీఱు, వల నొప్పు, వలపల, వలపలగిలక, వలపలించు, వలబాఱు, వలమురి, వలమురితాలుపు, వలమూపు, వలఱెక్క, వలవంక.

**వలనుపఱచు** వ క్రి (వలను+పఱచు) అమర్చు, ధరించు

సీ శ్రవణి దుష్టరక్తపత్వమున మించు జలూకవామహాస్తంబున వలనువఱచు ... దశా 2. 290

**వలనుమించు** అ క్రి (వలను+మించు) ఒప్పు.

సీ. రమమాడ్కిఁ గమలజురాణి రాణింపంగ వాణిమాడ్కిని లక్ష్మి వలను మించ ఇందు 1. 106.

**వలనుమీఱు** అ. క్రి (వలను+మీఱు) ఒప్పు.

గీ తన యజత్వంబు దెల్ప రాట్తనయమౌళి, రాజసమెలర్ప ఘనపద్మరాగకలిత, వర్తుల మృగేంద్రపీఠిపై వలను మీఱి, రాజహంసాశ్రయప్రౌఢి రంజిలంగ. ఇందు, 5 94

**వలనొప్పు** అ. క్రి (వలను+ఒప్పు) అనుకూలపడు.

సీ. తెలుగంటిదొరయింటి తెలిమ్రాఁకు లెగఁబ్రాకి వలనొప్పఁ దెలిదీవికెలన మెలఁగి . నీలా 1 45.

ద్వి వలపలికడఁ బంటవలఁతినెచ్చెలి, వలనొప్పఁ దమ్ముఁ డవ్వల నొప్ప ద్వి పరమ 3. 216.

**వలపల** వి ఔ (వలము+పల) కుడిభాగము, దక్షిణ పార్శ్వము.

క వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱుమిడి కుఱుమాపుడుఁ బుట్టం, బలవడఁ గట్ట జరరవ, ల్కాలమున నెవ్వీఁగుఁ జన్నుఁ గవ గప్పితగన్. భార విరా 1 291

చ వలపలికన్ను నీకు రవి వారిజలోచన చందురుండు దా, పలినయనంబు కర్ణుఁడును బార్థుడు దత్ప్రియనందనుండుఁ ద,త్కులజుఁడు వీరొకం డొకనితోఁ గలహింప సహించితి రెట్లొకో నైష 8 133

వ వలపటఁ గృపాశ్వత్థామలును దాపటం గృతవర్మ మద్రేశ్వరులును వెనుక బాహ్లీక సోమదత్త భూరిశ్రవసులును భార భీష్మ. 103

గీ కళుకు విడికెంపురవల చెక్కడపు మేడ, వలపట నెసంగు శృంగారవనములోన .. దశా. 1. 4 102

**వలపలగిలక** వి (వలపల+గిలక) రేఫమునకు వేఱొక చిహ్నము (రేఫముయొక్క రూపాంతర నామము) (శ ర)

**వలపలించు** స. క్రి (√ వలపల)

1 వలపలగా తిరుగు, కుడివైపుగా తిరుగు

వ. గాంధారీనందనుండు వలపలించి చుట్టుకొనిరానదిసరకుసేయక ఒకవైరి భార శల్య 2 267

2 వలఁగొను, ప్రదక్షిణము సేయు

గీ మొవయువలిపిల్లలా పుల్లమునకుగాని, బొల్లినెమ్మోము దవరారు పుల్లు లేని ప్రబంధ 802 107.

**వలి** = శైత్యము, (ప్రసిద్ధము)

కాని యీ ప్రయోగమునఁ గాలి, యనునర్థమున నుపయోగింపఁబడినది

సీ. చూతాటవీవాట శోభమానంబైన పులుగుఱ్ఱి సోమేశు వలపఱించు ... భీమ. 3. 89

**వలపించే** స. క్రి (వలచు¹.) 1. ప్రీతిఁబొందించు, సంతుష్టునిఁజేయు

ఉ. .... వాసుదేవునిన్, బ్రీతిమెయిన్ భజించి వలపించితి ధన్యుఁడనైతి నింక నీ, నీతులు గీతులుం జదువునేర్పులు గిర్పులు నాకు నేటికిన్ వి. పు 2 296

2. కామింపఁజేయు.

సీ వలపింప నేర్తురు వలరాజు గెలిచిన పెద్దకాలము వేల్పు భీమనాథు భీమ. 1 94.

క ... భుజిక్రియ, వలపించెం బెండ్లివారి వనితయుఁ బోలెన్ ... నైష 6 134.

సీ చిఱుతపాయపు గొల్లతెఱవల వలపించి మఱవక పసులఁ బల్మఱునుగాచి . నీలా 1. 3.

**వలపు¹(ల్పు)** వి (√ వలచు.) 1 వాంఛితము, కోరిక

క కావున వంచన బాహిర, పోవకయుండంగ మనరిపుం బరిమార్పం, గావచ్చు నేని యట్టిద, నా వలపటుగాక తక్కినను వలదుసుమీ భార విరా 2. 287

తోటకము. వలపుల్ గను గోవలపుల్ గొలువన్, దొలుకారు మెఱుంగులతోనెనయై వలరాచ సిరుల్ వలె వారొకచోఁ, దలుకొ గురువెందల పందిరిలోన్ యయా 4 23

క ... మెలఁతకుఁ బతికిన్, వలపు సమంబగుట జన్మవాసన చెలియా ... మనుచ 6 66

2 మోహము

గీ వలపు నటియించుచును వారవారం తనకుఁ, దాన వారికి వారికి నైనయట్లు హర 6 103

గీ భ్రాంతి దన వల్పులంజియఁ బాయలేక, క్రీడయించుక లేని చేబోడిబోఁటిగు .... కవిక 4 99

గీ. శాంతితనమున లంజియఁ బాయలేక, క్రీడయించుకలేక ... (చూ. చేబోడి. శ. ర.)

రగడ. మితిలేక పరఁగె రతిమెలపులును వలపు పులును, నతివ లెంతయు మఱచి రలపులును సొలపులును. రాఘవ. 2. 6.

**వలపు²(ల్పు)** వి. (√ వలచు.) సువాసన

చ. అలరుఁ బురంబునం దొగల నంతరచామరఁ బ్రాఁచిఁ గప్రపున్, వలపులు మీఱ . . పురాతన తీర్థకుండముల్ . ఆము. 1 71

సీ వలపులు గులుకు చెంగలువ క్రొవ్విరుల ఱేకులు గానరా సేస కొప్పు ముడిచి . వరాహ. 3 109.

క . . చలికరువలి సు, నొప్పలపమున విరియు పరువపుఁ, దొలు మొగడల వలపు దెలుపు తోఁటల లోనన్ . పారి 5. 103.

ఆ. కంపు గబ్బు గవులు గందంబు వలపన గంధ మొప్పు . ఆం భా 1 106 మనుచ. 6 31

సీ నులివాడు నాఁచు వల్పులగొం తొగర్చిలేఁబోల వల్పుగాలివే పోకయొఱఁగి ... ఆము 2 53.

**వలపుల వింటివాఁడు** = పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

చ వలపుల వింటివాని దళవాయి వసంతుని జోడు కోడె పాటుల బడకుండఁ గుండలి కుటుంబము నాఁకలిఁ దీర్పు చందనాచల గృహమేధి యెప్డు వడచల్లని చల్లనిగాడ్పు వీటఁ జెల్వలరతి శాంతకాంతుల యలంతలు మానుచుఁ బ్రాణబంధుఁడై . రామా. 1 151

చ వలపుల వింటివాని దళవాయి చకోర మనోరథంబు రే, వెలఁది మగండు పాల్కడలి వెన్న నిలింప గణాన్నరాశి చుక్కల దొర కూలి మౌళి మణి గల్వలవిందు తమంబుగొంగ చల్వలగని జింకతాలుపు కళానిధి తూర్పునఁ దోఁచె నత్తఱిన్. తె శకుం 2 187

**వలపుఁగొల్పు** స. క్రి (వలపు¹ + కొల్పు.) మోహింపఁ జేయు.

సీ. వ్రేఁతల వలపుఁ గొల్పెడు దిస్స మొలహత్తి గచ్చకాయల తిత్తి రచ్చసేయ .... ఘటికా. 1. 128.

**వలపుకత్తియ** విశే. (√ వలపు¹.) కామము గలది, కాముకి.

సీ. తోఁ(ద్రో)పులకును బోదురబె యొఱుంగఁజా వలపు కత్తియలుంట కలుసకంటి ... శా. వి. 5. 65.

**వలపుకాఁడు** విణ (√ వలపు[1].) కాముకుఁడు, కామము గలవాఁడు. (శ ర.)

**వలపుకీలు** వి (వలపు[1] + కీలు) పోఁకముడి, నీవి
గీ ... అనుచుఁదగ బుజ్జగించి హస్తాంబుజమున, వలపుకీలు దెమల్చు భూవల్లభుండు నైష 7 176.

**వలపుటిక్కు** వి. (√ [1]వలపు.) కళాస్థానము
ఉ అక్కలకంరకఁరి తెలియంగని నప్పుడె ధిక్కరింపుచున్, జక్కెరఖాణ పుందురికి సాహిణి చాయల జంటదారిమేల్, చొక్కపు వాఁడి చెంగ ఉువ సూరికటారినిఁ బోటు వేటుపెం, పెక్కఁగ నొక్కటన్ వలపుటిక్కువఁ బక్కన రేచియార్చి వన్, ఉ హరిశ్చ 2 56
(వలిపు టిక్కువ) అపముద్రి

**వలపుదాల్పరి** వి (వలపు[2] + తాల్పరి) వాయువు
సీ బలితంపు వలపు దాల్పరి దిడిగమిరావు గల దొరవాకిట నిలుచువాఁడ ప్రబంధ. 217 లో 5 పుట 76

**వలపుదేవర** వి (√ వలపు[1] + దేవర.) వలరాజు, మన్మథుఁడు
చ పాదిరి మీఁదికి మాటిమాటికిన్, దిరిగెదుఁ దుమ్మెదల్ వలపుదేవర పచ్చల మేడయెక్కియ, చ్చెరువుగఁ దుంటవింట వడిఁ జిమ్మెడు కస్తురి యుండలోయనన్ యయా 5. 56,

**వలపుమోపరి** వి (వలపు[2] + మోపరి) గంధవహుఁడు, వాయువు.
సీ వలపుమోవరి జియ్యవల మూల దయ్యాంబు గుండుల తలకట్టు పండుదండి .. అచ్చ రా బాల 8.

**వలపురాయఁడు(లు)** వి (√ వలపు[1]) రతిపతి, మన్మథుడు
గీ చల్లులాడంగ నప్పుడు చదలనెగసి, మగుడు తెలినీటి తుంపరల్ దగియెఁజూడ, వారి నీరాట కును మెచ్చి వలపురాయఁడాని కురియించు పువ్వుల వానలనఁగ ... యయా. 3. 63. యయా 5. 112.
గీ. ఇటు చతుర్విధ దళము లుద్భటము గాఁగఁ ఛాయఁగాముని దళవాయిఛాయ వలపు, రాయ లారామమున డిగ్గె రహివియోగి, సముదయ వనతతి పలాయనములు గాఁగ. ఉ హరిశ్చ 3. 13

**వలపులకొండ** వి (√ వలపు[2]) మలయ పర్వతము.
చ వలపుల కొండడిగ్గి కుజవారములో వటు లుత్తరంబుగా, వెలువడి వేగనేఁగ వెడవిల్తుని కార్యముగాఁగ వచ్చుచోఁ, జిలువల కోఅలంజిదిమి చేరు వనంబులగంటి దంతఁ దుమ్మెలు పొడ కట్టె నీ శకునముల్ వితగాదుగదా మదానిలా. కృ శకుం 2 207

**వలపులరాచజోదు** వి (√ వలపు[1]) మన్మథుఁడు
చ. చెలంగి చెలంగి మానసముచిల్కులు వోవఁగనేసె బాలికన్, వలపుల రాచజోదు ప్రసవంబుల పేరము గొర్వి కోలలన్ పి శకుం,3 169

**వలపులరాజు** వి (√వలపు) మన్మథుఁడు
చ వలపుల రాజు తూపులగు వారిరుహంబుల నొక్క యెత్తునన్, గెలుపుగొనంగఁ జాలు మృగనేత్ర యపాంగ నిరీక్షణద్యుతుల్ . విక్ర 6 26
చ. వలపులరాజు దండునకు వైచిన త్రోఁవ గుడారు నాఁగ వెన్నెల జలకంబుఁగాంచ రజనీ గజయానకు మోడ్పుదమ్మి గుబ్బ సమయాళి ముందెనెరిఁఒట్టిన చందురు కావినా సముజ్జ్వల తరసాంధ్యరాగరుచి సంధిలె సౌమనసాధ్వ పీఠికన్ రా. వి 4 40

**వలపులతేఁడు** వి (√ వలపు[1] + తేఁడు) మన్మథుఁడు.
క. . దేవర జాణయమీనుఖాన వలపులతేఁడా .. యయా 5 1.
వ వలపుల తేని చివురుటరిగెల పొలుపు దెలుపు రత్నతాటంకంబుల ధర్మఖండము 3 178

**వలపులాఁడి** విణ (√ వలపు[1]) కామముగలది, కాముకి
గీ దొరసి యొండొంటి నొరసి క్రిక్కిఱిసి మెఱసి, యగణితస్ఫూర్తి మొగమునకెగయు నీదు, వలుదవలిగుబ్బచన్నులో వలపులాడి ... వరన. 5. 113.

**వలబాఋ** అ. క్రి. (వలను + మీఋ) పార్శ్వమునకుఁ బాఋ.

ద్వి. చతురుఁడై యతఁడర్ధ చంద్రబాణమున, నితని విల్లుట్రుంచె నేడు దూపులను, వక్షంబు నేయుచో వ్యాఘ్రంబుఁ గన్న, ఋక్షంబు వల శాఖు రీతిఁ దేరుడిగి... భార విరా 4 73.పా.

**వలభి** సం వి ఇ ఈ స్త్రీ 1 కొణిక, మంజూరు 2 ఇంటి నడికొప్పు (హలా ని) 3 శిరో గృహము, చంద్రశాల. (విల్యమ్సు)

**వలమానము** సం విణ (అ. ఆ అ) 1 తిరుగు చున్నది. 2. చలించుచున్నది, కదలుచున్నది

**వలము** విణ 1 అధికము

చ పొలకయి గారవంబయిన పుత్రకుఁడొక్కఁడ యేల మాంసమున్ వలముగ మీరు నేను నగు వారమెకామె హర 2 68

ఉ తమ్ములతావితానములఁ దావలమై వలమైన గాలితో, యమ్ములఁ కామతింపఁ జటు లాల సయై వనకేళిసేయఁగాఁ, దమ్ములతావి తాన ములఁ దావలమైవలమైన గాలితో, యమ్ముల కామతింపఁ జటులాలసయై వనకేళి సేయఁగన్ కృ శకుం 2 165

2. స్థూలము, లావైనది,

క ఆరెలు వలములు దొడలును, దోరము బలు మెడయు దశకు. 9 81.

క ... నిడుదలగు తొడల బెడగున్, గడువలమగు నడుము గలుగు కలికిది బలిరా .. చంద్ర వి. 1. 75. కళాశాస్త్రము 1 15

వి 1 స్థౌల్యము

సీ వ్రేలి వలంబున వ్రేలెడు మెడనూళ్లు జాకు వాముంజేతి జతులబ్రాళ్లు. రా వి 2 44

2. వైశాల్యము, విరివి

గీ .. ముప్పది యోజనముల, పొడువు వది యోజనమ్ముల నడిమివలము, గలుగునగ్గిరి తరు మృగా వలులతోడ, ధరణితల సమానంబుగా ధరణిఁ గ్రుంగె ... భా రా సుం. 519

**వలమురి** వి (వలము+మురి) దక్షిణావర్త శంఖము, శంఖము

చ. విలసిత మౌక్తికంబులు సవిభ్రమ రేఖలునుని్క సాటిరాఁ, దలఁచి మహోద్ధతిన్మొరసి తన్మృదు నాద విలాసకౌశలం, బలవడమిన్ ముడింగి గరమై తనలో వివరం బెటింగియా, వలమురి దాఁబ్రదక్షిణము వచ్చెనొ యానతి కంఠ లక్ష్మి కిన్ వసు 2 43

క వలమురి జిగినగు మెడికలు, వల మురిపెముఁ జూపు చూపు వనజాతమునా, వలమురి యించు మొగముకై, వలమురి విహసించు వేణి వని తకుఁదనరున్ . చంద్రా 4 144

క అందంబున వల వలమురి, చిందంబు ముకుందుఁ డర్థిఁ జేఁబట్టినదా, నిందగ నెఱుఁగము ... విప్ర 2 42.

**వలమురితాలుపు** వి (వలమురి+తాలుపు) శంఖ మును ధరించినవాఁడు, విష్ణువు

చ వలమురి తాలుపింక నిటవచ్చుట మానుము మచ్చకంటినా, నిలిచి . . పాండు 5. 133

క వలమురి దాలువు దొరయా, వలఁబిలువఁగ నీలవలదు వలదని పెనఁగన్, జెలికత్తె గదిమి నీకిటు, వలెఁగూడదటంచుఁ దలుపు వడిగాఁ దీసెన్ ... మృ వి 3. 35

సీ గట్టురా విల్లును కడలిబత్తలికయు వలమురి దాలుపు వాడి తూపు .. రామలిం 1

**వలమూఁపు** వి (వల$^{3}$+మూఁపు) కుడిమూఁపు

ఉ నీవలమూఁపు లావు మునునేల వహించిన నాగ కూర్మగో, త్రావని భృద్దిశాకరుల కారయ నూఁటట పట్టుగాదె ... భార విరా 2 193

గీ కలఁచి కబళించి కదువడి బలిమి మించి, గెలిచి యార్వీటి వేంకట క్షితిపు తిర్మ, లేంద్రు వల మూఁపునను నిల్చి యురవు కొనియె, రాజ నుతు లొప్ప ధంణీ వరాహమూర్తి .... రామ. 387

**వలయపుఁగత్తి** మి. వి (వలయము+కత్తి) చక్రా యుధము

ద్వి వలమురి నెఱవాఁడి వలయపుఁగత్తి, బలసి చూపట్టెడు పాణి యుగ్మమును ...ద్వి. పరమ. 2 94 పా

**వలయము** సం. వి అ పుం న

1 కడియము, హస్తపాదకటకము, మురుగు, అందె. మొ 2. చుట్టు 3. స్త్రీలనడి కట్టు; ఒడ్డాణము. 4. (సమాసాంతమున) మండ

లము, గుండ్రముగా నుండు వస్తువు. 5. ఆవ రణము, కంచె, ప్రహరి

పుం. 1 శాఖ, కొమ్మ 2 గొంతుకనొప్పి

**వలయించే** న క్రి (√ వలయు[2]) వలయాకార ముగఁ ద్రిప్పు, చుట్టు త్రిప్పు, త్రిప్పు.

సీ వలనంబు పుట్టించి వంకంబు వలయించి డిల్లాయి ప్రకటించి రేవచూపి . పి శకుం. 1. 112.

క ఏలాగున వలయించెదో, యేలాగున నీల విభుని నెలయించెదొ ... చంద్ర వి 3 80.

**వలయితము** సం విణ (అ. ఆ అ ) 1 చుట్టు వాఱు కొనఁబడినది 2 గిర గిర వేగముగ చుట్టును ద్రిప్పఁ బడినది 3 మెలివేయఁ బడినది.

**వలయు**[1] అ క్రి (ఇది అసంపూర్ణ క్రియ దీవిక భూతార్థక ప్రథమ పురుషైక వచన బహువచనములందును తద్ధర్మార్థక ప్రథమ పురుషైక వచనమునందును వ్యతిరేకార్థమునందును క్త్వార్థమునందును భూతతద్ధర్మార్థక విశేషణముగాను టవర్ణకాంతముగాను ప్రయోగములు గానవచ్చుచున్నవి వ్యతిరేకమున వలదు వలవదు అని రూపద్వయము కన్పట్టుచున్నది. ఇంకను విశేషములు ప్రయోగానుసారముగా గ్రహించునది )

1 ఆవశ్యకమగు

గీ ధర్మమార్గ ముల్లంఘింపఁదగదుగాన, వలసె నిష్కృతి కులమెల్ల వెలసె నీ క,తమున సుర ముని పితృతర్పణములు సేయు, మరిగి బాహుదా పుణ్యతోయముల ననఘ భార శాం 1. 166

గీ భోగమనుభవించు, నెడమ బహిరంతరరులపై దృష్టివలయు అము 4 241

గీ. వలని సిగ్గున వెఱపునఁ గలసి మెలసి, యుండ కుంటకు మాటోటు లోర్వఁగలరె కాశీ 3. 62

క. .. అన్నరు వత్యద్భుత విక్రమ, పరిణతి సూడఁ గనుదోయి పది వేల్వలయున్ . . భార. కర్ణ 2. 283.

ఉ మున్ను నిన్నెఱుఁగ నా వలదా నను నీ వెఱుంగఁగన్ .. భార శాం 4. 396.

గీ. వలదు కుక్కల విడువంగ వలవ దేయ, నడిచి మొలపిడియమ్మునఁ గొడువవచ్చున్. మనుచ 4 20

గీ. పెండ్లికని పిలవఁబంచినఁ బ్రియముతోడ, నేగుదెంచితి మిన్నాళ్లు సెల్లయొప్పి,దములఁ జూచితి మిట్యోడఁ దడవుగాఁగ, నిలువఁ దీరదు పోయి రావలయుమాకు. భార ఉద్యో 1. 42.

ఆ. వలయు పదవియందు నిలిచి నారాజ్యమంతయును జక్కఁబెట్టి నయమువిక్ర,మంబు నడపు నంత మానిసివై యుండి, కుచ్చితంపు బ్రదుకు కోరఁ దగునె భార. విరా. 1 282.

ఉ ... ఎల్ల వా,డుందనవారిఁ దోకొనికడున్ రథసంబుఁ గూడి నా ర్తకున్, ముందఱఁబోయి గోధనము ముట్టుకొనన్ వలయున్ మహోగ్రతన్ . భార విరా. 3 126.

గీ. . పరుషములు శత్రువుల రాయబారు లెదుటఁ బలుకకుము సంధియొక వేళ వలసియుండు ... అము 4 267.

క. ఈరీతిమండ మచ్చిక, దేరన్వలసినవి యెల్లఁ దెప్పించుటకై వారసతులు బొజుఁగులతోఁ, బోరామి యొనర్పఁ బసుల పొంగలి వచ్చెన్ భార ఆది (4.176) కుక. 2 562

క ఈ రెండు ప్రకారంబుల, వారలకును మమత విడువ వలయుట సరి... భార శాం. 5. 98.

క జముఁడైన వచ్చి వానిని, దమియింపఁగ లేమి నిశ్చితంబేమి యుపా,యము గలదొ కనుఁడు మీ భావము నందిటఁ బ్రజలు మీకు వలసిర యేనిఁ హరి పూ 6. 126

ఆ ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు, చేల నీకుఁ జెప్ప నేలవలసె .. భార సభా 2 228.

గీ. ఏమిరా వాసుదేవుఁడ నేన యనుచుఁ, జెప్పికొన వచ్చునేయింకఁ దెవుమ నాకు, నిన్ను గన్నప్డ చక్రాగ్ని నీఱుసేయ,వచ్చు మూఢ మించుటకింత వలసెఁ జేయ. హరి. ఉ. 6, 217,

2. తప్పనిదియగు

క. వీరెవ్వరయ్య ద్రుపద మహారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్, వీరికి వలసెనె యహహా మహా,రాజ్య మదాంధకార మదిఖానె కొకో. భార. ఆది 6. 89

వ. . తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నం బున నింతమనల వలసె వినుఁడు... భార. ఆది. 1. 117.

పడవలయు = పడుట తప్పనిదియగు

గీ .. వెఱచి తాత, విడిచి నా పుత్రులందఱు విఱిగి యడవి, గలిసిరొకో యాతనికిఁ బడవలసె నకట . భార భీష్మ 1 58

సీ .. అనయముఁ బ్రతి .

ఆ. కోటిలేని నాదు కొమరున కిప్పాటు, వలసెనకట యిది యవార్యమనుచు, వేఁగు వాని చావు విని యంతజిష్ణుండు, ఖండితారిపం క్తికంథరుండు రాఘ 4. 148

చంపవలయుట = చంప సంభవించుట.

ఆ సురనదీ సుతుఁడు పరలోకగతి నిరీక్షించుట కును దాను గృతకవృత్తిఁ, జంపవలయుటకును సవిషాద మానసుం, డగుచు నిట్టులనియె నచ్యు తునకు భార భీష్మ. 3. 104.

చ అమరహితంబుఁ గోరియ సురాంగముల న్విద లించునట్టి మాకమరులఁ ద్రుంపఁగా వలసె నక్కట నేఁడని సిగ్గుజెందు చం,దమున . పారి 5. 7.

3. విహితమగు = విధియగు

క. ఇనుఁ డస్తమింపఁ బోయిన, వనభూ బోధింప వలసె .. భార. ఆది. 2 159

క. వినుమలసుండును గర్వియు, ననర్థ భాషి యును మత్సరాళీభుఁడుఁ గ్రో,ధముఁడును గావలవదు .. భార శాం. 5 454.

(ఇట నిషిద్ధము )

గీ ఎల్లవారలఁ బిలిచి మీరే సుకృతను, నాచరింపఁ గవలదు నా నాధ్వరముల, తెరువుపోకుడు .. హరి. పూ 1 98.

ఆ కొడుకుఁబోలె నరయ గురుఁ బోలెఁగొలు వంగ, నగ్నిఁ బోలె నిష్ఠనర్చితుఁడుగఁ, జేయ వలయు విప్రుఁ జెప్పెర వేదసం,తాత మేక బుద్ధి నాదరింపు భార అను 1 160

క. పితృ సంకల్పము సేయఁగ, సుతులకవశ్యమును వలయు ... భార. సభా, 1. 93,

ఆ గంగ నాడవచ్చి నీవు, వలవదనిన నుడుగు వారముగాము నీ, విఘ్న వచనములకు వెఱతు మెట్లు .. భార. ఆది 7 41

శా . య,త్నించి ధృతియులేక విష్ణునహితుం గీర్తించు చున్నాఁడు వర్ణించుం జెప్పినమానఁ డంగమున భాగ 7. 187.

4 యుక్తమగు, తగు, అర్హమగు

క చెలయ విధిదృష్ట నయమున, వలయుఁ బరా క్రమము సేయ వసుధేశ్వర యగ్గలమగు బుద్ధియుఁ గడఁకయుఁ గల పురుషుల కిది యచూపె కర్తవ్యమిలన్ భార సభా 1. 180.

గీ. . . వందపీయులు చెనకంగ వలదు వారి .. హరి 3 157

వలయువాఁడు = తగినవాఁడు

క. గోవులకు మేలుచేసిన, యా వేలుపు గొల్ల వారి యర్చవలకు నె,చ్చోవలయువాఁడు గావున, దేవేంద్రునిఁ గొలుతు మేము దృఢతరభక్తిన్ . హరి. పూ 7 126.

గీ చెలిమి గలదానిపైఁ దలఁపుమాన, వలదు సుమి మంచి పనసపండుల మెసంగు, జాణలకు మావి పండులు చవియ కావె నీలా 2 31.

చ బవరము సేయుచుండియును భాషణముల్దగఁ బల్కుచుండగా, నవినయ వృత్తిమై వలవ దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డగై,దువు పడినం దొలంగినను భార. భీష్మ 1. 148

చ. ... వస్తులన్, వవరఁగ వేడ్కయయ్యోడివో వర్తిటువంటి కుబుద్ధి లివ్వనం,బునఁ గొనమేవు నీళ్లుఁ గఱవో పతిమన్నన నీకుఁ జాలదో .. వేం. పంచ. 4 519

5. ఇష్టమగు

చ . వినిలోననీ, వలసిన వస్తువుల్ గొను ధ్రువం బుగ నిచ్చెద నీకు నాపుడున్ ... భార. ఆది. 5. 200.

"నీవలసిన" అనుచో ప్రౌ వ్యా కార. 15 సూత్రమున నీ శబ్దమునకుఁ గర్త్రర్థమున యొక్క విభక్తియు 16 సూత్రమున లోపము నగు

క. కుడువుఁడు కట్టుఁడు గైకొమఁ డడుగుఁడు మీ
వలయునట్టి యర్థములర్థుల్, కడమ యొకింత
తయు వలదని, యెడపక ఘోషింపఁ బనిచె
నెల్లెడ నెలమిన్ ... హరి ఉ 3. 170.

క. మావలికినట్టి వన్నియు, నా పుత్రునియందు
వలదు వరవరధర్మ, వ్యాపారము మనుమనియం,
దాపాదింపుదురు కానియని పలుకుటయుఁ.
వి. పు. 6 135.

గీ. పట్టియే దర్శనంబైనఁ బ్రతిభకలిమి, వలసినట్లు
వక్కాణింప వచ్చియుండు నైష. 7 73

6. సంభవించు, తటస్థించు.

ఆ అట్టి జెట్టినిన్ని, దినములిట్లు దొడరి పెనఁ
గియు నీచేత, నేఁడు విడఁగ వలనె వేఁడిపలుకు...
భార భీష్మ 3 177.

గీ. అప్పుడొక చారుఁడేతెంచి యసురనాథ, నీకు
జయపెట్టుచున్నారు నిఖిలజనులు, కొదవ
వలదెందు . దశా 5. 30.

గీ. .. అవఘు, సవిత్రు నుదయాస్తమయముల
శయన మెగ్గు, నిట్లు గూర్చుండు నెడమేలు
నెపుడు వలయు . మార్క 3 236

7 పుట్టు, కలుగు

ద్వి పొలఁతుక నీతోడి భోగేచ్ఛనాకు, వలయుటఁ
దలపోసి వచ్చితి ననిన రం. రా బాల.
50 పా 12 పం

గీ ద్వాదశక్షేత్ర శివలింగ దర్శనంబు, మొదలఁ
జేయంగ వలయుట ముఖ్యపథ, మావతీఁదగు. .
భీమ. 3 69

(చేయంగ వలయుట=చేయఁగోరుట.)

సీ న,హల్య ప్రాణేశుఁ డహల్య కాల్యన్నంబు
వలసినవారికి వలసినంత, ఘృతసూప ఫలదధి
క్షీరయుక్తంబుగాఁ దలఁచినప్పుడె పెట్టె .
వరాహ. 10. 33.

వ నీవు మమ్ము వలసినవాఁడ వగుదేని యివ్వి
ధంబున కియ్యకొను మనిరి . హరి పూ.
7 212.

వలయు² అ. క్రి (√ సం వల్) చుట్టతిరుగు

క. విడివడి జల మధ్యమునకుఁ, కడువేగమ కమర
మేగె గ్రక్కున తొక్కం, బడెనెలుక వాని
బొడఁగని, వడిగాకఘు నెగసె మృగము
వలయం బాజెన్. వేం. పంచ. 2. 235
(క. ర పా)

"మృగముఁ బాజెన్ దవులన్" (వా. రా కా.పా)

వలరసము వి వి. (వలపు+రసము) మోహము

చ . రాగులన్, వలరసమందఁ బ్రోషితులు
వందఁగ వల్మదమంద వచ్చె ... కు. సం.
6 789.

సీ ఆ, తరుణి వలరసంబు దళమిపైఁబడనున్న,
నెఱ వెఱింగి కూడ నేరకేల, జేలసైతి ...
కు. సం. 6 819.

వలరాకటారి (వలపు¹+రాచే+కటారి) వి మన్మ
థుని కత్తి.

చ . . కేవలము తుటారి కారియని వాఁడి కడున్
వలరాకటారికిన్ . చంద్రా 4 188.

వలరాచేపని వి (వలపు¹+రాచే+పని) గ్రామ్య
ధర్మము, సురతము, మైథునము.

క. చెలువుప వృషపర్వుండను, బలియుని గారాపుఁ
బట్టి పపిబిడ్డసుమీ, వలరాచపనులు వెలిగాఁ, గలి
గిన సొంపులను వడపఁగాఁదగు దీనిన్ యయా.
4 148

సీ తలిరుఁ బాయపు ముద్దుఁ జెలువలఁ గనుగీఁటి
వలరాచ పనులకు వలసి పిలుచు ... నీలా
1 76

వలరాచేరాచేవాఁడు వి (వలపు¹+రాచే+రాచే+
వాఁడు.) మన్మథుఁ డనెడు క్షత్రియుఁడు

సీ వలరాచ రాచవాఁడలికాతు కమవెచ్చఁ గరఁ
గిన యల కనికరపు చోటు ... మనుచ.2 9.

వలరాచేలచ్చి (వలపు+రాచే+లచ్చి) వి మన్మథ
లక్ష్మి

సీ + విలువ కన్నియలతోఁ జెలిమిగావింపఁగా
వచ్చిన వలరాచ లచ్చియనఁగ ... యయా
3 41

వలరాచేవాఁడు వి (వలపు+రాచవాఁడు) మన్మ
థుఁడు

సీ. సికగార మమరంగఁ జికిలి చేయించిన వలరాచ
వాని పూములుకు లనఁగ ... యయా 1 81.

వలరాజు మి వి (వలపు+రాజు) మన్మథుఁడు.

గీ భాళకుద్దాంత భామినీ రత్నరాజి, దీముగావించి
వలరాజ ధీకు నేనె ... నైష. 3 92,

క వలరాజు మూలబలమగు, నలికుక పికములకుఁ
చైత్రుఁ డభిమత భోజ్యం,బులఁగూర్చె ...
విక్ర 5 4.

**వలరాజుడాగులు** = మన్మథాంకములు
విక్ర 8 7

**వలరాచెక్కెము** (వలపు¹+రాచ+చెక్కెము) వి.
మన్మథుని ధ్వజము.
మ వలరా చెక్కెపు మీనమో సురలఁ బ్రోవ
న్మించు మీనంబవో . దశా. 1 156.

**వలరాయఁడు¹(లు)** వి (వలపు¹+రాయఁడు) మన్మ
థుడు
క ఱేఁడు రెండవ, వలరాయనిపగిది వచ్చి
వాకిట దిగియెన్ ... యయా. 4. 102.
క వలదాఁకుగశిఖకీలల, వలదాఁకుగ తిన్నగుడ్ప వల
రాయఁడ . వసు 4. 88.
ఉ అంగన యంగరాజ్యమున హస్తయుగా వర
ణాంతరంబునం,దుం గొమరొందు చారు కుచ
దుర్గములన్, వలరాయ లాక్రమిం,చం గది
యించు గాంతిజిగి నంచపు నిచ్చెన మెట్లలీలఁ
జూ,డం గనుపట్టె నమ్మరె మిటారి వళీతతి
మోహనాకృతిన్ ఉ హరిశ్చ 3 64

**వలరాయఁడు²** వి (వల¹+రాయఁడు) జాలరి, బెస్త
చ ... క్రమ్మఱఁ గూడఁబాఱు మో,హన గుణ
శక్తి నివ్వటిలు నవ్వలరాయని పేర్చు పెంపు
నన్ వసు 3.51
(మన్మథుఁడని రెండవ యర్థము )

**వలఱెక్క** వి (వలను+ఱెక్క) కుడిఱెక్క.
సీ. గవనివెల్పట బెరికయుఁబోతు వలగొనె వల
ఱెక్క మూపెఁ జేవలఁతిఁ జెమరు... పి. శకుం
1. 132.

**వలఱేఁడు** వి (వలపు¹+ఱేఁడు) మన్మథుఁడు.
గీ కినిసి వలఱేఁడు దండెత్తఁ గేతువగుట, మీన
మిలఁ దోఁచు టుచితంబ ఆము 5 98
గీ మేలివెలిదమ్మిరేకుల నేలఁ జాలు, కన్నుఁ గవ
వాని వలఱేనిఁ గన్నవాని, వన్నియల కెల్ల
మిన్నయై యున్నవానిఁ, గాంచి యిట్లని
యగ్గింపఁగడఁగి రపుడు అ రా శాల 62.

**వలవంక** వి (వల³+వంక) కుడిదిక్కు, కుడివైపు
గీ ఆర్చి యెడవంక పాత్యకి యడ్డగింప, వాసు
దేవుండు వలవంక వచ్చియురము, వ్రేయ
నవ్విరుఁ డచ్చోట వ్రేసెఁ దత్తఱించి పౌం
డ్రుఁడు ధర మోఁకటిల్లఁ బడియె ఉ. హరి.
3 65

**వలవంత** వి (వలపు¹+వంత ) 1 మన్మథ వ్యథ
గీ. .. అంత, కంత కగ్గలమగు వలవంతఁ దూల,
పోయెఁ జావకుఁ డేమి సెప్పుదు నరేంద్ర ...
భార అను 1 48
సీ ఎలమి ముఖాంభోజ మలరు నొక్కొక్క మాటు
వలవంత నప్పుడ వందికందు కు. సం 5.
589
శా కోమలి యోర్వలేక వలవంతం బద్మినీ
జాతికిం, గీడానుగ్రశిఖామణిం బలికె నఖీణాను
లాపంబులన్ . వసు 4 26
2 చింత వ్యథ
ఉ. . అవలవైరిఁ బల్కు నచలాగ్రణిమామ
కశోక వార్ధికిన్, నావ లతాంగి నధిరశనా వల
యేశ్వరు కేలఁ గూర్చెదే, నావలవంతఁ
దీర్చెద వసు 5 26
సీ. కదలి యహంకారగతివశంబునఁ జాల విప
శుఁడై బోధకు విపరియైన, వానికి నీరితి వల
వంత కర్మప్రచారంబులను మీఁదఁ జక్కనైన
భాగ 6 282.
ఉ ధరణీతల మంతయు భారఁబోసిప, ల్వం
తలఁ జెందువేళ . . 3 32 బ్రౌ ని
సీ చిలువ పోగులను వ్రేల్చపులఁ గీలవచేసి వల
రాచ నీటు మైఁ గలయ వలఁది ... హర. 5
55.
3 మాయ, మోసము.
మ. ఈ, వలవంతల్ పచరింపనేల కుహనావై
సారిణాగ్రామణీ . దశా 1 156

**వలవంతతనము** వి (వలవంత+తనము. స్వార్థమున)
మన్మథవ్యథ
తరు ... ఇంత వలవంతతన మాఁడువారికిఁ
దగునె . . కు సం 6 678.

**వలవల** వి 1. ఏడ్పుటయం దగు ననుకరణము

క కలకంఠకంఠి మదిలో, వలి దుఃఖం బాపలేక బాష్పజలంబుల్, జలజలజల ప్రవహింపఁగ, వలవల నత్తదెస నమ్ర వక్త్రాంబుజయై
వ . ఏడ్చుచున్న నవ్యధూరత్నంబుఁ గాంచి నిరం 2 61 62

2. కన్నీరు మొ. కారుట యందగు నమకరణము
చ వలవలఁ గన్నులం దొఱఁగు బాష్పకణంబులతో రఘూత్తముం, బలువుఱుఁ జూచుచున్ నిలిచి పంచితివే రఘురామచంద్ర మూ,స్థలముల కంచు మూఢుల విధంబున నేడ్చుచుఁ బోయి రెంతయున్ ఉ రా 5 308
సీ తళుకునిద్దంపుటద్దపుమోము కళ దప్పె వలవల కన్నీరు వడువకమ్మ . . అని 2 86

3. వళావళి యందగు నమకరణము.
చ. చలిగాలి ప్రాలితో,య్యలి వలయించెఁ జిల్కల గయాళివిగాక వవాళి నీవుమన్, వలవల మన్వళావళి నవాళి దువాళిగ మేళవింతురే. లక్ష్మవి 4. 78

4 ప్రాలుట యందగు నమకరణము
చ. ... నేలపై, వలవల ప్రాలెఁ గ్గిలెడలి ప్రాలిన ఫుత్తడి బొమ్మకైవడిన్ .. భాగ. 10 ఉ. 288 (శ. ర, పా )
("వలవటి" అని ముద్రి పా )

వలవలన విశ వదలినది, విశ్లథము
సీ జలధరప్రకరంబు వలవలనై తోచె వెలరారి దిక్కులు విశదమయ్యె . పద్మ. 9. 226
చ. వలుకని మోముఁ ద్రొట్టుపడు పాదములున్ వగరంపు టూర్పులున్, వలవలనైన దంతములు వంగిన మేను వణంకుమస్తమున్, నిలువఁగరాని యుక్కివయు నెమ్మెయి నెక్కొను దప్పి పెంపుఁ జే,వెలుఁగువఁ జూచుచూపుఁగల వృద్ధమహీసురుఁ డమ్మహీశ్వరున్.
వ కాంచి . విక్ర. 2 155

వలవాఁడు విశ ($\sqrt{}$ వల[1]) వాగురికుఁడు, ఉచ్చు లొగ్గువాఁడు
గీ వాగురిక సంజ్ఞయవు వలవాఁడనంగ అం. శా 2 286

వలస వి (సం పరదేశః )
1 రాజోపద్రవాదులచే స్వదేశము విడిచి పరదేశమునందు నివసించుట
చ. .. అవార్యతమిస్రమునేఁడు తత్పురిన్, విలసితశర్మహర్మ్యరుచి వేముఖ నల్గడపారి వెళ్లఁగా, వలసలు సేయఁగాఁ దొడఁగె వారకతర్ఘనగహ్వరంబులన్ తపతీ 1 47
గీ అష్టమహిషులపై పదియారువేల, సతులతో నీకు వలస కెచ్చటి కరిగెదు ... సిం నార. 11.
సీ. ఉదయగిరి మీఁదఁ గోపురం బుండి నిగుడు, సహితరవి రశ్మిచే బద్ధుఁడగుచుఁ దోడి, బలగమై నట్టు చుక్కలవలస ప్రోవఁజూప నేతెంచెనవ వేఁగుఁజుక్క వొడిచె. మనుచ. 3. 54
గీ వలసయవఁ బ్రవాసాఖ్యగా వజలు ... అం శా. 2. 223
2 రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ బోయిన ప్రజ
ఆ. వలస బెదర నృపతి కలఁగక ప్రజ్వగ, లార్పఁ బనిచి . ఆము. 3. 27

వలసవచ్చు=శత్రుభయమున స్వదేశము విడిచి వచ్చు.
సీ ఏమ లతాంగులవృత్తాంత మెఱుఁగుదు విను మందరాచలంబునకు నికట,మువనున్న పాటలంబను పురంబున వేలుపులకు నాతంకించి వలస వచ్చి, గీ నిలిచి యెప్పుడు నీదురాకలకు నెదురు, చూచు హేతి ప్రహేతుల సుతలు .. వరాహ. 3 131
జ : వలసపాటు, వలసపోవు, వలసలుచేయు, వలసలుతీయు, వలసల్పాగు, వలసరి

వలసపాటు వి ($\sqrt{}$ వలస) వలసపోవుట
గీ ఓడి గంధర్వులూడనిఁ బాడి రచ్చరలకుఁ జెఱలుప్పతిలె మహారాజికులకుఁ, గలిగెఁ దలగంపదింపని వలసపాటు, రాక్షసులు నేయురాయిడి రఘువరేణ్య . ఉ. రా 1. 285.

వలస(లు)పోవు అ క్రి రాజోపద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ బోవు.
వ . ఉభయస్యందనతురగ ఖురక్షతరథనేమి ఘట్టనసముద్ధూతంబగు రేణుపటలంబు రాయిడి కోర్వక పుడమి మింటికి వలసపోవు చందంబున నెగసి . . భా. రా. యు. 2 25.

చ అలఘుబల ప్రతాపయుతులై యతఁ
డమ్మెయి వచ్చు దండు వార్తలు విసుచుం
దద్రగరిశరాజులుగొందఱుము క్తమార్గులై, వల
నలుపోవు వారుఁ దగు వస్తువు లప్పన వంపు
వారుఁ గేవల వినయంబుతోఁ గొలుచు
వారును నైరి యథోచితస్థితిన్. కళా. 8. 46.

గీ జలజవని నుండి తుమ్మెద వలనఁ బోయెఁ గువ
లయవనీదళాంతరగుహాలు చేర . ఘటికా.
2 140.

**వలనలుచేయు** అ క్రి. (వలనలు+చేయు) సంచ
రించు, పోవు, గమించు

వ . ఉపరి లోకంబుల వలనలుచేసి మరలి తమ
తమ యగారంబులం జేరు వారి నాలోకిం
చుచు.. దశా. 1 261

**వలనలుతీయు** అ క్రి (వలనలు+తీయు) రాజో
పద్రవాదులచే దేశము విడిచి పరదేశమునకుఁ
బోవు, వలసపోవు

చ. ఎలనగ వంకురింప ముని యిట్లను రావణ
యింక నేమి విం,తలు వివరింతు నీవిజయ
ధాటికిక్షితిలి యూర్ధ్వలోకముల్, వలనలు దీయ
సాగె బలవంతుఁడ వన్నను నీవెకాక నీ,కిల
నొకరుండు సాటిగలఁడే యన బెట్టుగఁ గేరి
నవ్వుచున్ ఉ. రా. 5. 199.

**వలసల్సాగు** అ. క్రి. (వలసలు+సాగు) రాజోపద్ర
వాదులచే దేశము విడిచి పాఱిపోవు

మ. అనుచుం గాలకరాళ కాలహార ఫాలాక్షిల కీలా
కులా, కనిలీలాపరిలోల శూలము భుజాస్థానిం
జెలంగ న్మహా,ఖలోకంబుల వారు సూచి
వలసల్ సాగం దపోవాసు లొ,య్యనఁ గేల్మో
డ్చుఁగ . . దశా. 4. 99.

**వలసరి** విశ (వలస+అరి$^{3}$) వలసపోవువాఁడు, వలస
పోవునది

క చెలువా పిలువక ముందట, వలసరి మా యింటి
కేల వచ్చితి చెపుమా, పిలువని పేరంటము వని,
గలవారనుబోలి సిగ్గు గాదే రాఁగన్ ... వీర.
1 189

**వలానకము** సం. వి. అ. పుం 1. కోకిల. 2 కప్ప,
భేకము.

**వలాహకము=బలాహకము** సం. వి. అ పుం.

**వలి** వి 1. శైత్యము, చల్లందనము

వ .. వలిమించు క్రొమ్మంచు తొడుతిఁదియుఁది.
మనుచ. 3. 28.

చ చేలిమల మున్ను మేరుతనుజాతయనం దగు
మేని చెక్కు చ,న్నుల వలినిక్కునుం గల మనో
రమఁ జేకొని కాంచె చంపూరా 3 3

సీ వలిదేరు పన్నీరు వంకల వంకల గాలితేజీల
నిల్కడల కడల . సారంగ 3. 232.

2 చలి.

చ వలికయి విల్లువంకఁగని వ్రాసెడి యొక్కటి
లెక్కయక్కునం, దలయిడి రెంటి లెక్క యిడి
నాఁడు ముడించిన కాళ్ళసొంపుచే, నిలిపెడు
మూటిలెక్కబలి నిద్దురపోవుచు లెక్క మావఁ డీ,
బలకరపుందవు ల్గలిగి బక్క నియోగియటంద్రు
తద్భటుల్ రా వి 2 71

చ వలియును మంచు నెండయును వానయు
గాలియుఁ జేరనీని బ,ల్కలుగటు చేయఁబంచి
యదిగన్నడ కుండఁగఁ బుట్టలుంబొదల్, బలు
వుగ సంఘటింపుఁడని పల్కి నిజాకృతి డించి
చొచ్చియం, కొదలయుచునున్న వాఁడిపుడు
వాన్యగుఁ దూసరవెల్లిరూపునన్. ఉ రా.
6. 366.

3. కంపము, వణఁకుట

క చలిగాడ్పుల మునురుల మెయి, వలిగొని ధాత్రీ
పురంధ్రి వలిఁ బచ్చని కం,బలిఁ గవిసి కొన్న విధ
మునఁ, బొలుపునఁ జిప్పరలు గలిసె భూతల
మెల్లన్ . కు సం 6. 757.

క. కని వలిగని దొరలదొరల, నసుపమగతి నను
ప మదమఁ డాలోవాలోఁ, ఖనమన్న వారిఁ
గనుఁగొని, మిసుకెనయన్ బొగరు మేన మేనక
వలికెణ . చంద్రాంగ. 3 80.

4. చలిగాలి

క. విసవిస నెప్పుడు నుడుగక, విసరెడి వలిచేత
వడఁకు విడువక . భాగ. 10 ఉ 11

సీ సౌధవీథికలలోఁ జరియించు పుష్పకోమల లేడ
మల లేడఁ దలిరుబోఁడి, చీనచీనాంబర శ్రీఁ
జెందు కాలికావలు లేడ వలు లేడ వామవ
యన నరస 5. 145

5. గాలి, వాయువు.

గీ మొవయువలిపిల్లలా పుల్లమునకుగాని, బొల్లి నెమ్మోము దవరారు పుల్గురేని . . ప్రబంధ 802. 107

వలి = శైత్యము, (ప్రసిద్ధము)
కాని యీ ప్రయోగమునఁ గాలి, యనునర్థమున ముపయోగింపఁబడినది

ద్వి వలివేగమున్న వచ్చి వచ్చి యెంతేని బస. పు 5 205. పం.

ద్వి వలివేగమున నవివారితవృత్తి బస. పు. 4 121 పం.

6. వడి, వేగము.

ద్వి నలిన శక్త్యాలోకనాచ్చైవ యనఁగ, వలిఁ బదార్థానిహవర్జయేత్తనఁగ పండితా. పర్వ 337

విజ 1. శీతము, చల్లనిది

గీ అల్లవలిగాలి యుల్లంబు దల్లడిల్ల, బహువన ప్రసవోదిత పరిమళంబు, లలమి తెచ్చి పైఁ బొలసి .. భా. రా అర. 2. 426.

చ. పొలుపుగ నందుఁ బెండ్లినడుపుల్ నడుపున్ వలినాలి తెమ్మెరల్. విజ. 1 78

సీ పుడుకు ప్రొమ్వలికావి పువ్వుతేనియ లాను నీలా. 2. 76

సీ. తెంపార వలిజిలిబిలిపాటఁ బాడుచు నింపుగా వీణ వాయింపవేమి రసి 4 21.

(ఇట "మనోహరమైన" యని యర్థము )

2. గుండ్రనిది, వర్తులము

సీ వలిపకంచెలలోని వలిచనుంగవ మించి జక్కవ శ వశంగి సంభ్రమింప ... విక్ర 2 89

సీ. వలిజక్కవల పెక్కువలు దక్కవగ నిక్కు చనుదోయి కొకవింత చాయదోఁచె పారి 1. 59.

సీ గురుగోత్ర తటములు గోరాడ మనుమొక్క వోయిన వలిగొమ్ము దోయిమెఱయ, ఘన మేఘ తటములు గాల్ ద్రవ్వ కొమ్మెఱుఁగుల వన మూనిన గొరిజలొప్ప హరి ఉ 7. 79

3 గొప్పది (గ్రా ని ) (చూ వలితనము )

జ • వలిగట్టు, వలిగుబ్బలి, వలిగొను, వలిచంద్ర, వలిచుట్టు, వలితనము, వలిపన్ని, వలిఫిరి, వలిపిరి గొట్టు, వలిమల, వలిమిన్న, వలిమిరి, వలిమెట్టు, వలిమొలక, వలివెలుఁగు.

**వలి** నం. వి ఇ ఈ స్త్రీ 1 ముదిమిచేఁ జర్మముపై నేర్పడు ముడుత. 2 స్త్రీల కడుపుమీఁది ముడుత 3 ఇంటికప్పుయొక్క వెనుబద్ద 4 సుగంధి తైలముతో శరీరముపై గీసినగీఁత.

**వలికి** వి. గోనర్దము, ఒకానొక పక్షి,
గీ . గోనర్ద మలరు, వలికి యనఁగను ... ఆం. భా 2c 67.

**వలిగట్టు** వి (వలి+గట్టు) హిమాద్రి
క అవఁ దనయు రామచంద్రుని, ముని పరమేశ్వ రున కిచ్చె మోహముతో న,జ్జననాథుఁడు జాబి ల్లిన్, వననిధి వలిగట్టువల్లువారికిఁ బోలన్. రామా. 4 14

సీ. ఏ సామి సామేన నేప్రొద్దు వలిగట్టుదొర పట్టి వర్మెలి తోడఁ బూనె .... నీలా 1 12.

**వలిగుబ్బలి** వి (వలి+గుబ్బలి) హిమవత్పర్వతము.
చ అవ్విరిం, దననెటి గొప్పునం జెరివినవ్వలి గుబ్బలి ముద్దుపట్టి లేఁ,త నెల ధరించిన ట్లమరెఁ దద్దయుమోహనకాంతి సంపదన్ పారి. 1 55

సీ అంక్రౌంచగిరికి రంధ్రాన్వేష మొనరించి వలి గుబ్బలికి వింతవడఁకుఁ గూర్చి . నరస. 5. 191

**వలిగొను** అ క్రి (వలి+కొను) చలిగొను, గడగడ లాడు
క. ... పలుకులు వేయును వేటికి, చలిగొని వడఁ కాడుచుండు వైశ్వానరుఁడున్ ... పి శకుం. 3 45

క చలిగాడ్పుల మునురుల మెఱు, వలిగొని ధాత్రీ పురంధ్రి వలిఁ బచ్చని కం,బలిఁ గవిసికొన్న విధమునఁ, బొలుపుగఁ జిప్పరలు గవిసె భూతల మెల్లన్ కు. నం 6 757

**వలిచేంద్ర** వి (వలి+చంద్ర) ఒకానొక చెట్టు.
ద్వి బలుసుముల్ మోదుగు పచ్చారె యారె, వలి చంద్రములు చంద్ర వాడగన్నేరు ద్వి. సారంగ. 2. 80. పా 4 పం.

**వలిమేట్టు** న క్రి (వలి+చుట్టు) వలయాకారముగ చుట్టు

సీ వలిచుట్టి పూదండ వెలిచుట్టుగన నొప్పుకప్పు చిప్పిలు సాముకొప్పు దనర ... వాల్మీకి 3 13

**వలితనము** వి (వలి+తనము) గొప్పతనము.

గీ తేరుఁ దవఁ దెచ్చి తత్సూతుఁ డూరు పేర్చె, నక్కబంధంబు, లెదురెక్కె నొక్కవడిన, ద్రేటు వాటును వాయును ద్రేటు చూప, కవనిఁ గలయక వలితనం బివుర దనుచు కకు 5 49.

**వలితము** నం విణ (అ ఆ అ) 1 చలించినది, కద లినది 2 చుట్టుతిరిగినది 3 గుండ్రముగా వంపఁ బడినది. 4 చుట్టుకొనఁ బడినది, పరివేష్టింపఁ బడి నది 5 ముడుతలు పడునట్లు చేయఁబడినది 6 త్రోసివేయఁ బడినది

**వలినము** నం విణ (అ ఆ అ) ముడుతలు పడినది, వళులుగలది, వదులయినది, బిగిలేనిది

**వలిపని** వి (వలి+పని) శైత్యోపచారము (శ. ర.)

**వలిప(ల్ప)ము** విణ 1 తెల్లనిది (వృత్తియందు 'ము' వర్ణలోపము వైకల్పికము) (కొన్ని ప్రతులందు "వలిపెము" అనురూపము కన్పట్టుచున్నది నిర్ధారకము కానరాదు)

గీ. తారకాధీశుకిరణకదంబకంబు, చిలికెఁ బలుచని వలిపంపు జిలుగుమంచు పారి 2, 47

సీ. కలువ పుప్పొళ్ళచేఁ గసటైన వెన్నెల వలిప వెన్నెలలోన వడిచి తేర్చి. పారి 2 48.

సీ పలుచగా వండిన వలిపంపుఁ జాఁపట్లు పెనర పప్పులతోడఁ బెనఁచి పెనఁచి ... నైష 6 120

2 పరిశుద్ధమైనది

చ మలయజవారిసేకముల మౌక్తిక నూతనహార లీలలన్, వలిపపునన్న కావులను వారిరుహోత్పలపీఁగుఁజన్నులన్, గలిగిన చల్విరిన్ బ్రదికెఁ గాక జనావళి యిట్టి వేసవిన్, గలఁడె శరణ్యమన్య మనఁగాఁ గడుఁ బేర్చె నిదాఘదాహముల్ నృసిం 3 68

3. సన్నమైనది, సూక్ష్మము.

వ ... మత్కుచకర్కశతకీవలిపమడుం గెట్లు సహించు వన్నట్లు వల్కలాంబరంబులు ధరియించి . . మ్హ వి 2. 39.

మ. . సుఖటోద్యత్ఖడ్గకాంతిచ్ఛటల్, వలిపంపుం దెలిచల్వపావడలు పైవన్ దుందుభుల్ మ్రోయఁగ .. దశా 2 67.

చ తడిసినవల్పపయ్యెదలు దాఁకొని పైపయినంటి యుండఁగా, నుడువనగోచరం బగు విశాలత్న విలాసత నొప్పె నప్పుడు కవిరా. 4. 102.

వి 1 ధౌతవస్త్రము, చలువబట్ట.

చ పలుచని సన్నకావివలిపంబులు గట్టఁగ నిచ్చి నెచ్చెలుల్ విక్ర 1 136.

క తడియొత్తి సన్నవలిపం,బిడి మణిపీఠస్థయైన యింతి. ఆము. 6 127.

2 సన్నవస్త్రము

మ వలిపంపుం దెరమాటునం దిరుగు జాళ్వా మేలి కీల్జొంపమ్ములన్, దెలనాథుల్ విరి చందుకా మొకరి లేఁదెంట్లార్భటుల్ వేత్రహస్తులు సామంతులు కొల్వుదెల్పు ... చంపూరా. 2 56.

చ వల్పముల నెచ్చెలి యొక్కతె తెచ్చి యిచ్చి వన్ సుద 5 45.

3. తెల్లబట్ట

చ వలిపము గట్టి హారములు వైచి పటీరము మైవలంది జాదులు నెఱికొప్పునం దుఱిమి త్రోవనె పోయితిమేని దాఁకియుం,దలఁచెదు వారులేరని మనంబుకలంకలు చేర్చి జారకాం,తల సమయ స్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టి వెన్నెలన్ పారి 2 51.

**వలిపి(ల్పి)రి** వి (√ వలి) 1 జల్లు, వాన కురియునపుడు చిందిపడు నీటితుంపర.

గీ వల్లమామూల వలిపిరి చల్లునిచట, మరియు నీడాయ నిద్రమై నుందు వచట, మహిత రామానుజోదీర్యమాణభాష్య, ముఖ బహు గ్రంథ సామీప్యమునకుఁ జనకు విప్ర 3.77

శా. నంపెంగల్పరు వంది క్రొవ్విరులచే శంపా లతాలక్ష్మినొం, ద్రింపం బాదపము ల్ఘనంబు లయి పూఁదేనె ల్దువాలించి వ,ర్షింప న్వల్పిరి చల్లి పాంథ జనరాజున్గమ్మగాడ్పు ల్చలిం, పింపన్మాధవుఁడంబుదాగతి విడంబించెన్ విజృంభించు చున్. పి శకుం. 2. 127

2. శైత్యము, చల్లఁదనము, చలి.

సీ. గుడిసె నెన్నఁడు చక్కఁగుడువ వల్పిరిఁ గొన్న గడలు దుట్రిల వడవడ వడంక ... రాజవాహన 2. 70.

3. వణంకు, కంపము (శ. ర)

విశ. శీతము, చల్లనిది.

ద్వి వలిపిరి గాలితో వడి మీఱిమీఱి, బలువిడి వాన యంపాచారమైన ... ద్వి పరమ. 4 (చి వి.)

**వలిపిరిగొట్టు** విశ. (వలిపిరి+గొట్టు) వణఁకువాఁడు. (శ. ర.)

**వలిభము=వలినము** సం విశ. (అ ఆ. అ)

**వలిమల** వి. (వలి+మల) హిమాద్రి, శీత నగము.

క. .. వలిమల, కానందవమూనునదితి గనియె శుభంబుల్ .. బాశా. 5 44

మణిగణనికరము కలువలదొర కొలఁగల తల విరిగా, వలిమలలలి, నిలువఁ గడఁగు బసగాఁ గలుములచెలువమగఁడు గడుఁ జెలిగా మల యుచు జగముల మనుచు నొడయఁడా అ రా. అయో. 119.

**వలిమలయల్లువాఁడు** శివుఁడు.

చ. చెలిమదురున్ గడున్ దొరయ సేమముతో నెల కుండఁ గల్గెన, వ్వలిమలయల్లువానితల వాడని పువ్వయి ... యయా 4. 43

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవు గుత్తి .. పారి పీరి 6.

**వలిమిడి** వి పశువులకు కాలిమడమల యందుఁ గల్గు రోగ విశేషము. (శ ర.)

**వలిమిన్న** వి. (వలి+మిన్న) చంద్రుఁడు

సీ కననింపుఁ గూర్చు చక్కనిమోము వలిమిన్న మనసార ముద్దు గైకొనఁగఁ దివురు చంద్రికా. 4. 20.

**వలిమిరి** విశ శీతము

గీ కర్షకుఁడు మెచ్చె వలిమిరి గాడ్పు హెచ్చె ఉ. రా. 1. 103

**వలి(లీ)ముఖము** సం. వి అ పుం వానరము, క్రోఁతి ఇట్లే వలి(లీ)వదనము.

**వలిమెట్టు** వి (వలి+మెట్టు) హిమాచలము.

సీ. వలిమెట్టు నాకుఁ గావలిపట్టు దేవరసామి గట్టుకు నేను సామినొడయ ... చంద్రాంగ. 2. 45.

**వలిమొలక** వి (వలి+మొలక) 1. వడముడి, భీముఁడు.

సీ . అనిలజుఁ డలరును వడముడి వలిమొల కన ... ఆం భా 2 182

2. ఆంజనేయుఁడు, హనుమ.

**వలియు** అ క్రి 1. డయ్యు, శ్రమనొందు

క సకలక్షత్ర భయంకరు,నకు శార్ఙ్గధ్రదీకి నని మొనన్ మార్కొనన్,పక వలియం బాఱఁడె యీ,ముకుందుఁడు భయాతిరేకమునఁ బది మాఱుల్. భార సభా. 2 46.

సీ. ఎదిరినపోతుల నెవ్వానినైన నవారణ నోడించి వలియఁదోలు ... హరి. పూ 6. 124

ద్వి వలియఁబాఁకెడు శిలావర్షంబుచేతఁ, బలు దెనఁ జెడిపాఱు వతులో యనఁగ రం. రా. యు 445 పు 8 పం

సీ హరిరథంబు, గడపెడు నటె పరికర మిట్టదై యుండ నెట్టు కర్ణునకోడి యిట్టు వలియఁ, బాఱు తెంచితినీవు భార. కర్ణ 3. 61

2 సన్నగిల్లు

సీ. వా కలఁ బడి నీరువలియఁ బాఱఁగ మిట్టు లొండొండ వెలసి తృణోత్కరముల,తుదలువచ్చు దినంబుతోఁ దలమూపఁగ . హరి. పూ 7 186.

**వలిరుఁడు** సం విశ. (అ ఆ అ) 1. ఓర చూపు చూచువాఁడు 2 మెల్లకన్నువాఁడు.

**వలివెలుఁగు(ల్గు)** వి (వలి+వెలుఁగు) శీతకిరణుఁడు, చంద్రుఁడు

వ . . మందయానల చెక్కుల వెలుంగు వలి వెలుంగుం బూపి మీ మొగముల మిలమిలలు గిలుకాడవచ్చెఁజుమీ వెన్నెల బచ్చు ముచ్చు ... వసు. 4 23.

సీ వలివెల్గుబాఁవెల్లువలు వాటి మదనవహ్ని జ్వాలిక లవేఁడి నిగురుఁబోలు ... వసు 4 66

**వళిశము=బడిశము** సం వి అ. న

**వలి(లీ)కము** సం వి, అ న కొణిగ, ముంజూరు

**వలుఁద(ల్ద)** విశ. స్థూలము

సీ. వస్త్రాలకంబుల వలుఁదపిఱుందుల దర్పగద్గద
భాషితములఁ జేసి, జనులచిత్తములకు సంక్షోభ
మొనరించు కామినీ జనములు కలిగి భార
ఆది 8. 74

చ . బాలపై, వలువెడలన్ బయల్పడియె వల్లకు
చంబులుఁ గుచయుగ్మమున్ భార ఆది
4. 43

చ తొంటిలా, గునఁ దవ కాయకంబు కొలకుం
జని చాలవలుంద మీలఁ గైకొని చనియొక్క
వీధి వెలకుం దగనమ్ముచు మన్న యత్తరిన్ .
చెన్న 4 336.

మ. .. తీరైన ఫాలంబు బి, త్తరపుం జూడ్కి
వలుంద గుబ్బకవ వంతల్ గూర్చుఁ దన్వం
గికిన్ ... కృ కుం 2. 17.

చ. జల జల దుల్లు పర్ణముల చప్పుడు లక్కడఁ
జూడఁ జూడఁ బై, నెన మెఱు వల్దమోను
లును నేర్పడు కెందలిరాకుఁగొంపమున్ కు
సం 6. 787.

సీ వలుఁద చీకట్లలో వ్రాలు మక్కలు వోలె
వేణీభరమ్ములో విరులు వ్రేల ... ఉ హరి
5 276.

**వలుకు**=వఱుకు వి తగుపు

క డగ్గఱఁ బోరా దగ్గికి, వెగ్గలమై యున్న దౌర
వీరల తేజం, బగ్గలిక పలుకు వలుకుల, సిగ్గుల
చేటయ్యె నేమిసేయుదమింకల ఘటికా
2 112

**వలుము** వి. మోనము.

సీ దుగుణంబు సేసిన తోడనే మాఁడని వాకొంచి
వేదని వలుముసేసి . ఉ హరి 3 122

**వలువ(ల్వ)**=వలువు వి వస్త్రము, సన్న వస్త్రము

సీ కల్పవృక్షంబులు గలుగఁగ వేఁటికి వలువలకై
తంతువాయ సమితి ... కాశీ. 3 201.

గీ. వస్త్రనామంబు చెలఁగును వలువవలువు ...
ఆం. భా. 2. 151.

రగడ. వలిచలువలు చనువలువలు చొచ్చెన్,
జలిపచ్చడములు చలి పారతెచ్చెన్, మూల
కొదిగెఁ దుది ముదుగుంగోకల్ ... బహు.
2. 18.

చ అని మదనాతురుండగు నిజాధిపు చెప్పిన మాట
యేర్పడన్, విని వినయమ్ము భక్తియు వివే
కముఁ బ్రీతియు నగ్గలింప న,వ్వనిత కడుం
బ్రయత్నమున వల్వ దృఢంబుగ గట్టి లంకె
కున్, ధనమొదువంగఁ బుచ్చికొని వాధుని
మూఁపునఁ తాల్చిచెచ్చెరన్ మార్క 2 164.

గీ తొడల బెడఁగారు నునువల్వతోడపెడుపు, రతి
కళావించి వచ్చిన రమణ మెఱయఁ, గొలమ
వెలువడివచ్చిరాజలజముఖులు . విక్ర
5 61

సీ ఎడపక గీమున కేతెంచు విందుల కెలమి వల్వ
లును సొమ్ములు నెసంగు సీలా 1. 49

**వలువు**=వలువ వి బట్ట, వస్త్రము

సీ బంగారు వలువున రంగారు కటిమీఁదఁ
జక్కఁగా నొక్కహస్తంబుపాచి .. కళా
2. 158.

మధురగతిరగడ. పదియార్వన్నియ బంగరు వలు
వును మెదలెడి తళుకుల మేఖల చెలువును .
కళా 8 232

గీ వస్త్రనామంబు చెలఁగును వలువవలువు ..
ఆం. భా 2. 151.

**వలూకము** సం వి అ. పుం పక్షివిశేషము, ఒకజాతి
పిట్ట
న. తామర దుంప.

**వలె** అ క్రి. ("వలయు" నకారాదేశముగా వచ్చు
రూపము) ఆవశ్యకమగు
(ఇయ్యది తఱచు అన్నంత క్రియలతో నను
ప్రయుక్త మగుచుండును )

ఉ. భా,పావరు పాలికిం జని నిశాట వరేణ్యుల
బాధచెప్పి దే,వావలె మాకునొక్క దళవాయి
ధరాధర వైరికిన్ మహా,దేవచమూకదంబక
పతిత్వము దాల్చుట బెట్టు గావునన్. నరాహ.
6 60.

క. . పసిఁడి వహ్నిరమైనన్, కెరువఁగఁ బోటి వలె
నని, చేరితినిను నాదు కోర్కిఁ జింతింపుమదిన్..
విక్ర. 1. 111.

(**వలెనను** = వలెన్ + అను)

క జాలరులు దానిఁజచ్చిన, వాలువగా నిశ్చయించి వలెనవక సరి, తూర్కాలమునకుఁ ద్రోచి వము, ద్వేలగతిన్ దిక్కులంబు ద్రిలన్ లిలన్ వేం వంచ. 1 6 7.

క. ఒప్పగునో తప్పగునో, యిప్పటికిం దోఁచు కార్యమిది నృపతులకుం, జెప్పవలె నా ప్తమంత్రులు, చొప్పడునే మనకు రాజసూయము చేయన్ ఉ హరి. 4 130

క. . వలివమలిఁక సరగఁ జేయవలెనని మఱి యున్ నీలా. 3 31

అవ్య. 1 ఉపమా వాచకము

క. . క్రీడియనికి వచ్చిన వా డిదె పులివలె మార్గాన రాదె కర్ణసేనకుం బ్రియ మొనఁగన్ .. భార. విరా త. 22

క ఉండి భుజంగముఁ గన్గొని, మండూక కులంబు నెల్ల మడియించితి మి, త్రుండు వలెనుండి తగున్, యొండొరులకుఁ గీడు సేయుటొప్పునె మనలోన్ కేయూర. 3. 258.

2 ప్రకారార్థకము

క ఇటుచూచినఁ జెలిపైఁ దప్పటు చూచిన సుతుని నేరమవుఁగా దవఁగా, నెటువలె వచ్చునో మీఁదట, వటమటమో లేక నిజమొ యది యెఱుఁగముగా. సారంగ 2. 253.

క అనవుడు నా నక్కిరుఁడు, మునుపటి వలెఁ దప్పటన్న ముక్కంటియు నాతనికనియెన్ గిరి తనయా, ఘనకచ భారంబు సహజ గంధం బనుచున్. కాళ. 3. 168.

3. వాక్యాలంకారము.

క. నరుఁడరువది వేలేడు లితర దైవత దర్శన మునఁ దాఁ గనుఫలమున్, బొరయు నలవోక వలె కాంకరి యీ క్షేత్రోత్తమంబుఁ గను గొన్నంతన్. పాండురంగ. 2 83

వలెత్రాడు=వల్లెత్రాడు వి పశుబంధరజ్జువు

ఉ ... కోడలా యిసుక మేదినిఁ బుట్టదటంచు నెంచియో, తెచ్చితి వంచు నాగ్రహమతి న్నెమకె న్వలెత్రాడు ముంగిటన్ .... శుక. 2. 571.

సీ మెడలపైఁ గర్నాధులిడి పులుల్ వలెద్రాటఁ జిక్కి నఖమ్ములఁ జిమ్ముకరణి ... ప్రబంధ 1. 86.

వలెవాటు=వల్లెవాటు వి 1. రజ్జువు వలె మెలిపెట్టి యుత్తరీయమును వైచుకొనుట

గీ తమ్మిదోదుమ్మి కోదుసాదవల హారువు, వ్రాఁత వని దుప్పటి వలెవాటు వైచి . కువల 2 4.

క. వడిఁ బుడమి ఱేఁడు వలెవాటిడుకొన్న పసిండి వ్రాఁత నెసఁగెడు వలువన్, వడుము బిగియించుకొని మఱి, యడుగులపై వ్రాలి లేచి యతఁడును దానున్ యయా. 4 66

సీ. వలెవాటు వైచిన సుకువుఁ జెందిర కావి వలి వముల్ వదపల్లవముల జీర .... చంద్రి 1 107.

2 రజ్జువువలె మెలిపెట్టి వైచికొన్న యుత్తరీయము

క. సిగనంపెఁగ పూలొనవరి, వగకస్తురి నామ మెఱువువలెవా టౌరా, సొగసిటులుండఁగ వలెనని, సొగసి లతాతన్వియతని సొగసు నుతించెన్ విజ 1. 64.

ద్వి వసుధపై జీరాడు వలెవాటుతోడ, వసివాళ్లు వాడిన వదనంబుతోడ, . రం రా. సుం 247 పా 11 పం

వల్కతమువు నం వి ఉ పుం. వృక్ష విశేషము, భూర్జపత్ర వృక్షము

వల్కద్రుమము = వల్కతరువు నం. వి అ పుం.

వల్కము నం వి అ పుం న 1 చెట్టు పట్ట. 2 చేప పొలుసు. (మే ని) 3. ఖండము, తునియ. (వి.ని)

వల్కలము నం వి అ. పుం న 1. చెట్టుపట్ట 2 నారబట్ట, నార చీర. 3 వృక్షము, చెట్టు (రా ని)

వల్కలోధ్రము అ. వి. అ. పుం. ఒకజాతి లొద్దుగ చెట్టు (రా ని.)

వల్కిలము నం వి. అ. పుం ముల్లు, కంటకము. (విల్యమ్సు)

వల్గ నం. వి. అ స్త్రీ. 1. కళ్లెపు వాఱు, పగ్గము.

వల్గనము నం. వి. అ. న, దుముకుట, లంఘనము; దౌడు తీయుట.

వల్గితము సం. విశ. (అ అ అ) 1. దుముకినది, గంతువేసినది.
2 చలింపఁ జేయఁబడినది, నటింపఁ జేయఁబడినది
వి. అ న 1 అశ్వధారా విశేషము, గుఱ్ఱపుదౌడు.
2. బడాయి చెప్పుట, బహు భాషణము 3 గమనము, నడక

వల్గుపత్రము సం వి అ. పుం వనముద్గము, అడవి పెసరు (వృ వి)

వల్గులిక సం వి ఆ స్త్రీ 1. బొద్దీఁక, బొద్దింక. 2 గబ్బిలము (వాచ)

వల్గువు సం. విశ (ఉ)1 మనోజ్ఞము, సుందరమైనది. ఇంపైనది 2 మధురమైనది, తియ్యనిది 3. అమూల్యము, ఎక్కువ విలువగలది
వి ఉ పుం ఛాగము, మేఁకపోతు
న 1. చందనము 2 వనము. 3 పణము, (వాచ)

వల్మి సం వి ఈ స్త్రీ చెదలపురువు, చెదలు

వల్మికము=వల్మీకము సం. వి అ. పుం న

వల్మికి=వల్మీకము సం వి ఇ పుం.

వల్మీకము సం వి అ పుం న. పుట్ట, చీమలు (చెదల పురువులు) పెట్టిన పుట్ట పుం. రోగ విశేషము. శ్లీపదము, ఏనుఁగు కాలు, పుట్టకాలు.

వల్మీకశింబి సం. వి ఈ స్త్రీ పుట్టతమ్మ (వృ వి) (శ. ర)

వల్మీక శీర్షము సం వి. అ. న. ఒక విధమైన నేత్రాంజనము (సుర్మా) (విల్యమ్సు).

వల్మీకుఁడు సం. వి. అ. పుం. వాల్మీకికవి.

వల్మీకూటము సం వి అ పుం. వల్మీకము, పుట్ట.

వల్ల[1]=వలను విశ యుక్తము
చ అకట యదేమియో యెఱుఁగ నయ్యెడఁ దొయ్యలి దక్షిణాంస చూ,చు కనయన ప్రకంప గుణసూచన లేమియు వల్లకావు ... పారి. 1 73
ఆ వల్లవైపు లేక వాగ్దత్తమటు చేసి, యదిగో యిదిగో యనుమ నాసబెట్టి, గడువుబెట్టి రేపు గడియగా నిమ్మని, గడియలోనఁ బడియెఁ గదర వేమ .... వేమ. 3. 28.
వి. నైపుణ్యము, నేర్పు.
ద్వి. అనవుడు తరుణి కిట్లనియె నర్జునుఁడు, వనిత సారథ్యంబు వల్లనే వెలుఁగ, నీవు వచ్చిదిగాన నీవేడ్కనాకుఁ గావింపకుండుటగా దెన్ని విధుల ... విరాటపర్వము 2. 81. పొ.
జ . వల్లగట్టు.

వల్ల=వలన ప్ర ప్ర పంచమీ విభక్తి ప్రత్యయము
గీ. ఆ రమణివల్ల సంశయం బేరుపడక, పడకయిలు వెళ్ళి వచ్చి భూపాలు డప్పడు . సారంగ 3, 154.
సీ. తనవల్ల బుట్టిన దనక మహామాయ వాదిని జేపట్టి పోయిసెంచె ... పార్వ 4 102.
సీ వల్లవాధర యల్ల మొల్లతీవల వల్లనెల్ల తావులఁ దావులుల్లసిల్లె ... దశా. 3 8
గీ అదియు నావల్ల దెలిసి యయ్యధిపవర్యు. కటకమని తెల్పనరిగితి గాదె మున్ను .. కువల, 4. 164

వల్లకాడు వి డా (వల్లడి+కాడు) దశా. 3 8. శ్మశానము.
(వల్లడి .అకారణమైన యాపద)
గీ. అఖల తీర్థప్రదేశంబు లడవులిండ్లు, యజ్ఞవాటకవల్లకా డను విభేద, మించుకయు లేదు భీమనా థేశుభూమి, జంతువులు శంభులగుదురు చచ్చినవుడు భీమ. 4 34
గీ. అబ్బనే నేఁడు మీరు మధ్యాహ్నభిక్ష బ్రహ్మపురివాడఁ గాశికా పట్టణమున, నబ్బదో నాశక్తిపోలె మహర్షులార, వాడ వాడల నీపెద్ద వల్లకాట .. కాశీ 7. 158
చ. ... దుష్కరమగు వల్లకాటి కధికారము వచ్చిన దుష్టబుద్ధికిం, గరుణాదలంప నెక్కడిది గంధ గజేంద్ర. సమానగామినీ ...హరిశ్చంది 5. 92

వల్లకి సం. వి ఈ స్త్రీ వీణ వీడియ.

వల్లగట్టు న. క్రి (వల్లల+కట్టు) శుచిగాఁ జేయు పరిశుద్ధ పఱుచు.
ద్వి చల్లగాఁ బూవు వానన కట్టితెచ్చి, వల్లగట్టిన రసావళ్లు వంటిళ్లు ... అ. మ. శ. 5. 246 పొ. 24. పం.

వల్లడ వి. పక్షి విశేషము.

సి జిట్టువము పూజిట్టువ గిజిగాండు వల్లడ పొడిపిట్ట వంగపండు హంస 3. 12.

**వల్లడి** వి అకారణమైన యాపద.

2. కొల్ల (శ. ర)

(చూ. వల్లడికాఁడు)

జ వల్లకాడు, వల్లకాఁడు.

**వల్లడికాఁడు** విశ. (వల్లడి+కాఁడు)

1. అకారణమైన యాపద చేయువాఁడు (చ. ని, శ ర)

2 కొల్ల పెట్టువాఁడు,

సీ. దొంగ తెక్కలికాఁడు దొరకోలు సన్నాసి ముచ్చెత్తు బరికాఁడు ముడియవిడుపు, తెరువాటుకాఁడు, కత్తెరదొంగ చేవాఁడికాఁడు వల్లడికాఁడు కన్నగాఁడు, మునిముచ్చు గడిదొంగ యనఁ దస్కరాఖ్యలౌ అం నం. మాన 11

**వల్లభ** నం వి అ స్త్రీ ప్రియురాలు, భార్య, ఇల్లాలు

**వల్లభపాలుఁడు** నం వి అ పుం గుఱ్ఱపువాఁడు, అశ్వరక్షకుడు

**వల్లభము** నం వి అ పుం మేలిజాతి గుఱ్ఱము.

విశ (అ ఆ అ) ప్రియమైనది.

**వల్లభాయితము** నం వి. అ న పురుషాయితము, ఉపరతి

**వల్లభుఁడు** నం విశ (అ ఆ అ) 1 ప్రియుఁడు, ఇష్టుఁడైనవాఁడు 2. ఉత్తముఁడు, గొప్పవాఁడు.

వి అ పుం 1 ప్రియుఁడు, భర్త, రమణుఁడు, 2 పై విచారణ చేయువాఁడు 3 పెద్దగొల్ల, గొల్లలలో ముఖ్యుఁడు

**వల్లము**=వల్లువము వి. వలపొల జాలె.

ఉ. ఉల్లము జల్లనం గలఁగి యొక్కెడ దక్కెడ కోలవైచి వీఁ,డొల్లడొకాని విద్యలని యుంటిఁ గదా యని కొంత చింతతో, వల్లము పాఱవైచి కొని వైశ్యుని జాడ నిజంబు గావకన్ జిల్లర చేరము ల్విడిచి చేరి కుమారునిఁ దండ్రి యిట్లనున్. బహు 5 155.

ఉ. అల్లన మందభాగ్యుఁడగు నాతడు వేవిధులం గృశించియున్, వల్లము పచ్చగాళ పసివాడిన మోమునఁ దా నివృత్తుఁడై, తెల్లముగా సుహృత్తతులఁ దెమ్మని వేడిన వంచనామతిన్, గల్లలఁ బల్కె నాతడెలుకల్దినెఁ ద్రాసని యాస పెంపునన్. వేం. వంచ 1 774.

సీ. వల్లంబు పోనాడు వైశ్యుని తేవను...

గీ. చికిలి నెఱవన్నె కాంద్రకు శివములెత్త వెనసి చరియించు వీఁట నా హేమరేఖ. హంస. 1. 220.

**వల్లము** నం. వి. అ పుం 1. ఆచ్ఛాదనము, కప్పు. 2. మూఁడు గురివెంద గింజల యెత్తు 3. (వైద్య) ఒకటియువర గురివెంద గింజల యెత్తు, రెండు గురివెంద గింజల యెత్తు. (రా ని) 4. మూష మెత్తు వెండి 5 నిషేధము.

**వల్లరము** నం. వి. అ న 1. అగురుచెక్క. 2. కుంజము, పొదరిల్లు. 3 గహనము, సాంద్రారణ్యము 4. పూలగుత్తి మంజరి.

**వల్లరసి** వి ఒకానొక చెట్టు. (శ ర.)

**వల్లరి** నం వి. ఇ ఈ స్త్రీ. 1. తీగ, లత. 2 మంజరి, పూలగుత్తి 3 చిత్రమూలము (వ్య. వి) 4 మెంతి వృ. వి. (రా ని)

**వల్లవి** నం. వి ఈ స్త్రీ గొల్లత, గోపాంగన

**వల్లవుఁడు** నం. వి అ పుం. గొల్ల గోపుఁడు. భీముఁడు 3. వంటవాఁడు.

**వల్లి** నం వి. ఇ ఈ స్త్రీ 1. లత, తీఁగ. 2 పుడమి, భూమి. 3. ఓమము వృ వి.

**వల్లించు** న క్రి 1 ఆమ్నాయము చేయు.

ద్వి పలుమరు మునిశ్రేష్ఠ పనలెన్నుచును, వలనొప్ప సారెకు వల్లించుకొనుచు ద్వి పరమ 2 126 పొ

2. అభ్యసింపఁ జేయు, నేర్పు, కఱపు

మ. . . వల్లించు శ్రీరామ నామసుధా మాధురి సాధురీతి ... బింబోష్ఠి రాచిల్కకున్ ... పాండు 4. 227

జ : వల్లింత.

**వల్లింత** వి. (√ వల్లించు) తిట్టుంబోతు, ఒకానొక తిట్టు

సీ. తచ్చువగొండి పోతరకత్తె కల్లరి వల్లింత మాయల బెల్లికటికి ... చెన్న బ. 2. 24.

వల్లిక వి మత్స్యభేదము, ఒకజాతి చేప

సీ వాలువముకు బొమ్మ వల్లిక గండెకల్లరుజు బేడిస .. వేం పంచ 1. 294 (బి ని పా)

వల్లిగము వి బొక్కెనమీఁది యినుప వలయము (శ ర త్రా.)

వల్లియ=వల్లె వి వల్లెత్రాడు, పశుబంధన రజ్జువు

గీ వల్లియలు వైచి యోదములెల్ల ద్రవ్వి, తార్చువే సరియురు లొగ్గి తటము డయ్యఁ, దోలి యోటలి వోనీక దొడ్డినాఁగి, పొడువ నడువను నలుదెసఁ బొంచియోడి ... హరి పూ 6 128

క వల్లియలు త్రెంచుకొని బల, మెల్లను జెల్లగిలఁ జొచ్చి యెంతయు నలుకన్, గెల్లువడి సురభి హుంకృతి, మల్లడిగొను ప్రజలమారి మనఁగఁ దొడంగెన్ పద్మ 7 288

2. ఆకర్షణము, వశీకరణము.

వ అరవిరి విరులఁ గ్రోలి యితర సౌరభలోలు షట్పదంబులకు వల్లియలగు బొండు మల్లియలును .. విప్ర 2 25

జ వల్లియత్రాడు, వల్లియత్రాడు దాల్పు

వల్లియత్రాడు=వల్లెత్రాడు వి (వల్లియ+త్రాడు)

1. పశుబంధన రజ్జువు

ద్వి తరిత్రాళ్ళు వల్లియ త్రాళ్ళు జల్లెడలు, నురి త్రాళ్ళు పగ్గంబు లుగ్గంబులురులు .. అ మ క 1. 45. పా 20. పం.

2 వరుణ పాశము

(చూ వల్లియత్రాడు దాల్పు)

వల్లియత్రాడుదాల్పు వి. (వల్లియ త్రాడు+ దాల్పు) వరుణుఁడు

క కలఁచి వేల్పుతేని మడిగంబులఁ బూన్చితినగ్గి వజ్రమున్, గెలిచితి నోఁకు పెద్దవడఁగించితి వల్లియత్రాడు దాల్పుఁ జిక్కులఁ బెరయించితిన్ .. అ. రా యు 496.

ఆ మేటనీరుచూలి మెయిశాలువులసామి, వల్లెత్రాడుదాల్పు నీళ్ళరాయఁ డేటి కోఁటిమగల యెకిమీఁడు పడమటి, దొరయనంగ నొప్పు వరుణుఁ డీశ. అం. సం. దేవ. 21.

వల్లినూరణము నం వి అ. పుం పుల్లబచ్చలి (వృ వి) (శ ర)

వల్లిజము నం వి అ న మరిచము, మిరియము

వల్లిబదరి నం వి ఈ స్త్రీ. నేలరేను (వృ వి)

వల్లీదూర్వ నం వి ఆ, స్త్రీ తృణవిశేషము, ఒకజాతి గడ్డి

వల్లీముద్గము నం వి అ పుం. వనముద్గము, అడవి పెసరు (వృ వి)

వల్లీవృక్షము నం వి అ పుం సాలవృక్షము, మద్దిచెట్టు

వల్లురము నం వి అ న 1. పొదరిల్లు. 2. గహనము, దట్టని యడవి 3 మంజరి, పూలగుత్తి. 4 సేద్యము చేయని పొలము 5. నిర్జన ప్రదేశము 6 పచ్చిక బయలు

వల్లువము=వల్లము వి వరహాలముల్లె

ఉ పల్లవతస్కరుం డొకఁడు ప్రాక్సముపార్జిత తారపంక్తితో, వల్లువ మెత్తికొంచుఁ బెడ వాఁకిట వెళ్ళిన నాటినుండి పూఁటిల్లిన శంక... క్రీడా 6 71.

చ . పెనంగ వల్లువముఁ ద్రెంచి .. ద్రోఁపు నొల్చిపోన్ ... ఆము 6 81 (7 17)

వల్లూరము నం. వి అ పుం 1 ఎండిన మాంసము. 2 సూకర మాంసము (అడవి) పంది మాంసము

న 1 గహనము, దట్టని యడవి 2. నిర్జన ప్రదేశము 3 సేద్యము చేయని పొలము. 4 ఊషర క్షేత్రము, చేవుటినేల.

ల్లె[1] వి 1. పశుబంధన రజ్జువు, రజ్జువు, త్రాడు

గీ వల్లెవైచు వారెవ్వరు మల్లరాల, లంపుగల తొట్టులను గూయ లావుగలదె; యేర్పు దాఁటు లలోఁ దొలఁగెలుఁగఁ ఒడునె, పరికరము కోడెలమ్మెడు పాటిగలదె. ఉ హరి 4. 308

2 వాగుర, ఉచ్చు

గీ. వచ్చిమాయున్న పొలమెల్ల వల్లెవైచు, చందమునఁ జుట్టుకొనివఁ బో సందులేక, చలిత చరణంబులును బరాసన్నదృష్టి, గలిగి యఁుండిమ మచటఁగా కవులకరణి వేం పంచ 2 200

3 మరలమరల పరించుట

(చూ వల్లెవేయు.)

జ. వల్లె తాలువు, వల్లెత్రాడు, వల్లెవాటు, వల్లె వేయు.

**వల్లె²** అవ్య. అంగీకారార్థకము

క తొల్లిటి దోషములెవవి, యెల్లను సైఁచితిమి మాకు నిం కిటతానే, వల్లెయని నడచి. కు సం. 10 490

క. వల్లెయని రాజనందను, లెల్లను సమకట్టి. భార ఆది 6 64.

వ ... శస్మం బిచ్చిన వల్లెయని యందుకొని ... హర 1. 19

గీ మంచిది యనఁగాను వల్లెయనంగను, రెండు సమము లౌచునుండు. ఆం భా 3 75

**వల్లె³** వి మత్స్య విశేషము

సీ వాలువములు దొమ్మ వల్లెగండియు నల్లెగుజ్జు బేడిస జాతికొలుకు ... వేం పంచ 1 294

**వల్లెతాలువు(లుపు)** వి. (√ వల్లె¹) వరుణుఁడు, పాశి.

**వల్లెత్రాడు = వల్లియత్రాడు** వి (వల్లె¹ + త్రాడు) పసులఁగట్టెడి త్రాడు, త్రాడు

సీ దామెనలును వల్లెత్రాళ్లును బలుపులుఁ గవ్వముల్ గొడవలి కత్తి.. హరి పూ 6 21

గీ ఇవ్విధంబునఁ దనపోఁక తెలుఁగనీక, మగని జోకొట్టి నెరవచ్చి సొగసుమెట్టి, వాడలోఁ గూడు జారుల వల్లెత్రాడు, చెలువున మెలంగు నక్కొమ్మ సొలపుగ్రమ్మ శుక 3 163.

శా ... వల్లెత్రా, డెంతే గైకొని పేయటంచు గదిమెన్ హేలా వినోదంబునన్ ... దశా. 8 16.

సీ. పిల్లఁ గ్రోవులు నెక్కువెట్టిన విండ్లు కంబళ్ళు దుప్పట్లును వల్లె త్రాళ్ళు.

గీ. మొదలుగాఁ గల పరికరంబులఁ గొఱంత, లేక భూమిరుహ చ్ఛాయలే గృహాళి, గాఁగ వాఁ చాలమందలఁ గాచు జాళి, నడవి మానిసియై తిరుగాడు నెపుడు. శుక. 2. 545

**వల్లెత్రాడులాఁడు = వరుణుఁడు** ఆం. భా 1. 51.

**వల్లెలు** వి. బ. వస్త్రవిశేషము

సీ. వల్లెలు విడ్డంచు వలిపాలు బురులును పట్టు జబ్బులు మంచి పరకతాలు ... ధనా 3. 38

**వల్లెవాటు = వలెవాటు** వి (వల్లె + పాటు.)

1. ఉత్తరీయమును రజ్జువవలె మెలిపెట్టి వైచికొనుట

చ వల్లెవాటుగ భుజాగ్రము నందగు మేలి జాళువా, జిసుఁగు మెఱుంగు బంగరుపుచేల చెఱంగు ... దశా 2 34

2. రజ్జువవలె మెలిపెట్టి వైచికొన్న యుత్తరీయము

సీ బంగారు జిగురు దుప్పటి హొయల్ జిగిబిగి నీటు మీఱంగ వల్లెవాటు వేసి రామ 10.

గీ. జిలుగు చెంగావి దట్టిపైఁ జెక్కుకొన్న, వంకి దులకించఁ బసిఁడి దువ్వలువ వల్లెవాటు నెఱ నీటు గులుకఁ జావాలు మెట్టి, రాజ దేవేంద్రుఁ డంతః పురంబు వెడలె ఉ. రా 7 395

సీ. చెలువ గట్టినచీర మొలఁగొంతఁ గట్టి యా నగముపై వల్లెవాటుగ నమర్చి. వైజ 2 45.

**వల్లెవేయు** స క్రి (√ వల్లె¹) మరలమరల పఠించు.

ఉ మెల్లన వానిడగ్గఱి సమేలపు మాటలు వల్లెవేసి నీ, యుల్లసితాంఘ్రిపద్మముల కొప్పన చేసెద నేల చింతిలన్.. తపతి. 3 62

**వల్లే = వల్లె** అవ్య అంగీకారార్థకము

క అని యానతియ్య వల్లె, యనుచు సుశీనరధరావ రాగ్రణి ప్రమదంబును జెంది కవిజ. 3 24.

**వల్వము = వలువ** వి వస్త్రము

గీ పసుపుఁబొడి తోలువల్వంబు నెసక మెసఁగ, ఆము 6 6

(శ. ర. వేదం. పా, "తోలు పళ్ళంబు" వావిళ్ళ పా, "తోలు వల్వయు," వ్రాతప్రతి. పా.)

**వళంద** వి ఒకానొక పట్టణము

గీ ఈడమును వళంద బందర యింగిలీసు, కలము మొదలైన పేఁటల గారలెల్ల సౌరభద్రవ్యములు బేర సారమాడఁ, బిలువనంపిరి తమ తమ పేఁటలకును హంస. 1. 112.

**వళాగ్రము** వి. ఒకజాతి వక్క, క్రముక భేదము. (శ. ర.)

**వళావళి** వి. కుతూహలము, వేడుక

ఉ అంబురుహాక్షి నాసిక నిజాన్వయ శత్రువుఁ జంపక ప్రసూనంబుఁ గరంబు గెల్చుట మనంబునఁ జెట్టి తదీయపార్శ్వయుగ్మంబున నిత్య

సేవకతఁ గ్రాలెడు సీతుణతార కాభ్యరో, లంబ కదంపతుల్ పెను వళావళి నెంతయు సంభ్ర మించుచున్. ప్రభా 2. 70

2. విజృంభణము

చ అళులకు డాఁగుటో హాల హాలాహల భీకర మత్తకోకిలా, వళులకు డాఁగుటో విపుల వైరి మదాళుల నేయుని వ్వళా, వళులకు డాఁ గుటో ... భామమ 3 26

సీ కినిసి మాటలు నేరవనుచు శిక్షించితే చిలుక కేటికి వళావళి యొనర్ప ... వేం పంచ 4. 173

3 చప్పుడు, ధ్వని

సీ అంచనేతెంచు రాయంచజాడ నదల్పు కళుకు టందెల వళావళులతోడ .... ఇందు 3 27

వళుకు వి 1 తగవు, వివాదము

చ చిలుకకు మావికిం బగలుసేయకురే లత కూన లారవే, వళుకులువచ్చు మీఁద బలవంతుఁడు కంతుఁడు . కకు 1. 130.

ద్వి మనవారి వళుకు సమ్మతిని తీర్చెదను ద్వి. పరమ 6. 477

2 అపవాదము.

గీ చుట్టముల కెల్ల వళుకులు గట్టి యురక, ప్రజకు బందెలు గొల్పగఁ బ్రాఘుఁడీవు, పాములకుఁ బాలు పోసినపగిది నీకు, మేలు చేసినఁ బొమ్మింకఁ జాలు భద్ర శేష 3 192.

వ. ఎదురువారలు బలిమి వళుకులు వైచి పంత ముల కొలారిక లంపెడి జిత్తులును ... ప్రబంధ. 1. 78.

3 మోసము

ద్వి. ... అమ్మోని వల్లభుఁడు, దిచ్చరి యగునట్టి దీని మాటలకు, వచ్చెనా నిలువెల్ల వళుకుల పుట్ట ... ద్వి పరమ 4. 337 పా

సీ. అనుమానమైన వాఁడర్థంబు లిచ్చిన వళుకుగా నెంచు విశ్వాసపడఁడు ... నీతి. 76.

విశ. వదులైనది

సీ. సెట్టి చేతంగొని చేతడియారదే ముక్కెర పది లమే. ముకురవదన, యొరవుల సొమ్ము వారిడి వది వళుకింత యిటుల చేవీళకే చటుల నయన, నీమీఁది చూపెమన్నె కొమాళ్ళు కొకవింత గుట్టుతో నుండవే కుందరదన రావి. 6 66.

వశ సం. వి అ. స్త్రీ. 1 స్త్రీ, ఆఁడుది. 2. భార్య 3 కూఁతురు 4 భర్తతోఁ బుట్టినది ఆఁడుఁబడుచు, నవంద. 5 ఆవు 6. గొడ్రాలు, వంధ్య 7. గొడ్డావు 8 ఆఁడేనుఁగు, కరిణి.

వశంవదుఁడు సం విశ. (అ అ అ) విధేయుఁడు, లోఁబడినవాఁడు

వశక్రియ సం. వి. అ స్త్రీ జయించుట, లోబఱుచు కొనుట.

వశగ సం. వి ఆ స్త్రీ విధేయురాలగు భార్య, చెప్పి నట్లు చేయు పెండ్లాము

వశగుఁడు సం విశ (అ అ అ) విధేయుఁడు, లోబ డినవాఁడు

వి అ పుం భృత్యుఁడు, సేవకుఁడు

వశమగు మి అ క్రి సమర్థమగు

వశముగావు=సమర్థములుగావు.

క. విను మలుక వొడమి మిక్కిలి, కనుదెఱచిన త్రిపురవైరికైనడియా యర్జుసునందుఁ దోఁచు చున్నది, మన మొనలున్ వశము గావు మర లుపు మింకన్ . . భార భీష్మ 2 93

వశము సం విశ. (అ ఆ అ.) 1. లోఁబడినది, స్వాధీ నమైనది (సమాసాంతమునందు) 2 విధేయ మైనది, చెప్పినట్లు చేయునది 3 మచ్చిక చేయఁ బడినది. పెంచఁబడినది 4 మంత్రతంత్రాదులచేత వశము చేసికొనఁబడినది 5. శక్యము

క శ్రుతివిహితకర్మజాత, స్థితియోగ్యుఁడవైన నీకుఁ జేయఁగ వశమే, యతిలోకజ్ఞాన సమ, న్వితయతిజన కృత్య మటు వివేకింపు మెదఁ . భార శాం. 1 61

వి. అ. పుం. న 1 ఇచ్ఛ, కోరిక 2. ప్రాబల్యము, ప్రాభవము, స్వాధీనత, లోఁకువ, లోఁబడుట

3. మచ్చికయగుట. 4. పుట్టుక.

పుం. వేశ్యాగృహము.

వశవర్తి సం. విశ. (న్. నీ. న్.) విధేయుఁడు, లోఁబడినవాఁడు.

విశ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

వశానుగుఁడు=వశవర్తి సం. విశ. (అ. అ. అ.) అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**వశి** నం విణ (న్ సి న్) 1 ప్రాబల్యము గలవాఁడు 2 ప్రాభవము గలవాఁడు, లోఁబడినవాఁడు, విధేయుఁడు 3 ఇంద్రియ నిగ్రహము గలవాఁడు, ఇంద్రియములు జయించినవాఁడు

వి ఇ. పుం 1 లోఁబఱుచుకొనుట, వశ పఱుచుకొనుట 2. మంత్రించుట. న పరతంత్రత

**వశితము** నం విణ (అ ఆ అ) ఉత్తది, శూన్యమైనది

**వశిత** నం వి. ఆ స్త్రీ 1.లోఁబఱుచుకొనుట, స్వాధీనపర్చుకొనుట, మంత్రముచే వశపఱుచుకొనుట

**వశిత్వము**=వశిత నం వి అ న

**వశిని** నం వి ఈ స్త్రీ. శమీవృక్షము, జమ్మిచెట్టు

**వశిరము** నం వి అ పుం ఒక దినుసు మిరియము న. సముద్రపు టుప్పు,

**వశీకరణము** నం. వి అ న 1. లోఁబఱుచుకొనుట, మంత్రాదులచే వశము చేసికొనుట. 2. ఆకర్షించు సాధనము లేక మరులు కొలుపు సాధనము

**వశీకరించు** నం న. క్రి లోఁబఱచు, స్వాధీనము చేయు.

ద్వి అరయ సజాతీయులగు వారిచేత, చిరజీవతతుల వశీకరించెదను . ద్వి పరమ 1 26 లా

వ ఇట్లు వశీకరించి యందఱం గళింద కన్యా తీర కాంతారంబుల కెలయించిన . హరి పూ 8. 13

**వశ్య(క.)** నం వి. ఆ స్త్రీ విధేయురాలగు భార్య.

**వశ్యము** నం అ అ. న. లవంగము

**వశ్యుఁడు** నం విణ (అ. ఆ అ) 1. వశము చేసికొనఁ దగినవాఁడు,లోఁబఱుచుకొనఁ దగినవాఁడు 2 లోఁబడినవాఁడు, విధేయుఁడు

వి అ. పుం సేవకుఁడు, భృత్యుఁడు

**వశౌషధము** నం వి అ న పెట్టుమందు (శ ర)

**వషట్కారము** నం వి అ పుం వషట్ అని యుచ్చరించుచు హవిస్సును హోమము చేయుట

**వష్క(స్క)యము** నం వి. అ పుం పెండాది యీడు గల దూడ, తఱపిదూడ,

**వష్క(స్క)యి(య)ణి**=బష్కయిణి

నం. వి ఈ స్త్రీ. చిరకాలముక్రిందట నీనిన యావు, తఱపి దూడగలయావు

**వస**[1] వి (నం వచా) ఓషధీ విశేషము, ఉగ్ర గంధ (వృ వి)

చ . లేజవరాలు చెక్కుఁ గీటిన వసవల్చు శాలకుఁడు డెందమునం గలఁగంగ నేర్చువే .. నైష 1 17

క . చెక్కడిచిన వసరాలెడు, నిక్కము వాకోలుతలకు నిలువఁగఁ గలవే ... విక్ర. 6 88.

గీ విట్టు మొరసెడు వస త్రాగినట్టు ... సీతా 8 29

(వ్యవ) వసత్రాగిన పిట్ట

**వస**[2]=**వసము** విణ శక్యము, వశము. (నం. వశః)

క .. అలగంగ నిసుక నెప్పటి,వలె ఘటముం జేయఁ బోయి వసగాకున్నన్ ... దశా 6 77

క తన శాస్త్రియైన తానము, లనియని వసకాక కాఁక వణివిహ్వలుఁడై, మునియున్న ... సమీర 6. 218

ద్వి రసికుండ వేనియు వసదక్కి యాత్మ, నుసిలిన మఱిమీఁద నోరెత్తఁ గలదె . . పండితా. పురా 114. పొ

**వస** నం వి ఆ స్త్రీ 1 మజ్జ, క్రొవ్వు, కరఁగిన క్రొవ్వు 2 మెదడు, మేదస్సు

**వసంత** వి. రాగవిశేషము

సీ గౌళనారాయణ గౌళవసంతవరాళి పున్నాగవరాళి శంక, రాభరణము ... రామక్రియయు మేళ రామక్రియ వసంతసామంత శుద్ధ వసంత మధ్య, మాదులు. ప్రబంధ 1 96.

**వసంత కుసుమాకరము** నం వి అ. పుం. ప్రమేహములను బోఁగొట్టెడి యౌషధవిశేషము

**వసంతగంధము** నం. వి అ పుం తుంగవృక్షము (శ్రా ని.)

**వసంతఘోషి** నం. వి న్ పుం కోకిలము, కోయిల. (శ్రా ని)

**వసంతజ** నం వి ఆ స్త్రీ 1 వాసంతి, మాధవీలత, బండి గురివెంద (వృ వి) 2. వసంతోత్సవము.

**వసంతతిలక** నం వి ఆ. స్త్రీ (ఛంద) ఒకానొక వృత్తము.

**వసంతతిలకము** నం వి. అ న (ఛంద) వృత్తభేదము ప్రతిపాదమునను వరుసగా త, భ, జ, జగణములు రెండు గురువులును పదునాలు గక్షరములుగల యొకానొక వృత్తము

వసంతదూత సం వి అ పుం 1 కోకిలము 2 చైత్రమాసము, 3 హిందోళ రాగము (దీనిని శిశిర వసంత ఋతువుల సంధిని పాడుదురు) 4 చూతము, మామిడి చెట్టు

వసంతదూతి సం వి ఈ స్త్రీ 1 పాటలీవృక్షము 2 ఆఁడు కోకిల 3 మాధవీలత, బండి గురివెంద తీఁగ.

వసంతద్రుమము సం వి అ పుం ఆమ్రవృక్షము, మామిడిచెట్టు.

వసంతపంచమి సం వి ఈ స్త్రీ మాఘశుక్ల పంచమి.

వసంతబంధువు సం వి ఉ. పుం మన్మథుఁడు

వసంతము వి. పసుపు సున్నము కలిపిన యెఱ్ఱని జలము

రగడ . . సతతమును గంధపు వసంతములఁ బంతములు, వ్రతులకును నయ్యె రసవంతములు కాంతములు .. రాఘ 2 6

క. అంతట నాగసరంబుల, నింతులు తానముల మిగుల హెచ్చింపుచు సామంతము పరవన్ బువులువ, సంతములోను గనుఁగొనుచుఁ జనుదే మటియున్ యయా 4 158

సీ. మొవమున కెగయు చన్గవపైని నునుమోవి తళుకు గుంకుమవసంతములు చల్ల దశా. 2 278

జ వసంతములాడు.

వసంతము సం వి అ పుం. 1 చైత్రవైశాఖ మాసాత్మకమైన యొకానొక ఋతువు 2 (సంగీ) రాగ విశేషము 3. అతిసారము, రోగ విశేషము

వసంత(మా)ములాడు అ. క్రి (వసంతము+ఆడు) వసంతము చల్లుకొను

చ . ఇందఱము ధన్యులమైతి మటంచుఁ బుట్టముల్, చపలతఁ ద్రిప్పి పువ్వుల వసంతములాడుచుఁ బాడుచున్ గత, త్రపులయియాడుచుం బ్రజలు దద్దయుఁ బండుగ సేసిరెల్లెడన్ ... భాగ. 9 318

స క్రి చల్లుకొను

గీ తగవుదప్పని జగడమీ తరుణులందు, నూటివడె మేలుమేలని జోకఁ జెలులు, సరసమాడంగ విరుల వసంతమాడి, రా లతాంగులు పంకేరుహాక రమున. కవిరా, 4 98,

(వసంతము, పారాణి కలిపిన నీరు వివాహాది శుభములందుఁ బరిహాసార్థము వసంతము చల్లుకొనుట యాచారము)

మ కటిస్థలిపై వేవలి మొగ్గ ప్రాలనడుగుల్ చండింప నేత్రాంబుజంబులు గన్నీట వసంత మాడ నరిగెం బూఁబోఁడి ఖేదంబునన్ ... సారంగ 3. 44.

(ఇట స్నానముచేయుట అనిభావము)

వసంతయోధుఁడు సం వి అ పుం. మన్మథుఁడు.

వసంతవిలాసములు సం అ పుం వి బ వస్త్ర విశేషము

వ . నాగ బంధంబులును బూజాబంధంబులును జలపంజరంబులును కామవరంబులును ... ద్రౌపదీ స్వయంవరంబులును ... వసంత విలాసంబులును రత్న కీలితంబులును ... ధరియించి ద్వా 3 206

వసంతసఖుఁడు సం వి అ పుం మన్మథుఁడు

వసంతావతారము సం వి అ పుం వసంత ఋతువు రాక, వసంతప్రారంభము

వసంతుఁడు సం వి అ పుం 1. మన్మథునికి సహచరుఁడుగా నెంచఁబడెడు నొకదేవుఁడు 2 నాటకములందు విదూషకుని మాఱుపేరు

వసతి సం వి ఇ ఈ స్త్రీ 1 వసించుట, ఉనికి. 2. వాసస్థానము, ఇల్లు. 3 ఆస్పదము, స్థానము 4 శిబిరము, మార్గమధ్యమున నాఁగెడి బస. 5 రాత్రి 6 జైనమఠము

వసథము సం. వి అ న 1. బస, మార్గమధ్యమున ఆఁగెడు చోటు 2 పిట్టగూడు

వసది వి (సం వసతిః) బుద్ధాలయము

ద్వి అరయ నేకాంత రామయ్య శాపమున, నది వల్బులూరి వసది గూలినట్లు . పండితా మహిమా 257

ద్వి వసదులన్నియు వ్రచ్చివైసించెగాదె .. బస. పు 144. పా 15 పం.

వసనము సం వి. అ. న. 1. వసించుట, బస చేయ్యుట.

2. ఇల్లు, గృహము 3. బట్టలు ధరించుట. 4. వస్త్రము, బట్ట. 5. స్త్రీకటిభూషణము, మొల నూలు మొ.

**వసనాభి** వి విష విశేషము. వత్సనాభి (బ్రౌ ని.)

**వసపడు** అ క్రి (వసము+పడు) శక్యమగు

క. వసుధం బుత్త్రాదిక దు,ర్వ్యసనము సైతమును దండ్రి వారించుటకున్, వసపడదఁట మఱి రాజ్య, వ్యసనము వారింప నెంత వాఁడెవ్వాఁడున్ ఆము 4 192.

**వసపోవు** అ క్రి (వసము+పోవు) శక్యమగు, వశమగు.

సీ. పవిచేత వసపోనిదివిజేంద్రరిపుతపోవితతికి నిది గదా వేలువిత్తు .. చం రా 3 45.

మ. ... ఎదిరింపన్ వసపోక భీతిలిరి దేవేంద్రాదులుర్వీశ్వరా ... ఉ రా 4. 326

సీ. వడిగాలి వడినిల్వ వసపోక బలితంపుసరిపెణల్ దువియ వేవరక నిగుడు ... శుక. 1. 170

(దీనికిఁ బ్రాయికముగా వ్యతిరేకార్థమునందే ప్రయోగము కానవచ్చుచున్నది)

**వసము**=వస[2] (సం. వశ) 1 వి అధీనము

ద్వి. కసిమసంగిన శత్రుగణముల అమున, వసము చేయుచు బరవసము చూపుచును .. ద్వి పరమ. 6 465. పా.

వ. వల్లియలువైచి కోడెలం బట్టి పెనచి కారూళ్ల జట్టి కాఱులకు వసంబుచేయు బరవసం బెసంగ. హరి. పూ. 5. 142.

సీ. వెనరాహుతులతోన వసమటిహయములు గెడసి యొయ్యెడలను బుడమిఁ గప్పె. భార. అర. 6 225.

(వసముఱు=స్వాధీనత తప్పు)

క. అనురజవని కడునార్తిని, వసమఱి యిట నేయఁదగునె వానవ యనఁగా . . హరి. పూ 1. 86

చ. తరుణియొకర్తు కంఠమునఁ దాల్పఁగఁ దావ నమేదిహారముల్, కరములయందుఁ బూని పతిఁ గగ్గొనవచ్చె రయంబుమై... కవిక. 3 152.

2. శక్యము

క. అసమాలంబమశబ్దము,రసగంధస్పర్శరూప రహితంబగుటఁ, బసరించు నింద్రియములకు, వసంబుగాదొందఁ బరమవస్తువు పుఁరా. భార శాం. 4 174.

మ ...కుమతధ్వాంతార్క బింబంబుదు,ష్ప్రసహం బెవ్వని చక్ర మట్టి హరికిం బ్రత్యర్థియై నిల్వఁగా, వసమే యెంతటివానికిన్ వెఱకు వర్వైరసద్యముం బూనఁగన్ హరి. పూ 3 215.

గీ. దుసికిలఁగఁ గాదె నవరింప వసముగాక, పుష్పబాణుని చెఱకువి ల్పుడమిఁ బడియె ఆము 2 65.

జ. వసపడు, వసపోవు.

**వసల(లా)** వి కొయ్యకు అదుకు వేసెడికొయ్య (శ ర, వా)

**వసార(రా)** వి పంచోది. (శ. ర వా)

**వసాచపుట** సం. వి. అ స్త్రీ మెదడుముద్ద

**వసాఢ్యము** సం వి అ పుం. శిశుకము, ఒకజాతిచేప.

**వసాహాయి** సం వి న్ పుం. కుక్క

**వసి**[1] వి. 1 కొనచెక్కినకొయ్య, కొయ్య.

ఆ ఉరులు జిగురుగండె దెరలును బోనులు, వారువారెనలును వసులుగనులు మిళ్లువలలు పేట్లు గోళ్లు దిమంబులు, నాదిగాఁగఁ దెచ్చిరాటవికులు. పి. శకుం 1. 116

సీ. వసులుగనులుపోగు వాలువెంద్రుక త్రాళ్ల బలువిండ్లునమ్ములు బల్లెములును ... హరిశ్చ 2. 6.

సీ. వెస అంపమున నిడ్డ వసిగఁ గొన్నిటిని సుమంతులుగా మఱుమాడియాడి ... భార విరా 5 35

2. మొనమీఁదుగా నాఁటిన మేకు

చ. లసికిరి జోదులగ్గలికలగ్గల కెక్కినఁ గుంతపంక్తులన్, వసుమతిఁ గూల్చియున్ గదల వైచియ గత్తుల వ్రక్కలించియున్, వసుల వధించియున్ ముసలవర్గములం బడ మోది వాలుకల్, మఃలకవేసి వంచియును మందులతిత్తులు గాల్చివైచియున్ రావి. 5 31.

సీ. . వసిగసిమేనక వసుధశంకు

గీ. . . భేద నామంబులగుచు శోభిల్లుచుండు అం భా 2. 218

3 ముల్లు.

సీ ములు వసియనఁగను జెలఁగుఁ గంటక
సంజ్ఞ .. ఆం. భా 2 38
ఆ విరహిణీజనంబు వీఁడెపో నొప్పించు వసుల
మాట యిట్టి వానిఁ బట్టి, పగలు తీర్తమంచుఁ
దొగజేనిఁ బొంతురు, నగరి సౌధశృంగనలిన
ముఖులు 'రామా 1 143
4 ప్రాపు, ఆశ్రయము, అవలంబము
క. చెందిన తత్పుణ్యము వసి,గం దరుణీయుండు
మింకఁ గల్పతయమొ, నందాక బ్రహ్మ
లోకము, నం దవ్యయదివ్యసుఖసమన్విత వగు
చున్ ... కై. శ్రీరంగ 4.793
జ: వసికొయ్య

వసి2 విణ మిక్కిలి. (వాడు, వాఱు, తాఁకు మున్నగు వానికి ముందుఁ గానవచ్చుచున్నది.)
క బెడిదమగు నెండసోఁకునఁ, దొడిమలు వసివాడి
నవలు దొరఁగె లతల నెల్లెడ .. పారి 4. 19
క. ఒడలున్ వసివాళ్లు వాడన్, వెడయూర్పు
నిగిడ్చ . సారంగ 2. 216
జ వసియాడు, వసియార్పు, వసివాడు, వసి
వాళ్లు, వసివాళ్లువాడు

వసి3 వి (సం వశము) ఉత్సాహము, పూనిక
వ ... ఇవ్విధంబున న య్యూర్వసియు వసి
మాలఁ జెనంగి .. హర 7 134
ద్వి వసిగుర్చు కృతులు వా వడ్లను బెరుగు, బినుగు
చందపు బిలిబిలికృతుల్ కృతులె పండితా
దీక్షా 6. పా
జ వసిగొను

వసి సం వి ఇ పుం. 1. వస్త్రము, బట్ట 2. వాస
సావము ఇల్లు 3. ఉనికి

వసి(యి ంచే సం. అ క్రి ఉండు, పడు
క. ధినుచిల్ల యిడిన యాయుధ,మును విషలిప్తమగు
శస్త్రమును నెట్టి యమి,త్రునిపై వైవఁ బ్రయో
గిం,చిన వరపతి నరకమున వసించు నృపాలా
ధార శాం 2. 420.
ద్వి. ఆపురి నెలకొనిచిరాద్దములు, వసియించి
యటమీఁద వసుధపైఁ గలుగు, వసమాత్ర
గురుని దేహములఁ దీర్ఘములఁ, గనఁగొంచు .
ద్వి పరమ 3 171.

ద్వి బసవేశ్వరుండు నభ్యాలుని యంద, వసియించి
సత్యంబు వరదుఁడై యునికి ... పండితా
పురా 168. పా.

వసికొ(గొ)య్య (వసి+కొయ్య) వి కొనచెక్కిన
కొయ్య.
సీ. పందిళ్ళు వెట్టించి పైఁగొమ్మ లెగయించి
గుండు దూలము వసి కొయ్యఁ గూర్చి . .
ఉ హరి 2 92
సీ మనక తిత్తులు తుంగకసవు చాపలు వసి
గొయ్యలు జనప మోకులును వలలు ... చెన్న
2 204

వసిగొను అ క్రి (వసి3+కొను) పూను, ఉత్సహించు.
ద్వి వసిగొని హరియు దేవతలు నెత్తంగ, వెసనోపి
రేయక్ష వినిహిత తృణము . బస. పు.
6 899 పం.
ద్వి. కవవుమో పుత్తమాంగమున ముండియును, వసి
గొని పై మర్లఁ గసపు క్రిందటను, వరదనారగ
మీఁద వానయుఁ గురియ . పండితా దీక్షా
50 పా.
ద్వి బసవతీర్థం బేఁగు పరస యనంగ, వసిగొని
యిటఁ గ్రిక్కిఱిసి వచ్చువారు ... బస పు.
2 145

వసితము సం. విణ (అ ఆ అ) 1 ధరింపఁబడినది
2 నివసించుచున్నది. 3 నిలువచేయఁ బడినది
(ధాన్యాది)
వి అ న నివాసము, ఇల్లు

వసియాడు (వసి2+ఆడు అ క్రి. మిక్కిలి తిరుగు
సీ వ్రచ్చి వందఅలాడు వాహరిపులఁ .
గీ. జొంపి వసియాడు శశములగుంపుకుఱికి, చించి
చెండాడు కణుజుల . దుష్యంత భూప ..
పి శకుం 3 12.
వ . వసియాడు చిన్ని యడుగులతో . ఉ రా.
4 221.

వసియార్పు వి (√ వసియాడు) మిక్కిలి యాడించుట
మ జిగురంబళ్ళ పెనంబులున్ దిలరస స్నిగ్ధోష్ణ
కుంభంబులున్, పొగ బాణంబులుఁ జిచ్చుబుడ్లు
వసి యార్పుందారు ఖండంబులున్ ... రంగా,
3. 33.

వసిరము నం వి అ న సముద్రపుటుప్పు

**వసివాడు** అ. క్రి (వసి2+వాడు) మిక్కిలి వాడు

క. ఏవంవిధఘనసాత్త్విక, భావావృతి నా లతాంగి భావోదిత ల,జ్జావనతానన నీరజ, యై వసి వాడంగఁ జెలులు హాసనోన్ముఖులై చంద్రా 5. 28

చ చెదరిన ముంగురుల్ తరుచు చెమ్మటఁ దోగిన తళ్కుఁ జెక్కులున్, వదలిన కప్పుఁ గొప్పు వసి వాడిన మే నొకయింతజాఱు ప,య్యెద యసియాడు లేఁగవును నిట్టటుఁ దొట్రిలు పద్ద్వయంబుఁ జెల్లొదవెడి యూర్పులుఁగల తలో దరిఁ గన్గొని రాముఁడిట్లనున్. ఉ రా 6 65.

ఉ తేలెడు కన్నుదోయి వడదేరెడు ముద్దు మొగంబు సొరెఁ గై,వ్రాలెడు గొప్ప కొప్పు వసివాడెడు నన్ను వకౌను కాఁకలం, దూలెడు లేఁతమేను నయి తొట్రిలు నమ్మగనాలి .. పాండు 3 65

**వసివాళ్లు** వి బ (√ వసివాడు) మిక్కిలివాడుటలు

గీ కంఠకుండంగ వసివాళ్లు జెందకుండ, పొగల కుండఁగ శిఖరులు దగలకుండ, ననుచుఁ తి రాజ పూజనాయత్త చిత్త, కలనఁ బుష్పోపచయసము త్కంఠలగుచు చంద్రా 4. 233.

సీ. లివహత్తి విగికౌఁగిలింతల వసివాళ్ళఁ గనుపట్టు నెమ్మేను గప్పి కప్పి ఉ. హరిశ్చ4 49

**వసివాళ్ళు(లు)వాడు** (వసివాళ్లు+వాడు) అ క్రి మిక్కిలివాడు

క. వసివాళ్లువాడి యవ్వుడు, వసంతసమయంపు టెండవలవన్నెటిపోఁ, గనుగందలు గందిన నవ, కుసుమలతికవోలె మిగులఁ గోమలి యొప్పెన్. కళా. 4. 106.

మ ... అప్పన మెవ్వాఁడో యొకండు రాత్రి సురతప్రౌఢిం దనుం దేల్చినన్, వసివాళ్వాడుచు వచ్చుచున్నయది కర్ణాటాంగనఁ జూచితే .. క్రీడా 1. 86.

సీ. క్రొవ్విరులెనఁగి , వీఁగారుచనుఁగవ వ్రేఁగునఁ గౌఁదీగవడుపసివాళులు వాడుచుండు ... కు సం 8 9.

**వసి(శి)ష్ఠుడు** నం వి అ పుం (బ్రహ్మమానస పుత్త్రు లలో నొకఁడును, సూర్యవంశపు రాజులకు లగురువు నగు ఋషీశ్వరుఁడు. (సప్తర్షులలో నొకఁడు)

**వసుంధర** నం వి అ స్త్రీ భూమి.

**వసు(సూ)కము** నం వి అ పుం 1. అర్కవృక్షము, జిల్లేడు చెట్టు 2 అగిసె చెట్టు

న 1 సముద్రపు టుప్పు 2 భూమి నుండి త్రవ్వి తీయఁబడిన యుప్పు

**వసుకీటము** నం వి అ పుం. బిచ్చగాఁడు, యాచకుఁడు.

**వసుద** నం. వి ఆ స్త్రీ భూమి

**వసుదేవత** నం వి. అ స్త్రీ 1 ధనిష్ఠానక్షత్రము 2 నవమీ తిథి, పక్షములలోఁ దొమ్మిదవ దినము ఇట్లే వసుదేవ్య

**వసుదేవుఁడు** నం వి అ పుం యదువంశస్థుఁడైన శూరుఁడను నతని పుత్త్రుఁడును, శ్రీకృష్ణుని తండ్రియునగు క్షత్రియుఁడు (కుంతీదేవి సోదరుఁడు.)

**వసుధ** నం వి ఆ స్త్రీ 1 భూమి 2 నేల, ప్రదేశము

**వసుధాధరము** నం. వి. అ. పుం పర్వతము, కొండ.

**వసుధాధిపుఁడు** నం వి అ పుం రాజు, పుడమిఱేఁడు

**వసుధానగరము** నం వి అ, న వరుణుని పట్టణము

**వసుప్రభ** నం వి ఆ స్త్రీ అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి.

**వసుప్రాణుడు** నం వి అ పుం అగ్ని,

**వసుమతి** నం వి ఈ. స్త్రీ భూమి,

**వసులు** అ క్రి తొలఁగు, అపసరిల్లు (శ ర) ఇ. వసులపాతర

**వసులపాతర** వి (వసులు+పాతర) ఒకజాతి పందెపు కోడిపుంజు (ఆ పుంజులవంటి వారు)

గీ వసులపాతరలై వీరుసులనీయ,రు...సారంగ. 2 127

(ఇట "వసులపాతర" వంటివారు. అని భావము)

**వసువు** నం విణ (ఉ) 1 మధురమైనది. 2 ఎండినది.

వి ఉ న. 1. ధనము 2. రత్నము 3 బంగారము 4 నీరు 5 పదార్థము, ద్రవ్యము 6 సైంధవ లవణము 7 వృద్ధియనెడి మందు దినుసు 8 ఒకజాతి సీమ చిక్కుడుగింజ

పుం. 1. ఎనిమిది సంఖ్య 2 కుబేరుఁడు 3. శివుఁడు 4 అగ్ని 5. వృక్షవిశేషము, అగిసెచెట్టు 6 మడుగు, జలాశయము 7. కళ్లెము 8 పలుపు 9 ఉరిత్రాడు 10 కిరణము. 11. సూర్యుఁడు బ అష్టవసువులు అపుఁడు, ధ్రువుఁడు, సోముఁడు, ధరుఁడు, అనిలుఁడు, అనలుఁడు, ప్రత్యూషుఁడు, ప్రభాసుడు అనువారు

స్త్రీ 1 కిరణము 2 ప్రకాశము, కాంతి 3. వృద్ధి యనెడి మందు దినుసు

**వసుశ్రేష్ఠము** నం వి అ న 1 మేలిమి బంగారము. 2 వెండి, రజతము

**వసుషేణుఁడు** నం వి. అ పుం 1 విష్ణువు 2 కర్ణుఁడు

**వసూక** నం. వి ఆ స్త్రీ లంజె, అంకులాఁడి.

**వసూలు** వి (త హిం వసూల్, క వసూలు) జమ, పోగుచేయుట. (శ ర, వా,)

**వస్కరాటిక** నం వి ఆ స్త్రీ వృశ్చికము, తేలు.

**వస్తము** నం వి. అ. న వసతి, నివాసము

పుం ఛాగము, మేక

**వస్తాదు** వి. 1 శెట్టి.

సీ విరుదు వస్తాదులఁ బేర్వేర నాడాడ ముస్తాదుగా నిల్వఁ గుస్తరించి ... రంగా 2 198

2. ఉపాధ్యాయుఁడు, యజమానుఁడు (శ ర)

జ. వస్తాదుతనము

**వస్తాదుతనము** వి (వస్తాదు+తనము) బంటుతనము.

గీ. రవివికసనంబు లేనట్టి దివస మేల, ధైర్య మొదవని వస్తాదుతన మదేల . వేణు 42.

**వస్తి** నం వి ఇ స్త్రీ. 1 వసతి, నివాసము 2 పొత్తికడుపు 3 పొత్తికడుపు చుట్టు నుండెడి యస్థిపంజరము, వస్తికము 4. మూత్రాశయము, ఉచ్చత్తి 5 చిమ్మన గొట్టము

**వస్తిమలము** నం. వి అ న మూత్రము

**వస్తిశోధనము** నం వి అ న మూత్రాశయమును శుద్ధిచేసెడి మందు, మూత్ర వర్ధకమైన మందు.

**వస్తుకవిత** నం. వి ఆ స్త్రీ వర్ణింపఁబడు వస్తువు కన్నుల కగపడునట్లు చేయు రచనా విశేషము

క. భారవియు వస్తుకవితను, భారవియును బరఁగి రుదయపర్వతశిఖరా, గ్రారోహణేంద్ర కీలన, గారోహణ వర్ణనల జనారాధితులై కు నం 1. 20

**వస్తురచన** నం వి ఆ స్త్రీ శైలి, అంశముయొక్క కూర్పు, ఫక్కి

**వస్తువు** నం వి ఉ న. 1 సత్యపదార్థము, నిజమైన పదార్థము 2. పదార్థము 3 సొత్తు, ధనము. 4 తత్త్వము, స్వభావము 5 వస్తుసాధనము, కారణము 6 నాటకము నందలి యితివృత్తము, కథాంశము 7 వస్తుసారము 8. కల్పన, పన్నుగడ

**వస్తూపమ** నం వి ఆ స్త్రీ ఉపమాలంకార భేదము, ధర్మలుప్త

**వస్త్యము** నం వి అ న ఇల్లు, గృహము

**వస్త్రకుట్టిమము** నం వి అ న 1 పటగృహము, డేరా 2 గొడుగు

**వస్త్రగృహము** నం వి అ. న పటగృహము, డేరా.

**వస్త్రగ్రంథి** నం వి. ఇ పుం నీవి, పోఁకముడి

**వస్త్రనిర్ణేజకుఁడు** నం వి అ పుం. బట్టలుతుకువాఁడు, చాకలి

**వస్త్రపుత్రిక** నం వి ఆ స్త్రీ ఆటబొమ్మ

**వస్త్రపూతము** నం. విణ (అ అ అ) గుడ్డతో వడియఁగట్టఁబడినది, వస్త్రగాలితమైనది

**వస్త్రభేదకుఁడు** నం. వి అ పుం. బట్టలు కుట్టువాఁడు, కుట్టుపనివాఁడు

**వస్త్రభేది**=వస్త్రభేదకుఁడు నం. వి న్ పుం

**వస్త్రము** నం వి అ న 1 బట్ట, వలువ 2 దుస్తు, ఉడుపు

**వస్త్రయోని** నం. వి ఇ. పుం వస్త్రములకు సాధనమైన దూది, ఉన్నె, పట్టు మొ

**వస్త్రరంజనము** నం వి అ న కుసుంభము, రంగు (వాచ)

**వస్త్రాంచలము** నం వి అ పుం చీరచెఱఁగు, బట్టయంచు ఇట్లే వస్త్రాంశము.

**వస్త్రాగారము** నం వి అ. పుం న. 1. పటగృహము, డేరా 2. బట్టలయంగడి (విల్యమ్సు)

**వస్త్వభావము** నం వి అ. పుం 1 సత్యములేమి, యాథార్థ్యము లేకుండుట

**వస్ననము** నం. వి. అ. న. కటిభూషణము, మొల నూలు, ఒడ్డాణము మొ.

**వస్నము** నం. వి. అ. న. 1. కూలి 2. జీతము. 3. బత్తెము 4. ధనము 5. వస్త్రము 6. చర్మము 7. మృత్యువు, చావు

పుం. న. మూల్యము, వెల

**వస్నస** నం. వి. ఆ. స్త్రీ. స్నాయువు, నరము.

**వస్నికుఁడు** నం. విణ. (అ ఆ అ) కూలికిఁబని చేయు వాఁడు.

**వస్వోకసార** నం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రుని పురము, అమరావతి 2. కుబేరపురము, అలకాపట్టణము, 3. అమరావతికి లేక అలకాపురమునకు సమీపమునఁ బ్రవహించెడినది

**వహ** నం. వి. ఆ. స్త్రీ. నది

**వహంతము** నం. వి. అ. పుం. 1. వాయువు, గాలి. 2. శిశువు

**వహతము** నం. వి. అ. పుం. వృషభము, ఎద్దు

**వహతి** నం. వి. ఇ. పుం. 1. ఎద్దు 2. గాలి 3. మిత్రుఁడు, సలహా చెప్పువాఁడు.

ఈ. స్త్రీ. 1. నది.

**వహతుఁడు** నం. వి. అ. పుం. 1. బాటసారి, పాంథుఁడు.

**వహనము** నం. వి. అ. న. 1. తీసికొనిపోవుట, మోయుట, 2. పోషించుట, ప్రోచుట 3. ప్రవహించుట 4. బండి మొదలగు యానము. 5. ఓడ, పడవ

**వహము** నం. వి. అ. పుం. 1. మోయుట, తీసికొని పోవుట. 2. పోషించుట 3. ఎద్దుమూఁపురము, వృషభస్కంధము 4. బండి మొదలగు యానము 5. అశ్వము 6. వాయువు 7. బాట, మార్గము. 8. పదము 9. నాలుగు ద్రోణముల పరిమాణము 10. ప్రవాహము

**వహి**[1] వి. 1. విధము.

ఉ. పంటపలంతిపోముగమి పంటవహిన్ రహిమించు వాని వా, ల్గంటివడిన్ హరించి తెలగంటి వజీరుల త్రుళ్లడంచెదన్ .. చం. రా. 5. 56

చ. గెలిచివగెల్పు లర్థితతికిన్ దిన మిచ్చిన యీవు లన్ వహుల్, తలఁచిన విక్రమార్కు లోకలక్షయుఁ గర్ణులు కోటియుంగదా, కలిగిన నీడ వత్తురు విజ. వి. పీఠిక. 14.

సీ. మకరవై ఖరి వైరినికరంబు చెలరేఁగ వనజనాథుఁడు వార్ధి వహి వహించె ఉ. రా. 2. 50.

2. ప్రసిద్ధి

ఉ. అన్వహమున్ బ్రవృద్ధమగు నంబుజనాథ పదారవిందభ, క్తి న్వహికెక్కుచున్ వసుమతీ సురవంశవతంస మెల్ల వ్వారు న్వినుతింపఁ బెంపెసఁగుఁ బ్రోది యొనర్చుచుఁ దల్లి తండ్రి వెం,దు న్వివిధానురూపతను దోహదభోజనపూజనాదు లన్ పాండు. 2. 12.

ఉ. లక్షణ లక్ష్యకోటి వదిలంబుగ మేటికవుల్ నుతింప క్షో,ణక్షమపంస్కృతాంధ్ర కవితా పదవిన్ వహికెక్కి శబ్ద వైచక్షణిమించు నన్నని విశారదుఁడై తగు తిక్కయజ్వ .. వాల్మీకి. 1. 11

రగడ .. మంచు ముంచుకొన మావులు గ్రుసుకెక్కెన్, మంచినీళ్ళరుచి మహి వహికెక్కెన్ బహు. 2. 13

**వహి**[2] వి. (క ఒహి) లెక్క పుస్తకము 2. పుస్తకము (క ర)

**వహి(యి)ంచు** నం. న. క్రి. 1. మోయు.

క. మహనీయ భవత్పటవీ, మహితుండై నహుషుఁ డేచి మదమున ధర్మ, స్పృహదక్కి తన్ను నిప్పుడు, వహియింపఁగ సన్మునీంద్రవర్గము బనిచెన్. భార. ఉద్యో. 1. 195

2. పొందు, ప్రాపించు

క. విహంతాళుండై లజ్జా,మహితంబగు నాళదొలఁగు మదితో సకల, స్పృహయును నెవ్వని యందును, వహింపని యతుల మైనవ్రతముం బూనెన్ భార. శాం. 3. 165

క. చైతన్య శక్తి బురుష స్వమేతత్వవిశేషమువ వహించుఁ బ్రకృతి త,జ్జాత యగును బుద్ధి తదు, ద్భూత మహంకార మదియుఁ బొరయుం జిత్తున్ భార. శాం. 4. 270

3. అవలంబించు

ఉ. ఏ మెయినైన వంచన వహించి తొలంగుట మత్ప మీహితం,బు .. భార. విరా. 1. 177.

**వహించేకొను** (వహించు+కొను) నం. అ. క్రి. పక్షమువలంబించు.

ఉ. ఏ నటు వేఁటఁ బోవఁ గని యిందులకున్ వెళు కావగింజ యంతైనను లేక చేయనగు నా తగు నా యన కేఁతచేసెనే, వానికిఁగా వహించుకొని వచ్చితివా సారఁగ 3 69

వహి(త్ర)కము నం వి. అ న ఓడ, పడవ.

వహే(హై)డకము నం వి అ పుం విభీతకము, తాండ్ర చెట్టు.

వహ్ని నం వి ఇ పుం 1. అగ్ని, అగ్ని దేవుఁడు. 2 జారరాగ్ని. 3. నల్లజీడిచెట్టు 4. చిత్రమూలము 5. రేఫము 6 యాజకుఁడు

వహ్నికరము నం విశే (అ ఈ అ ) 1. నిప్పంటించునది ఁగలకొనఁ జేయునది 2 జారరాగ్ని వృద్ధి పొందించునది.

వహ్నికాష్ఠము నం వి అ న. దాహాగురువు, ఒక విధమగు అగురు చెక్క

వహ్నిగంధము నం వి అ. పుం 1 ధూపము. 2 గుగ్గిలము, యక్షరసము

వహ్నిగర్భము నం వి అ పుం 1. శమీవృక్షము, జమ్మిచెట్టు 2 వెదురు (వృ వి)

వహ్నిదీపకము నం వి అ పుం కుంకుమ పువ్వు.

వహ్నినామము నం వి న. పుం 1 నల్లజీడి చెట్టు. చిత్రమూలము (వృ వి)

వహ్నిబీజము నం వి అ న 1 బంగారము 2 నిమ్మచెట్టు, 3. జీరకము, జీలకఱ్ఱ, 4 రేఫాక్షరము

వహ్నిభోగ్యము నం వి అ న ఘృతము, నెయ్యి

వహ్నిమిత్ర(త్రుడు)ము నం వి. అ పుం వాయువు

వహ్నియిచ్చు మి అ క్రి అగ్ని సంస్కారముచేయు

క వలుమాఱును రామికి నుత్తలపడియెను దాన నిట్టిదళ నతఁడొందెం, జెలియగుట నితనిదొక్కఁడు, నలఘువిధిన్ వహ్నియిచ్చి తది మేలకదా భార శాం 3 515

వహ్నిరేతస్సు(ము) నం వి స్ పుం. బంగారము

వహ్నిరేతుఁ(తసుఁ)డు న. వి. అ పుం శివుఁడు.

వహ్నిలోహ(క)ము నం. వి. అ న 1 తామ్రము, రాగి, 2 కంచు, కాంస్యము (వా చ.)

వహ్నివర్ణము నం వి అ న. ఎఱ్ఱకలువ, రక్తోత్పలము.

వహ్నివల్లభము నం వి అ పుం. గుగ్గిలము.

వహ్నిశిఖము నం. వి అ న 1 కుంకుమపువ్వు. 2 కుసుంభము, ఒక విధమగు రంగు.

వహ్నిసంజ్ఞకము నం వి అ పుం చిత్రమూలము

వహ్నిసఖుఁడు నం వి అ పుం వాయువు

వహ్యము నం వి అ న 1 రథము, తేరు. 2 పాలకి, బండి మొదలగు యానము

విశే (అ ఆ అ ) 1. వహింపఁదగినది, మోవఁదగినది 2. కొనిపోఁదగినది.

వహ్వా అవ్య ప్రశంసను దెలుపును అరరే, బళి అహహా

మ అరరే శౌరి బళీ ధ్రువుం డహహా ధాత్రా శ్వుండు వహ్వా తలో, దరి ప్రహ్లాదుఁడు మేలు వరాహ 8.93

## వా

వా = వాయి వి (నం వాక్) 1 మాట

సీ. ఎదిరివా ఖండించు టిది దెప్పరము సుమ్మి జలగ జంపులు జోగి జంగకొలము. హార 2. 51

2 నోరు

గీ వాకల దటంచు నెన్నెని వదరుచుండ, శిక్షఁ జేయక యుంట యుపేక్షగాదె. వాల్మీకి. 3 23

క. నా పేరు శంభుమిత్రులు, వాపారము విద్య లెల్ల వనజాసనుఁడున్, నా పాటిగాఁడు .. సుద. 2. 28

చ .. ఇప్పుడు నరుఁ గాంచి మీ రతని పోటును తించుచు భీతి నిట్లు వా, విడిచి యనేక భంగిఁ బృథివీపతి వీఱిఁడిఁ జేయు టొప్పునే ... భార. విరా. 4 200

3 ఆహారము.

ఉ అప్పుడు దేవదారువిపినాంతరసీమవసించు సంయముల్, విప్పగు భూమివన్నము ఫలింపక చెట్టులు నెండిపోయె వా,తప్పినఁబోవుఁ బ్రాణములు తప్పదురం డని మున్ను గౌతముం, జెప్పఁగ విన్న వారగుటఁ జేరిరి తచ్ఛతశృంగశైలమున్. వరాహ 10 31.

4. నూయి గోయి మున్నగువాని ముఖము, అగ్రభాగము,

సీ. ... సగము దుమ్మునఁ బూడి చిగిరింత వా
మూయఁ జెరిఁగిన నూతిపాఁతంబొఁటియల ....
ఆము 6 18.

5. ఖడ్గధార, కత్తివాదర.

ద్వి ఈ రీతి కౌశికునింద్రజాలంబొ, వాతప్పినదొ
చేతివడిదప్పి చనెనొ, చూత మీతోయ మీచోద్య
మీలీల, ననివోవ వచ్చు నాయసివోకయనుచు...
ద్వి. హరిశ్చ. ఉ. 2557 పం.

ఉ. . . వా,తప్పక ఁవేసె నొక్కమొగిఁ దార్కొని
భీముశిరంబు వశమున్ ... జై భా 2 79

జ వాకట్టు, వాకలిపె, వాకల్వికాయ, వాకాటు, వాకిలి, వాకొను, వాకొలుపు, వాక్రుచ్చు, వాగంటిపులుఁగు, వాగళ, వాచఱచు, వాచవి, వాచూరు, వాతప్పు, వాదోడు, వాపుచ్చు, వాబిఱుసు, వాయిదువు, వాయోడు, వావాఁడి, వావాదము, వావాదు, వావిడుచు

**వాఃకిటి** నం. వి ఇ పుం శిశుకము, ఒకజాతి చేఁప, ఉలూపి.

**వాఃపసఖ్వి** నం ఆ స్త్రీ వరుణసఖ.

చ. అఱుసఖఁ జెప్పు మింద్రుసఖ నాడుము వాఃప
సఖ న్గణింపుము హరి. ఉ. 6 106.

**వాఃపుష్పము** నం. వి అ న. లవంగము.

**వాంచే=వంచు** న క్రి (√ వంగు) వంగఁజేయు.

ఆ. పతులపిఱుఁద మందగతి ముక్తకేశియై, పోవు
దాని ద్రుపదపుత్రిఁ జూచి, యంతఁ గౌర
వేంద్రు నంతిపురంబున, వారలెల్లఁ దలలు
వాంచి రడలి. భార సభా 2. 298.

మ. అనినన్ మోమరవాంచితిన్ వినయలజ్జా
యత్తచిత్తుండనై . . ఉ హరి 2 21.

క తల వాంచి మగుడ మునుఁగిడె ... పారి.
1. 111

**వాంఛ** నం. వి ఆ స్త్రీ ఇచ్ఛ, కోరిక, మనోరథము.

**వాంఛచేయు** మి అ క్రి (వాంఛ+చేయు) కోరు.

సీ. ద్వీప మేలెడువాఁడు తేజస్వియై మహీవలయ
మెల్ల నేల వాంఛచేయు ... ప్రబోధ 2. 64.

**వాంఛనము** నం వి అ న కోరుట, ఇచ్ఛగించుట, అభిలషించుట.

**వాంఛి** నం. విఱ. (న్ సి న్) 1. కోరువాఁడు 2. కాముకుఁడు.

**వాంఛించే** నం న. క్రి కోరు.

గీ . అనుడు నా జిష్ణుఁ డిమ్మహోత్సుని తెఱంగు,
సెప్పఁ జిట్టలు వినఁగ వాంఛించితేని, వినుము
చెప్పెద నని యిట్టు లనియెఁ బ్రీతి . భార.
శాం 2. 429

**వాంఛితము** నం. విఱ. (అ. అ అ ) కోరఁ బడినది అభిలషింపఁబడినది.

వి. అ న కోరిక ఇచ్ఛ.

**వాంఛిని** నం వి. ఈ స్త్రీ కామాతురత గల స్త్రీ.

**వాంతము** నం విఱ (అ ఆ అ.) 1. క్రక్కఁబడినది, ఉమియఁబడినది 2. పైకిఁ ద్రోయఁబడినది వెడలఁగొట్టఁబడినది

**వాంతాదము** నం వి. అ పుం శునకము, కుక్క.

**వాంతాశి** నం విఱ. (న్ సి న్.) క్రక్కిన దానిని దినువాఁడు, మలభక్షకుఁడు

**వాంతి** నం వి ఇ స్త్రీ 1. వమనము, క్రక్కు. 2 వెడలఁగొట్టుట

**వాంతికృత్తు** నం విఱ (త్) వమనకరమైనది, వాంతి చేయించునది.

**వాంతిదము** నం విఱ (అ అ అ ) వమనకరమైనది, వాంతి చేయించునది

**వాంశము** నం విఱ (అ ఆ అ ) 1. చెఱకునకు సంబంధించినది 2 వెదురుతోఁ జేసినది, వెదురునకు సంబంధించినది

**వాంశి** నం వి ఈ స్త్రీ. వంశరోచన, తవ క్షీరము, వెదురుపాలు

**వాంశికుఁడు** పుం. వి అ పుం 1 వెదురుకఱ్ఱల నరుకువాఁడు, పిల్లంగ్రోవి యూదువాఁడు

**వాఁక¹** (నం అవగా ) 1. ఏఱు.

క నడకట్ట లిసుకతిప్పలు, మడలుఁ దరులు వాఁక
లును గ్రమంబున నొకఁడున్, గడవఁబడకుండఁ
గృష్ణుఁడు పడతులకును యమున యాటపట్టుగఁ
జేసెన్. హరి. పూ. 8 37.

సీ పడిఁబాఱు విరితేనె వాఁకల దరుల వెంబడి
ఘుమ్మనను మృగమదము తావి . ఉ. రా
3 66

క ఏఱన వాఁక యన నదికి పెసఁగును బేర్లై .
ఆం. శే. 45.

2 సెలయేఱు

గీ ... వాఁకయనఁగ, వాగనఁగ సెలయేఱు వా
ద్రవంత యనఁగ, నచలనది యొప్పు  ఆం భా
2. 30

జ. వాఁక దాలుపు

**వాఁక² విశే.** (సం వక్ర్ర) వంకర

గీ అంతఁ బరికాలుఁ డేలచూచు  తాఁకె వారిఁ,
గలుపడవిఁ బేర్చునొక వాఁక కనుమలోన
పరమ. 4 205

**వాఁక³** వి 1. ప్రదేశము

చ వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన
పూవుగుత్తి  పారి పిరి 6

2 పార్శ్వము, ప్రక్క

ద్వి మూఁకచింతలఁ బడుమేక మామిళ్ల, వాఁక
నొప్పెడు సరోవరము వీక్షించి  బస. పు
105 పా 30 పం

**వాఁకదాలువు** వి (వాఁక¹ + తాలుపు) గంగా
ధరుఁడు, శివుఁడు

ఉ. ... వే, గ్రుచ్చి కవుంగలించి వలిగుబ్బలి పట్టియు
వాఁకదాలుపున్  పాండు 1. 199.

**వాఁకుడు** వి కంటకారిక, ఓషధి విశేషము

గీ వెలగ వాఁకుడు పల్లేరు ములక వేఁప, నగిరె
నీర్గొబ్బి మొదలుగా జగతిఁ గల్గు, కంపలన్నియు
వేవేఁగ గడచి కడచి . హంస 4 9

సీ. .. బృహతియా వాఁకుడునా . ఆం భా
2. 59

**వాఁగడ** వి (వాయి + కడ) ముఖప్రదేశము

గీ దంష్ట్రికలు పాదమునఁ గొని తన్ని సంధి, మున్న
యెముకను సంచువ నూదిపట్టి, పాపి కదిలించి
వెలికి యాపతి యధిక, వేగమునఁ బులివాఁగడ
వెడలిపోయి కేయూర 3 120

**వాఁగడుపు** వి. (వాపు + కడుపు.) వాఁపు గల
కడుపు.

సీ. లీదనరాలతోఁ బెరుఁగువాఁగడుపులో బల్ల నల్ల
దలందుఁ ద్రుళ్లిపడఁగ ... శుక 3. 30

**వాగరత(ర్త)** వి సముద్రతీరము (శ ర., ద్రా.)

**వాఁగించు** స క్రి (√ వాఁగు) మ్రోగించు, ధ్వనింపఁ
జేయు

వ .. ప్రచండంబగు వానిపిచండంబు వాఁగించి
కాలం గాలు గిలించి. భాగ. 10 పూ 1345.

**వాఁగు** అ క్రి (సం గవచ్) 1 వదరు, ప్రేలు

సీ వేదాంతయుక్తులు వినిరెండు నేర్చుక వాఁగి
నాతఁడు రాజయోగి గాఁడు ... వేమ. గో.
శ 7

2 మ్రోఁగు, ధ్వనించు.

ఉ చెంగువ దాఁటుఁ జూపు లిరు చిక్కని బేడిస
లేమొ మీఁటినన్, గ్రంగన వాఁగు గుబ్బలు
చొకారపుఁదాళము లేమొ... విజ వి 1 118.

వి 1 సెలయేఱు,

చ కదిసిన భీతి వావరులు కన్కనిఁ దాటియు గహ్వ
రంబులం, దొదిఁగియు వాఁగుద్రంతఁ బడి
యుఁడియు... భా రా. యుద్ధ. 912.

గీ నెత్తురుల దోఁగి బవరంపు నేలఁ ద్రెళ్లి, సోఁకు
దొర యొప్పె గట్టులనూఁడు జాతి, వాలు
చేఁబడ్డ జేగురు వాఁగుగములతో నెనయు మేటి
గుబ్బలతో దొరయుచు అచ్చ. రా యు 558.,
ఆము. 673.

2 నది

ఆ మేఘమార్గ మెక్కి మేరుశైలముదాఁటి, మింటి
వాఁగు నొరసి మిగుల మెఱసి .. తపతి 3 20.

మ దిననాథప్రతిరూపుఁ డాతఁ డెలమిన్ దేశాంత
రాసక్తిమైఁ, జని యాశ్చర్యకరంబులో పురము
లున్ శైలంబులున్ వాగులున్, వనమధ్యంబు
లుఁ జూచుచుం దిరిగి.. ద్వా 9. 91

3 సైన్యము

క, వెలు గుగని కడఁగి యిరువాఁగులుఁ బోరికిఁ
జొచ్చె .. భార విరా 3. 198.

చ . తావకా, ప్రతిహతబాహు:తు యిరువాఁగును
జూడదె పాండవోత్తమా .. భార. కర్ణ.
3 120

చ నడచెఁ గుమారువాఁగు భువనంబు సమస్తము
నొక్కపాయగాన్ .. క సం 11. 595.

4. పక్షము, వైపు

వ. వైరాగ్యానుబంధంబు లుడిగి యయ్యిరు వాఁగు
వారును.. హర 6. 110

5 ఖ అలలు.

చ. గిరిఁ థ మెక్కి తమ్ము లిరు గ్రేవ గిరిద్వయ మట్లు దవ్వులన్, దురమునఁ దేరులై యొదవఁదోఁబడి వాఁగులు వచ్చురీల రాల్, గురియఁగ దేరిమీఁది పురికోటల కేతనదండ కోటులన్, దిగిగివనింగి మేన వడిసెం బయిపై నవ రక్తపూరముల్. కకు 5 114.

జ వాఁగించు, వాఁగుడు.

వాఁగుడు వి (√ వాఁగు) 1 ప్రేలుట, వదరుట.

(వ్యవ) నీవాఁగు డింక చాలించు

2. మ్రోఁగుడు, మ్రోఁత (శ ర)

వాఁచు అ. క్రి. 1 మిక్కిలి అపేక్షించు, పఁకరు.

శా ప్రారంభించిన వేదపారమునకున్ బ్రహ్మో హమౌ నంచునో, యేరా తమ్ముఁడ నన్నుఁ జూడఁజనుదే వెన్నాళ్లనో యుండి చ, తూరాజీవ యుగంబు వాఁచె నినుఁ గన్గోకున్కి పాండు 3 33

ఉ .. కన్నులు వాఁచు నీ మొగము గానక యెప్పుడుఁ జూడకున్న నా, యన్న యిదేటికిన్ దమకమారసి చూచిన వింత వాఁడవే. యయా. 3. 145, వి. పు 6 102

2. వాయించు

ఉ. సొంపునిం, ప న్నటియించియుం దివిరి మద్దెల వాఁచియుఁ బ్రొద్దువోక యా, కన్నెలు కేళికా వని నొకానొకనాఁడు మెలంగి రయ్యెడన్. చం రా 2. 98.

సీ సరసిజాక్షి యొక రత్న స్వరమండలము వాఁచబోటి యొక్క తెదండ మీఁటి పాడ. వాల్మీకి 3 125.

3. రోగముచే నుబ్బు

(వ్యవ) వానికి జబ్బుచేసి కాళ్ళు వాఁచినవి.

ఒడలు వాఁచు = పొగరెక్కు, ఉద్ధతుఁడగు

(వ్యవ) ఈ మధ్యన వాఁడు బొత్తిగా ఒడలువాఁచి పెద్దవారి నెదిరించుచున్నాఁడు.

జ: వాఁగడుపు, వాఁపి, వాఁపిరి, వాఁపిరి గొట్టు, వాఁపు.

వాఁడి వి. 1. తీక్ష్ణత, పదను, నైశిత్యము.

అ. వాఁడిఁ బొడలు జఠర వైశ్వానరుఁడు....అము. 4. 280.

ద్వి వాఁడును గోపించి వసుధేశు మేన, వాఁడి తూపులు నాటె వడి నైదువదులు . ద్వి భార. 1 22

క . అహి యేమి కోఱబల్ వాఁడి సెడిన ... అము 4 235.

2 క్రూరత్వము

క నారిజనముల కాజ్ఞా, కారియగు భటుండు మరుఁడు గాఁబోలుఁజుమీ, వారి కటాక్షము సోఁకిన, వారియెడల వాఁడిఁ జూపి వర్తించుఁ గదా భర్తృ 2 11

సీ ఈ వాఁడి చాలించి మావాడ నలివేణి చేదోడుగా నుండు చిలుక నీకు ఇందు. 4 59.

3 కాఠిన్యము

లోవాఁడి = లోపలవాఁడి

మ కోశంబులో వాలుమె, ల్పున రాజిల్లుచు మాట మెత్తఁ దనమున్‌లో వాఁడియు న్నేర్ప దన్ ... భాగ 10. 223

4 పరాక్రమము, శౌర్యము.

ద్వి. వేఁడు మీ ధర్మాన నెఱవేఱఁ గలిగె. వాఁడిచేఁ బెండ్లాడి వచ్చెద వనుచుఁ, గడఁగి దుశ్శకునముల్ గనిపింప నిటకు నడచితి. ద్వి వల. 2 609.

మ . రణం. బునఁ బాడిన్ రిపుగెల్చు వాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రాజునకౌ ... అము 3 61

చ. కొడవలి వ్రేలివట్టి దొర కూఁతురికిన్ వెనునిడ్డ నాభిచం, దదరఁగఁ గాంచి పంరచవి శిఖాఖ్య తురుష్కలంబు వాఁడి, కెక్కుడు సమయం బటం చదరు గ్రోపులు గాల్పఁగఁ బిట్టు మందు చిం. డెదు పొగనా వజాండమున నిండె నఖండ తమః ప్రకాండముల్. రా. వి 4 41

విశ. 1. పదనైనది, నిశితము. రాఘవ. 2. 21

క ... దేవ, వ్రతు మీఁదను సాళ్వుఁడేసె వాఁడి శరంబుల్ ... భార ఆది. 4. 204.

వ. వాఁడులగు కత్తులన్ దిత్తు లొలిచి ... మనుచ. 4. 60.

గీ. ... వాఁడి పండ్లు బిగించి చేవలఁతి యొగిరి .... హర. 1. 20.

2. తీక్ష్ణము.

క వాఁడి యగు నలుకలోకము, పోఁడిమి సెడఁ, గయ్యమట్లు పొడిచివనటమై... భార. శాం 1 63.

ఉ కొందఱు మంతనంబులను గొందఱు జంకెన వాఁడి చూపులం, గొందఱుఁ జేతి సన్నలఁ దగుల్పడఁ జేయుచు .... పారి. 1 108., శాం 5 74

3 క్రూరము

క. వాఁడగ్ని లోనఁ ద్రోచిన, వాఁడ వకట యంతఁ బోక వల్లభనిమ్మె నేఁడడవిఁ ద్రోచి తెరఁ గడు, వాఁడిగదె నీకు రాఘవ కులప్రవరా ... నిర్వ. 10 129.

4 వేడియైనది

ఉ వాఁడిమయూఖముల్ గలుగువాఁడపరాంబుధిఁ గ్రుంకె ... భార ఆది 3 112

జ , వాఁడి చెఱుచు, వాఁడితనము, వాఁడి మగఁడు వాఁడిమి, వాఁడివెట్టు, వాదర

**వాఁడిచెఱుచు** స క్రి (వాఁడి + చెఱుచు) పరాక్రమ హీనునిచేయు

సీ. బ్రహ్మత్వమును బొంది పరఁగు విధాతను వాణికై యెవ్వఁడు వాఁడి సెఱిచె భాగ 10 ఉ 10

**వాఁడితనము** వి (వాఁడి + తనము) తైక్ష్ణ్యము, పరుషత్వము

ఆ అతివఁ జంపఁ బాపమని యూరకుండిన, నోరి కొలఁదులాడె దొర నన్ను, వనితకింత వాతి వాఁడితనం బేలఁ ప్రభుల నోట లేక పలుకు టేల ... భా. రా. సుం 202

2 పరాక్రమము

చ. భయంబునఁ బాఱితి పెక్కు మార్లు వంచన మధురాపురి న్విడిచి సాగర మధ్యము నందు డాఁగనే, వనరుహనాభనీ విరుదు వాఁడి తనంబును నాకు వింతయే భాగ 10. ఉ. 729.

**వాఁడిమగఁడు** విశ. (వాడి + మగఁడు) 1. శూరుఁడు.

క. వీఁడొకఁడు కురుబలంబున, వాఁడి మగం డనఁగఁ జాలువాఁడు ... భార. విరా. 5. 111.

క. తగువారిఁ బిలిచి యిదిగో, లగనము దాకా నిడుపెల్లిలతిఁ బుడమికి తే. నిఁగఁ జేయవలయు రక్కసి, మగువంబోరి గొన్నవాఁడి మగనిఁగ దంకన్. అచ్చ. రా. అయో. 8.

క ధరలో శూరాహ్వయములు, పరంగును మొనకాఁ డనంగ బంటనఁగాఁ బో,టరియన వడిగల వాఁడన విరుదనవాడిమగఁడనఁగ భీమకపర్ది ఆ. సం మూవ 51.

**వాఁడిమి** వి. (వాఁడి + ఇమి) 1 తేజము, ప్రతాపము

ఉ నేఁడు ప్రసూతికాలమున నీవు గదాధర మద్గృహంబునన్, వాఁడిమి తోడ నుండి జము వాకిలి వట్టి మదీయసంతతిం, బోఁడిమితోడఁ గాంచి ఉ హరి 2 17

ఉ వింటిరె యొక్క వార్త మన వెట్టులు చెప్పిరి రాము కన్నులం, గంటి మటంచు నీతవిని గాంగ్రుడు మదీయమహోగ్రమాయకై, దంటతనంబునం జని ఋతుధ్వజు సైన్య సమేతుఁ దేర నా, బంటుతనంబుఁ జావుటకుఁ బన్నిన వాఁడట వాఁడు వాఁడిమిన్. కువల 2 101

క. వేఁడికొని కృపణులై కను, పోఁడిమి యదియేల రాజు పుత్రులదమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు విని యులుకుదురే భార. ఉద్యో 3 197

2. పరాక్రమము.

ఉ. .. పోరిలో, వాఁడిమిఁ గొంతకాల మిల ద్రావులు టావరియేట ఆము 6 21

3. తీవ్రత.

ఉ. . వాఁడిమి గల్గు శాపమున వచ్చెఁ బురాకృత కర్మ భావ్యమె, వ్వాఁడును నేర్చునే ... భార విరా 1. 238

క, పోఁడిమి చెడియునుఁ దనమది, వాఁడిమి సెడనీక లబ్ధవైరాగ్యుం డై, వాఁడతి నియమంబునఁ బదు, మూఁడేఁడు దాఁక ధ్యానమున నుండంగన్. ద్వా 10 114

4. శౌర్యము.

క. మూఁడవవి ల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడిపోవ ననుర పొలువరి యలుకన్, వాఁడిమి యొనఁ గఁగ నొకగద, వేఁడిమితో వైచె వృష్ణివిభునతి మీఁదన్. హరి. ఉ 4. 157.

ద్వి. వాఁడిమి మెరసి దుర్వారుఁడై కడఁగి వాఁడె దుర్యోధన వచ్చినవాఁడు ... ద్వి. భార. 2. 38. బొ.

5 వాఁడి, పదను, నైశిత్యము

సీ వజ్రాయుధంబు క్రొవ్వాఁడిమి మెచ్చని ఖర నఖంబుల నొప్పు చరణయుగము ... భా. రా. అర 102.

**వాఁడివెట్టు** స. క్రి. (వాఁడి+పెట్టు) వాఁడి కలిగించు.

ఉ. నాకులభీకరదానవగణంబులతో సరిపోలు వారె వీఁ,డేకుల వాఁడివెట్టెఁ దన యెద్దును దాను విటుండి వీని ము,న్నేకతమంత మజ్జముని యింటికి నంచుఁ గకుత్స్థుఁ డాఁకి రా, లోకము లగ్గి సల్ల నెటులో యట నెవ్వరో యంటి వేని యున్.. శకు 5 45.

**వాఁడు** స (క. అవను, త అవన్) తచ్ఛబ్దార్థకమగు (అ) అను సర్వనామశబ్దముయొక్క మహత్ప్రథమైకవచనరూపము ప్ర బ వారు, వాండ్లు, వాఁడు. ద్వి ఏ వానిన్, ద్వి బ వారిన్, వారలన్, వాండ్రన్. మొ. వ హర్షించి వారు నవి న్నయ స్వాంతులయి .. ఆము 1. 18

గీ మెఱసి యుపకార మొనరింప మేలువచ్చుఁ, గీడు వచ్చు మనంబులో నోడ వలదు, వాఁడు చేసిన ధర్మంబు వానిఁ గాఁచుఁ, గీర్తి యొక్కటి ఫాలదే కేవలంబ కాశీ 2 107.

ద్వి. వాఁడును చనుదెంచి వరుసఁ బాండవులఁ, బోఁడిగాఁ బురమున మును దోడితెచ్చి . ద్వి భార 1 16

ఉ నావుడు వాక లమ్మనుజనాథున కిట్లనిరి... ఆము 3 56

2 సంబంధార్థమున పదములకు ప్రయుక్తము

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు ... భాగ. 8 549

(ఇట స్వస్వామి భావసంబంధము)

ఉ ఎక్కడివాఁడో యక్షతనయేందుజయంత వసంత కంతులన్, జక్కఁదనంబున న్గెలువఁ జాలెడు వాఁడు .. మనుచ 2 35.

(ఇట ఆధారాధేయభావసంబంధము)

ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు ... భాగ. 10. పూ. 1010

(ఇట ధర్మధర్మిభావసంబంధము.)

ఉ .. నవ్వురా, జిల్లెఁడు మోమువాఁడు .. భాగ 10. పూ 1010

(ఇట అవయవావయవిభావసంబంధము.)

**వాఁత** వి. తెగులు గొంటైన పశ్వాదులకు వేయు చూఁడు (శ. ర., వా.)

**వాఁపి** విశ (వాఁపు$^3$+ఇ) శోఫి, వాఁపుగలవాఁడు

గీ ఫి వా పి యన నులిపి యన నుల్పడన శోఫి, శోఫిలు . ఆం. భా 2 123.

**వాఁపిరి** (వాపు+ఇరి) మిక్కిలి కాంక్షించుట, ఏకరుట. (శ ర, వా.)

**వాఁపిరిగొట్టు** విశ (వాఁపిరి+కొట్టు) వాఁపిరివాఁడు, ఏఁకరువాఁడు (శ ర, వా)

**వాఁపు** వి (√ వాచే) రోగాదులచే శరీరము ఒకవిధముగా లావగుట, పొంగుట (ఇది సానుస్వారమని. శ.ర విర్ధారకము)

క ఊపిరి వెడలక కడుపున, వాఁపొదవినఁ బాము ప్రాణవాతంబులు సం, తాపించి .. భాగ 10 పూ. 480.

**వాకట్టు** స క్రి (వా+కట్టు) వాగ్బంధముచేయు.

ద్వి దాదివాకట్టి భూతలనాథు పట్టి, వాదట నీకిశి వఱ్ఱొత్తి చంప . హరిశ్చ ఉ 2 411.

సీ వాకట్టుతిని వాసవప్రముఖాదితేయుల ... ప్రభులిం 7. 72. (ప్రౌ.)

దం హోమమంత్రంబులన్ మారు తంత్రంబులన్ జిక్కఁడే సొక్కఁడే దిక్కులం జిక్కులం బెట్టు వేధన్ మహావేధ నైనన్ విరోధించి వాకట్టు నీతిన్, బలారాతి మంత్రిన్ ప్రమోహించు . భోగినీ దండకము

గీ. అనుచుఁ దమ వేలుపుల నెల్ల నమరఁ దలఁచి వేఁడుకొని మ్రొక్కి వాకట్టు వేళ్లు గొనుచు, వలను లెస్సైన మిక్కిలి నలరు గొనుచు, వచ్చి యెఱుకులు వేఁటాడ. బోచ్చిరవుడు ... యయా 2 3.

వి. 1 వాగ్బంధము చేయు మందు మొ.

గీ మూలికల్ మణుల్ వాకట్టు మొదలుగాఁగఁ, జోరసంగ్రహణీయ వస్తువులు గొనుచు... దశా 1. 260.

ద్వి కుక్కల వాకట్టుఁ గొంకి వారనము.. బస. పు 5. 388 వం.

2. వాగ్బంధము.

సీ కలకంఠనికురుంబములకును వాకట్టు విడిపింప వచ్చిన వెజ్జునంగ. విక్ర. ౫. ౩.

గీ అతిథిపసరంబునకు నీనినట్టి తొనుప, కడుపు లేఁగల గమికి వాకట్టు లెనఁగె ... ఆము 4 123

**వాకబుచేయు** స క్రి తెలిసికొను (శ ర, వా)

**వాకము** విణ వాటము, జాఱుపుగా నుండునది

ద్వి. ఈ కొండ పడమట నీకొండక్రేవ, వాకమౌ నొక పెద్ద వటముమూలమున శ ర., రం కా అ

**వాకము** సం వి అ పుం వచనము, పదము మాట

న బకముల సంఘము, కొంగల గుంపు

**వాకలిచె** వి (వా+కలిచె) ఒకానొక చెట్టు

ద్వి చిఱుపాల బూరుగుచిల్ల చెన్నంగి, కుఱుముసిడియు గొండగోఁగు వాకలిచె ద్వి శ సా 2 80. పా 2, పం

**వాకల్వెకాయ** వి (వాఁకలిచె+కాయ) వాకలిచె కాయతో పెట్టిన యూరుఁగాయ

సీ. తేకరక్కాయయు వాకల్వె కాయయుఁ జిటి నెల్లి కాయయుఁ జిల్లకాయ . ఆది, యైన యూరుగాయలు గల వతనియింట హంస 4 185

**వాకాటు** వి (వా+కాటు) వాగ్వాదము, వాక్కలహము.

క. అకాశదివ్యమునులును, నాకౌకః ప్రత్యనీక నాయకమునులున్, వాకాటులకుం జొచ్చిరి పాకంబులు దప్పినట్టి పటురోషములన్. భీమ. 4 183. శివరా. 4 70

**వాకిలి** వి. (వా+ఇల్లు) 1 గృహద్వారము, ద్వారము

ఆ వచ్చి పర్ణశాలవాకిట నిల్చి యు, త్తన్విఁ బిల్చె ... భార ఆర. 1 75.

క. అకులగతి వలుదెనలం, గాకులక్రియఁ బెదరి కడు వెగడుపడి రక్షో, నీకములులంక యెనిమిది వాకిళ్లం దూఱెఁ బౌర వర్గము దలఁకన్. భార అర. 7 106.

సీ ... అమ్మెన భేదంవ నఖిమన్యుఁ డోపుఁ బొమ్ము నియెడు తలఁపు నాకపుడు పుట్టె.

ఆ వానిఁ బిలిచి నీవు వాకిలి బుచ్చుమం, ద ఱ ము మొగ్గరంబు దఱియఁ జొచ్చె,దము ... భార. ద్రోణ 2 270

చ తొలితొలి యేఁగి భూరిభుజభుర్యత యొప్పఁగ నింద్రుపీటివా,కిలి తలుపుల్ ప్రగాఢపరికలిత ముష్టిహతిం బగిల్చి వే,వెలలుము కయ్యమిమ్మని సవేగసముత్థిత సింహనాద సంకలితము గాఁగ... హరి ఉ 4 16

2 ఇంటికి ముందటి భాగము, అంగణము,

వ పర్ణశాలవాకిట హవిశ్శేషంబయిన హవిష్యనీవారపాయసాన్నం బల్ల నల్లన లేడిపిల్లలకు మేపుచుండె ... హర. 1. 2 (ప్రా ప)

వ, రఘువీరునగరివాకిట నుండియు జలధి ఘోషం బోల బేలతనంబున నేర్చితిరని . ఉ. రా 1 138

వ స్వస్తి సమస్తరాజన్య చూడామణి కిరణ రంజిత పాదపర—సిజా(తుం)డగు కాక తియ్యభరాధీశుశ్రీవాకిలిక నంగరక్షయై ద శా. 952

వ (కా) కతియ్యరుద్రమహాదేవరాజుల చప్పటము వాకిటి అంగరక్ష బొల్లి నాయంకులు . . ద. శా 705

**వాకు=వాక్కు** సం వి చ్ స్త్రీ 1 పలుకు, మాట

క . సౌ,మ్యాకృతులుగానివారల, వాకులు శితులు నుపద్రవంబులు గావే భార అది 8 41

క వాకును మనసును గాయము, నేకాయన వృత్తి కాచ మెడలని తపముం, జేకొనునది యది బోధ, శ్రీకి ఘృతంబునకు వెన్నక్రియ జనక మగున్ భార శాం 4. 338.

సీ. వడుగు వాకుగ బలినడుగువాకువఁ జేరియడుగు వాఁగఁ ద్రొక్కు నడుగువాఁడ ... ప్రబంధ (అప్ప కెమఁగు) 3.

2 భాష.

గీ. వాకునా భాషయౌ నలవంబు తెమఁగు, కన్నడంబు నమతి యిట్లు కొన్నిదేశ, భాషలై - యొప్పు.. అం. భా. 1. 110.

3 సరస్వతి

**వాకులము** నం వి. అ న పొగడ పువ్వు

**వాకొను** న క్రి (వా+కొను) చెప్పు, వచించు

క నీ కిప్పుడు గానంబడె, నాకులకును నురగపతి పివాకుల కైనన్, వాకొనఁగం దలపోయము, రాకుండు మదీయరూపరమ్యత్వాంబుల్ భాగ 8. 323

క వాకొను తెరవుఁ జలంబున, బోకి తెవు వినక వాదుపుట్టినచోఁ డా, నాకును సాక్షియు నేలా, యేకం బనుభవమె చాలు వేర్పడఁ దెలుపన్ విజ్ఞా 3 36

ఉ వారివిహారముల్ నలుప వాంఛ జనించెను జేర రాఁగదే, వారిజమిత్రపుత్రి యని వాకొని పిల్చిన ద శా 8 128

2. అడుచు, పేర్కొను, వాక్రుచ్చు

క కనుఁగొని పలుఁదెఱఁగులవా, కొనిలేపఁగ అచ్చ రా యు 226

**వాకొలుపు** న క్రి (√ వాకొను) వాకొనఁజేయు

సీ. .. గీ పరువులిడు మారపందుల ముటికిగవులు, చేప తట్టల గదురుతోఁ జెనసి చుట్టఁ, గూఁత వెట్టున జముల వాకొలుపఁజేయ, భయము గొల్పెడు నొక బోయపల్లె గాంచి వాల్మీకి 2 85.

క నాకముఁ గూల్చుటకో భూ,లోకముఁ గాల్చు టకొ ... వాకొల్పెడు కోఁతిపోరు వాక్రువ్వ కుమీ రామా 8 140

గీ పరులఁ జూపులు వాకొల్పఁ బ్రసభలీల నైష 7 61

**వాకోవాక్యము** నం వి అ న ఉక్తి ప్రత్యుక్తి రూపమయిన సంభాషణము

క. మీకును మీపతియానతి, మాకును మా భర్త యాజ్ఞ మన్నింపఁదగున్, వాకోవాక్యమ్ములి వెడ, వాకాల్గం బల్పుజంబు పలవదు సేయన్ శివరా 4 70

**వాక్కలహము** నం వి. అ పుం మాటలతోఁ బోరాటము

**వాక్కిరుఁడు** నం వి అ. పుం వేడుక మాటతోఁ గీరమువలె సంతోషపెట్టువాఁడు, భార్య తోడఁ బుట్టినవాఁడు, శ్యాలకుఁడు.

**వాక్కు(కు)** నం వి చ్ స్త్రీ 1. పదము, శబ్దము, 2 మాట, పలుకు 3 భాష 4 ధ్వని 5 చెప్పుట 6. వాగ్దానము, మాటయిచ్చుట 7 సామెత, లోకోక్తి 8 సరస్వతీదేవి

**వాక్చపలుఁడు** నం విశే (అ ఆ అ) పనికిమాలిన మాటలు పలుకువాఁడు, మంచిచెడ్డ లాలోచింపక మాటలాడెడి వాఁడు

**వాక్చాపల్యము** నం వి అ న. వదరుట, వదరుఁ బోతుతనము

**వాక్ఛలము** నం. వి అ న మాటలయందమర్యాద, తప్పించుకొను జవాబు, నిజముచెప్పకుండఁ దప్పించు కొనుట

**వాక్పటువు** నం విశే (ఉ) మాటాడు నేర్పుగల వాఁడు, మాటలయందు నేర్పరితనము.

**వాక్పతి** నం విశే ఇ గొప్పవక్త

వి ఇ పుం 1 బృహస్పతి. 2. పుష్య నక్షత్రము

**వాక్పారుష్యము** నం వి. అ న 1 భాషాకాఠిన్యము, మాటలయందలి కఱకుఁదనము 2 నిందించుట

**వాక్ప్రచోదనము** నం. వి అ న. వాఙ్మాత్రమైన యాజ్ఞ, మాటలతోఁ దెలుపఁ బడిన యానతి

**వాక్ప్రతోదము** నం వి అ. పుం మాటయనెడి యంకుశము అంకుశమువలె బాధించు మాట

**వాక్యఖండనము** నం వి అ న వాదము ఖండించుట.

**వాక్యపదీయము** నం వి అ. న గ్రంథవిశేషము, భర్తృహరి విరచితమగు నొక గ్రంథము.

**వాక్యభేదము** నం. వి అ పుం వేఱుగాఁ జెప్పుట, విరుద్ధముగాఁ జెప్పుట

**వాక్యము** నం వి అ న 1 మాట, పదము 2 పర స్పర సంబంధముతోఁ గూడి యేకార్థత్వము గలిగి క్రియతోఁగాని తదితరముతోడఁగాని సమన్వయించు పదసమూహము, యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి, గలపదసమూహము. 3 (తర్క.) వాదము. 4. సూత్రము, నీతివాక్యము, విధివాక్యము

**వాక్యరచన** నం వి. ఆ స్త్రీ వాక్యమునఁ బదముల కూర్పు

**వాక్యవిన్యాసము** నం. వి అ పుం = వాక్య రచన

**వాక్యవిశారదుఁడు** సం విణ (అ. ఆ. అ) మాటల యందు నేర్పుగలవాఁడు మాటలాడుటయందు చాతుర్యముగలవాఁడు

**వాక్యశేషము** సం వి అ. పుం 1 వాక్యము తర్వాయి, సమాప్తి కాని వాక్యము 2 ఒక భాగమున లుప్తమగు వాక్యము.

**వాక్యార్థోపమ** సం వి ఆ స్త్రీ. ఉపమాలంకార భేదము.

**వాక్యాలాపము** సం వి అ పుం సంభాషణము.

**వాక్రుచ్చు** స. క్రి (వా + కూర్చు) (త వాయ్కొలుత్తల్) (సంధిని వర్ణ వికారము)

1 పేరుకొను, పేరుచెప్పు, పలుకు.

ఉ మెచ్చి యొకింత గౌరవము మెచ్చుకయుండి లఘుత్వలేశమున్, తెచ్చుటకున్ సమర్థులె కృతి క్రియకున్ గుకవిత్వ గర్వితుల్, తచ్చరితంబు పేరు కుచితంబగుఁగాక నగంగనై నవాక్రుచ్చి యజాగళస్తనసగోత్రుల వారల నెన్న నేఁటికిన్ కళా 1. 6 7

క తగునయ్య వనితకు, వనితలదుశ్చేష్టితములు వాక్రువ్వంగన్ ... భార అను. 2 169.

2 వచించు, చెప్పు

సీ కలిగె లేకుండె నిట్ల లఘు గుణంబులు వాక్రుచ్చి మీయంతవార లిట్లు, గొనియాడ ... భార శాం 1 376.

సీ నృపుల చేబట్టి కానికలు దెచ్చిన సొమ్ముకొలఁది యెవ్వరికి వాక్రువ్వరాదు . విక్ర. 5 120.

సీ . వాక్రుచ్చె నుడివెను బలికె నాడె, ననెననఁగ వచించె నంచును విలసిల్లు ఆం. భా 3 119.

ద్వి. వారక తలపోయ వాక్రువ్వఁజాల .. హరిశ్చ. పూ 1257

క . ఆంబికేయు చరితము దుర్యోధను కొఱగామియు నెవ్వారును వాక్రువ్వంగ వెఱతురు కురుప్రవరా ... భార. ఆశ్ర. 1 15

ద్వి వరమిచ్చు నప్పుడు వాక్రువ్వఁ డయ్యె, నరులఁ గావువాఁడు నరులచేఁ జచ్చు ... రం. రా. బాల. 17 పొ 7 పం.

మ. ఈవు మానవులతో నేవేళఁ బోరాడఁగాఁ, కృశతంబొందె మదీయకౌతుక మదేమీయన్న వాక్రుచ్చెదన్ . ఉ రా. 3 301.

మ సరసగోష్ఠిన్ బోటియుం దాను న,వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి వర్ణించుచున్ . పారి 1 71

గి వానిచెలువంబు మడుపులజేనికైనఁ, బూని దిటముగ వాక్రువ్వఁబోల దెందు నీలా 1 82.

మ అని సంకల్పభవైకసాతులగు శయ్యావేక సంభోగచిహ్నావలన్ భూపతి ప్రత్యభిజ్ఞ కొఱకై యందంద వాక్రువ్వ న,వ్వనితారత్నము వాలుఁగన్నులఁ జతిన్ వారించుచున్ నైష. 8 87.

దండకము, నీవుగావించు చెయ్యుల్ నెఱింబూని వాక్రువ్వ నెవ్వారికిం దీరు ... నీలా 2 41

సీ వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు కాశీ 1. 13

శా భద్రాశ్వకేతుమాల చెప్పతి భవత్రప్రశ్నాను రూపంబుగా,రుద్రాంభోరుహగర్భ ముఖ్యులకు వాక్రువ్వంగరా కద్భుతో, న్నిద్రంబైన మహేతిహాసమిదియే వరాహ. 9 20.

**వాక్సంయమము** సం వి అ పుం వాక్కును నిరోధించుట, మౌన మవలంబించుట.

**వాగ** సం వి పాదుక

ద్వి. యోగవాగలు మెట్టి యొకపాద మూది, బాగుగా నొపపరి బాగునటించు హరిశ్చ. ఉ 135

**వాగ** సం వి ఆ స్త్రీ కళ్ళెము

**వాగంటిపులుఁగు** వి (వా + గంటి + పులుఁగు) చిలుక, కీరము

ఉ తుంటఁట కార్ముకంబు కరదొట్టిన తేంట్లఁట వింటినారిచే, యంటినవాఁడు తూపులఁట యప్పులపాలఁట కేతనంబు వా,గంటి పులుంగు గుజ్జమఁట కాయము లేదఁట నీకు లోకముల్, కొంచెతనంబువన్ గెలిచికోలిది యచ్చెరియంబు మన్మథా కృ శకుం 2 179.

**వాగపహారకుఁడు** సం. విణ. (అ ఈ ఆ అ.) 1. మాటలు దొంగిలించెడివాఁడు 2. నిషేధింపఁబడిన గ్రంథములు చదువువాఁడు.

**వాగము** వి వాగె
వ మొగలిరేకులపలుకయుఁ గలువకాఁడియుఁ గురువేలు వాగంబులును సంతరించి వసంత సారథి తిన్ననై యున్న క్రొన్నన మునికోలఁ గదల్చి యదల్చినం గెరలి చెరలికొట్టుచు మిన్నుల పైఁబారు చిలుక వారువంబులు. శ్రీరం 2 294

**వాగరము** నం. వి అ పుం 1 గీటుఱాయి, బంగారు మొదలగువాని వన్నెచూచెడి యొరగల్లు 2. విఘ్నము, అంతరాయము 3 నిశ్చయము 4 బడబాగ్ని 5 తోడేలు

**వాగరుఁడు** నం వి అ పుం 1 ఋషి 2 పండితుఁడు. 3 వీరుఁడు 4 ధీరుఁడు

**వాగలి** వి (వాయు+కల్లి) ముచ్చివాఁడు చిత్తరువు వ్రాయుతూలిక. (శ. ర, బ్రౌ)

**వాగళ(ళ్ళ)ము** వి (వా+కల్లము) కళ్ళమునకుముందు భాగము: ఖల్యాముఖము. (శ ర, బ్రౌ)

**వాగాడంబరము** నం వి అ పుం ఎక్కువ మాటలు మాటలాడుట, పటాడంబరము

**వాగాయిత్తము** వి. (నం వాగ్వివాదః) వాగ్వివాదము, మాటలపోరాటము (శ ర)

**వాగారువు** నం. విశ (ఈ) అడితప్పిన వాఁడు: కృతఘ్నుఁడు, కృతఘ్నురాలు

**వాగియ**=వాగె వి. గుఱ్ఱము నోటికళ్ళెమునకుఁ దగిలించెడు పగ్గము
ద్వి రాగెలు బిగియించి రథసంబులోడ, వాగి, యనడలి చువ్వన రెండుగడల. ద్వి పరమ 3. 280 పొ.

**వాగీశుఁడు** నం వి. అ పుం. 1 బ్రహ్మ 2 బృహస్పతి. 3. గొప్పవక్త.

**వాగీశ్వరి** నం వి ఈ. స్త్రీ సరస్వతి, పలుకుఁజెలి

**వాగీశ్వరుఁడు** నం వి అ. పుం 1 గొప్పవక్త, వాగ్ధాటిగల మనుష్యుఁడు 2. బ్రహ్మ.

**వాగుజి** నం వి ఈ. స్త్రీ. కారుగచ్చె. (వృ వి.) (శ ర)

**వాగుర** నం వి ఆ స్త్రీ వల, పాశము, ఉరిత్రాడు

**వాగురావృత్తి** నం. వి ఇ. స్త్రీ. వేఁటవలన జీవించుట పుం వాగురికుఁడు, వేటకాఁడు.

**వాగురికుఁడు** నం వి అ పుం వలలు, ఉచ్చులు ఒగ్గి జంతువులను వేఁటాడు జాతివాఁడు, వేఁటకాఁడు

**వాగురువు** వి (నం వాగురా.) ఉచ్చు, ఉరిత్రాడు.
గీ దురితమృగశాబకముల వాగురువు గురువు. వరాహ 4 110

**వాగృషభుఁడు** నం వి అ పుం భాషయందు సమర్థుఁడు, గొప్పవక్త

**వాగె(గియ)** వి (నం. వాగా) గుఱ్ఱపునోటి కళ్లెమునకుఁ దగిలించెడి పగ్గము
చ అరయఁగ రాజధర్మము సమాశ్రయమై నడపుం త్రివర్గమున్, గురుతరమోక్షధర్మమునకుం దలఁపం దనప్రాపయూఁత భూ,వర వినుఘోటకంబునకు వాగెయుదంతికి నంకుశంబు నే, కరణి నివారకంబులు జగంబుల కట్టుల తాను నెమ్మెయిన్ భార. శాం 2. 158.
సీ వాగెలు గుదియించి రాగసన్నలు సేయహరణపుటంబుల నౌఘళించు చిత్రభా 4. 86
సీ వక్యాపథవుఁ దీగె వాగె తోడ. కళా 362
జ వాగెవదల్పు

**వాగెవదల్చు** అ క్రి (వాగె+వదలుచు) స్వేచ్ఛగాఁ బోవిచ్చు.
చ మనమున నీవు గోరు నృపమన్మథుతో నిమఁ బెండ్లిసేయ నీ, జనకుఁడు సంభ్రమించె వదె నమ్మద మొందుదు గాక బేలవై, వవరుహపత్ర నేత్ర! యిటు వాగె వదల్చిన కోర్కులన్ మనో, జున కెరయిచ్చి డిల్లపడఁ జూచినఁ జూచినవారు మెత్తురే కవి క. 3 399

**వాగ్గుదము** నం. వి. అ పుం అజినపత్త్రి, ఒక జాతి పిట్ట (తలక్రిందుపక్షి అనివాడుక)

**వాగ్గులి** నం. వి ఇ పుం (రాజులు మొ వారికి) తాంబూల మిచ్చెడివాఁడు, తాంబూల కరండవాహి.

**వాగ్గులికుఁడు** నం వి. అ పుం = వాగ్గులి

**వాగ్డంబరము** నం వి అ. పుం 1 నిరర్థక పదపుష్టి. 2 శబ్దచాతుర్యము గలభాష.

**వాగ్దండము** నం. వి అ. పుం 1 చీవాట్లు, తిట్టు

నిందా వాక్యము. 2 వాక్సంయమము, వాఙ్నిర్బంధము.

**వాగ్దత్త** నం వి అ స్త్రీ వాగ్దానము చేయఁబడిన కన్యక, పెండ్లి చేసికొనుట కిచ్చెదనని యొకనికి మాట యీయఁబడిన కన్యక

**వాగ్దత్తము** నం విణ (అ అ అ) మాటచే నీయఁబడినది

**వాగ్దరిద్రుఁడు** నం. వి అ పుం మాటల పేద, మితముగా మాటలాడెడివాఁడు

**వాగ్దలము** నం వి అ న పెదవి, మోవి,

**వాగ్దానము** నం వి అ న (ఒక పని) చేసెదనని మాట యిచ్చుట.

**వాగ్దుష్టుఁడు** నం విణ (అ. అ అ) 1 దూషించెడివాఁడు, తిట్టెడివాఁడు. 2. వ్యాకరణ దుష్టమగు భాష నుపయోగించువాఁడు

వి. అ పుం 1 పేరు చెఱుచు మానవుఁడు 2. యుక్త కాలమున నుపనయనము కాని బ్రాహ్మణుఁడు

**వాగ్దేవి** నం వి ఈ స్త్రీ సరస్వతి

**వాగ్దోషము** నం వి అ పుం. 1 నోటితప్పు, మాట తప్పు 2 నిందించుట 3 వ్యాకరణ విరుద్ధమగు పదము

**వాగ్మి** నం విణ. (న్ నీ న్.) 1 వాగ్ధాటి కలవాడు, ఉపన్యాసకుఁడైన వాఁడు 2 వదరుఁబోతు, వాచాటుఁడు. 3 మంచి మాటలు గలది, ప్రశస్త పదములు గలది

వి న్ పుం 1. గొప్ప వక్త, యుక్తియుక్తముగా మాటలాడెడివాఁడు. 2 బృహస్పతి

**వాగ్యతుఁడు** నం విణ (అ అ అ) వాక్కు నరికట్టినవాఁడు, మౌనము గలవాఁడు

**వాగ్యము** నం విణ (అ అ అ) 1 మితముగా మాటలాడునది, జాగ్రత్తతో మాటలాడునది 2 సత్యము మాటలాడునది.

వి. అ. పుం అణఁకువ, వినయము

**వాగ్యాముఁడు** నం వి అ పుం నోరులేని వాఁడు, మూగవాఁడు

**వాగ్యుద్ధము** నం వి అ న వాక్కలహము, తీవ్ర వాదము

**వాగ్రోధము** నం. వి అ పుం వాఙ్నిరోధము, మౌనము

**వాగ్వజ్రము** నం వి అ పుం పిడుగు వంటి మాట కఠినవాక్కు, కఠినభాష

**వాగ్విదగ్ధ** నం వి అ స్త్రీ తియ్యని మాటలాడెడి స్త్రీ, మాటలచే మోహింపఁ జేసెడి యాఁడుది

**వాగ్విభవము** నం వి అ పుం 1 మాటల సంపద 2 భాషాసంపత్తి, వర్ణనశక్తి

**వాఙ్నిబంధనము** నం విణ (అ అ అ) వాక్కులపై నాధారపడునది

**వాఙ్నిష్ఠ** నం వి అ స్త్రీ మాట పట్టుదల, అడినమాట తప్పకుండుట

**వాఙ్మనఃకాయములు** న వి అ పుం త్రికరణములు, వాక్కు, మనస్సు, శరీరము

గీ నరుఁడు గంగ, నాడి శుచిఁజేయు లాచిన యంతమాత్రఁ, బాచు వాఙ్మనః కాయ పాపతతుల .. భార అను 2 110

**వాఙ్మనసములు** నం వి అ న.

ద్వి మాటయు, మనస్సును ...

శ్లో అద్వైనంతుష్టువు స్తుత్య మవాఙ్మనస గోచరమ్ రఘు 10 15

చ దళిత విరోధి యిట్టిదని దాని తెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం, గొలఁదియె తానవాఙ్మనస గోచరము భార సభా 1. 79

**వాఙ్మయము** నం విణ (అ ఈ అ) 1 వాక్ప్రచురమైనది మాటలు మెండయినది 2 భాషాస్వరూపమైనది. 3 భాషా సంపన్నము వాగ్ధాటికలది

అ న 1. సారస్వతము, భాషా ప్రపంచము

వ అందుఁ దొలుత యోగసాంఖ్యంబులం దరాచార్యులను సృజియించి మహావ్యాహృతిత్రయంబున లోకత్రయంబుల నుత్పాదించి నిజ శరీరార్ధంబుననఖిల వాఙ్మయ మూర్తియగు సుందరిఁ గలిగించి హరి ఉ 9 153

2. సాహిత్యము, కావ్యనాటకాలంకారాది

క. మును మునిముఖ్యులు భక్తిం, గొనియాడగ నిఖిలనిగమగోచరుఁడై యొప్పిన వాఙ్మయమున నిట్లని, వినుతించె నవంతమహిము విశ్వాత్ము హరిన్. హరి ఉ 10 210.

3 వక్తృత్వము

వాఙ్మాత్రము సం వి అ న మాట మాత్రము (క్రియశూన్యము)

వాఙ్ముఖము సం వి అ న 1 మాటల ప్రారంభము, ఉపన్యాస ప్రారంభము 2 ఉపోద్ఘాతము, గ్రంథము యొక్క భూమిక

వాచ సం వి ఆ స్త్రీ 1 వాక్కు. 2. భాష 3 శ్రుతి, సూత్రము 4 శపథము

వాచఃపరుషత సం వి. ఆ. స్త్రీ వాక్పారుష్యము, పలుకుఁ బిల్లదము.

క . వాచః పరుషత గ్రోధం, బాచార విధిజ్ఞ లఘుము లంద్రు కుమారా . భార. అను 4. 114

వాచంయముఁడు సం విణ (అ ఆ అ) మాటల నరికట్టినవాఁడు

వి అ పుం 1 మౌనవ్రత మవలంబించిన సన్యాసి, 2 మౌని.

వాచకము సం విణ (అ చికా అ) 1 చెప్పునది, తెలుపునది, వివరించునది 2. వాచ్యార్థమును దెలుపునది (పదము), 3 నోటఁజెప్పినది, వ్రాఁత మూలముకానిది 4 భావగర్భితమైనది (పదము)

వాచకుఁడు సం వి అ పుం 1 వక్త 2. పారకుఁడు, చదువరి

చ మునికొని పోవకెంతయును ముట్టక నిల్పక భావమున్ రసం,బును వెలయం దగుల్పడక పొందుగ వాక్యవిభాగ మొప్పఁగా, నెనిమిది తానకంబులను నేర్పడి వర్ణము లుల్లసిల్ల నిం,పెనయఁగ వాచకుండు కడునింపగు రీతిఁ బఠింపఁగాఁ దగున్ . (హరి. ఉ 10. 297)

3. రాయబారి, దూత.

వాచనకము సం వి అ. న, కట్టుకథ, విడికథ, కఠిన ప్రశ్న

వాచనము సం వి. అ. న 1 చేదువుట, పఠించుట, చదివించుట 2 కథనము, చెప్పుట

ఉదా , స్వస్తి వాచనము

వాచనికము సం. విణ (అ. కీ. అ) నోటితోఁ జెప్పినది. 2 మాటలతో నయినది

వాచము సం వి అ పుం 1 ఒకజాతిచేఁప. 2. మదన వృక్షము.

వాచేరము వి (√ వాచారు) పరిదేవనము, విలపించుట

సీ వాచాంపం బన వాచరం బనఁగను దేవురిం పనఁగను దేవు ఁ నఁగ, బరఁగుఁ బరిదేవనము... ఆం భా 10 116

వాచేఱచే అ క్రి (వా+చఱచు) నోరు కొట్టుకొను, మొఱ పెట్టుకొను

చ. విఱిగెడు రూపులున్ విఱిగి వ్రేలెడు రూపులుఁ దల్లడిల్లి వా, చఱచెడు రూపులుం గలయఁ జాల్పడు రూపులు నొచ్చి నేలపై, నొఱఁగెడు రూపులుం జెలఁగ నూర్చెడు రూపులవఱ్ఱు ఘుట్టన,న్నలుమగు రూపులుం బ్రధురణంబున నగ్గల మయ్యె నయ్యెడన్ కు సం 11 700

క పావలుఁ జెప్పులుఁ దొడుకొని, దేవ శివాలయములోనఁ ద్రిమ్మరు పాపుల్, వావిడిచి విగళబంధము, తో వాచఱచుచును గాలుదురు నరకాగ్నిన్ శివ సా 291

ద్వి తెట్టపై మూతులువెట్టి యన్నగరి, చుట్టును వాచర్చు శోకంబు లడర .. బస పు 200 పా 10 పం

చ వెఱచినవాని దైన్యమున వేఁదురు నొందినవాని నిద్రమై, మఱచిన వాని సౌఖ్యమున మద్యముఁ ద్రావిన వాని కావు మంచు వాచఱచిన వానిఁ గాములుఁ జంపుట ధర్మముగాదు ఫల్గునా భాగ. 1. 155

వాచేవి విణ (వా+చవి) జిహ్వా ప్రీతికరము

క కీచకుని యింట నెప్పుడు, వాచవి యగు బహువిధంపు వారుణి గలుగున్, వేచని యిచటికిఁ గొని ర,మ్మా చూతముగాని నీ గమనవేగంబున్. భార విరా 2. 89

ఉ వాచవియైన గడ్డిఁదిని వాహినులందు జలంబు ద్రావఁగా .. భాగ 1 420

సీ దర్వీకరస్త్రీలు దన్ను వాచవి చూడగందంబుఁ గొండ చెంగట మఱంచి . పి శకుం 2 132

ద్వి వాచేరఁ బట్టి భూవఁకుమారునకు, వాచవిగా సిద్ధవరుఁడు ద్రాగించి . సారంగ 2. 97. పా. 18 పం.

చ. ఇలు గలనైన వెల్వడని యీలువుటాండ్రకుఁ దాఁపికత్తెవై, యులు కెడలించి శౌరి తను యోగవు వాచవిఁ జూపి మీఁదఁ బెల్లలము వియోగవహ్ని శవదతరసైకత పంక్తి పొంతవం, తలఁ బొరలించి తౌదు శమనస్వస వుగ్రమయూఖనందినీ. ఆము 5 70

**వాచస్పతి** నం వి అ పుం 1 బృహస్పతి, దేవ గురువు 2 పుష్యనక్షత్రము.

**వాచస్పత్యము** నం వి. అ న. వక్తృత్వము, వాక్ప టిమ.

**వాచాలుఁడు** నం విఱ (అ అ అ) వదరుఁబోతు, పనికి మాలిన పెక్కు మాటలు మాటాడెడు వాఁడు.

**వాచారపము** వి (√ వాచారు) పరిదేవనము, విలా పము

సీ వాచారపం బన వాచరం బనఁగను దేవురిం పనఁగను దేవు రనఁగ, బరఁగుఁ బరిదేవనము ఆం భా 1 116

**వాచారు** అ క్రి పరిదేవనముచేయు

ద్వి చనునె మాటలఁ బ్రొద్దు జరుపుచు నిల్వ, ముని తనూజుఁడు జలమ్ములకు వాచారి ద్వి హరిశ్చ పూ. 19 48 పం

క ఈ చిల్లరనేఁతలకే, వాచారెద రోర్వలేక వల దుడుగుడు సానందో 4 28,

దండకము కండలున్, దొబ్బలున్ మాంసముఁ గ్రొవ్వు అందంద వాచారు నానా మహాశాకినీ ఢాకినీభూత భేతాళరింఛోళిన్ బ్రేయుచున్, దశా. 4 232

జ వాచరము, వాచారపము

**వాచాలుఁడు** నం. వి. (అ అ అ) 1 అఱచువాఁడు 2, వాచాటుఁడు, వదరుఁబోతు 3 డంబములు పలుకువాఁడు,

**వాచి** నం విఱ (న్. వి న్) (సమాసాంతమున) చెప్పునది, తెలుపునది.

**వాచించు** నం న క్రి 1 వచించు, చెప్పు

క. ఆ చెలువంబున నది గని, యాచెలువ ప్రియంబు వంద నది గని, వనితా, నేచనిన వార్త విను మి జె, వాచించెద ననుచుఁ గిరవర మిట్లనియెన్. ముకుంద. వి. 3. 14

సీ ఇల్లు మంచములేక వెల్లిప్పిఁ దేలాడ శ్రీనాథుఁ డౌట వాచింప నేల .. చంద్రా 1 23

2 చదువు

మ . శవతుక్కమాని పదివేల్ వర్షాలు జీవించు నెంటక పద్మాంగ్గవయేటఁ జెందుఁ బతిగండం బంచు వాచించివన్ ... చంద్రా 3. 14

(ఈ ప్రయోగము ఇతర గ్రంథముల యందు మృగ్యము )

**వాచికపత్రము** నం వి అ న 1 జాబు, ఉత్తరము 2. వార్తాపత్రిక

**వాచికము** నం విఱ (అ. ఆ ఈ అ) వాక్సంబంధి, మాటలకు సంబంధించినది 2 నోటఁ జెప్పఁబడినది. వి అ న 1 వర్తమానము, చెప్పి పంపిన సమా చారము 2 వార్త, వింతలు

**వాచికహారకుఁడు** నం వి అ పుం రాయబారి, జాబులు తీసికొని పోవువాఁడు.

**వాచూరు** (వా + చూరు) వి ఇంటి ముంజూరు

ద్వి పగడంపు వాచూరు బద్మరాగముల, మొగ డలు ద్వి హరిశ్చ. పూ 176 పం

ద్వి ముత్తెంపు వాచూర మొగడల మంచు, గుత్తంపుఁ జవికెల గ్రొత్త బాగొదన ... నవ నాథ 1 25 పు 12 పం

**వాచోయుక్తి** నం విఱ (ఇ) మాట నేర్పు గలవాఁడు వి ఇ స్త్రీ. మాటలకూర్పు, మాట నేర్పరితనము 2 ఉపన్యాసము, మంచి యుపన్యాసము

**వాచ్యచిత్రము** నం వి అ న అధమ కావ్యభేదము

**వాచ్యత** నం వి. అ స్త్రీ 1 నింద దూఱు. 2 అప కీర్తి, చెడ్డపేరు

**వాచ్యము** నం విఱ (అ ఆ అ) 1 పలుకఁదగినది, చెప్పఁ దగినది 2 వర్ణనఁ జేయఁ దగినది 3 అభి ధాశక్తిచేఁ దెలుపఁ దగ్గది, (వాచ్యార్థము) లక్ష్య వ్యంగ్యార్థ భిన్నమైనది 4. నింద్యమైనది, నిందింపఁ దగినది

వి అ న 1 నింద, దూఱు 2 ఆఖ్యాతము, క్రియ 3 ఆఖ్యాతముచేఁ జెప్పఁబడు భావ, కర్మ కర్తలలో, నొకటి

**వాచ్యార్థము** నం వి అ పుం అభిధాశక్తిచేఁ దెలుపఁ బడ్డయర్థము, లక్ష్యార్థవ్యంగ్యార్థములు శాన్నిధి.

**వాజ** వి. రోఁత, ఏవ.

సీ దేవురించుచు వాజిదేరెడు మొగమును బడబాదు
చుండెడు బడుగు టొడలు హరిశ్చ 4 103

విశ 1 రోఁత పుట్టించునది, ఏవ కలిగించునది

ద్వి ఓజమాలిన వాజి ఘోరి పో[ వాత్యాసిజన్న
మంతయు నేఁడు ఫలించే ద్వి పరమ.
2 132 పా 19. పం

2. మంచిది, యుక్తము

క ఈ జాడ లే మెఱుంగమె, వాజో మాపట్ల చారు
వాకంబు లహా, ల్యాజారుఁడై వ యింద్రున,
కేజీవన మిట్టి పముల కిచ్చట తగునే బలరామ.
1 234. (శా.)

**వాజజము** నం వి అ న 1 ఘృతము 2 కవ్యము, పితృదేవతల కిచ్చెడి యన్నము 3 అన్నము 4 నీరు 5 యజ్ఞమును ముగించు మంత్రము 6 యజ్ఞము 7 బలము 8. ధనము 9. వేగము 10. నెల, మాసము.

**వాజపేయము** నం. వి అ పుం న ఒకానొక యజ్ఞము, యాగవిశేషము

**వాజము** నం. వి. అ పుం 1 ఇల్లు మొదలగు వాని పార్శ్వభాగము. 2 పక్షి ఱెక్క, పక్షియీఁక 3 బాణమునకుఁ గట్టెడియీఁక. 4 యుద్ధము, పోరు. 5 ధ్వని.

న 1 నేయి 2. హవిస్సు. 3 అన్నము 4 నీరు
5 యజ్ఞము 6 యజ్ఞాంతమునఁ బఠించే
మంత్రము 7 బలము. 8. ధనము 9 వేగము
10 నెల

**వాజసని** నం వి ఇ పుం సూర్యుఁడు

**వాజసనుఁడు** నం వి అ పుం 1 విష్ణువు 2. శివుఁడు

**వాజసనేయి** నం. వి న్ పుం 1 యాజ్ఞవల్క్యుఁడు 2 వాజసనేయి, శుక్ల యజుర్వేద శాఖానుసారి

**వాజసనేయుఁడు** నం వి అ పుం = వాజసనేయి

**వాజి** నం. విశ (న్ నీ న్) 1. వేగము గలది వడి గలది 2 బలముగలది

వి న్ పుం 1 గుఱ్ఱము 2 బాణము 3 శుక్ల
యజుర్వేద శాఖానుసారి 4 ఇంద్రుఁడు
5 బృహస్పతి

**వాజిదంతము** నం. వి అ. పుం అడ్డసరము (వృ. వి) (శ. ర.)

**వాజినము** నం వి అ న 1 బలము, వీర్యము 2 యుద్ధము 3 ఆమిక్షానిస్సృతజలము, పాల విఱుగుడు పై నీరు.

**వాజిని** నం వి ఈ స్త్రీ 1 గోడిగ, ఆఁడుగుఱ్ఱము 2 ఉషఃకాలము. ప్రభాతము

**వాజిభక్షము** నం. వి అ. పుం చణకము, సెనగగింజ.

**వాజీకరణము** నం. వి అ. న కామోద్దీపనము, వీర్య వృద్ధికరమయిన యౌషధ విశేషము.

**వాజీకరము** నం. వి (అ ఆ. అ.) కామమును వృద్ధి చేయునది.

**వాటధానుఁడు** నం వి అ పుం భ్రష్టుఁడైన బ్రాహ్మ ణునకు బ్రాహ్మణ స్త్రీ యందుఁ బుట్టిన సంతతి వాఁడు (మనుస్మృతి)

**వాటపడు** (వాటము+పడు.) అ క్రి అనుకూల పడు

తే వారువము నెక్కి మితపరివారుఁ డగుచుఁ,
బోఁటికాండ్రును వడిగల యాటకాండ్రు,
వాటపడి వెంట నరుదేర వేఁటగదలె, మందర
మున కవనిపుఁ డమందగతిని ద్వా. 8. 22

**వాటమగు** అ క్రి (వాటము + అగు) వీలుపడు, వలనుపడు

ఉ మాటల జాగుసేయకుము మన్మథవేదనఁ దాళఁ
జాలనో, పాటలగంధి నీదు కుచపాలికఁ
జేర్పుము తెల్లవాఱినన్, వాటము గాదు దశా
7. 125

**వాటము** విశ 1 ఏటవాలైనది, జాఱువుగా నుండు నది

క కొలఁదికి మీఱిన లక్ష్మికి, నలరెడుభోగంబెరఁబ
యారసి చూడన్, జలపూర్ణతటాకమునకు, నల
వడఁగా వాటమైన యలుఁగుంబోలెన్ .
విక్ర 2. 180

చ వనితకుచాద్రులం బొడమి వాటవుఁ బొక్కిలి
నిండి యుబ్బి జాల్గొని కటిచక్ర మూని మెఱుఁ
గుం దొడలై విరవాసి వచ్చునూ, తన కిరణా
మృతౌఘముల దండహాలాంక పదోత్థితం
బులై, మను మడివోనిగర్భకలమంబులు గావె
... లతాంగి జంఘికల్.. వసు. 2 74.

2 అనుకూలమైనది

ఉ. దోచుకో, నిక్కడ వాటమంచు మది
నెంచఁగ వారికి వక్కడక్కడన్ .. కాశి.
4 66

ఉ. .. సుందరి యేరతి నానచేయునో, వాటము
గాఁగ నారతుల వారక తేల్చెద నంచుఁ బల్కి
గన్ పీఠ. 2 282

మ వడియం బప్పడ మొప్పు నింపువరుగుల్
వాటంపు మారీచపుం, బోడి రా వి.
2 100 యయా 1 49

3 పొందికయయినది

సీ. తెడదవాఁడెఱచి యేర్పడ దవానలు బ్రమింగు
వెడఁదవాటంపుఁ బేరెడఁదవాని ... చంద్రా.
1. 84.

చ. వదలివ్రదిండు తొంటిగతి వాటముగా విరి
యించి మోమునన్, జెదరిన ఘర్మవారిఁ గొన
చేలమునన్ దొలగించి జై భా 2 86.

సీ వాటమే దవనంపుఁ దోఁటకంవ వెలుంగుఁ
దొలఁగిపో నెవ్వరో త్రోసినారు . శుక 1
287.

4. వక్త్రమైనది

గీ. మఱియు నెవ్వరిచిత్త మెత్తెఱఁగునందు,
వాటమై యుండునది యెల్లవలయునట్లు, చేసి
విహరింపుడు : భార ఉద్యో 2 127

గీ. చెలులు చుట్టలు దమ విడిచినను తాను, వారి
విడువంగఁ జాలక వగచుచున్న, వాఁడు
నెయ్యంబు మనమున వాటమైన, దివ్విధం బింత
యును నిదియేమి యొక్కొ మార్కం 6. 22

5. ప్రసిద్ధము

సీ. . ... . ... . . . ...

గీ ... ఇవియె చిహ్నంబులగుఁగాన నిమల పేళ్ళు,
వాటమెయుండు ధర వాని వాని వలన ..
కాశీ 6. 27

సీ. మేటిజూదరియన వాటమై తిపుటమై వాడు
చుండుదు నే నహర్నిశముతు ద్వా 10.88

వి 1 అనుకూల్యము

ఉ, బోటి ప్రియంబుతో నిపుడు వోఁబనిలేదు భుజంగ
భీతిచే, వాటము దప్పెనో . గంధ. 1. 122

2. ప్రదేశము.

చ పెద్దలకును బెద్దయై తనరు తండ్రికిఁ
దక్కువపాటు దెచ్చితిన్. గుల మెరియించితిన్
జననిఁ గూల్చితి శోకములోఁతువాటమున్. హరి
ఉ 7 105

3 పటవాలుతనము, ప్రవణత, అభిముఖ్యము

చ సమముగ మిట్టపల్లములు చక్కగఁ జేయుచు
జట్టినీరు వాటముఁ గని వాల్గువంకల గుదా
రము తెత్తిరి చీనిపట్టుపగ్గములు బిగించి .
వాల్మీకి 8 96

ఉ అతఁ డేటికి రాజసతామసంబులన్, వాటముఁ
బొందె భూధరము వారితమౌ టది యేవిధంబు
భాగ. 9. 429

4 సూటి, నిబ్బరము

ద్వి వాటమై యీమాట వడినమ్మువోలె, నాటి
యున్నది నేఁడు నామనంబునను . హరిశ్చ
ఉ 1475

5 రీతి, విధము

సీ గుడుగువాల్ మబ్బుతాపిడుగు వానకుగట్టు
గొడుగువాటము దాల్చు వడుగువాఁడ ..
ప్రబంధ 1 3

మాలిని. విధిశివసనకాదుల్ వేదము ల్గూడి నిన్నే,
మధుమథన యితం డిమ్మాడ్కి వాఁడంచు
నెన్నన్, విధురు లయినచోటన్ గాఢమోహం,
బుధివడి పడుచున్నాబోఁటి నీవాట మెన్నన్
పాండు. 4 81

జ వాటపడు వాటమగు, వాటముచేయు

వాటము నం వి అ పుం న 1 ఆవరణము, ఆవర
ణము చేయఁబడిన కొంతభూభాగము 2 ఉద్యా
నము, చిన్నతోఁట 3. బాట, మార్గము 4 గజ్జె,
వంతణము 5 ఒక దినుసు ధాన్యము

వాటముచేయు న క్రి (వాటము + చేయు.)

1 అనుకూలపఱుచు.

వ తారకారాజు పఱపు చీటంబు వాటంబు సేయు
లలితకటాక్షవీక్షావిక్షేపమ్ములను హర 5 89.

2 ఓరవాకిలిగా వేయు

వ. నిజకుటీరద్వారంబులకవాటంబులు, వాటంబులు
చేసి చనిన . వి పు. 7. 12.

వాటా వి భాగము, పాలు (వా )

శా నాళీకారికి నొక్కఁజంక నొకయేణం బంజనా కామికిం గాళీకాంతున కొక్క లేడి యిడి యింకంగూడునే మూడువా, టాలుం బెట్టిన చెంగనాలు మము ముట్ట న్రాకుఁడున్ రీతి మీ, రేలా పోయెద రేణులాఁ నిలువుండీ వానుతుం బూవుఁడీ సారంగ 236

(వాటము. సం వి అ పుం అని, శ ర)

**వాటి** సం వి ఈ స్త్రీ 1. ఇంటి స్థలము, వాస్తువు. 2 ఇల్లు, గృహము 3 దొడ్డి, ఆవరణ గలస్థలము 4 ఉద్యానము 5. దారి 6 గజ్జ, 7 ధాన్య విశేషము.

**వాటిక** సం వి అ స్త్రీ. 1 ఇంటి స్థలము వాస్తువు. 2. ఉద్యానము

**వాటు** వి. (√ వైచే) 1 వైచుట (బ వాటులు, వాట్లు)

సీ. ఒక దాయమాడిన నున్న దాయం బాడు మనక వాటులు రెండు గొని చెలంగి ఉ హరి 3 126

వ జుంబెపువాటుగా నీటు గానఁబడ మొకల వెండి గొలుసుల సజ్జగు సజ్జలు ప్రబం 1 78

2 దెబ్బ, హాని

సీ. సుత్తివాటుల వారు లెత్తని సొమ్ము సొంపల రించె నెవ్వాఁడు సాంబునకును శా వి 1 9 (శౌరి యొక పాషాణముతో విచక్రుని వైచెను)

క వాటునన మూర్ఛ వోయెం, బోటరి దైత్యుండు . ఉ హరి 4 235

ఉ. చక్కెర మోవికాటు, దమసానుల చీరల వల్లె వాటు, లేఁ, జెక్కులగోటునీటు, మెయిఁజెల్వగు కీల్జడవాటు శార్జపుం జెక్కు ఘటింపఁ గుంకుమ పటీరకురంగమదాదివాసనల్, సొక్కు బిడ న్నడ న్విటులు సోలుదు రచ్చటి వేశ్యవాటులన్ చంపూ రా 3 67.

సీ పుక్కిటి విడెమీయఁబోయి తిలోత్తమా వనజలోచన ముచ్చెవాట్లు పడియె కువల 1 39

3 విధము

సీ బడవ వాటునఁ జాటుబడ్డఁ బన్గజవిమ్మ కాయ గాచినచెయికాయగాచె,(బడవ = భృత్యుఁడు) ।వబం 755

**వాటుఁగాలు** వి ఔ. (వాటు + కాలు) నడుచునపుడు ప్రక్కవాటుగాఁ బోయెడు కాలు

సీ నరవెంబ్రుకనరాదు నాఁడెల్ల జగడించు వాటుఁగా లనరాదు చేటుఁదెచ్చు శుక 3 21

ద్వి రోటుపోయినచేయి రొమ్ము కంపరవా, వాటుఁ గాలును బోటివలెనున్న నడుము .. ద్వి హరిశ్చ ఉ 1088

**వాటుబల్లెము** వి (వాటు + బల్లెము) పొడుచునట్టి యొకానొక అయుధము, కుంతము

వ . అందంద లతాకుంద బృందంబులకు దూరం బారు నిందిందిరావళి యిందిరానందనుం డిందీ వరగంధులపై వైచువాటు బల్లెం బని చాటుచు .. రా వి 3 114

**వాటురా(జా)యి** వి (వాటు + రాయి) దొంగలు విసరుట కేటి తీసికొనిపోవురాయి

ద్వి ఒలుకుం బూడిదయును వాటు రాలు బస వ 5. 337 పం

ఉ క త్తియు నీలిచీరెయును కంకటిరజ్జువు నార సంబుముల్, గొత్తియు వాటు రాలినుము గొంకియు నకుత లొల్కి బూదియున్ చెన్న 3 294

**వాటులాడు** అ క్రి (వాటులు + ఆడు) కొట్లాడు

సీ కరమొప్ప

ఆ వె ... ప్రణయ, మొదవ సంకులముగనొండొ రుతో వాటు, లాడువారుఁ దన్నులాడువారు, కుమా సం 9 279

చ ఇరువురు నీలనీరజనిభేక్షణ లించిన వేడ్కతోఁ బరస్పర మెదిరించి కాంచనపు బంతులఁ దచ్చనవాటులాడఁగా, ధరణిపుఁ డడ్డమై చనుడుఁ దద్భుజ దండముఁ దాఁకి మిట్టి బిట్టు రవడిఁ జెండు గ్రమ్మఱిన మబ్బరం బోయిరి భామినీ జనుల్ శృ నైష 3 95

ఉ కొంచెపు మంచు పట్టుగతి గుబ్బల మేనలఁ జెక్కులం గదం, బించుచు ఘర్మ బిందువులు పిచ్చిల బంతులవాటు లాడఁగన్. వరాహ. 3 93

**వాట్యపుష్పము** సం వి అ న 1 చందనము;మంచి గంధము 2 కుంకుమ పువ్వు.

**వాట్యము** సం విణ (అ ఆ అ) ఉద్యానవన సంబంధమైనది

**వాట్యాలకము** సం వి. అ పుం ముత్తవ పులగము. (శ. ర)

**వాట్లీఁడు** విణ (వాట్లు+ఈఁడు) దెబ్బలాడువాఁడు, కొట్లాడువాఁడు

గీ వాదులాని తోడ వాట్లీనితోడను, బూతుతోడఁ దిండి పోతుతోడ, నటమటీని తోడ నడియరి తోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు ఉ హరి 3 112

**వాడ**[1] వి (సం వాటః క వాడె.) 1 వీథి

శా . అ,వ్వాడం బౌర జనంబులెల్ల నితఁడెవ్వాఁడో క్కో?[2] నేత్రోత్సవం,బై డాయం జనుదెంచె నంతటను మాయంబయ్యె . కృ నై 3 82

శా ఏడో ద్వీపములేదు వాడలుగ సర్వేలాతలం బెల్లఁ బె,న్వీడై పోఁడిగ నేలుచున్ . భాగ. 9 560

తే గీ వాడఁజను చాకికి ధరించు వలువవైచి, తెట్టు తాఁగట్టు పుట్టంబుఁ గట్టి తనుచుఁ, బొరుగు సతిదాల్చు చీరపైఁ బోరె నొకతె, యధిక మధుమత్తతా వృత్తి నట్టి రాత్రి రా వి 3 15

2 ఇండ్ల వరుస

ద్వి. భూజనంబులు మెచ్చి పొగడు వాడలును, వేడుక మదికొదవించు వీథులును హరిశ్చ పూ. 110

ద్వి. గరుడోరగామర గంధర్వసిద్ధ, వరసతుల్ చెలు లున్న వాడలుచూచి . రం రా సుం కాం 245 పు 3 పం.

తే. గీ కోడలా యింక బంగరు గోడలేల, మేడ లేటికి రతనంపు వాడలేల, మాడలేటికి బలు రాచ జాడలేల, వాడలో నీవు ద్రిమ్మరనోడి చనిన అ రా అయో 9 7

3. వరుస, పంక్తి

వ సహకార మహీరుహంబుల వాడల నీడలఁ గ్రీడలు సలుపుచు వరాహ. 3. 64.

చ హాయము నదల్చి ధేయనుచు నాజికిఁ దోలుట యొండు దోఁచెన, వ్యయరయ శక్తినంత మటి వచ్చిన త్రోవయుఁ బోయినట్టి త్రో,వయు నొకటంగనం బడద వాడలు వాడలుగా నతం డని, క్రియలను జక్కచేసిన హరిద్విరదాదుల చేతఁ దక్కఁగన్ కళాపూ. 8 84

జ వాడకట్టు, వాడవదినె

**వాడ**[2] వి (త. వాడై) తావి, పరిమళము

సీ. పరిమళ వీథులు వాడయంచన మీఱు . ఆం. భా 8 59

జ వాడగన్నేరు, వాడగాలి, వాడపసుపు.

**వాడఁబాఱు** అ క్రి (వాడన్ + పాఱు) మ్లానమగుట కున్ముఖమగు, బడలి పోవుట కున్ముఖమగు

సీ ... ...

గీ చేతనా ప్రాప్తి పొందె, పరసిజాతా యతాఱ తచ్ఛద్దమాత్ర, వాడఁ బాఱిన నస్యంబు వానఁ బోలె . కాశీ 5 184

సీ

గీ కమలవైరి, తన కళాస్ఫూర్తి యంతకంతకుఁ దొలంగ, వరుణదిగ్వేధి కడఁజేరి వాడఁబాఱె... రాజ చ 2 68

ఉ వ,ద్మంబులు వాడఁ బాఱెఁ,గుముదంబులు సొంపున కెక్కెనిక్కుచున్ ద్వా. 4. 922

**వాడకట్టు** వి (వాడ+కట్టు స్వార్థమున) వీథి, వాడ.

సీ . తే మేనమామలు తావలుగాని వానిఁ, గాఁగఁ బూతురు మూ వాడకట్టువారు, కంట గింతురు నన్నంతెఁ గమలజాతు, వ్రాఁత ఫల మేమియో కాని వనజగంధి పొంన. 3 150

**వాడకము** వి (√వాడు) చిల్లరసామానులు అరవుతీసి కొనుట

సీ .. అప్పులిచ్చిన చోట నటమటించిరి డాఁచి కొనిన పత్రంబులు చినిఁగిపోయె, వాడ కంబులు గొన్న వార లేగిరి కోఁట లెల్లను బరులచేఁ గొల్లవోయె శుక 2. 360

**వాడగన్నేరు** వి (వాడ[2]+గన్నేరు) ఒకా నొకచెట్టు, పచ్చపువ్వుల గన్నేరు

ద్వి. బలుసుముల్ మోదుగు వచ్చారె యారె, వలిచంద్రములు చంద్రవాడ గన్నేరు .. ద్వి. శ సా 2 80. పొ. 4. పం.

**వాడగాలి** వి (వాడ[2]+గాలి) మలయ మారుతము. (శ. ర)

**వాడపసుపు** వి (వాడ[2]+పసుపు) పరిమళముగల పసుపు.

గీ. గునియు జార్సిగ చెక్కిటగోరు మోవి, కెంపు లత్తుక నుదురగంధవు చిటులు, వాడ పసుపంటు వలువతో వచ్చినట్టి, పుత్త్రి యిది కాని వడతకు వులుకు గాదె. ప్రబంధ 6. 63

**వాడబము = బాడబము** సం వి అ. పుం. బడబాగ్ని, సముద్రములోపలి నిప్పు

వ. అందు గుఱ్ఱముల సమూహాము, తర్ఫీదుచేయు గుఱ్ఱములుంచఁబడుచోటు

**వాడవదినె** వి. (వాడ[1] + వదినె) జారిణి.

సీ. ఉత్తమాంగముల కెదురాడు దుశ్చారిణి వావివర్తన లేనివాడవదినె, కొండెల గంపలు గూర్చు పాతకురాలు బలిభిక మిడని నిర్భాగ్యురాలు .. (శ్రీ). రం. మా. 5. 34.

సీ. .. గీ. నీకుఁ జరదానతుఁడనైతి నేత్ర జితచ, కోర నన్నిచ్చలో వేలకోరనైతి, వందురాత్మ ప్రవంచకులైన జారు, లెదురు తాకైన నవ్వా తవదినెఁ గూర్చి వేం పంచ 3 252

**వాడించే** న. క్రి. (√ వాడు) మ్లానత నొందించు, వాడఁజేయు.

సీ. ఉస్సని నిగిడించు నూర్పుల బలువేఁడి నించి కెమ్మోవి వాడించు వాని . ఉ రా. 6. 205.

**వాడిక[1]** వి చెప్పకయు చూపకయు ఉంచిన యిల్లడ, ఉపనిధి (శ న.)

**వాడిక[2] = వాడుక** వి. (√వాడు) పోషణము

సీ. ... గీ ... ఈడ విడిచిన మైదీఁగె యింత నయము, గలిగియున్నది వాడిక గలిగెనేని, నెంత వవకమై యుండునో ... కు. సం. 7. 333

**వాడు** (త వాడు) అ. క్రి 1. వడలు, మ్లానమగు.

క పరిమళము నెడదు వాడదు. ఈ కుసుమ రాజ మంబుజవతవా పారి 1 59.

సీ. వానలేని కతాన వాడినత్తుల వలె సకల సస్యం బులు సమసిపోయె . వరాహ 7 52.

సీ. ... ఎండచే వాడిన యెల దీగెయును బోలె నిద్దంపుఁ దనువల్లి నిగ్గు సడల. విక్ర 7 102.

2. అలయు, బడలు.

సీ. నిస్స్వనంబులు రేచి విగుడు కాతర నేత్ర శంబ రంబులు వాడు శరశగండకములు దూలెడు చిత్రకాయ శిలలు .. 3. 111.

రగడ వనిత వనితరులశల యలరుల వాడి వాడితి కొవ్వు ప్రేఁగుఁ . వసు. 3. 149.

3. ఖేదపడు

క. అడినఁ గూడిన కినుకన్, వీడిన జడముడియుఁ బొగలు వెడలెడిచూపుల్, పోఁడిమిగొను నిట్టూర్పులు, వాడినడెందమును మేనవడియుఁ జెమరునై. పాండు 5. 204

చ. వరుణుఁడు విప్రయోగమున వాడదె . నైష. 4 65.

సీ . గీ ఇతరసుమనస్సులార మీ రిటులవాడి, యుండ నేటికి నామోదముడిగి యనిన.. దశా. 2. 75

(ఇది 1. 3 అర్థములకుదాహరణము )

4. ఎండ, శుష్కించు.

ద్వి వెలయ వసంతమవ్వేళ నెల్లెడలఁ, గలయంగఁ బదనింకి కడపళ్ళువాడి, జిగిదప్పి చెఱఁగులు చిరు బీటలెత్తి పగులుచు బిరుసనై పలఁకిన వాట. నవనాథ 1. ఆ. 11. పు. 5. పం.

స క్రి 2. ఉపయోగించు.

ఉ పాల్పెరుగు నెయ్యిని వాడెడు కోడె కాంద్రపై, వెన్నెల సోగలీన(న్) రా. వి. 2 61

రగడ నాము కుముద దామకంబు వాడ వాడ వైతి నౌనె ... వరాహ 3. 92

సీ. కన్నంబుఁ ద్రవ్వు తస్కరుఁ డింటి వారికి వాత లేదని మంతవైచి చనునె . రామ. లిం 30.

2. చెప్పు, వచించే

ఉ అప్పుడు యౌవనాళ్య మతుఁడైన సువేగుఁడు కీచకాంతకున్, దప్పక చూచి తానును గదా ఘునదండము కేలఁ గ్రాలఁగాఁ, ద్రిప్పుచుఁ దేరు డిగ్గి పఱతెంచి పడిందన పేరువాడినా, తప్పక వ్రేసె నొక్క మొగఁదార్కొని భీముశిరంబు వక్షమున్ జై భా. 2 79

సీ. . అర్చుచుఁ బేర్వాడి యదలింపుచుఁ గడంక నెఱపుచు బుజేములు నఱచు కొనుచు అ రా. యు. 195

సీ. గంధర్వ పతులు చొక్కపు పాట వాడిరి వాడిరి తర్పవర్యవార్త మయుబు... చంద్రి. 3. 148.

3 గౌరవించు, సన్మానించు.

ఉ ఆడిక లైన నేమి మగఁడాఁడఁ బెట్టిన నేమి చుట్టము ల్వాడిక యున్న నేమి పరివారలు నవ్విననేమి . . శశాం 4 37

4 చేకూఁ బఱుచు, చేకూఁ బెట్టు.

క. అలన యిలువాడి నాథుఁడు, వలచినచవి వంటకములు వండి యిడి .. భార అను 5. 290

చ ధన రహితుండు పుత్త్రి సముదాయ సమేతుఁ డుపాయశూన్యవర్తనుఁ డరయంగ వాడ్వి జుఁడు క్షత్త్రియ భామయు బుద్ధిహీన జీవన మొనరింప నేర దిలువాడ నెఱుఁగదు .. భోజరా 2. 4

5 అలుక

క. ఇలువాడి మ్రుగ్గిలిడి కూరలు గూర్లమరించి యేల రాడాయెనొకో, వెలలెం బ్రొద్దని యటనీ, చెలియలు నేఁడెదురు చూచు సేవించుటకున్ వేం పంచ 4. 56

వి 1 వాడుట వడలుట

సీ . చిత్తంబు తలపోఁతచే వాడు పొదివినఁ జెలువ నీ నెమ్మోము చిన్నఁబోయె .. భార. విరా. 2 156

సీ. వక్షస్థలంబున వైచిన నవకంబుఁ దులసి దండకు వాడు దోఁపకుండ హర. 6 45

2. కలవు

సీ. తే. దుక్కిలో నుండి మనరాచ చిక్కుజేని, యక్కఱకుఁ బట్టినట్టి యా యేనుఁగుఁబట్టి, బెండ్లి యాడంగ నేతెంచు పిన్న యతఁడు, చూడఁగద రమ్మ కన్నులవాడు దీఱ బహు 4 82. చంద్ర 4 94

నులివాడులువాడు = ఇంచుక వాడు

క. కలహమున సురలు దొరకొను, ప్రళయావల రూపము దిరిపడి యొక్కొకమా, ర్దలచిన మీనలు గడ్డము,నులివాడులు వాడుచుండు నొందినభీతిన్. కు సం 10 466

జ : వాడఁబాఱు, వాడకము, వాడించు, వాడిక², వాడుక, వాడుకపడు, వాడుకొను, వాడుచు, వాడుదల, వాడుదెంచు, వాడుదేఱు, వాడుపడు, వాడుపఱచు, వాడువాఱు

**వాడుక** వి. (√ వాడు) 1 ఉపయోగము 2 వ్యవహారము
(ఉదా నన్నె చోడుని కాలములో ఈ పదములు వాడుకలోఁ గలవు)
3 అభ్యాసము, అలవాటు.

ద్వి కేవల సాధనకృతి బాహ్యపూజ, వాడుకయై యుండ వసుధ నందఱకు,కూడ నంతఃపూజ గురుకృప లేక ప్రభు(లిం) + 4. అ 117 పా 19 పం

సీ పుట్టు జున్నంగల్లఁ బెట్టించు వాడుక కోమట్లు మాకెల్ల గొడ్లు సుమ్ము సారంగ. 1 78

**వాడుకపడు** అ క్రి (వాడుక+పడు) అలవడు, పనుపడు (శ ర , వా)

**వాడుకొను** స క్రి (వాడు+కొను) 1. (జనులు ప్రచారముగా) చెప్పుకొను 2 ఉపయోగ పఱచుకొను (శ ర)

**వాడుచు** స క్రి (√ వాడు) వాడఁజేయు, వాడించు (శ ర.)

**వాడుదల** వి (√ వాడు) వాడుక,అభ్యాసము (శ.ర.)

**వాడుదెంచు** అ క్రి (వాడు+తెంచు, స్వార్థమున) మ్లానమగు

సీ ... పగలింటి సెగలచే సొగటొందు పూఁ దీఁగె వడువున నెమ్మేను వాడుదెంచె ... అని. 3. 121

**వాడుదేఱు** అ క్రి (వాడు + తేఱు స్వార్థమున) వాడు

ఉ. నీటను దేమయొక్క సనినిల్చి యొకించుక వాడుదేఱియ, ప్పాటున వేరువాఱి ధృతి పాటవ మొప్ప నతండొనర్చు న,ప్పాటునఁ జెమ్మమీఱి పరిపాటిగఁ గెంజిగు రక్కడక్కడన్, మోటిక లెత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గలమయ్యె నయ్యెడన్. విప్ర. 2 23.

న . వాడు దేఱెడి నమ్మోములును .... కళా 6 224

**వాడుపడు** అ క్రి. (వాడు + పడు) వాడు, మ్లానమగు. (చూ. వాడు పఱుచు)

**వాడుపఱుచు** స. క్రి (√ వాడుపడు)వాడఁజేయు.

సీ .. వెలలేని కళలతో వెలయు నీ నెమ్మోము
వనితయే వికలుండు వాడుపఱిచె ఉ రా
4 227

వాడువాఱు అ క్రి (వాడు + వాఱు) వాడు, వాడు పడు

సీ కదుపుతోఁ బాసిన కోదమ జింకయుఁ బోలె
వాడు వాఱిన నవవల్లిఁ బోలె .. భా. రా.
యు 2 287.

సీ తొలుకారు మెఱుఁగుఁ దీఁగెల నేలు కన్నులు
వడఁవాఁకి యొక్కింత వాడు వాఱ . . కాశీ
1 90.

సీ లవలీదళము లట్ల సవరైన చెక్కులు వాడు
వాఱఁగ ముద్దులాడియాడి ఉ. రా 4
217

వాడె వి ఇత్వ్యగ్రము, దవ్వ

సీ . చెరివిన పూవులు చే నంట నిచ్చిన వాడెలు
గూర్చిన భద్రకాళిఁ బంపిన ప్రబంధ 1.
738.

సీ వాడె దవయన నిత్వ్యగ్ర మొప్పు . ఆం భా
2 75

ఆ. .. తవరు దవ యనంగఁ దల వాడె నాఁగఁద,
దగ్రమున కభిఖ్యలగు గిరీశ . ఆం సం స్థా 9.

గీ పలుల నిత్వ్యగ్రమిల దవవాడె యనఁగ .
ఆంధ్రపదాకరము అచర 66

వాణి నం వి ఈ స్త్రీ 1 వాక్కు, పలుకు, విద్య 2 భాషాశక్తి, వాక్పటుత్వము 3 ధ్వని. 4 కృతి, గ్రంథము 5 స్తుతి, పొగడ్త 6 సరస్వతీ దేవి

ఇ స్త్రీ 1. నేఁతనేయుట 2 సాలీని మగ్గము నందలి తాకుడు పలక, వాయదండము 3. వాక్కు, పలుకు, విద్య 4 సరస్వతి.

వాణిజకుఁడు నం వి అ పుం 1 వ్యాపారి, బేహారి. 2. శరుఁడు, దుష్టుఁడు (అ ని)

వాణిజుఁడు నం. వి. అ పుం వ్యాపారి, బేహారి.

వాణిజ్యము నం వి. అ. న వ్యాపారము, బేహారము, వర్తకము ఆము 4. 245.

వాణిని నం వి ఈ స్త్రీ 1. నేర్పరి యైన యాఁడుది. 2 నర్తకి, ఆటకత్తె 3 మత్తిల్లిన స్త్రీ, కామాతుర యగు స్త్రీ.

వాత్య నం వి ఋ పుం వీచునది, గాలి, వాయువు.

వాతకము నం వి అ పుం వృక్ష విశేషము, సోమిదపుచెట్టు

వాతకర్మము నం న్ న అపాన వాయువును విడుచుట, పిత్తు

వాతకానివాఁడు వి బట్టలకు రంగు వేయువాఁడు. (శ ర)

వాతకి నం విఇ (న్ నీ న్.) వాత రోగము గల వాఁడు.

వాతకుండలిక నం వి ఆ స్త్రీ మూత్రరోగ విశేషము, మూత్రము తక్కువగాను బాధతోను గాఱుట

వాతకుంభము నం వి. అ పుం ఏనుఁగు నొసటిపై బుడిపి

వాతకుఁడు నం వి అ పుం జారుఁడు, ఉపపతి

వాతకేతువు నం వి ఉ పుం ధూళి, దుమ్ము.

వాతకేళి నం వి ఇ పుం 1 శృంగార సల్లాపము, కాముకుల గుసగుసలు, 2. నాయికా నాయకుల శరీరము మీఁది నఖక్షతము

వాతగుల్మము నం వి అ పుం 1 పెనుగాలి, ప్రచండ వాయువు 2 వాతరోగ విశేషము, వాత నిమిత్తకమైన గుల్మరోగము

వాతఘ్ని నం వి ఈ. స్త్రీ. పులుగండు (వ్యు. వి. (శ ర) (పుమ.)

వాతచక్రము నం వి అ న గాలిసుడి, ఇది శుభా శుభములను దెలుపును.

వాతజ్వరము నం వి అ పుం చెడిన వాతధాతువు వలనఁ గలిగిన జ్వరము

వాతదొమ్మ మి వి (వాతము + దొమ్మ) ఒక విధమైన పశురోగ విశేషము.

క. చావవి సోలెండడ్డెడు, తానకముగ గోవు పంచి
తంబును గూడన్, మానుగఁ గడుపున నిడినను,
ధేనువులకు వాత దొమ్మ తెప్పున వడఁగున్.
సహదేవశిక్ష 1. 12. (చి ని)

వాతధూద నం. వి. ఆ స్త్రీ. 1 పెనుగాలి, ప్రచండ వాయువు. 2 తీవ్రమైన వాతరోగము. 3. ఒక విధమైన స్ఫోటకము, మసూచికా రోగభేదము. 4. మనోజ్ఞురాలగు స్త్రీ

వాతధ్వజము సం వి అ. పుం 1 మేఘము, మబ్బు 2. ధూళి, దుమ్ము

వాతపిత్తము సం వి అ న. ఒకవిధమగు వాత రోగము.

వాతపుత్రుఁడు సం. వి అ పుం 1 శఠుఁడు, దుష్టుఁడు 2 భీముఁడు 3 హనుమంతుఁడు

వాతపోథ(క)ము సం. వి అ పుం పలాశము, మోదుగు చెట్టు

వాతప్పు అ క్రి (వా+తప్పు) 1 మాట పొరపాటు నొందు, మాట పొరఁబడు

ఉ .. దురాశల మాయలాఁడి వా,తప్పక యిఁకఁ దత్తదుచితంపుఁ గుయుక్తుల మాట లెన్నియే, ప్పొప్పుగ నాడుకో నెఱుఁగకుండనె యిట్టిది చెప్ప నేటికిన్ కళా 3 198.

క అప్పురి సౌధములం గల, యెప్పును బొడవును దనర్పు నూహించుచు వా, తప్పఁడె కల రూపెల్లను, జెప్పెడుచో రెండువేల జిహ్వల వాఁడున్... విక్ర 1 68.

క ఇప్పుడు నను నీ వడిగిన, చొప్పున నేత్రద్రహస్య సూత్రంబులు వాఁ,తప్పక ప్రశ్న మొనర్చినఁ, జెప్పితి వినుతత్కథా విశేషము లనఘా ... వి. పు 4 107

2 పొరపడు, ప్రమాదము నొందు

ఉ అప్పుడు యౌవనాశ్వసుతుఁడైన సువేగుఁడు కీచకాంతకున్, దప్పక చూచి తానునుగదాఘన దండము కేలఁ గ్రాలఁగాఁ, ద్రిప్పుచుఁ దేరు డిగ్గి పఱతెంచి వడిం దన పేరు వాడివా, తప్పక వ్రేసె నొక్క మొగిఁ దార్కొని భీము శిరంబు వక్షమున్ జై 2. 79.

3 మాట పొరపాటు

ఉ తప్పు గణించికా దొరలు దండన సేయుదు రొద్ది వారి వా,తప్పున కల్గి మంది కలదాన నటంచును మారు మాపులన్, గుప్పితి పీవు ఉ రా. 6 105

సీ. గి . తన వచోదోషము క్షమింపుమనెడు వాఁడె, యేమనిన లేని వాత్తప్పు లెంచసాగె . కువల 2. 24

వాతప్రమి సం. వి ఈ. పుం. స్త్రీ వడిగల జింక

వాతమండలి సం వి ఈ స్త్రీ సుడిగాలి,

వాతమజము సం వి అ పుం వడిగల జింక

వాతము సం విశ (అ ఆ అ) 1 ఊఁదఁబడినది 2 కోరఁబడినది

వి అ పుం 1 గాలి 2 వాయుదేవుఁడు. 3 వాత పిత్త శ్లేష్మములలో నొకధాతువు. 4 వాత రోగము 5 కీళ్ల నొప్పి, సంధులవాపు

వాతమృగము సం వి అ పుం వడిగల జింక

వాతరంగము సం వి అ పుం రావిచెట్టు.

వాతరక్తము సం వి అ న రోగ విశేషము

వాతరట్టు వి (√వాయి) వదరుపోతు.

సీ ఎంచఁగా మీ జాతి కొంచెపు వడకరి వసుధ నెన్నఁగ మీరు వాత రట్లు, తెలియంగ మీ కూట ములు వేళ కొలఁదులు చూడ మీరలుగండి చోరవకాండ్రు ...

(ఇది రాయంచల విషయము) .. చంద్రాంగ. 4. 61

ద్వి పెలుచఁ గోవెలయన్నఁ దెంపుడుఁ జేయ, కెలయు కిరంబు మిక్కిలి వాత రట్టు, తలపోయ వట తుమ్మెదలు గూడ గొంట్లు .. ద్వి. పరమ 3 247. పొ

వాతరము సం. విశ (అ. అ అ) 1 పెనుగాలిగలది, తుపాను గలది 2 వేగము గలది, వడి గలది.

వాతరాయణము సం వి అ పుం 1. బాణము, 2 వింటిదెబ్బ. 3. పర్వత శిఖరము, కొండ కొన. 4 అంపము, క్రకచము. 5 సరల వృక్షము, దేవ దారువు. (వృ వి)

వాతరాయణుఁడు సం వి. అ పుం 1. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు 2 సోమరి, అలసుఁడు.

వాతరూపము సం వి అ. పుం 1, పెనుగాలి 2 ఇంద్రధనుస్సు. 3 లంచము. (మే ని )

వాతరోగము సం వి అ. పుం వాతధాత్వాధిక్యము వలనఁ గలుగు రోగము.

వాతర్థి సం వి ఇ స్త్రీ (వాత+ఋద్ధి) 1 వాతాతి శయము, ఎక్కువ గాలి. 2 దుడ్డుకఱ్ఱ, ఇనుపదుడ్డు.

వాతలము సం విశ. (అ ఈ అ ) 1 పెనుగాలి గలది తుపాను గలది. 2 ఉబ్బినది

వి అ పుం 1. గాలి, వాయువు, చణకము, సెనగ

వాతవస్తి నం వి ఇ స్త్రీ మూత్రనిరోధము.
వాతవృద్ధి నం వి ఇ స్త్రీ వాచినయండము, అండవృద్ధి
వాతవైరి విశ వి న్ పుం ఆముదపుఁ జెట్టు
వాతశీర్షము నం. వి. అ. న పొత్తికడుపు.
వాతశూలము నం వి అ న రోగభేదము ఉబ్బుతోఁ గూడిన కడుపునొప్పి.
వాతసహుఁడు నం విశ (అ అ అ) వాతరోగము గలవాఁడు,
వాతసారథి నం, వి ఇ. పుం అగ్ని.
వాతాండము నం వి అ పుం వృషణరోగము, వృషణములు పెద్దవగుట
వాతాటము నం వి అ పుం 1 వాతమృగము, జింక, 2 సూర్యాశ్వము
వాతాతిసారము నం వి అ పుం. వాతధాతువు చెడుట వలనఁ గలిగెడి గ్రహణి, రోగవిశేషము
వాతాదము నం వి అ. పుం బాదాముచెట్టు.
వాతాపి నం వి. ఇ పుం అగస్త్యునిచే మ్రింగఁబడి జీర్ణింపఁజేసికొనఁబడిన యొక రాక్షసుఁడు, (ఇల్వలుని సోదరుడు)
వాతాపిసూదనుఁడు నం. వి అ పుం అగస్త్యుడు
వాతాప్యము నం వి. అ. న 2 పు లి యు ట, 2. సోమము 3. నీరు
వాతామోద నం వి అ స్త్రీ కస్తూరి
వాతాయనము నం వి అ పుం గుఱ్ఱము న 1. గవాక్షము, కిటికి 2 తలవాకిటి వసారా, 3 మండపము
వాతాయనము నం. వి అ న. వర్ణము, ఆకు
వాతాయువు నం వి ఉ పుం. వడిగల జింక, వాతమృగము, జింక
వాతారి నం వి ఇ పుం 1 ఆముదపుచెట్టు. 2. శతమూలి = పిల్లి తేగలు (వృ వి) శేఫాలిక = శాలిచెట్టు (వృ వి.) యవాని = ఓమము (వాము) (వృ వి.) భార్గి = గంటు బారంగి (వృ. వి) స్నుహి = జెముడు. (వృ వి) విడంగ = వాయువిడంగములు శూరసణ = కూరకంద (వృ. వి) జతుక = పద్మావతి. (వృ వి.)
వాతాలి నం వి ఇ. ఈ. స్త్రీ. సుడిగాలి.
వాతాశ్వము నం వి అ, పుం. వడిగల గుఱ్ఱము
వాతాహతి నం వి ఇ. స్త్రీ 1. గాలిదెబ్బ 2 ప్రబలవాయువు.
వాతి నం వి ఇ పుం. 1. సూర్యుడు, 2. గాలి 3. చంద్రుఁడు (విల్యమ్సు)
వాతికము నం విశ (అ ఈ అ) 1 పెనుగాలి గలది, తుపాను గలది, 2. వాతరోగము గలది. 3 వెఱ్ఱిది. ఉన్మత్తము
వి అ. పుం వాతదోషము వలనఁ గలిగిన జ్వరము.
వాతికాసు వి. (వాయి + కాసు) 1. వాతిపాతిక. (గ్రా) 2 అంచేము. (శ. ర.)
వాతిగణము నం వి అ. పుం వంగచెట్టు, వంగకాయ.
వాతిగమము నం వి అ పుం. వంగచెట్టు, ఇట్లే వాతిగము
వాతిగముఁడు నం వి అ పుం. ఖనిజ శాస్త్రజ్ఞుఁడు, ఇట్లే వాతిగుఁడు
వాతిపాతిక వి. (వాయి + పాతిక) చితియందుంచిన శవమునోట వేయుబంగారము
ద్వి. వసుధామరునిఁ గాంచి వదలక వేఁడి, వలయుమాడయు మఱి వాతిపాతికయు, వల నొప్పఁగొనిరమ్మ వడి నిట కనిన ... హరిశ్చ 2261. పం.
వాతిబియ్యము వి. (√వాయి) దహనము చేయునపుడు పీనుఁగు నోట వేసెడి బియ్యము.(శ ర, గ్రా.)
వాతివాడి వి (√వాయి) వాక్పారుష్యము గల స్త్రీ.
మ సుర సేవించినవాతి వాడియయినన్ సొమ్మెల్లఁ గోనాడినం, బురుషద్వేషిణియైన గొడ్డయిన నెప్డుం గూఁతులం గన్నమైఁ, బరపారోగము లున్న ధూర్తయయినన్ భార్యం బెడంబాసి య,ప్పురుషుం డొం డొకపెండ్లి యాడినను నొప్పుందప్పు లే దేమియున్ విజ్ఞా. 1 .118.
వాతవాడి. (శ. ర పా)
వాతీయము నం విశ (అ. అ అ.) పెనుగాలి గలది.
వి. అ న కాంజకము, గంజి,
వాతుఁడు నం. వి. అ పుం. 1 ధృష్ట నాయకుఁడు. 2 వాయుదేవుడు
వాతులము నం. వి, అ. పుం. సుడిగాలి.
వాతులి నం. వి. ఇ పుం పెద్ద గబ్బిలము.
వాతూలము = వాతులము; వాతులుఁడు.

**వాతూ(తు)లుఁడు** సం విణ (అ ఆ అ) 1 వాత రోగముగలవాఁడు 2 వెఱ్ఱివాఁడు, ఉన్మత్తుఁడు
వి. అ పుం సుడిగాలి.
మ దుర్వారాద్భుతాసారముల్, వడగండ్లుం జెరయంగఁ దీవ్రవిసరద్వాతూలుతోఁగూడి దం, దడిఁ దోడ్తోడఁ బ్రవృద్ధిఁబొంది ... పారి పూ 7 164

**వాతెర(ఱ)** వి (వాయి + తెర) రదనచ్ఛదనము, పెదవి
క గురివెంద చైత్రుఁ డొందఁగఁ, గరములు కన్నాతి యవుడుకఱచినను వా, తెరమీఁదఁ గాననగు పలు, వరుసయన న్ననలు పల్లవముపై తొనసెన్ పారి 3. 48
సీ తెలిదమ్మివిరియింటి తెలిగంటికెంపు వాతెర సొంపె పవడంపుఁ దీఁగెగుంపు దశా 1 164
చ సెఱి గురులున్ విలోలసిత నేత్రయుగంబును నొప్పు తెప్పవా, తెఱయును .. భార ఆది. 7 73
క. పలుచేని వా తెఱ మెఱుఁగునఁ, బలు మెఱుఁగులు సందడింప .. మనుచ 4. 70

**వాత్య** సం వి ఆ స్త్రీ వాత సమూహము, సుడిగాలి, పెనుగాలి, తుపాను

**వాత్సకము** సం వి అ న వత్ససమూహము, దూడల గుంపు

**వాత్సల్యము** సం వి అ న 1 (పుత్రాది విషయక) ప్రేమము. 2. ప్రేమము, స్నేహము, చెలిమి 3 అత్యంత ప్రేమము, దయ.

**వాత్సి** సం వి ఇ ఈ స్త్రీ బ్రాహ్మణునకు శూద్ర స్త్రీ యందుఁ బుట్టిన కూతురు.

**వాత్స్యాయనుఁడు** సం వి అ. పుం 1 కామసూత్రములు రచించిన యొకానొక ఋషి 2 గౌతమ న్యాయసూత్రములకు భాష్యము రచించిన యొక ముని

**వాద** వి (వ వాద) జలాశయము, నీటిపట్టు
తే. ముంచుకొను వాదనీరుల మునిఁగి మునిఁగి, గుళ్లగుళ్లను వేల్పులఁ గొలిచి కొలిచి, భాత మాటలుబట్టి ఛాందసముబట్టి, యలయుచే కాని పావంబు తొలఁగదయ్యె శ్రీరం మా. 5 112

**వాదకుఁడు** సం వి అ పుం 1 గాయకుఁడు, సంగీతము పాడువాఁడు 2 వక్త, ఉపన్యాసకుఁడు

**వాదడుచు** అ క్రి (వాదు + అడుచు) వివాదపడు.
క. ఒక్కయెడం దమలో నొక, టొక్కకు వాదడిచి శశకము కపిఁజలముం, గ్రక్కునఁ బఱతెంచి పులికి, మ్రొక్కుచు నిజవాద మిరువురుం జెప్పుటయున్ కేయూర 2 91
క ఊరక పుడకలు విఱుచుట, వైరంబున నోరుల తోడ వాదడచుట దు, ర్వారగతిఁ బరువు వాఱుట, గోరన్ గో రొలుచుటెల్లఁ గొఱ గాదుసుమీ వి పు 4. 233.

**వాదనము** సం వి అ న 1 వాయించుట 2 వీణ మొదలగు సాధనములమీఁద పాడెడి పాట

**వాదము** సం వి. అ పుం 1 పలుకుట, చెప్పుట 2 మాట, పలుకు, 3 రూఢిగాఁ జెప్పఁబడిన సంగతి 4 కథ, చరిత్రము 5 వాదించుట, పరస్పర వ్యతిరేక భావములు తెలుపుట 6 సమాధానము, ప్రత్యుత్తరము 7 వివరణము స్పష్టపఱచుట 8 సిద్ధాంతము, వాదానంతరము నిర్ణయించిన విషయము 9 ధ్వని, చప్పుడు 10 కింవదంతి, జనప్రతీతి 11 ఫిర్యాదు, అభియోగము, తగవు

**వాదయుద్ధము** సం వి. అ న పట్టుదలతో వాదము చేయుట

**వాదర** వి (వాడి + ధార) (ఖడ్గాదుల) తీక్ష్ణధార.
వ ... అంతకంతకు నెఱ్ఱడగుకోపంబున నాటోపంబు దీపింప వాదరఁ జిక్కిన యొముకతును కలు గోఱ దౌడలకై వడి గలిగి భార. సౌప్తి. 1. 176.

**వాదర** సం వి అ స్త్రీ. ప్రత్తిచెట్టు

**వాదరంగము** సం. వి అ. పుం అశ్వత్థ వృక్షము, రావిచెట్టు.

**వాదరతుఁడు** సం. విణ (అ ఆ అ) వాదమునం దాసక్తిగలవాఁడు

**వాదరము** సం. విణ (అ ఆ అ) దూదిగలది, లేక దూదితోఁ జేయఁబడినది
వి అ న దూదిబట్ట

**వాదరి** విశ (వాదు+అరి²) జల్పాకుఁడు, వదరుబోతు

మ. ఊమతో మంద భయస్థుఁ డంౘు కినియన్ గయ్యాళివాఁడంౘు మౌనమిడన్ మూఁగ యటంౘు వాక్పటిమచెందన్ వాదరిం చంౘు పార్శ్వమున న్నిల్వ మదాంధుఁ డంౘు . నుల్లభూ నీతి 47

**వాదవాది** నం వి న్ పుం జైమఁడు

**వాదసాధనము** నం వి అ న వాదమును సాధించుట, చెప్పినదానిని నిలబెట్టుకొనుట.

**వాదాడు** అ క్రి (వాదు+ఆడు) వాదించు.

మ మనకీపాటులువచ్చెఁ జూచితిరె నామాటల్ వృథా వాంశ్రుతిన్, విడఁగానొల్లకయల్ల రాత్రి యిచట న్నిరెల్లవాదాడ యుంచిన యాకాకము రెట్టలో మొలిచె హెచ్చెంజూవె యీమట్టి . కేయూర 3. 48

**వాదానువాదములు** నం వి అ. పుం. ద్వి 1. ఒక విషయమును జెప్పుటయు దానిని ఖండించుటయు, వాద ప్రతివాదములు. 2 పరస్పర వ్యతిరేకాభిప్రాయములు దెలుపుట

**వాది** నం. విశ. (న్ నీ న్ ) 1 పలుకువాఁడు, సంభాషించువాఁడు. 2. స్థిరముగాఁ జెప్పువాఁడు. 3 వాదించువాఁడు

వి న్. పుం 1 వక్త, ఉపన్యాసకుఁడు 2 ప్రతివాది, ప్రతిపక్షుఁడు 3 అభియోగము తెచ్చిన వాఁడు, నేరము మోపినవాఁడు 4. బోధించు వాఁడు, ఉపాధ్యాయుఁడు 5. (వీణ) మెట్టు

**వాదించు** నం అ క్రి (√ వాదు) 1 వాదాడు. 2. తగవాడు. (శ ర.)

తే ఒండొకఁడవైన నిపుడ నీపిండి యిడమె, బ్రాహ్మణుఁడవౌట మాచేత బ్రదుకుఁ గంటి. తడవఁబనిలేదు నిన్ను గౌతమునిగోవ,వనుచు వాదించి విడిచిన నాగ్రహించి, మనుచ 4 90.

**వాదితము** నం విశ (అ ఆ. అ) 1 పలికింపఁబడినది 2. వాయింపఁబడినది, ప్రయోగింపఁ బడినది

**వాదిత్రగణము** నం వి అ పుం సంగీతపు మేళము, మృదంగాది వాయిద్యముల వాయించువారి మేళము

**వాదిత్రము** నం వి అ న 1 తతము, అనద్ధము, సుషిరము, ఘనము, అను వాద్యచతుష్టయము వీణాగానము మొదలగునది

**వాదు** వి. (నం వాదః) 1. వాదము, వాక్కలహము

గీ ఒలసి నీపుత్రులెల్ల నొండొరులతోడ, నెట్లొ డంబడి యుండుదు రట్లు చేయ, వలయుఁ దమలోన జూదంబు వాదు నగుటఁ, గలహమూలంబ యెట్టి శాంతులకునైన భార సభా 2, 181

ఉ వాదున గెల్వలేక పురవైరి లలాటము కన్నుఁ జూపఁ దాఁ, బాదమునందుఁ గన్ను ప్రతిపక్షుతఁ జూపెను ... ప్రభా. 1 12

సీ వాదనఁగ వాదంబు చెలఁగు . అ భా, 1 113

2 కలహము

వ . విష్ణుఁడు సర్వలోకగురుఁడు, తత్పత్ని హారణంబు కొంటగాదు, వాదులు ప్రోదులు చేయుమునిముచ్చు బోధనంబులు వినంబనిలే దని చెప్పు . వరాహ 11 57.

3 మాట

క కాదేని చేతిరోకట, వాదులువారించి లెస్స వడ్డించినచో, నీ దిక్కున నీ కెవ్వరు, రా దిక్కని పల్కనవ్వి యతఁడిట్లనియెన్ విప్ర. 4 60

4. నింద

దండకము . మముం జేరనీఁడే నిమం జేరరాఁడే ప్రవేశింపరాడే ప్రమోషింప వాదే ... భోగినీ దండకము

విశ అసత్యము, కల్ల.

క వ దెసఁ జూచిన నాదెస, నాదృష్టికిఁ దావయగుచు నామది నెపుడున్, వైదేహి పాయదొండెడ, వైదేహిం గంటి మనుట వాదో నిజమో భా. రా. సుంద 564

జ వాదడుచు, వాదరి, వాదాడు, వాదించు, వాదుకుఁబోవు, వాదుగొను, వాదుపెండేరము, వాదులాఁడు, వాదులాడు, వాదువెట్టు

**వాదు(ల)కుఁబోవు** అ. క్రి. (వాదులకు + పోవు) వాక్కలహముచేయు.

ఉ కారణ మేమి లేకయె వికావిక నవ్వును నిర్ని మిత్తమె, వ్వారంల నై వనుం బిలిచి వాదుకుఁ బోవుమ . సీధురస విభ్రమయైవమ్మగాడి య త్తటిన్ కవిరా 5 186

సీ అతని నెవ్వరు దూఱనాడిన వారితోఁ జెల పట్టి వట్టివాదులకుఁ బోదు ... కువల 4.190

వాదుగొను స క్రి (వాదు+కొను) నిందపడు

క ప్రోదిఁ గొనదగిన పుష్పఫలాదుల గొడ్డట ప్రచ్చి యవనిజము నెడన్, వాదుగొనునల్ల ఘూర్జణ, బాధించిన నేల కలుగు పలికరి గోరుల్ కవిక. 2. 17

వాదుపెండేరము వి (వాదు+పెండేరము) వివాద మున గెలుపును సూచించు బిరుదు చిహ్నము

ద్వి అలస యానముల రాయంచలం గెలిచి, పెలుచఁ బెట్టిన వాదుపెండేర మనఁగఁ, గమ లాప్త బింబంబుగతి నొప్పు మణుల, రమణీయ మగు నూపురము బొందుపఱచి ద్వి పరమ 5 430 పొ

వాదులాఁడు వి (వాదులు+వాఁడు) వాదమాడు వాఁడు, వాదించువాఁడు.

అ. వాదులానితోడ వాళ్లేనితోడను, బూతు తోడ తిండిబోతుతోడ, నటమటీనితోడ వడియరి తోడను, వెలతు నెత్తమాడ వెరవుగాదు ఉ హరి 3 112

వాదులాడు అ క్రి (వాదులు+ఆడు) వివాదము చేయు

ఉత్సాహ ... ఈయన నవుం బరాకుపఱచి యాట గెలుపు తనదిగా, వెనుక వాదులాడ నేను విసఁగఁ జాలనని తగన్ . కళా 6 118.

వాదువెట్టు (వాదు+పెట్టు) అ. క్రి. నిందమోపు

రగడ ... కలికి కలిత యీసు నెమ్మదిఁ గ్రమ్మఁ గ్రమ్మఱ వాదువెట్టకు .. వాల్మీకి 3 114

వాదోడు వి (వా+తోడు) మాటాడుటకు సహాయ పడువాఁడు, సహాయపడునది

శా బంగారందియ ముక్కునం గమిచి పై పై వంచె యఱ్ఱింపగా, సింగారంబగు ముద్దు తన కుం జేదోడు వాదోడుగాన్ . విజ 2 157

గీ దాస్యవృత్తికి నిటువంటి దానిఁ జేర్చి,కొనఁ గొదువలేదు వలదుబొమ్మనఁగ నేల, యిది యదృచ్ఛాప్త లాభమై యొదవెఁ దోఁట, పనికిఁ జెదోడు వాదోడు పాటుపడును వైజ 2 106.

వి పనులకు నాలిక చేయులలోనుగాఁగల తెవుళ్ళను బరిశీలింప నోటఁ జొప్పించి నోరు తెఱపించు టకై యేర్పఱచిన దార్వాయస రూప యంత్ర విశేషము

సీ దామెనలును వల్లె త్రాళ్లును దలుగులు గవ్వ ముల్ గొడవలి కత్తిసూఁడు ...

తే గొడుపు వాదోళు మొదలుగాఁ దెరకయుండ, వలయు ముల్లెల్లఁ దెమ్మన్న హరి పూ. 6. 21

వ . చూఁడు గొడుపులును వాదోళ్లముకు బంతులు మొదలుగాఁ గంసాధనంబులు గొని వచ్చి తెవులు గొంటులఁ జికిత్సించువారు హరి. పూ. 5 142

వాద్యకరుఁడు సం వి అ పుం వీణాదికమును వాయించు పురుషుఁడు

వాద్యభాండము సం వి అ. న 1 వీణాది వాద్య ముల సమూహము 2 తతము, అవద్ధము మున్నగు సంగీతపరికరము.

వాద్యము సం వి అ న 1 వీణ మున్నగు సంగీత సాధనముల ధ్వని (విల్యమ్సు.)

వాధు(ధూ)క్యము సం వి అ. వ. 1 వివాహము, పెండ్లి.

వార్ధీణసము సం వి అ పుం ఒక జాతి యడవి మృగము, ఖడ్గమృగము

వాన వి 1 వర్షము

చ తరుణులు చంచలాలతలు తక్కర ఖాండవి కాయ మంబుదో, త్కరములు పాలు దేనెలు ఘృతంబులు నలు . . వాఘుక్తి వేళ దొ,ల్కరి సమయంబు పేరెలమిఁ గైకొనకుండునె భోక్తృసన్యముల్ ... నైష. 6 121.

వానయగు అ. క్రి వానవచ్చు, వాన కురియు,

అ. వానయైన నెండ వచ్చిన గొడు గవశ్యంబు వలయు రాత్రి యడవిలోనఁ, దిరుగునపుడు గుడియ ధరియింప వలయును, గాలఁజెప్పు లిడక కదలరాదు. వి పు. 4. 245.

2. వర్షకాలము.

సీ. వానయు సీతను వర్జించి మందు వేసవిగాక మున్న సస్యముల పంట, లోదవెడు తటి నెత్తు వది శత్రువయి భార. శాం 3 8

ఉ వానకరంబు దీటుటయు వానరనాథుఁడనేక సేవతో, మానవనాథుఁ గాంచి బహుమానవన చోగతి కుబ్జి జానకీ, మానవతిం గనంగ వన మానవనాటులఁ బంప ఉ రా 1 104

ఎనుపోతుపై వాన=ఎన్ని చెప్పినను లక్ష్య పెట్టని వాఁడు

ద్వి. ఒక విచారము మాకు వొదవె నీరాజు, సుక వాసి పనివంద చూపుగుత్తంబు, మామిడి క్రింది సోమరి మేధకుండు, బూమెతుంటరి యెనుపోతుపై వాన ద్వి. హరిశ్చ ఉ. 1498. పం.

జ వానకట్టె, వానకాళులు, వానకోయిల, వాన గొట్టు, వానజాఁలి పులుఁగు, వానతటి, వాన నెచ్చెలి, వానపడె, వానపాము, వానపేగు, వానరాయి.

వాన సం వి అ. స్త్రీ మీలవల్లంకిపిట్ట.

వానకట్టె (వాన+కట్టె) వి అలగర్దము, నీరుకట్టె

సీ. .. వాహినీనాథుతో వరిమల్లి కొలువ వ్యాళ నాయకునితో వానకట్టె .. చెన్న 5 71

వానకాళులు(ళ్లు) వి బ (వాన+కాళులు) దూరము నుండి చూచువారికి మేఘములందు కాళ్ళవలె కన్పడు వర్షధారలు.

గీ. ధర నిదాఘవాతాహతి నెరయకుండ, విధి దమాలమంటపము గావించె ననఁగ, నొప్పె నీలాభ్రపటల మచ్చుప్పరమున, రాలు లన నెల్ల దెన వానకాళు లమరె కు సం 6 754

గీ. పుట్ట వెడలి వఝోశ్లిత్తిఁ బట్టు శక్ర, కార్ముకవుఁ జెద్ద పలువన్నె కట్ల జెట్టి, దైన నడచెడు కాళ్ల గుంపనఁగగాలి, కారోకని దిగంతముల వాన కాళ్లు నడచె ఆము 4. 89

క. సలిలంపువృద్ధజలధర,ములు పూనిన యూఁత కోలమొత్తములక్రియన్, దొలు వానకాలు లెసఁగెన్, గలహంసకులంబులెల్లఁ గలఁగంబడఁ గన్ పాండు. 4 25.

వానకోయిల (వాన+కోయిల) (వాన చినుకులఁ ద్రావు పక్షి)

వి 1 చాతక పక్షి.

గీ. అఱుత దోరెవుఁ ద్రావుచే నత్తమమరఁ, దళుకుచేఁ దొల్ల వానకోయిలలఁ దునిమి, ఖైరిచే వెన్క కొంగలకాళుఁ గొట్టి, పాళువము చేతఁ గుందేళ్ళఁ జీరెవంత ప్రబం 1. 232

సీ . తొలు మొగుల్నిడు చినుకు లెలమిఁ గ్రోల్వాన కోయిల బలుమంచు సోనలకుఁ ఆనునె .. నీలా 2 76.

2 సర్ప విశేషము (శ ర)

వానగొట్టు వి (వాన+కొట్టు) వానదెబ్బ, వాన తాఁకు

ఉ అక్కడ నుండ నేల ధవళాయతలోచన వాన గొట్టునం, జిక్కితిగా యిఁకం దడవు నేయక నా చిగురాకు శయ్య యీ, దిక్కున నున్న దీ విటు మతీయపదంబులదండ నుండు . వి ప్ర 3 76

వానజాలిపులుఁగు (వాన+జాలి+పులుఁగు) వి. హంస

చ ...సఖుం గమతాగ్రణి నవ్విధంబునన్, గొని యల వానజోలిపులుఁగు ల్గగనంబునఁ బోవఁ ద్రోవ లో,చనమవా మాచరించె విదిశా నగ రంబు .. వేం పంచ 1 568.

చ అని యల వానజోలిపులుఁ గావవజాతినిఁ జీరి వేడినన్, విని తలపోసి చూచి యిది వింత సుమీ తెలియంగలేను నేఁర్పున వది భర్తకింపు మదిఁ బుట్టఁగ నెట్టులు బొంకెఁ జెప్పవే, యనఁ గలహంసవంశకలశాంబుధిచంద్రుఁడు కాంత కిట్లనున్ హంస. 4 61.

వానతటి (వాన+తటి) వి వర్షాకాలము, వర్ష ఋతువు

గీ. కోఁతిరాయఁడ మావయిఁ గూర్మి నిలిపి, వాన తటియెల్ల నగళులలోన నుండఁ, దపసి రూపులఁ ద్రోళ్లకుఁ దవిలిరాఁగ, మాకుఁ బోసఁ గదు పొమ్ము మఱాక రమ్ము అ. రా కిష్కి. 54

వాననెచ్చెలి వి (వాన+నెచ్చెలి) 1 వానకోయిల. (శ. ర.)

2 వరుణుఁడు

గీ. వానసెచ్చెలి పడమటి యింక లేదు, పల్లెత్రాడు గలాఁ డన వరుణుఁ డొప్పు . ఆం. భా 1 51

**వానపడె** వి (వాన+పడె) వాననీరు నిలిచెడి చిన్న గుంట

సీ. అమానవసామానసీమావటదనూనమాన సౌకము లోనె వానపడెకు ... ముకుందవి 2 145.

**వానపాము** వి (వాన+పాము) ఎఱ్ఱ, మహీలత (శ ర, బ్రౌ వా)

**వానపేగు** వి (వాన+పేగు) ఎఱ్ఱ, మహీలత (శ ర)

**వానప్రస్థము** సం వి. అ. పుం. 1. మధూకము, ఇప్ప చెట్టు. 2. పలాశము. మోదుగు చెట్టు

**వానప్రస్థుఁడు** సం వి. అ పుం 1 వనవాస వ్రతమును (వానప్రస్థాశ్రమమును) అవలంబించిన పురుషుఁడు, తృతీయాశ్రమమునం దున్న యతఁడు 2. పరివ్రాజకుఁడు, సన్యాసి, యతి

**వానము** సం విశే (అ ఆ అ) 1 ఊఁదఁబడినది 2 ఎండినది. (శాయ లోనగునది,) 3 అరణ్య సంబంధమైనది, అడవి సంబంధమైనది

వి. అ. న 1 ఎండిన ఫలము 2 ఊఁదుట. 3 జీవించుట. 4 గాలినుడి 5 పరిమళము, సువాసన 6 ద్రాక్ష తీఁగల తోఁపు 7. నేయుట 8 గడ్డిచాప. 9 ఇంటి గోడ లోని కన్నము 10 గతి, నడక (మే ని)

**వానరప్రియము** సం వి అ పుం. పాలచెట్టు

**వానరము** సం వి అ పుం క్రోఁతి

**వానరాక్షము** సం వి అ పుం అడవి మేఁక

**వానరాఘాతము** సం వి అ పుం లోధ్రము,లొద్దుగ చెట్టు

**వానరాయి** వి (వాన+రాయి) వడగల్లు, కరకము (శ ర., చి ని)

**వానరి** సం వి ఈ. స్త్రీ ఆఁడు క్రోఁతి

**వానలము** సం. వి. అ పుం కృష్ణ తులసి. (వృ వి)

**వానస్పత్యము** సం వి అ పుం పూచి కాచెడి చెట్టు, పూవునుండి పుట్టిన ఫలముగల మామిడి మున్నగు చెట్టు, వనస్పతి.

**వానాయుజము** సం వి అ పుం వనాయు దేశమునఁ బుట్టిన గుఱ్ఱము (అరబ్బీ గుఱ్ఱము)

**వానాయువు**=వనాయువు సం వి అ పుం భరత ఖండమున వాయవ్య దిక్కున నుండెడి దేశ విశేషము, వనాయు దేశము (అరేబియా)

**వాని**=వాఁడి విశే నిశితము, తీక్ష్ణమైనది

క అనిన విని వాని మది దోఁప నిరంకుశ విజయ భేరిభాంకృతు లెసఁగన్, మొన లేర్పరించి తోడనె, జననాథుఁడు గదలె సమరసంరంభమునన్ జై భా 4 52.

**వానియము** వి (సం వాణిజ్యమ్) వర్తకము

ఉ చీనపుదీవి నిన్నును బసిండియుఁ దుల్యమటన్న వచ్చుటన్, వానియ మాడఁ బోదమని నావల వేలొకఁ డాయితంబుగాఁ, బూని ఘటింప నందిమము పూర్ణముగాఁ గొని సెట్టు లిద్దఱున్, ఫేన తరంగ భంగుర గభీర పయోనిధిలోన నావపై కేయూర 3 169

**వానీఁడు** వి (వానె+ఈఁడు) 1 వానె కులమువాఁడు, 2 కుబేరుఁడు

సీ వానీఁడు రారాజు వడచక్కి యొకిమీఁడు తత్తడినెక్కుడు దంటయనఁగఁ . ధనదు పేళ్ళగు ... సాం ని. దేవ 14

**వానీరకము** సం వి అ పుం ముంజగడ్డి, ఒక జాతి కసవు

**వానీరము** సం వి అ పుం. వేతసము, నీటి ప్రబ్బలి చెట్టు

**వాను** స క్రి కుండలుచేయు

ఉ ... అజాండ భాండముల్, వానను ఆము. 1 4

సీ గూనమూయంగ మూకుఁడు వానుగాకను కలఁడె వానను దటాకంబు మూయ ... రామ. శ 92

**వానె** వి ఒకజాతి కోమటి

క ఆనందవనమునం దొక, వానెవణిజు నింటనుండి వైశ్యుఁడు పదా,ర్థానయనార్థము పోయెన్. . కాశీ 5 63

వ ... అవ్వీటిమేటి సాలెయగసాలె పటుసాలె వానెవైజాతి సాఁతులేతుల కొమిరెలు ..., ఆము. 4 85.

ఙ వానీఁడు, వానెత

వానెత వి (√ వానె) వానెజాలి స్త్రీ (శ ర)

వానేయము నం వి అ న తుంగముస్త, పరిమళము గల యొకజాతి తృణమూలము.

వాపదండము నం వి అ పుం సాలెవాని నేఁత పలక, వేమము

వాపనము నం వి అ న 1 విత్తులు చల్లించుట 2 క్షౌరము, గొఱుగుట, గొఱిగించుట

వాపము నం వి అ పుం. 1 విత్తులు చల్లుట 2 నేయుట 3. క్షౌరము, గొఱుగుట

వాపాఠము మి వి. (వాయి+పాఠము) కంఠపాఠము, ముఖస్థముగానుండుట, నోటిపాఠము

ద్వి భరత శాస్త్రంబు వా పాఠంబు వీడె, పరి పరి విధములఁ బలికింప నేర్చు. ప్రభు 1 4. 27. పా

వాపి నం వి. ఇ. ఈ స్త్రీ బావి, దీర్ఘిక, ఒక విధమయిన జలాశయము

సీ ... బహువిధాగారంబుల్ ప్రమదవనంబుల వాపుల దీర్ఘికావలుల వెలసి. భార. సభా 1 282

వాపితము నం విశే (అ. ఆ అ.) 1. విత్తులు చల్లఁబడినది. (క్షేత్రాది,) చల్లఁబడినది (బీజాది) 2 క్షౌరము చేయఁబడినది, గొఱుగఁబడినది.

వాపి(పీ)హము నం వి. అ పుం చాతకపక్షి

వాపు వి వాయింపు

సీ. వాయింపు వాపన వాదనమగు . ఆం భా 1 126

(ప్రాఁత ప్రతి పా శ ప్రా)

వాపుచ్చు నం. క్రి (వా+పుచ్చు.) 1. నోరు తెఱచు

ఉ చచ్చినపుత్రు నెత్తుకొని జానపదుం డొక విప్రుఁడార్తుఁడై, వచ్చి నరేంద్రుమందిరము వాకిట నాలుగు దాను నిల్చి, వాపుచ్చి, మహోష్ణబాష్పములు బోరనఁ గ్రమ్మఁగ నేడ్చి యేడ్చి క్రన్నిచ్చుచు మోదుచున్. నిర్వ 10 53

క చూపుల శ్రీపతిరూపము, నాపోవక త్రావి త్రావి హర్షోద్ధతమై, వాపుచ్చి మంత మధురా, లాపంబులఁ బొగడె నదితి లక్ష్మీనాథున్ ... భాగ. 8 482.

ఉ చచ్చిన న త్తపస్విసతి సన్నులు మోమును మోముకొంచుఁ బై, వెచ్చనికన్నునీ రడర వీడిన వేనలితోడఁ బెల్చ వా,పుచ్చి తనూజులం బనవఁ బొంచి కనుంగొని పోయె విప్రుఁడై, యచ్చటికిన్ సురాధిపతి యాతనిఁ జూచి లతాంగి వెక్కుచున్ భార అను 1 299

ఉ వచ్చె ఘనాఘనంబు లివె వల్లభు లేలొకొ రారటంచు వి,ద్యుచ్చలనోద్యతద్యుతుల కుల్కుచుఁ బ్రోవలు నిక్కిచూచి వా,పుచ్చక నెవ్వగ న్వగపు పుట్టఁగఁ గాంతనతుల్ నిగుడ్చు వె,న్వెచ్చనియూర్పుల న్వరిసె విన్నపయింబ్రథమాంబువాహముల్ కవిక 6 13

వాపోక వి (√ వాపోవు) 1. అఱచుట 2 ఏడ్చుట (శ ఠ)

వాపోవు ద్వ్య అ క్రి. (వాయి+పోవు) 1 అఱచు. (వాయి - ప్రకృతి - వాక్)

క పయెడఁ బతిఁ బొడగానక ... వాయుడువక చీరునేడ్చు వడి వాపోవున్ కు నం 5 547

సీ ఆ గి వాయు వెదురు వీచె వాపోయె వఱదులు భార అర. 1 182.

క ఉఱుమక పిడుగులు పడియెడి, వఱదులు వాపోవఁబొచ్చె వాహినికెదురై, యొఱలందు నాయుధంబులు, విఱిగిపడఁదొడంగెఁ బుట్టె విపరీతంబుల్. జై. భా అశ్వ 6 188.

సీ కులపర్వతావళి కులిశభయంబున బెదరి వాపోవు వల్లెదురు సెలఁగె ... భార ఉద్యో 4 116

2 ఏడ్చు

ఉ రావణుబారిఁ జిక్కినధరాసుత చాడ్పున భీతినొంది వా,పోవుచుఁ బోవుచో నృపతి పుత్రువకుం దనపోక చెప్ప భూ,దేవికి లంచ మిచ్చిన గతిన్ సురవైరి యెఱుంగకుండ రా,జీవదళాక్షియప్పు వయిచెం దనమైతొడవుల్ గ్రమంబునన్ భోజరా 5 52

క ఈ పగిది నీవు వగలన్, వాపోవఁగఁ జూచి యకట వారింపంగా, నోపినవిలుకాఁ డొక్కం, డీపురి లేఁడయ్యె నయ్య యిది పాపముగున్ భాగ 10 స్కం ఉ 1264.

శా వాపోవున్ తుధఁ గుంది బాల సుతు లవ్వా
బువ్వ బువ్వంచు ని,ల్లాపెన్ మల్లభూ
వైరాగ్య శ 21

**వాప్యము** నం వి అ న చెంగల్వ కోష్టు (వృ వి) (శ ర)

**వాబిఱును** వి (వా+బిఱును) నోటికారివ్యము, వాక్పారుష్యము

సీ ప్రతిపక్షియని తిరస్కృతిఁ జేసితే సాధు
పికమున కేల వాబిఱునుఁ జూప . వేం
వంచ 4 187

**వామ** నం వి ఆ స్త్రీ. 1. స్త్రీ అఁదుది 2 సౌం దర్యవతియగు స్త్రీ 3 గౌరి 4 లక్ష్మి 5 సరస్వతి

**వామకము** నం విశ (అ ఆ అ) 1 ఎడమది 2. వ్యతిరేకమైనది, ప్రతికూలమైనది

**వామదేవుఁడు** నం వి అ పుం. 1 ఒకానొక ఋషి 2 శివుఁడు

**వామనగాయ** మి. వి. (వామన+కాయ) 1 లేత చింతకాయ

క మునుఁజిగురునఁ బువ్వన వా,మనగాయల దోం
పండ్ల మఱి యారఁగఁ బం,డినపండ్ల నెల్ల
కాలము, దనియఁగఁ జవులొసఁగ నొండు తరు
పులు గలవే ద్వా ప్రథమ 1 158

2 ఊరుఁగాయ కుపయుక్తమైన కాయ (చూ వామనములు)

**వామనగొమ్ము** మి వి (వామనము+కొమ్ము), ఊరవేసిన వామనగాయ ఖండము (శ ర)

**వామనపాతు**=వామనపాతుకాఁడు వి ఒకానొక పిట్ట.

సీ. వెలిచె కాటుకపిట్ట బెళవ చామనపాతు పసి
డిక లకుముకి పావురాయి ... పాల్కు. 6 77

**వామనపాతుకాఁడు**=వామనపాతు వి (వామనపాత+కాఁడు స్వార్థమున) ఒక జాతి పక్షి

సీ . వంగపండు పికిలి వామనపాతుకాఁడు
ల్లంకి .. అం భా 2. 98

**వామనపురాణము** నం వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి.

**వామనము** నం విశ (అ ఆ అ) 1 (అ) పొట్టిది, హ్రస్వము, కుఱుచయైనది. (ఆ) చిన్నది. అల్పము. 2 నమ్రము, వంగినది 3 అధమము, నీచమైనది.

వి అ పుం 1 దక్షిణదిగ్గజము 2 మావమున రెండు మూరలు తక్కువైన యేనుఁగు 3 అంకోలము, ఊడుగుచెట్టు

**వామనములు** వి బ వామనగాయలు

రగడ వామనములు నవామలకములు వామగ
తిడిగ వామయలుకకు చంద్రా 4 284

**వామని** నం వి ఈ స్త్రీ 1 పొట్టియాఁడుది. 2 గోడిగ, ఆఁడు గుఱ్ఱము 3 ఒక జాతి స్త్రీ 4. భగరంధ్రమందలి రోగవిశేషము

**వామనుఁడు** నం వి అ పుం 1 పొట్టివాఁడు. 2 విష్ణువు 3 విష్ణుని పంచమావతారము 4 పాణిని సూత్రములకు వ్యాఖ్యానమగు కాశికా వృత్తి రచించిన పండితుని పేరు

**వామపార్శ్వశృంగి** నం ఈ స్త్రీ. వి మల్ల విద్యా విశేషము

వ గజదండ, శృంగిదండ, వామపార్శ్వశృంగి,
దక్షిణ పార్శ్వ శృంగి . మల్లుపు, 3 69.

**వామభ్రువు** నం వి. ఈ స్త్రీ అందమైన కనుబొమలు గల స్త్రీ

**వామమార్గము** నం వి అ పు = వామాచారము

**వామము** నం విశ (అ ఆ అ) 1 ఎడమది, దక్షిణేతరమైనది, కుడిది కానిది 2 ఎడమవైపున నున్నది 3 (అ) వక్రమైనది, విపరీతమైనది, ప్రతికూలమైనది, అనుకూలము కానిది (ఆ) వ్యతిరేకముగాఁ జేయునది, వ్యతిరేకస్వభావము గలది. (ఇ) వక్రబుద్ధిగలది, కుటిల స్వభావము గంది. (ఈ) లొంగనిది, మొండి కెత్తినది 4 నీచమైనది, చెడ్డది 5 అందమైనది, ఇంపైనది 6 పొట్టిది

వి అ పుం 1. జంతువు, ప్రాణి 2 పాము 3 పశువుల పొదుగు, చనుకట్టు 4 నిషిద్ధ కార్యము, చేయఁగూడని పని (త్రాగుడు మొ) ని ధనము, సొత్తు

**వామలూరము** నం వి అ పుం పుట్ట

**వామలోచన** నం వి. ఆ స్త్రీ అందమైన కన్నులు గల స్త్రీ

**వామశీలుఁడు** నం విశ. (అ ఆ అ) కుటిల స్వభావము గలవాఁడు లేక వ్యతిరేక స్వభావ ము గల వాఁడు,

వి అ పుం కామదేవుఁడు, మన్మథుఁడు

**వామాచారము** నం వి అ పుం వేద విరుద్ధమైన యాచారము, తంత్రోక్తమైన మద్య మాంసాది సేవన రూపమైన దురాచారము

**వామాపీడనము** నం వి అ పుం పీలువృక్షము, గోఁగుచెట్టు

**వామావర్తము** నం వి అ పుం కుడినుండి యెడమ వైపునకుఁ దిరిగిన సుడిగలశంఖము

**విశ** (అ ఆ అ) కుడివైపునుఁడి యెడమ వైపు నకుఁ దిరుగునది

వామి వి తృణతతి, గడ్డిమేటి

సీ వామియటం చన వఱలును దృణతతి ... ఆం భా. 2 77

ద్వి హేమంత మనుమేఘ మెల్లెః నిండి, వామిగా వడగండ్లు వర్షించె ననఁగఁ, గురిసిన పెనుమంచు కుంభిని యెల్ల, వెరసి యొప్పారె ఘనీభవించు చును రం రా. అర 153 పొ 11 పం

సీ .. వాములుగా వారువంబులు వ్రాలెఁ గంధర వాల మధ్య పాదములు ద్రెవ్వి, ప్రోవులుగా రథంబులు ద్రెళ్లె . వరాహ 5 23, కేయూర. 3 14

వామి నం వి ఈ స్త్రీ 1 గోడిగ, ఆఁడు గుఱ్ఱము 2. ఆఁడుగాడిద, గర్దభి 3 ఆఁడేనుఁగు, కరిణి 4 సృగాలి, ఆఁడునక్క

**వామిలుఁడు** నం విశ (అ ఆ అ) 1 అందగాఁడు, సుందరుఁడు 2 గర్వించినవాఁడు (మే ని) 3 వంచకుఁడు, మోసగాఁడు

**వాము** = ప్రాము, పాము న త్రి పొరు (శ ర)

**వాముఁడు** నం వి అ పుం 1 శివుఁడు 2 మన్మథుఁడు

వామోరువు నం వి ఉ ఈ స్త్రీ అందమైన తొడలు గల స్త్రీ.

వాయ వి (సం భాగః) దంచుట రుబ్బుట మున్నగు వానికై యొకతూరిపోసెడు ధాన్యాదికము (శ ర, వా,)

వాయకుఁడు నం. వి అ పుం నేఁతగాఁడు, సాలీఁడు, తంతువాయుఁడు

వాయదండము నం వి అ పుం వేమము, నేఁత వలక, సాలీని.

వాయన(క)ము నం వి అ న వ్రతకాలములయందు దేవతకు, విశేషించి బ్రాహ్మణునకు నిచ్చెడి భక్ష్య రూపమైన యుపహారము

వాయము విశ వ్యర్థము

ఉ వాయపు రజ్జులేల మునివల్లభ! వృద్ధుఁడ వౌంటె గాపులే, ఛాయపువాఁడ వద్రివన రమ్యములైనయనేక దేశముల్, ధీయుత! యల్పకాలమునఁ ద్రిమ్మరశక్యమె? నీకు నెమ్మెయిన్, వేయును నేల నమ్మ నెద నీ పలు కన్న మునీంద్రుఁడిట్లనున్ మార్కం 4 217.

ఉ మాయలు నింద్ర జాలములు మాధవుఁ డిందును గొన్ని వన్నినన్, వాయపు రజ్జులెప్పుడు నవారణ నీ వెటులాడి తెనియన్, వేయును నేల భార ఉద్యో 4 201

**వాయము** నం వి, అ పుం నేఁత, నేయుట

**వాయవము** నం విశ (అ ఈ అ) 1 వాయుదేవునికి సంబంధించినది, వాయుదేవునిచే నియ్యఁబడినది 2 గాలి సంబంధమైనది

వాయవి నం వి ఈ, స్త్రీ వాయవ్య దిక్కు, పశ్చిమోత్తరదిక్కుల మధ్యభాగము

వాయవీయము నం విశ (అ ఆ అ) వాయు సంబంధమైనది

వాయవ్యము = వాయవీయము నం విశ (అ అ అ)

వాయసము నం వి అ. పుం 1 కాకి 2 మంచి పరిమళముగల అగురువు, అగురువృక్షము (వాచ)

వాయసారాతి నం వి ఇ పుం గుడ్లగూబ

వాయసాహ్వ నం వి అ స్త్రీ ఒక జాతి కూరాకు మొక్క, కాకశాస.

వాయసేక్షువు నం వి ఉ పుం కాశతృణము, ఒక జాతిజెల్లు

వాయసోలి నం వి. ఈ స్త్రీ కారుకొల్లి, కాకోలి (వృ వి) (శ ర)

వాయి = వా వి పొ (సం. వాక్ త వాయ్) 1 నోరు, వదనగుహ.

ఉ ఆతనిఁ బట్టి యెత్తి నిహతాహిత వీరుఁడువాని ముక్కునన్, వాతను గర్ణ రంధ్రముల వారక శోణితధార లొల్కఁగా, వాతసుతుండు వీచె . భార సభా 1 209.

చ . మహోగ్రహుంకృతుల్, వడిగొనఁ గొమ్ము లొడ్డుకొని వాతులు విచ్చి ఖురాగ్రపాతనం, బుడమిఁ బగల్చుచున్ . హరి పూ 6 87

క. జ్యోతుల ముంటం బొడిచిన, వాతుల నెత్తురులు గురిసె వసుధేశభట, వ్రాతముల కెల్ల వచ్చుట భాగ 9 స్కం 62

గీ ఒక్కవ్రేటున నూర్లు వే లోలిఁ గూల, వ్రేయు చును గాళ్లఁ జమరుచు వాయిదెఱచి, మ్రింగు చును గొంగిటను బిగియంగ నొత్తి, నలియఁ జేయుచునున్న బిట్టలుకతోడ ఆ. రా యు 238

2. (కలశాదుల) ముఖము

గీ కాలసర్పంబు నొక్కటిఁ గడవఁబెట్టి, వాయిఁ గట్టి ముద్రించి య వ్యాసుదేవుఁ, డొక్క దూతచే నిచ్చి యయ్యుగ్రరిపుని, పాలి కెంత యునరుదుగాఁ బనుపుటయును హరి ఉ 2 124

సీ. తొడినులనదుమవాత లోకింత గనవచ్చె రావ న నన లంకురంబునొందె పి శకుం 2 126

3 అగ్రము, కొన

చ నిలువక వచ్చివచ్చి ధరణీంజిఱుపెంచికలు న్వసుంధరం, గలసిన గోడలుం జిలికి గంపఁ గాచిన వెజ్జిసొజ్జిజీవలు చిగిరెంతగంట గమి వాతులు గప్పిన పూడుపాతరల్, గల యొక యూరిపాడు గనుపట్టిన . వేం పంచ. 1 467

4 నోరు

చ. ఇంచుక వాయివిడ్డ తామరమొఱ వెట్టి పెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాగుచున్, మొరయ విపంచి మీటుగతి మ్రోసియళుల్ వెడ లెఁగొలంకులన్. మను 3 60

5. ఖడ్గాదిధార, వాదర

ఆ అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్క ముష్టిఁ దొడిగి గ్రక్కనంగ, నతఁడు లీలఁ దునిమె నందఱతలలును .. భార. విరా 5 149.

ఆ వాఁడియైనకత్తి వాతియమ్మునఁ గొని, పగ తుశిరముచెక్క లెగయ గొట్టి, నరులకెల్లఁ జూడ నవ్వగునట్లుమఁ, గలయనైదుకూఁ కటుల నొనర్చె భార ఆర 6 250

ఉ నీతనయుండు నిఃహాకమనీయతరం బగు భీమునల్ల సత్కేతన మర్ధచంద్రశరతీవ్ర హతిన్ మణికింకిణీనినా, దాతిశయంబు తోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్, వాతిశరం బునం దునిమె వారివరూధిని యేపడంగఁగన్. భార. శల్య 1 240

6 వాయువు, వాతరోగము (చు కోరవాయి. వాయువిళంగము )

గీ .. వాయినాఁగను వాయువువలలు . ఆం భా 2 125

జ వాఁగడ, వాతరట్టు. వాతికొను, వాతిపాతిక, వాతిబియ్యము, వాతివాఁడి, వాతెర, వాపా రము, వాపోక, వాపోవు, వాయిగట్టు, వాయి దార, వాయివిళంగము

**వాయించు** న క్రి (సం. వాద్) మ్రోగించు —

ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున నారణంబు వాయించి యనేకభంగుల నుమేలుఁ ద్రిలోక శరణ్యు నాత్మ మెప్పించి. భాగ 10. స్కం. ఉ 314.

సీ ... ఆ వాద్యభంగిజలము వాయించి వాయించి, పాడిపాడి కెరలి యాడియాడి హరి పూ. 6 101

సీ గీ. .. మదికి, నించువేడుక వీణవాయించు చెలువ, నలువరాణి మదాత్మలో వెలయుఁ గాత ... మనుచ 1 5

జ : వాయింపు

**వాయింట** వి బర్బర, ఒకజాతి కూరాకు (వృ వి.)

సీ . వాయింటయనఁగ బర్బర చెలంగు ఆం భా. 2 67

**వాయింపు** వి (వాయించు) వాయించుట

సీ .. వాయింపు వాదన వాదనము గు ఆం భా 1. 126

**వాయిగట్టు** న క్రి (వాయి+కట్టు) సంచి మొదలగు వానిని కట్టు.

క అకరువుమచ్చులగుదిక్కర్ణి కానువర్ణంబు మధు పనికమముగలత, మ్మిక్క విలసంచి దివస వైశ్య కులాగ్రణి వాయిగట్టె సంధ్యావేళన్ వరాహ 4 138

**వాయిదకాఁడు** విశ (వాయిదము + కాఁడు) వాద్యము వాయించువాఁడు

ద్వి. కరమర్థి వాయిదకాండ్రు ముంగలిని, బిరుదుకాళియలచేఁ బెల్లు నాదింప .. ద్వి పరమ 7 551 పా

**వాయిదకారి** విశ (వాయిదము + కారి) వాద్యమొనర్చువాఁడు, వాయించువాఁడు

చ అరుదుగ వాద్యవిద్య బిరుదందినవాయిదకారుల త్తటిన్, కరిములురెండు నొక్కసరిగా మురజంబులు ముట్టి దిమ్మనన్, మొరయఁగఁజేసి . వైజ 1 128

**వాయిదము** వి (సం వాద్యమ్) వాద్యము

వ . నీరుహారులాతనికి మేలివాయిదంబులనగు సంతసం బలవడ(ంజేయ) అచ్చ తె భార వి 2 31 పు.

సీ. ... పలుదెఱంగుల బోరుకలుగు వాయిదములు గడితంపుటులుము చేప్పుడులుగాఁగ అ రా కాల 164., నీలా 3 48

జ వాయిదకాఁడు, వాయిదకారి

**వాయిదార** వి (√వాయి ) (త వార్యారై) వంకలుగల కత్తి.

సీ వాయిదా రవఁబడు వంకలుగలకత్తి . అం శా. 2 218

**వాయువిళంగము** వి. (√వాయి) క్రిమిఘ్నము, విడంగము (వృ వి ) (చి ని శ. ర., వా.)

**వాయుకేతువు** నం వి ఉ పుం ధూళి, దుమ్ము

**వాయుగండము** నం వి అ పుం (ఉజీర్తిచే) కడుపుబ్బుట

**వాయుగుల్మము** నం. వి అ పుం 1 తుపాను, పెనుగాలి 2 జాలావర్తము, నీటినుడి

**వాయుగోచరము** నం వి అ పుం వాయువు సంచరించెడి ప్రదేశము.

**వాయుజాతుఁడు** నం వి. అ పుం 1.హనుమంతుఁడు. 2 భీముఁడు

(ఇట్లే వాయుతనయుఁడు, వాయుతనుజుఁడు మొ )

**వాయుడుపు** అ క్రి (వా+ఉడుపు) నోరుగట్టు

క ఏ యెడఁ బతిఁ బోడగానక పలుమఱు, వాయుడుపక చీరు నేడ్చువడివాపోవున్ కు సం 5 547

**వాయుదారువు** నం వి ఉ పుం గాలిచేఁ జీల్పఁబడినది మేఘము, మబ్బు (వాచ.)

**వాయునిఘ్నుఁడు** నం విశ (అ అ అ ) 1 వాయువుచేఁ బాధింపఁబడినవాఁడు 2 స్థిర బుద్ధిలేనివాఁడు, వెఱ్ఱివాఁడు

**వాయునివృత్తి** నం వి ఇ స్త్రీ 1 శాంతి, నిశ్చలత. 2 వాతరోగము మానుట.

**వాయుపురాణము** నం వి అ. న. పదునెనిమిది యుపపురాణములలో నొకటి (చూ ఉపపురాణము. సూ ని )

**వాయుఫలము** నం వి అ న 1 వడగల్లు, వర్షోపలము 2 ఇంద్రధనుస్సు

**వాయుభక్షణము** నం వి అ పుంసర్పము, గాలిమేపరి, (ఇట్లే, వాయుభక్షము )

**వాయుభక్షుఁడు** నం వి అ పుం గాలి యాహారముగాఁ జేసికొని బ్రతుకుచు తపస్సుచేయు ఋషి. (ఇట్లే, వాయుభక్షకుఁడు )

**వాయుభుక్కు** నం వి క్ పుం. 1 వాయుభక్షణుఁడు 2. వాయుభక్షణము.

**వాయువర్త్మము** నం వి న్ పుం న వాయుపథము, ఆకాశము

**వాయువాహము** నం. వి అ. పుం పొగ. ధూమము

**వాయువాహిని** నం వి. ఈ స్త్రీ శుద్ధరక్తనాళము, శరీరమందలి వాయుసంచారము గల నాడి.

**వాయువు** నం వి ఉ పుం 1 గాలి. 2 వాయుదేవుఁడు, (పశ్చిమోత్తర దిక్కుల మధ్య దిక్కున కధిపతి). 3 ప్రాణవాయువు (ప్రాణోపానవ్యానోదాన సమాన భేదములఁ బంచవిధనుగు వాయువు.) 4 రోగసంబంధమైన వాయువు, వాతధాతువు చెడుట

**వాయుసఖుఁడు** నం వి అ పుం అగ్నిదేవుఁడు

**వాయుసమము** (నం విశ. అ. అ. అ) వామాన్యుంపమైనది, వాయువేగము గలది

**వాయోడు** అ క్రి (వా+ఓడు) 1 పలుకవెఱచు, మాటాడవెఱచు

క. .. మాయయ్య పెద్దకొలువున, వాయోడక యిట్టనంగవలయుంజుమ్మీ ... భార ఉద్యో 1 369.

సీ పదిరి యేఁగోపింప భయము వొందు, భర్జించినను మాఱు పలుకక వాయోడు బుద్ధిహీనుఁడనైన బుద్ధిసెప్పు భాగ 4 స్కం 815

2. సంకోచించు, వెఱదీయు

సీ గీ విరహిజనముల పాలింటి వేఱువిత్తు, దురితముల కేల వాయోడుఁ దుహినకరుఁడు . పి శకుం. 3 182.

**వాయ్వాస్పదము** సం వి అ న గాలి సంచరించు తావు, ఆకాశము

**వార** 1 ఎనిమిది పుంజముల నూలు 2 (శ ర, గ్రా )

(పన్నులోని) కొఱఁత (చి ని )

సీ న్యాయంబు కేలు తప్పని కోరువారి తీర్వలవల్ల వచ్చు ధాన్యములు సువర్ణాదాయములును .. ఉ హరిశ్చ 1. 67

2 తారతమ్యము, హెచ్చుతగ్గులు (శ ర, గ్రా )

**వారంగము** సం వి అ పుం 1 కత్తిపిడి, ఖడ్గముష్టి. 2. పిడి యమర్చుట కేర్పరచిన సన్నని కొన

**వారక** అవ్య. (√ వారు) 1 మిన్నక, ఊరక.

క. ఈ రాజకుమారుఁడు దను, గారవమునఁ జెనపఁ జెఱిఁగి కదుఁ గ్రొవ్వికదే, వారక వాఁడిటు చేసెను, మీరిమొద తెలుఁగ రివి యె మీదు విమర్శల్ భోజరా 5 302

2 తప్పక, అవశ్యము.

క. : బృం, వారక యువతీలోచన, వారులు వెన నింకుఁగాక వారక యింకన్ హరి ఉ. 4, 101

3. అడ్డు లేకుండఁగా

ఉ. వారల బాణవర్షములు వారక నిల్పుచుఁదాము వారిదు, ర్వారశర ప్రతానపరివారిత దేహులఁగా నొనర్చున్, వారిజనాభుఁడు . హరి. ఉ 3. 143

4 ఉడుగక, నిరమింపక

చ ఉచిత మనోనురాగదహనోష్ణభరంబున వాల తాఁగికిన్, హృదయమునందు జొబ్బిల వహించిన చందనకర్దమంబు బుద్బుదముల నీనెఁ గల్పితవిభూషణ జాలమృణాలవల్లరీ, వదనములం దమందగతి వారక పిచ్చిలఁ జొచ్చె ఫేనముల్. నైష 2 114

ఉ ... విజ్ఞానము భక్తియు న్విరతము శాంతియు దాంతియు నొప్ప సంతరాధ్యాసిత శంభులింగ సముదాయము వారక సంభజించుచున్ కాశీ 4 301

**వారకము** 1 దే వి లేని కాలమందు ఇతరులకు వాడుకొనుటకు ఇచ్చి కలిగిన కాలమందు మరలఁ బుచ్చుకొనెడు ధనాదికము.

క వారణఘోటకభాండా, గారంబులు మొదలు గాఁగఁగల ధనములతో, సూరినుత యిందఱము నీ, వారకములు గాఁగ మమ్ము వగపుము బుద్ధిన్ భార ఆది. 8. 152

ద్వి వలసిన జీతంబు వారకంబులును, కొఱఁది మీఱఁగ నిచ్చి కూడిక నుండు .. ప్రభులిం 1. 4 26

(గ్రా. పా. వాడకంబులు ముద్రిపా.)

2 తాకట్టు

సీ. ... పలుకుల చెలువంబుఁ గలికి కింములకు వారకం బిచ్చితే వనజగంధి.. విక్ర 7. 62

సీ. తాకట్టు కుదువ యుద్దర వారకం బీడనంగను నాధి చెలంగుచుండు ... ఆం. భా 2 229

**వారకము** సం విశే (అ. రకా అ ) అడ్డు పెట్టునది, ఆటంక పఱుచునది

వి అ పుం. 1 ఒకజాతి గుఱ్ఱము 2. గుఱ్ఱము. 3 అశ్వగతి విశేషము, ఒక విధమగు గుఱ్ఱపు నడక.

వ 1 నొప్పి పెట్టు చోటు, కష్టస్థానము 2 హ్రీబేరము, కురువేరు, ఒక దినుసు పరిమళద్రవ్యము.

**వారకి** సం. వి. న్ పుం 1 ఎదిరివాఁడు, శత్రువు 2. సముద్రము. 3 మంచి లక్షణములుగల యొక జాతి గుఱ్ఱము 8 పర్ణాశనుఁడు, ఆకులు తిని జీవించుచు తపస్సుచేయు ఋషి.

**వారకీరము** నం వి అ పుం 1 బడబాగ్ని 2 దువ్వెన 3 పేను 4 వందెపు గుఱ్ఱము
**వారకీరుఁడు** నం వి అ పుం కీఁమువలెఁ జమత్కారముగాఁ బలుకువాఁడు 1 శ్యాలకుఁడు 2 భారవాహకుఁడు, బరువుమోయువాఁడు, కూలివాఁడు
**వారట** నం వి. అ స్త్రీ = వరట
**వారటము** నం వి అ న 1 క్షేత్రము, పొలము 2 క్షేత్రసమూహము కొన్ని పొలములగుంపు
**వారడ** వి (√ వారు) తాటాకు వారిన చివ్వ. (శ. ర.)
**వారడి** వి. నష్టి, లోపము
వ్యవ. ఆ వారడి యిందు కలిసివచ్చినది. (శ ర.)
**వారడు** న. క్రి. చాలించు (శ ర)
**వారణ** నం వి ఆ స్త్రీ చెలియలి కట్ట (శ ర)
**వారణబు(ష)స** నం వి ఆ స్త్రీ కదళి, అరఁటిచెట్టు
**వారణము** నం. విశే (అ ఈ ఆ.) నివారించునది, అడ్డగించునది
వి అ న 1. నివారించుట అడ్డగించుట, అడ్డము 2 విఘ్నము, ఆటంకము. 3 ప్రతిఘటనము, ఎదిరించుట 4 పాలనము, రక్షించుట
పుం. ఏనుఁగు. పుం. న కవచము
**వారణవల్లభ** నం వి ఆ స్త్రీ కదళి, అరఁటిచెట్టు
**వారణసి** నం. వి ఈ స్త్రీ = వారాణసి
**వారణావతము** నం. వి. అ పుం న పాండవులు నివసించిన యొకానొక పట్టణము
**వారత్రము** నం వి అ న తోలువాఱు, తోలుపట్ట
**వారది** వి. (సం వారధిః) వంతెన చి ని ) (వారధి అని. శ. ర, బ్రౌ.)
**వారధి** నం వి ఇ పుం వంతెన
**వార(లు)పట్టు** న క్రి ఆచమించు, త్రాగు.
సీ ... గీ అమరమతముగజారణ్యమది మదీయ, వనతి యిహసౌఖ్యమంతయు వారపట్టుఁ, నీ సొమ్ము నిజమని పలికి చనియె .. శేష 4 197
సీ. రథచక్ర నేమినిర్గత ఘూర్ణోరాజివార్ధు లో కుక్కమ్మడి వారపట్ట .. జై భా 5 3
(ఇట నించుక, అని భావము)
ఉ. వార లసంఖ్యకోటు లనివారితవిక్రమశీల వాలి పాథోరుహ గర్భసర్గము వధూమయమయ్యె వనంగ నిండి దే, వారి చమూ సమూహముల నాజిఁ ఒడల్పడఁ గొట్టి నెత్తురుల్, వారలు పట్టి రప్పుడు బలతయమైన రురుండు తెంపునన్. వరాహ 11 124
**వారపోయు** న. క్రి త్రాగుటకు పోయు.
వ్యవ. గ్రామ దేవతకు కల్లుఁ వారఁ బోయుట కొందఱ యాచారము
**వారబు(బూ)ష** నం వి ఆ స్త్రీ కదళి, అరఁటిచెట్టు
**వారము** నం వి అ పుం 1 మూఁత, కప్పు, ఆచ్ఛాదనము 2 సంఘము, సమూహము. 3. రాశి, ప్రోవు 3 మంద, పశువుల గుంపు 5 భాన్వాది వారము (భానువారము, సోమవారము. మొ.) 6. వంతు 7 తడవ, పర్యాయము 8 తఱి, తరుణము, అదను 9 ద్వారము 10 నదియొక్క యావలి యొడ్డు
వ. 1 మద్య భాండము, కల్లుకుండ 2 జల సంఘము, నీటి మొత్తము
**వారముఖ్య** నం. వి ఆ స్త్రీ వేశ్యలలో ముఖ్యురాలు, పలువురు గారవించెడి వేశ్య
**వారయాత్రికుఁడు** నం. వి అ పుం పెండ్లి కుమారునితో వచ్చిన చుట్టము
గీ వార యాత్రికు లమమోదవంతులగుచు, వలచి రుజియించి రొగిఁ బిండివంటకములు ... నైష 6. 120
**వారల** నం వి ఆ స్త్రీ 1 కందురీఁగ 2 వరట, హంసి
**వారవాణము** నం. వి అ. పుం. న కవచము, యోధుల మైమఱువు
**వారవాణి** నం వి ఇ పుం 1. వాంశికుఁడు. పిల్లనగ్రోవి యూఁదు వాఁడు 2. గాయకుఁడు, పాటగాఁడు 3 న్యాయాధికారి, తీర్పరి 4. సంవత్సరము
స్త్రీ ఇ ఈ వేశ్య
**వారవిలాసిని** నం వి ఈ స్త్రీ = వారాంగన
**వారవృష** నం వి ఆ. స్త్రీ 1 ధాన్యము 2. అరఁటిచెట్టు

**వారవేల** సం వి అ స్త్రీ. భాన్వాది వారములందు వర్జ్యకాలము, దుర్ముహూర్తము శుభ కార్యారంభము చేయఁ గూడని కాల విశేషము

**వారసు** వి. (హిం వారిస్) జ్ఞాతి, దాయాదుఁడు
సీ చెవిటి రాయసమైన సేవకుఁడట్లయిన వారసుగాఁడు దివాను నయిన వేణు శ 46

**వారసేవ** సం వి అ స్త్రీ 1 వేశ్యావృత్తి లంజెటికము.

**వారాంగన** సం వి ఆ స్త్రీ సర్వజనమునకు సామాన్యాధికారముగల స్త్రీ, గణిక, వేశ్య

**వారాంనిధి** సం వి ఇ. పుం సముద్రము

**వారాణసి** సం వి ఈ స్త్రీ - వరణ - అసి. అను నదుల నడుమనుండు పురము కాశీపురము

**వారాశి** సం వి ఇ పుం నీటి ప్రోవు — సముద్రము

**వారాహకందము** సం వి అ పుం పంది గడ్డలు (వ్యు. వి)

**వారాహకల్పము** సం వి అ పుం బ్రహ్మమాసమున నొక మాసమునందు వచ్చు ముప్పది కల్పములలో నొకటి, శ్వేత వరాహ కల్పము
(కల్పములు — 1 శ్వేత వరాహ కల్పము. 2 నీల లోహితకల్పము. 3 వామదేవ కల్పము. 4. గాథాంతర కల్పము 5 రౌరవ కల్పము 6. ప్రాణ కల్పము. 7 బృహత్కల్పము. 8. కందర్ప కల్పము 9 సత్యకల్పము. 10 ఈశాన కల్పము 11 ధ్యాన కల్పము. 12 సారస్వత కల్పము 13 ఉదాన కల్పము. 14. గరుడ కల్పము. 15 కౌర్మ కల్పము 16. నారసింహ కల్పము 17 సమాధి కల్పము 18 ఆగ్నేయ కల్పము 19. విష్ణుజ కల్పము 20 సౌర కల్పము 21. సోమ కల్పము 22. భావన కల్పము. 23 సుప్తమాలి కల్పము 24. వైకుంఠ కల్పము. 25. అర్చిష కల్పము 26. వల్మి కల్పము 27. వైరాజ కల్పము. 28. గౌరి కల్పము. 29. మహేశ్వర కల్పము 30. పితృ కల్పము అనునవి ముప్పది ఒక్క కల్పము బ్రహ్మదేవున కొక దినము

**వారాహపురాణము** సం వి అ న పదునెనిమిది పురాణములలో నొకటి, వరాహ పురాణము

**వారాహము** సం విశ (అ ఈ అ) వరాహ సంబంధి, అడవి పందికి సంబంధించినది.
వి అ పుం 1 పంది, అడవి పంది. 2 మహా పిండీతకము, నల్లరంగుగల పెద్ద బ్రమంగ చెట్టు

**వారాహి** సం వి. ఈ స్త్రీ 1 ఆఁడు పంది. 2. భూమి 3 వరాహావతార మెత్తిన విష్ణుని శక్తి, సప్తమాతృకలలో నొకతె. 4 పరిమాణము, కొలత

**వారి** సం వి ఇ న 1 నీరు, జలము, ద్రవద్రవ్యము. 2. కురువేరు, హ్రీబేరము.
ఇ. పుం 1 ఖైది, చెఱఁబడ్డ వాఁడు. (విల్సన్సు).
ఈ. స్త్రీ. 1 ఏనుఁగును గట్టెడి చోటు. 2. గజశృంఖలము, ఏనుఁగుమ గట్టెడి గొలుసు శేక త్రాడు 3 ఏనుఁగును బట్టుకొనఁ ద్రవ్విన గొయ్యి. ఏనుఁగును బట్టుకొనెడు బోను 4 నీటికుండ. 5 సరస్వతి 6. మాట, వాక్కు.

**వారించు** సం న క్రి నివారించు, అడ్డగించు
అ ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁ జూచి వారు వెఱచి, లోని కెఱుక చేసి . భార శాం. 6 263
క మదిలోపలఁ దలఁకుచు, నభ్యుదయం బైనట్టి లగ్నమున గద్దియపైఁ, బదమిడు నెడ వారించుచుఁ, బదియాఱవ బొమ్మ భోజపతి కిట్లనియెన్ ద్వా. 7. 2

**వారికర్పూరము** సం వి అ పుం మత్స్య విశేషము, ఒకజాతి చేఁప

**వారికుబ్జము** సం వి అ పుం శృంగాటక వృక్షము.

**వారిక్రిమి** సం వి ఇ పుం. జెలగ.

**వారిచరము** సం విశ. (అ. ఈ అ.) నీటిలోఁ దిరుగునది
వి అ పుం 1. చేఁప. 2 నీటి జంతువు, జలచర జంతువు

**వారిచామరము** సం వి అ. న నాఁచు, శైవాలము.

**వారిజము = వారిదము** వి. పారిభద్రకము (వ్యు. వి.)
సీ ... వారిజే మంచనఁ బారిజే మంచన భారి భద్రాఖ్యమై మీఱుచెన్మి.. ..అం భా. 2. 48

వారిజము నం. విణ (అ ఆ అ) నీటిలోఁ బుట్టినది
వి అ. పుం 1 శంఖము 2 ఆలిచిప్ప, కప్పచిప్ప, శంబూక
న 1 పద్మము 2 ఒక దినుసు లవణము (ద్రోణి లవణము) 3 గౌరీ సువర్ణమను నౌకానౌక మొక్క 4 లవంగము

వారిజము వి మత్స్య బంధన విశేషము, చిన్న చేప లను బట్టెడు సాధన విశేషము. (శ. ర)

వారిజ(ర్ణ)ము వి ఒకజాతి దేగ
క మఱియు సాళువంబుల శని శరంబులు వారి ణంబులు జేవడంబులు జలకట్టెలు తళుకుమించు మొదలగు దేగలం గరంబులఁగెల బెత్తంబుల హత్తించి ఇందు 2 60
గీ వారిణంబును జలకట్టె బైరిగిద్ద, చంచడము సాళువము శనిశరము మించు, వేస్ట్రిమును శకు కాదిగ వేజవేజ, నొప్పుడేగల జత గూర్చు కుండుటయును. ప్రబం 1 171.
సీ. వార్ణము బైరిజావళము సాళ్వము డేగగూడ జాతుల్లాంగి కుందకేలు యాదియైన పతు లతఁడు దీర్చు . హంస 3 18

వారితస్కరము నం వి అ పుం. 1 మేఘము 2 ముస్త (వ్య వి)

వారితస్కరుఁడు నం వి అ. పుం 1 సూర్యుఁడు. 2 మేఘుఁడు

వారిత్ర నం వి అ స్త్రీ. ఛత్త్రిము, గొడుగు

వారిదము = వారిజము వి. కొండబూరుగు, పారి భద్రము
క. మదిఁగొఱకొఱ నిగుడఁగ వప్పడి మొగముల కోడుఁబెనిపై నూఱ్ఱులుకుల్, చేద లద్రువ నేసి విరివాశిదము తెఱంగొంద జేసి వేల్మిడి నొంచెన్ అ. రా యుద్ధ 504

వారిదము నం వి అ పుం మేఘము, మబ్బు న ముస్త (వ్య వి)

వారిధరము నం వి అ పుం మేఘము, మబ్బు

వారిధి నం వి ఇ పుం. 1. సముద్రము. 2 కలశాది-కుండ మొదలగునది.

వారినాథము నం. వి. అ. పుం 1 సముద్రము. 2 మేఘము. 3. పాతాలలోకము.

వారినిధి నం వి ఇ పుం సముద్రము

వారిపర్ణి నం. వి ఈ స్త్రీ నాఁచు (వ్య వి.) (శ ర.)

వారిప్రవాహము నం వి అ పుం సెలయేఱు, నిర్ఝ రము, కొండ కాలువ.

వారిబాలకము నం వి అ న. హ్రీబేరము, కురు వేరు (వ్య వి)

వారిభవము నం వి అ న సౌవీరాంజనము.

వారిము(ర్ము)చము నం. వి. చ్ పుం. జలదము, మేఘము, మబ్బు.

వారిరథము నం వి. అ పుం ఓడ, పడవ.

వారిరాశి నం. వి ఇ పుం 1. నీటిప్రోవు, సముద్రము. 2 జలాశయము, మడుగు.

వారిరుహము నం. వి అ న పద్మము, తామర

వారివాహ(న)ము నం వి. అ పుం. 1 మేఘము. 2 ముస్త (వ్య. వి)

వారిశుఁడు నం. వి అ పుం నీటపైఁ బరుండువాఁడు, విష్ణువు

వారిసంభవము నం వి అ పుం 1 లవంగము. 2 సౌవీరాంజనము 3 ఉశీరము, వట్టివేరు

వారీశుఁడు నం వి అ పుం. 1. సముద్రుఁడు. 2 వరుణుఁడు

వారు అ క్రి 1 ఉడుగు. (దినికి 1. 2. అర్థములలో వ్యతిరేకక్త్వార్థక వ్యతిరేకార్థక విశేషణ రూపములే కానవచ్చుచున్నవి)
ఉ వారక వడ్డికిచ్చి కుడువన్వెర వారిన దావశీలు ఖార కా 5 249.
ఉ. వారని మంచుపైఁ బొదివి వచ్చిన పోయిన చొప్పు మూసినన్, ఘూరినఖాగ్రము త్తమయి పొల్పగు ముత్తెపుఁ జాలు వెంటఁద, చ్చారణు లేఁగి కాంతురు హత ద్విపకేసరి వాద వేళలం, దారొక వాసికాంద్రు వలెఁ దక్కఁగ నూల్కొనఁ జేయుతానముల్ పి శకుం. 2 105
ఉ. శ్రీ రఘువీర శేఖరుఁడు చిత్తము రంజిలఁ బల్కు-చిల్క ముం, జే రహియింప సీతఁగని చెల్వరో పీయధరంబు బింబికా, శిరసమొల్కు-శా చిలుక చేరెడు నంచునో జిల్గునవ్వులన్, వారక మాటు సేసెదవు వంచవ సేతురె యాశ్రయించి నన్ ఉ రా 6 50.

2 తక్కువయగు

చ మహాధనరాశి వేల్మి వ్రాఁగని విభవంబు తోడ ధృతరాష్ట్రుఁడు సేసె శతాశ్వమేధ ముల్ భార ఆది. 5 42

చ . వ్రాఁగని కృప నట్టు లిచ్చితి వ ంబని యాయమ పల్కె నత్తటిన్ కళా 4 166

చ. ... మన్మథభూ, వరుండు దగంగరాఁబనిచి వారని మన్నన సాదరించుచున్ . నిర్వ 1 2

౨ ఎడియ వ్యా గంజి వారెను

న. క్రి. 1 (తెర మొ) పట్టు

మ కలధౌతద్రవచిత్రము ల్మెఱయముక్తాస్యూతమౌ మేచకాంచలపుం బెందెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ బెద్దలు వంపన్ . ఆము. 7 67.

(6 131 ప్రాఁత ప్రతి)

క మెఱయంగా మధుపర్కము. కఱకంరుని కిచ్చి వెనుక కమనీయముగా, మఱిఁగట్ట నిచ్చి కన్యకు, మఱువుగఁ దెరవారఁ బంచె మహి తాత్ముఁడై. నీర 3 1 67

3. రెండు చేతులతో తాటాకు ఓరచివ్వు (శ ర)

౨ సొట్ట, నొక్కు

సీ. ... సుత్తెనాటుల వారు లెత్త సొమ్ము సొం పలరించె నెవ్వాఁడు సాంబునకును ... శా వి. 1 7

౫ వారక, వారడ, వారుకొను, వారుచే

**వారుండము** సం వి అ పుం సర్పశ్రేష్ఠము, మేలు జాతి పాము

పుం న 1 కంటిపుసి, నేత్రమలము 2 చెవిలోని గులిమి, శ్రోత్రమలము 3 ఓడలోని నీరు తోడెడి తొట్టి

**వారుఁడు** సం. వి అ పుం శివుఁడు

**వారుకొను** స. క్రి (వారు+కొను) రెండు చేతులతో నాకర్షించు

వ. ... అరవిందబాంధవో పలబృందంబులఁ దిల కించి మందానిలస్పందిత గళితలలితమందార కోరకంబు లని వారు కొనంబోవు బృందారక సుందరుల సాంద్రతరసంభ్రమంబుల కచ్చెరు వడి ఇందు. 1 157.

**వారుచే(ర్చు)** అ క్రి. ఆచమించు

క చనదు మిసినవార్వకునికి నజుతుఁడైవన్... భార అను 4 115

గీ. ప్రీతి మంచంబుపై నుండి పీఁట నుండి, చెప్పు పావలు దొడి తలచీరచుట్టి, నవ్వుచును మాట లాడుచు నడిచి నడిచి, వంగికయనించి నిలు చుండి వార్వఁజనదు విజ్ఞా 1. 53

ఉ ... నవ్య వస్త్రంబు ధరించినప్డు దురితంబులు చూచినయప్డు పుణ్యకార్యంబుల యప్డు హేయములు నంటిన యప్పుడు వారు వందగున్ కాశీ 5 204

గీ చంద్ర పుష్కరిణీ తటస్థలిని దేవ, విభుని నిలబెట్టి శంకాని వృత్తిఁ నేర్చి, వచ్చి వారిచి మరఁగఁ బుచ్చుకొనగ, నొదిగి యింతైనఁ గదలింప నోప లేక శేష. 4 283.

న క్రి. 1 (సంధ్యను) ఉపాసించు.

గీ స్నానమాడెనె వార్చెనే సంధ్య యగ్ని, హోత్ర మొనరించెనే యింతి పుత్రుఁడనిన . కాశీ. 4. 86

చ ... జాహ్నవీ తటమున సంధ్య వార్చి జప తత్పరుడై తగువాని యామినీ, పటకుల శేఖరుం గొనుచు ... విజ 1 78

క వేదము చదివిన ఫలమున్, వాదించిన ఫలము సంధ్య వార్చిన ఫలమున్, బైదలి నీకు నొసం గెద శుక 1 408

2 ప్రక్షాళించు, కడిగికొను.

మ కలయం జేతులువార్చి యున్నతోడ బాగా లిచ్చి దశా 7 280.

క ఎంగిలి వార్వగ నీళ్ళిడె, బంగరు నెఱగిండి తోడఁ బరువడిపొక సారంగ విలోచనయా వృప, పుంగవులకు మదిని గూర్మి పొంగా రంగన్ . రసి. 1 77

క నవ్వినఁ గమఁగొని పొదవిన, నివ్వెర చేతులను వార్చి నృపవరుఁడంతన్, నివ్వటిలు సంది యంబున, జవ్వాదు మనంబుతో హజారము చేరెన్. శుక 3 231

3. ప్రతిష్ఠించు.

గీ అనఘ నారాక వార్చి నీవధిక నిష్ఠ, నిట్టులుని కికిఁ గారణమేమి భార శాం 6 573

మ కలవం బెవ్వరు గూర్చి తెచ్చినను నిక్కంబొల్లఁ డెల్లప్పుడున్, జలకంబాడి మదాగమంబు మదిలో నన్వార్చుఁ గంసుండు రా, తెలిమి న్మెచ్చిన గట్టు వాలిది యవన్ హరి వూ. 9 28

4 అపేక్షించు

ఉ. అతఁడు ముఖ్యజాతిగని నంతవ పాయుచు నెండ గాలి వెం,తో తడవుం బ్రసాద వినియోగము వార్చి వసించుచున్ ఆము 6 7.

5. అభిలషించు, కోరు.

ఉ. ... మావున నన్నియు తచ్చెనేనితే, నక్కటి తేటి తక్కుకలమారయ ముంతుతు శేయు వేఁగినన్, తెక్కువగ న్మదిం బోడమి బిడ్డల నేమము వార్తు భూవరా మార్కం 8. 66.

6. కెడయు, వీడు, ఎడయు

సీ. . వార్చె నాఁగడిగె నుపానించెఁ గెడసె నుద్దేశించె నాఁగము దేజరిల్లు ఆం. భా. 3 186.

వారుచే(ర్చు) స. క్రి. (' ' వారు) వడియజేఁయు వ్యవ వంటలక్కగంజి వార్చెను.

జ . వాప్చ

వారుణము సం వి (అ ఈ అ) 1 వరుణ సంబంధి. 2. వరుణునికి మీఁదు కట్టబఁడినది 3 వరుణున కియ్యబడినది.

వి అ పుం భరతవర్షము నందలి తొమ్మిది భాగ ములలో నొకటి.

న. 1 జలము, నీరు, 2. శతభిష న్నక్షత్రము

వారుణి సం వి. ఇ పుం 1 అగస్త్యుఁడు 2 భృగు మహర్షి.

ఈ స్త్రీ 1. పశ్చిమదిక్కు 2 మద్యము 3. శత భిష న్నక్షత్రము. 4. దూర్వా, గరిక (వృ వి ) 5. వరుణుని భార్య

వారువపుజన్నము వి (వారువము+జన్నము) అశ్వ మేధయాగము

గీ. అనుచు నిటులొజ్జ చెప్పినయట్టు లతనిఁ, దోడు కొని వచ్చి వేల్పులఁ దొలుమ దనియ, బాలు లుగఁ బాలులనుగూర్చి వారువంపు, జన్న మొనరించి యారాచమిన్న మఱియు అచ్చ రా జాల. 58

వారువము=వాపురము వి 1. గుఱ్ఱము

ఆ వారువంబు నొక్క వసుమతీ రుహమునఁ, గట్టి నీడనొరగి కన్ను మొగిచె .. వరాహ. 8 66

క తోరపు లత్తుక చాయల, వారువములుగట్టి మహిమవర కేతువు నె, త్వార సమకట్టి తేరా, సారథి గొనితేర నెక్కి సంరంభమునన్ ఉ రా 3 348.

సీ. గీ. .. వాయుజవములు తవితేరి వారువ ములు .. కాశీ 3 10

2. వాహనము

ఉ తెల్లనిఠాము పాముపును తెల్లని వార్వము నెక్కు బిడ్డఁడున్, తెల్లని దివ్పైె విడిది తెల్లని తమ్ముల మీరు కన్నులున్, తెల్లని మోము గుజ్జ మును తెల్లని మామయు తెల్ల కైదువున్, తెల్లని కోడలుం గలుగు తెల్లని కూఁతురితంబ్రిఁ గొల్చెదన్ రుక్మాం 1. 60

చ. బలు తెలిపుల్గు వారువము బంగరు వీణెయు... నీలా 1 6

జ వారువపు జన్నము

వారువు సం వి ఉ. పుం. విజయకుంజరము, యుద్ధపు టేనుఁగు

వార్క్షము సం విజ (అ ఈ అ.) 1. వృక్షములు గలది, వృక్ష సంపన్నమైనది 2 వృక్షములచే నేర్పడినది, వృక్షసంబంధి 3 చెట్టు పట్టతోఁ జేయఁబడినది, నారది

వి అ న వృక్షసమూహము, అడవి.

వార్షికుఁడు సం. వి. అ పుం బ్రాయసగాఁడు, లేఖ కుఁడు

వార్త సం వి అ స్త్రీ. 1. ఉనికి 2. వృత్తాంతము, సమాచారము 3 జీవిక, వృత్తి 4 వైశ్యవృత్తి, వాణిజ్యము, సేద్యము, కృషి. 5. ఆన్వీక్షక్యాది విద్యలలో నొకటి, దీనియందు లాభాలాభములు తెలియవచ్చును. 6. వంగ చెట్టు, 7. దుర్గ. 8. (అలం) వర్ణనావైభవము

వ. ... వార్తలేని కవిత్వంబు వోలెఁ జెన్నుదఱిగి...

(ఈ క్రింది యర్థము లాంధ్ర గ్రంథములయందు మాత్రమే కానవచ్చు చున్నవి )

1 ప్రసిద్ధి, వార్తకెక్కు = పేరుపడు

సీ తే తుంగభద్ర ప్రసంగ ముత్తుంగభద్ర, రాజి రాజిల్లు గౌతమి యోజ మఱియు, వార్త కెక్కిన తీర్థప్రవర్తనముల, స్వామి వినిపించె వింధ్య సంస్తంభయితకు పాండురం 1. 148.

చ తెగిన మనోభవుం దిరుగఁ దెచ్చి కుజంబుల కెల్లఁ బ్రాయముల్, మగుడఁగనిచ్చి యన్యభృత మండలి మూగతనంబుపుచ్చి ము, జ్జగముల వార్తకెక్కిన వసంత భిషగ్వరుఁడాప్తుఁ డయ్యునుం, ద్రిగుగతి మాన్పలేఁడ మఱి తక్షిణ వాయువునందు జాడ్యముల్ కవిక 4 4

2 లోకోక్తి.

ఆ మోహమునకుఁ బోవ మొఁకలెత్తుకొనిపోయె, ననెడు వార్త నిక్కమగు నటంచుఁ, గ్రుంక వెఱతు రెవ్వరును ... విజ వి 2 43

ఆ. ఒక్కనక్క వల గతుక్కునఁ గొఱికి తా,నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము, వసుధ నక్కఁ గన్నవాఁడెల్ల వేఁటకాఁ, డనెడు వార్తనిక్కమయ్యె ననఁగ. శుక 1. 166

3. నీతి.

చ నిగమసుభాషితాళ్యసననిష్ఠలు గల్గిన పండితోత్తముల్, మగువల పొందు నింద్యమవి మాటికి వార్తలు చెప్ప నేర్పరుల్ ... భర్తృ 2 71

నీలివార్త = అసత్యపు ప్రతీతి

వార్తము నం.విణ (అ ఆ అ ) 1 ఆరోగ్యవంతము, నెమ్మదిగానున్నది. 2 అసారము, దుర్బలమైనది 3. వృత్తి (జీవిక) ననుసరించినది

వి అ. న 1 క్షేమము, ఆరోగ్యము. 2. ప్రావీణ్యము, నేర్పు. 3 పొట్టు, ఉముక.

వార్తాకము నం. వి. అ. పుం. వంగచెట్టు.

వార్తాకి నం. వి. ఇ. ఈ. స్త్రీ. న్. పుం. వంగచెట్టు.

వార్తాకువు నం. వి. ఉ. పుం. స్త్రీ. వంగచెట్టు.

వార్తామాత్రము నం. వి. అ. న. 1. కేవలము, వదంతి చెప్పుకొనుటయే. 2. యేవిషయములో నైనను పైపై తెలివి, అల్పజ్ఞానము.

వార్తాయనుఁడు నం. వి అ. పుం. వార్తాహరుఁడు, దూత.

వార్తారంభము నం వి. అ. పుం వ్యాపారము, వాణిజ్యము.

వార్తావహుఁడు (నం వి అ. పుం ) దూత, రాయబారి.

వార్తావృత్తి నం వి ఇ. పుం కృషి వాణిజ్యముల వలన జీవించువాఁడు, వైశ్యుఁడు

వార్తావ్యతికరము నం. వి అ పుం సామాన్యపదంతి, అందఱు చెప్పుకొనుట

వార్తాహరుఁడు నం వి అ పుం. = వార్తావహుఁడు.

వార్తిక నం వి. ఆ. స్త్రీ. పక్షి విశేషము, మీలవల్లంకి పిట్ట

వార్తికకారుఁడు నం వి. అ పుం. కాత్యాయనుఁడు, పాణిని సూత్రములకు వార్తికము రచించిన ముని.

వార్తికము నం విణ (అ ఈ అ ) 1 వార్తకు సంబంధించినది, వృత్తాంత సంబంధమైనది 2 వార్తను దీసికొని వచ్చునది 3 వివరించునది, టిప్పణ రూపమైనది

న ఉక్తానుక్తదురుక్తార్థవ్యక్తికారి

సూత్రముల యందుఁ జెప్పఁబడిన యర్థయుము వివరించునదియు నను క్తమగు దానిని చెప్పునదియు, దురుక్తము (భిన్నముగాఁ జెప్పఁబడిన దానిని) సరిగాఁ జెప్పునదియునగు సూత్ర ప్రాయమైన గ్రంథము

వార్తికుఁడు నం. వి అ పుం. 1 సందేశ హరుఁడు, దూత 2. కృషివలన వాణిజ్యమువలన జీవించువాఁడు, వైశ్యుఁడు.

వార్త్రఘ్నుఁడు నం వి అ పుం. ఇంద్రపుత్రుఁడు, అర్జునుఁడు.

వార్దము నం వి అ పుం. మేఘము, జలదము

వార్దరము నం. వి. అ న. 1 నీరు 2. పట్టు. 3. వాక్కు, మాట 4. గురివెందగింజ. 5 గుఱ్ఱము మెడమీఁది సుడి. 6. దక్షిణావర్త శంఖము. (మే. ని.)

వార్ధకము నం. వి. అ. న. 1. ముదిమి, వృద్ధత 2. ముదిమి వలనఁ గలిగిన యశక్తి 3. వృద్ధ సమూహము. 4. వృద్ధునిపని.

**వార్ధక్యము** నం. వి అ. న. 1. ముదిమి. 2. ముదిమి వలనఁ గలిగిన యశక్తి.

**వార్ధి** నం. వి. ఇ. పుం. సముద్రము.

**వార్ధిభవము** నం. వి అ న సాముద్రము, సముద్రపు టుప్పు

**వార్ధుషి** నం. వి ఇ. న్ పుం వడ్డి వలన జీవించువాఁడు, అన్యాయమైన వడ్డి కప్పిచ్చువాఁడు.

**వార్ధుషికుఁడు** నం వి అ పుం. = వార్ధుషి.

**వార్ధుష్యము** నం. వి అ న వృద్ధికై (వడ్డికై) అప్పిచ్చుట, అన్యాయమైన వడ్డి.

**వార్ధ్రి** నం వి అ స్త్రీ. వాఁఱు, తోలు పట్ట

**వార్ధ్రిము** నం వి. అ న =వార్ధ్రి

**వార్ధ్రీణసము** నం వి అ పుం 1 ఖడ్గ మృగము. 2 పొడువైన చెవులుగల యడవి మేక

**వార్పు(రుపు)** వి (√ వారుచు²) 1 అన్న రసము. గంజి.

సీ .. వఱలు నన్నరసంబు వార్పు గంజి, యనఁ గాను ... ఆం భా 2. 25

2 ఆచమనము.

సీ. . . ఆచమనీయాఖ్య యలరు వార్పనఁగను... ఆం. భా. 2. 178.

3. (గంజి) వడియఁ జేయుట

సీ. పని వంటవార్పుల బాధలించుక లేక తీరిన మంచి సంసార మొదవె .. హంస 4 146

సీ. నిలనీని వంట వార్పులు వత్తమామల పోరును లేని కాపురము గలిగె ... శుక 3 600

**వార్భటము** నం వి. అ పుం మొసలి

**వార్మణము** నం వి అ న. కవచధారుల సమూహము, మైమఱువులు తొడిగిన యోధుల గుంపు

**వార్ముక్కు(చము)** నం. వి చ్ పుం మేఘము, మబ్బు

**వార్యము** నం. విణ (అ ఆ అ) 1. నివారింపఁ దగినది, అడ్డగింపఁదగినది. 2 వరింపఁ దగినది, కోరఁదగినది.

**వార్యోద్భవము** నం. వి. అ. పుం. జలగ.

**వార్వణ** నం. వి. అ. స్త్రీ. మఱికాలివేసము, ఒకజాతి యోఁగ.

**వార్వపుటగ్గి** వి. (వార్వము+అగ్గి) బడబాగ్ని.

క. అగడితలోఁగెందామర, మొగడలు గనుపట్టెఁ జాల మూఁకై చూడన్, దగి మున్నీటందేలుచు, బెగడని వార్వంపుటగ్గిపిల్లలు వోలెన్ యయా. 1. 80

గీ. అరయఁ దీవంచవార్వంపు టగ్గిపట్ల, నడుము నడరొందు వాఁడెంపుఁ బుడమిఱేఁడు, లెల్లఁ గదలింపలేని యువ్విల్లు దునిమె, నిప్పుడీతని మగతనం బెన్నఁదరమె అ. రా బాల 184

(వార్వపుటగ్గిపట్టులు = సముద్రములు.)

**వార్వము** వి వారువము.

గీ. వఱలు నేనిక తిండి వార్వమును దొలుత, గాఁగఁ దానెక్కి .. కళా. 3. 62.

జ. వార్వపుటగ్గి

**వార్షము** నం విణ. (అ. ఈ అ) 1 వర్షసంబంధి, వర్షాకాల సంబంధమైనది. 2. సంవత్సరమందైనది, ప్రతిసంవత్సరము వచ్చునది.

**వార్షికము** నం విణ. (అ ఈ అ) 1 వర్షముల సంబంధమైనది, వర్షాకాలసంబంధి 2. ప్రతిసంవత్సరము వచ్చునది 3. సంవత్సరమునకు వచ్చునది, ఏడాదికి సరిపోవునది

వి అ న ఒకానొక మందుదినుసు చెట్టు

**వార్షిల** నం వి అ స్త్రీ వర్షోపలము, వడగల్లు.

**వార్షుకము** నం విణ (అ ఈ అ) వర్షించునది, వర్షించు మేఘము.

మ. ... లవణాబ్ధి స్నీరము న్గ్రోలివార్షుకము ల్దియ్యనినీరముల్ గురియునే చోద్యంబుగా కెయ్యెడన్ .... దశా. 1. 88.

**వార్ష్ణేయుఁడు** నం వి. అ పుం 1 వృష్ణి సంతతివాఁడు. 2. కృష్ణుఁడు 3 నలుని సారథి

**వాఁఱంటువిల్లు** వి (వాఁఱు+అంటు+విల్లు) రాళ్ళ పనివాండ్ర వాఁఱుకట్టిన పెద్దవింటికోల. (శ. ర)

**వాఁఱు** వి. (త. వార్.) సన్నగాఁ గోసినతోలు.

సీ. ... హారంబు బరు వని యలయు లతాతన్వి వాఁఱుల నెట్టికై వడిధరించు .... చిత్రభా. 8. 111.

వ. ... కురువేరువాఁఱులును తమ్మితూండ్ల ప్రక్కల పల్లంబులును గల పచ్చ చెక్కల పాలమాయి నెక్కి ... సానందో. 5. 136.

జ. వాఋంటువిల్లు, వాఋకోల చంద్రా 2 38

**వాఋకోల** వి (వాయి+కోల) కళ, కొరడా

వ ... గిలుకలుగదల్చి తగు వాఋకోలలువైచిన వీథి వీథుల జగన్మోహనంబుగా నటించు నాహా వంబుల మోహారంబులు చూచుచు. కుచేల 2 10.

**వాఱెన** వి. 1 వేఁట కుపయోగించు సాధనము

ఆ ఉరులుజిగురు గండెదెరలును బోనులు, వాఋ వాఱెనలును వసులు గసులు, మిళ్లుపలలు పేట్లు గోళ్లు దీమంబులు, నాదిగాఁగఁ దెచ్చి రాటవికులు. పి శకుం 1. 116

2 ఒకవిధమైన పగ్గము, బలమైన త్రాడు.

ద్వి. ఘోరునమ్రోకులు గోరెవాఱెనలు, గోరె యనుచు వింత గూడబెట్టుచును పండితా దీక్షా 40 పా

సీ. . జలజనాభుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి, వాఱెనయుఁ జక్రరక్షకద్వయముఁ ద్రుంచి, కల్లుబిల్లలుచేసి వెగ్గలమునవ్వె ఉ వారి 3 99

ఉ. పగ్గపుం, ద్రాడును మోకువాఱెనయుఁ దాలిచి ముందఱ వెన్కఁజుంగు ద్రేలాడఁగ. శేష 4 ఆ.

**వాఱెనపీఁట** వి (√ వాఱెన) ఏఁడికోలకును కాఁడికిని నడుమ చేరికగానుండు కొయ్య (శ ర)

**వాల** సం వి ఆ స్త్రీ 1. కొబ్బెరచెట్టు. 2 పసుపు (వృ వి). 3 మల్లెతీఁగ. 4 త్రుటికాలము

**వాలంపఱ** వి (వాలు+అమ్ము+పఱ) బాణసమూహము

క కాళింగుని కరిఘటలం, గ్రాలి కలము దూల నడచు ఘనపవనమువ, ట్లాలంబున వాలంపఱఁ, దూలించిరి దోర్విలాసదుర్దము లగుచున్. హరి. ఉ 3. 123.

**వాలకతనము** వి (వాలకము+తనము) మోసము.

గీ. వాలకతనంబుమాని నిశ్చాయ్యకులగతి, కోకిలా యేకడల నీడుకాకలివి, రావములరంగ నీభోజ రాజసహజ, వినయ మెనయంగఁ గొల్చుమీ వేడుకలర. ఇందు. 4. 59.

**వాలకము** వి. 1. వేషము.

సీ. .. ఒకవేళ మాఋవాలకముతోనసి సహాయం బుగాఁ బురశోధనం బొనర్చు .. కువల. 1 98

గీ. వేషమగు వాలకమ్మువాఁగ, వేన మన. ఆం భా 2 149

ఉ ప్రాజ్ఞుఁడు తజ్ఞుఁడుత్తముఁడు పావనమూర్తి మరుత్సుతుండు సర్వజ్ఞుఁడుగానిచోఁ దపసివాల కముల్ విలువమ్ము లున్న వంచజ్ఞత నమ్మి కున్న పవనాత్మజు నమ్మఁగఁ బల్కి మమ్ము మా ప్రజ్ఞ లెఱింగి సత్యమృదుభాషల సంధి ఘటింపనేర్చునే సమీర 3 8.

వ ... ఇబ్బాలికులు మనవాలకపు సొమ్ములందు నేమేనియు నపహరించుటకు వత్తాడుచున్న వారు ప్రభా. 1 107

2 మోసము

చ శుకుఁడను దూత పంక్తిముఖచోదితుఁడై చను దెంచి కీశసైనికనికరంబు పెంపు ధరణీవరు తెంపును జూడవాని వాలకమొకవీర వానర లలాముఁడు కన్గొని పట్టితెచ్చి కామకయిడ రాఘవుండు కృపనూల్కొనఁగా విడిపించి పంచి వన్ రామా 7 162

జ వాలకతనము.

**వాలఖిల్యుఁడు** సం. వి అ పుం = బాలఖిల్యుఁడు, ఒకానొక ఋషి.

**వాలధి** సం వి ఇ పుం ఏనుఁగు, గుఱ్ఱము మొదలగు వాని తోఁక (శ. ర)

**వాలపాశ్య** సం వి ఆ స్త్రీ జడబిళ్ల, పారితథ్య (శ. ర)

**వాలము** వి. (సం వ్యాలః) బెబ్బులి, వ్యాఘ్రము.

క వాలమ్ముల దంష్ట్రాశిర, వాలమ్ముల నెత్తి సెలసి వాలమ్ములపెం, జాలమ్ములఁ దగిలిన కిటి, జాలమ్ముల దూఁకె నింద్రజాలమ్మనఁగన్. సారంగ. 1 102

**వాలము** సం. అ పుం 1. ఆచ్ఛాదనము. 2. జుట్టు, 3 గుఱ్ఱము, ఏనుఁగు మున్నగువాని తోఁక వెండ్రుకలు. 4. తోఁక. 5. అయి దేండ్లఁ యీడుగల ఏనుఁగుగున్న. 6. గుఱ్ఱపుపిల్ల. 7, మత్స్యవిశేషము.

**వాలయించే = వాలాయించే** స. క్రి. నిర్బంధించు.
క ... ఏవారికి నిన్ను వాలయింపఁగ నేలా ....
భోజ. 5. 352

**వాలఋగుడు** వి (వాలు+అఋగుడు) వాఁడి క్రోఁతి, తోకలేని క్రోఁతి (శ. ర)

**వాలహస్తము** నం వి అ పుం 1 వెండ్రుకలు గల తోఁక 2 వెండ్రుకల సమూహము (శ ర.)

**వాలాయము** వి 1 నిర్బంధము, నిరోధము
శా త్రైలోక్యంబు భుజాప్రతాపమున నిర్వక్రంబుగా నేలుచున్, హేలాహుంకృతిఁ గామగత్రి నగరీహృద్యప్రచారంబులన్, వాలాయమ్మున మమ్ము వెట్టిగొనుచున్ వర్తింపుచున్నారు మీ,రాలస్యం బొనరించినన్ బ్రతుక శక్యం బెట్లు మాకోంట్లకున్. భీమ 4. 119
శా రావై రాగ్యముఁబూని నీవు కడునిర్దాక్షిణ్యచిత్తంబునన్, రావై తేజివిగాని యిందులకు వాఁరాహాఁరిగాఁబోరిమే, లా వాలాయము సేయఁగా బ్రతుకు నీవాచారమంతుండవై . మను 3 94.
2. ఎల్లప్పుడు
శా .. కేళిం దేలఁగ వేను దుంబురుఁడు సంగీతప్రసంగంబులన్, వాలాయంబుఁ గరంగఁ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా భాగ 7. 102
విశ. 1 అనివార్యము
శా పౌలస్త్యాన్వయ చంద్రకూరులకు సౌభ్రాత్రంబు బాంధవ్యమున్, వాలాయం బన వచ్చునే . ఉ రా 2 227
సీ ... సుతులు పుట్టిరయేని సుతులకు మృత్యువు వాలాయమై వెంట వచ్చెనేని, బ్రహ్మచేతను వీఁడు పాటేమియును లేక యుండునే నదుపాయ మొకటి లేదె .. భాగ. 10 పూ. 88.
2. అనుకూలము.
క. ఇలు పతిసౌఖ్యములకిల, వాలాయంబైన దాని యాలిన వమ్మున్, అలాగువఁ గాకుండినఁ, గాలుని పెనుదూత కదర కదియఁగ వేమా, వేమ. 2. శా. 209.
3. నిరంతరము.
సీ. .... ఆ వేలుపు తేలికఁ జుట్టి రావేను చేతు,అ వెడల్పు వేల వాలాయంబుగాఁ గన పూడ్చి యల్కి భజించుచున్న జనుల, చేతఁ బూజలు గొను బూతనా బూతవారి భర్త . పాండు. 5 67
4. యథావిధి, విధివిహితము
సీ. వత్సరార్ధమునందు వాలాయముగఁ జేసి రన్న సంప్రాశనం బర్భకునకు . కాశీ 4. 13
5. అవశ్యము, తప్పక
క. వేలం బాతిన వన్యుల, పాలవు ధనమొండె మ్రుచ్చు పాలవు ధరణీ, పాలునిపాలవుఁ గావున, వాలాయముఁ గుడువ విడువ వలయున్ధనమున్ విక్ర 2 178
క. ఏ యెడ నవదలమొబ వా,లాయము విన వలయు దుర్బలప్యబలంరా,జా యన వినవే ధరణీ, వాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్ మనుచ 4 74
క దూలాలు పెంకినుండిన, వాలాయము చేటు వచ్చు వసుమతిలోనన్, లోలాక్షి విడిచిపెట్టిన, మేలిమిగా బ్రతుకవచ్చు మేదిని వేమా వేమన 3. శా. 247
జ వాలాయించు.

**వాలాయించే** అ క్రి అభినివేశమూను, పట్టు పట్టు
శా. ... వాలాయించి యొనర్తురా జనులు దేవ బ్రాహ్మణారాధనల్ ... విక్ర 2 145
క వాలాయించి వనమ్మున, నేలమ్మ తపంబు సేయ నిళకుంభకుచా ... వీర 2 223
స. క్రి = వాలయించే (√ వాలాయము) నిర్బంధపఱచు
క వాలుంగంటి నిలువుమని, వాలాయింపంగ నేఁగ వలయు ననుచు న,వ్వాలు మగఁడు మెఱుఁగారెడు, వాలుసహాయముగ మగిడి వచ్చెం బురికిన్. ద్వా 4 284.
వ. ... నీవు ప్రియంబుగూర్చి రమ్మని వాలాయించెదు మదీయప్రకారంబు వినుము ... ధనాభి 2. 72.
వ. .... వాలాయించి యడిగినప్పు డియ్యకొని యిప్పు డిటుచేత నా భాగ్యంబు కాక మీ రేమి చేయుదురు ... భోజరా. 7. 94.

**వాలారు** (వాలు+అరు.) విశే 1 దీర్ఘమయినది

సీ. తానిఁ గైవ్రాలిసతమ్మి రేకులభంగి వాలారుఁ జూపులు ప్రాలుదేర .. విక్ర. 7. 102

శా. . వాలారుం గన్నుల మీఁదు చూచుతటి ... ఆము 5 11

మ అంభోజాతి వాలారు జూపులఁ దేలించుచుఁ బల్కు .. దశా 2 364

2. మనోహరము, ఇంపైనది.

మ బెరసె న్నేస్సన నిగిడ్చినట్లు వశు లుబ్బెన్దర్ప లాంగంబు లంకురములూసపె రదంబు లంఘ్రుల వడంకు ద్దీజె వాలారులై, కరజంబు ల్పిగిరించె ... పారి. 5 48

సీ జలజసంవ్యాలిశిఁగాఁ జనుదెంచు రయమునఁ దొరఁగిన చెమట బిందువు లనంగ, గహ్వరస్థలి విత్తఁగాఁ దెచ్చి నెఱపిన వాలారుఁజలివిత్తనా లనంగ, లలి మించు శాఁదలతిన్నఁ జాఱఁగఁ ద్రోలి లిఖయించు వరజయలిపు లనంగ ... చంద్రా 4. 55

3 వాఁడియైనది

సీ వలరాజు పాటించు వాలారుటమ్ములు గామినీ రూపంబుఁ గాంచె వోక్కొ . భా రా. అర. 2 86

మ మరువాలారుశరంబులం దొరఁగు కమ్మం దేనెతోఁ గూడి . నైష 2 99

శా వాలారుంగొనగోళ్ల నీ వలసత న్వాయించుచో నాటకు, వ్నేశంబై నవిపంచి విన్న మొదలు న్నీ వంటమింజేసి యా, యాలాపంబె యవేళఁ బల్కెడు . మనుచ 3 57

అ క్రి 1. ఒప్పు

అసంబాధ – వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్. వాలారున్ గోవిందవరదధ్రువ వాత్సల్యా, కాళిందీప్రాణేశమత నసగగ ప్రాప్తిన్, జాలాభాన్వద్విక్రమమునమ వసం బాధల్. అప్పక 4 221

2. ఉపశమిల్లు, క్షీణించు

గీ డప్పి దీఱంగ మధురకాండంబుఁ గ్రోలి, కడుపు నిండంగఁ దూఁడుఁ దీఁగలు భుజించి, యెండ వాలారు నంచాకఁ నిండు కొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించెనతఁడు శివరా. 3. 27,

క పలిక సింగవ యచ్చో, సోలుచు విరహానలాప్తి గ్రుక్కి వగచుచున్, జాలింబొందుచు నేడ్చుచు, వాలారుచు నింక నేటి వల పనుకొనుచున్ .. చంద్ర. 2 85

**వాలార్చు** స క్రి (√వాలారు) 1 కత్తులు జళిపించు

సీ హరిరాజ సమమధ్య లంకించి వాలార్చఁ గరికుంభకుచలు పరాకుఁ జెల్ప వీర 1 126

2 పరీక్షించు

ద్వి వడిగొని డగ్గరి వాలార్చి చూచి బస పు 5 559 పం

**వాలి** సం వి శ. పుం న్ పుం. సుగ్రీవునియన్న. అంగదుని తండ్రి.

**వాలించు** సం క్రి (√వాలు) 1 వాలఁజేయు, నేలఁ గూల్చు, ఖండించు

మ అరుదారం బరగండభైరవుఁడు వీరాకారుఁడై వైరి భూవరుఁ దుండించి ఘృణాచికిం బ్రియ సిగా వాలించు కావ్యా 2 113

సీ. కరము వాదిడు మామయురము వాలించు మొక్కరము వాఁని మేలికరము వాఁడ ... ప్రబంధ 1 217

2 తర్జించు.

క. వ్రాలిన చెల్లాచెదరై, నేలం దిల లొలికెనంత నివ్వెఱఁగున న,న్నిలాలక చూచునెడన్, వాలింపక నతికిఁ బ్రాణవల్లభుఁడనియెన్. వేం పంచ. 2. 104

వి నేలఁ గూల్చుట

పి తలతలతల మంచుఁ దలమించు వలిమించు వాలించు వలిప పావడలు గట్టి . రా వి. 3 117

(ఇట సౌమ్యద్యోతకము)

**వాలిఁడి** వి. (వాలు+ఇఁడి) తోఁక లేని కోతి విశే. తోఁకలేనిది (శ. ర.)

**వాలిక** విశే (√వాలు). 1 దీర్ఘము, పొడుగు

మ ప్రకటస్నేహ మెలర్చ నాతనిపయిం బద్మావతీ కాంత వా,లిక క్రొవ్వాఁడిమెఱుంగుఁ జూపులని ఫాలిం జెంగు వాలించుచున్. విక్ర. 8 24.

క. పనిపూని శాశికింజని, పనరుహాలోచనుఁడు వెడఁద వాలికకమ్ముల్, తనకుఁగల ఫలము గనియెం,బనివడి తద్విభవలక్ష్మిఁ బరికించు నెడన్ కాశీ 6. 70.

క. వాలికలై విరిదమ్ములు, యేలికలై భావభవుని యెలదూపులకుం, బోలికలై యుత్కలికల, మాలికలై యబలఁ దాఁకె మటి నృపుచూపుల్. పి శకుం 2. 88.

2. వాఁడియైనది.

సీ. వెడఁద యమ్మున నేసి వెండియు మూఁడు వాలిక యమ్ము లొడలఁ గీలించి . భార భీష్మ 1 272

ఉ. వాలిక దొడ్డనారసము వజ్రము శైలముదాఁకు శాకృతిన్, ఫాలము మీఁదఁ దాఁకిన(న్) భార. ద్రోణ 1. 358.

సీ ప్రణతుల కాయువుల్ వ్రాయు తూలికనాఁగ వాలికతూ పొక్క_కేల నమర .. వాల్మీకి 3 150

వాలికనడ వి (వాలిక+నడ) అశ్వగతి విశేషము

వ ఇట్లిచ్చి యనిపి పోడియము జంగనడయు వాలిక నడయునుం గలుగు వారువంబు వదలించి వాగె వదలి జిరాగనగనం గదలించి తోలిన ద్వా 8 71.

వాలు అ. క్రి 1. విజృంభించు

ఉ. వాలి యతండు బాహువిభవం బలరించినఁ బేర్చి రౌద్రతం, గూలు గజంబులుం గెడయు గుఱ్ఱపు తండము .. భార శల్య 1 155

చ. ... దేవ నీ,వలన వరంబు లిట్లుగొని వాలిన దైత్యుఁడు మమ్ము నింక నే, క్రియలఁదుల నైఁచునే ... హరి పూ. 4 22,

సీ. . తిమిరారి దోఁచిన దీనత పెంపునఁ దెమలిన చీకటిగము లనంగ,

గీ వాలి చరియించుఁ బరి మదవారణములు, దారుణాహవాంభోనిధితారణములు విక్ర 1 85.

2. అతిశయించు.

ఉ వావిరిఁ జెప్పఁగా వలసె వాలిన దుఃఖము ధాత్రిఁ గ్రాఁచివన్ ... భార. శాం 1 117.

చ మల్లి దేవఁ డ,చ్చెరు వగుచున్న పొత్తపియ చెన్నగు పిడుగ వాలి పాకనాఁ, టిరువదియొక్క వేయిఁ జననేలుచు ఆ. పా వ ప. 8.

ద్వి వాలిన తేజమ్ము వమ్ముగా జేసి, యేలయో దీనోక్తు లిట్లాడ నీకు . రం రా అయో. 99 పొ 31 పం

క ఈలీల దుర మొనర్పఁగ, వాలినదర్పమున బభ్రువాహనధరణీ పాలుండు తేరు గదియం, దోలించి సురేంద్రతనయుతో నిట్లనియెన్ జై భా. 5 178

3 (పక్షి) కాలూను, క్రిందికి దిగు

గీ ఈగ వాలిన నందంద యెలుఁగు లొసఁగు, వట్టి సకినెల మంచములు మనుచ 6 3.

సీ ఇది మింటఁ బఱచు పక్షీంద్రుఁ జూపిన నీడబడి వాలునంచాకఁ బఱవఁజాలు మనుచ. 4. 31

4 ఒఱఁగు, కూలు.

వ్యవ మామిడికొమ్మ యింటిమీఁదికి వాలినది

సీ. సురపథం బొకవేళ సోలి వాలినఁ గాని ఊతిరాఁ గయై యఱచేతనొద్దు ... ఘటికాచల. 1. 50.

5 ప్రసిద్ధికెక్కు

చ అరుదగు చున్నజన్మసమయగ్రహయోగబలంబు పెంపునన్, వరరుచియై దిగంతములవాలుఁ జతు ర్దశ సంఖ్య విద్యలన్ . విక్ర 1 172.

క ఫాలాక్షుని చాపము బా, హాలఘుసత్త్వమున విఱిచితని జను లెన్నం, బోలమహేంద్రాద్రిని విని, వాలిన నీలావు చూడవచ్చితి నిటకున్ భా రా బాల. 726

సీ హరిహరాబ్జజుల ముప్వురఁ దనూజులఁ జేసి వాలిన యది పతివ్రతయ కాదె భోజరా 6 197

ద్వి నీలావు లావుగా నిఖిలలోకముల, వాలుదు వెందు దుర్వారుఁడ వీవు రం. రా. యు. 539 పొ 2. పం

6 అనక్తమగు.

క భాగ్యమనై యిహపర పరి,భోగ్యార్థమనై యగ ణ్యపుణ్యమనై వై,రాగ్య జ్ఞానోన్నతులగు, యోగ్యతములపాల వాలియుండుదుఁ జమిన్ని పాండు 4 108.

7. ప్రకాశించు.

చ. ... బాహుబలార్జితశత్రుమండలో, జ్వలధన వంతులై మహిమ వాలుదు రప్పురిరాజ సత్తముల్ భా. రా. బాల 31

చ. తల గడుగంగ మర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో, జ్వలకలమాన్నభోజనము చందన చర్చ ప్రసూనదామకంబును కపురం పువీడ్యమును భూషణపంక్తులు కల్గి నిచ్చలున్, బులుగడుగంగబడ్డ నునుముత్యము బోలుచు వాలుచుం బురిన్ పాండు. 3 9

సీ. గీ కాక భూపాలుచే వాలు కఱకువాలు, కరిన శితకోటిశతకోటిగాఁ దలంచె, నేమొ ... దశా 1 115

8 ప్రేలు.

సీ ప్రాయమింకిన వాలుపాలిండ్ల వెలయాండ్రు పడుపు పుట్టక మూలఁ బడి కృశింప ... వేం. పంచ 4 230

క. లోలయగులోలలోచన, వాలుంజమదోయిఁ గేల వడిఁ బట్టుక ను,య్యాలో జంపాలోయని, ప్రేలుం గృష్ణుండు పఖులు విక వికనవ్వన్. దశా 8 195

9 ప్రవేశించు.

క ఇప్పుడు, వానలు వెలిసెను శరత్తు వాలఁగఁ జొచ్చెన్ భా. రా కిష్కిం. 485.

("శరత్తు' అని ముద్రిపా )

10 పడు

ద్వి రాతుమండపు గాక రాజవానీవు, వాలు వైరులమీఁద వాలునీవాలు, వాఁగంటులం ద్రుంప వాలె యీవాలు .. ద్వి. హరిశ్చ ఉ 2484 పం.

వ త్రి వహించు

ద్వి వాలియు నేనును వడినొక్కవంశ, వాలిత మొకవంక వాలినవారు, సురగరుడోరగాసుర సిద్ధసాధ్య, వరు లందఱును క్షీరవారిధిఁ దరువ రం రా కిష్కిం 203. పా 23. పం

వి (సం వాలః ) 1. కత్తి.

క. వాలుపయి నడచునట్ల, బ్బాళిక ... భార ఆది. 2 156

క పలకయు వాలును గొని ఆ,క్కలు గల పెను బాముపగిదిఁ గవిసిన . భార భీష్మ. 2.191.

సీ శశికాంతి చెంగావి దశమలంచినకేల స్వర్ణ త్సరువు వాఁడివాలు మెరయ . ఆము. 2 75

2 తీక్ష్ణత

సీ. మూర్చెట్ట నోపని ప్రమాఁకులేర్పుట యెంత వా లగువని వవవహ్ని నవ్వు . కం పం 10 526.

గీ ఏదివినుజాలు కనువాలు నిక్కికేలు, నేది తోల్చిర మెడచార యెముకకోర, యేది నెలకూన సామేన నిడిన చాన,యితఁడు జేజేల దొరయని యెటుల నందు. చెన్న. 3 53.

3. ఏటవాలుచోటు

క కైవాలు పండుపంటల, కైవాలు మొకమ్ము లామికైవాలుటచో, నీవాలువ నీవాలున, నీవాలున నీప్రశస్తి నెలపఁగవలయున్ ప్రబంధ 169

4. ప్రవాహము

వ పూఁదేనియ కాలువ వాళ్లసుళ్లంబడి వడి వడిం దిరుగు మరునికెంపు బొంగరంబులుం బోని మెటఁదామర మొగడలును .. యయా 4. 13.

5 తడవ, తూరి, పర్యాయము

చ ... బలాఢ్యులు రాత్రిచారు లె,య్యడఁ దగ దీరసంబు ఒలహీనులకున్ మనబోటి వారికిన్ .

క ఈ వాలువచ్చి రేవం, జావం,గానున్న వారిఁ జంపెద రహితుల్, దేవా సంధియనూన కు,భా వహ మొనరింపు మస్మదా దేశమునన్. వేం. పంచ. 3. 18.

క ఆలమ్ముల వాలమ్ములు, గీలమ్ములఁ గప్పు నసురఁ గనిసి యొకఁడు క్రొ,వ్వాలున నొక వాలునఁ గర, ఖేలనమునఁ గేలుఁ గాలుఁ గీ లెడలించెన్. లక్ష్మి వి 2. 81.

6 దైర్ఘ్యము, పొడుగు (శ. ర )

విశ 1 దీర్ఘము

సీ. వాలుగాఁ గైవ్రాలువేలువు పూబంతిచాలు ఫైలైన వాసనలు గుప్ప ... రాధా 1. 122.

సీ సొగసువాలు మెఱుంగుచూపు లాళావీథి కలఁ
గల్వ విరిమేలుక ట్లమర్ప ఉ రా. 2.124
సీ, . . ఎడఁదకాఁపురపుఁ బుత్తడి బొమ్మనిడు
వాలుకన్నులా యీ వాలుగన్ను లరయ
దశా, 1 164

2 అధికము
ఉ వాలుమగంటిమిన్ దనుజవల్లభుఁ డల్క
వహించి యెవ్వఁడో, శైలమునన్ గుణస్వనము
సల్పెను బాపురె వంటయింటఁ గుం,దేలిది
చొచ్చె రక్తములు తీవ్రతఁ గ్రోలఁగఁ గల్గె
నంచు ను,త్తాలశరాసనాంచిత గదాతురి కాసి
ముఖాయుధాఢ్యుఁడై రుక్మాం 5. 20.

3 క్రూరము
ఆ వాల్మృగములఘోరవన మని వగవక,
మఱచి యుండి రేమి మాడ్కి యొక్కొ .
భార ఆది 6 178
ద్వి ముదమొప్ప రాజ్యాంగములు పరికింతె, వద
లక నిర్జింతె వాలుశాత్రవుల ... రం రా
బాల 58 పా 22 పం
సీ ... గీ ... వాలువైరులఁ జెండాడు వాలు
వాని పద్మనాభుని వీక్షించెఁ బద్మ యపుడు.
దశా 2. 257.
ఉ ద్వైతవనంబునట్టి సుఖవాసము గోవులకెందు
లేదు ధా,త్రీతలనాథ యిప్పుడు ప్రదీప్తములై
సతతంబుఁ జేర్చి గో,వ్రాత భయంకరంబులగు
వాలు మృగంబులు నంచరించు మీ,కాతెఱఁ
గెల్లఁ జెప్పుటకునై యిటవచ్చితి నేను జెచ్చెరన్.
భార అర 5. 360

4 మనోజ్ఞము.
గీ గొప్పకన్నులు నిడువాలుఁ గురులఁ జెలఁగు,
కాను నీలా. 1 88
గీ, చూడ వేటికి నిడువాలు సోఁగమీల, మూడు
పట్టంగఁ జాలెడు చూపుఁ గొనల . . నైష
8 50
వ సోమ సూర్యాత్మకంబులగు వెడందనిడువాలు
కెజ్జనెరలకన్నులం గెందమ్మిఱేకుల వెద
చల్లువాని . ఆము 6. 98
క. వారిద్దఱవాలమ్ముల, బారిం బడి యర్జునునకు
బ్రదుకవశమె . భార ఉద్యో. 4 191.

అ. అట్టియెడ శిఖండి యాపగాసుతుమీఁద, వాలు
టమ్ము లేయ వానినేయ భార భీష్మ
3. 379
చ. కులిశసముజ్జ్వలద్విశిఖకోటులమాలికరాలఁద్రుంచి
త, జ్జలదనిభాంగమున్ గదియ శార్ఙి మెఱుంగులఁ
బోలువాలుఁ దూ,పులు నిగుడింపఁగా నవియుఁ
బోయి తదీయ శరీర రక్తమున్, బలువిడిఁ
గ్రోలెమున్న మృత పానము సేయు సురౌఘముం
బలెన్ ఉ రా. 2. 73

6 మృదువు.
(తారాది కామినులు.)
ద్వి వాలిగూలినమాట వజ్రమైతమదు, వాలు
గుండెలునాఁట వసుధపైఁ గూలి .
రం రా కిష్కిం. 214 పా. 12 పం
జాబిలినవ్వువాలు = చంద్రహాసము అచ్చ. రా. సుం
34
జ వాలంపఱ, వాలఱుగుడు, వాలారు, వాలార్చు,
వాలించు, వాలిండి, వాలిక, వాలికనడ, వాలుఁ
గంటి, వాలుఁగన్ను, వాలుకొంగ, వాలుగడుపు,
వాలుచు, వాలుచుక్క, వాలుచూపు, వాలుపు,
వాలుప్రొద్దు, వాలుమగఁడు, వాలుమీను, వాలు
మెకము, వాలురమ్ము

వాలుఁగ(ల్గ)ంటి వి (వాలు + కన్ను) 1 దీర్ఘము
లైన కన్నులుగల యాఁడుది
సీ. . నాటితప్పునకు నీనవబోండ్లతో నాకు వర
వుడై యున్న దీ వాలుఁగంటి .. యయా.
4 57.
శా. వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛా
ప్రదానక్రియా, హేలాలోలుఁడు హరిశ్చ.
3 164
ద్వి రాఘనుండవుగాక రాజవానీవు, వాలు వైరుల
మీఁద వాలునీవాలు, వాలుఁగంటులఁద్రుంప
వాలెయీవాలు . ద్వి హరిశ్చ ఉత్త 2484
ఉ వింటగుణంబుఁగూర్చి రఘువీరుఁడు పంటవలంతి
నన్నవా,ల్గంటిఁ బరిగ్రహించు క్రియ
చంపూరా 3 109
మ .. అ, వలఁపుంగ్రొవ్వుదీవి యామగువ యా
వాల్గంటి నీకేతగున్ . నీలా 2 28.
2. భార్య

ఉ. ఇంటికిఁదెచ్చి యోగి పరమేశునకున్ వణిజుండు తాను వాల్గంటియు భక్తియున్నయము గౌరవ మున్వినయంబు నాత్మలో, నంటికొనన్ ... హర 2 89

**వాలుఁగ(ల్గ)న్ను** వి (వాలు+కన్ను) సోగకన్ను
సీ దీర్ఘలోచనములు వాలుఁగన్నులనంగ వఱలు చుండు ఆం భా 3 60
సీ .. అసమాన నీలోత్పల సమానరుచులొంది కలికిసోయగపు వాల్గన్నులలర ఉ రా 1 254

**వాలుక** నం వి ఆ స్త్రీ 1 ఇసుక. 2 చూర్ణము, పొడి 3. కర్పూరము. 4 ఒకజాతి దోస, నూఁగు దోస (వృ వి) 5 (వైద్య.) యంత్రభేదము. 6 కాలజ్ఞానమున కుపయోగించు యంత్రవిశేషము, వాలుకాయంత్రము

**వాలుకాత్మిక** నం వి. ఆ స్త్రీ శర్కర, చక్కెర.

**వాలుకాస్పర్శ** వి రత్నదోషము
ఆ పటియిసుకవంటి నెరుసులుగలిగియు, మహిని వెలుఁగునీల మణియ నైదు, వాలుకాస్పర్శనా వరలుచున్నట్టి, దానిఁబూన మేలు దొలఁగి పోవు
(ఈ పద్యమున యతిగణభంగము లు గలవు) రత్న పరీక్ష, 66

**వాలుకి** నం వి ఒకజాతిదోస, నూఁగుదోస (వృ వి)

**వాలుకొంగ** వి (వాలు+కొంగ) వక్కకొంగ, బకము (శ. ర.)

**వాలుగ(గు)=వాలువ(వు)** వి చేఁప, మత్స్యము
క గాలపుటెర యిచ్చికవా, వాలుగలం దిగిచికొనుట వక్రరిపుఁడుదా, నేలోఁబడునంతకు బల,శాలి యుదాసింబుఁ జూపఁ జనునొక్కయెడన్ కవి 2 42
గీ అనుచుఁ బలికిన జనపతి మనుచువేడ్కఁ, బెనుచు వాలుగ మేలుగాఁ గనుచునవియె .. దశా 1 136.
ఉ. వాలుగమీలనేలు నిడువాలు కనుంగవ మేలి జాలువా, డాలుగఅంచుమేను రసిక 3 55
పీ. దరహాసరుచి గాంగఝురిగీలుకొనవాలుగల లీల బెళుకు వాల్గన్నులలర ఉ. రా 6 181.
సీ. కేలిమైనొక్కట లీలఁగ్రేళ్లుఱికెడు వాలుగు సోగల నేలుదెంచి ... భా౦ విరా. 2 63
గీ వాలసిప మౌను వాలుగు వాలుగ యన . ఆం భా 1 159
జ వాలుగకంటి, వాలుగతెంకి, వాలుగడాలు, వాలుగగన్ను, వాలుగపాము

**వాలుగకంటి** వి (వాలుగ+కన్ను) మీనాక్షి, స్త్రీ
సీ బలిమివానవుచెట్టు నులిమి వాకిటఁబెట్టు కలిమి వాలుగకంటి చెలిమివాని .. చంద్రా 1. 84

**వాలుగతెంకి** వి. (వాలుగ+తెంకి) మత్స్యవిశేషము (శ. ర.).

**వాలుగడాలు** వి (వాలుగ+డాలు) మన్మథుఁడు, మీనకేతనుఁడు (శ. ర ).

**వాలుగ(ల్గ)డుపు** వి (వాలు+కడుపు) బొజ్జ (శ ర, బ్రౌ )

**వాలుగన్ను** వి (వాలుగ+అన్ను) 1 ఆఁడుచేఁప
గీ చంద్రుపై దోడు పూఁబోడి జళుకుతళుకు, వాలు గన్నుల బెళుకుల పైపునూపు, వాలుగన్నుల వలపింపవలయు ననియొ, దేవమాయపుమీన మైతివి పయోధి దశా 1. 212
2 ఆఁడు వాలుగచేఁప
సీ . స్త్రీ మత్స్యభేదముల్ దీర్ఘలోచనములు వాలుగన్ను లవంగ వఱలుచుండు ఆం భా. 3 60

**వాలుగపాము** వి. (√వాలుగ) మత్స్య విశేషము (శ. ర )

**వాలుచే(ల్చు)** స. క్రి (√వాలు) 1 వాలఁజేయు, వంచు.
ఉ బాలిక మోము మత్తవనబర్హి కిశోర కలాస్య లీలఁబై, వాలిచి పచ్చ కప్పురపు వాసనతోడి ముఖారవింద తాం,బూలము మోవి మోవిపయి మోపుచు రాధకు నిచ్చు ధూర్త గో.పాలుఁడు ప్రోచుఁగావుత యపారకృపామతి మంత్రి యన్న నిన్ భీమ. 1 3
ద్వి వాలిన కిన్కమై వాలునీవాడి, వాలువజిహ్వాలు వాలుతు ననిన ... హరిశ్చ పూ 1042
వ. తలవాల్చి యేడ్చుచున్నం గనుంగొని ..., శృ నైష 4. 88

ఉ. ఱెప్పలు వాల్చకప్పుడమిఱేని మనోహరమూర్తి నిచ్చలుం, దప్పక చూచిచూచి . . శృ. నైష. 1 67

2. ప్రవణము చేయు.

సీ. కాంత పుష్పాది భోగంబులిం పెసఁగిన వైరాగ్య విధిఁ దావాల్పుఁ జిత్త(ము) . . శివరాత్రి. 2 18

3 అతిశయింపఁ జేయు

సీ ... గీ కదియఁ గూర్చితి బ్రహ్మాండ కర్పరంబు, పరిధిగా వాల్చితిని మహావరణ జలము . శివ రాత్రి 1 75.

వాలుచే (ల్చె)క్క వి (వాలు+చెక్క) కుత్రుఁడు.

ద్వి అంత నిశాచరు లతిఖేద మొంద, వింతగ వాల్చెక్క వెడలియా వేళ, దెలతెలగాఁ దూర్పుదెస విస్తరిల్లె .. ద్వి శ. సా 3. 99. పా 2 పం

వాలుచూ(ల్చూ)పు వి (వాలు+చూపు) ఓరచూపు

సీ . ఏ రాయఁ జూచిన నిందీవర శ్రేణి వెల యించు వాలుచూపుల విలాస(ము) . . దశా 2. 239.

సీ. వాలు చూపవఁ బోల్చు వక్ర దృష్టి ... అం ఖా 2 144

క. డాలా మెఱుఁగులు గ్రొంబొగ, డాలా నెత్తావి మోవిదంబులు కోదం,డాలా కనుబొమ లతమని,డాలా వాల్చూపు లన మిటారి రహిం చున్ హంస 2. 338

సీ ... కలువఱేకుల యేపు ఖంజనంబుల రూపు నిరసించు వాల్చూపు నీటుదాని . ఉ రా. 2 266.

వాలుడు వి వాకారి (వృ వి )

సీ .. చీ సిగ్గు గాదొకో చేర మాకాటదియన్నఁ జెల్లెలు వావి యనెడు వారు ...

గీ. కోరి వాలుడు తైలంబుఁ గ్రోలువారు. కుములు కుంపటి శాకముల్ గోరువారు, నైరి యొక కొంద అచ్చలి వేం. పంచ 1 688

వాలు(ల్చు)పు వి. (√ వాలుచే) వాలుచుట, మోడ్పు

ఛ పులకల జగ్గునెమ్మి నెఱపుఁ జిగి నైమ్మోయి నిగ్గుఁ జెయ్యులన్, వలగొను సిగ్గు వింతయర వాలుపుఁ జూపుల కగ్గు . బిల్హ. 2 160

వాలుప్రొద్దు వి (వాలు+ప్రొద్దు) అపరాహ్ణము. (శ. ర.)

వాలుమగఁడు విశే. (వాలు + మగఁడు) శూరుఁడు

ఉ. . అ,వ్వాలు మగండు శాక్వరితవంబుఁ దలంచుచుఁ గ్రౌర్య ధుర్యుఁడై భార సౌప్తి 1 157.

సీ. రాయఁడ విను మతికాయుండు మొదలగు వాలు మగల్పెక్కు వేలు రక్కసుల ఱేని కొడు కులు అచ్చ రా యు 71

ఉ వాలుమగం డితం డనఁగ వానికి నెక్కి దశాస్యు శక్తిచే,నేలకు వ్రాలి మేల్కనని నిద్దుర నొందితి వయ్య తమ్ముఁడా . భా రా యు 1587.

వాలుమీకేశుఁడు మి వి. (సం వాల్మీకేశః) వాల్మీకి ప్రతిష్ఠితుఁడగు నొక దేవుఁడు.

ద్వి ఆవాలుమీకేశుఁ డాత్మఁ గలంగ ...బస. పు. 4. 763 పం

(ఇక్లే, "వాల్మీక దేవ దేవుఁడు," మొ )

ద్వి. దేవ ముస్నెఱుఁగవే యీ వాలు మీక, దేవ దేవుఁడల సత్ప్రీతి దొల్కాడ బస. పు 4. 726 పం

వాలుమీను వి. (వాలు+మీను) వాలుగ, ఒకజాతి చేప.

ఆ వాలు మీలఁబోలు వామాక్షి చూపులు, సోము సాముగోము భామమోము . . హంస 3 69

వాలుమృ(ల్మృ)గము మి వి (వాలు+మృగము )

1. పులి, వ్యాఘ్రము

ఉత్సాహ. వాఁడి మగఁడు నిద్రపోవు వాలు మృగముఁ బోలెనై, వీఁడె బాహ్లికుండు .. భార స్త్రీ 2. 98

శ్లో ప్రాతిపేయం మహేష్వాసం, హతంశేమేన బాహ్లికం, ప్రసుప్తమివ శార్దూలం, పశ్య కృష్ణ మనస్వినమ్ ... సం. భార. స్త్రీ 22 5

2. క్రూర జంతువు

ఉ పూచిన తీఁగెలన్ మధురభూరి ఫలంబుల వ్రేగుచున్ మహిన్, మోచిన కొమ్మలుం గలిగి మూఁక ఱ గట్టిన ఘోఁకమోకలన్,రాచిన్న

వాల్మ్పగంబులు దినంబడి వర్ణన చేయ నొప్పు విం,ధ్యాచల పార్శ్వశానన మవన్యవనీవిభవోప మానమై కేయూర. 3 10.

వాలుమె(ల్మె)కము వి. (వాలు + మెకము) వరాహము, అడవిపంది, క్రూరజంతువు.

సీ . వాలుమెకము

గీ పంది నలు గేకల మ్మనఁ బరగు ఘృష్టి .. ఆం భా 2 82

క అల్లదె కంటే పొనపొవ, తెల్లని గట్టుతుత మబ్బు దేటెడు పొలమం, దెల్లెడఁ జూచిన ధరణీ, వల్లభ సీరాముసేన వాలు మెకంబుల్. మనుచ. 4. 16

క కై వాలు పండుపంటల, కై వాలు మెకమ్ము లామికై వాలుటచో, నీవాలున నీవాలున నీవాలున నీప్రశస్తి నెఱపఁగవలయున్ ప్రబం 1 169

ఉ . వేఁటలాడుకోఁ, జయ్యనఁ బోయి యా యడవి చాయలఁ గంటిమి వాల్మికంబులన్ .. సారంగ 1 66

ద్వి వన్నెల పులుఁగులు వాల్మికంబులును, వీఱంప వెఱపును వెఱఁగును గాఁగ . ద్వి హరిశ్చ పూ 516 పం

వాలురమ్ము (వాలు + అమ్ము) వి వాఁడిగలబాణము

తే వంక యెత్తిన మన్మథువాలురమ్ముఁ, బోలె నెమ్మేను చక్కనై పొలుపు మిగిలె ... హరి పూ 9 35.

వాలువ(వు) = వాలుగ వి. మత్స్యవిశేషము

సీ. వాలువముకుదమ్ము పలై గండెర న త్తెగుజ్జు బేడిస జాతి కొలుకు మడిన . వేం. పంచ. 1. 294

చ. వడిఁ బుటమెత్తి వ్రాలు నిడు వాలువ చాలుపు లింత వంతపై, నిడులెలిగుంచెలం దెలుప .. వేం. పంచ 4 133.

క కోలగతి వడిచి యెత్తిన, గేలోగిఁ దెగి యెలుఁగుతోవ కేళ్లెగసి పడిన్, దూలె జల వాయ సంబా, వాలువుఁ గఱచుకొని దివికి వడి నెగయు క్రియన్ . కు సం 11 725

సీ కొట్టి మీనులఁ దండ్రి కొలువు లెంకల కిచ్చె వాలువులను సంగడీల కిచ్చె . . ద్వా 1. 221.

వాలువగ్గము విశ మిక్కిలి వశమైనది

ద్వి ధైర్యంబు దూలి వెన్కయుముందుఁ దోఁచక మూల, గూలి నీ చెలులతోఁ గూడుక మరుని, వాలమ్ములకు వాలువగ్గమై పాట్లఁ, బడిపడి బెండై తీఁ బాలకి యనిన,నుడురాజ వదన ని మ్నడికించినట్టి, ఘనుఁడల్లమ విభుండె కాని కాఁడొరుఁడు ప్రభులింగ 2 46 పా 23 పం

వాలూరు అ క్రి ఆలస్యమగు.

ద్వి. పలిన పతికార్య మెడరైన యెడమ, వాలూర వటు చేయువాఁడు మధ్యముఁడు .. రం. రా యు కాం 279 పా 11 పం

వాలెము = వాలాయము క్రి విశ 1. నిరంతరము, ఎల్లప్పుడు

క నీవార మనుచు నమ్మిక,తో వాలెము గొలుచు వారి దొసఁగుల పాలం,బోవిడిచి నిరాబారులఁ, గావించు చెనంటి వీవె కద పరికింపన్ .. అచ్చెరా యు 259

2 అత్యంతము

ద్వి దానికై వగరిలో ధరణీశ్వరుండు, లేనిచోనైన వాలెము బంకు లేక . వి సారంగ 1. 13 పు. 3 పం

క పలినవాఁడమ సింగఁడ, వాలెంబును దానిఁజూచి వలచినవాఁడన్ . చంద్రరేఖా విలా. 2. 104

3 అవశ్యముగా

చ నేలతాల్పయి,ప్పనిఁ దలఁబూని రక్కసుని బాలెము వాలెము బొచ్చి చేడియం, గనుఁగొని యుంగరం బొసఁగి క్రన్ననఁ దలమానికంబుఁ గై,కొని పఱతెంతు .. అ రా కిష్కిం 82.

వాల్కము నం విశ. (అ. ఈ అ) చెట్టు పట్టతోఁ జేయఁబడినది

వాల్కలము నం విశ (అ. ఈ అ) చెట్టుపట్టతోఁ జేయఁబడినది.

వి అ న నారబట్ట

వాల్మీ(ల్మి)కి నం విశ పుం శ్రీమద్రామాయణము రచించిన ఋషి

వాల్మికుఁడు నం వి అ పుం = వాల్మికి

వాల్లభ్యము నం వి అ న వల్లభుని ధర్మము, ప్రేమ, అనురాగము, వలపు.

**వాళి** వి. 1. పసులు పోవుదారి (శ ర.)
2 వాడుక.
వ్యవ. ఈ పని మనకు వాళిలేదు
**వాళించు** స క్రి. వాడఁజేయు, మ్లానతనొందించు
క. లాలించి స్వామి బిరుదులు, పాలించితిరనుచు నపుడె వదరక యుంటిన్, వాళించి విడుతు గర్వము, చాలించి సనంగ దాని సరి వారు వగన్ వాల్మీకి 3 26.
**వాళ్లపఱచువారు** విశ (వాళ్ల+పరచుట) గ్రుక్కుఁ జేయువారు, మ్లానత గల్గించువారు
ద్వి కుపితము లాలముల్ క్రూరముల్ వాళ్లు, పఱ చులు వికృతముల్ భ్రమితలు గ్రుచ్చులు ... వండితా పురా 116 పొ 21 పం
**వావదూకుఁడు** సం విశ (అ ఆ అ) బహుభాషి, వదరుఁబోతు
వి. అ. పుం వాగ్మి. వక్త, ఉపన్యాసకుఁడు
**వావాఁడి** వి (వా+వాఁడి) వాక్పారుష్యము
క లోవాఁడియు వావాఁడియుఁ, జేవాఁడియుఁ గలిగి మిగుల సీమారామా, గ్రావాగ్రహార జన పద, దేవస్థానాటవులను ద్రిమ్మరుకతనన్. ప్రబంధ 767
**వావాదము** మి వి (వా+వాదము) వాగ్వాదము.
క. నా విని ధర్మార్థికృతుల్, వావాదం బేలయేను వారము లెడ మీ,రే వివరము నాఁబవనాఁ,డావి ష్కృత బుద్ధిఁ దెలుపుఁ డరుగుఁడు మగుడన్. వేం పంచ. 1 725.
**వావాదు** వి (వా+వాదు) ఉపన్యాసము
సీ ... వావాదనంగను బరగునుపన్యాసము .. ఆం. భా 1 113
**వావి** దే వి శాస్త్రీయమైన సంబంధయోగ్యత, అను కూలమైన సంబంధ యోగ్యత.
ఆ వావిగానియట్టివనితఁ బొందిన పాప, మూఱు నెలలఁ బాయు సార్ద్రవస్త్రు, ధరణ భస్మశయన పరతఁ జాటించుచు, నియతిముండెనేని నృపవ రేణ్య. భా శాం 1 313.
గీ నీకునేనాటి తల్లిని నిజముసెపుమ, యమర లోకంబు వేశ్యలమైనమాకు, నిట్టిభగవులు నడవ కహీనబాహు, వీర్య యిచ్చట వావియు వెదవఁ బమనె. భార అర. 1 362.
ద్వి వావిఁ దమ్ముఁడఁగాని వాలి నీ కేను, సేవ కుండ సుతుఁడఁ జెప్పనేమిటికి . రం రా. కిష్కిం 205 పు 10 పం.
చ. మఱది యటంచు బావయని మామ యటంచును నల్లుఁడంచు నందఱకును నన్ని వావులిడి తచ్చు నలన్ మటుమాయసుద్దులన్ దశా. 2 366
**వావింట**=**వాయింట** వి బర్బర, ఒకదినుసు కూరాకు మొక్క. (వృ వి) (శ. ర)
**వావిక** వి కుత్తుక మొదటఁగల గుంట (శ ర, బ్రౌ)
**వావిడుచు** అ క్రి. (వా+విడుచు) 1 నోరెత్తు
క. అడిగితినే నిను నా క,వ్వాడి భుజబల మెట్టిదని యవారణ నీవి,ప్పుడు నృపులెల్లను వినవా,విడిచి పొగడెదిట్లు వంది విధమున వతవిన్ భార కర్ణ 2 99
(వావిడిచి=బిగ్గరగా, అని భావము)
క, .. దానవ, వల్లభుఁడట్లఅచుచుండె వా విచిడి వడిన్. నిర్వ. 4 94
2. దుఃఖించు
క దైవికములైన పనులకు, వావిడువఁ డవార్య ధైర్యవంతుఁడు. . వేం పంచ. 2. 25
**వావిరి**[1] వి. 1 క్రమము.
క అవల నాచేయంగల, యావిధమును మున్న యదియ యని మునుమట్టన్, వావిరి చెప్పఁగ నేలా, నావుడు నవ్విభుఁడు భీషణ స్ఫురణము నన్ హరి ఉ 1 163
క. కావున మనుజుఁడు సేయక, దేవుండీయంగలేఁడు తెగి యేమియు నా,నావిధధాన్యము లుండిన, వావిరి వండకయరిత్త వంటకమగునే. కుచేల. 1 91
క ఈ వరుసఁ ద్రయస్త్రింశ,ద్భావములకు లక్షణము లుదాహరణంబుల్, వావిరి నొనర్తు నీయెడఁ, గేవలశృంగారసూత్రకీలిత ఫణితిన్ నరస 3. 49
2. అనుగతి
క పోవఁగ న య్యాగసాలియు, వావిరిఁ దోడరుగ నొక్కవన మధ్యమునన్, గేవల పక్వఫలంబుల, ప్రోవై యొక వెలగ యుండఁబొడగని వేడ్కన్. భోజరా. 5. 240.

ఉ కావున సిద్ధ్యసిద్ధుల వికారముఁ బొందక ద్రోహ మెయ్యెడన్, వావిరిఁ జేయ కేలు భువనంబు భవ త్కుల ధర్మరక్షివై భార శాం. 1 150.

3 ఆధిక్యము

ఉ. మనోరథభోగసౌఖ్యముల్, వావిరిఁ బొందు చున్ నృపతివంద్యపదాబ్జము లొప్పనర్వధా, శ్రీ వలయంబు నేలెదు భా. రా సుం 514

ఉ వావిరిఁ గమ్మ నీరు మృగనాభిరసంబున మేళవించి నైష 3 102

విణ 1 ఉత్కృష్టము, గొప్పది.

చ వగవఁగ నేమియుం దగని వారికినై హృద యంబు గుందఁగా, వగచెదు బుద్ధిమాటలును వావిరి నాడెదు నీవు భార భీష్మ 1 195

చ వడిఁద్రిదళాలి నోర్చుడొక వావిరి టీరము గాఁగ ... కు సం 10 561

ఉ మారుతసూతి నేను హనుమంతుఁడ రాముఁడు పంపఁగాఁ బయో, వారిధి కేగుచో నొదవె వావి రియై జలతృష్ణనాకు . భా. రా యు 1684.

ద్వి రావణుండెంతయు రఘురాముమీఁద,వాని రి యమ్ముల వానలు గురిసె .. రం. రా యు. 525 పా 27 పం. (బ్రౌ)

2 ధూర్తుఁడు

చ వలదని యెంతచెప్పినను వావిరివై కడువేగ పాటుమైఁ, బలుమఱు నెల్లెడం దొడరఁ బాఱెదు భార విరా 2 260

(ఇట "అనుగంతుఁడు" అని (శ ర)

క ఆ వనిత చూచుచుండఁగ, వావిరియై పాఱ వాతి వాడిశరమునన్,బావా మేలము సూయని, ఈవులు గానతని తలగొట్టిగి పో విడిచెన్ వి పు 8. 62

3 అత్యంతము

ఉ వావిరిఁ జెప్పగా వలసె వాలిన దుఃఖము దాల్మిఁ గ్రాఁచిరన్ . భార. శాం 1. 115.

చ. ... వర్మబంధముల్, మురియఁగఁ జావముల్ దునియ ముద్గర తోమర శక్తులాదిగా, వరుస ననేకము ల్నడియ వావిరిఁ బోరిచేలంబు పెంపు వన్ ... హరి. ఉ. 2. 57

ఉ. వావిని సంతసిల్లి వటునాథుఁడు దానవనాథుఁ జూచి నీ,పావనశీల సంపదకు భక్తికి నత్యవ చోనిరూఢికిన్, వావిరి మెచ్చితిన్ సుకృతవర్ధన వేడు వరం బొసంగెదన్, నావు దతండు పల్కె సుజన ప్రియ నిమ్ము వరింప నెద్దియున్. జాహ్నవి 2 34.

వావిరి² వి = వావిలి శేఫాలిక (వృ. వి)

సీ. . వావిరి నిట్టూర్పు వావిరి నిడి యొడికంబుగ నడితిలకంబుఁ జూచి ఇందు 3. 51.

ద్వి దేవదారువు కల్వె దేవ కాంచనము, వావిరి లేలమువ్వంచు వంచాది ద్వి సారంగ 2 29 పా 21 పం

వావిలి వి. శేఫాలిక (వృ వి)

(దీని భేదములు — తెల్లవావిలి, నల్లవావిలి)

చ. వినఁగనరాని పల్లవిక వృత్తి మెయింగెడఁ గూడి యక్కటా, కనుగొన నయ్యో వావిలి తగన్ మఱి దీనికి వావిలేదొకో . చంద్రాంగ 4. 223

క వలనుగ నమ్ముద్దుం బై,దలి వలి నిట్టూర్పు కమ్మ తావులచే వా,విలి వనిచెవనఁగ నిది వే,ల్పుల ము న్నెవ్వారి వెట్లు పూజించె నొకో. రసిక. 3 127

సీ . వావిలి యన సిందువార మమరు . ఆం భా 2 51

వావురము = వారువము వి అశ్వము, గుఱ్ఱము

సీ వరఁగు నశ్వంబు జాబా వావురము వారువము జక్కి త త్తడి మావు గుఱ్ఱము ఆం భా 2. 196

సీ గీ మురువు గలిగిన తొడుకు వావు మునెక్కి . వరాహ. 9 88.

స్రగ్ధర .. నయ్యంబుమాలిన్, వనమాలిన్ గీలిఁ గేలిన్ వడి గడఁగి నగున్ వావురంబుల్ దినంబున్. భోజసుతా 1 74.

వావృత్తము సం. విణ. (అ ఆ అ) వరింపఁబడినది ఎన్నుకొనబడినది

వాశకము (సం. విణ అ శికా అ.) అఱచునది, ధ్వని చేయునది.

వి. అ. పుం అడ్డసరము (వృ. వి.)

వాశనము సం వి. అ న. 1 అఱవు, బొబ్బరింత, బొబ్బ 2. పక్షికూఁత. తుమ్మెదల రొద, ఝుంకా రము.

వాశి నం వి. ఇ. పుం అగ్ని, అగ్నిదేవుఁడు. ఈ. స్త్రీ. శాడిస, వడ్రంగి పనిముట్టు
వాశిత నం వి ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు, కరణి. 2 ఆడుఁడి, స్త్రీ
విణ. వెదపోయినది (ఆవు, ఏనుఁగు మొ.) పొర్లుటకు సిద్ధమైనది.
వాశితము నం వి అ న 1. పక్షికూఁత. 2 పిలుచుట, ఆహ్వానము
వాశ్రము నం. వి. అ పుం 1 దినము 2. ఎద్దు
న. 1 ఇల్లు 2. చతుష్పథము. నాలుగు వీథుల మొగ 3 పేఁడ
వాస=వాసము వి ఇంటిమీఁదఁ బఱచెడు పట్టె (శ. ర.)
ఇ వాసపోయు
వాసఃకుటి నం వి ఈ స్త్రీ. పటకుటీరము, డేరా
వాసంతకుఁడు నం వి అ పుం 1. (నాటకమున) విదూషకుఁడు, హాస్యగాఁడు 2 వటుఁడు
వాసంతము నం. విణ (అ. ఈ అ) 1 వసంతఋతు సంబంధి, వసంత ఋతువునఁ బుట్టినది 2 నడిమి వయస్సున నున్నది, నవయౌవనము గలది.
వి అ పుం 1 ఉష్ట్రము,ఒంటె 2 పిల్లయేనుఁగు, ఏనుఁగు గున్న 3 కోకిల 4 చిన్నపిల్ల జంతువు 5. మలయమారుతము, తెమ్మెర. 6 ఒక దినుసు చిక్కుడు. 7. ముద్గము, కృష్ణముద్గము (వాచ) 8. మ్రంగ చెట్టు.
వాసంతి నం వి ఈ స్త్రీ 1 మాధవి, పూవుల గుంది వెంద (వృ వి.) 2 అడవి మొల్ల 3. పిప్పలి. 4. కలిగొట్టు చెట్టు. 5 వసంతోత్సవము
వాసంతికము నం విణ (అ ఈ అ) వసంత ఋతు సంబంధి, వసంత ఋతువునందుఁ బుట్టినది
వాసంతుఁడు నం విణ (అ తీ అ) 1 నవయౌవనము గలవాఁడు, నడిమి వయస్సున నున్నవాఁడు 2. (తన పని నేర్పుట యందు) శ్రద్ధ గలవాఁడు. 3. భోగలంపటుఁడు 4. విటుఁడు (వి. ని.)
వాసకము నం. విణ (అ. నకా. సికా అ.) 1. సువాసన గలిగించునది. 2. నివసింపఁ జేయునది.
వి. అ. న. వస్త్రము.
వాసకర్ణి నం. వి ఈ స్త్రీ యజ్ఞశాల. 2. నాట్యము మున్నగు వినోదముల జరుపుశాల. (విల్సమ్సు)
వాసక సజ్జ నం. వి అ స్త్రీ = వాసక సజ్జిక
వాసక సజ్జిక నం వి అ స్త్రీ ఒక శృంగారనాయిక, తన దేహము గేహమును నలంకరించుకొని ప్రియుని రాక కెదురుచూచు నాయిక
వాసగృహము నం. వి అ న గర్భాగారము, పడకటిల్లు.
వాసతాంబూలము నం వి. అ న సుగంధి ద్రవ్యములతోఁ గూడిన తాంబూలము
వాసతేయము నం విణ (అ ఆ. అ) నివాస యోగ్యమైనది
వాసతేయి నం వి ఈ స్త్రీ రాత్రి
వాసన నం వి. ఆ. స్త్రీ 1. ఆశ, అపేక్ష. 2 జ్ఞానము. 3 స్మృతికి హేతువగు సంస్కారము, భావన. 4. పురాకృత సుకృత దుష్కృతముల వలనఁ దనంతటనే మనస్సు నంటిన సుఖదుఃఖ కారణమైన సంస్కారము 4 ఊహ, ఆశయము 5 మిథ్యాజ్ఞాన జన్యమైన సంస్కార విశేషము. 6 గౌరవము. 7. సుగంధీకరణము, పరిమళము గలిగించుట.
వాసనకెక్కు (వాసనకు+ఎక్కు) మి అ. క్రి వాసన కలుగు, పరిమళించు
చ. మలయసమీరణా భహతి మ్రాఁకులనాకులు డుల్లి డుల్లి కుసుమంబులు వాసనకెక్కియెక్కి కు. సం. 4. 443.
వాసనకొడుపు మి వి. ఊదువత్తి పుడక, సాంబ్రాణి వత్తి
వ జిల్ల తైలంబున వాసనకొడుపులం బూసిన మణుంగు చంద్రిక చేలలె రవణంబులుగా ... ఆము 4 35
వాసనము నం వి. అ న 1 ధూపనము, సుగంధి కరణము, పరిమళము కల్గించుట. 2 నానబెట్టుట 3 నివసించుట 4 ఇల్లు, నివాసము 5 ఒక వస్తువు నుంచుట కాధారమైన పాత్రము, పెట్టె, కుండ, మొ. 6. జ్ఞానము. 7. వస్త్రము. 8. (నంచి) ఆచ్ఛాదనము, కప్పు. 9. సగుణధ్యాన సమయమున ముముక్షు లభ్యసించు నొక విధమైన స్థితి, ధ్యానావస్థా భేదము.
వాసనరాజనాలు మి. వి. బ. ధాన్య విశేషము.

సీ .. వక్షపుఁ దళుకులు వాసన రాజనాల్జవ్వాజి వంకెలు గవ్వసరులు ... హంస 4 128

**వాసపోయు** అ క్రి (√ వాస) వాసములు పఱుచు

సీ. . వాస పోసెడిచోట వాసనగల వాసమేపె వాసము నొకఁడింతె మహిప . రా.వి 3 40.

సీ. .. తళుకు చేమంగు దంతముల దూలములెత్తి వారాహి దంష్ట్రల వాసపోస్తి . దశా. 8 39

మ. జవనాశ్వంబు నితండఖండ సమరక్ష్మా మండలి మ్నాకి వేమిన్కల వాసపోయు నిలువా రంబై పయి న్నిల్వఁగన్... చంద్రాం 5 142.

**వాసభవనము** నం. వి. అ న నివాసగృహము, కాపు రముండెడి యిల్లు

(ఇల్లె వాసమందిరము. మొ )

**వాసము** వి ఇంటిమీఁదఁ బఱచెడి పట్టె

సీ . . వాసపోసెడు చోట వాసనగల వాసమేపె వాసము నొకడింత మహిప . రా వి 3. 4

సీ ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బు శిఖయబ్బెనే నింటిలోఁ బూరియిడి విదరక, ర్యాఁజదు రాఁజిన రవులుకోల్వాసాలఁ గాని కల్గదు మఱి దావఁ గలిగె, నేని కూడగుట .. ఆము 4. 127

**వాసము** నం వి అ పుం. 1 పరిమళము, సువాసన

2. నివాసము, ఉనికి

ఈ యర్థమున కాలవాచకము కాని, హలంత అదంత శబ్దముల సప్తమి కీ శబ్దము పరముగా నున్నప్పుడు సమాసమున సప్తమికి అలుక్కు వికల్పముగా వచ్చును.

ఉదా. గ్రామేవాసము, గ్రామవాసము

3 గృహము, ఇల్లు. 4. ఇంటి స్థలము, నివేశన స్థలము. (అని ) 5. వస్త్రము.

**వాసయష్టి** నం. వి ఇ స్త్రీ. పక్షులు రాత్రులు వసిం చెడి దండెము.

**వాసయోగము** నం వి అ పుం. పరిమళముగల యొక విధమగు చూర్ణము, గంధపొడి.

**వాసరము** నం. వి. అ పుం న. దినము, దివసము.

పుం. నాగభేదము, ఒకానొక సర్పము.

**వాసవదత్త** నం. వి ఆ. స్త్రీ 1 సుబంధు కవిచే రచింపఁబడిన వాసవదత్తా చరిత్రమును దెలుపు గ్రంథము. 2. బహు కథల యందలి కథానాయిక.

**వాసవము** నం. విశే (అ ఈ. అ.) ఇంద్రసంబంధ మైనది

వి అ న ధనిష్ఠా నక్షత్రము.

**వాసవి** నం. వి ఈ. స్త్రీ వసువు కూతురు, వ్యాసుని తల్లి, సత్యవతి

**వాసవుఁడు** నం. వి. అ. పుం ఇంద్రుఁడు.

**వాససజ్జ** నం వి ఆ స్త్రీ =వాసక సజ్జిక.

**వాససు** నం వి. స్. న 1 వస్త్రము 2. శవము మీఁది గుడ్డ. 3 తెర, యవనిక.

**వాసాగారము** నం వి అ పుం న గర్భగృహము, పడకటిల్లు

**వాసి** వి (క.త. వాసి ) 1 తారతమ్యము

క ఆసేనకు నీసేనకు వాసియడిగె దీవునన్ను.. భార. ఉద్యో 2 308

క రామునకు నీకు హస్తికి, దోమకుగల వాసి .. భా రా అర 2. 100.

క . . బానొక్కట నిందు వాసు లరయఁగ వల యున్ . ఆము. 3. 48

2 భేదము

గీ జలధి మధ్యస్థుఁ డాతఁడు జలధి తీర, వాసి యితఁడును నొకమాటె వాసిగాక, పద్మ నాభుఁడు మగదల పద్మనాభుఁ, డఖిలలోకా వనమున నన్యోన్యసములు దశా 1. 46.

ద్వి వారికి వారికి వలసి నంతైనఁ, గోరిగైకొని తమకుం దామె రాజులై యల్పులధికులు వను వాసిలేక, రాయిడింపుచుఁ బ్రతిగృహదాన ముఖ్య, ధర్మంబు లన్నియుఁ దప్పి. నవ. 5. 217 పా 14 పం,

3 అధిక్యము.

ద్వి. వాసవునన్నాక వాసుల తోడ, వాసిఁ దప్పిం పవా వాసికి నెక్కి ... రం రా. యు. 287. పా 15. పం.

చ వలిపజు రాణివాస మొకనాఁడువ నుందనచేతి ప్రోదిరా, చిలుకను వాదుకుంగవిత చెప్పఁ గఁదా నియమించి యందునా, పలుకులఁ గొంత వాసిఁగని భావమునం గడు మెచ్చుచున్ వథాం, చలమున నామతెక్కనులి చక్కఁగ దువ్వుచు గారవించుచున్ ప్రభా. 2. 92.

చ కులమును రూపమున్నగని కూరిమియుంగల
దాన నంచునీ, వలనన రుక్మిణీ రమణీ వాసిఁ
బెనంగఁగ . . పారి. 1. 42

4. లాఘము

సీ వర్తిల్లుదుము వాసి వట్టమేమియు లేక ...
హర 2 139

5 ప్రసిద్ధి, కీర్తి

మ. రతికిన్ భారతికిన్ వినోద కథలన్ ప్రాగల్భ్య
ముం జూపి త,త్పతులం గూరిచి
మాట వాసిఁగను పెద్దల్ గారెమీ వారలా,
చతురత్వం బిటగొంత గానఁబడ నీచంద్రాన
నన్ గూర్చి నన్, బ్రతికింపం గదెముద్దుఁగీరమ
సుధాబంధూ భవద్గీరమా విజ 2 184

చ. వాసిగ నీకృతి రత్నమే మహా, మహునకు
నంతనంబున సమర్పణ సేయుదు . ఉ. రా.
1. 18. హంస. 1 125

6. గొప్పతనము

ఉ. సం,గ్రామములోన వొక్క నరుగానికి వాసి
దొలఁగఁ డీశ్వర,జ్ఞామహిళా మనోహరుని
సాటియె యీశ్వరుఁ డెన్ని భంగులన్ పారి.
పీఠి 9

గీ. కపటములు పన్ని యిపుడు వన్ గన్ను మొఱఁగి,
సుకుఁగఁ జూచెద వేమఱఁజుమ్ము నిన్నుఁ, గని
కరము మానసంబునఁ గదియనీక దాసిగాఁజేసి
యేలుదు వాసి యుడిపి హరిశ్చ 4 151

గీ. ఇట్టి కారడవిలోన, గాసిఁ జెందంగ నింకేమి
గలిగె వాసి . దళా 5. 38

7. అందము, చక్కఁదనము

క. ఎడమ కరంబునవే య,య్యెడ మకరముఁబట్టి
బైటికీడిచివైవన్, వడిభూమికఁ జూపిన
కై,వడిఁ దొల్లిటి రూపువాసి వాసియెసఁగన్.
విజ 2. 45,

8. పరాక్రమము

గీ. బంటు నెఱుఁగవు గాన మిమ్మంశెఁ గనరె, దవ
సరము వచ్చె మముఁ జూడు మనెడు వారు,నైరి
మగధేంద్రు పాలెంబునందు రిపులు, దాసిచేవాసి
యెలజాలు చేసినపుడు. శా. వి. 5 5.

9. విధము, పోలిక.

గీ చచ్చిపోయిన వారికై చాల వగల, దుఃఖపడు
దురు మఱునాఁడు దొడరిచనరో, తాము బ్రతు
కుటకేది తథ్యంబు తడవ, వనిత క్రిందాకు
మీఁదాకు వాసి గాదె కుచేల. 1 80

10. ఔన్నత్యము.

సీ. .. వాసినాఁ బొడవునా వఱలు నున్న,తుండు
ధర్మంబుగానిది దోఁచు నొకటి ఆం. భా.
2 123.

11 పరిమితి (శ. ర)

వ్యవ ఈ గ్రంథము నందు ముక్కాలువాసి అచ్చు
పడినది (శ ర)

విణ 1 దీర్ఘము, నిడుద.

క నిడుదయనన్ వాసి యనఁగ నెగడును
దీర్ఘంబు ఆం భా 3 18.

2. ఉత్కృష్టము

వ్యవ దానికంటె నిదివాసి. (శ. ర)

3. స్వస్థము.

వ్యవ, ఇపుడు నాకు నొడలు వాసిగా నున్నది
(శ. ర.)

4 బాగు

క కాశీమహిమము మీచే, వాసిగ విని సంశయ
ములు వాసితిమి . కూర్మ 4 శ ర

జ వాసికెక్కు, వాసితనము, వాసిమీఱు

వాసి నం విణ (న్. నీ న్.) ఇది కాలవాచక భిన్న
మగు హలదఁత సప్తమికి పరముగానున్నపుడు
సమాసమున సప్తమికి అలుక్కు వికల్పముగా
వచ్చును

ఉదా గ్రామేవాసి, గ్రామవాసి, మొ నివసించు
వాఁడు, కాపురముండువాఁడు

వి. ఇ పుం స్త్రీ 1. బాడిస, వడ్రంగి పనిముట్టు
2. నివాసము, ఉనికి

వాసించు నం వ క్రి 1 వాసనకట్టు, భావనచేయు.

క విను కుసుమంబుల వాసిం,చిన నొప్పుని కంపు
విడిచి చెందును సౌర,భ్యనిరూఢిందిలలు ...
భార. శాం. 5. 418.

2 పరిమళింపఁజేయు.

సీ. హిమధామధాతు మిశ్రములగు శశికాంత జల
ములు వాసించి జలకమార్చి ... కు. సం.
5. 624.

3. నిలుపుకొను, జరపుకొను

క. భూసుర వేషముఁదాల్చిన, వాసవునీక్షించి యెదురు వచ్చినతుల్ తాఁ, జేసి పద్యార్ఘ్యము లంటుచు, వాసించె సుశర్మ తనదు వ్రతధర్మం బున్. శేష. 1. 127.

అ. క్రి 1 భావనయగు

వ వాసించి పరిమళించునడవి పసుపు నుమఁ బూఁతయు . కాళ 3 36.

2 పరిమళించు

ద్వి వాసించుకాగాలు వడివాకుమడుపు,లానతీ జన మణి కందిచ్చెనొకతె . రం రా బాల 64 పా 17 పం.

**వాసికాఁడు** వి ఉన్నతుఁడు.

ఉ. వారనిమంచుపైఁ బోదివి వచ్చినపోయిన చొప్పు మాసినన్, భూరినఖాగ్ర ముక్తమయి పొల్పు గుముత్తెపుఁ జాలువెంటదఁ, చ్చారణులేఁగి కాంతురుహతద్విపకేసరి వాదవేళలన్, దారోక వాసికాంద్రవలెఁ దక్కఁగనూల్కొన జేయు తానముల్. వి. శకుం 2 105.

**వాసికె(కినె)క్కు** అ క్రి (వాసికిన్+ఎక్కు) ఖ్యాతి నొందు, ప్రసిద్ధివడయు.

సీ వేదశాస్త్రపురాణ విద్యానిరూఢులై వాసి కెక్కినతోడివారిఁ దలఁచి కాశీ. 4 91

2. పెంపుమీఱు, అతిశయించు

ఉ వాసికినెక్కుకూర్మి జనవల్లభుఁ డిచ్చెను వైర సేవికి నైష. 6 92

ఉ వెన్నెల కుప్పసంబిడిన వింతవిలాసము వాసి కెక్కఁగా .. నైష 6 50

**వాసిత** నం వి ఆ స్త్రీ. = వాశిత.

**వాసితనము** వి (వాసి+తనము) గొప్పతనము, ఘనత

గీ పలుకులేటికి దావీర పత్నియేని, మీఁదిచేవి తనదు ప్రాణేశుఁడైన, మఘవు నటఁబంపి సత్య భామా విధేయు, వలన మరలంగఁ గొమకొపో వాసితనము. పారి 4. 58.

**వాసితము** నం విణ (అ. ఆ అ.) 1. సువాసన గల దిగాఁ జేయఁబడినది. 2. నానఁబెట్టఁబడినది. 3. తాలింపు పెట్టఁబడినది. 4. దుస్తులు ధరించినది. 5. కాపుర ముండునట్లు చేయఁబడినది 6 సంపన్న మైనది, కలిగినది. 7. ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది

వి. అ. న 1 పక్షులధ్వని, పక్షికూఁత 2 జ్ఞానము (పురాకృత సుకృత దుష్కృతములవలనఁ దనంతనే మనస్సునంటిన సుఖదుఃఖ కారణమయిన సంస్కార విశేషము )

**వాసిమీఱు** అ క్రి. (వాసి+మీఱు) ప్రసిద్ధివడయు.

క తాతకు మమమఁడవై పొల, మేతరి తెగలందు వాసి మీఱితనరుసీ, కేతెఱఁగువఁ గొదుగక సెఱ, నాతిం దమి నిగుడదాకొనం దగవగునే ఉ. రా. అర. 70.

**వాసిల్లు** నం అ క్రి పరిమళించు

ద్వి చెలువార వాసిల్లు శీతలోదకము పండితా రీయ. 42. పా

**వాశి(సి)ష్ఠము** నం విణ (అ ఈ అ) వసిష్ఠుని సంబంధమైనది, వసిష్ఠునిచే రచింపఁబడినది

**వా(శి)సిష్ఠి** నం. వి ఈ స్త్రీ గోమతీనది, గంగానది, యను నదులలో నొకటి

**వా(శి)సిష్ఠుఁడు** నం. వి అ పుం వసిష్ఠుని సంతతి వాఁడు, వసిష్ఠగోత్రుఁడు

**వాసుకి** నం వి అ పుం సర్పముల రాజు, శేషాహి సోదరుఁడు

**వాసుకేయుఁడు** నం వి అ పుం = వాసుకి. (విల్యమ్సు)

**వాసుదేవుఁడు** నం వి అ పుం 1 వసుదేవుని సంతతి వాఁడు 2 కృష్ణుఁడు

**వాసుర** నం వి. ఆ స్త్రీ 1 భూమి 2 రాత్రి 3 స్త్రీ, ఆఁడుది 4 ఆఁడేనుగు

**వాసువు** నం వి ఉ. పుం 1 జీవుఁడు 2 విశ్వాంతర్యామి, పరమాత్మ 3. విష్ణువు . 4 పునర్వసు నక్షత్రము

ఊ స్త్రీ. (నాటక) కన్యక, చిన్నది

**వా(సియ)సె** వి (సం. వంశః) పిల్లనగ్రోవి.

మ. ఎలమిన్ దుమ్మెద మ్రోతవాసె రవతై యింపొంగ మత్తిల్లు కో, వెల సీకారులు కూఁక పాట లమరన్ వేవేడ్కతో నాలి గాడ్పుల పేరంగల నట్టువల్ గఱప, గోపుల్ చూపు లేఁదీవ పాత్రల కయ్యా మిని పూపుముత్తె పుసరుల్ దాల్పంగ నిచ్చెంగడున్. యయా. 4, 12.

జ. వాసెకాఁడు, వాసెగ్రోలు

**వాసెకాఁడు** వి (వాసె+కాఁడు) ఒకానొక విధమైన వాద్యమును వాయించువాఁడు.

మద్దెలకానికి 52 వాసెకానికి 52 పాడేవారికి ఒక్కొకడ్లకు 52 శె శా. శ 1135.
Ep Ind. Vol. 5. No 17

**వాసెగ్రోలు** వి (వాసె+గ్రోలు) పిల్లనగ్రోవి. మురళి.

వ. .. మృదంగం బుపాంగంబు .. ఉరుమ కిన్నెర సన్నగాశె వీణె ముఖవీణె వాసెగ్రోలు.. లోనగు నసంఖ్యాత వాదిత్ర త్రితయ పరం పరలు .. ఆము. 4 35

**వాసెన** వి కుండమూతి మూయఁ గట్టిన గుడ్డ

సీ. ఆజ్యతైల ఘటంబు లన్నియు వాసెనల్ గట్టి యందనిచోట నట్టినుంచు .. శుక. 3 345.

ద్వి వలిపంపుఁ బావడ వాసెనగట్టి, పొలుపారఁగా శిరమ్మునఁ గొందువఱచి . ద్వి పరమ. 3 255 పొ 2 పం చి. వి.

ఉ. ... వాసెనకట్టుగట్టి నిడువాలిక గస్తురి బొట్టు వెట్టి ... పారి 1 99.

జ. వాసెనకట్టు, వాసెన కుడుము.

**వాసెనకట్టు** వి (వాసెన + కట్టు) వాసెన గుడ్డ కట్టువలె తలకు కట్టెడుకట్టు.

ఉ. మాసిన చీరగట్టుకొని మౌనముతోడ నిరస్త భూషయై, వాసెన కట్టు గట్టి పారి. 1 99.

సీ. తెరగుఁ బూపెడు నూనె ముడిలోనుగా వంటఁ గట్టిన వాసెనకట్టుతోడ ... శుక 4 38

సీ. తలచూపఁ బాసెనందఱతోన దనకన్న కై వడి వాసెన కట్టుకట్టి . సారంగ. 2. 150

**వాసెనకుడుము** వి (వాసెన+కుడుము) ఇడ్డెన, ఒక విధమగు పిండివంట (శ. ర, బ్రౌ వా)

**వాస్తవము** సం విశ (అ ఈ అ) 1. యథార్థము, నిజమైనది. 2 స్థిరపరుపఁబడినది, నిశ్చితమైనది.

వి అ న నిశ్చితమైన పదార్థము సత్య పదార్థము

**వాస్తవికము** సం విశ (అ ఈ అ) 1 యథార్థమైనది, నిజమైనది

2 సిద్ధాంతీకరింపఁబడినది, నిజము

**వాస్తవ్యము** సం విశ (అ.ఆ అ) 1 నివసించునది 2 నివాసయోగ్యము, నివసింపఁదగినది

వి. అ. న. 1, నివసింపఁ దగిన చోటు. 2 వసతి, నివాసము

**వాస్తవ్యుఁడు** సం వి. అ పుం. నివాసి, కాపుర ముండు మనుష్యుఁడు.

విశ (అ అ అ) నివసించువాఁడు

**వాస్తుసూత్రము** సం వి అ న ఒకజాతి కూరాకు, చక్రవర్తము (వృ వి) (శ ర)

**వాస్తుయాగము** సం వి అ పుం ఇంటికిఁ బునాది (మూలబంధము) కట్టు సమయమునఁ జేయఁదగిన హోమాదికము

**వాస్తువు** సం వి ఉ పుం న 1 ఇల్లు మొదలగునవి కట్టఁ దగినచోటు, నివేశన స్థలము. 2. ఇల్లు, వాస స్థానము

**వాస్తుసంశమనము** సం వి అ. న ఇంటికిఁ బునాది వేయునపుడు, విశేషించి గృహ ప్రవేశము చేయు నపుడును చేయఁబడెడి శాంతి కర్మము.

**వాస్తేయము** సం విశ. (అ ఈ. అ) 1. నివసింపఁ దగినది, వాసయోగ్యమైనది 2. వస్తిసంబంధి, పొత్తి కడుపునకు సంబంధించినది.

**వాస్తోష్పతి** సం వి ఇ పుం. 1 వేదమందు నివేశన స్థలమున కధిష్ఠాన దేవతగా నెంచఁబడిన దేవత. 2. ఇంద్రుఁడు.

**వాస్త్రము** సం విశ (అ ఆ అ) వస్త్ర నిర్మితము, వస్త్రముతోఁ జేయఁబడినది

వి అ పుం గుడ్డకప్పు వేయఁబడిన బండి

**వాస్ప(బాష్ప)యము** సం వి. అ పుం. నాగకేశర వృక్షము

**వాహకుఁడు** సం వి అ పుం 1 బరువు మోయు వాఁడు, భారవాహకుఁడు 2. రథము, గుఱ్ఱపుబండి తోలువాఁడు, సారథి. 3. గుఱ్ఱపువాఁడు.

**వాహద్విషత్తు** సం. వి త్ పుం. మహిషము, దున్నపోతు

**వాహద్విషము** సం. వి ష్‌. పుం. వాహద్విషత్తు, దున్నపోతు.

**వాహనము** సం వి. అ. న 1 మోయుట, తీసికొని పోవుట 2 గుఱ్ఱము మొదలగువానిని తోలుట, నడపుట 3 ఎక్కఁ దగిన యేనుఁగు మున్నగునది. 4. యానము, బండి మొ.

**వాహము** సం. విశ. (అ ఆ అ) (సమాసాంతమున) మోయునది
ఉదా. అంబు వాహము
వి. అ. పుం. 1 మోయుట, తీసికొనిపోవుట 2 బండి మొ లాగెడి జంతువు, బరువుమోయు జంతువు 3 గుఱ్ఱము 4 ఎద్దు. 5 దున్న పోతు 6. యానము, బండి మున్నగు వది 7. బాహువు 8 వాయువు 9. నాలుగు భారములకు సరియగు పరిమాణము.

**వాహశ్రేష్ఠము** సం వి. అ పుం అశ్వము, గుఱ్ఱము

**వాహసము** సం వి. అ పుం. 1 ఏఱుమున్నగు జల ప్రవాహముల యుత్పత్తి స్థానము 2 అజగరము, కొండచిలువ.

**వాహి** వి ప్రసిద్ధి
గీ. గంగకన్నను గడు వృద్ధగంగ యనెడు, వాహిని వహించు నా పుణ్యవాహినిఁగని, వినతులఁ జెలంగి తీర్థమున మునింగి, మునివరేణ్యులు సమ్మోదమునకు బోంగి . ఘటికా. 2 164

**వాహి** సం. విశ. (న్. నీ న్) (సమాసాంతమున) మోయువాఁడు, తీసికొని పోవువాఁడు
వి న్ పుం రథము, తేరు.

**వాహికము** సం వి అ. పుం 1. ఢక్క (ఢంకా) 2. ఎడ్లబండి

**వాహికుఁడు** సం వి అ పుం. బరువుమోయువాఁడు, భారవాహకుఁడు.

**వాహితము** సం. వి అ. న. పెద్దబరువు, మహాభారము.

**వాహిత్థము** సం వి అ న. ఏనుగు కుంభస్థలము యొక్క క్రిందిభాగము.

**వాహిని** సం. వి. ఈ. స్త్రీ 1 సేన 2. సేనావిశేషము, ఎనుబదియొక్క రథములును, ఎనుబదియొక్క ఏనుఁగులును, ఇన్నూటనలువదిమూఁడు గుఱ్ఱములును, నన్నూటయేవురు కాల్వురును గలసేన 3. నది, ఏఱు.

**వాహినీనివేశము** సం. వి. అ పుం. సేనదిగిన చోటు, శిబిరము.

**వాహినీపతి** సం వి ఇ పుం 1 సేనానాయకుఁడు. 2. సముద్రుఁడు.

**వాహుఁడు** సం. వి అ. పుం. బరువు మోయువాఁడు.

**వాహ్యము** సం. విశ. (అ ఆ. అ.) వహింపఁదగినది, మోయఁదగినది
వి అ. పుం బరువుమోసెడి జంతువు, గుఱ్ఱము, ఎద్దు మొ న. బండి.

**వాహ్యాళి** సం స్త్రీ. ఈ యర్థమున సం లో ప్రయోగ మున్నట్లు తోఁచదు
గీ. సముచితానల్ప పరివార సహితుఁ డగుచు, వవని నాథసుతుండు వాహ్యాళి వెడలె ... వైష 1 86.
ఉ పాలును నీరువేఱు పరుపంగల మావుల వేదవీథి వాహ్యాళి యొనర్చునే యలికులాలక .. రామా. 1. 8

# వి

**వి** న "అవి" శబ్దముయొక్క ఆద్యక్షరము లోపింపఁగా మిగిలిన రూపము, సంబంధమును దెలుపు నపుడు అనుప్రయుక్తమగు
సీ వారివి ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్పదామములయు ... భార. ఆది. 3 156.

**అవ.** 1 భూతార్థక మధ్యమ పురుషైక వచన ప్రత్యయము
సీ ఎంచిరంటివి గాని యీసారి గట్టిగాఁ దెగుఁ గార్యమును వార్త దెలుపవైతి ... విజ. వి. పీఠి. 1. 41
2 ప్రథమాంతమగు యుష్మదర్థ విశేషణములకు ఏకవచనమువఁ బ్రాయికముగా వచ్చు నాగమము
మ. .. నిన్నికుఁగా, స్తవముల్ సేయుబ్రుతుల్, సమస్త జగదంతర్యామివి న్నీవ ... మనుచ. 2 75
3. అమహదర్థమునందు వర్తమానమున ఉన్నానుబంధముమీఁది ప్రథమపురుష బహువచన రువర్ణకమునకు ఆదేశముగా వచ్చు ప్రత్యయము.
ఉదా . చిలుకలు పలుకుచున్నవి

**వి** సం. వి ఇ. పుం 1. పక్షి 2. గుఱ్ఱము. 3. యాత్రికుఁడు, బాటసారి. 4 కన్నెము

అవ్య. 1. విశ్లేషము 2 అతిశయము 3. అత్యంతము 4. ఇంచుక 5. వ్యతిరేకము, మున్నగు వర్థములనిచ్చును
ఉదా 1. వియోగము 2 వికీర్ణము 3 విస్పష్టము. 4. విలోకనము 5. విస్మృతి, విక్రయము మొ

వింఖము సం. వి అ పుం గుఱ్ఱపుడెక్క.

వింగడము విశ (సం విశంకట) (త వింగడవు)
1 విశాలము, విస్తృతము
ఉ వింగడమైన యొక్కవనవీథిఁ గనుంగొనె నీడ నున్నపున్, రంగుటరంగుపచ్చలయరంగయి పో వెలిదమ్మిబావికిన్, జెంగటమల్లెసిల్లు తులసీ వన సీమ శుభాంగి నొక్కబాలం ఆము 5 4
2 సుందరము
సీ వింగడంబైనట్టి ముంగిట సెలకొన్న బృందా వనికి ముగ్గు పెట్టుదాన . ఆము 4. 50.
3. విపరీతము.
క అంగజహరుని ప్రసాదము, నం గలుగుచువచ్చె నతఁడు నాఁడాదిగ మావంగడమున వది యిప్పుడు, వింగడమై కూఁతురుదృవించెన్నాకున్ విజ, ౨ 2. 8
క. చెంగటికిఁ జేరి ప్రియని,రో యంగన నీపున్న విధము నరసిన మాకున్, వింగడ మైనదియున్న తె,లం గొటిఁగించెదవొ మమ్ము నాపిడియెదవో. భోజసుతా 3 84
4 వేఱు, భిన్నము
(చూ. వింగడించు.)
జ : వింగడించు, వింగళింపు

వింగడి(ళి)ంచే స క్రి ('వింగడము.)
(క. వింగడిసు) వేఱుపఱచు
చ. అమరవరాశుమానవవరాంచిత వృత్తులు వింగడించి నే,ర్పమరఁగ నాసురూప వినుతాఖిల సద్గుణపాత్రశాలిధిన్, విమల సుగంధమాల్యవిని వేశవిభూషితుఁజేసి ... హ. వ. 2. 118.
అ. క్రి. దుముకు.
చ. విడిచిన యంత మల్లులటు పెన్కకుఁ జెంగున వింగడింపుచున్, బడిబడి మీసలంటి మెలిఁ బట్టుచు దండలనిల్పి కమ్మునదున్, బిడికిటులూది పట్టుకొని బిట్టుగఁగేకలు వేయుచున్ బొమల్, ముడిగొనఁ బండ్లు గీటుచు సముద్ధతిచేఁ జెయిసోఁక మీటుచున్. ప్రబంధ 1 84.
ఆ. వింగళించి యాటవెలఁదిచందంబున, కోపులందు మీఱి యేపుతోన, మిత్త్రిగణము లతివిచిత్రితంబైకొన, దైవగణము లెదురఁదారసించె ప్రబంధ 791.

వింగళింపు వి (√వింగడించే) మల్లబంధ విశేషము
వ . దండ నిల్కడ కదలుదుటుకలయు మెలకువ వి గళింపు ప్రబంధ 78
వ ... వింగళింపు దశావదిశపాదవీక్షణము నయన వీక్షణము మల్లుపు 3 69

వించే అ క్రి (√ విను[1]) వినవచ్చు, వినఁబడు
క ఖలుఁడీ దుర్యోధనుఁ డెగ్గులతోడన యుత్పవిల్లె గోమాయురుతం,బులు వించె దుర్నిమిత్తం,బులు పెక్కులువుట్టె వీని పుట్టిన వేళన్ భార సభా 2 178
చ. చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహదేవు పయిన్ దివంబునన్, దెలయఁగ సాధువాదములు వించె సభాసదులెల్ల విస్మయా, కులిత మనస్కులైరి. భార సభా 2 31

వింజకోన వి (వింజము + కోన) వింధ్య పర్వతము యొక్క లోయ
సీ గాసినారము రాజ కలశంబు బిడ్డఁడు క్రొవ్వ డంచిన వింజకోన లెల్ల ఇందు 2. 50

వింజము వి (సం వింధ్యః) వింధ్య పర్వతము
క ఆ కొలువువారు గరము చ,లాకృతి నొక పలుకు లేక యందఱు వింజం, బాఁకిడిన కరణి నవశము, దాకారిత చిత్త వృత్తులై యుండంగన్ భార ఉద్యో 3 255
వ ... అది .. తన పలుకులా స్థానంబెల్ల సావధానంబగుచు వింజమాఁకిడి నట్లు వినుచుండ న న్నరేంద్ర చంద్రునకు నిట్లని చెప్పందొడంగె. కళా. 5 9.
క. అద్దశముఖుఁ డట్లొందు వి,పద్దశ పరికించి అచ్చవడి మంత్రులు దా,రెద్దియును బల్కకుండిరి, పెద్ద తడవు వింజ మాఁకవెట్టిన భంగిన్ ... భాగా యు 7. 28.

వ వింజేమాఁకిడిన భంగి నూరకుండిన
నైష 4. 16
మత్తకోకిల ఉగ్రశంకర భక్తవత్సల సోమ యా
మఖ సేమలో, నగ్రపూజ లొవర్తు నెవ్వని కావ
తిమ్మని పల్కసా, నుగ్రహంబుననా సుమేరుధ
నుర్ధరుండు సమస్త దే,వాగ్రగణ్యులు వింజే
మాఁకిడి నట్లు నిల్వనలున్ వనున్ వరాహ.
10 10

వింజామర(ము) మి వి (వెల్ల+చామర త వెజ్జా
మరై.) తెల్లని చామరము
సీ గీ .. భార్యవింజామఱ నొప్పుపొందుఁ
గనియె. ఆము 4 58
వ .. గంగా యమునలు వింజామరలిడ .. హర.
4 89
సీ వింజామరలు వైచు వేల్పుఁబూఁ బోఁడుల
కంకణ క్రేంకార కలనకంబె . ఉ రా,
7 291.
సీ. చామరం బొప్పు వింజామర యవఁగను ....
ఆం భా 2. 193
క. గొడుగులు వింజామరములుఁ, ఒడగలునుం
దాలవృంత పట వాసములున్, మృదుని కొసం
గివ ధన్యుఁడు, పుడమిని నైకాతపత్రముగఁ
బాలించున్ కాశీ. 7. 124.
సీ. కంకణంబులు మ్రోయఁగా నీళయును ధరా
రమణియు వింజామరములు వైవ .. దశా.
3 144.

వింజామర క్రోవి వి (వింజామర+క్రోవి) ఒక విధ
మగు బాణనంచు.
మ. ద్యుమణింబోలిన పంజులుం బగలువత్తుల్
మంచి యాకాశ బా,ణము వింజామర క్రోవు
లుం బరుసులున్ బ్రహ్మాండము న్నిండఁగన్
బహు 4 76.
క. పంజులును పగలువత్తుల, పుంజము లాకాశ
బాణములచే బిరుసుల్, వింజామరక్రోవుల
చా,లుం జెలువు వహించె లోక లోచనముల
కున్ .. రా: వి. 5 61

వింజామరము నం వి అ. న. కంటి తెలుపు
వింజిలి వి. మత్స్య విశేషము. (శ. ర., బ్రౌ )

వింఞోవి నం వి ఇ. ఈ. స్త్రీ పంక్తి, వరుస
వింట వి (√ విన్ను[1]) వినుట
గీ ... ఇట్టి యన్యాయమే జాతి నెన్నఁడైనఁ దొంటి
కతలందుఁ జెప్పఁగా వింటగలదె .. సారంగ.
2 238.

వింటాలము వి మల్లబంధవిశేషము, ముప్పది రెండు
విన్నాణములలో నొకటి.
సీ. వింటాలము పణమ్ము పెట్లాగు పాలమ్ము డొక్కర
మ్ముత్తరడొక్కరము ఆం 2. 209
వ ... కక్కిళ్ళొక్కిన డొక్కెరము తెర... వింటాలం
బును కాశనిల్కడయు నృసింహంబును నను
ముప్పది రెండు విన్నాణంబుల నాణెంబు వరీ
క్షించి హంస. 1. 206.
వ. గళక తెర నృసింహంబును కాసె నిల్క
డయు వింటాలంబును విశదపఱచి మల్లుపు.
3. 69.

వింటికోల వి (విల్లు+కోల) రాగ్గపని వానిధను
రాకారమగు సాధన విశేషము. (శ. ర.)
వింటిజోదు వి. (విల్లు+జోదు) ధానుష్కుఁడు,
విలుకాఁడు
క. నలినంప కయ్యమప్పుడు, సొలయక బలమేచి
వింటిజోదులు పెలుచన్, నలువఁగ నెచ్చెలు
వమునకు, వెలయఁగఁ బెల్లార్చిరపుడు వేలుపు
లెల్లన్ ... పిర. 4. 152

వింటితెర్వరి వి. (√ విన్ను) దేవత, గగన చరుఁడు,
వేలుపు.
సీ. వింటితెర్వరి మేటి వెల్ల గొరును నిక్కు చెవుల
నిలనిక్కి చెలఁగు తెల్ల ... ఉ రా 6 208
వింటిపట్టు=వింటిపెట్టు వి (విల్లు + పట్టు) ధన్వంత
రము, నాలుగుమూరలు కొలఁదిగల నేల (శ ర )
వింటిపెట్టు=వింటిపట్టు అమ్ముపేటు నేల.
ద్వి పిఱఁదికి నొకవింటి పెట్టొసరించి, అలచేతఁ
జఱచె బిట్ట సురారి శిరము ... రం రా ఉ
17 పా 7. పం.

వింటిబ(ద్ర)ద్ద వి (√ విల్లు ) 1. ధనుస్సు
ఆ. వెట్టి చెఱకుఁ గోల వింటిబద్దకు మల్లె, తీవనారిఁ
జేసి భావభవుఁడు, పఱచు పువ్వుఁబోండ్ల పెఱ
చోటులన్ మెత్త, విరుల తూఁపులేసి స్మరుల్ళ
క్రాలిపె. వైజ. 2. 36.

2. వింటిరూపమగు వెదురు చీలిక
సీ. తనవింటిబ్రద్దఁ దిట్టె నటంచు నగ్రజు దూషించి నట్టి పార్థుని హసించి .. దశా. 1 54.

వింటిరాసి వి. (విల్లు+రాశి) ధనూరాశి.

వింటివాఁడు విశ. (విల్లు+వాఁడు. త విల్లాణ) ధానుష్కుఁడు, విలుకాఁడు.
క మనపీటన కాద య్యర్జునునకు పరివింటి వానిఁ జూడఁగ లోకంబున నెందులేమి దెల్లంబు .. భార. ఉద్యో. 2. 167
గీ ఇంత ప్రొద్దు కిరీటి కట్టెదుర నిలువ, వెఱవకున్నప్డు ద్రోణుండ వింటివాఁడు .. భార విరా. 5 136

వింద్లమ్ములాట వి (విల్లు+అమ్ము+ఆట) బాలక్రీడా విశేషము.
సీ. ... ఒడ్డు, విడుపునెట్టుడుగాయ వింద్లమ్ములాటలు పులిజూదములు కట్టె పుట్ట చెండ్లు ... హంస 3. 146

వింద్లవారు వి. (√ విల్లు) ధనుర్ధారులు
వ. ... అరదంబులకుం దురంగంబులకు వింద్లవారు వింద్లవారికి వద్దాయుధులు వడ్డంబగు తెఱంగున నిలువ .. భార. భీష్మ. 1. 103.

వింత వి. 1. సొగసు, అందము.
మ. కలపం బెంతయు వింతగా నలఁది చెంగల్వ త్నెటిన్నించవే, నళిఁ గీల్కొల్పి. పారి. 2. 14.
2. అద్భుతకార్యము.
గీ. ... దొంతరగ నన్ని కటినేల్పు వింతలెల్ల . నీలా. 1. 101.
3. అపూర్వ విషయము.
ఉ. వింటిరె తమ్ములార యొక వింత వినంబడె ఉ. రా. 2. 4.
ఉ ఒక్కతె రెడ్డి ప్రక్క వినయోక్తుల వింతలఁ గాఁగిలింతలన్, జక్కిలి గింతలన్నెరసిజంతతనంబునఁ బ్రొద్దుఁ బుచ్చుచో ... శుక. 2. 336.
4. చమత్కారము.
సీ. ఘన భర్తృహరి శతక త్రయంబునఁ బ్రతి శ్లోకంబునను వింతఁ జూపుసొబగు ... దశా. 1, 48.
గీ. విలసదుపమాద్యలంక్రియల్ వింతఁజెలువ. . దశా 1. 11.
5 ఆశ్చర్యము
శా. అంతం గాంచిరి వారి చూడ్కికన వద్యప్రోద్యదుద్యానముల్, వింతల్ సేయుచునుండఁగా... వాల్మీకి 2 22
6. వినోదము.
క ఇవ్విధమున నవ్వేలుపు, జవ్వనియును వవ్విభుండు సరివలపులతో, నివ్వటిలం బువ్విలుతుని, యవ్వంతలఁ గొంతకాల మట్లు మెలఁగఁగాన్. కవిరా 5 237.

విశ 1 అపూర్వము, క్రొత్తది
సీ వెడవెడ నూఁగారి వింతయై యేర్పడందేరని వళులలో నారు నిగుడ ... భార విరా. 1 245.
ఉ. వింతయె మాగధుండు మును వీఁడును వాని సుతుండ కాఁడె .. దశకు 12. 51.
ఉ. ..వింత మాంసమున్,గావతెనంచు వచ్చితిని... దశా. 1 280.
చ. . భయంబునఁ జాటితి పెక్కుమార్లు వంచన మధురాపురిన్ విడిచి సాగర మధ్యమునందు డాఁగవే, వనరుహనాభ నీ బిరుదువాఁడితనంబును నాకు వింతయే. భాగ 10 ఉ 729
2 అన్యుఁడు
సీ. వివి కోసలేంద్రుండు కనుకని వీరఁగలయ నొప్పింపఁగ వలవ దుడుగు ...
గీ వింత లెవ్వరు మనకిందు వీరి నీవు, భీమ వేత్రాహతుల నడ్డపెట్ట నేల . భా రా. యు 2328
సీ .. దాఁచ, నేటికిఁ జెప్పుమా యే నంత దానవె దయలేదా నామీఁద ... దశా 2 365
3 ఆశ్చర్యకరము.
చ. వెలవెలఁ బాఱు దివియలు వింతరుచిం గలిగించు తమ్ములు ... విక్ర. 2 106.
ఉ వెన్నెలకుప్పసం బిడిన వింత విలాసము వాని కెక్కఁగా ... నైష 6 50
మ. నరలోకంబటఁ సిద్ధసాధ్యఫణిగంధర్వాంగనా సేవనా, పరిపాకం బటఁ యెంత వింతయమృతం బల్మాలు వీక్షించి ... వసు. 4 69,

4. అరుదు.

ఉ వీఁడియ ముట్టుటల్ మిగుల వింతలు పెంపుడు చిల్కబోధతో, రాణ దలిర్పఁబల్కుట గరం బపురూపము .. కళా. 6 217

ఉ ఏ నొక వింతయే రఘుకులేశ్వర యాదిమ విష్ణుమూర్తివై, యీ నిఖిలావనీతలము నేలెడునిన్ గనుఁగొంటి . సుద. 1 99

జ వింతకజ్జము, వింతకాఁడు, వింతతనము, వింతరాలు, వింతవాఁడు.

**వింతకజ్జము** వి (వింత+కజ్జము) పరిహాసము నకుఁ గాను అభక్ష్యవస్తువులతోఁ దయారుచేయు అపూపము

గీ నఖులు వడ్డించు వింతకజ్జముల మర్మ, మెఱిఁగి త్రోయుచు . . దళా 7 278.

**వింతకాఁడు** వి (వింత+కాఁడు) ఆశ్చర్యకరుఁడు

క. నావుడు న వ్వేళ్యాంబిక, యా వటునింజూచి పిలువ నంపఁగ తే మ,య్యా వింతకాఁడు తానెటఁ, బోవునో తా వెఱుఁగ మెటకుఁ బోదు మటన్నన్. వైజ 4 14

**వింతతనము** వి (వింత+తనము) భేదము, అన్యత్వము.

గీ పుట్టి నింటికేను బోయి యొక్కించుక, యూర డిల్లి వత్తు నువిదనీవు, వింతతనము లేక విభునకుఁ బ్రియము నా,మూలుగా నొనర్చి మనుము నెమ్మి హరి. పూ 1 170.

**వింతరాలు** విజ (వింత+ఆలు) అన్యురాలు

సీ. ముంగొంగుఁ బసిఁడియై మూల్గు పుణ్యాంబుల విఱ్ఱవీఁగుడు రెట్టి వింతరాండ్రు .. భాగ 6. 255.

**వింతవాఁడు** న. (వింత+వాఁడు) 1 క్రొత్తవాఁడు

వ. ఓ యుత్తమవిలాసిని నిన్నితర వారవనితల యట్లసత్యవాదిఁగాఁ దలంప నంత వింతవాఁడనే . కళా. 4. 25.

2 అన్యుఁడు, పరుఁడు.

గీ. ఇవ్విధంబునఁ జనుదెంచి యిగురుబోఁడి, విభునిఁ దన వెక్కమంచుక వింతవారు, లేరుగా యంచు సదనంబుఁ జాఁలఁ జూచి, యలబలము లేని నిజ మందిరాంగణమున కళాం. 3. 100.

గీ. ... వింతవారలు లేరుగా యింతనంత, నువిద మనవారలేకదా యున్నవారు ... నైష. 4. 17.

**విందు** వి. 1. చుట్టము, బంధువు

వ ఆ సైనికోత్తములు సాత్యకిం గడచి యాచార్యుం గదిసిన

క. విందులఁగనిఁ వట్లాతఁడు, మందస్మితుఁడై యెదిర్చి మార్గణజాల, స్పందితులఁ జేసెవారల భార. ద్రో. 3. 275.

క. విందులకును బ్రహ్మసుఖా, నందంబై భక్తగణమునకు దైవతమై, మందులకు జాలుఁడగు హరి ... భాగ. 10. పూ 482.

గీ అన్నఁగంటి దండ్రినిఁగంటి నయ్యఁగంటి, విందురావయ్య విందులు విందు లనుచు ... హరి పూ 5 190

సీ. విందులు విందులు విందు లంచును బలుకెంచి.. దశకు 6 157

క ఎందుండి యేమి పనికై, యొందుల కరిగెదవు భూసురేశ్వర ప్రీతిం, బొందితి నినుఁగని తగియొదు, విందవయితి నాకు నీదువిధముం జెపుమా భార. శాం. 3. 479

2. అతిథి

క భూసుర కైతవకుసుమశ, రాసన మాయింటి విందవై తివి ... మను చ. 2 46.

సీ ఎడపక గీమున కేతెంచు విందుల కెలమి వల్వలును సొమ్ములు నొసంగు. నీలా. 1 49.

గీ .. విందవ నతిథి వాసుమై వెలయుచుండు... ఆం. భా 2 172.

3. బంధు భోజనము

చ .. నేఁడు వడంతుల యొద్దనుంగడున్, నెగడెడు విందు గల్గెనని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్ ... కళా. 3. 197

క విందారగింపఁ దగు గో,విందాంఘ్రిమిళింద మనవి విని చనుదెమ్మీ, విందాక రాచకలువల, విందా ముఖనిందితారవిందానందా. రా వి 2. 93

ఆ. ప్రియములేని విందు పిండివంటకు చేటు, భక్తి లేని పూజ పత్రిచేటు, పాత్ర మెఱుఁగ నీవి బంగారు చేటురా, విశ్వదాభిరామ వినుర వేమ వేమ. 2. 49.

వ్యవ. ఒకనాఁడు విందు, ఒకనాడు మందు, విందైన మందైనమూఁడు పూటలకు గుణముతెలియును.

4. అతిథ్యము.

ద్వి అందుకు కౌశికుం డనుమతించుటయు, విందు సేయుటకు నై వేగంబ యతఁడు ... రం రా. బాల. 53. పా 16 పం

శా. విల్లుంబాణము ఖిల్లుఁ డొక్కఁడరుగన్ విందింట దుగ్ధాన్నమున్, ఖిల్లుం డన్యుఁడు వెట్ట ..ఆము. 4 223.

సీ. శబరి యిచ్చిన పండ్ల చవి భరద్వాజుల విందొక్క రీతి భావింపలేదె ... ఉ. రా 7. 15.

సీ .. విందు, నాఁగ మనుష్య యజ్ఞము పొల్చు... ఆం. భా 2. 171

విణ సంతోషము, ప్రియము.

ఉ. .. క్రొం, బట్టుఁ బసిండిసిబ్బిలపుఁ బయ్యెద కొం గొకయింత జాఱి చ, న్గట్టు అలాటలోఁచ ముని కన్నులు మూఁటికి విందు సేయగన్ హర. 5 47.

శా . అందైన ని, దైన విం, దైనాదం బొనఁ గూర్పునే మదికి నిట్లానంద సందోహమున్ వసు 2 16.

జ విందుపురుగు, విందువచ్చు

విందుపురుగు(వు) వి (√ విందు) ఒకజాతి సాలె పురుగు.

సీ. పాదొట్టనఁగ లూత వరగుఁ దద్భేదంబు తోఁచు నీగపులి విందుపురు వనఁగ ... ఆం. భా 2 87

విందువచ్చు అ. క్రి (విందు+వచ్చు) అతిథియయి వచ్చు

వ. ఇందుధరుండు మన మందిరమునకు విందువచ్చి నాఁడు హర 1. 19.

విందువు నం విణ ఉ 1 బుద్ధిమంతుఁడు. 2 దాత, ఈవిగలవాఁడు.

వి. ఉ. పుం బిందువు

వింధ్య నం వి ఆ స్త్రీ. 1. లవలీలత 2.చిన్నయేలకి తీఁగ

వింధ్యకూట(కు)ముఁడు నం.వి. అ. పుం అగస్త్యుఁడు

వింధ్యకూటుఁడు నం, వి అ పుం. = వింధ్య కూట నుఁడు.

వింధ్యము నం వి. అ. పుం 1. పర్వత విశేషము, సప్త కులపర్వతములలో నొకటి

వింధ్యవాసిని నం వి. ఈ స్త్రీ వింధ్యపర్వతమందు నివసించు నొకానొక దేవత

సీ. వింధ్య వాసిని కేకవీరకు మున్నుగా నెల్ల వేల్పు లకు బిందించి మ్రొక్కి ... హ్వా. 4 259.

వింధ్యాటవి నం ఈ స్త్రీ వింధ్య పర్వతము మీఁది పెద్ద యడవి.

వింశకము నం వి. అ పుం ఇరువది. (సంఖ్య)

వింశతి నం వి ఇ. స్త్రీ ఇరువది

వింశతికము నం విణ (అ ఆ అ.) ఇరువదికి దగినది, వింశతి సంఖ్యకు యోగ్యము.

వింశతితమము నం విణ (అ ఈ అ ) ఇరువదియవది

వింశతీశి నం వి న్ పుం ఇరువది గ్రామముల యధికారి.

వింశతీశుఁడు నం. వి అ పుం. = వింశతీశి.

వింశము నం విణ (అ ఈ అ ) ఇరువదియవది.

వి అ. పుం ఇరువదియవ భాగము

వింశి నం వి. న్ పుం. 1. ఇరువది. 2. ఇరువది గ్రామముల కధికారి

వికంక(ట)తము నం వి అ పుం. వృక్షవిశేషము ములు వెలమ (వృ. వి.)

(దీనికఱ్ఱతో తెడ్లుచేయుదురు.) "పుల్లవెలఁగ" అని (కొందఱు.)

వికంపము నం. విణ (అ ఆ అ ) 1. ఉబుకునది, పైకి లేచునది 2 చంచలము, స్థైర్యము లేనిది.

వికంపితము నం విణ (అ. అ అ ) 1 వడఁకింపఁబడి నది, వణఁకునది. 2 అదరునట్టిది. 3. చంచల మైనది

వికచము నం విణ (అ ఆ. అ ) 1. వికసించినది. 2. వ్యాపించినది, ప్రసరించినది. 3. కేశములేనిది, వెంట్రుకలు లేనిది 4 మూర్తిమంతమైనది, స్పష్ట ముగాఁ గాన్పించునది.

వి. అ పుం ధ్వజము, కెక్కెము

వికట నం. వి ఆ స్త్రీ వజ్రవారాహి యను దేవత

వికటకవి నం వి ఇ పుం వికటముగా మాటలాడు వాఁడు, హాస్యకరుఁడు. (శ ర )

**వికటుపీతము** సం. వి. అ. పుం. న మౌక్తిక దోషము.
సీ. వికట పీతంబులు విలసిల్లు బుడుపులు జాగుడై జిగిచెడ్డ జారరంబు ... రత్నపరీక్ష. 50 ప

**వికటము** సం విశ (అ ఆ అ) 1 వికృతమైనది, చూడ నసహ్యామైనది 2. అంగవికారమైనది. 3. భయంకరమైనది. 4 విశాలము, పెద్దది, విరివియైనది 5 గర్వము గలది 6 సుందరమైనది, చక్కనిది 7 ముఖము చిట్లించుకొనునది, కనుబొమ్మలు ముడివేయునది 8. గూఢమైనది, తెలియనిది 9. మాఱిన యాకారము గలది 10 పెద్ద పండ్లుగలది, మిట్టపల్లములు గలది
న కుఱుపు.

**వికటించే** సం అ క్రి ప్రతికూలించు
సీ. కాంత నీ వేకవాక్యముగ వర్తించుచువికటింప వేల యో శుకవతంస శాను 3. 56

**వికత్థ** సం వి అ స్త్రీ 1. డంబములు చెప్పుకొనుట, ఆత్మస్తుతి 2 స్తుతి, పొగడ్త 3 నిందాస్తుతి 4 ఉద్ఘోషించుట, బిగ్గరగాఁ జెప్పుట

**వికత్థనము** సం వి అ వి 1 ఆత్మస్తుతి, డంబము చెప్పుకొనుట 2 వ్యాజస్తుతి 3 స్తుతి, పొగడ్త

**వికత్థనుఁడు** సం విశ (అ ఆ అ) 1 ఆత్మస్తుతి చేసికొను వాఁడు, డంబము చెప్పుకొనువాఁడు. 2 వ్యాజస్తుతి చేయువాఁడు

**వికము** సం వి అ. న ముఱుఁబాలు, అప్పుడే యీనిన యావుపాలు

**వికరము** సం వి ఆ పుం రోగము, జబ్బు

**వికరాలము** సం విశ (అ ఆ అ) మిగుల కరాళమైనది, మిక్కిలి భయంకరమైనది

**వికర్ణుఁడు** సం. వి అ. పుం 1 ధృతరాష్ట్ర పుత్రులలో నొకఁడు, ఒకానొక భారతవీరుఁడు. 2 కర్ణ పుత్రుఁడు.

**వికర్తనము** సం వి అ. పుం అర్కవృక్షము, జిల్లేడు చెట్టు.

**వికర్తనుఁడు** సం. వి. అ పుం. 1 సూర్యుఁడు. 2 తండ్రిరాజ్యమును బలాత్కారముగా లాగుకొనిన కొడుకు

**వికర్మము** సం. వి. న్. న 1. అన్యాయకార్యము, నిషిద్ధకృత్యము, అపవిత్రకార్యము, 2. విభిన్న కార్యము.

**వికర్మస్థుఁడు** సం విశ (అ ఆ అ.) నిషిద్ధమైన పనులు చేయువాఁడు, కుత్సితాచారముల కలవడిన వాఁడు

**వికర్మికుఁడు** సం విశ. (అ ఆ అ) 1 చెడుపని చేయువాఁడు, దుష్టుఁడు. 2. వేఱు వేఱు పనులలో వినియోగింపఁ బడినవాఁడు, వివిధ కర్మలుగలవాఁడు
వి అ పుం. అంగడి పారుపత్తెకాఁడు, దుకాణముల మీఁది పన్ను వసూలు చేసెడి యధికారి

**వికర్ముఁడు** సం విశ న్ 1. చెడ్డపని చేయువాఁడు. 2. పనిమానిన వాఁడు

**వికర్షణము** సం. వి అ పుం మన్మథుని బాణపంచకములో నొకటి.
వి దూరముగా లాగుట. 2. (మల్లయుద్ధమున) అడ్డముగాఁ ద్రోయుట.

**వికర్షము** సం వి అ పుం 1 దూరముగా లాగుట, ప్రక్కగా నీడ్చుట. 2 బాణము, అమ్ము

**వికల** సం వి ఆ స్త్రీ (జ్యోతి.) కలలో నఱువదవ వంతు. (చూ. కల )

**వికలము** సం విశ (అ ఆ అ ) 1. ఒకభాగము, లేక యవయవము లేనిది, లోపముగలది, అసంపూర్ణమైనది 2 బెదరినది, భయపెట్టఁబడినది 3 శూన్యమైనది, వట్టిది. 4 క్షుబ్ధమైనది, కలఁతనొందినది, అధైర్య పడినది. 5. నిరుపయోగము, విఫలమైనది. 6 తప్పినది 7. క్షీణించినది, కృశించినది.

**వికలాంగుఁడు** సం విశ (అ ఆ ఈ. అ.) వికలమైన యవయవములు గలవాఁడు

**వికలీకరణము** సం వి అ న 1. వికలముగాఁ జేయుట, వికలాంగునిగాఁ జేయుట 2. కలవరపెట్టుట, క్షోభపెట్టుట.

**వికల్పజాలము** సం వి అ న వలవలె నుండెడి సంశయము, ఎట్లును తోఁచని స్థితి

**వికల్పనము** సం వి. అ న 1 సంశయమునొందుట, విచికిత్సపడుట. 2 అనిశ్చయము, నిశ్చయము లేమి

**వికల్పము** సం వి అ పుం 1 సంశయము, కోటిద్వయాత్మక జ్ఞానము, విచికిత్స 2 ఊహ, భావన 3 కల్పనము 4. విధము. 5. అజ్ఞానము. 6 తారతమ్యము 7 (వ్యాక.) పక్షప్రాప్తి (కలుగుట, కలుగకుండుట.)

**వికలోపహారము** సం. వి. అ పుం. ఐచ్ఛికమైన దానము.

**వికల్మషుఁడు** సం. విశే. (అ. అ అ) 1 మాలిన్యము లేనివాఁడు, కలంకము లేనివాఁడు 2. పాపములేని వాఁడు, తప్పు (అపరాధము) లేనివాఁడు

**వికవిక** వి. 1 నవ్వుటయందలి ధ్వని కనుకరణము.

క. అనుచు సురగురుఁడు పలికిన, విని బ్రహ్మాసురేంద్రుఁడూచి వికవికనగి . పార్వ. 2. 108

చ. వికవిక నవ్వియక్కపట విప్రకుమారుఁడు మేలు లెస్సవా, నికనయి రాగబంధమును నిల్పె మదిం దరశాయతాతి మీ, నకియ .. హర 4 27

2. తెగడుటయం దగు ధ్వని కనుకరణము.

ద్వి దీకొల్పి వికవికఁ దెగడువల్లియలు, చేకొని వారింపఁ జేరుగోపికల . అ. మ. క 2 124. పు 11. పం.

**వికష(స)** సం వి అ. స్త్రీ మంజిష్ఠ- మంజిడి. (వృ. వి.)

**వికసనము** సం. వి అ న వికాసము.

**వికసించు** సం అ క్రి. వికాసముపొందు.

క. అవపతియు నా మకేశి, వనితావదనంబు తెప్ప వాల్పక పీఠం, చెను రాకాచంద్రోదయ, మునఁ గలువల పగిది వయనములు వికసింపన్ ... వరా 3 112.

**వికసింపించు** సం స. క్రి. (√వికసించు) వికసింపఁ జేయు.

సీ ... నవ్యగీతులఁ బేంకణము వికసింపించి వనిత యొక్కతె ప్రసవములుగోసె పి శకుం. 2. 138.

**వికసితము** సం విశే. (అ అ.అ) వికసించినది, విరిసినది. (పుష్పము మొ.)

**వికసిల్లు** సం. అ క్రి 1. వికాసముపొందు

చ అనవుడు నట్లకాకయని యా వరనాయకుఁ డాత్మ నమ్మతిం, చినవెడ విశ్వవేది వికసిల్లుచు మార్కం 8. 26.

(ఇట "ఆనందించు" అని భావము)

గీ. అనిన విని వికసిల్లి యిట్లనియె నింతి... ధశకు, 5. 27

2. ఒప్పు, ప్రకాశించు.

క. సుకవి నిరూపణములచేఁ, బ్రకటిల్లుచు రూపకములు ఒహుళాకృతులై, వికసిల్లువాని తెఱఁగులు, నికటంబులు దెలియవలయు వివిధస్మృతులన్ కావ్యా 5. ఉల్లా. 22.

**వికస్వ(శ్వ)రము** సం. విశే (అ అ అ) 1 వికసించునది, విరియునది 2 బిగ్గరయైనది, స్పష్టముగా వినఁబడునది.

**వికారము** సం వి అ పుం 1. ఆకారమున మార్పు, స్వభావమున మార్పు, స్వాభావిక స్థితినుండి మాఱుట 2 రూపాంతర ప్రాప్తి, మాఱుపాటు 3 రోగము, వ్యాధి. 4 చిత్తవృత్తి, మనోవ్యాపారము 5 బొమలు ముడుచుట, చిట్లించుట. మొ ముఖచిహ్నము 6 (సాంఖ్య) మూల ప్రకృతి నుండి పుట్టినది. (మహదాది) 7 గాయము.

**వికారహేతువు** సం. వి ఉ పుం ఆకర్షణము, ఆందోళనము గలిగించు కారణము.

**వికారి** సం విశే (న్. జి న్) 1. వికారముగలది, మార్పునొందినది 2. మాఱునది. 3 చెఱుచునది.

**వికారితము** సం విశే (అ అ అ) వికారము గలదిగాఁ జేయఁబడినది, మార్పఁబడినది

**వికాల(క)ము** సం వి అ. పుం. అసురసంధ్యాకాలము. (ఇది దేవపిత్రాది కర్మల కనర్హకాలము.)

**వికావిక** సం. వి అ స్త్రీ. కాలమును దెలుపు ఘటీయంత్ర విశేషము

(నీటిమీఁద నుంపఁగాఁ గ్రమముగా నిండుటచేఁ గాలపరిమితిని దెలిపెడి బెజ్జముగల రాగి పాత్ర)

**వికావిక** విశే చెల్లాచెదరైనది.

క. . . నుగ్గులయి యవురునవురయి, గగ్గులుకాదై వికావికలయి యమర్త్యుల్ ... కాశీ. 7 87.

క. ... తత్పరిజనము వికావికలయ్యెన్. దశకు. 2. 64

**వికావిక** వి నవ్వుటయం దగుధ్వని కనుకరణము.

క ... కులశీలంబులు వఱదం, గలపితివిఁక నేమి యని వికావిక నగుచున్ ... వేం. పంచ. 3. 146.

ఉ. కారణమేమిలేకయె వికావిక నవ్వును ... కవిరాజ. 5. 188.

**వికాస(శ)నము** సం వి. అ న 1. స్పష్టపఱచుట, స్పష్టముగాఁ జూపుట 2 (పువ్వు మొ.) వికసించుట, విరియుట

**వికాస(శ)ము** సం. వి అ పుం. 1 స్పష్టపఱుచుట, స్ఫుటముగాఁ జూపుట 2 (పువ్వు. మొ.) వికసించుట, విరియుట 3 ఋజుపద్ధతి, సరళమార్గము. 4. వక్రపద్ధతి, కుటిలమార్గము 5 సంతోషము 6. ఆకాశము 7. ఆతురత, తీవ్రవాంఛ 8. వికాంతము. 9 వృద్ధి, పెరుఁగుఁదల

**వికాసి(శి)** సం విశ (స్. నీ న్.) 1. దృశ్యమగునది, స్పష్టముగాఁ గనఁబడునది. 2 వికసించునది, విరియునది. 3. ప్రకాశించునది

**వికాసించే**=వికసించే సం అ. క్రి. వికాసము నొందు.

శా . అంతస్నానము మాన్పఁగా వలయునల్లె నంబ్రియం శాఁ జే,యింతున్ వీనికి రెట్టి సొమ్ములు మనం బెంతే వికాసింపఁగన్. రుక్మాం. 4. 113.

క . భూమీసురుఁ గనుఁగొని నగు, మోమున నిట్లనియె డెందము వికాసింపన్ . . శ్రీరం. 2 98.

**వికిరణము** సం వి అ న. 1. చెదరఁగొట్టుట, ఇటు నటుఁ జల్లుట 2. అంతటను వ్యాపింపఁ జేయుట. 3 చీల్చుట. 4 హింసనము, చంపుట. 5. జ్ఞానము. పుం అర్కవృక్షము, జిల్లేడు చెట్టు

**వికిరము** సం వి అ పుం. 1. చెదరిన భాగము 2. విఘ్న శాంతికై చల్లబడిన దూర్వాంకురాదికము

శ్లో. లాజచందన సిద్ధార్థ భస్మ దూర్వాంకురాక్షతాః, వికారా ఇతి సందిష్టాస్సర్వ విఘ్నౌ వినాశనాః (తంత్రసా. వాచ)

3. అసంస్కృతులై, మృతులయిన పితరుల నుద్దేశించి శ్రాద్ధమునందు దర్భలపై మంచఁబడు నన్నము.

శ్లో. అసంస్కృత ప్రమీతానాం యోగినాం కులయోషితాం, ఉచ్ఛిష్టం భాగధేయంస్యాత్, దర్భేషు వికిరశ్చయః. (అ త వాచ.)

4, పక్షి. 5. మాయి. 6. వృక్షము.

**వికీర్ణజ్ఞము** సం వి. అ న పరిమళ ద్రవ్య విశేషము.

**వికీర్ణము** సం విశ (అ ఆ అ) 1. చెదరినది. విడిపోయినది 2 చల్లఁబడినది. 3. ప్రసిద్ధమైనది.

**వికుంఠము** సం. వి అ న విష్ణులోకము.

**వికుంఠితము** సం విశ (అ ఆ అ) 1. మొక్కైనది, మొఱపోయినది, మొద్దుగాఁ జేయఁబడినది 2 మూఢము, మూర్ఖము

**వికుర్వాణుఁడు** సం విశ (అ. ఆ అ) 1. మార్పు పొందినవాఁడు 2 సంతోషించినవాఁడు

**వికు(క్ర)స్రుఁడు** సం వి అ. పుం చంద్రుఁడు.

**వికూజనము** సం వి అ న 1 పావురముకూఁత పక్షికూఁత 2 పేగులార్చుట.

**వికూణనము** సం వి. అ న ఓరచూపు

**వికూణిక** సం. వి అ స్త్రీ నాసిక, ముక్కు.

**వికృతము** సం విశ. (అ ఆ అ) 1 మార్పుచెందినది. మాఱినది 2 తెవులు గలది 3 అంగవికారము గలది, విరూపమైనది 4 అసంపూర్ణమైనది 5. మనోవికారము గలది, భావోద్రేకము గలది. 6. ఇష్టము లేనిది, విసిగినది. 7 అసహ్యమైనది, చీఁదరైనది. 8 అసాధారణ మైనది 9 స్వాభావికముగానిది, స్వభావ విరుద్ధమైనది. 10. పాడు చేయఁ బడినది, చెఱుపఁ బడినది 11 రోగయుక్తము, వ్యాధిగ్రస్తము

వి. అ. న 1 మార్పు 2 హీనస్థితికి మాఱుట. 3. తెవులు, రోగము. 4. ఇష్టములేమి, వసుగు.

**వికృతి** సం. న అ. స్త్రీ 1 ఉద్దేశము, మనస్సు, రూపము మొదలగువాని మార్పు 2. స్వభావ విరుద్ధస్థితి 3 రోగము 4 మానసికోద్రేకము, కోపము, రోగము మొ. 5 భావము, చిత్తవృత్తి. 6. బలాత్కారముగఁ బట్టుకొనుట 7 పులిసిన కల్లు 8. భూతము, దయ్యము (విల్యమ్సు) 9 ప్రభవాది సంవత్సరములలో నొకటి.

**వికృష్టము** సం. విశ (అ. ఆ అ) 1. దూరముగా లాగఁబడినది, ఈడ్వఁ బడినది, ఆకర్షింపఁబడినది. 2 పొడవుగాఁ జేయఁ బడినది. 3 ఉద్ఘోషింపఁ బడినది, చాటఁబడినది, మొఱపెట్టఁ బడినది. 4. కఠినమైనది, నిర్దయము, క్రూరము 5. చక్కఁగా దున్నఁ బడినది.

వి అ న. 1. మొట్టు 2 నింద.

**విశేశి** నం. వి ఈ స్త్రీ 1 విరియఁబోసికొనిన జొట్టు గల స్త్రీ, వీడిన కొప్పుగల స్త్రీ. 2 వెంట్రుకలు లేని యాఁడుది 3 వేడి, జడ 4 అష్టమూర్తియైన శివునికి మహీరూపమున నున్నపుడుండు భార్య.

శ్లో సూర్యో జలం మహీవాయుర్వహ్ని రాకాశమేవచ, దీక్షితో బ్రాహ్మణ స్సోమ ఇత్యేతా స్తన వక్రమాత్॥ సువర్చలాతథైవోషావికేశీ చాప రాశివా, స్వాహాదిశ స్తథా దీక్షా రోహిణీ చ యథాక్రమమ్. (మార్క వాచ)

**విశేశుఁడు** నం విశే (అ ఆ ఈ ఆ) 1 వీడిన వెంట్రుకలు గలవాఁడు. 2 వెంట్రుకలు లేని వాఁడు.

**విశోశ(ష)ము** నం విశే (అ ఆ.అ) 1. పొట్టు లేనిది. 2. కోశము లేనిది, ఒఱలేనిది.

**విక్కను** అ క్రి (వికు్క+అను) విక్కుమను ధ్వని కలుగు.

ద్వి. వ్రక్కలై కూడఁ జారాడికు మేను, విక్కవ విరియుడు విరవిరి యనుచు ... బస. పురా 185. పా. 20 పం.

**విక్కము** నం. వి అ పుం పిల్ల యేనుఁగు, గజ శాబకము.

**విక్కవిరియు** అ క్రి (విరియు+విరియు) మిక్కలి విరియు, మిగుల సంతోషించు.

వ నమోన్మాదంబున విక్కవిరిసి రక్కసుని యురంబున ... భాగ. దశ. పూ. 276.

**విక్కు** అ క్రి 1 విశ్లథమగు, వదులగు

ఉ. క్రిక్కిఱి చేన్నుఁదోయి యిరుగ్రేవల కాంతియుఁ బంచబాణుఁ గ్రొవ్వెక్కఁగఁ జేయ హస్త యుగమెత్తి విహారభరంపుఁ బేర్మికిన్, విక్కి ప్రసూనము ల్గురియు వేనలి వీడిచి కొప్పు వెట్టుచోఁ, జొక్కులఁ బెట్టె భూవరుని చూపులఁ గోమలి బాహుమూలముల్. నైష 7. 194.

౨ గర్వించు

ఉ. చక్కెర విల్తు పక్కెరల జెక్కినటంచుమ విక్కి విక్కివే, డెక్కుడు మాటలం బదరె దింతియ కాని యవారియాన వ్రాల్చక్కెరఁ బెట్టి రాము కతఁ జెక్కగ నేర్చుచుఁ బెంచి నట్టి యా, యక్కను జూడవై తివి గదా ప్రమదాళినిగూఢ కీరము రా వి. 4 66

ద్వి. విక్కుచుఁ జొక్కుచు విట్టువీఁగుచును, మిక్కిలి తమకంబుమే కొనఁ గ్రొత్త, సింగారమూనె తి. సారంగ 1. 5 పా. 4. పం.

3 విజృంభించు.

క అకొ్కమ్మ మెకవు జోదులు, విక్కుచు నకొ్కండ యెక్కవిరిదేనియలన్, జొక్కటపుఁ దియ్యపండుల, జెక్కరి తెలివీర్ల వలువు సడ లించి తగన్ అచ్చేరా. కిష్కిం. 89

4. నిందించు, అధిక్షేపించు.

క తక్కిన పాండుకుమారుల, విక్కుచు శస్త్రంబు చేత విడిచిన గురునిం, ద్రొక్కితలఁద్రుంచు వానిన్, గ్రుక్కక రణ వీథిఁ బోడుతుఁ జోద్యముగాగన్ సేతుఖం. 3 93. పా.

(ఇది యశ్వత్థామ యనుమాట.)

వి 1 గర్వము

ద్వి. దాని చెక్కుల తెక్కు దాని బల్ విక్కు, దాని మోము మెఱుంగు దాని తెఱంగు ... తి. సారంగ 1. 7. పా 9. పం.

2. విరియుట యందగు ననుకరణము.

ద్వి విషయ వాసన మదివీడొ్కన్న యపుడె, విషయషడ్వర్గంబు విక్కవవిరియు ... ప్రభు లింగ 5 157 పా. 16. పం

3 విఱుగు నప్పుడగు ధ్వని కనుకరణము

ద్వి విపులేంద్రముని వీఁపు విక్కవ విఱిగె ... బస పు 158 పా 18 పం.

**విక్రమ** నం. వి. అ పుం ప్రభవాది సంవత్సరము లలో నొకటి.

**విక్రమణము** నం వి. అ న విష్ణుదేవుని యంగ.

**విక్రమము** నం వి అ పుం 1 అడుగు, అంగ 2 అడుగులు వేయుట, నడచుట. 3 గెలుచుట, జయించుట 4. వీర్యము, పరాక్రమము. 5 బలము, శక్తి.

**విక్రమాదిత్యుఁడు** నం వి అ. పుం సుప్రసిద్ధుఁడైన యొకరాజు.

(ఇప్లే, "విక్రమార్కుఁడు.")

విక్రమి నం. విశ. (న్. జీ న్) 1 పరాక్రమము గలవాఁడు, శౌర్యవంతుఁడు 2. బలవంతుఁడు, శక్తిగలవాఁడు.
వి న్. పుం 1 సింహము 2 శూరుఁడు 3. విష్ణువు.

విక్రమించే నం. అ క్రి 1 పరాక్రమము చూపు
ఉ. ... రాజులు, య్యాదవు ముందటన్ జయ జయ ధ్వను లిచ్చిరిగాని వాని శౌర్యోదయ వృత్తి కట్టెదురనోవర యెవ్వరు విక్రమింపగన్ భార సభా. 2 97.
వ. అనవరతాన్యోన్యసంగతంబు లగు చక్రంబుల నతిక్రమించెడు క్రమంబులఁ గుచంబులు విక్రమింప నిజకరాఘాతంబులఁ...శుకచరి 2 20
(ఇట 'నతిశయింప' నవిభావము,)
చ. అపుడు సుమాలి ... విపులశతాంగమున్ మెఱయవేచని మార్కొని విక్రమించినన్ ఉ రా. 2 65

విక్రముఁడు నం. వి అ పుం 1 ప్రఖ్యాతుఁడైన యుజ్జయినీ పట్టణపు రాజు, విక్రమాదిత్యుఁడు, విక్రమార్కుఁడు 2. విష్ణువు.

విక్రయము నం. వి. అ పుం అమ్మకము.

విక్రయానుశయము నం వి. అ పుం 1. అమ్మకము రద్దుచేయుట (ఆ. వి.) 2 అమ్మకము రద్దు చేసి కొనుటకైన వివాదము (వాచ.)

విక్రయి నం విశ. (న్ జీ న్) వ్యాపారి, అమ్మువాఁడు

విక్రయించే నం న. క్రి. అమ్ము
మ. .. కలత్రమున్ వరకుమారుం గాశిలో విక్రయించి నిరూఢంబగు నత్యముర్వరఁ బ్రతిష్ఠించెన్ .. జై భా 4 128.

విక్రయికుఁడు నం. విశ. (అ. ఆ. అ) వ్యాపారి, అమ్మువాఁడు.

విక్రాంత నం.విశ. (ఋ. త్రి. ఋ) పరాక్రమము గలవాఁడు.
వి. ఋ. పుం. 1. వీరుఁడు. 2. సింహము.

విక్రాంతము నం. విశ. (అ. ఆ అ.) 1. అంగవేయఁబడినది, దాఁటఁబడినది, 2. బలము గలది, పరాక్రమము గలది. 3. జయించినది, గెలిచినది,
వి. అ. పుం. 1. సింహము.
న 1 అంగ 2 వీర్యము, పరాక్రమము 3. వైక్రాంతమణి

విక్రాంతి నం వి. ఇ స్త్రీ 1 అడుగువేయుట, అంగవేయుట 2 గుఱ్ఱపునడక 3 పరాక్రమము, వీర్యము

విక్రాంతుఁడు నం వి అ. పుం వీరుఁడు, యోధుఁడు

విక్రియ నం వి. ఆ స్త్రీ 1 మాఱుపు. 2 మనోవికారము, కోపము, రాగము, అసంతుష్టి మొ 3 వైకల్యము 4 కనుబొమలు ముడుచుట మొ ముఖచిహ్నము 5 ఆకస్మికమగు గగుర్పాటు మొ.

విక్రేత నం వి ఋ పుం విక్రయించువాఁడు

విక్రేయము నం. విశ. (అ ఆ అ) అమ్మఁదగినది.

విక్రోశనము నం వి అ న. 1 మొఱపెట్టుట, ఉద్ఘోషించుట. 2 నిందించుట

విక్లబము నం విశ. (అ. ఆ అ.) 1. భయమునకు లోనైనది భయపడినది 2 పిఱికి, ధైర్యము లేనిది 3 పరవశమైనది, (ఒకదానికి) లొంగినది. 4 కలవరపడినది, క్షోభపడినది. 5 బాధింపఁబడినది, దుఃఖము కలుగఁజేయఁబడినది 6 విసిగినది, విసుగు చెందినది 7. తొట్రుపడినది

విక్లిన్నము నం విశ (అ ఆ అ.) 1. మిగులఁదడిసినది, తేమగలది 2. క్షీణించినది, వాడినది. 3. ముదిసినది.

విక్లిష్టము నం విశ (అ ఆ అ.) 1. మిక్కిలి బాధింపఁబడినది, మిగుల క్లేశపెట్టఁబడినది 2 హాని కలుగఁజేయఁబడినది.
వి. అ. న ఉచ్చారణము నందలి లోపము.

విక్లేతము నం వి అ. పుం 1 పూర్తిగాఁదడియుట. 2 కరఁగిపోవుట

విక్షతము నం. విశ (అ ఆ. అ) 1. గాయపఱుపఁబడినది, కొట్టఁబడినది. 2. ముక్కలుగాఁ జేయఁబడినది.
వి అ. న. 1. గాయము చేయుట. 2. గాయము.

విక్షావము నం వి. అ. పుం. 1. కాసరోగము, దగ్గు. 2. తుమ్ము. 3. ధ్వని, చప్పుడు.

**విక్షిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెదరినది. చెదరఁగొట్టఁబడినది 2 (ఉద్యోగము మొ. దానినుండి) తొలఁగింపఁబడినది 3. పంపబడినది 4. కలవరపడినది. 5 (వాదము) ఖండింపఁబడినది. 6 (యోగ) చిత్తము యొక్క స్థితి విశేషము "క్షిప్తం, మూఢం, విక్షిప్త, మేకాగ్రం, నిరుద్ధమితి చిత్తభూమయః."

**విక్షిరము** సం. వి. అ. పుం. అర్కవృక్షము, జిల్లేడుచెట్టు

**విక్షేపణము** సం. వి. అ. న. 1. త్రోసివేయుట, (బాణము) ప్రయోగించుట 2. చెదరుట, ఇటునటుఁ బోవుట 3 కలవరపడుట. 4 దూరీకరణము, ఉద్యోగాదులనుండి తొలఁగించుట.

**విక్షేపము** సం. వి. అ. పుం. 1. దూరముగాద్రోయుట, చెదరఁగొట్టుట 2. ప్రయోగించుట, (బాణము మొ) విడుచుట. 3 అలల వలెఁగదలుట, కంపమొందుట 4. ఇటునటుఁ గదుపుట, ఆడించుట. 5. కలవరపాటు. 6. భయము 7. వాదఖండనము. 8. ధ్రువరేఖ. 9 స్త్రీల సత్త్వజమైన యలంకార విశేషము 10. కార్యాంతరమిషచే వాదమును నిలుపుట, నిగ్రహస్థాన విశేషము.

**విక్షేపశక్తి** సం. వి. ఇ. స్త్రీ (వేదాంత) అవిద్యాశక్తి విశేషము, లేనిదానినున్నట్టు కనఁబడఁజేయు మాయాశక్తి.

**విక్షేపించు** సం. స. క్రి. త్రోయు, చిమ్ము

శా. శ్రేణీభూతములై దిగంతముల విక్షేపించు సౌమిత్రి దోః, స్ఫూర్జాగ్రోక్షిత...బాణములు వర్షింపంగ ... భా రా సుం 443.

**విక్షోభము** సం. వి. అ. పుం 1 కదలుట, చలించుట. 2 మానసిక క్షోభము, కలవరపాటు, భయము. 3. బాధ, నొప్పి.

**విక్షోభించు** సం. అ. క్రి. బాధపడు.

శా. హాలాపానము మాంసభక్షణము వశ్యాసక్తిఁ గావింప హృచ్ఛూలాది ప్రరుజా వ్యథల్ గలిగి విక్షోభించుచున్ ధాత్రిఁ జం, డాలత్వంబు భజించె సువ్రతము శిష్టావాప్తముల్లేమి ... బ్రహ్మోత్తర 2. 98

**విఖండితము** సం. విణ. (అ ఆ అ) 1 ఖండింపఁబడినది, పగులఁగొట్టఁబడినది, విభజింపబడినది. 2 రెండు ముక్కలుగాఁ జేయఁబడినది 3. వికలాంగముగాఁ జేయఁబడినది 4 (వాదము) ఖండింపఁబడినది

**విఖండించు** సం. స. క్రి. నఱకు.

గీ. రాక్షసుఁడు వైచినట్టి యాప్రబల శక్తి, శక్తి వైచి విఖండించె శంభుశక్తి ... కాశీ. 6 244.

**విఖా(ఖ)నసుఁడు** సం. వి. అ. పుం. 1. వానప్రస్థుఁడయిన ఋషి 2. ఒకానొకముని.

**విఖాన** సం. వి. ఆ. స్త్రీ జిహ్వా, నాలుక. (విల్యమ్సు)

**విఖురుఁడు** సం. వి. అ. పుం. 1 రాక్షసుఁడు 2 చోరుఁడు, దొంగ

**విఖు(వు)** సం. విణ. (ఉ.) ముక్కిడి, ముక్కు లేనివాఁడు

**విఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసిద్ధమైనది, పేరుపొందినది 2. పిలువఁబడినది, పేర్కొనఁబడినది 3. ఒప్పుకొనఁబడినది, అంగీకరింపఁబడినది.

**విఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి, కీర్తి

**విఖ్యాపనము** సం. వి. అ. న. 1. ప్రకటించుట, ఉద్ఘోషించుట 2. వివరించుట, స్పష్టపఱచుట. 3. ఒప్పుకొనుట, అంగీకరించుట.

**విఖ్రు(ఖు)ఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ముక్కిడి, ముక్కులేనివాఁడు.

**విగంధకము** సం. వి. అ. పుం. ఇంగుదీవృక్షము, గారచెట్టు

**విగడము** విణ. (సం. వికటః) వికటము

వ. ... దిట్టమాటలం బుట్టిన విగడంబులై యుద్ధపతదంతంబులగు పంతంబులం గుంతంబులం గొని పి. శకుం 1. 86.

**విగడియ** వి. (సం. విఘటికా) గడియలో అఱువదవ భాగము.

క. ... ఒక్క విగడియలోనన్ ... రామా. 8. 64 (శ ర)

**విగణనము** సం. వి. అ. న. 1 లెక్కించుట. 2. ఆలోచించుట. 3 ఋణముతీర్చుట

**విగతచక్షువు** సం. విణ. (స్) కన్నులు లేని వాఁడు గ్రుడ్డివాఁడు, అంధుఁడు.

క మఱునాఁడు విగతచతుని, తెఱఁగువ నొక పంచఁజేరి దీవతదోఁపన్, గొఱమాలిన యొక పెంచిక, యఱచేతం బట్టికొని వతానమునఁదగు చున్ భోజరా 2 184

**విగతము** నం విణ (అ అ అ.) 1. పోయినది, నష్టమైనది 2 విడిచిపోయినది. 3 చేనిపోయినది 4 శూన్యము, లేనిది. 5. చీకఁటియైనది, మబ్బుపడినది వి అ న పక్షిగతి, పిట్టలెగురుట

**విగతలక్షణుఁడు** నం విణ (అ అ అ) శుభలక్షణములు లేనివాఁడు, అదృష్టహీనుఁడు

**విగతస్పృహుఁడు** నం విణ. (అ అ అ) అపేక్ష లేనివాఁడు.

**విగతార్తవ** నం వి అ స్త్రీ రజస్సుపోయిన స్త్రీ, ముట్టుడిగిన యాఁడుది

**విగమము** నం వి. అ పుం 1 విశ్లేషము, వీడిపోవుట. 2. సమాప్తి, ముగింపు 3. త్యాగము, విడుచుట. 4 నాశము, కనఁబడకపోవుట 5 చావు, మరణము 6 విడిపోవుట, విభక్తమగుట.

**విగరుఁడు** నం వి అ పుం 1 దిగంబర సన్న్యాసి 2 మితభోజి, మితముగా భుజించువాఁడు

**విగర్హణ** నం వి అ స్త్రీ నింద, దూఱు.

**విగర్హణము** నం వి అ. న =విగర్హణ

**విగర్హించు** నం న క్రి నిందించు

శా. . ఇ, శ్లేవేశం బురిఁ ద్రిమ్మరుచ్ మిజములెం తేఁదన్ విగర్హింపఁగన్ ధర్మ 8 132

**విగర్హితము** నం విణ (అ అ అ) 1 నిందింపఁబడినది 2 నిర్లక్ష్యము చేయఁబడినది 3 నిషేధింపఁబడినది, నిషిద్ధము 4, అధమము, హీనమైనది, 5. చెడ్డది, దుష్టము. వి అ. న. నింద.

**విగల(ళ)నము** నం వి అ. న మిక్కిలి జాఱుట, విస్ఖలనము

**విగలితము** నం. విణ (అ అ అ.) 1. కాఱినది, స్రవించినది 2 జాఱినది. 3 పోయినది. 4 కరఁగినది. 5. చెదరినది. 6 వదులైనది. 7 (తల) విరియఁబోసికొన్నది.

**విగాఢము** నం విణ. (అ అ అ) 1. స్నానముచేసినది, మునిఁగినది. 2 లోఁతైనది.

**విగానము** నం వి అ న. 1. నింద, దూఱు, అన. వాదము 2. పూర్వోత్తర విరుద్ధముగాఁ చెప్పుట.

**విగాహము** నం వి అ పుం. 1. స్నానముచేయుట, మునుగుట 2. లోతువకుఁ బోవుట

**విగాహించు** నం అ క్రి మునుఁగు, క్రుంకు. (శ.ర.)

**విగాహితము** నం విణ (అ. అ. అ) మునిఁగినది.

**విగీతము** ం. విణ (అ అ అ) 1. నిందింపఁబడినది, విగర్హితము 2. పూర్వోత్తర విరుద్ధమైనది.

**విగీతి** నం. వి అ స్త్రీ 1. నింద, దూఱు. 2. పూర్వోత్తర విరుద్ధముగాఁ జెప్పుట.

**విగుణము** నం విణ (అ అ అ) 1. సుగుణములు లేనిది, చెడ్డది. 2 నిర్గుణము, ఏగుణమును లేనిది, గుణరహితము. 3 సారము లేనిది.

**విగుర్వించే** అ క్రి (√విగుర్వ. క. విగుర్విమ)

1. గర్వించు.

వ అనేక బ్రహ్మాండ విఖండఖండన వ్యాపారము నకు నేమేము చాలుదు మనుచున్న గణంబులందు గణముఖ్యులు దలతలమని వెడలి విగుర్వించి... కు నం 2. 189.

2 యత్నించు.

క. గర్వించి పలికి తగునే, గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ,పర్వత వివరము తెర్చివి, గుర్వంపుము చూత మనిన గోత్రభిదుండున్. భార. ఆది. 7. 273

**విగుర్వ** వి. ప్రయత్నము

ఉ పారతుపార శంఖవిమలాభ్ర మహోజ్జ్వలకీర్తిఁ జాలం బొ,ల్పారిన బుద్ధమండలికు నగ్రసుతుం డగు మన్మమండ(ం) డా,చారవరుండు నాదెండ్లం జారుతరంబగు వెండికొండనాం, గౌరి శశాంకమౌళికి విగుర్వనతో గుడినిల్పె... 1061 ద శా. 4. 672.

జ విగుర్వించే.

**విగూఢము** నం విణ. (అ. అ. అ) 1. రహస్యమైనది, దాఁచఁబడినది. 2. నిందింపఁబడినది, విగర్హితము.

**విగృహీతము** నం విణ. (అ. అ అ.) 1. పట్టుకొనఁబడినది. 2. ఎదిరింపఁబడినది. 3. ఆటంక పఱుపఁబడినది. నిర్బంధింపఁ బడినది. 4. (వ్యాక) విగ్రహము చెప్పఁబడినది. (సమానము.)

(వాక్యమున అర్థము వివరింపఁ బడినది.)

**విగ్గోరు** వి ఒకజాతి లత (వ్య. వి)
సీ. క్రొవ్విరు లెసఁగి ... విలసిల్లు నిండారు వెన్నె లలోఁ గారు విగ్గోరుఁ దీగెలు వెలుఁగునట్లు . . కు సం. 8. 9.

**విగ్రహము** సం. వి అ. పుం 1 చాఁచుట, వ్యాపింపఁ జేయుట. 2. ఆకారము, రూపు. 3. శరీరము 4. కలహము, ప్రణయ కలహము 5. యుద్ధము, పోరాటము (సంధికి వ్యతిరేకము) 6. రాజ్య తంత్రము నందాఱు గుణములలో నొకటి 7 నిర్దయత, దయలేమి. 8 భాగము 9 (వ్యాక.) సమాసార్థమును వివరించు వాక్యము

**విగ్రహవంతుఁడు** సం.విశ. (త్ వతీ త్) శరీరము గలవాఁడు మూర్తిమంతుఁడు,అవతరించినవాఁడు

**విగ్రహించే** సం అ. క్రి. కలహించు, విరోధపడు
గీ. . వేయికన్నుల వేల్పుతో విగ్రహించి వనిత యింకేమి కానున్నవాఁ డొమరుఁడు నైష. 4. 28.
ఆ. అనుచు జనులు నాశ్చర్యభరితులై, చూచు చుండ నిందు సుందరాస్య, యాత్మ యోగ వహ్నికాహుతిఁ గావించె, విగ్రహించి తనదు విగ్రహంబు. మూర్తిత్ర. 5. 75.
సీ. గి నీర. జాతములను గిరజాతములను, విగ్రహింపనీని విరహంబె తోడుగా, వెలఁది వెడలెవిపిన వీథులకును . . వసు 3. 132

**విగ్రీవుఁడు** సం విశ (అ అ అ) పోయిన మెడగల వాఁడు—శిరశ్ఛేదము చేయఁబడిన వాఁడు, తల గొట్టఁ బడినవాఁడు.

**విగ్రుఁడు** సం. విశ. (అ. అ అ.) ముక్కిఁడి. ముక్కు పోయినవాఁడు.

**విఘటనము** సం వి అ న 1. విడఁగొట్టుట. 2. నశింపఁజేయుట, చెఱుచుట

**విఘటించే** సం. అ క్రి తప్పిపోవు, చెడు
సీ. గీ. మొదల సంఘటియించినఁ బొంది కార్య మవల విఘటించెనేని గౌరవము దప్పి... నైష. 2. 66.
వ. దీని విఘటింపం జేయుదునని ఘూసురా కారుండై వచ్చి పూర్వులంగాంచి ... భార. అను. 1. 295.

**విఘటిక** సం. వి అ. స్త్రీ. 1. గడియలో నఱువదవ భాగము, విగడియ. 2. విడఁగొట్టునట్టి (వియోగము నొందించు) స్త్రీ

**విఘటితము** సం. విశ (అ అ అ.) 1. విడఁదీయఁ బడినది, వేఱుచేయఁబడినది 2. విభజింపఁబడినది, పంచిపెట్టఁబడినది. 3. పగులగొట్టఁబడినది. 4. విశేషముగాఁ గూర్పఁబడినది. (వాచ.)

**విఘట్టన** సం వి. అ. స్త్రీ 1 ఎడఁబాపుట, విడఁ జేయుట. 2 ఒరయిక, రాపిడి. 3 విడఁదీయుట, వదులుచేయుట 4 అపాయము గలిగించుట.

**విఘట్టనము** సం వి అ న. = విఘట్టన.

**విఘట్టించే** సం స. క్రి (మోకాళ్లు మొ వానిచే) పొడుచు
స్రగ్ధర చించెం జెండాడె మట్టెం జిదిమె విఱిచెఁ గ్రొచ్చెన్ విఘట్టించెదంచెన్, .. కాశీ 6 176

**విఘట్టితము** సం. విశ (అ అ అ) 1 వియోజితము, ఎడఁబాపఁబడినది, విడఁజేయఁబడినది, 2. విడఁ దీయఁబడినది తెఱవఁబడినది, వదులుచేయఁబడినది 3 రాచఁబడినది, ఒరసికొనఁబడినది 4. చలింపఁ జేయఁబడినది, కదల్పఁబడినది. 5. హానిగలిగింపఁ బడినది

**విఘనము** సం వి. అ. పుం కొయ్యసమ్మెట, సమ్మెట.

**విఘసము** సం వి అ పుం 1. సగము నములిన కబళము 2 దేవతలను, పితృదేవతలను ఉద్దేశించి యిడిన యన్నమున మిగిలిన భాగము 3 భుక్తశేషము, తినగా మిగిలిన యన్నము 4. ఆహారము అన్నము.
స. మైనము

**విఘసాశి** సం విశ (న్ + నీ న్) దేవతలను పితృదేవతలను ఉద్దేశించి యిడిన యన్నమున మిగిలిన భాగమును భుజించువాఁడు

**విఘసాశుఁడు** సం. విశ (అ ఆ. అ) = విఘసాశి.

**విఘాతము** సం వి. అ. పుం. 1. నాశము. 2. చంపుట, హింసించుట. 3. అడ్డంకి, విఘ్నము, వ్యాఘాతము. 4 పెద్దదెబ్బ 5.త్యాగము,విడుచుట.

**విఘాతసిద్ధి** సం. వి. ఇ స్త్రీ. విఘ్నములుఁ తొలఁగించుట, అడ్డంకులఁ ద్రోసివేయుట.

విఘాతి నం విశ (న్ నీ న్.) 1 తొలఁగించు వాఁడు, నివారకుఁడు 2 నశింప జేయు వాఁడు, నాశకుఁడు.

విఘాతించు నం స క్రి. 1 చంపు, సంహరించు

మ. మేదినికిన్ భారముడింప దైత్యుల విఘాతింపంగఁ గ్రీడార్థమై జనియించెన్ భవదీయ సూనుఁడు.. హరి. పూ. 6. 15.

2 చెఱుచు (శ ర.)

విఘూర్ణితము నం. విశ. (అ. ఆ అ) విశేషముగాఁ ద్రిప్పబడినది. (కన్న)

విఘృష్టము నం విశ (అ ఆ అ) 1 మిక్కిలి యొరయఁబడినది 2 మిగుల నూఱఁబడినది, మిక్కిలి మర్దింపఁబడినది 3 ఎక్కువగా రుద్దఁబడినది.

విఘ్నకరుఁడు నం. విశ (అ ఈ అ) అడ్డు పెట్టువాఁడు విఘ్నము గలిగించువాఁడు

విఘ్నకర్త నం. విశ (ఋ ర్త్రీ ఋ) = విఘ్నకరుఁడు

విఘ్నకారి నం విశ. (న్. జీ న్) విఘ్నకరుఁడు

విఘ్నధ్వంసము నం వి అ పుం విఘ్నములు తొలఁగించుట

విఘ్ననాయకుఁడు నం వి అ పుం విఘ్నేశ్వరుఁడు.

విఘ్ననాశనుఁడు నం వి అ పుం విఘ్నేశ్వరుఁడు, గణపతి.

(ఇట్లే విఘ్ననాశకుఁడు)

విఘ్నపడు వి. అ క్రి (విఘ్నము+పడు) అడ్డిపోవు, విఘ్నితమగు

క ఆ జోలియేల నిర్మల, బీజహవి స్సత్ర మేను బ్రీతి నొనర్పంగా జగతి వఱపునం జెడు, నే జేన్నము విఘ్నపడు 3 యేఁటికివగవన్. భార. అశ్వ. 4 26.

విఘ్నము నం. వి. అ. పుం. 1. అంతరాయము, అడ్డంకి, చెఱుపు. 2. శ్రమము, కష్టము 3 కరమర్దము, కలివెచెట్టు. (వాచ)

విఘ్నరాజు నం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

విఘ్నవినాయకుఁడు నం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు, గణపతి.

విఘ్నహారి నం వి న్. పుం - విఘ్నములు పోఁగొట్టువాఁడు - విఘ్నేశ్వరుఁడు.

విఘ్నితము నం విశ. (అ ఆ అ) 1 విఘ్నములు కలిగినది, ఆటంక పఱుపఁబడినది 2. అడ్డుకొట్టఁబడినది.

విఘ్నేశ్వరవాహనము నం వి. అ. న. ఎలుక.

(ఇట్లే విఘ్నేశవాహనము మొ)

విఘ్నేశ్వరుఁడు నం వి అ పుం గణపతి, ఈశ్వరుని పుత్త్రుఁడు, విఘ్నముల కధిపతి

(ఇట్లే విఘ్నేశానుఁడు, విఘ్నేశుఁడు. మొ)

విచ(చి)కిలము నం వి అ పుం 1 ఒక జాతి మల్లె. (వృ వి) 2 మదనవృక్షము, మ్రంగచెట్టు.

విచక్షణుఁడు నం విశ. (అ ఆ అ) 1 సూక్ష్మదృష్టిగలవాఁడు, దూర దృష్టిగలవాఁడు, వివేకశాలి 2 బుద్ధిమంతుఁడు 3 నిపుణుఁడు, నేర్పరి. 4 చదువుకొనినవాఁడు, చదువరి.

వి. అ పుం పండితుఁడు, విద్వాంసుఁడు

విచక్షించు నం స క్రి విమర్శించు దండకము .. ఇంతింబరీక్షించి బుద్ధిన్ విచక్షించి తన్మాత్రమాయాపరాభూత జామాత భోగినీ దండకము

విచక్షుఁడు నం విశ (న్) - విచక్షుష్కుఁడు.

1. కన్నులు లేనివాఁడు, గ్రుడ్డివాఁడు. 2 కలవర పడినవాఁడు, విమనస్కుఁడు, దుఃఖితుఁడు.

విచయనము నం వి అ. న 1 వెదకుట. 2. పువ్వులు మొ కోయుట (వాచ)

విచయము నం వి అ పుం 1 అన్వేషణము, వెదకుట 2 పరిశోధనము

విచరించు నం అ క్రి విచారించు, సంతాపపడు.

ఉ హైదరు జంగు పంపున మహాహవకేళిఁ గోటచుట్టి బాహాదృఢ విక్రమోద్ధతిరయమ్మున సైన్యమువచ్చి నిల్చె నిమ్మిఁది విచారమెట్లనియ మేయ పరాక్రమ రంగరాయ ధాత్రీదయితు గ్గణించి విచరించిరి యచ్చటి పెద్ద మానిసుల్. రంగా. 3. 27.

విచరితము నం. వి. అ. న. తిరుగుట, సంచారము.

విచర్చిక నం వి. ఆ. స్త్రీ పామ, చర్మరోగ భేదము, గజ్జి.

విచర్చితము నం. విశ. (అ. ఆ అ) పూయఁబడినది, రాచఁబడినది, రుద్దఁబడినది.

**విచలనము** నం. వి. అ. న. 1. మిక్కిలి కదులుట. మిగులఁజలించుట. 2 మార్గము నుండి తప్పుట, తొలఁగుట. 3. చాంచల్యము, స్థైర్యము లేమి. 4. గర్వము, దురహంకారము.

**విచలము** నం. విశే. (అ. ఆ. అ) మిక్కిలి కదలునది.

**విచలుఁడు** నం. విశే. (అ. ఆ. అ) దురహంకారము గలవాఁడు, గర్వి.

**విచారకుఁడు** నం. వి. అ. పుం. విచారించువాఁడు - 1. పరిశోధకుఁడు, పరీక్షకుఁడు 2 న్యాయాధికారి.

**విచారజ్ఞుఁడు** నం. విశే. (అ. ఆ. అ) నిర్ణయింప సమర్థుఁడు, తీర్పరి.

**విచారణ** నం. వి. ఆ. స్త్రీ 1 పరీక్ష, పరిశోధనము, సందిగ్ధమైన విషయమును తత్త్వ నిర్ణయమునకై ప్రమాణములతోఁ బరిశీలించుట 2 ఆలోచన. 3. సంశయము, ఎటులును దోఁచనిస్థితి. 4. మీమాంసాశాస్త్రము.

**విచారణము** నం. వి. అ. న. 1 విచారణ, పరిశోధనము, పరిశీలనము. 2. ఆలోచన. 3. సంశయము, ఎటులును దోఁచని స్థితి.

**విచారణీయము** నం. విశే. (అ. ఆ. అ) విచారణ చేయఁదగినది.

**విచారపడు** మి. అ. క్రి (విచారము+పడు) సంతాపించు, చింతిల్లు. (శ. ర)

**విచారభువి** నం. వి. ఈ. స్త్రీ 1 న్యాయస్థానము, న్యాయసభ. 2. యమసభ, యముని కొలువు

**విచారము** నం. వి. అ. పుం. 1. పరీక్ష, పరిశోధనము, సందిగ్ధ విషయమును తత్త్వ నిర్ణయమునకై ప్రమాణములచేఁ బరిశీలించుట. 2. (అభియోగము) విచారించుట, సత్యము తెలిసికొనుటకై సాక్ష్యము మొదలగునవి వినుట. 3. ఆలోచన 4. వివేకము, యుక్తాయుక్తపరిజ్ఞానము. 5. నిశ్చయము, నిర్ణయము. 6. ఎన్నిక, ఏర్పఱకొనుట. 7. సందేహము, ఎటులును తోఁచనిస్థితి. 8. దూరదృష్టి.

**విచారముచేయు** మి. స. క్రి ఆలోచించు, విచారించు.

ఉ. మజ్జన భోజనాదులకు మాపుశయించుటకు వ్యధూమణుల్, సజ్జనగేహ మొక్కటి విచారముచేసి యొనర్చి వాలిపెన్, సజ్జఁడొఱంగి యచ్చటఁ బ్రసన్నత నిల్పిన లింగమున్ భవా, వజ్జలరాశికుంభజుని భక్తిభజింపఁగఁబోవునంతటన్. కాశ. 4. 66.

**విచారశీలుఁడు** నం. విశే. (అ ఆ అ) 1. ఆలోచన గలవాఁడు, వివేకి. 2 దూరదృష్టి గలవాఁడు

**విచారస్థలము** నం. వి. అ న. 1 న్యాయస్థానము 2 యుక్తివాదము, యుక్తియుక్తమగువాదము.

**విచారి** నం. విశే. (న్ ణీ న్) 1. తిరుగువాఁడు, త్రిమ్మరి. 2 తిరుగుబోతు, భోగలంపటుఁడు 3. ఆలోచన కలవాఁడు, వివేకి

**విచారించు** నం. స. క్రి 1 పరిశీలించు.

వ. పంచబాణ శరంబులని ప్రమాణంబు విచారించు విరహ పరితాప పరిహరణనిపుణ పురంధ్రీగణంబుల. ఉ. హరి 5. 136.

వ. మత్ప్రసాదంబున నతీతానాగతవర్తమాన దర్శియగుటం జేసి విచారించి పనుపుమనిన. మార్కం. 5. 154

2. పరామర్శించు.

మ. అగ్నిహోత్రమును నిత్యంబున్ విచారింతువే ... శకాం. 4. 8.

3. ఆలోచించు

గీ ఇవ్విధంబునఁ దమతమ యెఱుఁగు తెఱఁగు, లందఱును జెప్పవిని కురునందనుండు, దగ విచారించి కార్యంబు తెగువ గాంచి, యెలమి వారలఁ గనుఁగొని యిట్టులనియె భార. విరా. 3 112

గీ. అమరులల్లోడి వాలఖిల్యాది మునులుఁ, దారు గురునిపాలికిఁ జని దైత్యవరుల, నోర్చు తెఱఁగు విచారించుచుండ వారి, కెలమి మిగుల బృహస్పతి యిట్టులనియె మార్కం. 2. 221.

నం. అ క్రి. సంతాపించు

వ. పుత్త్రహత్యాది దోషంబును పుత్త్రవిహీనత్వంబును ప్రాప్తంబయ్యెనే యని విచారించి ... కాశ. 2. 62.

**విచారితము** నం. విశే. (అ. ఆ అ.) 1. ఆలోచింపఁబడినది. 2. పరిశోధింపఁ బడినది, పరిశీలింపఁబడినది. 3. నిశ్చయింపఁబడినది, పరీక్షింపఁబడినది, నిర్ణయింపఁబడినది. వి. అ. న. ఆలోచన.

విచార్యము సం. విణ. (అ అ అ) విచారింపఁదగినది.

విచి=వీచి సం వి. ఈ. స్త్రీ. తరంగము, అం. (వాచ)

విచికిత్స సం వి అ స్త్రీ. 1 సంశయము, నిశ్చయములేమి. 2. తప్పు.

విచితము సం. విణ. (అ అ అ) వెదకఁ బడినది, పరిశోధితము, పరిశీలింపఁ బడినది.

విచితి సం వి ఇ స్త్రీ 1 అన్వేషణము, వెదకుట 2 పరిశోధనము, పరిశీలనము.

విచిత్ర సం వి ఆ. స్త్రీ తెల్లదుప్పి

విచిత్రకము సం వి అ పుం వృక్షవిశేషము, కొండరావిచెట్టువంటి యొకచెట్టు

న ఆశ్చర్యము, వింత

విచిత్రదేహము సం. విణ. (అ ఆ అ.) మనోజ్ఞమైన (ఇంపైన) దేహముగలది

వి అ పుం మేఘము, మబ్బు

విచిత్రము సం విణ (అ. ఆ. అ) 1. ఆశ్చర్యకరమైనది, వింతయైనది. 2. కర్బురము, నానా వర్ణములు కలది. 3. వివిధము, పలువిధములైనది. 4. మనోహరము, ఇంపైనది 5. చిత్తరువుగా వ్రాయఁబడినది, ఆలేఖ్యము.

వి అ. న 1 శబలవర్ణము, చిత్ర వర్ణము. ఆశ్చర్యము, వింత. 3.ఒకానొక యర్థాలంకారము.

విచిత్రవీర్యుఁడు సం వి అ పుం చంద్రవంశపురాజు (శంతనునికి సత్యవతి యందుఁ బుట్టినవాఁడు భీష్ముని తమ్ముఁడు ధృతరాష్ట్ర పాండురాజులితని పుత్రులు)

విచిత్రాంగము సం. విణ (అ ఆ ఈ. అ.) చిత్రవర్ణమయిన శరీరముగలది

వి అ పుం 1 నెమిలి. 2. పెద్దపులి.

విచిన్వకము సం వి అ పుం 1 వెదకుట, అన్వేషణము 2 పరిశోధించుట, అన్వేషణము. 2. పరిశోధించుట.

విచిన్వకుఁడు సం. వి అ. పుం. పీఁరుడు.

విచీర్ణము సం. విణ. (అ. అ. అ.) 1. ఆక్రమింపఁబడినది. 2. ప్రవేశింపఁబడినది.

విచేతనము సం విణ. (అ. అ. అ.) 1. చైతన్యములేనిది, ప్రాణము లేనిది, చచ్చినది. 2. జడము, మొద్దుపాఱినది.

విచేతనుఁడు సం. విణ (న్) 1 చెడ్డమనస్సు గలవాఁడు, ఒరులకుఁ జెడుగు కోరువాఁడు 2 విరుద్ధమయిన చిత్తముగలవాఁడు అవివేకి, మూర్ఖుఁడు 3. దుర్మనస్కుఁడు, దిగులొందిన మనస్సు గలవాఁడు.

విచేష్ట సం వి ఆ స్త్రీ. 1 ప్రయత్నము, పూనిక, ఉద్యమము 2 ప్రవర్తనము, నడవడి, 3 నడక, గమనము

విచేష్టించే సం స. క్రి మిక్కిలి చేష్టించు మిక్కిలి చేష్టలుగలదానినిగాఁ జేయు

సీ పురుషోత్తముం డెల్ల భువనంబులును దానయఖిల భూతాత్మకుండై విహారలీల విచేష్టించు భార ఉద్యో 2 136

విచేష్టితము సం విణ (అ ఆ అ) 1. చేష్టాశూన్యము చేష్ట లుడిగినది 2. యత్నింపఁబడినది 3 పరీక్షింపఁబడినది, పరిశోధింపఁ బడినది. 4 తప్పుగా చేయఁబడినది.

వి అ న 1. కృత్యము, పని 2. పూనిక, యత్నము. 3. కుట్ర,తంత్రము 4. అభినయము 5 వ్యాపారము, పని, చేష్ట. 6 తంత్రము, కుట్ర.

విచ్చ వి నాలుగు వ్రేళ్లకుఁ జుట్టితీసిన నూలిచుట్టు. (శ. ర. శా.)

విచ్చఁబాలు అ క్రి (విచ్చున్+పాలు స్వార్థమున) పాలు, విచ్చు

సీ జంతమయూరమా యింత గన్వాఁజాఁజే విటిసిమె పొలలెత్తి విచ్చఁబాలు కలువాయి. శ 14

విచ్చలవిడి వి 1 స్వాతంత్ర్యము. స్వేచ్ఛాప్రవృత్తి.

క ఎచ్చోటనైన నధముఁడు, విచ్చలవిడి నుండు లేదు వెలి పించుకయున్ భార శాం. 4. 36

చ. . . విచ్చలవిడి నీకునాతనికి సంగతి చేకుఱు ... దశకు. 7. 76.

క. అచ్చుగఁ బ్రయాగలోపల విచ్చలవిడిఁ దనదు మేను విడిచిన మమతుం, డొచ్చెల్ల యేమి చెప్పుదుఁ, జెచ్చెఱఁ గను నిష్ట కామ్య సిద్ధి ధరిత్రిన్. భోజరా. 1. 182.

2. స్వేచ్ఛ.

వ. .. చందురుండు కందర్పదిగ్విజయస్ఫూర్తియుం బోని యచ్చవెన్నెల విచ్చలవిడింగాయం దొడంగె ... కాశీ. 3. 23

వ. ... విచ్చలవిడిం దిరుగుబోటులును . నీలా. 3. 10.

క్రి. విశ. నిరాటంకముగా.

వ. . ఆకృశాంగి మరల కన్నుదామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడి యశ్రుజలధారా ప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱ .. ఉ. రా 6. 276.

**విచ్చేలు** వి విచ్చేలవిడి

ఉ. అచ్చర మచ్చెకంటులకునై కడు హెచ్చిన మచ్చరంబుతో విచ్చలుగాను మెచ్చగు వివేకము తెల్లను వెచ్చఁబెట్టి వీరిచ్చటదొమ్మి గూడి కలహించిన తేరుగదేలఫట్టు నీ రచ్చల నొంపఁగా వలయు రాయని యింద్రుఁడుచే యమర్చుచున్ అహల్యా. సం. 1 109.

**విచ్చేవిచ్చేలు** అవ్య. యథాయథలు. (శ. ర బ్రౌ.)

**విచ్ఛాయ** వి. (సం. విచ్ఛాయా) రత్నదోష విశేషము. (శ. ర )

**విచ్చికము** విశ. దుష్టము

తే. కక్కసపు వంకగోరులఁ ద్రొక్కిత్రొక్కి, కఱకుముక్కున నందంద కఱచికఱచి పూన యొకటియుఁ బోఁగువఁ బొందనీక, చెరిపె ముత్యాల పేరు విచ్చికపుఁబులుఁగు. పాండు 4. 239.

**విచ్చిలు(ల్లు)** = విచ్చు అ క్రి (√ విచ్చు) విడిపడిపోవు

శా విచ్చిలెం, గోలంబుల్ బెదరెంజమూరుగణమాక్రోశించెఁ బంచాస్యముల్ తాలాంకావరజుండు మందరమహీ ధాత్రీ ధరంబెత్తినన్ హర. 6 46.

**విచ్చు** అ. క్రి. 1. (పుష్పాదులు) వికసించు, విడుచు.

క. అచ్చేనవాసతోడను, విచ్చపడక మొనసి తుదిని హెచ్చెత్తివడిన్, నిచ్చెంబుంపక ముకుళము. చెచ్చెరమతి నువ్వుఁబువ్వు స్నేహం బూనెన్. రసి. 2 85.

చ. వరుఁడిక నేమిసొమ్మడుగ వచ్చెనటంచును వల్గుభాన నా, సరసకటాక్షబాణములఁ జల్లగ నుల్లము విచ్చఁజూడ నా చరణ సమీపభూము లకుఁ జయ్యనఁజేరఁడె యేమి సేతు సుందరులకు నాథుఁడింతదయ దప్పిన నేమగు వామలోచనా. గంధ. 1 81

చ .. కైశికము రేవఁ బ్రభాతశశాంకు మోప విచ్చినవవహల్లకాళిఁగయి సేసి .. ఆము. 2. 16

ఉ క్రచ్చఱఁ బారిజాత లతికావనదేవత జంభవైరిపై, మచ్చికఁ గూర్పఁగా నవసుమ ప్రకరంబుల వేల్పుజేటలో, విచ్చిన పైడితామరల వెంబడివచ్చిన కమ్మగాడ్పులన్ మెచ్చులరీతిఁ గోకిలసమీరణ దీవనలిచ్చె నొప్పుగన్. హర. 6 10.

2 చీలు, ఛేదిల్లు.

క. చొచ్చి చతురంగవితతులు, విచ్చునటులు సేయుటయును విప్పచ్చుఁడు వేవచ్చితల పడినఁ బురి కొని, యచ్చట నిరువాఁగునట్ల లాడంబోరెన్ భార భీష్మ 2. 394

క. తరువాకటి పెటికిలాంగల, ధరుఁడుద్ధతిఁ బూంచి హాయరథ ద్విపసుభటౌ, త్కరముల మ్రగ్గింపఁ గన, స్నెరవులు విచ్చుటయు మేదినీధరుఁ డలరెన్. హరి ఉ 3 93.

3 విరియు, విడిపోవు.

సీ సంపారజీమూత సంఘంబు విచ్చునే చక్రిదాస్య ప్రభంజనము లేక .. భాగ 7. స్కం. 172

చ. ఖురముల నేలఁద్రవ్వుచు వకుంఠితవాల సమీరణంబులన్, విరవిరఁబోయి మేఘములు విప్పవిషాణము లొడ్డికొంచు దుస్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు .. భాగ 10. స్కం పూ. 1142

చ. తెలతెలవాఱెఁ దూర్పువలు దిక్కులవిచ్చెఁ దమంబుపతులుం, గలకలఁ బల్కె.. బిల్హ. 3 183.

వ. ... జవ్వనంపుఁ గ్రొవ్వునవివ్వటల్లి మవ్వంపువాతెఱలు విప్పనప్పు ... పరిచారికా సహస్రంబును గూఁతునకు సరణంబుగా నిచ్చి మఱియును... మనుచ. 5. 101.

4. నశించు.

శా. తీవ్రతరాంగసంభవ శరశ్రేణీవిదాహ వ్యథల్, విచ్చం దిరని భక్తితో హృదయమావిర్భూత మోదంబునన్, నవ్వం దీఁగయుఁ బోలెఁ బూడ్కులోదవన్ నక్కిరుఁడుత్కంఠతన్ కాళ. 3. 180.

5. బ్రద్దలగు, బ్రీలు.

మ ధరఖర్వాటుఁ డొకండు సూర్యకర సంతప్త ప్రధానాంగుఁడై, త్వరతోడం బఱువెత్తి చేరి నిలిచెం దాళద్రుమచ్ఛాయఁ, దచ్చిరముం దత్ఫల పాతవేగమున విచ్చెన్ శబ్దయోగంబుగాన్. భర్తృ. 1. 85

6. వికలమగు.

క జనులెట్టిది శత్రువిధం,బని చెప్పుదు రట్టిచంద మారయఁగా దుర్జనుఁడ వగునీకు వాయెడ, వినుముకలిగె దీనమనసు విచ్చెంగుటిలా భార కర్ణ. 2. 104

7. తెఱచియుండు

ఉ. ఏమఱుపాటఁ జూచినను నేటితటంబున దాన కాంతఁబే, రాముదపాకుచందమున హస్తము విచ్చియ యుండువానికిన్ . కాశీ. 7 234.

న క్రి 1 విప్పు, విడఁదీయు

వ. విన్నపంబుచేసి తమతెచ్చిన విధ్వస్తోపకరణంబులు విచ్చిచూపి . ఉ హరి 1 111

వ ... తదలంకార చామరంబులు రెండును విచ్చ పుచ్చుకొని ... కళా. 1. 160.

2. విరియఁజేయు, వ్యాపింపఁజేయు.

చ. పతిఁగని .. వీక్షణా,యతసితదీధితుల్ గల యనద్రిజ విచ్చెమహేశుమీఁద . . కు. సం. 7. 901.

క. ఎఱకలు విచ్చుచుఁదుండము, తెఱచుచు ... భార. ఉద్యో. 3. 301

క అచ్చటనచ్చట నిడుపుగ, విచ్చిన గుసుమాస్త్ర శాస్త్ర వేదుల మనముల్, మెచ్చించుఁ దెరల మంజిడి, పచ్చడములు చతురశీతి బంధంబుల తోన్. నైష 7. 155

8 తెరచు.

చ వెడవెడఁగన్నుమూయుఁ గనువిచ్చు నగుందల యూఁచు ... పారి. 1. 101.

ఉ. . . ఇంక నాహారము గమ్మనాకని గుహాసదృశంబగు నోరువిచ్చినన్ ... భా రా. సుం 48.

4 వికసింపఁజేయు

చ అనవిని మోము విచ్చుచు మురాంతకు నిట్లనుఁ గుంతి పాండు నం,దనులకుఁ దండ్రియు న్గురువు దైవము నాఁయ నీవకావె . భార. ఉద్యో 3 207.

గీ. నవ్వినట్లల్ల విచ్చెఁ, గలయ మూఁతులు కేతకి గహనతతులు . . ఆము 4 94.

5. చీలుచు, భేదించు

క విత్తము సంసృతి పటలము, ప్రవత్తముకామాది వైరి వర్గంబులనేఁ, డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణపదము శుభమగు మనకున్. భాగ. 7 249.

వ ఎడయిచ్చిన వజ్రంబును జను మఱగ్రుచ్చి వెనువిచ్చి చనలేక యచ్చటనే యున్నన్ ... దశా. 2 433.

6 విడిచిపెట్టు, త్యజించు

ఉ. సోరణగండ్ల రాఁగొదమ చుక్కలు పట్టనతుల్కవాటముల్, చేరుప ... ప్రొద్దువోఁ,గా రతిడస్సిగాడ్పులకుఁ గాఁదెఱవం జను విచ్చి మేడలన్. ఆము. 2 13

7 విడఁగొట్టు, తొలఁగించు.

సీ పాలిండ్లు గదలంగఁ బనవు బయ్యెద విచ్చ నచలాధిపతి కూర్మియాఁడు బిడ్డ . కాశీ. 2. 52.

విశ. చీలినది, విడిపోయినది, విదారితము.

సీ. ... శ్రోత్రఘుచ్ఛటలు విచ్చుగ రచించితి సూక్తినైపుణి జ్ఞాన చింతామణి కృతి .... ఆము. 1. 13.

వి. వికాసము.

సీ సకల వత్త్వపురాణ సారాంశముల హెచ్చు కైవల్యరమచేతికల్వ విచ్చు .... ఘటికా. 1 140.

జ. విచ్చఁబాఱు, విచ్చిలు, విచ్చుకత్తి, విచ్చుకొను, విచ్చుటాకు, విచ్చునొగ్గ.

**విచ్చుకత్తి** వి. (విచ్చు+కత్తి) ఒఱ దూసిన కత్తి.

చ. వెలువడి యొప్పుదెప్పు డరి వీరులఁ దాఁకు దమంచు విచ్చుక,త్తుల బెడఁగుం దళత్తళలతోఁ దనముందట వచ్చుదేవ వీ,రులకును జేయి వీచు టయు రోసముతోఁ జని దైత్యవీరులం, దలపడి రా సురాసురులు దార్కొని రుగ్రతరాగ్ర హంబునన్ ఉ రా 4 290.

మ. మొనకు న్వచ్చిన విచ్చుకత్తులసివే ముస్తీదు మేల్ రౌతులం,దుసుమాడంగము గల్గిపార్శ్వ మున యందుం గ్రమ్మి నశ్వంబులం, దనబల్లె మున్నఁ గ్రుమ్మి క్రమ్మఱుచు వెన్కన్ దార సిల్ జోదులన్, గని దూరంబు దొలంగఁ జేయుఁ బటు దోర్గర్వం బఖర్వంబుగన్ కృష్ణ 3 34.

సీ .. విచ్చుకత్తుల వారు వెంటరా నందలంబున నిబ్బరంబుగాఁ బోవ నిచ్చు . కువల 5 9

**విచ్చుకొను** స క్రి (విచ్చు+కొను) విప్పుకొను

క. వచ్చినఁ బోడఁగాంచి పెనల్, విచ్చుకొని కడుం దలఁకి వినదారిగముల్, విచ్చున్మొగ్గయి కడ లకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లు వీడెం బజకున్ అ. రా. యు 163.

**విచ్చుటాకు** వి (విచ్చు+ఆకు) 1. కర్ణపత్రము, చెవ్వాకు.

సీ. గీ విచ్చుటాకు చెవ్వాకన వెలయుఁ గర్ణపత్ర నామంబు అం. భా 2. 148

2 విరిసిన యాకు.

సీ. బలితంపు విచ్చుటాకుల దుద్దుఁ గమ్మలు విద్దెఁపుఁ జెక్కుల నీడఁ జూడ క్రీడా 101.

విచ్చున్మొ(మొ)గ్గ విశ (విచ్చు+మొగ్గ).

1 చెల్లాచెదరైనది

క వచ్చినఁ బోడఁ గాంచి పెనల్, విచ్చుకొని కడుం దలంకి వినదాలిగముల్, విచ్చున్మొగ్గయి కడలకు, విచ్చలవిడిఁ బఱచెఁ గట్లువీడెం బజకున్. అ. రా. యు. 163

శా. ... విచ్చున్మొగ్గ విరాలి మొగ్గయగుచున్ విచ్చేసిరయ్యంగవల్ తపతి. 4 69.

చ... ప్రమథ్యోక యింతయు విప్ప విచ్చు మొ,గ్గయి మఱిపాసిపోదురు సమస్త దిశాగతులైన యధ్వ గుల్ ... ఆము. 4. 131.

మ. కరుణం గ్రోచిన మిత్రుఁడేఁగెను గళంకం బు ను చెల్లవ్వుడున్, గురువిద్వేషి నిశాచరుండ మరుతోటుల్ నిందగావించు ని,ష్ఠుర శాపుండరు చేఁ గీడ్పఱచునంచున్ విచ్చు మొగ్గచనెన్, ఐరితార్థాత్మకళత్ర వృత్తమగుచున్ జక్రద్విజ వ్రాతముల్ భోజనుతా 5 10.

సీ .. ముచ్చు చేరువులకు విచ్చు మొగ్గ కళిజ 3. 81

వి 1 విరియుమొగ్గ. 2 చెల్లాచెదరగుట

సీ . ఎలమిఁ బొల్పగు యూథికలకు సంతలకూట ములకును మఱి విచ్చుమొగ్గలొదవె ఆము 4 123

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము)

విచ్చేయు=విజయముచేయు అ. క్రి 1 (పూజ్యులు) వచ్చు

శా. . నిర్వాణదాన క్రియా,శీలుండైన పరా శరాత్మజుఁడు విచ్చేసెం గృపాలోలుఁడై. భార ఆశ్వ 3 147

శా . వేదవ్యాసమునీశ్వరుండు గరుణన్ విచ్చేసె నచ్చోటికిన్ .. హరి. ఉ. 9. 17

క. విచ్చేయుము తల్లికడుపు వెడలిముకుందా. భాగ 10. 101.

2. (పూజ్యులు) వెళ్లు, పోవు

క. అసమయంబున దైత్య మ,హాసంయమి యేఁగు దేర నర్ఘ్యాదివిధుల్, చేసి వసున్నపతి యెటు వి,చ్చేసెదవు మునీంద్ర నాకుఁ జెప్పుమటన్నన్. వరాహ 2 5

మ అడుగ న్నిమ్ము వరంబు వేగమ యహల్యా జార విచ్చేయ నా, కుడురాజార్ధవిభూషణుండు వరమీనున్నాఁడు యుష్మాదృశుల్, బడుఁగు ల్వాఁఛిత మీ సమర్థులె కాశీ 4 50.

సీ . పరమేశుఁ డతని సద్భక్తికి మదిమెచ్చి కల లోన నొకనాఁడు గదిసి వరము, తే. వేఁడికొను మన్న నిరువుర వేఁడె సుతుల, శివుఁడు నిచ్చితి నంచు విచ్చేసె నంత. ఉ. హరి 4. 7.

3. ప్రవేశించు, చొచ్చు.

తే రమణి హృదయంబునను మహారాజ వీవు, గరిమ విచ్చేసియుండిన కారణమున, దీని వక్షో రుహంబు లాలోన నుండ, నెడము లేకున్న మరికదా వెడలెవెలికి. నై ష. 8. 66.

4 కూర్చుండు.

క నిచ్చలు లోపలికాంతలు, మచ్చికఁ దన తోడ నాడుమాటలు నాకున్, ముచ్చటలు సెప్పు మెల్లన, విచ్చలవిడిఁ దొడల మీఁదవిచ్చేసినృపా

భాగ. 1. 371

ద్వి. ఇంతకంటెను భాగ్య మెయ్యది యనుచు, సంతసం బొదవ వాజారంబు మీఁద, విచ్చేసి యుండిరి ద్వి. పరమ 2. (చి ని.)

**విచ్ఛంద(క)ము** నం వి అ పుం. ఈశ్వర గృహ భేదము, అనేకభూమి కలుగు మేడ

**విచ్ఛర్దకము** నం వి అ పుం. = విచ్ఛందము.

**విచ్ఛర్దనము** నం వి అ న క్రక్కుట

**విచ్ఛర్దితము** నం విశే (అ. ఆ. అ.) 1. క్రక్కఁబడి నది, బహిష్కరింపఁబడినది 2 అశ్రద్ధ చేయఁబడి నది, నిర్లక్ష్యము చేయఁబడినది. 3. విడువఁబడినది, త్యజింపబడినది. 4 చెఱుపఁబడినది. 5. క్షీణింపఁ జేయంబడినది.

**విచ్ఛాయ** వి. రత్నదోష విశేషము.

క. తనజాడ మెరుగు వెలుగును, దనరక మలివంబు వెలయు దనకాంతవేలు, న్మణి విచ్ఛాయయు మేదిని, వొనరఁగ విడుచుదురు దీని ధీయుతు లెన్నన్. రత్నపరీక్ష, 68. ప

(ఈ పద్యమందు గణభంగమును విశ్రమభంగమును గలవు)

**విచ్ఛాయము** నం. విశే (అ ఆ. అ) పాలిపోయినది, వివర్ణమైనది, కాంతిలేనిది

వి అ పుం. ప్రశస్తమైన కాంతిగల రత్నము.

న. పక్షులగుంపు నీడ.

**విచ్ఛిత్తి** నం వి ఇ స్త్రీ 1. నఱుకుట, తునియఁ జేయుట, పగులఁగొట్టుట చీల్చుట. 2. విభజిం చుట, వేఱుచేయుట. 3 కనఁబడకపోవుట, లేక పోవుట. 4. ముగియుట, సమాప్తి. 5. రంగులతోఁ గాని సుగంధి తైలముతోఁగాని శరీరము పూయుట, మైపూఁత లలఁదుట 6 (ఇల్లు మొ. వాని) హద్దు 7 పద్యపాదమునందలి నిలుపు చోటు, విరతి. 8 వస్త్రములు నగలు సమృద్ధిగా లేకున్నను శరీర సౌందర్యము చేతనే మిక్కిలి యొప్పిదమును దోఁపఁజేసెడి స్త్రీల శృంగార చేష్టా విశేషము.

**విచ్ఛిన్నము** నం విశే (అ. ఆ అ.) 1. నఱకఁబడి నది, ముక్కలు చేయఁబడినది. 2 చీల్పఁబడినది, పగులఁగొట్టఁబడినది,విభజింపఁబడినది 3 నిషేధింపఁ బడినది, ఆటంకపఱుపఁబడినది 4 అంతమొందినది, ముగిసినది. 5. చిత్రచిత్రముగాఁ జేయఁబడినది. 6. దాఁచఁబడినది. 7. సుగంధి తైలాదికములతో పూయఁబడినది. 8. వంపఁబడినది 9. కుటిలమైనది.

**విచ్ఛురితము** నం విం. (అ ఆ. అ) 1. కప్పఁబడినది, ఆచ్ఛాదితము. 2. కాఁపఁబడినది, స్థగితమైనది. 3 పూయఁబడినది, రాచఁబడినది, రుద్దఁబడినది

**విచ్ఛేదనము** నం. వి. అ. న = విచ్ఛేదము.

**విచ్ఛేదము** నం. వి అ. పుం 1. ముక్కలుగాఁ జేయుట, నఱుకుట. 2. విభజించుట, వేఱుపఱు చుట 3 పగులగొట్టుట. 4. విఘాతము, ఆటం కము 5 ఆఁగిపోవుట, అంతమగుట 6. తొలఁగిం చుట, నివారణము. 7. విరోధము, పగ. 8. గ్రంథ భాగ విశేషము 9. అవకాశము, తెఱపి, విరా మము. 10. వంశపరంపర యొక్క భంగము, వంశ మంత మగుట

**విచ్ఛేదించు** నం. స క్రి. ఖండించు

శా. సేనానిం బరహస్తము స్తములు విచ్ఛేదించి మోదించినన్. జై. 6. 141

**విచ్యుతము** నం విశే (అ ఆ. అ.) 1. భ్రష్టము, జారిపోయినది. 2. భ్రష్టముగాఁ జేయఁబడినది, తొలగింపఁబడినది 3 (మంచి మార్గము మొ వాని నుండి) తప్పినది, తొలఁగినది 4. పక్కుకట్టి రాలిపోయినది.

**విచ్యుతి** నం. వి ఇ. స్త్రీ 1. భ్రష్టమగుట. పడిపోవుట, జాఱుట, విడిపోవుట 2. క్షయము, క్షీణించుట, నాశము 3, (మంచి మార్గము నుండి) తొలఁగి పోవుట. 4. చెడిపోవుట (గర్భ విచ్యుతి మొ)

**విజననము** నం వి అ న 1 ప్రసవము. 2. ఉత్పత్తి, పుట్టుక.

**విజనము** సం. విజ (అ ఆ. అ) జనులు లేనిది, ఏకాంతమైనది, నిర్జనమైనది
వి. అ. న నిర్జనప్రదేశము, రహస్యస్థలము.

**విజన్ముఁడు** సం విజ (న్) వి పుం జారజుఁడు, పరపురుషుని వలన జన్మించినవాఁడు

**విజపిలము** సం వి. అ. న బురద, పంకము (హ ది)

**వి(ష్కి)జము** సం. వి. జ్. పుం 1. పక్షి 2. పాచిక.

**విజయ** సం. వి ఆ స్త్రీ 1. దుర్గ. 2 దుర్గ యొక్క పరిచారకురాండ్రలో నొకతె. 3. విశ్వామిత్రుఁడు రామునికుపదేశించిన విద్య 4 ఆశ్వయుజ శుక్ల దశమి. 5 గంజాయి చెట్టు. 6 ఉసిరిక చెట్టు 7. వావిలి చెట్టు 8 మంజిష్ట (వృ వి) 9 ఒక జాతి జమ్మి. 10 నెల్లి చెట్టు 11. విజయద్వాదశి, శ్రవణ నక్షత్రముతోఁ గూడిన శుక్లపక్ష ద్వాదశి.
శ్లో, యదా తు శుక్ల ద్వాదశ్యాం, నక్షత్రం శ్రవణం భవేత్, తదా సాతు మహాపుణ్యా, ద్వాదశీ విజయాస్మృతా.

**విజయం(యము)చేయు** మి. అ క్రి (విజయము + చేయు.) 1 వచ్చు, విచ్చేయు.
శ్లో. భవేద్విజయ తశ్చేయు,ర్గతౌ కర్తృ ప్రపూజనే, మోరఖండో భవేద్బిందుర్వాత దంతస్య వేం విచౌ. (చి ని)
క. పాయక పెక్కుతపంబులు, సేయు తపోనిధుల కైనఁ జేర నశక్యం, బీయరద మెక్కి విజయం, చేయుము జగతీశ తడవు సేయక యనినన్ విక్ర 2 79
మ. అజరుద్రు లగని పోరు చూచుటకో యీ యాదాయ మాశించియో, విజయం చేసితి రయ్య మీరిచటికిన్ వేవేగ విద్వన్మణీ .. కళు 5. 155.
క వినుఁ డీఁదగుసంబంధపు, చెనయికఁగని మోచి తెచ్చి యిచ్చెననరె చు,ల్కని నరులుగాన మాపుర,మునకు స్వజయంబు సేయఁ బుత్త్రిక నిత్తున్. అము. 7 55.
2. పోవు, అరుగు
క. మనలితిరి విచిత్రకథా, రసవృత్తిం దడ వెఱుంగ రాక యనుష్ఠానసమయమయ్యె నఖో మ,ధ్య సమీపంబునకుఁ దరణి యరథమువచ్చెన్,
మ విజయం చేయుఁడు నావుడు న్నమలు .... నిర్వ 7 135.
వ అని వినుతించి గరత్మంతుండు దేవా యేను నీ తలంపులోనివాఁడ . ఇదె యాయితం బైతినెక్కు మెక్కడ విజయం చేసెద వక్కడ నడిచెద ననిన హరి ఉ 8 64
సీ అత్మ పట్టణమున కతివఁ దోడ్కొని విజయంబు చేసెను మహోహర్ష మొప్ప ... అము. 7. 71

**విజయంతుఁడు** సం వి అ. పుం ఇంద్రుఁడు. (చూ. వైజయంతము)

**విజయకుంజరము** సం వి అ పుం పట్టపుటేనుఁగు, రాజు అధిష్ఠించెడి యేనుగు, యుద్ధమున నుపయోగపడెడి యేనుఁగు.

**విజయచ్ఛందము** సం వి అ పుం ఏనూఱు పేటలు గల హారము.

**విజయడిండిమము** సం వి అ. పుం ఢక్క, ఒక విధ మగు చర్మవాద్యము (ఇట్లే విజయమర్దలము మొ)

**విజయదశమి** సం వి ఈ స్త్రీ ఆశ్వయుజ మాసశుక్ల పక్షదశమి

**విజయము** సం వి అ పుం 1 జయించుట, గెలుచుట 2 జయము, గెలుపు 3 దేవతా విమానము, దివ్యరథము. 4 ప్రభవాది సంవత్సరములలో నొకానొకటి

**విజయసప్తమి** సం వి ఈ స్త్రీ ఆదిత్యవారమున వచ్చిన శుక్లపక్ష సప్తమి.

**విజయసిద్ధి** సం వి ఇ స్త్రీ గెలుపునొందుట.

**విజయి** సం వి న్ పుం జయశీలుఁడు, గెలుపు నొందినవాఁడు

**విజయించు** సం న క్రి గెలుచు
ద్వి వెనఁ గౌరవుల నేను విజయింప లేమి, వసుధేశుఁ డేల యెవ్వరు నెఱుంగుదురు .. ద్వి. భార. విరా 4. 82 పా

**విజయుఁడు** సం వి అ పుం 1 అర్జునుఁడు 2 యముఁడు 3 విష్ణుని ద్వారపాలకులలో నొకఁడు

**విజయేశుఁడు** సం వి అ పుం శివుఁడు.

**విజయోత్సవము** సం. వి. అ పుం విజయ దశమి నాఁడు దుర్గాప్రీతికై చేసెడి యుత్సవము.

**విజరము** నం విశ (అ ఆ అ) ముదిమి లేనిది 1. ప్రాయమున నున్నది. 2 నూతనము, అభినవము.
వి అ. న (అకు మొ వాని) కాఁడ.

**విజల్పము** నం. వి అ పుం 1 ప్రేలుట, వదరు, వ్యర్థసంభాషణము. 2. మాట, సంభాషణము 3. కోపవాక్యము

**విజల్పితము** నం విశ (అ ఆ అ) 1. పలుకఁబడినది, చెప్పఁబడినది 2. ప్రేలఁబడినది, వదరఁబడినది.

**విజాత** నం వి ఆ స్త్రీ పిల్లలఁ గన్న స్త్రీ

**విజాతి** నం వి ఇ స్త్రీ. 1 భిన్నజాతి, వేరుజాతి. 2. మాఱురకము, వేఱువిధము

**విజాతీయము** నం. విశ (అ. ఆ అ.) 1 భిన్నజాతులకు సంబంధించినది, వేర్వేఱు విధములు గలది 2 భిన్నజాతికి (వర్ణమునకు) సంబంధించినది 3. సంకరజాతికి సంబంధించినది

**విజాతీయుఁడు** నం విశ. (అ ఆ. అ) వేఱుజాతికిఁ (వర్ణమునకు) జెందినవాఁడు, అన్యజాతివాఁడు, భిన్న ధర్మావలంబి.

**విజాతుఁడు** నం విశ (అ ఆ. అ) 1 నీచముగాఁ బుట్టినవాఁడు, పరపురుషునివలనఁ బుట్టినవాఁడు జారజుఁడు. (వాచ) 2. పుట్టినవాఁడు. 3. రూపాంతరము నొందిన వాఁడు.

**విజానత్** నం విశ. (త్) = విజ్ఞుఁడు (దీనికి తెలుగున వ్యస్తప్రయోగము లేదు సమాన పూర్వపదముగానే ప్రయుక్తము)

**విజిగీష** నం. వి ఆ. స్త్రీ 1 జయింపవలె ననెడి యిచ్ఛ. 2 స్పర్థ, పోటీ, ఒకనిని మించవలెననెడి యిచ్ఛ 3 పొట్ట పోసికొనుటకై నింద్యమైన కృత్యమునఁ బ్రవర్తించుట (వాచ.)

**విజిగీషువు** నం. విశ (ఉ) 1 జయించవలెనని కోరువాఁడు, జయాభిలాషి 2 ఒకనిని మించవలెననెడి కోరిక కలవాఁడు 3 పొట్ట పోసికొనుటకై నింద్యమైన కృత్యమునఁ బ్రవర్తించువాఁడు
వి. ఉ. పుం 1 వీరుఁడు, యోధుఁడు 2 ప్రతిస్పర్థి, ఎదిరివాఁడు, శత్రువు.

**విజిత** నం. వి ఋ పుం. 1. నిర్ణయించువాఁడు. 2. భాగస్వామి, వాటాదారు.

**విజితాత్ముఁడు** నం విశ. (న్) తన్నుఁ దాను లోఁబఱచుకొనినవాఁడు, తన యాత్మను స్వాధీనపఱచుకొన్నవాఁడు

**విజితి** నం వి ఇ స్త్రీ విజయము, గెలుపు

**విజితుఁడు** నం విశ (అ ఆ అ) జయింపఁబడినవాఁడు, లోఁబఱచుకొనఁబడినవాఁడు.

**విజిన(ల)ము** నం వి అ పుం న. సరసవ్యంజనము. పలుచని పులుసు

**విజిహ్మము** నం విశ (అ ఆ అ) మిక్కిలి కుటిలమైనది, మిగుల వంకర యైనది

**విజిహ్ముఁడు** నం విశ (అ ఆ అ.) మిక్కిలి కుటిలుఁడు, మర్యాద లేనివాఁడు, ఆర్జవ హీనుఁడు.

**విజులము** నం వి అ పుం. బూరుగుచెట్టు ("శాల్మలీ కందము" అని రా ని)

**విజృంభణము** నం వి. అ న 1. ఆవులించుట, ఆవులింత, జృంభ 2. (పుష్పము) విరియుట, వికసించుట 3 ప్రదర్శించుట, కనఁబఱచుట, 4 వ్యాపించుట, వ్యాపనము. 5 వినోదము శృంగారక్రీడ

**విజృంభించు** నం అ క్రి 1. చెలరేఁగు.
వ ఇవ్విధంబున నమ్మహాదేవిచేత నిజసైన్యంబు నిరవశేషంబైన విజృంభించి యమ్మహాసురేంద్రుండు .. తదీయగణంబుమీఁదఁ గవిసి. మార్కం 6 104.
2. వికసించు. (శ ర)

**విజృంభితము** నం విశ (అ, ఆ అ) 1 ఆవులించినది 2 వికసించినది, విరిసినది 3. ప్రదర్శింపఁబడినది, కనఁబఱుపఁబడినది 4. గోచరమైనది, కనఁబడినది 5 విహరించినది
వి అ. న 1 ఆట, వినోదము 2 ఇచ్ఛ, కోరిక. 3. ప్రదర్శనము, కనఁబఱచుట 4. కృత్యము పని. 5 ఫలితము

**విజ్జన(ల)ము** = విజినము నం వి అ న 1. వ్యంజన విశేషము, పలుచని పులుసు మొదలైనవి 2 బాణము.

విజ్జు వి. తన్నుకొనుటయం దగుధ్వని కనుకరణము

సీ. .. చంపకప్రసవవాసన సోఁకి రొమ్ములదేఁటి కూలి విజ్జునఁ దన్నికొనియెనేని . . పి శకుం. 3. 190.

సీ. ... పల్యాణములఁ గ్రిందఁ బడినరాహుత్తులుఁ గూలి విజ్జునఁ దన్నుకొనెడి వారులు జై. భా. 5 192.

సీ. తే విజ్జువిజ్జునఁ దన్నంగ విడువ రెలమిఁ, గఱకు టంఘ్రుల నిఱికించి గజ్జెగదల, గఱకు నెఱినెఱికో తెమ్ముకయును విఱుగ,విఱిచె వడిఁ గైజు వౌళ పెద్దవేసడంబు మనుచ. 4. 86

అ క్రి వ్యాపించు, అలముకొను.

సీ కిసలయంబులతోడఁ గెంగేలు దడఁబెట్టి విరులపై నఖకాంతి విజ్జరాల్చి ... ఉ హరి. 5.50.

విజ్జులము నం. వి అ న దాల్చినచెక్క, లవంగపట్ట.

విజ్జులిక నం వి అ స్త్రీ చీకురువాయి, ఒకజాతి గబ్బిలము (రా ని)

విజ్జోడు విశ (వీడు+జోడు,) 1 జోడుకానిది, సరిరానిది

సీ శ్రుతులు విజ్జోడైనచోఁ దంత్రి బిగువుగాఁ బీడించు గిటగిట బిరుడఁద్రిప్పు ... వైజ. 1. 118

సీ మారేడుబుట్టలో మంత్రాక్షతంబులు పదముల విజ్జోడు పాదరక్షలు .. శుక. 2. 442.

2. ఎడఁబాటు పొందినది

శా. చూడంజాలక మిత్రబాంధవుల విజ్జోడై చనం జేయవో ... కవిరా. 3 131.

(చంద్రోపాలంభనము)

విజ్జోడు(ప)వడు అ క్రి. (విజ్జోడు+పడు) భేదిల్లు, భేదపడు

సీ . శారదావదన ప్రతిబింబాది నామకర్మ కల్పనాకేళిప్రకార మాత్రములైన యన్న దాఖ్యానక్రియాదికములు.

గీ తోడ నెందు నొకింత విజ్జోడువడక, నమముగుట యెట్లొ యను విచారము గలిగియు. కళా. 5. 86.

సీ విజ్జోడుపడ నిడ్డ వెంద్రుకలందెంబు వలిగుబ్బపాలిండ్ల కెలఁకు లొరయ ... క్రీడా, 1. 101.

విజ్ఞప్తము నం విశ (అ. ఆ. అ) 1. గౌరవముతోఁ దెలుపుకొనఁబడినది, మనవిచేసికొనఁబడినది 2. తెలుపఁబడినది

విజ్ఞప్తి నం వి ఇ స్త్రీ. 1 విన్నపము, మనవి, గౌరవముతోఁ దెలుపుకొనుట, ప్రార్థన 2 ప్రకటన, ప్రచురణము. (ఆ ని.)

విజ్ఞాతము నం. విశ (అ ఆ అ) 1 తెలియఁబడినది, గ్రహింపఁబడినది 2 ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది.

విజ్ఞానము నం, వి. అ న. 1 జ్ఞానము, తెలివి, గ్రహణశక్తి 2 ప్రజ్ఞ, సూక్ష్మభేదములను దెలిసికొను బుద్ధి. 3 నైపుణ్యము, నేర్పు 4 లౌకికజ్ఞానము, లోకానుభవమువలనఁ గలిగిన తెలివి (జ్ఞానము = బ్రహ్మజ్ఞానము విజ్ఞానము = తద్వ్యతిరేకజ్ఞానము.) 5. ఉద్యోగము, పని, వ్యాపారము (మే ని.) 6 సంగీతము 7 చతుర్దశవిద్యల జ్ఞానము. 8. (బౌద్ధమతమున) ఆత్మరూపజ్ఞానము

విజ్ఞానస్కంధము నం వి. అ పుం. బౌద్ధమతమునందలి పంచస్కంధములలో నొకటి (స్కంధములు: రూపస్కంధము, విజ్ఞానస్కంధము, వేదనాస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కారస్కంధము అని యైదు.)

విజ్ఞానికుఁడు నం విశ (అ ఆ అ) = విజ్ఞుఁడు.

విజ్ఞానేశ్వరుఁడు నం వి అ పుం యాజ్ఞవల్క్యస్మృతికి మితాక్షరి యనువ్యాఖ్య రచించిన యతి.

విజ్ఞాపకుఁడు నం. వి. అ. పుం 1 విజ్ఞాపన చేయువాఁడు, తెలుపుకొనువాఁడు 2. బోధకుఁడు, ఉపాధ్యాయుఁడు.

విజ్ఞాపన నం వి. అ స్త్రీ 1. మనవి, విన్నపము, ప్రార్థన. 2 తెలుపుట, తెలియఁజేయుట 3 బోధించుట

విజ్ఞాపనము నం వి. అ న = విజ్ఞాపన

విజ్ఞాపించు నం న క్రి విన్నవించు.

వ కంపాపరాధంబుల ననురోధింపక తదుత్తర క్రియలకు ననుమతింపవలయునని విజ్ఞాపింపు మనిన ... హరి. పూ. 9. 169.

మే ... కళ్యాణి నాకూర్మినందవ నీ వాత్మఁ దలంచి దేవరకు విజ్ఞాపింప నేతెంచితిన్ వరా. 6 34.

**విజ్ఞాపితము** నం విణ (అ అ అ) 1. మనవి చేయఁబడినది, గౌరవముతోఁ దెలుపఁబడినది 2 ప్రార్థింపఁబడినది. 3. తెలుపఁబడినది 4 బోధింపఁబడినది. బిత్తుకచేయఁబడినది

**విజ్ఞాప్యము** నం విణ (అ అ అ) మనవిచేయదగినది, విన్నవింపఁదగినది

వి అ న మనవి, విన్నపము ప్రార్థన.

**విజ్ఞుఁడు** నం విణ (అ. అ అ) 1 తెలిసినవాఁడు. చదువరి. 2 నేర్పరి, పనివాఁడు

వి. అ. పుం విద్వాంసుఁడు, పండితుఁడు

**విజ్వరుఁడు** నం విణ (అ అ. అ) 1 జ్వరములేనివాఁడు 2 సంతాపము లేనివాఁడు.

**విటంక(క)ము** నం వి అ పుం న 1 పావురపుగూఁడు, కపోతపాలిక 2. పర్వత శిఖరము, కొండకొన.

**విటంకితము** నం విణ (అ అ అ) గుర్తుపెట్టఁబడినది, ముద్రవేయఁబడినది

**విటకత్తె** మి వి వ్యభిచారిణి, వలపుకత్తె

గీ విటుని వలె హారి సొగసుగ వేస మెనగఁ, దాల్చి విటకత్తె వలె నుండుతరుణిఁగూడి, పాదుకల మెట్టికొంచు వాప్రథితయజ్ఞ, వాటఁ దేరంగ జూచుచు వచ్చుచుండె వేం మా 1 126.

**విటకాఁడు** మి వి. విటుఁడు.

గీ తనదుప్రాయంబు నెటి చక్కఁదనముఁ దానె, కాంచి విటకానిపొంచు కేకారి పొరలుఁ, బట్టఁ జాలని తమిదొట్టి గుట్టువిడక, హాళికుని కోడలౌరౌర జాళితోఁడ ఉ. హరిశ్చ 4 18.

విటకాని మౌనిశయ్యం, దటుకునఁ గూర్చుండఁ బెట్టి తరుణీమణి చెంగట నుండె హారమౌక్తిక, ఘటితంబగు కుందనంపు గద్దియ మీదన్ మురా 107.

సీ. విట నామధేయమౌ విటకాఁడు వేడుకకాఁడు బొజుఁగు నన్నువాఁడు లంజె,కాఁడనఁగ ... ఆం. భా. 2. 116.

**విటతటమార్చు** న క్రి (విటతటము + ఆర్చు),

1 తాఱుమాఱుచేయు

ద్వి విద్వేషవాదుల విటతట మార్చి బస పు. 6 193 పొ. 21 పం.

2 తుత్తుమురుచేయు

ద్వి వెన జైనప్రతిమల విటతట మార్చి, వసదు లన్నియు త్రవ్వి వైపించెఁగాదె .. బస పు. 6 101 పం

**విటతాటనము** = వీటతాటనము విణ తాఱుమాఱు, వ్యత్యాసము

సీ మండితధ్వజదండమండలంబులఁ గిట్టి విట తాటనంబుగా విఱిచి విఱిచి . భార. విరా 5. 56

వ విటతాటనంబులగు హేమకుంభంబులును ఉ. హరి 1 58

సీ ఒక్కొక్కరథముతో నొక్కొక్క రథమును విటతాటనంబుగా విఱుఁగఁగొట్టి . మొ రా. సుం 141.

**విటతా(త)టమాడు** న క్రి (విటతటము + ఆడు)

1 తాఱు మాఱుచేయు

ద్వి వివిధాన్యసమయుల విటతాటమాడు ... పండితా వాద 205, పొ 10 పం.

2 తుత్తుమురు చేయు

ద్వి. వెన జిన ప్రతిమల విటతాటమాడి, యొసఁగు వాఁడీ జైను లెక్కడఁ జనిరి ... పండితా వాద 200 పొ

**విటతా(త)టము** విణ తాఱుమాఱు, వ్యత్యస్తము.

ద్వి. అమరారులను నిరసావనీజములఁ, దమకించి తా విటతాటంబు నేయు, నని దరికొను విలయానిలుపగిదిఁ, దనరు విట్టూర్పులఁ దఱుచైన దాని రం రా యు. 3383 పొ 29 పం

క. పుట మెగసి తాళవృతము, చటులోద్ధతిఁబూని పెటికి సారథి నవనిన్, విటతటముగఁ బడ వైచెను. బటుభుజసత్వంబు మెఱయఁ బవనజుఁ డల్కన్ మై. 3 82

ద్వి కర్మేంద్రియంబులు కమకని పాతె, వికృతులాఱును లోన విటతాటమయ్యె, నిక్రృతి సత్కృతి మతి నిందానమత్వ, మంతఃకరణముల కనుమతంబయ్యె ప్రభులిం, 4. 137. భా, 9, పం.

వి తుత్తుమురు.

వ. చక్రకుంతపట్టస ప్రాసకోదండ గదాదండ శూలాది సాధనంబులు విటతాటంబులు చేసియు ... వి. పు 8 59

గీ కీలు కీలుకు విఱుచుట గేరును విట, తాట మనఁగాను ... ఆం. భా 3. 39

జ విటతటమార్చు, విటతాటమాడు

**విటపము** సం. వి అ పుం. 1 కొమ్మ, శాఖ. 2. ఆకులు, చివుళ్లు మున్నగు వానిగుంపు,జొంపము. 3. నూతనాంకురము, కొత్త మొలక 4. గుంపు, తోఁపు 5. వ్యాప్తి, వ్యాపనము, విస్తరించుట. 6. స్తంబము, కాడ 7. పల్లవము, చివురు. (వాచ.) 8 ముష్కవంక్షణాంతరస్థానము, అండములకు గజ్జకు మధ్యప్రదేశము. (వాచ)

**విటపి** సం. వి న్. పుం. 1. వృక్షము, చెట్టు 2 మఱ్ఱిచెట్టు, వటవృక్షము

**విటపిమృగము** సం వి అ పుం. శాఖా మృగము, క్రోఁతి

**విటమాక్షికము** సం. వి. అ. న. ధాతుభేదము, ఒక విధమగు ఖనిజము.

**విటము** సం. వి అ పుం 1 ఎలుక 2, ఖదిరము, చండ్రచెట్టు 3 నారింజచెట్టు 4. చిగురుఁగొమ్మ, 5 ఖనిజ లవణము, జాతియుప్పు.

**విటరాయఁడు** వి. విటశ్రేష్ఠుఁడు

క పటుతరమగు మద్వీణా,స్ఫుట మధురరవంబు చెవుల సోఁకిన మాత్రన్, విటరాయఁడైనగానీ, ఘటదాసుఁడు గాఁడె యొక్క ఘడియటిలోనన్ రుక్మాం 2 126. (శ. ర.)

**విటలవణము** సం. వి అ. న. ఖనిజలవణము, జాతియుప్పు.

(ఇది మందుల కుపయోగపడును.)

**విటి** సం. వి. ఇ. ఈ స్త్రీ. పీతచందనము, పచ్చగంధము.

**విటుఁడు** సం వి అ పుం 1. పల్లవుఁడు, మిండఁడు, జారుఁడు. 2. విషయాసక్తుఁడగు మనుష్యుఁడు. 3. శృంగారనాయకుని యనుచరుఁడు.

(సంగీత సాహిత్య కవిత్వ శిల్పాదులయందు నేర్పరియైన యీతఁడు నాటకముల యందు విదూషకుని వలె నుపయోగించును.)

4. శఠుఁడు, దుర్మార్గుఁడు.

**విటుకు** వి విలాసము. (చి. ని)

చూ. విటుకులాఁడి

**విటుకులాఁడి** వి (విటుకులు+ఆఁడి) విటురాలు, కులుకులాఁడి.

క అని చిలుక తేనియలు బోఁరని యెడు జడివాన వెలిసినటువలెఁ బలుకన్, తనయంత నె తా నిల్చిన, విని కోమటి విటుకులాఁడి వెనవిట్లనియెన్ శుక 2. 29.

("చిటుకులాఁడి" అని ముద్రి. పా)

**విట్కారిక** సం వి ఆ. స్త్రీ పక్షివిశేషము, ఒకజాతి పక్షి.

**విట్ఖదిరము** సం. వి. అ. పుం. వృక్షవిశేషము, వెలితుమ్మ. (వృ. వి)

**విట్చరము** సం వి అ. పుం. మలభక్షకము, ఊరఁబంది.

**విట్ట(ఠ)లుఁడు** సం. వి. అ పుం పండరపురమున వెలసిన విష్ణుదేవుని యర్చామూర్తి.

**విట్టు** సం వి ష్. స్త్రీ 1 మలము, పురీషము. 2 వ్యాప్తి,విస్తృతి 3. కన్యక.

**విట్పణ్యము** సం వి. అ న పరకు, వాణిజ్య సామాగ్రి, సామాను.

**విట్పతి** సం వి ఇ. పుం 1 ప్రజానాయకుడు, రాజు. 2 అల్లుడు 3 పెద్ద వర్తకుఁడు, పెద్ద బేహారి

**విట్సంగము** సం. వి. అ పుం (విష్+సంగము) మలబంధము, విరేచనబంధము

**విట్సారిక** సం వి ఆ స్త్రీ పక్షివిశేషము, పీతిగోరువంక.

**విడంగము** సం విణ (అ ఆ. అ.) నిపుణము, నేర్పుగలది

వి అ న కడుపులోని క్రిములను బోఁగొట్టుట కుపయోగించెడి యొకయోషధి, వాయువిళంగము

**విడంబన** సం. వి ఆ. స్త్రీ 1. అనుకరణము. 2 మాఱువేషము, కపటవేషము 3. వంచన, మోసము 4. వ్యసనపెట్టుట, దుఃఖపెట్టుట 5 బాధించుట. 6 ఆశాభంగము గలిగించుట 7. పరిహసించుట, పరిహాసము, వెక్కిరింత 8 తిరస్కరించుట, తిరస్కారము. (వా చ.)

**విడంబనము** సం వి అ న. = విడంబన.

**విడంబము** సం వి. అ పుం. 1. అనుకరణము. 2 బాధించుట, ఉపద్రవముచేయుట

**విడంబించు** సం న క్రి. 1 పోలు, అనుకరించు.

వ. ... వికచారవిందదీర్ఘికల విడంబించు రావులును. భార. విరా 3 236.

సీ. బాలార్కబింబ ప్రభాడంబరంబు విడంబించు పీతాంబరంబుతోడ .. వరాహ 1. 57.

2. మోసపుచ్చు (శ ర)

3 వంచించు.

మ. తరుణీచిత్తము భూసురోత్తముని మీఁదం జేర్చి లజ్జాతిరస్కారిణీ గుప్తముగా నొనర్చి యిటు లేకాంతంబు దుర్దాంతదుష్పరచింతం బడఁ బంతమమ్మ ముని వాక్ప్రౌఢిన్ విడంబింతుగా . విక్ర. 1 131

అ క్రి. అతిశయించు

క ... గోవర్ధనాద్రిఁ దొల్లిఁటి, రావుననిడి మహిమతో విడంబించుటయున్ వి పు 7 254

**విడంబితము** సం. విణ (అ. ఆ అ ) 1 అనుకరింపఁ బడినది. 2. పరిహసింపఁబడినది, ఎగతాళి చేయఁ బడినది. 3. మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది 4. విసిగింపఁబడినది 5 భంగపఱుపఁబడినది, విఫలముగాఁ జేయఁబడినది 6 అధమము, నీచమైనది

వి. అ న పరిహాసపాత్రము

**విడఁగొట్టు** న క్రి (విడన్ + కొట్టు) విడిచిపెట్టు, పరిత్యజించు

క. చిలుకలు కమ్మఁదెమ్మెరలు శీతమయూఖుఁడుఁ దేఁటులాదిగాఁ, గలవనవిల్తుసాధనవికాయము లేలము పట్టులంగనా, కుల మటుగాన దాని విడఁగొట్టక తృట్టెకదొట్ట వీత రాగుల మని విఱ్ఱవీఁగెదరు కొందఱుబోఁడలు నానగండలై పాండు. 1. 182.

**విడఁచిమ్ము** న క్రి (విడన్ + చిమ్ము) విడుచు.

సీ. వీని నెట్టులనైన విడఁచిమ్మిపోతోడ వంటి నాయబలను ... చెన్న. 1. 136.

**విడఁదన్ను** న. క్రి. (విడన్ + తన్ను) విడఁగొట్టు, పోఁగొట్టు.

సీ. దుర్వ్యాసనలబెట్టు దొసఁగులు విడఁదన్ని యథ్యాత్మవాసన నలరుటొకటి . పాండు. 2. 85.

**విడఁద్రొక్కు** న క్రి (విడన్ + త్రొక్కు) విడివడఁ జేయు, విడుచు (శ ర)

**విడఁద్రోచు** న క్రి. (విడన్ + త్రోచు) పరిత్యజించు. విడనాఁడు

చ పడఁబడఁ బాఱుచున్ వడఁకుపట్టిన తల్లిని దండ్రి నేల లో, వెడలనితమ్ముఁ గుట్టల నవీవకులాంగన నోరులేని యీ, తొడుకులబంటుఁ బైదవిడఁ ద్రోవక ప్రోవఁగ నెందునీక పాల్పడి నది కర్ణునౌఁదలనె భారతసంహిత నిల్పుచాడ్పునన్ పాండు. 3 38.

**విడఁబడు** అ క్రి (విడన్ + పడు) విడువబడు.

ఆ. . విడఁబడె ననఁగను, దనరు విడువఁ బడియె నమటకభవ . . ఆం భా 3 116.

**విడఁబాఱు** అ క్రి (విడన్ + పాఱు) విడివడు, విడు

ద్వి విడువిడుమని చెయ్యి విడఁబాఱఁ దిగిచి, వెడమతి తనపాలి విధిఁ ద్రిప్పఁబోవ ... వవ 1. 59 పా 18. పం

ఉ .. మించునొయారమున్ గులుకు నెన్నడయున్ విడఁబాఱుకొప్పు నొక్కించుక జాఱు పయ్యెదయు నిట్టటుఁదూలెడు హారముల్ మిటారించుకుచంబులున్ జలదరించు వలగ్నముఁ బొల్పుమీఱఁగన్. కళా 2 17.

**విడఁబుచ్చు** న క్రి (విడన్ + పుచ్చు) విడుచు

ద్వి పీటిడిమాటలు విడఁబుచ్చి యనిన బస వు 193. పా 2 పం (ప్రాఁతప్రతి)

**విడనాడు** న క్రి (విడన్ + అడు) 1 విడుచు, త్యజించు

ద్వి. అంతట నృపతి భార్యను విడనాడి చింతించుచును గద్దె జేరకూర్చుండి ... ద్వి సారంగ. 489. (ప్రా. ని.)

చ. ... అఖిలభోగముల న్విడనాడి సద్విజ యా, నిరతిని బ్రహ్మచర్యనరణి స్మహనీయ తపోమహత్త్వముం, బొరసినయట్టియిట్టి మునిపుంగవు భావ మెఱుంగవేమియున్. విప్ర. 2. 77.

సీ. గీ చిలువ సొమ్ములు విడనాడిచెలువు మెఱయ, లలిత నవరత్నభూషణంబులు ధరించి ... జాహ్నవీ 1. 151.

2 పోఁగొట్టు

సీ. గీ. ఉచితబంధానుబంధత నుండియుండి, ననఁ గిపుంభావరీతుల ననఁగిపెనఁగ, దపసికిని నేర్పి యతని మౌగ్ధ్యంబునెల్ల, రమణి విడనాడె నతను ప్రౌఢిమ చెలంగ. విప్ర 3 90.

ఉ శా నెల దోఁటకేగిన విధంబు మునిం గనుఁ గొన్న చందమున్, వానికిఁ గాఁగఁ బన్నిదము వైచినమాటయు బేలువెట్టి య,మ్మౌని నిని దోడి తెచ్చిన క్రమంబుఁదమిన్ మొగమాటయొక్క యుం,తైననులేక తల్లి విడనాడినచందముఁ జెప్పి వెండియున్ విప్ర 5 47.

**విడము** సం వి అ న. ఒక విధమయిన ఉప్పు.

**విడవలి** వి (సం. వీరణం) అవురు, వీరతరము (వృ వి ) (శ. ర, ప్రౌ )

**విడాల(క)ము** సం వి. అ పుం. = బిడాలము

**విడి** విణ 1. ఎఱ్ఱనిది, అరుణము

క. మలయానిలంబు సోఁకినఁ, జలిమిరి సొగయించి భూమిజంబులమొదలుల్, పులకించినట్లు విడి గుము, రులుగొని యీరికలు గడుమురువుగా నెగసెన్. కు సం. 9 294

సీ. ... గీ అక్కుఁ జేరిచి చేన్నిచ్చి చొక్కటంపు, గొంపు విడికెంపు జంపున సొంపునింపు, జాతిమగ జాల తొల్లహార్మమునఁబెట్టి, రమణదాదులు పెనుప నారాచేపట్టి. చంద్రాం 2 3,

1. స్వచ్ఛము, నిర్మలము

గీ కళుకువిడికెంపు రవలచెక్కడపుమేడ, వలపట . దశా 4 102

సీ .. సిగపొందుగ నమర్చి చిన్నారివిడికెంపుతాయె తుల్ చుట్టి కుళ్లాయివెట్టి ... శుక. 1. 116.

సీ. ... విడి కెంపుగమపింపు పెదవితోడ ... రాధికా. 1. 9.

ద్వి విడి రత్నములనొప్పు వేలి ముద్రికలు .... ద్వి. శ. పా. 1. 185. వం. (ప్రౌ పా.)

8. ప్రకాశమానము.

ఉ. లిలఁ బళిందుఁ డొక్కఁడు కళిందసుతోర్మి నరో జనీదశాం,బోళితకోకరేఖ తన తోరపు వల్లని దీర్ఘబాహుపై, హాలహలంబపోలె విడియత్తె మునం దల యెత్తిచూచుబల్, సాళువమున్ వడిం జను శశంబు పయి న్విడిచెన్ మహోద్ధతిన్ మనుచ 4 56.

4 విడిపోయిన.

సీ .. విడికచ్చతో నుండు విడువకెపుడు కాశీ 6. 46.

5 ప్రత్యేకమైనది.

సీ విడిమేనులుగ నిల్చి వినువాఁక నీరాడు పన్న గాంగనలను బట్టి పట్టి సత్యభామా 2 29

(విడిమేనులు = దిగంబర దేహములు )

వ. ఒక విడిది సంతరించి విడియైదువలచుట్టరికంబు పొంకించి నత్యభామా 4. 35

(విడియైదువలు = లంజెలు )

క. నోరెఱుఁగని మేకములకై, జారెడుకైదు వయుఁ బట్టఁ జాడియె యనుచున్, దూఱు న్నము విడికేలున, దూరు న్మేకమున్న పొద యదూరుండగుచున్ చంద్రాం 2. 49

(విడికేలు = వట్టిచేయి, ఆయుధములేనిచేయి )

సీ. విడిగాలశౌరి తత్తడివెన్క వే తెంచె సగతులఁ జేబూని చారుచంద్రుఁ,డు . చంద్ర 5. 127

(విడికాలు = వట్టికాలు, పాదరక్షలు లేనికాలు )

6. విడువఁదగినది

ఉదా విడికథ. (శ. ర )

7 పనినుండి విడిచినది

ఉదా విడికోడె (శ. ర )

వి. 1 కెంపు కాంతి

సీ పద్మ రాగాభిధ పరగుఁ గెంపన .. తత్కాంతి విడియనఁ దనరుచుండు అం భా 2 278.

2 స్వచ్ఛత, నైర్మల్యము

క. విడిగల మానికముం బుత్తడితోడం గూర్చి నట్లు ... వేం. పంచ. 3. 267.

రగడ. దొరయ నొక వరిపాటి దొరలకు దొరకనీ విడికెంపు మిన్నలు ... శుక. 1. 222. 10. పం.

8. (శ. శ. విడి.) విసర్జనము, విడుచుట.

సీ. ఉజ్జనమనఁగను ముజ్జగింపనఁగను విడియన విడు వన విడుదలయన ... అలరు విసర్జ నాహ్వయము ... అం. భా. 2. 178.

4. తడవ

గీ. శిఖలు వీడఁగ ముఖములు జేగురింపఁ, గటము లదరఁగ నొక విడిఁగాటులాడి, యొండొరుల మీఁద శాపంబు లుగ్గడించి, హస్తములయందు సలిలంబు లందుకొనిరి. భీమ 4. 184

5. రీతి, విధము (రకము)

సీ గీ. చెవుల నెలరాల కామాతు లవటసీమ, సన్నవిడి గౌడరుద్రాక్షసరము లమర ... సారంగ 3 180.

గీ. జిలజిలమ సన్నవిడిగఁ బట్టెలమ దీర్చు, దుడుము మగఱాల మెలకువ తొలపు బొబ్బ, మెకము నెమ్మోము దనువున మించు గద్దె, సరిగఁ గూర్పుండుమని పోరి సురవరుండు. పార్వ 2 116

6. ప్రత్తి కాయలోని జీడ

గీ నింగి యనియెడి ప్రత్తి చేనికిని రక్త, బలియిడి రనంగ నెఱ సంజె తొలుత నమరఁ, దఱుచుగా దాన విఱిసిన మెఱుఁగుఁ బ్రత్తి, విల్లువాఁ జుక్క లెంతయు మల్లసిల్లె. కళా 8. 12.

క్రి విశే ఒంటరిగా, విడిగా

క ఆసమయంబున భిక్షుని, వేసమున దశాననుండు విడిచనుదేరన్, భూసుత పూజయొనర్చి సు,ఖా సన మిడి మధుర ఫలము లర్పించి తగన్. అధ్యా అర 90 పా.

ఇ విడిగోలు, విడిదేఱు, విడినీరు, విడియాకులు.

**విడిగోలు** వి (విడి+కోలు) మాఱువు. శ. ర, బ్రౌ.
విశే పనిలేనిది (శ ర)

**విడిచిపెట్టు** స క్రి. (విడుచు¹+పెట్టు) వదలు, వీడు

వ. పట్టువడిన నన్ను విడిచిపెట్టి ప్రాణంబు రక్షించిన యుపకారికిం బ్రియంబు సేయుదునన నేస్తురునే ... నైష 2. 8.

గీ. విజితుఁ గావించి దయ వాని విడిచిపెట్టె .... ఆము. 3. 6.

**విడిచివాటుగుదియ** వి. (√ విడుచు¹) భిండివాలము, ఆయుధవిశేషము. (శ. ర.)

**విడిదల** వి. (విడిది+తల.) 1. విడియుచోటు.

ఆ. వేఁట దోఁట యనుచు విడిదలఁ బడిపోవ, వలదు చరులఁ బనిచి వైరికొఱఁగు, లరసి గెలుచు వెరపులన్నియుఁ దలపోసి, విక్రమంబు గారవించు టొప్పు హరి. ఉ 5 124.

సీ. ఇదుగో మీవిడిదల కేనె వచ్చెద నంచుఁ దమ కించు యజ్వలఁ దాళఁ బలికి ... ఉ. రా. 4. 175.

2. సేనానివేశనము, దండు దిగిన చోటు.

వ. ... అతండు సైన్యంబుల నివర్తింప నియమించి సమస్తజనపరివృతుండై.

గీ. విడిదలకుఁ బోయె నపుడు. భార. భీష్మ 366.

క. పలుమాటల కిటుముఱుమాటలు పలుకని కృష్ణుతో నడలు మది మొలవం, బలుకుచు ధర్మ సుతుని విడిదల కరిగెను మోము వెల్లదనమున గదురన్ భార. ద్రోణ. 2. 231.

**విడిదలపట్టు** వి. (విడిదల+పట్టు) ఉండుటకుఁ దగిన చోటు.

ద్వి. విడిసిన సేనయు విడియు సేనయును, విడిదల పట్లను వెదకు సేనయును ... రం రా యు 328 పా. 7. పం

**విడిది** వి (√ విడియు) 1 సేన బసచేసిన చోటు, శిబిరము.

సీ. . . సంగీత వివిధవాద్యములతోన, కలయ విడిదిలో పేరమద్దెలలు మలిసె . కు సం 11. 620

సీ. వేలము పాళెము విడిదిపట్టు బిడారు విడిది యంచనఁగ నివేశమొప్పు ... ఆం భా 2. 194.

2 నివాసస్థానము, బస

గీ. విద్యకై వడి ముక్తికి విడిది యగుచు, నాత్మ విధముచ వానందమైనయిచట, నున్న సర్వేశు నౌదల విన్నచంద్రు, నవ్వుచున్నది గంగ ఫేన ముల చేత. ప్రబోధ 4 44.

క. వాశీశ్వర భైరవులన్, బాలికలు భజించి భూత పతి నభవుని శ్రీ,కాళద్విపేశుమదిలోఁ, గీలించుచు విడిది యింటికిం జనిపిదపన్. కాశీ. 4. 94.

గీ. విట్టలాధీశుఁ దలఁచి తద్వీపుల మహిమ నొడువుఁ బ్రామట్టి క్రీనిడ విడిది ప్రోడ ... పాండు. 1 213.

3. నివాసము, ఉనికి.

ఆ కృష్ణుకొంగుకేలఁ గీలించి నేఁడు మా,యింట విడిదిచేసి యేఁగు డిల్లి, యనిన నేఁడు దీరదరుగుము నీవంచుఁ, బలికె. వి పు 7 38

సీ. తనయిల్లు విడిది సేయవటంచుఁ జల పట్టు కొడుకు చేతులు పట్టుకొనఁగ వలసె ... కువల 1 42

**విడిదిపట్టు=విడిది** వి (విడిది+పట్టు) విడిదిచోటు, బసచేయుస్థలము.

వ ... విశ్వకర్మ మణిమయంబుగాఁ గట్టిన విడిది పట్టున విడిసి. ఆము 6. 123.

సీ. గీ సకలసౌభాగ్యలక్షణస్వచ్ఛమైన, వీని నెమ్మేను లక్ష్మికి విడిదిపట్టు ... కవిరాజ 2 222.

వ. పీఠంబులు గంధంబులు గోకలు తొడవులు నిడి విడిదిపట్టుల నునిచె. నీలా. 3. 50

**విడిదేఱు** అ క్రి (విడి+తేఱు) ప్రకాశమానమగు

క విడువని తగు నిర్వుర కి,వ్వడుపున వనుకరణి నుభయ వస్త్రాంచలముల్, విడిదేఱు వక్షతలతో, ముడిఁబెట్టిరి పంచశరుఁడు ముడిఁబెట్టంగన్. వేం పంచ 4. 365.

**విడినీరు** వి. ఔ అనౌ (విడి+నీరు) ప్రత్యేక జలము, ఏతము మొ వానిచే తోడి పోయు నీరు

వ. విడినీరం బణ్డిన అయ్యపుట్టి 1 ట్టికి చి 8 ఱొన్న వేల పుట్టి 1 ట్టికి చి 8. ... దా. శా 1384

**విడిపట్టు**[1] వి (విడిది+పట్టు) 1 నివాసస్థానము, విడిది

క పడఁతి తావులకున్ బై,పడ నేఁటికిఁ లోగడ లివియ పంచాస్త్రునకున్, విడపట్టునతుల సిగ్గుల, విడిపట్టు గదా యటంచు వెఱతురు చేరన్. చిత్రభా, 2. 126

గీ. ... ఇట్లుగూడిన యోకిమీంద్రకెల్లఁ చెలిమి, మెఱయ విడిపట్టు లొసఁగె వమ్మిథిలఱేఁడు .. అ రా కాల. 165.

సీ. శూద్రులకును మెట్టు శూరుల విడిపట్టు మంత్రివ ముఖలకు మనికిపట్టు....శివ ధర్మోత్త. 1. 16.

2. పల్లె, పేఁట.

ద్విప, విసవికాయమున గంభీర తోయమున, వన దూనమైన యయ్యనమున మార్గంబు, విడిచివఁ గడతెంచి వేవేగ గొల్ల, విడిపట్టు నడువందు విడి పట్టు సొచ్చి. అ మ క. 1 22 పా. 14 పం

3. వి (విడియు+పట్టు) బసచేయుట, నివసించుట.

చ అమర విభుండు సేరి విషయాసక్తుఁడై విడిపట్టు వై జయం,తమునను జిత్తగింపు మన నవ్వుచుఁ దద్బల దైత్య వైరి హా,స్తముఁ గయిదండ గొంచు .. పారి 3 40.

**విడిపట్టు**[2] వి (విడు+పట్టు) వీడునట్టిస్థానము

క. పడఁతి తావులకుఁ, బై పడ నేఁటికి లోగడలివియ పంచాస్త్రునకున్, విడిపట్టు సతుల సిగ్గుల, విడి పట్టు గదా యటంచు వెఱతురుచేరన్ చిత్రభా 2. 126.

**విడిపించే** స. క్రి (√విడుచే) విడుచునట్లు చేయు

సీ. . , మొగి జరాసంధుచే నిగృహీతులై యుండు పృథివీపతుల విడిపించి చెలఁ. భార సభా 1. 214.

సీ. జడలు కంపలు వట్టి జరుగనీకున్నచో విడిపింప శిష్యుల వెదకువారు ఉ పారి 1. 102

మ. అని పౌలోమి మొగంబు చూచి విను మోయ జ్ఞాన్య నీకింతమా,త్రవ విన్నంబడ నేల? పోదు విదె సత్యాగర్వభారంబు ది,వ్యనగంబు న్విడిపించి వత్తునని సాహంకారుఁడై లేచి చ,య్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థుఁడై పారి 4 61

ఉ. . లీ,లావతి యున్న పెట్టె యనలంఘ్య తరంబగు తజ్జలంబునం, లో విడిపించి ... శుక 1. 466.

**విడిమట్టు** వి (√విడియు) 1 వాసస్థానము

సీ. గీ. ఎపుడుఁ కాయక యున్న మిన్నేఱు దనరఁ, బెర్మిఁ గొండల ఱేఁడను పేరు మెఱయ, వేల్పుమల వింటి దేవర పొల్పుఁదాల్పు, జన్నపుందిండి విడిమట్టు చలువగట్టు. యయా. 2. 86

సీ. ... చిత్రనైర్మల్య సంస్థితికిని విడిమట్టు ప్రహ్లాదనమునకుఁ బట్టుఁ గొమ్మ ... విప్ర. 1. 84.

2. కాఁపురము.

సీ. విప్రాలయములందు విడిమట్టుగా మందువాని మంటలలోన బై వలేదు ... రుక్మాం. 2. 7

3. విడిది.

వ. ... తుహినాచలేంద్రుండు తనకు నియమించిన విడిపట్టు ప్రవేశించియుండె ... పీఠ. 3 160

**విడిముడి** వి. ధనము

క. వడిగలతనాల నీగిని, విడిముడి పసఁ బ్రాభవమున విజయనగరిలోఁ, గడు నెన్న నేర్పుఁగల మొల్లడకలఁ బెద వేంకటాద్రి నరవరుఁ డొప్పున్. రాఘవ పీఠి. 37.

గీ. పొగడకయి నిక్కి తమినోర్తు పూలుగోయఁ, బోకముడివీడఁ గని నెపంబునను బోటి, యడుగు విడిముడిగలదాన వనుచు విరులు, తెలిసి తానీవి గల దౌట తెలిసె నదియు రామా. 1 194.

క. తొడవులు మానికములు విడి, ముడియున్నా డెంపుఁ బుట్టములు ప్రోవులుగా, మడుగరలు దెచ్చి యిడి య,య్యెడయని యడుగుల కెఱఁగి యొప్పుగఁ బలికెన్. అ. రా కిష్కిం. 48.

క. విడిముడియన రొక్కమనఁగ విత్తంబనఁగున్, బుడమిని నామములగు .. ఆం సం. స్థా 30.

2. వీడిన ముడి.

గీ. పొగడకయి నిక్కి తమినోర్తు పూలుగోయఁ, బోకముడివీడఁ గని నెపంబునను బోటి, యడుగు విడిముడిగలదాన వనుచు విరులు, తెలిసి తానీవి గల దౌట తెలిసె నదియు. రామా. 1. 194

౩. విడిముడి పట్టు

**విడిముడిపట్టు** వి (విడిముడి+పట్టు) ధనగృహము

సీ. విడిముడిపట్టులు వెలిమి గావించి మల్లెసాలలు బిట్టు మండఁజేసి ... అ. రా సుం. 172.

**విడియ** వి ధనము సించుసంచి, (రొక్కపు) జాలె.

ద్వి. విడియలతో రెండువేలమాడలును ... బస.పు. 5. 275. పం

(సం. వీటీ) తాంబూలము.

ద్వి. అడికినమాడల విడియలుగాంచి .. బస. పు. 5. 291. పం. (292, 299, 311. పం చూ.)

**విడియము** = విడ్యము, విడెము, వీడియము, వీడెము.

వి. (సం. వీటికా) (క. బీడి. త. విడ్రైయం) తాంబూలము.

గీ. ... కనక కలహంస వాహవాహనమైన, విడియపుం బెట్టెఁ జూచి యుర్వీధవుండు.... నైష. 8. 105.

సీ. ... గీ. ... అధ్వగులు లాఁచి యిడువిడియముల పేర ... ఆము 2. 58.

సీ. వెన్నుఁడు కపురంపువిడియంబు కొసంగిన నొదిగి కైకొనక యుండెదవు సుమ్ము నీలా. 3 94.

గీ. సొగసు తెలివాలు నునుసొగసొంపుతళుకు, బెళుకు చికిలి యొయారంపుఁ బేరెముదుటు, సొలఁపు విడియంపు దేలింపు చులుకుటొర, కలికి బెదరెచ్చు చూపుల కలికిఁ జూచి. ప్రబంధ. 1 106.

**విడియాకులు** వి. బ (విడి+ఆకులు) భార్యాభర్తలు విడిపోయినట్లు వ్రాసికొనిన పత్రములు. (వా )

**విడియించు** స. క్రి. (√విడియు ) విడియఁజేయు, బస చేయించు.

చ పడఁతుక యేను రావణుఁడ బాహుబలంబున నింద్రుపీటపై, నడచుచునుండి యిన్నగమునన్ విడియించితి సేన నిప్పుడు,య్యెడ కలవోకవచ్చి సొగయించు విధంబునఁ బోవుచున్ననిన్, బొడగని కాము బల్మితకముల్ నను నిమ్మైయి వెట్టఁ జేసినన్. నిర్వ 6 62.

గీ. యమున నిడుపెల్ల విడిదలయై తలిర్ప, బలము విడియించి మగధభూపాలకుండు, మనుజనాథులఁ బిలిపించి మంతనమునఁ, గావ్యమంతయు నూహించి కడఁక మిగుల. హరి. ఉ 2 13.

క ధరణీశు లెల్లవచ్చిరి, వెరవున మన్నించి వారి విడియించితి ... భా రా. బాల. 108

**విడియు** అ. క్రి. 1 సేనలు బసచేయు, బసచేయు.

సీ. మడుఁగుల పొందుల ప్రమాఁకుల నీడల వెలువులఁ గనికని విడియువారు .. కు సం 11. 600.

క. సవరణల నొప్పి యనిఁ బాండవబలముల మార్కొనం గడంగుచు నత్యుత్సవమునఁ బేర్చిన సేనల, కవకాశములేదు విడియ హాస్తిపురమునన్. భార ఉద్యో. 1 226

ద్వి కడు నొప్ప సేతువుగడచి యుబ్బంగి, విడిసె రాఘవుఁడు సువేలాద్రియందు .... రం. రా. యు. 317. పొ. 25. పం.

వ. బ్రాహ్మణుల బకాసురుండు బాధించుటయుఁ దమవిడిసిన యింటిబ్రాహ్మణునకైన యాపదయు ... భార. ఆది. 6. 277.

ఉ యజ్ఞవాటమున జనాధిపులకు ముని,వ్రాతము లకు విడియ వలయునట్టి, మందిరములు. భార. అశ్వ. 4 188.

గీ అమృతఁ దద్వీశేషంబు లత్యాదరమున, వర్ష కోటికిఁ జెప్పుచు వంబుజాతుఁ, డంతవట్టి వారలఁ దగనల్లి విడియఁ, బనిచెఁదగు ముహూ ర్తంబున మన మెలర్ప. హరి. ఉ 2. 106.

2. దండెత్తు.

ఉ. భక్తిఁగొలిచి శాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై, విడిసెఁ దత్పురమున విభుఁ డవంత, బలము తోడఁ బన్ని భగదత్తుఁ డేతెంచి, విజయుఁ దాఁకె సమరవిజయకాంత. భార సభా. 1. 228.

క .... భూపాల జయమవశ్యము నీ, పాలిద నిక్కంబు లంకపై విడియు మిఁకన్ ... భా రా. యు 12.

చ. ... రసాతలంబుపై, విడియఁగ దండుడిగ్గిన ... ఆము 4. 128

3. (నీతి) షడ్గుణములలో నాలుగవదగు నాసనము నాశ్రయించు, సమయము ప్రతీక్షించు.

క. వడపునఁ గోల్పుచ్చఁగనగు, నెడయు విడిసి యుండి చెఱచు నిక్కయు నీ వేర్పడఁగను ... భార. ఆశ్ర 1. 69.

4. ప్రవహించు.

గీ. వడచి భగవంతు క్షేత్రంబు నడుమఁ జొచ్చి విరజయను సింధు వెచ్చోట విడిసియుండు, వృహరి ప్రత్యక్షమైయుండు నెట్టిచోట, నట్టి చోటను వైష్ణవి యనఁగఁ బరగు . పాండు. 2. 227.

5. విడిపోవు.

వ అనుటయు నమ్మునీంద్రులు విడియజాడం దలంచి యతనితోడ ... ఉ. హరి. 1. 98

సీ. ... ధర్మ, విముఖుఁగావింపుము విడియంగ జాడకు ధర్మమార్గైకతత్పరుని నికని ... కాశీ. 5. 819.

6. జోలు.

గీ. అర్థి నన్నంబు గుడుచుచో నందుఁ గలిపి, విషముపెట్టిరి పెట్టిన విడిసిపడక, గరముతోఁ గూడ సగరుండు ఘనుఁడు పుట్టి, వరయశ స్స్ఫూర్తితోఁ జక్రవర్తి యయ్యె. భాగ. 9. 202.

(శ. ర. పా. "విరిసిపడక" ముద్రిపా )

జ . విడిదల, విడిదలపట్టు, విడిది, విడిదిపట్టు, విడి పట్టు, విడిమట్టు, విడియించు

**విడిపడు** అ. క్రి (విడి+పడు) 1 (నిర్బంధమునుండి) తొలఁగు.

క మెడ బిగియఁబట్టుకొని దిగఁ, బడిరొడి బాలకునిచేతఁ బర్వత నిభుచే, విడిపడఁ జాలక వాఁడురి, బడిబెగడెడు ఖగము భంగి భయముం బొందెన్. భాగ 10 స్కం 274

క. పడుచున్ లేచుచుఁ బులిచే, విడిపడిన కురంగిఁ బోలి విహ్వలు రాలై ... ప్రబోధ 3 74

సీ. ... గీ కుటిల మబ్బున విడివడు మెఱుపు లటుల, కమ్మపౌజుల తళతళల్ క్రమ్మకొనఁగ, సభకుఁ జనుదెంచె వెయ్యాఱు సఖులు గొలువ, శ్రీలలితధామ చంద్రమతీ లలామ. ఉ హరిశ్చ. 2. 14.

2. (తెగనుండి) విడిపోవు, వీడు, వీడిపోవు

వ. ... సాలంకారధేను సహస్రంబులు విడిపడు నిజవత్సంబులం బిలుచు నంభారవంబుల వల నన్ . పారి. 5 75

చ. కలఁగిన కొప్పుతోఁ జిటుల గంధముతో విడివడ్డ కైకతో . . కళాం 4 74 (శ. ర. పా "విడఁబడ్డ కైకతో" ముద్రి పా )

వ. ఇట్లు దుర్వాసుం డాశీర్వాద పూర్వకంబుగా నొసంగిన కుమార పారిజాతమాల్యం బహల్యా జారుండగు సునాసీరుండు ... ఐరావణ కరటి కుంభ పీఠంబుపై .. వైచిన ... ప్రమత్తుని కైవసమగు రాజ్యలక్ష్మి విధంబున విడివడియు, డస్సియు, గ్రుస్సియు, నొగిలియు, బగిలియు దీనదశకు వచ్చినం గనుంగొని. హర. 6. 16.

3. నిరాతంకముగాఁ బ్రవర్తిల్లు.

చ. మడవక భీమసేనుఁడును మాగధరాజుఁ గడంగి బెబ్బులుల్, విడివడులీల నొండొరుల వీఁపులు మూఁపులునుం బ్రకోష్ఠముల్ ... భాగ. 10. ఉ. 786.

చ. ఏర్పడ నమరేంద్రుఁ బాడుదల పట్టిన రావణి రోష దీప్తుఁడై, విడివడి మించుమంచిపటువిక్రమ సంపద సొంపెలర్పఁగా.. భా రా యు. 444.

క. కప్పురఁపుతునకలలవడ, విప్పగ విరితేనెవావ విడివడి కురియం, జొప్పడర హంస సురపతి, సెప్పెను హేమావతికుశేశయ ముఖికిన్ హంస. 2. 73.

4. తెంపఁబడు.

సీ. . గీ బయిసి మాలింపుఁ దన పిన్న వయసు నాఁటి, పడపుసుద్దులు దల పెట్టి పాఁతజోలి నోరు విడివడ్డఁ బచ్చి బూతే రచించు, వివిధ, మాయామయోపేత వేశ్యమాత వై జ 2. 84.

5 జాఱు.

క పిడికిట నడఁగెడు వడుమున్, గడుఁదియ్యని మేనుళ్ళంగ కలిత గుణంబున్, విడివడని కొప్పు నేర్పడి, పడఁతుక గతియయ్యె మించి పౌరుష వృత్తిన్ చిత్రభా 2. 85

6 ప్రసరించు

సీ .., అడుగు దమ్ములకాంతి విడివడి పగడంపుఁ జిగురుటాకుల మేలు చిందు సేయ... జాహ్నవి. 4. 21

7. బయలుపడు.

సీ. కరము సాఁచి నవాంబుకలశ మీ విడివడ్డ కుంకుమాంకపు ముద్దుఁ జంక మెఱపు ... విజ. వి 2 141.

**విడిపాటు** వి (√ విడివడు) 1 ఏకాకిత్వము, ఒంటితనము

ఉ. పట్టిన కార్యము ల్విడువఁ బాడియె పాడిదొఱుంగవోటు నేఁ,బుట్టిన నుక్కిచచ్చు విడిపాటున నొక్కట గాలిఁబోవునేఁ, గొట్టిన పిండి వాఁడతఁడు ... చంద్రాం 3 60

2. విడివడుట.

మ. ... పెక్కుల్ రూకలున్ రెండుమూఁ,తు విడే కాకులు పోకలూని విడిపాటున్ గోడలై తక్కుటి, భవనప్రాంగణ సీమఁ ద్రిమ్మరుడు రంభా కుంభచేటీ విటుల్. వై జ. 2 41.

**విడిపాటుబడియ** వి. విడిచిపాటు గుడియ.

సీ. ... గీ. భావభవుచేతి విడిపాటుబడియదుద్లు ... కవిక 4. 94

**విడివేఁట** వి (విడి+వేఁట) డేగవేఁట.

గీ అపుడు విడివేఁట యిడుమని యానతిచ్చు, రాజు ముంగిలి కడకుఁ జేరంగవచ్చి, లగడు సాళ్వంబు డేగలోముగను గల్గు, వేఁట పుల్గుల విడిచిన వింటి కెగసి. యయా 2. 23.

సీ ... తెగిన మెకంబులఁ దేలేదు విడివేఁట పిట్టలకును మేఁత పెట్టలేదు ... కాళ. 3. 76

**విడిపోవు** అ. క్రి (విడి+పోవు) వదలు, విడివడు. (శ ర)

**విడినము** నం వి అ న పక్షుల గతిభేదము.

విడు న క్రి. త్యజించు, విడిచిపెట్టు.

మ. ... విడుకోపంబిదె శాంతిఁ గైకొనుము వాగ్వివాద మింతేటికిన్ .. హర 7. 59.

మ అలనా రత్నముగాన మాధురికి కైలంబుల్ గరంగెన్ మృగంబులు మేపుల్ విడిచూచుచుండె .. వాల్మీకి. 3. 133.

క, సమరము నిష్కారణ వైరముశం బాటిల్లె నెల్ల రాజులు భరతో. త్తములును మడిసిరి విడుకో,పము దీర్ఘక్రోధుఁడైన పతి కి దొందున్. భార. కల్య 1 55

క ... నీ వింతయేల పెనఁగెదు, నేవిడ వా కన్నులావ నిమఁ గూడ కిఁకన్ ... సారంగ. 2 106

అ క్రి. 1 పోవు, అంతమగు.

క. నా చెప్పినట్లు చేసిన, నీ చెఱ విడునట్లుఁ గాక నిలుపోపక నీ,వేచంపి నన్ను నోఱుము, చైచుకొనిన మానునే భవత్కు త్తెల్లన్ . కేయూర. 4. 105.

2. వీడు, విశ్లిష్టమగు.

సీ ఓహో సరోజంబులోడి విడివడియె వేరుకొనంగ వలెనని సకులఁ బిలిచి, ... వరాహ. 1. 5.

చ. ... ఇంచుక వాయి విడ్డ కాఁ,మర మొఱపెట్టి పెట్టి వలుమాటును కాకిలి దాఁటి యాఁగుచున్, మొరయ విపంచి మీటుగతి ద్రోసి యతుల్ పెడతెం గొలంకులన్ ... శుకుచ. 3. 60.

మ. ... దం,తుర సంతోష వ్యాకులతనై దిగధి కాంతుల్ చెంత చింతల్ విడన్ .. కువల. 3. 13.

3. వికసించు.

సీ ... అత్యన్యచేతో హలుకాళన వ్యజనంబు బుడుత తెమ్మెరకును విడినదంట, రత్యంత కాంత హృద్రసపున స్థితికర్త చిదుమంగ దల కెక్కఁ జేయుదంట. (కర్త—క్రొవ్విరి.) రా. వి. 3 76

విడఁబల్కు=స్పష్టముగాఁ జెప్పు.

ద్వి. ఏ విడఁబల్కిన భావంబుఁ జూచి, భావజ్ఞుఁడ వయేని పోవంగ వలదె ... పండితా. పురా. 114 పౌ

ఇః విడఁగొట్టు, విడఁజిమ్ము, విడఁదన్ను, విడఁ ద్రొక్కు, విడఁద్రోచు, విడఁబడు, విడఁబాఱు, విడఁబుచ్చు, విడనాడు, విడిపట్టు, విడివడు, విడిపాటు, విడిపోవు, విడుగడ, విడుగర, విడుచు, విడుదల, విడుమర, విడ్వరుచు, విప్పారు, విప్పు, విప్పుగంటి, విప్పుపాఱు, విప్పుసేయు.

విడుగడ వి. (√ విడు) విడుదల, విముక్తి.

చ. ... జనుకాను మతంబున నా బలారికిన్, విడుగడసేసె. నిర్వ. 7 12.

క. రాగాదిదోష దూషిత,మై గర్హితమైన చిత్తమది సంసారం, బాగతిఁ బరిభ్రమింపమి, వేగమెకవ బంధములకు విడుగడ గాంచున్. వాసిష్ఠ 2 148.

విడుగర వి. (√విడు) విడుదల, విమోచనము

క. ఉర్విదెవ్వఁ గొలికి యిప్పుడ, వెవారఁగ నీకు నేను విడుగర సేయం, దొరకొనుట నీకు భాగ్యం, బరిత్వము దొలంగి మైత్రి యలవడుపుమదిన్. భార. శాం 3. 205.

ఆ. అవిన నట్లయగుట నాత్మ నెఱింగియు, కాదె సంధియైన నాదుబ్రదుకు, నీదు విడుగరయును నిజమగు టూహించి, నిన్నుఁ జెందె బుద్ధి నిశ్చయంబు, భార. శాం. 3. 208.

విడుగు అ. క్రి. వికసించు,

క. ముడిఁగెఁ దొగలడఁగె జక్కవలు, విడిగెఁ బకెూ జమ్ము లుడిగె వెన్నెలలు .... కుర. 1. 286.

విడుచు[1] స. క్రి. 1. త్యజించు, వదలు.

సీ గుణవంతు లగుచున్న కొడుకులు గలవాఁడు పాంచాలుఁడేల యపాండు సుతుల, వినయ సంపన్నుల విడుచువాఁడగు . భార. ఆది 8 25.

ఆ. బాల్య కేలిమీఁది భరముగ్రమంబున, విడువఁ గళలయందు వేడ్క సాని, నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు నీవ కాదె భార. విరా 1 251.

గీ వలునిదక్కంగ నొరునినేఁ దలఁతునెట్లు, విడువు సందేహ మోహంబు విహగరాజ ... నైష 2. 70.

2 (బాణాదులను) ప్రయోగించి

మ . శాత్రవుంగుఱిచి యీగాయత్రి వర్ణావళిం, బ్రతిలోమంబుగ నుచ్చరించి విడువన్ బ్రహ్మాస్త్రమై తాఁకి యా, ప్రతిపక్షుం దెగటార్చు నంగుళి శిఖాప్రస్ఫోట మాత్రంబునన్ కాశీ 3. 190

సీ కరినాడుఁబట్టు నక్రంబుపై విడిచిన సరసిజాక్షుని చేతి చక్రమనఁగ . బిల్హ. 2 19.

మహాస్రగ్ధర . కోపమ్మైన రోషమ్మయిన విడువు మెల్లినమేలింక నన్నున్ .. ఆము 3. 30

క. తుదినమరశక్తి వైచినఁ, గదనధురంధరుఁడు ఱేఁడు గైకొని పైపై, ప్రదరసహస్రము విడిచెం, బొదివడిచెఁ గటారిఁ బొడిచె బొమముడి ముడిచెన్. కకు 2. 143.

3 పంపు

సీ ... గీ పికిలి పిట్టలఁ గొట్లాటఁ బెట్టుచూచు, డిట్టతనమునఁ జెలికు పందెంబులాడు, డీకొనఁగఁజేసి యనికిఁ బొట్టేళ్ల విడుచు, రంభచుట్టంబు నైభవ ప్రాభవమున. కువల 5 9

ఉ కాయము చిత్రవర్ణములు గల్గి మనోజవమైన యశ్వమే, ధీయహాయంబు వాగమువిధిన్ విడువం దగు ... జై. భా. 1 76.

4. దానముచేయు

క. నేలం గాఁచిన సస్యాల, పాలవు ధనమొందె ద్రుమ్ము పాలవుధరణీ, పాలుని పాలవుఁ గావున, పాలాయముఁ గుఱుచ విడువవలయున్ ధనముల్. విక్ర. 2. 178.

5. విడువఁజేయు, విడిపించు, త్యజింపించు.

సీ . . ఆ మాతనాజివంబు నుము విడిమేలని, గోఁచి విడిచి మృదుదుకూల మిచ్చి ... భాగ. 9 694.

6 (ఇదికొన్ని వట్ల విశేషార్థములేకయే క్త్వార్థ మునకను ప్రయుక్తమగు )

సీ కోపించెవా మేరుకుధరచాపునినైనఁ దృణ ముగాఁ జూచి మర్దించి విడుచు జాహ్నవీ. 1. 116

(మర్దించి విడుచు=మర్దించి తీఱును, మర్దనక్రియ పూర్తిగఁజేయును )

అ క్రి. 1 (ఊడలు, కొమ్మలు మొ) పుట్టు.

సీ . . గీ. . విసపుఁజెట్టున కూడలు విడిచినట్లు, ఆడలు జనియించి చెటిచె మస్తమున నీకు. చంద్ర. 8. 24.

2 ఎడతెగు.

క. విడువక మీఁగావము పొగ,విడుటయు మఱిపాడుఁ డమట యెగ్గే ... అము. 5. 58.

విడిచిపుచ్చు=విడుచు.

ఆ. . . అనుచు నుల్లసంబులాడి ద్రుపదు, విడిచి పుచ్చెగురుఁడు భార ఆది 6 90.

వ . ఆ భూపాలుండు హస్త పల్లవంబులు వదలి రాజహంసంబ పొమ్ము సుఖంబుండుమని విడిచి పుచ్చె ... నైష. 1 108

జ విడిచిపెట్టు, విడిచివాటు గుడియ, విడిపించు, విడువరి, విడుపరితనము, విడుపు, విడువడు, విడ్పించు, విడ్పు, విడ్వఁబడు.

**విడుమే** స క్రి (√విడు) 1. విడునట్లుచేయు, విప్పు

క. నీముడిచిన ముడివిడువఁగ,నే మెవ్వరు నేరమింక నీ సౌభాగ్య, (శ్రీ) మహితువిఁ బతిఁగూర్పం, గామిని నీ కంటెఁ తెలుఱు కలరే చెపుమా. ఉ హరి 5 104.

ద్వి. పొడిచె నొక్కఁడు తూఁటు వోవఁగనెత్తి, విడిచె దోవతికట్టు వెననొక్కరుండు ... ద్వి. హరిశ్చ ఉ. 954.

గీ కొదమగుబ్బలఁదావి కుంకుమపుఁబూఁత, విభుఁడు చెంగావిజయికంచు విడువఁబోవ ... ధ్రువా. 9 124.

క. అని పంచాంగము పుస్తకమును విడిచి కడం ద్రియత్నమువఁ దిథివారా,దివిరితచేసి వ్రేళ్లన్ని నిరూపించెన్ గ్రహాది నిఖల బలంబుల్ కళా 7. 48.

2 విడిపించు, పోవునట్లుచేయు.

సీ ... సీకాయ యెరువువ జిడ్డువిడిచి .... హర. 2. 107.

**విడుజట్లుగొను** అ క్రి. (విడు+జట్టులు+కొను) ప్రత్యేకమైన అమ్మకపు సరకుగాఁగొను.

వ. హారగిరిజ లొండొరుల చిత్తంబులు విడుజట్లు గొని తారసీహారాచలంబుల కరిగిరి ... కు సం. 7. 909,

(ఒకరి మనసు నొక రాకర్షించి యనిభావము )

**విడుత** వి తడవ, పర్యాయము

ఉ. మాలనిచేతనైన విసుమానిని దానములోలిఁ గొందు దు,శ్శీలతచే దురన్నము భుజింతున బద్ధములాడుచుందు నే,వేళల నేటిగట్టుకడ వ్రేలుచుఁ జేతులు చేతుఁగాసుకై, తాలిమి రెండుమూఁడువిడుతల్ గుడుతుం బరిఁజైత్ర కాన్నముల్. జాహ్నవి 4. 116.

**విడుదల** వి. (√విడు) విమోచనము, విడుపు.

సీ. . గీ ... దొంగలకుఁ జిక్కితింకనే భంగినాకు, విడుదలౌనని చింతించువేళ నెదుట ... వరాహ. 9. 10

వ. వేఁటకాని లాఁగునఁ బరచమూరు శరభచమర కదళీపుండరీకషండంబులఁ బడఁగెడపుచుఁజెలి కాని చేడల్పనఁ జూచుచుఁ దూఱంబురాణ వెముదవిలిపోవుచుఁ బథికజ మందన వల్మీకవాను లం జూచి మఱలుచు చంద్రా 6. 98

**విడువరి** విశ (విడుపు+అరి[2]) త్యాగశీలుఁడు (చూ. విడుపరితనము )

**విడుపరితనము** వి (విడుపరి+తనము) త్యాగము, ఈవి

మణిగణనికరము—కలువలచెలి సెగకను గలిగిన య,బ్బలియని బలుకుల పడఁతుకఁ చెలి గ్రో, త్ర లరుల వలమురిననమున నగుచున్, బలువునఁదగు విడుపరితనపు బలి. యయా 5. 159

**విడుపు** వి. (√ విడుచు[1]) 1. విడుచుట, త్యజించుట,

ఆ. కార్తవీర్య దశముఖ ప్రముఖులు జమదగ్ని
తనయ రాఘవాదులైన, పురుష వరులచేతఁ
బొలియరే సక్రోధ, వృత్తిఁగాన నలుకవిడువు
మేలు. భార. శాం. 6 590.

సీ. అనవుడు ధర్మనందనుఁ డమ్మహాత్మతో విను
భక్తియుక్తుని విడువు బ్రహ్మ, హత్యఁబోలిన
పాపమని చెప్పుదురు పెద్దలు భార. మహా.
55.

క. ... అతఁడు శుభమశుభం,బను భేదముఁ బోర
యఁడు విడు,వున సమతామ యత్వముంగను
చుండున్ భార శాం. 5. 327.

సీ . ఫణి విషవహ్నిఁ జేద్పడియున్న శశిరేఖ
నెఱవిడువునఁగాంతి వఱలునట్లు ... కు. సం.
7. 897.

2. త్యాగము, దానము.

క లోకము చందము గనికొని, యీకానఁగనగు
ధనాదులెల్లను గాల, వ్యాకులతఁ బొందఁ గల
యవి, గాకుండమి యెఱిఁగి విడుపుగడుఁ జదు
రెందున్ భార. శాం 4 37.

గీ. అ య్యయాతి గడఁగి వెయ్యమునఁబుడమి,
వేల్పులకుఁ బైఁడి నొసఁగెడు విడుపునీట, నిండి
కొదవేమియును లేక యుండెఁ గడలి, యతని
భాగంబు లేక వెన్ననలవి యగునె. యయా.
1. 95.

3. దిగుమతి

గీ. తురగమునకుఁ బణము పురుషున కరపణ,
మాఁడుదానికైవ వందునగము, బ్రేఁగు ముట్టు
వందు బ్రేగు విడుపునకు, నోడకూలి గొనుట
యుచిత మంత్రుు. విజ్ఞా. ప్రా. 86.

విశే. త్యక్తము, విడవఁబడినది.

ద్వి. . . భూవరులు, సఖులై జన్నముల్ సన్న
ముల్ సేయ, విబుధుల కుడుపులు విడుపులై
పోయె . అ. మ. క 1 14. పా. 22. పం.

విడుమర వి. (√ విడు.) 1. విడుదల, విముక్తి.

క. ఒకనాఁడేమును నాపద,లకు విడుమరఁ గాంచి
విప్రులం జుట్టలఁ బెట్టుకొని సుఖముండఁ బడ
యుదు, మొకో యిప్పాటెందుఁ గఱద్దె ఘోరు
లైవ్వరికిన్? భార విరా. 1. 49.

క. గడగడ వడఁకుచు నద్రులు, వడియఁగఁ
జేదోయి మొగిచి స్వామీ కోపం, బుడుగుము
శాపంబునకును, విడుమర యెన్నఁడగుఁ జెప్పవే
కృపతోడన్. భోజరా. 6 349

గీ అపుడు మాళవుచేతఁ బ్రహారవర్మ, పట్టు వడి
వాని కరుణయ ప్రాపుగాఁగఁ, దనకు విడుమర
గాంచి. దశకు 7. 10.

2. ఎడఁబాటు, వియోగము

ఉ. గిరిజ నొడఁగూర్చి వరదుచే వరము వడియ,
నోపుఁ బొమ్మని నమ్మి నే నున్నచోట, నెట్టి
విడుమరవచ్చె నీ కెట్టిబావు, సంభవించెనె మన
సిజ చక్రవర్తి కు సం 6. 552.

విడులము సం. వి అ పుం. వేతసము, ప్రబ్బలి (వృ
వి) (వాచ)

విడువడు అ క్రి (విడుపు+పడు) విడివడు, బయలు
పడు

గీ. మేటి ఛాటి జనిత కాలకూటవిషము. చిచ్చు
విడువడి యంతంతఁ జెచ్చు పెరుఁగ ... భీమ.
4. 61.

క. కావున నీమహనీయ, గ్రావంబున నంటు వడ్డ
క్రతు సైంధవ మిం,కేవిధమున విడువిడిచను,
నావిధ మెఱిఁగింపవే దయానిధి యనినన్.
శై. భా 4. 84.

విడూరజము సం వి అ న. వైడూర్యము, రత్న
భేదము

విడెము=విడియము, వీడ్యము వి (సం. వీటికా)
తములము.

మ. . రెండుమూఁడు విడేలాకులు పోకకాలి
విడివాటు న్గోడెలై తక్కటీ, భవన ప్రాంగణ
సీమఁ ద్రిమ్మరుదురు రంభః కుంభ చేటీవిటుల్ ....
వైజ. 2 41

గీ. పొసఁగ విడెమీయ శతపత్ర పూగహారి...దశా.
2. 128.

సీ . మిత్ర బిందకుఁ బుక్కిటి విడె మొసంగి ...
ఉ. రా 1 44.

విడ్చు=విడుచు స క్రి (√ విడు) విడఁజేయు.

సీ ..దుర్భ్యాసమందు, నెట్టిన ద్రౌపది గట్టిన
పుట్టంబు సభలోనవిడ్చెనాశంక లేక భార.
సభా 2 281.

చ. జనులు నుతింపఁగా సుకృత సంపదఁ జేసి యమర్త్యశాపముం, గనియును జెంద కిట్టునికి కార్యమె ద్రౌపది భీమసేను నర్జునుఁ గవలం ద్యజించుటకు సువ్రత చాకిరి చాలవయ్యె దీ,కువ కము విడ్వ నిత్తెఱఁగు సూరినుతుం డగు నీకు నర్హమే. భార మహా 56

ఉ ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెంట్రుకల్, దా వల చేతఁ బూని . భార ఉద్యో 3. 114

**విడ్డూరము** వి (సం. విడ్వరః) 1 మౌర్ఖ్యము. (శ. ర)

2 ఉపద్రవము.

ద్వి. విడ్డూరములు వచ్చె వేగ ప్రాణమున,కు ... పల్నాటి వీరచరిత్రము 338 పం. ద్రా

విణ మూర్ఖము. (శ. ర)

**విడ్గ్రహము** సం. వి. అ. పుం. మలబంధము, ఒక విధ మగు రోగము

**విడ్పి(డిపి)ంచు** స క్రి. (√ విడుచు) విడువఁజేయు, వదలించు.

శా. . గం,ధర్వున్ దర్పితుఁ జిత్రసేను ఖరునిన్ దండించి విడ్పించె .. రాఘు. 3. 117.

**విడ్పు**=విడుపు (విడుచు) విమోచనము. భార. అను. 1. (శ. ర.)

**విడ్యము**=విడియము, విడెము, వీడ్యము. వి. తమలము, తాంబూలము.

క. తెలనాకులు బాగాలును, నలమిన పెనిమిటులఁ గూర్చి వైయెదుర యెలనా,గల కెల్లనిడిరి విడ్యా ముమ్మలు దగ నప్పుడమితేఁడు ముదితయుఁ గడఁ కన్. యయా. 4 119.

సీ. వలపుఁ గప్రపు విడ్యముల వెన్నెల బయళ్ల సైకతములఁ జల్వచప్పరముల ... కవిరా. 4 15

క. కావున మీరు దలంచిన, శ్రీవారాహంబు మంచి కృతిమాపేరం, గావింపుఁడనుచు సుముఖుం,డై విడ్యముఁ గప్పురంబు నర్పించుట యున్. వరాహ 1. 14

**విడ్లవణము** సం వి. అ. న. వైద్యమునకుపయోగిం చెడి యుప్పు.

**విడ్వఁబడు** (√ విడ్పు) స. క్రి. విడువఁబడు.

గీ. రమణియవశముచే నైన రామనామ, మమర వర్తింపఁ బడుచుండ నఖిలపాత,కములచే విడ్వఁ బడుఁజుమ్ము సుమతి యపుడె, సింహమతి భీత మృగములచేతఁ బోలె. సీతారా. 1. 58.

**విడ్వరము** సం వి. అ. పుం ఉపద్రవము.

**విడ్వరాహము**=విట్చరము సం. వి. అ. పుం.

**విడ్వఱచు** (విడు+పఱచు) స. క్రి తారు మారు చేయు, మార్చు.

క. ఆ రసికుఁ డెఱిఁగి వచ్చిన, నీ రీతుల నడుమఁ గలిసి యెఱుకఁపడఁగమా, చీరలు విడ్వఱచి తిమి వి,చారింపఁగ నేల నాదు జయమగుఁ గాదో. రాధా. 11. 56.

**విత**=వితా వి॰ (సం. వృథా) వ్యర్థము (దీని యా మ్రేడితరూపము "వితవిత")

క. అతివల హృదయముతారసి, రతికలనన్ దేల్ప లేని రట్టడికూపున్, జతురతయు జవ్వనంబును, వితయ చుమీ యడవిఁగాయువెన్నెల రీతిన్. కళా 3. 73

క. కొడుకులు పుట్టని మానిసి, తొడుకులు బల్మి యును నిండ్లుఁ దొడవులు మావుల్, పుడమియు నెక్కుడు మెకములు, విడిముడియుం బట్టము లును వితగద తలఁపన్. ఆ రా. బాల 50.

గీ. వారితో నది యోయన్నలార కంట్,రా వితవితగ నన్నింత బట్టుసేసి, తానె తొత్తుల కాంతమదంబుకతన, నిల్లుపట్టక తిరిగెడు నివ్విధమున. శుక. 2. 138.

**వితండ** సం. వి. ఆ. స్త్రీ. 1. నిరాధారమైన వాదము, శుష్కవాదము. 2. (తర్క.) ప్రతిపక్ష స్థాపనములేని జల్పము స్వపక్ష స్థాపనములేని పరపక్ష నిరాకరణ రూపవాదము. 3. కోపమును బుట్టించెడి విమర్శనము. 4. గలిజె 5. పొంగ్రాణి. 6. గన్నేరు. (వృ. వి.)

**వితండము** సం. వి. అ. పుం. 1. ఏనుగు. 2. తలుపు గడియ.

**వితండావాదము** సం. వి. అ. పుం. స్వపక్ష స్థాపనము లేక పరపక్షమును ఖండించు వాదము; అడ్డదిడ్డపు వాదము.

(ఈ యర్థమునఁ దెమఁగునను ప్రయోగము గన్పడు చున్నది.)

క. ఉండుడు మీరిచ్చోట వి,తండా వాదములు మాని తాలిమితో ని,ట్లుండంగ నోపరేనియుఁ, బొండిప్పుడు నిజనివాస భువనంబులకున్. వరాహా. 1. 14.

**వితంతువు** సం వి ఉ పుం. మంచి గుఱ్ఱము, స్త్రీ ముండమోపి, విధవ.

**వితంత్రి** సం వి ఈ స్త్రీ తంత్రులు (తీఁగలు) సరిగాఁ బొసఁగని వీణ

**వితంసము** సం వి అ పుం 1 పిట్టగూడు. 2. పక్షులను మృగములను బంధించుట కుపయోగపడు త్రాడు మున్నగు సాధనము.

**వితతధన్వుఁడు** సం విశే. (న్.) ఎక్కుపెట్టఁబడిన విల్లుగలవాఁడు.

**వితతము** సం. విశే (అ ఆ. అ) 2. వ్యాపించినది, విస్తరించినది. 2. పొడిగింపఁబడినది, సాగఁదీయఁబడినది, విశాలమైనది. 3. ఆచరింపఁ బడినది. 4. కప్పఁబడినది 5. చెదరినది, వీణ,తంబురా మున్నగు తీఁగలు గల వాద్యము, తతము.

**వితతి** సం. వి. ఇ. స్త్రీ 1. వ్యాప్తి, వ్యాపనము. 2. సమూహము, గుంపు. 3. పంక్తి, వరుస.

**వితథము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అసత్యము, నిజము కానిది. 2. వ్యర్థమైనది, నిష్ప్రయోజనమైనది.

**వితథ్యము** సం. విశే. (అ. ఆ. అ ) అసత్యము, నిజము కానిది.

**వితనువు** సం. విశే (ఉ.) 1. సుకుమారుఁడు.
2. మందరుఁడు (ఆ. ని.)
3. శరీరము లేనివాఁడు.

**వితమరి** విశే (వితము+అరి) కార్యదక్షుఁడు, కార్య పద్ధతి నెఱిఁగిన వాఁడు, పొలమరి.

కళిక. ... నటిమి తటిమి చటిమి మఱుము నద్రు గెల్చిన వితమరికిఁ గఱచి బిఱచి యఱచి పఱచు కపిని జంపిన నచ్యుతునకు... అప్ప 4. 327.

**వితము** వి (సం. విధా.) 1 విధము.

గీ. వెల్ల గొడుగులు వట్టించు వితము మించు, నంచగమి నిల్పియాడెఁ జా లగుచు దివిని. ఘటికాచల. 2 124.

ద్వి. ప్రతిమీఱు సంకల్ప తవకల్పలతిక, వితముగ నతులిత విక్రమోన్నతియు ... విష్ణు. ఉ. 4. (శ ర.)

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, నచ్చుగఁ దొడఁగిన వితాన నబలపయి నీ్మ,కెచ్చుగఁ గోపంబిటులా, వచ్చునె తపై ్వనపై సవలయు నటంచున్. కళా. 4. 21.

సీ. తెలుఁగు చందము పగిది విత మనంగను మీఱుచు నుండుఁ బ్రకారసంజ్ఞ . . అం. భా. 2. 308.

2. ఉపాయము.

చ ... ఉరువ్యాఘ్రకరా, సతమొక వృద్ధవిప్ర మిథునంబు మృతుండగు పిన్నపాపనిన్, విత మఱి కొంచు వచ్చి రమువీరుని వాకిట వైచి దీనతన్ ఉ రా. 7. 181

జ వితమరి.

**వితరణము** సం వి అ న. దానము, ఈవి

**వితరణి** సం వి ఇ పుం దాత, ఈవికాఁడు. విక్ర. 2 (శ ర.)

**వితర్కము** సం వి. అ పుం 1 యుక్తులతో నాలోచించుట. 2. ఊహ, ఆశయము, అనుమానము చేయుట 3. తలంపు, అభిప్రాయము 4. సంశయము, విచికిత్స 5. సమీక్షణము, పర్యాలోచనము.

**వితర్కించు** సం న క్రి 1 సంశయించు

క పలుమాఱుఁ గాంచు తమూజుల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బదియుం, దెలియంబలికెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా భార. ఉద్యో 2 318.

**వితర్కుఁడు** సం. వి. అ. పుం. జ్ఞానోపదేశకుఁడైన గురువు.

**వితర్ది** సం వి. ఇ. ఈ స్త్రీ. 1. వేదిక, అరుఁగు, తిన్నె 2 మేడ ముందరి వసారా.

**వితర్దిక**=వితర్ది సం. వి. అ స్త్రీ.

**వితలము** సం. వి అ. న. సప్త పాతాళలోకములలో రెండవది.

**వితస్తి** సం. వి ఇ. పుం. జేన, పన్డ్రెండంగుళముల పరిమాణము

**వితా**=విథ (సం. వృథా) విశే వ్యర్థము.

చ. తపముల పాలి మృత్యువులు దైత్యులు వీరల నున్న వాళ్లకుం, దపమని చేయఁగూడునొ వ్రతంబని పట్టఁగ శక్యమో వితా, యిపుడిది యేటి యత్నము వహించె వివేక విహీనుఁడైన యీ, నృపముని యంచుఁ గౌశికుపయిం గడు నేరము లెంచు వారలున్. చంపూరా. 2. 84.

**వితాకు** వి 1. సంతాపము

చ. ... కృతి సంతతి కన్యక కెన్న యోగ్యుఁడౌ, ధవుఁ డొకరుండు లేమికి వితా మదిలోన వితాకుఁ జెందుచున్ ... ఘటికాచల 1. 14

2. పరాకు.

చ. కదనము సేయవచ్చి భయకంపిత గాత్రుఁడవై వితాకుఁ జే,సెద విదియేమి రాత్రిచరశేఖర... ఉ. రా 4. 12

సీ. ఈ వితాకున మేత లుడనై తిఁగా త్రోది గొర వంక కనుచుఁ దావరిగె నొకతె ... (శ ర.) యయా. 5 22.

3 పారవశ్యము.

చ గదె తడ వాతఁ డొక్కపనిగాఁ జనియింటికి రాకయుండినన్, దడఁబడు మీఁదెఱుంగదు వితాకున నుండును జిన్నవోవు .. శశాం. 2 78.

4 నిశ్చేష్టత. (శ ర )

విశే 1 పరవశుఁడు.

క. అనియిటు లుర్విశ్యూరెడు, మనమునఁ గొని యాడి యంతమాపటివేళం, గనుఁ ద్రామి చొక్కుఁ జల్లిన, యమువున నందలు వితాకులై యుండగన్ ... విజ. 1. 188.

2. నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు.

చ. సొరుగుమ సొమ్మసిల్లు మదిఁజొక్కు వితాకగు .. ఇలా. 3 (శ. ర.)

జ: వితాకుఁడు, వితాకుపడు, వితాకురాలు, వితాకులవిత్తు.

**వితాకుఁడు** విశే. (√ వితాకు) నిశ్చేష్టితుఁడు.

శా మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదములేదు నిండు సభలో నొక్కింత మాత్రంబు హే,మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాత లీసాములే, లా హీనాధిక భావముల్ తడవరాదంచున్ వితాకుండనై వరాహ 10. 8.

క. అనిచెప్పి వారిధారల్, గనుదోయిం జెమ్మగింపఁగా నలుదిక్కుల్, గనుఁగొనుచు వితాకుఁడనై, చననేరక యుంటినన్ని శాసమయ మునన్. వేం పంచ. 4. 103

వ. ఇట్లు మూర్ఛావివశుఁడై నేలవ్రాలియున్న యన్నరనాథ కుమారుఁగొని పోవువాఁడై వాన వారి తేరుడిగి యెత్తంబోయి తద్రథకంబై విష్ణుతేజంబున్న కతంబునఁ గదలింపలేక వితాకుండై తనలోన .... రామా. 8. 121.

**వితాకుపడు** అ. క్రి (వితాకు+పడు) నిశ్చేష్టితుఁడగు (శ ర )

ఉ. అక్కట వేటలాడుచు హయంబు రయంబునఁ దోలుకొంచుఁ దాఁ, గ్రక్కున నొక్కపంది వెనుకం జని మార్గముతప్పి క్రంపలం, జిక్కి మదిన్ వితాకుపడి చింత మునుంగుచుఁ బండ్లు గోయఁగా, నొక్కెడ దేవదత్తుఁ గని యూరికి నేఁగెదు త్రోవ వేడినన్. ద్వా. 3 21.

**వితాకురాలు** వి (వితాకు+ఆలు) నిశ్చేష్టితురాలు

చ. . అలనత దీఅ నిద్రఁగనసంచుఁ దలంచి వితాకురాలగున్ ... కువల 3 79.

చ భయపడి లేచి లే యదురు పాటునఁ గట్టియుఁ గట్టకున్న నీ,వియు నెలవంక చన్మొనల వేసియు వేయని పైట కొంగుదోఁ,పియు నటదోఁపకున్న యల పెన్నెఱి కొప్పునునై వితాకురా,లయి యవిచూచి యల్లలన యల్లలనాడు మనంబు లోడుతన్. సారంగ 3 153.

**వితాకులవిత్తు** వి సంతాపబీజము, పరితాపకారణము.

ఉ ఇప్పుడు నా మనోరథములెల్ల వితాకులవిత్తు చేసి యీ,తప్పులు వెట్టెదేమిటికిఁ దక్కఁ దలంచెద వెన్ని చెప్పినన్ .... వి. పు. 2 229.

**వితానకము** సం వి అ పుం. న 1. వైశాల్యము, విరివి 2. సమూహము, గుంపు. 3. మేలుకట్టు, చాందిని. 4. మాదవృక్షము.

**వితానము** సం. విశే. (అ. అ. అ ) 1. వట్టిది, శూన్యము 2. నిస్సారము, సారములేనిది 3 భంగము గలుగఁ జేయఁ బడినది, దిగులు చెందినది 4 తెలివిలేనిది. 5. దుష్టము, మూఢము, దుర్మార్గమైనది.

వి. అ. పుం. న. 1. వ్యాప్తి, వ్యాపించుట. 2.మేలు కట్టు, చాందిని. 3 తలగడ, మెత్త, దిండు. 4. సమూహము, గుంపు. 5. యజ్ఞము. 6.అగ్ని హోత్రకుండము, అగ్నిహోత్రవేదిక. 7. అవసరము, అదను తఱి.

న. 1. తెలుపి, అవకాశము.

వితావిత విజ. మిక్కిలి వ్యర్థము ("వితా' యొక్క ఆమ్రేడిత రూపము.)

ఉ పరోకటబ్బె రాముడను నెద్దు హొసంగవు, చంద్రమః కళా,ధారికి నొక్కయెద్దది వితావిత పేరములేమి . శశాం 2. 20.

చ. ... సంతస మందిన వారుచూడనీ, ధమవును వీరి ముచ్చట వితావిత సేయకుమన్న . . దశా. 7. 199.

ఉ. ... భూ.పాలక యింటివారిడిన బాముల రచ్చలకెక్కినంతయే, చాలద యింకమీఁదను నిజంబుగ రట్టున కోర్చు నంతకుం, దాడునె యీ శరీరము వితావిత యెక్కుడి జోలి యక్కటా. శుక. 4 63.

క్రి. విజ. మిక్కిలి వ్యర్థముగా.

చ. తడఁబడు మాటగద్గదిక దార్కొను నిల్చినచోట నిల్వరా,దడుగులఁ దొట్రుపాటు గదియంబడుఁ గంపముచెందు నిద్రరా,దెడపని కోర్కెహెచ్చు మదినేమొ వితావిత జాలి జాలియో, నడిగినఁ జెప్పఁగూడ దకటామరు లెత్తిన యాఁట దానికిన్ కువల. 3, 100.

గీ వేలకన్నులఁ గెంపుంచనేల మఱియు, మొర యనేల వితావిత ముదితలార ... చంద్రా. 4 196

చ. ముసుఁగిడి పండియుండుమని మోహముతోడ వితర్దిఁ జూపితా, మసురసు రంచుఖన్నయయి యొయ్యనవేగి కవాట మవ్వలన్, బెనబెనఁ ద్రోచి మూఁటఁ దలఁబెట్టుక వచ్చిన భర్తకింత సాధ్వస మొదవంగఁ జెప్పవిని వాఁడు వితావిత యేమియం చనన్. హంస. 4. 113

వితీర్ణము నం విజ (అ అ అ ) 1. దాటఁబడినది, అతిక్రమింపఁబడినది. 2. ఇయ్యఁబడినది, దానము చేయఁబడినది. 3. దిగినది, అవరోహించినది. 4 కొనిపోఁబడినది, తీసికొనిపోఁబడినది. 5 లోఁబఱుచుకొనఁబడినది.

వితీర్ణి నం వి ఇ స్త్రీ ఈవి, వితరణము. (శ. ర )

వితున్నకము నం వి అ. న 1. కొత్తిమిరి 2. మైలుతుతము, తుత్థము

పుం నేలయుసిరిక

వితున్నము నం. వి. అ న 1. కూరాకు (వృ వి.) చెంచలి కూరవంటి యొక మొక్క 2 శైవాలలత, నాఁచుతీఁగ

వితుష్టము నం. విజ (అ ఆ అ ) అసంతుష్టి పొందినది, సంతోషింపనిది.

వితృష్ణము నం విజ (అ. అ అ ) తృష్ణలేనిది, ఆసలేనిది, తృప్తినొందినది

విత్త[1] వి చిహ్నము

ద్వి అజమత రామానుజార్యసిద్ధాంత, విజయ ధ్వజంబుల విత్తయై మిగులఁ, దళుకొత్తుచుండు త్రిదండముల్ దాల్చి ... ద్వి పరమ 8. 642 పొ

విత్త[2] వి మిక్కిలి చిన్న గోనె

సీ ... అత్యల్పగోణియై యలరు విత్తయనంగ. అం. భా. 2. 266

క చిత్తజుచేఁ దలిరాకుల, విత్తైతన ధైర్యమెల్ల వెడలనడిచియా మత్తేభగమన మిగులం, దత్తరపడి సమ్మదమునఁ దమకించుటయున్ ... వి పు 6. 24.

విత్తదుఁడు నం వి అ. పుం 1 ధనదాత 2. ఆస్తి నిచ్చినవాఁడు, ఉపకారి.

విత్తనము వి. విత్తు, బీజము

గీ. విప్రవరునకుఁ దూమెడు విత్తనముల, నేల యొసఁగిన ఫలము వర్ణింతు వినుము ... దశా. 5. 100.

గీ. . . బీజాఖ్య పరఁగువిత్తు, విత్తనము గింజ గిజ రన వెలయు నీళ ... అం. భా 2 39.

విత్తము నం విజ (అ ఆ అ ) 1. కనిపట్టఁబడినది, కనుగొనఁబడినది. 2 లబ్ధము, పొందఁబడినది. 3. పరీక్షితము, పరిశీలింపఁబడినది 4 ప్రఖ్యాతము, ప్రసిద్ధికెక్కినది

వి. అ. న. 1. సొత్తు, ఆస్తి, ధనము. 2. శక్తి, బలము.

**విత్తవంతుఁడు** సం విశే. (క్. వతీ క్) ధనవంతుఁడు, ఆస్తిగలవాఁడు

**విత్తవర్ధనము** సం విశే (అ అ. అ) ధనమును వృద్ధి చేయునది, లాభకరమైనది, ఆదాయము కలిగించునది.

**విత్తాగమము** సం వి అ. పుం ధనలాభము, ధనప్రాప్తి.

**విత్తి** సం వి ఇ స్త్రీ 1 జ్ఞానము, తెలివి 2 విచారము, ఆలోచనము. 3. సంపాదన, గడించుట, పొందుట.

**విత్తించు** స క్రి (√ విత్తు) విత్తనము నాటించు

గీ విరివిగాఁ బైరు విత్తించు వేళ్లఁగొలుచు, గాఁగ మామకసస్యముల్ గడుఫలించు ... వేం. పంచ 5. 13.

**విత్తిడు** అ క్రి (విత్తు+ఇడు) విత్తులు చల్లు.

క క్షేత్రమెఱిఁగి విత్తిడుటయుఁ, బాత్రమెఱిఁగి దాన మిచ్చి పనుచుటయు వివేక, క్షత్రాణ పరాయణులకు, ధాత్రీశ్వర యిందువందుఁ దగ మేలొనఁగున్. వి పు. 5. 130

**విత్తు** స. క్రి. (విత్తనములు) చల్లు.

సీ. పెంచంగఁ బెరిఁగె నావృత్తిపైఁ గొండలు విత్తిరాయడవుల వివిధగతుల.. నీతిసీ శ. 60.

ద్వి. త్రొక్కినచోటెల్ల దున్నకపండ, దిక్కులంబసిఁడి విత్తిన పైరుగాఁగ ద్వి పరమ. 3. 182 పా

ఆ పూర్వజన్మమందుఁ బుణ్యంబు సేయని, పాపి ధనముకాశ పడుటయెల్ల, విత్తమఱచి కోయ వెదకిన చందంబు, విశ్వ .. వేమ 1 44.

ద్వి. మామిడివిత్తుదా మహిమీఁద విత్త, వేముగునే పెక్కువిధు లెలచెప్ప . బస పు (ప్రాత ప్రతి.) 1 261 పం

వి. విత్తనము

గీ. విత్తు సహకారి గాకున్న రిత్తనేల, వంధ్యముగుఁ గాక తా ఫలవంతమగునె ... భార. అను. 1 136

గీ. తవరిహేమంత మగుడుఁ బరమ్ంబు లడఁగి, పోయెఁబోయినఁ గొలహొక్క పువ్వుతనకు, ధ్విత్తుగా ధాఁచికొనియున్న విధముపోలె, శైలసుత ముఖముదక వాసమున నొప్పె కు. సం. 6. 783.

విత్తఁదగు=సమూల నాశనమగు

ఉ. .. ... నీ, వేఁడిమి చూపియూథపుల విత్తఁదగందును మాడిపైపు .. భా రా యు 783

జ విత్తించు, విత్తిడు, విత్తుపట్టు, విత్తుమాల్చు.

**విత్తు** సం వి క్ స్త్రీ దీనికిఁ బ్రత్యేక ప్రయోగము లేదు

1 జ్ఞానము 2. గ్రహణశక్తి, తెలివి.

**విత్తుపట్టు** వి (విత్తు+పట్టు) సస్యములు ఫలించు పొలము

వ. ... చెఱువు దక్షనామున ముప్పదిపుట్లు విత్తుపట్టు సర్వాకర పరిహారముగా శ్రీచోడ గంగ్గ దేవరిచ్చి . దా. శా. 1015.

**విత్తుమాల్చు** స క్రి (√ విత్తు) చంపు, కడతేర్చు.

గీ. చటులగతిఁ గొన్ని కణుజుల సంహరించె, వెంటఁబడి కొన్ని శశముల విత్తుమాల్చెఁ, గొన్ని జింకల ప్రేవులు గ్రుచ్చివైచెఁ, గుక్క లాఖేటకంబున నుక్కుమిగిలి పి శకుం. 2. 15.

**విత్తేశుఁడు** సం వి. అ పుం. కుబేరుఁడు.

**విత్రాసము** సం వి అ. పుం భయము, వెఱపు

**విత్సనము** సం. వి అ పుం. వృషభము, ఎద్దు.

**విధుర** సం. వి. ఆ స్త్రీ విధవ, ముండమోపి.(శాచ)

**విధురుఁడు** సం. వి అ పుం. 1. రాక్షసుఁడు. 2. చోరుఁడు

**విద** సం వి ఆ స్త్రీ 1. జ్ఞానము. 2. గ్రహణశక్తి

**విదంశము** సం వి. అ పుం దప్పి గలిగించెడి కారము గల యాహారము

**విదగ్ధ** సం వి. ఆ. స్త్రీ చాతుర్యమును, చులుకుఁదనమును గల స్త్రీ, చమత్కారిణి.

**విదగ్ధము** సం విశే. (అ అ. అ) 1 ఎక్కువగా దహింపఁబడినది, తగులఁబెట్టఁబడినది. 2 వండఁబడినది 3. అఱిఁగినది, జీర్ణమైనది. 4. నశింపఁ జేయఁబడినది, ధ్వంసము చేయఁబడినది 5 వాఁడియైనది, చురుకుఁదనము గలది, నేర్పుగలది, 6 జిత్తులు గలది, కపటముగలది. 7. తగులఁబడినది. 8 జీర్ణము కానిది, అఱుఁగనిది. 9 మనోహరము, ఇంపైనది 10. గౌరవార్హమైనది. (వేమము.)

**విదగ్ధుఁడు** నం. విశ (అ ఆ. అ) నేర్పరి, చతురుఁడు, నిపుణుఁడు. 2 కపటియైనవాఁడు, జిత్తులుగల వాఁడు.

వి. అ. పుం. 1. పండితుఁడు, విద్వాంసుఁడు, 2. దుర్ణయము గలవాఁడు, పొగరుఁబోతు.

**విదథుఁడు** నం. వి. అ. పుం. 1. కృతి, ధన్యజీవి. (మే ని) 2 యోగి, విద్వాంసుఁడు (అ ని.)

**విదరము** నం వి అ పుం. 1. చీల్చుట, భేదనము. 2. వృక్షము, చెట్టు

విశ (అ అ అ) భయరహితము, భయములేనిది. (వాచ.)

**విదర్భ** నం వి. అ స్త్రీ ఒక పట్టణము.

**విదళితము** నం. విశ. (అ ఆ. అ) 1. మిక్కిలి ఖండింపఁ బడినది. 2. మిక్కిలి భేదింపఁ బడినది.

**విదర్భజ** నం. వి. అ. స్త్రీ. విదర్భ దేశపురాజు కూతురు. 1. దమయంతి. 2. లోపాముద్ర, అగ స్త్యుని భార్య 3 రుక్మిణి, కృష్ణుని భార్య. (ఇట్లే విదర్భతనయ మొ)

**విదర్భము** నం. వి అ పుం ఇప్పుడు బేరారని వ్యవహ రింపఁబడు దేశ విశేషము 2 నిర్జన ప్రదేశము, జనులు విడిచిపోయిన దేశము.

**విదర్భసుభ్రువు**=విదర్భజ నం వి. ఈ స్త్రీ

**విదర్భుఁడు** నం. వి. అ పుం. విదర్భ దేశపు రాజు. బ విదర్భదేశ నివాసులు.

**విదలనము** నం వి అ న. చీల్చుట, బ్రద్దలుచేయుట.

**విదలము** నం. విశ. (అ అ అ) 1. చీల్పఁబడినది, బ్రద్దలు చేయఁబడినది. 2. (పువ్వు) వికసించినది, వికసించినది.

వి. అ పుం. 1. విడఁదీయుట, ఎడఁబాపుట. 2 చీల్చుట. 3. భక్ష్యము, పిండి వంటకము. 4 అడవికోవిదారము.

న. 1 బద్దలతో నల్లిన పాత్ర, వెదురుబుట్ట. 2. దానిమ్మచెట్టు పట్ట, 3. రెమ్మ, ఉపశాఖ. 4 ముక్క, చెక్క. 5. కందిగింజ మొదలగువాని బద్ద.

**విదళించు** నం న క్రి 1. చీల్చు, భేదించు, పగులఁగొట్టు.

క. విదళింప నలుకు సింగపుఁ, గొదమయు మద ఘళిత గండ కుంజరములపై, నిది బలశాలికి నైజము, గద తేజోనిధికి వయసు కారణ మగునే. భర్త 1 31

సీ. విటుల గుండెలలోన విదళించు చిగురాకు నంపెట ప్రేకెండు సమసె నేఁడు . . వీర. 2. 118.

2. నలుకు, ఖండించు.

సీ కలుషంబు విదళింపఁగల ధర్మశాస్త్ర ప్రపం చంబు లెవ్వాని పలుకుఁ బళ్లు వరాహ 1. 9.

చ కడఁగిన వీరుఁ దారసిలి ఖడ్గముచే విదళించి పొచ్చుటో కృష్ణాభ్యుదయము. (ప్రౌ.)

**విదారకము** నం. విశ (అ టికా అ)

వి అ పుం 1 చీల్చునది, విభాజకము, విభజించు నది. ప్రవాహ మధ్యమునమన్న వృక్షము లేక పెద్దఱాయి 2 చెలమ, ఎండిపోయిన యేటిలోఁ ద్రవ్విన గుంట.

న. 1. జలబంధనము, ఆనకట్ట 2. చవుటిపేల.

**విదారణము** నం వి అ. పుం 1. ప్రవాహ మధ్య మునమన్న చెట్టు, పెద్దఱాయి, బండ 2. కర్ణికార, కొండగోఁగుచెట్టు 3 యుద్ధము

న 1 చీల్చుట, పగులఁగొట్టుట 2 బాధించుట, హింసపెట్టుట 3 చంపుట.

**విదారము** నం వి అ పుం 1. చీల్చుట, పగులఁ గొట్టుట, ముక్కలు చేయుట 2. యుద్ధము 3 నది, చెఱువు మొదలగువానియం దెక్కువగా నుండు జలము పొర్లి పాఱుట, జలోచ్ఛ్వాసము.

**విదారి** నం వి ఈ. స్త్రీ 1. గజ్జలోనివాపు (అ ని) 2. శాలపర్ణి, ముయ్యాకుపొన్న. 3 భూమి కూష్మాండి, నేలగుమ్మడి. (వృ వి) 4. కంఠరోగ విశేషము, గొంతులోఁ బుట్టెడి యొకానొకరోగము. (వాచ.)

**విదారించు** నం న. క్రి చీల్చు, బ్రద్దలుచేయు.

మ. ... ... అశ్వ విశాలోదర పార్శ్వములన్ కరటి హస్తంబుల్ విదారించి యుయ్యనరణ్యా ధిపు పేనగాడుపుల రణ్యావనిన్ బలెన్ గూల్చి నన్ . . ఉ రా 3. 161.

**విదారిగంధ** నం వి. ఆ. స్త్రీ. ముయ్యాకు పొన్న. (వృ. వి.)

**విదారువు** నం. వి ఉ. పుం. ఊసరవిల్లి, తొండ.

**విదాహము** నం. వి. అ. పుం. 1. కాలుట, తగులఁబడుట. 2. జ్వాల, పెద్దమంట. 3. తైక్ష్ణ్యము, వాఁడిమి.

**విదాహి** నం. వి. న్. పుం. దాహమును (అత్యుష్ణమును) పుట్టించెడి పదార్థము.

**విదాహించు** నం. అ. క్రి తాపమునొందు

వ. ఇట్లు మోహావలంబున దేహంబు విదాహింప నయ్యుర్వీ గీర్వాణుఁడు చలిత వియోగి ప్రాణుండగు పంచ బాణుం దలంచి . వేం. పంచ 4 250.

**విదిక్కు** నం వి క్. స్త్రీ మూల, రెండు దిక్కుల నడిమిభాగము.

**విదిక్కుపడు** మి అ క్రి దిగ్భ్రమ చెందు

సీ. నామాట కుల్కి మిన్నక కాలభైరవుం డేలోను నిద్దఱ నిట్లు ద్రుంచె, నింక నెందఱఁ బంప నెంచినాఁడో యని విడిచి కన్కని గుడివెడలి పాఱి.

గీ. రేను నామాట పర్యాయంబుగా నొవర్చి వాసి నిలిపి నంత నెవ్వారలైన, ముక్కఁ బనుదెంచి కాంచి విదిక్కు పడుచు, వెడలి మఱి చూడరిట వెరవేఁకి పట్టి. ద్వా 4 70

**విదితము** నం విణ (అ ఆ అ.) 1 తెలిసినది, బోధపడినది. 2 తెలుపఁబడినది. 3. ప్రసిద్ధి కెక్కినది, ప్రఖ్యాతము 4 కోరఁబడినది, ప్రార్థితము 5 అంగీకరింపఁబడినది. 6 వాగ్దానము చేయఁబడినది 7 యుక్తము. (ఈ యర్థము సంస్కృత గ్రంథములందుఁ గానరాదు )

క అది గావునఁ గార్యార్థము, మదవ గురుని కడకు నిపుడు మన మూరకపో, విదితముగా దె తెరవన, ముదితయుఁ దనవిభుని వాక్యములకు వెఱచున్ కుచేల 1. 112

వి అ న 1 ఎఱుక, జ్ఞానము 2 ప్రసిద్ధి, ప్రఖ్యాతి 3 లాభము, ప్రాప్తి. 4 అంగీకారము ఒప్పుదల

**విదితుఁడు** నం వి. అ పుం పండితుఁడు, చదువరి.

**విదియ** వి. (నం. ద్వితీయా) పక్షమందు రెండవ తిథి.

గీ. విదియ నాఁడేరు వడకున్నఁ దదియనాఁడు, కావఁ బడియెడు పనికింత కనల నేల... యయా. 5, 9.

సీ. వర్ష గర్భము నదవకపోయె విదియలఁ గుము దాప్త దారణ కొమ్ము దట్టిగె .. కాశ. 3. 149.

**విదిలించు** న. క్రి (√ విదులు) 1 జాడించు, చలింపఁ జేయు.

సీ. అలవోక వోలె వాలాగ్ర మొకించుక విదిలించు నంత వవ్విహాగ విభుఁడు ... సమీర. 6. 169

క ఆ నీరు సోఁకి మాయాశ్వేధనువు కా నిద్ర పోయి తెలిసిన పగిదిన్, మేను విదిలించికొంచును, మౌనులు వెఱగంది చూడ మగువయగు తఱిన్. వరాహ. 10 60.

2 జాడించు, కడుగు, శుభ్రము చేయు.

ద్వి. వీఁకతో నలికిన విత్తులు నీళ్ల, విదిలించుకొని వచ్చి వేఁపి దంపించి . . బస. పు 4. 970. పం

3 విదుర్చు, వదలుచుకొను.

చ. విదువిదు పట్టరాకు మటివేణి యటంచును జాతి కెంపురా, కడియపుఁ గేలు ఘల్లు రవఁగా విదిలింప ... దశా. 5 24.

4 విదులుచు, దులుపు.

చ కంఠ గ్రక్కున విదిలించి యందుఁ బది కోటుల మాడలు రాలఁ దోపుగా . విక్ర. 2. 18.

సీ. వంకెల విదిలించి తాంబూల దళపూగ నివహంబుఁ జాలగ నించు మబ్బు .. ఆము 7. 7.

5. విదుర్చు, పోఁగొట్టు

వ . అఁకటఁ గటకటంబడి గ్రాసంబు వేఁడినఁ దెడు పురుపునుం బోలె విదిలించు వారలే కాని యాయాసం బెఱింగి రమ్మను వారు లేరు. (కసరికొట్టు అని భావము) శుక. 3. 187

**విదిలించుకొను** న క్రి (విదిలించు+కొను) దులుపుకొను, కదలించుకొను

క. అని శ్రీపతి యానతి యిచ్చిన మందల విడిచె వతని సిద్ధ విభుఁడు వాఁడును గులగులయై జావగ, లిపమై విదిలించుకొనుచు లేచెఁ గ్రిదుకుచున్. పాండు. 4. 297.

**విదిల్చు** న. క్రి. (√ విదులు) విదులఁ జేయు, దులుపు.

క తెక్కలు విదిర్చి లావులు, ముక్కుకొనందువ్వి. శుక. 1. 234.

**విదిశ** సం వి. అ స్త్రీ. 1. దశార్ణ దేశమునకు రాజధాని. 2. మాల్వదేశము నందలి నదీ విశేషము. 3 విదిక్కు, మూల, రెండు దిక్కులనడిమిభాగము.

**విదీర్ణము** సం విశ. (అ. అ. అ) 1. చీల్పఁబడినది, బ్రద్దలు చేయఁబడినది, ముక్కలు చేయఁబడినది, 2. తెఱవఁబడినది. విస్తరించినది

**విదుఁడు** సం విశ (ద్) (సమాసాంతమున) తెలిసినవాఁడు (వేద విదుఁడు మొ.)

వి ద్ పుం 1 బుధ గ్రహము. 2. పండితుఁడు, చదువరి

**విదురు**=విదులు అ. క్రి. (క. ర.)

(చూ. విదురుచు)

స · విదురుచు, విదుర్చు, విదుర్పు.

**విదురుఁడు** సం. విశ (అ. అ. అ) బుద్ధిమంతుఁడు, తెలివి గలవాఁడు.

వి. అ పుం. 1 పండితుఁడు, చదువరి. 2. యుక్తులు గలవాఁడు, కుట్రలు పన్ను మనుష్యుఁడు. 3. పాండురాజు తమ్ముఁడు, కౌరవులకు మంత్రి.

**విదురుచే**=విదుర్చు స. క్రి. (√ విదురు) విదురఁజేయు, విదిలించు

క. కప్పుంగొప్పులఁ జన్నుం,గప్పుల మొగముల నొదల్లఁగప్పిన మెఱుఁగుం, బుప్పొడి విదిరిచి కొవి మఱి, యప్పడఁతుక లరిగి కప్రపఁటుల చెంతన్, యయా. 4. 28.

**విదుర్చు**=విదురుచే, విదులుచు, విద్రుచు, (√విదురు) స. క్రి 1. దులుపు.

గీ. రాలియున్న పుష్ప ప్రకరము విదిర్చి, తెన్నుగా నున్నచేసిన సెజ్జయనఁగ, వేఁగుటయుఁ జుక్కలన్నియు విరిసి విశద, కాతిఁ తెలువొందెఁ జూడ నంబరతలంబు. కార. విశా. 2. 289.

ఉ. ... పెన్నెఱుల్, వేమరుచేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులన్, గోమల లీలదువ్వి... పారి. 2. 10.

2. చలింపఁజేయు.

క. తలిరాకు మెఱుఁగు వాతెఱ, కలకంఠ విటుండు గమియఁగాఁ జాతలతా,లలన విదుర్చెను గంటివె, యలికంకణ ముఖర విటప హస్తముల నళీ పారి 3 49

చ . రసా, తలమువనుండి వెల్వడు నుదారత మేను విదుర్చ ... భాగ 3 485

ఉ. ... గ్రక్కున వారుపాటి మునుగంబడ నెక్కిన బిట్టుదూలి వ,ల్దిక్కులఁ గూల గాత్రము విదుర్చె వతండు మదద్విపా కృతిన్ ... భా రా. యు 940

3 ప్రసరింపఁజేయు

రగడ .. గొడిపె తింత్రిణీకులము విదుర్చెన్, వడ పిందె జనావళి వడఁ దీర్చెన్ ... బహు. 2. 18.

చ ... విస్ఫుట పటుదీర్ఘ నిశ్వసనముల్ బలితంపు శిఖల్ విదుర్పఁగా . . దశా. 2. 26

4. ఒసఁగు, ఇచ్చు

వ. అప్పుణ్యవంశంబు (శూద్రవంశంబు) ...విశ్వ విశ్వంభరా క్రీడనంబు దనకు విదుర్చిన పరమ శాంతి యంతరంగంబున సంతరించి నిఖల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె ... భీమ 1. 31.

5 తొలగించు, త్రోసివేయు,

సీ తన మ్రొక్కు కిముకఁ గైకొనక లచ్చి విదుర్పఁ బదనఖంబంటిన ఫాలతలము... దశా. 8. 145

6 జాడించు

సీ. స్నాతుఁడై మెయినీరుచేతఁ దొడయఁ జీర నార్చ వెంద్రుకలు విదుర్పఁ గూడదు ... మార్క. 3 233

7. విదలించు,

సీ. అమాధవి పరాగ మఱీరాగము మించఁ బఱ తెంచు కలకంఠిపై విదుర్చె ... వసు 1. 128.

**విదుర్పు(రుపు)** వి. (√ విదుర్చు) కదల్చుట.

వ. ఇట్లేయు నా నూతనందను విల్లు విదుర్పుదోఁపక గుడుసు పడుటఁ జక్రాకృతింబొలుచు నవల శిఖల చెలువుదాల్చి ... భాం. ద్రోణ. 4. 232.

చ. .... తెక్క విదుర్పు మున్నుగా, పడఁకుకొకాక శేష్టుడిగెఁ బతులు పతము జానువుల్ చొరక్... అము. 4. 118.

**విదులము** నం. వి అ. పుం. 1 ప్రబ్బలిచెట్టు. 2. నీటి ప్రబ్బలి. (వృ. వి.) (మే. వి.) 3 గోవరనము, బాలెంతబోలు. (ఒకదినుసు పరిమళముగల బంక)

**విదులు** స క్రి 1. విడుచు, త్యజించు.

క. పదియాఱువేల నూర్వురు, సుదతులు వెన మంద్రునీకు సొంపుగ భార్యల్, విదితంబుగ బహురూపుల, విదులక భోగింపు దొరవేడుకఁ గృష్ణా. కృష్ణ శ. 23.

1. రాలు. (చూ విదురుచు.)

జ విదిలించు, విదిలించుకొను, విదుల్చు, విదులుచు, విదుల్చుకొను, విదుల్చు

**విదులుచే(ల్చు)** స క్రి 1 దులుచు

చ .. పదములు జంఘలూరువులు బాహువులోలి వమర్చి త్రొక్కియున్, విదులిచియున్ నొగిల్చియుమ ద్రేసియు నొంచెవతండు ద్రేల్మిడిన్ .. హరి. ఉ 10 255.

2 ప్రసరింపఁజేయు.

సీ. విషము విదుల్చుచు వెన ఘన విముఖతఁ జముజాల వదిము లీ సారసములు ... రసి. 4. 52.

3. రాల్చు

ద్వి. ... ఆ తటినొక్క యుదుత ... అశ్చపు భక్తితోవట వార్ధి మునిఁగి, వచ్చితా నిసుకలో వడి బొరలాడి, తడయక చనుదెంచి తన మేని యిసుక, వడఁ గట్టపై .... విదుల్చె . రం. రా. యు. 315 పొ 23. పం

4. దులుపు

ద్వి జడలు వీడఁగఁగలాసములు విదిల్చి, మడిచి చంకలనిడి మరలి చూచుచును . ద్వి హరిశ్చ. పూ. 420. పం.

వ .. పరాగంబులు రాల్చుచుం బయ్యెదలు విదుల్చుచు ... కళా 6 225,

**విదుల్చుకొను** స. క్రి (విదుల్చు+కొను స్వార్థముస) దులుపు

క. కొలనెల సుధారసంబునఁ గలపోవఁగ నొరసి కడిగి కౌముదిలోఁ గ్రొమ్మెఱుఁగుల విదుల్చుకొనిపై, మెఱుఁగిడు వట్లొప్పునగజ మృదు నిటలరుచుల్ కు. సం. 3. 312.

**విదుల్పు(లుపు)** వి (√విదుల్చు) విదిలించుట విక్షేపణము.

వ .. జవంబులు రవంబులు వదుల్పులు విదుల్పులు వీకులు తాఁకులు .. భీమ 4. 60.

ఉ. పైటకు లాగులాడి కటిపై ఘటియించిన చేవిదుల్పులన్, బాటలి నీవికై పెనఁగిపైఁబడి చేతులు తట్టి వేఁతల, న్మీటుగ నాటఁ బట్టుబలిమిం గనమిం దగ దొట్టు కెట్టిపో,రాటము లాయెనాయవ కొయారి యెడాటములన్ హుటాహుటన్ పాంచాలి. 5. 20.

**విదువు** నం. వి. ఉ పుం 1. ఏనుఁగు కుంభస్థలము నడిమి భాగము. 2 నీటి గుబ్బము

**విదుషి** నం వి ఈ. స్త్రీ విద్వాంసురాలు.

**విధూనము** నం విణ (అ. ఆ అ) మిగుల బాధింపఁబడినది, హింసపెట్టఁ బడినది

**విదూరగము** నం. విణ (అ. ఆ ఆ) మిక్కిలి దూరముగా వ్యాపించునది, మిక్కిలి దూరముగాఁ బోవునది

**విదూరజము** నం వి అ. న వైదూర్యము, నవరత్నములలో నొకటి.

**విదూరము** నం. విణ (అ ఆ. అ.) మిక్కిలి దూరమున నున్నది, దవ్వున నున్నది.

వి. అ పుం వైదూర్యములు పుట్టెడి పర్వతము.

న. మిగుల దూరము, కడుదవ్వు.

**విదూషకుఁడు** నం. విణ. (అ ఈ అ.) 1 మలినముగాఁ జేయువాఁడు, పాడుచేయువాఁడు, చెఱచువాఁడు 2 దూషించువాఁడు, నిందించు వాఁడు 3. చమత్కారి, హాస్యముగా మాటాడువాఁడు.

వి అ. పుం 1. హాస్యగాఁడు 2. శృంగార నాయకుని సహాయులలో నొకఁడు.

(ఇతఁడు తన రూపము పని వేషము భాష మొదలగు వానిచేత నెల్లరకు నవ్వుఁ బుట్టించుచుఁ తన పని నెఱవేర్చుకొనెడి స్వభావము గలవాఁడు.)

3. భోగలాలసుఁడు

**విదూషణము** నం. వి అ. న 1. చెఱుచుట, పాడుచేయుట, 2. నిందించుట, దూఱుట.

**విదేశజము** నం. విణ. (అ. అ. అ.) దేశాంతరమునఁ బుట్టినది. పరదేశమున నుద్భవించినది.

**విదేశము** నం. వి. అ. పుం. పరదేశము, దేశాంతరము.

విదేశి సం. విశే (స్. ని న్.) దేశాంతర సంబంధి, పరదేశస్థుఁడు.

వి న్. పుం. దేశాంతరము నుండి వచ్చిన మనుష్యుఁడు, అన్యదేశస్థుఁడు.

విదేశీయుఁడు=విదేశి సం విశే. (అ. అ అ)

విదేహ సం. వి. అ స్త్రీ. మిథిలా పట్టణము, విదేహ నగరి.

విదేహము సం. వి అ. పుం 1. విదేహదేశము, దేశ విశేషము. 2. విదేహమను నొకానొక మండలము, భూభాగము

విదేహుఁడు సం విశే (అ అ అ) 1. దేహము లేనివాఁడు, దేహసంబంధము లేనివాఁడు. 2 కంఠము క్రింది భాగము లేనివాఁడు

వి అ పుం 1. విదేహ దేశనివాసి 2. జనకమహారాజు.

విద్దె(ద్దియ) వి (సం విద్యా.) 1. చదువు.

సీ. తెలివి చూపక క్రొమ్మోలగిలికొని విద్దెలఁ గొఱల వారల రిత్త మొఱఁగుటయును .. అ రా. బాల. 45.

ద్వి. విద్దెలు సెలవుచు విభుని ముందఱను, ముద్దులు గులుకుచు మోహనాకృతుల .. రం. రా బాల. 21 పొ. 4. పం.

2. మాయ.

ఉ. .. ఇంద్రియంబులన్, పెద్దవునీవెఱుంగని ప్రవీణపు బుద్ధులు లేవు గావనీ, విద్దెలు మానుమాను మవివేకము సెందమ నిన్ను వేఁడెదన్. చంద్ర. వి. 2. 128

3. దంభవాక్యము, బడాయి

ద్వి. విద్దెలాడెదుఁగాక విందుమే తొల్లి ... బస. పు. 5. 105. పం

విద్దె(ద్దియ)ము వి (సం. విద్యా) తొలుసారి బాలకులు లేచి నిలువబడుట.

క. విద్దెములు సేయరాదా, ముద్దులపట్టియటంచు ముచ్చట దీరన్, దద్దయుఁ దలిదండ్రులు తమ, ముద్దిడుకొన నఱఁడు వెలసె మోహనలీలన్. ఇందు. 2 17.

మ. జనకుండయ్యలు విద్దె మేదియన ... దశా. 4. 142.

ఉ ముద్దులమాటలున్, జిలుగమోముక నున్నని లేత చెక్కులున్, గొద్దిగ నున్న సెన్నడుముకూఁకటి కందక ఫాలపట్టికన్, విద్దెము సేయ ముంగురులు విప్పగుతెప్పల గొప్పకన్నులున్, బ్రొద్దొకవింతయై యమరెఁబుప్ప సుగంధికి బాల్యవేళలన్ అని. 2 21

(ఇట "విద్దెముసేయు = చిందులాఁడు" అని భావము)

విద్య సం. వి. అ. స్త్రీ 1 జ్ఞానము, తెలివి 2 తత్త్వజ్ఞానము, ఆత్మసాక్షాత్కారము 3 చదువు, జ్ఞానహేతువగుశాస్త్రాదికము. (చతుర్విద్యలు అన్వీక్షకి, త్రయి, వార్త, దండనీతి మనువు ఆత్మవిద్యయైదవదిగాఁ జేర్చి యున్నాఁడు) (చతుర్దశ విద్యలు నాలుగు వేదములు, ఆఱువేదాంగములు, ధర్మశాస్త్రము, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అను వానితోఁ బదునెనిమిది.) 4 దుర్గాదేవి 5. దేవీమంత్రము 6.ఇంద్రజాల నైపుణ్యము, గారడీ యందలి నేర్పు.

విద్యమానము సం విశే (అ అ. అ) 1 ఉన్నది, స్థితము 2. సమక్షమున నున్నది, ఎదుటనున్నది. 3. సత్యమైనది, యథార్థము.

విద్యలవాఁడు మి. వి (విద్యలు+వాఁడు) ఇంద్రజాలికుఁడు, గారడివాఁడు.

గీ వదలికౌర్యంబు విద్యలవాని కరణి, నింద్రజాలంబు పన్నెదవే బలీంద్ర దశా 2. 408.

విద్యాకరుఁడు సం. వి. అ పుం. విద్వాంసుఁడు, చదువరి

విద్యాచంచువు=విద్యాచణుఁడు సం. విశే (ఉ.)

విద్యాచణుఁడు సం విశే (అ అ. అ) విద్యచేఁ బ్రసిద్ధికెక్కినవాఁడు.

విద్యాదలము సం వి. అ. పుం భూర్జపత్ర వృక్షము.

విద్యాదాత సం. వి. ఋ. పుం. చదువు చెప్పువాఁడు, విద్యనిచ్చువాఁడు, గురువు.

విద్యాదానము సం. వి. అ. న. 1. విద్యనేర్పుట, చదువుచెప్పుట. 2. పుస్తకాదికము నొసఁగుట. (వాచ.)

విద్యాదేవి సం. వి. ఈ. స్త్రీ. సరస్వతీదేవి,

**విద్యాధరి** సం. వి. ఈ. స్త్రీ. విద్యాధర స్త్రీ.

**విద్యాధరుఁడు** సం. వి. అ. పుం. దేవతలలో నొక తెగ పురుషుఁడు

**విద్యానులాపి** సం. విణ. (న్. నీ. న్.) విద్యను వల్లించువాఁడు, వల్లె వేయువాఁడు

**విద్యాభ్యాసము** సం. వి. అ. పుం. విద్య నేర్చుకొనుట, చదువుకొనుట, జ్ఞానము సంపాదించుట

**విద్యారంభము** సం. వి. అ. పుం. (విద్యయొక్క యారంభము) చదువు ప్రారంభించుట, పిల్లవానినిఁ జదువులోఁ బ్రవేశపెట్టుట

**విద్యార్జనము** సం. వి. అ. న. విద్యను సంపాదించుట, చదువుకొనుట, జ్ఞానసంపాదనము

**విద్యార్థి** సం. వి. న్. పుం. 1. చదువు కోరువాఁడు 2. చదువుకొనుచున్నవాఁడు

**విద్యార్థుఁడు** సం. వి. అ. పుం. విద్యయే ప్రయోజనముగాఁ గలవాఁడు

**విద్యాలయము** సం. వి. అ. పుం. బడి, పాఠశాల, విద్యాస్థానము

**విద్యాలాభము** సం. వి. అ. పుం. 1. విద్యాప్రాప్తి, చదువువచ్చుట 2. విద్యవలన సంపాదించిన ధనము.

**విద్యావంతుఁడు** సం. విణ. (త్. తీ. త్.) విద్యగలవాఁడు, చదువరి

**విద్యావృద్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) విద్యచే నధికుఁడు, విద్యచేఁ బెద్దవాఁడు

**విద్యావ్యసనము** సం. వి. అ. న. విద్యయందలి యాసక్తి.

**విద్యా(వ్రత)స్నాతకుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మచారివ్రతము పూర్తిచేసిన బ్రాహ్మణుఁడు, విద్య పూర్తిచేసి గురుకులమునుండి మఱలిన బ్రాహ్మణుఁడు

**విద్యుజ్జిహ్వుఁడు** సం. వి. అ. పుం. మెఱుపువంటి నాలుక గలవాఁడు, ఒకానొక రాక్షసుఁడు.

**విద్యుజ్జ్వాల** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపుయొక్క ప్రకాశము, మెఱుపుమంట.

**విద్యుత్తు** సం. వి. త్. స్త్రీ. 1. మెఱుపు. 2. సంధ్యాకాలము (వాచ)

విణ. త్. ప్రకాశములేనిది, కాంతిలేనిది. (మే.ని.)

**విద్యుత్ప్రియము** సం. వి. అ. న. కాంస్యము, కంచు

**విద్యుత్వంతము** సం. విణ. (త్. వతీ. త్.) మెఱుపు గలది

వి. త్. పుం. మేఘము

**విద్యుదున్మేషము** సం. వి. అ. పుం. మెఱుపు ప్రకాశము, మెఱుపు వెలుగు

ఇట్లే విద్యుద్ద్యోతము.

**విద్యుద్దామము** సం. వి. న్. న. బ్రాఁడువలె నుండెడి మెఱుపు, తీఁగ మెఱుపు

**విద్యుల్లత** సం. వి. ఆ. స్త్రీ. మెఱుపుతీఁగ, తీఁగ మెఱుపు.

**విద్యుల్లేఖ** = విద్యుల్లత సం. వి. ఆ. స్త్రీ

**విద్యోతనము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రకాశింపఁ జేయునది. 2. స్పష్టపఱుచునది

**విద్యోతించు** సం. అ. క్రి. ప్రకాశించు

వ .. ఇంతటికి నధిష్ఠానంబై తదీయరాజధానియగు ప్రాగ్జ్యోతిషంబు విద్యోతించె . హరి ఉ 4 45

వ . . కంఠకోణంబునఁ గంఠికోపరి నీలంబునం బోని కాలకూటంబున సంఘటిల్లు భ్రాంతిసంతమసంబునకు ఖద్యోతంబులునుం బోలె విద్యోతించు కంకణాశీవిషానల విస్ఫులింగంబులవలన దుర్నిరీక్ష్యుం డగుచు ... భీమ 5 8.

**విద్యోపార్జనము** సం. వి. అ. న. చదువును గడించుట, విద్య నేర్చుకొనుట.

**విద్రధి** సం. వి. ఇ. పుం. కడుపులోఁ బుట్టుపుండు.

**విద్రధినాశనము** సం. వి. అ. పుం. మునగ చెట్టు, శోభాంజనము (వృ వి) (త్రి ని)

**విద్రము** సం. వి. అ. పుం. రంధ్రము, కన్నము (వాచ)

**విద్ర(ద్రా)వము** సం. వి. అ. పుం. 1. పాఱిపోవుట, 2. దిగులు, భయము 3. పొరలిపోవుట, గట్టులు మునుఁగఁ బ్రవహించుట 4. కరఁగుట, ద్రవమగుట 5. నింద, దూఱు 6. జ్ఞానము, తెలివి

**విద్రాణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మేలుకువ చెందినవాఁడు, నిద్రనుండి లేచినవాఁడు

**విద్రావణము** సం. వి. అ. న. 1. తరిమివేయుట, పరుగెత్తించుట, ఓడించుట 2. కరఁగించుట, ద్రవముగా జేయుట.

**విద్రావితము** సం. విణ. (అ. అ. అ.) 1 తరుమఁబడినది, పరుగెత్తింపఁబడినది. 2. చెదరినది, చీల్పఁబడినది. 3. కరఁగింపఁబడినది, ద్రవముగాఁ జేయఁబడినది.

**విద్రుచు** = విదురుచు న. క్రి. 1. దులిపివదలైచు, వదలుచు.

వ .. తానునుగుడిచి దర్భపూరులు విద్రిచి యంద ఱకు వేఱువేఱ యనమ్ము లిమ్ముగా రచియించి .... భార. ఆది 7. 223.

2 విదిలించు, దులుపు.

వ. ... హిడింబుండను నొక్క రక్కసుండు వారి దవ్వులం జూచి మైవెంచి రూక్షకేశంబులు విద్రిచి ... భార. ఆది. 6 185

ద్వి అటు పట్టువడి యతఁడాకాశవీథి, బటు శక్తి నెగసి యుద్భటవృత్తి మెఱసి, విద్రిచినఁ బడి శిల పీరులు ధాత్రియద్రువంగ నుగ్గునూచై త్రెళ్లిరంత ... రం. రా. యు. 848. పా 7. పం.

శా .. ఈ కంథచే, వేలుపల్ కవకంబురాలు విద్రువన్ విశ్వంభరాధీశ్వరా . విక్ర 2 7

3. చిమ్ము, వినరు.

మ. అది చూత్కారముఁ జేసి కేల్ విద్రుచు కొంచంభోజషండంబు ను, న్నదభంగిన్ బలు ప్రమోఁతతో నెదలి పల్మాఱున్ మహాఘీంకృతుల్, సెదరన్ వెండియుఁ దొండమున్ విద్రుచుచున్ శీఘ్రుంబెసెన్ ప్రమాఁకులుం, బొదలుం గూల్చుచుఁ బాటితైన విలయంబుల్ సొచ్చె మద్రాకృతిన్ శేయూర. 2. 102.

4. రాల్చు.

శ. ఎద్రిచివ కాలపాశమున నీగ్రతిపీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మన్నికిత బాణపరంపరపై మిణుంగురుల్, విద్రువఁగఁ దర్పలంబుల చవింజరికారులుగా శరీరపుం,జిద్రుపలు చేరుఁ దత్సతుల చేతులఁగాక కులంబు వాతులన్. ఉ. హరి. 4. 109

5. విఱుచు.

సీ. గోవజవ్యాదిఁ గస్తూరిఁ గొలితవలుచు, వెన్న పడిదెంబు జొబ్బిల విద్రిచివిద్రిచి ,,, నైష. 6 120.

**విద్రుతము** సం విణ. (అ. అ. అ) 1 (భయమువలన) పాఱిపోయినది. 2 తుద్ధమైనది, కలఁత నొందినది. 3. కరఁగినది, ద్రవమైనది.

**విద్రుమము** సం వి. అ పుం 1. పగడపుఁ జెట్టు. 2 పగడము, ప్రవాళము 3 నవాంకురము, క్రొత్త మొలక, చివురు.

**విద్రుమల(తిక)త** సం వి. అ స్త్రీ. 1. పగడపుఁదీఁగ 2. (నలిక యనెడి) గంధ ద్రవ్య విశేషము

**విద్వత్కల్పుఁడు** సం విణ (అ అ అ.) కొంచెము తక్కువగాఁ బండితుఁడు, ఇంచుమించుగ విద్వాంసుఁడు.

(ఇట్లే విద్వద్దేశీయుఁడు, విద్వద్దేశ్యుఁడు.)

**విద్వాంసుఁడు** సం విణ (న్. ఉవి. న్.) 1. తెలిసిన వాఁడు, బుద్ధిమంతుఁడు 2 చేదువరి.

వి న్. పుం. పండితుఁడు, చేదువరి.

**విద్వి(ట్టు)షుఁడు** సం వి ష్. పుం. శత్రువు, పగవాఁడు.

**విద్విష్టము** సం విణ. (అ. అ. అ ) ద్వేషింపఁబడినది, పగగొనఁ బడినది

**విద్వేషణము** సం వి అ న 1 విరోధ కారణము 2. విరోధము, పగ

**విద్వేషణి** సం. వి ఈ. స్త్రీ. కోప స్వభావము గల స్త్రీ రోషముగల స్త్రీ.

**విద్వేషణుఁడు** సం. వి అ పుం. శత్రువు, పగవాఁడు

**విద్వేషము** సం వి. అ పుం 1 విరోధము, పగ, శత్రుత్వము 2 (ఇతరులను) తక్కువగాఁ జూచు గర్వము, తిరస్కారము, తృణీకారము

**విద్వేషి** సం. విణ (న్ ఈ న్.) పగ గలవాఁడు, విరోధము గలవాఁడు.

వి. న్. పుం శత్రువు, పగవాఁడు

**విద్వేషించు** సం అ క్రి. విరోధించు, పగఁ గొను

శా. వా, పీరస్ఫార బలంబు లొండొరుల ధిషేపంబులే పాఱఁగా, వీరావేశ భరంబునం జెనఁగె విద్వేషించి .. జై. భా. 5. 176.

**విధ** సం వి. ఆ. స్త్రీ. 1 పద్ధతి, ప్రకారము 2 మచ్చు, రకము, రీతి 3 సమృద్ధి, ఐశ్వర్యము 4 గుఱ్ఱము, ఏనుఁగు మొదలగు వానికిఁ బెట్టెడి యాహారము, దాణా. 5. చొచ్చు, ప్రవేశము 6 జీతము, కూలి. 7. పని, కృత్యము.

**విధము** నం. వి. అ. పుం. 1 రకము, జాతి, మచ్చు, (బహువిధము) 2 రీతి, ప్రకారము, పద్ధతి 3 త్రివిధము, అష్ట విధము మొ. 4 గజకబళము, ఏనుఁగులకు బెట్టెడి దాణా 5. కలిమి, సంపద. (విల్యమ్సు) 6 చొచ్చుట, ప్రవేశము (విల్యమ్సు.)

**విధవ** నం. వి. ఆ. స్త్రీ. పెనిమిటిలేని స్త్రీ విగతభర్తృక, ముండమోపి.
విధవకుఁదలసుళ్లు వెదుకుట=నిష్ఫలమనుట.
సీ. జవ్వాది యలఁదినఁ జంకలెత్తఁగనేల విధవకుఁ దలసుళ్లు వెదకనేల. రామ శ. 56

**విధవనము** నం. వి. అ. న. 1 క్షోభము, కలఁత, కదలిక 2 వణఁకు, కంపము

**విధవాగామి** నం. వి. న్. పుం. విధవను (రతియందు) పొందినవాఁడు

**విధవావేదనము** నం. వి. అ. న. విధవను (వితంతువును) పెండ్లాడుట

**విధాత** నం. విశే. (ఋ. తీ. ఋ.) చేయువాఁడు, కల్పించువాఁడు
ఋ. పుం. 1 సృష్టికర్త, బ్రహ్మ 2 దాత, ఇచ్చువాఁడు 3. విధి, దైవము 4 విశ్వకర్మ. 5. మన్మథుఁడు. 6 మద్యము 7 అధర్మము. (వాచ)

**విధాతృఁడు** నం. వి. ఋ. పుం. బ్రహ్మదేవుఁడు
సీ. .. ఇంద్రనందనునకు, దేవిఁగాఁ బ్రీతితో దీనినీఁ గాంచితివని యున్నచో విధాతృనకు నిట్లు, పాడియె ... భార. ఆది. 7 23.
ఉ. .. మారుతికిన్ జయంబొసఁగె మాల విధాతృఁడు వాని గెల్పు కో,లేరికి సమ్మతంబగునె యిట్టిది దీనను బెంపుగల్గునే ... భార. సౌప్తి. 1. 218.

**విధాత్రాయుస్సు** నం. వి. స్. పుం. 1. బ్రహ్మదేవుని యాయువు. 2. సూర్యుని వెలుఁగు,ఎండ. 3.ప్రొద్దు తిరుగుడుపువ్వు చెట్టు.

**విధాత్రి** నం. వి. ఈ. స్త్రీ. పిప్పలి. (వృ. వి.)

**విధానకము** నం. వి. అ. న. 1 శాసనము, నిబంధనము. 2 బాధ, నొప్పి.

**విధానజ్ఞుఁడు** నం. విశే. (అ. అ. అ.) విధినెఱిఁగినవాఁడు, చేయవలసిన పద్ధతి తెలిసినవాఁడు.
పుం. విద్వాంసుఁడు పండితుండు. ఇట్లే విధానగుఁడు.

**విధానము** నం. వి. అ. న. 1 ఏర్పాటు, ఏర్పఱుచుట 2 చేయుట, ఆచరించుట 3 సృష్టి, సృజనము 4 ఉపయోగము, ప్రయోజనము. 5 ఆజ్ఞ, శాసనము 6 శాస్త్రవిధి. ధర్మవిధి. 7 శాస్త్రవిహిత కర్మానుష్ఠానము, శాస్త్రమున జెప్పఁబడినట్టు కర్మముల నాచరించుట 8 పద్ధతి, ప్రకారము. 9 సాధనము, ఉపాయము. 10. సంస్కారము (ఉపనయనాది.) 11 లాభము, ప్రాప్తి 12. గజకబళము, ఏనుఁగులకుఁబెట్టు దాణా. 13 ధనము. 14 బాధ, నొప్పి. 15 (వ్యాక) ప్రత్యయాదులను ప్రకృతికిఁ బూర్వపరములుగాఁ జేర్చుట 16 (నాట్య) భావసంధి. 17. విరోధకార్యము.

**విధాయకము** నం. విశే. (అ. యి. కా. ఆ.) 1 ఏర్పాటు చేయునది. 2. చేయునది, ఆచరించునది 3 సృజించునది. 4. విధించునది, ఆజ్ఞాపించునది 5 ఒప్పించునది, అధీనము చేయునది.
వి. అ. న. ఆజ్ఞ.

**విధాయి** నం. విశే. (న్. నీ. న్.) విధించువాఁడు.

**విధి** నం. వి. ఇ. పుం. 1 చేయుట, ఆచరించుట 2 పని. 3 పద్ధతి, రీతి, ప్రకారము 4 అప్రాప్తప్రాపకమైన వేదవాక్యము, ఒక పనిచేయవలయునని నిర్దేశించు వాక్యము, క్రియాప్రవృత్తి నిమిత్తమయిన వేదవాక్యము (ఇది అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి అని త్రివిధము.) 5 సంస్కారము వేదోక్తకర్మము. 6 ప్రవర్తన, నడవడి. 7. స్థితి, అవస్థ 8. సృష్టి, సృజనము 9 బ్రహ్మదేవుఁడు 10. అదృష్టము, దైవము 11 గజకబళము, ఏనుఁగులకుఁబెట్టు దాణా 12. సమయము. 13 వైద్యుఁడు. 14 విష్ణుదేవుఁడు. 15 నియోగము, ఆజ్ఞ. 16 ఆజ్ఞావాక్యము (వాచ)

**విధి(యి)ంచు** నం. స. క్రి. 1 చేయు.
ఉ. ఇమ్ముగ నాత్మరతి విధియించు వినమ్మనమంత్రరతి యత్నమ్మునఁ జేయఁగావలయు ... భార. ఆది. 6. 110.

క. శివతీర్థములో నొంచెను, శివాజ్ఞలో నొంచెఁ దాను జీవత్యాగంబు విధించిన మానవుఁడును, శివప్రసాదమున ముక్తిఁ బడయు మహేశా. శివ. సా. 281.

2. ఏర్పఱుచు, నియమించు, ఏర్పాటుచేయు

సీ. దివిజ మర్త్యాది జంతువు లమ్మహాత్ము విధించిన తెరువులఁ దిరిగి బ్రదుకుచుండ ... భార. శాం. 3. 442.

గీ. స్మృతుల యందు బలాత్కార కృతములెల్ల నకృతములుగా విధించి వాఁడట్టె మనువు ... నైష. 7. 72

**విధిఘ్నుఁడు** సం విణ. (అ అ. అ) శాస్త్రవిహితము లయిన కర్మములను ఆచరింపనివాఁడు, ఉల్లంఘించువాఁడు.

**విధిజ్ఞుఁడు** సం. విణ (అ. అ అ.) శాస్త్రవిహితము లయిన కర్మముల నెఱింగినవాఁడు

వి అ. పుం. శాస్త్ర విహితము లయిన కర్మముల నెఱింగిన బ్రాహ్మణుఁడు.

**విధిత్స** సం. వి. ఆ. స్త్రీ. 1. చేయవలయునవెడి కోరిక, ఆచరింప నిచ్ఛ. 2. ఉద్దేశము, కోరిక, ఇచ్ఛ

**విధిత్సితము** సం విణ (అ. అ అ) 1. చేయనిచ్ఛగింపఁ బడినది, చేయ నుద్దేశింపఁ బడినది.

వి అ. న. ఉద్దేశము.

**విధిదర్శకుఁడు** సం. వి. అ పుం. ఉపద్రష్టయనెడి ఋత్విక్కు, యజ్ఞమున నంతయు సరిగా జరిగినదియు లేనిదియుఁ జూచుచుఁ దప్పిన దానిని దిద్దుచుండెడి ఋత్విజుఁడు.

ఇట్లే విధి దేశకుఁడు.

**విధిదృష్టము** సం విణ. (అ అ అ) శాస్త్రమునఁ జూడఁబడినది శాస్త్రముచే విధింపఁబడినది

**విధిద్వైధము** సం. వి. అ న. విధి వాక్యములు, శాస్త్రములు వేర్వేఱర్థములను దెల్పుట, శాస్త్రము యొక్క భిన్నత్వము

**విధియోగము** సం. వి అ. పుం దైవ సంఘటనము, దైవయోగము, దైవవశము.

**విధివంతము** సం. విణ. అవ్య శాస్త్రోక్తము, శాస్త్రవత్తు ("విధివత్తు" అనుట యుక్తము )

వ. ... వసిష్ఠుండు విధి వంతమ్ముగా సంవరణున కుం దపతి వివాహమ్ము సేయించె ... భార. ఆది 7 87.

**విధివిహితము** సం విణ (అ అ అ) శాస్త్రమున విధింపఁ బడినది

**విధిహీనము** సం విణ (అ అ అ) శాస్త్రీయము కానిది, అశాస్త్రీయము

**విధుంతుదుఁడు** సం. వి అ. పుం. చంద్రుని వ్యథ పెట్టువాఁడు, రాహువు.

**విధుఁడు** సం వి ఉ పుం 1. చంద్రుఁడు 2. విష్ణుదేవుఁడు. 3 బ్రహ్మదేవుఁడు 4 శివుఁడు

**విధుక్షయము** సం వి అ పుం. చంద్రుని క్షీణత, కృష్ణపక్షము

**విధుతము** = విధూతము సం విణ (అ అ అ)

**విధుతి** సం. వి ఇ స్త్రీ 1. కదలుట, కంపము. 2. ఇటు నటువిసరుట

**విధుననము** సం వి అ. న 1 కదలుట, కంపించుట, కలతనొందుట. క్షుబ్ధమగుట 2 వణఁకుట.

**విధుప(పి)ంజరము** సం వి అ పుం వెనుకకువంగిన కొనగల పట్టాకత్తి

**విధుప్రియ** సం. వి. ఆ స్త్రీ తార, నక్షత్రము.

**విధుర** సం. వి. ఆ. స్త్రీ రసాల. పంచదారయుఁ బరిమళ ద్రవ్యములు గలసిన పెరుగు

**విధురదర్శనము** సం వి. అ న. 1. అపాయమగపడుట, భయము కటస్థమగుట. 2 క్షోభమనుభవించుట, మనోవిచారము నొందుట

**విధురము** సం. వి. అ. న. 1. భయము, విచారము, అపాయము, హాని. 2. విరహము, ఎడఁబాటు

**విధురుఁడు** సం. విణ. (అ అ. అ.) 1 దుఃఖపెట్టఁబడినవాఁడు, బాధింపఁబడినవాఁడు, దుఃఖముగలవాఁడు, విచారమునకు లోనైనవాఁడు. 2. విరహతాపముగలవాఁడు. 3. శూన్యుఁడు, లేనివాఁడు. 4. ద్వేషముగలవాఁడు. పగగలవాఁడు.

వి అ పుం 1. భార్యపోయినవాఁడు, మృతపత్నీకుఁడు.

**విధువనము** సం వి. అ. న కదలుట, వణఁకుట. కంపము

**విధువు** సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు. 2. కర్పూరము. 3 పిశాచము, రాక్షసుఁడు. 4 ప్రాయశ్చిత్తార్థమైన యాహుతి. 5 విష్ణుదేవుఁడు 6. బ్రహ్మదేవుఁడు. 7. శివుఁడు. 8. వాయువు 9 యుద్ధము

**విధూతకల్మషుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పోఁగొట్టఁబడిన పాపముగలవాఁడు, పాపము లేనివాఁడు.

**విధూతకేశుఁడు** సం. విణ. (అ. ఆ. ఈ. అ.) విరియంబోసికొనిన జుట్టుగలవాఁడు

**విధూతనిద్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పోయిన నిద్ర గలవాఁడు, మెలకువ చెందినవాఁడు

**విధూతము** సం. విణ. (అ. ఆ. అ.) 1 కదలుపఁబడినది 2 విరియఁజేయఁబడినది, అలలవలెఁ గదలినది 3 వణంకినది, కంపమునొందినది. 4 తీసివేయఁబడినది, పోఁగొట్టఁబడినది 5. చంచలమైనది. 6. త్యజింపఁబడినది, విడువఁబడినది.

వి. అ. న. ప్రతికూలత, విరోధము

**విధూతి** = విధుతి సం.

**విధూననము** సం. వి. విధుననము.

**విధూనితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బెదరింపఁబడినది, భయపెట్టఁబడినది, కలత నొందింపఁబడినది 2. దుఃఖపెట్టఁబడినది

**విధృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1 బలాత్కారముగాఁ బట్టుకొనఁబడినది; పట్టుకొనఁబడినది 2 విడదీయఁబడినది, దూరముగా నుంచఁబడినది. 3 పొందఁబడినది 4 ఉడ్డగింపఁబడినది, ఆటంకపరుపఁబడినది 5 రక్షింపఁబడినది, పోషింపఁబడినది

వి. అ. న. 1 ఆజ్ఞనుల్లంఘించుట, ఆజ్ఞోల్లంఘనము 2 అసంతృప్తి, సంతుష్టిలేమి.

**విధృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఏర్పాటు. 2. శాసనము

**విధేయజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) విహితకృత్యము (తాను చేయవలసినపని) నెఱిఁగినవాఁడు

**విధేయపదము** సం. వి. అ. న. 1. చేయందగిన కార్యము. 2. (వ్యాక) క్రియాపదము, కర్తృకర్మముల గుణక్రియాదులం దెలుపుపదము.

వ్యతి. ఉద్దేశ్యము.

**విధేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1 చేయఁదగినది, జరుపఁదగినది. 2, విధింపఁదగినది, శాసింపఁదగినది, 3. (వ్యాక) కర్తృకర్మముల గుణక్రియాదులం దెలుపుట కుపయోగింపఁబడునది

వి. అ. న. 1. కృత్యము, విహితకార్యము. 2 కర్తృకర్మముల గుణ క్రియాదులం దెలుపు పదము.

**విధేయావిమర్శము** సం. వి. అ. పుం. అవిమృష్ట విధేయాంశ మనెడి కావ్యదోషము. (విధేయాంశము ప్రధానముగా నిర్దేశింపఁబడకుండుట)

**విధేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒకరి యధీనమునున్నవాఁడు, అన్యాధీనుఁడు. 2. పరులకు లోఁబడినవాఁడు, లోఁగినవాఁడు. 3. వినయము గలవాఁడు, చెప్పినట్లువినువాఁడు.

వి. అ. పుం. భృత్యుఁడు, సేవకుఁడు.

**విద్ధకర్ణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కుట్టఁబడిన చెవులు గలవాఁడు.

**విద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గ్రుచ్చఁబడినది, ప్రవేశపెట్టఁబడినది 2. గాయము చేయఁబడినది, ఆయుధాదికములతోఁ బొడువఁబడినది. (చెవి) కుట్టఁబడినది. 3. కొట్టఁబడినది; కొరడా మున్నగువానితోఁ గొట్టఁబడినది. 4. త్రోయంబడినది. 5 నిర్దేశింపఁబడినది 6 ఎదిరింపఁబడినది 7 సమానమైనది, సాటియైనది.

వి. అ. న. గాయము

**విధ్వంసము** సం. వి. అ. పుం. 1. నాశము 2 పగ, విరోధము; అప్రీతి 3 అవమానము, ఇష్టములేకుండుట, అసహ్యము.

**విధ్వంసి** సం. విణ. (న్. నీ. న్.) 1. మిక్కిలి ధ్వస్తమైనది, తునియలైనది 2 పగగలవాఁడు; విరోధి, పగగలది

**విధ్వస్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బొత్తిగా నశించినది 2. ఎగురఁగొట్టఁబడినది. చెదరఁగొట్టఁబడినది 3 మఱుగుపఱుపఁబడినది, కప్పివేయఁబడినది 4 కాంతిహీనముగాఁ జేయఁబడినది, (రాహుకేతువులచే) గ్రసింపఁబడిన, (సూర్యబింబము మొ)

**వినఁబాటు** = విన్నఁబాటు (√విన్న) వి విన్నఁబడుట, వైవర్ణము

చ. అమృతముఁగోలుపోయి విబుధారులు గంధగజాసురాంధక, ప్రముఖులు మోములందు వినఁబాటు దలిర్పఁగఁగూడియున్నచో, సమరఁగ్ర వప్పుఢేన్మ. భీష 4 99,

వినత నం. వి. ఆ స్త్రీ 1 కశ్యపునిభార్య, అరుణ గరుడులకుఁదల్లి 2 ఒక విధమైన గంప బుట్ట.

వినతము నం. విశ. (అ ఆ అ.) 1 వంగినది, వ్రాలినది, ముందుకు వ్రాలినది. 2 నమస్కరించునది; అడఁకువగలది 3. మునిఁగినది, క్రుంగినది 4. వంకరయైనది. 5 (వ్యాక) సకారస్థానమున వచ్చినషకారము, నకారస్థానమున వచ్చిన ణకారము.

వినతాననుఁడు నం. వి. (అ. ఆ అ) వంపఁబడిన ముఖము గలవాఁడు చిన్నవోయిన ముఖము గలవాఁడు.

వినతానందనుఁడు నం. వి. అ పుం. (వినతకొడుకు) 1. అరుణుఁడు 2. గరుత్మంతుఁడు ఇట్లే వినతాసుతుఁడు. మొ

వినతాసూను(వు)ఁడు నం. వి. ఉ పుం = వినతానందనుఁడు.

వినతి నం. వి. ఇ స్త్రీ 1 వంగుట, వ్రాలుట. 2. నమ్రత, విధేయత, అడఁకువ. 3. ప్రార్థన, వేడికోలు.

వినదము నం. వి. అ పుం. 1 ధ్వని, చప్పుడు, 2 ఒకానొక చెట్టు వృక్షవిశేషము (వాచ)

వినని వాఁడు విశ (√ విను) చెవిటివాఁడు, బధిరుఁడు. (చి. ని శ. ర)

వినపము = విన్నపము వి. మనవి

క. వేయేలఁజియ్య వినవ,య్యాయిఁక మా వినపమొకటి యటు కనుఁగొనఁగా, వేయొడఁజాచిన నడపిలు, లాయంబులు వెలయు అముని లాయములనఁగన్. ప్రబంధ.166

దీనికి ప్రయోగాంతరము కనుఁబడలేదు

వినమి వి. (√ విను) వినకుండుట.

ఆ. పోఁడుతునెట్లు పాండు పుత్రులతోఁగయ్య, మేము నీవు దీనికియ్యకొనుము, పలుకువినమి గాఁగఁదలఁపకు ముచితంబు, తెలుఁగు ధీర జనుల కెఱుఁగ రాదె భార. శల్య 1 69

వినమితము నం. విశ (అ ఆ అ.) మిక్కిలి వంగినది.

వినమ్రము నం. విశ (అ ఆ. అ) 1. మిక్కిలి వంగినది, మిగుల వ్రాలినది, 2. క్రుంగినది, మునిఁగినది, అణఁగినది 3 విధేయమైనది, అణఁకువ గలది.

వినయగ్రాహి నం. విశ (న్ జి న్.) వినయము గలవాఁడు, విధేయుఁడు, చెప్పినట్లు వినువాఁడు.

వినయనము నం. వి. అ న. 1. నివారించుట, తొలగించుట. 2 చదువునేర్పుట, మంచి పద్ధతులు నేర్పుట.

వినయభా(కు)జుఁడు నం. విశ (జ్) 1 నమ్రత గలవాఁడు. 2 మంచి నడవడిగలవాఁడు.

వినయము నం. విశ (అ. ఆ అ.) 1. క్షిప్తము, చిమ్మఁబడినది. 2 రహస్యమైనది. 3 చెడు నడవడి గలది

వి. అ. పుం. 1 క్రమశిక్ష, మంచి పద్ధతులు నేర్పుట, 2 యుక్తత, ఔచిత్యము 3. మంచి నడవడి, మంచిపద్ధతి 4. నమ్రత, అణఁకువ. 5. మర్యాద, గౌరవము, వందనము (ఆ. ని.) 6. నడవడి, ప్రవర్తన 7. నివారించుట, తొలఁగించుట.

వినయస్థుఁడు నం. విశ. (అ ఆ. అ) వినయము గలవాఁడు, నమ్రుఁడు

వినయుఁడు నం. వి. అ పుం 1 జితేంద్రియుఁడు. ఇంద్రియములు వశపరచుకొనిన జనుఁడు. 2 వ్యాపారి, వణిజుఁడు, శేవారి.

వినవచ్చు అ క్రి (వినన్+వచ్చు) వినఁబడు, శ్రవణగోచరమగు.

వ . . మిక్కుటం బగున కోలాహలంబున నేపాటియుఁ గాట వినరాక ... ఆము. 4. 85.

వినశనము నం. వి. అ న. మిక్కిలి నాశము, అగోచరమగుట పుం. సరస్వతీనది పైకిఁగనఁబడక యనుకలో నంతరించిన చోటు, కురుక్షేత్రము నందలి యొక తీర్థము (వాచ.)

వినష్టము నం. విశ (అ ఆ అ) 1. పొత్తిగా నశించినది 2. కనఁబడనిది, అదృశ్యమైనది. 3. పాడైనది, చెడిపోయినది. 4 పతితము, జాతి భ్రష్టమైనది. (వాచ)

వినష్టి నం. వి. ఇ. స్త్రీ. 1 మిక్కిలి నాశము. 2 అగోచరమగుట, కనఁబడకపోవుట

వినసుఁడు నం. విశ. (అ ఆ ఈ అ) ముక్కిడి, ముక్కు పోయినవాఁడు.

**వినాడి** సం. వి ఇ స్త్రీ విగడియ, గడియలో నఱువదవ భాగము.

**వినాడిక**=వినాడి సం వి అ. స్త్రీ.

**వినాయకము** సం వి అ పుం 1 విఘ్నము 2. పక్షి శ్రేష్టము, గరుడపక్షి.

**వినాయకుఁడు** సం వి అ పుం 1. (విఘ్నములు) పోఁగొట్టువాఁడు, గణపతి 2 బుద్ధదేవుఁడు 3. గరుత్మంతుఁడు 4 గురువు, మతబోధకుఁడు.

**వినాశధర్ముఁడు** సం విశే (న్) నశించుటయే ధర్మముగాఁగలవాఁడు, నశించు స్వభావము గలవాఁడు.

**వినాశనుఁడు** సం వి అ. పుం లయకారుఁడు, నశింపఁజేయువాఁడు.

**వినాశము** సం వి అ. పుం. 1. లో తిగా నశించుట, క్షయము. 2. తొలఁగించుట, పోఁగొట్టుట, తీసివేయుట.

**వినాశోన్ముఖుఁడు** సం. విశే. (అ ఈ అ) నాశనమునకు సిద్ధముగా నున్నవాఁడు, నశింపనున్నవాఁడు

**వినాస(సి)కుఁడు** సం. విశే (అ. సికా అ) ముక్కిడి, ముక్కుపోయినవాఁడు

**వినాహము** సం వి అ పుం కూపముఖపిధానము నూతిమీఁది కప్పు

**వినిందించు** సం స క్రి. మిక్కిలి దూఱు, విశేషముగ నిందించు

మ. ... మందార సుధాంశు బింబముల యందంబుల్ వినిందించుచున్. వై జ 1 21

**వినికి** వి. (√విను) వినుట, శాస్త్రాది శ్రవణము

మ. మును గోవింద సుతుండు దానును బ్రియంబుల్ మీఱ నన్యోన్యశోభనరూపోరు గుణావళుల్ వినికిఁ దాదాత్మ్యానురాగాత్ముఁడై, యునికిం గన్నియ యత్తటిందగిలి సర్వోర్వీశులుం జూడ నా,తనిఁ బ్రీతిన్వరియించె ... హరి ఉ 3 217.

సీ వసుమతీకార్య నిర్వహణంబు పెద్దకొల్వున నుండి నీవనుదినము నడప, కునికి కర్తవ్యమే వినుకులు భీష్మాది మహితులచేత సమగ్రభావ, మొందినయవి ... భార. ఆశ్ర. 2. 138,

క. మునికులములోన మిక్కిలి వినుకులు గలవాఁడ నీవు విభు గీర్తులనీ, వనుకూలతఁ బొగడుము . భాగ 1. 112.

**వినికిడి** వి (√విను) వినికి (క ం గ్రా.)

**వినికిసేయు** స క్రి (√ వినికి) వినిపించు.

సీ. ... సురవార వారిజాతులు చెం గుపాంగంబుఁ ముఖవీణ మురజంబు మొదలుగాఁగ, గోముఖ గంధర్వ మేళంబు వినికిసేయ . దశా 2. 260.

**వినికీర్ణము** సం విశే (అ ఆ అ) చిమ్మఁబడినది, చెదరఁగొట్టఁబడినది

**వినిక్షేపము** సం వి అ పుం 1. క్రిందికిఁ ద్రోయుట. 2. ముందునకుఁ బంపుట.

**వినిగడము** సం విశే. (అ ఆ. అ.) విశృంఖలము, అడ్డులేనిది

**వినిగ్రహము** సం వి అ పుం 1. అడ్డుపెట్టుట, లోఁబఱచుకొనుట 2. ఒకరి నొకరెదిరించుట

**వినిద్రము** సం విశే (అ ఆ అ.) 1. నిద్రలేనిది, జాగరూకము 2 వికసించినది, వికసినది

**వినిపాతము** సం వి అ పుం 1. పడిపోవుట, పాటు 2 కష్టము, దుఃఖము, నాశము, 3 క్షయము, చావు 4 నరకము, అధోగతి 5. సంభవము, తటస్థపడుట 6 బాధ, నొప్పి. 7. అమర్యాద, అగౌరవము

**వినిపాతశంసి** సం విశే (న్ నీ న్.) రాఁబోవు కీఁడును సూచించునది

**వినిపించు** (√ విను) అ క్రి వినవచ్చు, శ్రుతిగోచరమగు, వినఁబడు, వినుచు.

మ. వినిపించెన్ హరి పాంచజన్యరవముద్వేల ప్రభాచక్రమున్, గనిపించెన్ సురదానవావళికి ... దశా 2 400

క. వినిపించెననెడు మాటకు, వినిచెననం జెల్లుచుండు ... ఆం. భా. 3. 110

స. క్రి. వినఁజేయు, చెప్పు, తెలియఁజేయు

క. వినుమాచార్యులు నూర్వురు, జనక నృపాలునకు వారు సతతంబునున, జ్ఞనపతివినిపింతురు త,త్త్వనిరూపక శాస్త్రములు పృథగ్విధములుగన్. భార. శాం 4. 340,

క. అని చెప్పిన మాధవుఁడి,ట్లనియె న్నీవంటి వారి కారక్కను మా,ర్కొని నిల్వవళమె దురమున, వినిపించెద వానిగెలుచు పీరుని మీకున్. జాహ్నవి. 1. 80

చ. ... సత్యవతీసుతుఁడు సె,ప్పిన యది యేను నీకు వినిపించెదఁబూజ్యతమంబు వంశవ,ర్ధనము సమ స్తపుణ్యఫలదంబిది శ్రోతకు వక్తకున్నృపా. హరి. పూ. 1. 50.

**వినిమయము** నం. వి అ పుం. 1 తుల్యమైన ఒక వస్తువునిచ్చి మఱియొక వస్తువును పుచ్చుకొనుట. 2 తాకట్టు, జాగ్రత్తకై యిచ్చినసొత్తు 3. అతురముల పరివర్తనము, మార్పు.

**వినిమయించు** నం. న. క్రి వినిమయముచేయు, మార్చు

గీ కలధౌత కుట్టిమం బలఁదు ః స్తూయును ఘన వాసనాద్యుతుల్ వినిమయింప చంద్రా. 6. 118.

**వినియతము** నం విశే. (అ. ఆ. అ) స్వాధీనపఱుచు కొనఁబడినది, అణఁపఁబడినది, నిగ్రహింపఁబడినది.

**వినియుక్తము** నం విశే. (అ ఆ. అ.) 1 ఉపయోగింపఁబడినది 2 పంచఁబడినది, విభజింపఁబడినది 3. విడఁదీయఁబడినది, వేఱుచేయఁబడినది 4 చేర్పఁబడినది 5 ఆజ్ఞాపింపఁబడినది, శాసింపఁబడినది.

**వినియోగము** నం. వి అ పుం 1 విడఁదీయుట, వేఱుచేయుట. 2. విడుచుట, త్యజించుట 3 ఉపయోగము, ప్రయోజనము. 4. ఉద్యోగము, నమ్మి చేయుమని ఒప్పగించినపని. 5. విఘ్నము 6 ఆశ్రితుఁడు, పరివారము (ఈయర్థము తెనుఁగున మాత్రము కనవచ్చుచున్నది)

వ. ... వేంచేయు నవసరంబున గురుమహా ప్రధాన మాండలిక సామంత సేనాపతి.. జాలిక మృగ యార్థిపతి పోషకులును. ఫణిహారులు రాయ వారులు సుగ్రాణపు తెగలు కెలనిబంటులు వేశ్యాజనంబులనియెడు డెబ్బదిరెండు వినియోగంబులు ప్రబంధ. 78

**వినియోగించు** నం న క్రి ఉపయోగపఱచు

క. తనయంశమైన కనకము, వినుకుంతీదేవికిచ్చె వేదవ్యాసుం, డనఘాయధి యఱతయు న,వ్వి నుత చరిత ధర్మకృతుల వినియోగించెన్. భార అశ్వ. 4. 203

**వినిర్గతము** నం విశే (అ ఆ అ) బయలువెడలినది.

**వినిర్గమము** నం వి అ పుం. 1 కనఁబడకపోవుట, అదృశ్యమగుట. 2 విడిచిపోవుట.

**వినిర్గమించు** నం న. క్రి అతిక్రమించు.

వ. ... తద్వారిపూరంబు వినిర్గమించి ... పాండు. 1 142.

**వినిర్జయము** నం వి అ పుం సంపూర్ణజయము

**వినిర్ణయము** నం వి. అ పుం 1 సంపూర్ణమైన నిశ్చయము 2 నిశ్చయింపఁబడిన శాసనము, స్థిరమైన శాసనము.

**వినిర్భేదించు** నం న క్రి బ్రద్దలుచేయు

సీ పడురసాతల క్రోడంబులును వినిర్భేదించి వెడలిన పెద్దవేల్పు భీమ 3 36.

**వినిర్మించు** నం. క్రి నిర్మించు

వ ... చంద్రుండు వంశకర్తగా సకలకలికలు పాపహర్త వంకిదేవ మహీభర్తకీర్తి కార్తికా చంద్రికా ప్రవాహంబులు వినిర్మించి దశ దిశాంచలంబులు ముంచె ... వరాహా 1 20.

సీ. ఇనవంశశేఖర యీ కావ్యమణి వినిర్మించిన సుకవివాల్మీకి మౌని. ఉ. రా వ 66

**వినిర్మింపించు** నం. న క్రి నిర్మింపఁజేయు.

సీ. గవనులు పరిపాటిగా వినిర్మింపించి ... వి. శకుం. 4. 177.

**వినిర్మితము** నం విశే (అ ఆ. అ.) 1 చేయఁబడినది, నిర్మింపఁబడినది. 2. సృజింపఁబడినది 3. (విందుమొ.) జరుపఁబడినది 4. స్థిరపఱుపఁబడినది, నిశ్చయింపఁబడినది.

**వినివర్తన** నం వి అ. స్త్రీ. వెనుకకుఁదిరుగుట, వెనుకకు మరలుట. రాఘవ 8. 113. (రామాయణార్థమున)

**వినివినమి** వి. (√విను) అలత్యము.

సీ. నీ బంట నన్ను మన్నించవేయన వినివినమి చేయుచు, దుంట విల్లువంచి. కువల 4 51.

క. అనుచు విటీ విట సంఘము, కవఁబడ గోపాలుఁ జూపి కడు వేర్పగ నా,డిన సరసవాక్యములు విని, వినములు చేసికొనఁ దెలియవినుమని పలికెన్. సారంగ 2 78.

**వినివృత్తము** సం విణ. (అ ఆ అ) 1 మరలినది 2 ఆఁగినది, ముగిసినది, 3 ఉద్యోగము, వ్యాపారము మొదలగు వానినుండి విరమించినది

**వినివృత్తి** సం వి ఇ స్త్రీ 1. ఆఁపుట, నివారించుట 2 సమాప్తి, ముగింపు అంతము

**వినివేశము** సం వి అ పుం 1 ఒకచోట స్థిరపడుట, 2. ముద్ర, చిహ్నము.

**వినిష్పేషము** సం వి అ పుం పూర్తిగా నలఁగఁగొట్టుట, పిండి చేయుట

**వినిహతము** సం విణ (అ ఆ అ) 1 మిక్కిలి కొట్టఁబడినది 2 చంపఁబడినది. 3. పూర్తిగా జయింపఁబడినది.

వి అ పుం 1 దైవవశమునఁ దటస్థమైన గొప్ప కష్టము ఆపత్తు 2 ఉత్పాతము, శుభాశుభ సూచకమగు మహాభూతముల వికారము

చూ ఉత్పాతము

**వినీతకము** సం వి అ న. 1 వాహనము, యానము (పాలకి మొ.) 2. మోసికొని పోవు జంతువు

**వినీతము** సం విణ. (అ ఆ. అ) 1 తీసికొనిపోఁబడినది 2 నివారింపఁబడినది, తొలగింపఁబడినది 3. సుశిక్షితమైనది, చక్కఁగాఁ జదివింపబడినది 4 నాగరికతను బొందినది, మంచినడవడి గలదిగాఁ జేయఁబడినది. 5 నమ్రమైనది, అడఁకువ కలది 6 మర్యాదగలది, ఋజువైనది 7 పంపివేయఁబడినది, (ఉద్యోగాదులనుండి) తొలగింపఁబడినది 8. మచ్చిక చేయఁబడినది, పెంచఁబడినది 9 అలంకారములు లేనిది, సాదాయైనది (వేషము). 10 జితేంద్రియము, కామాది వికారములను వశపఱుచుకొనినది 11 శిక్షింపఁబడినది 12 అధికారములో నున్నది 13 అందమైనది, ఇంపైనది.

వి. అ పుం. సుశిక్షితాశ్వము, మంచి నడకలు నేర్పఁబడిన గుఱ్ఱము

**వినీతి** సం వి ఇ స్త్రీ 1 అడఁకువ 2 మంచినడవడి నలవరుచుట, మంచినడవడి 3 గౌరవము, మర్యాద

**వినీతుఁడు** సం వి అ పుం వణిజుఁడు, వేహారి విణ క్రమశిక్షనందనివాఁడు, ఉద్ధతుఁడు

మ .... వినీతుఁడైన పతిచేష్టల్ చేటు దే ఖుండునే. కేయూర 3 301

**వినీయము** సం వి అ పుం 1 ముఱికి, మాలిన్యము. 2 పాపము, తప్పు, అపరాధము

**విను**[1] స క్రి (త విన్) ఆకర్షించు

మ. అనఘా మున్ను శమంత పంచకము నయ్యక్షౌహిణీ సంఖ్యయున్, వినఁగా మాకెఱిఁగించి భారత కథా విఖ్యాతికిం గారణంబును ... చెప్పుముద్యన్మతిన్, భార ఆది 1. 34

ద్వి. రావణాంతకవిను రణశూరుఁడైన, రావణు సుతువింటి రావణువినుము, రం రా ఉ. 86 పా. 1. 80

శా పాండిత్యాం బమరం బురాణములమున్ బౌరాణికు ల్సెప్పఁగా, విందున్ వింతలుగావు నూతన కథా విస్తారమై యోగ్యమై ... .. మార్క. పూ 14

జ వింను, వింట, విననివాఁడు, వినమి, వినవచ్చు, వినికి, వినికిడి, వినికిసేయు, వినిపించు, వినివినమి, వినుకలికంటి, వినుకొను, వినుచు, వినిపించు. విన్ను. విన్పించు

**విను**=విన్ను వి ఔప. ఆకాశము

(దీనికి హల్లుపరమగునపు డుత్వలోపము)

చ .. కంథయును సన్మణి పాత్రము యోగ దండముం, గొని వెనఁబాదుకల్ దొడిగికొంచు వియచ్చర వాహినీకన, త్కనక సరోజ గంధ వహ కౌతుకుఁడై వినువీథి కేగుచున్ విక్ర. 2. 12

క వనవహ్ని తపులకొన్నన్, వినువీథికి నెగురు పక్షి వితతులవలె ... దశా. 4 75.

జ వినుకెంపు, వినుచూలి. వినుజాలు, వినుచెంకి, విన్రుతోవ, విన్రుదిమ్మరి, విన్రుప్రోలు, వినుమనుజుఁడు, వినుమానికము, విన్రుమ్రాకు, వినురతనము, వినువలను, వినువాఁక, వినువిడు, వినుసికదేవర, విన్నది

**వినుక(న్క)లి** వి. (√ విను) 1. వినికి

చ వినుకలి మున్నుగిల్కొనిన వేడుక చూపుల కర్థిచేయఁగా, గనుఁగొని యన్నరేంద్ర వర కన్యకనిద్రితుఁడైన భూపతిన్. కేయూర 4 4.

చ ... చేష్టితం, బులఁదడఁ బెట్ట భావముల పూఁపు బయల్పడ వారి నిద్దఱన్, బలసి మరుండు తుల్యరసపాకము తీపులు గ్రోల్చె విన్కలిన్. పారి, ఉ. 3, 8,

చ. వినుకలిఁ గూర్మిఁ జిక్కి పృథివీ భవనంబునకున్
డి గంగనే, యనుపునలేక రంభయను వచ్చర
లేమ నలున్ వరింపఁబూనిన తన కోర్కె ...
నైష. 2 58.

చ. వినుకలిచేతనే విరహవేదన నా మదినింత
వర్ధిల్లెన్, గనుకలి నిట్లు చిత్రఫలకంబునఁ
గాంచిన యింతి నెమ్మనం, బునఁగడు నింత
కెంత పరిపూర్తి వహించునొ యెంత
నొచ్చునో, . ప్రభా 2. 35.

2. శ్రోత్రేంద్రియము, చెవి.

3. కీర్తి

సీ. తేజు విన్కలి గల్గి తెంపొందు మీవంటి వారిట్లు
పగరచేఁ బడియుమూర, కున్న ... అచ్చ. భా.
1. 6

**వినుకలికంటు** వి (వినుకలి+కన్ను) చక్షుశ్శ్రవము,
పాము (శ ర)

**వినుకెంపు** వి (విను+కెంపు) సూర్యుఁడు, నభో
మణి.

వ. విను కెంపు నుడి కెంపు విడి కెంపు రవ చెక్కడం
పుకడ వన్నె పసిఁడి గద్దియ నధివసించి ...
దశా. 1 14

సీ. పొడుపుఁ గొంపు వహించు బెడిదంపు వినుకెంపు
రహినింపు, కంఠహారంబు వాఁడు ఉ. రా.
1. 16.

**వినుకొను** స క్రి. (విను+కొను స్వార్థమున) విను.

వ. ... మృకండు ముని సన్నిధానంబునఁ
గుమారుండు వినుకొన్నగిరికుమారిం గటాక్షించి
ద్రాక్షారవ పక్షంబులగు వచుర విశేషంబు
లొలయ నిట్లనియె పాండు. 2. 4

**వినుచే** అ క్రి (√ విను) వినవచ్చు, వినఁబడు.

వ. ... దివ్యవాణి దా, వినిచె ధరాధినాథునకు
విస్మయ మందఁగఁ దత్సభాసదుల్. భార. ఆది
4. 104.

చ. ... మొత్తములై పెనుగ్రద్ద లాడెడెట్టుగ విని
చెన్ శివారుతము దుల్లెఁ గడు వ్వడినుల్క తెల్ల
డన్. భార ద్రో. 1. 182

మ. వివిధామోద ... దేవాంగనాగాన ముత్సవ
శీలన్ వినిచెన్ ... ఉర్వీన్ గౌరి జన్మించినన్.
కు. సం. 3 273.

చ. కరుణకుఁ బాత్రమై వినిచెఁ గాండవిన్ నతి
కూఁత ... దశకు. 3. 60

క. ... తోఁచినచోఁ, బదపడి చముదెంచియు విని,
చెద మన వారలకు నృపతి సెలవిచ్చుటయున్.
శుక 3 233

వ. క్రి. వినఁజేయు, వినిపించు

ఆ. అట్లు వాండ్రు మువ్వు రడఁగిన వడలుచు,
సుప్పనాతి మిగుల ద్రుక్కి లంక, కరిగి తోడఁ
బుట్టువగు రావణునిఁ గాంచి, తన తెఱంగు
దెలియ వినుచుటయును అ. రా. అర. 15.

క. నంతనముఁ జెంది భూసురు, డంత న్విజయాన్వ
దమున కరిగి ధరిత్రీకాంతునిఁ బొడగాంచి
శుభో,దంతము వినుచుటయు నతఁడు హర్షముఁ
జెందెన్. కవిజ. 3. 3

**వినుచూలి** వి (విను+²చూలి) గాలి, వాయువు.

గీ గాడ్పు కరువలి వినుచూలి గాలివలవు, మోపరి
చిలువమేఁ తనఁ బొలుచుఁ బవనుఁడు ... ఆం.
భా 1 56.

**వినుజాలు** వి (విను²+జాలు) ఆకాశగంగ, మందా
కిని.

గీ. ఏది వినుజాలు కనువాలు నిల్ల కేలు, నేది
తోల్చిర మెడచార యెముక కోర, యేది నెల
కూన పామేన నిడిన బూన, యితఁడు జేజే
దొరయని యొటులనందు. చెన్నబ 3. 62.

**వినుతెంకి** (విను²+తెంకి) వి. స్వర్గము

సీ అచ్చరవిరిబోఁడు లాలవట్టము లూన వినుతెంకి
చెలులు వీవనలు వైవ. అచ్చ రా. సుం.
3. 52

**వినుతించు** సం స క్రి స్తుతించు, పొగడు.

ఆ. విష్ణు బహు విధముల వినుతింప నజులు, శాయి
హాయ శిరంబు సకలవర్ణ, భాసురంబునైన పర
మాద్భుతంపు రూపంబుదాల్చి ... భార. శాం.
6. 484.

మ. ... ఆ తన్వంగి వేమాఱునుం, బ్రజ లెల్లన్
వినుతింప విందు మొదలం బక్షీంద్ర ... నైష.
2. 26

**వినుత్రోవ** వి. (విను²+త్రోవ) ఆకాశమార్గము.

మ .. ఎన్నం డిచ్చునో పీనికిన్, వరముజ్ఞానముఁ డంచు గెంచు వినుత్రోవం బోవు దేవౌఘముల్ ఉ. రా 2. 170.

**వినుద్రిమ్మరి** (విను²+ద్రిమ్మరి) వి దేవత, ఖేచరుఁడు.

సీ. వినుద్రిమ్మరులు కరివేల్పు హజ్జను బూజ పతి పిన క్రొత్త చెంగలువ లనఁగ. అచ్చ. రా. అయో. 18.

**వినుపించే**=వినిపించు, విన్పించు స. క్రి (√ విను) వినం జేయు.

సీ. వినుపించినాఁడవు వేమభూపాలువ కఖల పురాణ విద్యాగమములు. భీమ 1. 23.

క. ... నీ కన్నియకున్, మగనిఁ దగునతని గుణగరిమగని న్వినిపింతు వినుము మత్ర్పాణ సఖున్. వసు. 5. 28.

అ. క్రి వినవచ్చు, వినఁబడు

క. వినిపించె ననెడి మాటకు. వినిచె నవంజెల్లు చుండు ... అం. భా. 3. 110.

**వినుప్రోలు** వి ఔ. (విను²+ప్రోలు) స్వర్గము.

ఉ కాయజువారి కోడి ముని గౌతమికై తమ కోడిజాతి వాఁ, డాయె సురేంద్రుఁ డట్టి దొర నాఁగి జయింప దశాస్యుఁ డీ యెడం, బోయెడు నిత్తెఱంగు వినుప్రోలికిఁ దెల్పెద మంచు జెట్టుగాఁ గూయిడుచున్నవో యనఁగఁ గుక్కుటముల్ రొదసేసె దిక్కులన్ ఉ రా. 4 245

**వినుమనుమఁడు** వి (విను+మనుమఁడు) ఆకాశ పౌత్రుఁడు, హనుమంతుడు

క. వినుమనుమఁడ మానుడువులు, విను మునువు దలిర్ప నీవు దేఱొండు తలం,పున మండిన నీర తనవు, గని యుందిఁక నొరుఁడు దాఁటఁ గలఁడే చెపుమా. అచ్చ రా కిష్కిం. 62

**వినుమానికము** వి. (విను²+మానికము) సూర్యుఁడు, నభోమణి.

ఉ. ... వినుమానిక్యంబు లో,డై యిల గాధినూనుఁడు తపోధికతం దన వేఁడి నూపెడున్. గాధేయో. 3. 88.

**వినుమ్రాను** వి ఔ (విను²+మ్రాను) కల్పవృక్షము.

సీ వినుమ్రాని వరుపంపు విరిదండలెదనించి కలయ నెమ్మెయిఁగమ్మ కలప మలఁది. అచ్చ. రా సుం 84.

**వినురతనము** వి. (విను²+రతనము) నభోమణి, సూర్యుఁడు.

చ. ... వినురతనంపు వంగడవు వెన్నెలరాయని మర్వు పేరినన్ అచ్చ రా. యు 223.

**వినువ(న్వ)లను** వి (విను²+వలను) స్వర్గము.

ఉ ... విన్వలనిలో నమృతంబు సుంఖిత స్థితిన్ క. ఉండువన .. భార అను. 1. 216.(క.ర.) "ఇన్నవలలో" ముద్రి. పా తాళపత్రపు ప్రతి పా శ్లో తతోజాలేన మహతా అవనద్ధం సమంతతః అయస్మయేన వైతాత వృత్ర హంతు స్సమాస నాత్ (సం భార అను 25. 10.)

**వినువాఁక** వి (విను²+వాఁక) ఆకాశగంగ.

సీ. వినువాఁక యిదిగదా యనుచు నాకాశ గంగావారి సంగముల్ గడిగి కడిగి రా వి 1 87.

**వినువీడు** వి ఔ. (విను²+వీడు) స్వర్గము.

గీ. హరి యనఁడు తేరు వెదకఁడు కరినిగోర,ఁడే నిమిత్తంబు వినువీటిపైన మితని. కనఁగ వరిగె సభంగురాహవవిహార, విశకలిత దైత్య రథుఁ డగు దశరథుండు రం, రా 4. 83

వ పద్దెఱన్ జూపు వినువీటి పోటుబంట్లును. ఉ. రా 4. 261.

**వినుసికదేవర** (విను²+సిక+దేవర) వి వ్యోమ కేశుఁడు. శివుఁడు.

చ వినుసిక దేవరన్ నలువ వేల్పుల ముప్పది మూఁడు కోటులన్, బనిఁగొని ముజ్జగంబు మనుపంగల వీరుఁడు .. రామా. 1 7

**వినేత** సం వి ఋ పుం 1 సాహాయ్యకర్త, ముందు నకుఁ గొనిపోవు మనుష్యుఁడు.2.ఉపాధ్యాయుఁడు 3 పాలకుఁడు, రాజు. 4 శిక్ష విధించు నధికారి, దండనాధిపతి,

**వినోదనము** సం వి అ న 1. నివారించుట, తొలగించుట. 2. వేడుక, క్రీడ.

**వినోదము** సం. వి. అ పుం. 1 పోఁగొట్టుట, నివారించుట (ఉదా శ్రమ వినోదము) 2. వేడుక, కాలక్షేపమునకై న పని, కాలక్షేపోపాయము. 3 క్రీడ, ఆట. 4. ఆతురత, తీవ్రేచ్ఛ 5. ఆనందము, సంతోషము. 6 సురతవిశేషము, సురతములలో నొక విధము. 7 ఒక విధమైన యిల్లు,

**వినోదించే** సం. న. క్రి విరియించు, పోఁగొట్టు
ఆ తీవ్ర బాలజాల దీప్తులు పరగించి, పాండు తనయ సైన్య బహుళతమము, లీలఁబది దివసంబులోలి వినోదించి యధిప భీష్మభానుఁడస్త మించె భార భీష్మ 1. 47.
అ. క్రి 1. క్రీడించు.
సీ. హరినీలమణిమనోహరమందిర స్తంభముల వినోదించు కీల్బొమ్మవోలె. ఉ హరి. 2 73
వ. ఇవ్విధంబున వినోదించుచున్న నొక్కనాఁడు మార్క 2 294.
2. క్రీడాదులచేఁ బ్రొద్దుపుచ్చు.
వ. పగలు వినోదించి రాత్రి రసాతలంబున కరుగుచు ... మార్క 2. 264.

**విన్కి** = వినికి వి. వినుట.
ఉ. వీనులఁదియ్య మెక్కమును విన్కిఁ బరస్పర రాగ వృత్తిలో, నూనినఁజూచు వేడుకల నువ్విళులూరెడు నెమ్మనంబులు ... భార విరా 5 363

**విన్చు** = వినుచే అ క్రి. (√ విను[1]) వినవచ్చు, వినఁబడు. లయగ్రాహి. వాచా, లమ్మ్రులగు కోకిల కులమ్ముల రవమ్ము మధుర మ్మగుచు విన్చె ... భార. ఆది 5. 138.

**విన్న** విశ (సం వి వర్ణః) వివర్ణమైనది, కాంతి హీనము
(వృత్తియందు వికల్పముగా నిగాగమము)
చ. ... నీరజ షండము వొల్చె విన్నగా, క యువతులాట మైఁ జెలఁగు క్రందువ నొందిన క్రొత్త సంపదన్ నిర్వ 8 40.
క. కన్నీ రొలుకఁగ వగచిన, నన్నరపతులెల్ల నేడ్చి రార్తరవంబుల్, మిన్నందు వక్త్ర జలములు, విన్నని వదనంబులందు వెల్లి గొనంగన్ భార ద్రో. 1. 26
ఉ... మొగ్గెడు పాణముల్ మదులముంచిన ఖేదము లెండ శాక్రుడున్, వెగ్గలమైన యార్పులను విన్నని మోములు గానిపింపఁగన్ విప్ర. 2 53.
విన్నదనము, విన్నఁబడు, విన్నఁబాటు, విన్నఁబాఱు, విన్నఁబుచ్చు, విన్నఁబోవు, విన్నన.

**విన్నందు** అ. క్రి. (విన్ను + అందు) విజృంభించు.
శా వీరుం డవ్విలుకానిఁ గాంచి యొడయా వేఱొక్కఁడున్నాఁడెవి, న్నేరూపంబువనైనఁ బోలు దొర నీవే రాజవున్ రౌతవున్, వీరిం గాచి తి విమ్ములన్నగుచు రా విన్నంది పోరాడఁగా, వారిం బాచితి వింక నొక్కవరమే వాక్రుత్తుమా కిత్తువా. కకు. 4 111

**విన్నఁదనము** వి (విన్న + తనము) 1 వైవర్ణ్యము
ఉ కన్నుల నీరునించుఁ బులకంబులు దాల్చు వహించుఁ గంపమున్, విన్నదనంబునొందుఁ గడు విస్వరతం బలవించు ఘర్మబిం, దూన్నతిఁ జెందు జచ్చవడి యుండును మూర్ఛిలు నంత నింతిపై, కొన్నలువైన వేచు వగగుందుచు భూపతి సాత్త్వికాప్తిచేన్. కవిరా 5. 266
ఆ తివిచి చూడలేదె గవిసెన యెన్నండు, నొళవు దుమ్ముగప్పి యొప్పుడాఁగి, తంత్రులూడి విన్నఁదనఁ మొందెనిదియేమి, మహతియున్న యునికి మౌనిచంద్ర కకు 2 45
మ. మునిలోకస్వామి లేమయ్య మీ, రిట విన్నందన మొందినా రనుడు వాగీశాత్మజుండిట్లనున్ కకు. 5 5
2 దైన్యము.
ఉ. . ఏమొ నేఁడు నా, చిత్తములోన మావ దొళ సిగ్గును విన్నఁదనంబుఁ దాపమున్. కళా. 7. 236
చ. . వెలవెలవాఱు మోముపయి విన్నదవంబు దొలంకుచుండగన్ యయా. 4 139.

**విన్నఁబడు** అ. క్రి (విన్న + పడు) దైన్యపడు, ఖేదపడు.
మ. అని పౌలోమి మొగంబుసూచి విను మోయబ్జాస్య నీకింతమాత్రన విన్నంబడ నేలపోదునిదె నత్యాగర్వభారంబు ది, వ్యనగంబువ్విడిపించి పత్తువని సాహంకారుఁడై లేచి ... పారి 4 81.

**విన్నఁబాటు** వి (విన్నఁబడు) 1. విన్నఁబడుట, వైవర్ణ్యము.
ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁబల్కె ... మనుచ 2. 54
క. మురరిపుఁడుఁగినుక వారుణ, శరము ప్రయోగింపఁదడవ శాంతంబయ్యెన్, హరుబాణము బాణాసుర, పరివారంబునకు విన్నఁబాటు దలిర్పన్ హరి ఉ 8. 144.

2. విషాదము, దుఃఖము

చ విపరువాఙ్మత్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె వెక్కసమగు నెవ్వగల్ వొడమెఁ గంపము పుట్టెఁ జెమర్చె మేను మానసమున విన్నఁబాటొదవె.. పారి. 1 100.

ఉ. పౌరులు మేలుకాంచి నఁ పాలకుఁ గానక విన్నఁబాటుతో, నా రథమార్గమారసి ... భా రా. అయో. 185

శా. నిన్ను న్నిండించితి సైన్యముల్ సొరుగువోనీ దీన నాకేమియున్, విన్నంబాటు ఘటింపనేరదు . పి శకుం 3 132

విన్నఁబాటు అ క్రి (విన్న + పాటు) వెల వెలపోవు, వికాసము చెడు.

గీ. పుడికివైచిన మవ్వంపుఁ బోఅయపోలె, వాడి సొమరుచు మేఁ దీఁగవందికంది, వెలఁది నీవింత వగఁగూరి విన్నఁబాటి, యునికి దుఃఖాబ్ధి మమ్ముఁడి యునికిగాదె. కు సం 6 660

విన్నఁబుచ్చు స క్రి (√ విన్నఁబోవు) వివర్ణముగఁజేయు, అవమానపఱచు, చిన్నఁబుచ్చు.

వ. ... యామళంబులం గలంచియు, జన్నంబుల విన్నఁబుచ్చియు ... వైష 7 88.

విన్నఁబోవు అ క్రి (విన్న+పోవు) 1 వివర్ణమగు.

ఉ. వాడిన మోముఁ దమ్మిఁదెలివాలిక కన్నులు విన్నఁబోవఁ దో, నాడక నెన్నొసల్ కరమునం దిడి శిరనిషణ్ణయై జలం, బాడఁగఁ బిల్చువారి నొక హస్తము మ్రొక్కున నాడుఁ డంచుఁదాఁ, జూడక చూచుచూడ్కినల జోటిదెసల్ పరికింప నొక్కచోన్ మనుచ. 3. 86

శా. విన్నంబోయిన మోముతో హృదయనిర్వేదంబుతో ... ఎల్లన 1 238 (బ్రా.)

2. ఉడిగు.

గీ వర్ణములు నాశ్రమంబులు వరుసఁదప్పె, వేదములు నాగమంబులు విన్నఁబోయె, సౌరథంబులు కృష్ణపచ్యములుఁ జెడియె, వృద్ధిఁ బొందె నధర్మంబు విశ్వమునను కాశీ. 6 86

3. న్యూనమగు, తక్కువగు

గీ. విన్నఁబోకుండఁ గ్రియలెల్ల విశ్వస్తరిల్లఁ, దగ నొనర్చిరి పురిటాలి తగవులెల్ల. పి. శకుం. 4 62.

4. దైన్యమునొందు.

గీ. తనయ సంతానలబ్ధి దౌదవ్వుగాఁగ, విభవ సపత్నిగల్గియు విన్నఁబోయి, వనితసిప్పల పుష్పదర్శనముఁదాల్చె, శరలతా కాననము వోలెజవ్వనంబు శివరా 2 17

విన్నది వి. (విను$^2$+ నది) చేదలేఱు, ఆకాశనది

చ పారిజాత మం,జులలవలీనికుంజముల నోలుచు విన్నదిఁ దేలుచున్ సురల్. సారంగ. 2. 181. 2. 177.

విన్నన వి (√ విన్న) 1 వైవర్ణ్యము, కాంతిహీనత.

సీ. ఉన్నత గతిసెడి యుర్విపైఁగడు విన్నవై పడియున్న సుధాంశుఖంగి ... భార. ద్రో. 2. 126.

గీ. రాజునకు విన్నవించిరి రమణితెఱఁగు, విన్నవించిన నారాజు విన్నవగుచు, నిన్నుఁదోడ్కొని రమ్మని నన్నుఁబనిచె విక్ర. 7. 64

గీ జలరుహంబులు పాండవ సైనికుల మొ, గంబులట్టుల విన్ననై కాంతి దఱిఁగె. భార. భీష్మ. 1. 300.

శా. పట్టంగైదువులేక విన్నవగు నాజాహోర్గళుల్ చూడుఁడా ... భీమ. 6. 61.

(విన్ననగు = చిన్నఁబోవు)

గీ. తొంబమూఱును తొంబది తొమ్మిదియును, జలజములఁ బూజసేసెను శార్ఙ్గపాణి, వేయిటికి నొక్కపద్మంబు విన్ననైన, నహహా నియమంబులకు భంగమయ్యెననుచు. భీమ. 6. 64. (శ. ర. పా.)

(వెలితియైన ముద్రి. పా.) భీమ. 6. 61.

విన్ననువు వి (సం విజ్ఞానం) 1. నేర్పు.

చ. అనలముధోఁచునే తరువువందుఁ గురార ముఖంబుతైన సాధనములఁ బ్రవ్వసజ్జన హితా తగఁ దర్చినఁగాక యట్లయి, తనువు నలంగఁ జేసి పరతత్త్వముఁగాంతు మనంగరాదు వి,న్ననువున నాగమోక్తమతివం బొనరించినఁగాని యారయన్. భార. శాం 4 179.

సీ. హారుఁడు .. విన్ననువులు చూపు వేడుకవట కొంద అణిమాదిగుణముల నలవరించి. కు. సం. 11 664.

వ. .. అద్దంబుల మీఁదవతె మండనున్నచేసి విన్ననువున మెఱుంగు వెట్టినంద్రొక్కిపఁ జిక్కంజీరు వాఱుచు. పి. శకు. 1 86.

క. ఎన్నఁదగు హితులు బుద్ధులు, విన్ననువునఁ జెప్ప నతఁడు వినకున్నఁ జెడున్ ... నా పంచ 1. 428.

2. విధము, రీతి.

వ. ... మహోజ్వరంబులు జ్వలన జ్వాలాకలాపంబులు రూపంబులు గై కొన్న విన్ననువునఁ గన్నను చూపఱగ్గింప . . ఉ. హరి 6. 108.

**విన్నపత్త్రిక** మి. వి. (విన్నపము+పత్త్రిక) విజ్ఞాపన పత్త్రిక.

వ. ... సింధుకటకాధీశ్వరుండగు సింధురాజునకుఁ దత్కృత్యమంతయుఁజేట తెల్లంబుగా విన్నపత్త్రిక వ్రాసిపుత్తెంచిన ... కల్లూ 4. (క ర.)

**విన్నపము** వి (సం. విజ్ఞాపనం) మనవి

చ. వెలవక మీకొనర్తు నొకవిన్నపము... మనుచ. 1. 73.

క అయమ్మ యాగ్రహిం చెదఁ, నాయక నామీఁద విన్నపముచేసిన భూనాయకుఁడిది యొఁగాదన, కీయెడనామీఁద నాగ్రహింపం దగునే. సారంగ. 2. 272.

జ • విన్నవించు.

**విన్నము** సం విశ. (ఆ ఆ ఆ) 1 తెలియఁబడినది. 2. పొందఁబడినది, సంపాదింపఁబడినది 3. విమర్శింపఁబడినది, పరిశోధింపఁబడినది 4 ఉంచఁబడినది. 5 స్థిరపఱుపఁబడినది 6. పెండ్లియాడఁబడినది.

**విన్నవించు** అ క్రి (√విన్నపము) మనవిచేయు, విజ్ఞాపించు

క. ... పవనపుత్త్రుఁడు మనుజేంద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కివిన్నవించె నిశ్చితుఁడై. భార విరా 1. 217.

గీ అంత నొకనాఁడు తరుణి యేకాంతవేళ, విభుని పాదంబులకు మ్రొక్కి విన్నవించు. కాశీ. 3. 214.

**విన్నాణము** వి (సం విజ్ఞానం) 1 మల్లబంధము

ఉ ప్రాణములం గదల్పఁగ బలంబున ధైర్యము నిక్కి పెక్కువి,న్నాణము లొప్పఁగా నరిఁ బెనంగ ... భా. రా యు 717

క బలభద్రుఁడు ముష్టికుఁడును, బలములు మెఱయంగఁజేసి బాహాబాహిం, బ్రకియాగున్నల క్రియఁ బోరిరి, వెలయఁగ బహువిధములైన విన్నాణములన్. భాగ. 10. పూ 1346

వ ... గళకత్తెరయు నృసింహంబును నానె విలుకతయు నను ముప్పదిరెండు విన్నాణంబులును ..., ప్రబంధ. 178.

2. సామర్థ్యము, శక్తి

శా. నానా లోకములన్ జయింపఁగల విన్నాణంబు చెందన్ జనస్థానాధీశుఁడు దేవశాత్రిఁ దపమున్ సల్పె న్నిరాహారుఁడై. ఉ హరిశ్చ. 4. 76.

3. నేర్పు

వ . . మధుర కిన్నర నిక్వాణంబుల రాణన్ ద్రోణఁ జెలఁకు విన్నాణంపుఁ గొల్పు చెలుంగును ... మనుచ. 5. 71.

శా. ... రాసంబు మాతోఁడ సంగీకారం బొనరించి బంధనియతిం గ్రీడించు విన్నాణముల్. భాగ. 10. పూ 1478

సీ. తెగువ రాసభ రూపు ధేనుకాసురుఁబట్టి విన్నాణమున మేను విఱిచివైచె. ఉ హరి. 1. 8.

4 ఒప్పిదము, రమ్యత

ఉ వేణి చలింపఁ గంపిత నవీనమృణాల భుజాగ్ర కంకణ, శ్రేణినటింప లోలశఫరీనిభిరీసకటాక్ష కాంతి వి,న్నాణముచూప హంసకగణక్వణనంబును మీఱ .... వసు. 2. 138.

ద్వి. వెన్ను విన్నాణంబు వెడఁద యురంబు, మున్నత భుజములు నొరపైన మెడయు. ప్రభులిం. 1. 4 గతి. 28 పా.

విశ 1 సమర్థమైనది; శక్తము

క. (శ్రీ)నాయక నీ నామము, నానా భవరోగ కర్మ నాశమునకు వి,న్నాణంబగు నౌషధమిది, కావరు దుష్టాత్ములకట కంజదళాక్షా. భాగ. 11. 17.

2 అందమైనది, సుందరము

శా. (శ్రీ) విన్నాణపు గుబ్బచన్నుల వయా రేగంబు రా గుప్పి ముక్తావల్లుల్ ఘటియించె దేమి శశికిం దారా ప్రయుక్తంబనే, భావం బోయని .. శశాం 1 1.

జ॰ విన్నాణి, విన్నాణించు

**విన్నాణి** (సం. విజ్ఞానీ) (విన్నాణము+ఇ)

వి సన్న్యాసి, సన్నాసి

అ. వేదవిదునిచేత విన్నాణిచేతను, దపసిచేతఁ జిన్న దానిచేత, రాయబారిచేత రాజపురుషుచేతఁ, గూఢి పుచ్చుకొనుట చాలఁ దప్పు. విజ్ఞా ప్రా కాం. 87.

విశ. 1 సమర్థుఁడు.

మ. బహువర్షఁబులు బ్రహ్మ దొర్లి జగముత్పాదింప విన్నాణి గా,క హరిప్రార్థన భాంబావశమువం గాదే యమోఘోల్లప, న్మహనీయోజ్జ్వలబుద్ధియై భువన నిర్మాణ ప్రభావంబుతోఁ, విహరించె న్నరనాథ జంతునివహావిర్భావ నిర్ణేతయై. భాగ 2 16

2. నేర్పరి

దండకము ... తద్వక్త్రి పద్మస్థ వేదంబులంగొన్న విన్నాణి యున్నట్టి యంభోధిలోఁ జొచ్చి దాఁగున్న యా సోమకుంబోర మీ నాకృతిం బట్టి కట్టల్కతోఁ జంపి ... చిత్రభా 8 124. దండకము ... గోలోకముం గాచి గోవర్ధన క్షోణి భృత్కందర క్షోణిఁ గ్రీడించు విన్నాణి. పాండు. 4. 77.

**విన్నాణించు** అ. క్రి (√ విన్నాణము) సుందరమగు, ఒప్పిదమగు

ద్వి వగపువెన్నెలల విన్నాణించు మించు, మొగ మెత్తిచూడవే మోహనవాణి. అ మ. ౪ 4. 187. పా 3. పం.

**విన్నావ** (విన్ను+అవ) వి గంగానది.

గీ. పసుఁగులు గుజ్జములు ముస్తనేచి నీళ్ళు. దారి నతమేడ గరిడంబదాఁక నాడు, మున్న విన్నావ యొడ్డున మోసి దొలుకు, దొట్టినట్టి తెలుంగుల తోడివయ్యె అచ్చ. భార ప 3 37. పా

**విన్ను**=విను² వి ఔ ఆకాశము.

గీ విన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె. అము. 4. 91.

గీ. తెచ్చి కంసువ కొసఁగ నుద్వృత్తి 'గుర, వేసి యసిపూన నద్దేవి వింటనిలిచి, వేలెయున్నాఁడు నీవైరి వెట్టియనుముఁ, జనియె దళా 9. 177.

సీ విన్నులపైఁ బాయువెల్లి ముత్యపు జల్లి చలువల బచ్చు చెంగలువ కచ్చు. వరాహ. 9. 88.

జ వింటితెర్వరి, విన్నందు, విన్నావ, విన్నుకేళాకూళి, విన్నుచూలి, విన్నుద్రిమ్మరి, విన్నుమనుముఁడు, విన్నుమూలదేవర, విన్నువాఁక, విన్నువెలుఁగు, విన్నేటికాలువ, విన్నేటికాల్వ, విన్నేఱు

**విన్నుకేళాకూళి** వి. ఆకాశగంగ, సురదీర్ఘిక

సీ. విన్నుకేళాకూళి వెలఁది నీర్నిచిన పసిఁడి జారీ చెంబు వనపొసంగ అ. రా. యు. 154

సీ. విన్నుకేళాకూళి వేల్పుల బోనము తడవుల నిడుపడుపుడుకు దొడుకు. అ. రా యు. 592

**విన్నుచూలి**=వినుచూలి (విన్ను+చూలి) వి. వాయువు.

గీ అనుచుఁ దెదోయిమోడ్చి యో యంటరాని, వెల్పనీ వంగడీఁడగు విన్నుచూలి, కనుఁగుఁగొడుకగు కోఁతికన్నాకునందు, మడుకుచూపక చల్లనై యుండుమయ్య అచ్చ. రా. సుం 169

**విన్నుద్రిమ్మరి**=వినుద్రిమ్మరి (విను+ద్రిమ్మరి)

వి దేవత, ఆకాశమునందు సంచరించువాఁడు.

సీ. విన్నుద్రిమ్మరి రాచకన్నియల్ వరవుల్లు పులుఁగుల మేల్బంతి వలఁతిమాపు అచ్చ. రా. బాల. 6.

**విన్నుమనుముఁడు**=వినుమనుముఁడు వి. (విన్ను+మనుముఁడు) హనుమంతుఁడు

క. అన్నను మున్నుగ బలితపు, మున్నుబికన్ లక్ష్మణుండు మొగిఁదొలి కేఁకే, మిన్నపయినడరుచో గని, విన్నుమనుముఁడతనిఁ ద్రోచి వెసఁదానెదిరెన్. అచ్చ. రా. యు. 211

**విన్నుమూలదేవర** వి. (విన్ను + మూల + దేవర) మిను నికదయ్యము, శివుఁడు

గీ నలువు మెఱయంగఁ బెద్దలనాఁటనుండి, మున్ను దమయింట డాకొనియున్న విన్ను, మూలదేవర విల్లెత్తఁ జాలుమేటి, కితుఁ-న కన్నెనంచు నొట్టదుక యతఁడు అచ్చ. రా బాల 129.

**విన్నువాఁక** వి (విన్ను + వాఁక) మిన్నేఱు, ఆకాశ నది.

ఆ. పిన్నకౌరి యశము వెన్నుకేళాకూళి, విన్ను వాఁకఁబలుకువెలఁదిఁ బుడుకు, దొడుకు రిక్క తేని నొడలి చూ పొడయని, మేటి తేఁటిబోలు డీటులేఖి. రామ. 197.

**విన్నువెలుంగు** వి. (విన్ను + వెలుఁగు) సూర్యుఁడు.

తరల. కడఁగి విన్నువెలుంగు డా గురిగాఁగ నబ్బలు గానలో, నడలుచున్న ననుంగమంగొని యప్పుడర్మిలి నూతిలో, వెడలఁదీయుచుఁ గేలు పట్టితివేకడా యిఁకఁ బెండ్లికిం, గడమ వెల్లను నొంపులింతియకాక మీరలెఱుంగరే. యయా 4. 61.

**విన్నేటికాలువ** వి (విన్ను + ఏఱు + కాలువ) ఆకాశ గంగ.

ద్వి విన్నేటికాలువ వింతగాఁజుట్టి, కొన్న హేమా చల కూటమో యనఁగ ద్వి. పరమ 3 161 పొ

**విన్నేటి తాల్పు** వి (విన్నేఱు + తాల్పు) శివుఁడు, గంగాధరుఁడు.

శా ... విన్నేటి తాల్పున్న యా, గట్టుంబిట్టు పెకల్చి రావణుఁడనంగా మీఱితాఖాసి పెన్, బట్టం జేలెనతండు తమ్ముని గవయొప్పట్లందనుం గొల్వఁగన్ యయా. 2. 63.

**విన్నేఱు** వి జొ (విన్ను + ఏఱు) ఆకాశగంగ.

సీ విన్నేఱు తలఁగల్గువేల్పు నౌదలపువ్వు తలఁప నెవ్వని తాత తాతతండ్రి. యయా. 1. 91.

**విన్పించు** = వినిపించు, వినుపించు స. క్రి (√ విను) వినఁ జేయు

మ. ... విను వానీరెయొడఁజాటు సెల్లె జనులన్ విన్పించితిం దెల్ల గా, వినతం దోడ్కొని పోయె దన్ .. భార. అను. 1. 263.

సీ. పాముసాడించు దేర్పాటునఁ దళుయాఁచి కొంచును జెంగు విన్పించుకొనుచు. కువల 2. 114

**విన్యసించు** సం స క్రి ఉంచు.

వ.. దక్షిణజానూరు మధ్య బవ వామపాదంబును వామజానూరు మధ్య బున దక్షిణ పాదతలం బును విన్యసించి. కాశీ. 3. 239.

**విన్యస్తము** సం. విశ (అ ఆ అ) 1 ఉంచఁబడినది. 2. తాఁపఁబడినది 3. స్థిరపఱుపఁబడినది 4 ఏర్ప ఱుపఁబడినది. 5 ఒప్పగింపఁబడినది. 6. కానుకగా నీయఁబడినది. 7. ఒకని యధీనముగా నుంచఁబడి నది.

**విన్యాసము** సం. వి అ పుం 1 ఒప్పగించుట, ఉంచుట 2 (భయము లేదను నమ్మకముతో సొమ్ము మొ) ఒక చోట నిక్షేపించుట 3 ఏర్పాటు, కూర్పు, రచన, 4. సమూహము 5 నివాసస్థలము, నివేశస్థలము

**విపంచి** సం వి ఈ స్త్రీ 1 వీణ. 2. క్రీడ, వినో దము, ఆట.

**విపంచిక** = విపంచి సం వి ఆ స్త్రీ

**విపక్త్రిమము** సం విశ (అ ఆ. అ) 1. పూర్తిగాఁ బండినది, బాగుగాఁ బక్వమైనది 2. అనుభవింప సిద్ధమైనది.

**విపక్వము** సం విశ (అ అ అ) 1. పూర్తిగాఁ బండినది, బాగుగాఁ బక్వమైనది. 2 అనుభవింప సిద్ధమైనది 3 వండబడినది, పక్వము చేయఁబడి నది

**విపక్షభావము** సం వి అ పుం 1 విరోధము, శత్రు త్వము, పగ 2 తెక్కలు లేక పోవుట

**విపక్షము** సం. వి. అ పుం. 1. ప్రతికూలమైన శత్రు త్రము. 2 వ్యతిరేక దృష్టాంతము (నిశ్చితమైన సాధ్యాభావముగలది) 3 (వ్యాక) అపవాద మాత్రము

**విపక్షుఁడు** సం. విశ (అ. ఆ అ) ప్రతికూలుఁడు, శత్రుత్వముగలవాఁడు

వి అ పుం 1. శత్రువు, పగవాఁడు ) 2 వివాది, ప్రతివాదము చేయువాఁడు.

**విపణనము** = విపనము సం. వి. అ. న.

**విపణము** సం. వి. అ పుం 1. అమ్మకము 2. చిన్న వ్యాపారము (చిన్న వర్తకము).

**విపణి** సం. వి. ఇ. ఈ స్త్రీ 1 అంగడి. 2 అమ్మకము నిమిత్తమైన వస్తువు 3 వర్తకము, వ్యాపారము

వి. న్. పుం వర్తకుఁడు, వణిజుఁడు

**విపత్తి** సం. వి. ఇ స్త్రీ. 1 ఆపత్తు, కష్టము 2 చావు, నాశము. 3 యాతన, తీవ్రమైనబాధ.

వి. అ పుం శ్రేష్ఠుఁడైన కాలిబంటు.

**విపత్తు** సం. వి. త్. స్త్రీ 1 ఆపద, ఇడుము, కష్టము 2 చావు

**విపథము** సం. వి. అ పుం. తప్పుత్రోవ, చెడ్డత్రోవ.

**విపద**=విపత్తు సం. వి. ఆ స్త్రీ

**విపద్గ్రస్తుఁడు** సం. వి. వి. (అ ఆ అ) ఆపదచే మ్రింగఁబడినవాఁడు, ఆపదకు లోనైనవాఁడు, కష్టదశలో నున్నవాఁడు

**విపన్నము** సం. విశే. (అ ఆ అ) 1 ఆపదనొందినది, కష్టములోఁబడినది 2. క్షీణించినది, తగ్గినది 3 నశించినది, పోయినది 4 మృతమైనది, చచ్చినది. 5. అసమర్థమైనది, శక్తిలేనిది

అ. పుం. సర్పము, పాము

**విపరిణమనము** సం. వి. అ న 1. మాఱుపాటు, మాఱుట 2 రూపాంతరము పొందుట, మాఱురూపు నొందుట.

**విపరిణామము**=విపరిణమనము సం. వి. అ. పుం.

**విపరివర్తనము** సం. వి. అ న చుట్టఁబెట్టుట

**విపరీత** సం. వి. ఆ. స్త్రీ 1 పతివ్రత కాని స్త్రీ, కులట 2 కుటిల స్వభావముగల స్త్రీ, విపరీత బుద్ధిగల స్త్రీ.

**విపరీతకరుఁడు** సం. విశే. (అ ఆ అ.) విరుద్ధముగాఁ బనిచేయువాఁడు ఇట్లే విపరీతకారకుఁడు

**విపరీతకారి**=విపరీతకరుఁడు సం విశే. (న్ ఈ న్)

**విపరీతకృత్తు**=విపరీతకరుఁడు సం. విశే. (త్)

**విపరీతచేతను(స్కు)ఁడు** సం విశే. (అ. ఆ. అ.) విరుద్ధబుద్ధికలవాఁడు

**విపరీతమతి** సం విశే. (ఇ) వ్యతిరేక బుద్ధికలవాఁడు, విరుద్ధ బుద్ధికలవాఁడు.

**విపరీతము** సం విశే. (అ ఆ అ) 1 వ్యత్యస్తము, తలక్రిందైనది 2 విలోమమైనది, వ్యతిరేకమైనది 3 తప్పైనది, నిబంధనమునకు విరుద్ధమైనది 4 అసత్యమైనది, నిజము కానిది 5. అనుకూలము కానిది, ప్రతికూలమైనది 6 అడ్డుదగులునది, విరుద్ధముగాఁ బని చేయునది 7. అనిష్టమైనది అశుభమైనది

వి. అ పుం న పురుషాయితము, రతిబంధ విశేషము (వాచ)

**విపరీతరతము** సం. వి. అ. న పురుషాయితము

**విపరీతలక్షణ** సం వి ఆ. స్త్రీ ఒక వస్తువు యొక్క వ్యతిరేక గుణములను వివరించుచుఁ బరిహాసముగా వర్ణించుట, వ్యతిరేక గుణావిష్కరణముచేఁ బరిహాసకర వర్ణన

**విపర్య(ర్యా)యము** సం వి. అ. పుం. 1. వ్యత్యయము, తాఱుమాఱు, వ్యతిరేకము. 2 ఉద్వేగము, వేషము మున్నగువాని మార్పు 3. వినిమయము, వస్తువులను మార్చుట. 4 సమక్షమున లేకపోవుట, అభావము 5. పోవుట, నష్టి 6 సమూల వినాశము, పూర్తిగ నశించుట. 7 తప్పు, అపరాధము, దోషము 8. ఆపద, ఇడుము, దుఃఖము. 9. పగ, శత్రుత్వము, విరోధము. 10. వక్రబుద్ధి, దుశ్శీలము, చెడ్డస్వభావము.

**విపర్యస్తపుత్ర** సం వి. ఆ. స్త్రీ. పుత్రసంతతిలేని స్త్రీ. (విల్సను)

**విపర్యస్తము** సం విశే. (అ ఆ. అ) 1. మాఱినది, తాఱుమాఱైనది 2 వ్యతిరేకమైనది, విరుద్ధము 3 యథార్థమని తప్పుగా గ్రహింపఁబడినది 4 వెనకకు మరలినది. 5. వ్యతిక్రాంతము, అతిక్రమింపఁబడినది.

**విపర్యాసము** సం. వి. అ పుం 1 మార్పు, వ్యతిరేకము 2 ప్రాతికూల్యము 3. వినిమయము, వస్తువుల మార్పు. 4. దోషము, తప్పు.

**విపలము** సం. వి అ. పుం పలములో నఱువదియవ వంతు కాలము, అత్యల్పకాలము.

**విపశ్చి(త్తు)తుఁడు** సం. విశే. (త్.) చదువరి, పండితుఁడైనవాఁడు

వి. త్. పుం విద్వాంసుఁడు.

**విపాండురము**=విపాండువు సం. విశే. (అ. ఆ. అ.)

**విపాండువు** సం. విణ. (ఉ) మిక్కిలి తెల్లనిది, మిగులఁ దెల్లపడినది.

**విపాకము** సం. వి. అ పుం 1. వండుట, వంట 2. జీర్ణమగుట. 3 పరిణామము, పండుట 4 కర్మఫలము, ఫలితము, పర్యవసానము. 5. స్థితియొక్క తారుమారు. 6. దైవవశమున సంభవించిన ఆపద. 7. కష్టము, ఇబ్బంది 8 రుచి

**విపాటనము** సం వి. అ. న 1. చీల్చుట 2. పెల్లగించుట, నిర్మూలించుట, సమూలనాశముచేయుట. 3. చెఱచుట, చెడఁగొట్టుట.

**విపాఠము** సం వి అ పుం ఒకవిధమైన పెద్ద బాణము.

**విపాదనము** సం. వి అ న వశింపఁజేయుట, చంపుట

**విపాదిక** సం వి అ స్త్రీ 1 కాళ్ళు పగులు రోగము 2. విడికథ, గూఢప్రశ్న.

**విపాశ** సం. వి అ స్త్రీ నదివిశేషము, పంజాబు దేశము నందలి బీసు అను నది

**విపినము** సం. వి అ న అరణ్యము, అడవి.

**విపుల** సం వి అ. స్త్రీ భూమి

**విపులము** సం. విణ. (అ ఆ అ) 1. విశాలము, విరివియైనది 2 అధికము, మిక్కుటము, సమృద్ధమైనది. 3. గభీరము, లోతైనది 4 పులకితము, గగుర్పొడిచినది

వి అ. పుం 1. మేరుపర్వతము 2 హిమాలయపర్వతము. 3. మేరుపర్వతమునకుఁ బడమర నున్న యొకానొక పర్వతము.

**విపులరసము** సం. వి అ పుం. చెఱకు.

**విపులుఁడు** సం వి అ. పుం గౌరవముగల మనుష్యుఁడు

**విపుష్టము** సం విణ (అ అ అ.) చెడ్డగాఁ బోషింపఁబడినది, మంచి పెంపకములేనిది

**విపూయము** సం. వి. అ పుం ముంజగడ్డి

**విప్పారు** అ క్రి (విప్పు+ఆరు) 1 విరివిచెందు, విస్తరిల్లు

మ. ఒక నేత్రంబునఁ గజ్జలంబు నిడి వేఱొక్కంట వర్పింప నొ,ల్లక యొక్కర్తు జయాంగనా వరిణయాలంకార విశ్వతమా,పతునిన్ జూచె విలోచన ప్రభలు విభ్రాజిల్ల నిద్దంబులై, వికచేందీవర పద్మతోరణ గతిన్ విపా,రి యొప్పారుచున్. కావ్యా. 2 47

ద్వి ... తమ్మఁ,గప్పిన పుత్రశోకంబునమునిఁగి, విప్పారుకన్నుల వెనవ్రకులొలుక. ద్వి. హరిశ్చ ఉ. 2242

ఉ జంజాత్రై తిరులుగట్టి నెఱుల్ తుదబీట వాఱి వి,ప్పారెడు కీలుగంటు తెఱయన్ విటకంటకి దాసి యమ్మ్యోడన్. విప్ర 5. 25.

2 వికసించు.

శా. ... తవప్రశ్నలకున్, ప్రేకంబై వెలయున్ ఘనోదయమునన్ విపారు నిప్పద్మముల్. పీఠం జిత్ర చరిత్రపాత్రములుగా వేధాత్రి మూహింపఁగాన్. వసు. 5 100

**విప్పు** అ క్రి (√ విడు) 1 విరియు, విరివిఁజెందు.

క ఎప్పుడు విప్పిన గొడుగులును మింటవేగమె మొగిడెన్ ఆము 4 12.

మ. మను గప్రంపు టనంటి విప్పు పొరయన్ జో కెక్కి మాధ్వీ మహోవనధిం బుపొడి దీవికిన్ మధుకర వ్యాపారు లేతేరఁగా .. వసు. 3 142.

2. వికసించు, విరియు

ఉ. దక్షిణనేత్రకాంతి ముచితంబుగ నర్ధవికాసశమొంది వా,మాక్షిరుచి ప్రసారమున నర్ధము విప్పకయున్న పుండరీ,కాక్షుని నాభిపద్మనిలయంబువఁదు మ్మోద భంగిలోఁ డైన.. విరించిఁ దలంచి మ్రొక్కెదన్. ఛ్యా. 1. 3.

3 విడు

చ రయమున . మఱ్ఱోకయించుక విపవ ... ఆము 4 181

స క్రి. 1 విడఁదీయు, విరివిఁ జెందించు.

క. అప్పుడు తూరుపుదిక్కున, విప్పిన వలువ విధమున రాగం, బొప్పఁగఁ బ్రభాతసమయము, చొప్పడియె రథాంగములకు సొంపుగ నంతన్ భోజరా. 2 116

ఉ. ... క్రౌతుల తప్పు పట్టుదున్, ఖండల ముష్టి విపఁగని నవ్వుదు వెండి ప్రయోక్తలన్. ఆము. 7. 3

2. వికసింపఁజేయు, విరియించు.

మ మొగుడుం దమ్ముల విప్పు వప్పుడు రజంబున్ జక్రవాకంపుం గొం,డగడిన్ దేఱు గడైనపట్లం దమమున్ మందేహులందోలి వా,సిగడల్ కొత్త తియందు సత్త్వముం బ్రకాశింపం ద్రిమూర్త్యాత్మ కుం, డగు తేజోనిధి వేడ్కఁ జేయు రఘునాథా ధీశుం దేజోనిధిన్ విజ 1 5.

3 విడఁజేయు

ఉ వేవిన మేడపై పలకి వేణికం జంట వహించి విప్పఁగా ... అము. 1. 62

4 విడఁగొట్టు

సీ. కలికి జక్కవ పిట్టకవఁగూర్పి విప్పంగఁ దరమైన కనుదోయి దయఁ దలంపి దశా 5 46

ఉ తమ్మినయమ్మ దప్పఁ గుముదమ్మ ముద మ్మున నొప్పఁ జక్రవా,కమ్ములు జోడు విప్పి... భాస్కరుం డమ్మెయి వస్తమించె కవిరా 5 173

5 ప్రకటించు.

చ .. పెంచినట్టి రా,చిలుకకుమైనఁ బద్దెములు సెప్పదు విప్పదు మర్మమేరికిం, బోలంతి సుదంతా 2 156

ఉ త్రిప్పకు ... వేఁడు మన దైత్యవరేణ్యుని ప్రమోల నేము మున్. జెప్పిన నీతిగాని మఱి సెప్పకుమన్న విరోధి నీతులన్, విప్పకుమన్న దుష్టమగు విష్ణుచరిత్ర కథార్థ జాలముల్ భాగ. 7 218.

6 వ్యాఖ్యానముచేయు, వివరించు

మ. కలలో వార్తలు విప్పి చెప్పెదు ప్రియన్గాథా పురాణార్థముల్, దెలుపన్నేర్తురు. పాండు 5 214

క హాలధరుఁడు ధర్మజుండును, బలమున కడ్డంబు వచ్చి బ్రతికిన చందం,బుల విప్పి చెప్పఁదిరి గెన్, వలినాథుని మహిమఁ దమ మనములఁ బొగడుచున్ చిత్రభా 8. 118.

పంచచామరము అభీష్టసిద్ధి నీకగున్ మహాత్మ వోయి వత్తు మా, ప్రభుండు వజ్రపాణి మమ్ముఁ బంచె నిర్విశేషముల్, లభించెనంచుఁ బల్కియబ్బలంబు వెంటరాఁ గుభృ, ద్విభేది పాలికేగి చెప్పె విప్పి విప్పి యంతయున్. కకు 1 197.

విశే 1 విశాలము

ఉ చెన్నగు ... వెన్నలరేలఁ గప్పుగవు విప్పుట నంటుల నీడ నీఁగు రా,కన్నెల రోయు వన్నలకు గన్నులుమూయుఁ దదీయ వాసనల్, మన్ననఁగాంచి కప్రవు దుమారము రేఁచు సమీర డింభముల్ వసు. 1 111.

మ. ... చూడఁ జూడఁ బుడమిన్ హాటిల్లి పై విప్పులై, యవనం బ చుల నాడఁగా నెగసె వాత్యాలిన్ రజశ్చక్రముల్ అము 2. 48.

2 అధికము.

క అప్పెను వేసవి విభవము, విప్పుగఁ దన్నగర నికట వృషగిరి హారికిం, దెప్ప తిరునాళ్లురా .. అము 2 71.

క అప్పుడు వివేకవరపతి, ముప్పిరిగొను వేడ్క రత్నముల చెక్కములన్, విప్పగురుచు లోగిఁ గుప్పలు, గప్పెడు రథరాజమెక్కి కదలెడు వేళన్ ప్రబోధ 4 38.

క. కప్పురఁపు తుమకలలవడ, విప్పుగ విడితేనె వాన విడివడి గురియం, జొప్పడర హంస సురపతి, సెప్పెను హేమావతీ కుశేశయ ముఖకిన్ హంస. 2 72

3 గొప్పది, పెద్దది

సీ తళుకులకోరి కోలలపొదల్ విప్పైనకళుకుఁ గ్రొంజికిలి సింగాణివిండ్లు ఇందు 2 64

క. అపకారి నీలభూపతి, యపయశముల విస్తః ముల నలమునవంగా విపులమగు కటిక చీఁకటి విపులాస్థలి నంబరమున విప్పుగఁ గప్పెన్ చంద్ర. వి 3 96.

దం. తోరంబులై మధ్యభారంబులై నిర్జితానంగ బాధోపరి స్వర్ణకుంభంబులై యొప్పు నీవిప్పు వక్షోజకుంభంబులం జూపి భోగినీదండకము.

4 శ్రేష్ఠము, ఉత్తమము.

క ఇప్పగిది సులక్షణముల, విప్పగు కమనీయ కావ్యవితతులు నైకో, నెప్పుడు నీచిత్తమునన చొప్పడు శీతాంశువంశ చూడారత్నా కావ్యా 4 100

వి. 1 వైశాల్యము

చ. ఇనుమునఁ జేసినం బొలుచు నెన్మిది గండ్లగు తేరువేయి పెం,పెవసిన గర్దభంబులువహింపఁగఁ గ్రొక్కము విప్పుగల్గి సా,ధన చయకోటి యొప్పఁగ నుదగ్రతరధ్వజ మగ్రభాగముంబిని యయి గ్రాలఁగాఁజనితెఖిరి విదూరుఁడుతారుఁ డాతికిన్. హరి. పూ. 4 83

చ. పొలఁతుక గుబ్బచన్నుఁగవ పొంగున కయ్యెద చాలదయ్యెఁ దో,య్యలి కనుఁ దోయివిప్పునకు నాననబింబము చాలదయ్యె. కవిరా 5 124.

క. అప్పుడు పదియోజనముల, విప్పువగాడుపవకు డుగ్రపువేశంబునఁగా, నప్పురము దిరిగి రాముని, చెప్పిన కందువల నట్లుసేకొని విడియన్ భా రా. యు. 498

2. అధిక్యము.

చ. వినుమిటులున్న యీ జనుల విప్పుగనుంగొన వచ్చినం బురం,బున కిచటిమ్మ చాలదనుబుద్ధి జనించె గణించిచూడుమా హరి. ఉ. 2 158

వ. అప్పటప్పటికిం గనుజివ్వలఁ దెప్పలుగా గుప్ప ళించు విప్పుగల నిప్పుకల కుప్పలకుం దోడు నప్పళించినం జిప్పిలు దంష్ట్రల గదనర్గళ లాలాజలంబు రాహువు ముక్కాలు గ్రాసం బుగా మెక్కినం జిక్కిన రిక్కదొర ప్రక్కం దొరఁగు .. రా. వి. 3 65

3. విరియుట (చుట్టు మొ.) విడిపోవుట

సీ. ఛిద్రోత్థితహత వలత్క్రూరజమనఁజుట్టు తో విప్పుతోదరిఁ దొండమూడ ఆము 4 153.

4. విరిసిపాఱు, చెదరిపాఱు.

సీ. తనయభిజాత నూతన సువర్ణస్ఫూర్తి విషధరం బులమూఁక విపాఎనరప వసు 6 45

విప్పుచఱచు=విరివిచెందు

గీ. వెన్ను వఱవయి కంఠంబు విప్పుచఱచి,పిఱుఁదు తెఱఁగొంతి వడవు నొప్పెడిను వింత, తెఱఁగు గైకొన గోపాలదేవమూర్తి. హరి. పూ 6. 177

విప్పుగంటి వి (విప్పు+కన్ను) తెఱగంటి, అని మిషుఁడు.

సీ. గగనవీమను విప్పుగంటి తా వాల్గంటిగము లాడు తెలిగచ్చ తాయలవఁగ నుదంతా 2 150.

గీ. వెలయుఁ బగ్గంపుఁగగ్గంపు విప్పుగంటిసామి నగరంబు ధరణీరసాగరంబు. ఘటికా 1 83. (వగ్గంపుఁగగ్గఁపువిప్పుగంటిసామి=వరుణుఁడు.)

విప్పువాఱు (విప్పు+పాఱు) అ. క్రి వికసించు

సీ వెనువెంట ముకుళముల్ విప్పువాఱఁ దనర్చు విరులతండములతో విఱ్ఱవీఁగె కృ. శకుం 1 71

విప్పుసేయు స క్రి (విప్పు+చేయు) బహుళముగాఁ జేయు, అధికముగాఁజేయు

వ మేఖలాకలాప కింకిణీ కలకలంబుమఁ గుఱుచ తెలుంగులం గలసి సకినల కీలుఁబజపుల చప్పుళ్లు విప్పుసేయ .. నైష. 7. 187

విప్రకర్షము సం. వి అ పుం. దూరము, దవ్వు

విప్రకారము సం. వి. అ. పుం 1. అవమానము, తిర స్కారము, అగౌరవపరచుట 2. అపాయము, హాని 3. దుష్టత, చెడ్డతనము 4. వ్యతిరేకముగాఁ జేయుట, వ్యతిరేకము 5 ప్రతిక్రియ, మాఱు సేఁత

విప్రకాష్ఠము సం. వి. అ న ప్రత్తిచెట్టు (వాచ)

విప్రకీర్ణము సం. విణ. (అ ఆ. అ) చిమ్మఁబడినది, చల్లఁబడినది, చెదరఁగొట్టఁబడినది 2 వ్యాపించి నది 3 విడినది, ముడి విడిపోయినది (జుట్టు). 4 విస్తరింపఁజేయఁబడినది. 5. విశాలమైనది, విరివి యైనది

విప్రకృతము సం విణ (అ. ఆ అ.) 1. హానికలి గింపఁబడినది. అపకారము చేయఁబడినది 2 అవ మానపరుపఁబడినది, నిందింపఁబడినది, అగౌరవ పరుపఁబడినది 3. ఎదిరింపఁబడినది 4. ప్రతిక్రియ చేయఁబడినది, ప్రతీకారము చేయఁబడినది. 5. క్రతు పెట్టఁబడినది, ఒత్తుడు కలిగింపఁబడినది 6 రేఁపఁ బడినది, కోపము రప్పింపఁబడినది

విప్రకృతి సం వి ఇ. స్త్రీ 1. అపాయము, హాని. 2. అవమానము, తిరస్కారము 3. ప్రతీకారము, ప్రతిక్రియ, మాఱు సేఁత.

విప్రకృష్ట(క)ము సం విణ. (అ. ఆ అ) 1 విశా రింపఁబడినది, తొలగింపఁబడినది. 2 దూరమైనది. 3. పొడవుగాఁ జేయఁబడినది, దవ్వున మన్నది,

**విప్రతికారము** సం. వి. అ. పుం. 1 ఎదురుగాఁ బని చేయుట, వ్యతిరేకముగాఁ బనిచేయుట. 2. ప్రతీకారము, మాఱుసేఁత, (ఉపకారాపకారములకు) మాఱుచేయుట

**విప్రతిపత్తి** సం. వి. ఇ. స్త్రీ 1 పరస్పర విరోధము, వివాదము: అభిప్రాయము మొదలగు వానియందలి విరుద్ధభావము. 2 అనంగీకారము, అడ్డు 3 కలవరము, కలఁత 4. పరస్పర సంబంధము 5 పరిచయము, చనవు 6. సంశయ జనకమైన వాక్యము 7 (తర్క) విరుద్ధ కోటిద్వయముం దెలుపు శబ్దము. (వాచ.)

**విప్రతిపన్నము** సం. విశే (అ. ఆ. అ) 1. పరస్పర విరుద్ధమైనది, ఒకదాని కొకటి వ్యతిరేకమైనది 2. కలఁతపడినది, కలవర పడినది 3. వివరింపఁబడినది, వివాదముచేయఁబడినది. 4 పరస్పర సంబంధముగలది. 5 సందిగ్ధము, సందేహముతోఁ గూడినది (వాచ)

**విప్రతిషేధము** సం. వి. అ. పుం. 1 స్వాధీనముగా నుంచుట, తన యధికారములో నుంచుట. 2. తుల్య బల విరోధము, సమానమైన ప్రాధాన్యముగల రెండు పనులకుఁ బరస్పర విరోధస్థితి. 3. (వ్యాకరణము) సమబలముగల రెండు భిన్న సూత్రములకు నేక స్థలమునఁ బ్రవృత్తి గలుగుట, తుల్యబల విరోధము 4. నిషేధము

**విప్రతి(తీ)సారము** సం. వి. అ. పుం. 1 పశ్చాత్తాపము 2 కోపము, కినుక. 3. చెడ్డతనము, దుష్టత్వము.

**విప్రనష్టము** సం. విశే (అ ఆ అ) 1. నష్టమైనది, అదృశ్యమైనది. 2. వ్యర్థమైనది, పనికిమాలినది

**విప్రప్రియము** సం. వి. అ. పుం. పాలాశ వృక్షము, మోదుగుచెట్టు (వృ. వి.)

**విప్రము** సం. వి. అ. పుం. అశ్వత్థ వృక్షము, రావి చెట్టు. (వృ. వి.)

**విప్రముక్తము** సం. విశే (అ. ఆ. అ) 1 స్వేచ్ఛగా విడువఁబడినది, వదిలివేయఁబడినది. 2. ప్రయోగింపఁబడినది, వదిలివేయఁబడినది (బాణము మొ.) (సమాసాంతమున) శూన్యము, రహితమైనది.

**విప్రయాణము** సం. వి. అ. న. యుద్ధమునఁ బాఱి పోవుట, పలాయనము,

**విప్రయుక్తము** సం. విశే (అ ఆ అ.) 1. వియోగమును బొందినది, ఎడబాసినది. 2. విడదీయఁబడినది, వేఱుచేయఁబడినది 3. ఎడఁబాపఁబడినది, వియోగము నొందింపఁబడినది 4. విడుదల చేయఁబడినది, విడువఁబడినది 5. (సమాసాంతమున) సహితమైనది, శూన్యము, లేనిది

**విప్రయోగము** సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు, విరహము. 2 ఐకమత్యములేమి, కూడికలేమి, వీడిపోవుట 3 కలహము, విరోధము 4 తగియుండుట.

**విప్రలంభనము** సం. వి. అ. న. వంచన, మోసము.

**విప్రలంభము** సం. వి. అ. పుం. 1. వంచించుట, మోసపుచ్చుట 2. భ్రాంతిచెందుట, మాయలోఁబడుట. 3. ముందొప్పుకొని వెనుకలేదని వాదించుట. 4. కలహము 5 ఐకమత్యములేమి, విభిన్నభావము, కూడికలేమి. 6. స్త్రీపురుషుల యెడఁబాటు, వియోగము, విరహము 7. (అలం) శృంగారరసభేదము, స్త్రీపురుషుల విరహకాలము నందలి శృంగార రసము. (వ్యతి) సంభోగశృంగారము

**విప్రలప్తము** సం. వి. అ. న 1. వివాదము. 2. కలహము 3. విలాపము

**విప్రలబ్ధ** సం. వి. ఆ. స్త్రీ ఒకానొక శృంగారనాయిక, సంకేతము నేర్పఱచి వచ్చెదనని మాటయిచ్చి యట్లురాని ప్రియునిచే వంచింపఁబడిన నాయిక

**విప్రలబ్ధము** సం. విశే (అ ఆ. అ) 1 మోసపుచ్చఁబడినది, వంచింపఁబడినది. 2. ఆశాభంగము నొందింపఁబడినది 3 హానిగలుగఁ జేయఁబడినది, అపాయము నొందింపఁబడినది

**విప్రలాపము** సం. వి. అ. పుం 1 బొత్తిగాఁ బనికి మాలిన సంభాషణము, వదరు, ప్రేలుడు 2. విరుద్ధోక్తి, పరస్పర విరుద్ధముగాఁ జెప్పుట 3. వివాదము. 4. అడినమాట తప్పుట

**విప్రవాసనము** సం. వి. అ. న 1. దేశభ్రష్టత, దేశమునుండి వెడలఁగొట్టబడుట 2 దేశాంతరమున నుండుట, దేశాంతరవాసము

**విప్రవాసము** సం. వి. అ. పుం. పరదేశమ్మున నుండుట, దేశాంతరవాసము,

విప్రశ్నిక సం. వి. అ. స్త్రీ దైవజ్ఞురాలు, సోదె చెప్పెడి స్త్రీ వేలుపుసాని

విప్రియము సం. విణ. (అ. అ. అ) ఇష్టముకానిది, రుచి లేనిది

వి: అ. న అనిష్టమైన పని అపకారము, చెడ్డపని.

విప్రీతి సం. వి. ఇ. స్త్రీ. వైమనస్యము, విరోధము

సీ. ... మీరేవురకపుడు ద్రుపద, సుత యొక్కతియ ధర్మమతి ధర్మపత్ని యైనది యీ క్రమంబు లోకాగమంబు, లందు విరుద్ధ మీ సుందరి కార ణంబున మీకు విప్రీతి పుట్టకుండ . భార. ఆది 8. 23

విప్రుఁడు సం. వి. అ. పుం. 1 బ్రాహ్మణుఁడు. 2. ఋషి, విద్వాంసుఁడు. 3. సూక్త (మంత్ర) పాఠకుఁడు

విప్రు(ప్లు)షము సం. వి. ష్. స్త్రీ 1 బిందువు, చుక్క, బొట్టు. 2 చిహ్నము, మచ్చ

విప్రోషితభర్తృక = ప్రోషితభర్తృక ప్రవాసము నకుఁ బోయిన భర్తగల స్త్రీ, దేశాంతర గతుఁ డైన భర్తగల స్త్రీ.

విప్రోషితుఁడు సం. విణ. (అ. అ. అ) దేశాంతర మున నున్నవాఁడు. 2 దేశభ్రష్టుఁడు, దేశము నుండి వెడలగొట్టఁబడిన వాఁడు

విప్లవము సం. వి. అ. పుం. 1 కొట్టుకొనిపోవుట, నీటిలోఁ గొట్టుకొని పోవుట, నలుమొగములఁ గొట్టుకొనిపోవుట 2. వ్యతిరేకము, పరస్పర విరోధము. 3. కలఁత, క్షోభము 4. దొమ్మి యుద్ధము. 5. శత్రురాజుల వలని యుపద్రవము, రాష్ట్రోపద్రవము, దోపిడితోఁ గూడిన యుద్ధము. 6 బలాత్కారముగాఁ బుచ్చుకొనుట 7 నాశనము 8. ప్రాతికూల్యము 9 అద్దముపై మాలిన్యము. 10. ఉల్లంఘించుట. శాసనాదికమును నిర్లక్ష్యము చేయుట 11. ఇడుమ, కష్టము, ఉపద్రవము 12. పాపము, దుష్టత్వము. 13 అఱపులతోను (కేకలతోను), చేష్టలచేతను (అభినయములచేతను) శత్రువును భయపెట్టుట. 14 (గహాస్యము) బైటఁ బెట్టుట

విప్లావము సం. వి. అ. పుం. 1. జలప్రళయము, వఱదలో మునుఁగుట 2. దొమ్మి యుద్ధము 3. పించుట. 3 అశ్వగతివిశేషము, గుఱ్ఱపు నడకలలో నొకవిధము (దౌడు)

విప్లుతము సం. విణ. (అ. అ. అ) 1. నీటిలోఁ గొట్టుకొని పోవునది 2 నీటిలో మునిఁగినది. 3. కలఁత నొందినది, కలవరపెట్టఁ బడినది. 4. ఉపద్రవము నొందినది 5. పోయినది, కనఁబడనిది, అగోచర మైనది 6 అగౌరవపఱుపఁ బడినది, అవమానింపఁ బడినది 7 నశింపఁజేయఁబడినది 8 మఱుఁగు పఱుపఁబడినది, కప్పఁబడినది 9 అతిదుర్మార్గము, కామాతురము 10 వ్యతిరేకమైనది, పరస్పరవిరుద్ధము. 11 అసత్యము.

విఫల సం. వి. ఆ. స్త్రీ కేతకి, మొగలి

విఫలము సం. విణ. (అ. అ. అ) 1. ఫలములేనిది, పండ్లులేనిది, నిరుపయోగము, వ్యర్థము, ప్రయోజనములేనిది, లాభములేనిది. 2 అర్థములేనిది. (అ. ని.)

విఫలీకృతము సం. విణ. (అ. అ. అ) 1 ఫలములు లేనిదిగాఁ జేయఁబడినది. 2 వ్యర్థపఱుపఁబడినది. నిరుపయోగముగాఁ జేయఁబడినది

విఫలీభూతము సం. విణ. (అ. అ. అ) 1. నిష్ఫలమైనది 2 వ్యర్థమైనది, నిష్ప్రయోజనమైనది, పనికిమాలినదైనది

విఫా(భా)లు(ళు)ఁడు సం. విణ. (అ. అ. అ.) నశింపఁ జేయు వాఁడు

గీ మదరిపువిఫాల మునిజనహృదయలోల. వేఙ. శ 1

ఉ చమూ, పాల సమేతుఁడై రిపు విఫాలుఁడు నందురికామమంత్రి వా, హ్యాళి విహారముల్ సలుపు నర్థిజనుల్ జయవెట్టుచుండఁగన్. జాహ్నవి. 1. 84

2 జయించు వాఁడు

సీ ముందట బలభేది ముఖ్యదిక్పతి విభాళాయని బహుకాహళములు మొరయ వరాహ 5 27

విబంధము సం. వి. అ. పుం. 1 మలబంధము, విరేచనబంధము. 2. ఆటంకము, నిరోధము

విబద్ధము సం. విణ. (అ. అ. అ) 1 విశేషముగాఁ గట్టఁబడినది, గట్టిగా బంధింపఁబడినది 2. నిరోధింపఁబడినది, అడ్డగింపఁబడినది.

**విబుద్ధము** నం విశ (అ అ అ) 1 మేల్కొంచినది, మెలకువగానినది 2 వికసించినది, విరిసినది. 3. నేరుపు గలది, నైపుణ్యము గలది. 4. బోధము లేనిది, మనస్సునకు స్ఫురణ లేనిది.

**విబుధాధిపతి** నం వి. ఇ పుం ఇంద్రుడు, వేలుపుల ఱేడు.

**విబుధానుడు** నం. వి. అ. పుం 1 విద్వాంసుడు, పండితుడు 2 ఉపాధ్యాయుడు, ఒజ్జ

**విబుధుడు** నం. వి అ పుం 1 విద్వాంసుడు, పండితుడు 2 వేలుపు, దేవత 3 చంద్రుడు

**విబుధేంద్రుడు** నం వి అ పుం ఇంద్రుడు, వేలుపు ఱేడు.

ఇట్లే, విబుధేశ్వరుడు

**విబూది** వి. (నం. విభూతిః) భూతి, బూది

గీ .. బూది విబూది యనగ, భూతి దనరారు శ్రీమాతృభూతలింగ. ఆం భా 1. 48.

**విబోధము** నం వి అ పుం 1 మెలకువ, జాగరూకత, 2 కనిపట్టుట, కనుగొనుట. 3 తెలివి, వివేకము, 4 (అలం) ముప్పదిమూడు వ్యభిచారభావములలో నొకటి 5. పరధ్యానము.

**విభ** నం. వి ఆ. స్త్రీ 1 ప్రకాశము, వెలుగు. 2 కిరణము. 3 సౌందర్యము, చక్కదనము, శోభ.

**విభంగము** నం. వి అ పుం. 1. పగులు, బీట, విఱుగుట 2. అటంకపఱుచుట, నిరోధము, అడ్డగింత. 3 (కనుబొమలు) ముడుచుట. 4 ముడుత 5 మెట్టు, సోపానము 6 వెలిబుచ్చుట, స్పష్టపఱుచుట, 7 పంపకము, విభజనము, వేఱుపఱుచుట.

**విభక్తజుడు** నం వి. అ. పుం తన తండ్రియొదన సోదరులును కుటుంబపు సొత్తు పంచుకొనిన తర్వాత బుట్టిన కుమారుడు.

**విభక్తము** నం. విశ. (అ. ఆ అ.) (ఆస్తి) పంచబడినది, భాగములుగా నేరుపఱుపబడినది. 2. కృతవిభాగము, పంచుకొనినది 3 వేఱుగా నుంచబడినది, విడదీయబడినది 4 భిన్నభిన్నమైనది, వివిధము, నానా ప్రకారమైనది. 5 (ఉద్యోగాదుల నుండి) నివృత్తమైనది, మరలినది, ఏకాంతముగా నున్నది. 6 వక్రముగు, అనురూపముగానున్నది. 7 అలంకరింపబడినది 8 కొలువబడినది

వి అ న 1. ఏకాంతస్థితి, ఒంటరిగా నుండుట, (వ్యాపారాదులనుండి) విరమించుట 2. భాగము, వాటా, 3. పంచుకొనిన సొత్తు 4 ఎడబాటు.

**విభక్తి** నం వి ఇ స్త్రీ 1 విడదీయుట, పంచుకొనుట, వేఱుచెయుట. 2 భిన్నభిన్నమగుట, వేఱువేఱగుట 3 దాయభాగము, భాగము 4. ప్రాతిపదికాదులకుఁ జేర్చెడి ప్రత్యయము

**విభక్తుడు** నం వి అ పుం కుమారస్వామి...విశ. వేఱుగానున్నవాడు, పంచుకొనినవాడు (విభక్తులు = సోదరులు.)

**విభజనము** నం. వి అ న విభజించుట, విభాగము.

**విభజించు** నం న. క్రి. విభాగించు, వేఱుపఱుచు

క. నిలిచిన గనుగొని యిమ్మెయి, గలసిన యమ్మొదలు రెండుగా విభజింప, న్వలయునని యటుడు పలికిన (మార్క. 4. 54.)

**విభవము** నం వి అ పుం 1 ధనము, సొత్తు, ఆస్తి 2 బలము, శక్తి, మహత్త్వము 3 ఉన్నతస్థితి, హోదా, గొప్పతనము. 4 ఔదార్యము, 5 మోక్షము; 6 సర్వమూర్తద్రవ్య సంయోగిత్వము, మహాభూతాదుల లక్షణము. 7 ప్రభవాదులయినఱువది సంవత్సరములలో నొకటి, రెండవది

**విభాకరము** నం వి. అ పుం 1 అర్క వృక్షము, జిల్లేడుచెట్టు 2 అగ్ని, నిప్పు

**విభాకరుడు** నం వి అ పుం. 1 సూర్యుడు. 2. చంద్రుడు 3 అగ్ని

**విభాగధర్మము** నం వి అ పుం దాయమును గురించిన ధర్మశాస్త్రము

**విభాగము** నం. వి అ పుం 1. పంపకము, పంచుకొనుట, దాయము పంచుకొనుట, 2. దాయభాగము 3 భాగము, వాటా, పాలు. 4 విడిపోవుట, వేఱగుట, (తర్క) ఇరువదినాలుగు గుణములలో నిదియొకటి. 5 అంశము, లవము 6 ఖండము, కొంతభాగము 7. రచన, ఏర్పాటు

**విభాగించు** నం. న. క్రి 1 విభజించు, పంచు,

గీ వసుమతీచక్ర మేకోష్ణవారణముగ, నేలి భర తాదిసుతులకు నేడుదీవులునుస్విభాగించి యిచ్చి తా< జనియె . వరాహ. 1. 87

వ. .. మనుష్యులకు జనన మరణాదులయెడ వేద నావేశంబునుంగా విభాగించె ... భార శాం 5. 443

2. వేఱుపఱుచు.

క. ... ఆ, య్యాసువదితాల్గింటని దరతరమ విభాగించి చెప్పెదం దెలియంగన్ భార.శాం 6 6.

**విభాజకము** సం విశ (అ. ఈ అ ) విభజించునది (భాగహారమునందు విభజించుసంఖ్య )

**విభాజనము** సం. వి అ న పంచుట, విభజించుట.

**విభాజితము** సం విశ. (అ ఆ. అ ) విభజింపఁబడినది.

**విభాజ్యము** సం. విశ (అ ఆ. అ ) 1 పంపకము చేయఁదగినది, పంచుకొనఁదగినది (ఆస్తి మొ ) 2 విభజనీయము, వేఱుచేయఁదగినది

**విభాతము** సం వి అ న ప్రభాతము, వేకువ.

**విభ్రాళించు** సం న క్రి 1 కొట్టు

శా పాశం బాఱఁగఁదోలి యంతకు దిశాపట్టంబు గారించి పూ,ర్వాశాధీశ్వరు వెన్నడిం జని ధనాఢ్యతున్ విభాళించికే, శీకస్త్రాశ్రువిహార సార మెచటన్ లేకుండ నిర్మించితిన్, మీ శాస్త్రంబుల నింక నెవ్వరికగున్ మేలైన యజ్ఞాంశముల్ ఉ హరి. 1 91.

సీ .. ఇంద్ర బర్హిః పరేతపాస్రవ ప్రచేతసుల విభాళించిన సమీరు డాసిరి ... వరాహ 6. 180

2 ఖండించు, నఱకు

సీ కులధరాధరపక్షములు విభాళించిన దంభోళి తనకటి తాపగాఁగ,గీ వాలి ముల్లోకముల నేలు వానవుండు . వరాహ. 3 65.

ద్వి పొట్టలు చించి వీఁపులు విభాళించి, యట్టలు వేలతో నడిచి కొందఱును. విశా 4. 70. పా.

3 వశపఱుచుకొను.

సీ. ఆకలి గొన్నాఁడ వశనంబు పెట్టుపు మదీవన్ను బ్రాహ్మణమాత్రుఁగా విచారింపకుము విను కౌశికకర్మమును దఱత వహించిన ప్రతిస్పర్థి విఱుగ, దట్టించి నాల్గువేదములు విభాళించి బ్రహ్మార్థం బెక్కి బహువిధాధ్వ, రాగ్రపూజనము పరిగ్రహించిన జగజెట్టి యోగ్యుఁడ ... వరాహ. 6. 20.

**విభావకము** సం విశ (అ. ఆ అ ) ప్రకటించునది, స్పష్టపఱుచునది, చూపునది 2 చక్కఁగాఁ బరిశీలించునది, బాగుగాఁ బర్చించునది

**విభావన** సం. వి. అ స్త్రీ. 1. స్పష్టముగాఁ దెలిసికొనుట, నిజము గ్రహించుట 2 పరిశీలనము. పరిశోధనము, విమర్శనము 3. భావన, తలఁపు. 4 అర్థాలంకార భేదము (కారణము లేకయే కార్యము పుట్టినట్టు వర్ణించుట )

**విభావనము** సం. వి అ న 1 స్పష్టముగాఁ దెలిసికొనుట; నిజము గ్రహించుట 2 పరిశీలనము, పరిశోధనము, విమర్శనము 3 భావన, తలంపు.

**విభావము** సం వి అ పుం 1 (అలం) రసోద్దీపకములగు భావములలో నొకటి (ఇది ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము అని ద్వి విధము.) 2. పరిచయము 3. ఉద్రేకమును బుట్టించు సంగతి (వేషము, భాష. మొ )

**విభావరి** సం వి అ స్త్రీ 1. రాత్రి. 2 పసుపు. 3 కుంటెనకత్తె 4 లంజె 5 కుటిల స్వభావము గల స్త్రీ 6 వదరుబోతైన యాఁడుది, వాచాటురాలు

**విభావసు(ఁడు)వు** సం. వి ఉ. పుం 1. సూర్యుఁడు 2. అగ్ని. 3 చంద్రుఁడు

**విభావసువు** 1 జిల్లేడుచెట్టు. 2. చిత్రమూలము. (వ్యు వి ) 3 ఒకవిధమైన హారము

**విభావితము** సం. విశ (అ అ అ.) 1 ప్రత్యక్షము చేయఁబడినది, చూపఁబడినది 2 గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది 3 ఆలోచింపఁబడినది. 4 నిశ్చయింపఁబడినది 5 అనుమతి చేయఁబడినది, ఊహింపఁబడినది, సూచింపఁబడినది 6. నకారణముగా రుజువుచేయఁబడినది, స్థాపింపఁబడినది.

**విభాష** సం వి అ స్త్రీ. 1 పక్షాంతరము, వికల్పము. 2 (వ్యాక ) ఒక సూత్రము వికల్పముగాఁ వర్తించుట.

**విభాసిల్లు (లు)** సం. అ. క్రి ప్రకాశించు.

మ హేమపటకణ్యా సుందరాందోళనం,బు
విభాసిల్లు పిటించిదిక్కునకు నొప్పుల్పెంప ...
హరి పూ 8 12,

చ. పలుకఁదలంప దవ్వులగు భారతరామ కథార్థ
ముల్ విభాసిలఁగ వరంటపందొలిచి చేతికి
నిచ్చినరీతి... కళా. 1 6

**విభిన్నము** సం విణ (అ ఆ అ) 1 చీల్పఁబడినది 2 గ్రుచ్చఁబడినది గాయపఱుపఁబడినది 3. త్రోసిపుచ్చఁబడినది, చెదరఁ గొట్టఁబడినది 4. కలఁతనొందినది, కలవరపడినది. 5 ఇటునటు కదలఁబడినది 6. ఆకారంగము కలుగఁజేయఁబడినది, వేఱువేఱయినది 7 నానారూపమైనది 8 మిశ్రము చేయఁబడినది, కలుపఁబడినది. 9. స్పష్టపఱుపఁబడినది 10 కృతఘ్నము, విశ్వాసరహితము.

**విభిన్నుఁడు** సం వి అ పుం. శివుఁడు,

**విభీత** సం. వి అ స్త్రీ తాండ్రచెట్టు, తాఁడి (వృ వి)

**విభీతకి** సం. వి ఈ స్త్రీ. తాండ్రచెట్టు, తాఁడి (వృ వి.)

**విభీషకము** సం విణ (అ ఆ అ) భయపెట్టునది, బెదరించునది

**విభీషణము** సం విణ. (అ ఈ అ.) 1 మిగుల భయపెట్టునది, దిగులుగొలుపునది 2. గద్దించునది, అదరించునది. (మాట)

వి. అ న 1 మిక్కిలి భయపెట్టుట, వెఱపించుట, 2 వెఱపు, భయము.

పుం నలము, కిక్కస (వృ. వి)

**విభీషణుఁడు** సం వి అ. పుం రావణుని కొంచెప తమ్ముఁడు, శ్రీరామభక్తుఁడు.

**విభీషిక** సం వి. ఆ. స్త్రీ 1. భయము, వెఱపు 2 వెఱబొమ్మ, భయపెట్టుటకుపయోగించు సాధనవిశేషము

**విభు(ఁడు)** సం విణ. (వి, త్రి ఉ.) 1 బలవంతుఁడు, 2. ఘనుఁడు, శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు 3 సమర్థుఁడు. 4. స్థిరుఁడు, జితేంద్రియుఁడు 5. సర్వవ్యాపకుఁడు, అద్యంతరహితుఁడు, శాశ్వతుఁడు. 6. (తర్క) సర్వమూర్తద్రవ్యసంయోగి 7. దృఢమైనవాఁడు, గట్టివాఁడు,

వి ఉ పుం 1. ఆకాశము 2. స్థలము, అవకాశము 3. సమయము, కాలము 4. జీవుఁడు. 5 ప్రభువు, పాలకుఁడు, యజమానుఁడు 6 చక్రవర్తి, రాజాధిరాజు 7 భృత్యుఁడు, సేవకుఁడు.

**విభూతము** సం విణ. (అ ఆ అ) 1. బయలుదేఱినది ఉద్భవించినది. 2 కనఁబడినది, గోచరమైనది 3 గొప్పది, బలవత్తరమైనది

**విభూతి** సం వి. ఇ స్త్రీ 1. బలము, శక్తి 2. అభ్యుదయము, క్షేమము 3 మహత్త్వము, గొప్పతనము. 4. ఐశ్వర్యము, సంపద, వైభవము. 5. ధనము, ఆస్తి 6 అణిమాద్యష్ట సిద్ధులుగల అమానుషశక్తి, (అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము ఇవి యష్టసిద్ధులు) 7. గోమయభస్మము.

**విభూష** సం వి ఆ స్త్రీ 1. అలంకారము, నగ. 2. ప్రకాశము, కాంతి. 3. చక్కఁదనము, శోభ.

**విభూషణము** సం వి అ న అలంకారము, నగ

**విభూషించు** సం. స క్రి. అలంకరించు.

సీ రోహణాచలపతి నూహించి వరరత్నసంచ
యంబున విభూషించినట్లు, .. కు. సం. 1 49.

**విభూషితము** సం విణ (అ ఆ అ) అలంకరింపఁబడినది.

**విభృతము** సం విణ (అ. ఆ. అ.) పోషింపఁబడినది.

**విభేదము** సం వి అ పుం 1 భేదము, విరోధము, పగులఁగొట్టుట 2. విడఁదీయుట, విభాగము. 3. గాయపఱుచుట 4. కలత, క్షోభము. 5 వ్యతిరేకము, ప్రాతికూల్యము. 6. శత్రుత్వము, విరోధము

**విభేదించు** సం స క్రి భేదిల్లఁజేయు, పగులుచు.

మ . . అశ్వసంతతుల గాత్రంబుల్ విభేదించి
యున్. జై భా 2. 56.

**విభేదిల్లు** సం. అ. క్రి. బ్రద్దలగు, పగులు.

మ. . . భూరితరారాతిబలంబులం బొదివి మూర్ఛ
ల్లన్ విభేదిల్లఁగం, పితచేష్టన్ దురపిల్ల విహ్వల
దశన్ భీతిల్లఁజేసెన్. హరి. పూ 4. 126.

**విభ్రంశము** సం వి. అ పుం 1 పడిపోవుట, జారిపోవుట 2 భయము, నాశము 3. ఏటవాలుగా నుండు స్థలము

**విభ్రంశితము** నం విశ (అ ఆ అ) 1 పడవేయఁబడినది, రాల్పఁబడినది 2 పాడుచేయఁబడినది, చెఱుపఁబడినది. 3. లేకుండఁజేయఁబడినది. 4. వశింపఁజేయఁబడనది, ధ్వంసముచేయఁబడినది.

**విభ్రమ** నం వి అ. స్త్రీ వార్ధకము, ముదిమి

**విభ్రమము** నం వి అ పుం 1 తిరుగుట, ఇటునటు సంచరించుట, చుట్టగాఁచుట్టుట 3 భ్రమ, పొరపాటు, ప్రమాదము, తప్పు. 4 అతిత్వర, తొందర, కామవికారముచే మనస్సునఁబుట్టిన తొట్రుపాటు

శ్లో. చిత్తవృత్త్యనవస్థానం శృంగారాద్విభ్రమోభవేత్.

5 అతిత్వరచే (తొందరచే) నలంకారములను దబ్బిబ్బుగా ధరించుట. 6 స్త్రీల శృంగార చేష్టా విశేషము 7 సౌందర్యము, చక్కఁదనము 8 సందేహము, ముందు హానిగలుగునని తెలియుటచేఁ గలిగిన భయము. 9. చాపల్యము, మనసునకుఁ గుదురులేమి 10 విలాసము, రీతి, విధము.

వ. ... సింధునాథావరోధంబునఁ బొల్పుక్రీడాశైలంబుల విభ్రమంబుల నభ్రంకషంబులై వెలయు పులినతలంబులు విప్ర. 2 14.

**విభ్రమించు** నం. అ క్రి తిరుగుడుపడు

సీ. ... అపగతవ్యాసంగమగుటఁ జీత్కారంబు వెలిగాఁగ జక్రంబు విభ్రమింప . కాశీ. 1 126.

**విభ్రష్టము** నం విశ (అ ఆ అ.) 1 పడిపోయినది, జాఱినది, రాలినది 2. క్షీణించినది, నశించినది, చెడిపోయినది 3. అదృశ్యమైనది, అంతర్ధానమైనది 4. శూన్యము, విహీనమైనది, లేనిది.

**విభ్రాంతము** నం. విశ (అ ఆ అ) 1 భ్రాంతి నొందినది, పొరపడినది, తప్పినది 2 మడతపడినది, చుట్టచుట్టుకొన్నది 3 త్వరపడినది, తొట్రుపడినది. 4 కలవరపడినది, క్షోభపడినది 5 వ్యాపించినది.

**విభ్రాంతశీలము** నం వి. అ. పుం 1 వానరము, క్రోఁతి 2. సూర్యచంద్రుల బింబము.

**విభ్రాంతశీలుఁడు** నం విశ (అ. ఆ అ) 1 తొట్రుపడిన బుద్ధిగల వాఁడు 2 మత్తెక్కినవాఁడు.

**విభ్రాంతి** నం వి. ఇ. స్త్రీ. 1. పొరపాటు, ప్రమాదము. 2 మడతపడుట, చుట్టచుట్టుకొనుట, 3 తొట్రుపాటు, కలవరపాటు 4 తొందర, అతిత్వర

**విభ్రాజిల్లు** నం అ క్రి ప్రకాశించు.

మ .. విశ్వతమా,పకునిం జూచె విరోచనప్రభలు విభ్రాజిల్ల నిద్దంబులై కావ్యా. 2. 47.

**విభ్రాట్టు** నం విశ (ట్) భూషణాదులచే ప్రకాశించువాఁడు

**విమతము** నం విశ (అ ఆ అ) అభిప్రాయభేదము గలది. 2 పరస్పర విరుద్ధము, భిన్నమైనది 3 తేలికగాఁ జూడఁబడినది, నిర్లక్ష్యము చేయఁబడినది. 4 సందేహాస్పదమైనది, సందిగ్ధము

**విమతి** నం విశ ఇ బుద్ధిహీనుఁడు, మూర్ఖుఁడు.

వి ఇ స్త్రీ 1 అసమ్మతి, ఒప్పుదల లేకుండుట. 2 అనిష్టము, ఇష్టము లేకపోవుట 3. బుద్ధిహీనత, మౌర్ఖ్యము

**విమతుఁడు** నం వి అ పుం శత్రువు, ప్రతిపక్షి

**విమత్తుఁడు** నం విశ. (అ ఆ అ) 1 త్రాగుడు మొదలగు వానిచే మిక్కిలి మత్తెక్కినవాఁడు. 2 క్రొవ్వినవాఁడు, మదించినవాఁడు.

**విమత్సరుఁడు**|నం విశ (అ ఆ అ) అసహనము లేనివాఁడు, మాత్సర్యము లేనివాఁడు.

**విమదుఁడు** నం విశ. (అ ఆ. అ) 1. మత్తత (మత్తు) లేనివాఁడు 2. సంతోషములేనివాఁడు, దుఃఖి

**విమనస్కుఁడు** నం విశ (అ. ఆ అ.) 1 దుఃఖము గలవాఁడు, దుఃఖి, ధైర్యములేనివాఁడు 2 పరధ్యానమున నున్నవాఁడు. 3 వ్యాకులపడినవాఁడు, కలఁతనొందిన వాఁడు 4 అసంతుష్టుఁడు, మనస్సు విఱిగిన వాఁడు, మనస్సు మారినవాఁడు

**విమన(స్సు)సుండు** నం. విశ (స్) = విమనస్కుఁడు.

**విమనీకృతుఁడు** నం విశ (అ ఆ అ.) 1. అసంతుష్టుఁడు, మనస్సు విఱిగినవాఁడు 2. మనస్సు మారినవాఁడు 3 దుఃఖితుఁడు, దుఃఖము గలవాఁడు

**విమను(వసు)ఁడు** నం విశ స్ దుఃఖితమనస్కుఁడు

తరలము (ధృతరాష్ట్రుఁడు) ...ప్రజా తయకారణం బని తద్దయున్ భయమందుచున్, విమనుఁడై పడియుండె హాయని వెచ్చనూర్పుచు విన్నఁడై భార సభా. 2 310.

విమన్యువు(ఁడు) సం విణ ఉ 1. కోపములేని వాఁడు. 2 దుఃఖములేనివాఁడు

విమర్దకము సం వి అ పుం 1. పిసుకుట, గుడ చేయుట 2. సువాసన వస్తువులను నలుపుట, చూర్ణముచేయుట. 3 గ్రహణము 4 సూర్య చంద్రుల కలయిక 5 నాశము, ధ్వంసము

విమర్దన సం. వి. ఆ స్త్రీ 1 గుండచేయుట, పొడి చేయుట 2 నలుపుట, రాపిడి, సంఘర్షణము, ఒరయిక 3. నశింపఁ జేయుట, సంహరించుట. 4. గ్రహణము

విమర్దనము సం. వి అ న విమర్దన

విమర్దము సం. వి. అ పుం 1. నలఁగఁగొట్టుట, చూర్ణముచేయుట 2 నలుపుట, రాపిడి, సంఘర్షణము, ఒరయిక 3 (ఆలింగనమున) దగ్గఱ గ నదుముట 4 పొడుచేయుట, చెఱచుట 5 స్పర్శము, సంపర్కము, అనుబంధము. 6. తైలములు మొదలగునవి దేహమున మర్దించుట, మర్దనచేయుట 7 యుద్ధము, పోరు 8 నాశము, ధ్వంసము 9 సూర్యచంద్రుల కలయిక. 10 గ్రహణము. 11 విసుగు

విమర్దితము సం. విణ (అ అ. అ) 1. నూఱఁబడినది, గుండ చేయఁబడినది 2 రాపిడిపెట్టఁబడినది, సంఘర్షింపఁబడినది 3 పూయఁబడినది, మర్దింపఁబడినది, రాఁచఁబడినది

విమర్శనము సం వి అ. న విమర్శము.

విమర్శము సం. వి అ పుం. 1 పర్యాలోచనము, సమీక్షణము, పరిశీలనము 2 హేతువాదము, యుక్తియుక్తముగ వాదించుట 3 పరస్పర విరుద్ధమయిన తీర్పు 4. సందేహము, ఎటును తోఁచని స్థితి 5. పూర్వసుకృత దుష్కృతములచేఁ గలిగిన సంస్కారము, వాసన 6 నాటకాంగము లగు పంచసంధులలో నొకటి (నాల్గవది).

విమర్శించు సం న క్రి పరిశీలించు.

శా మాహాత్మ్యంబులు తేజముల్ విభవసంపత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదము లేదు వరా. 10 8

విమర్షము సం వి అ పుం 1 పర్యాలోచనము, సమీక్ష. 2. ఓరుపు లేమి 3 అసంతుష్టి 4. నాటకాంగములగు పంచసంధులలో నొకటి.

విమలదానము సం వి అ న. దేవత కిచ్చెడి యుపహారము, దేవతా బలి

విమలమణి సం వి ఇ పుం స్ఫటికము

విమలము సం విణ. (అ. ఆ అ) 1. మచ్చలేనిది, కళంకము లేనిది 2 స్వచ్ఛమైనది, పరిశుద్ధమైనది, మురికి లేనిది 3. తెల్లనిది,

న 1. వెండి పూఁత 2. అభ్రకము.

విమాంసము సం వి. అ పుం న. అపరిశుద్ధ మాంసము, కుక్కమాంసము మొ

విమాత సం. వి ఋ స్త్రీ సవతితల్లి

విమాతృజుఁడు సం వి అ పుం సవతితల్లి కొడుకు.

విమాథము సం వి. అ పుం ధ్వంసము, సంపూర్ణ నాశనము

విమానన సం వి ఆ స్త్రీ. అగౌరవము, అవమానము.

విమానము సం. వి అ పుం., న అగౌరవము, అవమానము 2 పరిమాణము, కొలఁత 3 దేవత లాకాశమునఁ దిరిగెడి రథము 4. వాహనము, యానము 5 ఏడంతస్తుల మేడ. 6 గుఱ్ఱము

విమానరాజు సం వి అ. పుం విమానము నడుపు వాఁడు

విమానితుఁడు సం విణ (అ. ఆ అ) అవమానింపఁ బడినవాఁడు

విమార్గగ సం వి ఆ స్త్రీ చెడు నడవడి గల స్త్రీ, కులట

విమార్గగామి సం విణ (న్ నీ న్) దుర్మార్గమున నంచరించువాఁడు, చెడ్డపనులు చేయువాఁడు.

విమార్గణము సం. వి. అ న వెదకుట

విమార్గము సం వి. అ పుం. 1 చెడ్డదారి, పాడుత్రోవ 2. దుర్నీతి, దుర్మార్గము 3. చీఁపురు.

విమిశ్ర(శ్రిత)ము సం విణ. (అ ఆ అ.) మిక్కిలి కలసినది.

విముక్తకంఠుఁడు స విణ (అ ఈ అ. అ) ఎలుగెత్తి యేడ్చువాఁడు, బిగ్గఱగా వేడ్చువాఁడు.

విముక్తము సం విణ (అ ఆ. అ) 1 విడువఁబడినది, స్వేచ్ఛగా వదలివేయఁబడినది 2 పరిత్యజింపఁబడినది 3 (చెఱ మొదలగువానినుండి) విడుదల చేయఁబడినది. 4. ప్రయోగింపఁబడినది, విసరఁబడినది. (బాణము.) 5 అవకాశ మొసగఁబడినది,

తే. కొడుకుఁ గోడలి రావించి కోటవెలికి, వియ్య మని శిష్యుఁడని కాచి విడిచె నతని, సింహాణితో రాజులు చెనయువారె ... ఉ హరి. 1. 9

2. వియ్యఁపురాలు.

గీ నాకు నీవు వియ్యమవు మంజువాదిని . . దశకు 12 25.

3. చుట్టము.

తే. అనుజ తనుజులు శెలులు వియ్యములు నడుగు, మాఱిపోదురు నీకుఁగా మనుజనాథ ... భార. ఉద్యో. 3. 341.

తే. ... నను నీవు గూడియున్న, నతఁడు నినుఁ గాచు వేడ్క వియ్యంబ నముచు, . భా. రా. అర 189.

తే అనుచు నెయ్యఁపు వియ్యంబు లల్లనల్ల, సర ససరోక్తి చాతుర్యసౌష్ఠవముగ, గోష్ఠి సలిపిరి తమలోనఁ గొంతప్రొద్దు, భోజనా గారపర్యంత భూములందు. నైష 6. 110.

చ. చెలువముఁదాల్చి తన్గవయఁజేరిన రాగిణి రావణస్వసన్, నలువురు నవ్వ నత్తెఱఁ గొన ర్చక యేలిన వియ్యమై యతం, డలుగఁడు సీత కిట్టి తలఁ పొత్మఁదలంపక యాయమవ్వృథా, కలహముతం దమందొటఁగు కాఁకకు నాఁకకు లోనుపేయఁడే. అము. 5. 49.

4 చుట్టరికము.

క. దయ్యమెఱుంగున్ వారల, నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్, వియ్యము లును నెడనందిని, బయ్యెద కొంగద్దమైనఁ బ్రాణము వెడలున్. భార. 9. 401.

తే. తోడికోడలు వగచాటి పీడనాడు, నాఁగడ మొనర్తురెపుడు వియ్యముల వారు.
(వియ్యముల వారు = బంధుగులు.) శుక. 3. 294.

5. వైవాహిక సంబంధము.

క. దేవతలఁగొలిచి ధాత్రీ,దేవతలకు నిష్టధనము ధీరతభక్తిన్, నీ వియ్యం బూర్వంబున, నీవి య్యం బమరెఁగాక యిది యల్పంబే. పీమం. 3. 49.

6. వినయము.

వ. వెండియు నమ్మహీమండలాఖండలుండు రాజ్యంబు పాలించుచు గురుజనంబుల యెడ వియ్యంబును సామంతుల యెడ నెయ్యంబును... కృ శకుం. 1 14

జ వియ్యంకుఁడు, వియ్యంకురాలు, వియ్యఁపు రాలు, వియ్యఁపుసాని, వియ్యమందు

విరఁబడు అ క్రి (విరియన్ + పడు) విరయఁబడు. (స్వార్థమందు) 1. విరియు, వికసించు 2 విజృంభించు.

సీ ..., ఊరక విరఁబడు మారనారీచంబు దుండ గంబునఁ దమ్ము ధూళిఁగలయ, .. వరాహ. 4 21

(పై రెండర్థముల కిదియే యుదాహరణము)

విరక్త నం వి. ఆ స్త్రీ దురదృష్టవంతురాలగు స్త్రీ.

విరక్తము నం విశ (అ ఆ అ) 1. మిక్కిలి యెఱ్ఱ నిది. 2 రంగుపోయినది, వివర్ణమైనది. 3 మనస్సు విఱిగినది, అసంతుష్టమైనది. 4. విషయసుఖము లపేక్షింపనిది, ప్రపంచ సంబంధమును విడిచినది 5 ఉద్రేకముతోఁ గూడినది

విరక్తి నం వి. ఇ స్త్రీ 1 మనస్సువిఱుగుట, అసం తుష్టి 2. విరోధము, అనిష్టము. 3 విషయసుఖ ములయం దపేక్షలేమి, ప్రపంచసంబంధమును విడు చుట

విరచన నం వి అ స్త్రీ. 1 ఏర్పాటు 2. కూర్చుట, కల్పన 3. నిర్మించుట, సృజించుట. 4. గ్రంథ రచన.

విరచనము నం వి అ. న = విరచన.

విరచించు నం స క్రి కూర్చు, రచించు.

క ఇ మ్మార్కండేయపురాణ మ్మఖిలహితమ్ముగాఁగ నా నేర్చుగలిన్, నెమ్మి విరచించెదను ... మార్కం. 1. 23

విరచితము నం. విశ (అ ఆ అ) 1. ఏర్పఱుపఁబడి నది, చేయఁబడినది. 2 కూర్పఁబడినది, కల్పింపఁ బడినది 3. గ్రంథముగాఁ జేయఁబడినది. 4. అలంక రింపఁబడినది 5 ధరింపఁబడినది 6 తాఁపఁబడి నది, ఖచితము చేయఁబడినది.

విరజ నం వి. అ స్త్రీ. 1. దూర్వాతృణము, గఱిక (వ్య. వి.) 2 నహుషుని భార్య.

**విరజము** సం. విణ. (అ ఆ అ) దుమ్ములేనిది, రజో గుణరహితము, కామక్రోధాది వికారము లేనిది.

**విరజస్క** సం వి అ స్త్రీ ఋతుస్రావము లేని స్త్రీ, ముట్లుడిగిన స్త్రీ

**విరజస్కము** సం విణ. (అ ఆ అ) 1 ధూళిలేనిది 2. కామక్రోధాది గుణములు లేనిది 3 ఆర్తవము లేనిది

**విరజాజి**=విరజాది వి. నవమాలిక, ఒకజాతి జాజి. (వ్యు. వి.)

సీ. విరజాజివిరులపై విహరించు విహరించి సొబగు నెత్తావులు చూఱలాడు ... విక్ర 1 95

సీ ఒరవుగా విరజాజిసరులతో సిగవైచి లాగి యో బురుసాకుశాయిఁ జెట్టి .. దశా. 7 250

సీ విరజాజివిరుల యోవరులముంగిటచాయ వల్లి ఖిల్లిగ ద్రాక్ష అల్లుకొనియె . శాను 2 67.

**విరజాది**=విరజాజి వి నవమాలిక (వ్యు వి) (శ ర.)

**విరజుఁడు** సం విణ (అ ఆ అ) కామక్రోధాదిగుణ వికారములు లేనివాఁడు.

వి అ. పుం విష్ణువు.

**విరటుఁడు** వి (సం విరాటః) విరాటరాజు.

చ. విరటుఁడు నిమ్ము నెప్పు. బదివేవురముందట జెప్పు బాహువిస్ఫురితుఁడు శౌర్యశాలి కుల ధూర్తి విశేషవిధాయకుండు ధూ,శరణ వికార దుండు అనళవ్యతపఃఫలసంభవుండుగా,తర పరి రక్షకుం డనుచు దానికి నీడుగఁజేయు. మిత్రరిన్. భార విరా. 4 7

ఆ. వి ఇమ్ముదప్పువేళ నెమ్మెలన్నియుఁదప్పి,కాల మొక్కరీతిఁ గడుపవలయు, విజయుఁ డనువు దప్పి విరటునిఁ గొలువఁడా, విశ్వదాభిరామ వినుఁవేమ వేమ. 8 భా 156.

**విరణము** సం వి అ. న. వీరణము, అవురుగడ్డి.

**విరతము** సం విణ (అ ఆ అ) 1 విరమించినది, మానినది. 2 ఆఁగినది, నిలిచినది 3. సమాప్తమైనది, ముగిసినది

**విరతి** సం వి. ఇ స్త్రీ 1 విరామము, చాలించుట. 2 (మధ్యమమున) నిలుపుట, తెఱపి, అవకాశము 3. విషయ సుఖములం దపేక్షలేమి. 4. (ఛంద) పద్యపాదమున గ్రుక్క(త్రిప్పుకొనుటకై నిలుపు తావు

**విరమము** సం. వి. అ పుం 1 విరామము, ఆఁవుదల 2 సూర్యాస్తమయము

**విరమించు** సం అ క్రి విశ్రాంతినిబొందు, ఉడుగు, చాలించు (శ ర.)

**విరమోపకము** వి ఉత్సాహము

వ పి భటోత్తము శాల్మియాంతరంగాపూరి తాపారవీరరసంబు వెల్లిగొలుపునట్లు విరమోప కంబువఁ దమతమ విశ్వయించిన వీరవృత్తి ప్రకటించుచు ... కు. సం. 11 611.

**విరల(ళ)జానుకుఁడు** సం. విణ (అ ఆ. అ.) దొడ్డి కాళ్ళవాఁడు

**విరలద్రవ** సం వి ఆ స్త్రీ పలుచనిజావ

**విరలము** సం విణ (అ ఆ అ) 1 సందులు గలది, దట్టముకానిది, పలుచనిది 2 సుకుమారమైనది, నాజూకైనది 3. పరులైనది, దృఢముకానిది. 4. తఱుచుగాలేనిది, క్వాచిత్కము, అరుదైనది. 5 అల్పము, కొంచమైనది 6. దేశకాలములచే దూరమైనది, దూరస్థము

వి. అ న దధి, పెరుఁగు. (వాచ)

**విరలి**=విరాళి వి వలపు (చూ విరలిగొను)

జ విరలిగొను

**విరలిగొను**=విరాలిగొను అ. క్రి (విరలి+కొను) మోహపడు, వలచు.

సీ. కరియిచ్చె నరమేని కరిణికి...

ఆ వె మధువిడంబనమున మగలును మగు వలు, విరలిగొనిరి మదనపరవశమున కు. సం. 4. 469

సీ ... గీ తన మహత్త్వంబు దలఁపక తరుణి పొందు,వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁదలఁచు, భావజాస్త్రాభిహతి మహాదేవుఁడొక్క, వ్రేలి మిడిఁ జెంపునెడి కడు విరలిగొనియె కు సం. 5 524

**విరళి** విణ విశాలము (శ. ర)

**విరవాజి**=విరవాది వి నవమాలిక (వ్యు. వి.) (శ.ర.)

**విరవాది**=విరవాజి వి. నవమాలిక. (వ్యు వి.)

రగడ ... మిత్తిలేని తేనె నామెతఁ జేసె విరవాది, యితరలతికల మఱిగి యేగునది వరవాది . మనుచ 3. 84

వృ. రగడ . వాదులేటికి రారె యా నెఱవాదు లౌదురు చాలు మీచల,పాదితనములు మాని యీ విరవాదియలరులు గోయుఁ డిచ్చట ... కిరా. 3. 52.

సీ...గీ. విరవాదియును నవమల్లికాఖ్య వఱలు ... అం భా. 2. 52.

**విరవాయు** అ. క్రి. (క. విర = రెండు.) రెండుగా చీలు.

ఉ. వనితకుచాద్రులం దొడవి పాటవుఁ జొక్కిలి నిండి యుబ్బి జాల్గొని కటిచక్రమాని మెఱుఁగుం దొడలై విరవాసివచ్చు నూ,తన కిరణామృతౌఘముల దండహతాంక వదోక్షి తంబులై, మను మడివోవిగర్భకలమంబులుగా వెలతాంగియంఘ్రికల్. వసు 2 73.

(విరివాసి—క. ర. పా )

**విరవిర[1]** వి 1 త్రెళ్లుటయందగుధ్వని కనుకరణము.

చ .. , విరవిరఁ ద్రెళ్లి వొవ్వఁ దరివివ్వాలుఁడై దశకంఠరుండు ఘో,రరవము లోకసంభ్రమకరం బగువట్లుగఁ బెల్చఁగూసె ... నిర్వ. 4. 93.

2. కరఁగుటయందగు ననుకరణము

సీ ...విమలబంధుస్వాంత విధుకాంతములఁ గటాక్షోత్సృష్ట విరవిరఁ గరఁగుచుండ . వేం పంచ. 4. 345.

3. (ఎండ) కాయుటయందగు ననుకరణము.

ద్వి. వెలిసె వానలు గాడ్పు విడిదపెను నెండ, విర విరయై కానె వెలువయ్యె దెనలు. ద్వి. భాగ. 2. 32. పా

**విరవిర[2]** = విలవిల వి, (సం. విహ్వలః) విహ్వలత. (చూ. విరవిరవాఱు, విరవిరవోవు.)

**విరవిర[3]** = బిరబిర క్రి విశే మిక్కిలి త్వరితముగా.

ద్వి. ధరణీశు నాజ్ఞచే దవరు లిట్లు, విరవిరగొని రాజనీతి నేతేర, నింతింత దేఱువ యిండ్లిండ్ల వారు, అంతంత వెఱఁగంది యరుదెంచి రంత ద్వి. క. సా. 2. 57 పా. 9. వం.

**విరవిరవాఱు** అ. క్రి (విరవిర[2] + వాఱు.) విరవిరవోవు, భయాదులచే అవయవములు స్వాధీనత తప్పు

చ. వరుణుని పాశముం త్రిదశవల్లభు వజ్రముఁ గాలు దండమున్, సురల సమస్తశస్త్రములుఁ జూచినవాఁడనకాదె యీరఘూ,త్తరు విశిఖంబు లంత బెడిదంబులు గావని నాకు నంచుమై, విరవిరవాఱఁ జే సడలి విల్లువతం గని రాముఁ డిట్లనున్. భా. రా. యుద్ధ. 850.

**విరవిరవోవు** = విలవిలవోవు అ. క్రి (విరవిర[2] + పోవు.) 1. విహ్వలతనొందు.

చ చరణములుం గరంబులును సంచలభావము నొందఁజొచ్చె మేన్, విరవిరవోవుచున్న యది విహ్వలమయ్యె మనంబు ... భార. కర్ణ. 1. 158.

చ...అ, సరసిజనాభనందను విశాలభుజాంతరముం బగిల్చినన్, విరవిరవోయి మేమనిదు వెంద్రుక వెట్టఁగ ... భాగ 10. స్కం ఉత్త. 872

చ.. సూతునిఁ ద ద్రథఘోటకంబులన్, విర విర వోవ నేయుటయు నీరజనేత్రుఁడు విన్న నవ్వుతో... భోజరా. 4 134.

2. విరిసిపోవు

చ. ఖురముల నేలఁ ద్రవ్వుచు వకుంఠితవాలసమీరణమ్ములన్, విరవిరవోయి మేఘములు విన్వ విషాణము లొడ్డికొంచు దు,స్తరతరమూర్తియై వృషభదైత్యుఁడు గన్నుల నిప్పులొల్కఁగా, దురదురవచ్చి భాగ 10. స్కం. పూ 1142.

చ. ఉరుకుచ దెంద మెంతమృదువో మఱి తియ్యని తుంటవింటనే, విరవిరవోవునారిఁ గొని పెన్నెలి గొజ్జఁగతూవుచేత న,చ్చెరువుగఁ గొంచి కంటికి దిసింపనిచూఁ దపుదేసి ... సారంగ. 2. 38.

**విరసము** సం. విశే (అ. ఆ. అ ) 1. రుచిలేనిది. 2. అనిష్టమైనది, ఇష్టము కానిది. 3. క్రూరము, నిర్దయమైనది.

వి. అ పుం 1 బాధ, నొప్పి. 2. ద్వేషము

సీ. రోహణాచలమను రూఢిగాక ... వింధ్యాద్రితో సురత్ విరసమెత్తిరిగాక గ్రహచక్రమది యింత గడచియున్నె .. కు సం 3. 246

క. సరసము విరసముకొఱకే,...సు శ. 103.

**విరసించు** నం. అ క్రి 1 ద్వేషించు, విరోధపడు

సీ. కలనైన నెదిరి పఁ దలఁకు ముల్లోకంబు విరసించి యేకూడుఁ దొరయునతని,... జై. భా 6. 191

క విరసించినచో రాజులు, దురమున నెవ్వారి నైనఁ దునుముదు రటుకన్, గుణ సగ్రజునను జన్మోత్సాహంబున వధియింపఁ దోఁటు పారిసుతుఁ డటన్. (వేం పంచ 1 795)

2 వైరస్యముచూపు, విరోధించు.

సీ. పతి నీవు నేకవిచారంబువారలై విరసింపనేల యోపిరమరాశ. భాను 2 56.

**విరహము** నం. వి అ పుం 1. విడిపోవుట, ఎడఁబాటు 2 నాయకానాయకుల యెడఁబాటు, వియోగము 3 తనపటాలము విడిచిపోవుట 4 సమతమునలేమి, అభావము. 5. విప్రలంభ శృంగారము 6. ఏకాంతత, ఒంటరితనము.

**విరహి** నం నా. (న్ జి న్) 1 విరహము గలవాఁడు, ప్రియురాలి నెడఁబాసినవాఁడు. 2. ఒంటరిగా నున్నవాఁడు, ఏకాంతముగా నున్నవాఁడు, ఏకాకి

**విరహిణి** నం. వి ఈ. స్త్రీ. 1. ప్రియునెడఁబాసిన స్త్రీ. 2 భృతి, జీతము, కూలి

**విరహితము** నం. విశే (అ ఆ. అ) 1. విడువఁబడినది, విడిచిపెట్టబడినది 2. ఎడఁబాపఁబడినది 3. (సమాసమ్మున) ఒంటరిగానున్నది,4 శూన్యము, లేనిది.

**విరహోత్కంఠిత** నం. వి. ఆ స్త్రీ. శృంగారనాయికలలో నొకతె, వేళకు నాయకుఁడు రాకుండుటచే విరహముచేతఁ దహతహపడు నాయిక.

**విరాకులవిత్తు** విశే. (విరియు + ఆకులు+విత్తు) చెడినది.

చ. అలవడ వేదమార్గము విరాకులవిత్తుగ నజ్ఞాని విచ్చలవిడిఁ దెంతలందిరుగుచుండఁగఁ

దెచ్చితి మెల్లచోట్ల న్వక్కళియుడను నేను .. ప్రబోధచం 2 45.

**విరాగము** నం వి అ. పుం. 1 రంగుమాయుట, వివర్ణత 2 మనస్సువిఱుగుట. 3. అసంతుష్టి, అనిష్టము, అనురాగములేమి. 4 విషయ సుఖములం దపేక్షలేమి, విరక్తి

**విరాగుఁడు** నం. విశే. (అ అ అ.) విషయేచ్ఛారహితుఁడు.

**విరాజమానము** నం విశే (అ అ అ) మిక్కిలి ప్రకాశించునది

**విరాజము** నం వి అ పుం = విరాట్టు.

**విరాజితము** నం. విశే (అ. అ అ.) 1 ప్రకాశించినది, ప్రకాశింపఁజేయఁబడ్డది. 2. స్పష్టముగఁ జెప్పఁబడినది.

**విరాజిల్లు** నం. అ క్రి ప్రకాశించు.

క. పుడమికి వితస్తిమాత్రపుఁ, గొడువున నాక్షేత్రరాజము విరాజిల్లున్ ... పాండు 2 322.

**విరాటక(జ)ము** నం వి అ పుం. ఒక విధమైన తక్కువజాతివజ్రము.

**విరాటపర్వము** నం. వి. న్. న. మహాభారతమున నాల్గవ పర్వము.

**విరాటము** నం. వి అ. పుం 1. భరతఖండమునందలి యొక దేశము, మత్స్యదేశము

**విరాటుఁడు** నం. వి. అ. పుం. విరాటదేశాధిపతి, మత్స్యదేశపురాజు. (పాండవులు వీని కొలువులోనుండి యజ్ఞాతవాసము గడపిరి ఇతని కూఁతురగు ఉత్తరను అభిమన్యుఁడు పెండ్లాడెను. ఉత్తర కుమారుఁడగు పరీక్షిత్తు ధర్మరాజు ననంతరమున కురుదేశమును పాలించెను )

**విరాట్టు** నం వి. ట్ పుం 1 సౌందర్యము, చక్కఁదనము. 2 క్షత్రియుఁడు. 3 ఆదిపురుషుని ప్రథమసంతతి. 4 శరీరము 5 (వేదాంతశాస్త్రమున) బ్రహ్మాండాత్మక స్థూలదేహాభిమానియైన యాది పురుషుఁడు.

స్త్రీ. వేదమునందలి యొకానొక ఛందస్సు.

**విరాదము** వి. ఒకవిధమైనపన్ను, నజరానా.

ద్వి ... మన్నీలు చెల్లింప,వలసిన నిల్వపల్లలు విరాదములు, సరవిగొనుక దేవసంబు ధాన్యంబు. ద్వి. పరమ. 3. 197 పొ. 14 పం.

విరావి సం. విశ (న్ ఇ న్) 1. అఱచునది, బిగ్గరగా ధ్వనిచేయునది. 2. ఏడ్చునది, విలపించునది

విరావిణి సం వి ఈ స్త్రీ 1. విలపించుట, ఏడ్చుట, బిగ్గఱగా ధ్వనిచేయుట 2 చీఁపురుకట్ట.

విరి వి (√ వి॰యు.) పుష్పము, పువ్వు.

గీ తమ్మిపూ మాలి ... దర్పకు డ, విరులు నీ కాయుధములు గావి ... నాఁడు నైష 2 83

చ కనుఁగవఁ బిన్ననవ్వు దొలకన్మని నాథునిఁ కన్ను సన్న ని,చ్చినఁ దగ భోజనందవయుఁ జేకొని మౌనికి మ్రొక్కి యవ్విరిం,దన నెఱి గొప్పునం జెరవినన్ . పారి. 1 55

విశ 1. వికసించినది

క శరదాగమమున ... కైరవాలఁ బండి కలమ వనంబుల్, గరుసున నెలమిగఁ దామర, విరి పువ్వులతావి కెరఁగు విధమునఁ బొలిచెన్. కు. సం 6. 776

చ దనుజవిరోధిమీద నొకతన్వి కరంబున లాజలెత్తి చేల్లిన నెఱివేణి యూనుఁబలె న్విరిపూవులఁ జల్లిలో,చనములు సమ్మదాశ్రువులఁ జల్లె అలాటము ఘర్మబిందులన్, జిమఁగవ సల్లె సంభ్రమ వశత్రుటి తామలమౌక్తికాలులన్. (పారి. 3. 19)

సీ. . గీ. . , విప్పుఁగన్నులు విరిగల్వవిరులుగాఁగ, దశా. 3 28

2. విడినది (శ ర.)

క... శిరస్థానము కాలుకడగాఁగఁ దా విరి తల లోన్.

క. నిద్దురవోవఁగఁ గనుఁగొని, యద్దిర కడునలుచి యైన యది దిని ... భా రా శాం 482.

క .. విరివేనలితోఁ,బరఁబరఁబడి యేడ్చుచుండె భూభాగమునన్ దశకు 4 69.

క. మదిఁ గొలకొలనిగుడఁగ న, ప్పుడి మొగముల బోదు జేనిపై నూల్ములుకుల్, చదలద్రువ నేసి విరి వ్రారిదము తెలం గొందఁజేసి ద్రేల్మిడి నొంచెన్. (ఉ. రా. యు. 504.)

3. విడిచినది, వదలినది

ఉ ... కానె మొగుల్ విరియొండ లత్తఱిన్ అము. 4. 160.

గీ శీల నీప్రావృడాగమవేళయందు, నిందుజాలిల్లి పండువెన్నెలలు మింట, నెడనెడలఁ గాయ వరి కంటివేకరంబు, మొగులు విరి యెండవలెఁ దాపమునఁ దెరల్చు రామా 6 21

4 విడి - నున్నది, ప్రత్యేకమైనది, చిల్లరయైనది

వ. నయి బయిబ డుకోల్చు విరిపైఁడియు గట్టి దిమన్ను జాయి ఉప్పయు మఱి బటు కాని నలుఁ బైఁ ముఁ బెయ్యలు చేలు చెట్టు లోవయిన సమస్తసంపదలు నన్న విరిఁగ్గి వెచ్చ పెట్టఁగా, ... కళా 6 ౬౫.

విరిం(రం) చను డు సం వి అ పుం = విరించుఁడు

విరించము సం వి. అ పుం దినముయొక్క పదియవ భాగము

విరిం(రం)వి సం వి. అ పుం 1. బ్రహ్మ 2 శివుఁడు. 3 విష్ణువు

విరిం(రం)చుఁడు సం వి. అ పుం. 1 బ్రహ్మ. 2 శివుఁడు. 3. విష్ణువు

విరిఁబోఁడి వి (విరి + బోఁడి) పుష్పమువలె నొప్పిద మైన స్త్రీ

సీ విరిఁబోఁడి చీనిచక్కెరమోవి రుచులాన వలవదే నాలుకగలుగఁ ఫలము దశా 2. 307.

క ఈవిరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్ నీలా 1 87

విరికటారపుజోదు వి. (విరి + కటారము + జోదు) మన్మథుఁడు.

సీ విరికటారపుజోదు వెలపించె వెలఁది నీకుచ దుర్గముల హత్తుకొనఁగనిమ్ము ... కృ శకుం. 2 133.

విరికిలించు స క్రి (√ విరి) విరియఁజేయు,చాఁచు.

ద్వి. చంకలదచికొంచు శంకరుఁ బొగడు,చును మురుచుకును గెర్లి చూచుచు జన్ని,గొనుచు గంతులు వేయుచును మనికట్లు, వెఱమరించుచు వ్రేళ్లు విరికిలించుచును పండితా పర్వ. 371.పా

విరికొంతవేల్పు వి. (విరి + కొంతము + వేలుపు) పుష్పాయుధుఁడు, మన్మథుఁడు

క అంతట నొకనాఁ డింతులు, సంతసమునఁ గొల్వఁ బైఁడి జంగిడిపైఁ జేమంతుల మాడుపు గా విరి, కొంతపువేల్పనఁగ రాజు కొలువున్న యెడన్. యయా. 5 45.

**విరిగి** వి. శ్లేష్మాతకము, శేలువు, ఒకజాతిచెట్టు
రగడ విరిగి పయింగడు విరిగిరి చావలు...యయా 4. 25

సీ. మట్టి విరిగి తొండ్లి మజ్జి తుంకిచ్చెడ పెద్ద విరిగి వక్కి గద్దనెల్లి, .హంస 4 11.

వ. రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల విరుగుల నెమ్మిల జమ్మినేరేళ్ళ మారేళ్ళ ... పి శకుం. 2. 14.

**విరిగొమ్మ** వి. (విరి+కొమ్మ) పూఁగొమ్మ
సీ...కొమ్మ యీ విరిగొమ్మఁ గమ్మతేనియ గ్రమ్మ నెమ్మెమీఱఁగఁ తమ్మి తుమ్మెదలకు ... శశా. 3. 8

**విరిచెండు** వి. (విరి+చెండు) పూలబంతి
సీ. తళుకుబంగరుగిండ్లు తులకించు విరిచెండ్లు నడఁగించు పాలిండ్ల సమరుఁడాని ఉ. రా 2 266.

**విరితీవఁబోఁడి** వి. (విరి+తీవ+బోఁడి) లతాంగి, పూవుఁదీగవలె మనోజ్ఞురాలగు స్త్రీ
ఉ. ఆ విరితీవఁబోఁడి కృప కద్భుతమంది భవన్ని యోగమే, లా వృథయౌ ఫలింపక బలాయ బలాయని ... వేం. పంచ 4 300

**విరితేనియ(నె)** వి (విరి+తేనియ) పూఁదే .
చ వాళవాళినప్పు లిచ్చిన క్రియన్ విరితేనియ లాను తేఁటులున్, మలయుచు దాఁచఁబెట్టిన క్రమంబువఁ బండ్లుగ్రహించు చిల్కలున్...ఉ రా 6. 18

సీ. సరసమాధవి పేం విరితేనెసమముతోఁ జెమ రించె సురపొన్న చెలియచూడు ఉ రా 1 171.

**విరితేనెమేపరి** వి. (విరితేనె+మేపరి) మధుపము, తుమ్మెద.
క. విరితేనెమేపరులకున్, హరినీలఁపుసరుల కిరుల కజ్జాతిఝరుల్, గుఱుతై... చం. శా. 3. 74.

**విరిదట్టు** విశే. (√ విరియు) ఎడఁబాటునొందినది, విరుకుడము
క. విరసంబువఁ దము నిలువర, విరిదట్టుగఁ జేసి నట్ట విశ్వాసమఁకు... (వి. పు. 6 106 )

**విరిదలవాఁడు** విశే. (విరి+తల+వాఁడు.) విడిపోయిన జుట్టు కలవాఁడు,
సీ. విరిదలవానిని విరథుని నాయుధంబిడిన వానిని కూరు లేయ రెండు భాం కర్ణ 3. 351

**విరినీరు**[1] వి జా (విరివి+నీరు) సమృద్ధమైన జలము
సీ ఏటేట విరినీట నిరుగారునుం బండుఁ గ్రాసంగు వరిచేలఁ బసిఁడిచాయ. భీమ. 2 54.

**విరినీరు**[2] (విరి+నీరు) పన్నీరు

**విరిపిడియము** వి (విరివి+పిడి+అమ్ము) పెద్దబాకు.
క కట్టినదట్టి కటీతటిఁ, బెట్టిన విరిపిడియ మెక్కువెట్టిన విల్లున్, మెట్టిన యోగవాళ్లుంగను,వట్టిన పన మారుఁడవుడు పాంథుల వెదకెన్ శా వి 3 16.

**విరిపోటు** వి (విరి+పోటు) భేదము
క పేఁకెత్తిరిపులతో విరిపోటగు నహుపాంథు మొకటి పుట్టింపఁ దగున్ . (కవిక. 2 44 )
సీ ఏబోఁడి గావించెనే యింత విరిపోటు తల్లి నీకు పనిప త్తరుణితోడ... ప్రబోధ 3 3

**విరిపోటుసేయు** అ క్రి. (విరిపోటు+చేయు)
1. భేదముకల్గించు.
ద్వి. విడిపోవఁగఁ బల్కి విరిపోటుసేసి, కోడుఁ కాపుము దాన సురసమై జరుగు ... ద్వి. హరిశ్చ పూ 2447 పం
2. పాడుచేయు, చెఱుచు.
సీ. వీటితమ్ముల విరిపోటు సేయకయున్న దోషాకి కూతుఁరై తొలఁగకున్న .. వరవ. 5. 160.

**విరిద్ధము** సం. వి అ. పుం 1 స్వరము, (మజ్జాతి ) 2 ధ్వని (విల్యమ్సు )

**విరియఁబడు** అ క్రి (విరియన్+పడు, స్వార్థమున) విరియు, వీడిపోవు
చ కమఁగవఱ్రమాన్పడంగ నెఱక ల్విరియం బడ బోరమోవ, సెండిన వదనంబులం తెఱచి నిక్కిన యట్లులు దల్లడించుటల్, గనఁబడ మూరుపుల్లికముగా నిగుడవ్వడఁ గుంది యూ తెలం,గునఁ దమచానిఁ బిల్చుచు శకుంతములు తొల్గెడ నిర్బ్రమాకులన్. (పారి. 4. 21.)
2. వ్యాపించు, క్రమ్ము.
సీ. కట్టిన చీనాంశుకంబుల పింజెలు మొలయు మట్టెలఁమీఁద విరియఁబడఁగ .. వరాహ 4. 133

**విరియఁబాఱు** అ. క్రి (విరియన్+పాఱు, స్వార్థమున) 1 వికసించు.

మ. విరియంబాఱిన గొజ్జెఁగల్దురియ మున్నీరైన యక్కమ్మనీరు. ఆము 5 121

2 విచ్చు, విడిపోవు

సీ రాణుసీ కబరీభరంబుల చాడ్పున విపులాంధకారంబు విరియఁబాఱ శా శా శయు. 1431

సీ తిరముగా ముడువమి విరియఁబాఱెడు కొప్పుఁ దోడ్తోడ నొక కేలఁ దుఱుముకొనుచు కళా 8 156

3 వ్యాపించు, క్రమ్ము

గీ కాంత కబరీభరంబను కారుమొగులు, వితతముగ వంతకంతకు విరియఁబాఱె కళా 7 166

4. పగులు, భేదిల్లు

చ అలరు సురంటిగూండ్లమును పంతటఁ బెట్టిన బొండుమల్లెమొగ్గలగమి గాలిగ్రుడ్లు తటి గావున నే విరియంగఁబాఱఁగా చంద్రా 2 82

**విరియఁబోయు** స క్రి (విరియన్+పోయు.) (తల వెండ్రుకలు ముడివిప్పి) వ్రేలఁజేయు.

సీ. విరియఁబోసిన జటావిసరంబు కెంజాయ సాంధ్యరాగంబుపైఁ జౌకళింప దశా. 3 52

**విరియాట** వి (విరి+ఆట) స్వేచ్ఛావిహారము

ఉ. ... వృద్ధొమ్మలఁ జెందువారలు తగు ల్విరియాటలు నేరకుందురే (వసు. 3. 138) (పువ్వులందలి యాట యని యర్థాంతరము)

**విరియించు** స క్రి (√ విరియు,) 1 వికసింపఁజేయు

క విరియించి తామరలలో, వరుణాంశులు సొచ్చి సుభగమగు సౌందర్య స్ఫురణము నొందఁగఁ దోఁచెం, దరణి యుదయశిఖరిమీఁద ధరణీనాథా. (భార ద్రో. 5 18)

సీ సముదగ్రాగస్థితి సంపెంగ విరియించి చంద్రాస్య యొర్తు పుష్పములుగోసె పి శకుం. 2 138

2. విప్పు, తెఱచు

గీ ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త నైష. 4. 64,

3 చెదరఁగొట్టు, తొలఁగఁజేయు

సీ మూఁకల విరియించి వీఁక నాచార్యాది యోధులనెల్లను నొక్కదెసకు, వెలచి .. భార ద్రో 2 156

లయవిభాతి. పారుల పారియించుచును గరుల విరియించుచును గిరుల ముట్టియించుచును రురులఁ జీరిగొంచున్. ఉ రా. 7 87

4 నశింపఁజేయు

ద్వి చీఁకటి విరియించు చిఱునవ్వు బసిఁడి, రేకులతో నెదురించు చెక్కిళ్లు. ద్వి. పారిశ్చ. ఉ. 348.

ద్వి పోరి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరియింప నొక్కడె వెరవైనవాఁడు రం రా ఉ 103. పో 10 పం.

క. చరియించును త్రిభువనముల, మొరయించును మహతియందు మురరిపుచరితల్, విరియించును భవతిమిరము, వరియించును ముక్తికాంత వనజభవసుతా. రుక్మాం 1 158

**విరియు** అ. క్రి (క విరియు. త. విరి) 1. వికసించు

సీ నిండార విరిసిన పుండరీకశ్రేణి యామినీరమణిరేఖాళి గాఁగ (నైష 1, 86.)

క చలికరువలిను, సొంపమున విరియు పరువపుఁ, దొలుమొగడల వలపు దెలుపు తోటలతోనన్ పారి 5 103

క రావణు నుద్యోగమునకు, దైవము ప్రతికూలమైనఁ దత్త్వనిధిధ్యానావేశ విరామంబై, యావనచరవిభుఁడు గన్నులరవిరియంగన్. నిర్వ. 7. 78

2 పుష్పించు, పూచు

మ. అతఁడున్ దోఁచిన నవ్వుడున్ విరిసెఁ బ్రాంతాంచన్న మేరుద్రువున్ ఆము. 5.128.

3. విడిపోవు

క. పారిఁబోతిగ నయంబున ముడివిరియ వలువ చెఱఁగు పట్టి వ్రేతల నిడెన్ పారి పూ 5 187

చ. ఉరవడి నేగుచోట నొక యుగ్మలి యొల్లె చెఱంగు మేదినీశ్వరుని భుజావిభూషణము వజ్రముఁ దవులంగఁ బాఱినన్, విరిసెను నీవిబంధము ... నై 3, 84.

ద్వి కెఁసిన యలకలనెఱులుఁ జిక్కొదవి విరిసిన జడలను విన్నవై మురువుచెడిన మోములు ... (ద్వి హరిశ్చ పూ 1128)

4 విచ్చిపోవు, విశ్లథమగు.

వ అంతట ధరణిచక్రం బమ్మహాసలిల మధ్యంబున మహోదకంబుల స్వల్పలోష్టపిండంబు విధంబున విరిసి చెడు. (సీతారా 2 158)

సీ. వీవి చెల్వమువార్త విన్న భయంబున బ్రీహిగర్భంబులు విరియకున్నె కవిక 6 154

గీ విరహకాలంబు మరుబాణవితతిఁ గొన్నఁ, గంటులన్నియుఁ బ్రియుఁగూడి కైవుమిగిలి, పెనఁగు నెడనెట్టవిరిసె నావనిత మేనఁ, గలయ నవనఖదంతవిక్షతము లడరె కు సం 8 178.

ద్వి వెన వార్ధిలో నోడ విరియు చందమున ద్వి భార విరా 4 70.

5. చెదరు.

చ మురదనుజుఁడు పౌరవసమూహమునుంగని రాజరాజుపై, శరనికరంబు పుచ్చి తనచక్కిన యెక్కిన యక్షగుహ్యకుల్, విరియఁగ ఖడ్గపాళముల వేసిన వచ్చిన త్రోవ వట్టరి ఉ హరి 1. 40.

క. వురికొనుచుం దెంలుచునో, హరి సాహరి నొం క చోట నలవడునొంచో, విరియు నొకచోటఁ దిరుగు-, దిరుగక యొకచోట రెండు దెలఁగలు నొచ్చున్. భార భీష్మ 3 178.

6. తొలఁగు.

వ అవిద్యావ్యవధానంబు విరిసినం దోఁచు పరమాత్ముని ప్రకారంబున .. నైష 4 2

సీ. వీడెంపు బలుకెంపు విరిసి వెన్నెల గాయ వరిగింజ నొకటఁ బవ్వరునఁ దోమ. ఆము 1 60

పి. పైమొగుల్ విరిసిన బాలేందుకళరీతిఁ బులుకడిగిన రత్నకళికలీల వరను. 2 18

చ వరవరవాసవుం డడిగివన్ గురుఁ డిట్లనిచెప్పె బుద్ధితోఁ, బోఁయని పాతకంబులు వబుద్ధిక పుణ్యముల నృశించు నంబరమునఁ బట్టినట్టిమల పంకము గారములోన వద్దఁగా, విరిసిన యట్లు నమ్మనిమిది వేదము సెపిపన నేనుఁ జెప్పితిన్, భార. శాం 3 364.

క అజితాత్ముండైన యాతని, విజయంబును సిరియు విరియు వేగంబ శర, ప్రత్యజనితజల ధరములు గడు, విజములగునె యంబరమున నిము సంబైనన్. నృసిం 2. 140.

మ కురిసె న్వానలు సస్యవృద్ధి గలిగెం గొల్చి క్కుడై యమ్మె నె,వ్వరు రోగంబులచేత జావరు మృగవ్యాళాది దుర్దోషముల్, విరిసెన్ సాధు మతంబులెల్ల వడచెన్విఖ్యాత సౌఖ్యంబులో, ధర శోభిల్లె శమంతకాఖ్యమణిరత్న స్థైర్యసంపత్తిచేన్ వి. పు 6 325

7 రాలిపోవు.

గీ మధువుఁ గాంతల పుక్కిటిమధువుఁ జేల్ల, యార్ద్రయై బసనూపఁ బోగడపై నెలయదాన, విరిసెఁ దొల్లిటిదళములు . ఆము 5 180

8 వివశమగు

క. .. బంగారముఁబోలెడు కొడుకున, కేరూపున నైనఁ బాపు మీ సంకటమున్.

మ అనినం దల్లడమంది మేను విరియన్ హోయంచు గోపాలభామిని హరి పూ 5 246

9 అదృశ్యమగు, అడఁగు

క కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి వానివదవి దొలఁగినన్, దమకున్నిలు వఁగఁదగదను, క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్ భార ఉద్యో. 2 108

గీ ప్రకటదౌహృదకుంభసంభవవిభూతి, యౌవనారంభఘనవిలాసార్ణవంబు, నింకఁ జేసినచోఁ దిరోహితములైన, తత్తరంగంబులవ వింతి తలులువిరిసె విప్ర 1 72.

చ . చిట్టుముల్, గరమొదవెన్ వళుల్ విరిసెఁ గన్నుల నొలముదోఁచె . వరను. 2 170

10 భగ్నమగు, విరుగు

గీ నేమి విరిసిన కతన వన్నెల నెలవు, నేమిశంబయ్యె నదియ తానై మిశంబు ... కాశీ 1 77

11 వ్యాపించు

ఆ అంత మదయశైలమను నశోకద్రుమ, సమితియందుఁ గాంతి చారుభంగి, నెఱయవిరిసి తొలుత నెగసిన యుజ్జ్వల, స్తబకమనఁగఁ బద్మసఖుఁడు వొడిచె. భార ఉద్యో 2 113

ద్వి కంఠ క్రొవ్వునఁగాల కౌశికుమీఁద, మండు కోపము చంద్రమతిమీఁద విరిసి, పాడిఁజెప్పఁగ నిన్నుఁ బనివడి యిచటి, కేడముక్కిఁడి తెచ్చె ద్వి హరిశ్చ ఉ 1188.

వెల్లివిరియు—వెల్లి = ప్రవాహముగా, విరియు = చెదరు—ప్రవహించు.

క. రెంటను ... మదీయ మూర్ధము, వెంటంగా వక్రగంగ వెల్లివిరియుటన్ హర 4 57

12. పొంగు

క మినుమినుకు మినుకుమనియెన్, జెనుమినుకుల బరణి ధరణి బిట్టూటాడెన్, వననిధులు విరిసెఁ గురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు గుప్పలు గన్. (పాండు 5 188 )

స క్రి విడుచు

గీ కార్య మొక్కఁడు గనిన మాత్సర్యమున నొకండుగాదని ఖండించుఁ గన్నెటింగి, యిరువురను గాదనక కొల్వువిరిసె మీఁద, నల్లవాఁ డెన్నినది సేయనగు శుభంబు. ఆము 4 227

వ సర్వసేనాన్వాహంబులు సమకట్టుమని పనిచి కొలువు విరిసి చనియె భార ఉద్యో 4 210

క జనపతి మునిపతిఁ బూజావినుతి నతిక్రియలఁ బల్లవిలఁజేసి ప్రియంబున వీడుకొలిపి తానుం, జనియెఁ గొలువు విరిసి రత్నసదనంబునకున్ వేం పంచ 4. 108

ఇ. విక్కవిరియు, విరఁబడు, విరవాయు, విరాకుల విత్తు, విరి, విరిఁబోఁడి, విరికటారపు బోదు, విరికిలించు, విరికొంతవేల్పు, విరిగొమ్మ, విరిచెండు, విరితీవఁబోఁడి, విరితేనియ, విరితేనెమే పరి, విరిదట్టు, విరిదలవాఁడు, విరినీరు, విరిపిడియము, విరిపోటు, విరిపోటుసేయు, విరియఁబడు, విరియఁజాలు, విరియఁబోము, విరియాట, విరియించు, విరివి, విరివింటదంట, విరివింటదొర, విరివింటివాఁడు, విరివిడి, విరివిలుకాఁడు, విరివిల్తుఁడు, విరివోఁడి, విరిసరి, విరుతెత్తు.

**విరివి = విఱివి** వి. (√ విరియు) 1 ఆధిక్యము.

రగడ వెలయు కురువింద పూవిరులను మురువుచు రాఘు 2 6.

ఉ. కావిరి యంతటం గ్రలయఁగా విరివిన్ గనుపెట్టె సర్వశైలావళి ఘూర్ణిలెన్ ... ఫరళు 77,

క ఒక్కని విరివికిని దొరల్, పెక్కండ్రే నొక్కనొకని వెంబడి...(ఆము 4 214 )

సీ విలసిల్లు త్రివళుల విరివితోఁగూడంగ విరివి నెమ్మనముల విస్తరిల్ల (విక్ర 1 166 )

3 వెడలుపు

గీ. నాగ...యిన్నూరు యోజనముల నిడుపున శతయోజనముల విరివి, ఫలితఖర్జూర గోస్తనీలలితమగుచు. వరాహ. 10 136

విశ 1 విస్తృతము, విశాలము

గీ ... ఇంక నొండొక విరివియౌనెడ వసింపఁ, జేయుమెందైన... దశా 1. 141.

2 అధికము

మ తరుణా .. శరధింగవ్వలి జోగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించు నేర్పరి...హర 1 27.

క అరచేతి ఈవిరిఁబోఁడి జగంబులెల్ల విరివిగఁ బొగడన్ నీలా 1 87

**విరివింటిదంట** వి (విరి + విల్లు + దంట ) మన్మథుఁడు, పుష్పధన్వి

చ. అల విరివింటిదంట తదిలాధిపమోహము నెమ్మనంబునన్, గలవలమానభేదిమణికైశికఁ గెందలిరాకుములుఁకలన్, గలవల మాన మానెపు వలుకన్నవసంగరముద్రనిల్పి మం, గలవలమానమీన తిలకధ్వజశోభి మరుద్రథంబునన్. చంద్రికా. 4 15

**విరివింటిదొర** వి (విరి + విల్లు + దొర) మన్మథుఁడు, పుష్పధన్వి

క పోల్పఁ దొలి మినుకు దెఱఁగున, వేల్పించిన పిదప రాచవిరివింటిదొరన్, వేల్పులకున్ మ్రొక్కించిరి... యయా 4 113.

**విరివింటివాఁడు** విశ (విరి + విల్లు + వాఁడు) పుష్పధన్వి, మన్మథుఁడు

క విరివింటివాఁడపుగదా, శంకాగతులైన పాంథజనులను రక్షింతురు గా కిటులను వేఁతురె పైకముగూడఁబెటఁ దొడఁగుచు మద్యా విజ వి 8 43

(గొప్పయింటివాఁడు అని అర్థాంతరము )

**విరివిడి** వి. (విరిసి + ఇడి, స్వార్థమున) విస్తృతి ... విశ విస్తృతము. (శ ర, శ్రీ.)

విరివిలుకాఁడు వి. (విరి + విలు + కాఁడు) మన్మథుఁడు.
చ తిరుగుచుఁ జాల్పులైన మగకేఁటులు మీఁజెడు జేఁద చూచితే, విరివిలుకాఁడొనర్చు వల వేలిమి మంటలపైఁబొగ ల్వెలెన్. యయా 5 54.
విరివిల్తుఁడు వి (విరి + విల్లు) పుష్పధన్వి, మన్మథుఁడు
సీ. విరివిల్తు వతనిదేవేరిఁ గస్తురిఁ దమ్మి రేకుపై వ్రాసి గుఱించి నిలిపి. (యయా 4. 28)
ఉ .. నన్ విరివిల్తుఁ డమ్ములన్, గ్రుచ్చి జయించె ... సమీర. 3. 243
విరివొడి వి (విరి + పొడి.) పుప్పొడి, పరాగము
ద్వి అరుదెంచి పూఁదేనియలకాల్వఁ దాటి, విరి వొడి నెత్తంబు వెడచాయ వెదలి ద్వి పరమ 4. 277.
విరిసరి (విరి + సరి.) పుష్పమాలిక
చ. విరిసరి వేవలిన్ గళమువిన్ మణివల్లరి యంఘ్రి వల్లవున్, సరివణి కాఁద్రిలోకి యమునానకుఁ దానొక నీటువెట్టు నం,బరతటనీ వతంస మిది పావకమూర్తి గతిం ద్రిధావరి,స్ఫురణముఁ బూనుకొన్న విధమున్ వివరించెద నీకు రాఘవా (చం. రా. 3. 8.)
విరుగ్ణము నం. విణ (అ ఆ అ) 1. మిగుల విఱుగఁ గొట్టఁబడినది, పగులఁగొట్టఁబడినది 2 వళింపఁ జేయఁబడినది. 3. వంగినది 4 మొద్దువాఱినది, కుంఠితము.
విరుతము నం. విణ (అ. ఆ అ) 1. అఱచునది, బిగ్గఱగా ధ్వనిచేయునది 2 మాఱుమ్రోయునది, ప్రతిధ్వని చేయుచున్నది
వి. అ. న. 1. అఱపు, కేక, బొబ్బరింత 2 ధ్వని, పెద్దధ్వని 3. పక్షికూజితము, తుమ్మెదల ఝుంకారము.
విరుదితము నం వి అ న 1 పెద్దయఱపు.2 ఏడ్పు.
విరుద్ధధీ నం విణ (ఈ.) దుష్టబుద్ధిగలవాఁడు, దుష్టుఁడు
వి. ఈ. స్త్రీ చెడుబుద్ధి, విపరీతబుద్ధి.
విరుద్ధపడు మి. అ క్రి. (విరుద్ధము + పడు) విరోధపడు, కలహించు.
వ బద్ధాంజలియై శుద్ధబుద్ధస్వరూపిణివగు నీతో విరుద్ధపడు దురాత్ములకుఁ దగినయట్లయ్యె ప్రబోధ 4. 58.
విరుద్ధపఱచు మి న క్రి. (√ విరుద్ధపడు) విరోధింపఁజేయు.
వ వేదమార్గోపనిషత్తులతోడ శ్రద్ధను విరుద్ధ పఱచి . ప్రబోధ. 3 2.
విరుద్ధమతికృత్తు నం. వి క్ పుం విపరీతార్థము స్ఫురింపఁజేయుట యనెడి ఒకానొక కవితా దోషము
విరుద్ధము నం విణ (అ ఆ అ) 1 ఆటంకపఱుపఁ బడినది, అడ్డుపెట్టఁబడినది 2. మూయఁబడినది. 3. ముట్టడింపఁబడినది 4 భిన్నమైనది, పరస్పరము విరోధముగలది. 5 వ్యతిరేకమైనది, వ్యతిరేక గుణముగలది 6 (తర్క) విరుద్ధభావమును రుజువుచేయు హేతువు, (తర్క) ఒకానొక హేత్వాభాసము 7. వగగలది. 8. ప్రతికూలమైనది 9. (ఆహారము) నిషేధింపఁబడినది. 10. అవర్ణ్యము, కూడనిది 11. పైకిఁద్రోయఁబడినది 12 సందేహాస్పదమైనది, సందిగ్ధమైనది.
వి అ న 1 వ్యతిరేకము, విరోధము. 2 అనిష్టము, అసమ్మతి, పొసఁగమి.
విరులెత్తు అ క్రి (విరులు + ఎత్తు) పుష్పించు
చ తరుణుల కౌఁగిటన్ననుచు తమ్మి వృథా విరులెత్తఁజేసె మోపరులుగఁ జైత్రుఁడంచు.... అము 5. 126
విరూకరణము నం. వి. అ, న 1 మోటగాఁ జేయుట, మొద్దుగాఁజేయుట 2. విరేచనములు కట్టించుట. 3 నింద, దూఱు 4. శాపము, తిట్టు
విరూఢము నం విణ. (అ అ అ) 1 అంకురించినది, మొలకలెత్తినది 2. బయలుదేఱినది, పుట్టినది 3. మొగ్గతొడిగినది, వికసించినది 4 ఎక్కినది, ఆరోహించినది
విరూపకము నం విణ (అ. ఆ అ) 1 విరుద్ధమగు రూపము గలది 2. భయంకరమైనది
వి ఆ పుం మాఱుపేరు
విరూపకరణము నం వి అ న 1 కురూపినిఁ జేయుట 2 హానికలిగించుట, అపాయముచేయుట.

**విరూపము** సం విశ (అ ఆ, ఈ అ) 1 అంగ వికారముగలది, వికృతమైన రూపముగలది 2 స్వభావవిరుద్ధమైనది 3 స్త్రీ బహురూపము, పలు రూపములు గలది

వి అ న 1 కురూపము, అంగవికారము 2 బహువిధరూపము, విభిన్నస్వభావము

**విరూపాక్షుఁడు** సం విశ (అ ఈ అ) వికారముగల కన్నులుగలవాఁడు, సరిగాలేని కన్నులుగలవాఁడు

వి. అ పుం శివుఁడు, విషమనేత్రుఁడు

**విరూపి** సం విశ (న్ ఔ న్) కురూపము గల వాఁడు, అంగవికారముగలవాఁడు

వి న్ పుం. అడవిపిల్లి

**విరేకము** సం వి అ. పుం 1 బేది, మలముపోవుట, పాసనము 2 బేదిమందు, విరేచనములుకలిగించు మందు.

**విరేచనము** సం వి అ న = విరేకము

**విరేచితము** సం విశ (అ ఆ అ) విరేచనమైనది, మలముపోయినది.

**విరేఫము** సం వి అ పుం 1 ప్రవాహము, నది 2 మదము (వాచ)

విశ (అ ఆ అ) రేఫమను వర్ణములేనిది

**విరోకము** సం వి అ పుం, న రంధ్రము, కన్నము. పుం కిరణము.

**విరోచనసుతుఁడు** సం వి అ పుం బలిచక్రవర్తి

**విరోచనుఁడు** సం వి అ పుం 1. సూర్యుఁడు 2. చంద్రుఁడు 3 అగ్ని. 4 ఒకానొక రాక్ష సుఁడు, బలిచక్రవర్తితండ్రి, ప్రహ్లాదుని కొడుకు.

**విరోధకారి** సం విశ (న్. ఔ. న్) కలహములు కల్పించువాఁడు, పగకల్గించువాఁడు, కల్గించునది

**విరోధకృత్తు** సం విశ (త్) = విరోధకారి

వి. త్. పుం. 1, శత్రువు 2. ప్రభవాది సంవత్స రములలో నొకటి

**విరోధనము** సం. వి అ న. 1 వైరము, విరోధము 2 ఆటంకము, అడ్డగింత, నిరోధము 3 ముట్టడి. 4. ప్రతిరోధము, ఎదిరించుట 5 పొసఁగమి, పర స్పర విరోధము

**విరోధము** సం వి. అ పుం 1 శత్రుత్వము, వైరము, పగ. 2 ఆటంకము, అడ్డు, నిరోధము. 3. ముట్టడి. 4 అఁపుట, నిలుపుట 5 పొసఁగమి, పూర్వోత్త రములు సరిపడకుండుట 6. వ్యాఘాతము, భేదము 7 కలహము 8 దుఃఖము, కష్టము 9 (అలం) ఒకయలంకారము, విరోధాభాసాలం కారము (పూర్వోత్తరములకు వైరమున్నట్లు భాసించుట).

**విరోధి** సం విశ (న్ ఔ. న్) 1. ఎదిరించువాఁడు ప్రతిఘటించువాఁడు 2 ముట్టడించువాఁడు 3 వ్యతిరేకభావము గలవాఁడు, విరుద్ధుఁడు. 4 పగగలవాఁడు, శత్రుత్వము గలవాఁడు 5 కలహశీలుఁడు, పోట్లాడువాఁడు.

వి న్ పుం 1 శత్రువు, పగవాఁడు 2 ప్రభ వాది సంవత్సరములలో నొకటి

**విరోధించు** సం స క్రి ద్వేషించు, పగఁగొను

మ హరి.. మును మీయయ్యన్ విరోధించి రొక్కొ రుఁడు గ్రాసి వధింప ... ఉ రా. 8. 117

**విరోధోక్తి** సం వి ఇ స్త్రీ విరుద్ధముగాఁ జెప్పెడి మాట, విరుద్ధ వాక్యము, విప్రలాపము

**విరోప(హ)ణము** సం వి అ న 1. (వ్రణము) పుండుమాన్పుట 2 మొక్కలు నాఁటుట, (పాతి పెట్టుట)

**విరోహము** సం వి అ పుం పెరుఁగుట, మొలక యెత్తుట

**విర్గు** = విఱుగు అ క్రి తునియు, భగ్నమగు

ద్వి ఏమ వినోదమై రొక్కటి విరియఁబానివఁ జాపమువ్పుడు విర్గెఁగాక. శం. శా శా 78. శా. (శ. శ. శా).

**విర్చు** = విఱుచు స. క్రి విఱుగఁజేయు, ముక్కలు చేయు.

శా అట్టే...మంచి వల్లెచెఱకుల్ భారంబుగావిర్చి వేేకట్టెనొక్కపు ... హర 2. 8.

చ వెకృవఁ దరుశాఖవిర్చి కపి యచ్చటిచేరువఁ బల్వలోదకంబునఁ బడవైచెవంత వెలిపుట్ట ఖగాంగన గూయుచుండగన్. శేయూర 3. 180.

**విఱవిఱకపోవు** అ క్రి తాపమునొందు

క ఆపాతాళగభీరజ, లాపూర్ణమహో ప్రవాహమై నను గూపా, రావతిమిత పరమైనం, జాపము విఱవిఱకపోవఁ జొచ్చెం దనుపుల్ వేం. పంచ 3. 65.

**విఱపీఁగు = విఱ్ఱపీఁగు** అ. క్రి. గర్వపడు
క. వింటికి సరిబోము కౌనల,వింటికి సరిదొరక వెంత విఱపీఁగిన నె,వ్వంటికి వలపంటికి నల,వంటికి వల సాటి గుబ్బపాలిండ్లసిరుల్ అచలా. 2 40

**విఱిఁగి** వి. స్ఫోటభూమి
ఆ. విఱిఁగి నాఁగ స్ఫోటపృథివికి సంజ్ఞయా ... ఆం. భా. 2. 4

**విఱిచికట్టు** న. క్రి. (విఱిచి+కట్టు) (ఱెక్కలు) వెనుకకుఁద్రిప్పికట్టు.
ఉ. వట్టుఁడు పాఱుఁడంచు నరపాలుని భృత్యులు నందడించుచున్, గట్టిగ నాతనిన్ విఱిచికట్టిరి తన్నిలయంబు ముట్టుకో,లఎట్టిరి ... సారంగ 3 166.
సీ. తలనొప్పియయవరాదు ధరలోన ెవ్వారు విఱిచి కట్టించు వశ్యమల చౌకట ... దశా 4 117.
సీ. పెనిమిటిగలదాన వని కాటుక ధరింప వేడు కలాయని విఱిచికట్టు శుక. 2 115.
గీ. బహుభూషణదురీణ బాహువల్లరులకా కలఱు ముప్పిరిత్రాళ్ళ విఱిచికట్లు ... సారంగ. 3. 87.
ద్వి. కటకటా గోలవుగదర నాయన్న, మటు మాయచిత్రాంగిమాటలే నీకు, విఱిచి కట్లాయెఁ బృథ్వీపతి విన్న, నఱుకంగ సెలవీయ నాలు కెట్లాడె ... ద్వి. శ. సా 2 58 పా. 17 పం.

**విఱివి = విరివి** వి. విస్తృతి
చ. తరుచయు నీలనీరదవితానముపై వయిగప్పి యొంతయున్, విఱివిగ నేలయున్ దిశలు నింగియు నిండఁగ బర్వి మార్క. 2 165
విశే. విస్తృతము.
ద్వి. తెఱనోరు కరిమేను దీర్ఘజిహ్వాయును, విఱి వైనరూపును విషమదృష్టియును .. రం రా అర. 157. పా 28. పం.
సీ. బలుతల్పువగు నూస్థలముపై విఱివియొాతమి విల్ప యేమేమొ తలఁచి తలఁచి ... ఉ రా. 6 154.

**విఱుగఁబడు** అ. క్రి. (√ విరుగు.) 1. పాఱిపోవు, పలాయనముగు.
వ. ఇట్లు వెరలి చెట్లువిండ్లు వంచుకొని ఘుంచుకొను నన్నల్ల ప్రజం జూచి హల్లకల్లోలంబై విఱుగఁ బడు నెడ .. ఆము 6 76.
2 గర్వించు (శ ర.)

**విఱుగఁబాటు** వి (√ విరుగఁబడు) 1. గర్వించుట (శ ర) 2 ఓడుట
గీ. విఱుగఁబాటుల వీఁపున వెడలుగొఱక,లు ... కవిక 2 (శ ర)

**విఱుగడ** వి (√ విఱుగు) 1. విరామము.
వ. సాంసారికబంధంబులం దగులువడి మానవులు విఱుగడలేకున్నవారు భా రా యు 2335
2. విమోచనము.
వ. హనుమంతు ప్రసాదంబున భవత్కర్ణ పాశంబులు విఱుగడయ్యె రమ్మని .. మై. 3 131

**విఱుగు** అ. క్రి. రూ విర్గు 1 తునియు, ముక్కలగు.
క. సెఱిగలుగు నాఁడునాఁటికి, . చిఱుఁదొడలు నడుము నట్టును, విఱుగకతక్కదని గిరిజ వెఱచుచు నడచున్ కు సం 8 7
క. అఱువుడు గావిమునుంగును, విఱిగిన దండంబుఁ దునిసి వ్రేలెడుగోఁచిన్, బఱియయిన కమండలమును, చుఱచుఱయై వేఁడికెఱఁగు చూపుల తోడన్ ఉ. హరి. 4. 78
సీ. నవ్వావనవ్యముల్ శరములేయుటమాని వెఱఁకులు విఱుగంగ నిలుగుచాటు. వరాహ 11. 126
2 విరక్తమగు, అనక్తి లేకుండు
రగడ మందగమన చౌరకు చౌరకు మావిమావి మోకలెల్ల, నిందువదన మనసువిఱిగె నీడ నీడ నిలువనొల్ల వరాహ 3. 82.
క. అని యిటు లతఁ డాకామిని,యను వాక్యము లెల్ల వేఱెయర్థముగా నేర్చున విఱిచి మాటలాడిన, మననేమియు విఱుగకపుడు మదవతి కణఁకన్. సారంగ 2. 81
3 భయపడు
గీ. పాండుమనుజులు .. శిఖండియుఁ .. బండశక్తి, మొఱయ ... త్రొక్కుటఁ బైఁబడ్డ వెఱ్ఱి తాత, విడిచినా పుత్రులందఱు విఱిగి యుద్ధవిధ గలిసి రొక్కొం...యాతనికిఁ .. ఖడవులనె నక్కట్టి ... భీష్మ 1. 58.

ఆ ఇట్లు . క్రీడిసెలఁగి దేవదత్తమొత్తుటయును దత్సైన్యములు సెడఁ, విఱిగి పాఱె భీష్ముమఱువు సొచ్చె. (భార విరా 5 66.)

4. ఓడు, పరాజితుఁడగు

క. విఱిగి శపత్సుతనివహం, బఱిముఱిఁ గనుకనిఁ జనంగ భార. భీష్మ 2. 380

క. విఱిగి నిశాటులు రావణు, మఱువున కేతేరఁ జూచి మనమున కోపం, బెఱుకపడ భా రా. యుద్ధ 1 508.

క. అనినఁ జతుర్వదనుం డిట్లను రమ్మా పంచవదన యస్మృతంబులు పల్కెనె బ్రహ్మనన్నెఱుంగవె, వినుమిది కొంకైన నీకు విఱిగిన వాఁడన్. భోజరా. 5. 333

5. పలాయితుఁడగు, పాఱు

క. మొగమోడఁడితఁడు కౌరవ,జగతీశుఁడు విఱిగి నపుడు జవమున వెనుకం, దగిలి యిది యాద మాడఁగ, నగు నెడగా దఱుమవలయుననియె నతనితోన్ భార. విరా 5 338

సీ. లోకభీకరులమై నాకంబునకు దాడివెడలి యింద్రాదుల విఱుగఁదోలి వరాహ 4 52.

6. అడఁగు, వశించు

సీ. ముంచి చీకటులు కల్పించు నీడలుపోవ, పద్మాకరంబుల పాఁచివిఱుఁగ . శుక. 3. 10

నిర్మలమగు = ఇండుపకాయచేత నీళ్ళు విఱుగును.

మనసువిఱుగు = వికృతినొందు, నిర్వేదమునొందు.

క. కూరిమి విఱిగిన సతిపై, నేరమి దోఁచుగతి విషయనిస్పృహమతియై, కోరికలుడిగినవానికి నూరక విశ్వంబుమీఁద నొల్లమిపుట్టున్. కవి 5. 151

క అని యాశ విఱుగనాడిన, విని యందఱు జనిరి ... వాల్మీకి. 2 138

7. పడు.

ఆ. ఒడలు పెంచు అంటె యుబ్బుఁబునవైన వేగ విటునిమీఁద విఱిగెనేని, పందికొక్కుమీఁద బండికల్ పడునట్లు, విశ్వ ... వేమ 2 101.

8. (ఋణము) తీఱు

ఉ. అత్తఱిఁ బోతునెద్దుఁ గనకాంచితదివ్య విమాన మిక్కి పూఁగుత్తులు దేవతల్ గురిసికొంచు నుతింప వియత్తలంబునన్, హత్తి విచారమేమి టికి నత్తువు మాకది శూద్రనీవు నే, మత్తము వానికిన్ విఱిగె నప్పుడివంబున కేగుదెమ్మనన్. శేష 3 231

వాడుకలోని ప్రయోగవిశేషములు

ఉదా పాలువిఱిగెను, నెత్తురువిఱిగెను, మందు వలన విషము విరిగెను

వి 1 ఓటమి, పరాజయము

గీ నను జయించితివేలయ్య మనుకుమారఁ, విఱుగెఱుఁగ జగంబెల్ల నెఱుఁగు నన్ను, నెవ్వరేమేమిగారు నా యేటుదాఁకి, యమ్మ నీ బుద్ధి కెదురెక్కదయ్యెఁగాక కకు 1. 182

2 ముక్కలగుట, భగ్నమగుట

సీ కలనైన విఱుగెఱుంగని పోటు పరికరాచూరు కత్తులమాటు జొచ్చెఁ గొన్ని . వే. పంచ. 4 238

జ విఱిచికట్టు, విఱుగఁబడు, విఱుగఁబాటు, విఱుగడ, విఱుగుడు, విఱుచు, విఱుపు

**విఱుగుడు** వి (విఱుగు) పాకముచెడినవస్తువు.

ఉదా పాలవిఱుగుడు మొ (శ. ర, వా.)

విణ విఱుపైనది, విఱుచునది.

ఉదా పాషాణములకెల్లఁ బైఁడిప్రత్తి విఱుగుడు.

**విఱుచు** స. క్రి. (√ విఱుగు) 1 విఱుగఁజేయు, త్రుంచు, భగ్నముచేయు

ఆ లావు ..కోలెమ్ము బ్రల్లన, విఱిచి నడుము ద్రుంచి వీచివైచె (భార. ఆది 6 215.)

క విఱుతునో మ్రింగుదునో తల, దఱుగుదునో యేను జ్వరుఁడ . . (ఉ హరి. 8. 108 )

సీ విఱువుకంఠాస్థుల నుఱికి చివ్వంగుల మొత్తి మోదరలాడు మత్తకరుల ... పి. శకుం 2 12

2 (గాత్ర) వినామముచేయు

సీ. కడువికారంబుగా నొడలెల్ల విఱుచుచు మలఁగి రిత్తకురిత్త సెలఁగి నవ్వు .... భార విరా. 2 250

3 (నిరసించునపుడు పెదవి) మణుచు

సీ వెలయొప్పకవలఁబోవిఱుచుమోవియుఁ గోప మొదవెడు చూపు మోమోటఁద్రిప్ప. .. అము. 2 22.

తే అధరబింబంబు విఱిచి సంధ్యాగమ మని
నై ష. 6. 137.

4 చంపు

క అని గంగడోలు బిగియఁగ, దవ మెడయెత్తుకొని కపిఅదగ్గఱఁ జనుదెంచినఁ జూచి పుండరీకము, వెనువెనుక కెపోవుఁగాని విఱువదు దానిన్ భోజరా 6 70

సీ. వడవి రాళ్వయుజంబునను వ్రతంబులు బ్రహ్మ చారుల విఱిచి భక్షణముచేసి ... హై భా 5. 180

5 ఓడించు.

గీ. జెట్టితండంబుతోడఁ జేపట్టి వాశాంతకారి విఱిచినయట్టు లగ్గలిక విఱుతు, లాఁగువేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని. భార విరా. 1. 81.

6. (చేతులు వెనుకకు) త్రిప్పు

గీ అనిన...ఆ బహుశ్రుతుండు, వెఱచి వేగమ గురుఁబట్టి విఱిచికట్టి ... (విక్ర. 3 64)

7. పదచ్ఛేదముచేయు

క అని యిట్టు లతఁడా కామినియను వాక్యము లెల్ల వేఱెయర్థముగా నేర్పున విఱిచి మాటలాడిన, మననేమియు విఱుగకవుడు మదవతి కలఁకన్ పాంగ 2 81.

7. వివరించు, స్పష్టపఱుచు.

ద్వి అదివిని చెలికత్తె ఆమాయ కనిరి, యెదిరించి పైకొన్న యీ కల మంచివిధమంచు వక్కల విఱిచితి చెలులు, విధుముఖ యామాట వినమి నచ్చెలులు, వినవమ్మ కల నీకు విఱిచి చెప్పెదము. ప్రభులింగ 2 34. పా 15 పం

9. ఒక వస్తువునుండి వేరొకవస్తువును విభాగించు

క. . పాల్, హంస విఱువ నీ ర్విఱిచెను అము 4 178.

**విఱువు** వి. (√ విఱుచు) విఱుచుట, భంగము.

సీ. కలికి మాటలు కిలకిలనవ్వు లోరచూపులు మోవి విఱుపులు గులుకునడలు శుక. 2 483.

విజ. విఱుగుడు

ఉదా దానికిది విఱువు

**విజ్జనవీఁగు** = విజ్జువీఁగు అ క్రి మిక్కిలి అతిశయించు.

చ ఘనుఁడొకయోగితుల్యుఁ డనఁగా ధరణీ స్థలియందు నేరికిన్, వినఁగవరాని రూపమున విజ్జనవీఁగి తపంబు సేయఁగా, వనరుహమిత్ర చంద్రనగ వర్గసముద్రనదీనదక్షమా, జనతతి యన్ చలించెనని చారులు చెప్పిన మాట వింటరే చిత్రభా 2 52

**విజ్జువీఁగు** = విజ్జనవీఁగు (వీఁగు+వీఁగు) అ క్రి.

1 మిక్కిలినిక్కు, మిక్కిలిగర్వించు.

చ గురుని యుపేక్షఁజేసి తనకున్ పమరోద్ధతి నెల్ల దాని నీవెరవిఁడి గానలేఁడు తన పీరము కాఁగొని విజ్జువీఁగెడున్ భార. ద్రోణ 2. 46.

సీ వేల్పుటింతులలోన విజ్జువీఁగుచు మేన నవరత్నరచనలరవణ మెఱఁగె ... మను చ. 2 11

సీ శ్రుతిదూరభోగన క్తి విజ్జువీఁగి తాఁ జరణమ్మగజాదెనఁ జూపఁదేని (వసు. 1. 34.)

2. మిక్కిలిమెప్పు, మిక్కిలి అతిశయించు.

క విను నీ పదితిసుతుఁ డవు, విననకొడుక నేను విజ్జువీఁగెద్దుమనకున్, అనఁటుడు కళ్యాపుఁ డొక్కఁడ దనుజుల సామించి (శోధించి) చంపు దమ యిరువురమున్. భార. ఉద్యో 2. 285

సీ వానలు సరవితో వర్షించె పస్యముల్ పేళ్ళఁ గొల్చుగ విజ్జువీఁగి పండె మను. 6 121.

గీ. ఇరుగు పొరుగుల వారల యిండ్లనెల్ల, వివిధ మార్గంబులను సిరుల్ విజ్జువీఁగఁ, గుడిచి కట్టెడు శిశువుల గోము లరసి, తల్లి యెట్లోర్చుఁ దన పేదతనమునకును. కుచేల 1. 36.

3. సమృద్ధమగు

ద్వి పూచె మోదుఁగువృక్షములు విజ్జువీగ, గాచెఁ జూతంబులు . హరిశ్చ పూ 433

చ విపులధరాధరాగ్రమున వేలుపుమూకల రచ్చ రావి దివ్యవరిమళంబుతోఁ గడవలంతలు పండుల విజ్జువీఁగు ... వరాహ. 10. 120.

**విలంఘనము** సం. వి అ న 1 అతిక్రమించుట, దాఁటుట, మీఱుట 2 అపరాధము, శాసనోల్లంఘనము

**విలంఘించు** సం స క్రి. 1. అతిక్రమించు, దాఁటు.

మ. ఒక పాదంబున భూమిగప్పి దివి వేఱొంటన్ నిరోధించి యొం, డొకటన్ మీఁది జగంబులెల్ల దొడి యొండొంటన్ విలంఘించి ... హరి విభుం డొప్పారె విశ్వాకృతిన్. భాగ. 8. 625.

2. లంఘించు, దుముకు

మ తలయూచె గలకంరి యచ్చెరువునన్ దాటంక రత్న ప్రభల్, పలుకంబాటిన చెక్కుటద్దములపై బైపై విలంఘింపఁగాన్ . కాశీ 5. 168

(ఇట ప్రసరించు అని భావము)

**విలంఘితము** సం విణ (అ ఆ అ) 1 దాటఁబడినది, అతిక్రమింపఁబడినది 2 మీఱఁబడినది, ఉల్లంఘింపఁబడినది 3 అతిశయింపఁబడినది, మించఁబడినది 4 ఓడింపఁబడినది, జయింపఁబడినది

**విలంబనము** సం వి అ న 1 వ్రేలాడుట, జాగు, ఆలస్యము

**విలంబము** సం. వి అ పుం 1 వ్రేలాడుట 2 ఆలస్యము, జాగు 3 ప్రభవాది సంవత్సరములలో నొకటి "విలంబి" అని వాడుక

**విలంబి** సం విణ (న్. నీ న్) 1 వ్రేలాడునది 2 జాగుచేయునది, ఆలస్యముచేయునది, మందమైనది.

**విలంబించు** సం అ క్రి ఆలస్యముచేయు, జాగు చేయు.

శా ఎండన్ గ్రుగ్గితి రాకటన్ బడిలి రింకేలా విలంబింపఁగా, రండో బాలకులార చల్దిఁగుడువన్ ... భాగ. 10 పూ 493

**విలంబిక** సం వి అ స్త్రీ మలబంధము, రోగభేదము.

**విలంబితము** సం విణ (అ ఆ అ) 1 అనుకొనియుండునది, అనుకొనియుండునట్లు చేయఁబడినది 2 వ్రేలాడునది, వ్రేలాడఁదీయఁబడినది 3 చేరియుండునది, అంటియుండునది. 4 జాగైనది, ఆలస్యమైనది 5 మందమైనది (సంగీ) ద్రుతము మధ్యము గానిది.

వి అ న 1. జాగు, విలంబము, ఆలస్యము 2 నృత్యవిశేషము

**విలంభము** సం. వి అ. పుం 1. ఔదార్యము 2 అధిక దానము, మిక్కిలియీవి.

**విలక్షణము** సం విణ (అ ఆ అ.) 1 విశేష గుణములులేనిది. 2 భిన్నమైనది, వేఱైనది. 3 విశేష లక్షణములుగలది, అసాధారణమైనది 4. శుభ చిహ్నములు గలది శుభచిహ్నములు లేనిది.

వి అ న 1 వైయర్థ్యము, నిష్ప్రయోజన స్థితి, 2 పాఱజూచుట, కనుపెట్టుట

**విలక్షము** సం విణ (అ ఆ అ) 1 విశేష గుణములు లేనిది 2 విశిష్టమయిన (అసాధారణమయిన) చిహ్నములు గలది 3 కలవరపడినది, క్షోభపడినది 4 ఆశ్చర్యపడినది, విస్మయము నొందినది 5 సిగ్గుపడినది, భంగపడినది 6 తెచ్చిపెట్టుకొన్నది, స్వాభావికము కానిది (చిఱునవ్వు మొ)

**విలక్షించు** సం అ క్రి ఆశ్చర్యపడు

మ రామరావణు లసామ్యులైన యుద్ధంబుఁ జేసిరి నక్తందివ మేడునాళ్లు త్రివిక్రమేణుల్ విలక్షింపగన్ దశా 7 2 155

**విలక్షితము** సం విణ (అ ఆ అ) 1 ప్రత్యేకపఱుపఁబడినది 2 పరిశీలింపఁబడినది, కనిపెట్టఁబడినది 3 క్షోభపెట్టఁబడినది, కలఁతనొందింపఁబడ్డది 4 విసిగింపఁబడినది 5 భేదపఱుపఁబడినది.

**విలగ్నము** సం విణ (అ ఆ అ) 1. మిక్కిలి యంటియుండునది, అనుబంధించియుండునది 2 గుఱిపెట్టఁబడినది 3 గతించినది, కడచినది. (కాలము) 4. సన్ననిది, సుకుమారమైనది

వి అ న 1 నడుము, మధ్యము 2 కటిప్రదేశము 3 మేషాదిరాసుల యుదయము.

**విలపనము** సం వి అ న 1 సంభాషించుట, పలుకుట 2 వదరుట, వ్యర్థసంభాషణము 3. ఏడ్చుట, విలపించుట 4 జిడ్డుగల వస్తువుల మడ్డి

**విలపించు** సం అ క్రి పరిదేవనముచేయు, ఏడ్చు

గీ హా హరిశ్చంద్ర కనకపర్యంకతలము, నందుఁ బొందు నీయంగమే యకట చెవఁటి, నేలఁ గూలినయది నేఁడు నీచదైవ, మిట్టి దశ దెచ్చెనే దివిజేంద్రభోగ.

వ అని విలపించుచు నమ్మహాదేవి భర్తృ దుఃఖ భారపీడితయై ... మార్కం 1 82.

**విలపితము** సం వి అ. న ఏడుపు, విలాపము.

**విలయనము** సం వి అ. న. 1 ద్రవముచేయుట, నీరుగాఁజేయుట 2. హరింపఁజేయుట 3. తీసివేయుట, తొలఁగించుట. 4 సన్నముగాఁ గొట్టుట, చూర్ణముచేయుట, పొడిగొట్టుట 5. పొడి, చూర్ణము

**విలయము** సం వి అ పుం 1 ద్రవమగుట, ద్రవీభావము. ౨ నాశము, అణఁగిపోవుట ౩ ప్రపంచనాశము, ప్రలయము

**విలవిల** వి 1 ప్రాణము విడుచుటయందగు ననుకరణము.

ద్వి సిరివరు జయ ... సేఁ ప్రాలన గ, వంకుశ మౌక్తికవ్రాతంబు రాల, విలవిలఁ బ్రాణము ల్విడువంగ ధరము, వల వజ్రగతి ముష్టిహతి మగ్గఁజేసి, దాని దంతంబు వంతంబున మాడ్చి, పూని శా నావహస్తిని ముక్తికనిచె (అమ క. ౩ 148. పా ౮ పం)

౨ **తన్నుకొనుటయందగు ధ్వని కనుకరణము.**

ద్వి **విలవిలఁదన్నుక** విడిచెఁ బ్రాణములు. ద్వి నల 4 (శ ర.)

౩ **విహ్వలత.** (చూ విలవిలపోవు)

జ : విలవిలఁబడు, విలవిలపోవు.

**విలవిలఁబడు** అ. క్రి (విలవిలన్+పడు) మ్లానమగు, వాడిపోవు.

క తెలతెలవాఱఁగవచ్చెను, వెలవెలఁ బాఱె నెలదొవలు విలవిలఁబడియెఁ, బలపలనయ్యెం జుక్కలు... (సారంగ. ౩ 197.)

**విలవిలపోవు** అ క్రి (విలవిల+పోవు) విహ్వలతఁ జెందు, అవశమగు.

ఉదా చేతులు కాళ్లు విలవిలపోవుచున్నవి.

**విలసత్** సం క్రి (సమాస పూర్ణావయవముగానే ప్రయోగము) 1 ప్రకాశించుచున్న ౨ తళుకుమనుచున్న ౩ తరంగములవలె చలించుచున్న, 4 విలాసముగల, క్రీడాశీలమైన, ఆటలం దిష్టముగల.

**విలసనము** సం వి అ న 1 తళుక్కున మెఱయుట ౨ ఆటలాడుట.

**విలసించు** సం అ క్రి ప్రకాశించు

సీ నందనవనవాసనల సొంపు విలసింప వలసంపుఁ జలిగాడ్పు లనుసరింప కకు ౩ 38

**విలసితము** సం విశే. (అ అ అ) 1, ప్రకాశించునది, తళుక్కుమని మెఱయునది. ౨ కనఁబడునది, స్పష్టమైనది ౩ ఆటలాడునది, క్రీడాశీలమైనది.

వి. అ. న 1 తళుక్కుమని ప్రకాశించుట,తళుక్కుమనుట. 2. తళుక్కుమనెడి మెఱపు, ప్రకాశము. ౩ స్పష్టముగాఁ గనఁబడుట, స్పష్టపడుట 4 ఆట, క్రీడ, శృంగారచేష్ట ౫ చేష్ట, అభినయము ౬ ఫలితము, పర్యవసానము,

**విలసిల్లు(లు)** అ క్రి 1 ప్రకాశించు.

ఉ శ్రీతరుణీ ముఖోజ్జ్వలశశిద్యుతియున్ బృథుకౌస్తుభార్కబాల తపదీప్తియు న్నిజభుజాంతఁ మ్యనభస్థలిన్ జఁస్ఫుతవిచిత్ర భాతి విలసిల్లఁగ నొప్పుఁ మాధవుఁడు మార్కం 1 1

మ వసుధాచక్ర మవక్రమై విలసితెన్ వార్ధుల్ చెలంగెన్ కృ శకుం ౩ ౪౬.

2. సంతోషము

ద్వి వేఁటాడఁ జయ్యన విచ్చేయుమనిన, మాటకు విలసిల్లి మనుజవల్లభుఁడు, వానికిఁ దవకట్టు వర్గంబు నిచ్చి . నవనాథ. 1, 47 పా. 28 పం.

**విలాతి** వి దేశము.

చ.. వెలలేని సొమ్ములన్, వెనఁ గడుఁగూర్మి తోడఁ జదివించిన విమ్మట గారవంబుతోఁ, బసుపున కిచ్చెనంత వృషపర్వుఁడు కొన్ని విలాతు లింతికిన్ యయా 4 122

చ . వసుమంతుఁడు నాఁ బ్రసిద్ధిగాంచిన యొక సెట్టియుండు నలసెట్టిన మూఁడువిలాతి కేఁగుచున్, తన ధనరాసిపై నిడిన దాశ్చి ... వేం పంచ 1. 479

సీ. సౌవర్ణకలశముల్ సవరించిన విలాతి సకలాతి వశౌదాల సామజములు రంగా 1 156.

**విలాపము** సం వి అ పుం పరిదేవనము, ఏడ్పు

**విలాపించు** సం. అ. క్రి దుఃఖించు

సీ అని విలాపింప మారార్చి యేఁటికిఁ గ్రేపుఁ గాసి గొడ్డొఅలెడు పగిది నడలెదు...జై. భా ౬. 265

**విలాసకాననము** సం వి. అ పుం శృంగారవనము, లీలోద్యానము

**విలాసనము** సం వి అ న. 1 ఆట, క్రీడ,వినోదము. ౨ శృంగారచేష్ట, సయ్యాట, సరసము

**విలాసమందిరము** సం వి అ న. లీలాగృహము, ఆనందమందిరము, విలాసముల కేర్పడిన యిల్లు.

**విలాసము** సం వి అ. పుం 1. క్రీడ, ఆట, వినోదము 2 స్త్రీల శృంగార చేష్టావిశేషము, స్త్రీల యంగవికేపాదులందలి తాత్కాలిక విశేషము 3 వగలాడితనము, వలపించుట 4 స్త్రీలసాత్త్విక భావవిశేషము 5 చక్కఁదనము, సౌందర్యము 6 తళుక్కుమని మెఱయుట

**విలాసి** సం. విణ (న్ సి న్) 1 క్రీడాశీలుఁడు, ఆటలాడెడివాఁడు, శృంగార చేష్టలు గలవాఁడు, వలపించువాఁడు

వి న్ పుం 1 విషయసుఖమును గోరుమనుష్యుఁడు. 2 అగ్ని 3 చంద్రుఁడు 4 పాము. 5 కృష్ణుఁడు 6 శివుఁడు 7 కామదేవుఁడు, మన్మథుఁడు.

**విలాసించే** సం అ క్రి క్రీడించు

సీ. మనసు రింగులువార మణితక్వణంబునఁ జెంత నల్లన విలాసించె శౌరి పి శకుం. 3 218

**విలాసిక** సం వి. అ. స్త్రీ శృంగార రసబహుళమై యేకాంకమయిన నాటికాభేదము

**విలాసిని** సం వి ఈ స్త్రీ శృంగారచేష్ట లెక్కువగల స్త్రీ; స్త్రీ. 2 వేశ్య

**విలిఖనము** సం. వి అ న 1 గోఁకుట, గీఱుట 2. వ్రాయుట

**విలిఖించే** సం. స క్రి వ్రాయు

మ. కళలం దేలు మెఱుంగుఁ జెక్కులపయిన్ గస్తూరికాపత్రముల్, విలిఖింపన్ . చంద్రా. 6 124.

**విలిప్తము.** సం విణ (అ ఆ అ) 1 పూయఁబడినది, రుద్దఁబడినది 2 మలినముగాఁ జేయఁబడినది, కళంకితము, అపవిత్రితము.

**విలియవేయు** స క్రి 1. నరిచూచు (శ ర) 2. పూఁటకాపుగా చేంచులు (వాచ.)

**విలీనము** సం విణ. (అ ఆ అ) 1 అణఁగియున్నది, అంతర్భావమైనది. 2. అంటియున్నది, ఆశ్రయించియున్నది. 3. కరఁగినది, ద్రవరూపము నొందినది. 4. నశించినది, చచ్చినది

**విలు=విల్లు** వి. ఔ. ధనుస్సు.

క. ... విలు ఢిఱుగఁజేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు దోర్బలలీలన్ భార. విరా 5. 74.

- విలునమ్ము సంకుఁజక్రము, బలకయుఁ గాఁపే యకంబుఁ బాశముగదయున్, గల యెనిమిది చేతుల దాఁపల వలపలఁ దాల్చి శౌరి బాణుని యనికై ఉ హరి. 6 25

శా ఏ వేళన్ సీతయు లక్ష్మణుఁడుఁ దను సేవింపంగ విల్లూని చెల్వొలిలన్ దగు రామమూర్తి రఘువాథాధీశ్వరుం బ్రోవుతన్ విజ. వి 1 1

జ విలుకాఁడు, విలుదాలుపు, విలుమండి, విలువిద్దె, విలువిద్య.

**విలుంచనము** సం వి అ న తీల్చుట, ఛేదించుట, పెరుకుట 2 (తోలు) ఒలుచుట.

**విలుంఠనము** సం వి అ న 2. దోఁచుట, కొల్లపెట్టుట. 2 భూమిపై దొర్లుట, పొరలుట.

**విలుంపకుఁడు** సం వి అ పుం. దొంగ, తస్కరుఁడు, దోచుకొనెడివాఁడు.

**విలుకా(ల్కా)ఁడు** విణ. (విలు+కాఁడు) ధానుష్కుఁడు, విల్లుపూనినవాఁడు

సీ అతిరథోత్తముఁడు ద్రోణాచార్యుఁ డందలి యిందలి విలుకాండ్రకెల్ల గురుఁడు భార. ఉద్యో 4 229

క అసమశరుఁ డించు విల్లును, కుసుమశరమ్ములను విడిచి కొమ్మలభ్రూనే, త్రసమృద్ధిచేతఁ దత్పురిఁ, బసగలవిలుకాఁ డనంగ బరగుచు నుండున్ విక్ర 1 81

గీ అలరు విల్కానితల్లికిఁ బ్రార్థితార్థఁకలవల్లికి మ్రొక్కఁగఁ గంటిమంటి. కాశీ. 3 41

ద్వి విలుకాండ్రురిద్దరు వివిధశస్త్రాస్త్ర. కలితులై యట వంపకడ నున్నవారు. రం రా. కిష్కిం 168 పొ. 27. పం

(చి ని. పా. విలుపూని యిద్దరు, ముద్రి పా)

**విలుచే(ల్చు)** స క్రి 1. కొను

గీ జీవహింస యెన్నండును జేయ నవఘ, యొరులు సంపితెచ్చిన మాంస మొవర విలిచి, తగినవెల కమ్మి బ్రదుకుదుఁ దద్ధనమున .. భార అర 5 33

సీ. ... ఎక్కుడు సొమ్ముకలవాఁడ నెంత యర్థంబైన నిచ్చి నిన్ను, విలిచెదఁ జెప్పుమా వెల యన్న...మార్కం 1 226

చ.. ధూర్జటిన్, వరించినవాఁడు భక్తిమయ విత్తమునన్ ధరనేకవీరుఁడై నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుఁడు. ఉ హరి 5 89

చ...క్రొవ్విరి మల్లెపూవుబంతులు దశనాథరద్యుతులఁదోఁచివఁ బైకొనరీమిగా విటుల్, విలువగ వారి చిత్తములు విల్తురు తత్పురిఁ బువ్వులావికల్. పి శకుం 1 83.

2. అమ్ము, విక్రయించు.

శ కొలిచితిమో పెఱవేల్పుల, నిలిచితిమో శూలధరుని నిందించుచెడన్, దలఁచితిమో దుర్వృత్తులు, విలిచితిమో వేదమంత్ర విద్యావిభవుల్. శెన్న 5. 406

గీ. విరులు విలుతురు పుష్పలావికలు వీఁట వసు. 1. 109.

గీ. పొందుగావిపొందు పోనఁగ పెక్కువయేల, యేకతమున నెవ్వఁడేని యొరుల,ధనము కాని దాని దాను విల్చుటయది, మెచ్చుగాదు వాఁడు ముచ్చుగాని విజ్ఞా ప్రా 24.

గీ. అలరు బొంతులఁ దెలఁగించి యఖిలకమన, పాళితమదండకై యానపడఁగఁ జేసి, విరులు విల్తురు కుసుమలావికలు వీఁట .. చంద్రి. 1 105

3. పిలుచు, ఆహ్వానించు

గీ. వెలయు విలిచె ననంగఁ బిలిచెననుట ఆం భా 3 184

జ విలువ, విలువకత్తె, విలువకాఁడు, విలువ జవరాలు, విల్పికోలు

**విలుదాలుపు(ల్పు)** విశ. (విలు+తాలుపు) ధనుర్ధరుఁడు.

క. విలుదాలుపుఁ బ్రోడలు తావ, చెలిజంట కొలం పురాచసింగపుఁగొదమల్, నిలిచిరటఁ బుడమి పుట్టగు, నెలఁతుకయం దాముఁదపసి నెలపున నంతన్ రామా. 5. 23.

(శ. ర. పా. విలుదాల్పు, ముద్రి. పా.)

గీ. తరలివచ్చిన నవ్విలుదాల్పుగడిమి, నెదురుకొని పెక్కునెఱదూపు లేసి యెల్ల, నల్లద్రావుడు మూఁకలఁ ద్రెళ్ళఁజేసి, యగ్గరాసులపై నిలిట్టార్చుకొనుచు. అచ్చ. రా. అర 12

**విలుప్తము** నం విశ (అ. అ అ.) 1 లోపించినది, తక్కువపడినది 2. విఱువఁబడినది, చీల్పఁబడినది 3. బలాత్కారముగాఁ బట్టుకొనఁబడినది, 4 కొల్లగొట్టఁబడినది, దోచుకొనఁబడినది. 5 వశింపఁజేయఁబడినది, ధ్వంసము చేయఁబడినది 6 అంగవిహీనము గావింపఁబడినది, వికలాంగము గావింపఁబడినది

**విలుమంది** వి (విలు+మంది) విల్లులు ధరించిన జనసమూహము, విలుకాండ్రు

ఆ. వలపవెదర నృపతి కలఁగక ప్రజ వగ, లార్పఁ బనిచి కనుమలందునిలువ, వేలువేలయేర్చి విలుమందిఁ బనిచితా, రుడుకుపెంచె ముఱకవాదము వెడలి. ఆము 3 27.

**విలులితము** నం విశ (అ అ అ.) 1. చలిపిచేయఁబడినది 2 చలింపచేయబడినది. 3 తల్లిబిల్లుచేయఁబడినది, తాఱుమాఱుచేయఁబడినది. 4. చంచలమైనది, స్థిరతలేనిది, నిలుకడలేనిది

**విలువ (ల్వ)** వి. (√ విలుచు) 1. వెల, క్రయము, ఖరీదు, మూల్యము.

ఆ కర్షకునకు నేలకాల మెఱుంగుట, బట్టివానికేది సంభవించె, నందు విలువ మొదలవగు లాభమును నెడ, వ్యయముగల్గుటయు శివప్రదములు ఖార అను 5 35.

కం దేవార్చనానిమిత్తము, దా వేలోతతోఁట వేయఁదలఁచి యతం డా,తాపు గృహస్థుల చేతన్, వేవిలి సుక్షేత్రభూమి విలువకుఁ గొనియెన్. వై జ 1 83.

వ. .. మలయంబునంగల చలువకు విలువయెయ్యది... మను. 1. 72.

సీ ఈ చంద్రబింబాస్య నీ భూసురేంద్రుడ కీవు మొదల విక్రయించువేళ, నీవిల్వలోని వాఁడీనందనుఁడు గాఁడు వేఱె పుత్రునికిని విలువ వలయు. (హరిశ్చ. 4. 136.)

**విల్వసేయు** = కొను

మ త్తకోకిల, ఆజగత్పతిచిత్త గేహమునందుఁగాఁ పురముండఁగా, బూజసేయకయొండు వేల్పులఁ బూనికొల్వఁగఁబోవుటల్, రాజసంబునఁ జేతి కౌస్తుభరత్న మొల్లక బెలతై,గాజుఁ బూనలు విల్వసేయఁగఁ గాంతనేనెదరే మనన్. వాసిష్ఠ. 4 18,

2 ప్రాముఖ్యము

గీ . . గౌరి తనదారు సౌభాగ్య గౌరవంబు, విలువ పోయిన చెలువున విన్నవయ్యె హరి 3. 83

**విలువకత్తె** వి (విలువ+కత్తె) 1 వెలయాలు, వెల వేలది, శ్యస్త్రీ

చ .. మాలఁగల గ్గెలు తగ్గలుజేసి ప్రోలుచన్, గలసి చరింతు విలువకత్తెలు మారుని కత్తులో యనన్ ప్రబంధ 17

2. వెలయిచ్చి వస్తువుఁగొను స్త్రీ

(చూ విలువకాఁడు)

**విలువ(ల్వ)కాఁడు** విశ (విలువ+కాఁడు) వెలయిచ్చి వస్తువును కొనువాఁడు, క్రేత.

ఉ ఎత్తుల యొప్పుకంటె పరమెత్తుట యొప్పుగఁ జొక్కివిల్వకా, ఓ త్తడిఁబుప్పముల్ కొనర కూరకయున్కికి నల్ల నవ్వుచున్ విక్ర. 1 83.

**విలువజవరాలు** వి జౌ (విలువ+జవరాలు) వెల వెలఁది, వేశ్య.

గీ. తొలుత రతిదేల్చె వాగదత్తుండు తనదు, విలువ జవరాలికూటమి గలఁచి తలఁచి ... ప్రబంధ 720

**విలువిద్దె** వి. (విలు+విద్దె.) ధనుర్విద్య

చ కరితురగాధిరోహముల గద్దులై విలువిద్దె లందు నేర్పరులయి చాతురంగరణరంగ సమర్థులునై రి ధారుణిన్ చంపూ రా. 2 53

**విలువిద్య** మి వి (విలు+విద్య.) ధనుర్విద్య.

క విలువిద్యఁ గఱచుచుండిరి, బలయుతులు కుమారకులు ... (భార. ఆది 5 181.)

సీ. జమదగ్నిసుతకృపాశ్రయమునఁ బడసిన విలువిద్య కలరూపు వెలయఁజేయ భార విరా 4. 205

**విలూనము** నం విశ (అ అ అ) ఖండింపఁబడినది, నఱకఁబడినది

**విలేఖనము** నం వి అ. న 1. గోఁకుట, గీఱుట, వ్రాయుట 2 త్రవ్వుట. 3 నిర్మూలముచేయుట, వేళ్ళతోఁగూడఁ బీకివైచుట. 4 విడఁదీయుట.

**విలేపనము** నం వి అ. న. 1. పూయుట, అలఁదుట. 2. సువాసనపరిమళద్రవ్యము (చందనాది.)

**విలేపని** నం వి ఈ స్త్రీ పరిమళ ద్రవ్యములనువా సనగల స్త్రీ 2 సువేష, మంచిదుస్తులు ధరించిన స్త్రీ 3. యవాగువు, గంజి, జావ

**విలేపము** నం వి అ పుం 1. పైనిబూసికొనెడి పదార్థము (చందనాదికము) 2 సున్నపుగచ్చు 3 సున్నము పూయుట, సున్నముచేయుట, గచ్చుచేయుట

**విలేపి** నం వి ఈ స్త్రీ యవాగువు గంజి, జావ.

**విలేపిక** నం. వి ఆ స్త్రీ = విలేపి.

**విలేప్యము** నం వి అ. పుం = విలేపి

విశ (అ అ అ) పైనిబూసికొనఁదగినది. (చందనాదికము)

**విలోకనము** నం. వి అ న 1 చూచుట, కనుఁగొనుట. 2 చూపు

**విలోకించు** నం న. క్రి వీక్షించు

వ ... సూత్రంబున మణిగణంబులంబోలె నున్న శూన్యలోకంబులు విలోకించి ... వరాహ 2 159

ద్వి భానుకోటిప్రభఁ బ్రత్యక్షమయ్యె, నైనవిలోకించి ద్వి. పరమ 3. 163 పొ

**విలోకితము** నం విశ (అ అ అ) 1 చూడఁబడినది. 2 పరీక్షింపఁబడినది, పరిశీలింపఁబడినది

వి అ న. చూపు, దృష్టి

**విలోచనము** నం. వి అ న నేత్రము, కన్ను

**విలోడనము** నం వి అ. న 1. మథించుట, త్రచ్చుట, ఇటునటుఁ గదుపుట

**విలోడితము** నం విశ (అ అ అ) 1. మథింపఁబడినది 2 ఇటునటు కదల్పఁబడినది. 3. నేలపై దొర్లింపఁబడినది

వి అ న. చేల్ల, తక్రము.

**విలోపనము** నం వి. అ న. 1 లోపింపఁజేయుట తక్కువపఱుచుట 2. భేదించుట, నఱకుట. 3. తీసికొనిపోవుట 4. నశింపఁజేయుట, నాశము.

**విలోపము** నం వి అ పుం 1. తీసికొనిపోవుట. 2 బలాత్కారముగాఁ బట్టుకొనుట. 3. దోఁచుకొనుట, కొల్లగొట్టుట 4 అదర్శనము, కనఁబడకుండుట, అంతర్ధానమగుట, నాశము.

**విలోభనము** సం వి అ న ఆశచూపి యాకర్షించుట, ఆశగొలుపుట 2. దుర్మార్గమునఁ బ్రవేశపెట్టుట, మంచిమార్గమునుండి తప్పించుట 3. ముఖస్తుతి, ఇచ్చకము.

**విలోభము** సం వి అ పుం. 1. ఆశగొలిపి యాకర్షించుట, మోసగించుట 2 మరులుగొలుపుట, దుర్మార్గమునఁ బ్రవేశపెట్టుట

**విలోమజాతుఁడు** సం విణ (అ అ అ) = విలోమజుఁడు

**విలోమజిహ్వము** సం వి అ పుం. ఏనుఁగు

**విలోమజుఁడు** సం విణ (అ అ అ) (విపరీత క్రమమునఁ బుట్టినవాఁడు.) తండ్రికంటె నుత్తమజాతి గల తల్లికిఁ బుట్టినవాఁడు (వ్యతి అనులోమజుఁడు)

ఇట్లే విలోమవర్ణుఁడు, విలోమోత్పన్నుఁడు.

**విలోమము** సం విణ. (అ ఈ అ) 1. విరుద్ధము, విపరీతము, తలక్రిందైనది 2 విరుద్ధ క్రమమునఁ బుట్టినది 3 వెనుకఁబడినది, హీనస్థితిలోనున్నది.
వి అ పుం 1. విరుద్ధక్రమము 2 కుక్క. 3 పాము.
న. నీరుతోడెడి యంత్రము

**విలోమి** సం. వి ఈ స్త్రీ ఉసిరిచెట్టు,

**విలోముఁడు** సం. వి అ పుం వరుణుఁడు.

**విలోలనము** సం వి అ న 1 కదుపుట, ఆడించుట 2. శుద్ధముగాఁ జేయుట, కలియఁ బెట్టుట

**విలోలము** సం విణ (అ ఆ. అ) చంచలము, కదలునది. 2 విడిపోయినది, విరియఁబోసికొనఁబడినది (జుట్టు.) 3 మిక్కిలి తృష్ణగలది

**విలోహిత** సం వి అ స్త్రీ. అగ్నిహోత్రుని సప్తజిహ్వలలో నొకటి

**విలోహితము** సం. విణ. (అ ఆ. అ) ధూమ్రవర్ణము గలది, ఎఱుపును నలుపును గలసినది. 2. ఎఱ్ఱనిది, రక్తవర్ణముగలది.

**విలోహితుఁడు** సం. వి. అ. పుం రుద్రుఁడు

**విల్పికోలు** వి. (√ విలుచు) వెలయిచ్చికొనుట.

ఉ. ... ఇది పథ్యము మమ్మొక నక్కనిచ్చి, సింహమ్ముల విల్చికోలుఁ బడెదె యన్నట్లె వారలు కౌరవేశ్వరా. భార సభా 2. 181

**విల్లు** = విలు వి ఔ. ధనువు, ధనుస్సు.
బ వింటులు, విల్లులు, విండ్లు,

ఉ వేఱొకవిల్లు పుచ్చుకొని వింటులు రెండును ద్రుంచి మేనులం దూఱఁగనేసె . భార. ద్రోణ. 3 83.

గీ అర్జునుఁ డొంటిభార్గవుఁడు వింట,నిట్టిఁడే యని పొగడంగ నెల్లజనులు భార ఆది. 5 230

సీ జగములొక్కుమ్మడి సాధింపనెత్తిన రతిమన్మథుల విండ్లు రమణి బొమలు. నైష. 2 15

దీని భేదములు తడవిల్లు, వెదురువిల్లు, సెలసువిల్లు మొ

గీ విల్లుపట్టిన నెలపదినాళ్ళలోన, వీఁకగలిగిన తడవిల్లు వెదురువిల్లు, సెలసువిల్లును మొదలైన చేగవిండ్లు, చులుకుగాఁదీసి శబరేంద్రసూనుఁ డేయు కాశ 3 35

జ వింటికోల, వింటిజోడు, వింటిపట్టు, వింటిపెట్టు, వింటిబద్ద, వింటిసాని, వింటివాఁడు, విండ్లమ్ములాట, విండ్లవాడు

**విళగు** వి ఒక స్వరస్థాయి.

ద్వి శిక్షాయి పోయలును రక్షిలవిళగు, చొక్షాయి యాదిగా సొగయుతాయములు బస పు 3 71. పొ. 15 పం.

**వివంచిషు(ఁడు)వు** సం విణ (ఉ) వంచనచేయ నిచ్ఛగలవాఁడు, మోసపుచ్చఁ దలఁచినవాఁడు, మోసగాఁడు

**వివక్ష** సం వి ఆ స్త్రీ 1 చెప్పనిచ్ఛ, చెప్పఁదలయువాఁడి తలంపు. 2 ఇచ్ఛ, కోరిక, 3 అర్థము, అభిదేయము 4 ఉద్దేశము, తలంపు.

**వివక్షించు** సం స క్రి చెప్ప నిచ్ఛించు

మ చలితాఘంబగు వేదభూజమునకున్ శాఖోపశాఖాచయంబులు పెక్కుల్ గల వన్నియుం బ్రకటితంబుల్ గా వివక్షింపనా, జలజాతాసనుఁడైన నోపఁడు వి పు 4 67.

**వివక్షితము** సం విణ. (అ. ఆ. అ) 1 చెప్పనుద్దేశింపఁబడినది, తలఁపఁబడినది. 3. ఇచ్ఛగింపఁబడినది, కోరఁబడినది. 4. ఇష్టమైనది, ప్రియమైనది
వి అ న. 1. ఉద్దేశము. అర్థము. అభిదేయము.

**వివక్షు(ఁడు)వు** సం. విణ (ఉ) పలుకనిచ్ఛగలవాఁడు, పలుకసిద్ధముగా నున్నవాఁడు.

**వివత్స** నం వి అ స్త్రీ దూడలేని యావు

**వివదించే** నం అ క్రి వాదముచేయు,

సీ వేదాంతమది వార్ధి విననగు దెల్పెద పూర్వ పక్షగ్రాహ పుంజయుతము, సిద్ధాంత ఝషము లచే స కులంబగు నజ్ఞానభీరువుల గు మునిఁగి, చిత్తశుద్ధియలేక చెడి రియి పుచు వివది తు రెవుడు వివేక మెడలి,... సేతు . 7 పొ.

**వివధము** నం వి అ పుం 1. కావడి 2 మార్గము, దారి 3 బరువు, భా ము 4 గ్రామాంతధాన్యము, నిలువధాన్యము 5 పాత్రము (కుండ మొ)

**వివధికుఁడు** నం వి అ పుం 1 బరువు మోయు వాఁడు, కావడివాఁడు. 2 కావడితో సరుకులు తీసికొనిపోయి యమ్ముకొనువాఁడు

**వివరకట్టు** అ క్రి (√ వివరము) స్పష్టపడు

గీ గజ్జియలు మ్రోత గలగలగల యట చు, వివర కట్టుక రయమున వినికిఁజేయ, విరులతేరు విశా నముం దరికి నరిగి, స్థాయిగావించి యంతట హాయిమించి మల్లువు. 4 65.

**వివరణము** నం వి అ న. ప్రకటించుట, బైలుపఱు చుట 2. కప్పు లేకుండఁజేయుట 3. వివరి చుట, స్పష్టముగాఁ దెలుపుట, వ్యాఖ్యానము 4 వ్యాఖ్యా నమునకు వ్యాఖ్యయగు గ్రంథము 5 వర్ణించుట, వర్ణన 6 వాక్యము.

**వివరనాళిక** నం వి అ. స్త్రీ మురళి, పిల్లనగ్రోవి

**వివరపుట్టు** అ క్రి (వివరము+పుట్టు.) విశదమగు, స్పష్టమగు.

క. నావిని రక్షాతుఁడు చిరజీవిం బరికించి చ చ్చే చేసెడు పని యే, మీ వివరపుట్టఁజెపుమా, నీ వమటయు నాతఁ డాతనికి నిట్లనియెన్ వేం. పంచ 3. 295.

గీ వివరపుట్టంగ నాను పూర్వియనుగాఁగఁ, దనె లించింపు మన .. (విప్ర 5. 46)

**వివరము** విణ (నం వివరణమ్) విస్పష్టత

ద్వి. రవళిసేయుకి పదరక యొక్కరొకరై, విప రమ్ముగా మాకు వివరింపుఁ డనిన ద్వి పరమ. 4 336 పొ.

జ . వివరకట్టు, వివరపుట్టు, వివరి వివరించు.

**వివరము** నం వి. అ. న 1 రంధ్రము. 2. సందు, మధ్యనుండెడి యవకాశము, జీట 3 నిర్జనప్రదే శము 4 దోషము, లోపము. 5 గాయము 6 గణిత) తొమ్మిది సంఖ్య

పుం విస్తృతి, విరివి.

**వివరి** విణ (√ వివరము) విచారణశక్తికల వాఁడు, వివేకి.

క వివరికి వివరించిన కృతి, చవిపాలన్ బచ రించ చవిగూర్చును నా, యవివేకికి వినుపి చినకవిత వంద చింతపండు గలుపుట మహీన్ద్ర ద్వా. 1 18

**వివరించే** (√ వివరము) 1. వక్కాణించు, స్పష్ట పఱుచు.

వ వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న నారాయణాభి ధానంబులు గలిగి విలసిల్లు నా మూర్తుల విధంబు వివరి చెద మార్కం. 1. 111.

2 విచారణచేయు, ఆలోచించు.

అ తల్లివంక సైదుతఁములు వివరించి, తండ్రి వంశ పేదుతరము లరసి, వారివారి గోత్ర వంశవంకరము గానియక యతివఁ కెండ్లి యయిన మేలు వి. పు 4 184.

శా. ఆబాధల్ పడలేక ఘూరమణి శోకాక్రాంతయై మూర్ధవీ, ధీబద్ధారుణపాణి పద్మములతో దేవా జగం బెల్లం, బాబుద్ధిన్ వివరి పు నీ సుతులచేఁ గాతెంజుమీ యంచు భా,పా బద్ధుండగు బ్రహ్మ దేవుఁ గని విజ్ఞాపించె ఘోషించుచున్. కాశ. 2 31.

క. వివరింప నాడము లేదిఁక, మవిరను పోబనుపు జలక మొనరింపంగా, ఇవరాంతఁ బనుపు మను పుడుఁ, బువుబోఁడియు నలరి తగిన పొలఁతులఁ బనిచెన్. యయా 4. 85.

(ఇట నాలస్యముచేయు, అవి శ. ర )

3. చెప్పు, వక్కాణించు.

ద్వి. వివరమ్ముగా మాకు వివరింపుఁ డనిన ...ద్వి. పరమ. 4. 335. పొ.

**వివర్జనము** నం వి అ న. విడిచిపెట్టుట, త్యజించుట, బహిష్కరించుట.

**వివర్జించే** నం. న. క్రి. విడుచే.

క. మమకారంబు నహంకారము సంసారాను
బంధరజ్జువులని చిత్తముల వివర్జింతురు సం,
యము లీవు నడుపుమా తదాచారంబున్
భోజరా. 6. 30

**వివర్జితము** సం విణ. (అ అ అ) 1. విడువఁబడినది, త్యజింపఁబడినది. 2. తప్పింపఁబడినది. 3. (తఱచు సమాసాంతమున) శూన్యమైనది, విరహితమైనది 4. ఈయఁబడినది.

**వివర్ణము** సం. విణ 1. కాంతిలేనిది, పాలిపోయినది, తెల్లఁబడినది. 2. రంగుమాసినది. 3 నీచము; అధమము. 4 బుద్ధిహీనము, మూఢము, తెలివిలేనిది 5. అక్షరముల నెఱుంగనిది, చదువురానిది.

**వివర్ణుఁడు** సం వి అ పుం 1 వర్ణబాహ్యుఁడు, వెలివేయఁబడినవాఁడు 2. నీచజాతివాఁడు, 3 నిందితవృత్తి నవలంబించిన మనుష్యుఁడు

**వివర్తనము** సం. వి అ న 1 గుండ్రముగాఁ దిరుగుట. 2. ఇటునటుదొర్లుట. 3. వెనకకుఁ దిరుగుట, 4. క్రిందికి దొర్లుట, దిగుట. 5. ఉండుట, నివసించుట. 6. భక్తిపూర్వకమైన నమస్కారము. 7. వివిధ స్థితులను గడుపుట, నానావస్థలు చెందుట. 8. మాఱినస్థితి, అవస్థాంతరము.

**వివర్తము** సం. వి అ పుం. 1 గుండ్రముగాఁ దిరుగుట, చుట్టివచ్చుట 2 ఇటునటుదొర్లుట, పొరలుట 3. వెనుకకుఁదిరుగుట, మరలుట. 4 నృత్యము. 5. మార్పు, రూపాంతరప్రాప్తి, మాఱినస్థితి. 6. (వేదాంత) కనఁబడురూపము, అయథార్థరూపము, అవిద్యవలనఁ గలిగిన యసత్యరూపము. 7. రాశి, సమూహము, సంఘము, గుంపు

**వివర్తవాదము** సం వి అ. పుం జగత్తు (దృశ్యప్రపంచము)మిథ్యయనియు బ్రహ్మము మాత్రమే సత్యమనియు దెలుపు వేదాంత సిద్ధాంతము.

**వివర్తితము** సం విణ (అ. అ. అ.) 1. గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది 2. ఇటునటు త్రిప్పఁబడినది. 3. ఖండింపఁబడినది, తునియలుగాఁ జేయఁబడినది. 4. విప్పఁబడినది. 5 వంకరగాఁ జేయఁబడినది, వంపఁబడినది

**వివర్ధనము** సం వి అ. న 1 పెరుఁగుదల, వృద్ధినొందుట. 2. పెంపు, ఆధిక్యము, అభివృద్ధి, గొప్పతనము 3. అధికమగుట 4 ఖండించుట, నఱకుట, విభజించుట.

**వివర్ధించు** సం స. క్రి విశేషముగా వర్ధిల్లఁజేయు
క ఈ కులము వివర్ధింపఁగ, నా కభిమతము ...
భార ఆది 5, 8

**వివర్ధితము** సం విణ. (అ అ అ) 1 పెంపఁబడినది 2 అభివృద్ధి నొందింపఁబడినది 3 సంతోషపడినది, సంతోషపఱుపఁబడినది 4 ఖండింపఁబడినది, నఱకఁబడినది, విభజింపఁబడినది

**వివశుఁడు** సం విణ (అ అ అ) 1. (ఇతరుల) వశమునలేనివాఁడు, స్వతంత్రుఁడు 2 వశము తప్పినవాఁడు, పరాధీనుఁడు, అస్వతంత్రుఁడు 3 ఒడలెఱుఁగనివాఁడు, స్మృతితప్పినవాఁడుఁ 4 చనిపోయినవాఁడు, మృతుఁడు

**వివసనుఁడు** సం విణ (అ. అ అ) దిగంబరుఁడు, దిసమొలవాఁడు
వి అ పుం జైనసన్యాసి

**వివస్వంతము** సం. వి. త్. పుం అర్కవృక్షము, జిల్లేడుచెట్టు

**వివస్వంతుఁడు** సం. వి. త్. పుం 1. సూర్యుఁడు. 2. అనూరుఁడు, సూర్యసారథి 3 దేవత, వేల్పు

**వివహము** సం వి. అ. పుం 1 అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి 2 వివాహము
క అనాగనచివధీమణి ... పోతమాంబ వివహం
బయ్యెన్ పి శకుం. 1. 40

**వివాకుఁడు** సం వి అ. పుం విచారణచేయువాఁడు, ప్రాడ్వివాకుఁడు, న్యాయాధికారి

**వివాదము** సం. వి. అ. పుం. 1. కలహము, జగడము 2. వాదము, సయుక్తికముగ నొక యంశమును గూర్చి చర్చించుట 3 ఋణము, దాయము మున్నగువానిఁగూర్చి సంభవించిన తగవు, అభియోగము వ్యాజ్యము 4 వైరుధ్యము, విరుద్ధమగుట. 5 ఆజ్ఞ, శాసనము 6 అఱచుట, బిగ్గఱగా ధ్వనిచేయుట.

**వివాదార్థి** సం. వి న్ పుం. వ్యాజ్యమునకు సంబంధించినవాఁడు, వివాదము కోరువాఁడు. 2 వాది, వ్యాజ్యము తెచ్చినవాఁడు.

**వివాది** సం. విణ. (న్. వి న్) 1 వాదించువాఁడు, కలహించుచున్నవాఁడు. 2. వ్యాజ్యము తెచ్చినవాఁడు.

వి న్ పుం వాత్స్యమునకు సంబంధించిన పురుషుఁడు, వివాదమున నొక పక్షమువాఁడు

**వివారము** సం. వి. అ పుం 1 తెఱచుట, విప్పుట. 2. అచ్చులను, ఊష్మములను స్పష్టముగా నుచ్చరించునపుడు నోరు తెఱచుట.
(అభ్యంతర ప్రయత్నములలో నొకటి.)

**వివాసనము** సం వి అ న 1 దేశాంతరవాసము. 2 దేశాంతరమునకుఁబంపుట, దేశభ్రష్టత నొందించుట

**వివాసము** సం. వి. అ పుం దేశభ్రష్టత, దేశాంతరవాసము.

**వివాసితుఁడు** సం. విశ (అ. ఆ అ.) దేశాంతరము పంపఁబడినవాఁడు, దేశభ్రష్టుఁడుగా జేయఁబడినవాఁడు.

**వివాహమగు** మి న క్రి. (వివాహము + అగు) పెండ్లాడు.
వ గ్రహకై శికాధీశ్వరతమాభవ వివాహంబై మిమ్ము దర్శింపగలవాఁడను నైష 7. 88

**వివాహము** సం వి అ పుం పెండ్లి, పరిణయము. (వివాహము ఎనిమిది విధములు బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, అసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము.)

**వివాహితుఁడు** సం విశ (అ. అ అ) పెండ్లాడినవాఁడు.

**వివాహ్యుఁడు** సం వి అ. పుం 1 అల్లుఁడు, జామాత. 2. వరుఁడు, పెండ్లికొడుకు.
విశ (అ ఆ అ) పెండ్లిచేయఁదగినవాఁడు, పెండ్లి చేయవలసినవాఁడు.

**వివి(వృ)క్త** సం వి. ఆ. స్త్రీ దుర్భగురాలు, దుర దృష్టవంతురాలు, భర్తకిష్టములేని స్త్రీ

**వివిక్తము** సం విశ (అ ఆ అ) విడఁదీయబడినది, వేఱుచేయఁబడినది 2. నిర్జనము, జనశూన్యము 3. ఒంటి, ఏకాకి. 4 వివేచింపఁబడినది, ప్రత్యక్షముగాఁ దెలిసికొనఁబడినది 5 వివేకము (తెలివి) గలది. 6 పవిత్రమైనది, దోషరహితము 7. గంభీరమైనది, లోఁనైనది (ఆలోచన మొ) 8 ఒక్క విషయముపై మనస్సు నిలుపునది, ఏకాగ్రచిత్తము.
వి అ. న 1. నిర్జనప్రదేశము. 2 ఏకాంతవాసము, ఒంటరిగానుండుట.

**వివిగ్నము** సం విశ (అ. ఆ. అ.) 1 మిక్కిలి వ్యాకులంపడినది, భయపడినది 2 మిక్కిలి కోపము గలది.

**వివిధము** సం. విశ. (అ ఆ. అ.) నానాప్రకారము, అనేక విధములుగలది.
వి అ న అభినయ విశేషము, ఒకవిధమైన యభినయము.

**వివీతము** సం వి. అ పుం. ఆవరణమువేసిన ప్రదేశము, పచ్చికపట్టు.

**వివృక్తము** సం. విశ (అ అ అ.) విడువఁబడినది, త్యజింపఁబడినది

**వివృతము** సం విశ (అ ఆ అ) 1. ప్రకటింపఁబడినది, బైటఁబెట్టఁబడినది. 2 స్పష్టమైనది, దాఁపరికములేనిది. 3. కప్పులేనిది. 4. తెఱవఁబడినది, మూఁతలేనిది 5 చాటింపఁబడినది. 6 వ్యాఖ్యానము చేయఁబడినది, వివరింపఁబడినది. 7. వ్యాపించినది 8. విరివియైనది, విశాలమైనది 9. ఫలింపనిది, పండనిది (నేల)
వి అ న 1. స్పష్టముగా నుచ్చరించుట, స్ఫుటోచ్చారణము 2. వివార ప్రయత్నము, అభ్యంతర ప్రయత్నములలో నొకటి

**వివృతాక్షము** సం విశ (అ ఆ. అ.) పెద్ద కన్నులు గలది
వి అ పుం కోడిపుంజు.

**వివృతి** సం. వి ఇ స్త్రీ 1. తెఱచిచూపుట, స్పష్టపఱచుట 2. వ్యాప్తి, విస్తరించుట. 3 బైటపెట్టుట, వెలువఱచుట. 4 వివరణము, వ్యాఖ్యానము, టిప్పణము.

**వివృత్తము** సం విశ (అ ఆ అ) 1 గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది. 2. అడ్డముగాఁ దిరుగుచున్నది. 3. ప్రకటింపఁబడినది

**వివృత్తి** సం వి ఇ స్త్రీ. 1. గుండ్రముగాఁ దిరుగుట, చుట్టుతిరుగుట

**వివృద్ధము** సం విశ (అ ఆ అ) 1. పెరిగినది 2. హెచ్చైయినది, అధికమైనది. 3. విశాలమైనది, విరివియైనది

**వివృద్ధి** సం. వి ఇ స్త్రీ 1. పెంపు, ఆధిక్యము, హెచ్చు 2 అభివృద్ధి, పెరుఁగుదల

**వివేకజ్ఞానము** సం వి అ న. విచారణ చేసెడిశక్తి.

**వివేకజ్ఞుఁడు** నం *విశే* (అ ఆ అ) విచారణ చేయు నేర్పుగలవాఁడు, సూక్ష్మబుద్ధిగలవాఁడు

**వివేకపదవి** నం. వి అ పుం 1 తెలివి, జ్ఞానము. 2 విచారణము, పరిశీలనము 3 రెండువస్తువులను సూక్ష్మభేదము నెఱింగి వేఱుపరచుట 4 (వేదాంత) ఆత్మానాత్మ భేదమును దెలిసికొనుట, మిథ్యాప్రపంచము నుండి బ్రహ్మమును భిన్నముగాఁ దెలిసికొనుట 5 యథార్థజ్ఞానము, నిజమైన తెలివి 6 నీటితొట్టి

**వివేకి** నం. *విశే* (న్. నీ న్) విచారణచేయువాఁడు.

*వి న్.* పుం 1 వివేకముగలవాఁడు, న్యాయాధికారి. 2. జ్ఞాని, ఆత్మజ్ఞాని.

**వివేకించు** నం స *క్రి.* విచారణసేయు

క. యఖిలోకజ్ఞాననమ్మన్వితయగజవకృత్యమటు వివేకింపు మెదన్. భార. శాం 1 61.

ద్వి అనఘ నీతత్త్వమే నాత్మలోఁజూచి, నిను వివేకించితి నీవు విష్ణుఁడవు ఽం రా బాల 80 పా. 25. సం.

శా... ఈ విశ్వంబునగల్గు మే లిదియపోమెఱదన్ వివేకించినన్ (కళా 2 12)

**వివేక్త** నం. వి ఋ పుం 1 విచారణకర్త, న్యాయాధికారి 2 జ్ఞాని, వేదాంతి

**వివేచన** నం వి ఆ. స్త్రీ 1 విచారణ, వివేకము 2. ఆలోచనము, పరిశీలనము 3 నిశ్చయము

**వివేచించు** నం. అ క్రి వివేచనసేయు, వివేకించు (శ. ర.)

**వివోఢ** నం వి ఋ పుం వరుఁడు, పెండ్లికొడుకు. 2. అల్లుఁడు.

**వివ్వచ్చము** వి (నం. బీభత్సః) బీభత్సరసము, నవరసములలో నొకటి (చి ని, శ ర)

**వివ్వచ్చుఁడు** వి (బీభత్సః) అర్జునుఁడు

సీ వివ్వచ్చుఁ డిప్పుడు వినియెడునది తనవినియట్లయతిఁజూచి వీఁడు విజయుఁడొక్కొయనుచు... భారఁ ఆది. 8. 185

గీ శంకరుడు గిరాతవేషంబు దాల్చి యగజ చెంచెతయై తోడవరుగుదేఁ, బాణి నోంకారదివ్యచాపము ధరించి, వచ్చె వివ్వచ్చు వరతపోవనమ్మునకడకు, పాణి 7. 41.

ఉ. .నీ,వచ్చుటజేసి ప్రాణములు వచ్చెఁ జుమీయిట నేఁడు మాకు వివ్వచ్చుఁడు పోరులన్ నవతు వచ్చునె నీకసమానమామపా రాజశే 3.222

**విశంక** నం వి ఆ స్త్రీ 1 భయము. 2 సందేహము

**విశంకటము** నం. *విశే* (అ ఆ. ఈ. అ.) 1 విశాలము, విరివియైనది, పెద్దది 2 బలవంతము, బలముగలది, ఘోరము, భయంకరమైనది

**విశంకుఁడు** నం *విశే* (అ ఆ అ) 1. భయములేనివాఁడు, నిర్భయుఁడు 2 సందేహము లేనివాఁడు

**విశదము** నం *విశే* (అ ఆ అ) 1 శుద్ధమైనది కలంకములేనిది 2 స్వచ్ఛమైనది, తెల్లనిది, తెల్లరంగుగలది 3 ప్రకాశించునది, మనోహరమైనది 4 స్పష్టమైనది, స్ఫుటముగాఁ గనఁబడునది. 5 శాంతము, నిర్వికారమైనది, సంతోషించునది

*వి అ పుం* తెలుపు, తెల్లరంగు,

**విశదీకరించు** నం అ క్రి. విశదముగాఁజేయు

వ. చిత్తశుద్ధివలన వేదాంతజ్ఞానంబు విశదీకరించి... కాశీ 3 2"8

**విశయము** నం వి. అ పుం 1 సందేహము, సంశయము, (మీమాంస) అధికరణమునందలి యైదంశములలో రెండవది 2 ఆశ్రయము, అభయస్థానము.

**విశరఘాతము** నం వి అ పుం చంపుట, వధము. (శ. ర.)

**విశరము** నం వి అ పుం 1. పగులుట, బ్రద్దలగుట, 2. చంపుట, సంహరించుట

*విశే.* (అ. ఆ. అ) బాణములు లేనిది

**విశల్య** నం వి ఆ స్త్రీ దంతి, నేపాళము (వృ వి.), గుడూచి, తిప్పతీఁగ (వృ వి), అజమోద, ఓమము. (వృ వి)

**విశల్యము** నం *విశే* (అ ఆ అ) 1 కష్టము లేనిది, విచారములేనిది; భద్రముగానున్నది 2 ముండ్లు లేనిది, ములుకులులేనిది

**విశల్యకరణి** నం వి ఈ స్త్రీ. శరీరమున నాఁటిన ములుకుల నూడఁజేయు ఒక విధమైన ఔషధి

**విశసనము** నం. వి అ న 1 చంపుట, సంహారము, నశింపఁజేయుట 2 నాశము,చేటు. 3 యుద్ధము.

వి అ పుం 1 వంకరకత్తి 2 ఖడ్గము, పెద్ద కత్తి.

పుం న నరకభేదము, ఒకవిధమగు నరకము

**విశసించే** నం న క్రి చంపు, విశసనము చేయు

గీ. . పాపపశువుల విశసించి భక్తి చరువు, పాండు రంగ గ్నిలో వేల్చు పాండవునకు, పాండు 5 56

విశస్త నం వి ఋ పుం 1. బలియిచ్చువాఁడు, 2. చండాలుఁడు

**విశస్తము** నం విణ (అ ఆ అ) 1 నఱకఁబడినది, తునియలు చేయఁబడినది 2. మర్యాదనెఱుఁగనిది, మోసమైనది. 3 స్తుతింపఁబడినది, కొనియాడఁబడినది

**విశాఖ** నం వి. ఆ స్త్రీ ఒకానొక నక్షత్రము, అశ్విని మొదలగు నక్షత్రములలోఁ బదియారవది. 2 గలిజేరు (వృ వి.) 3 కాఁకర (వృ వి).

**విశాఖజము** నం వి అ పుం. నారింజచెట్టు

**విశాఖము** నం వి అ పుం వేఁటలో నొక విధమైన స్థితి (ఒడుపు) (ఈ యొడుపులో విలుకాఁడు జానెఁ డెడములో నడుగులిడి నిలఁబడవలయును) 2. నూలువడికెడి కదురు

**విశాఖుఁడు** నం వి అ పుం కార్తికేయుఁడు, కుమారస్వామి 2 యాచకుఁడు, అడుగుకొనువాఁడు. 3 శివుఁడు 4 ఒకానొక వేలుపు, దేవతాభేదము.

**విశాతనము** నం వి అ న 1 చీల్చుట, భేదించుట 2. విమోచనము, విడుదల 3 సానఁబట్టుట, మిక్కిలి వాఁడిచేయుట

**విశాయము** నం వి అ పుం కావలివాండ్రు వంతుల ప్రకారము నిద్రించుట

**విశారణము** నం వి అ న. 1 చీల్చుట, భేదించుట 2 చంపుట, సంహరించుట

**విశారదము** నం వి అ పుం వకులవృక్షము, పొగడ చెట్టు

**విశారదుఁడు** నం విణ (అ. ఆ అ.) (తఱచుగా సమాసాంతమున) నిపుణుఁడు, నేర్పరి 2. బుద్ధిమంతుఁడు, తెలివికలవాఁడు. 3 ప్రఖ్యాతుఁడు, ప్రసిద్ధిఁ జెందినవాఁడు 4. ధీరుఁడు, ధైర్యశాలి,

**విశాల** నం వి ఆ స్త్రీ 1 ఉజ్జయినీనగరము. 2 ఒకానొక నది.

**విశాలత** నం వి ఆ స్త్రీ 1. విరివి, విస్తృతి, పెద్దది యగుట. 2 ఘనత, గొప్పతనము, శ్రేష్ఠత్వము

**విశాలత్వక్కు** నం వి చ్ పుం ఏడాకులరఁటి. (వృ వి) (శ గ)

**విశాలము** నం విణ (అ. ఆ అ) పెద్దది, విరివియైనది, వెడల్పుగలది. 2 సమృద్ధము, నిండియున్నది 3 శ్రేష్ఠమైనది, ఘనమైనది, ప్రసిద్ధమైనది

వి అ పుం 1 ఒకవిధమైన లేడి. 2 పక్షివిశేషము

**విశాలాక్షి** నం వి ఈ. స్త్రీ కాశీక్షేత్రమున వెలసియున్న పార్వతీదేవి యర్చావతారము 2. వేశ్య. 6 తెలుకొండి. (వృ. వి.)

**విశాలాక్షుఁడు** నం విణ. (అ ఈ అ) విరివియైన కన్నులుగలవాఁడు.

వి అ పుం 1. విష్ణువు 2 గరుత్మంతుఁడు 3 శివుఁడు

**విశాలాస్యప్రదరము** నం వి అ. పుం వెడఁద వాతియమ్ము.

క. కడిసి శరాసనగురుఁ డిరువదియేను శరంబు లేయ శార్ఙుఁడు వానిం, గుదియించి విశాలాస్యప్రదరము లడరింపఁ గుంభభవుఁ డెడఁద్రుంచెన్. భార ద్రోణ 3 75.

**విశిఖ** నం వి ఆ స్త్రీ 1 పాఱ 2. నూలు వడికెడి కదురు 3 సూది. 4 చిన్నబాణము 5. బాట, త్రోవ, రథ్య. 6 మంగలది.

**విశిఖము** నం విణ (అ ఆ. అ) 1. శిఖలేనిది, జుట్టులేనిది, అగ్రములేనిది. 2 ఈఁకలులేనిది. (బాణము.)

వి అ. పుం 1 బాణము. 2 ఒకవిధమైన రెల్లు.

**విశిష్టత** నం వి ఆ స్త్రీ 1. ప్రత్యేకగుణము, విశేషగుణము 2 శ్రేష్ఠత్వము, ప్రశస్తత

**విశిష్టము** నం. విణ (అ ఆ అ) 1. విశేషగుణములు గలది 2 విలక్షణమైనది, ప్రత్యేకమైనది, అసాధారణమైనది. 3. కూడినది, ఉపలక్షితమైనది, సంపన్నమైనది, 4 ఉత్తమమైనది. శ్రేష్ఠము,

**విశిష్టాద్వైతము** సం. వి. అ. పుం బ్రహ్మమునకుఁ బ్రకృతికి నభేదమును, సత్యమును బోధించెడి మతము; ప్రకృతి విశిష్టబ్రహ్మమునకు నద్వైతమును దెలుపు మతము

**విశీర్ణపర్ణము** సం వి అ పుం నింబవృక్షము, వేఁప చెట్టు

**విశీర్ణము** సం విశే. (అ ఆ అ.) 1. పగులఁగొట్టఁ బడినది, ముక్కలయినది. 2 పడలినది, వాడినది, ఎండినది, శుష్కము. 3 జాఱినది, రాలినది 4. ముడుతలువడినది. 5. చెడినది, పాడైనది 6. ముదిమిచెందినది. (వాచ)

**విశీలుఁడు** సం విశే. (అ ఆ అ) విరుద్ధప్రవర్తనము గలవాఁడు, మంచి నడవడిలేనివాఁడు, నీతిలేని వాఁడు, దుష్టుఁడు

**విశుఁడు** సం. వి. ఉ. పుం (తెనుఁగున వ్యస్తప్రయోగము కానరాదు) 1. వైశ్యుఁడు, కోమటి. 2. మనుష్యుఁడు. 3 ప్రజ, జనము.
స్త్రీ. దేశప్రజ

**విశుద్ధము** సం విశే (అ ఆ అ) 1. శుభ్రముచేయఁ బడినది 2. పరిశుభ్రమైనది, పవిత్రమైనది పాపము లేనిది. 3 కళంకములేనిది 4 సరియైనది, హెచ్చు తక్కువలులేనిది 5. గుణవంతము, సుగుణములు గలది, కౌటిల్యమెఱుఁగనిది, ఋజువర్తనముగలది 6. అడఁకువగలది
వి. అ న. శరీరమునందలి విశుద్ధచక్రము

**విశుద్ధి** సం వి ఇ. స్త్రీ 1. పరిశుద్ధత, నిర్మలత్వము 2. నిర్దోషత్వము, దోషములేమి. 3. సరిగా నుండుట, హెచ్చుతక్కువలులేమి. 4. తప్పు దిద్దుకొనుట. 5. సామ్యము, పోలిక. 6 (బీజగణిత) తీసివేయుమొత్తము, తీసివేసెడి రాశి.

**విశృంఖలుఁడు** సం. విశే (అ ఆ అ.) 1. శృంఖలములు (గొలుసు) లేనివాఁడు 2 బంధనములేని వాఁడు, ఒడ్డులేనివాఁడు 3. నీతిలేనివాఁడు, కట్టుపాటులేనివాఁడు.

**విశేషకము** సం విశే (అ ఆ అ) భేదపరచునది, వేఱుపఱచునది
వి. అ పుం. న. 1. భేదపఱచు లక్షణము, గుణము 2 భేదముదెలుపు గుణము. 3 నొసటి బొట్టు, తిలకము, 4 రంగులతోఁగాని పరిమళద్రవ్యములతోఁగాని ముఖముమీఁదను శరీరము మీఁదను చిత్తరువు వ్రాయుట, పత్త్రరచన. 5 ఏకవాక్యముగానుండిన శ్లోకత్రయము. 6 నువ్వుమొక్క.

**విశేషగుణము** సం వి అ. పుం 1. ప్రత్యేకగుణము, ఇతరమునుండి వేఱుపఱుచు గుణము 2 (తర్క) సంయోగపృథక్త్వముల వంటిదికాక స్వాభావికమైన గుణము
శ్లో బుద్ధ్యాదిషట్కం రూపాదిచతుష్కం స్నేహా భావనే, స్వాభావిక ద్రవత్వంచ అదృష్టం శబ్ద ఏవచ ... విశేషగుణాఇత్యతే కారికావళి

**విశేషజ్ఞుఁడు** సం విశే (అ ఆ అ) 1 గుణాగుణము లెఱిఁగినవాఁడు, విమర్శకుఁడు 2 విద్వాంసుఁడు, పండితుఁడు.

**విశేషణము** సం విశే (అ ఆ అ.) 1. గుణమును దెలుపునది 2. భేదపఱుచునది, ఇతర వ్యావర్తకము
వి అ. న 1 వ్యావర్తనము, భేదపఱుచుట. 2 భేదము, వ్యత్యాసము 3 మఱొకదాని నుండి ప్రత్యేకపఱుచునట్టి పదము, గుణమును దెలుపునట్టి పదము
(వ్యా) విశేష్యము ఇది మూఁడువిధములుగలది 1. వ్యావర్తకము. 2 విధేయము 3 హేతుగర్భము 4 భేదపఱుచులక్షణము, గుర్తు 5 విధము, రకము 6 మించుట అతిశయించుట

**విశేషము** సం విశే. (అ. ఆ. అ.) 1 విలక్షణమైనది, అసాధారణమైనది 2. సమృద్ధమైనది, విరివియైనది
వి అ పుం 1 వేఱుపఱుచుట. 2 భేదము, వ్యత్యాసము 3 గుణసంబంధభేదము 4 మంచికిగాని చెడ్డకుఁగాని గలుగు మార్పు. 5 అవయవము 6. రకము, విధము. 7 నానావిధమైన వస్తువులు 8 (సమాసాంతమున) శ్రేష్ఠత, ఘనత, ఆధిక్యము 9 (తర్క) అనన్యనిష్ఠ గుణము, ప్రత్యేకగుణము. అనన్యసాధారణమై ఒకదానియందేయుండి ఇతర పదార్థములనుండి భేదము తెలుపు గుణము, పృథివ్యాది నవద్రవ్యముల పరమాణువులందుండు గుణము 10 వ్యక్తి, ప్రత్యేకత. 11. వర్గము, శబ్దసముదాయము 12. తిలకము, నొసటిబొట్టు 13 విశేషగుణము. 14 ఒకానొక యర్థాలంకారము.

శ్లో విశేషః ఖ్యాతమాధారం, వినాప్యాధేయ వర్ణనమ్ ఆధారములేకయే ఆధేయమున్నట్లు వర్ణించుట.

విశేషవచనము సం వి అ న ప్రత్యేకవిధివాక్యము.

విశేషవిదుఁడు సం విణ (ద్)=విశేషజ్ఞుఁడు

విశేషవిధి సం వి ఇ. పుం ప్రత్యేకవిధి.

విశేషశాస్త్రము సం వి అ న = విశేషవిధి.

విశేషించు సం స క్రి. 1 స్తుతించు, అగ్గించు

వ అని యనేక ప్రకారంబులంబరమేశ్వరు నిరాకరించుచు నితర సురవరుల విశేషించుచున్న కృతకవిప్రు వగజ కటాక్షించుచు .. కు. సం. 7. 853

2. విశదీకరించు.

మ ... వచ్చినకార్యం బఖిలంబు నాతఁడు విశేషింపంగ మాల్యానులేపనతాంబూలవిభూషణావళుల సంభావించి యత్యున్నతిన్ జై. భా 3 54.

అ క్రి అతిశయించు

వ .. విశేషించి యీ ధర్మోత్పత్తి శ్రాద్ధకాలంబున పరించినఁ బితరులకు పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మలోకంబుగలుగు వరాహ 7 35.

వ విశేషించియుం గౌరవనికేతనంబులఁ గేతనంబులఁ బొగలెగయుటయు నాయుధంబులు మండుటయు నివి మొదలుగా దుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి. భార. భీష్మ 1 12

విశేషితము సం విణ (అ ఆ. అ.) 1. భేదపఱుపఁబడినది. 2 నిర్వచింపఁబడినది, ప్రత్యేక లక్షణము చెప్పఁబడినది. 3 విశేషణముచే వేఱుపఱుపఁబడినది 4 శ్రేష్ఠమైనది, ప్రశస్తము

విశేషుఁడు సం విణ (అ ఆ అ.) విశిష్టుఁడు, గొప్పవాఁడు.

క దనుజారికంటె వీరుఁడు,... త్రిన.యనుకంటె విశేషుఁ డురుతరైశ్వర్యమునన్ కు సం 10 423

విశేషోక్తి సం. వి ఇ. స్త్రీ ఒకానొక యర్థాలంకారము

శ్లో. కార్యాజ నిర్విశేషోక్తిస్సతి పుష్కలకారణే. (ప్రసిద్ధకారణసామగ్రియున్నను గార్యము కలుగనట్లు వర్ణించుట )

విశేష్యము సం విణ (అ ఆ అ.) 1 భేదపఱుపఁబడినది 2 శ్రేష్ఠము, ముఖ్యమైనది

వి. అ. న విశేషణముచే గుణము తెలుపఁబడిన పదము, మఱొకపదముచేతఁ బ్రత్యేకపఱుపఁబడిన పదము నామవాచకము.

విశోక సం వి ఆ స్త్రీ. శోకములేకుండుస్థితి, యోగశాస్త్రమందుఁ జెప్పఁబడిన చిత్తవృత్తివిశేషము

విశోకము సం విణ (అ ఆ అ.) దుఃఖములేనిది, సుఖకము.

వి. అ పుం అశోకవృక్షము

విశోకించు సం అ క్రి మిక్కిలి దుఃఖించు.

శా ... అతిద్వయా,క్రాంతాశ్రుప్రకర ప్రవాహములు హేరాళంబుగాఁ బర్వఁగా, నెంతేగుంపులుగూడి యేడ్చిరి జగంబెల్లన్ విశోకింపగా సేతు. 1 88 టీ

విశోధనము సం వి అ న 1. శుభ్రముచేయుట, శుద్ధిచేయుట, తీసివేయుట (రాజ్యకంటకవిశోధనోద్యతుఁడు ) 2. పవిత్రముచేయుట, పాపము మొదలగువాని తప్పించుట 3. ప్రాయశ్చిత్తము, పాపపరిహారార్థమైన సంస్కారము.

విశోధ్యము సం విణ (అ ఆ అ.) 1 పవిత్రముచేయఁదగినది 2 శుభ్రముచేయఁదగినది, సరిచేయఁదగినది.

వి. అ. న ఋణము

విశోషణము సం వి అ న మిక్కిలియెండుట, శుష్కించుట.

విశ్నము సం వి అ పుం దీప్తి, కాంతి.

వి(శం((వం)భణము సం. వి. అ న. విశ్వాసముకలిగించు, నమ్మకము పుట్టించుట

వి(శం((సం)భపాత్రము సం. వి అ. న నమ్మఁదగినవాఁడు, విశ్వాసస్థానము.

వి(శం((సం)భభాషణము సం. వి అ న =వి(శంభాలాపము

వి(శం((సం)భభూమి సం వి. ఇ. స్త్రీ వి(శంభపాత్రము.

వి(శం((సం)భము సం వి. అ పుం 1 నమ్మకము, విశ్వాసము, చేవవు 2. రహస్యము, రహస్యవిషయము 3. విరామము, విశ్రాంతి. 4. క్షేమముతోఁ బ్రశ్నించుట 5. ప్రణయకలహము, పొలయలుక.

6. చేయుట, హింసించుట.

**వి(శం(్రసం)భస్థానము** నం వి అ న =వి(శంభ పాత్రము.

**వి(శం(్రసం)భాలాపము** నం వి అ పుం 1 నమ్మకముతో మాటలాడుట. 2. రహస్య సంభాషణము

**వి(శంభి** నం విశ (న్ శ్ న్) 1 విశ్వాసముగలవాఁడు, నమ్మినవాఁడు 2. నమ్మఁదగినవాఁడు, విశ్వసనీయుఁడు

**వి(శ(్రస)బ్ధము** నం విశ (అ ఆ అ.) 1 నమ్మకముప్పగింపఁబడినది, వశముచేయఁబడినది 2 విశ్వసింపఁబడినది, నమ్మఁబడినది, భయములేనిది, నిర్భయము. 3. విశ్వసనీయము, నమ్మఁదగినది 4. శాంతము, క్షోభము, నిర్వికారము. 5. స్థిరమైనది, నిశ్చలము 6 మెల్లనైనది, మందమైనది 7. అధికమైనది, అతిశయించినది

**వి(శమము** నం. వి అ పుం 1. పద్య విరామము 2. ఊటట. (శ ర)

**వి(శమించే** నం అ క్రి. 1. (శమతీర్చుకొను

క. బహుయోజనముల పొడవగు, మిహిమలతుదఁజేసి వి(శమించిన యంతన్ . ఉ. రా. 4. 49.

క. మునిభామల వ్యధూమణి, వనపరత ప్రసవ ఫలసమాకీర్ణ నివాతనివేశ వివృతకృష్ణా, జీవ ముపయిన్ వి(శమింపఁజేసి యడలుతోన్ తై. భా. 6 84.

2. ఊరడిల్లు (శ. ర.)

**వి(శయము** నం వి. అ పుం 1 నివాసము, ఆ(శయము, రక్షకస్థానము, నీడపట్టు

**వి(శవసుఁడు** నం వి న్ పుం పులస్త్యుని కొడుకు, రావణుని తండ్రి.

**వి(శాంతము** నం. విశ (అ ఆ అ) 1. ఆగినది, నిలిచినది. 2. వి(శాంతి నొందినది. అలయిక తీర్చుకొన్నది, అవకాశము నొందినది తెలివిగామన్నది శాంతమైనది, కలఁతనొందనది

**వి(శాంతి** నం. వి అ, ఇ. స్త్రీ 1 విరామము, ఊఱట, తెఱపి, 2 నిలుపుదల సమాప్తి

**వి(శా(్రశ)ణనము** నం వి అ. న ఈవి, దానము, దాతృత్వము,

**వి(శామము** నం. వి అ పుం. 1 చేయుపనిని నిలుపుట, విరామము. 2 వి(శాంతి, ఊఱట, అలయిక తీర్చుకొనుట 3 శాంతి, నెమ్మది

**వి(శావము** నం వి అ పుం (ప్రఖ్యాతి, (ప్రసిద్ధి.

**వి(శుతము** నం విశ. (అ ఆ అ) 1 (ప్రసిద్ధమైనది, (ప్రఖ్యాతినొందినది 2 సంతోషించువది, సుఖించునది

**వి(శుతి** నం వి ఇ. స్త్రీ (ప్రఖ్యాతి, (ప్రసిద్ధి

**విశ్లథము** నం విశ. (అ ఆ అ) వదులైనది, బిగువు లేనిది, శిథిలము 2. దుర్బలము, బలము లేనిది.

**విశ్లిష్టము** నం విశ. (అ ఆ అ) విడఁదీయఁబడినది, వేఱుచేయబడినది

**విశ్లేషము** నం వి అ పుం 1 విడిపోవుట. 2 నాయికానాయకుల యెడఁబాటు. 3 వియోగము, ఎడఁబాటు. 4. లేకపోవుట, అభావము. 5 బీఁటు నందు 6. (గణిత) వ్యత్యస్తసంకలనము, తలక్రిందుగ కూడుట.

**విశ్లేషితము** నం విశ (అ ఆ అ.) విడఁదీయఁబడినది, ఎడఁబాపఁబడినది.

**విశ్వంతరము** నం వి అ పుం నేత్రము, కన్ను (అ. ని)

**విశ్వంభర** నం. వి ఆ. స్త్రీ. భూమి.

**విశ్వంభరుఁడు** నం విశ (అ ఆ అ) సర్వము భరించువాఁడు (వహించువాఁడు)

వి అ పుం 1 సర్వవ్యాపకుఁడు, పరబ్రహ్మము 2. విష్ణువు 3 ఇంద్రుఁడు

**విశ్వక(ద్రువు** నం విశ (ఉ) అధముఁడు, నీచుఁడు, దుర్మార్గ (ప్రవర్తనముగలవాఁడు

వి ఉ పుం 1 వేఁటకుక్క 2 ధ్వని.

**విశ్వకర్మ(ర్ముఁడు)** నం వి న్ పుం 1. దేవశిల్పి, త్వష్ట 2. సూర్యుఁడు. 3 సూర్యుని (ప్రధాన కిరణముల యేడింటిలో నొకటి 4 జ్ఞాని 5. ఒకానొక ముని 6 పరమేశ్వరుఁడు.

**విశ్వకార్యము** నం. వి అ పుం. సూర్యుని (ప్రధాన కిరణము లేడింటిలో నొకటి

**విశ్వకృత్తు** నం వి త్ పుం. 1 (ప్రపంచ సృష్టికర్త. 2 విశ్వకర్మ, దేవశిల్పి.

**విశ్వకేతువు** నం వి ఉ. పుం అనిరుద్ధుఁడు

**విశ్వగంధ** సం వి ఆ స్త్రీ భూమి

**విశ్వగంధము** సం. వి. అ పుం 1 నీరుల్లి.
 వి. గంధద్రవ్యవిశేషము, బాలెంతబోలము

**విశ్వగోప్త** సం వి ఋ పుం 1. ప్రపంచరక్షకుఁడు, విష్ణువు. 2 ఇంద్రుఁడు

**విశ్వగ్రంథి** సం. వి ఇ. స్త్రీ హంసపదీలత, ఎఱ్ఱఅత్తిప్రత్తి తీఁగ

**విశ్వచక్రము** సం. వి అ న సువర్ణమహాదానము, స్వచ్ఛమైన బంగారము దానము చేయుట.

**విశ్వజనము** సం వి అ న మనుష్యజాతి

**విశ్వజనీనము** సం విణ (అ ఆ అ.) సకల జనులకు హితమైనది, సర్వజనహితమైనది

**విశ్వజనీయము** సం. విణ (అ. ఆ అ) 1 సర్వజనులకు హితమైనది, ప్రపంచ జనులకు మేలు చేయునది, సర్వజనార్హము (విల్సన్)

**విశ్వజిత్తు** సం వి త్ పుం. 1 యాగవిశేషము (ఇది ప్రపంచమునంతను జయించిన రాజు చేయవలసినది ఇందు సర్వస్వమును దక్షిణగా నియ్యవలయును) 2 వరుణపాశము 3 విష్ణువు.

**విశ్వతోముఖుఁడు** సం విణ (అ ఈ ఆ. అ) అన్ని వైపుల ముఖములు గలవాఁడు.

**విశ్వదేవుఁడు** సం వి అ. పుం. దేవతలలో నొక గణము

**విశ్వధారిణి** సం వి ఈ స్త్రీ. భూమి

**విశ్వనాథుఁడు** సం వి అ పుం విశ్వేశ్వరుఁడు, కాశీక్షేత్రమునందలి శివుని యర్చావతారము

**విశ్వపావని** సం వి. ఈ స్త్రీ తులసి.

**విశ్వపుఁడు** సం వి. అ పుం. 1 సర్వరక్షకుఁడు. 2 సూర్యుఁడు 3 చంద్రుఁడు 4 అగ్ని

**విశ్వపూజిత** సం. వి ఆ స్త్రీ. = విశ్వపావని

**విశ్వప్సుఁడు** సం. వి స్ పుం 1 దేవుఁడు. 2 సూర్యుఁడు. 3. చంద్రుఁడు. 4 అగ్ని 5 విశ్వకర్మ. 6 గాలి 7. యముఁడు.

**విశ్వభుజుఁడు** సం. విణ (అ ఆ అ.) సర్వమును భుజించువాఁడు, సర్వభక్షకుఁడు
 వి అ పుం 1 ఇంద్రుఁడు. 2 అగ్ని.

**విశ్వభేషజము** సం వి అ న సొంటి
 పుం సర్వరోగహారమైన యౌషధము.

**విశ్వము** సం (సర్వ) విణ (అ ఆ అ) 1 సర్వము, సకలము, అంతయు.
 వి అ. న 1. ప్రపంచము 2 సొంటి.

**విశ్వమూర్తి** సం విణ (ఇ.) సర్వవ్యాపకమైనది అంతను నిండియున్నది
 వి అ. పుం 1. పరబ్రహ్మము, పరమాత్మ 2 శివుఁడు 3 విష్ణువు

**విశ్వయువు** సం వి. ఉ పుం వాయువు.

**విశ్వయోని** సం వి ఇ పుం 1 బ్రహ్మ 2 విష్ణువు

**విశ్వరా(ట్టు)జుఁడు** సం వి అ పుం సమ్రాట్టు, చక్రవర్తి

**విశ్వరుచి** సం వి ఈ స్త్రీ అగ్నిహోత్రుని సప్తజిహ్వాలలో నొకటి

**విశ్వరూప(క)ము** సం వి అ న కృష్ణాగరువు

**విశ్వరేతసు(తుఁ)డు** సం వి స్ పుం 1 బ్రహ్మ 2. విష్ణువు

**విశ్వవా(ట్టు)హుఁడు** సం విణ (హ్ శ్వా హ. హ్) సమస్తమును వహించువాఁడు, సర్వమును ధరించువాఁడు

**విశ్వవేదు(దసు)ఁడు** సం విణ స్ 1 సమస్తమును దెలిసినవాఁడు, సర్వజ్ఞుఁడైనవాఁడు. 2. జ్ఞానము కలవాఁడు.
 వి పుం. 1 జ్ఞాని 2 ఇంద్రుఁడు మున్నగువేల్పు (వాచ)

**విశ్వసనీయుఁడు** సం విణ. (అ ఆ అ.) 1 నమ్మఁదగినవాఁడు, విశ్వసింపఁదగినవాఁడు. 2 నమ్మకముపుట్టించువాఁడు.

**విశ్వసహ** సం వి. ఆ స్త్రీ భూమి. 2 అగ్నిహోత్రుని సప్తజిహ్వాలలో నొకటి.

**విశ్వసించు**=విశ్వాసించు సం. స క్రి నమ్ము
 సీ .. రుద్రుండును శాత్రవదుహిత గాఁగ,
 భావించి విశ్వసింపకమానునో నాకుఁ గడవంగ
 రాని దుఁదుడుకు పుట్టె ... వరాహ 6. 8.
 గీ వీర లిందరు నామీఁద విశ్వసింప,కున్నవారప
 కీర్తి నాకొదవకుండఁ, జూపుమా సర్వబంధులుఁ
 జూడవలయు, నిందు నీ కపరాధమొక్కింతలేదు
 (వి. పు 6. 330.)

**విశ్వసృ(ట్టు)జుఁడు** సం వి జ్ పుం బ్రహ్మ, సృష్టికర్త

**విశ్వస్త** సం. వి. ఆ. స్త్రీ. విధవ, వితంతువు.

**విశ్వస్తుఁడు** సం. విణ. (అ ఆ అ.) 1 విశ్వసింపఁబడినవాఁడు, నమ్మఁబడినవాఁడు 2. నమ్మినవాఁడు, విశ్వసించినవాఁడు. 3 నమ్మఁదగినవాఁడు, విశ్వసనీయుఁడు

**విశ్వాచి** సం. వి. ఈ. స్త్రీ 1 ఒకానొక యప్సరస్త్రీ 2. వాతరోగవిశేషము (వాచ.). చేయి కదలకుండఁ జేయు పక్షవాతవిశేషము.

**విశ్వాత్ముఁడు** సం. వి. న్. పుం. 1 పరమాత్మ. కూటస్థుఁడు. 2. బ్రహ్మ. 3 శివుఁడు. 4 విష్ణువు.

**విశ్వామిత్రుఁడు** సం. వి. అ. పుం. గాధిపుత్త్రుఁడు, ఒకానొక ఋషి. (తొలుత రాజయియుండి తపోమహిమచే బ్రహ్మర్షిత్వమును బడసిన మహాముని, శ్రీరామునికి శస్త్రము నుపదేశించిన ఋషి.)

**విశ్వావసువు** సం. వి. ఉ. పుం. ఒకానొక గంధర్వుఁడు. స్త్రీ రాత్రి (వై. వి.)

**విశ్వాసఘాతకుఁడు** సం. విణ. (అ ఇకా అ.) ద్రోహి, నమ్మించిమోసపుచ్చువాడు.
(ఇట్లే. విశ్వాసభంగము.)

**విశ్వాసఘాతి** సం. విణ. (న్. నీ. న్) = విశ్వాసఘాతకుఁడు

**విశ్వాసనము** సం. వి. అ. న. నమ్మకము పుట్టించుట, నమ్మించుట

**విశ్వాసపాత్రము** సం. వి. అ. న. నమ్మకమునకు స్థానము, నమ్మఁదగినవాఁడు.
(ఇట్లే: విశ్వాసస్థానము.)

**విశ్వాసభూమి** సం. వి. ఇ. స్త్రీ = విశ్వాసపాత్రము

**విశ్వాసము** సం. వి. అ. పుం. 1. నమ్మకము 2 రహస్యము

**విశ్వాసి** సం. విణ. (న్. నీ. న్) విశ్వాసము గలవాఁడు

**విశ్వా(శ్వ)సించు** సం. స. క్రి. విశ్వసించు, నమ్ము.
క. జనక శ్వశుర సతీగురు, జననీ బుధ ఖామణములు నమ్మద మొప్పన్, విని విశ్వాసింపుము మది, వనయము నిష్కపటు వచనమది నమ్మదగున్. (బ్రహ్మో. 4. 88)
ద్వి. అతఁడు వారలకెల్ల నభయహస్తంబు, చతురత నిచ్చి విశ్వాసించి పలికె విరాట ప. 4. 62 పా.

**విశ్వుఁడు** 1 విష్ణువు 2 స్థూలశరీరాభిమానియగు జీవుఁడు 3 నాగరకుఁడు, నగరవాసి

**విశ్వేదేవులు** సం. వి. అ. పుం. బ. గణదేవతావిశేషము, విశ్వదేవగణము (వీరు క్రతువు, దక్షుఁడు, వసువు, సత్యుఁడు, కాముఁడు, కాలుఁడు, ధురి, రోచనుఁడు, పురూరవసుఁడు, మార్ద్రివసుఁడు అని పదుగురు)

**విశ్వేశుఁడు** సం. వి. అ. పుం. 1 పరమాత్ముఁడు, జగదీశ్వరుఁడు 2 శివుఁడు, కాశీక్షేత్రమున వెలసిన శివుని యర్చావతార విశేషము
(ఇట్లే విశ్వేశ్వరుఁడు)

**విష** సం. వి. ఆ. స్త్రీ 1. పురీషము, మలము 2 తెలివి, జ్ఞానము 3 అతివిష, అతివస (వృ. వి)

**విషండము** సం. వి. అ. న. తామరతూఁడు, మృణాళము

**విషకంఠుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు

**విషక్తము** సం. విణ. (అ ఆ అ) 1 దృఢముగాఁ గూర్పఁబడినది, దగ్గఱఁగాఁ జేర్పఁబడినది 2 అంటియున్నది, వ్రేలాఁడఁగట్టఁబడినది 3 సంప్రాప్తమైనది, ప్రసక్తమయినది

**విషఘ్నము** సం. విణ. (అ ఈ. అ) విషమును పోఁగొట్టునది.
వి. అ. పుం 1 విషమునకు విరుగుడుమందు. 2 శిరీషము, దిరిసెనము. (వృ. వి) 3 చంపకము, సంపంగి (వృ. వి) 4 చిన్నరేవడి, దూలగొండి (వృ. వి) యవాసము 5 విభీతకము, తాఁడిచెట్టు.

**విషఘ్ని** సం. వి. ఈ. స్త్రీ 1 పసుపు (వృ. వి) 2. వెఱ్ఱిపుచ్చ (వృ. వి) 3 పెద్దపావర (వృ. వి) 4 కారుతులసి (వృ. వి.) 5. నేలయుసిరిక (వృ. వి) 6. ఎఱ్ఱగలిజేరు. (వృ. వి.)

**విషజుష్టము** సం. విణ. (అ ఆ అ) 1. విషముగలది. 2 విషముకలసినది

**విషజ్వరము** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు (మహిషమునకు జ్వరము విషమువలెఁ బ్రాణాంతకమైనది)

**విషణ్ణుఁడు** సం. విణ. (అ ఆ. అ) విషాదమునొందినవాఁడు, దుఃఖితుఁడు, క్రుంగినవాఁడు.

**విషదంత(క)ము** సం. వి. అ పుం సర్పము, పాము
**విషదము** సం వి అ పుం 1 నీరదము, మేఘము, మబ్బు 2. శుక్లవర్ణము, తెలుపు
వ అన్నభేది.
**విషదర్శనమృత్యుకము** సం. వి అ పుం చకోరము, పక్షివిశేషము
**విషదిగ్ధము** సం విశ (అ ఆ అ) విషముతోఁ బూయఁబడినది.
**విషద్రుమము** సం వి అ పుం 1. విషవృక్షము, విషపుఁజెట్టు. 2 ముసిఁడిచెట్టు
**విషధరనిలయము** సం వి అ పుం నాగలోకము, పాతాళము
**విషధరము** సం వి అ పుం 1 సర్పము, పాము 2 మేఘము, మబ్బు.
**విషపుచ్ఛము** సం వి అ పుం తేలు, వృశ్చికము
**విషపుష్పకము** సం. వి అ పుం రోగవిశేషము, విషపువ్వులు తినుటవలనఁ గలిగిన రోగము
**విషపుష్పము** సం వి అ న నీలోత్పలము, నల్లకలువ
**విషప్రయోగము** సం వి అ పుం విషముపెట్టుట
**విషమకర్ణము** సం వి. అ పుం. 1. (గణిత) సమానముగాలేని కర్ణములు (ఎదురుగానుండు రెండు మూలలు కలుపు గీఁతలు) గల చతుష్కోణము. 2 సమకోణముగాఁ జేయఁబడిన త్రిభుజము యొక్క కర్ణము, ఎదురుగానుండెడి రెండుమూలలు కలుపు గీఁత.
**విషమకర్మము** సం వి న్ న (గణిత) రెండు సంఖ్యల వర్గముల భేదమును, ఆ సంఖ్యల మొత్తమైనను భేదమైనను తెలిసినచో, ఆ సంఖ్యలను కనిపట్టు పద్ధతి.
**విషమచతురస్రము** సం వి అ పు సమముకాని నలుప్రక్కలుగల న్యాసము
(ఇట్లే విషమచతుర్భుజము)
**విషమచ్ఛదము** సం వి అ పుం సప్తపర్ణము, ఏడాకులయరఁటి (వృ వి)
**విషమజ్వరము** సం వి అ పు నడుమనడుమ తగ్గుచు హెచ్చుచుండెడి జ్వరము.
**విషమత్రిభుజము** సం వి అ పుం (గణిత) సమానముకాని మూఁడుభుజములుగల న్యాసము.
**విషమదారి** మి వి వృక్షవిశేషము
సీ వెలఁగ విషమదారి వెట్టికుందెన మంచికుందెన కలబంద గువ్వగుత్తి హంస 4 10
**విషమనయనుఁడు** సం వి అ పుం విషమాక్షుఁడు. (ఇట్లే విషమనేత్రుఁడు, విషమలోచనుఁడు, విషమాక్షుడు మొ.)
**విషమము** సం విశ (అ ఆ అ) 1 సమముకానిది, మిట్టపల్లములు గలది 2 సమానముకానిది, హెచ్చుతగ్గులు కలది 3 బేసియైనది, అయుగ్మము. 4 కఠినమైనది, దుర్బోధము, సులభముగా బోధపడనిది 5 దుర్గమము, పోవుటకుఁ గష్టమైనది 6 ముదురకైనది 7. వంకరయైనది 8. బాధాకరమైనది, శ్రమము గలిగించునది 9 తీవ్రమైనది 10 అపాయకరమైనది, భయంకరమైనది 11 ప్రతికూలమైనది 12 అసాధారణమైనది, సాటిలేనిది. 13 కుటిలమైనది, కుత్సితమైనది 14 దుష్టము, చెడ్డది 15. భిన్నము, వేఱైనది
వి. అ. న 1. మిట్టపల్లము లుండుట 2. బేసియగుట 3 దుర్గమప్రదేశము, కొండకోనము 4 కష్టస్థితి 5 విషమప్రదేశము, నిమ్నోన్నతమైన నేల 6 విషమాలంకారము, అరాలంకారము 7 వృత్తభేదము
**విషమవిభాగము** సం వి అ. పుం హెచ్చుతక్కువలుగఁ బంచిపెట్టుట
**విషమశరుఁడు** సం వి అ పుం బేసి బాణములు గలవాఁడు, మన్మథుడు
(ఇట్లే విషమబాణుఁడు, విషమాయుధుఁడు మొ)
**విషమశిష్టము** సం. వి అ న అనుచితమైన శాసనము, పనికిమాలినయాజ్ఞ.
**విషమశీలుఁడు** సం. విశ (అ ఆ అ) ప్రతికూలస్వభావముగలవాఁడు, వికటమయిన స్వభావము కలవాఁడు, చిటచిటలాడెడువాఁడు.
**విషమస్థుఁడు** సం విశ. (అ ఆ అ) 1. మిట్టపల్లములుగలచోట నున్నవాఁడు 2. కష్టములో నున్నవాఁడు, అపాయస్థితిలో నున్నవాఁడు
**విషమించే** సం అ క్రి. అపాయము తెచ్చు
సీ వలికతో మేల మెప్పుడు విషమించు-బడుచుతో నవ్విన భంగపఱుచు నీతిసీ. శ. 62.

సీ రాకేందుముఖ నీవు నేకరూపముదాల్చి విష మింప వేల యోవిషమశరుఁడ భాను 8 56

**విషమితము** సం విణ (అ అ. అ) 1 విషమముగాఁ జేయఁబడినది, మిట్టపల్లములు గలదిగాఁ జేయఁ బడినది, వంకరగాఁ జేయఁబడినది 2 ముడిచికొను నట్లు చేయఁబడినది, సంకుచితముగా చేయఁబడినది 3. కష్టమగునట్లు చేయఁబడినది

**విషము** సం. వి. అ. పుం న గంశము, వత్సనాభి న. 1. నీరు, జలము. 2. తామరతూఁడు. 3 గోప రసము, కాలెంతబోళము.

**విషమృత్యుకము** సం. వి. ఉ. పుం. ఒకానొక పక్షి, చకోరము.

**విషమేషువు** సం వి ఉ. పుం. విషమశరుఁడు

**విషయకము** సం. విణ (అ. అ. అ.) 1. ఒక వస్తువు నకు సంబంధించినది 2 (సమాసాంతమున) ఒక దానినిగూర్చి చెప్పునది, ఒకయంశము విషయ ముగాఁ గలది.

(ఉదా దానవిషయక గ్రంథము.)

**విషయగ్రామము** సం. వి అ పుం. ఇంద్రియార్థముల సమూహము, శబ్దాది విషయముల సమూహము

**విషయాభిరతి** సం వి ఇ. స్త్రీ ఇంద్రియార్థముల యందాసక్తి, ఐహికానందములయందలి కోరిక (ఇశ్లే విషయనిరతి, విషయాసక్తి మొ)

**విషయప్రసంగము** సం వి అ. పుం విషయాభిరతి

**విషయము** సం వి అ పుం. 1. ఇంద్రియార్థము, ఇంద్రియగోచరమగుశబ్దాదికము, భోగసాధనము 2 లౌకికార్థము, వ్యాపారము 3. ఇంద్రియా నందము. 4 పదార్థము, వస్తువు 5 లక్ష్యవస్తువు, లక్ష్యము. 6. తిరిగెడిచోటు, సంచరింపవీలగు ప్రదే శము. 7 పని, కృత్యము, ప్రధానకార్యము, 8 ప్రస్తావము, ప్రకరణము, సంగతి. 9 వివరింపఁ దగిన యంశము, (మీమాంస) అధికరణమందలి మొదటంశములలో మొదటిది. (శ్లో విషయో విశ యశ్చైవ పూర్వ పక్ష స్తథోత్తరం, నిర్ణయశ్చేతి సిద్ధాంతశ్శాస్త్రేధికరణం స్మృతమ్ ) 10 స్థానము, ప్రదేశము. 11 దేశము, గ్రామ సమూహము, మండలము 12. శరణము, రక్షకస్థానము, నీడపట్టు 13. వీర్యము, శుక్రము 14. మత సంస్కారము, కర్మము. 15 అయిదుసంఖ్య 16. (అలం) ఆరోపాశ్రయము

ఉ అజ్ఞానతిమిరము, ఇట తిమిరత్వారోపమున కాశ్రయ మజ్ఞానము.

**విషయసుఖము** సం వి అ పుం భోగ్యవస్తువుల వన గలిగెడి యానందము, ఇంద్రియానందము.

**విషయాత్మకుఁడు** సం విణ (అ. అ అ భోగవస్తు వులయందే మనస్సు గలవాఁడు, భోగపరుఁడు, ఇంద్రియసుఖము గోరువాఁడు,

**విషయాభిలాషము** సం వి అ పుం విషయాభిరతి

**విషయాసక్తుఁడు** సం విణ (అ అ అ) ఇంద్రియ సుఖములందాసక్తి గలవాఁడు, ఐహికసుఖము అను గోరువాఁడు (ఇశ్లే విషయనిరతుఁడు )

**విషయి** సం విణ. (న్ త న్.) విషయాసక్తుఁడు, భోగలాలసుఁడు

వి న్ పుం 1 లోకజ్ఞుఁడు, లోకజ్ఞానముగల వాఁడు. 2 రాజు 3 మన్మథుఁడు 4 ఇంద్రియ సుఖాసక్తుఁడైన మనుష్యుఁడు, భోగి

న 1 జ్ఞానేంద్రియము, త్వగాది. 2. జ్ఞానము, ఎఱుక

**విషయించు** సం స క్రి. 1 ఉద్దేశించు

సీ విద్వజ్జనులు నిన్ను విషయించి వత్తురు .. నైష. 6 110.

2 రమించు, మైథునముచేయు.

క. ... వినుము చంద్రరేఖా, తమకమువలె నిన్నుఁ జేతఁబట్టి యొవరినిన్, విషయింపనీయ గట్టిగ మ్మనుగాదని పలికె ... చంద్ర వి 3. 153.

ఉ. బండరువారి పాపికిని బైటి వసారమొకాని యందులో, పుండట యెల్లవంకఁ జెడి పోదుఁ గదా విషయింపఁబోయినన్ క్రీడా. పీఠి 53. పా.

**విషయీకరించు** సం స క్రి విషయముగాఁజేయు, తెలిసికొను

వ స్వస్వరూప పరమాత్మస్వరూపంబుల విషయీక రింప నెఱుఁగమి సహజానంద ముఖుఁ డయి... (కవిక 5. 100 )

**విషయైషి** సం. విణ. (న్. ఈ. న్.) భోగములు గోరువాఁడు, ఇంద్రియసుఖము గోరువాఁడు

**విషయోపసేవ** సం. వి. ఆ. స్త్రీ. విషయాభిరతి.

**విషవిద్య** సం. వి. ఆ. స్త్రీ. విషము పోఁగొట్టు విద్య, విషప్రతిక్రియ

**విషవృక్షన్యాయము** సం. వి. అ. పుం. చూ. న్యాయము

**విషవృక్షము** సం. వి. అ. పుం. విషముగల చెట్టు, ముసిఁడిచెట్టు

**విషవేగము** సం. వి. అ. పుం. విషముయొక్క తీవ్రప్రసారము

**విషశూకము** సం. వి. అ. పుం. కందిరీఁగ

**విషశృంగి** సం. వి. న్. పుం. = విషశూకము

**విషసూచకము** సం. వి. అ. పుం. చకోరము.

**విషస్ప(క్క)క్వము** సం. వి. న్. పుం. కందిరీఁగ

**విషహంత్రి** సం. వి. ఈ. స్త్రీ. తెల్లదింటెన (వ్య. వి.)

**విషహృదయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) విషముగల మనస్సు వాఁడు, ద్వేషబుద్ధిగలవాఁడు

**విషహ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సహింపఁదగినది, ఓర్వఁదగినది 2. నిశ్చయింపసాధ్యమైనది 3. సాధ్యమైనది

**విషాంకురము** సం. వి. అ. పుం. 1. ఈఁటె 2. కొనను విషము పూసిన బాణము

**విషాంతకము** సం. విణ. (అ. ఆ. అ.) విషమును పోఁగొట్టునది, విషమునకు విరుగుడైనది

**విషాంతకుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు

**విషాక్తము** సం. విణ. (అ. ఆ. అ.) విషముఁ బూయఁబడినది

**విషాణము** సం. వి. అ. పుం. న. 1. ఎద్దు మొదలగు వాని కొమ్ము 2. ఏనుఁగుదంతము. 3. పంది (అడవిపంది) కోఱ, వరాహదంష్ట్ర 4. చెంగల్వకోష్టు (వ్య. వి.)

**విషాణి** సం. విణ. (న్. నీ. న్.) విషాణములుకలది
వి. న్. పుం. 1. కొమ్ములుగల జంతువు, దంతములుగల జంతువు. 2. ఏనుఁగు 3. ఎద్దు. 4. వరాహము

**విషాదము** సం. వి. అ. పుం. 1. దుఃఖము, చింత. 2. ఆశాభంగము, ఆశలుడుగుట, నిరాశ 3. దౌర్బల్యము, కృశత్వము 4. తెలివిలేమి, స్మృతిలేమి

**విషాది** సం. విణ. (న్. నీ. న్.) దుఃఖముగలవాఁడు, దుఃఖితుఁడు

**విషాదించు** సం. అ. క్రి. ఖేదపడు
"శిరమున రక్తము వెడలఁగ, బోరెడు తన విభునిఁ జూచి పొడమిన వగతోఁ, బరుషధ్వని వాపోవుచు, గరము విషాదించు క్రౌంచిఁ గనుగొని కరుణన్." భా. రా. బాల. 7.

**విషాపహము** సం. విణ. (అ. ఆ. అ.) విషమును బోఁగొట్టునది, విషమునకు విఱుగుడైనది

**విషారము** సం. వి. అ. పుం. పాము, సర్పము.

**విషాలువు** సం. విణ. (ఉ) విషముగలది.

**విషాస్య** సం. వి. ఆ. స్త్రీ. నల్లజీడి (వ్య. వి.)

**విషాస్యము** సం. వి. అ. పుం. పాము, సర్పము (ఇట్లే విషాననము)

**విషువత్తు** సం. వి. త్., న్. 1. విషువము, సమరాత్రిదినకాలము, యజ్ఞమున నడిమి దినము (విల్యమ్సు)

**విషువచ్ఛాయ** సం. వి. ఆ. స్త్రీ. నీడగడియారపుముల్లుయొక్క మధ్యాహ్నపునీడ, వేళ తెలిసికొనుటకై యుపయోగపడు మధ్యాహ్నపు నీడ.

**విషువద్దినము** సం. వి. అ. న. రేయుంబవలును సమప్రమాణముగా నుండెడి దినము, సమమయిన రాత్రి దిన ప్రమాణముగల దినము.

**విషువద్రేఖ** సం. ఆ. స్త్రీ. భూగోళముమీఁద సరిగా మధ్యను తూర్పు పడమరల కుండెడు రేఖ.

**విషువము** సం. వి. అ. పుం. మేషతులారాసుల ప్రథమాంశము, రాత్రిందివాభాగములు సమప్రమాణములుగా నుండెడి యంశము, సమరాత్రిందినకాలము.

**విషువ(త్సం)సంక్రాంతి** సం. వి. ఇ. స్త్రీ. తులామేషరాసులలో నొకదానియందు సూర్యుఁడు ప్రవేశించుట

**విషూచిక** సం. వి. ఆ. స్త్రీ. విరేచనముల జబ్బు, జేదిరోగము, కలరా

**విష్కందము** సం. వి. అ. పుం. 1. చెదరుట. 2. వెడలిపోవుట.

విష్కంభ(క)ము నం వి అ పుం. 1 విఘ్నము, అడ్డంకి. 2 తలుపుగడియ, అడ్డుగట్టు 3 ఇంటికి మూలాధారమైన దూలము 4 స్తంభము, రాడు. 5 వృతము. 6 రూపకాంగభేదము, (నాటకముల యందు రెండంకములకు నడుమ నొకటిలేక రెండు పాత్రములుప్రవేశించి నాటక కథావస్తువును-జరిగిన దానిని రాఁబోవుదానిని – సంగ్రహముగా సభ్యు లకుఁ దెలియఁజేయు భాగము ) 7 ఒక వల యముయొక్క మధ్యరేఖ, వ్యాసరేఖ 8 యోగు లభ్యసించెడి బంధ విశేషము 9. విస్తా రము, వెడల్పు 10 జ్యోతిశ్శాస్త్ర సంబంధమైన యిరువదియేడు యోగములలో మొదటిది.

విష్కంభి నం వి న్ పుం. తలుపుగడియ.

విష్కంభితము నం విశ. (అ. ఆ. అ) అడ్డుపెట్టఁబడి నది, విఘ్నము గలిగింపఁబడినది.

విష్కిరము నం. వి అ. పుం 1 చిమ్ముట, వెద జల్లుట 2. చీల్చుట. 3. పక్షి 4 కోడిపుంజు, కోడిజాతిలోఁ జేరినపక్షి.

విష్టంభము నం వి. అ పుం 1. దృఢముగా అను కొనుట 2. విఘ్నము, అడ్డంకి, నిరోధము 3. మూత్రనిరోధము, మలనిరోధము 4 పక్ష వాతము. 5. నిలుచుట, ఆగుట. 6 పాదన్యాసము, అడుగుపెట్టుట

విష్టంభి నం విశ (న్. నీ న్) 1 అడ్డగించునది, నిరోధించునది. 2. స్తంభింపఁజేయునది, మొద్దు బాఱఁ జేయునది

విష్టపము నం. వి అ పుం , న. జగత్తు, భువనము

విష్టపహారి నం. విశ. (న్ ణీ న్.) లోకరంజకుఁడు, ప్రపంచమును రంజింపఁజేయువాఁడు.

విష్టబ్ధము నం. విశ (అ. ఆ అ.) 1. గట్టిగా అదుముఁ బడినది 2. ఆశ్రయమీయఁబడినది, బలపఱుపఁబడి నది 3 విఘ్నితము, అడ్డగింపఁబడినది. 4 స్తంభింపఁ జేయఁబడినది

విష్టరము నం. వి. అ పుం 1. (పీఁట, బల్ల మొద లైన) ఆసనము 2. యజ్ఞమునందు 'బ్రహ్మ' కిచ్చెడి పీఠము. 3 దర్భలతో పేల్లిన చాఁప, కుశాసనము 4. కుశముష్టి, పిడికెడు కుశము. 5. చెట్టు.

విష్టరశ్రవుఁడు నం వి న్ పుం విష్ణుదేవుఁడు.

విష్టి నం వి ఇ స్త్రీ. 1 వ్యాప్తి, వ్యాపించుట 2 ఉద్యోగము, పని. 3 జీతము, కూలి. 4 వెట్టి, జీతములేనిపని. 5. పంపుట. 6. నరకనివాసము. 7. (జ్యోతి) పంచాంగములోని కరణములలో నొకటి (భద్రకరణము.)

విష్ఠ నం వి ఆ స్త్రీ 1 మలము, పురీషము . ఉద రము, కడుపు

విష్ఠలము నం వి అ. న దూరప్రదేశము.

విష్ఠించు నం. అ క్రి విష్ఠచేయు, పరుగు, మలవిసర్జ నముచేయు (క ర., ప్రా)

విష్ణుక్రాంత నం. వి. ఆ. స్త్రీ నల్లదింటెన. (వృ వి.)

విష్ణుగుప్తుఁడు నం వి. అ. పుం. చాణక్యుని మఱియొక పేరు

విష్ణుచక్రము మల్ల బంధవిశేషము

వ. నరనామధేయంబులగు గతులును, విష్ణుచక్రం బును, రామబాణంబును, నాగబంధంబును ... మల్లుపు. 3. 68.

విష్ణుదైవత్యము నం విశ (అ ఆ అ) విష్ణువు అధి ష్టానదేవతఁగలది

వి అ న శ్రవణనక్షత్రము.

విష్ణుపదము నం వి అ న 1 ఆకాశము, మిన్ను. 2 క్షీరసాగరము 3 గయాక్షేత్రమునఁ బూజిం పఁబడెడి విష్ణుదేవునిపాదము 4 పద్మము, తామర పువ్వు

విష్ణుపది నం వి ఈ స్త్రీ 1. గంగానది. 2 వృషభ, సింహ, వృశ్చిక, కుంభరాసులలో సూర్యుని ప్రవే శము

విష్ణుపురాణము నం వి అ న పదునెనిమిది మహా పురాణములలో నొకటి

విష్ణుమాయ నం. వి ఆ. స్త్రీ 1. అనాదియైన యవిద్య. 2 దుర్గాదేవి.

విష్ణురథము నం. వి అ. పుం గరుత్మంతుఁడు (ఇట్టే విష్ణువాహ్యము.)

విష్ణురాతుఁడు నం వి. అ పుం.పరీక్షిత్తు. (ఒకానొక రాజు )

విష్ణువల్లభ నం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి. 2. తులసి.

విష్ణువు సం వి ఉ పుం 1 అంతటను వ్యాపించువాఁడు, వెన్నుఁడు, త్రిమూర్తులలో రెండవవాఁడు (ఇతఁడు సత్వగుణప్రధానుఁడై లోకస్థితికర్తయై తనపని నిర్వహింప ననేకావతారము లెత్తినవాఁడు) 2 అగ్ని 3 హిరణ్యపురుషుఁడు 4 విష్ణుస్మృతి రచించిన యొకానొక ముని 5 అష్టవసువులలో నొకఁడు 6. శ్రవణనక్షత్రము.

విష్పందము సం వి. అ పుం అదరుట, ధాతువులు కొట్టుకొనుట, గుండెలు కొట్టుకొనుట

విష్ఫారము సం వి అ. పుం. 1 టంకారము, వింటినారిధ్వని 2. కంపము, వణఁకు,

విష్యందము సం వి. అ పుం కారుట బొట్లు బొట్లుగాఁబడుట.

విష్యము సం విణ (అ అ అ) విషముచేఁ జంపఁదగినది.

విష్వక్సేనప్రియ సం వి ఆ స్త్రీ విష్ణుప్రియ, లక్ష్మి

విష్వక్సేనుఁడు సం. వి అ పుం 1. విష్ణువు 2. విష్ణుదేవుని ప్రధానపరిచారకులలో నొకఁడు

విష్వణము సం వి అ. న భోజనము తినుట

విష్వద్ర్యం(ద్ర్య)చము సం విణ (చ్ ద్రీచీ చ్) అంతటను వ్యాపించినది, సర్వవ్యాపకమైనది

విష్వాణము సం వి అ పుం =విష్వణము.

విసంకటము సం విణ. (అ ఆ అ) భయంకరము, ఘోరమైనది

వి అ. పుం. 1 సింహము. 2 ఇంగుదీవృక్షము, గారచెట్టు.

విసంగతము సం విణ (అ ఆ అ) సంగతముకానిది, పొసఁగనిది, ఇంపుగాలేనిది.

విసంచేచేయు స క్రి చెఱుచు, ధ్వస్తముచేయు (క. విసంచిసు = 1. ముక్కలగు 2 బలహీనమగు.)

గీ అలసవలితంబులైన కటాక్షవీక్ష,ణాంచలంబులు యువధైర్యకంచుకములు, చించి చీకాకుపఱచి విసంచుజేసె, రామవర్తనకేళీ విరామవేళ. వైజ 1. 131

విసంధి సం వి ఇ పుం. పద్యమునందలి పదములకొఁడొంటితో సంధి (కూడిక) లేకుండుట. (కావ్యదోషములలో నొకటి.)

విసంయుక్తము సం విణ (అ ఆ అ) విడిపోయినది.

విసంయోగము సం వి అ పుం విడిపోవుట.

విసంవాదము సం వి. అ పుం 1 వియోగము 2. మోసము 3 మాట తప్పుట 4 పరస్పర విరుద్ధముగా నుడుట 5 వ్యతిరేకము.

విసంవాది సం విణ. (న్ నీ న్) 1 అసంగతము, పరస్పర విరుద్ధమైనది. 2. భిన్నము, వ్యతిరేకమైనది 3 వివాదపడునది, కలహించునది 4 అసత్యము నిజముకానిది 5 వంచకము, మోసపుచ్చునది 6. ఆక్షేపము చేయునది

విసంష్ఠులము సం విణ (అ ఆ అ) 1 చంచలము, కలఁతనొందినది 2 సమయము కానిది, విషమైనది

విసదారి వి (సం విషధారి.) సర్పము, పాము

గీ అలినిరాచారులేయుండు నలువప్రోలు, బలసి విసదారులుండు పెంజిలువప్రోలు, కూడు నిదురయు నెపుఁడు లేకూఱకుండు, వేలుపులప్రోలు నమ్మేటి వీటి కెనయ అచ్చ. రా బాల 81

విసనకఱ్ఱ వి. (విసన+కఱ్ఱ) వీవన, తాళవృంతము

అ కప్ర .. వలపు, గ్రమ్ము పూల విసనకఱ్ఱచే వీచుచు . నీలా. 3. 32

సీ విప్పెఎగొడుగులువిసనకఱ్ఱలు ప్రబం 1. 57.

విసపరి విణ దుష్టుఁడు, దుష్టురాలు

ద్వి పాపజాతులు విసపరలు పెడ్డరులు, మాటల మంచులు మందులమార్లు . పండితా పురా 116. పా.

విసపాల వి (విసము+పాల) ఓషధివిశేషము, ఒకానొక మందుచెట్టు (శ ర)

విసపాలవిత్తు విణ (విసపాల+విత్తు) ఘాతకుఁడు (ఇది యొకతిట్టు).

ద్వి. పదవిహీనుఁడు జగత్ప్రాణభక్షకుఁడు, వెదకియీ విసపాలవిత్తునేమందు.హరిశ్చ ఉ. 2038

సీ దరిచేసి చెడుగొట్టు బెతికి దగాకోరు విసపాలవిత్తు చర్విసము దగులు ... హంస 5. 113

విసపుమేఁతరి వి (విసము+మేఁత+అరి) శివుఁడు

వ విసపుమేఁతరియై తిరిగి యిచ్చుట యిష్టట్లు యుండును మ్ను. వి 1. 22.

విసపు[మాను(ఁకు) వి. (విసము+[మాను) విష వృక్షము.

ఆ... అందు విసపు[మాఁకులై యున్న చెడుగురే, [దిమ్మరుల నడంచి తమ్మికంటి...నీలా 1 80.

విసబొద్ది వి. (విసము+బొద్ది) పార, ఒకానొకచెట్టు.

సీ... విసబొద్ది యవఁగను వెలయుఁ బార ఆం భా. 2. 54

సీ. సహదేవి జుట్టుపు చలిపిండి చిటిముటి పెన్నేరు విసబొద్ది పిండిదొండ. హంస. 4 10

విసమాలుచే(లుచు) స [కి. రూపుమాపు

ద్వి వసదులన్నియు [వచ్చి వ(ఁద)లాడి, వెనటిన [ప్రతిమల విసమాల్చు నిదియ. బస పు 6 574.

విసము వి (సం విషం.) 1. గరళము

చం ... పయోజగర్భుఁడు సుధారసధారలు రెంటితో విసంబులు చిలికించి చేసెనో కా పొల్పెసలారఁగ దీని నేత్రముల్ వైష 8 116

సీ..., ముఖరాగమును గళంబున విసంబు. వసు. 8 128.

(వ బ ల శభేదమున బిసమని యర్థాంతరము.)

సీ. ఎడపెడ విసము[గక్కెడు పాములను మెడఁ గూర్పఁజెల్లునె మీకుఁగొమ్మలార నీలా 3. 34.

2 నీరు

సీ మించు చూపుచునె నమ్మించి నిల్కడయేది విస మొసంగెడు మబ్బుఁ గొనరవేల. యయా. 1. 28.

(ఇది రెండర్థములకు నుదాహరణము)

జ - విసపాల, విసపాలవిత్తు, విసపుమేఁతరి, విసపు [మాను, విసబొద్ది.

విసరణము సం వి అ న. [ప్రసరణము.

విసరము సం. వి అ పుం. 1 వెడలుట. 2 [ప్రసరిం చుట, వ్యాపించుట 3. సమూహము, మంద, గుంపు. 4 రాశి, [ప్రోవు.

విసరియాడు = విసరు స. [కి. (విసరి+ఆడు) ఆడించు

ద్వి విమవీథిఁ దోఁకలు విసరియాడుచును, గురు వులు వాఱుచు గునిసియాడుచును. రం. రా. యు. (క ం.)

విసరు స [కి. (సం విసృ) 1 ఆడించు

క తల విసరి వెల దగఁగ బో,యలకేఁలదయ్యె. భార అను 2 270

2 [తిప్పు

గీ...పట్టి కోదండదండంబు పరిఘుగాఁగ, విసరు చును వచ్చె వేఱొండు వేలుపుతోడు పారి 4 70

క గద విసరివైచె నరకుఁడు ఉ హరి 1 166.

వ. పుడమిపతి పెడవిసరు విసరి ... మనుచ. 4 115

3 రువ్వు,

గీ. తప్పులేకుండ నేల నెత్తమ్మి మొగడ, విసరి పక్షః[ప్రదేశంబు [వేటుగొఁటి. హర 1. 27.

గీ విరహితతిమీఁది కోపానమరుఁడు దివియ, వేగమై పైఁడి యొఱతోన విసరఁ గుట్లు, దునిసి బైటికి వసిథార దోఁచెననఁగ ... ఆము 5.24.

వ అప్పువ్వుదండఁ [గమ్మునఁ [గమ్మఁటించివిసరి... హం. 6. 16

4 ఖుటించు.

సీ తల్లియిచ్చిన చల్ది తగ [బవ్వ వచ్చిన వెనుకఁ జూడక వేగ విసరగలవు సిం నార 88.

5 వీజనముచేయు, విసనకఱ్ఱ నాడించి గాలి [ప్రస రించునట్లు చేయు.

సీ ఇల్లిల్లుదిరుగ నొక్కింతబ్బు శిఖ యప్పెనే నింటిలోఁ బారి యిడి విసరక, రాఁజదు... ఆము. 4 127.

గీ. అనుచు వెతనొందు జనకుని యానవంబుఁ, జూచి యడలూవ భావించె మందరాంగి, జాఁతిమై రాఁజఁబెట్టిన పావకంబు, వీవనం బునఁ బైపయి విసరినట్లు కృ. శకుం. 3. 108

గీ...బహుళ నిజదేహ లేపన పరిమళములు, పోదు ముట్టంగ నొక్కటె నురటి విసరె వరాహ. 9 189

6. చూర్ణముచేయు.

ఉదా - కందులువిసరు, పిండివిసరు, మొ

అ. [కి 1. వీచు.

**వీడ్కోలు = వీడుకోలు** వి 1. వీడుకొనుట, పోవ ననుమతి

మ ... మునివంశోత్తమునం ఘ్రిపద్మము శిరం బుం జేర్చి వీడ్కోలతం, డొనరింపన్ జనియెన్ బురంబునకు నిత్యోద్భాసితైశ్వర్యుఁడై వృసిం. 2. 43.

క తల్లియుఁ దండ్రియు వెఱఁగునఁ, బల్లవడన్ వారికడకుఁబోయి తడయంగా, నొల్లక పయనపు వీడ్కోలిల్లం దనయిచ్చ నడపియేఁడైర వెడలెన్ భార. ఉద్యో. 4 162.

3. విసర్జనము, విడుపు

మ. ... చెక్కులు ఫాలంబు చెమర్పఁగెట్టచెంద వీడ్కోల్ చెంద బంగారుగాజులు టోకియ్యఁగ నూర్పులెచ్చఁదలు అచ్చో నిక్కఁ దాళస్థిన్, దలయంచెన్ గనుదోయి సొక్క లోకకాంతా మౌళి మంగాంబకున్ ప్రబంధ 570

విజ విడిపించువాఁడు.

సీ. జలజగర్భుని చదువులచెఱ వీడ్కోలు వరాహ. 5 59.

**వీడ్చు = వీడుచు** స. క్రి. (√ వీడు) 1. విప్పు, విడఁ జేయు.

క. తెలవ యొకతె నిద్రింపఁగ, నెఱఁగట్టిన నిలువ వీడ్చి వేగుట తెలుం, గఱపించి నీ కుమారుఁడు, వెఱచుచు వది వఱవ వగిలె విహితచె సాధ్వి. (భాగ. 10. పూ 324.)

మ. కని సత్కారమణీయుతంబుగ నమస్కారంబు గావించి శౌ, మనికాటాహ్వతకుంతలద్వయము నాత్మస్వర్ణచేలాగ్రబం, ధనమున్వీడ్చి తొమసంగ నందుకొని మోదంబంది యా నందనం, దను దీవించుచుఁ జెంగటన్నిలిపెఁ జింతారత్న పీఠంబునన్ పారి. 3 25

చ. వెరవున జంటరైకముడి వీడ్చుటకుం గరకంక ణంబులుం, హారువుగ మోవి యానుటకు ... (శృంగారరసమంజరి 2. 6.)

2. దొంగిలించు, ఒరులమూటలనువిప్పి వానిలోని వస్తువులు హరించు

చ. వెలయఁగ సొమ్ముతోడ ముడివీడ్చులఁ బట్టిన బటవ్రేలితోఁ, గలయఁగ పెద్దవ్రేల్నఱికి క్రమ్మఱ వీడ్చునఁ గాలుఁజేయునుం, జలమఱఁ దున్మి మూఁడవగుసారి సహింపక యూరెఱుం గఁగాఁ, దలఁదెగవ్రేసి చంపుటుచితంబగు నాయకులైనవారికిన్ విజ్ఞా ప్రా కాం. 95.

**వీడ్పాటు = వీడుపాటు** వి (√ వీడు) వ్యత్యయము, అకటవికటము

క లింగంబుల వచనంబుల, భంగులు హీనాధిక తలపాటియు వీడ్పాటుం గదిరిన మనమకు విం, పుంగలుగం జేయు చంద్రుడు బుధులుచితోక్తిన్. కావ్యా 5. 10

సీ కొనఁడు నానాసేవకుల సేవ లెవ్వియుఁ గొనివ వీడ్పాటుగాఁ బనులు పనుచు. ప్రభా 2. 108.

వ ... అప్పుడు తమ సుఖాసక్తి మతి స్వంత నామధేయంబులు స్త్రీత్వంబుల వెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొనిరి ... కళా. 5 107

**వీడ్యము = వీడియము, వీడెము** వి (క వీశేయవు. త. వీడైయం.) తాంబూలము

సీ వీనుల నరసోఁకు వీడ్యంపుఁదావుల పలుకరింపుల మేనుపులకరింప. (అని. 3. 95)

ఉ, దూరమువోయి యొండఁబడి దూపిలివచ్చిన ప్రాణనాథునిన్, ద్వారకవాటగేహళులదాఁక నెదుర్కొని తీర్థమార్చి యాహారము పెట్టి వీడ్యము సమర్పణచేసి విహారళయ్యపై, నూరుపు తొత్తి చిత్తమున కుబ్బొవరించుట ధర్మమింతికిన్. కాశీ. 2 81

ద్వి. భూతి వీడ్యంబు తొప్పుగ నివేదించి ... పండితా. పురా 168.

**వీడ్వడు = వీడుపడు** అ క్రి. మాఱుపడు

క. చరువులు నమ్మనిచెప్పిన, తరువులు వీడ్వడితొ సుతకుఁ దల్లికి ... భార అను. 1. 111

గీ. పతియు భరియించుఁగావున భర్తయయ్యె, భామ భరియింపఁబడుఁగాన భార్యయయ్యెఁ, బరఁగనవి మనయందు వీడ్వడియె విన్ము, పేన యెల్లకాలము భరియింతుఁగాన భార, అని. 227.

క. ధరణీవరాహాలక్ష్మణుఁ, డరి లక్ష్మి వహింప వచ్చునప్పుడు నగరీ,తరుణుల తొడవులు వీడ్వడఁ, గొరిఁ దొడిగెడు కౌతుకంబు పొల్పగుఁ జూడన్ (కావ్యా 1. 80)

2. తడఁబడు

చ. తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రముఁ దప్పెదుం గడున్, వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబుగాదు వీడ్వడియెడుఁ జెయ్యి లంగము గడంకదొలంకెడు .. భార. భీష్మ. 3. 351.

ద్వి. పలుకులు వీడ్వడ భావంబు వెడల, తలఁపులు గరగంగఁ దన్మయత్వమున . . ద్వి భాగ. 2 29. పా.

3. శిథిలపడు

గీ. పాదయు వీడయుఁబోలె వీడ్వడక మెలఁగి, యుబల కంటికి ఱెప్పవై యరయవమ్మ. విక్ర. 4. 198.

సీ విశదాబ్జములతోడ వీడ్వడు కమ్మల కడలు దైవాఱెడు కరుణఁదెలుపు భాగ. 6 ౬౬3.

(ఇట ప్రతిఘటించు అని భావము)

4. బంధమునుండి తొలఁగు, తప్పుకొను.

ఉ నా మతుఁ డింద్రజిత్తు కదనంబునఁ బన్నగ పాశబద్ధులం, జేసిన నిర్జరాదులకుఁ జెల్లదు వీడ్వడవట్టి కట్టులం, జాసి పరాక్రమించెదరు వంక్తిరథాత్మజులు ... భా రా యు 1058.

5. విడిపోవు, శిథిలమగు

సీ. ఆమయాగ్రణి రాజయక్ష్మధాతువులు వీడ్వడి తాఱఁ జెదవులు దడుపుకొనితెు జై భా. 8. 17

వీణ సం వి ఆ. స్త్రీ. 1 వీణియ, తంత్రీవాద్య విశేషము. 2. విద్యుత్తు, మెఱపు. (మే ని)

వీణము = వీణాము . సన్నవస్త్రము, వలిసము, అంశుకము (శ ర)

వీణాదండము సం వి అ పుం. వీణెకు వెనుకవైపున నుండెడి కఱ్ఱ, ప్రవాళము.

వీణాము = వీణము వి వస్త్రము, అంశుకము

క. పన్నీట జలకమాడెను, మున్నని వీణాము గట్టెను విఱులు దురిమెన్ . . జై భా 3. 11

వీణాస్యుఁడు సం వి అ పుం నారదుఁడు.

వీణి సం వి న్ పుం వైణికుఁడు, వీణవాయించువాఁడు

వీణి(ణె)య వి కస్తూరిమృగము యొక్క కస్తూరియుండెడు బొడ్డుకాయ

వ కస్తూరి వీణెయలును బల్లి గడ్డలును ... శల్హా 3 (శ ర)

చ ... మంచిచొక్కపుఁ గపురంపు గిన్నియలు కస్తూరి వీణెలు రాశిగాఁగఁ గొండపొడవు దెచ్చి వైచి రచటన్ విజ వి 2 90.

వీణి(ణె)య వి. (సం. వీణా) విపంచి, వాద్యవిశేషము.

క పణాయత లోచన న. ప్రాణాయత చిత్రగాత్ర పాంచాలిక యై, వాణియ యీ రూపోయన, వీణియ వాయించె నొగిఁ బ్రవీణత మెఱయన్ వై జ 1 118

ఉ వీణియ ముట్టుటల్ మిగుల వింతలు పెంపులు చిల్కబోధతో, రాణ దలిర్పఁ బల్కుట కరంబపురూపము ... కళా 6 217

ఉ. . దేవకి వీణ మీటుటలు చిక్కొడలించుటలున్ నరింబడన్ ఆము 1 62.

వీణెకాయ వి (వీణె + కాయ) వీణకుఁ గట్టెడు తుంబీఫలము

సీ అతివ వతస్థితి నందమొందుటఁ జేసి వీణె కాయలు కొంత వీడు వచ్చు ... ముకుంద 2 102.

వీణెపిల్లి వి (వీణె + పిల్లి) కస్తూరి మృగము. (చి.ని)

వీతంసము సం వి అ పుం 1 మృగములను, పక్షులను బట్టుకొనుట కుపయోగించు త్రాడు, వల మొదలగునది 2 పెంపుడు జంతువులనుంచెడు పంజరము, బోను మొదలగునవి 3. ఆట కేర్పఱిచినచోటు (ఆ ని.)

వీతనము సం. వి. అ. పుం కంఠముయొక్క పార్శ్వభాగము, కంధరాపార్శ్వము.

**పీతము** సం విణ (అ ఆ అ) 1. పోయినది, గత మైనది. 2 విడిచిపోయినది, వెడలిపోయినది, 3 నిర్బంధములేనిది, స్వేచ్ఛగా నున్నది 4 తొలఁగింపఁబడినది, విరాయింపఁ బడినది 5 అంగీకరింపఁ బడినది, ఒప్పుకొనఁ బడినది 6 మచ్చిక చేయఁబడినది, శాంతమైనది 7 శూన్యమైనది, లేనిది 8 కోరఁ బడినది, అభిలషింపఁ బడినది 9 ధరింపఁ బడినది

వి అ. పుం. యుద్ధానర్హమైన, లేక, యుద్ధమునకు సిద్ధముచేయని గుఱ్ఱము, లేక యేనుఁగు.

వి. అ న ఏనుఁగు వంకుశముతో పొడుచుట, మదమతోఁ దన్నుట

**పీతశోకము** సం. వి అ. పుం అశోకవృక్షము

**పీతసూత్రము** సం వి అ న పవిత్ర సూత్రము, జన్నిదము,

**పీతి** సం. వి. ఇ పుం. గుఱ్ఱము

స్త్రీ. 1. గమనము, గతి, పరుగెత్తుట 2 పుట్టించుట, ఉద్భవింపఁజేయుట 3 (సుఖాది) అనుభవము. 4. తినుట 5 దీప్తి, ప్రకాశము. 6 శుభ్రముచేయుట, శుద్ధి

**పీతిహోత్రుఁడు** సం. వి అ పుం 1 అగ్నిదేవుఁడు 2. సూర్యుఁడు.

**పీతెంచు** అ. క్రి. (పీచు+ఎంచు) 1. వినఁబడు వచ్చు.

క. అని యాదమఱచి పలుకఁగ, వెనుక దెసంజల్ల గాలి వీతెంచిన గ్రక్కున నులికిపడి పదంపడి, హనుమంతుని దిక్కు చూచి యవ్విభుఁడనియెన్. రామా 7 46

దండకము ... ఉద్వేల శైత్యంబుతో గంధవద్గంధవాహోర్భికశ్రేణి వీతెంచె దశా 4 282

2 శ్రవణగోచరమగు, వినవచ్చు

ఆ. కర్ణకర్ణ వచ్చి కావు మనాథుల, మైత్రి మను నెలుంగు లగ్గలముగ, బలములోన నెల్లఁగల యంగ వీతెంచె, నాత్రి కెల్లముగ జనాధినాథ శార ద్రోణ 1 18

శా వీతెంచెన్ మధుమాస లక్ష్మి తరుణీహిందోళ రాగధ్వనుల్, వీతెంచెన్ బటుమీనకేతనముతో విల్లంది పూఁదేరిపైఁ, దోతెంచెం దలిరాకుఁ గైదువుల ... పి. శకుం. 2 121.

గీ విపిన వీథుల వీతెంచెఁ గుపితమదన, సమద భుజ వతనుమ ధనుష్టాంకృతములు ... మను 6.29.

**పీథి** సం వి. ఈ ఇ స్త్రీ. 1 రథ్య, బాట, త్రోవ. 2 శ్రేణి, పంక్తి 3 అంగడి, దుకాణము 4 ఇంటి ముందటి వైపు దర్పణము, డాబా 5. రూపకవిశేషము, దశవిధ రూపకములలో నొకటి

**పీథిక** సం వి ఆ స్త్రీ. 1 పీథి, బాట 2 చిత్రకుడ్యము, చిత్తరువు వ్రాసిన దీర్ఘపటము

**పీధ్రము** సం విణ (అ ఆ అ.) శుభ్రమైనది.

వి. అ న 1 ఆకాశము 2 గాలి 3. అగ్ని

**పీది** వి. (సం. వీధీ) వాడ, వీథి

క తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవులకెల్ల మోదము వెఱఁగున్, మది మొలవఁ జక్రధరుపై, వదలక విమవీదిఁ బుష్పవర్షము గురిసెన్ ఉ హరి 1 122

లయగ్రాహి వీదులను గన్మలుపు వేదుల మరుత్తరుల పాదుల సరోవర తటాదుల మఠప్రాసాదములఁ గేలిగిరిపాదములఁ దద్గతవయోదముల బంధుగృహ భేదములఁ గాంచెన్. రామా. 6 111.

ద్వి వేడుక మది కొదవించు వీదులును, వీదులు దోఁచు మాణిక్యవేదులును ... ద్వి. హరిశ్చ. పూ 111.

**పీనాహము** సం. వి అ. పుం కప్పు.

**పీని(నె)య=పీణియ** వి విణ.

వ కన్నియలన్ను చూపం బూఁదేనియలాని వీనియలయందుం బాడు నేర్పులకు మెచ్చి ... యయా 4. 13

(శ ర పా "తీనియల యందుం బాడు" ముద్రి. పా.)

**పీను** వి √విను కర్ణము, చెవి

చ మునిపతి వచ్చి పూవొనఁగి మోదముతోడ భవత్ప్రియాంగనన్, వినుతి యొనర్పఁగా వినిన వీనుల మా చవిగాని మాటలన్, వివవలసెం గదా . . పారి 1 128

క. ఆ నెలఁతయు నవవలుకులు, వీనుల కెడఁజేసి వాని విశ్రవు నుతుఁగాఁ, దానెటిఁగి హీనుఁ డనక య, హీనత నాతిథ్య మొనఁగి యిట్లని పలికెన్ ఉ. హా. 3. 108.

సీ. నిక్క వీనులతోడ నెక్క నక్కెములాడు కరణి నున్నవి వీని ఘనభుజములు . మను 2 36.

**వీనుల తేనె** చెవులకింపు, శ్రోత్రానందము.

ఉ. వీనుల తేనెయై కురియ వింతగఁ గావ్యరసంబు శ్రోతృ యమ్నాయవకోటికిన్ నృసిం పీఠి. 1. 7.

**వీనులపండువు** శ్రోత్రానందము.

గీ. మత్తకోకిల నివ్వన మధుర కీర, భాషణంబులు వీనుల పండువగుచుఁ, దనకుఁ దత్పురి నుపవ నాంతరములందు ... విక్ర 1. 93

**వీనులు చిల్లులు వోవుట** శ్రుతి కటువుగాఁ బలుకుట వలన చెవులు తూఁటుపడుట, శ్రుతి కటువుగా నుండుట.

వీనులు చిల్లులువోవ నా పొల్లుమాటలు పల్కించిన ఫలమేమి ?

**వీనులవిందు** శ్రోత్రానందము, కర్ణోత్సవము, చెవుల కింపు.

క. కందువ మాటలు సామెత, లందముగాఁ గూర్చిచెప్ప నది తెలుఁగునకుం, బొందైరుచియై వీనుల, విందై మతి తానిపించు విబుధుల మది కిన్. మొ శా. పీఠి 18

ఉ ... చక్కరా, కోడు మొగంబు వారల యశోధనులన్ బగదాయ చూడ్కికిన్, వేడుః గొల్పరే వినిన వీనులవిందులు గానె తత్కథల్. రామా 7. 189

**వీనులకు విందు** వి కర్ణోత్సవము, శ్రోత్రానందము

సీ కడఁది విల్లునియు చప్పుడు వీనులకు విందు సేయు నెప్పుడటంచు సీత దలఁప .. ఉ. రా. 1. 88

**వీనుమిగులు** అ క్రి (వీను+మిగులు) ప్రసిద్ధికెక్కు

సీ. అర్థంబు కాశీపురాధాంగణంబునయందు నానా ప్రకారమై వీను మిగులు ... కాశీ. ౭ 49

**వీనులకంటి** వి (వీను+కన్ను) సర్పము, చక్షు శ్రవము.

ఉ వీనులకంటి తొయ్యలియొ వేల్పువెలందియొ జక్కి మోరలేఁ, జానయొ ... అచ్చ. రా. బాల. 144.

ఉ ... వీనులకంటి జన్నిదము ప్రేలెడు బొజ్జయుఁ గల్గుగుజ్జ వాఁ, డేనొనరించు కావ్యమున కెప్పుడవిఘ్నము సేయుఁగావుతన్. శుక చ. 1 14.

**వీనులచూపు** వి (వీనులు+చూపు) చక్షుశ్శ్రవము, సర్పము

ఉ వీనుల చూపు పెండెముఁ దవిల్చిన మంచము కోడి కైదువుం, బూనిన ప్రాఁత వేల్పుఁ గవి పోకలఁ బోయిన వెన్నుఁ డిట్లనున్ ఉ. హరి. 2. 172

**వీనెగాజులు** వి. బ బాలక్రీడా విశేషము

సీ. వీనెగాజులు పోతుటీనె గుజ్జంబులు నాల్గు కంబాలాట పట్టకోతి ... హంస. 3 146.

**వీపు** వి (ఇది సామస్వారమని శ. ర., ఈ క్రింది ప్రయోగములు నిరమస్వార మనుటకు నిర్ధారకములు.) పృష్ఠభాగము, వెన్ను

క. అపన్నగ ముఖ్యులఁదన, వీపువఁ బెట్టికొని పఱచి విపినములు మహా, ద్వీపములు గిరులు నిఖిల ది, క్పాల పురములుఁ జూచెఁ బవహార లకున్. భార ఆది 2 44.

క వీ పెక్కిరమ్ము లంకా, ద్వీపముతోఁ గూడ నైన దేవీ నిను నే, నేపునఁగొనిపోవోపుదు, నీపతి కడ కతిగడచి నిమిషముతోవన్. భా. రా. సుం 305.

సీ. వృద్ధ కచ్ఛపరాజు వీపంఘ్రి పీఠంబు పుతతతం గిడి పెల్లి శిరసుపాగ . హర 5 19

**వీపుగానరాడాఁగుట** వెన్ను కనఁబడునట్లు డాఁగు కొనుట (రహస్యముగా దాఁచికొన యత్నించియు దానిన బయలుపఱచుట.)

ఉ. డాఁగడు వేగిరించెఁ గద తద్గతి నీవు నెఱుంగ సిగ్గువన్, లోఁగుచు నింతమండి యుఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా, నేఁగుచుఁ గోరు నీబలిమి నీప్సిత సిద్ధిగ వీపుగానరా, డాఁగుట దీనిపేరు నిబిడం బిది బాలికకెల్ల సాత్మతోన్. ప్రభా. 5 17.

**వీపుగోల** వి. (వీపు+కోల) వెన్నున మోఁదెడు బెత్తము

ద్వి మొగి బౌద్ధసమయుల ముక్కుపైఁ గ త్తి, యొగిని స్మార్త సమయుల వీపు గోల పండితా. వాద 173. పా.

**వీపుఁ బ్రేయు** = వెన్నునఁ జఱచు.

క అనిబెట్టిదంబు లాడుచు, జనపతి చూడంగ సురుచి సవతికొడుకుఁ జయ్యన రెట్ట బట్టి పొమ్మని, వెనుకకుఁ బడఁద్రోసి వీపు బ్రేసెన్ బెలుచన్ వి పు 2. 15

**వీప్స** సం. వి. అ స్త్రీ 1 వ్యాప్తి, అంతటను వ్యాపించుట 2. ద్విరుక్తి, చెప్పినది మఱలఁ జెప్పుట

సీ... వీప్సయో కాని పూర్విలుకాని సఖునకు నామ్రేడితమొ కాని యబ్ధిజునకు ... కాశీ. 4. 191

(బుధుని వర్ణనము ఇట వీప్స అనఁగా ప్రతిబింబము అని అర్థము.)

**వీయను** అ క్రి (వీ+అను) అంగీకరించు, ఒప్పుకొను.

గీ. అరిగి తండ్రికిఁ బ్రణమిల్లి యతఁడు కమ్మ, వచ్చుటలు దెల్పి తేజీదువాలికోలి, నలసి యున్నాఁడ నీవేఁగు మనుచు ననుప, నగు మొగంబున వీయని నగరు వెడలి. కువల. 4. 212

**వీయపురాలు** వి (వీయము+ఆలు) వియ్యపురాలు, కోడలి తల్లి, అల్లుని తల్లి, కొడుకు అత్త, కూఁతురి అత్త.

ఉ వీయపురాల వైతి గదవేయిపు, దత్తవు తొంటి వావినో, తోయజనేత్రుఁ గాంచిన వధూమణి నీ సుతఁ బెండ్లియాడఁగా, నాయము నా కుమారునకు వర్మిలి హత్తఁగ నత్తవావిచే, నాయువు గల్గువాఁడవు వటంద్రుడు శుభంబగు దీన నెంత యున్ విజ వి 3 126

**వీయమందు** అ క్రి (వీయము+అందు) సంబంధము చేయు

ఉ. ఈ వనజాత బంధుకులుఁడీ నిమివంశ్యుని తోడి బాంధవ శ్రీని చలింపఁ జూచుట శచీధవుఁ డీశుఁడు వీయమంది నన్నై వెలయించు చం. శా. 3 108

**వీయము** = వియ్యము వి వైవాహిక సంబంధము

సీ ఒండొరువుల తోడ నొప్పిదంబుగ వీయమందు వారుగ నిశ్చయంబు చేసి ... దశకు 7 69.

**వీర** సం. వి. అ స్త్రీ. 1 వీరుని భార్య. 2 మగఁడును, బిడ్డలును గల స్త్రీ 3. మురయనెడి సుగంధ ద్రవ్యము 4 మద్యము 5 కలబంద. (వృ. వి.) 6 అరఁటిచెట్టు (వృ వి ) 7 ఉసిరికచెట్టు (వృ. వి ) 8. కారుకొల్లి. (వృ వి )

**వీరంధరము** సం వి అ. పుం 1. నెమిలి. 2 మృగములతోఁ బోరాటము 3 చర్మ కవచము, తోలు చొక్కాయి

**వీరక త్తి(త్తె)య** వి (వీరము+కత్తియ) వియ్యపురాలు, జాయాపతుల తల్లులయం దొకతె కొకతె వీరకత్తియ యగును అల్లుని తల్లియేని, కోడలి తల్లి.

గి కూరిమిని వీరకానికి వీరకత్తియకును దొలు వేల్పు గొంగ యన్నకును మేటియు ... నీలా 3 87

**వీరకము** సం వి అ. పుం కరవీరము, గన్నేరు (వృ. వి )

**వీరకాఁడు** వి (వీరము+కాఁడు) వియ్యంకుఁడు, భార్యాభర్తల తండ్రులు ఒకనికొకఁడు వీరకాఁడగును. అల్లుని తండ్రియేని, కోడలి తండ్రియేని వీరకాఁడగును

గి అంతఁ గొడుకులఁ గోడంద్ర వందలముల. నునిచికొని వీరకానిఁ దోడ్కొని చెలఁగుచుఁ, బంతితేరుల దొంద్రతో వపట్టి యరుగు, చున్నచో నబ్బుగం బొప్పు నొక్క యెడను అచ్చ. రా జా 1. 198 (చూ. నీలా 3. 87 )

**వీరణము** వి డంగురము, చర్మవాద్య విశేషము.

సీ క్రొక్కాఱు మెఱుఁగు లుక్కున స్రుక్కఁగాఁ జేయు వెలఁదుకల్ బంగారు వీరణములు ... యయా 4 158

గి సన్న వీరణముల మ్రోఁత శంఖ కాహళార్భటి ఢక్కికా హుడుక్కారవములు ... రా. వి 2 49.

**వీరణము** సం. వి అ న వట్టివేరు (వృ వి.)

**వీరణయురుము** వి. (వీరణము+ఉరుము; వృత్తి నివర్ణలోపము) చర్మవాద్య విశేషము,

వ డోలు గౌరు గుమ్మెత తమ్మెట వీరణ యురుమ యొంటికంటి యురుమ ... హంస. 3 29

**వీరతరము** సం. వి. అ. పుం. బాణము
వ. వట్టివేరు. (వృ వి.)

**వీరతరువు** సం వి ఉ పుం 1 ఒకవిధమగు మారేడుచెట్టు, బిల్వభేదము. (వృ వి) 2 అర్జున వృక్షము (వృ వి)

**వీరతాంబూలము** సం. వి అ. న వీరత్వము చూపుటకుఁ బ్రతిజ్ఞ చేసి పుచ్చుకొన్న తాంబూలము.
ద్వి. బొంగుచు వీరతాంబూలంబు గొనుచు . జన. వృ 7. 396.

**వీరతాయెతు** మి వి వీరులు గురుతుగా కట్టుకొను తాయెత్తు. క. మగజాతి వీర తాయెతు... చంద్ర. (శ ర.)

**వీరపట్టము** సం వి. అ. పుం వీరులు ధరించెడి యొక విధమైన వేషము.

**వీరపానము** సం వి అ న యుద్ధమునకుఁ బూర్వము ఉద్రేకము కలిగించుటకుఁ గాని, యుద్ధానంతరము ఖేదమును బాపుకొనుటకుఁ గాని యుద్ధభటులు త్రాగెడి మద్యము

**వీరప్రసవ** సం వి ఆ స్త్రీ. వీరప్రసువు

**వీరప్రసవిని** సం. వి. ఈ. స్త్రీ వీరప్రసువు.

**వీరప్రసువు** సం వి ఉ స్త్రీ 1 వీరునిగన్న తల్లి, వీరమాత. 2. మగశిశువును గన్నతల్లి

**వీరభద్రపళ్లెరము** మి వి. (వీరభద్రుఁడు+పళ్లెరము) వీరభద్రునకు నైవేద్య మొసఁగెడు పెద్ద పళ్లెము
సీ... భీమవారపు వీరభద్ర పళ్లెరమిదు గృహదైవతంబు లిట్టింకు లింక ... ఆము 4. 48.
వీరభద్రపళ్లెర మిడుట, ఒకానొక శైవార్చనము.

**వీరభద్రము** సం వి. అ పుం 1 అశ్వమేధ యాగమునకు పనికివచ్చు గుఱ్ఱము. 2 వట్టివేరు (వృ వి)

**వీరభద్రుఁడు** సం వి. ఉ పుం 1. శివునిచేఁ దవభటుల నుండి సృజింపఁబడిన యొక మహావీరుఁడు. 2. ప్రసిద్ధ వీరుఁడు

**వీరమద్దియలు**=వీరమద్దెలు వి బ (సం వీర మధ్యమ్) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.
చ తరుణుల వీరమద్దియల తాఁకుడుఁ జిందఱ వందఱైన క్రొన్నురుగులతోడ శైవలము నూలుకొనంగ నితంబ పంక్తిపైఁ, బొరలుఁ దరంగ రాజ విరి పూవులు పీడిన కుంతలంబులం, బరఁగు పదంబులం దెలిఁగి పైఁబడ పేర్చు విటాళి కైవడిన్ ఉ హరి. 5 84
గీ వెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దియలును వందెలు మొలనూళ్లు నంగుళీయ, కంకణాంగద హార తాటంక ముఖ సమస్త భూషణములు దాల్చి మార్చిమార్చి ప్రభా. 4. 188
సీ మద్దెలు పిల్లాండ్లు మఱి వీరమద్దియ లిలమిఁ దొడంగెఁ దొయ్యలి యొకర్తు ... యయా. 4 89

**వీరమద్దెల** మి వి వాద్యవిశేషము
గీ. సమరసంగీత వివిధ వాద్యములతోన, కలయ విడిదిలో వీరమద్దెలలు సులిసె ... కు. సం 11 51

**వీరమద్దెలు** వీరమద్దియలు

**వీరమలహరి** వి వాద్యవిశేషము
సీ. వేలువుఁ బూఁబోండ్ల గేలిపేయు నొయారి చెలువలు దగ వీర మలహరులను ... యయా. 4 158.

**వీరము** వి (సం వీరః) వీరము, శౌర్యము
చ గురుని యుపేక్షఁజేసి తనతున్ సమరోద్ధతి నెల్ల దాని నీ, వెరవిఁడి గానతేఁడు తన వీరము తాఁ గొని విట్టవీఁగెదున్ ... భాగ. ద్రో 2. 49
క సైరంధ్రి సెప్పి నీ దగు, వీరమ్మును జెంపు లావు పెరవును మాకున్ ... భార. విరా 4. 34

**వీరము** సం వి అ పుం 1 శృంగారాది నవరసములలో నొకటి (ఇది దానవీరము, ధర్మవీరము దయావీరము, యుద్ధవీరము అని చతుర్విధము)
శా వీరం బాఁడుఁదనంబు నొందెనవఁగా ...హరి ఉ. 4 15.
2 అగ్ని, యాగ సంబంధియైన యగ్ని. 3 అర్జున వృక్షము (వృ. వి) 4 కరవీరము, గన్నేరు. (వృ. వి.)

వ 1 కర్కాటశృంగి (వృ వి ) 2. కిక్కెస. (వృ వి ) 3 తామరదుంప 4. మిరియము

**వీరముద్దియ = వీరముద్దె** వి. (సం. వీరముద్రికా) స్త్రీలు కాలి పెద్దవ్రేలిని ధరించెడు భూషణ విశేషము.

వ మట్టియలు వీరముద్దియలు పాయ వట్టంబు లాదిగాఁగ యలంకారముల నలరించిరి నైష. 6 44

సీ. తళుకుఁ బిల్లాండ్లు బిబ్బిలి కాయలును మట్టియలు వీరముద్దెలు నందియలును ... కళా 7 66.

**వీరముద్రిక** నం వి ఆ. స్త్రీ వీరముద్దియ.

**వీరముష్టి** నం. వి ఇ పుం కోమట్లను యాచించుకొని జీవించెడు ఒకతెగ భిక్షుకుడు. (శ ర., వా )

**వీరరజము** వీరరజస్సు సిందూరము.

**వీరరజస్సు** నం. వి స్. న సిందూరము

**వీరరాఘుత్తుఁడు** వి. (నం వి. అ. పుం ) శూరుఁడైన రౌతు

సీ. వీరరాఘుత్తుల శూరతఁ బొలియించి తురగ సంఘంబుల ద్రుంచి వైచి ... పరమ. 4 159.

**వీరరేణువు** నం. వి. ఉ. పుం భీమసేనుఁడు. (త్రి ని.)

**వీరపట్టము** మి వి వీరులు ధరించు బిరుదు చిహ్నము.

ద్వి. కనితంపుఁ దిలకముల్ కానికంబులును, వెస తోడ నడపులు వీరవట్టములు .. పండితా. పర్వ. 362 పా

**వీరవతి** నం. వి. ఈ. స్త్రీ. జీవత్ పతిపుత్త్రి) స్త్రీ. పతియుఁ బుత్త్రిలు బ్రతికియుండిన స్త్రీ.

**వీరవిప్లావకుఁడు** నం. వి అ పుం తక్కువ జాతి వారినుండి సంపాదించిన ద్రవ్యముతో యజ్ఞము చేయు బ్రాహ్మణుఁడు

**వీరవృక్షము** నం వి. అ.పుం అర్జునవృక్షము.(వృ వి.) 2. నల్లజీడిచెట్టు. (వృ. వి.)

**వీరసువు** నం. వి. ఊ. స్త్రీ. 1. వీరమాత. 2 పుత్త్రుని గన్న తల్లి.

**వీరసేనుఁడు** నం వి. అ. పుం. నలచక్రవర్తి తండ్రి

**వీరసైన్యము** నం వి అ న. వెల్లుల్లి. (వృ. వి )

**వీరస్కంధము** నం. వి అ పుం. ఎనుఁబోతు.

**వీరహుఁడు** నం. వి. న్ పుం. నిత్యాగ్నిహోత్రమును మానివేసిన బ్రాహ్మణుఁడు.

**వీరాణము** వి వీరణము. (శ ర )

**వీరామ్లము** నం వి. అ పుం ఆమ్లవేతసము, ఎఱ్ఱగోఁగు, పుల్లగోఁగు. (వృ వి.)

**వీరాశంసనము** నం వి అ న. 1. భయంకరమైన యుద్ధభూమి 2 కావలి యుండుట. 3 విరాధారమైన యాశ (వి॰ వ్యమ్ము )

**వీరాసనము** నం వి అ న 1 యోగులు మున్నగు వారు కూర్చుండెడి తీరులలో నొకటి 2 ఒక తొడ మీఁద రెండవపాదమును ఏ, మఱి కతొడక్రింద మఱియొకపాదమునుంచి కూర్చుండుట.

**వీరిఁడి** వి అవివేకి, మూర్ఖుఁడు, ప్రాచీనరూపము వీఱిఁడి.

క కూరలు పెరుగును మెసవెడు, వీరిఁడికిఁట మోక్షపదవి విరావేమా వేమ 3 222

విశ వివేకరహితము, మూర్ఖము

ఉ వీరిఁడి మాటలేల వినవే యలవాఁడెకలింత కన్యకా, తీరమువన్ వసించి ... రాజ చ 3 52.

**వీరుఁడు** నం విణ (అ అ అ ) 1 వీరరస ప్రధానుఁడగు నాయకుఁడు (దాన, దయా, ధర్మ యుద్ధ వీరులు అని నాల్గు తెఱఁగుల వీరులు) 2 ధైర్యము గలవాఁడు 3. శౌర్యము గలవాఁడు. 4 శ్రేష్ఠుఁడు. 5. కులాచార సంపన్నుఁడు.

వి అ. పుం. 1 యోధుఁడు. 2. నటుఁడు 3. సూర్యుఁడు. 4 భర్త. 5. పుత్రుఁడు. 6 జిన దేవుఁడు 7. విష్ణుమూర్తి

**వీరుధ** నం వి. ఆ. స్త్రీ వీరుధము.

**వీరుధము** నం. వి ధ్ స్త్రీ 1. విశేషముగా నల్లుకొనెడి తీఁగ. 2. పొద, గుల్మము. 3. కొమ్మ, చిగురుఁగొమ్మ 4. నఱికిన తర్వాత చిగిర్చినచెట్టు

**వీరువారు** వ బ. (వీరును + వారును ) సామాన్యులు

వ ... గానలోకంబున వచ్చుటింతియ కాని మఱి వీరువారునుంబలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టునట్టు మహిమలు వచరించువారము కాము. కళా 3. 41.

**వీరేశుఁడు** (వీరేశ్వరుఁడు) నం. వి. అ పుం. 1. కాశీపురమునఁగల శివుని యర్చావతార భేదము. 2. వీరులలో శ్రేష్ఠుఁడు.

**వీర్యము** సం. వి. అ. న. 1. వీరధర్మము, శౌర్యము, పరాక్రమము 2 బలము 3. పుంస్త్వము 4 ధైర్యము. 5 శక్తి, సామర్థ్యము (తపోవీర్యము). 6. మందుయొక్క మంచిగుణము 7. శుక్లము, రేతస్సు.

**వీఱిండితనము** వి. అవివేకత, బుద్ధిహీనత
ఉ. ... వ, వాండొకరుండనే పలుక కూరకనేరక యుండఁజేయు వీఱిండితనంబుచేత నిసిఱింతలు వాతెడఁ జిత్తమివ్వఁడున్ ఉ హరి. 4. 149.

**వీఱిఁడి** విశే. 1. అవివేకి, బుద్ధిలేనివాఁడు, లేనిది
ఉ ... వీఱిఁడియైన మానినికి వెండి వివేకము గఱ్ఱ నేర్పునే ... భార. ఉద్యో 8 107
(వేఱిఁడి శ ర హ)
ఉ వీంతె తలంతు నతండను వీఱిఁడిపాఱుఁడు... కు. సం. 2. 84.
2. వెఱ్ఱి.
చ. వినమె రెుఱింగియున్ మఱియు వీఱిఁడి మాటలు వేయు నేటికిన్ భా కర్ణ 2 84.
ఉ. వీఱిఁడి చూపులున్ గుఱుచవిప్పును ... దశకు 10. 67.
ఉ ... క్రూరుఁడు మారఁడేనియుఁ, తీగము మీఱ నేయఁ డొకపెట్టున నెట్టనఁ బోవనట్టియా, వీఱిఁడిలీవ మేటి కని వేమరు వేమరు వేచుచుండఁగన్ కృ. శకుం. 2. 211

**వీలు**=వ్రీలు అ. క్రి. 1 చీలు, పగులు.
ఉ. కూలఁబడెం దిశల్ కుధరకూటము లుర్వికి రాలె నేల పాతాళముదాఁక వీలిజలద ప్రకరోదరముల్ చిరింగె .. రామా. 8 61
2. తగ్గు, క్షీణించు.
రగడ....వీలకొలఁ పమరె వరవిందములఁ గుందముల, లీలఁ దళుకొత్తఁగ మిళిందములదెందముల.... రాఘ 2. 6.
ఉ. నెట్టన రేయినిం బగలు నేరమిపెట్టునటంచు వేలుపుల్, వెట్టియుఁ గొట్టముల్ చలుప వీల నిచే బలువొప్ప నొక్కఁడున్, బట్టము గట్టుకొన్న వృషపర్వుని కూఁతుర ... యయా. 3. 75.
3. కూలియాడు.
చ కనుఁగవ నశ్రుపూరములు గ్రమ్మఁగ వీడిన కాకపక్షమున్, వెనుకకు వీల దైన్యరస వేదన నిల్వఁగలేక యేడ్చుచున్ . వి పు. 2 16.
4. ఉపయోగపడు, పనికివచ్చు.
ఉ వేలక కాలజిత్ప్రముఖవీరులు మున్న కుశాకుగాహతిం, గూలిరి రక్తధారలు బుగుల్కొన లక్ష్మణుముఁ బ్రోల . (జై. భా 6 197.)
వి అనుకూల్యము
ద్వి కాఁపు గేములబోలు గడితల తేఱు, ధూపవాసన మేలు తొడవుల వీలు. ద్వి ని పా 1 కి ఛా 8 వ.
విశే అనుకూలము వ్యవ. ఆ పని వీలుగా లేదు.

**వీలుకొను** అ. క్రి (వీలు+కొను) అనుకూల్యము నొందు, అతిశయించు.
గీ తమ్మిఁ బెడఁబాసి వసుధానుధాకరాప్త, క్రాంతవలపంటి వవవింటి కొమరువంటి, నీటు కాఁసైన యుల తివ్వన్నవతిఁ జేర, విరహాగ్ని మంటు తమయందు వీలుకొనఁగ కువల 1 81

**వీలుపడు** అ క్రి (వీలు+పడు) అనుకూలమగు, సరిపడు
వ్యవ. ఆ కార్యము చక్కఁజేయుటకుఁ బ్రయత్నించితిని గాని యది వీలుపడదయ్యెను

**వీవధము** సం. వి. అ. పుం. 1. కావిడి 2. భారము, బరువు 3. పెద్దవరి (వ్యు ఐ) 4 బాట, మార్గము

**వీవధికుఁడు** సం. వి. అ. పుం. 1 కావటివాఁడు, కావడిమోయువాఁడు 2 చిల్లర సరకుల నమ్మువాఁడు, సామాన్యవర్తకుఁడు.

**వీవన** వి (√ వీఁచు) విసనకఱ్ఱ
గీ అనుచు వెతనొందు జనకుని యావనంబుఁ, జూచి యడలూన భాషించె సుందరాంగి, శాంతిమై దాఁచబెట్టిన పావకంబు, వీవనం బనఁ బైపయి విసరినట్లు కృ శకుం. 3. 108.
సీ. నిద్దంపు నెత్తంపు గద్దియల్ సవరించి వలివాలి గాడ్పు వీవనలు వైచి అచ్చ రా అయో. 104.
సీ. ఘనరతి శ్రమజాత ఘర్మాంబు లార్పంగ నతివకు వీవన వగుదుగాదె. భా. రా. కిష్కిం. 59.

**వీవని**=జీఁగని తీఁజింపని, పూర్ణమయిన.

**వీవలి** వి (√ వీఁచు.) గాలి, వాయువు

చ విటపసమృద్ధభూజముల వీవలులన్ విరులన్ మరందలి, ట్పటలి వియత్ప్రదేశమునఁ బతులు వారిమురాళ మండలం బెటువలె . వేం పంచ. 2 174

చ అల వగరాదిమౌళిసరసాగ్రణులెంచఁ జరించు చల్ల వీవలి తను భృంగకోటి గొలువన్ విట నేతయవంగ సొంపుమై, నలరెడి దిఙ్నితతుల యందవుఁదావులు సెందిి యుబ్బుచుం, గులు కుతిగుర్చుఁ గన్నెలతకూనల మేల్వలపూని చొక్కుచున్ (చంద్రి 1 106)

ద్వి ... కువలయేక్షణలు, తావుల కొండరెక్కావి వీవలులు, వీవవీవనలొయ్య వీవ సాకెంత ద్వి పదము 3 193 పా

**వీవలిచెలి** వి (వీవలి+చెలి.) అగ్ని, వాయుసఖుఁడు.

క వీవలిచెలి వనిచిన ము, క్తావళితో విభుని వఊ మలరారెన్ దా,రావినత ప్రతిఫలన, శ్రీవిలసిత కనకధరణి భృత్తటిపోల్కిన్ చంద్రి 6 41

**వీసబడి** వి (వీసము+బడి) గ్రామమునందు భాగ ప్రకారము గలిగిన భూస్వాతంత్ర్యము (శ ర., వా)

**వీసమంత** విశ (వీసము+అంత) మిక్కిలి కొంచము. పంచచామరము. ఇవీయుసీ మొగంబుమీద కిల్లు వెల్వరించినన్, వెస న్విసింగిపోవు సిగ్గు వీసమంత లేదు.. విప్ర. 4 59.

ద్వి. వెరకుచు నొక్కచో వీసమంతయును, సాసక్తి లేక సాయంగేహులగుచు, భాసిల్లుచుండిరి ... (పరమ ద్వి 1 42 పా.)

ఆ. కుకవికీటములకు సుకవి కావ్యములోన, నెమక వీసమంత వెరసులేదు ప్రబోధ 1. 80

**వీసము** వి 1. రూకలోఁ బదునారవభాగము

గీ గ్రహణసంక్రమణాదుల కాచెనగరఁ, గాను వీసంబు వెదలమి గ్రాసమునకు, సాగవెట్టిరి క్షేత్రంబులందుఁ గొన్ని .... మనుచ. 3 129

చ. వెలుపలవడ్డి కిచ్చినను వీసము వచ్చును వట్టు లారెమివో ... శుక. 2. 579.

వ ..మదాంధుఁడనై యల్పవిద్యాలబ్ధి విడువ ముడువ వేసరని వీసంబుగల రెడ్డియుంబోలె. . ఆము 7 4.

2 ఒకదానిలోఁ బదునాఱవభాగము, మిక్కిలి తక్కువ భాగము

వ . పోంక మోపున వీసాలు 2 ... కొలుచు ఖండివీసాలు (ద. శా 935)

సీ మనరాజుతోడ ధీమంతు లూహా... నచ్చి చెప్పిన వీసంబు తప్పఁగు వి. శా వి 2 11

గీ శాలతను కాంతితో సాటి పోల గోర, పృథ్వి నవల ప్రవేశంబు పెక్కుమార్లు, చేసి కులఅవులఁ బతెఁగాని, వీసమైనఁ, బోలఁగాఁ జాలదయ్యె జాంబూనదంబు రసి 2. 105.

గీ ... వీసమంతటి మాత్రంబు వెలితి ప్రష్ట. కాశీ 6. 277.

**వీసరపడు** అ. క్రి (వీసర+పడు) వెలితిపడు, కొఱఁత పడు, వీసరవోవు. (శ ర.)

**వీసరపుచ్చు** స క్రి. (√ వీసరపోవు) వెలితి పడఁ జేయు.

ఉ సత్యవతీతనూభవనృశంసత భీష్మునిఁ గుంఠ జన్మ నా,దిత్యకుమారు నూరక వధి చితి రాజ్య మావిభూతి కొ,ద్దత్యము తోడుతన్ సమరధర్మము వీసరపుచ్చి వంచకా,కృత్యజమైన యీనిబిడకిల్బిష మేమిటఁ బక్కనయ్యెడున్. (జై. భా 1. 56)

వ వదనమదిరామోదంబునం దదీయ దుర్వాసన వీసరపుచ్చం గర్ణంబునఁ బిసపిసనసమశర మంత్రంబు చెప్పి. (ప్రబోధ 3. 51)

**వీసరపో(వో)వు** అ క్రి వెదలిపడు, తగ్గు

అ తఁగకాలియంతయేనియు వీసర,పోవకుండధర్మ మునను నడచి,రయ్య దొంటిశాఖల క్రోధకామ ప్రయుక్తదండధరణ మొప్పుగా క (భార. శాం 2. 335.)

మ. ... పాంచాలీమానంబు వీసరపోకుండఁగఁ గాచినట్టి హరికిన్ సర్వంసహాభర్తకున్, గరుణా వార్ధికిఁ గృష్ణమూర్తికి నమస్కారంబు గావించెదన్. కేయు. 4. 70.

సీ. కోరి శిలాగేహకుడ్యభాగంబుల వ్రాయుదు రమ్మహీశ్వరునిమూర్తి, వ్రాసిక న్యాత్వగౌరవము వీసరవోవ దర్శింతు రనురాగతంళ దృష్టి. నైష. 1. 70

వ. ... అప్పువ్వుదండ గ్రక్కునఁ గ్రమ్మఱించివివరి కేసరంబులు వీసరవోవ, మకరందంబు చిందఁ దొరలు విఱుగం బుప్పొడి సడలం .. హర 6. 16.

ఉ నీ సుగుణత్వమున్ తెలుపు సేర్పును సెచ్చెలు లెల్లఁ జెప్పఁగా, వీసరవోని మోహమున నీనుఱ విందుగ విందు .. (సారంగ. 2 56.)

సీ విధిమార్గ మొక్కింత వీసరవోకుండ, వక్షత పాద్యాదిక్రియలాకలాప, మాచరించి .. హర 4. 55.

వీవత(ము) వి. (వీవము + అర.) తెలివి, కొఱఁత. చూ: వీసరపోవు.

వీసం(వీసు) వి. ఉన్మాదవిశేషము, వలువది పలములు. (శ. ర., వా.)

వీసెలు వి. బ. భక్ష్యవిశేషము.

వ. కుడుములు దోసెలు వీసెలు రొట్టెలు .... అది గాఁగల భక్ష్యంబులు. హంస. 1. 105

## వు

వు అవ. 1. ఉదంతములైన నామపదముల మీఁదను గోశబ్దముమీఁదను ప్రథమైకవచనమున వచ్చు ప్రత్యయము.

ఉదా: విష్ణువు, ధేనువు, మధువు, గోవు మొ.

2. ఉదంతనామపదములమీఁది ప్రథమా బహువచనాది ప్రత్యయములకు వికల్పముగను, గోశబ్దమునకు నిత్యముగాను వచ్చు నాగమము.

ఉదా. తరు(వు)లు, మొ. గోవులు. గురు(వు)లు, బాహు(వు)లు.

3. ధాతువులపై వచ్చు మధ్యమ పురుషైక వచన ప్రత్యయము. ఇ, ఈ, ఐలమీఁద నున్నప్పుడు దీని యుత్వ మికారమగును కొన్నియెడల ఈ ప్రత్యయము లోపింపను వచ్చును.

క. ఎదురువ్వరూపు వలుకఁగఁ, దుదిఁగటకటఁబడవు నీవు ... భార. ఉద్యో. 1. 362.

సీ. భావధ్వనివ్యంగ్యసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూ ప్రీణనంబు. (ఆము. 1 13)

క. మమ్మెఱుఁగుదెదిరి నెఱుఁగుదు .. భార. ఉద్యో 3 34

క. అవిభు నవంతరంబ ధరావలయము బూని తీవు .. ఆము 1 33

4. ప్రథమాంతమయివ యుష్మద్విశేషణమునకు వికల్పముగవచ్చు నంత్యాగమము.

క బాలసఖుండవు నాకును ... భార. ఉద్యో 1. 378.

చ సుగుణవు పుట్టినింటికిని జొచ్చినయింటికిఁ దేజ మొక్కఁగాఁ, దగుచరితంబునన్ నడచుధన్యవు. (భార ఉద్యో. 3 203)

వువూర్షువు సం విణ. (ఉ) వరింప నిచ్ఛగించిన వాఁడు, ఎన్నుకొనఁగోరినవాఁడు.

## వూ

వూర్ణము సం. విణ (అ. ఆ. అ.) వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది.

## వృ

వృంతము సం వి అ న 1. ఆకు, పువ్వు మొదలగు వాని తొడిమ. 2 జోరకొమ్ము 3 చూచుకము, చేను మొన.

వృంతాకము సం వి. అ. పుం. వంగచెట్టు. న. వంగకాయ.

వృంతాకి సం. వి ఈ. స్త్రీ. వంగచెట్టు.

వృంతిక సం. వి అ. స్త్రీ చిన్న కాఁడ.

వృకదంశము సం. వి. అ. పుం. కుక్క.

వృకధూపము సం. వి. అ. పుం. 1. కర్పూరతైలము 2 అనేక వస్తువులు కలసిన పరిమళ ద్రవ్యము.

వృకధూర్తము సం. వి. అ. పుం సృగాలము, నక్క.

వృకము 1. తోఁడేలు. 2 నివంగి. 3 నక్క, సృగాలము 4. కాకి. 5. గుడ్లగూబ. 6. కర్పూర తైలము. 7 అనేకసుగంధద్రవ్యములు గలసిన వస్తువు. 8 అగిసెచెట్టు. 9. జఠరాగ్ని. 10. జాఁగరి.

**వృకారాతి** నం. వి. ఇ. పుం. కుక్క. ఇట్లే వృకారి.

**వృకుఁడు** నం. వి అ పుం 1. దోఁచుకొనువాఁడు, దొంగ 2 క్షత్రియుఁడు 3 వృకాసురుఁడు.

**వృకోదరుఁడు** నం వి. అ పుం 1. బ్రహ్మ 2. భీముఁడు, కుంతీసుతమధ్యముఁడు.

**వృక్క** నం వి. ఆ స్త్రీ 1. హృదయము, గుండె. 2. మూత్రపిండము, మూత్రముచేరెడు కడుపులోనుండు మాంసగ్రంథి.

**వృక్కము** నం. వి అ. పుం =వృక్క.

**వృక్ణము** నం విశే (అ. ఆ. అ) 1 ఖండింపఁబడినది, నఱకఁబడినది. 2. చీల్పఁబడినది. 3 పగులఁగొట్టఁబడినది.

**వృక్తము** నం విశే (అ ఆ. అ) 1 శుభ్రముచేయఁబడినది. 2 పఱవఁబడినది, వ్యాపింపఁజేయఁబడినది.

**వృక్షకము** నం వి. అ పుం 1 చిన్నచెట్టు, మొక్క. 2 చెట్టు, వృక్షము. 3 కుటజము, కొడిసెచెట్టు.

**వృక్షకుక్కుటము** నం వి అ పుం అడవికోడి.

**వృక్షచరము** నం వి అ. పుం. శాఖామృగము, క్రోఁతి

**వృక్షచ్ఛాయ** నం. వి ఆ స్త్రీ. చెట్టునీడ

**వృక్షచ్ఛాయము** నం వి. అ న. పెక్కుచెట్ల నీడ, దట్టమైన నీడ

**వృక్షధూపము** నం వి అ పుం 1 కర్పూరతైలము 2 దేవదారువృక్షము.

**వృక్షనాథము** నం వి అ. పుం రావిచెట్టు

**వృక్షభిదము** నం వి ద్ స్త్రీ గొడ్డలి

**వృక్షభేది** నం. వి. న్. పుం 1. గండ్రగొడ్డలి. 2. ఉలి.

**వృక్షమర్కటిక** నం. వి ఆ. స్త్రీ ఉడుత

**వృక్షము** నం వి అ పుం. చెట్టు.

**వృక్షరుహా** నం వి ఆ స్త్రీ 1. బదనిక. 2. లతావిశేషము.

**వృక్షవాటి** నం వి ఈ స్త్రీ ఉపవనము, చెట్లతోఁపు.

**వృక్షవాటిక** నం. వి ఆ స్త్రీ = వృక్షవాటి

**వృక్షశాయిక** నం వి ఆ. స్త్రీ. ఉడుత.

**వృక్షాంఘ్రి** నం. వి. ఇ పుం వృక్షమూలము, చెట్టువేరు.

**వృక్షాదనము** నం వి అ. పుం 1 వడ్రంగి, యులి, విదారణము 2 గండ్రగొడ్డలి. 3. రావిచెట్టు. 4 ప్రియాలవృక్షము.

**వృక్షాదని** నం వి ఈ స్త్రీ. బదనిక

**వృక్షామ్లము** నం వి అ పుం. 1. మారేడుచెట్టు న చింతపండు.

**వృక్షాశ్రయి** నం వి. న్. పుం 1. ఒకజాతి చిన్న గుడ్లగూబ 2. పక్షి

**వృక్షోత్పలము** నం. వి అ. పుం కర్ణికారము, కొండగోఁగుచెట్టు

**వృజనము** నం విశే (అ. ఆ అ) 1. కుటిలము, వంకరయైనది. 2 నశ్వరము, నశించు స్వభావము గలది

వి అ పుం 1 వెండ్రుక 2. ఉంగరములవలెఁ జుట్టుకొనిన జుట్టు, అరాళకేశము

న 1 పాపము 2 దుఃఖము 3 ఆకాశము, 4 కంచెవేయఁబడిన పొలము. 5 బలము. 6. యుద్ధము, పోరు.

**వృజినము** నం విశే (అ. ఆ అ.) 1. వంకరయైనది, వక్రము 2 దుష్టము, చెడ్డది, పాపముగలది.

వి అ పుం. 1. వెండ్రుక, ఉంగరమువలెఁజుట్టుకొనిన జుట్టు.

పుం, న. బాధ

న 1 పాపము 2 ఎఱ్ఱనితోలు

**వృజినుఁడు** నం. వి అ. పుం దుర్మార్గుఁడు, దుష్టుఁడు

**వృతము** నం విశే. (అ ఆ. అ) 1 వరింపఁబడినది, ఎన్నుకొనఁబడినది 2. ఆచ్ఛాదింపఁబడినది, కప్పఁబడినది 3 దాఁచఁబడినది 4 ఆవరింపఁబడినది, ఆవరణచేయఁబడినది. 5 అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది. 6 అద్దెకుఁ దీసికొనఁబడినది. 7. తెలుపఁబడినది 8. సేవింపఁబడినది. 9 మార్పుగలుగఁజేయఁబడినది. 10. వలయాకారము గలది, వర్తులము.

**వృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. వరించుట, ఎన్నుకొనుట. 2 దాఁచుట, కప్పుట. 3 అడుగుట, వేఁడికొనుట. 4. ప్రార్థన. 5. ఆవరించుట, చుట్టువాఱుట 6. ఆవరణము, కంచె, ప్రాకారము.

**వృతింకరము** సం. విణ. (అ. ఈ. అ) ఆవరించునది, చుట్టువాఱునది
వి. అ. పుం. వికంకతము, కానరేగు (వృ. వి.)

**వృత్తకర్కటి** సం. వి. ఈ. స్త్రీ. కర్బూజ (వృ. వి.)

**వృత్తగంధి** సం. వి. ఇ. న. (వృత్తముయొక్క లేశముగలది.) ఒక విధమగు గద్యము
శ్లో. భవత్యుత్కలికా ప్రాయం సమాసాఢ్యం దృఢాక్షరం, వృత్తైకదేశసంబంధాత్ వృత్తగంధి పునః స్మృతమ్ (వాచ.)

**వృత్తచూడుఁడు** సం. విణ. (అ. అ. అ.) కేశఖండన సంస్కారము జరిగినవాఁడు (ఇక్లే. వృత్తచౌలుఁడు.)

**వృత్తతండులము** సం. వి. అ. పుం. యావనాళము, జొన్న. (వృ. వి.)

**వృత్తపుష్పము** సం. వి. అ. పుం. 1 వానీరము, ప్రబ్బలిచెట్టు 2. శిరీషవృక్షము, దిరిసెన చెట్టు 3. కదంబచెట్టు, కడిమిచెట్టు. 4 కుబ్జకము, గులాబి చెట్టు 5. ముద్గరము, పుష్పవృక్ష విశేషము.

**వృత్తఫలము** సం. వి. అ. పుం. 1. రేఁగుచెట్టు 2. దాడిమ వృక్షము.
న. మిరియము

**వృత్తబీజము** సం. వి. అ. పుం. 1. కంది (వృ. వి.) 2 బెండ. (వృ. వి.)

**వృత్తము** సం. విణ. (అ. అ. అ.) 1 ఉన్నది, స్థితము 2. సంభవించినది, తటస్థమైనది. 3. ముగిసినది, సమాప్తమైనది. 4. చేయఁబడినది, ఆచరింపఁబడినది. 5. కడచినది, అతీతము (కాలము) 6 గుండ్రమైనది, వలయాకారమైనది 7 చెనిపోయినది. 8 దృఢమైనది. 9. పఠింపఁబడినది, చదువఁబడినది 10 పుట్టినది, ఉద్భవించినది. 11 ప్రఖ్యాతమైనది, ప్రసిద్ధికెక్కినది. 12. ఆవరింపఁబడినది, కప్పఁబడినది. 13. వెనుకకు దిరిగినది, మరలినది
వి. అ. పుం. తాఁబేలు
న. 1. సంగతి, వృత్తాంతము 2. చరిత్రము. 3. వర్తమానము. 4. జీవనపద్ధతి 5. ప్రవర్తనము, నడవడి (సద్వృత్తము, దుర్వృత్తము.) 6. పూర్వాచారము 7. వలయము 8 పద్యభేదము

**వృత్తాంతము** సం. వి. అ. పుం. 1. సంగతి, జరిగిన పని, 2. వర్తమానము 3. చరిత్రము, కథ 4 విషయము, ప్రసంగము. 5 విధము, రకము 6 పద్ధతి, ప్రకారము, 7 అవసరము, తఱి 8 స్థితి, అవస్థ 9. మొత్తము, వెరసి, సముదాయము 10 విశ్రాంతి, తెరపి. 11. ఏకాంతస్థితి 12 గుణము, స్వభావము

**వృత్తానుపూర్వము** సం. విణ. (అ. అ. అ.) అఁడోళగాను గుండ్రముగా నున్నది.

**వృత్తానువర్తి** సం. విణ. (న్. నీ. న్.) విధేయుఁడు, చెప్పినట్లు చేయువాఁడు

**వృత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉనికి, ఉండుట. 2. నివసించుట. 3. బ్రదుకు, జీవనము 4 అవస్థ, స్థితి. 5 వ్యాపారము, పని 6. పద్ధతి 7 స్వభావము, సైజము. 8. వ్యాపారము, ఉద్యోగము, జీవనపద్ధతి. 9. జీవిక. 10 వేతనము, కూలి 11 (వేదాంత) అంతఃకరణ పరిణామము 12. సత్ప్రవర్తనము, మంచి నడవడి, ప్రవర్తనము, నడవడి 13. వ్యాఖ్య, టిప్పణి 14. చుట్టుతిరుగుట. 15 పరిధి, వర్తులము యొక్క కైవారము 16 (వ్యాక) సమాసాది (కృత్తు, తద్ధితము, సమాసము, ఏకశేషము, సనాద్యంతధాతువు అని పంచవిధములు.) 17 శబ్దశక్తి (అభిధ, లక్షణ, వ్యంజన అని త్రివిధము.) 18. కావ్యరచనా విశేషము, కైశిక్యాది (కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి అని చతుర్విధము) 19. వంశపారంపర్యమున వచ్చు మాన్యము. 20 ఆలోచన, అభిప్రాయము.

**వృత్తికర్షితుఁడు** సం. విణ. (అ. అ. అ.) జీవిక (జీవనాధారము) లేక బాధపడెడివాఁడు

**వృత్తిచ్ఛేదము** సం. వి. అ. పుం. జీవిక చెడఁగొట్టుట, జీవనాధారము పోఁగొట్టుట

**వృత్తిస్థము** సం. వి. అ. పుం. తొండ, ఊసరవిల్లి

**వృత్తిస్థుఁడు** సం. విణ. (అ. అ. అ.) 1. వృత్తిలో నున్నవాఁడు, మంచిస్థితి యందున్న వాఁడు 2 మంచి నడవడిగలవాఁడు.

**వృత్రౌజ(స, స్క)ము** సం విణ స్ 1 బలము కలది. 2 బీజశక్తి వశింపనిది.

**వృత్త్యనుప్రాసము** సం వి. అ పుం ఒక విధ మైన శబ్దాలంకారము (ఒకటి గాని, రెండు గాని మూఁడుగాని వర్ణములు పద్యమున మరల మరల వచ్చినచో వృత్త్యనుప్రాసము.)

ఉ చొక్కపుటుక్కు క్రిక్కిఱిసి స్రుక్కక పెక్కున వక్కళంపుట, స్నెక్కక ... కావ్యా. 6 16.

**వృత్త్యుపాయము** సం వి అ పుం జీవనోపాయము, జీవనాధారము

**వృత్రము** సం వి. అ పుం. 1 మేఘము 2 చీకటి, 3. ధ్వని. 4 చక్రము 5 పర్వత విశేషము. (మే ని.)

**వృత్రశత్రువు** సం వి ఉ. పుం. ఇంద్రుఁడు

**వృత్రద్వి(ట్టు)షుఁడు** సం వి ష్ పుం ఇంద్రుఁడు, వృత్రశత్రువు

**వృత్రహుఁడు** సం వి న్ పుం. 1 వృత్రాసురునిఁ జంపినవాఁడు, ఇంద్రుఁడు

**వృత్రుఁడు** సం. వి అ పుం 1. ఇంద్రునిచేఁ జంపఁబడిన యొక రాక్షసుఁడు 2 శత్రువు

**వృథపుచ్చు** స క్రి (√వృథపోవు.) వ్యర్థపఱుచు, నిరాశ చెందించు

క. ఇచ్చునది ధనము పాత్రున, కచ్చుగ నారువేఁడ కుండునది యభిముఖులై, వచ్చిన యార్థుల వృథ,పుచ్చకచేయునది సర్వభూతప్రీతిన్.(భార ఆది 8 304)

సీ అంగదవర్ధించివట్టి యశ్యాగతు వృథపుచ్చ కొక జాడఁ బ్రీతిఁదనిపి విజ్ఞా ప్రా కాం. 140.

**వృథపోవు** అ. క్రి. (వృథ+పోవు) వ్యర్థమగు.

ఆ. విమఁడు పడుచులార వృథపోదు నామాట .. వరాహ 11 80

**వృథా** సం అవ్య. (దీనికి తెనుఁగువ హ్రస్వాంత రూపము గానవచ్చుచున్నది. చూ వృథపుచ్చు, వృథపోవు.) 1 వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా నిరుపయోగముగా. 2 అనావశ్యకముగా 3. తప్పుగా, అనర్హముగా.

(ఇది విశేషణార్థమందును బ్రయుక్తమగును)

ద్వి. బలియులై తమదృష్టిఁబడువారినెల్ల, జలజ సంభవ వృథా చంపుచున్నారు రం రా.బాల 40. పా. 1 పం

చ తరుణుల కౌఁగిట న్ననుచు తమ్ముఁ వృథావిరు లెత్తిచేసె మోహపరులుగఁ జైత్రుఁడంచు. ఆము 5 126

శా ఏలాచేసితి దుష్ప్రతిజ్ఞ యిఁకఁ జండీశాన కోదండ మీ, బాలుం డెక్కిడఁజాలకుండిన వృథా పంపింపఁగా నేర్తునే,.. దశా 7 195.

**వృథాకథ** సం. వి అ. స్త్రీ వ్యర్థసంభాషణము.

**వృథాట్య** సం వి ఆ. స్త్రీ వ్యర్థముగాఁ దిరుగుట.

**వృథామతి** సం విణ (అ) మూఢబుద్ధి గలవాఁడు.

**వృథామాంసము** సం. వి అ న. దేవతోద్దేశముగాని పితృదేవతోద్దేశముగాని లేకయే చంపఁబడినజంతువు యొక్క మాంసము

**వృద్ధ** సం వి ఆ. స్త్రీ 1 ముసలిది, వృద్ధురాలు. 2 వంశస్థురాలు, వంశములోనిది.

**వృద్ధకాకము** సం. వి. అ పుం మాలకాకి, కాకోలము.

**వృద్ధదారువు** సం వి ఉ న సముద్రపాల (వృ వి)

**వృద్ధనాభి** సం విణ. (అ) తుందిలుఁడు, పెద్ద బొజ్జ వాఁడు

**వృద్ధము** సం. విణ (అ ఆ. అ) 1. పెరిఁగినది, వృద్ధి పొందినది, పూర్తిగాఁ బెరిఁగినది. 2 గొప్పది, విరివియైనది 3 రాశియైనది, ప్రోగయినది.

వి అ న 1 సాంబ్రాణి 2. (వ్యాక) మొదటి యచ్చు వృద్ధిసంజ్ఞ గల పదము.

(ఆ, ఐ, ఔ ఇవి వృద్ధిసంజ్ఞ గలవి )

**వృద్ధరాజము** సం వి అ పుం. ఒకజాతి గోఁగు. (వృ వి )

**వృద్ధవాహనము** సం వి అ పుం మామిడిచెట్టు.

**వృద్ధశ్రవు(వసు)ఁడు** సం. వి స్. పుం. ఇంద్రుఁడు

**వృద్ధసూత్రకము** సం వి అ న ఇంద్రతూలకము, గాలిలో నెగిరెడి దూదితోఁగూడిన ఒకజాతి విత్తు.

**వృద్ధాంగులి** సం వి ఇ స్త్రీ. 1. బొటనవ్రేలు. 2 పెద్దవ్రేలు.

**వృద్ధాచారము** సం. వి అ పుం పూర్వాచారము,చిర కాలమునుండి నిలిచియున్న యాచారము

**వృద్ధి** సం వి ఇ. స్త్రీ 1. పెరుఁగుట, అధికమగుట (తపోవృద్ధి, జ్ఞానవృద్ధి మొ ) 2 హెచ్చుగుట (చంద్రకళలయొక్క వృద్ధి ) 3 ఐశ్వర్యము (అభి వృద్ధి, సమృద్ధి ) 4. జయము, మంచిస్థితి. 5 ధనము, సొత్తు

వృద్ధిజీవిక సం. వి. అ. స్త్రీ. వడ్డీవలన జీవించుట
వృద్ధిపత్త్రము సం. వి. అ. న. శస్త్రచికిత్సకుపయోగించు రెండువైపులను వాఁడిగల యొకవిధమగు కత్తి.
వృద్ధిమంతము సం. విశ. (క. మతి క.) 1 వృద్ధి గలది, పెరిఁగినది. 2 ధనవంతము, ఐశ్వర్యము గలది. 3. అభివృద్ధిలోనున్నది
వృద్ధిశ్రాద్ధము సం. వి. అ. న. పుత్రజననము మొదలగు శుభసమయములయందుఁ బితృదేవతల నుద్దేశించి చేయఁబడు శ్రాద్ధము, నాందీశ్రాద్ధము.
వృద్ధ = వృద్ధుఁడు సం. విశ. (అ. అ. అ.) వృద్ధుఁడు, ముసలివాఁడు, జ్ఞానవృద్ధుఁడు, వయోవృద్ధుఁడు.
క. వృద్ధని జాత్యంధుండని, బుద్ధివిహీనుఁడని విన్నుఁ బుత్రుఁడు బలద, రోద్ధతుఁడై మెచ్చఁ డవం, బర్థంబులె కాని వినఁడు పలికిన పలుకుల్. (భార. అర 1. 388)
సీ. ఈతని వృద్ధని యొతిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ. భార సభా. 2. 11.
ఉ. వృద్ధపవుప్రవవుడు విను ... ప్రాణంబులెగయఁజూచు ... (భార. అను 4. 101.)
వృద్ధు(డు) సం. విశ. (అ. అ. అ) 1 పూర్తిగాఁ బెరిఁగినవాఁడు. 2. వయసుచే పెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు. 3 (సమాసాంతముగ) పెద్దయైన వాఁడు, (వయోవృద్ధుఁడు, జ్ఞానవృద్ధుఁడు, ఆగమవృద్ధుఁడు, ధర్మవృద్ధుఁడు మొ.) 4 బుద్ధిమంతుఁడు, చదువరి, విద్యావంతుఁడు.
వి. అ. పుం. ముసలివాఁడు 2. గౌరవముగలవాఁడు 3 జ్ఞాని, సంజ్ఞాని 4. వంశస్థుఁడు, వంశములోనివాఁడు.
వృద్ధోక్షము సం. వి. అ. పుం. ముసలియెద్దు.
వృద్ధ్యాజీవి సం. వి. న్ పుం. వృద్ధ్యాజీవుఁడు.
వృద్ధ్యాజీవుఁడు సం. వి. అ పుం వడ్డీవలన బ్రదుకు మనుష్యుఁడు, వార్ధుషికుఁడు.
వృధసానుఁడు సం. వి. అ. పుం. మనుష్యుఁడు, (సి. కౌ.)
వృధసానువు సం. వి. ఉ. పుం. 1. మనుష్యుఁడు. 2. ఆకు. పత్త్రము. 3. పని, కార్యము.
వృశ్చకము సం. వి. అ. పుం. 1. ఎలుక. 2. వాసకము, అడ్డరసము. (వృ. వి.)

న. అల్లము
వృశ్చికము సం. వి అ పుం. 1 తేలు. 2 (జ్యోతి) రాశిచక్రమున వృశ్చికరాశి, వృశ్చికలగ్నము. 3 ఎండ్రకాయ, పీత. 4. శతపది, జెఱ్ఱి. 5 ఒకజాతి పేడపురుగు 6. గొంగళిపురుగు 7. వృశ్చిక మాసము. (సూర్యుఁడు వృశ్చిక రాశియందుండెడి మాసము) 8. గరిజేరు. (వృ వి.) 9 బ్రమంగచెట్టు
వృషణకచ్ఛువు సం. వి ఉ. స్త్రీ అండకోశము మీఁదఁ బుట్టిన వ్రణము
వృషణము సం విశ (అ అ అ) 1 నీరు చిలుకరించునది, నీరు చల్లునది, బలము గలిగించునది 2. బలాఢ్యమైనది, దృఢమైనది. 3. వీర్యాన్వితము, పరాక్రమవంతము.
వి. అ పుం. అండకోశము
వృషణశ్వము సం. విశ (అ. అ. అ) సామర్థ్యము కలది, శక్తిమంతము.
వి. అ. పుం. ఇంద్రుని యశ్వము
వృషదంశ(క)ము సం వి అ. పుం. పిల్లి, మార్జాలము
వృషధ్వజుఁడు సం వి అ పుం 1 శివుఁడు. 2 గణపతి. 3. ధార్మికుఁడు, పుణ్యపురుషుఁడు
వృషనాశనుఁడు సం. వి. అ పుం. శ్రీకృష్ణుఁడు (వృషభరూపమును ధరించిన 'అరిష్టుఁ'డను రాక్షసుని నశింపఁజేసిన వాఁడు) (ఇట్లే వృషాంతకుఁడు మొ.)
వృషపతి సం వి అ. పుం 1. శివుఁడు. 2. ఆఁబోతు, స్వేచ్ఛగాఁ దిరుగవిడువఁబడిన యెద్దు.
వృషపర్వుఁడు సం వి న్ పుం 1 శివుఁడు. 2. ఒకానొక రాక్షసుఁడు (ఈతని కూఁతురగు శర్మిష్ఠను యయాతి పెండ్లాడెను)
వృషభధ్వజుఁడు సం వి అ పుం = శివుఁడు.
వృషభము సం. వి అ పుం 1 ఎద్దు. 2. మగజంతువు (అ ని.) 3 జ్యోతి) వృషభరాశి (రాశిచక్రములో రెండవది) 4. బుషభ మను మూలిక 5. కర్ణరంధ్రము. 6 ఏనుఁగు చెవి (అ ని)
విశ. అ పుం శ్రేష్ఠము. (ఈ యర్థమున సమాసోత్తరపదముగానే యుండును.)
వృషభావ సం. వి. అ. స్త్రీ. అమరావతి, స్వర్గరాజధాని

**వృషళి** నం వి ఈ స్త్రీ 1 విధవ, వితంతువు, 2 దూలగొండి (వ్య. వి) కండూర (వ్య వి.)

**వృషము** నం వి అ పుం 1 వృషభము 2. (జ్యోతి) వృషభరాశి. 3 ఎలుక 4 ధర్మము 5. నీతి, న్యాయము 6 ఋషభమను మూలిక 7 అడ్డసరము. (వ్య వి.) 8 ముఖ్యమైన పాచిక 9 సొరె

వ. నెమిలి పింఛము

విశ అ. పుం. (సమాసాంతమున) శ్రేష్ఠము

నం. వి. న్. పుం 1 వృషభము 2 (జ్యోతి) వృషభరాశి. 3 బుడ్డకొట్టని గుఱ్ఱము, గుఱ్ఱము 4 బాధ, దుఃఖము

విశ న్ పుం (సమాసాంతమున) శ్రేష్ఠము,

**వృషయము** నం వి అ పుం 1 నివాసము, గృహము 2 రక్షకస్థానము, శరణ్యము.

**వృషలము** నం వి అ పుం 1 గుఱ్ఱము. 2. వెల్లుల్లి (వ్య. వి)

**వృషలి** నం. వి ఈ స్త్రీ 1. పెండ్లి కాకుండఁగనే రజస్వలయైన కన్నె 2 ఋతుమతి, ముట్టుది 3. గొడ్రాలు, వంధ్య, 4 ప్రాణము లేకుండఁ బుట్టిన శిశువును గన్నతల్లి, మృత ప్రసువు 5. శూద్ర స్త్రీ, శూద్రుని భార్య.

**వృషలీపతి** నం. వి ఇ. పుం శూద్ర స్త్రీ యొక్క మగఁడు

**వృషలీసేవనము** నం వి అ. న శూద్రస్త్రీని రతియందుఁ బొందుట

**వృషలుఁడు** నం వి అ పుం 1 శూద్రుఁడు. 2 పాపాత్ముఁడు, అధార్మికుఁడు. 3. నటుఁడు 4. జాతి బహిష్కృతుఁడు, వెలివేయఁబడినవాఁడు. 5. చంద్రగుప్తుఁడు అను నొక రాజు. (ఇది చాణక్యునిచే వాఁడఁబడెడి పేరు) 6. తనకు విధింపఁబడిన కర్మము విడుచుటచేత వర్ణభ్రష్టుఁడైన బ్రాహ్మ క్షత్రియ వైశ్యులలో నొకఁడు (అ ని)

**వృషలోచనము** నం. వి అ. పుం. ఎలుక, మూషికము

**వృషవాహనుఁడు** నం. వి. అ పుం. శివుఁడు.

**వృషస్కంధుఁడు** నం విశ (అ ఆ అ) ఎద్దుమూపురమువంటి మూఁపులు గలవాఁడు, బలసిన మూఁపులు గలవాఁడు.

**వృషస్యంతి** నం వి ఈ స్త్రీ 1. కాముకి, మైథునేచ్ఛగలస్త్రీ 2. ఎదావు, ఆఁబోతును జేర సమయమైన యావు. 3 కపికచ్ఛువు, దూలగొండి (వ్య. వి)

**వృషాంతకము** నం వి అ పుం వల్లకీడి చెట్టు.

**వృషాంకుఁడు** నం వి అ పుం 1. శివుఁడు. 2. ధర్మనిష్ఠగల పురుషుఁడు, పుణ్యాత్ముఁడు 3 నపుంసకుఁడు.

**వృషాకపాయి** నం. వి. ఈ. స్త్రీ 1. లక్ష్మి. 2 గౌరి 3 శచి. 4 అగ్ని భార్యయగు స్వాహాదేవి. సూర్యుని భార్యయగు ఉష. 6 ఇంద్రునితల్లి. 7 శతావరి (వ్య. వి.), పిల్లి తేగలు (వ్య వి.) జీవంతి (వ్య వి), తిప్పతీఁగ (వ్య వి.)

**వృషాకపి** నం వి ఇ పుం. 1 శివుఁడు 2. విష్ణువు 3 ఇంద్రుఁడు. 4 అగ్ని. 5. సూర్యుఁడు.

**వృషాహారము** నం. వి అ పుం. వృషదంశకము, పిల్లి.

**వృషి** నం వి న్. పుం నెమిలి, మయూరము.

ఈ స్త్రీ బృసి, యతులు కూర్చుండెడి కుశాసనము

**వృషుఁడు** నం వి అ పుం 1. మన్మథుఁడు 2. కామశాస్త్రమందుఁ జెప్పఁబడిన నాలుగు జాతుల పురుషులలో నొకఁడు. 3 శత్రువు 4 కర్ణుఁడు. 5. విష్ణువు

విశ (అ. ఆ అ.) 1 బలాఢ్యుఁడు, బలముగలవాఁడు. 2. క్రీడాశీలుఁడు, ఆటలాడు స్వభావము గలవాఁడు.

వి న్. పుం. 1 ఇంద్రుఁడు. 2 కర్ణుఁడు 3. అగ్నిదేవుఁడు.

**వృషోత్సర్గము** నం వి. అ పుం ఆఁబోతు వచ్చుపోసి స్వేచ్ఛగాఁదిరుగ విడుచుట

**వృషోత్సర్జనము** నం వి అ న = వృషోత్సర్గము

**వృష్టము** నం. విశ (అ అ అ) 1 వర్షించినది 2 వర్షించుచున్నది.

**వృష్టి** నం వి ఈ స్త్రీ. వర్షము, వాన.

**వృష్టిజీవనము** నం విశ. (అ ఆ అ.) వర్షాధారమైన పంటలు గలది, దేవ మాతృకము (దేశము)

వి. అ పుం చాతకపక్షి.

**వృష్టిభువు** నం. వి. ఉ పుం. కప్ప, వర్షాభువు, భేకము

వృష్టిమంతము సం. విశే. (త్రి. మత్ త్రి) వర్షములు గలది.
వి. త్రి. పుం మేఘము
వృష్ణి సం. విశే. (ఇ) 1 మతాంతరము నవలంబించిన వాఁడు. 2. కోపము గలవాఁడు, తీక్ష్ణ స్వభావము గలవాఁడు
వి.స్త్రీ.పుం 1.మేఘము 2. పొట్టేలు, 3. కిరణము.4. 4.వృషభము 5.కృష్ణునివంశమునఁ బ్రాచీన పురుషుఁడు, ఒక యాదవుఁడు. 6 కృష్ణుఁడు. 7. ఇంద్రుఁడు. 8 అగ్ని 9 వాయువు, గాలి. 10 పాషండుఁడు.
వృష్ణిగర్భుఁడు సం. వి. అ. పుం కృష్ణుఁడు
వృష్య సం వి అ. స్త్రీ 1. ఉసిరిక. (వృ. వి) 2. శతావరి, పిల్లితేగలు. (వృ వి.) 3. ఋషభమనెడి ఔషధి.
వృష్యము సం. విశే. (అ అ. అ) 1 కురియఁదగినది 2. వీర్యవృద్ధిని గలిగించునది (ఔషధము.)
వి. అ. పుం మాషము, మినుము,
న. వాజీకరణము, కామోద్దీపనము చేయుట

# వె

వెంగడము విశే. వ్యత్యస్తము, తాఱుమాఱయినది.
క అంగజహారుని ప్రసాదమునం గలుగుచు వచ్చె మఱుఁడు వాఁడాదిగ మా, వంగడమున నది యిప్పుడు, వెంగడమై కూఁతు రుద్భవించె న్నాకున్ (విజ. వి 2. 8)
వెంగలి = వెఱ్ఱలి విశే (క. బెంగళి) 1. మూర్ఖుఁడు, అవివేకి.
క గంగాతనయుఁడు దెగినను, సంగరమున కుత్సహింపఁజనునే తమకున్, వెంగలు లని యప్పుడు దెలి,యంగా వెఱిఁగితి సుయోధనాదుల గృష్ణా. (భార. శల్య 1 351.)
చ ... కుంభజుఁడు బాలుని నొక్కరుఁ బంచలాక్కు వెంగళిఁ గడుఁబెద్దజేయుచుఁ బొగడ్తకుఁ బొచ్చె నితండు నొందగాఁ,దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ దాఁగుడుఁగూర్చుట నెంత బ్రుఖ్ఖి వన్. (భార. ద్రో. 2. 46.)
రగడ. వెంగలిదతునిఁ గూడినకతమున విజ్ఞానము చెడి పశులమైతిమి. (వరాహ 5 122)
2. వెఱ్ఱివాఁడు, అమాయకుఁడు.
ద్వి కటకటా యిట్టి వెంగలిరాజు గలఁడె, మఱు మాయతపసియే మరులుకొల్పినను.. అమ్మెరఁగడమకై యాలిఁ గొం డనెడు. ద్వి హరిశ్చ. ఉ 409.
గీ మగువఁ గోల్పోయి కడు నిడుమలఁ గలంగు, నలఁతిదొరఁ గొల్వఁ గడఁగు వెంగలులుగలరె. అచ్చ. రా ము. 154.
3. మూఢుఁడు, జడుఁడు.
క ... లింగాకృతిశివుఁ గొలువని, వెంగలిమానవులకంటె వెడఁగులు గలరే శివసా 254.
క. నింగియు నేలయుఁ దానై, పొంగిన హాలాహలంబుఁ బోరిమార్చి రహిన్, వెంగలుల మమ్ముఁ గావుము, గంగాతరంగ తరంగకలిత జటాంగా. వీర 3 231.
ద్వి. పొంగి చిచ్చుటుకంగఁబోవుచుఁ జీర,కొంగోనరించు పెన్వెంగలి యట్లు. బస. పు 3. 97 పా 1140 సం.
4 వ్యర్థము, యుక్తిలేనిది.
సీ. ఎవ్వరితోనైన నెఱుఁగత్తి యొక్కింత పనిలేని వెఁగలి పలుకు పలుకు. భాం. విరా 2. 250.
వెంగలితనము వి (వెంగలి + తనము.) 1 అవివేకము, మూర్ఖత
క కొం గేటికి విడువుము మును, ముంగలి వెడ లంగ వెఱతు ముగ్ధుఁడ నీ కీ,వెంగలితనమెట్లొదవె న,నంగ వికృతిమూవ నర్హమా నాయెదురన్. (భోజరా. 4 228.)
2. వెఱ్ఱితనము.
సీ వెర విట్టి తెఱఁగిది వెంగలితన మని యెల్లవాఁడును దవకొయెఱిఁగినట్టి, తెఱఁగున నిజకార్యదృష్టియ కయికొను ... భార. సౌప్తి 1 45
వెంగలివిత్తు విశే. మూర్ఖాగ్రేసరుఁడు, వెఱ్ఱి
క. వెంగలివిత్తయి తిరుగుచుఁ, గంగారై చెడక ముక్తిఁ గాంచుం చుతం, దంగతలతోడ విడువని, సంగడములు వదలవలయు జలజాతముఖీ. భాగ. 9. 583,

వ అవ్వెంగలివిత్తు లఱచు వీఱేఁడి యఱపులకు వంకలొత్తి మాఱుసెప్పుటయు నోపక భారం. ఉద్యో. 3. 235.

వెంగలివిత్తులు=వెట్టికాయలు.

**వెంగలీఁడు** వి (వెంగలి+ఈఁడు, స్వార్థమున) వెంగలి, అమాయకుఁడు

గీ అబ్ధిసంభవ యితఁడువో హాలహలవు, విషము పుక్కిటఁ దాల్చిన వెంగలీఁడు, కాశీ 5. 116.

**వెంగెమాడు** స. క్రి. (√ వెంగెము.)=వెంగెము లాడు, వ్యంగ్యార్థము వచ్చునట్టు మాటలాడు, పరిహాసముచేయు.

చ. తరుణికి వెంగెమాడవలెఁ దప్పక కాంతునిఁ గన్నచోటులన్, విరసముగాదు చిత్తభవవిభ్రమ మంత్రము దీనికై వినుం, బరుసములాడితిం బదరిపట్టకు మెగ్గులు వేంకటేశ్వరా కాళ్ళపాక వారి శృంగారవృత్తశతకము 101.

**వెంగెము** వి (సం. వ్యంగ్యమ్) వ్యంజనచేతఁ దెలియఁదగిన యర్థము, ధ్వన్యర్థము.

సీ. మచ్చరించినవాఁడు మంచిమాటాడిన వెంగమై తోఁచును వెగటుపోవ, ... (నీతి 76.)

**వెంగెములాడు** స. క్రి (√ వెంగెము)=వెంగెమాడు, వ్యంగ్యార్థము వచ్చునట్లు మాటలాడు, ఎగతాళిచేయు.

ద్వి వెలఁది వెన్నెలసోగ వెంగెంబులాడఁ, దులకించు బొమ్మంచుదుప్పటి గప్పి. ద్వి. పరమ. 4 315 పా.

**వెంచ** వి. (త. వెంచ=సరస్సు) మడుగు, హ్రదము.

చ. ఎలమిన పూరిమేసి సెలయేఱులనీరులు త్రాగి మేలివెంచల శెలమావిఱొంపముల చల్లనినీడల నిల్చి ... (కు సం 6 707)

చ. ... ముంచదటిగిరిపాంత గొంత యెదదప్పుల రేగడవెంచలోపలన్.

ఆ. నాల్గుకాళ్ళు రొంపి నాఁటిన ... ధేనువుఁ. బొడఁగని ... (ద్వా 10 38., 39)

**వెంజామర** మి వి (త. వెణ్ణామర—వెల్ల+చామర) తెల్లనిచామరము, వింజామరము వీరశ్రీకిమేశ్వర మహాదేవరకు ఉత్తరాయన సంక్రంతి నిమిత్తమున నిచ్చినక(ం)నఖదణ్డముఙ వెంజామర 1టి ... ద శా 4 1252.

... వహిణ్డిసీరు వఱడినకొ(ము)లవెంజామరలు 2 . ద శా 4. 1190

. వహిండికాయలతోడి వెంజామరలు 2 .. ద.శా 4 975

**వెంట** వి 1 కార్యము, పని.

చ వరుఁడొకవెంట సెన్నఁడు ప్రవాసగతుండగు నాఁటగోలె న,ప్పురుషుఁడు వచ్చునంతకును ... (భార అను 4 359)

ఉ ఈతని చందముం దెలుప నిట్టిది యక్కట వైరులుగ్రులై, నాతలపై సహస్రచరణం బిడిపోయిరి గాక యల్పమే, యీతెఱఁ గేమిసేయుదును దీర్ఘబలంబున వీనికారమున్, వే తొలఁగింతుఁ ద్రోవఁ గను వెంటకుఁ జూడుఁడు మీ రుపాయమున్ హరి. ఉ 8. 16.

గీ నయము కెడ యీక యెల్లవెంటలను తెలుచు, మాట పరుసదనంబు కుమారచంద్ర వి శకుం 4. 167

2 విషయము

చ ఒకరునిచేత ప్రోవుమ దదున్నతిప్రాపునుగాంచి యెల్లవెంటను గొఱంతలేక పొగడందగు సంపద నొంది .. భార. ఉద్యో. 2 77.

ద్వి నీవు రాజ్యముసేయ నిఖిలభూజములు, నే వెంటనే భయ మెఱుఁగరు గాన, నిన్నిచెప్పితి మీకు నిక్లేను వెఱవ, నన్నింక మన్నించి నా మాట వినుము రం రా. ఉ. 134. పా. 28 పం.

ఉ. ... విదిశాపురి మించు నందు చే,వెంటఁ గొఱంతలేని ప్పథివీసురుఁ డొక్కఁడు సోమశర్మపే,రింట నెనంగు ... శుక 2 144

3 కారణము, హేతువు

చ. వివతకు దాస్యమొందె నొకవెంటఁ దదీయ నిరాసహేతువై, యనఘువిచార నాకు నమృతాహరణంబు విధేయ మయ్యె ... భార. అను 1 251.

క వలసినయప్పుడు మరణము, గలిగింపఁడు పాప జాతికాలుఁడు గరశా,దులవెంట జావుదొంకదు, బలుగావలియై నిశాటభామినులునికిన్ (భా. రా. స్కుంధ 246)

ద్వి. ఏవెంటనో మాకు నింత నిగ్రహము, గావించె నిప్పు డాగంధవాహుఁడు రం రా ఉ. 94 పా. 28. పం.

4. దారి, మార్గము.

క. కను(ౖ)మసిన తెరువరి తన, కనపాయంబైన మార్గమరసి తగనెఱింగిన వారు చెప్పఁగాఁ గై, కొనవిశరడిఁ దగినవెంటకుం జొరవకటా. (భార. ఉద్యో. 2. 280.)

క. రెంటను వేఁచావనుఁడను, వింటిరె మునులార మీ పవిత్రాంఘ్రులు న, న్నంటుట మదీయ మూర్ధము,వెంటంగా వక్రగంగ వెల్లివిరియుటన్ హర 4 57.

మ. తమలోఁబుట్టినవిద్య గనిఁకొనుటం దన్మూలసంసారవి,భ్రమములై కొందఱు దేలుచున్ గలఁగుమం బవ్వెంటన్ దైవయోగముచందే పరమేశుఁ గెల్చి ఘములై కైవల్య సంప్రాప్తులై . (భాగ. 8 721.)

5. ద్వారము.

చ. పురిఁబరిఘోరగిరికరముల్ బలమాత్రము వెంట శోధమం,దిరములఁ జొచ్చి యందుఁ దరుణీతను గంధము చాలిసం కెలై, నెరయఁగనిల్చి కేళిమణివిహృతు ల్నెడవట్టి ట్రొబ్బఁగా, నరిగి తదీయశూలిఁగొనియాడు నిజాప్తులు మూఁగియూఁకొనన్ (కువల. 1 76)

6. విధము, రీతి

ఉ. వీరలు పెద్దద్రవ్యకొక వెంటనొడఁబడి తేటిశాంతులై ... (భార ఉద్యో. 1. 341.)

ఉ. ఏవెంటనేయిన విఘ్నము, గావింపుము భానుఁడుదయగతుఁ డగుఁనేనిన్, జీవింపఁడు విమతుండది, గావున వాకోర్కి దీరఁగాఁదలకొనుమా. (భా. రా. యు. 1617)

శా. ... వేఁ, డిదత్యాగ్రకృతులన్ భుజంగపతి హింసింపంగ నీ బాలకుం, దేవెంటన్ బ్రదికించె మేలనుచు ... (భాగ. 10. 486.)

ద్వి. కంతుకేతుండు ప్రసన్నుగాఁ బడసె, గావున హితులగు కాంతలబుద్ధి, తేవెంట హితమె కాకేల యొం డగునె వండితా. పురా. 150.

7. వెనుక భాగము

గీ. బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు, వచ్చునింటికిఁ బ్రజ దన్ను మెచ్చిచూడ. మనుచ. 1. 54.

సీ. వనిత యెవ్వతె హత్తుకొనునో వీని నటంచు వెంటనే బుడుతల వేగఁబనుతు . . కువల 4 180.

8. వేఁట.

శా. ఘంటాకర్ణుఁడ నేను శాయనుఁడ దీకాలాంతకుం దేను ముక్కంటింగొల్తుము కిన్నరేశు వనికై కైలాసశైలంబునన్, జంటన్వచ్చిన సారమేయములు నీ సైన్యంబులున్నావె హే, వెంటం బోయిరిమేమి కాఁబడవిలో వేఁటాడరే యెవ్వరున్. ఉ. హరి. 2 140.

9. ఉపాయము

గీ. ... వృత్రాసురుండు, పుట్టె వతనికిఁ దైత్య నన్నూరిగలుగ, స ప్తమునులమబంపి తత్సంధిఁ జేసి, వేల్పుఱేఁడొక్క వెంట న వ్విప్రుఁజంపె. (మార్క. 1. 11 9.)

10. స్థలము, చోటు

క. ఇవ్విధమున ఘోరంబగు, న వ్విపినాంతరము సొచ్చి యరుగఁగఁ గాముల్, గ్రొవ్వున గ్రోఁగుచు నాతని, వెవ్వెంటన్ దామెయగుచు నెగురుచుఁ బట్టెన్. ద్వా 8. 101

క. కావున వివేకహీనుల, క్రోవం బోవలదు వారి తోడిచెలిమి దా, నేవెంటనైన నాపద, గావింపక పోదు సుమతిఃలితుల కైనన్ కేయూర 3.283

అవ్య. క్రి. 1 అవిలంబముగా

ఉ. వంచనవేల్పుచెంకి కిటు వచ్చి యుపాంతము నందు ముందటం, గంచము వెట్టుకొన్నయది కర్పురయుగ్మము మాఱువెట్ట నేతెంచుచు నున్న వాఁడు మనదేవర విష్ణుఁడు వెంట వీరి మూఁచించుటమే ల్పుధారవము చెప్పెదు వోయకమున్న శారికన్. హర 6. 125 .

క. ఆవేళ రైక్వవను వను,ధావరు లాంగిరసుచే యథాసముచితపూజావిధులు వడసి వందితులై వెంటం జనిరి దివికి నఘగిరి పలికిన్. వరాహ 2 9.

2. వెంబడి.

ఆ. మౌనులచట వారి మార్గంబుఁ గానక, వెదకి వెదకి యల్లవిపినభూమి, పాపటయును బోలెఁ బాపట్టు వొక తప్పుత్రోవవెంట వంటిపోవు చవం (వాల్మి 2 82)

చ. అరసెదఁగాక యివ్వడుగు నాగడ మంచు వసించె వంగణాం,తరమున గోడమాటువడి దఱుఁ దెలుంగకయుండె వాని సుం,దరి వని వెంట వ ద్దెనకుఁ దాఁ జనుదేర నిజేచ్ఛనాత్మ మం,దిరమునుండి యావెలఁదిదిక్కునకుం జని యంత దఱుఁడున్ కేయూర 2 23

**వెంటఁబట్టు** అ క్రి (వెంటన్+పట్టు) వెనుకకుఁ బోవు

క త దవసరంబున బోదులు, పదివేవురు వెంటఁ బెట్టి కాగై రాఁగాఁ, బోదివెలువడి రథ్యం బులఁ, గదలించిరి ఘనరోమకదశిరోముల్ కకు 5 156.

**వెంటఁబడు** వ క్రి. 1 వెంబడించు.

క. మింటనిక వేల్పు మిక్కిలి,కంటిసెకన్ నొచ్చి పుట్టుగావక నోఁకున్, వెంటఁబడి మరుఁడు వాలుం,గంటీ రాఁ దగునె యెంతగండము గఠ చెన్ యయా. 5, 138

చ. ... అ,మరధరణీరుహప్రసవమాల్యసుగంధభరా నుయాతబం,భరనికరంబు వెంటఁబడి బంట్ల తెఱంగున వంటి కొల్వఁగన్. జాహ్నవి 1 128

2. తఱుము, తొందరపెట్టు.

గీ. ఇట్లు వర్తింప నొక్కనాఁ డిరులు గవియు, వేళఁ గారాంతరా వేశ వెంటఁబడఁగ, నింటి వారికిఁ జెప్పక యేగెఁ జపల,మగఁడు పొరుగూరికై బుద్ధిమంతుఁ డగుట శుక 3 487.

**వెంటఁబెట్టుకొను** స క్రి కూడనుంచుకొను

మ సుగుణాంభోధుల మంత్రిపుంగవుల నచ్చోనుంచి యం చన్మతిన్, దగువారిం దన వెంటఁబెట్టుకొని రత్న స్యందనారూఢుఁడై, .. చేరె నాథునుఁడు వాల్మీకాశ్రమ స్థానమున్. ఉ. రా 7 156

**వెంటనంటు** స. క్రి (వెంటన్+అంటు) వెనుదగులు, వెంబడించు.

సీ. హాతిహాయవాహనాహంకారము హరించి వేఁడి వేలుపుజాడ వెంటనంటి ... వసు. 4 12.

మ చిరునవ్వుల్ దళుకొత్తు నెమ్మొగములన్ శ్రీచూర్ణపున్ రేఖడా, లొఱపొ తిరుగఁబడి పట్టెలుల్లసిల శిష్యుల్ వెంటనంట గ క్రి,హమనారిస్నాన బు లుప్పతిల దాసోహమ్మటం చొండొరుల్, సఁగన్ వైష్ణవులేగుదెంచి రచటన్ సౌశీల్య సంపన్నులై ఇందు 5 60.

క ... గురుతరమగు మరుచి,త,త్పరి మకముల వెంటవంటి పాయక చనుచున్ శుక 5 88

**వెంటము** వి వేడుక, కుతూహలము (చి ని, శ ర)

**వెంటాడించు** వ క్రి. 1 వెన్నాడు, వెంబడిచు.

శా. కంటింగంటి వటంచు నార్చి శతశృంగ ఞ్నాధరాగ్రంబునన్, వెంటాడించి కరాళకీల పటల శ్వేతాశ్రయార్చిశ్ఛటా, లుంటాక ప్రతి ఘాతరారుణదృగాలోకంబు సంధిల్లఁగా, లంటంద్రొక్కి బులాయదానవుని వక్షోగంబు శూలంబునన్. వరాహ 11. 111

2. త్వరపెట్టు, తఱుము.

క ఒగ్గముల ద్రవ్వివడుమని, వెగ్గడు వెనుఁ దెరల వలల నురలు మృగములన్, దగ్గటి చంపెడు వేడుక, వెగ్గలమై చిత్తమందు వెంటాడింపన్ భాగ 1. 454.

**వెంటాడు** న క్రి (వెంట+ఆడు.) వెంబడించు.

సీ. గొరవంకపై డేగఁ గొనివేయవది దానిఁ దఱుము వెంటాడి తత్తడిని నూకి, . చంద్రా 4. 99

మ హాతిమూర్ఛాంతమునన్ రథాధిపతు లాత్మానూనసూతాళినం,గతి నిందించిన వర్తితాశ్వులయి సంగ్రామంబునందే రథ,స్థితపాలిన్ తుతులై రొ ప్రాక్సమయసందృష్టధ్వజంబైన గ,ర్వితతాదృగ్రథనాయక వ్రజము నే వెంటాడి రిష్టాధ్యతన్. (రఘు 4 107)

**వెంటి** వి మెలిపెట్టిన గడ్డి, కసవుపురి చి ని, శ ర., బ్రౌ, వా.)

చ .. బుణముంగొని పెట్టక పాయద్రోచు దు,ర్జనుఁ బురివెంట్లు చుట్టి పరుషంబుఁ గొల్వఁగలేదు విభులన్. (రుక్మా. 2. 9) (ముద్రి పా వరివెంట్లు. చి ని పా)

వెంటిగొను అ. క్రి (వెంట+కొను) వెరిగొను లయగ్రాహి. గంటి వడఁ దాఁచుదు మగంటమి దలిర్పన్, వెంటగొనఁగానులిచి మింటి కెగయన్వ యిచి ... భా రా యు. 1470

వెంౘువ వి. ఒకజాతి ముంగిస, బభ్రువు

గీ వెంౘు వనఁగను బభ్రువు వెలయు వశవ అం భా 2 86.

వెండి¹ వి (క. బెళ్లి. త. వెళ్లి) రజతము, పంచ లోహములలో నొకటి (నిత్యైకవచనము)

సీ ... వెండియొద్దెనలపై వెలచి తెచ్చినపైఁడి పళ్లెంబు లాయత్తపఱుచువారు ... నైష 6. 108

సీ. వెన్నెల జరియుద్ద వెండిలీఁగెలఁబోలు యజ్ఞో పవీతంబు లలుత నమర.. విక్ర 7. 148.

గీ. ... వెండిమీ లెక్కు వెంౘుకవిల్లు వోలె ఆము. 4. 177

(ఇయ్యది విశేషణముగాఁ గూడఁ జెప్పనగును ఉదా. వెండిగిన్నె.)

వెండి² అవ్య 1. పునరర్థకము, మఱి (ఇది "ఉను" వర్ణకాంతము నగును)

క. మాయయ్యకుఁ జాయక పని,సేయుచు దీవించి ప్రియము సేయుచుమందున్, మీయయ్యే వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు వానయు లేదే. భార. ఆది 3. 137.

క. మందెడు బలు నారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్, వెండి ప్రయో జన మేదీ, రండాసుత! దీనిపై శరము నిగి డింపన్. హర 7. 54.

ఆ. వెండియొక్క పండు విప్రుఁ డెప్పుడొ తెచ్చి, తనకు, నీక యమ్మకొనిరొ ననుచు. విక్ర 8 20.

క. పాండవహితుఁడగు విదురుఁడు, వెండియు జను దెంచి, కార్య విధులందు సహాయుండయ్యె జతవితోద హితుండయి మంతనము సేయఁ దొడఁగె న్వితుఁడున్ భార. అర 1. 72.

2. అనంతరార్థకము, పిమ్మట.

గీ. అట్లు కావున నవ్విబుధారిఁ దునిమి, వెండి చనుము తపంబుగావించు పనికి. హరి. పూ. 2. 25.

ఉ ... విము క్తికవ్యక్తన్, డాసెద నంచు నెమ్మన మునం గ్రమదంబు వహించి వెండియున్ విక్ర. 2. 189

చ ఒకమరి బుద్ధిగింప విలయోదకముల్ పయి కుబ్బి చిప్ప ప్రచ్ఛన్ని మహోగ్రపిథిఁ జన సూకరతన్ మెయి వెంచి వెండి క్రింది,దిక్కిఁ గయి వ్రాలు తత్పలిలనిర్గలధార ... ఆము. 4 21.

క. పడఁతికిఁ గన్యాధరమ్మం, బెడలినఁ గొఱయగునె వెండి యెవ్వతికైనం, గడిపోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁడగువాఁ డమోఘ వివేకా. భోజరా. 4. 224.

3. కింత్వర్థకము, ఇఁక నేమన్న

సీ.. గీ .. సోమయాజుల మెన్ని మాలామ శ్వపచభగకులుల మెన్ని మారులుగామపాము గాములను నెన్నిమాఱులుగాము వెండి, కంస రిపుభక్తుల మొకందెకాముగాని ఆము. 6 61

వెండిక అవ్య. పునరర్థకము, మఱి

ఉ వెక్కడి రూపులున్ విఱిగి వెండిక వెండిక వ్రాలు రూపులున్ ... కు సం 11. 699.

వెండికొండ వి (వెండి+కొండ) కైలాస పర్వతము, రజతశైలము

సీ... ధవళకేతన రుచులఁ, ఛత్రముల రుచులఁ, జామరంబులరుచు లొక్కసారినిగిడ,కొండుకావి వెండికొండపై నిండ నా ప్రచండభుజదండుఁ డాతఁడు దండు విడిసె. ఉ రా. 2 331

ఉ...తురంగ వాహుఁడై, సంగతివేగ విత్తపతి శంకరు కొండకు వెండికొండకున్. వీర. 3. 33.

వెండిగుండు వి (వెండి+గుండు) 1. కైలాస పర్వ తము, రజతశైలము. (శ ర) 2. వెండి గుండు వలె మండుటచే కుక్క కియ్యఁబడిన పేరు.

ఉ. పులియఁడు బూచిగాఁ దనురపోతులరా జమ మంతిగాఁడు చెంగలువసివంగి భైరవుఁడు గ తెరసంపఁగి వెండిగుండు మల్లెలగుది . . మమచ. 4 82.

సీ ... విష్ణుప్రసాదంబు వెండిగుంతుల పరిష్కచ్చి మిరెము వెట్టిపుచ్చకాయ ... పిం.శకుం. 1. 108,

3 వి. ధాన్యవిశేషము.

వ. రాయమెచ్చులు యేరుమల్లెలు మునిమనోహరాలు వెండి గుండ్లు బొంత మడములు కూటికుప్పలు కాటు నంపెఁగలు .. ప్రబంధ 112.

**వెండిగుబ్బలి** వి (వెండి+గుబ్బలి) రజతాచలము, కైలాసము.

సీ వెండిగుబ్బలిపై వేడ్క విడుకొల్పి, మేరు నగరాజుపైఁ జాల మెచ్చువదలి . భీమ 6 11

సీ. ... విన్నుఁగ్రొమ్ముడివాఁడు వెండిగుబ్బలిగూడె మేలువాఁ డుడివోని మేలువాఁడు .. అచ్చ రా. బాల. 13.

**వెండిఁడు** వి. సూత్రధారుఁడు, బొమ్మలాడించువాఁడు

ద్వి. ప్రకటిత కపటనాటకసూత్రములను, విశ్వతి ప్రకృతు లార్పు వెండిఁడు నతఁడ. బస పు. 4 70.

**వెంట్రుక** వి 1 కేశము, శిరోరుహము.

సీ. కలికువెంట్రుకలలోఁ బఱచు మందాకిని సుకుమారదేహంబు గ్రుక్కఁబాఱ .. హర 7.79.

సీ ... జుంజువెంట్రుక లెత్తి చుట్టవలేదెఁగవన్న గాధీశ్వరు వగిది మెఱయ. విక్ర. 2 128.

ఉ ... ఎలదేఁటి దాఁటులన్, బమ్మెరవోవఁ దోలుఁ దెగబారెడువెంట్రుకలు,...మనుచ.3 6.

సీ ... వెంట్రుక నెఱినెఱక నాఁగఁ దనరుఁ గేశము ... (అం భా 2. 145)

2 రోమము

ఉ తంత్రులు మీరు మీకు నయతత్వముఁ జెప్పెద మన్న మమ్ము చే,మంత్రు జనంబులూఱడు బృహస్పతి మీయెడనేమి లేవిచో, వెంట్రుక యంతమోసమును వేచి దురంబున కెత్తివచ్చునా, పౌంత్రుఁడు . ఉ. హరి. 2 101

నిడువెంట్రుకవెట్టు = అ క్రి జలదరించుట.

క గడగడవడఁకెడు మేన,న్నిడువెంట్రుకవెట్ట నెదుర నిదుర జలింపన్, మెడమడచు నావులించుం, దడఁబడుఁ బడఁబోవు నిలుచు ధరఁ గూర్చుండున్. (ఉ హరి 6. 96.)

**వెంట్రుకవిల్లు** వి. వా. గుజ్జువుతోఁక వెంట్రుకలతోఁ గట్టిన ధనురాకారమగు వాద్యవిశేషము. (దీనిని ఆ సరివాంద్రు వాయి తురు, దీనిని 'కామాచి' అందురు)

గీ. వృష్టితటి నిడ్డ జెనఁగ్రావఁ గ్రిందినుండి, తేట నదినీటఁ దనవెంటఁ దేలు మీల, తళుకుతో నాఁచులత దోఁచె వెలికి జమిఁ, వెండిమీ లెక్కు వెంట్రుకవిల్లువోలె ఆము 4 177

**వెందగు(వు)లు** న క్రి (వెన్ను+తగులు.) అనుగమించు, వెంటనంటు

ద్వి. అచ్చుగ నిటురాఁగ నతఁడు వెదంగిలి, వచ్చుచు నింగలకు వసుధేశ వినుము రం రా బాల 12 పా. 2 పం

ద్వి. తలలు వీడఁగ నాయుధంబులు విడిచి, వల నేది పాఱెడువారి వెందవిలి, సటుశిలీ ముఖముల పాలు సేయుచును రం, రా ఉ 16 పా. 7. పం

**వెందు** వి తమకు వశపడుటకై తుమ్మెదలు మధ్యనుంచి పాడెడు పురుగు

చ. చెవుడు పడంగ నల్లడలఁ జేరుచు నన్నొకవెందు చేసి మీ, రివియవియంచు బుజ్జనములిన్నియు నెన్నఁగ వేల .. కు సం 8 676.

**వెంపర** వి 1 పీడనము 2 హింస 3. భేదనము (శ ర) (చూ. వెంపరలాడు)

**వెంపరచేయు** దే న క్రి హింసించు

సీ పాదంబు లిసుకలోఁ బాతి వెంపరసేసి పటుసాయకముల పాల్పఱుత మనుచు దశకు 2.71.

**వెంపరలాడు** న. క్రి (వెంపరలు+ఆడు) 1.భేదించు

వ తామరల పరంపరల వెంపరలాడి తుండంబుల తండంబులు పొడవులెత్తి భూత్కారంబులుచేసి. ప్రబంధ. 1. 106.

సీ ... చెవి దార్చి విని చీమ చిటు కన్న కొకసారి నెలవి వెంపరలాడుఁ జిట్టలెల్ల ...మనుచ.4.17.

2 బాధించు, పీడించు

చ. మఱి పనిలేదె వేసరవు మాటికి నిక్కడ నుండ నోయి చే, లెఱుఁగని కూన దుర్జయనరేంద్ర శిఖామణి వీఁడె వచ్చె నే, వెఱవును లేక వేలుపుల వెంపరలాడుచు నాలకింప మా, మొఱలు తదీయధాటి నిను ముట్టఁజుమీ నిమిషంబు నిల్పినన్. వరాహ. 8, 84.

చ అని కొనియాడి చేడియ నొయ్యారపురాశినిజేసి నట్టయ,వ్వనజాచేతికిన్ బిరుసు వైవంగవచ్చుం గదయ్యొ దీని ప్రాప్పన ముదమొందు కెందలిరు గాందళవుందొర చూచువారలన్, వెనుకొని హావుటంపరల వెంపరలాడకు మన్న మానువే కుశల. 4. 154.

(వెంపరలాడు-ముద్రి. పా)

2. హింసించు.

చ. చలముననుం దావ యోగిజనసంఘము వెంపర లాడం బూని పూ,ములుకులు వింటం గూర్చు తటి ముక్కులం బిల్చి తదీయసార మ,గ్గలముగం గ్రోలంగా మమరుగాలకుల న్మరుండేయ ప్రేటుచాయల నలరెన్ బలాశముకులాం తకు లంటుకి మూంగు తుమ్మెదల్. చంద్రా. 4. 85.

చ. ... పేనలం జెక్కుతంగులన్, బొడవడంగించి మండి బలుమూంకల వెంపరలాడుచుండె . . వై. భా. 6. 177

ఉ ... పూ,వింటియతండు వన్గినిసి వెంపరలాడక ముణ్నెయల్ల వా,ల్గంటిమనోజ్ఞసంగమ సుఖస్థితి యోగతిం గల్గం జెప్పవే. రాజ. చ. 3. 77

**వెంపరులువెట్టు** వ. క్రి (వెంపరులు+పెట్టు) భేదించు.

వ. .... ఆ శత్రారి సేనానక్రాకరంబుం జొచ్చి శోధించి కలంచి కలగుండువేసి మట్టిమల్లాడి వెరంటి వెంపరులువెట్టి వచ్చిపోయినతెరువెఱుంగ రాక ... (పి. శకుం. 3. 126.)

**వెంపలి** వి బాణపుంఖ, ఒకజాతి. (వృ. వి.)

(ఇ. వెంపళ్ళు, వెంపలులు. దీనిభేదములు తెల్ల వెంపలి, ములువెంపలి మొ॥)

తే. వీరరసపారసాకారవిహరణంబు, విష్ణునకునొప్పు శతనితో విగ్రహింప, దొరకొనిన వచ్చు మనకు మద్దులు మునింగి,పాఱ వెంపళ్లు తమ కెంత బంటి యనుట. ఉ. హరి. 4. 124.

**వెంబట్టు** వి. (వెల్ల+పట్టు.) తెల్ల నిపట్టు.

క విస్టూగని మీఁదఁ గెలఁకులఁ, బట్టి సితచ్ఛద సమూహిమణియుట గడుఁ గ,న్పట్టు సరోవర లక్ష్మికిఁ, గట్టినవెంబట్టు మేలుకట్టుంబోలెన్. (కు. సం. 10. 336.)

**వెంబడి** వి (వెన్+పడి) 1 వరుస, క్రమము.

వ ... అప్పుడు తమ సుముఖాన త్రిమణి స్తంభనామ ధేయంబులు స్త్రీత్వ పురుషత్వంబుల వెంబడిన పిడ్డాటుగా సంకేతంబులు చేసికొనిరి ... కళా. 5 103

చ దినముల వెంబడిన్ జడనిధిన్ మునుగ్రోలిన నీరు ... ఆము. 4 86

2. ప్రకారము, రీతి

వ ... పిదపం జాళ్ళ వెంబడిం బంచుకొని ... మనుచ 4. 60.

ఆ. తగదు మిగుల నిచటఁ దడయంగ సంకేతి,తం బగునమయంబు దప్పకుండ, నేఁ దిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక రాఘవ 4. 19. (రామాయణార్థమున)

అవ్య్ర క్రియా 1. అనుపారముగా, వెంట.

ఉ... దంతపు మెట్లవెంబడిం, జే వడి వీణ మీటు టలు ... ఆము. 1 62

తే. అంతట వినివి యతం డాలతాంగి బిల్చి, నా తలంపు వెంబడి నీవు నడచె దనుచుం బలికె తిది యేమి చెపుమ నీ తంగు లిపుడు. కళా 6. 65

చ తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంత వంతనే, పనుపడ నిల్చి ముందటకుంజాతి కెలంకులకుం దొలంగి తా, వెనుకకు నేగు దెంచి కదువేడ్క యొనర్పంగ బంతియాడ నె,మ్మని గనకంపుంగోల నడిమింటనె ద్రిమ్మరం దారి కొట్టుచున్. ప్రభా. 2 29

తే. విప్రువెంబడిం బడి నీవు వేడ్కంజనిన ...దశకు. 3 35.

ఆ తగదు మిగుల నిచటఁ దడయంగ సంకేతి,తం బగునమయంబు దప్పకుండ, నేఁదిరిగి యరిగెద నీవు నా వెంబడి, నడువవలయుఁ దాల్మి నడల నీక. రాఘవ. 4 19. (భారతార్థమున)

సీ. ... నిద్రిశద్రుచ్ఛాయ నిలువక జరుగ వెంబడి నధ్వగపంక్తి పొంగలు వెట్టె ఆము. 2 46.

సీ... ఒకటికి వెలవియ్య మటికి చీకటి దాక బను లగాపరుల వెంబడిన పోదు. హంస. 3. 142.

**వెంబడించు** వ. క్రి (√ వెంబడి.) అనుగమించు, వెమకొను.

మహా॰స్రగ్ధర ... విదళించున్ వెంబడించున్ విను
వకనురులన్ విష్ణు డీరీతి (ద్రుంచున్. ఉ. రా.
2 838

వ . . వివిధ రాష్ట్రనివాసులు ... శ్రీరాముని
వెంబడించిరి .. ఉ రా. 8 268

**వెంబడు** అ క్రి (వెన్+పడు) 1. వెంబడించు.

చ జవవరమౌళి కొంతవడి సాహిణి నివ్వెఱగంది
చూడఁగో, డవ రవగాలు చూపుచు హుటా
హుటినేగి పరాకు వీరు వీ, ం ని తముఁ దెల్ప
నందఱు రయంబున వెంబడవాగె న్లెయ్యె.
య్యనఁ గనుమూసి కన్దెఱచునంతటిలో ముని
సీమఁ జేంగన్ (కువల 2 58)

2. కామించు, వలచు.

సీ ... పరకళత్రముల వెంబడఁ దలంచినవాఁడ
ప్రజ్ఞా విలాసంబు వదటఁగలదె శివరా.
3 62

**వెంబర** విశ 1. దుష్టుఁడు, దుష్టము

చ కలిగినవానిఁ బ్రాఁబలుకుఁగమ్మని యార్పుల
వాని యెందు నే,వెలుఁగును గాని పెన్వెలుఁగు
వెంబడినిం జనువాని నంతటన్, వెలసిన వానిని
న్గనని వెంబరపుట్టువు జాతిపుట్టువుం,బలె గతి
గానలేదు యతిమానస హంసక కంసహింసకా
పాండు 2 71

౨ అవివేకి, మూఢుఁడు

ద్వి. అమృతంబు గుక్కిల కందిచ్చి పులిసి, నంబలిఁ
ద్రావఁగా వాలించునట్టి, వెంబర గాని వివేకిగా
డెందు. ప్రభులింగ 3 ఆ 92 పా 10 పం

**వెంబరవిత్తు** విశ (వెంబర+విత్తు) మూఢాగ్రేస
రుఁడు.

మ మరుత్కూ రాత్రుభయా ప్తిఁ గుంజము సారన్
మత్తాళిమల్లాలిదు, స్తరహల్లోలాలిబద్ద మందదర
సంతాపించి చూతంబు డా,య ఁటల్కోకిల
పఙ్క్తి వలాడ వెతనేయన్ నిల్వ శంకించి వెం,బర
విత్తై వలువంకల మ్మని వరాపస్మారలోలా
త్ముఁడై సమీర. 3 233

**వెకలి** విశ. (సం. వికలః) 1. మూఢుఁడు

ద్వి. సకలోన్నతుండనై సడిగన్న నన్ను, వెకలియై
తమతండ్రి వెడలంగఁ ద్రోవ, యతి హీన
సత్త్వుఁడై యడవులలోన, బతిమాలి ఫలములం
బర్ణాశనముల, వికృతాంగుఁడై తపోవృత్తిమై
నున్న, ఁబక పేదమానవుఁడోవునే చెవక.
రం రా. సుం. 251 పా. 14. పం

సీ. వీథిలోఁ బొడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై
వలుమాలు వెక్కిరించు . . ఉ రా 7 828

సీ పట్టు పాటు మటంచుఁ బారావతంబును వెక
లినై నే నేల విడువఁబోతి ... సారంగ 2 145.

2 ఉన్మత్తుఁడు

సీ ... వెకలియై తిరుగ నేవేళను రతికేళి కళలు
దేరెడు మోము కళలుదేరె ... ప్రబం 1.755.

3 ఆసక్తురాలు, ఆసక్తము

గీ. ... వనిత చిన్నారి పొన్నారి తయసువాని,
విప్రవందనుఁ గన్నంత వెకలియగుచు. పాండు.
8 62.

సీ ... తిలఁ గర్పూరతాంబూల మర్పణఁజేసె
వెకలి మాటలతోడి యొక విసాళి ప్రబోధ.
5. 59

వ .. పుహాప్ళ మస్పతిల్లు సత్తావులకు వెకలులై
యాడు మొకరితుమ్మెదలు . మనుచ. 3.28.

4 అర్థము లేనిది.

సీ... వేడుక కైవను వెకలి నవ్వులు మీఁఱ నటనఁ
జూపట్టఁ బల్కుటయు లేక . వాల్మీకి. 1.33.

వి. వెట్టిది, అర్థము కానిది.

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుగో డెతవంబు
తోడఁ, గన్నిచ్చకు వచ్చుచేడియల నెచ్చరి
కించుచు ధూర్తకోటితో, మచ్చరికించుచున్
వెకలి మాటలు మాయపుఁ గూచిమారవుం,
బచ్చలు చూచుచున్ సెలవి పాటఁగ నవ్వుచుఁ
గేకరించుచున్ విక్ర 8 8

**వెకలితనము** వి (వెకలి+తనము) అవివేకము,
మూఢత్వము.

చ. అకట తదీయసత్కళల నాదటఁ గన్గొని మెచ్చి
పాతితో,పికముగ నిచ్చు సెమ్మనము చేడియలో
మరలంగవచ్చునే, వెకలితనంబుచే నిటుల
వేదనఁబొందఁగ నంచు నెచ్చెలుల్, పకపకనవ్వి
కేరడపుఁ బల్కులు పల్కఁగ నెట్టకేలకున్.
చంద్రా 2 145

**వెకలిపడు** అ. క్రి (వెకలి+పడు) అవివేకము నొందు.

క ఒక చెలిపై భ్రమపడి యా, సకి పిలువకయున్న మోహసంగతమతియై, వెకలిపడుచుంటి వదియు న్నమకురున్ వగవంగవలదు మనుజాధీశా. (పాండురం. 5. 148)

**వెకిరింత** వి. వెక్కిరించుట.

క. ... దీపము లేనింతుల్ సుఖలోపము లవి చీఁకటింటిలో వెకిరింతల్. (వైజ. 3. 26)

**వెక్క** వి. వేఁడిమి.

క. అక్కెండ యీరెలుంగై, చెక్కులు చెమరించి నెఱులు చిక్కులువడి కాళ్లొక్కి వసివాడి యూర్పుల, వెక్కం గెమ్మోవి కమలి వికలాంగముతోన్. పారంగ 3 242

సీ. తరుణరంభాగర్భదళతాళవృంతంబుపై గాలి వెక్కన పలుకఁబాజె .. నైష 2. 119.

అ వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చన యన నుష్ణ నంజ్ఞదగు .. (ఆం భా. 1 83.)

**వెక్కఁబెట్టు** స. క్రి (వెక్కన్+పెట్టు.) పైకి నిగుడించు.

తే వెట్టనీ రామకథమున వెడలునట్టిఁ, చౌక్కుఁ బోఁ దట్టి యొకకన్ను వెక్కఁబెట్టి, దడిగఱవఁ బోవు వేఁపిచందమునఁబట్టి, వరుసమెచ్చఁగ మారుజప్రముఖుఁ బలికె శుక. 3. 82.

**వెక్కలి** = వెకలి

ద్వి ... అ విప్రుఁ,కడఁ గూడి చదువు వెక్కలి బ్రహ్మచారు,లు . నవ. 2. భా (శ ర)

**వెక్కసపడు** అ క్రి (వెక్కసము+పడు)

1. సహింపలేనిస్థితి నొందు

క. ఎక్కడివెలుఁ గిది యివ్విభుఁ, డొక్కఁడ యిటు చొచ్చెనెట్లొకో తెఱ గనుచున్, వెక్కసపడియెదు మా కతఁ, డొక్క ముహూర్తమున మగుడ నొయ్యనఁదోచెన్ హరి ఉ 5 87.

వ. ఇవ్విధంబున విరోధివర్గం బుక్కుడక్కి వెక్కసపడి చూచుచుండ .. భార. విరా 5. 2.

తే. ... ఓకాంత, యిచటికసోకభుజబల, లాఢ్యుఁ, డొకరాజు వచ్చి నీయాత్మభవునిఁ, దునిమె నెఱుఁగ మతండు వోయినపథంబు.

క ఇక్కరణిఁ జెప్పినన్ విని,వెక్కసపడి వనము నందు విహరింపఁగ . . భా రా. అర 1.131.

2. వింతపడు, ఆశ్చర్యపడు

ఉ. కయ్యము గల్గినట్లయిన గంధగజప్రకరంబు కుంభముల్, వ్రయ్యఁదురంగ పంక్తులుధరం బడఁ దేరిగముల్ బడల్పడన్, దయ్యమికీవు వెక్కసపడన్ గదపందువు సేయునాకు ... (భార. ఉద్యో 3. 67)

ద్వి మ్రొక్కుచులోకంబు వెక్కసపడఁగ .. బస పురా. 184 పొ. 11. పం.

**వెక్కసపాటు** వి (√ వెక్కసపడు) సహింపలేని స్థితి నొందుట

ఉ వెక్కసపాటు భీతియును విహ్వలభావము నొంది యిట్లనున్ ... భార విరా. 5 112.

మ. ... ఈ,రసతో నొంచుఁ బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ దాఁకు వె,క్కస పాటొందఁగ వ్రచ్చుఁ జించుఁ బొడుచున్ గారించుఁ దూలించు ... భా రా యు.1974.

ద్వి. అక్కటా యిది యెంతయన్యాయ మనుచు, వెక్కసపాటున విధిని దిట్టుచును, నరపతి దూషించి నాతి నిందించి, పురమార్గమున వారు పోయి రా ప్రొద్దు ద్వి. శ సా. 2. 835. పం.

**వెక్కసమందు** అ క్రి (వెక్కసము+అందు.)

1 సహింపలేని స్థితినొందు

చ .. జమల్ వెఱఁగుపడంగ ఖేచరులు వెక్కసమందఁగ శత్రుకోటికిన్, వెఱపావరించు వార్త ... భార అశ్వ. 3. 157.

ద్వి. ఎఱిఁగి యాకసమున కెగసి వేగమునఁ, గఱకు రక్కసులు వెక్కసమంది చూడఁ, గపులెల్ల మ్రొక్కనుత్కటసంభ్రమమునఁ, గపిరాజు వచ్చి రాఘవునకు మ్రొక్కె. రం. రా. యు. 389. పొ. 29 పం.

ఉ. చెక్కిటఁ జేయిచేర్చుకొని చింతిలు మన్సురటంచుఁ జావులన్, వెక్కసముందు లేమతొలవిం బొడఁగట్టినయట్లు నుఁడఁగా, నక్కునఁ జేర్పఁ బోవు భ్రమమంది వెనం దల యూచునంతలోఁ, బక్కునవవ్వు నింలిపయి జాలి నృపాలకమౌళి ఖన్నతన్. హంస. 1. 72.

2 ఆశ్చర్యపడు

ఉ. ఎక్కడనుండి యొక్కడకు నేఁగెడినో యిది యొక్క కాంతరూ,పెక్కుడు పెంపు సొంపు మన కేర్పడుచున్నది దా వినీతయై, ప్రుక్కుచు వీచళామిమల చొప్పునఁ బల్కెడుఁ జౌరులుం గడున్, వెక్కసమంది చూచెదరు వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. (భార విరా 1. 308)

ద్వి వెక్కసంబందంగ వేయిమాడలును, జక్కఁగ నెన్నితిఁ జౌకముల్ ద్రోచి బస. పురా 120 పొ 10 పం

**వెక్కసము** వి. సహింపరానిస్థితి, దుస్సహత్వము

క ఇక్కైవడి రక్కసునకు వెక్కసమునఁ దొడరు జముని వీరభటులతో, నుక్కున మార్కొని పోరఁగ, నొక్కరుఁడుం గలుగఁ డసురయోధులలోనన్. ఉ. రా. 3. 336.

2. లోకువ, చులకన.

క. మనసిచ్చినఁ దన కోడరు, చనువిచ్చినఁ బ్రజలు వెక్కసము సేయుదురౌ,టను పతి మనసీయక కడుఁ, జనువీయక మెలపవలయు సమ్ముఖచరులన్. కవిక 2. 18.

3. వింత, ఆశ్చర్యము. (చూ. వెక్కసపడు.)

4 అధికము

ద్వి అక్కఱ గండఁడై యపుటప్పటికి, వెక్కసంబున మూర్ల వేలు నపిపించి... ద్వి హరిశ్చ ఉ 478 పం.

5. బ. దుస్సహవచనములు.

ద్వి. నేడు నీకల్ల నానిజము, గానక యేల వెక్కసము లాడెదవు ద్వి. సారం. 1 32 పొ 17 పం.

విశ. 1. దుస్సహము.

సీ. ... రాధేయబాహులే యాతితేయజులకు వెక్కసం బెవ్వని విక్రమంబు ... వి. పు 1.46.

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి వెక్కసం బయి తోఁప వెఱఁగుపాటు ... కళా. 7. 68.

2. దుర్లభము.

ఆ. తేమకాదుతై న దానవు లీలాళ,నవములో నున్న వారు దీనిఁ, జొచ్చి వాసవాది సురగణంబుల కైన, వెక్కసంబు బ్రదికి వెడలి చనుట. (వి. పు 7.194)

3. మిక్కుటము, అధికము.

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల గోల్చిన భంగి నేడ్చిన,బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్ద యెలుంగున వెక్కివెక్కి వెక్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరుసోనలై, యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగన్. కాశీ. 5 167.

మ రసికుండౌ రఘునాథ కీర్తిసతి యౌరా! తొల్త వాగ్బంధముల్, రసవాదంబును రాజవశ్యవిధి నేరంబోలుఁ గాకున్న వెక్కసపుం బ్రౌఢి వహించి శేషఫణిమూఁగంజేయఁ దారాద్రి నుల్లసముల్వ్రాల్కఁగ ఛత్రచామర మహోలత్కుల్గనన్ శక్యమే విజ పీఠి. 18.

**వెక్కసి** విశ. (వెక్కసము+ఇ) 1 దుస్సహుఁడు, దుస్సహము, దుస్సహురాలు

ఉ మక్కువ నేమఁ గేగఁ బదమా యను మా యను వెల్ల రోయు నీ,వెక్కసిచెంచు సింగములవేఁటల వేఁటలలిఁ బ్రుంచుచున్ చంద్రా. 2 50.

ఉ అంతట వొక్కనాఁ డల ధనాధిపుఁ డశ్వము వాగె వెక్కసిన్, రంతులుమీఱ నెక్కి పెను రౌతన జోడన చెల్వుఁ జూపుచున్ ... కువల. 4. 199.

గీ. ఘనుల మునులను మన్నించి ఖరులకు ఖర, దూషణుల భీమదాంబకాదులను గూల్చి, యొక్క రక్కసి వెక్కసై సొక్కుదాని, ముక్కుచెవులకుఁ గల నిక్కు చక్కుచేసి. సీతా వి 1 10.

2. హింసకురాలు, హింసకుఁడు.

మ ... తద్భావంబు ఘోరంబుగా, విని గోగోపక గోపికానికరముల్ విభ్రాంతిమై బిట్టుమేల్కని చూడం బనుదెంచి రర్భకుల కెల్లన్ వెక్కసిన్. రక్కసిన్ వి. పు. 7 120

**వెక్కసించు** అ క్రి. (√ వెక్కసము) 1. అధికము గఁగనుపడు (దుస్సహమగు, అని శ. ర.)

సీ ... ఆ నాకు వెక్కసించు నా యామపైశ్వర్యశ్రీ మింతఁ బరులకైన నేమిచెప్ప, .. కవిక. 5.9

2. అతిశయించు

మయూరసారి వృత్తము వెక్కసించె శైలవిక్ర మంబు లోఎక్కి రేఫజంబులుగ్రగంబుల్ చక్కఁగా మయూరసారికొప్పున్, నిక్క మంబు జాతవేత్ర శారి అప్పక. 4. 171 211 పా.

**వెక్కించు** స. క్రి. (√ వెక్కు.) ఉబ్బించు, స్థూలము కావించు.

ద్వి. తొలుకోడి కనువిచ్చి నిలిచి మై వెంచి, ... ముక్కున నీకెలు జక్కొలిపి కడుపు, వెక్కించి మెడ సాచి నిక్కి మిన్నూచి. పండితా పురా. 88. పా.

**వెక్కిరించు** స క్రి (సం. వికృ) అపహాస్యముచేయు.

ఉ. ... నిన్నఁబుట్టి శా, నెన్నఁడు బ్రాంతియయ్యె మతిదొన్నఁడు నేర్చెను వెక్కిరింపఁగాన్. (కు. సం. 10. 510.)

, చెలికొండ యొకనిచే నిచ్చి తలమున్న, కొండ దొంతి కుదురుకొన సమర్చి, మగుడ నడుగ వాఁడు నగచరుల్ నగ వానిఁ, గిక్కురించి పోయి వెక్కిరించు. భా. రా. యు 267.

గీ. వీథిలోఁ బొడగన్న వృద్ధుల నరికట్టి వెకలియై పలుమారు వెక్కిరించు. ఉ రా 7. 32.

అ. క్రి. 1 వికారచేష్టలుచేయు

సీ. కనుఁగొని తత్పురోగమ భూమిరుహశాఖ లెక్కి యూఁచుచుఁ జాల వెక్కిరించు ... భాగ 10. స్కం. ఉత్త. 544.

సీ. ... తే. వెట్టి యనరాదు పైఁబడి వెక్కిరించు, గామి దనరాదు మొగమున గంటు వెట్టు శుక 3. 21.

2. ఇతరుల వేషభాషా చేష్టల ననుకరించుచు హాస్యము కావించు.

చ. ... తెలిలో కథచొప్పున బొమ్మలాడఁగా, నొకకడ హాస్యపుం బ్రతిమ లుండనె పెక్కులు వెక్కిరించుచున్ అని. 1 12.

**వెక్కిరింత** వి (√ వెక్కిరించు). (శ. ర) (చూ. వెక్కిరింతలాడు)

**వెక్కిరింతలాడు** స క్రి (వెక్కిరింతలు+ఆడు) ఎగతాళిచేయు, పరిహసించు.

సీ అలదుర్గ యెక్కిరింతల వెక్కిరింతలాడెడు రీతి నాలుకల్ వెడలఁ జాచు ... కవిరా 2 83.

**వెక్కిలి**=ఎక్కిలి (సం హిక్కా త విక్కమ్)

బ. వెక్కిళ్లు

సీ గీ .. తనరారు హిక్కకు నామ మగుచు, వెక్కసంగ వెక్కిలి యన వేదవేద్య. ఆం. భా. 1 140.

**వెక్కు** అ క్రి (సం హిక్కా. త వెక్కమ్.)

1. వెక్కిలి విడుచు, ఎక్కిళ్లు విడుచు. ?

వ ... మోపెట్ట నశక్యంబయిన ముక్కుపెడి వెక్కిన వారలం జూచి... భార. ఆది. 7 178

సీ చివు రెల్లఁగని నొత్తి తొవరాకు గుత్తుక డెక్కొని కోయిల వెక్కుచుండు ... కు. సం 5. 641

ద్వి. అక్కిలి పరపక యరగన్ను గొనక, వెక్కక పీఁగక వెడగురు వడక ... పండితా. దీక్షా. 61 పా

2 ఏడ్చునపుడు వెక్కిలి ధ్వనివలె ధ్వనించు.

క. ద్రోవదియు సుభద్రయు శోకావేశం బదర మోము లశ్రులఁ దోఁగం గా వెక్కి వెక్కి యేడ్చిరి. భార. ఆశ్ర. 1. 163.

ఆ. మిక్కుటంపు జాలిఁ బెక్కు దెఱంగుల, వెక్కి వెక్కి యేడ్చి స్రుక్కి సొక్కి, పొలసుదిండి తీర్పరులు బుజ్జగింప న,తండు గొంతదిట మెదం గుదిర్చె. అ. రా యు 361.

3. వెగచు, దుఃఖించు, రోదనధ్వనిచేయు

క ఒక్కంతకాలము వారిని, నెక్కువయగు కాలము వారి నెనయుదు రోలిం, దక్కువ కులజునిఁ గవియన్, వెక్కుదు రిత్పులను గొలది వేశ్యలు జగతిన్ విజ్ఞా ప్రా. కాం. 115.

క ఒక్కతె భయశోకంబుల, వెక్కుచు మెయిఁగల విలాసవిభ్రమలక్ష్మిల్, ధక్కుటయుమ నొక యొలపైఁ, నెక్కొన ధరణీశునెదుర నిలిచి వినీతిన్. (మనుచ 4. 69)

ఉ. ... ఎక్కడఁ బొచ్చువాఁడ వీఁక నెవ్వరిఁ జంపిననేమి యంచుఁ దా, వెక్కుచు లక్ష్మ ణుండు పలవింపఁగ ... దశా 8 140

వి. వెక్కిలి, వెక్కిలి. బ వెక్కిళ్లు.

తే. ... ఊర్పు లెడతెగుc గన్నుల నొందు వికృతి వెక్కు పుట్టును నాలుక వెగడు గదురు. మార్కం. 84.

సీ. కోరకతతులపై జేరి యాసక్తిచే నవి పీల్చి యాపోవ కవలికేcగి, కుసుమ మొక్కటి యబ్బె వెన మూcగి మధువాన వక్కెండు టమ జేసి వెక్కు పుట్ట, నించుకించుక త్రాగ చంచువు పద నొంద నా తృప్తిc గ్రోలcబోవందు లేమి, (భోజసుతా. 3 22)

సీ. వెక్కులు పెక్కులై వెతలc బెట్టుచునుండు శ్వాసంబుc బుట్టుచు గాసిc బెట్టు ... శివధర్మో. 6. 47.

విశే. సన్నద్ధము, సిద్ధపఱుపcబడినది

ఉ. కేవల వేటకాండ్రు దమకింపగ డింపల వెక్కు బాకులం, బోవుచుమాంస ఖేదమువి బోనము లాయితమైనదాcక నా,యావిధు లాచరించి యవి యన్నియు చేవరకెక్కు నట్టి సం,భావన సేసి తారు మఱి బంతులు సాగి భుజించుచుండcగన్. కకు. 1. 117.

అ. క్రి ఎక్కు. రూ. (సం. హిక్కా) 1. వెక్కిళ్లు విడుచుట. 2 ఏడ్చునపుడు ఎక్కిళ్లవలె ధ్వని చేయు.

తే. వేcడియశ్రులు నిగుడంగ వెక్కివెక్కి యేడ్వcదొడcగె లతాంగి. .... శృం. నై. 4 87,

**వెక్కిమీఱు** క్రి. (వెక్కు+మీఱు) వెక్కిలి విడుచు, వెక్కు.

చ. వివశత నొంది మేను విడువెంద్రుక వెట్టcగ వెక్కు మీఱ కన్గవc దెఱవంగ రాక పొరిc గంపము నొందుచు నిశ్వసించుచున్ ... హరి. ఉ. 8. 110,

**వెక్కురు** విశే (√ వెక్కు సం. వికారీ.) వికారము గలవాcడు, వికృతము.

క. ఎక్కడి సుతు లెక్కడి సతు, లెక్కడి సంపదలు మాయ లిన్నియు ధర్మం, బొక్కటి నిజమని యెఱుcగని, వెక్కురులకు సుకృతి భోగ విభవములగలదే. కుచేల. 1 62.

ద్వి. కథcగి పేథడవులc గాయపం చేరి, కుడిచి వర్తించు వెక్కురు తాపసులకుc, బొడల కళా సంబో బూదిబొక్కణమొ, జడలో రుద్రాక్షలో నంపదలేల్? హరిశ్చ పూర్వ. 1484.

క చొక్కపుc గక్కసికులమున, వెక్కురు జన్మించి వాcడు విష్ణునియందున్, నిక్కపు మక్కువ విడువం, డెక్కడి సుతుc గంటి రాజశేఖర వెట్టిన్ భాగ 7. 254

క నిక్కము మొనలిపి రెండవ, యక్కరమున కరిగ్రహంబు నందుండిన యా, వెక్కురు కల్పం బొడయనిc, జిక్కువడcగc (?) దేయుc బగరచే ణభూమిన్. అప్పక. 1 348.

సీ వెక్కురు నాcగను వికృతcబు విలసిల్లు . . అం. భా 1 182

**వెగచు** అ. క్రి. ఏడ్చునపుడు వెక్కిలివలె ధ్వనించు.

ఆ విడువవయ్య తండ్రి తడయక వచ్చెద, వీcడె నన్నుc జూచి వెగచివెగచి, కొడుకువద్ద వెగడువడి యేడ్చుచున్నాcడు . మార్కం. 1 215.

ద్వి వెడలు నిట్టూర్పులు వెగచుకుత్తికయు, బడలిన మేనును బగిలినమోము. ద్వి హరిశ్చ. 2083. పం

క. వగచిన చిత్తము వలcదురి ... వెగచిన కంఠ మునుడుగక, నెగసిన నిశ్వాసతతియు నీరజ ముఖకిన్ కు సం. 5. 587.

2. వెక్కు, ఏడ్చు.

సీ. కాటుక నెఱయంగc గన్నులు నులుముచు వెడలు కన్నీటితో వెగచువాని . భాగ 10 372

**వెగటు** వి రోcత, వైరస్యము

సీ విబుధ ధామముమీcద వెగటుగల్గినcగాని వన జారి మిముcజేరి చెనక వెఱచు కువల 2 15

సీ. భవ్యకలవిక పాదప పరిష్కృతాత్మీయ విపిన ఖేలనముల వెగటుcబూన్చి... హరిశ్చ నల 2. 18

ఆ పరుల పంచc జేరి బ్రతికి పలా వృత్తిమెత్త లంగు కోకిలమ్ము నకుc బొ,సంగుcగాక యింటc జక్కెరద్దినిమని, వెగటు చిలుక నీకుc దగునె చిలుక, రసిక. 4 172.

విశే. అనిష్టము,

తే .. మగుడఁ జదువుఁ డెవ్వఁడలఁచె.

క. తలఁచి యదియవు డొకింతయుఁ, దొలుతటి తరువాయి మఱియుఁ దోఁచక మఱియ,వ్వల వరసివ శ్రుతిశబ్దము, వలుకునకున్ రాక వెగడు వఱచినఁ గలఁకన్. పర. 1 118

2 తడఁబడఁ జేయు, విశ్రాంతి నొందించు

తే ఇట్లు గృహరాజి కేలి తా నేకరత్న, వివిధ రుచి వైభవంబులు వెగడు వఱప . వసు 4 78

**వెగడొందు = వెగడందు** అ క్రి (వెగడు + ఒందు)

1. తల్లడపడు, చలించు

సీ విబుధారి కినుకకు వెగడొంది తెఱఁగువ వన రాశికరము ఘూర్ణనము నొందె .. నృసిం. 2. 107

సీ వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి వాహంబు లశ్వలు వైచుకొనియె ... విక్ర 4. 60

2. తడఁబడు

క. వగముట్టికొనినఁ జిత్తము, వెగడొందఁగ మేను గలయ ... భార విరా 2. 808

3. భయము.

క. వెగడొంది యిట్లు వలుకఁగ, వగునే ... భార విరా. 4. 66.

గీ. విఱిగి పాఱినఁ బోనీక వెన్నడించు, హలధరునిఁ జూచి వెగడొంది యబ్ధిలోన, నుఱికి . ఉ. హరి. 3. 107

**వెగవెగ** వి శీఘ్రముగా నడచుటయందగు ధ్వని కను కరణము; గబగబ.

సీ. వేగుఁ జూచెదమంచు వెగవెగఁ జనుదెంచి దూర మేఁగుచు బొదల్ దూఱువారు....కృష్ణ.3.46.

**వెగ్గము** వి. వంతము.

ద్వి ఒకతోఁటలో నితఁడున్న మాయక్క, వెక లియై తనుఁజూచి వెగ్గంబులాడి, లలితంబులైన విలాసమున్ చూపి, వలపింపఁగలదె యీ వటు వేషధారి, వని ... ద్వి పరమ. 4 886 పా.

**వెగ్గలమాడు** అ. క్రి (వెగ్గలము + ఆడు) అధికముగా వంచరించు.

ఉ. ... తరుమరంద సరస్సరవింద గోష్ఠికిన్, వెగ్గల మాడు తేంట్లు ... ఆము. 5. 122.

**వెగ్గలము** విశ (క వెగ్గళ) అధికము

ఉ వెగ్గలమైన మోపుగడు పేఁకవ యెత్తఁగఁబోయి ముందటన్, మ్రొగ్గతిలం బడెన్... వార.1 21

క. ... పెనఁ దెరల వలలనురలు మృగములన్, డగ్గఱి చంపెడువేడుక, వెగ్గలమై చిత్తమందు వెటాడింపన్. భాగ. 1 454.

క సలసలమను కలశజు వెగ్గలపుం గినుక యను నెవటఁ గల వడివడి నౌ,దలయంటి చూచు కొనియే, నిలువెదలితి నా క్షణంబ యెత్తిన క్షితిన్. పాండు. 5. 207.

సీ . గీ జలజనాభుండు కోదండ చతురుఁడగుచు, గుఱ్ఱములతోడ సారథిఁ గూలనేసి, వారెవయుఁ జక్రరక్షకద్వయముఁ దుంచి, కల్లు విల్లులుచేసి వెగ్గలము వవ్వె ఉ హరి. 3 99.

సీ బాల్యమువ నుండి యౌవన ప్రాయమైన, యవు డుఁదన భార్యయందు నయం బొకింత గావఁ డయ్యెను వేము వెగ్గలము పెరుగఁ, గలదె మాధుర్యగుణము తిక్తంబుగాక వై. భా 4.86.

**వెగ్గలించు** న క్రి (√ వెగ్గలము), త్రోసిపుచ్చు.

ఉ మన్ననచేసి మీరు బహుమానముతో ననువేలి నారు నేఁ, గన్నది తెల్పకుండిన వఘంబగుఁ గాదని వెగ్గలింప కీ, విన్నత మూలకింపుము ... సారంగ. 2. 6.

**వెగ్గలీఁడు** విశ. (వెగ్గలము + ఈఁడు.) అధికుఁడు, గొప్పవాఁడు.

సీ. అబ్ధిసంభవ యితఁడు వో తోలవాలవు విషము బుక్కిటఁ దాల్చిన వెగ్గలీఁడు ... శివ. 5.115.

(క ర సా. వెంగలీఁడు వ్యత్యస్తార్థము.)

**వెచ్చ** వి వేఁడిమి, తాపము

సీ. వలరాచరాచ వాఁడలిగాయు కమవెచ్చఁ గరఁ గిన యల కనికరవుఁ బోతు ... కుకుచ. 2 ...

చ. ... వెచ్చలం, గరికరి తాపకాంగములఁ గప్పక రొంపులు వందయాఱఁ ... ఆము 3. 47.

2 జ్వరము.

సీ ... వెక్క నా వేఁకి నా ...

మొప్పు . ఆం. భా. 2. 128.

3. కాఁక, తాపము.

చ... అ.శ్రిరాడ్విరహా భరంబున నొప్పడము వెచ్చకు కాంతి యొనరప్రవాహినీ, తరుణులు మేన దట్ట ముగఁ దాల్చిన ముత్తెపుఁ బేరులోయవన్ ఆము 2. 51.

విశ 1. ఉష్ణము, వేఁడియైనది (వృత్తియందు వికల్పముగ నిగాగమము)

ఉ. వెచ్చని కమ్మ నీ ఁడర పీడిన వేవలితోడఁ గెల్చినా,పుచ్చి తనూజలం బనవ ... భార. ఆమ 1. 299

సీ. ... గీ. తేట నలివెచ్చ నీరువఁ దీర్థమాడి .. హార 2. 107.

చ. తలి మలి వెచ్చయోగిరముఁ దియ్యని చేరులుఁ దిమ్మనంబులున్ ... ఆము. 2. 81

2. తీక్ష్ణము, అసహ్యము.

చ. వలచుట జాతిలోనఁ దలవంపగునే కదయింక దాఁచఁగాఁ, గలిగెడిదేమి నా వనుపుకాంద్రను దొల్లిఁటివారి వీథిలో,వలఁ గనివంత వెచ్చ నగు కాటున కోరిచి యన్నదమ్ములం, బిలిచిన రీతిఁ బిల్వ వలపించెఁ జమీ యతఁ డంబ జావనా. కువల. 4 181.

క్రి. విశ వేఁడిగా.

తరలము. సమరకూరలు పాండవుల్ జితశత్రులున్నత చిత్తులుత్తములు వారలతోడి వైరము ధర్మయుక్తిఁ గరంబ యుక్తము ప్రజాక్షయ కారణం బని తద్దయున్ భయమందుచున్, విమ మఁడై పడియుండె హోయని వెచ్చమార్చుచు విన్నవై భార. సభా. 2. 310.

వెచ్చఁబడు అ. క్రి. (వెచ్చన్+పడు) వేఁడి కలదగు. (వ్యవ.) స్నానమునకునీళ్లింకను వెచ్చఁబడలేదు

వెచ్చఁబెట్టు స. క్రి (వెచ్చన్+పెట్టు) వేఁడిమి కలిగించు.

(వ్యవ.) నేయి వెచ్చఁబెట్టుము.

వెచ్చకాఁడు (వెచ్చము+కాఁడు) విటుఁడు. (బ. వ.) వెచ్చకాండ్రు.

వ. . . ఈ ధనంబుల నేమి యయ్యెడు నయ్యయో,ఈ వెచ్చకాఁ డెచ్చటికేఁగిన నేమి?...నా చేసిన దురితఁబె తకాలఁబునరకంబుల మండినను దరుగునే, పడచి కుడుచు పడఁతికంటెఁ బాపిని యున్నదే యని విచారించు .. జాహ్నవీ. 4. 41

సీ . .గీ. సురల యాఁకటికూఁడు ముచ్చులకు గీఁడు, దిక్కులకుఱేఁడు వెలుఁగుల యిక్క కోఁడు, లచ్చి సైదోడు రేఁబోటి వెచ్చకాఁడు, చంద్రుఁ డలరారె సత్కళా సాంద్రుఁడగుచు. కవిజ. 3. 79

విశ మిక్కిలి వ్యయము చేయువాఁడు. (శ ర)

వెచ్చన వి వేఁడిమి, ఉష్ణము.

ఆ. వేఁడి వెచ్చ వెక్క వెట్ట వెచ్చనయన, నుష్ణసంజ్ఞ తగు .. ఆం. భా 1 47.

విశ ఉష్ణముగలది, వేడియైనది.

సీ. తొలుదొ్ల మదయాద్రి శిలఁదాఁకి తింద్రిఁచు నసిలోహమున వెచ్చనై జనించె ... ఆము. 1. 36

క్రి విశ. క్రియ. వేఁడిగా, వెచ్చగా.

ఉ ... చెలింగని వెచ్చనూర్చుచున్. ఆము 5. 39.

వెచ్చపడు అ క్రి. (వెచ్చము+పడు) వ్యయమగు.

క కడు మేటియైన దొఁచేఁ, ఒడినది మీసొమ్ము వెచ్చ పడనోపిన నీ, కడగొఁత దివ్యవచ్చున్... పరమ 5 57

ద్వి. చేతివిత్తము మున్న చెనటయై పోయె, పలు తెలంగుల వెచ్చపడి ... నవనాథ. 5. 211. పా. 19. పం.

వెచ్చపఱచు (√ వెచ్చపడు) స క్రి. వ్యయము చేయు

గీ. ... పచ్చపైకఁబు నిఁదలో వెచ్చపఱుప, నెన్ని చెప్పినమాట లింకేటి కనిన ... హరిశ్చ. 4. 199.

వెచ్చపెట్టు స క్రి. (వెచ్చ+పెట్టు) 1. వెచ్చించు, వ్యయముచేయు

క. కట్టక కుడువక యొరులకుఁ, బెట్టక తమతండ్రి కూడఁ బెట్టిన సిరిఁ ... దనయిచ్చ వెచ్చ పెట్ట దలంచెన్. విక్ర 2 163.

ద్వి పలొకో కౌసల్య యొదమున్ని యున్ని, వే. సంఖ్యధనంబు వెచ్చపెట్టెడిని ... ర. రా. అయో. 88. పా. 28. పం.

తే మాద్రి మీరు వియూడ్వేద్రాద్రిరాజు, దాన
ధారార్థ మఖిలప్రధాన నగు, వెచ్చపెట్టుటఁ
దలఁచి యోవిబుధ తటిని, తుఙ శశిమౌళి
జడలలో దాగెఁయుడు పాం డు 1 72

2 విడుచు

చ హరిపద పూజనం బొలగి యుత్సాహుఁ గొల్చు
కులాభిమానముల్, సరసుఁ వెచ్చపెట్టి హరి
చందన కీర్తులు వీటిఁబుచ్చి .. హరిశ్చ
5 92

3. చెలువు, పాడుచేయు

చ ... మాయ నింద్రియా,ధిక మతియైనవాఁడు
దన తెంపునఁ జిత్తము వెచ్చపెట్టి పాతకములఁ
గూలకున్నె ... భాగ 6 517.

4. ఉపయోగించు, అనుభవించు

శా. వలావేయును విన్నవింపఁగఁ ద్రిలోకేశా
మహేంద్రాదిది, కావలై శ్వర్యము వెచ్చపెట్టు
కొను మింకన్ సృష్టి నష్టంబగున్ .. వరాహ.
10 18

అ వలసినట్లు దివ్యవస్తువులెల్ల నా, యిచ్చవచ్చి
నట్లు వెచ్చపెట్టి. ప్రభా 1 85
("నా యిచ్చ వనుభవించి వెచ్చపెట్టి" అను
పాఠాంతరమున "వెచ్చపెట్టు=వ్యయపఱచు,
వెచ్చించు" అని యర్థము.)

**వెచ్చపోవు** అ క్రి (వెచ్చము+పోవు) 1 వ్యయ
మగు, తఱుగు

చ తన ధన మింతకంతయు వృథా వ్యయమై
నది లేదు వైష్ణవా,ర్చనలకు వెచ్చపోయినది
సర్వము ... పరమ. 4 148

సీ కళ వెచ్చపోని నిర్మల చంద్రబింబంబు పర
భృతంబంటని సగసకిసల,ము రామా
4. 64

2. నశించు, చచ్చు

ఉ. ... ఆలిని బిడ్డల న్విడిచి యాకటి చిచ్చున
వెచ్చపోవు వా,ర్లేలిక బంటు వాసి యొక
యించుక లేక కృశించువారునై, తూలె జనంబు
మీన కని దోషము దాఁకి నింద్య సన్యమై ...
కాశీ 8. 158.

**వెచ్చము** వి (వి సం. విసర్జనమ్) 1. వ్యయము.

గీ వెచ్చమన్న ద నొంటట వేఁడువాఁడ, ధీశ్వ
రుండఁట తాము పతివ్రతలఁట . కళా.
6 90

క ఈ మెటు వెచ్చము చేసిన, నామేరు మహాద్రి
యంత యర్థంబైనన్, పే మొదలికి మోసం
బగు ... విక్ర. 2 167.

క ఎచ్చోగజ ఘోటక్రియ, తచ్చ్వణ సుభట
జీవిత ద్విజనుంపూ, జోచ్చ నిజభోగముల కగు,
వెచ్చము వెచ్చంబుగాదు విత్తంబునకున్ అము
4 262

2. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సర
కుల యప్పు.

ఉ వెచ్చము పెట్టుమన్నఁ బదివేలకు నుద్దరు
వొల్లరు .... పి శకుం 1 78.

సీ బచ్చయి వెచ్చంబు లిచ్చురొక్కపు దొరదళ
వాయియై కొల్చు చిలువ తాల్చు ... అచ్చ
రా సుం. 41.

3. ఇంటి వాడకమునకుఁ గావలసిన చిల్లర సరకు

క ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములు
గొనఁగ శీఘ్రమెయిది యీ, పల్లియ సంతకుఁ
జని ... శుక. 2 183

**వెచ్చించు** స క్రి (√వెచ్చము) వ్యయపఱుచు.

సీ అశ్వగో మహిష రూప్య సువర్ణ వస్త్రంబు లెన్ని
వెచ్చించిన నేమిఫలము ... భీమ 4 82.

క ఐనను బలికార్యము తన ప్రాణము వెచ్చించి
యైన ఘటువనకుఁ జేయంగా నగు .. ప్రబోధ.
3. 69.

**వెచ్చు** అ క్రి 1 క్రాఁగు, తప్తమగు.

ఉ వెచ్చెన మిన్నఖంబు పరివీత శరార్చుల దైత్య
సైన్యముల్, విచ్చె . శకు. 2 123.

గీ . అట్లు సిద్ధుఁ డరుగ నమ్ముగ్ధ ముక్తు లిఁబొందె,
విరహవహ్నిచేత వెచ్చివెచ్చి భోజరా. 3 70.

ద్వి. పాముచే నీవు లోఁబడియున్న దు పెటింగి,
వేమాఱు శోకాగ్ని వెచ్చుచుండితిమి. ద్వి. భాగ.
2 23 పౌ.

పీ . గీ. వెచ్చెనవఁగ నంటె వనఁగను వేఁగె వనఁగఁ,
గమలె వనఁగను నేకార్థములుగ. ఆం భా,
3, 99,

2. సంతాపము నొందు, పరితపించు

క అప్పుడు వెన్నెలచేఁ గడు, వెచ్చుటలును మాన మెతలి వెడవిల్తునిచే, నొచ్చుటలును బ్రియుఁ దుచ్చుని, ముచ్చటలును విప్రలంభమునఁ జెపఁ దగున్. కావ్యా. 3. 128. వ

ఉ మచ్చిక రెట్టిగాఁగ దన మందిరమొంది యభీష్ట వస్తువుల్, నెచ్చెలు లెల్లఁ దొంది సుఖలీలఁ జరింపఁగఁ జేయఁ జేసికిన్, వెచ్చని యూరుపు ల్గింపుకొని విన్నఁదనంబును బొంది నెవ్వగన్, వెచ్చినయట్లు సజ్జనుఁడు వేలాక దుర్ఘటచేత నొచ్చునే. కేయూర. 3 274.

సీ. కుడువ వేడుక పుట్టి కడియు నోటికిఁ బోని వేదన వెడవెడ వెచ్చివెచ్చి ... వాసిష్ఠ. 1 124

3. కాలు, దగ్ధమగు.

వ ... అలాంట శోచను శోచనంబు చిమ్మిన నతం డును వెచ్చి విమ్మఁగూడెనే ... హర. 3 9.

ఉ. చిత్తజవైరి ఫాల శిఖదే జగ మెల్లను వెచ్చఁ జూచెనో, యుత్తలగంటి పట్టమునకే నిటులుండక యుండ నెవ్వఁడే, సత్తులు వెట్టెనో ... వాల్మీకి 3. 7.

4. మండు, జ్వలించు.

ద్వి. వేఁడి వేలుపుడిగి వెచ్చి దీపంబు, లిడెచ్చి కిటి ... ద్వి. హరిశ్చ పూ. 1167.

వి. వేఁడిమి.

కం ... ముచ్చిచ్చునను వెచ్చనుర ... ఆము 3. 28.

వెజ్జతికము వి (వెజ్జ+తికము) వైద్యము.

క. నేరని వెజ్జతికము దా, నేరుతు నని రాజ పురుషునికినితరునికిన్, జారాదు లిడిన దురను, జారసిగొనవలయు నుత్తమాధమ విధులన్ విజ్ఞా. 2. 67.

వెజ్జ వి. (సం వైద్యః.) వైద్యుఁడు, భిషక్కు.

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు, నొగులు చిత్తవృత్తి నొవ్వుదీరఁ, వెజ్జ వీవకావె ... భార ఉద్యో. 3 26.

శా ... వేరం బెత్తిన ఘాత చెయ్ది యిడుపన్ వెజ్జెవ్వఁ డూహింపఁగన్. దశకు. 2. 89

ద్వి వెజ్జులు వచ్చిన వేగ మాన్పెదరు, లజ్జింపనేఁటికి లతాంగి నీకు .. రం రా అయో. 92. పొ. 10 పం (104 5 నవ్య సం)

ద్వి. మందు వెట్టఁగ లేము మనఁజేయలేము, వెదక నంపఁగ లేము వెజ్జుఁ దేలేము ... ద్వి హరిశ్చ. ఉ. 1903

వెజ్జుఁదనము వి (వెజ్జ+తనము) వైద్యత్వము. వైద్యుఁడయి యుండుట.

గీ .. కడవనాకు చాలు నీ గొడవయేల, వెజ్జుఁ దనమేల యని మది లజ్జనొందమి మనుచ. 5. 18.

వెజ్జురాలు వి (వెజ్జ+ఆలు.) వైద్యముచేయు స్త్రీ.

గీ. అనుచు వారలు పలుకంగ నాతణమున, జయను విజయను దోడ్కొని జవన గతిని, వెజ్జు రాండ్రును మీరు నా బిడ్డచెంతఁ, బదిలముగ నుండుఁడీ యంచు వనముఁజేరి పార్వ 4. 187

మ .. ఉగ్రదశ వక్త్రిభృచ్చిరోభారమున్, శమ మొందింపఁగ వెజ్జురాలయిన కాంతన్ భక్తి భావించెదన్. చంద్రా 1. 2.

వైట్కా-(టకా)రము వి ఎత్తిపొడుపు.

శా కానిమ్మెంత ప్రయోజనం బనుచు వెట్కా రంబుగాఁ బల్కి, నాథానోత్తంసముఁజూచి ... రంగా. 2 45

వెట్ట వి 1 వేడిమి

గీ అట్టి వేసవి కెకిపంబు వెట్టకతన, నేల వందందు విరిపిన నెఱియలందు ... వాల్మీకి 2 70.

(మార్తాండుఁడు) గీ. త్వష్ట కన్యక సంజ్ఞనుద్వా హమయ్యె న వ్విలాసిని యమ యమునాహ్వ యములు, గలుగు కొడుకును గూఁతును గనియుఁ గని ని,జేశ్వరుని మేనివెట్ట సహింప లేక. వరాహ 5 89

సీ ... జిగి దొండ పండంచుఁ జేరవచ్చిన చిల్క బలువెట్ట దిగులొంది పరువు లిడఁగ ... ఇందు. 3. 28

2. వేసవికాలము, వెట్టకారు.

చ పరియగు నిట్ట వెట్టలను సరఃము నేంచు ... ఆము 2 47

3. తాపము,

ఆ. ... కాంత నామధేయ మొకయు గైకొని,
చిలుం నీకు వెట్టసేయ దగునే కవి. 2.50.

గీ .. వేసగేస్తుం కొంపలు బిస్సగాజె, బజలు
వెట్టలు వడిని కా కాజెనపుడు అచ్చ రా
కిష్కిం. 67.

విశ వేడి, ఉష్ణము.

గీ వెట్టదినములు మడుగుల మట్టి గంచవ, బుడ
బుడధ్వని వెసలు బుర్బుదములందుఁ, జిలుప
చిలుపని నేకుల జిడ్డుదేఱు .. మనుచ. 4 17.

సీ. రే రాచ గేసంగి రేకు క్రొవ్వెసతోడ వెట్ట కన్
కెగురు బోట్టుతోడ పాంచాలీ 3 77.

ఉ. వెట్టగ మందమారుతము వీచఁగఁ దోడనె
వ్రోలెంబై విరుల్, మిట్టిపడఁగ ... సారంగ
2. 168.

చ. పరిసర చంపక ప్రసవ పంక్తులఁ బుట్టినవెట్ట.
వావవల్, గంళముల్లై పయిం బోంయగానిలి
వచ్చి మదాళి నీ పరం పరలు భవత్పదాబ్జము
లపై వాలసెన్ ... ఉ రా. 6. 43

**వెట్టకాలము** వి వి వేసవికాలము గ్రీష్మర్తువు

వ. ఇట్టి వెట్టిదంపు వెట్టకాలంబున గట్టుపట్టి యిట్టి
ట్టవరాని వీరంబునఁ బంచాగ్ని మధ్యంబున
నుండి .. మృత్యుం 2 45

**వెట్టచెవులతపసి** (వెట్ట + చెవులు + తపసి.) ఉగ్ర
శ్రవసుఁడు.

గీ. విను నిరాహారి ఱేండ్ల కన్వెట్ట చెవుల, తపసి
రాయఁడు నీలా 2 2

**వెట్టము** వి. శత్రువు

సీ. కలువల చుట్టంబుఁ గలువల వెట్టంబుఁ దన
రెండు కన్నులై తనరు వాని ద్వా. 2. 158.

**వెట్టి** వి (సం విష్టిః) ప్రతిఫలము లేక చేయుపని

సీ విరాజు రాజులనెల్ల జయించి మున్ వెట్టికిఁ
బట్టె దోర్విక్రమముల . మార్కం పు 35

క అట్టి ఘనపుణ్యవాహిని, నట్టంటనె యున్న
యది ... వెట్టగదే భూమిఁ దిరుగు విడువు
దురాశల్ భోజరా 6 302

సీ. వలుక గల్గిన జాలుఁ బనులు సేయించును
వెట్టమైఁ జదలేటి పట్టినైన ... యయా
1. 13.

**వెట్టిగొను** స క్రి (సం. విష్టి) (వెట్ట + కొను) ప్రతి
ఫలమీయక యే పని చేయి చు

శా . . వాలాయంబున మమ్ము వెట్టిగొనుచున్
వర్తింపుచున్నారు మీ, రాలవ్యం బొనరించినన్
బ్రదుక శక్యంబెట్లు మాకోంట్లకున్. భీమ.
4 119.

చ. మదమున నిద్రఁ దారిగ నమస్త నిలింపుల
వెట్టిగొన్న నా,యెదుర మృగాళి నీవకట హీన
పరాక్రము రాముగిముఁ జె,ప్పెదవు . భా.
రా.అర. 2. 105

**వెట్టిజవరాలు** వి ప్రతిఫలమును గోరకయే వచ్చి పని
చేయు స్త్రీ

సీ. . గీ పేరుగల యట్టి జన్నంపుఁ బైరుఁబాఁప,
వెట్టి జవరాంద్ర కిరుగోరు వెట్టు కావు,లట్టి
యచ్చరజాతిలో మొట్ట మొదలి, పేరు గలదాన
మేనక పేరుదాన చంద్రా. 3 101

**వెట్టివాఁడు** వి గ్రామమునందు దివల త్తెము లేక వెట్టి
పని చేయువాఁడు

సీ వెట్టివానికి నేల విమల విచారంబు పరదూష
కున కేల పరముచింత నీతి ళ 3.

**వెట్టీఁడు** విశ. (వెట్టి + ఈఁడు) ప్రతిఫలము లేక చేయు
వాఁడు, వెట్టిచేయువాఁడు. (శ ర )

**వెడ** విశ 1. అల్పము, కొంచము.

ఆ వేగజాము గలుగ వెడనిద్రఁ బొందుదు ...
భార అర 5 308

చ ..వసంభ్రమతం జనుదెంచె నల్లన,ల్లన వెడభీతి
దోపఁజనులన్ వెగడయ్యెడు దృష్టిఁ జూచుచున్.
భార విరా. 1 276

ఉ . వెన్నడు మొకించుక గౌరవమందెఁ గోరి
కల్, నెక్కొన నిక్కెనారు వెడనిద్ర కనుంగవఁ
జేరె నింతికిన్ చంద్రా 1 100

చ వెడనగ వంకురింపఁ బృథివీ నందనుఁడు
పల్కె సారంగ 2 64

2 తుచ్ఛము

క జడమతులైన జనంబుల, వెడమాటలు మానవు
నిదియ వెరవు నిర్వ 8 119.

క ఈ వెడమాయల నిప్పుడుఁ, బో విడువవు ...
భార శాం 6. 184.

ఉ. . . ఆరిమొనపని లాగయి మీకుఁ దీవినఁ, బొంఁడెటకైనఁ దక్కు వెదబుద్ధులఁ బోయిన నే వవశ్యమున్, దండన సేయుదున్ .. వరమ 2. 64.

క వెద దెరువు లిచటఁ జెల్లవు, పుడమివహహా దొంగలానఁ బొడిచినఁ గోకల్, విడుతురె ... కళా 3. 204.

3. వికృతము.

క. వెదగోఁతల నెత్తురొలుకఁ, బడఁద్రోచినఁ వచ్చి కుక్క పదువు వెమకకున్, జడిసెఁ గబళింప నొల్లక ... భార. శాం. 3 608.

క. బుడబుడ నెత్తురు గ్రక్కుచు, వెదరూపము గాల్చి గ్రుడ్లు వెలికుబుక ... భాగ. 3 701.

సీ. కొడగులు వదలి కుత్తుక వెండి మిక్కిలి వెద రూపులై పడ్డ వీరభటులు .. జై భా 2 78.

4. వ్యర్థము, వట్టిది.

ఉ. అవల వచ్చు నావదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి శా, కి వెదమాటల వ్యాళఁ దెన్ని విధం బులఁ జూపి చెప్పినన్ ... భార. విరా. 2. 78.

క. మీకును మీపతి యానతి, మాయను మా భర్త యాజ్ఞమన్నింప దగున్, వాకో వాక్యములుల వెద, వాకాట్లం బల్కుటలు వలవదు సేయన్ శివరా 4. 70.

చ. హృదయము లిప్పుడు గదియకే తలచొ వెద కౌగిలింతలన్, గదిరెడు మేలు కార్యములఁ గల్గక మాటల యందె కల్గు పెన్నదురులు వట్టి కైతవ్యములు చాల ఘనంబయి ముందు వేస విక్, బొదలఁగ నిల్చెదంపతుల పొందుల కార్యల పొందు కైవడిన్. అము 2. 62.

5. అసత్యము, కల్ల.

సీ. వన్నె లుపచరించి కన్ను సన్నలుచేసి వెద మాటలను ప్రేమ గడలు కొలిపి. ప్రబోధ 1. 75.

సీ వెదప్రోవ ముము జెప్పి వచివవ్వఁ దిరుగు వధ్య గుణ కొలఁది యవ్రతవయు మరల ... అము 4 162.

ఉ అతని పాలికేఁగి వినయంబునఁ జాగిలి మ్రొక్కి దీవనా, న్వితయుఁ బోలె. గొంత వెదయుక్కువల బాహ్యకణంబు లతి. కా. జాతముల వెదలుచు ఓయు . వరమ 3 205

ఉ. ముంగిట నాడు పుత్రుఁ డతిమోదముతో ... చిఱుగంతులతో వెదయేడ్పుతోడ, డాయంగ.. ముద్దుమో, ముంగమియార ముద్దిడుట ముజ్జగ మేలుటగాక యుండునే. కవిక 1. 40

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది

క. అదలవఁచి నెమ్మనంబున, వెదతెలివాడఁ గూర్చి .. నిర్వ. 8 181.

సీ. వెలవెలనైచాల వెదనవ్వు వహియించి మురి పెంబు దఱిగిన మోమువాని ... ఉ రా. 6. 205.

7. పిచ్చి.

క. కదతలఁపు లుడిగి సంధికి నొడఁబడు మిరి లెన్న. . భార కర్ణ 3. 273

8 నిర్హేతుకము నిష్కారణము

క. ...కరుణారహిత, త్వమునఁ దొలు మేన వెద వగ, వమేయ వరవధము సేసినట్టి దురాత్ముల్. భార అను 5 109

9 వింత, ఆశ్చర్యము

ఉ దేవ! సురాధినాథ భవదీయ మనోజ్ఞమునందు వింతగా నీవిధిఁ జింతిలంగఁ గత మెయ్యది నేఁడు తపోనిమిత్త మొం,దే వెదవార్తగల్గెనా కవిక 6 49

క్రి. విశే. 1 అల్పముగా, కొంచముగా

క. చని వెద వికసిల్లెడు నా,వన వద్మముతోడ .. భార విరా. 2. 320

సీ. వెదవాడు లీలారవిందయుగ్మము మాడ్కి సుదతి సీ కనుఁగవ నోలమందె . నిర్వ.8.86

సీ .. విరళమై వతుని ద్వితయంబు వెదజాఱ జంచులోకించుకాకుంచితముగ . . నైష. 1 98

ఉ. . . చ, న్గ్రీవల జాఱు కొంగు సవరించుచు వీడిన కొప్పుఁ బల్మరుం, జేవెద దోపుచుఁ బలికెఁ జెందొవ చూపులు ప్రేక్షు డాఁటఁగన్ పారి 4. 57

2 వదలుగా.

సీ చిటివ్రేలి పూసపై ఘటియిల్లు వెదపట్టుచిమ్ముఁ సురియ డా ల్మెమ్మరముగ ... అము 7.14

వి 1. ఇంచుక కాలము

చ అకరు నవాంబు ధారలు జటాటవిలోఁబడి విశ్రమించి వెల్వడి చనుదెంచి రాలుగొని పక్ష్మములన్ వెడనిల్చి మోవిపైఁబడి .... కు. సం. 6. 767

2 చెఱకు (ఈ యర్థము మన్మథధనుస్సంబంధమునందే కనబడుచున్నది 'పుష్పము'' అని (బ్రౌ. ని)

క. వెడా కీ నపుడు వెడసింగాణిఁగొని యలరుఁ దూపు గమిఁ జక్కెర యేబాణముగాఁ గలిగిన కంబాణపు దొరపింజ పింజ గాడఁగ నేసెన్. విజ వి. 1 62 (128)

Phrase—(1) వెడ విలుకాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుడు.

చ. వెడవిలుకానికిం జెఱకు విల్లును గల్వలకోరికోరి కల్, గడలు కొనంగ నామనియుఁ గల్వల రాయఁడు నిచ్చి మన్ననం, బడయుడు వాని కెక్కుడుగ మౌర్వులు తామును గాన్కతెచ్చె నాఁబడిబడి గంధలుబ్ధ మధుపమ్ములు రాఁజను దెంచెఁ దెమ్మెరల్ విజ వి 1. 211.

చ వెడ విలుకాఁడు నెమ్మనము వేమఱుగేదఁగి తేకు వంకిడిం, బొడునఁగ మేను పానుపునఁ బొందక నిన్నతయ ప్రవాదమే, నడిగెదవంచు రాఁ గలిగినమై యిటు వెన్నెలవేఁడి వెన్కొనన్, గొడుగుల నీడ వచ్చితిఁ జకోరవిలోచన యేమి చెప్పుదున్ రామా. 6. 146

(2) వెడవిలుతు(లు) డు = ఇక్షు ధన్వుఁడు, మన్మథుఁడు.

క వెడవిలుతు కీర్తిజాలము, వడుపునఁ జంద్రాతపంబు వాలుటయును . . కా రా యు 88

క. వెడవిల్తుఁడలరు వింటను, గడువడి విరితూపు లేర్చి కదియింపుచు న,వ్వడఁతిన్ రాచందురునిన్, గుడియెడమల నేసియేసి కో యని యార్చెన్. యయా 5. 111.

(3) వెడవింటివాఁడు = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

ఉ. ఆ కమలాక్షి యింపున దృగంచల మించుక మూసి హర్ష బాష్పకుల కోణకోణయుచు లగ్గమునం జనఁజూచు చూపు శీ,రైకమునట్టెఁ దమ్మఁ నను టు కొనన్ వెడవింటివాఁడు క్రోధైక ధుకిణతం గఱచి యేసిన సింగిణి కోలయో యనన్ మనుచ 3. 90.

(4) వెడవింటిజోదు = మన్మథుఁడు

క. వడి వేఱవేఱ నిరనులు, గడఁగి బెడఁగయిరి కుంతికాంచిన కొడుకుల్, వెడవింటి జోదు మొనవడిఁ, గడిగిన కారాచ పంచకంబో యనఁ గన్. పాంచాలి 4. 14

(5) వెడవింటిదొర = మన్మథుఁడు

సీ వెడవింటి దొర దాడివెడల నుత్సాహించుఁ జిలుకపైకములు విందులకుఁ దిరుగు. చంద్రా. 4. 141.

(6) వెడవింటితేఁడు = మన్మథుఁడు.

క వెడవింట తేని క్రేనియుఁ, గడకంటనె యేలు కొనఁగఁ గలవెల నవలా, వడకింటిలోన వింతగు, కడకంటఁ జరింతె వన్నుఁగాదని యవలన్. ప్రభు. 1. 737

(7) వెడవింటిబోయ = ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు

తరళము పగలుమీఱఁగఁ గాంతకోటుల బాధపెట్టుచు నుండు నీ, తొగతగుల్ వెడవింటి బోయకుఁ దోడువచ్చిన వాఁడవో . . విజ వి 3 64.

(8) వెడవింటి బలుదంట = మన్మథుఁడు.

సీ వెడవింటి బలుదంటఁ బొడచూపఁ గానీక . . నీలా 1 42

వెడఁగు విశ. 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.

ఆ. శ్రమ విమోహ లోభ భయ పరిభూతమై, కొడుకు విడువనంత వెడఁగ వయ్యె. భార ఆది 6 280.

క మది ధృతిలేని వెడంగుల, మతిఁగలఁచిన సమతికిం బ్రమాదము వచ్చున్, మతిఁ గలఁచిన మతి మంతుఁడు, సితచ్ఛదోత్కరము చేతఁ జెడ్డవిధమునన్. కేయూర. 3. 75.

క ఓ వెఱ్ఱులార! యేటికి, నీ వెడఁగు విచారములు సహింపఁగ రాదా, యేవారికైన మేలా, చావులతర్కితములుగ్ర సంగ్రామములన్. భీమ 4. 62.

ద్వి. గుడికేఁగి మీకింకఁ గొలువ నేలనిన, వెడఁగు ప్రశ్నకు మీరు వినుడుత్తరంబు. బస పు. 6. 182. పా 832. పం.

2. వికృతము.

ద్వి నీరాడి ముడుక వన్నియ మూరకుఱుచ, చీరలు వెడఁగు కుచ్చెలు వెట్టి కట్టి ... అ. మ క. 1. 23. పా. 26. పం.

వి 1. అవివేకము.

క. కార్యము తెలిఁగిట్టిది నీ. వార్యవ్రతము గకు జొచ్చి యాడెదు నీ కా, దుర్యోధను వవినయ మని, వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో ఖార ఉద్యో 1 318

క. కడు వనమునఁ గన్నతల్లి కెన గావల రామునిఁ గన్నతండ్రిగా, మదుగని జత్తితోఁ గొలుచు చుండెదు తన్ను వెడంగుఁ బాని కా, అడవుల తోపలం గణకులాడిన దోసవు పంటయంతయుం, గుడిచితి వంచు నా మఱఁది కుట్టుకు నిక్క మొఱ్ఱుఁగఁ బల్కుమా. అచ్చ. రా. సుం 90.

2 వికారము.

క. అని పలుకు పొత్తు పలుకులు, విని పలుకక యున్న మనుజ విభు దెసఁ గోపిం,చిన తవ మది వెడఁగుడువుచు, వనిలసుతుం డిట్లనియె నాతని తోడన్. ఖార. శాం 1. 114

వెడఁగుఁదనము వి (వెడఁగు+తనము) అవివేకముఁ

చ ... విచార విదూరుఁడు భీష్ముఁ డెంతయున్, వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధుం బుద్ధులు పెంచలింపవే ఖార. సభా. 2. 9.

వి ... ఒడికంపుఁ జేఁతల యొఱపెఱింగిన వింత వీడాపటు వనితల వెడఁగుఁదనము ... కావ్యా. 3. 41.

వెడఁగుపడు (వెడఁగు+పడు.) అ క్రి. 1 అవివేకము నొందు.

గీ. ... మేదుర మోహాంధకారమున వెడంగు పడఁడు సంసార విష్ణుంగ విద్ధిఁ, బొందుఁ గాల క్రమమున వరపురుషవరుఁడు. ఖార అశ్వ. 1. 195.

.. కలఁత నొందు.

సీ గీ... అడరి కోర్కులు చిట్టు ముట్టాడ వెడఁగు వడిన యుల్లంబు వట్టునఁ బట్టఁవ దవకు, వశము గాకున్న నెంతయు వంతఁ బొందు ... ఖార విరా 2 292

3. జడత్వము నొందు, మ్రాన్పడు

క వెడఁగుపడి యచటఁ బెద్దయు, వడి నిలిచి తలం చుకొని యవశ్యంబును నివ్వు డితనిఁ దెగఁ జూడక చొప్పడునే యావిప్రశిశువు ప్రాణం బనుచున్ నిర్వ. 10. 78.

4 వికారము నొందు.

వ. కొమరారు దోశెపఁ ద్రాక్షతోడన్ దిరుగుడుల వెడంగువడి వడి దప్పువట్లు త్రాళ్ళంగట్టువడి పొట్టలదురగ నిక్కి పరిసెనంబులు వేయు వవి యును ... మనుచ. 4 28

వెడఁగుపఱుచు స క్రి వెడఁగు పడఁ జేయు, వికారము నొందించు

వ ... ఎండకాఁకును రేయింటి యలజడియు నప్పటి యాఁకలియు నాడక్కు డిల్లపడం జేసి వను మొగంబులు వెడంగు పఱిచినను బొలివోని పౌరుషంబుల నయ్యిరువాఁగును గడంగి కల యన్ బెరసి పెనంగి . . ఖార ద్రో 5. 286.

వెడఁగుపాటు వి (√వెడఁగుపడు) వెడఁగుపడుట, నిశ్చేష్టత నొందుట

చ. బలిమిఁ దదీయ లప్పుడు సభాముని ముఖ్యుల రెట్టఁబట్టి యాతలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్త దానవం,బులు గొని కూరుచుండిరి తపోధనులున్ సురలు స్వేదంగు పాటొలయఁగ గ్రుక్కు మిక్కు మనకుండి రొదుంగుచు నక్కడక్కడన్. ప్రభా 1 82

వెడఁగురుపడు అ క్రి (వెడఁగురు+పడు) మ్రాన్పడు, జడత్వము నొందు.

సీ ... మాకు నీపూన్కి నమ్మతమేము దీనికి నీతోడివారము నీవు దప్పి,యున్న వాఁడవు నిద్రయను లేక యున్నెని వెడఁగురుపడియెదీ యడవిలోన ఖార సౌ. 1 60

(వ్రాఁత ప్రతిపా 'ఎడగర' అపముద్రి)

చ. ఉడుగక కన్ను నీరఁ గడు నొప్పఁ ఛాయలు చెడ్డ కన్నులున్, వెడఁగురు వడ్డమోముఁ బటు వేదవఁ గందిన యంతరంగమున్ ... ఖార. పూ. 8 156.

ద్వి అక్కిలి పఱవక యుఱగన్నుఁ గొనక వెక్కక
వీఁగక వెడఁగురు వడక . పండితా దీక్షా
61 పొ.

వెడఁద విశే 1 విశాలము
క. వెడఁద యురంబును నమ్మవ, కడుపును దృఢ
కరివ తనువు గల యాతనికిం, దడర ... భార
ఆది 7 222.
సీ వేయి గుఱ్ఱములూనిన వెడఁద యరదః
మర్థితో నెక్కి . హరి పూ. 4 85
గీ సిడము నడిమికి వెడఁ ద్రుంచె వెడంద, వాతి
దొడ్డతూపునఁ గురుసేన దొంగలింప . భార.
భీష్మ. 2 49
ఉ విచ్చిన కమ్మదమ్ములకు విందులు పెట్టు వెడంద
కన్నులున్ పాండు 4 49
2. స్థూలము.
గీ. పిఱుఁదుఁ బిక్కలుఁ తెక్కలు చెడఁగుఁ
దొడలు, వెడఁద యొడలును జన్నులు వెంద్రు
కిదను, నంపులేకుడ బలియుట .. హంస.
3 183.

వెడఁదమోముమెకము వి పంచాస్యము, సింహము
సీ వెడఁదమోము మెకంబు నడవులఁడా గ్రించి ...
నీలా 1 42.

వెడఁదవాతియమ్ము వి (వెడఁద + వాయి + అమ్ము) బాణవిశేషము, విశాలమైన వాయిగల బాణము.
వ సురనదీసూనుండు వెరవుగల వనపాలకుఁడు
తాళఫలంబులు దిగఁద్రోచు చందంబున
మెఱుంగు లడరు వెడందవాతియమ్ముల నమ్మ
హీశుల తలలు త్రొల్ల నేయుచు . . భార భీష్మ.
3 63
ఆ. అన్ని వెడఁదవాతియమ్ము లద్భుతముగ,
నొక్కముష్టిఁ దొడిగి .... భార విరా. 5.146

వెడఁబడు=వెడలఁబడు అ. క్రి (వెడలన్. .పడు
వృత్తి నివర్ణవికారము.) బయటఁబడు
ద్వి. కడుపులోననె చచ్చి క్రచ్చుఁ గ్రేవు, వెడల
కున్నను చూలు వెడఁబడకున్న, మసలక వెడ
లంగ మందులువెట్టి, పసరంబు ప్రాణంబు వన
నుగాఁ గాతు నవనాథ 1. 40. పొ 10. పం.

వెడగఱపడు అ క్రి. (వెడగఱ+పడు) జడత్వము
నొందు, (లేక) కాంతిహీనమగు.
చ ఉడుగకకన్ను నీరఁ గడునొప్పఱి చాయలు చెడ్డ
కన్నులున్, వెడగఱ వడ్డమోముఁ బటువేదనఁ
గందిన యంతరంగమున్ . . హరి పూ 8.155.

వెడచఱుచు=వెఱచఱుచు అ. క్రి. భయపడు.
క. ఎఱకల గాడ్పున నొగి వెడ, చఱువఁగ వడివీచి
యతని శాతనఖములం, జఱజఱఁ జీరియు
ముక్కునఁ, గఱచియు నొప్పించె ఖాఁడు గరు
వలిసుతుఁడున్ భా. రా. యుద్ధ 1704
క వడి రెగని వాలములఁగొని, వెడచఱువంజఱచి
దొంగ వీఁడు మనకు లోఁ,బడియె ననుచుఁ బిడి
కిళ్లఁ, బడఁబొడిచిరి ... భా రా. యు. 208
లయవిభాతి వెడచఱువ మొత్తియును దడఁ
బడఁగ నొత్తియును .. భాగ 10 ఉత్త 787

వెడతపసి వి. (వెడఁగు+ తపసి.) అవివేకతపస్వి.
గీ వెడతపసినాఁటె నెద గొడ్డు వీఁగ కన్న, రాము
నెదఁజాపు వతినిష్ఠురంపుఁ బలుకు, జిలుకు తన
వంటి పెనువంట చేతఁగాని, మఘమునాచిన్ని
పాఁపడే మనుచువాఁడు చంపూరా 2. 63

వెడతుఱు వి. ఒకానొక చెట్టు (వృ వి) (చూ. వెడ
తుఱుపల్లి=వేణుతురుమిల్లి ) వి శా. శ. 1024.
Ep Ind 5

వెడదప్పు దే వి స్వల్పదోషము
సీ బ్రాహ్మణ జనముల రాజులు పూజింతురటు
గాన నేను విప్రార్పనంబు, సేయుదు విప్రుని
చేతన యుల్లెతి వెడదప్పునవ యొండు వెరవు
వాకు, దురితంబు వాపంగ దొరకొనదు ...
భార. అశ్వ 3 99.

వెడదారి వి. (వెడ+దారి) అపమార్గము
సీ జడదారి యొయ్యారి వెడదారితిరువో నడుగు
నెత్తమ్మి దుమ్మిడియె నీతఁడు ... బహు
4. 82

వెడనగవు వి మందహాసము.
క. . . మృదులకల భాషలఁ దళుక్కొత్తెడు వెడ
నగవులతోఁ, జిత్తభవుం డార్వ ననలు చిమము
నెపము నన్. మనుచ. 6. 80.

**వెదపాడు** అ. క్రి. వెఱ్ఱిగా పాడు.

సీ. వెదలించె నెవ్వాఁడు వెదపాడు కావిలోమానసం వెల్లియై యున్న వృగుని... అప్పక 4 341

**వెదపేరు** వి. తుచ్ఛపు పేరు.

చ. అని మునినాథచంద్రుఁడు దయారస ముప్పతిలంగఁ బల్కిన, న్విని యలివేణి తానిదియె వేళయిఁక న్మతి వీనిఁ దక్కఁగాఁ, బెనఁగక యున్న నన్ను వెదపేరునఁ బిల్తురు లోకులంచు... విప్ర. 3 74.

**వెదపోక** వి. తుచ్ఛమగు వడువడి

ఉ. పొట్టలఁ గ్రొవ్వి కొన్ని వెదపోకల నట్టెలు చేసి యిట్టటున్ గట్టిడులై వృపుల్ తెరువు గట్టిరె నారలఁ బొట్టుపొట్టుగాఁ, గొట్టక తూపులం గదువు గొట్టక ... చంద్రాంగ. 6. 65.

**వెదమబ్బు** వి. అల్పమేఘము.

సీ. అలరు వెల్తురులేని వెదమబ్బులు హిమాద్రి లేని మంచులు వార్ధి లేని సుధలు ... వరపథూ. 5. 135.

**వెదము** వి. ఎదము.

సీ. వెదము వెట్టకరాని ప్రియుఁ గూర్పుమని రంభ తిచ్ఛకమ్ములు పల్కి తెమ్మనిటులం... శ్రీరంగ 10 58.

**వెదయేడ్పు** దే. వి. కృత్రిమ రోదనము.

గీ. ఎదురుగాఁ బోయి వెదయేడ్పు లేడ్చువారి, తోడనిట్లని పలుకు మీ తోయజాక్షి ... దశకు. 5. 92.

**వెదలఁగొట్టు** (వెదలన్ + కొట్టు.) స. క్రి. వెదలించు, పోవడచు.

ఉ. గొట్టుతనానఁ దన్ వెదలఁగొట్టిన దిట్టను దట్టడంచుఁ బోఁ, బుట్టువనోట నొందనక పోయితి. ఉ. రా 2. 309

**వెదలఁబడు** అ. క్రి. (వెదలన్ + పడు) స్వార్థమున పడు) 1 వెదలు, బయలుదేరు

క. మించిన పనులకు వేరము, లెంచం బనిలేదు సీత నెక్కటి వటులన్, గొంచు న్వెదలంబడి యే, తెంచితిగా చాల మస్తితిన్నిలు మింకన్. రామా. '. 68.

2. వెలువలఁ బడు, ఉద్ధరింపఁబడు,

గీ. హా సరోజాక్ష గోత్ర దుఃఖార్ణవమున, మునిఁగి యున్నాఁడఁ జేయూర్పు కొనఁగ లేక, నీ కృపాదృష్టి పేరోడగాక యున్న, వెదలఁ బడు టెట్లు ముఖము గాంచుటెట్లు. జై. భా. 1 106.

**వెదలబాఁటు** వి (√ వెదలఁ బడు ) వెదలఁబడుట.

చ. భువన భయంకరంబులగు పోరులఁ దమ్ములతోడఁ గూడ నీవు వెదలఁబాటు లెస్సయలవుంజలము న్వెలయించు చోట ధర్మవున కొకింతయుం దొలఁగఁ ద్రొక్కమి యెంతయు మేలు... భార. శాం. 1. 4

**వెదలఁబాఱు** అ. క్రి. (వెదలన్ + పాఱు) వెదలు

సీ. అడ్డకట్టఁగ నీక యల కేకరాసులు వెదల లజ పొరఁజించి వెదలఁబాఱె .. చంద్రా 5 27

**వెదలఁబెట్టు** స. క్రి. (వెదలన్ + పెట్టు) వెదలఁజేయు, వెలిపుచ్చు.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్టు వెదవెద నాలుక వెదలఁబెట్టు ... భాగ 10. ఉ 544.

**వెదలఁబోసికొను** స. క్రి. చెప్పుకొను, ప్రకటించుకొను.

చ. వెత వెదలంగఁబోసికొన వేఱొక నచ్చెలిఁగాన మిన్ దిశాపతులకు నంతయుం దెలియఁ జాటుటకై గమకించునో సుమీ, యతివయనన్. రామా 6 132

**వెదలనాడు** స. క్రి. (వెదలన్ + ఆడు ) 1. వెల్లడి చేయు, లిఁబుచ్చు

క. నీ యంగన కపటాచార, రాయత్తము మాకు వెదలనాడుట తగదే, మీ యున్న రాత్రులందు తదీయ వ్యాపార మేము తెలిసితి మెల్లన్. కేయూర. 3 231

2. తూలఁ బలుకు, ప్రేలు

ద్వి. విను మీఁదెఱుంగక వెదల నాడెదవు .. బసవ. 4. 50 పం

**వెదలించు** స. క్రి. (√ వెదలు) 1 పాయఁజేయు, తొలఁగించు

క. వడవడ వడఁకుచుఁ గ్రమ్మఱ, నడుగులపై
వ్రాలి యో మహామతి యే నెక్కడఁ గన్న
తేవ మెక్కడ, వెడలింపఁగదయ్యా దురిత విష
విధి వలనన్ భోజరా 3. 87

గీ .. గంధవహుఁడు, సతుల వయ్యెర వెడ
లించి చన్నుగవకుఁ, దప్పునేసియు దైత్యు
చిత్తంబు వడసి హం 3 4.

చ. పొలుపుగ గొల్లక్రొందలిరు బోఁడుల కుల్కు
మిటారి గబ్బి గుబ్బలు బలుపెన్న ముద్దలని
భావమునందలి పోసిచాసి కంచెల వెడలించి
మాటికిని జేతుల నొక్కుచు హాంతకారియై,
యలఁతిగ నవ్వు పెన్నుఁడు దయామతి మాకు
బ్రసన్నుఁ డయ్యెడున్. రసి. 1 8.

2 వెడలఁ జేయు, పైకి రావించు.

క. డయ్యెఁ దిరిగించి దేవుఁ, డొయ్యన వెడలించె
నోరి యూర్పున నమ్మెై, నయ్యమి వర్యుఁడు
వెలువడి, యియ్యనఁ గనుఁ గొనియెఁ దొంటి
యేకార్ణవమున్. హరి ఉ 9. 109

గీ కుంభసంభవుఁ డబ్ధితోఁ గూడఁ గ్రోలి, తజ్జ
లముతోడ వెడలింపఁ దలఁపఁడేని ... శృ
నై. 2. 123.

ద్వి ఎడనెడ బొక్కలనిడిన బాలకుల, వెడలించి
భక్షించు బేతాళతతులు ... హరిశ్చ. ఉత్త.
1630.

3. వీడఁజేయు, విడుమనట్లు చేయు

గీ. ... ఎల్ల తెలఁగు వనులు నారాత్రిలోఁ దీర్చి
ప్రొద్దు, పొడుపునకు మున్న వెడలించెఁ బురము
సకల, జనములను జీవధనముల సరకు వతఁడు.
భార. మౌస. 174

4. వెడలఁగొట్టు.

మ ... ధనగుప్తుం డొనరింపఁ బూనిన మహా
ర్థార్త్యంబు సర్వరబుఁ గాంచి నిశ్చేం బను
మంచుఁ గంచి వెడలించెం గిన్కతో వల్లువిన్
విక్ర. 7. 180.

5. ప్రవహింపఁ జేయు

గీ. వెన్నెలరముబ్బి వెడలించె దీక్షితా మంద
సౌగంధిక మధునదంబు.... మను చ. 6. 29

**వెడలిచేను** అ. క్రి. (వెడలు+చను) వెడలి పోవు.

క. పెద్దపులి వెడలిచనె నని... దశా 4 40.

**వెడలు** అ క్రి 1 బయలుదేఱు. (రూ వెలలు.)

క. వేగుటయు సత్వరంబుగ, నా గాంగేయుండు
మించి యనికి నడచినన్ సాగర తరంగములు
గతి, వేగము తరతరము మొదలు వెడలఁ దొడం
గెన్ భార. భీష్మ. 2. 167.

సీ ... దైవ సైన్యంబు లీరితిఁ దరతరంబ, వెడలి
మొనలేర్పరించి యుద్వేలవృత్తి పారి 5. 2.

తే. వలయు సవరణతోడ భూ వల్లభుండు,
వెడలె వేఁటకు మృగయా ప్రవీణులైన, శబర
నాయకులుభయపార్శ్వములఁ గొలువ ..
విక్ర 2 131.

2 బైటవచ్చు.

ఆ ... మూఁకలెల్ల జుట్టుముట్టినపుడు, వెడలువట్టి
వెరవు వినరానికేమి నాచొచ్చు నేర్పు బలువుఁ
జూడు మధిప భార. ద్రోణ. 2 5

గీ దేవదేవ రక్షింపవె దివ్యమూర్తి, యనుచుఁ
బలుకు న విప్రుని యార్తభంగి, చూచునప్పుడు
మురవైరి చూడ్కికేల, వెడలె నాకునుఁ గన్నీరు
వేయునేల. ఉ హరి. 2 9

తే. అబ్ధితో గూడ మునుగ్రోలు నౌర్వవహ్ని, యుదర
రబిలమున నొకచోట నుండియుండి, జటిల వరు
నకుఁ గద్రూజ కటకకటక. విరహతాప విషం
బున వెడలినపుడు పాంచ. 1. 121

3 వెళ్లు, కడచు

తే. తపము గావింప వెడలె వత్సర సహస్రములు
మహాదేవుఁ డంత నా భూమి ధర కు, మారి
గౌరి ననుగ్రహింపంగఁ దలచి. వరాహ. 6.16.

క. చావుఁ దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తి
వారయకే దినములు పొంచై వెడలునట్లు నడ
వఁగ, దైవంబామీఁద మేలుతావ ఘటించున్.
మనుచ. 4. 107

తే ... పాండు బహుళక్షపా పరంపరలు వెడల,
కిండితో నేదు మల్లెయ్యె నిందుముఖి.
ఆము. 5. 84.

4 సంచరించు, ప్రయాణముచేయు.

చ ఎడపక మున్ను మింటిపయి నే తగులంబును
లేక మూకతన్, వెడలెడుచో ... ఆము. 4.85

5. వ్యాపించు.
తే. మొదలు దునిమిన మీఁదికి వెదలు రుధిర, ధారలు మదాంధ పరిపంథి వీరభటక బంధములు నిర్భేదెక్కులు వగలు విరుదు, బంట్లు పట్టించు కొను దివ్వె పోఁడిమి లవంగ. వరాహ. 5. 29.
సీ. ... తే వెదలు పేరెండకును శరద్వృతుముడిగి, వార్షికమై యొక్క ... ఆము. 4. 181
చ. అడఁకువ మీకు నేమి యిడ వతయమౌవనుట విన్నజంబుగాఁ, గొడిదెఁడు దానతోయ మడుగుం దిగ దమ్ములు ముజ్జగంబులన్, వెదలు కోలం తియై మగుణ విక్రమ హంస పరాగయు క్తిచేఁ, గడలు కొనంగఁజేయు వలకైతవ వామను నిన్ను నెన్నెదన్ చంద్రాంగ. 1. 72.
6. తొలఁగు.
క. ... మనమున నాటిన మాటలు, వినుమెన్ని యుపాయములను వెదలునె యధిపా. భార ఉద్యో. 2. 62.
సీ. ఏమార్గమునఁ జేసి యీ దుష్టసంసార దుఃఖంబు వెదలు .... వాసిష్ఠ. 1. 171.
7. పోవు, వశించు
గీ. విష్ణుమూర్తులు కడ చన్న వేళలందు, నజుని మూర్తులు విబుధులు వెదలు నపుడు, కలదె నీకు నపాయంబు కాలకంఠ ... శివరా 1 1053
వ. క్రి. దాఁటు, లంఘించు అతిక్రమించు
ఆ. మదవి ఒకట జలధి వెదలి నన్నవుఁగ్రయ్య, మునిఁగి రూపడంగు ఒనులమాడ్కి ... భార. శా షి. 2. 17.
సీ. గ్రహరాజు వాజెదు ఘంటాపథముదాఁటి చుక్కలు వాడకెంచు చక్కి వెదలి ... శృ. నై. 7 37.
వి. బయలు.
ద్వి. వదలి కాళ్ళను జల్లి పగ్గంబు గట్టి, వెదలికి నీడ్పించెఁ దొడఁగి కాచిరువ, కులనతి యని యెదు కూరిమితేక ... పండితా. పురా. 96 పొ.

వెదలుచే(లుచు) న క్రి. (√వెదలు.) వెదలఁజేయు.
చ. అడలున నెంతయు న్గలఁగి యగ్గలికం గుడిచేయి సాఁచి మై, వడఁకెడు కొమ్మకేలు చెలువంబుగఁ బట్టి యయాతినూతిలో, వెదలిచి యప్పుడమ్మ గువ వేనలికన్నులు మోము చెక్కులున్, మెడ చనుదోయి నెన్నడుము మేను పిఱుందునుగాంచి వేడుకన్. యయా. 3. 451.
క. వికసించు తమ్మినుండు మధుకరావళి వెదలి వెలుఁగు దొరగవఁ గాసారకలావఁతుఁడు మునుగొం, చక్రమ్రింగి వెదల్చు నిమవ కురిపెణ మనఁగన్ రా వి 3. 11
సీ కుబుసంబు విడిచిన కొదమ నాగము రేవదొన వెదల్చిన పువ్వుఁదూపు సరణి ... పరమ. 2 31.

వెదలుపు(లుపు) వి. వైశాల్యము
చ వెదలుపు గల్గు నోరులోక వేయి ధరించి వియ న్నదీ జలం, బదరఁగఁ బుక్కిలించి రయమా రఁగఁ దెచ్చి మహానలంబుపై, వెదవదకుండఁ జల్లనది ... హరి. ఉ. 8 72.
క ఆమడ నర వెదలుపు మూఁడామడ నిడివి యును గలిగి యతి రమ్యంబై, రామ ఘటకర్ణు పటు నిద్రామందిర మలరు మృదులతలను తతులతోన్ ఉ. రా 2. 293.
వ. అదియును మూఁడుయోజన-బుల వెదల్పు మూటయేఁబది యోజనంబుల నిడుపును ... భార సభా 1. 62
సీ. రేఖలేరపడఁగ వర్థిలి వెడల్పయి రెమ్మ పసరు వాఱుచు నిక్కఁ బసరుకప్పు ... మనుచ. 6. 27.
సీ కంఠహారము దాఁగి గంగడో లుదయించె వెద లుపు నిడుపునై మెడ పొసంగె ... కళా. 4. 159.

వెదవాదము వి, వి, వ్యర్థవాదము.
మ గడు సొక్కాకక్కఁడు నిత్య దూష్యలనుచున్ గంజాతులన్ రోయ నీ. వెదవాదంబుల కేమి నామదికి భావింపన్ సతిం బోల నివ్వుడ మిం గామిత వస్తువుల్ బరహితంబుంబోలు పుణ్యం బులే, దదరన్ ... మల్ల భూ. 2 35.

వెడవెడ విశే. అతి సూక్ష్మము, అత్యల్పము, మిక్కిలి చిన్నది (ఇది "వెడ" యొక్క ఆమ్రేడిత రూపము.)
సీ. వెడవెడ నూఁగారి వింతయై యేర్పడు దేరని వళులతో నారు నిగుడ ... భార విరా 1 245.
చ. వెడవెడ కొంద లిడగునె వెంకట భర్త వసించు కొండకున్ మద. 5. 64

సీ. కుంభి కుంభముఁబోలు కుచకుంభ భరమున వెడవెడ నడుములు వీఁగియాడ .. వీ. 3 155

క్రి విణ 1 చిక్కిలి యల్పముగా, కొంచము కొంచముగా. (ఇది ప్రయోగములందు ద్రుత ప్రకృతికముగాను, కళగాను గూడఁ గనఁబట్టు చున్నది. నిర్ధారక ప్రయోగము కనఁబడలేదు. కాని కళయని శ ర)

సీ అరట నుపకరిణావళి వెడవెడ యాదరించుట రాగ మదరఁ దొడరి .. భార విరా. 2. 278

ద్వి. వెడవెడఁ దన కచ్చ వీడంగఁ జాఱి, వడి మోము వగులంగ వాటంబు దాఁక ... ద్వి. హరిశ్చ ఉత్త. 1108.

వ ... మునివర్యులకు నృపవర్యుండు నమస్కరించి వీడ్కొని విడిదలకు నరిగి మజ్జనాది కృత్యంబులు వెడవెడం దీర్చి శకుంతలావ లోకంబునకు లోకలోచనం గనుంగొను నప్పుడు పి శకుం. 3. 146

చ వెడ వెడయేనుఁ దొల్లి యిది వింటి ననుంగని కుంతి యెంతయుం, జెడనది వైచిపోయె ... భార. ఉద్యో 4 88

2. బిగ్గఱగా.

వ. ... ధనుర్వేదయ నిష్ఠ్యూతంబులగు శరవ్రాతం బులు వెడవెడ వార్చుచు పగఱ మొగంబులఁ బ్రవేశించి వెడతల వెడలుచు . కళా. 8. 110.

గీ. అనుచు వాలోయ కరకశాసన కఠోర, గుణ విరావ ప్రతిధ్వని కుధర గుహల, వెడల వెడ వెడ వార్చుచుఁ బిడుగు తునక, వంటి నారాచ మున నదరఁట సేయ వరాహ. 7 60.

చ, వెడవెడ వార్చుచున్ దిశలు బీటలువాఱనదల్చి రుద్రుపై, వడచిన నమ్మహారథుఁడు నవ్వుచు భూతపిశాచ కోటిఁ జూచుచుఁ జని వేయఁ బొచ్చె ... వరాహ. 5. 112

3. మిక్కిలి వికారముగా.

సీ. తోఁక మాంకమేను సోఁకఁగ నులివెట్టు వెడ వెడవెడ నాలుక వెడలఁ బెట్టు భాగ. 10. ఉ 544.

4. తఱచుగా.

క వెడవెడఁ బొడమెడి యూరుపు, లుడుములు తుడుములుగ వెడలదొడవులు పడలన్, ముడి బోము జంకెన చూపులఁ, బడఁతుల వదరించి కోప పరవశయగుచున్ చంద్రా 2 146.

5 అశ్రద్ధగా

క. వెడవెడ యపఎలుకులు చెవి,నిడి కొండొక సేవు చింత యెసకరంబున పాలపడి యూరకుండి... భార. శాం. 1 56.

ఆ మగడు చన్న దెసకు మనసును జనియున్నఁ, జెయ్వు వెఱఁగు పడినఁ జెవులు సొరని, వృద్ధ వనిత కథలు వెడవెడ నూఁకొంచు, నుండె వగల నొగిలి యుత్పలాక్షి విక్ర 6. 118.

6. మృదువుగా

గీ. .. వేగ వెడవెడ తడియొత్తి....అము 5. 89.

7 అధికముగా.

గీ. మస్తకము వాంచి యసురని మౌనముద్ర, నేల బొట్టవేల వ్రాయుచు నిలిచి కొంత,సేపు వెడవెడ చింతించి శిరసొకింత, యెత్తి సన్నంపు టెలుఁగుతో నిట్టులనియె. మనుచ 3 97.

8 మెల్ల మెల్లగా.

సీ బిడిబిడిఁ గమ్మ పుపొపడి నిప్పుకలు చల్లి వెడ వెడగా గాలి నుడిసెనేవి... రాజ చ 3 80

చ వెడవెడఁ గన్నుమూయుఁ బలవించుఁ గనుంగవ విచ్చు ... యయా 5 118.

సీ ... పచ్చరా కట్నంబు వచ్చిక పట్టని వెడవెడ మునివ్రేళ్ల నడచిపోవు . దశా. 1. 272

9. దృఢముగా, గట్టిగా

క. .. ప్లవంగుని మెడఁగడు, వెడవెడ బిగియించె గ్రుడ్లు వెలికుబుకంగన్. భాగ. 10 ఉ 556.

వెద్దరి విణ (వెద్దు+అరి[3]) వంచకురాలు.

ద్వి పాపజాతులు విసపరులు వెద్దరులు, మాటల ముచ్చులు మందులమార్లు ... వండిశా.పురా. 116. పా.

వెద్దు విణ కపటముతోఁ గూడినది.

ఆ. పాఱిపోయి వచ్చి బడిపొచ్చి యీ వెద్దు, నిద్ర వోవఁ గృష్ణ నీకుఁ దగునె . వద్మ 9. 272.

('ఆ. పాఱిపోయివచ్చి వడనొచ్చి యీగువహ' అని
చి. వి. పా.)
ద్వి. పెద్దుమాటలేకాని వేలుఎలకవ్వ,దొడ్డవాఁడవుర
కాదూఁ కలిఁదీరుప ... ద్వి. క. పా. 1. ఆ.
30 పా. 1. వం.
వి. వంచన.
సీ. ముమ్మోవనుపాలితుధనము పెద్దునఁ గొన్న తరు
ణిమేదెప్పెటైదు పెరపు గొఱలి ..దళకు. 5 88.

పెద్దుకొలుపు స. క్రి. పీడించు.
సీ. అతిమాత్ర మాయాన మనుభవించుమ గాక
విటజనంబుల వేల పెద్దుకొలిపె ... క్రీడా 287.

పెద్దు(పె)పెట్టు స. క్రి. (పెద్దు+పెట్టు) వంచించు.
చ. అనపుఁడు మున్న యిట్టులవరై తిరి వోవఁగ
నీవు మిమ్ము నెం,దును గదుపెద్దుపెట్టితి ..భార
శా. 6. 301.
క. ధనముగ్గలదు పుత్త్రులు లేరని యానంజాపి
యొరుని యాత్మజుఁ దాన్వేరుఎన పెద్దుపెట్టితగఁ
లే,కాని నేనియుఁ గృత్రిమంపుఁ గొడు కాతని
తిన్. విజ్ఞా. ఆచా. కాం. 122.
తే. ఇట్టిగతిఁ జెల్వ మము పెద్దుపెట్టునొక్కొ, పెట్ట
దది రా నృజించిన విద్దగాన, బొంకగుచు వంత
కరియ క్రోపు వడు నొక్కొ, వదదఱఁదు
చెప్పెనని విరఁబడియెఁ గాన ప్రభా. 3 10

వెఱఁద = వెదఁద విశ. విశాలము.
వ... అనంగ ధ్వజ పట కఠోర పాఠీవచ్ఛాయా
చాయాదంబులైన వెఱఁద కన్నులు తలచుట్టు
ముం బలిసి పొలయ ... భీమ. 2. 110.
ఉ. వంద మతుం గమంగొని వెఱంద కమంగ
వనించె కామపముల్ ... శృంగార రసాల
కాలము. 2. (శ. ర.)

వెఱుతురు=వెలుతురు వి. శరీరము, ప్రకరము.
(వృ. వి.)
సీ. కోరింద వలతుమ్మ గొటికె కోడారెయు
వెఱుతు రూఢంగ దంతి వెత్రివిమ్మ ... హంస.
4. 9.
సీ. వెఱుతు రవంగము జెలయుఁగరిరంబు ... ఆం.
భా. 2. 58.

వెన్నాఁడు అ క్రి. (వెన్ను²+ఆడు.) వెంబడించు,
వెంటనంటు.
సీ పదములు దొట్రిలఁ బరువులెత్తెడివారి వనుకర్త
వృత్తి వెన్నాడి చనదు ... వసు. 1. 56.
సీ. వెన్నాడి తత్సేన వీఁగఁదోలుటకును బృథురక్త
మున నుబ్బు పెన్నసాతి ... రామ. 259
మ .. మాయావి యన్వాడు .. పాతాళము
సొచ్చినన్ విడువకాకాఖా మృగ ధీశుఁడాతని
వెన్నాడి వనున్ రసాతల బిలద్వారస్థితుంజేయు
చున్ ... చం. రా. 6 23.

వెన్నిచ్చు అ క్రి (వెన్ను²+ఇచ్చు) 1. వెనుదీయు,
వెనుకకు మఱలు.
మ. నరుఁ డాభీల పరాక్రముం డగుడు దైన్యం
బంది వెన్నిచ్చి విచ్చి,రి వార దలు దివ్య
సంఘము నుతించం ... భార. కర్ణ. 3. 313.
2. (యుద్ధరంగమునుండి) పాఱిపోవు.
సీ. వెన్నీక రణములో విగతాసుఁ గువారు విబు
ధాధ్వరములు గావించువారు ... వరాహ.
10. 113.
సీ ఇలఁగు భృత్తులకు వెన్నీని కూర్మిపతులు గోత్ర
వర్గము బల్మిఁ గూల్చ వింద్రులు ... బిల్హ.
1. 30.
క దగగొట్టి కలనఁబెట్టిన, మగఁటిమి వెన్నిచ్చి
పాఱు మాళవ నృపతిన్, మగధపతి యట్టి తఱి
నా,కుగతిన్ వెన్నాడి కోటఁజొరఁదోలి వడిన్
శా. వి 5. 16.
3. వెనుక దిరిగి పాఱు.
సీ. ... పగలకు వెన్నిచ్చి పఱవక సంగర క్షోణిఁ
గూలిన మహోశూరులకును ... దశా. 4. 95.

వెన్ను¹=వెను వె అవా. 1. వీపు, పృష్ఠభాగము.
(రతిదేవి)
గీ. మోతిని క్రొవ్వేడి వెంటపై నెఱసిపాలయ,
నదలు దరికొని వావిరి వఱచుచుండె ... కు.
సం. 5. 565.
వ. మనుజపతి యమజులుం దానును వెన్నయ్యె.
వింధానువిందులుం గాంభోజుండును, శూర
సేనుండును బుచ్చంబై తి ... భార.భీష్మ 2.96.
వి. పృష్ఠభాగము.

గీ ఉట్టిపడి మ్రొక్క గతిఁదేల్చ మరగపై రి, వెన్ను వెన్నునఁగొని విన్నువీథి కెగసె ... జహ్న.3 4.

సీ ఆరత కచ్ఛప కులేశ్వరు వెన్నుగానరా జగతికి మిన్నేలు దిగ్గనచోటు . . మనుచ 2. 7.

వి. 2 ఇంటినడి కొప్పు

వ. . . పాడిల్లును బోలె వెన్నొఱగి ... కవిక 4 113

వెన్ను² = ఎన్ను వి వరి మొదలగువాని యెన్ను. కణిశము

ఆ ఉత్తముని కడుపున నోగు జన్మించిన వాఁడు చెఱుచు వాని వంశమెల్ల, చెఱకు వెన్నుపుట్టి చెఱుపదా తీపెల్ల ... వేమ 2 భా 2.

గీ. కలమ గర్భంబులా మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బిఁకెపాటి, వెన్నుచూపి తృణంబూని యెన్నరాని ... రసిక. 2 101.

వెన్నుఁడు వి (సం విష్ణువు) విష్ణుదేవుఁడు, కృష్ణుఁడు.

క. వరనాథ సమర్పిత మగు, విరవాదుల తండ యొప్పె వెన్నుని పాదాం, బురుహాంబున నంగుటమున, సురలిత యాకాశగంగ కుప మానంబై . . నైష 3 115.

గీ వెన్నునకు నస్మదాదుల మెన్నడైన, నపకృతి యొనర్పము ఉ. రా 2 28.

ఉ వెన్నుఁడు ప్రీతిఁ జెప్పిన సవిస్తర వాక్ప్రచయంబు తోడఁ బోవన్న కుమార యిట్లు యిన నాయువు శ్రీయును నీకుఁ గల్గు . భార. ఉద్యో 3 348.

క వెన్నుఁడు నవ్విభు దవ్వుల, గన్గొంతన నిజ సమాధి కవితాసనమున్, గ్రన్నన విడిచి యెదురు నని, సన్నత మౌళియయి భక్తిసంభరిత గతిన్. హరి. ఉ 6. 32

విన్నవాఁకఁ బలుకు వెలఁదిఁ బుడుకు, కొడుకు రిక్కతేని నొడలి చూపాడయని ... రామ 197

వెన్నుఁగాడి వి (వెన్ను+గాడి) వెన్నెల, ఇంటి నడుకొప్పు మ్రాను (శ ర పా)

వెన్నుగుదియ వి (వెన్ను+గుదియ) వీపుపై కొట్టుట కుపయోగించు కఱ్ఱ

తే గీ మందులాడి చెడుగు మానిసి భూతంబు, పిసిఁడి బిచ్చగాండ్ల వెన్ను గుదియ ... చెన్న. 2 24

వెన్నుచూచు స క్రి (వెన్ను+చూచు) పాఱఁ దోలు.

వ నిర్జరులం దర్శించి, కిన్నరుల వెన్నుచూచి. హరి, 8 9

వెన్నుచూ(సూ)పు అ క్రి. (వెన్ను+చూపు) వెన్నిచ్చి వెనుక మఱలు.

సీ మురియ వైవగవచ్చు మొన దారసించిన శూరత్వమున వెన్నుచూపఁ డనుచు ... పాండు. 1 63

గీ కలమ గర్భంబు లా మహోత్పల దళాళి, పిక్కలకు నోడి తద్దయుఁ బిఁకెపాటి, వెన్ను చూపి తృణంబూని యెన్నరాని, నావఁదల వంచుచుండె వనాంతరంబు రసిక 1 101.

(వెనుఁగవఁ బఱచు అనియర్థాంతరము)

సీ చనునె శత్రువుల వెంట మునుదాన తగిలి యవ్వీరులు నెగువంగ వెన్ను మాపి, పఱచుట ... హరి ఉ 2 3.

పంచచామరము అలంతులయ్య కూర్మ మత్త కాదు లైన జోదుల, బ్బలారి వెన్నుసూపి పార పాచినాఁడ కాని నేఁ, డలంఘ్య బాహుశక్తిఁ దావకాజిలోన నుంచుఁ బి,చ్చలించి తెల్పెఁ దత్కథల్ వచః ప్రయోగ చాతురిన్. కకు. 2. 126.

వెన్నుదన్ను = వెనుదన్ను స క్రి (వెన్ను+తన్ను)

1. వెంబడించు, అనుసరించు

సీ. చిన్ని వెన్నెల కందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమిన చెలువ తోఁ బుట్టు మాకు ..., మనుచ. 2. 43.

చ మొదలు గలంగినం గని సముద్ధత వత్తినదల్చి వెన్నుద,న్ని నిలిచె దానవేశ్వరుఁడు ... నిర్వ 3 13

మ గడఛొఁఱ వ్వెనుదన్ని నిల్వ విలుమ్రోఁక న్వెంబడిన్ గాఁవుగా వడవన్...చంద్రా 6 73

ఉ. ఆ హరి వెన్నుదన్ని కుసుమాయుధ సాత్యకి సాంబ సారణుల్, బాహుబలంబు మీఱఁగఁ గృపాణ శరాసన సాయకాది సన్నాహము తోడ నిల్చి . . చిత్రభా 8. 12

సీ ధారాధరము వెన్నుదన్ని పుట్టిన చాయనున్నదీ బింబాధరోష్ఠి వేణి ... విజ వి 2 106

(ఇట ఔపమ్య ద్యోతకము)

2. తిరస్కరించు

వ. నెన్నడుముల విన్ను వెన్నుదన్ని ... మనుచ. 5 101.

అ. క్రి వెనుక నిలుచు.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణ సుతుం డును కర్ణుఁడున్ బకు,త్రాణ పరాయణత్వమున దర్పసముజ్జ్వల భంగి నుల్ల స,ద్బాణ పరంపరల్ గురియఁ బార్థివుఁడున్ వెనుదన్ని చూడ న,క్షీణ బవంబునంగవియు సేవకు మార్కొన వగ్గ లించితే. భాః విరా. 5. 278

వ. ... వెన్నుదన్ని చూచు వవసరంబున ... ఉ హరి 3. 26. (శ ర త్రౌ)

వెన్నునడుగు విష్ణుపదము, ఆకాశము

గీ .. జక్కవలు వెన్ను, నడుగు వట్టుక మొలి పేయఁ దొడఁగె నవుడు. అచ్చ రా అయో 15

వెన్నువిఱుగు అ క్రి ధైర్యము కోల్పోవు

వ ఇట్లు జంభాసురుండు ... పడినం దారకుండు వెన్ను విఱిగి పడి నిశ్చేష్టితుండై యున్న ... కుమా సం 12 857.

వెన్నువమ్మెట వెన్నుపైని కొట్టుట కుపయోగించు వమ్మెట.

చ మద మొదవంగ మూవక కుమార సమూ హము వెన్నువమ్మెతై, మొదవివ వాల మార్చుచు ... కోజరా 4 20.

వెన్నువ(చే)అచు న క్రి (వెన్ను+చఱచు) వెంబ డించి తఱుము. (అమారు వర్ణనము.)

సీ జంకించి పర పృథగ్జన కోటి చందానఁ గఱకు జీకటి వెన్ను నఱచు వాఁడు ... కాశీ 3 234.

వెన్నుసొచ్చు న క్రి. (వెన్ను+చొచ్చు) వెనుక జేరు, శరణొందు

సీ. విప్రులఁ జుట్టల వెన్నుసొచ్చి యట్టివారిని గొలి చిన వారిఁ బ్రజల, హర్షంబుతోఁ గాచి యన్యాయ ముడుపుచు . ద్వా 7

వెన్నెక్కు అ క్రి (వెన్ను+ఎక్కు) గర్వించు

ద్వి నిమ్ము నీ వెఱఁగక వెన్నెక్కి క్రొవ్వి కన్నులఁ గానక కఱకంర మూర్తి, నొడలు గల్గఁ జూచి యెరునిగాఁ జూచి ... పండితా. పురా 95.

వెన్నెముక వి (వెన్ను+ఎముక) వీపు నడిమి యెముక (శ. ర పా)

వెన్నెల[1] వి (వెల్ల+నెల) 1 చంద్రిక. (చందు రుని) తెల్లని కాంతి

చ. . చందురు మనుసోగ వెన్నెలలతోఁ దులఁ దూఁగెదు తద్గుణంబులన్ నైష 1 50

చ. వలిమల యల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి వేల్పు,ల గమిజీవగఱ్ఱ యుడివోవని చల్వల టెంకి వెన్నెలల్, మొలచిన పాదు .. పారి. పీఠి. 6

2 వెన్నెల వంటి కాంతి

ఉ .. నా సఖ, న్ని కనుదోయి వెన్నెలలు నిండక కోర్కులు నాకు నిండునే. ఉ హరి. 1 62

సీ. పిడెంపు బలుకెంపు విరిసి వెన్నెలగాయ వరిగింజ నొకటఁ బల్వరుస . ఆము 1 60

3 ఒక విధమైన యాట.

ఉ. అల చిమ్మన చీఁకటి చూట మొట్టియా వె,న్నెల లాట మెట్టినటు విన్నలమెన్ మును మున్ని లాసలిన్ .. ముకుంద 3 53.

వెన్నెలకందు = లేతచందురుఁడు.

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడ మిన చెలువ తోఁబుట్టుమాకు . . మను 2.43

వ్యావ అడవిగాయు వెన్నెల నిష్ఫలము

క అతివల హృదయము లాఁ సి, రతికలనన్దేల్పలేని రట్టడిరూపున్, జతురతయు జవ్వనంబును, విత యచుమీ యడవిఁ గాయు వెన్నెల రీతిన్. శశాం 3 76.

ఇక్లే కానఁగాచిన వెన్నెల

వెన్నెల² వి వక్షివిశేషము, వందనభేదము

సీ తోవారు నీకు మంజులకీర రుకాక చిన్నివెన్నెల నీకు జిత్తజన్మ .. ఇందు 3 87

వ. శ్వేతగిరి యందలి సింహాలోచనునకు వెన్నెల ధర్మపురియందలి యోగానందునకుఁ గొల్వు మ్రొక్కి . ప్రబంధ 1. 660.

వెన్నెలకుప్పలు వి బాల్యక్రీడావిశేషము

సీ చఁగిలి ముచ్చులాటలు గచ్చకాయలు వెన్నెల కుప్పలు తన్ను బిల్లె . కాశ 3 33.

తే గీ అసవుఁ గప్పుగవుం గుప్పలవనినుంతుఁ, గూర్మి నను పేర్మి వెన్నెల కుప్పలాడు . . శా వి 2 23

సీ రమణీయగతిఁ జకోరి కుమారికలు గుంపు గొని యాడు వెన్నెల కుప్పలనఁగ ... పి. శకుం. 2 183

వెన్నెలకూన వి బాలికా క్రీడావిశేషాలు

సీ చేతుల కణఁగవీ చెలువ చెక్కు లటంచు వెన్నెల కూనకు నమ్మ బిలరు . పార్వ 2. 21

వెన్నెలకోలు వి నమస్కారము, వందనము.

రగడ విష్ణుపుర బున విలసిల్లు మహావిష్ణు స్వామికి వెన్నెలకోలని . . హంస 4 213.

వెన్నెలగీము వి (వెన్నెల+గీము) చంద్రుఁడు

సీ. కటికి చీకటికి నగ్గంబైన రే వన్నెలాఁడి వెన్నెల గీముఁ గూడుటెల్ల . ఉ రా 5 100

వెన్నెలగుత్తి వి (వెన్నెల+గుత్తి) చంద్రుఁడు

వ. తెల్లని దివిరాజు, మడివాలు కేలువఁ దనతీవ యొడయ, కాకరా వెన్నెలగుత్తి కన్దోయి మన్నిడడ ప్రబంధ 216.

వెన్నెలపాపఁడు వి (వెన్నెల+పాపఁడు) చంద్రుఁడు.

సీ వెలఁదిరో యీతడే వెన్నెలపాపని పువ్వుగాఁ దురిమిన పుట్టుభోగి .. వీర 3. 157

వెన్నెలపులుఁగము వి (వెన్నెల¹+పులుఁగము.) క్రీడావిశేషము.

వ. సరస సల్లాప బుల వల్లభులంగూడి వెన్నెల పులుఁగంబులాడు క్రీడావతులును . . వరాహ 4. 155

వెన్నెలపులు(ల్గు)గు వి వెన్నెలకు సంతోషించెడి పక్షి విశేషము, చకోరము.

గీ తొనఁగరే యింతి వెన్నెల పులుఁగుగములఁ, బెనుచుటకు మేత నించియుంచిన వెడంద ... అచ్చ రా అయో. 18.

సీ వెడఁద గూడులనుండి వెన్నెల పులుఁగులు తెమలె నా నేత్రాంచలములు తెలుగ ... ప్రబంధ 290.

చ స్ఫురిత నవోత్పల ద్యుతులు చొప్పడ యామిని కామినీ భవ, స్మరహర మూర్తియై తదుము మూర్ఛిల వెన్నెలపుల్గు వేలుపుం, దొరల కొసంగఁబూని .. కృ శకుం 2 194.

వెన్నెలప్రోవు వి (వెన్నెల¹+ప్రోవు) వెన్నెలలో బాలురు కుప్పలుగా నిసుక పోసియాడుపాట.

సీ మురిపెంపు నగవులు ముద్దు లేఁజెక్కులఁ బొద లుచు వెన్నెల ప్రోవు లాడ ... 1. 85

వెన్నెలబచ్చె వి (వెన్నెల+బచ్చె) చంద్రుఁడు.

వ మీ మొగంబుల మిల మిలలు గెలుచాడ వచ్చెఁ జుమీ వెన్నెల బచ్చుముచ్చు ... వసు. 4 28.

వెన్నెలబొమ్మ వి (వెన్నెల¹+బొమ్మ) వెన్నెలతో చేసిన బొమ్మ.

సీ వడపాడ నేర్చిన వవకంపు లత లవఁ బోలు పొందు వెన్నెల బొమ్మలనఁగ ... ధనాభి. 2. 23 వం

వెన్నెలరా వి. (వెన్నెల¹+రా) చంద్రకాంతమణి

ఉ ... బలు వెన్నెలరాల సరాల జాలురాఁ జెన్నెలఁ జూడముట్టె . ముకుంద 3 53.

వెన్నెలరాచఱా వి. (వెన్నెల¹+రాచ+ఱా) చంద్ర కాంతమణి.

ఉ, వెన్నెల రాచఱా చలువ విప్పటరంగులఁ జేసి జాళువా, కిన్నరలూని . . అచ్చ రా. బాల 120

వెన్నెలరాయఁడు వి (వెన్నెల¹ + రాయఁడు) చంద్రుఁడు.

చ విను రతవంపు వంగడపు వెన్నెలరాయ మర్త్యసేరివన్ .. అచ్చ. రా. యు. 216 (సూర్యవంశ శ్రేష్ఠుఁడని భావము.)

వెన్నెలతేఁడు వి. (వెన్నెల¹+తేఁడు) చంద్రుఁడు.

చ వికట జటా కుడుంగమున వెన్నెలతేని ధరించి ... పొడనూపె భీమనా,యకుఁడు ... భీమ. 5. 58.

రగడ గురువెంద వరె గిలుబు కొనియెఁబయ్యెర
దొంగ, విరులఁ గరికుంభ కుచవెరఁజు మైయర
గ్రుంగ మనుచ 3 84.

వ ఏమఱించి వచ్చి కాఁగుచున్న కాఁగుల మీఁది
మీఁగడలు మెల్ల మెల్లనె పుడుక వెరఁజి యార
గించియును ... వి. పు 7. 128

4. కనుపెట్టు, కాచియుండు.

సీ. వేద మన్నిఁడ నీవీకావ వెరఁజుము గైత నీవా
జాడ గవఁగఁ జూపు .. ప్రబంధ 188

5. గట్టిగా పట్టుకొను

చ. బరవవమెప్పు గాలి తడఁబాటు మెయిన్ గవిఁ
దూఱి యొక్క కుర్కుర్కరము తమంబులో వెరఁజి
కోటలచేఁ గబలించి పొట్ట పెం, తెరనుదుమంచుఁ
దెచ్చి కని చేవరొటంగక త్రుంచివైచె. మనుచ.
4. 52.

వెరవరి విణ (వెరవు+అరి) 1 ఉపాయశాలి.

చ. వెరవరిగాక వీఁడు కురువీరులకుం బొడ నూవు
వాఁడె యచ్చెరు వొక ప్రమాని పేర నిటసేరఁగ
వచ్చుచు నున్నవాఁడు .. భార. విరా 4 81.

ద్వి వెరవరులై మేష వృషణముల్ దెచ్చి, సురలు
వంధించిరి సురలోక పతికి .. రం రా బాల
50. పొ 28 పం.

సీ సకల విద్యా విచక్షణత మించినయట్టి వెరవరి
సైరంధ్రి వెంటరాఁగ .. రాజశే 3. 201

2 జీవనోపాయజ్ఞుఁడు

సీ ధనమెంత దక్కుగునో యనఁ డింత వెచ్చ మా
వడ్డికాసుల వెరవరికిఁ గలిగి ... రా వి
1 85.

వెరవిఁడి విణ (వెరవు+ఇఁడి) 1. ఉపాయహీనుఁడు

క. మఱవక యేఁడులు పూఁడులు, గొరికిన వా
యొడలు మృదువగునె నీకేలా, వెఱివిఁడి
చందము పుట్టెన్, దటి దీనికి వెరవుఁ జెప్పె
దన్ విను మర్థిన్ వేం పంచ 4. 544

క. తరుణీ విరహాతురుఁ డగు, నరనాథ తనూజు
మంత్రి నందనుఁ గని యా, నరపతి సుదక్షిణా
యని, వెరవిఁడియై పలుకఁదొడఁగె పీడని
కాఁకన్. సుద. 5 4.

క. గురుజను లెఱుఁగక యుండను, వెరవిఁడియై
మిమును గట్టి వెళ్ళి చనువునన్, పరియింపఁ
దగిన పురుషుఁడు, పరిణయమగునేని నదియు
పైశాచ మగున్. విజ్ఞా ఆచా 101

2. తెలివిలేనివాఁడు, మూఢుఁడు

క. ఆరులకు సిరియిచ్చెదనను, వెరవిఁడియుంగలఁడె
దీని విడువుము .. భార శల్య 2 78

క ఉరు బాహు బలము గల్గియు, వెరవిఁడినై తేర
కాని విధమున వకటా, కరుణ యెదలోనఁ
దలఁపక, దురమున జముచాత నిన్నుఁ ద్రోచితి
పుత్రా భా రా. యు 1385

వెరవు వి. 1. ఉపాయము

క వెరవును లావును గలిగిన, పురుషులు లే రెట్లు
లోకమున .. భార శాం 3 31

ద్వి ధరణీశ మీకు సంతాన సంప్రాప్తి, వెరవైన
కథ మున్ను విన్నాఁడ నేను ... రం రా.
బా. 11. పొ 7 పం.

ఉ .. రామావని పాథు తమ్ములకు నట్టి యపౌ
రుషవృత్తి మేలె మీ, రీ వెరవాదరింపఁ దగునే
యనినన్ మునులెల్ల నవ్వుచున్ నిర్వ 10.10

క ఎట్టి వెరవుననైనన్, ఊతి పులకరి జయము
ధనో,న్నతియుఁ బ్రజానీతి రక్షణము ధర్మం
బుల్. ఆము 3. 35

2. నేర్పు, చాతుర్యము

సీ . . కీర్తి ధనార్జన క్రీడనంబు.

ఆ. గలిగి జనుల నేలఁగాని యెన్నండును, నొరులఁ
గొల్చి తిరుగ వె వులేని, యట్టి నీవు విరటునెట్టి
చందంబున, ననుచరించువాఁడ వధిప చెపుమ.
భార విరా. 1. 67.

గీ అఖిల మోహనమూర్తిగా వరుఁబోఁడిఁ, బంచ
బాణుండు తాన నిర్మించెఁగాక, వేదజడుఁడైన
యజునకు వెరవుగలదె విక్ర 7 44

క. హైవచ్చె క్రూరజంతుఁ, జే వెరవున నేయు
కొందు సిగ్గె చెపుమా హర 7. 57

3 రీతి, విధము.

గీ నగరు వెరవునఁబురుకుత్సు సరణి వలుని రమణ
వర్జున క్రియఁ బురూరవుని చందమున . విక్ర.
269.

క సిరిలామో కాలొడ్డిన, కరణినిఁ బైకొనుచు
నేనె కదియఁగ వను నీ, వెరవున విడనాడుచు
నొక, తిరిపవుఁ జెలిపట్టెఁజేరఁ దివి రెదవేమీ.
యయా. 2 78 (శ ర. పా )

4 ధర్మము
గీ మేలుగల నాఁడు మురియుచు మెఱవసేర్చి, గొడవ లొదవెడు తఱిఁబోవ విడువఁదగునె, తలఁపనుసురుల యొడయఁడైతనరు మగని, వెరవెఱింగిన నాడెంపు వెంఁదుకలకు అచ్చ రా అయో 71
5 అనుకూల్యము
సీ మాతలేశ్వరు నొక్క మణికందరంబున విశ్రామ ముండంగ వెరవుచేసి హర 5. 40.
6 ద్వారము
వ. ప క్వాన్న గంధంబు గాలివెరవున నాఘ్రాణించి .. కాశీ 4 120
గాలి వెరవునన్ = గాలిద్వారా
విణ 1 శక్తము, సమర్థము
క పావన గుణానుభావము, భావర భావింపనెట్టి పరమ నదులు నీ, కావేరికి సదృశంబులు, గావేరికినైనఁ బొగడఁగా వెరవగునే కళా 2 13
ద్వి పొరి భూతకోట్లను బుట్టింపఁ బెంప, విరి యింప నొక్కఁడె వెరవైనవాఁడు . రం రా ఉ 103 పా 10 పం
2 యుక్తము
ఆ వానులానితోడ వాట్లనితోఁడను, బూతుతోడఁ దిండిపోతుతోడ,నటమటీనితోడనడయరితోడను, వెలకునెత్తమాడ వెరవుగాదు ఉ హరి 3 112
మ. వర వైతాళిక వంది బృంద జయ జీవస్ఫార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె సంప్రీతిన్ నిజావాసమున్ హరి ఉ 4 117
క వరపగు మోహాలు మేర్పను, వెరవగుచో నెల్లి నేఁడు విడిసెన మధురా, పురమున .. ఉ హరి 4. 168
3 అధీనము
క గరుడునిపై శార్ఙ్గ ధను, ర్ధరఁడగు విష్ణుండు మేరు తటిఁబోలుచు తటిత్పరివృత జలదము బోలుట,వెరవ దనుజ రాజ హంస వితతి యితని కిన్ నిర్వ 3 5 (శ.ర )(విరియ ముద్రి పా )

వెరవుపడు[1] అ క్రి (వెరవు+పడు) వశమగు, అధీనమగు
వ. అప్పాటం బ్రతివచనంబునఁ బాటిల్లు చీకటి తప్పు కప్పి వుచ్చ వెరవు పడకుండునట్లుగా బ్రకాశించిన హర. 5 57

వెరవుపడు[2] అ క్రి (వెరవు+పడు) అనుకూలమగు
గీ అపుడు గాని మా తండ్రి యున్నట్టి చోటు, నరసి సంధించు కొనుటకు వెరవు పడదు కళా. 6 154.

వెరసి వి అంకెలను గలుపఁగాఁ దేలిన మొత్తపు లెక్క
ద్వి చదువు లెక్క ల [illegible] బస. పు 6 783. పం.

వెరసి(సు)మాట పర్యవసానము, చివరకుఁ దేలిన సంగతి
వ అన్నియుం జెప్పనేల వెరసి మాట యొకటి గలదని యిట్లనియె కళా. 78.
క తగ వెరసు మాట చెప్పెద, మగువలసంచల కటాక్ష మార్గణ జాలంబు గెలువఁ దాఁకినఁ దాఁకవె, జగతిం గోవిదుల మతులుఁ జదువులుఁ దెలువుల్ ప్రబోధ 1 47

వెరసు వి. అంకెలు లోనగు వాని పంక్తి
చ. హరిదనధిఘమా రమణులాతురగాలిమదుల్ల పట్టములో, తరువుల రాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతదిమాన వేశ్వరునకుఁ దెచ్చియిచ్చిన సువస్తు పరంపర లెక్కఁ గూడు పెన్వెరసుల రీతిఁ దత్పవన వీతిఘురాంకము లుండు మర్వరన్ వరాహ 12. 60
ద్వి స్వర్గంబు గరను మోక్షంబుల వెరసు, శివ యోగుల కిరవు సిద్ధుల వెరవు ... పండితా. పర్వ 313

వెరసుబడి వి (√వెరసు) అంకెలపంక్తి, అంకమాలిక
క విను మీతని సేనం గల, వనచరభట సంఖ్య వర్గ వర్గములెల్లం, బెనురాశి నేసి కవిలెం, బన వ్రాసిన వెరసుబడి నిశాచర నాథా భా రా. యు 364.

వెరళించు స క్రి. చెలఁగించు, విజృంభింపఁజేయు. (ప్రయోగాంతరము కన్పడ లేదు. ఇంకను విచార్యము.)

గీ చికిలి లోపలనే చీమ చిటుకుమన్నఁ, గనకనవ కూయు నొకదారి కవలకదన, వఱుని వెఱ పించు మల్లెంటు విరులకదన, బడుకయిలు మాని విరహాతాపంబుఁ బూని కువల. 5 88

వెఱ వి. (త వెఱు.) 1. భయము

క. చెఱువు వడుమ వినినను బెను, వెఱమెఱములు చెదరినను వివేకవిధి యు, క్కటి బహుళ సైన్య మటి ముటిఁ, బఱచిన వా గంగరాదు బలి యురకైవన్ భార శాం. 3. 16

చ. వెఱమెరలేని యట్టి బలు వీరుఁడు కృష్ణ కుమారుఁ డొక్కచే, జబది . భాగ 10 పూ. 662.

శా పుట్టంబుట్టఁగఁ దల్లిదండ్రు లడవిన్ బోఁ ద్రోచిరి వైఖరిన్, బొట్టుంగట్టిన ప్రాణ నాయకుఁడు పో పొమ్మంచు నోవాడెడిన్, గట్టా కోయిల పిల్లచందమున బల్గానిన్ వెఱంగొంటి వ, న్నిట్టట్టుం గికురింపఁ జూచెదవా కుయ్యాలింపవే శ్రీహరీ కృ శకుం. 3. 164

2. ఆశ్చర్యము.

గీ నేను మొదలుగ నొండొండ నెవఁగువంప, వెల్లి వఱపియు వస్త్రముల్ వెలయఁజేసి, కాన మొక్కవి వందుఁ బాకదు దగులదు, ఱిచ్చవడి నిలిచితిమి వెఱ ముచ్చముడిఁగి. హరి.ఉ. 5 67.

గీ. అవఘ మణికంథరుం డట్లు తనదు తపము, విఘ్న మొందించుకొనుటకు వెఱ పొడమెడుఁ, దిరుగఁ దపమొనరింపంగ దొరకొనియెనొ, యిపుడు రంభతో నున్నాఁడొ యెఱుగ వలయు. కళా 3. 47.

గీ. దిగధి పాలుర నెల్లఁ దో డ్తెరఁబనిచి, వారు దాను రహస్య విచారణపరత, నుండి వెఱతోడి భయముననుు దిఱగొనుచుఁ, బలికె గీష్పతిఁజూచి యాబల విభేది. కవిక. 7. 97.

3. నిశ్చేష్టత

మ. పనిగా వేర దటంచుఁ బూనక వెఱంద్రావింతు రెంతేజముల్, పనికిన్ మేకొని విఘ్నలేశము జనింపవ్ మధ్యముల్ వీఁగి యం,తనె చాలింతురు ... మల్లి నీతి. 72.

వెఱఁగందు అ క్రి. (వెఱఁగు+అందు.) ఆశ్చర్య పడు.

క ఈ జనపదమున కధిపతి, యే జనపతి యో మునీంద్ర యిదిక్ర్పతయుగ వద్భాగ్రీజితమని వెఱఁగందెడు, నాజి తనూభవునితోడ యతి వరుఁ డనియెన్. చం రా 2 96

గీ చిత్తజాతుండు కనుమాయ చేసినాఁడొ, మన మనంబుల విభ్రాంతి మట్టుకొనెనొ, కమలలోచన పరితాప గౌరవంబు, యనుచు వెఱగంది మదిఁగుంది యబ్జముఖులు విక్ర 1 138.

వెఱఁగు=వెరఁగు వి (త బెఱగు త వెరళ్) ఆశ్చర్యము, వింత

క తదనంతరంబ రాముఁడు, మొదలగు యాదవుల కెల్ల మోదము వెఱఁగున్, మది మొలవఁ జక్రధరుపై, వదలక విసువిథిఁ బుష్పవర్ష ముగురిసెన్ ఉ హరి. 1 122.

ఉ. . వాసియు వన్నెయుం దగవు వైభవముం జవములు వివేకమున్, బో నవతుల్ భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమిచెప్పుదున్ పారి 1.92

క. . . నతఁడా, రూపం బెడఁబాసి ఖేచరులు వెఱఁగందన్. మనుచ. 4. 116

2 అద్భుతకృత్యము, వింతపని.

క శ్రీ విశ్వ విభుఁడు చేసిన, యా వెఱఁగుల కలుగ వలయు వలిగిన సిదపన్, భావింప నతఁడు ధీరుఁడు, వావిరి నను దేరపఁడతను వడిఁ బడ వలయున్. కావ్యా 1. 104.

ద్వి. వెఱఁగై న యా రంగ విభు మహోమహిమ, మఱి వేల్పులకు నవాఙ్మానస గోచరము ... ద్వి పరమ 5. 417. పా.

వెఱఁగొందు అ క్రి. (వెఱఁగు+ఒందు) ఆశ్చర్య పడు.

సీ విక్రమూర్క్యని సైన వెఱఁగొందఁగాఁ జేయు జండ తరాఖీల సాహసములు ... విక్ర. 1.87.

వెఱఁగుపడు అ క్రి (వెఱగు+పడు) 1 ఆశ్చర్య పడు

క వెఱఁగు పడి హర్ష రాగము, దఱిఁగిన వెల వెల్లనై వదనములు వ్రాలం, దెఱఁగేది ఱిచ్చ వడి ర, త్తఱిఁ దత్పరిజనము లెల్లఁ దద్దయు నంతన్. భార అర. 7 158.

గీ. నేఁటితోఁ బాసె రాక్షసానీకమునకు, వీర
హోమంబుచే నీవు వేలుపఁబెద్ద, వెఱఁగు పడఁ
జేసి లోకైక విజయహేతు, వంముతోం దుటఁ
బౌలస్త్య వరకుమార. ఉ. రా 2 214

వ కౌతుకాంకురంబు కరఁగు వడ వెఱఁగుపడి ..
మనుచ. 6. 79.

2 నిశ్చేష్టత నొందు

చూ: వెఱఁగుపాటు.

వెఱఁగుపఱుచు స క్రి (√వెఱఁగు పడు) ఆశ్చ
ర్యము నొందఁజేయు.

వ తంచు మించుగన్ బఱచుట గగన చరుల
వెఱఁగు పఱిచి ... మనుచ 4 115.

వెఱఁగుపాటు వి. (√వెఱ గు పడు) 1 నిశ్చేష్టత

గీ దాని కమ్ముమునెల్లఁ జిత్తమున భయము, విస్మ
యంబును బెనఁగొన వెఱఁగు పాటు, గదిసి
చిత్రరూపంబులఁ గరణి నుండ . భార.అను.
4 400

ఆ. . . వెఱఁగు పాటు దనికె నెఱనాడె నొవ్వ
నెవ్వగలు వగల నీకె దీగులు వొదివె ..భార.
విరా 2 106.

క అబ్బెఁ దగుశాభ మని మది, మబ్బెడుకో నంత
రాయ మొకఁ గూకుటయున్. బిబ్బికొను
వెఱఁగు పాటది, నిబ్బరపు విషాదమువఁగ
నెగదుం జూడన్. కావ్యా 1 73.

2 అబ్బురపాటు, ఆశ్చర్యము

ఉ వెఱఁగు పాటు తోడి వెఱపు నాకస్మిక, సమ్మ
దంబు మానసంబు నొలయ . హరి. ఉ
3 188

చ. ... గురు శిష్యులు కౌరవ సేనలోని భూపతి
సుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి ...భార
విరా 5 126

వెఱచేఱుచు స క్రి. (వెఱ+చఱుచు) భయపడు

క వెఱచఱవ నింతకంటెం, దఱుమగ బాణంబు
లేసి తడయక పగఱం, జెఱుతుననియిసుము
చల్లుచు, నుఱుక ధనంజయుఁడు రణజయో
న్నతుఁ డరిగెన్. భార. సభా 2 305.

వ. ఇట్లు క్రీడించి గాంగేయుడించి గాండీవి దన
యరదంబు రయంబున

క పఱపి రథికులను సూతుల, నఱకిన మ్రోడుపడి
యుండె నానాంథముల్, వెఱచఱచిరి కురు
వీరులు పఱిపఱియై మనబలంబు భయముం
బొందెన్ భార భీష్మ 2 38.

లయవిభాతి తఱిమి వెసరక్కసుల వెఱచఱువఁ
బట్టుకొని, పఱిపఱిగ వేతలలు మఱిపి ... భా.
రా యు 1437

వెఱచు అ క్రి 1 భయపడు

క. రవిసుత పార్థుల ఘోరా, హవమునకును
వెఱచుచున్న యది కుంతి. .. భార. ఆది.
6 41

చ. పరమున కేను దాసుఁడని పల్కఁగఁ బ్రాపుఁడఁ
గాను మత్సుతన్, హరునకు నిత్తునా వెఱవ
నయ్యో. కు సం 3 370.

చ వెఱచితి రాఁగదే యనిన వెండిక దావగఁ
దీర్తు నీవు నా, వెఱపెటులున్న నీ రథిక వీరులు
వాపెదరు ... భార ఉద్యో 4 139

ఆ. పాపఁడనక వెఱక పాపని మొదలింటి, పోక
లెల్లఁ దలచి పొగడఁ దొడఁగె ... భాగ.
10 116

వెఱక = వెఱవక.

క . విహంగంబులు రుతముల, నవని సుతను
వెఱకు వెఱకు మన్నంట్లుండెన్ భా రా,
అర 2 150.

వెఱకు = వెఱవకు

గీ ... అని జయంబిచ్చి తన గదా హతికి వెఱని,
మనికి ధనపతి దయచేసె ... సమీర 2 133

వెఱని = వెఱవని

ఇది 'వెఱచు' ధా యొక్క వ్యతిరేకార్థక విశే
షణము

2. జంకు, సంకోచించు

గీ అదియుఁగాక మరుత్తుండు యజ్ఞవేళ, నుచిత
దక్షిణ లర్పించి యున్నధనము, గొల్ల విడిచిన
బ్రాహ్మణు లెల్లఁదనిసి, విడిచి రర్థంబు దీనికై
వెఱవవలదు జై భా 1. 73

సీ హీర కుట్టిమ భూము లిసుకనేల లటంచు
గట్టిగా నడుగులు పెట్ట వెఱచు . దశా
1 272.

క. ... వన్నిన భయమున బేడిన, రెన్నఁడు జల దుర్గభూము లేమఱ వెఱచున్. హరివం 2 90

3. వ్యగ్రతగా నుండు

క. ... విను కావునఁ బతికిఁ బ్రజలు వెఱచుట యొప్పున్. భార. శాం. 2. 261

**వెఱచుకొను** అ. క్రి (వెఱచు + కొను, స్వార్థమున) భయపడు

ఆ ... వెఱపించఁబోయి వెఱచుకొన్న చాయ యయ్యె. కృష్ణ. 3. 48

**వెఱపరి** విశే. (వెఱపు + అరి³) భయము కలవాడు, భయము కలది.

సీ ... భయశీలుఁడౌ వెఱపరి .... ఆం. భా. 3. 9

**వెఱపాటు** వి (వెఱపు + పాటు) భయము.

ద్వి. నిరవైన పతి మీఁది నెయ్యంబు దలఁచు, వెఱ గందిచింతించు వెఱపాటునొందు .. రం. రా ఉ. 122. పే 3. పం.

క. ఏ వరము కొల్లదేవా, దేవర కరుణాకటాక్ష దృష్టి యునిచి నా, కావరముచేత వచ్చిన,యీ వెఱ పాటుడిపి ప్రోవవే యని పలుకన్. శ్రీరం. మా 4 83.

**వెఱపించు** స క్రి (√ వెఱచు) భయపెట్టు.

ఆ. ... వెగడు పడఁగఁ జాలి వెఱపింత మొజ్జలు తత్ప్రయోగ విధులు దప్పపఱవ. భార ఆది. 2 130

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱ పింపంగవలదు మాధవ ... భార ఉద్యో 3 43.

ఉ. శేలవుగావె నీవు వెఱపించెదు వీరిని వారిఁబోలె వ,మ్న .. రాఘవ 4. 10.

**వెఱపిఁడి** వి (వెఱపు + ఇఁడి) నిర్భయుఁడు, భయము లేనివాఁడు, భయములేనిది.

వ. .. వెఱపిఁడి తఱపికొన్న విధంబున శిబిరంబు చొచ్చి .... విక్ర. 4 98

**వెఱపు** వి (√ వెఱచు) భయము

క కఱవు పయిఁ గఱవ వొరయుచు, వెఱపు పయిన్ వెఱపు దోఁప విడువని యిడుముల్, దొఱఁగమిపైన్ ... భార. శాం 4. 72.

మ. కరకంఠుం దరుణేందు శేఖరుని షట్కాలంబు బూజించు నెం,దఱు భక్తుల్ దనువేఁడినం బ్రమదమున్ చాతుర్యమున్ భక్తియున్, వెఱపుం గల్గి తదీప్సితార్థములు గావింప న్నిరాలస్యతన్ హం 1 11., దశా 2 333

**వెఱపెక్కు** అ. క్రి (వెఱపు + ఎక్కు) భయపడు.

చ ... చొప్పుడునే నినుబోఁటి కాప్తి చెప్పిన క్రియఁ జెప్పినీవు వెఱపించిన నే వెఱపెక్క వాఁడనే భార కర్ణ 2. 38.

**వెఱబొమ్మ** వి (వెఱపు + బొమ్మ) పక్షులకు భీతి కలుగుటకు భీకరాకారముగఁ గట్టెడు బొమ్మ

క నెఱవగు సంపద గలిగిన, నెఱదానం గుడువఁ గట్ట నేరని మనుజుం, డఱిముఱిఁ జేనికిఁగట్టిన, వెఱబొమ్మయె కాఁడె యెన్ని విధములఁ జూడన్. విక్ర 2. 179.

ద్వి. వీఁ డొక్క వెఱబొమ్మ విప్రవ్యక్తికము. పీడించి వీరి నొప్పించుచున్నాఁడు ద్వి. హరివం ఉ 932 పం.

**వెఱవెఱపాటు** వి. (వెఱ + వెఱ + పాటు) నిశ్చేష్టత

ద్వి. వెఱవెఱ పాటును విహ్వలత్వంబు, వెఱపును మఱపును వీడి తోడాడ రం. రా అయో 96 పే 17 పం.

**వెఱవేఁకి** వి (వెఱ + వేఁకి) 1. భయజ్వరము.

గీ ఏను నామాట పద్యంబుగా నొనర్చి, వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన, ద్రొక్కి జను రెంచి కాంచివిదిక్కు పడుచు, వెడలి మఱిఁజూడ రిట వెం వేఁకిపట్టి చాటు. 4 70.

ద్వి వన్నెఱంగెదు గాక నాపేరు తెలియ, విన్న మిత్తికి నైన వెఱవేఁకి వచ్చు ... ద్వి హరివం. ఉ 1194 పం.

సీ మొన్నఁ బారాశర్య ముని యోటరాఁ గూఁత లిగయించి వెఱవేఁకి యెత్తఁజేసె . . కువల. 2 80

2. సంతాపము, జ్వరము

ఉ ఏవి దినంబులో రజను లెయ్యవియో విను నిద్ర యెట్టిదో, వేపుట యెప్పుడో యలఁత వెమ్ముతునం బున కెద్ది మందో యే, ప్రోవలఁ గ్రోలొ యెవో తలఁపు తోఁడవ చెయ్యి లెఱుంగ నేను నా కీ వెఱవేఁకి మాన్పఁ గమలేక్షణ యబ్బితి వీవు వెజ్జవై. హరి ఉ 7. 170.

(ఇందలి 'వెఱ' శబ్దము సాధురేఫ ఘటితము విర వార్థకము ప్రత్యేక ప్రయోగము లేనిది అని శ. ర)

**వెఱసొచ్చు** అ క్రి. (వెఱ+చొచ్చు) భయపడు

సీ. ... పశువుఁ జేయ, విప్రులు పట్టరా వెఱసొచ్చి యొదిఁగెడు గవయంబు చూచ్చుచుఁ గర్ణ భీతి, మల్లఅనుకుకుయ నుండును ..భార కర్ణ 8 33

క. ఇటులఁ దమి హెచ్చి మారుఁడు, పటలంబెట్టంగ నొచ్చి నడి వటు నిటుఁ జెందుటకు వెఱసొచ్చి రతినం, ఘటనార్థము మిగుల వేగు కాలము నందున్ హంస 3 156

**వెఱగాయలాటలు** వి. బ బాలక్రీడావిశేషము

గీ దాయముల వాడు వామనగాయ లాడు, బాట లను బాడు వెఱగాయ లాటలాడు, మున్ను మున్నగ దాఁగుడు మూతలాడు, నా సుశీల జగన్మోహనాంగి యగుచు బ్రహ్మో. 3 27

**వెఱ్ఱి** వి (క. త మ వెరి.) 1. పిచ్చి, ఉన్మాదము.

ఉ వైదిక కర్మచారి జనవత్సల నీ మది బట్టు కొన్న యున్మాదము హీన మానవు మనంబునఁ బుట్టిన వెఱ్ఱివో లెన, స్యాదులఁ దీర్చుటొప్పదు... భార. శాం 1 101

గీ. .. అదెంయూ వెఱ్ఱి పట్టె నేమొ, యనుచు నాలాగె కావింప . . శుక. 2 456

2 అవివేకము

క జడలు ధరియించి యడవుల, నిడుములఁబడి కాయ గసరులే మెసఁగెడు పెన్, బడుగు నిమఁ గవయఁదగునా, విడువిడు నీకేలపట్టె వెఱ్ఱిఁ అచాంగి రామా 6 152.

చ తనకిది దక్కెనంచుఁ బ్రమదంబునఁ బంక్తి ముఖుండు మీద కేతుని చిగురాకులూఁకుమదిఁ దూరిన దాలిమి మాలి చేరఁగాఁ, అని యిది యేమి వెఱ్ఱి యొఅ జవ్వనమున్ బొలిపోవ విష్ణుఁడం, చునె కలకాలమున్ దపసి చొప్పున దాఁటెదు వృద్ధకాంతవై ఉ రా. 3 115

విణ 1 వివేకము లేనివాఁడు, వివేకము లేనిది.

ఉ ఇమ్మది వెఱ్ఱి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని యాడె ... భార. పఖా. 2. 39

క. నీ పడవి కరుగ నొడఁబడి, నీ వెనుకవ వచ్చు నప్పుడు నిందింతురు మమ్మిం వెఱ్ఱు లితని మావ్వంగా వలఁతులు గాకయని జగజ్జనులధిపా. భాం శాం 1. 66

ఆ వినుపతివ్రత అగు వెలఁదుల దిక్కు. రా, వెఱ్ఱి యేయ మర్త్య విభుఁడు నీకు, వలవదతని మీఁది వైరన్య మనుకూలం, వృత్తి బోలునయ్యవి ప్రియంబు హరి ఉ 9 78

మ వలదమ్మా యిటువంటి కానిపని యో వామాక్షి యీ వెఱ్ఱిబుద్ధులు నీకేల ఘటిల్లె నమ్మ తెగువన్ దుర్భాషలిట్లాడి యీ,కాల నాకేటికిఁ గట్టెదమ్మ ... సారంగ. 2 102

2 పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు, పిచ్చిది

సీ వెఱ్ఱులు దొలుమేన వెద్దున సాధు జనము మోస పుచ్చి ధనంబు గొన్న జనులు . భార అను 5. 105

ఉ .. సీ. చందము నందముం గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే ... మనుచ 3 68

3 వికృతము

గీ . క్రోటి విర్వంకఁ బఱ, తులను నివురుమ వెఱ్ఱి చూపుల మరంబుఁ, గెలఁకుల గనుల గొమచుఁ గానఁ గేకులుండె అము. 4. 181.

**వెఱ్ఱికుందెన** వి (√వెఱ్ఱి) వృక్షవిశేషము (వృ వి.)

సీ వెలగ విషము దారి వెఱ్ఱి కుందెన మంచి కుందెన కలబంద గువ్వ గుత్తి .... హంస 4 10.

**వెఱ్ఱిగొను** అ క్రి. (వెఱ్ఱి+కొను) అవివేకము నొందు

గీ పల్ల వేసల్లె పెద్దవారిట్లు వెఱ్ఱి, గొనిరి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన, రక్కసులు లోనుగాఁ జేయ క్రందులెల్ల, నుడువఁ దమకు దిక్కైన వాఁడొరుఁడు గలఁడె. హరి. పూ. 8 181.

**వెఱ్ఱిగొలుపు** స క్రి (√వెఱ్ఱిగొను) అవివేకము నొందించు, మోహపెట్టు

క ప్రకృతి గుణంబులఁ గొని బహు, వికృత రూప ముల నట్లు వెఱ్ఱి గొలిపెనే, వకలంకుడ ... భార శాం 6 51.

**వెఱ్ఱిచిక్కి** వి (వెఱ్ఱి+చిక్కి) వృక్షవిశేషము (వృ వి)

ఒకజాతి యడవిచెట్టు

సీ గోగు పొగడములు గోరంటలును బెద్దవెలమ నుంకేసరి వెఱ్ఱిచిక్కి ... హంస 4 11.

**వెఱ్ఱిచెఱకు** వి. (వెఱ్ఱి+చెఱకు) ఇక్షు విశేషము, అడవిచెఱకు (వ్య. వి.)

ఉ. వెఱ్ఱిచెఱకుఁ గోలవింటి బర్దకు మల్లె, తీవె నారిఁ జేసి ఖావ భవుఁడు. పఱచుపువ్వు బోండ్ల చెఱచోటులకే మెత్త, విరుల తూఁపులేసి మరులు కొలిపె. వైజ 2. 35.

ఉ. వెఱ్ఱిచెఱకు వందు విలసిల్లు ముత్యాలు, పొరలు ప్రేంఖణంబు పువ్వుచాయ, వది సమస్త భూత లాధీశ కామినీ, వశ్య కరము ధరణి వలయము వమ రత్న 40

సీ. రసదాళి చెఱకుతోఁ బ్రతివెఱ్ఱి చెఱకైనఁ జాన వాశెల ప్రతి చక్కెఁగగును ..చంద్రా 4 105.

**వెఱ్ఱిజిల్లేడు** వి (వెఱ్ఱి+జిల్లేడు) రాజార్కము, ఒక జాతి జిల్లేడు (వ్య. వి.) (శ. ర)

**వెఱ్ఱితనము** వి. (వెఱ్ఱి+తనము.) అవివేకము, తెలివి తక్కువ తనము.

సీ. కాహు బలాఢ్యుల బలవిహీనుల క్రియ వెతలంగ వఠిచిన వెఱ్ఱితనము .... ఖార ఉద్యో 1 376.

మ. మత్తెతవోలె మా వడుము మార్కసాన్ జలి కింపఁ బూని వీ, వెఱ్ఱితనాలు మానవని వేడ్క నిటాడఁగ నింటనుండి కాఁ, జిట్టునఁ గోప గించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, వెఱ్ఱియగారు మంచిగురువే దొరికెన్ జదువెట్లు చెప్పునో వైజ 4. 12.

గీ. ... దైవకృతంబులకును, విఱ్ఱవీఁగుట వ్రేఁగుట వెఱ్ఱితనము దశా. 2 418

**వెఱ్ఱినారువ** వి. (వెఱ్ఱి+నారువ) అరణ్య వృక్ష విశేషము, ఒకజాతి యడవి చెట్టు. (వృ. వి)

సీ. వేరు పవనగుత్తి వెఱ్ఱి నారువ రేల పవన కంక కొమ్మి పలుకరేణి ... హంస 4 11.

**వెఱ్ఱినిమ్మ** వి (వెఱ్ఱి+నిమ్మ) అరణ్య జంబీరము, అడవినిమ్మ.

సీ కోరింద నలతుమ్మ గొటిరె కోదారయ వెణుతు రూడుంగ దంతి వెఱ్ఱినిమ్మ ... హంస. 4. 9.

**వెఱ్ఱినీరు** వి (వెఱ్ఱి+నీరు) వెఱ్ఱి యెత్తించు నీరు, మద్యము, కల్లు.

గీ. వెఱ్ఱినీరాను కతమున వెడలునట్టి, చొక్కుఁ బోదట్టి యొకకమ్మ వెక్కఁబెట్టి, దశిగఅవఁ బోవు వేఁపి చంద్రమునఁ బట్టి; ఎరున మెచ్చఁగ నూరుజ ప్రముఖుఁ బలికె. శుక 3 32.

గీ మేంమీఱిన గొఱియల మేఁక గముల,గొఱి యపోతుల నటికి బ్రోగులుగ నిడ్డ, వెగ్గలపుఁ బచ్చి వంజుళ్లు వెఱ్ఱినీళ్లు దొరహత్తుగ నిడఁగడు పార మెసఁగి అచ్చ రా యు 231

**వెఱ్ఱిపాల** వి. (వెఱ్ఱి+పాల) అరణ్య వృక్ష విశేషము, అడవి పాలచెట్టు

వెఱ్ఱిపాలాకు అరిక బియ్యము పిట్టున ఎలుక కాటు మానును. (చి కి చి ని)

**వెఱ్ఱిపుచ్చ** వి (వెఱ్ఱి+పుచ్చ) చేఁదిపుచ్చ (వృ.వి)

గీ. పావంయు వెఱ్ఱి పుచ్చయు బత్రపుష్ప, వల్లరి ఫల మూలంబులుల్ల పిల్లి, గ్రహణమునఁ దెచ్చి చూర్ణంబుగా నొనర్చి, నీళ్లతో సీయవిషము లన్నియును దీఱు (చి కి చి. ని)

**వెఱ్ఱిబాగులు** వి (వెఱ్ఱి+బాగులు) తెలివిలేని స్త్రీ (గ్రా.) తెలివిలేనివాఁడు, వివేకము లేనివాఁడు (శ. ర పా)

**వెఱ్ఱిబిల్ల** వి (వెఱ్ఱి+బిల్ల) అరణ్య వృక్ష విశేషము, ఒక జాతి యడవి చెట్టు

సీ పుత్రిచింత మోదుగు ములుమోదుగును వెల్ల పుల్ల వెలగ వెఱ్ఱి బిల్లశిల్ల ... హంస 4. 11

**వెఱ్ఱిబీర** వి (వెఱ్ఱి+బీర) చేఁది బీర (వృ వి)

గీ ముసిని వెఱ్ఱిబీర ముష్టి యుమ్మెత్తల, విత్తన ములఁ జెముడు వేళ్ల ఖాను, మూలములును దైలమున దించి చమరిన, సర్వ వాతములును శాంతి నొందు (చి కి. చి ని)

**వెఱ్ఱిమొల్ల** వి. (వెఱ్ఱి+మొల్ల) అడవిమల్లె (చి. ని)

**వెఱ్ఱివాఁడు** విఆ (వెఱ్ఱి+వాఁడు) 1 వివేకము లేని వాఁడు

చ. విడువక నీవు పట్టనము వీథుల వీథుల వెఱ్ఱి వాఁడవై, చెడుగులఁ గూడి ధౌర్త్యములు సేయ మహీరమణుం డెఱింగెనే, విడుచును సోమ యాజి మము వృత్తులు చేకొనువెల్ల వెంటలన్, జెదుదుము గాదె నీకతనఁ జీరయుఁ గూడుమ లేక పుత్రకా కాశీ. 4 93

2. ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు (శ. ర పా.)

**వెఱ్ఱిసెనగ** వి. (వెఱ్ఱి+సెనగ) ఒక జాతి చిన్నచెట్టు, చిన్న మొక్క.

సీసమాలిక. ... కామ జిలుగు మెట్ట దామరవెట్టి సెనగ జుంచిరము కాచి నల్లకాచి .. హంస. 4 10

వెట్టిసొట్ట వి (వెట్టి+సొట్ట) తుంబీ భేదము, చేఁదు సొర.

చ నిలువక వచ్చి వచ్చి ధరణిం జిలుపెంచి లున్ వసుంధరం, గలసిన గోడలుం జివికి గంపలఁ గాచిన వెట్టిసొట్టలీ, వలు చిగిరెంత గంటగమి వాతులుగప్పిన పూదు పాఁతరల్ ... వేం పంచ 1 467

వెల వి (క బెలె త విలై) 1 కొనువస్తువున కిచ్చెడు విలువ మూల్యము, క్రయధనము

క. ఇలకు వెలగా హిరణ్యం, బలఘుమతీ మాకు నొసఁగు మనుటయు .. భార. అశ్వ 4 189

గీ జీవహింస యెన్నండును జేయవనఘ, యొరులు సంపి తెచ్చిన మాంస మొనర విలిచి, తగిన వెల కమ్మి బ్రతుకుదు ... భార. అర 5. 33

ద్వి ఏ మేడ దేశంబు లేలుట లేద, భూమికి వెల యిమ్ము భూమీశమాకు .. రం. రా బాల. 16. పా 14. వం

వ .. తపస్వులకు మూలువురకుం బ్రోలునాంటి బబ్బర వాఁడు పన్నస్రలు దగువెలకు విలిచి కొని ... ద. భా 1281 9

సీ విలువనా జిట్టినా వెలయన రోయన వెలయుచు మందును విక్రయంబు.. ఆం. భా. 2 267.

2. పందెము

ఆ. వాదులానితోడ వాట్లనితోడను, బూతులోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడ నడియరి తోడను, వెలకు నెత్తమాడ వెరవుగాదు ఉ. హరి. 3. 112.

వెలఁగ వి (క బెళల, త. విళవు.) కపిత్థము, వృక్ష విశేషము.

చ. .. త.త్పదములఁ దోకయున్ బిగయఁబట్టి చెలంగి వెలగ ప్రమానితోఁ, బదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు వేఁగ రక్క సున్ భాగ. 10. పూ. 435.

సీ. వెలఁగపండులు పుల్లవెలఁగ పండులు మోవి పండ్లు వంకెవపండ్లు బలుసుపండ్లు . కాళ. 3 99

ఆ పిలికి పూలు బూతపిల్లు లేనికకొమ్ము, లలరుఁ దేసి పెద్ద వెలఁగపండ్లు, వెదురుఁ బ్రాలు ఇూతి పదనికల్ గసగసాల్, జల్లి మెకపుఁ జాలుఁ జాలపప్పు. యయా 1. 31.

వెలఁగొను స క్రి (వెలన్+కొను) వెలయిచ్చికొను, విలిచికొను

ఉ. ఆసలఁ బెట్టి యేచు వసువంచు వచింపఁగ నేల సంతతో, డ్భాసి నిజాభిజాత్యమునఁ దద్వ సువున్ వెలగొన్న మోహసంవాస పదంబు దారమణి వారక కుక్షిమతిం జనించె . వసు. 4 111.

(ఇట వశము చేసికొన్న అని భావము.)

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁ గుబేరుని జెనకెడు వైశ్యులు . కుచేల 1 23

(ఇట పోలు అని భావము )

వెలఁది విశ (త వెలిదు) 1 నిర్మలము

గీ ... కుప్పతిలు చుట్టుఁగొండపైఁ గొవలుసాఁగి, వెలఁది వెన్నెల తెల్లడ వెల్లివిరిసె, శ్రీరం. 2 258.

ద్వి సలలిత శశి కాంత చంద్రశాలలును, వెలఁది ముత్యంబులు వెలయు వాకిలులు ... ద్వి హరిశ్చ. పూ 178

సీ ఓలి నన్నింటి సద్యోఘృతంబులు నించి వెలఁది పట్టున వర్తులలవరించి ...

గీ .. యందముగ నివాళించి రయ్యవని పతికిఁ, జారు కంకణ ఝణఝణత్కార మెసఁగ . భోజరా. 2 96.

2. తెల్లనిది, ధవళము.

గీ చలువ లందిచ్చె నొకతె చెల్వ వెలఁది నవ్వులుత్త రీయము లందుచే నొడియ మూల్య, భూష ణంబులఁ గైసేసె పొలఁతి యొకతె ... దశా. 6 27.

ఆ చెలువ యొకతె చలువ వలువచేఁ దడియొత్తు, మగువ యొకతె సొగసు సిగయొనర్చ, వెలఁది చందనంబు వెలఁది యొక్కర్తుమై, నలఁద నొకతె ధూపములరఁజేయ. ఇందు. 5 26.

ద్వి. దళుకొత్తు వెడఁదడెందము మీఁద జిమగు, వెంఁది జన్నిదములు విలసిల్లుచుండ ... ద్వి పరమ. 3 244. పా 12 పం

3. మేలైనది

సీ. వవనతూగమమునఁ జవులు వక్కాణించి మించఁ జాలు వెలంది మిన్నగములు ... వసు 6 72.

(నారీ రత్నముల సముదాయములు అని యర్థాంతరము)

క. సిగఁజుట్టె విరులొక్క, సికతామయనితంబ వెలఁది కస్తురి నొక్క వెలఁది యలదె...సారంగ 2 192.

4 ప్రసన్నము, సంతోషభరితము

చ. ... పైపయి నద్భుత ప్రగుంభనము మనంబునం బెనుపఁ బల్క నమంగు వెలఁది పల్కులన్ ఈ. వ. 2. 102.

(నలపతుమున ప్రియసఖి వచనములతో అని యర్థము.)

5. విశదము, స్పష్టము.

ద్వి. వలనొప్పఁగాఁ బోయి వచ్చిన తెఱఁగు, వెలఁదిగా నంతయు వినిపింపఁగోరి ... నవ 2.65. పా. 6. పు.

వి. 1. చక్కని యాఁడుది, ఆఁడుది, భార్య

గీ. వెలఁది సంకల్ప సోపాన వితతియందు నతఁడు మాడఁగ సంచరింతహారహంబు...నైష 2.87

క. .. శైవ శరాసన మెక్కిడి, యా వెలఁదిం బెండ్లియాడు మా రఘురామా రామా.4.61.

పీ. ... ఎలనాగ కోమలి యింతి చెలువ చెలి వెలఁదుక మెలఁతుక వెలఁది మెలఁత. ఆం. భా. 2. 104.

గీ వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము నిష్ప్రయోజనముగ నమ్మునేఁత, యనెడు నప్తవ్యసనములఁ జనదుతగుల. భార. ఉద్యో. 2. 44,

సీ వెలఁదులు పదియారువేవురలో నెన్న సరిలేదు సౌభాగ్య గరిమ నీకు ... పారి 1 58.

గీ. చిత్రకారుఁడా తెఱఁగెల్లఁ జెప్ప విభుఁడు, వెలఁది తొడమచ్చ యేకాంతవేళఁ జూచి .... విక్ర. 3. 57.

ఆ. . పేయు వత్సరములు వెలఁదితో రమియించి దశా 3. 62.

2. ధావళ్యము, తళతళ కాంతి.

గీ. ఈ వెలఁది మొదల్ పైఁడిలో వెలంది, యీ నెలంత లలాటంబు లే నెలంత, యీసుపాణి రదశ్రేణి యేసుపాణి, యీబిడారు మృగమద శ్రీబిడారు విజ వి. 1 130

వెలఁదిమిన్న వి స్త్రీరత్నము, శ్రేష్ఠురాలైన యాఁడుది

వ. వేఁడివేల్పు వెలంది మిన్న వేనలి నలవరించుకొన్న సన్నజాజి విరుల సరుల సిరులం గడలుకొని ... ఉ రా 4. 163.

వెలఁదుక వి (వెలఁది+ఉక స్వార్థమున.) స్త్రీ. ఆఁడుది.

క. ... సౌరభమాలా, కలిత మధుమత్త మధుకర, విలసనమున నొప్పు వనము వెలఁదుక పొల్చెన్ మార్కం 1. 24

సీ అనయమ్ముఁ జెలియిమ్ములను ద్రిమ్మరుచునుండు చలి వెలుంగు నమంగుఁ దెలియలేనయొ .

గీ ఇవ్వెలందుక కనితవ యాడుచేడె లందలును డెందముల నుబ్బి యాడుకొనఁగ నీలా 1 52.

వెలఁబెట్టు స క్రి. వెలయిచ్చికొను.

క కలిగిరిపో యిది మన నగ, వెలఁబెట్టని భృత్యులనుచు వెలఁదియుఁ దాను , గలకల నవ్వుచు నాట్యము, సలిపిరి కరడమరుతాళసహితము గాఁగన్ ప్రబోధ. 3 58

(వెలఁబెట్టని భృత్యులు=వెట్టి నౌకరులు.)

వెలకుఁజూపు స క్రి (వెలకున్+చూపు.) అమ్మఁ జూపు, విక్రయింపనెంచు

సీ. వెలకుఁ జూపవు పొన్న విరియంతగోప్యమా యది యరంటులలోయ నయ్యోఁజుమ్ము ... కవిరా 1. 81

వెలకెక్కించు స క్రి. (వెలకెక్కు ) ప్రసిద్ధినొందించు.

క ఆ రాతుసుఁ దునుమాడక, పోఁడు పురంబున కును బోరాటమహో, ధారాట రథ మదద్విప, వీరాటన పాటవంబు వెలకెక్కించున్. మద. 5. 76.

వెలకెక్కు అ క్రి (వెలకు+ఎక్కు) ప్రసిద్ధిచెందు చూ వెలకెక్కించు

వెలగలవుసేయు అమూల్యమగు

గీ వెలఁ గలవుసేయు కౌశేయములు గలు గఁగ, మానమైనట్టి మైనమై నూనవేల సారంగ 2 188.

వెలచాన వి (వెల+చాన) రోవెలఁది, వేశ్య

గీ. అప్పుడంబునఁ గామ సేవాళిధాన, యైన వెల చాన మీలు జయైక తాన శుక 210

వెలచే న. క్రి శుభ్రపఱుచు, తోము.

సీ. వెండి యెడ్డెనలపై వెలచి తెచ్చిన పైఁడి పళ్లెంబు లాయత్త పఱచవరు నైష 6 108

(ఇది సానుస్వారమని చి ని, బ్రౌ, నిఁను స్వార మని శ. ర సిద్ధారక ప్రయోగము లభింపలేదు కనుక నిరనుస్వారముగా గ్రహింపఁ బడినది)

సీ పుప్పొడికంటె బుప్పొడిలోనఁ బొరలించి వెల చిన చెంగల్వ విరులకంటె పి శకుం 4 146

సీ విరహుల మర్మముల్ విదళింపఁ గరసాన వెల. చిన మరునస్త్ర గుళికయవఁగ శివలీలా విలాసము 1

వెలచెలువ వి (వెల+చెలువ) వెలచాన, రోవెలంది, వేశ్య

వ నిలింప పతి కొలువు వెలచెలువల కెలువంబులు మెచ్చుని మెచ్చు లాఁడులు. ఉ రా 5. 248

వెలడు = వెడలు అ. క్రి నిర్గమించు, పైకివచ్చు, బయలుదేఱు

క వెలడు నెడఁ దెలివితోన,గున్నలువలపల నుడియు శిఖలఁ గొమరగు భార శాం 3 14.

తరువోజ వెలడు విట్టూర్పుల వెస నుచ్చలించు వెలుపుఁ గలుగు నెవ్వేఁగుచందోయి. కు. సం. 5. 588

వెలతలిరుఁబోఁడి వి. (వెల+తలిరుఁ బోఁడి) వేశ్య, రోవెలఁది

గీ సంభవించెఁ గచాకచి సంగరంబు, చక్కఁగా వేగ దిక్కుల జాట వేఁడు, దండహతు లొద వెను వెలతలిరుఁబోండ్ల, తల్లులకుఁ దూర్పు తెల తెలల్ దాయునపుడు. రా వి 1. 77.

వెలన = వెల్లన వి తెల్లఁదనము చూ వెలనగు

వెలనగు అ క్రి (వెలన+అగు) వివర్ణమగు కాంతి రహితమగు

సీ పాత్రావలోకనోపాయంబునకు నైన వెలనైన దీపంబు వెలుఁగఁజేసె . కాశీ 4. 133

వెలనాఁ(ల్నా)డు వి దేశవిశేషము.

క వెలనాఁడు పేఁగినాఁడును, బలుగుల నాడ్వా కనాఁడు పొత్తపి నాఁడున్, గల మురికినాఁడు రేనాఁ, డలయక గమఁగొంటి నచటి యబలలఁ గంటిన్ హంస 1 53.

వెలనేస్తకాఁడు వి (వెల+నేస్తకాఁడు) విటుఁడు, బోఱుఁగు

గీ చాపమైనుండి యుచిత సల్లాపగరిమ, నుబుసుఁ బోకల నొక కొంత యూరడించి, వెలఁబన్నెడు తనకూళ తలఁవు వేఁడు, గానతేఁడని వెలనేస్త కానిఁ జూచి ప్రబంధ 726.

వెలపడంతి వి భోగముచాన.

గీ ముకుర పీఠావిధానంబు మొదలులేక, వెల పడంతికిఁ గాఁదాదు విటునిఁ గవయ క్రీడా 1 186.

వెలపెట్టు అ క్రి. (వెల + పెట్టు)

వ . భీమసధనం దన వనమునకుం జంగ కాయ లకు వెలపెట్టిన గన (హ)స్తిమాడలు ఇరువది 20 ... దశా. 1211 15.

వెలపొలఁతి వి (వెల+పొలఁతి,) రోవెలఁది, వేశ్య

ఆ మమత మూఢవిటులు భ్రమతురింతియ కాక వెలపొలంతి కెందు వలపు గలదె. వైజ. 2.76.

వెలపోయు న క్రి వెలగానిచ్చు

గీ పడుచు పని చేసితివి రేఁగుబండ్లకొఱకు, ముత్తి యంబులు వెలపోయు ములుచగలఁడె జై భా 5 58

చ. మనగొని రేఁగుఁబండ్లకును మౌక్తికముల్ వెలపోసినట్లు దుఃర్వ్యసనముఁ జెంది కావ్యము దురాత్ముల కిచ్చితి మోసపోతి . . దా. శ. 7.

వెలమ[1] వి బ శూద్ర జాతిలో నొక యవాంతర శాఖ, ఆ శాఖకుఁ జెందినవారు

వ . అందు (శూద్ర వంశమునందు)ఁ బద్మ నాయకులన వెలమలనఁ గమ్మలన సరిసర్లన నొంటర్లన బహుప్రకార శాఖోపశాఖా భిన్నం బులైన మార్గంబులన్ ... భీమ 1. 81.

(వీరు మహాశూరులు, మిగుల క్షాత్రవంతులు.)

గీ. వరలుకరు లోక రెండువేలరసిచూడ,రాజు
లును వెలమలుం గ్రమ్మ బ్రజలు ఘనులు,
గలుగు రాయలతోం బోరి గెలువ మనకు,
వశమె యైన ఖుదా యున్న వాం డటంచు
కృష్ణ. 3 26.

క. హరమౌళి హీర మచ్యుత, చరణాబ్జ మరంద
ధార జాహ్నవి లోకే,శ్వరి తమ సోదరి
యౌనట, పురి వెలమల భాగ్యమహిమ పొగ
డంగ వశమే. పాండు. 1 112.

(ఇట శూద్ర సామాన్యపరము)

**వెలమ²** వి. ధనము, వృత్తివిశేషము.

వ. ఇప్పకప్పర మద్దిగద్దగోరు గోరంట వెలమ
యులిమిరి మూంగ వేంగిన మొదలుగం బెక్కు
తెలుంగుల బ్రూంకులు ... పి. శకుం 2 14.

**వెలమండు** వి. (వెలమ¹+వాండు.) వెలమ తెగకు
సంబంధించినవాండు.

ద్వి. పరమేశ్వరుండు తనశాసలోంతరయ, వరు
డెంచి వెలమండై యరి యప్పనంబు ... బస.
పు. 4. 877. సం.

క ధనవంతుండై న శతహలి, యను వెలమని మీంద
తేవి యన్యాయపథం, బొనరించి .. దశకు.
3 148.

**వెలమనూళ్లు** వి. బ. తెలిక జాతిలో నొకభేదము
ఈ జాతిలోని భేదాంతరములు.

పత్తిపాలు, వరియూళ్లు, కుముదాళ్లు, మట్టూళ్లు,
పోవండ్లు, ప్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండ్లు,
అడ్డనూళ్లు.

వేశా. శ. A. D. 1086. Ep. Ind 6.

**వెలమ్మనంది** వి శాకజంతు, నేలవేములోని భేదము
(వృ. వి.)

సీ వెలమనంది చివికి వెలమనంగాం గాక జంగాభి
ధానంబు చనును ... అం. ఖా. 2. 66.

**వెలమిటారి** వి (వెల+మిటారి) వేశ్య, పణ్యస్త్రీ.

గీ. విటుల తల్పిబ్బులకుం గేరు వెలమిటారి, నగవు
నేలినదాలు ... కలిగి చౌదంతి పొడమె నా
జలనిధి యందు. దశా. 2. 228.

**వెలయబ్బురము** విశ (వెల+అబ్బురము) మిక్కిలి
వెల గలది, అమూల్యము

సీ. వెలయబ్బురవుం గ్రొత్త విడి కెంపు రవగుబ్బు
గలశాలి జిగివాటి గలసి వెలయ ... ఇందు.
5 37.

**వెలయాట** వి (వెల+ఆట) 1 సురతక్రీడ, రతి.

గీ అంగరాగంబు దమ వెలయాటవంత, రంగ
రాగంబు హొనంగెడు నప్పురంబు, గట్టివాలు
పడంతులు వంతుచేతి, గట్టివాలున కొప్పింతు
రెట్టివాని కవిశ. 1 1 22.

2 ద్యూతక్రీడ, జూదము.

గీ. ... పెద్ద వెలయాటం దెగ గెలిపించువారు.
దశకు. 5 36.

**వెలయాలు** వి. ఔ (వెల+ఆలు; బ. వెలయాండ్రు,
వెలయాండ్రురు.) రోవెలంది, వేశ్య.

క వెలందియు ధరణీ విభుండును, వెలయాలును
దాసింగూడి విమలాకృతులై, వెలువడిరి యగ్ని
గుండము, జలరుహషండమున నుండి చను
దెంచు గతిన్ విక్ర. 6 133.

చ. .. బలారి కొల్వులోం, గల వెలయాండ్ర
కెల్లను శిఖామణి వివేకదా...ఉ. రా 4. 213

క. ఇల . వెలయాండ్రుర కలుపు మగల విడు
పును నతులన్ కు. సం. 8. 165.

ఉ ఆ మహితాత్ముం డొక్క వెలయాలికి మిక్కిలి
తాను గూర్పువాండై, మమతనెమ్మలంగుచు ...
విప్ర. 4. 42.

ఋుడంబడక క్రమ్మనటి వేరా,స్వామికి వెగటుగ
ననునంట, యా మాటకె యాజ్ఞ వెట్టునంట

సీ. భవ్యకల్పక పాదప పరిష్కృతాత్మీయ విపిన
శీలనముల వెగటుంబూని ... హరిశ్చ వట
2. 18

6. కృత్రిమము, తెచ్చిపెట్టుకొన్నది.

**వెలయించు** స. క్రి (√వెలయు.) 1 బయలు
పఱచు, ప్రకటించు.

క. నా పురుషత్వము గైకొని, వేపోయి దశార్ణ
పతికి వెలయించిన మీ, యాపదలు దొలంగి
చనంబొడ, మూపుము పదినాళ్లయంత మాపృత
మొసపన్. భార. ఉద్యో. 4. 387.

ఉ. అక్కట యుగ్రసేనుని మహాత్మునిఁ బల్కుట సంగరంబునం, దెక్కుడు పౌరుషంబు వెలయించుటయే పలుకందలంచితివ్, ప్రక్కక నన్నుఁ బల్కుము విరోధి నొకండన కాన నీకు నీ యుక్కివ మెన్ని చందముల నోర్వక పోవునె వేయు నేటికిన్ హరి ఉ. 30

క. జనని సతీత్వము వంశంబున విమలత్వమును దనదు భుజవీర్యము నాతనయుం డిటు వెలయించునె, యని ప్రార్థనఁ బు కాంగఁ బ్రాణమ్యతుఁడై మార్కం 8 27

2. ప్రసిద్ధి కెక్కఁజేయు.

గీ. తన మహత్త్వంబు భూమిఁ దాను వారి, పేరు వెలయింపఁ జాలు గంభీరమహిమ... హరి పూ. 1 22.

3 ప్రకాశింపఁజేయు.

మ. మహి మున్నాగమశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు దన్మహనీయ స్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవన్ మహామహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపు వాటించు నీ, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్రాపగల్భ్య మూహించెదన్ వసు. 1. 10.

క వెలయించు పట్టి యొకమణి, వెలుఁగారం గొనుము ... ఆము. 4. 283

4. కావించు

ఉ. ఈ యిల ధర్మరక్ష వెలయింప జనించిన యట్టి యాది నారాయణ మూర్తి వీవు ... విక్ర. 2. 64.

5. వ్యాపింపఁజేయు.

క. ఆజ్ఞ వెలయించె దిక్కుల ... విక్ర 4. 10.

6. కప్పు, ఆచ్ఛాదించు

సీ బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు మాహేశ్వరి రుద్రాక్షమాలఁ గూర్చె, కౌమారి వెలయించె గజచర్మ చేలంబు వైష్ణవి తోలు దువ్వలువ మడిచె ... హ 4. 87.

7. పావనము చేయు, పవిత్రీకరించు.

క. కావున విను పాత్రము మేలై విహితాచరణ సౌమ్యమగుదానముభా, శ్రీ వరదాత్రాదాతలఁ, దా వెలయించు భువన ద్వితయ రంజకతన్ భార శాం. 1. 334

8 ఉల్లాసము నొందించు, సంతోషపఱచు

శా. దంతాఘట్టిత రాజతాచలచల ద్వారి వ్యయంగ్రాహమున్. కంతుద్వేషికిఁ గూర్చి శైలజకుఁ దద్గంగా ఝురాచాంతి సంత్యంతామోదము మున్నుగా నిడి కుమారాగ్రేసరుండై పితృ, స్వాంతంబుల్ వెలయింపఁ జాలు నిభరాడ్వక్త్రుం బ్రశంసించెదన్ వసు. 1 7.

సీ.. గీ తన సహజ లక్షణములలో నెనసియుండ, నా సరోలక్ష్మి గర్భచిహ్నములు దాల్చెఁ, బరిణయము లేక కన్య గర్భమున కిట్లు, గాక వెలయింపవచ్చునె లోకములను వర. 1 83.

వెలయింతి వి. (వెల+ఇంతి) వారకాంత, పణ్యస్త్రీ.

చ సతతము బ్రహ్మ శర్వ సుర సంయమిముఖ్యుల నాత్మ సామి వెలయింతిని మోహితఁ జేయలేక ప్రాకృత జనునట్లు తాను దవగిన్నె నొసంగెను బంటుకోనమై వైజ 4 5.

మ...మాకలవ లాభ స్పృహన్, సువిలాసంబగు మేనొసంగు వెలయింతుల్ భోగ్యలే జ్ఞాన కల్పవనీవల్లి కుతారముల్ సురభిమల్లా . భూ.2 58.

(ఇట్లే వెలయువిద, వెల తొయ్యలాఁడి మొ)

వెలయు అ. క్రి. (సం. విలస్) 1. ప్రసిద్ధికెక్కు.

క కడిఁది పగఱ నేఁ దెప్పఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు కౌరవనాథుం, డెడుఁ గాక యంచు నిత్తఱి, విడువ దగునె యతని వలన వెలసిన వాఁడన్. భార. ఉద్యో. 4 65.

తే. ఒవరఁ దండ్రిచే లక్ష్మిఁ గైకొను నతండు, తండ్రిచేఁ గ్లేశములఁ బాసి తనరు నతఁడు, తండ్రిచేతన వెలయు నతఁడు మదీయ, కులము నందును లేకుండ వలయుఁ దండ్రి... మార్కం. 8 220

2 ప్రకాశించు.

(లక్ష్మివాక్యము) క.. మత్తుష్టి కర చరితులగుటఁ ద్రివిష్టప నదులకడ నిలిచి వెలసెద నని యెన్... భార శాం. 5 13.

సీ.. గీ. వెలయు నెవ్వాని యభిరామ విమలకీర్తి .. నైష. 1. 87.

గీ చూడఁజాలకు వేడ్కలొనరించు సొగసువెలయు, వెలయొసఁగు జాళువా ప్రావఁతో కలిమి వెన్న, గన్న సైకపు దువ్వటి కలువాఱ, వలరు వల రేని చెల్వాగె హావునుఁ బూని. ఇందు. 5 27.

వెలరారు అ. క్రి. (వెలయు+ఆరు.) తెల్లనగు.

సీ జలధర ప్రకరంబు వలవలనై తోఁచె వెలరారి దిక్కులు విశదమయ్యె. పద్మ. 9. 206.

వెలరు[1] వి తెల్లన, పాండిమము.

తే వెలయు కీర్తిప్రతాపాధ్యు నిమ్నఁ దలఁప, యశము శౌర్యంబు గలిగిన ట్లలరు వెలరు, గాకయును నను మత్స్యేశుఁ గాంత నేలు, విర హమున కోర్వ దను వ్యంగ్య విభవమలరు. వరన. 2 142.

వెలరు[2] = వెలలు అ క్రి వెడలు, బయలుదేఱు. (ఈ రూపము కుమారసంభవమునందే కానవచ్చు చున్నది)

గీ. తమ ముఖంబులు.. వెల్లనై పద్మ షండంబు వెలరి చనియె కు. సం 9 286.

మ. తలుకొత్తెన్ దరహాస మాననము నందట్టూర్చి పోమేను ము,తపలఁ కల్ గ్రక్కునఁ బర్వె లోల నయనాంభోజాత పత్రంబులన్, వెలరెన్ భోరనసమ్మదాశ్రు జలముద్వేగంబు రాగం బుగా, నెలమిం జిత్తము తత్క్షణంబ రతిశాత్మే శావతారంబునన్. కు. సం 9 247.

సీ. అలికలభములు . . మలయానిలాహతి వెలరిన పుష్పొడిఁ బొదివి మేనుల వింత పూఁతగాఁగ. కు. సం 325.

వెలరువాఱు అ. క్రి (వెలరు+పాఱు) 1. తెల్లనగు.

సీ. ఉదరస్థుఁ డగు బాలు నుజ్జ్వల కాంతి దావెలిఁ బేర్చునన మేను వెలరువాఱె ... నృసింహపు. 3. 131

2. వెలవెలఁబోవు, వివరమగు.

తెల్లనైరను పలుకు జగతి, నిలుపుగతి దీక కల వెలరువాఱె కు. సం. 8 166.

వెలరువోవు అ. క్రి. (వెలరు[1]+పోవు) వెలవెలఁ బోవు, వివర్ణమగు

సీ ఉద్యానములు వాపికోదకంబులు లేక వృక్ష వాటంబులు వెలరవోయె .. కాశీ 5 267.

వెలలు = వెలరు[2] అ క్రి 1. వెడలు, బయలుదేఱు

చ ... ఇంద్రు వీటవా,కిలి తలుపుల్ ప్రగాఢ పరి కీలిత ముష్టిహతిం బిగిల్చి వే వెలలుము కయ్య మిమ్మని నవేగ సముద్ధత సింహనాద సం,క లితము గాఁగఁ బిల్చుటయుఁ గ్రక్కున వెల్వడి యెన్ మహేంద్రుఁడున్. హరి ఉ 4 16

క తెలిమొగము వందు లోలా,తుల పాలపం బమరు నా చకోరముల తులా,మల శశిబింబ ములోఁబడి, వెలలక చెలరారుచుండు విధమున సతికిన్ కు. సం. 8 309.

చ చిలుకలు వల్కునో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెప్పుడున్, వెలలఁడు నందనోపవన వీథు లకై. నైష 4 24.

2. చొచ్చు, ప్రవేశించు.

సీ నలుగు వెట్ట నురంబుకుఁ బూవ చమ్మలు బిలిపి క్రిక్కిరియఁ జే వెలల దపుడు...కకుత్ 3 70.

3 అతిక్రమించు, కడచు

క ఇలువాడి ముగ్గులిడి కూ,రలు గూర్లమరించి యేల రాఁడాయెనొకో, వెలలిం బ్రొద్దని యట నీ, చెలియలు నేఁ డెదురుఁ జూచు సేవించుట కున్. వే. పంచ. 4. 56.

వెలలుచే = వెడలుచే న క్రి (√ వెలలు.) వెడలఁ జేయు. (శ. ర.)

వెలవ వి (సం విలేపి) కాఁపుడుగంజి

సీ యవలు నగ్గుగ ధేను నివహోవఁ ద్రొక్కించి వెల వయ తెఱఁగు మూకలన కాఁచి ... శార. అను. 3. 48.

వెల(లు)వడము వి సస్యవిశేషము.

ద్వి. వెలువడం బుడివోయె వెరఁగయ్యె వరగ ... విష్ణు పూ. 3 2. (శ ర)

వి ధాన్య విశేషము.

సీ. వెలవెలనై చాల వెకనవ్వు వహియుచి మురి పెంబు విఱిగిన మోముదాని ఉ రా 6 205.

వెలవెల్లనగు అ క్రి (వెలవెలన+అగు) వెలవెలఁబోవు

క ఆననములు వెలవెల్లఁగా నగ లోదవినది మీకు భార ద్రోణ 2 233

సీ నిత్య స్వతంత్రతాశ నిరతిఁ జెన్నగు మోము వేదుకష్టత వెలవెల్ల నగుట .. హరి ఉ 10 248.

వెలవెలపాటు వి. (√వెలవెల.) వైవర్ణ్యము వెలవెల పోవుట.

వ . మంజమంజీరంబోయి కెంగేల వదరంట వాటునదు కాముకుల వెలవెల పాటు కూటువం గోటికిఁ బరగలెత్తి . మను 3. 23.

వ. నీ మనం జెఱఁగియే ఁదా ముసుముస్న యనని మాటలు మూనలేవంటి మఱి మూనలించి నం క్రి. విరవనతాన వనమై నెమ్మొగంబు వెలవెల పాటు శేకగపుర నకంచి .. అము. 5 71

వెలహెచ్చు విశ (వెల+హెచ్చు) అధికమూల్యము, మిక్కిలి విలువగలది

ఉ . కంబురా నవ్నపు గుందపుప్వులపు చక్కని మైవెలహెచ్చు జాలువా, వన్నె మెఱుంగు రంగురుమువల్వ చెఱంగు దురంగలింపఁగన్. ఇందు 5 103.

వెలారించు = వెలారుచు న క్రి 1 బయలుపఱుచు

వ ఇంతవట్టును వెలారింతు నీ మాటలు మఱవ కుండుము భార ద్రోణ 4 290

2 వెడలించు, పోఁజేయు

సీ. ఏను, గదిసియుఁ గ్రమ్మఱఁ గరిపురంబు నకుఁ బోనిత్తువే ధృతరాష్ట్రుఁ డింక వగలఁ, ఆ బొగులువాఁడు గాక పోఁడిమితోనుండు, వాఁడె వీఁడు మనల నాలి వఱుపఁ, బొల్లిపడిన పాటులెల్ల వెలారింతు నధిపనిమనమున హర్ష మెసఁగ భార శల్య 2 242

అ. క్రి సంచరించు, తిరుగు

సీ. పుడమి నంతక వామమునఁ జేర్చు వైళంబు రేలు వెలారించు బేలతనము ... కృ శకుం. 1. 56.

వెలార్చు(రుచే)=వెలారించే న. క్రి 1 వెడలించు.

సీ జము దూతలట్ల ప్రాణములు వెలార్పంగనీ ద్రుపదాత్మజుఁ డెన్నఁడేని .. భార. భీష్మ 3. 405

మ వనితా రీవతి తోడఁ గూడవలతేన్ వారేల వీరేల నీ,కని నన్నా యతిరుద్ధుఁ డున్నయెడ కట్టైవన్వెలార్తెరిఁ బోయిన నాకంటు కులాభిమానఘనుఁడై యేయూని శేత్రోవయం, చనుమానించినఁ ద్రోవవన్ గోఱవిఁ జేయం జూతెదే క్రమ్మఱన్ ఉ హరి. 5 161

సీ . . తే . గానమున వెలార్చు .. ము 5 37

ఉ. దోసము పెద్దలే వనక ధూర్జటి నిష్ఠుర కంఠ హుంక్రియా.భ్యాసము మైనవల్చి యనయు స్థితిఁ గాళి వెలార్చి నిక నే, నారథి నంయ మీంద్రుల వనాథత నేమెయిఁ జూతు దయ వాటి పదమండు పేను ఘనియు వక తాము నుపేక్ష చేసెదన్. భీమ 3 11.

2 బయలు వఱచు

ము . వివిధాస్త్ర ధారలు పమిమ్మాపెన్ వెలార్చున్ ప్రభా,వతి తీవ్రద్యుతి . ఉ. హరి 1 15

క వకనకని నఱుము నక్కులు, చకచకల వెలార్చు తొడలుఁ జక్కని తొగలన్, వికవిక నగు తెలిగన్నులు, వికచకమల వదన కొనరె వేడుక మీఱన్. ప్రబం. 1 490.

ఉ. . నా మనసు పాతగలించి వెలార్చినట్టి యా, మాటలు మూఁడు నుంకువగ మానవ నాయక నీకు దక్కితిన్. విక్ర 8. 104

వెలి[1] వి (త వెళి) 1 బయలు, వెలుపల

క వగళుల లోఁలి మాటలు, దగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొంటదు గడం బుట్టినఁ బతి విన, నగు పని చెప్పెడిదిగాక యాతని తోడన్. భార విరా. 1 190.

సీ పొదఁదూఱు నొక మేటి పూరేటి వెలికిఁబోఁ దోలి కైకొనె నొక్క తోఁదిగాఁడు... మను. 4. 58.

సీ ఎల తుమ్మెదల దిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము గలవేడి కొకవింత నలువుమీఱె...పారి. 1.56

క కొలువారె యొుంగి సురగవి, వెలికిలఁబడుఁ గలవితరుపు వేఁడిన మణి యాకులపడి వండ్లిగి లించును, నలువుగ నిగుబోలఁ గలవె వరసింహ నృపా నరస. 2. 84

వ ఇట్లు కుక్కుటాసనస్థుండై యుండి రెండు చేతు లును మెడను బట్టుకొని కూర్మము వలె వెతు కిలఁ బడియున్న నది కూర్మాసనంబగు వేం. మా 3 84.

**వెలికిలు** అ క్రి 1 వెలికిలఁ బడు

చ. వలపలి కాల ముక్కునను వాత సుధాగ్రస ముప్ప తిల్ల గాఁ, వెలికిల వైచి మట్టె రణవీర శిఖామణి వీరభద్రుఁడు కాశీ 7 83

గీ ఒక్కనతి వెలికిలి యీఁద నొప్పెఁ గురులు, వీఁగుఁజన్నులు నలరాచ వేఁటకాఁడు, కోక ములఁ బట్ట నొడ్డు వాగురులు వానిఁ, దా కొనఁగఁ బెట్టు దీము పిట్టలు ననంగ వరాహ. 3 103

2 వీఁపు క్రిందుగాఁ బరుండు

చ వెలికిలి సెజ్జమీఁదఁ గడు విప్పగు కన్నులచాయ లొప్పఁ జెక్కిలి గిలికించి శ్వేతలు వగింపఁగ నుండుట యాదిగాఁగ హరి పూ 8 134

**వెలికి(లు)ల్లు** అ. క్రి 1 ఉత్తానముగు, మీఁది ముఖ ముగు

క. వెలికిలఁ జరణతలంబులు, దల మీఁదనుజేర్చి ధరణితలమున నిలువం, గలిగెడువట్లుగఁ గర ములు, నల పశ్చిమ మెత్తఁ డిట్టిభాసన మయ్యెన్ సీతారా 1 115.

2. వీపు క్రిందగు నట్లు పడు

సీ వెలికిల్లఁ బెట్టె నుత్పలగంధి యొక్కర్తు కప్పు గర్భ గృహాప కంఠమునను శివరా 2 71.

**వెలిగట్టు** వి (వెలి$^{2}$+గట్టు) రజతాద్రి, వెండికొండ.

సీ చలిగొండ వెలిగట్టు ఛాయలగిలుబాడి కొండెంపుఁ దపసిఁ గైకొనక చెలఁగి

గీ పాపరాయఁడు నెగడె నీప్రాంతమందు . . చిత్రభా 5. 10

**వెలిగడ** వి (వెలి$^{1}$+కడ) మెట్టనేల (శ.ర, బ్రౌ)

**వెలిగారము** వి. (వెలి$^{2}$+కారము) టంకణము, బంగారమునకు కాంతిని గలుగఁ జేసెడి యొక దినుసు తెల వి యుపు (శ. ర.)

**వెలిగించు** వ. క్రి (√వెలుఁగు) 1 ప్రకాశింపఁ జేయు, వెలుగఁ జేయు

క. అనరిచ్చినాన్న వ్యయని, త్యపరంజ్యోతిర్మయము, డనై శశిగాంత భు, తపనాదుల వెలిఁగించుచుం నెపుడంతట నొక్కరీతి నేను వెలుఁగుదున్. సీతారా 2 80

చ . . రామ భాస్కరుం,...తపస్వి మానసాబ్జము లలరించి వేల్పుఁగవ జక్కవఁ కొ వెలిఁగించి లోక ము, క్రమము లడంచి . ఉ. రా 1. 128

మ. .. మించు వెలిఁగింప న్మబ్బులన్ వెల్లిపై . ఆము. 4. 88

2 చెల్లించు, చెల్లఁజేయు.

సీ ఉక్కడఁగించుచు దిక్కులఁ దన యాజ్ఞ వెలి గించుచును విప్ర కులము నెల్లఁ బ్రోచుచు ... భార. ఆది 1 7.

3 వ్యాపింపఁ జేయు

ఉ ... లోకాంచితుఁడైనవాఁడు నిఖిలాగమ పుంజము నేర్పడన్ విభాగించి జగంబులందు వెలిఁగించి .. .భార ఆది 3. 47.

4 ప్రసిద్ధికెక్కఁజేయు.

మధ్యా వీని మీరెఱుఁగరె భార్గవకులము వెలిఁ గించువాని ... భార ఆది 7 187

**వెలిగిడ్డి** వి (వెలి$^{2}$+గిడ్డి) కామధేనువు.

క వెలిగిడ్డి వింటి వెలికిలఁ బడు తొడుకనఁగఁ బరగు ఖేచరగవి ... ఆ భా. 1 57

**వెలిగుల్ల** వి. (వెలి$^{2}$+గుల్ల) శంఖము

క నలువకు నెలవగు తమ్మియు, వలివెంబగు పచ్చ పట్టు వలయపు టలుగున్, వెలిగుల్లయు వన మాలయు, గలిమియు మానికము మేనఁ గలిగిన వేల్పున్ ద్వా 4 148.

**వెలిగొండ**$^{1}$ వి (వెలి$^{1}$+కొండ.) దూరమందున్న పర్వ తము (శ ర)

**వెలిగొండ**$^{2}$ వి (వెలి$^{2}$+కొండ) వెండికొండ, రజ తాద్రి

**వెలిగొడుగు** వి (వెలి$^{2}$+గొడుగు) శ్వేతచ్ఛత్రము.

వ. అతని వెలిగొడుగుల పడగల చెడంగుల నుడు గని కలిమిం దొడరి ఉ రా 4 163.

**వెలిగోరు** వి (వెలి$^{2}$+గోరు) ఐరావతము, ఇంద్రుని యేనుఁగు.

ఉ. పోటున గ్రేటునం దిరిగి బోరగిలం బడియున్న దానవుం, గాటుక కొండ నెత్తు వెలిగారు తెలం గున నెత్తి ... ఉ. హరి 4. 268

**వెలిగ్రుక్క** వి. (వెలి¹+గ్రుక్క.) మణితము, రతి కూజితము

**వెలిచవి** వి. (వెలి¹+చవి) జారత్వము, అంకు శనము

చ. వలువుల యిక్కలంటియల వమ్మిన రోసె వెలపటు టక్కవల్, తలంపని కీడు కాని యవవాయము గ్రొవ్విరి తమ్మిలచ్చికిన్, వెలిచవిగోరు దుండ గవు వేడుక క త్తెల నోముసోంత గూ,బల మణి హంబు జారులకుఁ బందువ చీకటి పర్వె నుగ్వ రన్ కవిక. 4. 83.

గీ ... తవులు కోర్కెలచే వెలి చవుల కరుగ, నందు గావక కుందు వయ్యిందువదన. శుక 2. 504.

సీ. వెలిచవుల్ మరగిన వెలఁదికిఁ బతిభంగి గళిత దంతువకు కమ్మలిక భంగి ... రాములిం 27

**వెలిచాములు** వి. బ. (వెలి²+చాములు) ధాన్యవిశే షము.

సీ. జడకొట్టి కొట్లలు చాములు వెలిచాము కుట్టారి కారికె కొండబరిగె ... హంస 4 127.

**వెలిచూడ్కి** వి. (వెలి¹+చూడ్కి) బాహ్యదృష్టి వెలుపలి చూపు (వ్యతి లోచూడ్కి)

సీ. వెలిచూడ్కిలో లక్ష్య మలఁతి బాహిరముగా మునుకొన్న శాంభవీ ముద్రవాని కృ. శకుం 3 73.

**వెలిచెల్పు** వి. ఒక జాతిపిట్ట, వర్తకపక్షి.

సీ. వెలిచె కాటుకపిట్ట కెకవ వామనపాకు పసరిక లకుముకి పావురాయి పార్వ. 3 77

చ. చిలుకలుఁ బావురంబులను జెన్నుగ హంసలఁ జక్ర యుగ్మమున్. వెలిచెల నాదిగాఁ గలుగు వింత పులుంగుల బెంచి మిక్కిలిన్, గలికిగఁ జేసి ధనా. 3. 77

ద్వి. వెలిచె లావుక యాది వేర్వేరు జాతి పులుఁ గుల నన్నిఁటిఁ బొరివుచ్చి తనిసి ... హరివం. పూ 631.

చ .. గ్రవ్వల దంబునను వెల్చెలకున్ దగముద్ద వెట్టి యొక్కెడ మఱి కాటు లాడనిడు ... శల్హా 3. (శ ర)

**వెలిచెట్టు** వి. (వెలి²+చెట్టు) కల్పవృక్షము

శా. అర్థోరాశిఁ దృణీకరించి వెలిచెట్టట్టిట్టు గావించి దృక్కర్ణ స్వర్ణపదాంగద ప్రియసఖున్ గద్దించి యుస్తామ నంపూర్ణోన్నత నీడుకోడు గనఁడీ భూలోక చింతామణి, గర్ణుం గంటివె వర్ణ నీయుఁ డబలా కర్ణాంత నేత్రోత్పలా పాంచా 2 23.

**వెలిచేను** వి. (వెలి¹+చేను) మెట్టచేను

7 ... ఆ రామేశ్వరునికి దర్భ్యంన్న అవసరానకు కాడారంభ, వెలిపొలం కోలపాటి చేను ఖ 4 అతరాలాను కోలపాటి నాలుగుపుట్లు వెలిచేనున్ యీ తథా ద శా 4 801

**వెలిచంద్ర** వి. (వెలి² + చంద్ర) తెల్లచంద్ర, కదరము (వ్య వి) (శ ర)

**వెలితి** వి. న్యూనత, కొఱత

గీ. సప్త సంతానములు నాకు సంభవించె, నొక ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ, నా వెలితి మాన నాపేర నంకితముగ, శివపురాణంబు తెనుఁగుగాఁ జేయు మొకటి భీమ. 1 24.

ద్వి. విధవతనమునకు వెలితి వొమ్మనక, విధి లేదు నతి నెడ్డ విధి యి తె యనక . పండితా. దీక్షా 43. పొ.

క. తలఁపులు సమకూరెం గద, వెలితేమియు లేక యుంక వేంచేగుఁదఁబున్ ... యయా 6. 148.

2 విరళత, తఱచుఁదనము లేమి

ద్వి. వెలితి గాన గరాని విమల పూరములఁ, బొలుచు వీచులరాలు పుప్పాళ్ల జడియు . రం రా ఉ 1 6 పొ 21 పం

విశే. 1 తక్కువైనది, న్యూనము

గీ. ఒడలు నొలియించి యదువీరుఁ డొడిసిపట్టి యమ్మహాశక్తిఁ గ్రమ్మఱ నతని వైచె, మరము గాడఁగ భూపతుల్ తి గి చూడ, వేగ నదిచేసె నించుక వెలితిచావు ఉ. హరి 3 76.

గీ. తొంబనూటను తొంబది తొమ్మిదియును, జలజ ములు పూజచేసెను శార్ఙ్గపాణి, వేయిటికి నొక్క పద్మంబు వెలితియైన, నహహ నియమంబునకు భంగమయ్యెననుచు భీమ 6. 64,

గీ ఏమి చెప్పెడుదాన మీరెఱుకలేవు, సకల విద్యలు భూసుర సమితి కెల్ల,నజున కెనవత్తు రన్నింటి నకట మీర, లల ముకుందుని కన్న నే వెలితి చెపుడు. రాజ చ 8 20

2 పూర్ణము కానిది, నిండనిది

గీ బహుసహస్ర సంఖ్యలు గల పసులకెల్ల, నిడుపు దగిన యిమ్మెయ్యది యిచట ననకుc,డెనసి త్రైలోక్యమును వచ్చెనేని నిమ్ము, గలదు మెండియు వెలితియ కాcగ నుండు హరి పూ. 7. 182.

క. నిండార జలముc ద్రావియు, మెండియు మెండియును గడుపు వెలితిగc బైపై, నొండొండ క్రోలి జలరుహ, మండంబులతోడc గ్రీడ నల్పుచుమండన్. వాల్మీ 1 86

3 తఱచుcదనము లేనిది (శ ర)

వెలితిపడు అ క్రి. (వెలితి + పడు.) తక్కువగు, తగ్గు

గీ. ప్రతిదినము దశవాటీ పురంబునందు, మలయ వేలావనీ మందమారుతంబు, గంధసారలతా కుడుంగముల మెలcగు, చిలువ లేములు సేవింప వెలితిపడుచు. భీమ 1. 87

వెలితి(ది)ప్ప వి (వెలి²+తిప్ప) రజతగిరి, కైలాసము

సీ వెలిదిప్ప ముక్కంటిమల మెండికొండనాc గైలాన పర్వతాఖ్యలు చెలంగు. ఆం నం. స్థా. 1.

వెలితుమ్మ వి (వెలి²+తుమ్మ) తెల్లతుమ్మ, విట్ఖదిరము (వృ వి) (శ ర)

వెలిదమ్మి వి (వెలి¹+తమ్మి) వెల్ల దామర, పుండరీకము

సీ. ఉత్కంఠ రమసంబు నొలవు గీటడcగించి వెలిదమ్మి తుటుములc జులకcజూచి పె శకుం 1. 48

ఉ వెలిదమ్మి భావికిం, జెంగట నుల్లిసిల్లు తులసీ వన సీమ శుభాంగి అము 5 4.

గీ తెలిదమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనcగను దేజరిల్లుc బుండరీకంబు .. ఆం.భా. 1. 164.

వెలిదుక్కి వి (వెలి¹+దుక్కి.) నీళ్లుకట్టక వానతడిచే దున్నుట. (శ ర)

వెలిద్రొబ్బు న క్రి (వెలి¹+ద్రొబ్బు) వెలికిc ద్రోయు, బయటికిత్రోయు.

సీ. వలcద శూలముతోడ నలిమబ్బు నలమబ్బు వెలిద్రొబ్బు గరళ కృద్గళముతోడ ఉ రా, 1 260

వెలిపట్టు వి (వెలి¹+పట్టు) తెల్లని పట్టు వస్త్రము.

గీ ఎటిcగి యమ్మేటి కాముసుంగిడిన జిలుcగుc, జలువ వెలిపట్టు దొలగించి సరగలేచి, సరభ సంబున పట్టపానంబు సేయ, వింశతి భుజుండు భీతిల్లి వివశుcడయ్యె ఉ రా 5. 56

వ నన్న వలిపెంబులును వెలిపట్టులును పాంబట్టులును పులిగోరుపట్టులును .. ద్వా 3 206.

వెలిపట్టు జీబులు వి. బ (వెలిపట్టు+జీబులు) వస్త్రవిశేషము

సీ సంపంగి కావులు చందురు కావులు వెలిపట్టు జీబులు వేటచాళ్లు . ప్రబంధ. 2. 72.

వెలిపము = వలిపము వి. సన్నని తెల్లని వస్త్రము.

సీ వెన్నెల పొరవంటి వెలిపంబు చెంగావి జిలుcగు పావడ మీcద నలవరించి . యయా 2. 88.

(శ. ర. పా. వెలిపట్టు వలిపంబు జిలుcగుc బావడ మీcద .. ముద్రి. పా.)

ప్రయోగాంతరము లభింపలేదు

వెలిపారము వి అయోధ్యాపుర ప్రాకారాదికము.

మ. తలపై నన్ను ధరించి భూవరుcడయోధ్యా ప్రాగ్దిశా ప్రాంగణ, స్థలి యందున్ సరయూ తటంబునc బ్రతిష్ఠానంబు శ్రీరంగమున్ వెలిపారం బనcగా నయోధ్య భవనావిర్భావమున్ గోపురంబులు ప్రాకారము లాయతించె సుక శిలుఎల్ వచ్చి నిర్మింపcగన్. శ్రీరం. మా 2 117.

వెలిపోవు అ క్రి (వెలి+పోవు) పైకిపోవు.

ద్వి. అటుల పైcబడు గయాళి ద్రోయాలి, పటు ద్రోచిగుండె ఝల్లని వెలిపాఱ, హా పరమేశ మహాదేవ యనుచు, భూపసూనుcడు సొమ్మc బొంది వే తెలిసి . ద్వి ఠి పా 1 15 పా. 26. పం.

ఉ పొట్టున బ్రేటునం దిరిగి బోరగిలం బడియున్న దానవుం, గాటుక కొండ సెత్తు వెలిగారు తెఱం గున నెత్తి .. ఉ. హరి 4 268

**వెలిగ్రుక్క** వి. (వెలి¹+గ్రుక్క) మణితము, రతికూజితము

**వెలిచేవి** వి. (వెలి¹+చవి) జారత్వము, ఱంకుతనము

చ వలువుల యిక్కలంటియల వమ్మిన రో వెలపఁట జక్కవల్, తలఁపని కీడు కాని యవదాయము గ్రొవ్విరి తమ్మిలచ్చికిన్, వెలిచవిగోరు దుండగవు వేడుక కత్తెల నోమునోఁత గూబల మణి హాంబు జారులకుఁ బండువ చీకటి వచ్చె నుర్వరన్ కవిక. 4. 83.

గీ ... తవులు కోర్కెలచే వెలి చవుల కరుగ, నందు గావక కుందు వయ్యిందువదన. శుక 2 504.

సీ వెలిచవుల్ మరగిన వెలఁదికిఁ బతిభంగి గళిత దంతువకు శష్కులిక భంగి . రామలిం 27

**వెలిచాములు** వి బ. (వెలి²+చాములు) ధాన్యవిశేషము.

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చాములు వెలిచాము కుట్టారి కారికె కొండబరిగె .. హంస 4 137.

**వెలిచూడ్కి** వి (వెలి¹+చూడ్కి) బాహ్యదృష్టి వెలుపలి చూపు (వ్యతి లోచూడ్కి)

సీ. వెలిచూడ్కిలో లక్ష్య మలఁతి బాహిరముగా మునుకొన్న శాంభవీ ముద్రవాని కృ. శకుం 3. 73.

**వెలిచె ల్వె)** వి ఒకజాతిపిట్ట, వర్తకపక్షి.

సీ. వెలిచె కాటుకపిట్ట తెళవ వామనపాకు పారిక లకుముకి పావుశాయి పార్వ. 3 77

చ చిలుకలుఁ బావురంబులను జెన్నుగ హంసలఁ జక్ర యుగ్మముల్. వెలిచెల నాదిగాఁ గలుగు వింత పులుంగుల జెంచి మిక్కిలిన్, గలికిగఁ జేసి. ధనా 3. 77

ద్వి. వెలిచె లావుఁ యాది వేర్వేరు జాతి పులుఁగుల నన్నిఁటిఁ బొరివుచ్చి తనిసి .. హరిశ్చ. పూ 631

చ ... బ్రల్లదంబునను వెల్చెలకున్ దగముద్ద వెట్టి యొక్కెడ మఱి కాటు లాడనిడు ... భల్లా 3 (శ ర)

**వెలిచెట్టు** వి (వెలి²+చెట్టు) కల్పవృక్షము

శా. అర్ణోరాశిఁ దృణీకరించి వెలిచెట్టట్టిట్టు గావించి దృక్కర్ణ స్వర్ణపదాంగద ప్రియసఖున్ గద్దించి యుద్దామ సంపూర్ణోద్వారత నీడుకోడు గనఁడీ భూలోక చింతామణి , గర్జుం గంటివె వర్ణనీయుఁ డబలా కర్ణాంత నేత్రోత్పలా పాంచా 2 23.

**వెలిచేను** వి· (వెలి¹+చేను) మెట్టచేను

7 . . ఆ రామేశ్వరునికి దర్భ్యాంన్న అవసరానకు కాడారఁభ వెలిపొలం కోలపాటి చేను ఖ 4 అతరాలాను కోలపాటి నాలుగుపుట్లు వెలిచేనున్ యీ తథా ద శా 4 801

**వెలిచంద్ర** వి (వెలి² + చంద్ర) తెల్లచంద్ర, కదరము (వృ వి) (శ ర)

**వెలితి** వి న్యూనత, కొఱఁత

గీ సప్త సంతానములు నాకు సంభవించె, నొక ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ, నా వెలితి మాన నాపేర నంకితముగ, శివపురాణంబు తెనుఁగుగాఁ జేయు మొకటి భీమ. 1 24.

ద్వి విధవతనమునకు వెలితి వొమ్మనక, విధి లేదు నతి సెడ్డ విధి యి తె యనక .. పండితా. దీక్షా 43. పొ.

క తలఁపులు నమకూరెం గద, వెలితేమియు లేక యింక వేంచేయుఁదగున్ ... యయా 5. 148.

2 విం ళత, తఱుచుఁదనము లేమి

ద్వి వెలితి గాన గరాని విమల పూరములఁ, బొలుచు పీచులరాలు వుపొవ్వల్ల జడియు రం రా ఉ. 1 6 పొ 21 పం

విణ. 1 తక్కువైన, న్యూనము

గీ ఒడలు నొలియించి యదుపీరుఁ డొడిపిపట్టి యమ్మహోశక్తిఁ గ్రమ్మఱ నతని వైచె, మరము గాడఁగ భూపతుల్ తి గి చూడ, వేగ నదిచేసె నించుక వెలితిచావు ఉ. హరి 3 76.

క తొంబనూఱును తొంబది తొమ్మిదియును, జలజములు పూజచేసెను శార్ఙ్గపాణి, వేయిటికి నొక్క పద్మంబు వెలితియైన, సహహ నియమంబునకు భంగమయ్యెనమచు భీమ 6 64,

గీ ఏమి చెప్పెడుదాన మీరెఱకలెవు, సకల విద్యలు భూసుర సమితి కెల్ల,నజున కెనవత్తు రన్నింటి నకట మీర, లల ముకుందుని కన్న నే వెలితి చెపుడు. రాజ చ 3. 20

2 పూర్ణము కానిది, నిండనిది.

గీ బహుసహస్ర సంఖ్యలు గల పసులకెల్ల, నిడుపు దగిన యిమ్మెయ్యది యిచట ననకుఁ,జెనసి త్రైలోక్యమును వచ్చెనేని నిమ్ము, గలదు వెండియు వెలితియ కాఁగ నుండు హరి పూ. 7. 182.

క నిండార జలముఁ ద్రావియు, వెండియు వెండియును గడుపు వెలితిగఁ బైపై, నొండొండ క్రోలి జలరుహ, షండంబులతోడఁ గ్రీడ సల్పుచుమండన్ వాల్మీ 1 86

3 తఱుచుఁదనము లేనిది (శ. ర)

**వెలితిపడు** అ క్రి. (వెలితి + పడు.) తక్కువగు, తగ్గు

గీ. ప్రతిదినము దక్షవాటీ పురంబునందు, మలయ వేలావనీ మందమారుతంబు, గంధసారలతా కుడుంగముల మెలఁగు, చిలువ లేమలు సేవింప వెలితిపడుచు భీమ 1. 87

**వెలితి(ది)ప్ప** వి (వెలి² + తిప్ప) రజతగిరి, కైలాసము

సీ వెలిదిప్ప ముక్కంటిమల వెండికొండనాఁ గైలాస పర్వతాఖ్యలు వెలుఁగు . అం నం. స్థా. 1,

**వెలితుమ్మ** వి (వెలి² + తుమ్మ) తెల్లతుమ్మ, విట్ఖదిరము (వృ వి) (శ ర)

**వెలిదమ్మి** వి (వెలి¹ + తమ్మి) వెల్ల దామర, పుండరీకము

సీ ఉత్కంఠ రమసంతు నొఱపు గీటడఁగించి వెలిదమ్మి తుటుములఁ జుఱకఁజూచి పె శకుం 1 43

ఉ .. వెలిదమ్మి భావికిం, జెంగట నుల్లసిల్లు తులసీవన సీమ శుభాంగి అము 5 4.

గీ తెలివమ్మి వెలిదమ్మి వెల్లదమ్మి, తెల్లదమ్మి యనఁగను దేజరిల్లుఁ బుండరీకంబు .. అం భా. 1. 164,

**వెలిదుక్కి** వి (వెలి¹ + దుక్కి.) నీళ్లుకట్టక వాన తడిచే దున్నుట (శ ర)

**వెలిద్రొబ్బు** స క్రి (వెలి¹ + ద్రొబ్బు) వెలికిఁ ద్రోయు, బయటికిఁద్రోయు.

సీ. వలుఁద శూలముతోడ నలిమబ్బు నలమబ్బు వెలిద్రొబ్బు గరళ కృద్గళముతోడ ఉ రా, 1 260

**వెలిపట్టు** వి (వెలి¹ + పట్టు) తెల్లని పట్టు వస్త్రము.

గీ ఎఱిఁగి యమ్మేటి తామునుంగిడిన జిలుఁగుఁ, జలువ వెలిపట్టు దొలగించి సరగలేచి, సరభసంబున వట్టహాసంబు సేయ, వింశతి భుజుండు భీతిల్లి వివశుఁడయ్యె ఉ రా 5. 56

వ సన్న వలిపెంబులును వెలిపట్టులును హొంబట్టులును పులిగోరుపట్టులును . ద్వా 3 206

**వెలిపట్టు జీబులు** వి. బ (వెలిపట్టు + జీబులు.) వస్త్రవిశేషము

సీ సంపంగి కావులు చందురు కావులు వెలిపట్టు జీబులు వేటచాళ్లు . ప్రబంధ. 2. 72.

**వెలిపము = వలిపము** వి. సన్నని తెల్లని వస్త్రము.

సీ వెన్నెల పొరవంటి వెలిపంబు చెంగావి జిలుఁగు పావడ మీఁద నలవరించి యయా 2. 88.

(శ ర. పా వెలిపట్టు వలిపంబు జిలుఁగుఁ బావడ మీఁద ముద్రి. పా.)

ప్రయోగాంతరము లభింపలేదు

**వెలిపారము** వి అయోధ్యాపుర ప్రాకారాదికము

మ. తలపై నన్ను ధరించి భూవరుఁడయోధ్యా ప్రాగ్దిశా ప్రాంగణ, స్థలి యందున్ సరయూతటంబునఁ బ్రతిష్ఠాపంబు శ్రీరంగమున్ వెలిపారం బనఁగా నయోధ్య భవనావిర్భావమున్ గోపురంబులు ప్రాకారము లాయతించె సుర శిల్పుల్ వచ్చి నిర్మింపఁగన్. శ్రీరం. మా 2 117.

**వెలిపోవు** అ క్రి (వెలి + పోవు) పైకిపోవు.

ద్వి అటుల పైఁబడు గయాళి ప్రోయాలి, వటు ద్రోచిగుండె ఝల్లని వెలిపోవ, హా పరమేశ మహాదేవ యనుచు, భూపమానుఁడు సొమ్మఁ బొంది వే తెలిసి ... ద్వి తి పా. 1. 15. పా. 26. పం.

**వెలిపించు** స. క్రి (√వెలి¹) వెలిపఱచు, బయటకు రప్పించు
సీ భగదత్త తనయుండు బాహు గర్వంబున బాల్యసిద్ధంబగు లౌల్యమునను, బరి నిర్గమించి యత్తురగంబు వెలిపించి కొనిపోవఁ గాంచి ... భార అశ్వ 4 21.

**వెలిపుచ్చె** వి. (వెలి²+పుచ్చె) తెల్లపుచ్చ.
క. భూకాంత నీరువట్టుకుఁ, గాక వదన మిలుక రింపఁ గాన్పించిన పం,క్తో కాకన వెలిపుచ్చలు, లోకములోఁ గాచె నిట్లు లోఁబడె జనముల్. వరాహ 10. 30

**వెలిపుచ్చు** స. క్రి (వెలి¹+పుచ్చు) బయటఁబెట్టు
క జనపతి యెవ్వరి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి మదిఁదెలియ వెఱుం,గెన యేనిఁ దాను వెలిపు,చ్చునె మునుము న్నెట్టి పాల నుండును దానిన్ భార. విరా 1 134
వ తన యంతర్గతంబును సకలంబు నాకు వెలిపుచ్చ సిగ్గువడి పద్యత్రయంబుగా రచించి యొక్క కేతకీపత్త్రింబున లిఖించి ... కేయూర 4 142

**వెలిపె(వె)ట్టు** స క్రి (వెలి¹+పెట్టు,) బహిష్క రించు, సంఘమునుండి దూరముచేయు
సీ. వెలిపెట్టిరే వాడబులు పరాశరుఁ బట్టి దాశ కన్యాకేళిఁ దప్పుచేసి ... మనుచ 2 73.
గీ ఏమి గుడువంగ వచ్చినారిండ్లు విడిచి, హరుని వెలివెట్టినట్టి యీ యాగమునకు ..కాశీ.7 66.
సీ .... తెలి మెట్టదమ్ముల వెలివెట్టఁగాఁ జాలు శ్రవణాంత కాంత నేత్రముల వాని . దశా 8 27

**వెలిపొలము** వి (వెలి¹+పొలము) మెట్టచేను
శి. .. ఆ రామేశ్వరదేవునికి దథ్యంన్న అవస రానకు కాడారంభం వెలిపొలం కోలపాటి చేను ఖ 4 అశురాలాను కోలపాటి నాలుగుపుట్లు వెలిచేనున్ యీ తథా. ద. శా. 4.801.

**వెలిఁబడు** అ. క్రి. (వెలిన్¹+పడు) సంఘమును-డి బహిష్కృతుఁ డగు,
సీ. . గీ. తనరు వెలిఁబడ్డవాఁ డనఁగను బహి ష్కృతుండు ... అం భా 8 12

**వెలిఁబర్వు** అ క్రి (వెలిన్+పర్వు.) బయటకు ప్రస రించు,
ఉ ... మది నాఁటిన పంచసాయకా, నూన లతాంత కోరక సముత్కరముల్ వెలిఁబర్వ నోయనన్. వసు 6 88.

**వెలిబిత్తరి** వి (వెలి¹+బిత్తరి,) గాయమాన భేదము, మల్ల బంధ విశేషము
వ విష్ణుచక్రంబును రామబాణంబును నాగ బంధ బును తోలంకరి మెఱుపును, అల్లిమత్తును విస్సందు హస్తాభరణంబును పదఖండనంబును నురిత్రాడును లోబిత్తరియు వెలిబిత్తరియు సర్వాంకుశంబును మొదలుగాఁ గల పదిరెండు గాయమానంబులును ప్రబంధ. 78
వ పదఖండనంబును లోబిత్తరి వెలిబిత్తరి సర్వాం కుశంబు అల్లిమత్తును మల్లు పు 368.

**వెలిబూది** వి (వెలి²+బూది) తెల్లనివిభూతి
సీ. శ్రీకాళహస్తి గౌరీపతి స్తోత్రముల్ పెట్టిన వెలిబూది పెండెకట్టు ... కాశీ 4. 103
సీ అలసాత్త్వికము మేన నంతట నిండెనాఁ బొలు పైన వెలిబూది పూఁత దనర ... ఇందు 1 161.

**వెలిమల** వి (వెలి²+మల) కైలాసపర్వతము వెండికొండ
లయవిభాతి. మొలను బులితోలు వెలిమలను బలు ప్రోలు వలిఁ జిలుకు తలజాలు మెయిఁగులుకు జవరాలున్, గలిగి కడు మేలు పజకెలమి నిడ మేలుగని చెలఁగి జగమేలుచును వెలుఁగు నెఱ వేల్పా ... అచ్చ రా బాల 2 16

**వెలిమాడు** వి (వెలి¹+మాడు) విదేశముల కంపఁ బడు ధాన్యాదికము (శ ర)

**వెలిమావు** వి (వెలి²+మావు) ఇంద్రుని తెల్ల గుఱ్ఱము, ఉచ్చైశ్శ్రవము, తెల్లగుఱ్ఱము
సీ వరుసలు పెట్టి దువాళింప నుడివడి వెలిమావు మోపదు వెనుక కాలు . వరాహ. 10 15.
సీ మిగులఁ గుప్పసము పన్నగలోక భర్తకు వేఱొక్క వెలిమావు వేల్పు దొరకు...రామా 1 47
వ వర్మంబులుసించుచు నొక్కళ్ళొకళ్ళ వెలిమావులం డగలం దాఁక నేయుచుం జేరి పోరుసమయం బున ... భార. భీష్మ 2 42.

**వెలిమావుజోదు** వి (వెలిమావు+జోదు) ఇంద్రుఁడు
వ. మేచాయలు వెలిమావు జోదున కెటిఁగించు
పై మెఱుంగులును . అచ్చ మా 2.31 పొ

**వెలిమిడి**=వెల్మిడి వి (వెలి$^{2}$+మిడుఁగు)
1. విభూతి, భస్మము
సీ వెలిమిడి నలికంబు చెలువంగఁ బోవుచు తెలు
పార మైనిండ నలఁదికొనుచు ..కు సం 8 66.
2 బూడిద
క. ఆ మాటలు విని రోగ, గ్రామణి గోపించి కుడి
కరంబుల రెంటన్, దామోదరు నురము
పయిన్, వేమఱు మిడుఁగుఱులతోడి వెలిమిడి
చల్లెన్ ఉ హరి 6 86
ఆ. నీరు నెత్తు గనిన నిడివగు నాయువు, మంట
గంట పసిఁడి పంటగంట, తెలుపులెల్ల మేలుగల
లోన వెలిమిడి, యెముక ప్రత్తి లవణముముక
దక్క. ద్వా 8 73.

**వెలిమొట్ట** వి. (వెలి$^{2}$+మొట్ట) మత్స్యవిశేషము
సీ బేడసంబుల నిచ్చె వేడుకకాంద్రకు గెండెల
బలు దుండగీల,కిచ్చె, వెలిమొట్టలను దండువల
తలార్లకు నిచ్చె కొడిశల పరిహాసకులకునిచ్చె
ద్వా. 1 240

**వెలిమ్రాను** వి. (వెలి$^{2}$+మ్రాను) కల్పవృక్షము,
దేవతరువు (శ ర)

**వెలిమొన** వి. (వెలి$^{1}$+మొన) మల్లవిద్యావిశేషము,
పండ్రెండు మొనలలో నొకటి
వ లోమొన వెలిమొన యుసిమొన ముమ్మొన చతుర
మొన సరిశాళంపుమొన యాదిగాఁగల పది
రెండు మొనల నారితేరి హంస 1 206
వ లోమొన వెలిమొన యుసిమొన చదురుమొన
పుణ్యంపుమొన పాపంపుమొన చాటడుగుమొన
దాటడుగుమొన కదలుమొన యరమీటుమొన
నెరమీటుమొన సరిశాళంపుమొన అను పది
రెండు మొనలు ప్రబంధ 78

**వెలియగు** అ. క్రి (వెలి$^{1}$+అగు) 1 బహిష్కృత
మగు
క. చలముకొని యిట్టు వడయఁగ, వలయునె
రాజ్యంబు దీన వచ్చిన కలిమిం, గలుగునె
పెంపును బేరును, వెలియైతిమి లోకమునకు
వేయును వేలా భార ద్రోణ 5. 352
2 లోబడకయుండు
క. ఇల నెవ్వడు తనయాజ్ఞకు, వెలియై వర్తించు
వేద విప్రుని నైనన్, దలఁద్రెవ్వ నేసిచంపుఁడు,
తొలఁగక మీఁనుచుఁ బల్కె దుష్టభటాళిన్.
వి పు 2 105

**వెలియాకు** వి (వెలి$^{2}$+ఆకు) తెలనాకు, తమల
పాకు, నాగవల్లిదళము.
సీ విమలా లతాతన్వి వెలియాకు మడుపుతో
నడుగుఁ జాయక వెంటనంటి నడువ ... దశా
3 144
సీ. కడఁకతో వెలియాకు కుడుపు లెమ్మెను జేతి
వొసఁగెడు తొయ్యలిఁ గసరెదేమి .. నీలా
3. 86

**వెలియార్చు**=వెలార్చు స క్రి బయలుపఱచు.
సీ మగరాల మొగముట్టు నిగనిగల్ వెలియార్చు
హురుమంజి ముత్తెంపు సరిపెణీలు . చంద్రా.
2 68.

**వెలియావు** వి (వెలి$^{2}$+ఆవు,) కామధేనువు.
సీ. జోగుల వెలియావే నోయగంబుల ప్రోవ కని
కరంబుల తావ కావుకావు ... అచ్చ రా.యు
48

**వెలియు**=వెలుచు$^{2}$ అ క్రి 1. వాన కురిసి నిలుచు
ఆ. అచట నిలుచునంత నవ్వాన వెలియఁగ
నొకఁడు వచ్చె వాని యొద్దకేను ద్వా 3.84.
గీ తెలియ నింతయు వర్షంబు వెలియదాయె ...
విప్ర 3 67
క పెనువాన యింతట వ్వెలి,సిన నేగతిఁబోదురిత్త
చేతుల తోడన్ శుక 3 254.
2. రంగుచెడు, చాయతగ్గు,
(వ్యావ) ఆ చీర వెలిసి పోయినది
(ఈ యర్థమునఁ దఱచుగా దీనికి 'పోవు' అను
ప్రయుక్తము)

**వెలియునికి** వి. (వెలి$^{1}$+ఉనికి) ప్రవాసము, పర
దేశములో నుండుట (శ ర)

**వెలియొనర్చు** స క్రి (వెలి$^{1}$+ఒనర్చు) బహిష్క
రించు, వెలివేయు.

సీ. కలుపల చెలికాని వెలియొనర్చి .. నీలా 1. 42.

**వెలివాడ** వి (వెలి¹+వాడ.) చండాలవాటిక, మాల పల్లె

సీ. వెలివాడఁ బని క్రొత్త మలకడాల్గొని నూనె యిడి తంగెడాకు గట్టెడు తహతహా ... అము. 7. 7

వ. అని విస్తృత నిమేషంబు గీలించి ముకుళిత పక్ష్మాంచలంబును జిహ్మ తరతరళతారోదరంబును నగు వీక్షణంబున నవ్వెలివాడ వ్రీడావతి నీక్షించుచు. శివరా 3 86

ద్వి. తవిలి యీ వెలివాడ తలిరాకుఁ బోండ్ల, మన్నించి సకల సామ్రాజ్య భోగములఁ, తెన్నొందు .. ద్వి. హరిశ్చ పూ. 1342 పం

**వెలివాడచేడియ** వి (వెలివాడ+చేడియ) చండాల స్త్రీ.

వ. ఇవ్విధంబునఁ బాడిన నవ్వెలివాడ చేడియల నిరుపమాన గాన విశేషంబులకుఁ బరితోషంబు నొంది హరిశ్చంద్ర ధరిత్రీ వల్లభుండుల్లంబున నంతసిల్లి . హరిశ్చ. 2. 108

**వెలివాఁడు** వి (వెలి¹+వాఁడు) చండాలుఁడు.

చ. .. మదిం, బనయొక యింతలేక పెఱ ప్రాణు లనుం బొరిగొంచు నెప్డు దుర్వ్యసనతఁ గూరి యున్న వెలివాండ్రుర పల్లియఁ జేరి యయ్యె దన్ భార. శాం 3 284

చ. నిలచినఁ గొంతసేపటికి నీలగళాపరమూర్తి యైన య, య్యనఘుఁడు మౌనవృత్తి విడి యతులు విప్పి కవంగ నంత లో, పలఁ దిరుగంగ మ్రొక్కి వెలివాఁడ మనుష్యుఁడ పెద్దయాఖ్యుఁ డన్, ఖలుఁడను నన్ను శిష్యునిగఁ గైకొని వేగఁ గృతార్థుఁ జేయవే. చెన్న 5 217

**వెలివాడవాఁడు** వి (వెలివాడ+వాఁడు) చండాలుఁడు, మాలవాఁడు

సీ. ప్రార్థింప నున్నాఁడు పాదాగ్రముల వ్రాలి వెలివాడవాఁడు తద్విప్రకులుని కాశీ 7 240

**వెలివాఱు** వి. (వెలి+పాఱు) వేఁటాడెడి తావున బయట చుట్టు పాఱించెడు బోఁగు.

క వెలివాఱును గాలఁగులును, వలలుఁ దెరలు దీమములును వడిఁదీరిన కుక్కలు నారె గోలలును మంచులక్రోవులు వేటకారడంబుఁ బెనుపఁగన్. ఉ హరి 4 22.

**వెలివిడుచు** స క్రి (వెలి¹+విడుచు) వ్యయపెట్టు, వెచ్చించు

క కలిమికిని దగిన కొలఁదిని, నెలవుగ వెలివిడువ కున్న నిలుపెక్కడిదోఁ, గలయఁగ నిండిన చెఱువున, కలుఁగిచుక లేకయున్న యాఁగని భంగిన్ ద్వా 2 156.

**వెలివిరియు**=వెల్లివిరియు అ. క్రి. (వెలి¹+విరియు)

1 బయలుపడు

క. వెలు వెలుకఁబాఱె దేహము, అలసత నడుపులను జెయ్యులందును దోఁచెన్, వెలివిరిసెనాభి జఠరము, కలకంఠికిఁ బొడవుదోఁచి కానఁగ వచ్చెన్.

వ .. కూర్మి లజ్జావశంవదయై వెలివిరియంగా నీక . అము. 5 55.

వ మానసంబులోనన పూనియుండి యిప్పటి నీ దుండగంబు వలనఁ గలిగి వెలివెరియనిచ్చితి . కళా 1. 81

2 ఉబుకు.

చ .. భీష్ము నందఱున్, బలిసి భవత్తనూజులు మనంబులు నిండి ముదంబు మోమునన్, వెలి విరియంగ నేఁగిరి నవీన విభూతి నివాస భూమికిన్ భార భీష్మ 3. 275

3. పొంగు.

క వెలివిరిసి వచ్చు జలనిధి, పొలుపునదోఁతెంచు ధర్మపుత్రుని బలుగో, త్తల నిలువరింపనీ వొక, చెలియలికట్టవయి మమ్ముఁ జేకొను మిచటన్ భార భీష్మ 3. 244.

4. వ్యాపించు

క... భూమిలో వెలి, విరిసె నధర్మంబు యోగ విధ్వంసకమై దశకు 11. 111

**వెలివిసరు** అ క్రి. (వెలి¹+విసరు) 1. పైకి ప్రసరించు.

క ..విరిసెత్తా, వి సరంబులు దిగిచి వలపు వెలి విసరంగన్. సారంగ 2 82.

(మోహము బయలుపడు అని యర్థాంతరము )
గీ ...వెలి విసరదయ్యె దైత్యేంద్ర విభునియార్పు
దశా 4. 27

2. బయలుపడు
క విరసము నెఱసాహసమున్, బొరిగొన నెట్లు
భయసైన్యములు పోరన్ ర, క్తరసతరసములు
గదురఁగ, శరనిధి సత్త్వములు వెలివిసరిరాఁ
దొడఁగెన్ వేం పంచ. 4 14

క. ఆ చిత్ర ఫలక మెవ్వరు చూచిన వెలివిసరి
యపుడు మున్బెడునది నీ, వే చూచుచేను
జూచుట, యో చంచలనయన యింతయు
నెఱుఁగుదువే ప్రభా 1 135.

వెలి వెలి విశ పైపై, బాహ్యము.
('వెలి' యొక్క ఆమ్రేడిత రూపము )
సీ వెలివెలి వస్తువుల్ విడిచెఁబో నరుఁడు గర్మిష్ఠ
తంగాదె శరీర యాత్ర, నడపువాఁడది మోక్ష
ణంబు గానేరదు శారీర సౌఖ్య వంసక్తి వదలి...
భార శాం. 1 85

వెలివేయు స క్రి (వెలి1+వేయు ) బహిష్కరించు,
సంఘమునుండి దూరముగాఁజేయు
ద్వి వెంగలిగా మిమ్ము వెలివేసె నొకఁడు ...
భల్లాణ 2 భా (శ ర.)

వెలివోవు అ క్రి. (వెలి1+పోవు.) పైకిఁబోవు
సీ విభుమూర్తి యేమియు వెలివోవఁగానీక తన
కన్నుఁగవఁ ద్రావికొనఁగనిచ్చు .. దశకు,
4. 64.

క, అనుటయు రెండవ పక్షం, బనిమిషవర తప్ప
దెట్టి యర్థమును దగు,ల్కొనఁ దివియక వెలివో
వి,చ్చునె బుధుఁడూహించి చేయు సుకవిత్వం
బుల్. ప్రభా. 2. 5,

వెలిసల్పు(లుపు) స. క్రి. (వెలి1+సల్పు) బయలు
పఱుచు.
సీ. వెలిసల్పనీక యిచ్చెలువ మీ మాతామహుండు
దాపంబున నునిచె.. దశకు 8. 85.

వెలిసె వి ఇంటి చూరు యొక్క లోపలి భాగము.
(వా )

వెలు వి. వృత్తియందు 'వెలి' శబ్దమునకు వచ్చెడి
యాదేశము.
ఉదా వెలుపల, వెలువడు మొ,

వెలుఁగారు అ. క్రి (వెలుఁగు+అరు ) ప్రజ్వలించు
క ...వాసవపౌత్రుం, డా రూఢ తేజుఁడై వెలుఁగా
రెను హుతవహ్ని క్రియ రణాంగణవేదిన్...
భార భీష్మ 2 176.

వెలుఁగు అ క్రి. 1. ప్రకాశించు.
చ ..శిఖాచయంబులన్, వెలిఁగెడి దానిఁగాంచి
రరవింద నిశానన లమ్మహోదధిన్ భార
ఆది 2 28

గీ గగనమున నుండి డిగ్గి సత్కార యుక్తి,వెలిఁగె
హిమపర్వతాంతర స్థలమునందు, నిర్మలంబైన
నిధిలోని నీడఁదోఁచు. విఁదుబింబంబులను బోలి
ఋషిగణంబు. హర 4. 52.

గీ వివిధ మాణిక్య దీపముల్ వెలుఁగుచుండ....
దశా 1 262

2 జ్వలించు, మండు
ఆ ...హవ్యవాహ తొంటియట్ల వెలుంగఁగ,
వలయు గురుఁడు మాచి యెలమిఁబొంద.
మార్క 7 57

3 ఒప్పు, శోభిల్లు.
చ అనర్ఘ్య శాఁబ మౌక్తిక సముంచిత నాయక
రత్నమై సమం,జస రుచి పుంజమై తనరుచుం
బుల మీఁద వెలుంగు హారమున్, బిసరుహ
హస్త వుచ్చికొని పెట్టెఁ బ్రియంబునఁజేరిపాతే
నమః, ప్రనవ శరాసనాయ యని పల్కుచు
భూపతి కంధరంబునన్. కేయూర. 4. 138.

గీ పుడమి తిలతఁడుల న్యాయమున వెలుఁగ...
మనుచ 2.7.

క. అని మఱియుఁ జెక్కుటొర్కులు, దవమది బై
కొనఁగ వెలఁది దరళోర్మిల నాఁ,గివయట్ల
యోర్చి చెలులం, గననీక వెలుంగుచుండెఁ
గన్నియ యంతన్ కవిక. 8. 84.

4 ప్రసిద్ధి కెక్కు.
ఆ . వీని వలనఁగులము వెలుఁగునఁటను నెడ్డ,
జాహ్నవీసుతుండు సంతసిల్లి భార ఆది.
5. 15

సీ రాజరఁజన రీతి రసికతామహిమల సుమతియై
వెలుఁగంగ సుమతిగోరు...విక్ర 1. 167.

5. ప్రతిఫలించు.

వ. చందమామ గుటికలు గ్రోలు మందయానల చెక్కుల వెలుంగు వలివెలుంగుం జూపి వసు. 4. 28

6 ఉద్రేకించు, విజృంభించు

వ. హింసా కర్మంబులు వర్జించి కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు వెలుఁగనీయక యత్యంత విరక్తుండవై శాంతాకారంబునఁ బ్రవర్తింపుము. కుచేల 2 107

వి. 1 ప్రకాశము.

సీ. తన వెలుంగొగి నిరంజన దృష్టికిని లక్ష్యమై యుండునయ్యది యింతంత కాదు ... ఆము. 4. 200.

2 కిరణము.

క. అని యొడఁబడ బల్కుచుఁ దో,డ్కొని వచ్చినఁ గాన్పుఁ జేరి గురుకుచ దనపైఁ,గనకనఁ గన బడు వెలుఁగులఁ, గనికరమతి మందు చంద్రు గనికర మలుకన్. మనుచ. 8 35.

గీ. ...వే వెలుంగుల దొరజోడు రేవెలుంగు ఆము. 1 18.

మ. తలుకుం బ్రొద్దు వెలుంగు క్రొంబసిఁడి నిద్దాచో పుడుం గట్టియున్...చంద్రా. 1 40.

3. ఎండ.

శ నిడుద బ్రాఖ్లాని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొనఁగ ముప్పొద్దు మున్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు తెల్లెడఁ గాచుచు వలరు నిర్గ, వేఁట కాఁడవ్వుడెంతయుఁ జేటమీఱ అచ్చ. రా అయో. 42

వెలుఁగుచే స. క్రి. (√వెలుఁగు ఇది తగులుచు వంటిది) వెలుఁగఁజేయు, ప్రకాశింపఁజేయు

సీ. విలసితాంతర్జ్యోతి వెలిఁగించి తనువెల్లఁగయ లోఁగాల్చి చిత్కళ వెలిఁగించి ... చెన్న. 3. 383.

వెలుఁగు(ల)దొర వి (వెలుఁగు+దొర.) సూర్యుఁడు.

క. వికసించు తమ్మినుండు మ,ధుకరావళి వెడలె వెలుఁగు దొరఁగనఁగాసా,ర కలావంతుఁడు మునుగొం, చక బ్రింగ వెడల్చ నినుప సరిపెణ మవఁగన్ రా. వి 8 30.

వ వేలుపు సామియో వెలు గుల దొరయో జంట మోముల దంటయో యిట్లుంటగాక మానిసులీ తేజ బూనుదురే యనందగియె అచ్చ శా. 4 61.

వెలుఁగురా వి (వెలుఁగు+రా) సూర్యుఁడు

గీ. కాని మణి యెందు నేనియుఁ గల్గనీక, నేల యెలెను దద్దయు నేర్పుమీఱ, వెలుఁగురా వంగ దపు పాల వెల్లినిండు, చలి వెలుంగైన యా రాచజడల మెకము అచ్చ రా బాల. 47.

వెలుఁగుల యిక్క వి (వెలుఁగులు + ఇక్క) సూర్యుఁడు.

గీ. సుఁల యాఁకటికూడు ముచ్చులకుఁ గీడు, రిక్కలకు ఱేడు వెలుఁగుల యిక్కజోడు ... కవిజ 3. 78

(వెలుఁగుల యిక్కజోడు=చంద్రుఁడు.)

వెలుఁగులఱేఁడు వి. (వెలుఁగులు + ఱేఁడు) సూర్యుఁడు

మత్తకోకిల మేరువాయన మానసోత్తర మే వెలుంగుల ఱేనికిం, దేరుగాను లాటలాడఁగ దిద్దెఁ బెద్ద తనానకున్ ... కకు 1. 114

వెలుఁగొందు అ. క్రి (వెలుఁగు + ఒందు)

1. ప్రకాశించు

చ. గరుడ పతాకతోడి రథకల్పన మొప్పఁగఁ జక్ర మాదిగాఁ, బంగిన కైదువుల్ వితత బాహు వులన్ వెలుఁగొంద దివ్యతా, స్ఫురితశరీరుఁడై సకల భూత భయంకర విక్రముండు పం,కరుహ దళేక్షణుం డడరెఁ గంపముఁ బొందఁగ సర్వ సైన్యముల్. హరి. ఉ 2 21

క జలవసుధాంబర పవన, జ్వలనంబుల కంటెఁ దా వజ్రనంబు వెలిన్, వెలుఁగొందు నాత్మ యుండఁగ... ఆము 8. 68.

గీ. తన యసంబెల్ల కడల, వెలుఁగ వెలుఁగొందు నారాచ వేల్పు ఱేఁడు నీలా. 1. 45.

2. జ్వరిల్లు, మండు.

చ. ..నలము గూథ యత్నమున వ ట్యోడకుం గొనివచ్చి దానిఁ జ,య్యన వెలుఁగొందఁ జేయుటయు... శార విలా. 2. 255.

తరళము కలుముల న్వెలుఁగొంది యచ్చటి కాఁపుఁ బెద్దలు తద్దయున్. నీలా. 1. 38

**వెలుక** వి (వెలి²+ఉక స్వార్థమున) తెల్లన, ధవళ వర్ణము

చూ వెలుకఁ బాఱు

**వెలుకన** విశే. (√వెలుక) తెల్లనిది, ధవళము

క అతని వదాన్యత్వము విన, మతిఁ బ్రియమగు నేని వినుము మందారము సంతతమును సంతానముదా, నతనికి రాక వెలుకనై తల వాంచెన్ ద్వా 11 112

గీ అష్టమదముల ఝరి పూరితాద్రు లనఁగ, మీఱు దంతులఁ దనదు వజ్రాంమునకు, రావుగా యను ఖ్యాతినైరావతంబు, వెలుకనై యుండె నప్పురిఁ దంమె పొగడ శ్రీరం మా 10 58

వి తెలుపు, ధవళవర్ణము

**వెలుకఁబాఱు** అ క్రి (వెలుక+పాఱు.)

1. తెల్లబడు

క. తును మాయ మ్రింగి దమశేంద్రుని యురము వగిల్చికొనుచు దుర్భరగతి వీఁపున వెడలి శ్వేతయొగసెను, విను వీథికి నుడుగణంబు వెలుకం బాఱన్ భార ద్రో. 5 232.

క అలపొడుపు గట్టువగరున్, వెలువడు రాజువకు మ్రోల వేశ్యాసతి మెచ్చుల కుచ్చుఁబట్టి వైచిన, వెలిపావడ యనఁగఁ దూర్పు వెలుకం బాఱెన్ కువల. 4. 15.

సీ. తనుఁబాసి శశిదవ్వు చనిన నెవ్వగఁ బోలెఁ దొలిదిక్కు జవరాలు వెలుకఁబాఱె .. మనుచ. 5. 40.

2. వెలవెలఁబోవు

సీ. ఉరుకీర్తి యగు మూర్తి యుదరంబులోఁ జాలు నిలిచియుండుట మేను వెలుకఁబాఱె ... పి. శకుం. 4 56.

చ. ఎరువుల సొమ్ము సత్యమగునే యని వెల్వెల వయ్యె వహ్నినాఁ, బరిగళితద్యుతిన్ వెలుకఁ బాఱె నిశాంత నిశాంత దీపముల్ ... వేం. పంచ. 4. 278.

**వెలుగు** వి కంచె, పశువులు మున్నగువవి చొరకుండ చేనిచుట్టును కంపచే నేర్పఱచిన యావరణము.

గీ వేయిచేతులిచ్చి వెట్టిఁజేసిన కూతు, బాణుఁ జెఱపఁ దలఁచి ఖండనంబు, గలుగఁ జేసెనింక వెలుగుచే న్మేసినఁ, గాచువార లెందుఁగలరె జగతి ఉ. హరి. 5.42

సీ చీమలు ప్రాలీడ్వఁ జివికిన వెలుగుపట్టునఁబండి యెండి క్రుంగిన గునుకుల . ఆము 6. 18.

(దీనిని శ ర. నిర్బంధుకముగను, చి ని పఠిందుక ముగను గ్రహించినవి. ఈ క్రింది ప్రయోగ ములు పఠిందుకములు.)

వ వలుదెసలం బొడవుగా నమర్చిన బలితంపుములు వెలుంగులం గరంబు జతనంబులై యొప్పు పెను దొడ్లన్ హరి పూ 5, 142.

చ ఘటకుఁడు పంపఁగా వరిగి కంప వెలుంగు తలంగఁ ద్రోచి యుద్భటగతి బుద్ధిసారుఁడటు తారుచఁగర్కరికా ఫలాళిఁ జూఁపుటయు... శుక 2. 423

**వెలుచే(ల్చ)** వి సర్పము, పాము.

చ వెల్పల క్రియఁగానరాని గతు లన్మయిమైఁ జెవఁచున్. మనుచ 3 62. (శ. ర పా.)

( ..'చిల్వల క్రియ'—ముద్రి పా )

**వెలుచు¹ = వెల్చు, వెలలుచు** స. క్రి (√వెలి¹) త్రోలు

క వలి భగదత్తుఁడు గదువుల, వెలుచు పసుల వానియట్ల పిలసద్గతి నబ్బలము నెగవ...భార ద్రో. 1. 382.

చ గెలిచిన నేఁడువాఁడు రణకేళిఁ బురందరుఁ దద్గజేంద్రమున్, వెలిచినవాఁడు దేవతల వెట్టికిఁ బట్టినవాఁడు ధూర్జటిన్, విలిచిన వాఁడు భక్తిమయ వితమునన్ ధరనేకవీరుఁడై, నిలిచిన వాఁడు శౌర్యమున నీ జనకుండు భయం బిదేటికిన్. ఉ. హరి 5. 88.

గీ మడుఁగులకు వల్లదార్చుచు నడుసుగలుగు, కొలఁదిఁ బట్టంగ నగునని వెలిచి వెలిచి... భా రా. అర 2. 51.

2. వెడలఁజేయు, స్రవింపఁజేయు.

చ. వెలిచిన కన్నునీరు జడి వెచ్చని చన్నుల మీఁది వేఁడియుఁ దొలకరి ఘర్మతోయములతోఁగల సెవ్...ఉ. హరి. 5. 112.

3. ఋజువుచేయు, స్థిరీకరించు

క. ఇంత గొనియె నీతండని, పంతముగాఁ దెలిపి వాని పై వెలుపక తా, గ్రంతలు దూఱడి పెవపరి, యంతకు నిమమడి ధనఁబు నరువఁగ వలయున్. విజ్ఞా. 3 44

4. (నూలు) తోఁడు (శ. ర.)

వెలుచు[2]=వెలియు అ. క్రి వానకురిసి నిలుచు. (చి. ని, బ్రౌ.)

మ. ఎడ వెల్లైవను లేక పెక్కు దినముల్ హేరాళమై వర్షముల్, జడిగాఁ బట్టి తటాలవంగ వెలిచెన్ ... హర 2. 25.

క. జడిగొన్న వాన వేమం, దడిసిరి నాలో నొకింత దడవున కా నెవ్వడి పడలె వడఁగె నుఱుముల్, నిడిమించులు మానె వెలుఁగు నిలిచెన్ వెలిచెన్. వేం. పంచ 3. 106.

సీ. ఆ దివసములను వర్షాత్యయోచితముగా దళమైన వానలు వెలుచుటంతఁ, దెల్లవాఱిన యట్టి తెఱఁగున వావేళ దవమేళనం బెల్లజనులు నొగడ ... ద్వా 7 83

వెలుడు అ. క్రి. వెలువడు, బయలువెడలు.

శా. వెలి శుచియై మఱి తీర్థంబులు సొచ్చుట మేలు నియమములు దీర్చి తగన్, వెలుడినయెడ దేవార్చనములు విప్రార్చనలవశ్యముమ గృత్యంబుల్ భార. అను. 5. 185.

వెలుతురు=వెల్తురు వి. (√వెలుఁగు) 1. ప్రకాశము, వెలుఁగు.

సీ వెలుతురీయక జాలు విరిదేవియల నోవ వడలక కురియు పెన్వానగాఁగ ... యయా. 4. 4.

గీ. ... వెలయఁ బగలయ్యెఁ జీఁకటి వెలుతు రయ్యె, నడవి యిల్లయ్యె మఖమెంత తోడరు నొక్కొ. గంధ. 1. 144.

2. ఎండ.

క. వెలుతు రసఅంటి యెండియు ... ఆము 4 182.

వెలుప(ల్ప)ల వి ఔ (వెలి[1]+పల) బహిః ప్రదేశము, బయలు.

క. ఈ పగిది మొసలి సలిలము, లోపలికిన్ దిగువఁ దా వెలువలికిఁ దిగువన్, బాపనిఁ గొంతదడవు మే, నా పుత్రిక తిగిచి తిగిచి నాఁటివ వగలన్. వరాహ 6 28

గీ ... ఇమ్మహాతీర్థములు వేద విశ్రుతములు, వెలుపలను లోపలను నుండుఁ దలిరుబోఁడి కాశీ. 2 117

సీ ఆ యింటి గృహిణి నాయకుఁడు భుజించిన పసిఁడి పళ్లెరము వెల్వలికిఁ దెచ్చి, వెలచుచో... పరమ. 4 186

విశ వెలియైనది, బాహ్యము

క ఈ తడు దా వెలుపలయై, యేతెఱఁగున నైన వారి యేపడఁచిపరా,భూతులఁ జేయుదువని ప్రఖ్యాత జవహయాధిరూఢుఁడై పురివెడలెన్ కళా 8. 154

వెలుపలనుండు=బహిష్ఠయగు, ఋతుమతి యగు (వ్యవ) ఆమె నిన్ననే వెలుపల నున్నది

వెలుప(ల్ప)లించు స క్రి (√వెలుపల) వెలిపఱుచు. (శ ర.)

వెలుపించు స క్రి (√వెలుపు) వెలుపుచేయు, వెడలుపించు

ఉ పెట్టను బట్టి ఆక్క వెలుపించి కనంబడునట్టు గాఁగ నట్టిట్టొక రెండు మాఱులు పయిన్ నురటింబలెఁ జేతఁ ద్రిప్పుచున్ ... పారంగ 1. 126.

వెలుపు[1] వి. వెడలుపు, విస్తారము.

తరువోజ వెలడు నిట్టూర్పుల వెస మచ్చలించు, వెలుపునఁ గలుగు నెవ్వీఁగు చందోయి .... కు. సం 5 588

సీ. చెలరేఁగి వలరాచ వెలుపుల పెనుకతల్ విని పించినప్పు డూళ్లానెడి దారి .. కువల. 5 35. నవ్వురిఁ దరమె పొగడ. శ్రీరం మా. 10 58.

చ. పరిణత గంధశాలి వన పంక్తులు గంధవహోసు ధూత బంధురకణి శంఖలై వెలుపు దూళ్లొనఁ జాలు నిజాలవాల మంధరవికచారుణోత్పల పిఖాన నవ ప్రమదాలి మాలికా, నురుచిర గీత మాధురికిఁ జొక్కితలల్ గదలించెనో యనన్. శ్రీరం. 4. 1014.

విశ. వెడలుపైనది, విస్తృతము.

ద్వి. వెలిసె వానలు గడువు పిడిదవె ఎండ, విరి విరినై తానె వెలుపయ్యె ఉసలు... ద్వి. భాగ. 2 82.

**వెలుపు²** వి. (√వెలుచు²) వానకురిసి నిలుచుట,(వాన) వెలియుట

వ ఎడవెలుపు లేని పూ దేనియ జడిం దోఁగియ సమకాల పర్జన్య కాలశంక మత్తిల్లి నృత్తంబు సేయు మత్తకేకి కేకల కోడు భుజంగ కుటుంబం బులును శేయూర 4 50

వ ఇవ్విధంబున నిరువదియొక్క వాసరంబులు వెలుపులేక పాము ప్రేలఁ గట్టినభంగి. . ఁగురిసి యిరువది రెండవ దివసంబున హర 2. 63.

**వెలుపుడు** వి నూలు తోడుట

గీ తంతు నిస్సరణంబుగఁ దనరుచుండు వెలుపు డన.. ఆం భా. 2. 286

**వెలుమనూళ్లు** వి బ తెలిక జాతిలో నొకభేదము (ఈ జాతిలోని భేదాంతరములు వత్తిపాలు, నరి యూళ్లు, కుముడాళ్లు, మట్టూళ్లు, పోవండ్లు, స్రావకులు, ఉంద్రూళ్లు, అనుమగొండ్లు, అడ్డ నూళ్లు )

**వెలుములు** వి బ భూషణములు.

ఉ. ధీ నిరవద్య హృద్య నిరతిన్ హరితో భరితో త్సవంబులన్, బూను కడాని బొమ్మ కలుముల్ వెలుముల్ గల ముద్దుగుమ్మ స,న్మాని మనో విహారిణి రమారమణీ మణి భూరిసూరి స,న్మాన ముఁ గూర్చుఁగాత గరిమన్ నెఱి మంజుల మైన మత్కృతిన్ కృ శకుం. పీఠి 1. 2.

గీ. చెవుల వెలుములు కులుక్రాఁత చెవులబాగు, పడిగె ప్రోగులు మెలిగొన్న పచ్చడములు, తమర గుమిగూడి జాలరు లరుగు డెంచి, రలరు మొగములతోఁ ద్రాటి వలలు గొనుచు. వేం. పంచ. 1. 603.

**వెలువడము** వి సస్యవిశేషము.

ద్వి వెలువడం బు వోయె వెలఁగయ్యె వరగ. . విష్ణు పూ 8 (శ ర.)

బ. ధాన్య విశేషము

సీ మంది గంత్రలు నాగ మల్లెలు తీఁగెమల్లెలు కృష్ణనీలాలు వెలువడాలు...హంస 4 128.



**వెలువడు** అ క్రి (వెలి¹ + పడు ) (వృత్తి వర్ణ వికారము.) 1. బయలుపడు, బయటికి వచ్చు

క. నలుఁదొల్లి యాక్రమించిన, కలి కర్కోటక విషంబు గ్రక్కుచు నొడలన్, వెలువడి నలువకు విహితాం,జలియై తన్నెలుఁగఁ జెప్పెఁ బంచలుఁ దగుచున్ భార అర 2 178

క విలసిల్లుచు నుండఁగ ముచ్చిలిపట్టి కుమారు నోరఁ జీర దుటిమి వెంగలులగు క్రూరులు గొందలు, వెలువడఁ గావి పోయి యొక్క విపినములోనన్ భార ద్రో. 2 182.

ఆ వేల్పుగట్టు గవుల వెలువడి వడదేలఁ, బదలు వాఁక నీట జలకమాడి . పారి 4. 44.

2. వెడలు, బయలుదేరు.

క. నలుఁడును ధరణీ రాజ్యము, దలఁగఁగ సర్వంబు నపహృతంబై నఁ గడుం, దలరి దమయంతిఁదో డ్కొని, వెలువడియె నశేష రాజ్య విభవచ్యుతుఁడై భార అర 2 64.

చ. అలఘు వినూత్నరత్న కనకాంచిత భూషణ దీప్తులొప్పఁగా, వెలువడె నున్నద ద్విరద బృందము . విక్ర 4 81

గీ తపదిది యని వారలు తమనివాస, మొరు లెఱుఁగకుండ వెలువడి యరిగిరంత ... కళా. 6. 154

3 తొలఁగు, అపసరిల్లు

చ ..మిత్రు నతయోజ్జ్వల వసుఁ జేయ మిత్రవసు సంపదకైన ఘనావరోధమున్, వెలువడఁ జేయ నేర్తురు మణీ విపణీతపనీయ రాశి పేశల రుచి కోటికోటి విలసద్ధ్వజ కోటఁబురికిరాటకుల్. వసు. 1 88.

**వెలువరించు = వెల్వరించు** స. క్రి (√వెలువడు )

1. వెడలఁగొట్టు, వెలువడఁ జేయు.

ఆ వృద్ధు కొడుకు పలుకు విని క్రూరుఁడై పాప, బుద్ధిఁ జేసి మిమ్ము భూతలంబు, వెలువరించి రాజ్య విభవంబుగొని యిప్పు, డలుక సెడిన చిత్తుఁ డయ్యెనొక్కొ భార అర 1 208

వ. వానింబట్టి కట్టింపు మొండెనెద్దు పట్టింపుము తున్న వరణ్యంబులు సొంపు వెలువరింపు హరి. పూ. 6. 127.

2 బయలుదేఱఁదీయు

గీ. ...ప్రొద్దు వొడవక ముందర పురజనప్రయు తముగాఁ బురి వెలువరించితిఁ గడంగి భార. మౌ. 200

3. బయలు పఱుచు, వెలువడఁ జేయు

వ. ఒక్కింత సేపు పలుకు వెలువరింపఁ జాలకయూర కుండి యెట్టకేల కెలుఁగు దెచ్చుకొని భార. శల్య. 2 1..

సీ. కటవార్త వడలి యుండుట దైత్యకాంతల కల వరింతలు వి త వెలువరించె...సమీర. 3 76

4. పోఁగొట్టు, తొలఁగించు.

సీ. ...పరమ దైన్యమున కోర్చి కొలిచి మాత్స్యుని పాలనున్న దుఃఖంబును ద్రోహులఁ గనుఁ గొట్టి, వెలువరించెదవని తలఁచి కృష్ణుని నిశ్చ యంబుఁదీ ధర్మంబయగుటఁ దెలిసి...భార శాం. 1 120.

వెలువఱుచు స. క్రి. (√ వెలువడు) వెలువరించు (శ. ర)

వెలువెలుక వి. (వెలుక + వెలుక.) మిక్కిలి తెల్లన, అధిక ధావళ్యము.

చూ. వెలు వెలుకఁ బాఱు

వెలువెలుకఁబాఱు = వెల్వెలుకఁబాఱు అ క్రి. (వెలువెలుక + పాఱు) మిక్కిలి తెల్లనగు

క. వెలువెలుకఁ బాఱె దేహము, అలసత నడుపు లను కెయ్యిలందును దోఁచెన్, వెలివిరిసె నాభి జఠరము, కలకంఠికిఁ బొడవు దోఁచికానఁగ వచ్చెన్ రుక్మాం 1, 141.

వెల్కఁబాఱు = వెలుకఁబాఱు అ. క్రి తెల్లబడు.

గీ. అనిమిషుల దృష్టు మిఱుమిట్లు గొనఁగ భుజగ, పతియుఁగూర్మంబు సకట పడఁగఁ దరణి, కిరణములు వెల్కఁబాఱ దిక్కరులు కెదర, నొప్పె న త్తోలితాఁకు మహోగ్రముగుచు భార. శల్య ? 155

ద్వి. అమృతాన్న రుచిలోన వడఁగక వెలికి, గమ నించెనవ దేహకళ వెల్కఁబాఱె రం. రా బా 18. పొ. 24. పం (శ ర. పా,)

వెలిగిలు = వెలికిలు అ. క్రి. వీఁపు క్రిందగు.

ద్వి. హా తాత హా మామ యనుచు మోచేతు, లూఁ తగా వెనుకకు నొఱఁగి వెల్కిలను, బడి పాఱు కొని గుండె బలువిడినడిచి, పడె ... నవ 3. 217 పొ 2 పం

వెల్గ = వెలఁగ వి. కపిత్థము (వృ వి)

చ. ఒక శుకియుండు నత్తరువు నొద్దన చిక్కని వెల్గ మాని యం,దు . కేయూర. 4. 62.

సీ పులిచింత మోదుగు ములుమోదుగును వెల్గపుల్ల వెలఁగ వెట్టి బిల్లచిల్ల...హంస. 4 11.

వెల్గు = వెలుఁగు అ. క్రి ప్రకాశించు

గీ అతి మహత్త్వంబుచే వెల్గు నట్టిశక్తి,నలరు... అము. 5 82

దండకము ...మేత్తెల్విలో లోని వెల్గుం గనుం గొంచు.... నీలా 2. 41.

వెల్గొందు = వెలుఁగొందు అ. క్రి. (వెల్గు+ఒందు.) ప్రకాశించు.

మ సమన్వితమై యోగి మనోనురాగ పదమై వెల్గొందు నీ దేహము.. భాగ 4. 181

వెల్గొడుగు వి (వెలి² + గొడుగు.) శ్వేతచ్ఛత్రము

మ ధమువుం గేతువుఁ ద్రుంచి సారథిని రథ్య వ్రాతముం గూల్చి యేఁపునఁ బాంచాల తనూజు వెల్గొడుగు సొంపుం జింపిగావించి... భార ద్రో 5. 180

వెల్చు = వెలుచు స క్రి. 1 తోలు.

చ వింటుని గోవులన్ మరల వెల్చి ముదంబున నీదు తమ్ముడిన్, బొరిగొనఁ బార్థుఁ దాఁకకెట పోయితి నాఁడు...భార కర్ణ. 2 82

గీ దతునల్లుండ్ర మెడల సూత్రములు గట్టి, యూపములు సూత్రములతోడ నుద్దిచేసి, దాకె నలు గూర్చి వడిపించెఁ దరతరంబ, వీరభద్రుండు పశువుల వెల్చునట్లు. కాశీ 7. 88

ఉ అడ్డము వచ్చి కేల్పు పుత్రయాఁగెదు వమ్మిటు లావరించి మా, యొడ్డనముల్ దెరల్చి హరి యద్ధతి జాఁటిన గొల్ల వెల్చుటన్, దొడ్డికిఁబాఱు నా పసులతో సరికొని పురిఁబాని యాంధ్రడనున్, బిడ్డల వెంటఁబెట్టుకొని భీకలి చేరితి మున్వ క్రిందటన్. ఉ. రా 2 221.

2. వెడలించు.

ఉ తేఁటి దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబు దు, ర్వార రయంబు మాన్చి పశు వర్గము నిద్దెస వెల్వెవార్చుచున్ భార. విరా 5. 88.

3. (నూలు) తోడు

సీ నేతయు నింగియుఁ దాలముల్పాయింప నేలఁ దెన్నుండిచే వెలవ. కు సం 8 135

**వెల్తి = వెలితి** వి న్యూనత కొఱఁత

ఉ దేవం సుప్రసాద శుభదృష్టి సుధా విరసంబు సాపయిన్, ఎ విరి వెల్లిగొల్పితి మనంబున కింకొక వెల్తిగల్గునే, దేవకులేశ యైనను మదీయ మనీష నిశాంత భక్తి నే, ప్రోవల నెమ్మెయిం దొలఁగఁ ద్రొక్కక నిన్ను భజింపఁజేయవే హరి ఉ 5 251.

గీ అసుర విభుఁజూచి మునినాథుఁ డాట విడిచి వెడలినని వెల్తిరాకుండఁ బుడమి ఱేఁడు, తెలిసి గద గొన్న రిపుశక్తి దిగిచివైచి, మఱియొఱఁగి క్రమ్మఱం దేటి యురకనిలిచి. కకు 2 147.

విశ న్యూనము తక్కువైనది

గీ కేవలము మంచివడకైన గీసవెల్తి, రెండు జాములు నిటనూరకుండ నేల...భీమ 3 46.

ఉ తామసవృత్తి లేదు సతతంబును నుగ్రుఁడు గాఁడు పౌరుషం, బేమియు వెల్తిగాదు పారి పీఠి 8

**వెల్తిసేయు** స క్రి (వెల్తి+చేయు) తక్కువపఱచు

సీ విక్రమాధిప తను వెల్తిపేయుటె కాదు వా క్పాశిధిఁ గేరుఁ బార్వతికుమారు ... చెన్న. పీఠి. 85

**వెల్తురు = వెలుతురు** వి. ప్రకాశము

సీ. చినుకు వెల్తురు మబ్బుచే నడ్డపాటింత వోకార్చు రేరాచ రేక యనఁగ ..రా వి 4. 118

**వెల్పట్టు** వి. (వెలి[1]+పట్టు) పై భాగము, బయలు

ఉ. చుట్టి భిక్షించిపట్టి పురసూదన యీ గరళాగ్నిఁ గంధరా, ఘట్టమునందు నిల్పమదిగాక దిగఁబడ విచ్చితేని లో,బట్టున నున్న లోకముల భస్మము సేయు వెలార్చితేని వె,ల్పట్టున మన్న లోకముల భస్మము సేయు నిజంబు చెప్పితిన్. భీమ. 4. 68.

**వెల్పు** వి తెల్లఁదనము.

చ. తమమను నీలవర్ణ పరిధానము వీడఁగఁ బూర్వ శైల శృంగ ములను నున్నత స్తనయుగంబు దనరవ చకోర బంధు వ,ర్గము ముదమొందఁగా నిజముఖ ద్యుతి వెల్పుగ నిందు గర్భ చి,హ్నము లభిరామమయ్యె. కు. సం. 8 105

**వెల్పెట్టు** స క్రి (వెలి[1]+పెట్టు) అవమానించు.

క. మనరాజు విదూషకుఁ గొని, మన మేఖల మోసపుచ్చె మనమిపుడా బ్రా,వని మాఱు సేత యిదియొక, వనితయే వెల్పెట్టవలదె పార్థివ తిలకున్ కేయూర. 4 165

**వెల్మిడి = వెలిమిడి** వి 1. విభూతి.

సీ. కాళరాత్రి స్తనాగ్ర కృతావకాశమైయురము వెల్మిడి పూఁతయొప్పు వెనుప ... పాండు. 5 136.

2 బూడిద, భస్మము.

చ విలయ కృశానుకీలముల వేఁడిమి వోఁడిమి మాలి వెల్మిడిన్, గలసిన భూతధాత్రి మనుచ. 2. 10.

చ....ఒకిలిం,తలు పొడసూపె వెల్మిడిఁదిరన్ మన సయ్యెఁ బయోజగంధికిన్ పి శకుం. 3. 57.

**వెల్ల** విశ (సం వలక్షః) తెల్లనిది, ధవళము.

మ...అందఱు విహారాపేతులై డిగ్గి ర,య్యము నా భూమికి వెండి వెల్లినుకపెల్లై యున్న మార్గంబునన్. హరి పూ. 6 85.

(కర్మధారయంబున నిగాగమంబు వైకల్పికము).

(సముద్ర వర్ణనము)

సీ. రాజశేఖరుని గారాబంపుఁ బూఁబోఁట విపులా మహాదేవి వెల్లచేల...చిత్ర. భా. 5. 5.

వి. సున్నము.

ద్వి. మల్లెమొగ్గల వైవ మదనుని వేఁడి, వెల్లఁగాఁ జేసితి దెల్లంబుగాదె...బస. పు 6. 276.

**వెల్లఁకి** వి. గడ్డ, దుంప.

(ఇది వేరు శబ్ద పూర్వకముగానే ప్రయోగములఁ గానవచ్చు చున్నది.)

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బండులు నొండులు గూరగాయలుం. గోయుచు ... కు. సం 6. 682.

సీ వేరు వెల్లఁకి కాయగూర బండని కోరకుద రాగ్ని గాడ్పుచే నుజ్జగించు పాండు 2. 28
ద్వి వినుమాకు నతిమును వేరు వెల్లంకి, దినియెడి వానినే దేవర యంద్రు. .రం రా.యు 288.
పా 8. పం
చ. ఒసఁగిన నిక్కుమూరు లవియొల్లక వల్కిరి మాకుఁ గాయలున్, గసురులు వేళ్లు వెల్లఁకులుఁ గాక సముజ్జ్వల భూషణంబులుం, బసిఁడియు నేల...నిర్వ 10 122.

వెల్లఁదనము 1. తెల్లదనము, వెలవెలపాటు
ఉ యామవతీ కళత్రు మదయావనేరంబున కంటెఁ బాండిమ, (శ్రీ) మునుఁ దోఁచెఁ దూర్పుదెస సిద్ధము కృష్ణుఁడు పారిజాతమున్, భామినికై హరించునని పాయని నెవ్వగ నింద్రరాజ్య లక్ష్మీ ముఖమండలంబున వసించిన వెల్లదనంబు కై వడిన్. పారి. 2. 88.
సీ. చైన్యంబు తలపోఁతఁ దలకొన్నఁ జెలువ కాన నమున వెల్లఁదనంబు గదిరె ... భాం విరా. 2 106
క. ఉల్లము గలఁగఁగ మొగమున, వెల్లదనం బొలయఁ దాల్మి విడఁగఁ గడున్, దల్లడ మందుచు. భా. రా అయో. 68.
సీ. తళుకుఁ జెక్కులు వెల్లఁదనము మెల్లనఁదాల్పఁ గనరాని కటమరల్ పెనుపు నొందె...చంద్రా. 1. 88
2. స్వచ్ఛత, నిర్మలత్వము.
ఉ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధురియున్ వివేకమున్, వెల్లఁదనంబు మౌగ్ధ్యమును నిర్మలినత్వముఁ జూడవచ్చివన్ ...భీమ. 2 184.
చ. తిరముగ జైత్రయాత్ర ఘనుదెంచిన నిన్‌గని యూతుభృత్తు వి,ర్ఘరములఁ బాద్యమిచ్చి రవి సంజ్వలితార్కమణీ విభా పరం,పరల నివాళి సేసి వనభవ్య తుకాది విహంగమోక్తిపై,ఖరి నుతిపల్కెడిన్ రజత కాంతుల వెల్లఁదనంబుఁ జూపుచున్. ఉ రా. 8. 64.
8. దైన్యము.
క. తలగొఱిగి విడిచిపెట్టిన, దులువుకొనుచు వెల్లఁదనము దుఃఖము సిగ్గున్, గలఁగ భీరము లావును, బోలిపోయి విదర్భరాజ పుత్రుఁడు మరలెన్ పద్మ 10 34

వెల్లఁబాటు వి (వెల్ల+పాటు,) తెల్లనగుట.
ఆ. దశలు తుదకు వచ్చి తలలల్ల నల్లన, వణఁక వణఁక నపుడు వార్ధకంబు, తేటపడు విభాతి దీపంబులకు మేనఁ,బలితమనఁగ వెల్లఁబాటు తోఁచె కవిక 4 186

వెల్లఁబాఱు అ క్రి. (వెల్ల+పాఱు) తెల్లపడు, వెలవెలఁబోవు
మ. వడుమొయ్యెయ్యనఁ దోంమయ్యెఁ దనరెన్ నాభీతలం బంగముల్, జడనొందెన్ బలిసెం గుచద్వయము వెల్లంబాఱె మైదీఁగయు గ్గడువై కోర్కులు మూఁగె వస్తువులపైఁ గన్గోనలం దంద్ర యెక్కుడు దోఁచెం గమనీయ దౌహృద పరిశోభం బునం బొల్తికిన్ హరి ఉ. 8 180.
శా లేవే భోజనమేటికొల్ల విటు లేవే మేన బల్సోమ్ములీ, వేవిం బూనవు వెల్లఁబాఱె మొగ మేమీ రాజుతో నల్గినా,వో వామాక్షిరో యంచు నర్మరస గర్భోక్తుల్ చెలుల్ వల్కఁగా, వేవిళ్లం బొరలెన్ లతాంగి వతికిన్ వేడ్కల్ కొనల్ సాగఁగన్. సారంగ 1. 84.
ఆ అంత విజయపాలుఁ డతిభీత చిత్తుఁడై, వెల్లఁ బాఱు మెఱిఁగి భల్లుకంబు...విక్ర 8 100

వెల్లగజము మి వి (వెల్ల+గజము.) ఐరావతము
సీ తివిశేంద్ర వజ్రముద్రిక దాలొరసె వెల్లగజము సిందూరంపుఁ గటములందు...సమీర. 1. 67.

వెల్లగిసె వి (వెల్ల+అగిసె) ఒక విధమగు పైరు.
సీ. గోధుమ పెసనువ్వు కులునువ్వు తెలినువ్వు కుసుమ వెల్లగిసెయు గోగు జనుము.. హంస 4 127.

వెల్లగుముడు వి. (వెల్ల+గుముడు) ఒక విధమైన జొన్న.
చూ గుముడు

వెల్లగౌరు వి. (వెల్ల+గౌరు) ఐరావతము, తెల్లని యేనుఁగు.
సీ. వింటి తెర్వరి మేటి వెల్లగౌరును నిక్కు చెవుల సీలని సెక్కు చెలఁగు తెల్ల.. ఉ. రా 5. 108.

గీ. విజయలక్ష్మి సమేతుఁడై వెల్లగౌఱ, నెక్కి అమర విభుఁడు... దశా 2 443

**వెల్లచేఱపు** వి (వెల్ల+చఱపు) సన్నపుఁ బూఁత. (శ ర.)

**వెల్లజిగిపుల్లు** వి (వెల్ల + జిగి + పుల్లు) హంస, శ్వేతగరుత్తు.

మ అని ప్రార్థించు దివాటకోటిఁ గని యాహా యెంత కార్యంబు వచ్చె నిలింపాగ్రణి కంచు ధాత కరుణాస్ఫీతాత్ముఁడై లేచి కొల్వున నున్నందఱుఁ గొల్వ వెల్లజిగిపుల్లుం దేజిపై నెక్కి గ్రక్కున లంకాపురి కేఁగెఁ జారణ ముఖుల్ గైవారముల్ సేయఁగన్ ఉ. రా. 5. 12.

**వెల్లయేనుఁగు** వి (వెల్ల+ఏనుగు వ్యత్తినివర్ణాగమము) ఐరావతము, తెల్లనియేనుఁగు.

గీ వెల్లయేనుగు నెక్కి రీవెల్ల మెఱయ...వచ్చె నమరనాయకుఁగాంచి. దశా 2 18

**వెల్లదీవి** వి (వెల్ల+దీవి) శ్వేతద్వీపము.

గీ వెల్లదీవియుఁ బోని యప్వీడు సొచ్చి ఆము 6 64.

**వెల్లన** వి తెలుపు, ధావళ్యము, వెలవెలఁ బాటు, వివర్ణత.

చూ వెల్లనగు

**వెల్లనగు** అ. క్రి (వెల్లన+అగు) తెల్లనగు, తెల్లపడు, వెలవెలఁ బోవు

సీ ..వేలుపురాయని తేజి వెల్లనయ్యె. ఉ రా 1. 68

క తల్లడపడి యరదము డిగి, విల్లును నమ్ములును విడిచి వెల్లనగుచు మేనెల్లఁ జెమరఁగ నూరుపులు, పెల్లుగ నమ్మనుజపతువు పెలుచం బలిచెన్. భార అర 6 244.

గీ. వెల్లనై యున్న నత్తెఱంగెల్ల నెఱిఁగి, రాచ చిన్నెలు సడలించి రఘువు కొలపు, సామి పెలి నార చీరలు జడలుదాల్చి, తపసి రూపూని యచటికిఁ దరలివచ్చె అచ్చ. రా అయో 58

(దీని ఆమ్రేడిత రూపము వెల్లవెల్లన)

వ .. వాహినులు చిక్కుపడి చిందఱవందరై మత చెడి నులామడియె యేపుడెగి యవురు సవురై యనువు దప్పియదవదయై యంతంత విచ్చి యరవరలై పాఱలేక పలపలనై వెఱఁగుపడి వెల్లవెల్లనై చిదుముడిపడి చెల్లాచెదరై పొడవడంగి గ్రోవున నొక్కండై పోవిడిచి ..ఉ హరి. 1. 148.

**వెల్లమొదవు** వి (వెల్ల+మొదవు) తెల్లనియావు, కామధేనువు

ఉ ..క్షీరోదధిఁ బోలు వెల్లమొద వొక్కటి గన్పడఁజూచి మొక్కుచున్ ఉ రా 3 388.

**వెల్లయెలుక** వి. (వెల్ల+ఎలుక) తెల్లయెలుక

గీ ఉడుము గరిమిడి కొక్కుదండడియు వెల్లయెలుక కల్లెంక తఱచును నేమి చెప్ప ... మనుచ 4 26

**వెల్లవారువము** వి (వెల్ల+వారువము) ఉచ్చైశ్శ్రవము, వెలిమావు.

గీ ..పొడమె, వెల్లవారువ మా పాలవెల్లియందు. దశా 2. 226

**వెల్లవాఱు** అ. క్రి (వెల్ల+పాఱు) వెల్లనగు, వెలవెలఁబోవు

క ఉచ్చవడి వెల్లవాఱుచు, ముచ్చ ముడిఁగి మూర్ఛ తన్ను ముంచికొనంగా, వచ్చిన ధైర్యం బూఁతగ, నచ్చేడియ నిల్చుటప్పు డద్భుతమయ్యెన్ కేయూర. 4. 188.

**వెల్లవేయు** అ క్రి (వెల్ల+వేయు) (గోడలకు) సున్నము పూయు.

(వ్యవ) వారి క్రొత్తయింటికి వెల్ల వేసినారు.

**వెల్లవోవు** అ క్రి. (వెల్ల+పోవు) తెల్లపడు

ద్వి వెల్లవోవని పండు వెదురులు చూచి ద్విపరమ 2. 66 పా

**వెల్లాటకత్తి(త్తె)య** వి (వెల్లాటకము + కత్తియ.)

1 వేశ్య.

గీ మునుపు నేదని కొసఁగిన కనకపాత్ర, తెచ్చి తివి దేవదేవికిఁ దిరుగనిమ్మ, ఎందు వెల్లాటకత్తియ కిచ్చినట్టి, సొమ్ము మగుడంగఁ గొనుటయే సుగుణితనము. విప్ర. 5 78.

2 జార స్త్రీ

గీ. నీ జనని పుణ్యజన వర్ణనీయ సాధ్వి, నీ జనకుఁ
డెన్న నభిమాన నియత ధనుఁడు, నీ నగరు
కోటుకోఁగరు నిలువరాని, దయ్యు వెల్లాటకత్తెవీ
కాటయరిది శుక 1. 316

**వెల్లాటకము** వి. (వెం + ఆటకము) ప్రసిద్ధి
గీ. సంభవించిరి గంధర్వజాతి ననినఁ, గలితనం జేల
వెల్లాటకంబు సేయ...భీమ 1. 88.
(శ. ర. పా 'పెన్నాటకము' ముద్రి పా.)

**వెల్లాపుఁగత్తె** వి. స్వైరిణి
శా...ఘనాళుల్ మింట వర్తిల్లఁగా, దూషించున్
తెలుఁగున్ దళుక్కునఁ దటిత్తుల్ దోఁచినట్లెల్లె
వెల్లాపున్ గత్తె చరింపుమన్ సురభి మల్లా.
మల్లభూ 2 84.

**వెల్లి[1]=వెల్లిక** వి (త వెళ్లం.) 1. ప్రవాహము
క. అని యూరడిల్లఁ బలికిన, విని యాతఁడు సంత
సంబు వెల్లిం దేలెన్... భార. శాం. 1 282.
సీ కల్పాంతవేళ నేకటకంబు మునుఁగదు నింగితో
రాయు మున్నీటి వెల్లి .. కాశీ 3. 103.
క. అల్లారు బెల్లమై గలు, గల్లున నదియలు
మొరయఁగా వేడుక పెన్, వెల్ల మునిఁగించె
ధరణీ, వల్లభనందనుఁడు చూచువారల
చూడ్కుల్ రాఘవ. 2 5.
2 పరంపర.
క. కవిసినఁ గడంగి యేనుగు, గవియించితి నంప
వెల్లిఁ గడుఁ గ్రూరత ... భార. ఉద్యో.
4. 342.
ఉ కడలి యాకసంబు పుడమియుఁ దలుచగ,
నంప వెల్లి పొడువఁ బొంపు మీఱ, యంధకుండు
గొంద యల్లుఁడుఁ దార్కొని, యదరువట్లు
వ్రేటులాడు నెడల. అచ్చ. రా. యు. 348
వెల్లిఁ గలిపిన చింతపండు=ప్రవాహములోఁ గలి
పిన చింతపండు; నిష్ఫలము.
గీ. మాటిమాటికిఁ జేసిన మందులెల్లఁ, జెల్లెఁబో
వెల్లిఁ గలిపిన చింతపండు, నీట వ్రాసిన వ్రాలు
నై నెరయ వలదఁ, బోవు గాశేమి నెత్తురు
పుట్టనేల. కాశ 3. 111.

**వెల్లి[2]** వి (శ బెళ్ళ త వెళ్ళై.) తెలుపు, శుక్ల
వర్ణము.
విశ తెల్లనిది, ధవళము, శుక్లము.
చూ వెల్లిమొకము

**వెల్లిఁజల్లు** స క్రి. (వెల్లిన్[1] + చల్లు) చెఱుచు,
పాడుచేయు.
వ. తల్లిమాట యించుకంతయు విననొల్లక ప్రల్ల
దులై యెల్లధనంబు వెల్లిఁజల్లి బంధుజనంబులు
నిందింప నాతతాయులై చిత్తవిభ్రాంతిం దిరు
గుచు. జాహ్నవి. 3. 12.

**వెల్లిఁబోవు** అ క్రి (వెల్లిన్ + పోవు) వ్యర్థమగు,
నిష్ఫలమగు.
సీ. పార్వతీపతిచేతఁ బడసిన దివ్యాస్త్ర భూరి
సంపద వెల్లిఁబోయెనన్న...ఉ హరి. 4 300.
సీ. మానక గుపిఎంచు మదన కోదండంబు నిష్ఠు
రతను దన్ను నేలఁ గలయ, నెప్పుడు జంకించు
హృజ్జాత శింజిని గారవంబునఁ దన్ను గాలిఁబోవ,
నూరక విరఁబడు మారనారాచంబు దుండగం
బునఁ దన్ను ధూళిఁగలయ, పనిలేని పని మిట్టి
పడు మనోజపతాక, ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁ
బోవ. వరాహ. 4 - 21.
(ప్రవాహమునఁ బడిపోవుటని యర్థాంతరము)

**వెల్లిక=వెల్లి[1]** వి ప్రవాహము.
శా ఆ జాబిల్లి వెలుంగు వెల్లికలదాయన్ లేక రా
కానిశా, రాజశ్రీ నఖమైన మోమునఁ బటా
గ్రం బొత్తి యెత్తి యా, రాజీవానన యేడ్చె
...వసు 4 52.

**వెల్లికిలు** అ క్రి. వీఁపు క్రిందగు.
మ. తరుణీరత్న మొకర్తు వెల్లికిల నీఁదన్ గుచ్చి
చన్ బిందియల్, గరమొప్పెన్ .. ఘటికా.
2 121.

**వెల్లిగొను** అ. క్రి (వెల్లి[1]+కొను) 1 ప్రవహించు
ఉ. ఆ లలితస్మితాస్య అలికామల కోమల చంచ
లాల పాలోల విశాల సంస్ఫురిత లోచన దృష్టి
రస ప్రవాహమం, దోలిన పర్వి వెల్లిగొని
యొక్కటఁ గ్రక్కున ముంచి ... శు సం.
5. 513.
మ ...వైరిపేరురర ముగ్రోద్ధతిఁ జీరి నెత్తురులు
సర్వోర్వి నభోవిత్తటీ, పరిణాహంబుల నెల్ల
వెల్లిగొనఁ బైపైఁ జల్లి వ్రేవుం బోదుల్ గర
మాటోపముతో నతంతు పారి నాకర్షించె హర్షిం
చుచున్. హరి. పూ 4. 87.

శా. ఆమోదాశ్రు భరంబు వెల్లిగొన ... నైష. 5 137

2. వ్యాపించు, పచరించు.

గీ. శిరసు మకుటంబు సాఁకి చిత్తరువు గొలుప, గల్లములఁ గుండలద్యుతి వెల్లిగొనఁగఁ, గలికి తెలిసోగ కన్నులఁ గరుణ చిలుక, జననుని ప్రేమఁ గౌరి సాక్షాత్కరించె. కవిక 6 180

3. పరంపరగా వెడలు.

ఉ. ఱింగను ప్రోత ప్రోఁగుమను తెక్కలి పాములువోలె శౌరిచే, సింగిణి వింట వెల్లిగొను చిత్రశరంబులు నూతునొంచి ..పారి 5. 16

ఉ వెల్లగు నమ్మహోరవము పేర్చ సరోజభవాండ భాండముల్, చిల్లులువోఁ బ్రచండ గతి సేన ధరాస్థలి యూఁగెనో యన, న్వెల్లిగొనంగ నేర్పుతిచి నిర్భయతన్ నటింపఁజె .. తాళ చ. 2. 71

4. మునుఁగు, మగ్నమగు.

సీ. పుష్కలావర్త కాంభోధరంబుల వృష్టి విశ్వ ప్రపంచము వెల్లిగొనగ .శివరాత్రి 1 51.

5. అతిశయించు

క. తల్లియుఁ దండ్రియు బ్రమదము, వెల్లిగొనఁగఁ గౌఁగిలించి వేడివవలి, నుల్లమలర .. హరి పూ 7. 68

**వెల్లిగొలు(ల్వు)పు.** స. క్రి (వెల్లిగొను)

1. ప్రవహింపఁజేయు.

గీ ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి యివ్విధమున, నొక్కఁ డొక్కఁడ తలపడు టుడుపఁదలఁచి, వివిధ బాణపరంపర వెల్లిగొలిపె...భార విరా 5 78

ఉ. పూచిన యొక్కపోఁక నును బోదియఁజేరి విలోకనప్రభా, వీచికలం దదీయ పదవీ కల శాంబుధి వెల్లిగొల్పుచున్.. వసుచ 2 28.

2. పరంపరగా వెడలించు.

సీ. సాత్యకి యత్యుగ్ర శరముల విందానువిందుల వెసఁ బరివితతతనులఁ, జేయంగ వతనిపై సా యకంతికులు వివిధాస్త్రజాలంబు వెల్లిగొలిపి, విలుద్రెవ్వ రథహయంబులు వొవ్వ సారథి దలరఁ బ్రస్ఫుటశక్తి కలనఁజూప ... హరి ఉ. 2 51.

శా.. .పౌలస్త్యుఁడున్, భల్లంబుల్ వడి వెల్లిగొల్పి సమర ప్రారంభవేల్లద్ధను, ర్వల్లీ జ్యాఘన నాదమేదుర నభోరంధ్రంబుగా .. భా. రా. యు 1480.

3. వ్యాపింపఁ జేయు

సీ. కౌముది వెన్నెల వెల్లిగొలుపు కట్టాణి పౌ, క్తికముల గంధమాలికలు వైచి ... వరాహ. 8 111.

వ మరాళంబులు .. రోదోంతరం బంతయు నెంతయుం గలయ మలయు తను యమలంపుఁ దెలిదళుకుఁ జిలికి యది మఱియుఁ గలయంపి చెలువ నలవరింప వందుఁ గుందనంపు రంగవల్లి కామతల్లికల యుల్లాసంబు వెల్లిగొలుపు గురుదంత కాంతి వల్లరులచేత నతిశయిల్లుచు. . ప్రభా 2. 105

● క్రి ఆనందము సేయు.

గీ. ఉల్లమునకును జూడ్కికి వెల్లిగొలుపు, నా వరదు మోమునందు మనంబుఁ జేర్చు, ననుచు గీత రూపములుగా నాళు కవిత, నుతుల రచి యించి పాడుచు నతఁడు గొలిచె కభా 2 144.

**వెల్లితల** వి (వెల్లి[1]+తల) ప్రవాహ పురోభాగము, ప్రవాహమునకు ముందటి భాగము

గీ గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చౌటి పొర గాక చిట్టూట చోటు గాక, వెల్లితలగాక క్రిఁ జెదల్ వేరుపురువు, రాఁపోటును లేని చారాటి నేల. విప్ర 2. 18

**వెల్లిదొట్టు** అ క్రి (వెల్లి[1]+తొట్టు) అతిశయించు.

ఉ ఎవ్వరమాట మమ్మెఱుఁగ నీదు యథాకథిత స్వరూపమై, యెవ్వఁడ వౌట విన్నెఱుఁగ నీదను భావ్యతఁ దోచియైనఁ దా, నెవ్వరిదాటఁ దన్నెఱుఁగ నీదు ధ్రువ బ వెల్లిదొట్టు నీ, ద్రెవ్వని మాయలో మునిఁగి తేలెడు పీలము గామె యీశ్వరా కవిక 6. 182

**వెల్లిపొడుచు** అ క్రి (వెల్లి+పొడుచు) 1. ప్రవహించు

సీ గంగ యాతని మస్తకాగ్రంబుపై వెల్లివొడి చినవల్గి యద్భుత తపస్వియగు నమ్మహాత్ముఁ డయ్యమర తరంగిణిఁ గమఁగొని . హరి. పూ 8. 90.

(సువర్ణముఖరి) వ ఖిల్ల వల్లభుల వల్లియలపై వెల్లివొడిచినం దల్లడపడ శాళ 1 142
2. ఉప్పొంగు.
వ. పొంగి చింతాసాగరంబు వేగిర-బ వెల్లివొడిచె ననన్ మనుచ 3 9.

**వెల్లిమెకము** వి (వెల్లి + మెకము) సింహము.
ఉ వచ్చి యిదేమి చెప్ప కిటు వచ్చితి వప్పుడు కాలు పోతుతోఁ, బొచ్చెపు బొల్లివెల్లి మెకముల్ దమ బెబ్బులిఁ గూడి గూడెముల్, సొచ్చితివంగ జెంచులోక చొప్పున నూర్గురు వోయిరన్న వాఁ, డచ్చెరుపాటు సిగ్గు నొలయన్ వినుచుం దల వ్రేల వైచినన్. కళు 4. 59.

**వెల్లిపడు** అ క్రి (వెల్లి[1] + పడు) ప్రవాహమగు
శా .. కన్నీరు ము,న్నీరై వెల్లిపడంగఁ గాలి కుటిలో నించావుచున్ గూరిమిన్. వేం. పంచ. 1 256.

**వెల్లివాఱు** అ క్రి. (వెల్లి + పాఱు) ఎడతెగక ప్రవహించు, అతిశయించు.
గీ పాడి దప్పిరి నృపతులు బలసెఁ గొంతె, మడఁగె దాలిమి మాత్సర్య మతిశయిల్లెఁ, జెల్లె దయ పాతకంబులు వెల్లివాఱె, గ్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్మురేఁగె వరాహ 7 31
క. నమదాతీ మీననంచా,రమువఁ దొలంకుచును ముఖ సరస్సున లావ,ణ్యము వెల్లివాఱఁ గ్రేవల, నమరించిన పిల్లకాలఁకులంగన వీనుల్ కళా. 7. 128.

**వెల్లివిరి** వి॰ (√వెల్లి[1]) వెల్లడియైనది, ప్రకటితము.
క అలతైల బిందువయి నా, మెల,కువ వెల్లివిరియైన మేలగునే ని,ర్మల చరితుఁ డఖున బాణుం, డలుగఁడె ప్రాణముల కింత యపరాధమునన్ ఉ హరి 5 198. (వీరేశ.పా)
గీ. వెల్లి విరిగాఁగ భూజను తెల్ల నెఱుఁగ ... దశకు 6 82.
క ముల్లోకంబుల జనములు, రొల్లన్ రోకండ్లఁ బాడ రోయక మఱియన్, వెల్లివిరి గాఁగఁ దిరిగిన, గల్లరు నయగారి మెలఁతుకం గొని పోయెన్. వరాహ. 7 22.

**వెల్లివిరియు** అ క్రి (వెల్లి[1] + విరియు) 1. ప్రవహించు
క. ... మదీయ మూర్ధము, వెంటంగా నక్రభగంగ వెల్లివిరియుటన్ హర 4. 57.
గీ పిడుగువడ్డ తెఱంగునఁ బుడమిఁ ద్రెళ్ళి, సొమ్మగొని కొంతవడికి లోనుమ్మలికల, వెచ్చనూర్పుచుఁ దెప్పిరి వెల్లివిరియ, వేఁడి కన్నీరు గొనగోళ్ళఁ దోఁడుకొనుచు అచ్చ. రా. యు. 360.
2. ఉప్పొంగు.
గీ. పెరిఁగి పాండవాంబుధి వెల్లి విరిసినపుడు, విలువ విమ్మగు దీవిగా నిన్నుఁ దలఁచి...భార. భీష్మ 1 53. (ప్రవహించు అని శ. ర)
వ ... ఆనంద ప్రవాహంబుల్లంఘున వెల్లివిరిసిన కతంబున . . కాశీ 1 100.
3. వ్యాపించు
సీ చనుకట్టు విపఁ జుట్టును ఘన స్తనకాంతి జల్లించి యురముపై వెల్లివిరియ ... వైజ. 1 181.
చ ... ఆ,చ్చెరువుగఁ బోయి వెల్లివిరిసెం గపివాహిని లంకచుట్టునున్. భా రా యు 495
వ జగదండ కర్పరంబునఁ గుంటువడి మగుడు వేగం బడరఁ బుడమికి డిగి వలుగడల వెల్లివిరిసి పెల్లగుచుం జాలుకొని యిద్దరులు నేరుపడునుద్దవిడి నేలుబడి వెడలి ... చం, రా 3 25.
4. వెల్లడి యగు, ప్రకటిత మగు
ఆ. నీ కడింది లావు నే నెఱుంగనె వాలి, తోఁకఁ జుట్టి కడలిఁ ద్రోయుటయును, జెఱను బెట్టి వేయి చేతుల యొకిమీఁడు, విడుచుటయును జగము వెల్లివిరిసె అచ్చ రా. యు 600.
5. వృద్ధిపొందు, అతిశయించు
వ. ఇట్టి మాయావులున్న చోట సత్యంబు మూలఁ బడి కల్ల వెల్లివిరియుఁ బింగళకుండును మదోత్కటంబు వడుపునఁగు మంత్రి మంత్రతయంత్రంబుకం దగులు వాఁడుగాఁడె. వేం.పంచ.1 530
6. చెదరిపోవు

వ . . జీవనంబులు విడిచి విమల జ్ఞానవశంబున ముక్తులగు పురుష రత్నంబుల చెన్నున నమ్ను వదలి మిన్ను విడిచి వాయువశంబులై వెల్లి విరిసి చను మేఘంబులును . భాగ. 10. పూ 764

**వెల్లివిరిసేయు** స క్రి (వెల్లివిరి+చేయు.) ప్రకటించు.

క వనితల పురుషుల యెడఁ బుట్టిన యది వెల్లి విరిసేఁత డిమ్మరి తన మెట్టి నిక్కుష్టుండై నను .. భార. శాం 6 208.

వ. కంఠగతప్రాణంబు లగుజంతువులకుం గాలకంఠుండు గరుణా వశంవదుండై కర్ణోపకంఠంబుఁ జేరి యుపదేశించు తారక బ్రహ్మ మంత్రరాజంబు మంతనంబున విని యెఱుంగుటం జేసి మధు మదోల్లాసంబున నది వెల్లివిరిసేయుచున్న వియోయన విందిందిరంబులు మంద్ర స్వరంబున ఝుంకారంబు సేయు. కాశీ 2 44

గీ ప్రౌఢ గోపాంగనలు తమ ప్రాఁతవలపు, వెల్లి విరిఁజేసి రిందిరావల్లభునకు ..జై.భా 3 76.

**వెల్లివీఁగు** అ క్రి (వెల్లి[1]+వీఁగు.) అతిశయించు, మిక్కుటమగు.

ఉ. ఆ సమయంబునన్ మదనుఁ డగ్గలికం గళికాముఖంబులై, భాసిలు తూపులన్ హృదయ పద్మము లక్ష్యము సేసి యేసినన్, గాసిలి కాళికుండు తమకంబునఁ దన్ గనుసన్నచేసి యు, ల్లాసము వెల్లివీఁగ సఖులన్ నిలువన్నియమించి గ్రక్కునన్. కృ శకుం. 2 124.

**వెల్లిమాపు** అ క్రి (వెల్లి[1]+చూపు.) ప్రవహించు.

క. హరిగిరి జల మనమున వత్సురురాగ రసంబు నిండి యుత్కటమై తత్పురి మీఁద వెల్లిమాపిన, పరుసునఁ గాశ్మీర వారి పొరులఁ గప్పెన్. కు సం. 9. 256

**వెల్లుల్లి** వి (వెల్ల+ఉల్లి.) తెల్ల ఉల్లిగడ్డ, లశునము.

సీ పగిలి బీటలువాటి తగదెక్కెఁ గుబుసంబుతో రంపు వెల్లుల్లి తునుకలట్లు...భీమ 4. 130.

సీ ఉటజాంగణమునఁ గాపునిచిరి తవుటితో వెల్లుల్లి పొగయిచ్చి వీతిహోత్రు పి. శకుం 4. 63.

**వెల్లువ** వి. 1. ప్రవాహము.

క...అతఁ డతని యరదము, మునుఁగంగాఁ జేసె బాణముల వెల్లువలన్.

క ఆ వెల్లువ శరజీవ్వాలఁ, ద్రావి ధనంజయ మహాగ్ని దరికొని కవియంగా వెగడొందెడు కురుబల, దావము శాంతవపుఁ డంబుదము క్రియఁగాచెన్ భార భీష్మ 2 44 45.

సీ అమృతంబు వెల్లువయని నిలింపాదులు మును కొని దోసిళ్ళ ముంచిక్రోల ... ఇట్టలంబుగ వెన్నెల నిట్ల నొడిచె విక్ర 6. 69.

చ. ఉదుగక తేరు చన్న దెస నూనిన చూడ్కులుక గన్గెలంకులన్, విడువక పాఱు నక్షువుల వెల్లువ అూఅట లేని యూర్పులున్...గలిగి కుందెడు జానకిఁగాంచి కూరిమిన్. ఉ. రా. 6 309

2. వాహిని, సేన.

చ అలఘుమతిన్ మహా వనచరావళి దెబ్బది రెండు వెల్లువల్, గొలువఁగ నేగి వారినిధిఁ గొండల చేతను గట్టి లంకపై, బలువిడిసేవతో విడిసి బాహుపరాక్రములైన దైత్యులంగల హాములోఁ గులక్షయముగా నొనరించె మహామ భావుఁడై. వి పు 5. 326

ఉ. కొమ్మ మొకంపు వెల్లువలు గొల్వఁగ వేగిరమేఁగు దెంచి నంద్రమ్ము కడన్ దగన్విడిసి రావణు తమ్ముఁడు తేగవచ్చినన్, రమ్మని ... యయా. 3. 28

3 పరంపర

క. బడలు వడి యసురబలములు, పొడవడఁగెన్వి భుని బాణముల వెల్లువలన్...కవిక 2. 207

సీ చెక్కుటద్దములందు జిగి వెల్లువలు చిందు రమణీయమణి కుండలములతోడ...మనుచ. 3 71.

4. బృందము, మంద

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువలన్నియును లేచి విచ్చలవిడితో, జెల్లా చెదరై పాఱెను, బెల్లుగనంబే యటంచు బెబ్బులి గాలిన్. భాగ. 9. 36.

5. ఇటిక గోడల యింటిచూరు. (శ ర . వా.)

**వెల్లువగట్టు = వెల్లువపెట్టు** అ. క్రి. (వెల్లువ+కట్టు)

1. ధారారూపముగా స్రవించు.

సీ. కలయ వెల్లువగట్టి జలజల ప్రవహించు శశి కాంతకాంత నిర్ఝరము జలము ... మనుచ 5. 88.

ఉ ... చెక్కులన్, వెల్లువ గట్ట నశ్రువులు వెల్వెలఁ బోవ మొగంబు .... దశా. 5. 128.

2. మడుఁగు కట్టు

సీ. నీళ్ళు వెల్లువగట్ట నికటాగ్రహార ధరాసురుల్ నారికేళములు గొట్ట ... శుక. 3 438.

చ వికచ సరోజ మధ్యమున వెల్లువగట్టు మరంద బృందముల్, ప్రకట వినోదకేళి నొక పంకజ గంధి పిదిల్చి ... భాను. 2 60

**వెల్లువపెట్టు = వెల్లువకట్టు** అ. క్రి. ధారారూపముగా స్రవించు

చ కనఁ గలిగె న్విలాసములు కమ్మని చక్కెర లొల్కు పల్కులున్, వినఁగలిగెన్ సుధారసము వెల్లువపెట్టెడు మోవియాన నిం,పున నును జెక్కుటద్దములు ముద్దుగొనన్ .. దశా. 2 308

**వెల్లెకి** వి వృక్షవిశేషము, ఒకానొక చెట్టు

**వెల్లెడ్లు** వి బ. (వెల్ల + ఎడ్లు) తెల్లని యాడుపశువులు. (మేకలు, గొఱ్ఱెలు, మొ ఈ యర్థము ప్రాచీన శాసనములందే కానవచ్చుచున్నది చూ. ఎడ్లు)

చేబ్రోలు. శా...క ... వెలనాంటి గొంకయ శ్రీ మూలస్థాన మహాదేవరకు మాఘమాసమున పున్నమయు సుక్రవారమున సోమగ్రహణ నిమిత్తమున నఖణ్డవర్తిన్ దివియ యొక్కంటికిం బెట్టిన వెల్లెడ్ల యెంభదియు ఇనిమిత్తమునన వీం శ్రీ కుమారస్వామి దేవరకు నఖణ్డవర్తిన్ దివియలు రెంటికిం బెట్టిన వెల్లెడ్లు నూఱును వీరం జేకొని ... ద శా 9 109.

1 స్వస్తిశ్రీ శకవర్షంబులు 1073 ణ్డగు నేంటి ఉత్తరాయణ సంక్రాన్తి నాండు లొంప్పి చెఱువుల ప్రోలినాయకు కొడ్కు మల్లినాయకు ముదిపెలిచేతన్న 2 బోయుణ్డు తమతల్లి దండ్రులకు ధర్మువుగా కొట్యదొన త్రిభువన మల్లి శ్రీ కేశవదేవరకు అఖణ్డ దీపమునకు బెట్టిన వెల్లెడ్లు పంళ్ళయేను పెద్ద నన్నె బోయిని కొడ్కు పిన్ననన్నె పీనింజేకొని ... ద. శా. 6, కొణిదెన. 686-(2.)

**వెల్వ** వి. సంఖ్యావిశేషము? ఒకానొక లెక్క?

చ. మఱియ నగంబును డిపలుమాఱును రాముని జేరుకొంచు వెల్వలు దశసంఖ్య దన్నుఁ గొలువంగ రణోచిత ఘోరవాక్యముల్, పలుపుచు పార్శ్వటంబుల దిశావలయంబులు దల్లడిల్లఁగాఁ, జెలఁగుచు వచ్చినప్పుడు సుషేణుఁడు భానుసుతుండు మెచ్చఁగన్. సీతావి. 2 32.

**వెల్వడము = వెలువడము** వి సస్యవిశేషము

సీ బడఁతి నివ్వంటి వెల్వడము కోర్కి ఫలించెనన రాజభోగమే యతిశయిల్లు. రసిక 1 48

**వెల్వడు = వెలువడు** అ క్రి. 1 (క) నిర్గమించు, బయలువడు, బయటపడు

సీ... అతిక్రమింప, కుండగఁ బోక యెల్లొడఁ గూడు నిష్నాగభవన మెప్పాట వెల్వడఁగఁ బోలు. భార ఆది 1 114

సీ వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు యజ్ఞ కోలాహలం బాలకించి .. వరాహ 7 38

చ ఉవిద తదుత్తికంత చెవి యొగ్గక పోఁ బెనఁగన్విభుండు కేల్దవిలిచి చుట్టుని చుకయెడన్ భుజముల్ వలగొల్పి బొమ్మనన్, సువదన వెల్వడం దిరుగ శ్రోణి భుజస్తన వేణికాభర, శ్రవణ కపోలముల్ పతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్ ప్రభా 5 41

(చ.) బయటకు వచ్చు.

ఉ విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్... భార. ఆది 2 63.

చ అనుపమ దివ్య శస్త్రధరులైన యమర్త్యుల కాహవంబులో. మొనయక కాలకేయులు సముద్రముఁ జొచ్చి దివంబులెల్ల న వ్వనధి నడంగియుండి బలవంతులు వెల్వడి రాత్రు లెల్ల భూ,జనులకు బాధ సేయుచు భృశంబుగ నుండిరి క్రూరచిత్తులై భార. అర 3 8.

చ. ఇలుకలనైన వెల్వడని యీలువుటాత్రడకుఁ జాఁపికతైవై .. అము 5 70

2 బయలుదేఱు, వెడలు

మ .. వరవైతాళిక వందిబృంద జయ జీవస్థార శబ్దంబులున్, వెరవై పేర్చి చెలంగ వెల్వడియె పంప్రీతి న్నిజావాసమున్. హరి. ఉ. 4. 117.

మ. కలుచఁ గోళబింబు వెల్వడి యదః ఖడ్గాహిపై వచ్చుచో. నైష 5 157

సీ. విడుఁడని వీడు వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ డాతాఱుఁ గనుఁగొని గారవమున... ఆము 3 60

శి. గాంభీర్యము విడుచు

క బలవంతుఁడుఁ బగవాఁడును, ఖలుఁడనఁగాఁ జాలువాఁడుఁ గనటోత్కులఁ డాఁ, గలయఁగ వచ్చిన వెల్వడి, కలవికౌనిక యేనిఁ గీడుగాకుండ దిలన్. కేయూర. 3 7

వెల్వరించు = వెలువరించు, వెలువఱుచు స క్రి

1 వెలువడఁజేయు, బయలుపడఁజేయు

(ఒక శాసనమునందు శకటరేఫ యుక్తముగా గాన వచ్చుచున్నది)

ఉ. నిగ్రహ మేది నన్ను ధరణీవరకూపము వెల్వరించు వాఁడు... భార. ఆది 3 160

గీ ఒక్కఁడడుగెత్తి గొరక వేయుచును డాఁచి, నట్టిళిగి శెంకిగని పిఁకఁ బట్టుటయును, మృగయుల దఱుఁ జని వెల్వరించి నిశిత, కాండమునఁ జెండి రొక్క పెద్ద కాఱుపోతు మనుచ 4 49

2 బయలుదేఱఁజేయు

మ. ..వేశ్య నన్ను జెలువొందన్ బ్రీతిఁ గై సేసి యంత నిజావాసము వెల్వరించిన నరేంద్రా వచ్చి వేసిచ్చటన్ మార్క 8 181.

3. బయటికి బోఁజేయు వెడల నడచు

పంచచామరము ఇసీ యిసీ మొగంబు సూడ కిల్లు వెల్వరించినన్, వెసన్విసింగి పోవు సిగ్గు పీసమంత లేదు నీ, దెసం బనల్ ఘటించె దేర త్రిమ్మరీ మఱిట్లు వచ్చి పారె పారె నన్నుఁ గెర్లఁజేయ రాక పొమ్మికన్ విప్ర. 4 58

మత్తేభకర... గలతాన పతులును రాజు పట్టంబు గట్టిన పతియు వలియం బయ్యాఱల వెల్వరించిన నశ్వమేధంబు ఫలంబు.. యుద్ధ బెజ శాస

వెల్వఱ(ఱు)చు = వెలువఱుచు స. క్రి. వెలువడఁజేయు, బయలుపఱుచు.

సీ ...ఎన్ని నేర్పులనైనఁ బట్టదీగంటి వెల్వఱచుట కును, గీ. దతవు మల్లాడ మీకింకఁ దగదు... పరమ. 5. 23.

వెల్వుచ్చు = వెలిపుచ్చు స క్రి (వెలి+పుచ్చు) బయలుసేయు

ఉ వచ్చి తదీయ మందిరము వర్తనలెల్ల నెఱింగి యక్కటా, సచ్చరితంబు గల్గు నతి చాడ్పున ముద్దఱికంబు చూపుచు, న్మచ్చిలి రాత్రు లీ బఱభి మూఁడుజగంబులు ద్రిమ్మరుచుండె, వెల్వుచ్చక యున్న నా కొడుకు జోదఁ డెఱుంగునె దీని చెయ్దముల్. కేయూర 3 223

వెల్వెల = వెలవెల

చూ వెల్వెలఁబాఱు.

వెల్వెలఁజేయు స క్రి (వెల్వెల+చేయు) వెల వెలఁ బోవఁజేయు, తెల్లఁబోవఁజేయు.

చ విఱిగినఁజూచి నివ్వెఱఁగు వెల్వెలఁజేయఁగ కుత్సుఁ డేటు నేమఱక యిదేమొకో కులిశ మంత్రము తప్పు గొడంగినాఁడనో ... కకు 5 130

వెల్వెలఁబాఱు అ. క్రి (వెల్వెల+పాఱు.) 1 వెల వెలఁ బోవు, వివర్ణమగు

సీ అని యుల్లసము దోఁప నాడు మాటలకు వెల్వెలఁ బాఱుచును దైత్యవిభు తనూజ, కలఁగి రహస్య భంగ భయంబుచేతఁ బ్రత్యుత్తరం బేమియుఁదోఁపకునికి, నిట్టటు గ్రుక్కుచున్నట్టిలా గరసి . ప్రభా 5 33

సీ ప్రాలేయ కిరణ బింబంబు వెల్వెలఁబాఱి యస్తాచలంబు పై నత్తమిల్ల... కాశీ. 1 122

మ . .మోము వెల్వెలఁ బాఱన్ దనుఁగన్న తండ్రి గనిపల్కెంబల్క్ దొట్రిల్లఁగన్. ఉ రా. 1 101.

2 తెల్లపడు, వెల్లనగు.

ఉ ... ముచ్చట నూనెనల్ల చను ముక్కులు వెల్వెలఁబాఱు చెక్కులున్. ఉ. హరి 4 9.

మ ఇనుఁ డస్త్రాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁడే తేర నద్దీప్తి నంజన సంబంధజ బాంధవంబున రతిక్రాంతాంగనా నేత్రకోణ ని కాయంబుల డాఁచి తద్దవళిమన్ దాఁచూనెనో చొప్పు మార్పననన్ వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరి మనుచ 3. 56

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ బాఱు ముఖేందు బింబంబు ఠోడ ... శశా, 3. 146.

వెల్వెల బోవు అ క్రి (వెల్వెల+పోవు) 1 వివర్ణమగు
చ కుల మపకీర్తిఁ జెంద జనకుండును వెల్వెలఁ
బోవ బాంధవావలి దలవంప.. ఉ రా 1.190
ఉ ... చెక్కులన్, వెల్లువ కట్ట వస్త్రువులు వెల్వెలఁ
బోవ మొగంబు... దశా 5 128
2. తగ్గు, క్షీణించు.
సీ ... ఖండ విజ్ఞాన శతక్రతు శతులు.
గీ. తెలివి వెల్వెలఁబోవ నిర్మల మవశ్య, కోర
తృష్ణావలంబు చల్లార వంత, వనితరముగ
హృదాకాశమున వెలుంగు, మండితా ఖండ
చిచ్చంద్ర మండలంబు సీతాదా 1. 147.

వెల్వెలన వి (వెలవ + వెలవ) మిక్కిలి తెలుపు,
అధిక ధావళ్యము
చూ: వెల్వెలవగు

వెల్వెలవగు అ. క్రి. (√వెల్వెలవ) వెలవెలఁబోవు,
తెల్లఁబోవు.
క కావున నీవును వగ వక, భావమ్మున సంతసిల్లి
వసువు కుమారిన్, నావుడు వెల్వెల నగుచున్,
హేవేరియు ముద్దుకూఁతు దీనత తోడన్.చంద్రా
6. 55.
క త్రిదశుల కేమి చేటో యని దీనత వెల్వెల నౌ
పురీంది రా, సుదతి వివర్ణ భావ మనుచుం గన
వచ్చెడు నాదు చూడ్కికిన్...ఉ.రా 4. 262

వెల్వెలుకఁబాఱు అ క్రి (వెల్వెలుక + పాఱు,)
మిక్కిలి వెల్లఁబాఱు, మిక్కిలి తెల్లవడు
సీ. విమతుల మోములు వెలవెలఁ బాఱంగ విమ
లాస్య మోము వెల్వెలుకబాఱె ... భాగ.10
పూ. 71.
సీ అలమి నెమ్మది మన్న యతివ లేవవ్వుచేఁ బలె
నాడతెల్ల వెల్వెలుకఁబాఱె...యయా 5 92

వెల్వెల్ల విశే (వెల్ల+వెల్ల.) మిగుల వివర్ణము
మ .. కురు భూనాయకుసేన ... స,త్వరతన్
వగ్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్ల
గన్. భార శల్య. 1 302.
.. ఈ రాత్రి నీ, వింధ్యారణ్యమునందు
వర్తిలి తగన్ వెల్వెల్లగా వేగవన్. భా. రా.
గాల 261

వెల్వెల్లఁబాటు వి. (√వెల్వెల్ల.)మిక్కిలి వైవర్ణ్యము.

శా తాపంబుం బెడఁబాపి దుర్దమ విషాదంబుం
దిగం ద్రావి నిర్వ్యాపారత్వముఁ బోవఁద్రోచి
వగలుద్వాసించి వెల్వెల్లఁ బాటే పొంతన్
మెలఁగంగ నీక మదిశం దెల్లం దెగం బుచ్చఁగా,
నీ పెంపార్య జనంబు మెచ్చుధృతి కున్మేషంబు
గావింపవే. నిర్వ 9 78

వెల్వొడుచు అ. క్రి (వెల్లి+పొడుచు) పొంగు.
సీ పదపల్లవంబునఁ బ్రకటిల్లు చదలేఱు కడలెత్తి
ధాత్రి వెల్వొడిచి పాఱ . కాశీ 5 112.

వెళలు=వెళ్లు అ క్రి వెడలు
సీ. దడదడ మన గుండె తాళి బొట్టదర గుబ్బలిపట్టి
పడుక యిల్వెళల దయ్యె ... కువల 2. 115

వెళుకు వి (సం విలాసః.) విలాసము
సీ చిత్తిరము కులుకు బెడఁగు వెళుకు గునుపు .
హాాయ లనఁగ విలాస మొప్పుచుండు. ఆం భా.
1. 139.

వెళుపు=వెలుపు వి వెడలుపు.
సీ వెడఁద వెన్నుదుటిపై వెనురాకు వెళుపుతోదిద్ది
తీర్చిన పట్టె తిరుమణియును . వై జ ? 186
సీ అల తేప్ప కిరవగు వెళుపు మొగంబును లోద
కంత తలకాయ కుడితిగూనఁ, బోలెడు
బొజ్జయు .. చంద్ర వి 1. 90

వెళ్లఁగొట్టు స. క్రి (వెళ్ళన్+కొట్టు.) పోవునట్లు
చేయు, విడిపించు
గీ పరధరాధిపు భార్యకుఁ బట్టినట్టి, భూతముల
వెళ్ళఁగొట్ట భూభుజుఁడు మెచ్చి దన పరి
ష్కార వస్త్రము ల్దనకొసంగి, యంపకము
సేయఁ దనయింటి కరుగుదెంచి హంస 3 104.

వెళ్ళఁగ్రక్కు స క్రి (వెళ్ళన్+క్రక్కు) వెడలఁ
గ్రక్కు, బయటికిఁ బ్రసరింపఁజేయు
సీ నుడిగాడ్పు తెరి నల్పుట్టుఁ జుట్టలు వెట్టెఁ
గడిఁది మ టలు వెళ్ళఁగ్రక్కె నక్క ... ఉ.
రా 6 235

వెళ్లఁజల్లు స క్రి (వెళ్లన్+చల్లు) పాఱఁజల్లు
మ ... మణిప్రాప్తిక, న్ని వముద్రంబులు వెళ్ళఁ
జల్లఁ దలచున్ మేఘానురూపంబుగన్ దశా
3. 172

వెళ్లఁదన్ను స. క్రి. (వెళ్ళన్+తన్ను) వెళ్లఁగొట్టు,
తఱిమివేయు

గీ ... వెడలించె రోపెఁ, బీచెఁ దటిమెను దోలెను
వెళ్ళఁదన్నె, ననఁగ నుచ్చాటనముఁ జేసె ననఁ
దగుభవ. ఆం భా 3 119

**వెళ్ళఁబడు** అ క్రి. (వెళ్లన్ + పడు.) 1 (కష్టము నుండి) బయటపడు.

క బడలిక నెంతయు నేను, బడుచులు నేఁడెల్ల
వెళ్ళఁ బడుదుము దానిం, బోడగంటి వేని
నీకుం, గడుపుణ్యము చూపుమనినఁ గరుణా
పరతన్. వరాహ 12 35.

2. (పశ్వాదులు,) ప్రసవించు

(వ్యవ) నిన్నరాత్రి మా బఱ్ఱె వెళ్ళఁబడినది.

**వెళ్ళఁబెట్టు** స క్రి (వెళ్ళన్ + పెట్టు) పైకి ప్రసరింపఁ జేయు.

సీ. వెళ్ళఁబెట్టునో పూర్ణ విధుకాంతి మొగమున
దిగఁజాఱునో పైఁడి తెలివి మేన నిరం. 4 91.

**వెళ్లఁబొడుచు** స క్రి (వెళ్లన్ + పొడుచు.) ఈవల నుండి యావలకు దూసిపోవునట్లు పొడుచు

గీ ఒకఁడు కుంతానఁ బగవాని యురము గ్రుమ్మ,
వెంటనే యాతఁ డీఁటెచే వెళ్ళఁబొడువ, వెలసె
నిద్దఱు నిల్చిన నిలువు కదన, శాలికై కావ
డించిన కాను కనఁగ కువల 2 176.

**వెళ్ళనాడు** అ. క్రి (వెళ్ళన్ + ఆడు) స్పష్టముగాఁ జెప్పు.

చూ వెళ్ళనాడించు.

**వెళ్ళనాడించు** స క్రి (√ వెళ్ళనాడు) స్పష్టముగాఁ బలికించు.

వ. తాను మాట పట్టు పుచ్చుకొని తన కార్య రహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీదాన నగుట మీచేత వెళ్ళనాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చితినని చెప్పి ... ప్రభా. 4. 31.

**వెళ్ళించు** స. క్రి. (√ వెళ్ళు) 1 వెడలఁ జేయు, వెడలఁ గ్రక్కు.

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించిన జుగుప్సంబైన
యన్నంబు స, య్యన వెళ్ళించి పవిత్రుఁడైన
గతి ... భాగ. 4 92

2. పోఁజేయు, తీర్చుకొను

ద్వి ఇల్లు సేరిన మీఁద నీ పగ యెల్ల, వెళ్ళింప
కున్న నే విప్రుండ నటవె ... ద్వి హరిశ్చ ఉ.
990. సం.

**వెళ్ళు = వెడలు, వెలలు** అ క్రి. 1. బయలువెడలు

శా లావణ్యాంబులు నాభికూపమున వెళ్లం దోడి
ముద్భుజవ, చ్ఛావ క్షేత్రమునందు వంచు ఘట
యంత్రంబో యనంగా జప, వ్యావృత్త ప్పటి
కాక్షదామకము హస్తాబ్జంబునం దాల్చు వా, ణీ
వామేక్షణ నారసింహునికి సంధించున్ వచో
వైఖరుల్ వరాహ. 1 6.

ద్వి తివిరి పుట్టలువెల్లి తిరిగె సర్పములు ... ద్వి
హరిశ్చ. 1846.

ఉ .. ఒల్లదపున్ వరాహములు భద్రగజంబులమీఁద
నాదికోఁ, జెల్లుగ నెక్కువాని కొన వెంద్రుక
యొక్కటి రెమ్మ తీసినన్, జల్లున వెళ్ళఁబో
చమురు చిమ్మిన గ్రోవిని జిమ్మ కైవడిన్
సారంగ 1 71

2. బయలుదేరు.

చ సమధిక బాహు శౌర్యజిత చండవిరోధులు వెళ్లి
రున్నత, తమ . భాగ 10 ఉ 844

శా. కల్లెంబుల్ సవరింప కళ్ళెముల నెక్కించు నా
రాహుత్తులున్. బల్లెంబుల్ గొని యర్థభోజ
నము లజ్జన్ లేచు యోధాగ్రణుల్, కల్లన్
ఒలుకుచు నొంటిఁ బంచలనగళ్ళన్ వెళ్లు భూవల్ల
భుల్, బల్లింపం దలపోయు కూటమి దొరల్
జవ్వాడిఁ వ్వాడకిన్ రా వి. 50 4.

మ కుయివెంటన్ వెళ్లు కూన్యోరు కూ, వ వితా
నంబన . ఆము. 2 48

3. పోవు

మ ఘనతాపంబు హరింప నోప మనుచుం గానీ
క్రియా ద్వేష మే, చినఁ గానీ హృదయేశుఁ
జన్నులపయిం జిత్రింపఁగా నీతమున్, వనజా
క్షుల్ నిరసింపఁగాఁ జనుట హైన్యంబంచు
మున్ముస్న వె, ళ్లిన రీతిం బడుఁ బ్రేలి మౌక్తిక
మణుల్ మెట్టించి దూరఁబునన్ వరాహ.
4 35

చ. ఉరమున నేగుఁ గుండలి పయోధర ధారల నాను నెప్పుడున్, గిరులు కరుల్ రజో విహ్వ తికిం జను వెళ్లఁడు వేల కూర్మ శేఖరుఁ డిది మేల చాల జనకలిఎత సౌఖ్య మటంచు ధారుణీ, తరుణి సిరంగరాయ వసుధావరుఁ జేరెఁగుమార మన్మథున్ వసు. 1 72

ఉ. విన్నన నేఁగు తామరల విందుకి లాతవు నీడ లెప్పుడున్, వెన్నెల రాచతాలఁ గని వెళ్లక నీళ్ల మునిఁగి యున్న వీ, మన్ను లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గు వన్ గదలి మెల్లనఁబోవుదు రిండ్ల పట్లకున్ యయా. 2 89

4 కడచు, అతిక్రమించు

ఉ. ఇంక శరీరవాయువు ఫనేశ్వరుఁ డైన విధఁబు చెప్పెదం, బింకరుహ ప్రసూతికిఁ బ్రపంచ విని ర్మితి వేళ వెళ్లనా, తంకవిధాయి తీవ్ర సిక తల్ వెదచల్లుచు నూర్పుగాడ్పు కూల కష సప్త సాగర జలంబులు తువ్వరఁగాఁగ రువ్వఁగన్, వరాహ. 7 7.

సీ. పురుడు వెళ్లక మున్న పూతన విషదిగ్ధ కుచ దుగ్ధముల నెల్లఁ గ్రోలి చంపె ... చిత్ర భా. 5. 172.

5 పుట్టు, మొలచు.

క మానిని యెఱుఁగవు గా కీ, హ్మాసాయకు వ్రతము మాన్పఁగా నీతరమా, పమఁగకు కొమ్ముల్వెళ్లిన, నే కాఁటదు మగుడఁ ద్రోయ నెవ్వండోపున్. రుక్మాం 5. 128

6. పైకి వచ్చు.

చ మెలఁత లోకింత గావఁబడి మోసులు మెల్లన వెళ్లి పోగలై, నెలకొని వ్రేళ్లు గోళ్ళను జనించి చో కారములై మిటారి కెం, దలి రుకు కొమ్మ కట్టి ... సారంగ. 3. 257.

చ.... ఆ యన్మతోదరి రాజుచేత నుం,డిన బెడి దంపుఁ జాయల పిఱెం బొరవెళ్ల జరిన దూసి గొబ్బున మెడమీఁదఁ బెట్టుకొన... సారంగ. 2. 233

వెవ్వేఱలాడు అ క్రి. వెవె యని యధిక్షేపించు

ద్వి. కన్ను లార్పుచుఁ బెపుల్ గద్దరించుచును. వెవ్వెఱలాడుచు వెక్కిరించుచును .. పండితా. పర్వ 571. పా

వెస వి (సం వాజః) వేగము.

వ. మనము వెసగల కాలరుల వేగంబ పుచ్చి. భార. ఉద్యో 1 37

ఉ వాయుజుమై వెసన్ బెకలి, వాయుగ తింజని కూలెసాలముల్. సమీర. 2. 58

చ. . ఎ, క్కుడు వెస రాహు మ స్తకము గొన్న సుదర్శన దేవుఁ గొల్చెదన్. ఆము. 1. 9.

క్రి. విశే క్రియ. శీఘ్రముగా, వేగముగా.

శా. వేమాఱు న్మలయానిలుం డడరి యా వీటం బ్రసూనాన్వితా, రామంబుల్ వెసముట్టి యందలి యలివ్రాతంబుఁ బోబోపి ... విక్ర 1 86

ఉ ఆ దనుజాపహ ర్తయు భుజాగ్రశముల్ వెసఁ జాచి యంచితా, మోద వికాసవన్నయవ ముగ్ధ సరోరుహ పంక్తిఁ బూజల, త్యాదర లీలఁ జేయునమ రాధిపుఁ గౌగిటఁ జేర్చె . . పారి 3. 6.

మ పవనాశ్వంబు హరింపఁగా మును జటా పాళిం జగత్ప్రాణ మూ, ర్తి వరోధించి తదశ్వముం గొనియె నీరే ప్రొద్దు దాని న్మెడన్, దవులం గట్టి ఖవీధి ద్రిప్పి వడి నాతం డర్కుఁ ద్రోయింప వీ,ని వెసన్ వచ్చెనొ కాక రాజెటుల దీంద్రించు న్నభ్రగాంకంబునన్ చంద్రా. 5 87

వెసనము వి (సం.వ్యసనం). వ్యసనము, కామక్రోధా దుల వలన కలుగు దోషము

క. తన కంటికిఁ బ్రియమయ్యెడు, ఘను నొక్కని వెంటవంటి కౌతుక మొప్పన్, మననంటి కొఁగి లింపక, చన దింటికి దాని బల్వెసన మేమందున్. హంస. 1. 218

గీ. కంతు మాయల నుమ్మెత్త కాయఁ దినివ, వెట్టి తెఱఁగున వెసనంపు వెఱపువొడమి, చికిలి నెఱ వన్నెకాంద్రకు నివము లెత్త, వెసనిచరియించు వీఁట నా హేమరేఖ. హంస. 1 220.

వెసల వి. వంటపాత్రము, పాత్రము.

క. వడ్డింపఁగ నెంగిలి దొడిఁ, బడ్డ వెసల వంటకంబు పాయ విడఁ దగున్, వడ్డించు నతని సోఁకిన, వడ్డింపక డించి వార్చి వడ్డింపఁ దగున్, విజ్ఞా. 1. 78.

క వెస లలనామణి బంగరు, వెస లఱ ద్రోఁతలు డించి వినయము మదికిం, బొసఁగఁగఁ గంకణ రవములు, బొసఁగఁగ నారసి రసాన్నములు వడ్డింపన్ 2 152

సీ. పాటించి యా గడపకు వెలపట, బొదికిళ్లఁ దవుడు నిప్పును బ్రత్తిగింజలు నిడి యడ్డముగఁ జిట్టు బడిసి వైచి, వేఁపరెమ్మల పీళ్లు వెసల లోపల నుంచి గాషలు పురిటింటఁ గట్టి చేసి ద్వా 3 45

సీ వెసఁలో మూనాళ్ల వెన్నలుండఁగ నాఁడు కాఁచి డించిన నెయ్యిఁ గరఁగఁ బెట్టు...శుక 561.

సీ ఏమిరా కాఁజెడ్డకోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చిన విధమున, మమ్ము మీ మతముఁ గైకొమ్మని చెప్పెదు ప్రాణికి మీ మతం బర్హ మగునె, స్వర్గవైభవము విసర్జించి యెవ్వఁడు జన దూష్యమైన పైశాచ వృత్తి, నీవలెఁ దాల్చురా నిర్భాగ్య - ప్రబోధ 3.29.

సా. కాఁజెడ్డ కోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చు = తాను చెడి యితరునిఁ గూడఁ జెఱచుట

# వే

వే1 వ వేయి, సహస్రము, అనేకము, పెక్కు.

సీ విష్ణు నామంబులు వేయును నిత్యంబు వినినఁ బఠించిన మనుజుఁ డిహము, పందు . భార అను. 5 326.

క. వేసేతుల నిడుపగు కా,కాసనము గుణస్వనోగ్ర మగునట్లుగ నుల్లాసమునఁ ద్రిప్పుచు మ ... హరి పూ 4 66.

(బాణాసురుఁ డీశ్వరునితో.) శా. దేవా కయ్యము తోడి వేడుక మదిం దట్టాడు మర్త్యుండు వే, త్రోవం జేతుల తీఁట వుతునని కోరున్ దానవుం డైన నా,కివే చేతులు చేసితి కసిమి దిం కెట్లో ర్త(న్) ... ఉ హరి. 5. 21.

క .. పతిన్నె హమ కామినులకు బలవం,తము పెఱ సెయ్యములు వేయుఁ దత్సదృశములే. భార. ఆది. 6. 190.

క కలిగె నొక జాంబవతి వెన్నెలవడఁ బడెదేల వలపు సీతలవేగెన్, బులియకు వే నవతులుగల, బాలంతులచే పాటువడక పోరాదనిన న్ ఉ.హరి 3 116.

శా ... ఈ కంథచే, వేలకుల్ కనకంబు రాలు విద్రుపన్ విశ్వంభరా ధీశ్వరా విక్ర. 2. 7.

(దీని యామ్రేడితరూపము ('వేవేలు'.)

క ఏవేళఁ జూచి నందన, శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్, వేవేల సంఖ్యలుండెదరు ... హర 2 38

వేవెలుంగులదొర. వి (వేయి + వెలుంగులు + దొర ) సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు

సీ ...తే... వేవెలుంగులదొర తోడు రేవెలుంగు. అము. 1 19.

వే2 క్రి. విశే. (సం వేగః.) 1 వేగముగ, త్వరగా

ఉ వెండియు వేఁడు బాణములు వే తొడిధర్మజు నొవ్వనేయ .. భార భీష్మ 3 40.

ఉ. ఒరొఎక యింత లేని వికచోత్పల లోచన చిత్త వీథిఁ బల్లారఁగ నీల నీరద శుభాంగుఁడు వే సమ దెంచె ... పారి 1 112.

చ చతురతఁ జెప్పి యప్పుర మొసంగఁగ వేచని యాడి రమ్మనన్. ఉ. రా 2 224.

2. శీఘ్రముగా, వెంటనే

క ముచ్చుల మూర్ధత్వమునం, బచ్చి నరకవాన మునకుఁ జనిన తనయు నేఁ,దెచ్చెద మగుడఁగ వే నీ, కిచ్చెద వగపుడుగు మింక వేనియు నధిపా. భార. ద్రోణ 2 219.

క. ... ఈ యర్భకుపై, వే పడిన ఖలులు దహనుని, వైపున శలభములు పగిదిఁ బడిరి ధరిత్రిన్ భాగ 10 పూ. 462

మ .. పెలుచన్ గంటు పుటుక్కునం దునిసి వే పృథ్విం బడెం జాలె . అము 4. 8.

మ. ధర కెంధూళులు కృష్ణరాయల చమూధాటీ గతిన్ వింధ్య గహ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటఁ గాపై యుండుటం జాల నచ్చె రువై యొజ్జని వింత చీకటులు వచ్చెంజూడరే యంచు వేసొరిదిం జూతురు వీర రుద్రగజరా ట్పుద్ధాంత ముగ్ధాంగనల్ మను. 1. 39.

**వేంకటము** సం. వి. అ. పుం. పర్వత విశేషము, ఒకా నొక పర్వతము, తిరుమల

**వేంకటాచలము** సం. వి. అ. పుం. తిరుపతి కొండ

క. శ్రీ నయన కువల యుగళా, నూనతో త్సాహ యితస్మితోజ్జ్వల ముఖదై, త్యానీత సురశ్రీపు వ,రా నయనక్రమణ వేంకటాచల రమణా. ఆము 2 1

**వేంకటేశుఁడు** సం. వి. అ. పుం. 1 తిరుమలకుఁ బ్రభు వగు విష్ణుని యర్చావతారము, వేంకటరమణ మూర్తి.

సీ. ... గీ ఇల్లు విడనాడి శ్రీ వేంకటేశుఁడుండు, పర్వతశ్రేష్ఠమున కధో భాగముననుననుఁ దనరు చుండెడు కపిల తీర్థంబుచెంతఁ, జేరి స్నానంబు చేసి త త్తరమునను వేం. మా 1. 169.

2. వేదాంత దేశికుఁడను విశిష్టాద్వైత మతప్రవర్తకుని మఱియొక పేరు.

వ. ... మఱియు హయవదన పదారాధకుండై వేంకటేశుం డను నింకొక్క మనిషి . ఆము. 6 66.

**వేంకి = వేఁకి** వి. జ్వరము

ద్వి. చిచ్చుకు వేంకియు సీతుకుఁ జలియు, వచ్చిన తూపుంగ వచ్చునే యనఘ ... నవ 4 183 పా 20 పం.

**వేంచేపు** వి. (దేవతలు, ప్రభువులు మొ. వారి) ప్రవేశము.

సీ హరికి భూమికి నీళ కర్థికవ్యక్తు నూతనాంబరాభరణంబు లర్పణములు, చేసి శృంగారముల్ చేసి హాటకరత్న దీధితు లొప్పిన తిరుచయందు, వేంచేపు చేయించి వివిధ మంగళవాద్యములు భూవలోంతరఁబు సెనంగ . వేం మా 2 112

మ. ... దరాం చమ్మరజానకాధి రవముల్ చెన్నొందఁదిర్వీథులన్ క. వేంచేపుచేసి వేళ్యా, పంచానన మధ్య లాడ బ్రాహ్మణవర్గం, బంచిత వేదధ్వనితోఁ, జంచద్గతి నడువనిల్పి జనపతి యంతన్ భార్గవ పురాణ. 5. 282

**వేంచేయు = విజయంచేయు** అ. క్రి. 1 (దేవతలు, ప్రభువులు మొ వారు) వచ్చు

సీ. వింధ్య శాఖినిగల వేంచేసి సీపుత్తుని నేను సింహా కృతి నెక్కలేని, గానిపోయి దాఁచితి...నవియె. దశకు. 12. 25.

గీ ఆకసంబున వేంచేయు హరికి సిద్ధ,సాధ్య చారణ గంధర్వ సంయమీంద్ర, వివిధ సంస్తుతుల్ చెవుల పండువులు చేసె, జయజయా రావములతోడ సకల దిశల. ఉ హరి 6 17.

క. వేంచేయుము నాయింటికిఁ, బంచ శరాకార యనుచు . భాగ. 10 పూ 1278

2. (దేవతలు, ప్రభువులు మొ వారు) వెళ్ళు, పోవు

మ నలునిం బంచి నగంబులం బరపుగా నా మీఁదఁ గట్టించ వే, వెలయన్ సేతుపు లంక కా తెరువు నన్ వేంచేయవే ... రామా 7. 020.

గీ శివుఁడు మంథానగిరి తుంగ శృంగవీథిఁ, జెలువు మీఱంగ స్వారి వేంచేయు నపుడు ... ఉ రా 1. 260

క జననాయకుఁ డంతట నతి, వినయతఁ దిరుమాళిగలకు వేంచేసెద రో, యని కేల్మోగుచుచు వైష్ణవ, జనులన్ వీడ్కొలిపి చనియె జలకంబులకున్. పరమ 3 51.

3 (దేవతలు, ప్రభువులు మొ॥ వారు) కూర్చుండు

గీ ఉరగ రిపు వాహనమున నొక్కొకక్క వేళ, వేడ్క వేంచేసి మెఱయుఁ దిర్వీథులందు, ... విట్ఠలయ్య పాండు. 4 184.

4. (దేవతలు, ప్రభువులు మొ॥వారు) వసించు

సీ పీఠంబుపైఁ దీర్థ పెరుమాళ్లు వేంచేసి యున్న వా రపచార మోనరల్లు . విప్ర 3 77,

వ ఔద్దాలక ఋష్యాశ్రమంబున వేంచేసి యున్న వాఁడు శేష. 4 అ. (క. ర.)

**వేండ్రపడు** అ. క్రి. (వేండ్రము + పడు) కోపించు.

సీ తల్లికిఁ గలదైన దయలేదు నా మీదఁ దండ్రి యెప్పుడు చూచి వేండ్రపడును ... హంస 3 150

**వేండ్రము** వి వేఁడిమి,

క జడనుం దాపము నిద్రయు, నిడువేండ్రము తోడ నగయు నిట్టూర్పులు సంతడిగొని పడిగొని మదిలోఁ, జిడి ముడిపడి కన్నుఁ గవయుఁ జిడిముడి పడగాన్. ఉ హరి 6 78

క. ... ఎటువలె, వే వచ్చితి రిటకు నెండ వేండ్రము చూపన్. మత 2 28.

విశ 1. అత్యుష్ణము, మిక్కిలి వేఁడిమియైనది
ద్వి. తండ్రి వాక్యములకై దారుణ శిఖల, వేంప్ర మౌ నగ్నిలో విపధి లోనైనఁ, బడియెద విష మైన భక్షించువాఁడ ... రం రా. అయో. 96 పా 23 పం
సీ. తిలకింప ద్వాదశార్కుల కన్న వేంప్రమై జల జారి పండు వెన్నెలలు గాయ . దశా 8 44.
2 తీక్ష్ణము, వాఁడియైనది.
క ఉంప్రా యథాధమనీ, తంప్రిండగని తాళుకొంటిఁ దగఁగాకున్నన్. వేంప్రం బగు కత్తి నిఁకన్, జింప్రంబునఁ బట్టి నిన్ను ఛేదింతు సుమీ. అహల్యా 1 97.
3. పరుషము
క. వేంప్రముగఁ దిట్టుటయు జవ,రాంప్రదెవ్వరు మున్నెఱుఁగని యంగద యొదవన్, గుంప్రాతి రూపుఁ గైకొని, తంప్రీ పెక్కేఁడు తిందుఁ దరలకయుంటిన్ అచ్చ రా బాల 148.
4. శౌర్యవంతము
శా. వాంప్రదున్ వీంప్రదును రాజులే యనుచు గర్వ ప్రౌఢితో యాదవుల్, వేంప్రంబైన బలంబుతో మథురకున్ వేవచ్చి . భాగ. 10 పూ 1522.
వేంపమ్రాను వి (వేము+మ్రాను.) ఒకానొక చెట్టు, నింబము.
వేఁకటి = వ్రేఁకటి వి గర్భము, చూలు.
మ. . కాంత యొక్కట సంత్రాసమునొందుఁ ఉన్నఁగవ యాకంపింపఁగా నిండు వేఁకటి భారంబునఁ జేసి . కాశీ. 4 213
సీ. గొంతి మూఁడవపట్టి కోడలి నిండు వేఁకటిఁ గాచినట్టి చే కత్తివాఁడు ... రా వి 2 71
క. .. వేఁకటి యగు లంజపడుపు విడువని బ్రతుకుం, బ్రాఁకొన్న నూతి యుదకము, మేఁకల పాడియును రోఁత మేదిని సుమతీ. సు. శ. 10.
వేఁకథము వి. ఉపగ్రహము (శ ర)
వేఁకరి = ఏఁకరి వి (వ్రేఁ ము + అరి) కిరాతులలో నొక తెగకుఁ జెందినవాఁడు.
గీ. . కోయచెంచు ... యేనాటి యేఁకరి పట్ట యెఱుకు, వేఁక ... యెనకరి యనఁదగ్భేదము లుగఁ, బొల్చును . . ఆం భా 2. 289.

వేఁకి (క. బేగె త వెక్కై) వి. 1. జ్వరము
క. బలదేవు మేను సోఁకిన, వెలిమిడిచే వేఁకి పఱచి విటతాటముగా, నిలుగుటతో ములుగుటతో, నలమటతో నావులింత లంతంతకుఁగాన్ ఉ హరి, 6. 77.
గీ . వేఁకి దళుచూపె దాహ మావిర్భవించె. కాశీ. 3. 121.
సీ. విస్మృతియును సంధతయు వేఁకియు నవంగ, నట్లు ప్రమాదజతైన యూరుజలకు రయముకఁ దగుఁ బ్రతిక్రియ లొనర్ప. మార్క. 8. 327
2. వేఁడిమి
తే రుచిర శశికాంత రచిత సరోవరంబు, నెలఁత సొచ్చిన మెయివేఁకి నీరులెల్ల, నింక వదనేందు రుచి శిలలెల్లఁ గరఁగ, నిండెఁ దోడ్తోనఁ గొల నతనుండు వినువ కు సం 5. 596.
క మలయానిలునకుఁ గదళీ, దళముల వీచిరొక వేఁకి దనుకఁగ నామై, నలమెడు మలయజ కర్దమ, మలఁదిరొకో యుడుకులేవ నమ్మ తాంకువయిన్ కు సం. 5. 640.
3 అగ్ని.
క. చక్కని ప్రకోష్ఠ పీడన, మిక్కిలి కమవేఁకి నుఱికె మినుమినుకు మనన్ . హర 8 74.
వేఁగఁబడు అ క్రి (వేఁగన్ + పడు — స్వార్థమున.) వేఁగు, పరితాపము నొందు.
గీ నమ్మఁ దగదు మొదల నమ్మి శాఠాత్మ కార్య మున కొరులఁ బనిచి యందు హార, లరయ నేసిరేని యడియాల మెఱుఁగక, వేఁగఁబడుట యెల్ల వెట్టితనము కేయూర 3. 184.
వేఁగారు అ క్రి. (వేఁగు + అరు) భారమగు అరు వగు.
ద్వి వేఁగారు గుబ్బల వ్రేఁకంబుతోడ, లేఁగౌను దీవియ లివలివ లాడ . . ద్వి. పరమ. 2. 56. పా 11 పం.
వేఁగి[1] వి (సం వ్యాఘ్రః.) 1 పులి
సీ. వేఁగి సావ్యాళ మెసఁగు అం భా 2.82
2. = వేఁగి దేశవిశేషము, ఆంధ్రదేశములో నంత ర్భాగము.
సీ. అటసాగి జమ్మిలోయఁ బడి వేఁగి దహించె ... ఆము. 1. 36.

వేఁగి² = వేఁగిస వి పీతసాలము, ఒకజాతి మద్దిచెట్టు (వ్యు. వి.)

సీ. .. వేఁగి వేఁగిస యన వెలయుఁ బీత,సాలాఖ్యగా ఆం భా 2 47.

ఆ. ... వేఁగి వేము మొదలుగాఁ గల మ్రాఁకులఁ, గావవగుచు నొక్క కావవెలయు వేం. పంచ 4 552

సీ. . దేవదారు గుమ్మడుమోవి శోపసియుఁ గుమ్మర పొల్కి గుగ్గిలమెట్టి పోల్కి వేఁగి హంస. 4. 11

వేఁగినాఁడు వి. (వేఁగి¹ + నాఁడు) వేఁగిదేశము.

క వెలనాఁడు వేఁగినాఁడును, బులుఁగుల నాఁడ్పాకనాఁడు పొత్తపినాఁడున్, గల మురికినాఁడు రేనాఁ,డలయక గనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్ హంస 1 58

వేఁగిస = వేఁగి² వి పీతసాలము, ఒకానొక చెట్టు. (వ్యు. వి.)

వ ఇప్పకప్పుర మద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కు తెఱంగుల మ్రాఁకులు...పి శకుం 2 14

వేఁగు = మ్రేఁగు అ క్రి. 1 (కాయధావ్యము మొ॥) తప్తమగు, భర్జితమగు.

(వ్యవ) కందులు సరిగా వేఁగక పప్పు బాగుగా లేదు.

2. తపించు, తాపము నొందు.

సీ తొల్లి దాణాయణితోఁ బాసి శంభుండు వింహ సంతాపాగ్ని వేఁగుచుండె.. కాశీ. 4 248.

3 పరితపించు, దుఃఖపడు.

ఉ.... విశాల నరేశ్వరుండు పుత్రోద్భవ కౌతుకాను భవ మొక్కటి లేమికి వేఁగి వాక్యసంపదుఘ గేంద్ర సన్నిభుల బ్రాహ్మణులం బిలిపించి వారితోన్. వరాహ. 2. 90.

సీ ...అవయముఁ బ్రతి,

ఆ వె కోటిలేనినాదు కొమరుడ కిప్పాటు, వలసె నకట యిది యవార్య మనుచు, వేఁగె వాని చావు వినియంత జిష్ణుండు, ఖండితారి పంక్తికంఠరుండు. రాఘవ. 4. 143.

ద్వి రాముని సతి దశరథరాజు కోడ,లిమ్మన్గ జనక మహీపాలుపుత్రి, వివిధ సంకటముల వేఁగుచున్నదియు. .రం. రా. అయో. 139. పా. 11. పం.

4 కాలము గడవు

చ. .జానలను గ్రమ్మనఁ గూలఁగఁ ద్రోచెమట్టులు, స్వవస నుఱుమాడె నేమిగతి వేఁగుదు నెక్కడఁ జొత్తుఁ జెప్పుమా. హరి పూ 5 214.

5 కలు, దగ్ధమగు

ఉ ఏల మృగాతీ నాకులుకు లేఁటికి నమ్మవు కూలి కొండరా, చూలి వివాహమైన యెడశోభన మంగళ వృత్తి నున్నచో, వేలుపు లెల్ల నంగజుఁడు వేఁగుటఁ జెప్పినఁ గామునిచ్చునా నీలగళాంకుఁ డీవిధము నిక్కమటంచు నభంబు బ్రయోయఁగన్ వీర. 2 155

6 చచ్చు, నశించు.

ఆ బ రుదాత్మకుండు తారక దైత్యుండు వేఁగు ననుచుఁ జెప్పి వీడుకొలిపె వీర 2 70.

7. క్షీణించు.

సీ మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి వెచ్చువారును మూఁక విచ్చువారు.. వరాహ 3 47

వి. భారము, బరువు

చ గొరగొర లాడుచుం బుడమి గ్రుచ్చుచు బల్వెరతోడ నోఁగాఁ, బిఁదికిఁ జూచుచుం గడుపు వేఁగున వంకర గాఁగఁ బోవుచున్ ... చెన్న. 2. 20

వేఁచిపోఁత వి (√వేఁచిపోయు) వేఁగించుట, తపింపఁజేయుట

క. వారలకు వగ్రగణ్యుం, డైరవి సంవర్త సమయ హవ్యవహ శిఖా,దారుణ కరముల భువనము, లిరేడును వేఁచిపోఁత నెటిఁగి నభయులై వరాహ. 6 108

వేఁచిపోయు స. క్రి (వేఁచు + పోయు) వేఁగఁజేయు, తపింపఁజేయు.

చూ వేఁచిపోఁత

వేఁచు స క్రి (√వేఁగు) 1. వేఁగఁజేయు, భర్జించు.

గీ. బిట్టుగాలివ పెనములఁ బెట్టవేఁప, మిట్టిపడి యుక్కుమూర్ఛిల్లునట్టివారఁ...ఉ. రా. 3. 323.

సీ. ఒసర వేఁపఁగ నెందు నెనఁగ లెత్తఁగఁబోవు
నూఁకిఁ బొమ్మన్న మలుకుఁ జెందు .. శుక. 2. 208

2 తపింపఁ జేయు

ఉ. పూఁత పసిండి వఁటి వలపుం బచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యి త్తెఱఁగు లేమ సురాంగన లెల్లనిట్టినీ, చేఁతకు మెత్తురమ్మ దయ సేయక తిన్నని మేను వెన్నెలన్, వేఁతురటమ్మ యింత కనువేఁదులు సెల్లు నటమ్మ యింతికిన్ మనుచ 3 33

ఉ ...మున్న వారి ను,ద్వేజక తీవ్రతేజమున వేఁచిన సాహసిగాన వేగ నం,భోజ విరోధి సేరెఁ బరభూధర కందర కోటరాంతమున్ వసు 6. 40

ఉ...దురంత నిరంతర తాప మెంతయున్, మెండయి సర్వ జంతువుల మేనులు వేఁచఁ దొడంగె న త్తరిన్ ఇందు. 3. 95

3. పరితపింపఁ జేయు.

మ. .ప్రాణసఖవై సాంపీ తుదన్ యుక్తమే, విరసంబైన వచః ప్రపంచవముచే వేఁపంగ నిందాకనిన్, సరసత్వంబునఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్ ప్రభా. 3. 97

వేఁట వి (క. బేఁటె త, మ. వేట్టై.) 1 మృగయ, అడవిలో మృగ పతులను సంహరించుట (ఇది మృగముల వేఁట, పదువేఁగ, గంటవేఁట తెరవేఁట సివంగి వేఁట మొదలగు పలు విధములు గలది)

చూ గంటవేఁట, పతులఁవేఁట రెండు విధములు- పాదివేఁట, విడివేఁట

ఉ. వేఁటకి నొప్పుఁగాక రజనీచరు నీ డెటులైన నెల్లిపో, దాఁటు కవాటముల్ విఱుఁగఁ దాఁచుచుఁ జేతుల తీఁటవోవ మై,తీఁటలు వుచ్చి రక్కసులఁ దీర్చుట రాముఁడొనర్చు నున్న పె, న్వేఁటకు రావణాది మృగ బృందముఁ దార్చుటటంచు నార్చినన్ భా రా యు. 455

గీ. . లగుడు సాళ్వంబు డేగలోమగను గన్ల, వేఁట పులుఁగుల విడిచిన వింటికెగసి. యయా. 2 23.

తే వెలఁది జూదంబు పానంబు వేఁటపలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము, సొమ్ము నిష్ప్రయోజనముగ నమ్ము సేత,యనెడు సప్త వ్యసనములఁ జనదు తగుల భార. ఉద్యో 2 44

2 మేఁకపోతు, దేవతకు బలి యిచ్చుటకై యేర్పఱుపఁబడిన మేఁకపోతు.

గీ శశము పిశితంబు పక్షి మాంసంబు పంది, యామిషము వేఁట పలలంబు నధికమైన, తృప్తి యొనరించు నొగిఁ బితృదేవతలకు, నెలమి నాలుగు నేను నాఱేడు నెలల. మార్కం. 3. 200

ఉ ...ఈ, వెక్కసి చెంచుసింగముల వేఁటుల వేఁటల తీలఁ ద్రుంచుచున్ చంద్రా. 2 50

మ. కొలిచెం గాటమ రాజులన్ నతులు చేకూర్చెన్ మహా వీర్లకున్, బోలమున్ రాజుల నెంత భక్తిపరతం బూజించె నాగంగకున్, వెలయన్ వేఁటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై, చెలి యాలాగున నల్ప దైవము కృపవన్ సిద్ధించెఁ దద్వాంఛయున్. హంస. 281.

3 తగరు పొట్టేలు.

గీ. వేఁట యన మేష మృగయలు వెలయుచుండు ... ఆం. భా. 3. 58

వేఁటకరి వి (√ వేఁట) వేఁటకాఁడు

క . అధిపుకై పట్టిరి బె,ఖ్ఖులి మహిమ మెలుఁగుఁ గిటిఁ,డెలు మొదలగు వానిఁగొన్నిఁటిని వేఁటకరుల్ మనుచ 4. 50

వేఁటకాఁడు వి. (వేఁట+కాఁడు) మృగయుఁడు, వేఁటాడువాఁడు.

బ వేఁటకాఁలు, వేఁటకాండ్రు, వేఁటకాండ్రురు.

ఆ వె నల్లగ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి, నోరి జింకఁ దివియు నేరుపాదవు, వేఁటకాఁడు నోలె ... ఆము. 4 193

ఆ వేఁటకాఁలు ముట్టి వెనుకొనఁగా శ్వేత, వగము చటికిఁ దారు నమిలి వోలె ...

వ. అప్పు డనిలసుతుని వేఁటకాఁలులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతులై .. భార శల్య 2. 36.

ఆ. దాని వాడ వారు తవిలి చంపించిరి, కుక్క నంతఁ గినిసి కుక్కవేఁట, కాంద్రు రందఱేఁగి కత సవిస్తరంబు నృపతితోడఁ జెప్ప నృపతి యలిగి. కేయూ. 114

విశ. సంహారకుఁడు, వశింపఁ జేయువాఁడు

తే. నిడుద త్రాళ్ళని బయల నెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగ ముఖాఖ్యద్దు మువ్వేసములఁ జెలఁగుచు, వెలుఁగు లెల్లెడఁ గంచుచు నలరు నిర్ల వేఁటకాఁ డప్పుడెంతయుఁ దేటమీఱె. అచ్చ రా అయో. 42

లోకోక్తి – వేఁటకాఁడు మెత్త నగునపుడు లేఁడి మూఁడు కాళ్ళను నడుచుట.

అధికారి యసమర్థుఁడైన సేవకులు స్వేచ్ఛగాఁ బ్రవర్తింతురనుట.

తే. పౌరుషంబున దురకలఁ బాఱఁదఱుము, వేఁటకాఁడిల మెత్తనౌ వేళ లేఁడి, మూఁడు కాళ్ళను నడుచు నిర్మూలితాంహ .. సిం వార శ 9

**వేఁటకుక్క** వి. (వేఁట+కుక్క) వేఁటాడుటయందు నేర్పుగల కుక్క, విశ్వకద్రువు (శ ర., ప్రౌ.)

**వేఁటగిరి** వి. (√వేఁట) వేఁటాడి జీవించెడి బోయె, వ్యాధుఁడు.

క. ... వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొంకు విడివడి యంతన్. రా. వి 3 57 (శ. ర. పా)

(వేటిసిరు శీటకరుల్, వేఁటమరుల్ దొరకుఁ గొలువ నిడివడి యంతన్ ముద్రి పా.

**వేఁటచాళ్లు** వి ఒక దినుసు వస్త్రములు

సీ. సంపంగి కావులు చందురు కావులు జెలివట్టు జీబులు వేఁటచాళ్ళు .. ప్రబంధ 272

వ. వరకంచులును బొమ్మంచులును ముయ్యంచులును వేఁటచాళ్ళును తిందు వన్నెలును సుర వన్నెలును ... ద్వి. శి. 206

**వేఁటపట్టు** వి. (వేఁట+పట్టు,) మృగయాస్థానము, వేఁటాడుచోటు.

చ. తలఁపులఁ దిట్ట భావముల తావక మాపల పుట్టినిల్లు గోర్కుల నెలవీడు వల్వగల కూట మవస్థల జన్మదేశ ము,మ్మలికల వెంటవేదవలమందు మనోభవు వేఁటపట్టుమూర్ఛల సహావాసమన్వి రహ సంతతతాపము వొందెఁ బార్వతిన్ కు. సం. 5 584

**వేఁటపల్లె** వి. (వేఁట+పల్లె) బోయగూడెము, పక్కణము

సీ వింధ్యాద్రి నడుమ నిర్వింధ్యాతటంబునఁ గానలో నొక్క పక్కణము గలదు, పింగాతుఁ డనియెడు పేరివాఁడా వేఁట పల్లె యేలెడు భిల్ల పరివృఢుండు . కాశీ, 4 60

**వేఁటపిట్ట** వి (వేఁట+పిట్ట) దీమపు పిట్ట,పతులను పట్టుకొనుటకై వేఁటగానిచేఁ బెంపబడు పక్షి. (శ ర.)

**వేఁటమ్ముల** వి (వేఁట+అమ్ము) వేఁటకుఁ బనికివచ్చు బాణము

సీ కంగు కఁగునవేలఁ గైదప్పుగాఁ బడువేఁటమ్ము లేలిక దాఁటిదాఁటి . మనుచ 4 103

**వేఁటయిట్టి** వి. (వేఁట+ఇట్టి.) ఇట్టులను వేఁటాడుటకై పెంచఁబడిన యిట్టి. (లేఁడి)

గీ కొమ్ముటురులఁ గాలి గుండులు చిలుమోర, లఱుత గవ్వదండ లలఁతిగంట, లమరసాఁరెఁ బెదవు లల్లార్చి గురగుర, మనుచు వేఁట యిట్టు లరుగు దెంచె. చంద్ర. 2 22.

**వేఁటరి** వి (వేఁట+అరి[3]) వేఁటకాఁడు.

చ నృపాల నందనుం, డలరుచు వేఁటకై చన రయంబున వేఁటరు లెల్ల వత్తరిన్. ఇందు. 2 57

ఉ. ఆతమగంబుపై నరవరాగ్రణి సమ్ముఖవర్తి మానవ, వ్రాతముతోడ నెక్కి నిడు వాలిక తూఁపులు చాపతండమున్, జేతులఁ బూని వేఁటరులఁ జీరి మృగంబులఁ బోవఁబంపి ని,ర్భీత కిరాతులన్ వలల ప్రేవల గొందఱనిల్పెఁ జాలుప గన్. చిత్రభా 3. 137.

**వేఁటలాడు = వేఁటాడు** స. క్రి (వేఁటలు+అడు)

1 వధించు, చంపు

ఉ ఓ వరవర్య రాముఁ డసురోత్కరమున్ మును వేఁటలాడుచుం, దా నచటన్ వసించుటశ్రుతంబగు రామ వియత్పురంబవన్ ... పరమ 5 74.

2. వేయు, (బాణములను) ప్రయోగించు.

తే. అనుదినంబును రాజన సనులమీఁద, వేఁట లాడుచు నున్నాఁడు విషమశరుఁడు నైష. 3 26

**వేఁటలుపట్టు** వ క్రి (√ వేఁట) మేఁకపోతులు పొట్టేళ్లు మొదలగు వానిని బలియిచ్చు

తే గీ తల్లిదండ్రులు దాము నద్వైతమునకుఁ, బ్రణతు లొనరించి వేఁటలుపట్టి పిదపఁ, బక్కణము లోని శబర దంపతులతోడ, నన్నపానాదు లొనరించు నవసరమున కాళ 3 40

**వేఁటాడు** స. క్రి (వేట+ఆడు.) 1 అడవియందు వలలు దీములు మొదలగువాని నొగ్గి మృగములను పశులను వధించు

వ పొలంబులన్ బులుగులన్ బోవుచు దేగ వేఁట కాండ్రు వేయునడి వేఁటాడన్ దొడంగి రందు మనుచ 4 55.

2. వధించు, సంహరించు.

క మీఁటుగల రాజ రథికుల, నాఁటికి వేపుర వధింతు వరుశరములు నో, నాటి పడవైచు వంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరులవెల్లన్ భార ఉద్యో 4 407

3 పోఁగొట్టు, నశింపఁ జేయు

ఆ వేఁడివేలు పివము వేఁటాడుపోటరి, బ్రొద్దు తూర్పుమలను బొడమె నపుడు...నీలా 3.45

**వేఁడి¹** వి 1 ఉష్ణత, వేఁడిమి

గీ. వేఁడియెల్ల నుడిపి విబుధారి కినుకమై, క్షితి పాత్రుఁ జేసి వీతిహోత్రు నృసిం. 2 118

క వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకు నెల్ల విశ్రాంతికర, (శ్రీ) సంపాదనకంబై, యాస న్నంబయ్యె వంబుదాగమ మంతన్ విక్ర 4 26

తే...కందువాఁల నిట్టూర్పు గాడ్పు వేఁడి, ముకురములు చారు మోహనమూర్తి యినఁగ, బంఁగు దమయంతిచేతి దర్పణము దక్క. నైష 1.70

2 సంతాపము, విరహ సంతాపము

సీ.. తన పరిపాలనంబున బరమసుఖులఁ,

ఆ గానొనర్చువాఁడు గా నప్పగించిన, వాఁడనేను మీకు వేఁడి దాఁకు,నట్లుగాఁ జరింప(ను) .. భార. అశ్ర. 1. 93,

గీ కుచ్చితం బింత యెఱుఁగద మ్మచ్చెకంటి, కంటి విఖ్యాతి నాతిఁగై కొంటి వనుచు, నచటి జూట లువనగొంటు లతని వేఁడి, వేఁడిమీఁదనె ద్రోచిరి వెట్టిరేఁచి ఐహు 5. 108

3 తేజము, ప్రతాపము

క అపరిమిత మైన నీ యుగ్రపు వేఁడిం బ్రాణు లెల్లఁ గ్రాఁగెడుఁ దేజం, బుపసంహరింపు సృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వమయాత్మా. మార్క 6 84.

చ దనుజ బలంబుపై నడరి తచ్ఛిఖ వేఁడిన కాన నేర్పు చెన్నున నలిరేఁచి కాల్పఁగఁ గమంగొని యంతకు మున్నె వచ్చియ,య్యని తెలఁగెల్లఁ జూచు చతురాస్య గిరీశ సురేశ ముఖ్యుల,యిట్లనుచు రోష శక్తి నుతియించిరి యెంచిరి రాజసేంద్రునిన్ ఉ రా 3 355.

క వీఁడే దిలీప భూపతి, వాఁడితనంబుననె కాన వచ్చునె మరుచేఁ, బోఁడిమి యటి యున్నప్పుడె, వేఁడి మెయిం బట్టి తెత్తు వేల్పులు తెగడన్. సుద. 5 6.

4 తీక్ష్ణత

ఆ సప్తహయుఁడు మూర్తి సప్తకంబు ధరించి, కరము వేఁడి మిగులు కరములొప్ప, నదనదీ జలములు నుదధిజలంబులుఁ, బీల్చి జగములెల్లఁ బ్రేల్చుఁ గడఁగి. భార. అర 4. 243

మ తమ భోగార్థ పదార్థ సంతతుల నిత్తన్వంగి కేళీవనిన్, రమణుల్ దానును జూఁబలాడె నిదిగో రాజీవ బాణాయటంచు మదాళివ్రజకీ కోకిలము లచ్చో పెచ్చు నుచ్చైస్స్వనం, బమరన్ బ్రోఁగెడి నాఁదదీయ రవమొప్పాఱెన్ గడున్ వేఁడిమై ఇందు. 3 73.

విశే 1 వెచ్చనిది, ఉష్ణము

సీ ఉసవోని వేఁడి నిట్టూర్పు గాడుపుల ఒల్వడలఁగె జిగిమోవి వాడువాఱ .నీలా. 2. 89.

ఆ భామలార యిందు నా ముద్దు తనయుండు. వేఁడివేఁడి యనుచు వేఁడివేఁడి, వేఁడి వేఁడి నీకు వెడఁద కాటుక కంటి, కొలుకులందమాటి కొలుకుచుండ పారంగ. 3 79.

2. తీక్ష్ణము, ఉగ్రము.

సీ ఆయుధ ప్రభఁ గాంచి యలఁగు భీరువుఁబూను వాఁడి ముమ్మొనముల వేఁడియలుఁగు పాండు 1. 101

గీ చూచి యా దివ్యపురుషుండు నూను వేఁడి, చూపులకు జంకెలకుఁ జెంత సుడియ వెఱచి ఉ. రా 4 11

3 పరుషము, కర్ణకఠోరము.

ఆ ..అట్టిజెట్టి నిన్ని,దినము లట్లు దొడరి పెనఁగియు నీచేత, నేఁడు వినఁగ వలసె వేఁడి పలుకు. భార. భీష్మ 3 177

క. ...భరతునిఁ బట్టము, నిలుకుం గట్టుటయు రాము నీరేడబ్దంబులు కానకుఁ బొమ్మనుటయు, నిలు వేల్పులు పాఱిగాఁగ నిక్లే రెండున్

ఉ వేఁడిన వేఁడిమాట నృపవీరుడు సైఁపక కర్ణరంధ్రముల్, సూఁడిన భంగిఁ దాఁకుటయు. . భా. రా. అయో 19.

4. దుఃఖకరము, సంతాపకరము.

చ. అలఘుఁడు వాలి రామ వసుధాధిపు ఘోర శిలీముఖంబుచే, నిలిగిన వేఁడిమాట వినియెంతయు నల్ల ముఖల్ల నంగఁ గొందలవడి తార భా. రా కిష్కిం 266

ద్వి. ఎడపక నను విక్రయించి చెల్లింపు, కడఁబడుఁ గొంతైనఁ గాశికు ఋణము...మదిరాక్షి యీ వేఁడి మాట నా చెవులఁ, గదియించి పాపంబు గట్టుకోఁ దగునె ద్వి. హరిశ్చ. ఉత్త. 217

వేఁడి²(డీ) వి. (వేఁడు² + ఇ) ఎక్కుడ నున్నవాఁడు (రూ. వేఁడి, వేఁడీ.)

ఉ. పోఁడిగ నెఁదునుం గలఁడు పొమ్మను దానుని జిహ్వనుండి యో, వేఁడి రమావిభుం డనెడి వీఱఁడి దైత్యుని దృష్టి నుండియో, వాఁడిది వేయనింక నని నావిరిఁ గంబమునందు నుండియో, వాఁడటు లుద్భవించుట యవందగు సర్వగతాత్ముఁడల్పుఁడే. భోజరా 174.

ఎ గీ. పాదఘట్టన మేదినీ భాగమగల, గండ్ర గొడ్డలి భుజమున గ్రాలవేఁడి, వేఁడి రాముఁ డటంచును విలయరుద్ర రౌద్రమున వచ్చె భార్గవ రాముఁడపుడు దశా. 7 298.

క. పార్థుఁడు వేఁడీ పొదువుఁడుఁ, జార్థుఁడ యెట వోయెదింకఁ బార్థుఁడ రావే...భార ద్రోణ. 3. 46.

ఆ అచటి జనులనడిగె నయ్యె వేఁడీయని,గద్గదిక నెలుంగు గడలు కొనఁగ ... భార. ఆశ్ర. 2 31.

వేఁడించు స క్రి (√వేఁడు) వేఁడఁజేయు, ప్రార్థించునట్లు చేయు

సీ ..గీ ఏ ఘనునినైన వేఁడించు నీకుఁ బాంగి, తనువు బంగార మేమొ యే ధన్యునైన, మరులుఁ జెందించు నిది మరు మాయయేమొ, యనుచుఁ జూచిన జనములు వినుతిసేయు బిల్హ 1 53.

వేఁడికంటి వి (వేఁడి + కన్ను) శివుఁడు, ఉగ్రాక్షుఁడు

ఉ తొంగలి పువ్వుఁ దేనియలఁ దూకొని మత్తిలి తుమ్మెదల్ పయిన్, బొంగుచు వ్రాల నొప్పెసఁగు పూచిన పొన్నఁ గడంగి కాంచి మున్, మ్రింగిన యా విసంబు వెసమీఁదికిఁ బిచ్చిలు వేఁడి కంటి యా, జంగమటంచు మ్రొక్కెనొక చాన నెలంతలు చూచి నవ్వఁగన్. యయా. 415

వేఁడి(డు)కొను స క్రి (వేఁడు + కొను - స్వార్థమున.) 1 యాచించు

క వేఁడికొని కృపణులై కమ,పోఁడిమి యతియేఁ రాజపుత్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులుకుదురే భార ఉద్యో 3 197

2 ప్రార్థించు

తే వేఁడికొని యెదఁ జికురాకు బోఁడినిన్ను ... వైష. 3. 129

సీ కపురంపు విడెమిచ్చి కలికి ముచ్చటవిన వేడ్కయై మాటాడ వేఁడుకొనుచు . ఉ రా. 4 48

వేఁడికోలు వి. (√ వేఁడుకొను) యాచించుట

మత్త వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱులేని సుహృజ్జనున్, వేఁడికోలుచితంబు కావున వేడ్కతోఁ జని సోమకున్, వేఁడినన్ ... భార ఆది 5. 218

వేఁడిమి వి (√ వేఁడి) 1 ఉష్ణత, తాపము.

క ... రాజపుత్రులు దమమై, వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు వినియులుకుదురే భార. ఉద్యో 3 197.

చ విలయ కృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమి మారి మనుచ. 2 10.

2 సంతాపము

క . ఏ, నేఁడు వధింతును నెవ్వగ, వేఁడిమి బడఁజాల కొక్క వెఱపు దలఁచితిన్. భాగ. సౌప్తి 1 50

3 ప్రతాపము,

క. వీఁడొకఁడు కురుబలంబున, వాకి మగండ నంగఁ జాలువాఁడబ్బాగిం, బోఁడిమి సెకియెరు ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము విక్రమమునకున్ భార విరా 5 110

ఉ ... నీ, వేఁడిమిసూపి యూథపుల విత్తశఁగం దునుమాడి .. భా రా యుద్ధ 733

4 తీక్ష్ణత, కఱకుఁదనము

క వేఁడి బ్రాహ్మణుదేతం, బోఁడిమి సెకియేను జిక్కి పోవకయుండన్, వేఁడిమి మెఱయు శరంబుల, వాడిమి సొంపెల్లఁ జూపవలయుం జుమ్మీ భార ద్రోణ 1 239

5. చుఱుకుఁదనము

ఉ ... నీ, వేఁడిమి సూపి రూపడంపు వీరిఁ బురందర పుత్త్రి యంతతో, బోఁడిమి మాఱు నాతఁడు ప్రభూత జయోన్నతి నిల్పు నీ కడన్ భార కర్ణ 1 68

క మూఁడవ విల్లెత్త నదియుఁ, బోఁడిమి చెడిపోవ నసుర పొలుపరి యలుకన్, వాఁడిమి యెసఁగఁగ నొక గద, వేఁడిమితోఁ వైచె వృష్ణి విభు సతి మీఁదన్. హరి. ఉ 4. 157

6 కఠినము

ద్వి వేఁడిమి హృదయ మీవిప్రున కెపుడు, వీఁడు కొండికవాఁడు విపిన భూములకుఁ, గనికరింపక పంపఁగా నెట్లువచ్చు, ననక కృపాహీనుఁడై నిన్నుఁ బంపె ద్వి హరిశ్చ ఉత్త 1861. పం

**వేఁడిమికన్దొర** వి (వేఁడిమి+కన్ను+దొర,) శివుఁడు, ఉగ్రాక్షుఁడు

క. ఈఁడుల రాయఁడ విను మి, వ్వాఁడిమగల్గ య్యమునకు వచ్చినచో న,వ్వేఁడిమి కన్దొర నైనన్, బోఁడిమితో గెలుచుటకును బోలుదురు సుమీ. అచ్చ రా కిష్కిం 75,

**వేఁడివెలుఁగు** వి (వేఁడి+వెలుఁగు) ఉష్ణకిరణుఁడు, సూర్యుఁడు

ఉ వేఁడిననట్లకాక పృథివిం జిరకాల మభీష్ట సౌఖ్యముల్, పోఁడిగ మీరు గాంచి మఱి పొందుఁడు మద్గతియంచుఁ జెప్పియున్, వేఁడి వెలుఁగు లోలిఁ బదివేల సహస్రములున్న భంగి నెవ్వాఁడు వెలుంగునట్టి బుధవత్సలుఁ డేఁగె నదృశ్యమూర్తియై బోజ రా 351.

క కడకడలి వేఁడి వెలుంగను, జడధారి వడి నున్ననుంగఁ జనిజేగురు ప్రచ్చడ మాఱఁగట్టె దరి నసఁ, బడమట నెఱసంజనించె బలువుగ మఱియున్ యయా 3. 69

**వేఁడివేలుపు(ల్పు)** వి (వేఁడి+వేలుపు) 1. ఉష్ణకరుఁడు, సూర్యుఁడు

ద్వి వేఁడివేలుపుడిగి వెచ్చిద్వీపంబు, నీఁడేర్పు రీతి నింతింతనరాని, పటురౌద్ర రేఖ చొప్పడ... ద్వి హరిశ్చ పూ. 1157

ఆ వె తొగల యెకురుచుక్క మొగురు వేల్పుల యిక్క, జగము విందు తమ్మి మొగుదపొందు, కాఁడు వేఁడి వేల్పుగాముల్గి యెకిమీఁడు, తూర్పు కొండమీఁదఁ దోఁచెనంత అచ్చ రా. అయో 41.

చ ఉదిరి పసిండి చాయగల యొవ్వల కుప్పలు వేఁడి వేలుపుం, గొాదమలు దావపావకుని కుజ్జులు చిచ్చఱకంటి నెచ్చెలుల్ ... వానర వీరు లొక్కటన్, బోదివిరి లంకచుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్. రామా. 7 180.

2. అగ్నిదేవుఁడు, జ్వలనుఁడు

ఉ వేఁడి వేలుపునా, నొప్పెడు కప్పుఁద్రోవ దొ, యున్ వలి ప్రక్క హాసఁతికాచలం, బుపవిలింగుఁ రాశముల నొందెడు పాముపిల్ల క్రింద వర్తిల్లున్ సమీర. 2 105.

సీ జేజేయనుచు మ్రొక్కు జేజేల రాయఁడు వేఁడి కోలని చూచు వేఁడివేల్పు . దశా 1 238.

గీ. వేఁడివేల్పువ కెనయగు వాఁడి ముల్కి, యొకటి సింగాణిఁ గూర్చి యేయుడుఁ గడింది, మీఱ నదివాని పెన్దొర దూఱిచనిన, వల్లతోఁ దోఁగి కుడు సొమ్మసిల్లి తెలిసి అచ్చ. రా యు. 348.

వేఁడు[1] స. క్రి (వేఁడు.) 1 యాచించు.

మ త్త, వేఁడు వెంతయుఁ గష్టమైనను వేఱులేని మహాత్మజనుల్, వేఁడికో లుచితంబ ... భార. ఆది 5. 218.

క పదునాలుగు లోకంబులు, నుదరస్థములుగ జరించు చుండెడు లక్ష్మీ, హృదయేశుఁడు నిను వేఁడఁగ, బ్రదికితి నీ బ్రదుకు బ్రదుకు బలి భూపాలా విక్ర 2 150.

చ ... నిన్ను దేవతా, విసరమ యాచకత్వమున వేఁడఁగ వచ్చుట .. నైష. 3 69

2 ప్రార్థించు.

ఉ. వీరకుమార యేను నిను వేఁడెదఁ బ్రార్థన సల్పుమయ్య పెం,పార మఘం బొనరఁగ ప్రియంపడి దక్షిణలేమి వచ్చితిన్ ... మార్క. 3. 8.

చ .కొల్వున కేఁగుదెంచి మన్ననఁ బ్రజవిన్న పంబులు వినంగదవయ్య నృపాల వేఁడెదన్. విక్ర. 3 44.

గీ. పోయి సేవింప కేకున్న పుణ్యతీర్థ, మహిమ వినుటయు సకల కల్మషహరంబ, కాన వేఁడెద వనిన నమ్మౌనివర్యుఁ, డాదరాయు త్త చిత్తుఁ డై యతని కనియె మనుచ 1. 69.

3 కోరు, అడుగు

గీ ఇట్లు ప్రత్యక్షమై నీ యభీష్ట మెద్ది, వేఁడు మిచ్చెద ననిన న ద్విప్రవరుఁడు . విక్ర 3 5

క. వారించి నీకు నెయ్యది, కోరిక యేతెంచినాఁడ గురుదక్షిణ యా, భూరమణ వేఁడు మనుటయు ...ఆము. 3 54

శా...దేవాపి సంజ్ఞావంతుఁడు సత్వాంధవుండగుచుని, శ్శంకన్ నను వేఁడు వాఁడై ... మనుచ 6. 43.

రగడ. ననలు వేఁడిన మొఱఁగి తప్పుడు నాలి నాలి కుచంబు ముట్టకు...పారి 4. 16.

4 తలఁచు

ఆ. ఎక్కడైన రవము నెసకంపు టుబ్బున, బొదలు చున్నవారు ముదముకతన, సెదికి తమ్ము నించు కేనియు నెఱుగరు, వీరు క్రొవ్వివావ వేఁడి రకట. భార. ద్రో. 1 265

మ లయకాలంబునఁ బ్రాణి జాతమున నాలస్యం బుమై మ్రింగ వేఁ,డి యుదగ్రోద్ధతిఁ దోఁచు దండధరు మాడ్కిన్ వచ్చు దుర్వార ని. శ్చయు నా శాత్రవుఁ జూచి...పారి. ఉ 1 151

క వెదకి కానక వాఁడు నా హృదయ మెఱుఁగ, వేఁడి దాగెనో యని బహిర్వేదిఁ జూచి ... శుక. 3 305.

వేఁడు[2] వ ఎవఁడు. (బ వేరు )

గీ నిలిచి చారుల రావించి యిలయు దివియు, ముంచు కపివీరసేనల మించు గాంచి, వీరిలో ముఖ్యు లెవ్వారు వేఁడు రాముఁ,డతని యను జన్ముఁ డెట్టివాఁడనుచుఁ బలుక రామా. 3 192. (శ. ర )

ద్వి సారంగధర నీవు చ,క్కఁదనంబు, వేరికిఁ దగు వని ప్రియము లాడుచును ... ద్వి శ సా 1. 420 పం.

వేఁత = (వేఁత వి √వేయు ) 1 వేయుట

2 దెబ్బ, వాతి

మ వసుధాత్రీ భృన్నఖాగ్రంబు వేఁ,తకు విట్టో ర్చిన గట్టు దా వెఱచునే దంభోళి భృత్కేళి కిన్ వసు 5 7

3 ఇది కొన్ని ధాతువుల కనుప్రయుక్త మగు చుండును

సీ గడ్డంబు వసనంబుఁ గావించు మంగలి కొఱఁత వెట్టునె తల గొఱిగివేఁత.. రామ శ. 99

వేఁదుఱిది విశే. (వేఁదుఱు + ఇది.) వెఱ్ఱిది, పిచ్చి యెత్తినది.

ఉ వా వివి పల్కెఁ బంట చెలి నన్నిటు వేఁదుఱి దానిఁజేసి నీ. వీవగ లీ వినోదగతు లేటికిఁ జూపెదు తేటయయ్యె మృ వి 3 29

వేఁదుఱు వి 1. ఉన్మాదము, పిచ్చి

ఉ వేఁదుఱు గొన్న మానవుని వేమఱుగంటియు బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁద్రొక్కి యును మున్కలిడి తీరఁగడంగు వెజ్జన,ట్లేఁ దఁగ నిన్ని చందముల నీతనిఁదీర్చుటకై పెనం గితిన్ నృసిం 5 12

గీ. విజయ పాలునితోడ నుచితభంగి మాటలాడిన వేఁదురు మానవోపు. విక్ర 3 108

ద్వి తొలుత వేఁదుఱుగన్న దుష్టమర్కటము, సొలయక భూతంబు సోకిన రీతి ద్వి. హారిశ్చ పూ 1484. పం.

2 అవివేకము.

క. విను కొడుకు గొన్న వేఁదుఱు,కొని కొట్టిన తిండికాఁడు కుటిలుం డతఁడా, జనపతి ఛందము ధర్మజు,నసుపమ శీలంబు నెఱుఁగు దది యెట్లుండెన్. భార ఉద్యో 1 56

క విను నాతండ్రికిఁ బుట్టిన, పెను వేఁదుఱు నీకుఁ బుట్టి పీతాంబరునిన్, వినుతించి కొలువఁగా వల, దని పలికెద వకట యెంత యజ్ఞానివొకో వి. పు 2 290

3 పిశాచము.

క. నావుడు మురారి నవ్వుచు, నా వేఁదుఱు నూఁడించి యనుచితము మహీ, దేవునిఁ జంపుట యనుచుం, గైవెక్కిన వానిమేను కరమున నిమిరెన్. ఉ. హరి 2 150.

విశే 1, ఉన్మత్తుఁడు, పిచ్చివాఁడు.

ఉ వ్రేఁకని బండివానికిని విప్రునికిం బతికి న్వివాది కిన్,వ్రేఁకని మోపువానికిని వృద్ధునకుం గడుఁ జిన్న బిడ్డకున్, వ్రేఁకటి యాఁడు మానిసికి వేఁదుఱు వానికిఁ ద్రెవ్వుగొంటుకుం, దేఁకువతోఁ దొలంగునది తెల్లముగా నెదురేఁగు దెంచినన్. విజ్ఞా. 2 16

వ అతఁడు మరలిచూచి పైభూశి నల్లియు నమి సియు వేఁదుఱు చందంబు భావింప నాభూ వల్లభుండు భార. అశ్వ. 1. 43,

2. వివేకహీనుఁడు

సీ విజయుండు నవ్వనే వేఁదుఱులార యింద్రుని చేతనై,న నీతనికి నొక్క ప్రియము సేయంగఁ గోరి...భార. అశ్వ 4. 82.

ఆ. పరుల మర్మమెత్తి పలుకనివా రన్య, భామి మలకు వాన పడని వారుఁ, దలఁచి చూడ దేవతా సమానులనంగ, వినవె నీతి యేల వేఁదు రైతి సారంగ 3. 89

క కులపతి నమ్మెదు వేఁదుఱు, గలదే యని పరి హాసింపఁ గావలదు నా. పలుకులువిని ననుఁ గృపతో, వెలయఁగ రక్షింపరయ్య వేఁడెద మిమ్మున్. హరిశ్చ. 4 79.

వేఁదుఱుకొను అ క్రి (వేఁదుఱు + కొను) పిచ్చి యెత్తు.

చ అఱువుడు కుప్పసంబమర నొఁదలఁ దాలిక లైన వెంట్రుకల్, తఱుచుగఁ దూలి యాడ దవు దవ్వులఁ గన్గొని సారమేయముల్, మొఱు గఁగఁ జౌర బాలకులు మూఁకలు గట్టి పిఱుంద రాఁగ వేఁదుఱుకొని వచ్చు వాని క్రియఁ దూఁగుచు వచ్చె నొకండు భిక్షుకున్. భోజ రా 3 42

వేఁదుఱులు వి బ అకారణ హాసములు, పిచ్చి నవ్వులు.

గీ అద్యతన రాజ విభవంబు లవహసించు, తెఱఁగు దోఁప నలంతి వేఁదుఱులు నవ్వఁ, గాళ్యపర్షి మనంబునఁ గౌతుకంబు, సంతతంబు జనింప శాకుంతలుండు శకుం 4 64.

వేఁదుఱెత్తు అ క్రి ఉన్మాదము పట్టు, పిచ్చిపట్టు

వ...అ వ్నాగవానంబు నాగరక విలోకనంబునం జెలరేఁగి మొగంబులు బిగించుకొని వేఁదు ఱెత్తిన గతిని...ఆము 4 35

వేఁపి వి (√వేఁగు.) కుక్క, వేఁటకుక్క.

ఉ ... ఆమిషబుద్ధి వేఁపి యమరాలయ మూల్యముఁ గాదు దాల్చిన,ట్లామఘవారి యాత్మపురి కాశ్రమధారణి నుండి తెచ్చి దు,ష్కామత నిల్పవట్టి మహికన్యను జూచె నభూమిశాకృతిన్. చం రా. 7. 38.

క. బొఱియవడ వేఁపు లొకకట్టిఁ, గఱచి వఱచి కూర్చినపుడు ... శుక. 1 178.

వేఁపికాఁడు విశే (వేఁపి + కాఁడు) కుక్కలచే వేఁటాడువాఁడు

ఉ. అత్తటి వేఁపికాండ్రు యమునాంబు తరంగ పరంపరాకృతిన్, ముత్తరమైన సూకర సము త్కరముం గని . మనుచ. 4 40.

వేఁవు=వ్రేఁవు వి. (√వేఁగు.) వేఁచుట, వేఁపుడు. (శ. ర.)

వేఁపుడు=వ్రేఁపుడు వి (√వేఁగు.) 1. వేఁచుట, భర్జనము, వేఁచినకూర

మ . . తాలిదపు సొంపున్ నింపు వంకాయ వేఁపుడు గమ్మఁదనమందు కందయును పుంబొ ట్లున్ రుటంబైన చిక్కుడు జట్టల్ మొదలైన శాకములు నొల్కుం బప్పు వడ్డింపఁగన్. శా వి 2 100

2 వేఁచెడు చట్టి, బాణలి. (శ ర)

విశే వేఁచినది

క అందందఁ దిరుగఁబోఁత బు,గం దింపఁగ గుడము నిగుడఁ గమ్మని నేతం, బొందుగ వేఁచిన వేఁపుడుఁ, గందముకుందాదులకు నొకతె వడ్డించెన్. బహు 4 18.

గీ ఎడమదెస దొడ్డుగాపైచి యేకుశెల్లఁ, గెలఁ బలువగ వేఁపుడు గింజ లునిచి, చేవ పీఁటల మీఁద వాసినలైవ, వారలై . శుక. 2.420

వేఁబోక = వేగుఁబోక వి. బొ (వేఁగు+పోఁక) వేకువ, ప్రభాతము.

క. పూఁబోణులకును విటులకు, వేఁబోకలఁ దలరు సొంపు వీడ్కోలుపుఁ బురిన్, వేఁబోకఁ బోక తోఁటల, బూబాళల కమ్మతావిఁ బొదలిన గాడ్పుల్. భీమ. 1 95.

సీ తరుణులుఁ బతులు వాతాయనంబుల నల్లఁ బొలయు వేఁబోకటి మలయ పవను . . భార విరా. 2. 238.

వేకటుఁడు సం వి అ పుం. 1 హాస్యగాఁడు, విదూషకుఁడు 2 వ్యర్ణకారుఁడు, అగసాలి 3 పడుచు వాఁడు, తరుణుఁడు

వేకువ వి. (√ వేగు) ప్రభాతము, తెల్లవాఱుజాము

క. ... త,జ్జననీ జనకులు బహువిధ, వినతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్. భార ఉద్యో 4. 390.

చ .. గుబ్బచఁ బతి దివ్య తవ్య మణిపాదుక లంఘ్రుల సంఘటించి య,క్కనకపురంబు చొచ్చి తమకంబున నన్నిసి పుచ్చి వేకువన్. విక్ర 2. 105.

గీ. కమ్మ కస్తురి గుళికలు తమ్మిలేమ, నిదుర మంపునఁ బుక్కిట నించి మేలు, కాంచి వేకువ మమిసె వాఁగముల ముకుళ, కోటరంబుల నెల దేటి కొదమ లెగసె పారి. 2 68

వేగ వి (సం వేగః.) 1 త్వర, వేగిరపాటు.

మ. .... ఆ, ధృతరాష్ట్రుం డవినీతి నేసినను సంధం బంగ రాదంచువే,గ తెగంబాఱుకు . భార ఉద్యో. 3. 25.

సీ నెటి దప్పి సలిల మన్వేషించుచును వేగవచ్చుచో నొకచోట ... భాగ. 10 ఉ. 454

2 వేగము, వడి

సీ కుండలమ్ములు వేగ కొనిరమ్ము నాలవ నాఁటికి వని పూని వన్నుఁ బనిచె . భార ఆది 1 114

ద్వి బాణాధి రాజమై పరగు వాదివ్య, బాణంబు సంధించి బలు వేగ దివియ ... రం రా. ఉ కాం 147 పా 5 పం

మ ... వా,విరి బ్రహ్మాస్త్రము నిన్న రేశ్వరునిపై వేగం బ్రయోగింపు సు,స్థిరలీలన్నమకూరునీకు, జయలక్ష్మి నిత్య సాంగత్యముల్. విక్ర 4 123.

క్రి విశే (క వేగ) దీని యామ్రేడితరూపము వేవేగ = త్వరితముగ

చ. ... ఆ, యత ధనువెత్తినూతు తల యక్కు రుఘున్మఁ డేసె డొల్ల వే,గ తొలఁగ నీడ్చెఁ దేరు దురగంబులు మూఁక గలంగి సొంపఱన్. భార శల్య 1 241.

చ మనలక యామిషంబు గొని మార్గము పట్టిన తుచ్ఛసైన్యముల్, వెసఁజని ముట్టి గోధనము వేగ మరల్తము గాక .. భార విరా. 4. 57.

క. మామా యన్నియుఁ దెచ్చితి, తేమానమి దేల వేగ దీపము వలదా, యాముదముదెమ్మ పొమ్మన, నా మంద విచారుఁడప్పు డంగడి కరిగెన్ శుక 3 190

క. ... వేవేగ నయోధ్యనేల వెంచేయుఁడగన్. భా రా కిష్కిం 493

మ. నవరత్నోజ్జ్వల దివ్య పుష్పక విమానంబెక్కి వేవేగ వి,శ్రవసుం జేరి నమస్కరించి . ఉ రా 2. 245

వేగంటి వి (వే+కన్ను) సహస్రాక్షుఁడు, దేవేంద్రుఁడు.

సీ వేగంటి తేరి కావిమెఱుంగు పరుగ పీవలిఁ బాయఁజేయు నుజ్జ్వల రథముల ... చంద్రి 6. 85

గీ దీనిఁ గనుఁగొన్న వేగంటి దేవరకును, వెచ్చ నిట్టూర్పు పుక్కిట వెడలకున్నె ... రామా 6. 104

వ కంసారి మునుపు సారి వెడలిన దారిని దుము దారిగా వేగంటి దునేదారి రాజసమ్మునగు మీస రమ్మునఁ దచ్ఛుభ వాసరమ్మున వచ్చునప్పు డప్పుడవాల్లెంచి ప్రబంధ 605.

**వేగంటి నగరి** వి (వేగంటి+నగరి) ఇంద్రుని రాజధాని, స్వర్గము
గీ కంటిమో వింటిమో యిటువంటి వాలు, గంటి ధర యందె కాదు వేగంటి నగరిఁ, గలుగు తెఱ గంటి తెలిగంటిగములనైన ... దశా. 7 212.

**వేగంటివే(లుపు)ల్పు** వి (వేఁగంటి+వేల్పు) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు
గీ రమ్య గాంధర్వ విద్యాధర గురుబుధ క,వి ప్రతతితోడ వేగంటి వేల్పుజాడ, సకల సామంత బాంధవ సమితి తోడ, నవ్యమౌక్తిక సింహాసనమునఁ జెలఁగి ఇందు 5 5.

**వేగన్నులతఁడు** వి (వే+కన్నులు+అతఁడు) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు
గీ చేరి జేజేలు మఱి జకదారిగములు, నచ్చరలు గొల్వ వేగన్నులతని మొదలి, రాచనెల వేలిఁ జేర్మి నే రాజు తండ్రి యతఁడు గొనియాడ నెగడె యయాతి పుడమి. యయా 1. 19

**వేగన్నులదొర** వి (వే+కన్నులు + దొర) సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు
క వేగరులు వేగ వేగమె, వేగన్నుల దొరను గాంచి విన్నప మనుచున్...మల్లుపు 2 5

**వేగపడు** అ క్రి (వేగ+పడు) తొందరపడు, త్వరపడు
ఆ. వేగపడకు మనుజ విభుచేతి బలుపును, జూతుగాక యవిన శూరరేఖ, నగుచు మంత్రి వరుల మొగములు గనుఁగొని, యిట్టులనియెదాన వేశ్వరుండు నిర్వ 7 29
క...తును సంభా,వించు నెడనాతఁ డప్పుడుఁ, బాంచాలిం జూపి వేగ పడి యిట్లనియెన్ భార. విరా 2 39
క...తముఁ దాఁ తెఱుఁగుట వేగప,డమి దాలిమి నిడుపు గలుగుటయు లేని ప్రభుత్వముగలదె . భార ఉద్యో 2. 27
గీ. చలము శోభిల్లు నొండొరు సమయఁ జేయ, వేగపడి పెల్లు నొంచుచో ప్రేటుఁ బోటు, నాటు వగపాటు నొండొరు లోటుపడక, దారుణంబుగఁ బోరి రవ్విరవరులు భా. రా అర 2 137.

**వేగపాటు** వి (√వేగపడు.) తొందర పడుట, వేగిరపడుట
చ. వలదని యెంత సెప్పినను వావిరినైకడు వేగపాటు మైఁ బలుమఱు నెల్లెడం దొడరఁజాఱెను భార. విరా 2. 260.
క. వాలిం గనుంగొని రఘు భూ.పాలాగ్రణియపుడు వేగపాటునఁ జాలన్, బోలంగ ధర్మార్థ సమే, తాలాపముల నిటు లనియె నాతని తోడన్ భా. రా. కిష్కిం. 251
గీ ...వేగ పాటేల యతఁడు నీ విభుఁడగుటకు, నర్చవాదుల నివ్విటి హరి భజింపు ... ఆము 5. 83

**వేగము** సం వి. అ పుం 1 తాఁకు, దెబ్బ 2 వడి, త్వర, 3 క్షోభము, అలజడి 4 ఉద్రేకము, ఉగ్రత 5 ప్రవాహము 6 ఉత్సాహము 7. బలము, శక్తి 8 (విషాది) ప్రసరణము (విషాదులు) దేహమున వ్యాపించుట 9. అతిత్వర, తొందర. 10 బాణప్రసారము, అమ్ముల వడి. 11 కామము. 12 లోపల నున్న యుద్రేకమును వెలువఱుచుట 13 సంతోషము, ఉల్లాసము 14. మలవిసర్జనము 15. పురుషుని వీర్యము, శుక్రము
ఉ విప్రకులుండ! వెల్వడుము వేగము వీవును నీ నిషాదియున్...భార. ఆది 2 63.

**వేగరి** వి (వేగు+అరి³) చారుఁడు, వృత్తాంతము దెలుపువాఁడు, తెల్పునది.
క అట వేగరులగు వారలు, పటురయమున వేఁగు దెంచి పంక్తిముఖున కచ్చటి రాము కార్య గతులు,తక్కటమున నెఱిఁగించి రతఁడు తల్లడమందన్ భా రా యు 1610
చ. వెలువడి క్రోధకున్ భగిని వేగరిగాఁ బదునాల్గు వేల బో,దులు పదునాల్గు చేరువలతో మును తోవనికేఁగుదేఱఁ...చం. రా. 5 48.
క. కనుఁగొని నివ్వెఱ పడి చే,య్యన మగుడి దశాస్యుఁ జేరి యంజలి బంధం, బొనరించి నిలిచి దేవర, వినుఁడొక వింతయని యనిరి వేగరులంతన్. ఉ రా. 3 223

**వేగలము** వి సంక్షోభము, కలఁత.

క. ఈ గతినందఱు యజ న,చ్ఛాగముఁ గుర్కు-రముఁ జేసి చనుచుండంగా, నాగరిక మేది విప్రుఁడు, వేగలమున నిలిచి భ్రాంతి వికలుం డగుచున్ వేం పంచ 3 147.

**వేగవాహి** సం. విశ. (న్. నీ. న్.) వేగము గలది. వడిగలది.

**వేగసరము** సం వి అ. పుం. వేసడము, కంచర గాడిద.

విశ (అ ఈ అ) వేగముగాఁ బోవునది

**వేగాలము** వి. (క. వేగాల్య) వేగము

చంద్రాంగద ముద్రితా ముద్రిత ప్రతులలో నీ పాఠమే కానవచ్చు చున్నది. వేం. పంచ ప్రతుల యందును వేగల మను పాఠము కనఁబడు చున్నది గ్రంథాంతర సంవాదము లేదు. సందర్భానుసారముగ నీ యర్థము చెప్పఁబడి నది.

సీ. ఈ తరుకుక్కి వేగాల మెన్న శక్యమే పుల్గునొడి సెల వేసిన ట్లొడిసి పట్టి...చంద్రా 2. 77.

**వేగా(గ)లము** వి. వేగము.

క ఈగతి నందఱు యజన,చ్ఛాగముఁ గుర్కు-రముఁ జేసి చనుచుండంగా, నాగరిక మేది విప్రుఁడు వేగలమున నిలిచి భ్రాంతి వికలుండగు చున్. వేం పంచ 3 147.

(ఇంకను విచార్యము.)

**వేగి** సం. విశ (న్ నీ న్.) వేగము గలది, వడిగలది. వి. న్. పుం 1. వార్తావహుఁడు, సమాచారము తెచ్చువాఁడు 2 డేగ, శ్యేనము

**వేగించె** అ. క్రి (√వేగు.) జాగరణముచేయు, మేలు కొని యుండు

ఉ కొంచక నీవు మద్యములఁ గ్రోలితి వాత్మ గలంగె నాకు వే,గించిన వాఁడ వీవు కమకెం పులు నాకుఁ బెల్లగె నన్ను వం,చించిన నీవె పూఁబొదల శ్రీ ఫలముం గనుఁగొంటి వయ్యయో, వంచశరుండు నా పయిని బాణము వైచె నిదేమి చెప్పుమా గంధ 62.

గీ. అనుచు నటవచ్చి చెలిపను లొనరఁ జేసి,యలసి వేగింపఁ జాలక యతివలెల్లఁ, గన్నుదమ్ములు మోడ్చి నక్కలికి యంతఁ, దనదు దండకు తాఁజూ శాఁదలఁచి లేచి. యయా. 5 116.

గీ. చేరి యవ్వారి యగు బాష్పవారి ధార,అరుణ రుచి కన్నుదామర లారి నిదుర, మానవ్రరే యెల్ల వెతఁజెంద మనుజనాథుఁ, దలఁతనట్టుశె వేగించి రనుజులెల్ల ఉ రా. 6 225

సక్రి. 1 (కాలము) కడవఁజేయు, కడుపు, పుచ్చు.

ద్వి ఆ రాత్రి వేగించి యమ్మఱునాఁడు, యా రమణులఁ గన్న యచటి కేతేర . రం. రా. బాల. 13. పా. 19 పం

వ ఓ యవ్వ కుశలంబున నున్న దానవే నిక్కను ష్యంబైన యీ శక్తి స్థానంబునఁ జిరకాలం బునంబట్టి యెట్లు వేగించుచున్న దానవు...కళా. 3. 115

2 సహించు, ఓర్చు

ద్వి శశిముఖయైన కౌసల్య సంపదల, విఱ్ఱవీఁగఁగ నరి వెంది దైవె యుఁడి, వెఱ్ఱిదానవె యెట్లు వేగించెదీవు ... రం రా అయో. 90 పా 3. పం.

క వేగింపరాని వేదన, వేగింపఁగ నంత ప్రొద్దు వేగియు సతికిన్, వేగక,యుంటెను దైవని,యో గంబున నంతఁ బతి వియోగము కతనన్ విక్ర. 6 114.

ద్వి కొంచె పట్టుటకునై కొంచని యంచ, యంచఁలో నీకు వే యళివేణి, పట్టినఁ గడునెగ్గు పుట్టిన నిచట, నెట్టు వేగించెద మిఁకనైన నీవు, కవకవ నగకు జక్కవ కవబెదరు ... అ మ.క. 2 115 పా 17. పం.

3 చేయు, నిర్వహించు.

గీ ఎట్లు వేగింతు సంసార మిచటనుండి, యేల నినుఁ బాసి యొంటి నాకిచటనుండఁ, గలుగనిమ్ము పెక్కండ్రు బంధులును నాకు, బంధువు గలండె నాకు నీపాఁటి వాఁడు శివరా 3 125

**వేగితము** సం విశ. (అ ఆ అ) త్వరపెట్టఁబడినది

**వేగిని** సం వి ఈ స్త్రీ నది, ఏఱు

**వేగిరకత్తె** విశ. (వేగిరము+కత్తె) వేగిరపాటుకలది, త్వరపడునది.

గీ ఎంత వేగిరకత్తెవే యింతి కాన, మా మగువఁ గొల్వ వచ్చితిమో మిటారి, యేరిఁ బోలుదు కొలిచిన వారిలోన, సుదతి యాకార గతి మంబు చూచి పలుకు కువల. 4 167

ఉ . వీరిఁ గటాక్షములందె యేలఁజాల్, వేగిరకత్తె వీవుచిత శీలఁ దలంతువా వేళ యెంతువో?... విజ వి. 3 204.

**వేగిరకాఁడు** విశ (వేగిరము + కాఁడు) వేగిరపాటు కలవాఁడు, త్వరపడువాఁడు.

ఉ వేగిర కాఁడు మన్మథుఁడు వెన్కను ముందును జూడఁడంతకున్, వేగిరకాఁడు నీ విభుఁడు వీరిఁ గటాక్షము లందె యేలఁ జా, ల్వేగిరకత్తె వీవు . విజ వి 7. 204.

**వేగిరపడు** అ క్రి (వేగిరము + పడు) తొందరపడు, త్వరపడు

గీ నన్ను గిల్పిన వరుఁడను నిన్ను జనకు, కడకుఁ బుచ్చెద వేగిర పడక నిలుము ... భార. కర్ణ. 2. 331.

చ అరుగుట సెప్పిరా కతల నాఁకలి దీర్చెద నన్నఁ జాల వే,గిరపడు చున్కి నీయుదర గేహము సొచ్చితిఁ జక్క వచ్చితిన్ ... భా రా మం. 60.

వ అంత వరుణ కిరణుం డన్వర్థాభిధానుండగుచు వచ్చిన వేగిరపడి వాయువందనుండు సుయోధను నేఁడ సమయింతు నను సంరంభంబున భార. భీష్మ. 2 396.

**వేగిరపఱుచు** స క్రి (√వేగిరపడు) త్వరపఱుచు, తొందరపెట్టు.

క శాఁ బనుపుఁడు పార్వతికులఁ, దేఁబనుపుఁడు తెలుఁగు పలిచి తేకిట సఖువం,గాఁ బనుపుఁడు జయభేరిన్, వేఁ బనుపుఁడు కర్ణకరుల వేగిర పఱుపన్ కృ శకుం. 1 49.

**వేగిరపాటు** వి (√వేగిరపడు.) తొందర.

ఉ. ఉల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె ... భార. ఉద్యో 1 165.

ఉ. ... అయోధ్య మా భరతుఁ డేలఁగ నే నియమించి దేహముం, దక్కెడు వాఁడనైతి ననుచిత స్థితి వేగిరపాటు లొప్పునే. భా. రా.యు. 490.

ద్వి యాగ దీక్షితునకు నలుగంగఁ దగునె, వేగిర పాటేల విజ్ఞాని కనిన, ననుజుఁడ తవలోన వని కంబు మండి, కనలెడు శత్రుండుగాదె కోపంబు ... రం రా ఉ. 131. పొ 5. పం

**వేగిరపెట్టు** స క్రి. (వేగిరము + పెట్టు.) త్వరపెట్టు, తొందరపడఁ జేయు.

వ ప్రతీహారి ససంభ్రమ గతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయ ప్రవేశంబు తెలుంగు విన్నవించిన నా రథిక సారథులం జూచు వేడ్క మనంబు వేగిరపెట్టెడు న య్యిరువుర నియ్యోడకుం జయ్యనఁ దోడితెమ్మను విభుని పలుకులు విని ... భార విరా. 5 267

**వేగిరము** వి (సం వేగః) 1 వేగము

క వెరవు మెయిఁదాన కతిపయ, పరిజన సహితముగ వరిఁగె బటుతురగగతి, స్ఫురణాను మోదలీలా, భరితుఁడగుచు వేగిరంపుఁ బయనములఁ దగన్ భార ఉద్యో. 1. 63

చ మునుకొని కోవిద స్థపతి ముఖ్యులు శిల్పము లుద్యమింప, న,ప్పని తన వేగిరంపుఁ బ్రియభావనకుం దగియుండ కుంఠినన్ .. హరి.ఉ.2.150.

క హరితేజము హరి కాంతియు, హరి విభవము హరి భయంకరాకృతి హరివే,గిరము హరి విక్రమంబును, హరియను పేరిటికి లక్ష్మిసాపాదింపన్. ఉ హరి. 6. 22.

2 తొందర.

చ విను మొక మాట రాత్రి చర వేగిర మేటికి . . ఆము 6. 28.

చ . ఎం,దును గౌరలేక నీకు నిదె దుస్సహ కర్ణనిపాత సూచిరైు, వినఁబడు గుండె దిగ్గురవ వేగిర మేల దురంబ కోరికన్ రాఘ 4. 112.

క. మదిరాక్షుల నమ్మకు నమ్మ,విడుఁడవు గద వేగిరంబు వెరవరిఁ జెఱుచున్, బదరకు మీ లెస్స పదిం,బదిగ విచారించి సేయ మంచిది సుమ్మీ. సారంగ 3 260.

క్రి. విశ త్వరితముగ.

గీ కెలని వాకిళ్లు రెండు వేగిరము మూసి, నడిమి వాకిలిఁ దెఱవ నెవ్వండు నేర్చు...కాశీ.2.121.

ఆ. మురిసి మురిసి రాలె ముని[వ్రేళ్ళు వడుముక్కు, చదుకఁ బడియెఁ జీము జాలుకొనియెఁ, దనువు మీఁద మునరె దొన దొన నీఁగలు, వేగిరంబె పెద్ద రోగమునకు నరాహ. 9 79.

వ. చింతా సాగరంబు వేగిరంబ వెల్లి వొడిచెవనన్ మనుచ. 3 9

**వేగిరించు** అ. క్రి. (√వేగిరము.) వేగిరపడు, తొందర పడు.

శా నీకున్నాకు వలంక్రియా కలనముల్ నెమ్మిం బ్రయోగించి యుత్సేకం బిమ్మెయి నావహించుట రయన్ సిద్ధంబు కార్యార్థులై, నా కావానులు వేగిరించెదరు నానావైరి భూనాయకా, నీక ధ్వంసమొనర్చి మాన్పవలయున్ వేగంబు భూభారమున్ హరి ఉ. 1 75.

ఆ. .. అల కన్న తండ్రియు, వెరవుమాలి యిటుల వేగిరించె. సారంగ. 3. 186.

క పూఁట వగు కార్యగతు లొక, నాఁటన్ మఱి నాఁటఁగనెడు నయ కార్యములొక్కటం జేయుట మేలగుఁ, గోటలపై వేగిరింపకుము వేనై వన్. రా. వి 2 36.

ఆ. కామనించి చేయఁదగ దెట్టి కార్యంబు వేగిరింప నదియు విషము మగును, పచ్చికాయఁ దెచ్చి వడవేయ ఫలమౌనె . వేమ 1. 26

**వేగు¹(వు)** అ క్రి 1 తెల్లవాఱు, ప్రభాతమగు.

క. వేగుటయు సత్వరంబుగ, నా గాంగేయుండు మించి యనికి న్నడచినన్, సాగర తరంగముల గతి, వేగమ తరతరము మొనలు వెడలఁ దొడంగెన్ భార భీష్మ 2. 167

సీ....వేగునంతకుఁ జేసె జాగరంబు. కాశీ. 4 183.

ద్వి. ఆరాత్రి వేగంగ వంచిత స్తోత్ర, పాఠీనులగు పుణ్య పాఠకుల్ వచ్చి, వీరపుంగవ రామ విజయాభిరామ భూరి విక్రమ నిత్యమేల్కొనుము . రం. రా ఉ 108. పా 11. పం.

మ వరునన్ శుక్రుఁడు నాఁడు వేగఁదన చెల్వం జూచి యీ కన్నెకున్, దొరయౌ రూపును బ్రాయమున్ గలిగి చెన్నుం గల్గు వీ నేలతేఁ, డరుదై కల్గెఁ దలంచినట్ల యెత్తసేయం బోలు నే యింక నేఁర్పరులౌ కొమ్మలఁ బంపుమా తగు పనుల్ గావింపఁ శాణింపఁగన్ ... యయా. 4 84

సీ గీ ...వేగెవాఁగను దెలవాఱె నాఁగ తెలే,నవఁగ నేకార్థములు గాఁగఁ దనరు నభవ. ఆం భా 3 99.

2 ఉదయించు, పుట్టు, కలుగు.

ద్వి ఇల జీవులకునెల్ల నిదె వేగెఁ బ్రొద్దు...ద్వి హరిశ్చ ఉ 1155. పం

క కలిగె నొక జాంబవతి వె, న్నెల వడఁబడె దేల వలపు నీతల వేగెన్, బొలియకు వేన తులుగల, పొలఁతులచే పాటువడక పోదాదని యెన్. ఉ హరి. 3 115.

ఉ.. ఇట్టివి నీతల వేగనే చెలి. ఆము. 5 56.

సీ తలనే వేగెనా = నీయందే గలదా ? అవి యర్థము.

క వల పెక్కడ లేదా యీ, యలికుంతల తలనె వేగెనా యేఁచకిఁకన్, జలికాలఁ ద్రోఁచి విడువుము, చెలిమిక్కిలి మవమ పేద శీతల పాదా విజ వి 3. 50

3 (కాలము) కడచు.

వ. అనిన విని యశోదాదేవి వేర్వేఱ నమూన యించి

క. మీ నేగులెల్ల వచ్చెర, వేసరకుఁడు మీరు లేక వేగుకె మాకుం, జేసెం జేయఁడు బాలకుఁ, దామరపుం బనులు నిజము అనియెదరు బలే హరి. పూ. 5. 230

వ. నీవు కైటభారిం బాడిన వేఁటపాట ఫలంబు నజలంబుగా నాకిచ్చితేని బీభత్సకుత్పార్ధంబగు నీ జన్మంబు వేగు. ఆము. 6. 59

చ అలఘు విపన్నహార్ణవము నట్లు తరించి పువర్ణహోర్ధతిన్, వెలిగెడు వారిఁదద్రజని వేగ భయంకర లీలఁ దాఁకి పెం పలరఁగ. రాఘవ. 4 213.

4. శుభోదయ మగు.

ఉ, ంమని బాధలంబడు జగంబుల కింతటి వేగుఁ గాతఁ ద,ద్వఁశము వేగ వేగుటయు ... హరి. పూ. 9 33.

క ఈగతి నత్తఱిఁ దెలతెల, వేగిన గంధర్వ పతికి వేగుట విని తా, రాగమున కేఁగి కాంచిరి, రాగమ్మునఁ గొలిచి మను పురాతన ఖచరుల్ మనుచ. 5 41.

5 బాధపడు, క్లేశము నొందు,
చూ వేచు.

ద్వి నా నిమిత్తంబున నారీలలామ, కీ నీచ దుర్దశ నిటు వేగ వలసె . ద్వి. హరిశ్చ 1707.

ఉ. అల్పపు బుద్ధి నీక్రియ మహోగ్రతు తంత్రముఁ బన్నగాధిపా, కల్పనిఁ బాయఁబెట్టి కమగావక దతుఁడు చేయఁజొచ్చి యా, వేల్పులు దాను దుర్దశల వేగె మహోగ్రశయాగ్ని రుద్రుడనిం, బోలఁగ వచ్చునట్టి పటు భూరి విభుండగు వీరభద్రుచేన్ భీమ 2.9

**వేఁగు²** వి. 1 రాజకీయ సమాచారము.

క మాకంటె వాఁడు మునుపుగ, నే కార్యము సేయఁగలఁడొ యెఱుఁగము మీరల్, కోకగఁ దతుఎరి మెలఁగుచు, నాకేదొక పనికి వేగు నడ పగవలయున్ ప్రభా 1 114

చ. అపుడు తమంబు చొప్పు దెలియన్ సమయోచిత వేషధారియై, తపనుని యాజ్ఞఁగైకొని ముదంబున వేగున కేగుదెంచు దూత పగిదిఁ జూడ నొప్పె నుదితంబయి తూర్పున వేగుఁజుక్క యా, నెపముననో తదాఖ్య ధరణిం బ్రతిపాదిత మౌట దానికిన్ కవిరా. 5 217

క కింకరుల చేత వంతన్, లంకకు వేగంటె నందిన న్వని యంకా, పాంకాలు దరిగొనంగ ని,రంకుశ సాహస సమర్థుఁ డగు దశముఖుఁడున్ రామా 7. 49.

2. చారుఁడు

సీ. పరిమిత పరిచార పరిగతుఁడని తన వేగులు చెప్పిన వివిధయాన, పాత్రముల్సమకట్టి ... దశకు 11. 22.

గీ. అరులకడ నిజభూమియం దనుజ తనుజ, బాంధ వామాత్య మిత్త్రులఁ బారవేష,ధరుల వేగులఁ గాఁబెట్ట ధరణిపునకు, వలయు నొండొరు నెఱుఁగని వాఁరిఁగాఁగ. భా. శాంతి 2 279.

**వేఁగుఁజుక్క** వి (వేగు¹+చుక్క) శుక్ర నక్షత్రము, వేకువ జామున పొడుచు నక్షత్రము.

గీ ఉదయగిరి మీఁదఁ గోపురంబుండి నిగుడ, నహిత రవి రశ్మిచే బద్ధుఁడగుమఁ దోడి, బలఁగ మైనట్టి చుక్కల వలసత్రోవఁ, జూపనేతెంచె వన వేగుఁజుక్క పొడిచె మనుచ. 3. 54.

చ ...ఒంటిమైబయటనుండక పొమ్మని వేగుఁ దెల్ప న,చ్చిన గతి వేగుఁజుక్క పొడిచెం జనె రాజును బశ్చిమాద్రికిన్ సారంగ 2. 185.

క కమఁగొంటివె యతి చక్కన్, మనసిజనృప కీర్తి రుచి నతాజపు మొక్కన్, మినుకుల కులముల యిక్కన్, విను చక్కం బొక్క మైన వేగుం జుక్కన్ శుక 2. 268.

**వేగుఁబోక**=వేఁబోక వి బొ (వేగు¹+పోక.) ప్రభాతము, ప్రత్యూషము, తెల్లవాఱుజాము.

ఆ వెలరు వాఱు దివియల నల్ల వల్లార్చు, స్వర్ణ గండ్లయందుఁ జొచ్చి సుడిసి, తిరిగి వేగుఁబోక తెమ్మెర వెలదిఁగ, కొవల వంకలొత్తుననలఁ బ్రోచు భార ఉద్యో. 2 112

క. వేగుం బోకల మేల్కని, భాగవతోద్గీయమాన భగవద్గీతా, రాగంబులు విని మదిను,ద్వేగంబు వహించుఁ జేదుదిన్న విధమునన్ ... నైష. 7 129

చ.. ఇంద్రియముల వందువయ్యెను న తీ ప తి కోటికి వేగుఁ బోకటన్ కవిక. 4 188.

క. ఈరేయి వేగుఁబోకటఁ, జారాయణ యేమి చెప్ప జనులెన్నడు నె,వ్వారును నెచ్చటఁగా నఁగ, నేరని చోద్యంబు గంటి నిక్కమువినుమా, కేయూర. 4. 29.

**వేగుజాము** వి (వేగు¹+జాము.) తెల్లవాఱుజాము సూర్యోదయమునకు ముందు పడున్నర గడియల కాలము.

ఆ వేగుజాము గలుగ వెడనిద్రఁ బొందదు.. భార. అర. 6 308

ఉ కుప్పసముల్ వదల్చి వలి గుబ్బల నొత్తిరిహత్తి వేగుజా,మిప్ప లలర్చు గాడ్పుల కదీశు...ఆము 5 104.

మ అకటా యేమని దూఱుదాన మిము వాతా వేగు జామయ్యె...కళా. 4. 112

**వేగుపాటు** వి (వేగు¹+పాటు.) వేఁబోక, ప్రభాతము.

ఉ. ఇమ్మలఁ బశ్చిమాంబునిధి కేఁగు నెడందగ వారకన్ మయూ,ఖమ్ములనెన్ని కుంచితముగా నొనరించిన వ్రేళ్ళ రక్తిలోఁ, గ్రమ్మఁగఁ బ్రాక్ప్రవృద్ధ రవి రశ్మలఁ బద్మిని వేగుపాటు వం,గ్రమ్మఱ లెక్కబెట్ట నవఁగా వికసించె సహస్ర పత్రముల్. వేం. పంచ. 4 316

**వేగురు=వేవురు** న బ వేయిమంది, సహస్ర సంఖ్య గలవారు అనేకులు, పెక్కండ్రు

వ.. పదుండ్రు నూర్గురు వేగురు లక్షకోటి సంఖ్యా కులుం గూడికొని...దశా. 2 162

గీ. ఆతని కూఁతురు శర్మిష్ఠ యనఁగ నొప్పు,గూర్మి సకియలు వేగురు గొల్వనెపుడు, నా చెలియఁ గూడి యా కొమ్మ యాడుకొనుచు, నరమరలు లేని చెలుముల నవఁగి పెనఁగి యయా. 3 50

వ...అఖిల దేశాల వెలికి వేగురున్ను చేయించ్చిన ధర్మ్మకామ. దశా. 4. 774.

**వేగురుఁజుక్క** వి. (వేగు¹+చుక్క) వేగుఁజుక్క 'సంధిని వర్ణాగమము.'

మ. పొడమె న్వేగురుఁ జుక్క కాల ఫణ భృద్భో గోల్లస ద్రత్నమై...పారి. 2 53.

క. రక్కసుల గురువు గురునకు, వెక్కసమగు మతికి నిరవు వెరవుల కెల్ల,న్డిక్కు నుతికెక్కు వేగురుఁ, జుక్కదివి న్విటులు గడుసు జుక్కనఁ బొడిచెన్, వి. ప్ర. 3. 47.

ఉ. చుక్కల తేఁడు తూర్పుదెస బోదుతనుంగురు సంగరార్థమై, యుక్కున దారసిల్లునని యుక్క శమంపిన రీతి వేగురుం,జుక్క సురేంద్ర దిక్కు నను శోభిలె...శశాం. 4. 123.

**వేగు(ల)వాఁడు** వి. (√వేగు) రాజ్య సమాచారము తెల్పువాఁడు, చారుఁడు

క. మొదల నొక వేగువానిం, గదలరయఁగ బనిచి పిదపఁ గార్యము నేయం, బదిలమని పలికె శర ఘుఁడు, పడపడి మైందుండు నట్లు పలికెఁ బలు కుఁడున్ భా. రా. యు. 172

ద్వి. పదపడియుడు రాజుపై దినవాథుఁ, డదెవచ్చె నని చెప్ప నరుదెంచు రీతి, వేగువాఁడును బోలె వేగురుఁజుక్క, బాగుగా బొడిచినఁ బలపల వేగె...ద్వి. హరిశ్చ. పూ. 547.

గీ...మహనీయ వైభవ మెంక మెసఁగ, వఱలు వరపతి మందిర ద్వారభూమి, నేర వరిగి యా వేగుల వారు ప్రీతి భార విరా 3. 74

ద్వి. వేగులవారిచే విన్న వార్తలకు, వేగ నిస్సా ణంబు వ్రేయంగఁ బనిచి ... రం రా యు 335 పొ. 29. పం.

**వేచ** సం వి. అ స్త్రీ. జీతము, కూలి

**వేచందము(లు)** వి. (వేయి+చందములు)

ద్వి. వేచందములఁ గృపా వివశుఁడై యీవఁగా చిన పిదపఁ గుక్కల కిచ్చినట్లు...ద్వి పరమ. 2. 61. పొ.

**వేచు¹** స క్రి ఎదురుచూచు, ప్రతీక్షించు

చ. వినుమరిఁ జంపమం తెలుప వేచుట లెస్సప్రతాప భాషణం,బున వెడ మల్లి కుట్టులను బొంకుల వానిఁ గలంగఁ జేసి రేఁ,చినఁ దనపూఁపుదప్పు ...భార శాం. 3. 20.

సీ ధార్తరాష్ట్రులు మాతతనయ సౌబలులును తెలుపవ వేతురు చిన్న సన్న...భార విరా. 1 47.

క. ఈ చందమునఁ దెఱపులు, వేచియుఁ బయిఁ బూఁచిలాంచి వేసియుఁ బైపైఁ, ద్రోచుకుధి రమునఁ దడిసిరి పూచిన మోదువుల తోడఁ బుట్టువు లగుచున్. ఉ హరి. 3. 63

**వేఁచు²** న. క్రి. (√వేగు) బాధపెట్టు, క్లేశము నొందించు (ఈ యర్థమునం దిది నిరనుస్వార మనుటకు ఈ క్రింది భారత ప్రయోగము నిర్ధారకము)

ఉ. కీచక కోటిచేత నొక కీడును బొందక వచ్చి తమ్మ ని,న్వేచిన దుర్మదుఁడు ఽ మునిఁగొలువం బనెనమ్మ యంత బో,కేచిన సూతులీ యొదలి కింత యసాయ మొనర్తురమ్మవే,కాచి విరో ధులం దునుమఁగానిటు మట్టుదురమ్మ నీ పతుల్. భార. విరా 3 44

శ్లో॥ దృష్ట్వా సైరంధ్రి ముక్తాసి దిష్ట్యాసి పునరాగతా, దిష్ట్యా వినిహతా సూతా యేత్వాం క్లిశ్యన్త్యనాగసం. సం భార విరా. 28. 23.

ఉ కాఁక పెదిర్చి సంగరముఖంబున హెచ్చిన రాజ వంశముం, గూఁకటి వేళ్లతోఁ బెఱికి గోత్ర వధంబును జేసినట్టి యా, ప్రేఁకపుఁ గీడుగాక ప్రజ వేచఁ దలంచిన గోరుచుట్టు పై, రోఁకటి పోటు చందముగ రోసి జనుల్ నముఁ జూచి తిట్టరే జై. భా, 1 64.

**వేమేంగులపాగ** వి (వేయి + చుంగులు + పాగ) సహస్రఫణుఁడు, వేయి పడగలు గల వాఁడు, శేషుఁడు (అప్ర శ ర.)

**వేటు** = **ప్రేటు** వి (√ వేయు.) 1. దెబ్బ, హతి.

మ. మద దంతావళ దంతముల్ వఱకు నమ్మాత్ర వంతు లుద్భ్రాంతతన్, బెదరం బల్లము గుజ్జు మున్ రవుతునున్ వేటారు తుండెంబులై, చెద రంగా...వ్రిక 6 79

క. ఒకయే టొక పో టొక వే,టొక యాటొక ముట్టిపాలు నొందక తం,డక్కడ పుటలుమాన్పె నొక్కం, డకలుష దివ్యాస్త్ర తతుల నదియట్లుం డెన్ కకు 2. 104.

ద్వి అరుదుగా రౌతును హయముఁ బల్లమును, దురిమున వేటాలు తునియలు గాఁగ. .హరిశ్చ. పూ. 182.

2. వైచుట, వేయుట.

సీ...అచ్చులోన నే యచ్చైనఁ గైకొని మాట లాడిన యట్లు వేటు గలుగఁ, దలపు గతి వచ్చు గోరిన దాయమవఁగ, శకుని జూదము దీని యచ్చొక యనఁగ, గెలువు నాయది కాయొడ్డు గెలువనేర్చి, యేల్లఁ బిడికిళ్ళ విడిపించి యేన కొందు. ద్వా. 10 88

**వేటుగజ్జెలు** వి బ. (వేటు + గజ్జెలు.) నాట్యమందు కాళ్ళకు కట్టుకొను గజ్జెలు.

గీ వేటు గజ్జెలు మద్దెలల్ వీణచెంగు, మురళి సారంగ తిత్తి కిన్నెర రబాబు, శంఖ తాళాది వాద్యముల్ సరసరీతి, పాటశ్రుతిఁ గూడి నాద మేర్పాటుచేయ. మల్హవు. 4. 64.

**వేట్లాడు** అ. క్రి. (వేట్లు + ఆడు.) దెబ్బలాడు, పోట్లాడు.

వ. తల్లంకక బింకంబున నంకంబునకుఁ జంకించక వేట్లాడ నగ్గలిక డగ్గరు నవియును. (ఇది చకోర విహార వర్ణనము.) ఘటికా. 2 146.

**వేడ** సం వి అ. స్త్రీ ఓడ, పడవ.

**వేడబము** వి. (సం. విడంబః) 1 వంచన, మోసము

మ. కని యద్దేవుని తోడ వేడబమునం గప్పంబు గార్యంబుగా, నముఁ బుత్తెంచుటఁ జెప్పనోడితి .. ఉ హరి. 4 182

మ తలఁపుల్ చిప్పులు మాట లుజ్జ్వల సుధా ధారల్ విభుండైన పుంవ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ, రలు తోడుం బతినైనఁ జంపుదు రధర్మల్ నిర్ద యల్ చంచలల్, వెలయాండ్రెక్కడ వారి వేడబములా వేదాంత సూక్తంబులే. భాగ. 9 417.

ఆ. వేక్క మీఱఁగాను విప్రులు చూడంగ, వచ్చి చక్రియజ్ఞ వాటిలోన, జేరి ద్విజుల వడుమ సిరి తోడఁ గూర్చుండి, విడెము సేయుచుండె వేడ బమున వేం మా. 1. 139., కాశీ 6. 89.

2 మాయ, కపట ప్రవర్తనము

ఆ. విలయ కాలమందు విశ్వంబు నీ పెద్ద,కడుపు లోన దాఁచు కడిమి మేటి, నటుఁడ వీవు నేఁడు నాగర్భుఁడ వౌట, పరమపురుష వేడబంబు గాదె భాగ. 10 పూ 129.

చ సబలు నశక్తుఁ జేయుదు వశక్తు బలాఢ్యునిఁ జేయు దజ్ఞునిన్, విబుధు నొనర్తు నవ్విబుధు నిన్ జడుఁగా నొనరింతు వెల్లెలుం,గబడు భవత్స్వభావ మజకంతుహరాదు లెఱుంగలేరు వే,డబములు గాక యైహిక జడత్వము లున్నవె నీకు రాఘవా ఉ రా 5. 223

3. నడవడి, ప్రవర్తనము.

గీ తపమునకు విఘ్నకరియంచుఁ దలఁపఁడర్కుఁ, డోలయు వర్షావధూటి పయోధరముల, వేయి కరముల నింపె నవ్వేడబమున, నపుడ శాంతించె నతని మహాతపంబు. కృ శకుం 1. 39

4. వేషము.

సీ అస్త్రంబు ధరియించు నఁట తపస్వియు నట్టి, యిట్టి వేడబము లెయ్యెడలఁ గలవె .. కాశీ. 7. 46.

చ. ప్రబలతర ప్రభుత్వమున భాసిలు పాదుషహో మొనంగఁగా, నిబిడ తమ ప్రభావమున నేర్పు మెయిం గొనినాము గాని సా, హెబు వపుబత్తు దీని నెవరేని గ్రహింపఁగక యుండ దొంగ వే, డబముపఁ దెచ్చికొంటిమె తడం బడకిట్టు అనంగ న్యాయమే రంగా. 2 216

విశే. మహోక్షము, చక్కనిది.

సీ ఈ వేదబపు మొల్ల పూవు క్రొం బొదరింటఁ జాన యుంచుక సేపు సంచరించె, నీ నిగారంపు ద్రాక్షాలత నికాయ కాయమానాతరంబుల కడ నొకింతసేపు నాళిక వక్రాతిసేదఁ దీర్పు కొనిరెఁ గన్గొన రమ్మ యో కొమ్మలార. రసిక. 4 43.

వేదము = వేలము వి మండలాగ్రము, ఖడ్గము.

చ ... వేఁడి వేలుపుం, గొదమలు దార పావ కుని కుట్టలు చిచ్చులకంటి నెచ్చెలుల్, తుది జము వేదముల్ పిడుగు తున్కలు వానర వీరు లొక్కటన్. రామా. 7 180 (శ ర. సా.) (తుదజము వేఁడుముల్, అని ముద్రిపా.)

నం. వి. అ. న రంధ్రములు లేని గట్టి మంచి గంధపు చెక్క

వేడించు సం. క్రి. పరివేష్టించు, ముట్టడించు

ద్వి. అదె కపిసేనతో నా రాఘవుండు, విడిసినాఁ డిలంక వేడించి యుంకఁ, గడిమి నెన్నఁడు చూపఁ గలవాఁడ వీవు . రం. రా. యు. 848. పొ. 29. పం

ద్వి. అతీతాలంకరి హరి రాజరాజ, దశాహిణులు పదునైదు నెన్మిదియు, కూడికొల్వఁగ వచ్చి కుటిలుఁడై మధుర, వేడింప విని క్రొవ్వి వేడింపకున్న, గాదని బలుఁడు సంగత రమా బలుఁడు ... అ. మ క. 3.170 పొ 18 పం

ద్వి. తవిలి యా వనదేవతలు వనశ్రీకి, సవరించు దీపికా స్తంభంబు లనఁగ, మొగళిరో మాణిక్య ముల పాఁపజేలు, తగిలి వేడించు చందనములు గడచి .... ద్వి. పరమ. 5. 371. పొ.

అ. క్రి. వ్యాపించు, ప్రసరించు

ద్వి. చనిన పిమ్మట నల సౌమదామములు, తన క్రొవ్వునం బూని తన కొవ్వుతోడ, మించులు జలదంబు మీఁద వేడించు, సంచున నొసపరి నవతుగాఁ జుట్టి ... ద్వి పరమ 5. 381.పొ

ద్వి. చినుకు సోయగమున జీవరత్నములు, మెలఁ గెడు జాడఁ బ్రామినుకు వజ్రములు, తులకింప జలజల తూర్పెత్తినట్టి, మెలపున వలపుఁ దెమ్మెరలు వేడించు, నలుపున ద్వి పరమ 3. 170. పొ.

స క్రి చుట్టివచ్చు

ద్వి. చటుల మృగాళిపై శార్దూల ములుకు, ఘటన నాఁబోతులఁ గడిమి వేడించి, మల్లడి గొన నొక్క మటి మల్లరముల, దల్లువల్ గొమ్ము లుద్ధతి నొల్లగిల్ల ... అ.మ క 5 26 పొ 4 పం

వేడుక = వేడ్క వి. (√వేడు.) 1 కుతూహలము, ఉబలాటము.

సీ. మునిద త్తుకుగు మంత్రమున గొంతి కన్నియ నాఁడు వేడుక దినవాథుఁ దనకుఁ, బ్రత్యక్ష ముగఁ జేసి వడయుట. భార. శాం 1 16.

క. వేడుకపుట్టిన జూదం, బాడునె ధర్మజుఁడు ... భార. ఉద్యో 1 24.

క. నా మోహము నా వేడుక, నా మానము నా ప్రియంబు నా తగులము నా, ప్రేమమ్మును నా తెగువయు, హామము బొందంగ నూరకయె పోవుదునే హర 7 131

గీ తెలియ నానతి యిమ్ము సందియము దీఱ, వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగ . పారి 1 36.

2 అభిలాష, కాంక్ష.

ఉ . . లక్ష్మి గనుగందని వేడుకఁ గృష్ణరాయనిం, జేరువకాక వావిసెడఁ జెందునె సోదరుఁడైన రుద్రునిన్ ఆము. 1. 38.

క. అనఘా యిది యెంతటి పని, విను నా దెస నీకు నింత వేడుక గలదేఁ, గనుదెఱచి చక్కఁ జూడుము, మనలో మనకింత గలదె ... భోజ. 4. 235.

సీ . కుముద బాంధవుని తోడఁ,

గీ. దోడు నీడయి క్రీడించు వేడుకలర ... దశా 1. 45.

3. సంతోషము.

గీ సహజ కరుణా కటాక్ష వీక్షణ విశేష, దీపితా శేష ధనకృతార్థి కృతార్థి, కలితచాటు సుధా పూర్ణ కర్ణుఁడగుచు, నిండువేడుకతోఁగొలు వుండు నపుడు విక్ర. 1. 106.
చ. విశదముగా నెఱింగి కడువేడుకఁ బొంగి సుమాలి యయ్యెడన్...ఉ. రా. 2 211.
శా . శ్రీ నారీమణిఁ బోలు వేంకమ వరించె న్వేడుకల్ మీఱఁగన్ దశా 1 55.
4 వినోదము
ఉ. లేమ యొకర్తు వేడుక నశిక వశీకరణంబు జాతిగా, బూమియ దాను బన్నుకొని ... నైష 3 98.
ద్వి వేడుక జట్టి గావించి నావూన్కి పీడనాడకు... ద్వి హరిశ్చ ఉత్త. 1485.
వ...వేడుకకుం జూడవచ్చిన . అము 4. 35
5. ఉత్సవము, సంతోషకరమగు కార్యము.
ఉ వేడుక నిట్లగణ్యరుచి విభ్రమ ధన్యయ గేంద్ర కన్యరాఁ, జూడఁ దలంచి నిల్చిరి వసుక్షితిపాల పురీ పురంధ్రికల్ ..వసు. 6 64.
క. అని మధుర వచన రచనల, దనుజేంద్రుని వలరఁజేసి తగ మజ్జన భోజన విధులతండు వేడుక, లొనరింపఁగఁ దృప్తిఁ బొందియుం డెడు వేళన్. విక్ర 2 152.
6. విలాసము.
సీ. పెనిమిటి గలదాన నని చాటుక ధరింప వేడుకలా యంచు విఱిచి కట్టు.. శుక. 2. 115.
మ. బలి దైత్యేశ్వర కంచె యీ గిరిదరీ భాగంబుల న్వేడుకల్, పొలయం గ్రీడలు సల్పు కిన్నరపతుల్...దశా. 2. 153.
7. అవలీల, వేళ.
మ. కొనిరొయిం గంచుకముల్ సముద్భట నటద్ఘోటీ ఘట ప్రౌఢిఁ గైకొనిరయె వ్వేడుకఁ జీడికోట యహిత క్షోణీశులల్లాత...కాశీ. 1. 33

వేడుక(ల)కత్తి(త్తె)యు వి (√వేడుక.) 1 వేశ్య
చ. విను మది నాకలోకమున వేడుకకత్తియ దాని దానవి,జనన విశాల మొక్క మునిశాపము తెంచి మతోదయంబునన్. జనవది ... కళ. 4. 141.
గీ... కలికి వేడుకకత్తె శ్రీ కామకోటి, గనయు నేకామ్రనాథునిఁ గరిగిరిశు. కాశీ 3 107.
ఉ వేడుక కత్తెనంచు రతివింతల నిన్ భ్రమయించఁ జూతునో, మోడి వహింతునో భువన మోహన నేనని కాకయేల పెంౘ్లాడితి వంచు రాధా మాధవ సంవాదము. 2. 29.
2. వ్యభిచారిణీ, జారిణి
ఆ వారి వాదు సూచి వారింపఁగా వచ్చి, యేర్ప తింపలేక యెల్ల మునులు, నమర వరుల నడుగ వా వేడుకల కత్తె, యెఱుఁగుఁ గాని యితరు లెఱుఁగ రనిరి. భాగ 9. 380.

వేడుకకాఁడు విజ. (వేడుక + కాడు) 1. కౌతుక వంతుఁడు, ఉబలాటము కలవాఁడు.
క. పాఱెడు నీరెడ త్రెవ్వగ, దాటి బెడదమైన యెండ దనుకఁ గని పురంౘాఱె మడువంత వేడుక, కాఱులు జాలరులు సొచ్చిక్రిందు కొనం గన్. భార శాం. 3. 192.
2. కాంక్ష కలవాఁడు, అపేక్ష కలవాఁడు.
క. కయ్యంబుల వేడుక కాఁ,డయ్యున్నత కలహ కేళికా కాంక్షుఁడై, నెయ్యమున వచ్చె నారదుఁ, డయ్యెడ దివినుండి వారి నభిదర్శింపన్. రాఘవ. 2. 78.
3. విలాసవంతుఁడు.
గీ. దండ కూకంబు కలలోనఁ దరుణిఁ గూర్చుఁ. గాంత కలలోన దండకూకంబునునుచు, శెట్టి వేడుక కాఁడొ రత్నేశ్వరుండు, జంపతులఁ జేయుదాఁకను జెలము కొనియె. కాశీ. 6. 172.
4. క్రీడానక్తుఁడు.
ఉ. నెత్తము మీఁద గౌతుకము నిర్భరమై జని యించె నిపు మా,చిత్తముల్లరుదు వీవు గడు జిత్రపు జూదరి వాత్మలోన నుద్వృత్తుఁడు సీరపాణి కడు వేడుక కాఁడతనిన్ జయింతు వే, మిత్రఁటి మమ్మొకింత గదియింపు మొదర్పుము తత్ప్రసంగమున్. హరి. ఉ. 3. 227.
ఉ కోడి కుమారులున్ సఖులు శృంగారము వందకారవిందముల్, మోడిచి ఫాలభాగమున మోపి నమస్కృతు లాచరింపఁగా, నాడుమం డెగాని ముని కంజలి సేయఁగ నేరఁడయ్యె న, వ్వేడుకకాఁడు పుట్టదొక వేళ వివేకము పెద్దవారికిన్. కాశీ. 6. 5.

5. వినోదకరుఁడు.

క. ఆడెడు వారల కిచ్చును, పాడెడు వారలకు నిచ్చు జట్లకు నిచ్చున్, వాదవ వరులకు నిచ్చును, వేడుకకాండ్రకు నిచ్చు వివిధార్థంబుల్ వి.క. 2 164.

క. సంగడి లోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచును,ప్పాంగెడు వేడుక కాఁడటు, మ్రింగుడు పడె బకుని చేత మీఁదటఁగి నృపా భాగ. 10 పూ 446

1 ఉపపతి, జారుఁడు.

.... మంత్రి నందమందు జార చోరవిటధూర్త వర్గంబులం గూడి వేడుక కాఁడై పుణ్యస్త్రీల నెలవరునఁ జెఱుచు చున్న వాఁడు ..శివరా. 2. 48.

క...విను మే వగనైన నీదు వేడుక కానిం, గొని తెచ్చెద మచ్చాతురిఁ, గనవే నేఁడమచుఁ బల్కి గ్రక్కున వెడలెన్ శకాం 4 45

2. విటుఁడు

మ. ఒక యెకాదశి నాఁటిరేయి నముల్లై యున్నట్టి రోవెట్టు వేఁడుక కాండ్రెవ్వరు రామిఁ బల్లవుఁ డొక్కండున్ లేక లోఁ గ్రాఁగి శ,య్యకడన్ నిల్వ నవింప కిల్వెడలి యాతాయాతరీతిన్మనో, వికలత్వకినాజవ వాడవాడల విటాన్వేషంబు గావించుచున్. వైజ 2 89.

ఉ. వేడుకకాండ్రకై తిరుగు వేశ్యల నాడిన బాడ నవ్వు ని, ట్లాడఁగఁ బాడియౌనె ... ఉ. రా 4. 294.

వేడుకచేయు అ. క్రి. (వేడుక+చేయు.) కుతూహల

సీ. గంగాపది విలోకన మాత్ర వాఙ్మనః కాయ వాతక నామైథుకలుషమణఁగు, వినిన వేడుక చేసి కను గనుంగొనెనఁ జే నంటిన మునిఁగిన నవఘ చరిత . జాహ్నవీ. 1. 26.

వేడుకజోదము వి (వేడుక+జూదము.) వినోదము నకై యాడు జూదము.

వ్య.వ బలరాముఁడు రుక్మితో వేడుక జూదమాడె నందురు.

వేడుకపడు అ. క్రి. (√వేడుక) కుతూహలపడు, ఉబలాట పడు.

క. నను సీతఁడు వేడుకపడి, కొనివచ్చెను వీని తోడి గోష్ఠికి దగులై, యనిన తగ దితనికొక మే, లొనరించి యథేచ్ఛఁ జనుట యుక్తము నాకున్. భోజరా. 2 112.

క. వచ్చితి రథంబు దెచ్చితి, విచ్చేయు మటన్న సీత వేడుక వడుచున్, బొచ్చెంబు లేని కృప సెల, విచ్చెద వతి యనఘ వోదమే వనములకున్. ఉ. రా. 6. 280.

వ క్రి. కోరు, అపేక్షించు

ఆ విష్ణుఁ జూడ నీవు వేడుక వడితి నా,కైన వజున కైన నరిది విష్ణు, దర్శనంబు . భార. శాం. 2. 245.

వేడుకనలుపు అ. క్రి (వేడుక+చలుపు) క్రీడించు, భోగించు

క. కావుఁ బర కాంతా రతి, ధర్మ మార్గ గతి దప్పక యి,చ్ఛావృత్తి నాత్మ భామినితో వేడుక సలువవలయు దురిత విదూరా వి పు 4 224.

వేడెము వి (క వేడె.) 1 అశ్వగతి విశేషము, గుఱ్ఱముల మండలాకార గతి.

శా. ...గోత్ర ధరా ధరేంద్రములు ప్రీలన్ లీలమై వేడెముల్, దోలున్ ధేయని యశ కిన్నర పురుస్తోమంబు లూటాడగన్. రాజ చ. 2 29.

చ వతి యల తేజినెక్కి నరపాలురు గొల్వ హయాధి రోహ పాండితి నరిచాఁటు జోదవలు నిబ్బరమున్ రవగాలు వేడెముల్, జతవము మీఱఁజూపి ... చంద్రా. 2 70.

సీ గడగడ వడఁకి నల్గడ గడల్ విడచి కకావికలై పోయె గడల పొఁజు, చేతి క్రోవులు వైచి భీతిఁ జైవులుజారె బిగ్గము పాడె తుపాకి మూక, కేడెముల్ విడి మాని వేడెముల్ వంచ బంగాళమై పాఱె గుఱాల వారు . . రా వి. 5 15

2. మండలగతి, చుట్టు తిరుగుట.

సీ. పద్మాలయోదర ప్రౌఢ సారసవీథి నంచల వేడెంబు లరసి కొనుచు . . వసు. 6. 97.

క దాడింబ పండ్లకై వెస వేడెంబులు బెట్టెఁ జిలుక విరిబోణీ న్నీకోడె చనుగుబ్బ కవకై, వేడుకఁబడి తిరుగు వమరవిభు మదిఁబోలెన్. అహ. 2. 96.

సీ ధమ్మిల్ల సురతరు ప్రసవ వాసన కళుల్ జుమ్మని చుట్టు వేడెమ్మ గొనఁగ ఘటికా 2 97.

**వేడెవెట్టు** స. క్రి (వేడెము+వెట్టు) పరివేష్టించు, ముట్టడించు, చుట్టుముట్టు

ఆ చౌకళింప కుండఁ జతురంగ బలముల, సొరిది వేడెవెట్టి చుంచు విరియఁబట్టి, చదివి నొసలి పట్టిక మీఁదఁ గ,నవట్టి మెఱయు బిరుదపద్య మపుడు. జై. భా. 7. 147.

పరివేష్టింపఁ జేయు (శ. ర)

**వేడెవెట్టించు** స క్రి (√వేడెవెట్టు) పరివేష్టించు, చుట్టుకొను.

వ లంకకుఁ జని విడిసి వేడెవెట్టించి లగ్గలు పట్టించిన . భాగ. 9 289.

**వేడెంపుగట్టు** వి. (వేడెము+గట్టు.) చక్రవాళపర్వతము

శా కేళీలోలుఁడనై భుజాంగదముగాఁ గీలింతునో కాకడా కాలం బెట్టుదునో నిజాంక కటకాకారంబునన్ గ్రాలఁగా, వ్రేలం ద్రిప్పుదునో యెఱుంగఁ బడ నవ్వేడెంపు గట్టెత్తెదన్ ... రామా. 7. 65.

**వేడ్క = వేడుక** వి 1 సంతోషము. (దీని యామ్రేడిత రూపము వేవేడ్క)

గీ. ... బహు భక్ష్య భోజ్య లేహ్య, చోష్య పానీయముల మధుసూదనుండు, సారెఁగొని యాడుచును వేడ్క నారగించె పారి 2. 19

గీ .. అన్నయ సిద్ధమంత్రి, కొలువు గూర్చుండి వను వేడ్కఁ బిలువఁ బంచి విక్ర. 1 19.

గీ జానకీ నాథ సురలిట్లు శార్ఙ్గిచేత, నభయదానంబుఁ గొని వేడ్క నరిగి, రంత . ఉ రా 2. 2.

మ ఎలమిం దుమ్మెద మ్రోఁత పాసోకతై యింపొంద మ త్రిల్లు కోవెల నిసాకారుల ... సాట లమరన్ వేవేడ్కతో నాలిగాఢ్యుల వేరంగల నట్టువులొగ అవల గోష్ఠుల ... దివపాత్రల కయ్యోమని ... తెపుసరుల్ దాల్పంగ నిచ్చఁగడుః

ఋతువాహలమ్ము.

మత్త వేఁడికోలుచితంబె కావున వేడ్కతోఁ జవిసోమకున్ . భార. ఆది 5. 218

ఆ. అతఁడు చిఱుతనాఁడె యాచార్య కులమున, వేడ్క వేదశాస్త్ర విద్య లభ్యసించుచుండ ... ఆము 4 41

సీ గీ ... మేనకాదేవి కుదయించె మేలు వేడ్క. హర 8. 20.

3. అపేక్ష, కోరిక.

ఆ. కాలకేళి మీఁది శరము క్రమంబున, విడువఁగళల యందు వేడ్క నొనిపి, నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడ్పుగడయు నీవకాదె. భార విరా. 1. 251

క. ఒదవెడు తృష బెల్లిదమున, వదనము వలువట్లు వట్టె వాసిత రాజ,న్మదిరా రసమానఁగ నా,హ్వాదయంబున వేడ్క యెసక మెసఁగెడుఁ దరుణీ. భార. విరా 2. 88

4. వినోదము,

క కలిమికి భోగముల కదా, ఫలమని తమ మెఱసి బయలు వడ బెల్లగ వి,చ్చలవిడి భోగింపక వే,డ్కలు సలుపఁగ, ఫలయు భటుఁ ధదంబున తోడన్. భార విరా. 1 140

సీ. వేడ్కకై మానుషీ విగ్రహంబు ధరించి విహరించు తొలుకారు వేళవోలె ... శివరా 8.81.

5. ఉత్సవము.

గీ. ... గొల్లవారింటి వేడ్కఁ గన్గొనఁగవలయు నీలా 3 46.

**వేడ్కకత్తె** వి (వేడ్క+కత్తె) విలాసవతియగు స్త్రీ

సీ. ఘనుఁడైన జమదగ్ని మునినాథు కూరిమి నొల్లయుంచు పెనుఁబాళి వేడ్కకత్తె. క్రీడా. 1.129.

**వేడ్కకాఁడు** వి. విలాసపురుషుడు

ద్వి. చను వేడ్కకాఁడు దోసం బెగ్గడైడెందమ్ము ... యాడుచున్నాట నీయప్పుడేను గంటి .. పండితా. పురా. 116. పా.

సీ తొలు మామ యగు దక్షు త్రైలధోఁట నదు చక్కి ... సంహారణం బొనరించు వేడ్కకాఁడు ... భీమ. 8. 86,

**వేడ్కపడు** అ క్రి (వేడ్క + పడు) వేడుకపడు, కుతూహల పడు
గీ వేడ్కపడె నెమ్మనంబులో విబుధ రాజు, భోజ కన్యా స్వయంవరంబునకుఁ బోవ ... నైష. 3. 33.
క. అతని సదాశివమూర్తి, ప్రతిమాన విలాసు వేడ్క పడి పరమ పతివ్రతలకు నగ్రేసర పార్వతి సైతము కంటి చెప్ప వాల్పకచూ చెన్. వరాహ. 6. 57
స క్రి అపేక్షించు.
ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడు నానవ మర్థిఁదేరగా... భార విరా 2 93.
**వేడ్కసేయు** స క్రి. (వేడ్క+చేయు.) అపేక్షించు
చ...పూని యొకటింగడతేర్పఁ గడంగ లేక యెల్లిదులగు వారికేఁటికి సలిల విహారము వేడ్కసేయఁగన్ ఉ. రా 8 7.
**వేణ(న్న)** సం వి అ స్త్రీ. నదీ విశేషము, కృష్ణా నది యొక్క యుపనది.
**వేణి** సం. వి. ఈ స్త్రీ సొగసుగా నల్లిన జడ
సీ...జడలు గట్టియు నింత సక్కనైనది వేణి దీర్చిన నెరులెంత ద్రేణి యగునో ... కు స 7 88
1 జట 2 అలంకార రూప్యమైన జెడకట్టు, వ్రేలాడెడి జొట్టు 3 ప్రవాహము. 4. గంగా యమునా సరస్సుల సంగమస్థానము, ప్రయాగ క్షేత్రము.
**వేణిక** సం వి అ స్త్రీ 1. అల్లిన జెడ 2. ఎడతెగని ప్రవాహము, ప్రవాహము
**వేణిబంధము** సం వి అ. పుం జెడగా నల్లిన జొట్టు.
**వేణివేధని** సం వి. ఈ స్త్రీ. జలగ, జలూక.
**వేణివేధిని** సం వి ఈ స్త్రీ దువ్వెన, కంకతిక
**వేణిసంహారము** సం వి అ పుం. 1 జొట్టు జెడగా నల్లుట, పొట్టు ముడివైచుట 2 భట్ట నారాయణ రచితమగు నొక నాటకము.
**వేణుఁడు** సం వి అ పుం 1 సంకీర్ణజాతి వాఁడు పిలికి మురజాది వాదనము వృత్తి 2 వేనుఁడు. స్వాయంభువ మను వంశమునఁ బుట్టిన 'అంగరాజు' పుత్రుఁడును, పృథు చక్రవర్తి దండ్రియు నగు నొకరాజు ఇతఁడు వర్ణసంకర కారకుఁడు
**వేణుకము** సం వి అ న. వెదురు పిడిగల యంకుశము
**వేణుకర్కరము** సం వి అ పుం కరంపిరము, గన్నేరు. (వృ వి)
**వేణుజము** సం వి అ పుం వెదురు బియ్యము. ఇక్ష్వే వేణుయవము మొ॥
విణ (అ ఆ అ) వెదురునందు బుట్టినది, దండము. మొ॥
**వేణుధ్మఁడు** సం. వి అ పుం. పిల్లనగ్రోవి యూఁదు వాఁడు
**వేణునము** సం వి అ న మరేచము, మిరియము
**వేణునిస్రుతి** సం వి ఇ స్త్రీ ఇక్షువు, చెఱుకు (వృ వి.)
**వేణువాదు(దకు)డు** సం వి అ పుం పిల్లనగ్రోవి యూఁదువాఁడు
**వేణువు** సం వి ఉ పుం 1 వెదురు 2. రెల్లు 3. పిల్లనగ్రోవి.
**వేతనము** సం. వి అ న 1. జీతము, భృతి, కూలి. 2 జీవిక, జీవనాధారము 3 వెండి-రజతము
**వేతనానపాకర్మము** సం వి. న్ న 1 ఇచ్చెద మనిన జీతము, కూలి మొదలగునవి యియ్యకుండుట 2 జీతము, కూలి మొదలగునవి యియ్య నందులకై తెచ్చెడి అభియోగము
**వేతనానపక్రియ** సం వి అ స్త్రీ వేతనాదానము
**వేతని** సం. విణ (న్ నీ న్) జీతము గలవాఁడు, జీతము పుచ్చుకొనుచున్న వాఁడు.
**వేతము** సం వి అ. పుం, బెత్తము, వేత్రము
**వేతలలపాము** వి (వేయి + తలలు + పాము.) శేషుఁడు, అనంతుఁడు
చ జగములు గ్రుంక వే నెలయుఁ జాయ మగండును చేటదప్పరే, పగులదె నేల వేతలల పాము దలంకదె తిప్పలుర్ల వేపగ లిదు లెల్లెడన్ గవియఁ బర్వవె నంద్రము లింకఁబాలవే, రగులదె నల్వగ్రుడ్డు గమి రాముని కించుక కీడు గల్గినన్. అచ్చ రా. అర. 48.

**వేతసము** సం. వి. అ పుం 1. పేము, రెల్లు. 2. ప్రబ్బలి 3. దబ్బచెట్టు (వృ వి.)

**వేతసి** సం. వి ఈ. స్త్రీ పేము.

**వేతస్సుఁడు** సం వి. అ పుం అగ్ని. (అ ని)

**వేతస్వంతము** సం విణ (త్ స్వతీ త్) రెల్లుతో నిండినగి రెల్లు కలది (దేశము)

**వేతాలుఁడు** సం వి అ పుం 1. ఒక జాతి పిశాచము, శవము నాశ్రయించియుండు భూతము 2. ద్వారపాలకుఁడు

**వేత్త** సం వి ఇ పుం 1 తెలిసినవాఁడు జ్ఞాని. 2. ఋషి 3 భర్త, పెనిమిటి 4 పొందినవాఁడు, సంపాదించినవాఁడు

**వేత్రకీయము** సం విణ (అ ఆ అ) పేముతో నిండినది (దేశము)
వి అ పుం వేత్ర సమూహము

**వేత్రధరుఁడు** సం వి. అ. పుం. 1. ద్వారపాలకుఁడు. 2 అధికారికి ముందు వెండి బెత్తము పట్టుకొని పోవువాఁడు, వేత్రహస్తుఁడు, కట్టిక.

**వేత్రము** సం వి. అ పుం 1 పేము (వృ వి.) 2 చేతికఱ్ఱ, ద్వారపాలకుని చేతి కఱ్ఱ.

**వేత్రయష్టి** సం వి. ఇ స్త్రీ వేఁప బెత్తము

**వేత్రవతి** సం వి. ఈ స్త్రీ 1 ద్వారపాలకురాలు 2 మాళవ దేశమందలి యొక నది.

**వేత్రాసనము** సం. వి అ. న పేము కుర్చీ

**వేత్రి** సం. వి న్ పుం 1 ద్వారపాలకుఁడు, కావలి వాఁడు 2 వేత్రహస్తుఁడు, కట్టిక.

**వేద(త)ండము** సం వి. అ పుం ఏనుఁగు

**వేదగర్భుఁడు** సం వి అ పుం 1 బ్రహ్మదేవుఁడు 2. వేదము చదివిన బ్రాహ్మణుఁడు 3 విష్ణువు

**వేదజ్ఞుఁడు** సం వి అ పుం వేదవేత్తయైన ద్విజుఁడు.

**వేదదృష్టము** సం విణ (అ ఆ అ) వేదములయందుఁ జూపఁబడినది, వేదవిహితమైనది

**వేదన** సం వి ఆ స్త్రీ. 1 జ్ఞానము, తెలివి. 2. సుఖదుఃఖానుభవము 3 బాధ, యాతన 4 సంపద, ఆస్తి, ధనము 5 వివాహము, పెండ్లి. 6 ఇచ్చుట. వితరణము

**వేదనము** సం వి. అ. న వేదన,

**వేదని** సం వి ఈ స్త్రీ స్పర్శజ్ఞానము గలది. స్పర్శేంద్రియము.

**వేదనిందకుఁడు** సం వి అ పుం వేదములు నిందించువాఁడు 1 నాస్తికుఁడు. 2 బౌద్ధాది మతస్థుఁడు.

**వేదపారగుఁడు** సం వి అ పుం వేదము తుదముట్టఁ జదివిన ద్విజుఁడు
ఇట్లే వేదాంతగుఁడు

**వేదపుగనివేల్పు** మి వి (వేదము+గని+వేల్పు) వేదములకు గనియైన దేవుఁడు, బ్రహ్మ
చ. కృప దిలకింపఁ బెంపఁ బరికింపఁ గళాఁడుదయించునంచు వేదపుగనివేల్పు సెపివఁ బదంపడి నిన్నుఁ దలంపఁ బోవు డెన్ ... ఉ. హరి 2. 197.

**వేదమాత** సం వి ఋ స్త్రీ. గాయత్రి.

**వేదము** సం వి అ పుం 1 జ్ఞానము, తెలివి 2 ప్రాఁజెనువు శ్రుతి (ఇది ఋగ్వేదము యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అని చతుర్విధము) 3 దర్భ గడ్డిమోపు 4. మేడిచెట్టు యజ్ఞాంగము 5 వివరణము, వ్యాఖ్యానము. 6 ఛందస్సు

**వేదవాక్యము** సం వి అ న వేదమునందలి వాక్యము

**వేద(దా)వాసుఁడు** సం. వి అ. పుం. వేదాధ్యయనము, తదర్థావబోధము, తదుక్తాచరణ ప్రచారణములును గల ద్విజుఁడు.

**వేదవిదుఁడు** సం వి అ పుం. 1. వేదములు బాగుగాఁ దెలిసిన ద్విజుఁడు, వేదవేత్త. 2 విష్ణువు

**వేదవిహితము** సం. విణ (అ ఆ. అ.) వేదములచే విధింపఁబడినది, వేదములందుఁ జెప్పఁబడినది.

**వేదవ్యాసము** సం. వి అ పుం ఋగ్యజురాది భేదములచే వేదమును విభజించుట.
క. అనుటయు లెస్సగఁ దలఁచితి, వినుమొక కీటంబునకును వేదవ్యాసం,బున లోకహిత మొనర్చిన, మునికి నయిన సత్కథనము మునినుత చరితా. భార. అను. 4. 314.

**వేదవ్యాసుఁడు** సం వి అ పుం పరాశరమునికి సత్యవతి యందుఁ బుట్టిన మహర్షి, ద్వైపాయనుఁడు (ఇతఁడే వేదమును నాలుగు భాగములుగా విభజించినవాఁడు, అష్టాదశ మహాపురాణములను, భారత సంహితను రచించినవాఁడు.)

**వేదసన్న్యాసము** సం వి అ. పుం వేదోక్త కర్మముల విడుచుట

**వేదాంగము** సం. వి అ. న వేదమున కవయవము (వేదము యొక్క సరియగు నుచ్చారణము, నర్థము, మంత్రోపయోగము మొదలగు వానినిఁ దెల్పువది శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము—అని వేదాంగము లారు)

**వేదాంతజ్ఞుఁడు** సం వి అ పుం. ఉపనిషత్తుల (యర్థము) నెఱింగిన జనుఁడు, జ్ఞాని

**వేదాంతము** సం వి. అ పుం. (పరబ్రహ్మ ప్రతిపాదక మగు వేదము యొక్క తుదిభాగము) 1 ఉపనిషత్తు 2 షడ్దర్శనములలో నొకటి ఉత్తర మీమాంసా శాస్త్రము.

**వేదాంతి** సం వి. న్ పుం వేదాంతశాస్త్రము నెఱింగిన జనుఁడు.

**వేదాగ్రణి** సం వి ఈ స్త్రీ సరస్వతి.

**వేదాది** సం వి ఇ పుం న ఓంకారము, ప్రణవము

**వేదాధిపుఁడు** సం వి అ పుం 1 వేదాధిష్ఠానదేవత ఋగ్వేదమునకు-బృహస్పతి, యజుర్వేదమునకు — శుక్రుఁడు, సామవేదమునకు-అంగారకుఁడు, అథర్వవేదమునకు-బుధుఁడును అధిపతులు. 2 విష్ణువు

**వేదాభ్యాసము** సం వి అ పుం 1 వేదము చదువుట, వేదాధ్యయనము 2. వేదమును జదువుట, తదర్థము నెఱుంగుట, తద్విహిత కర్మముల నాచరించుట, తన్మంత్రముల జపించుట, శిష్యులకు బోధించుట. 3. ప్రణవమును జపించుట

**వేదారము** సం వి అ పుం తొండ, ఊసరవెల్లి.

**వేది** సం విశ (న్ నీ న్) 1 తెలిసినవాఁడు. 2 ప్రజ్ఞాడినవాఁడు.

వి న్ పుం 1 జ్ఞాని 2 ఉపాధ్యాయుఁడు 3 పండితుఁడు 4 బ్రహ్మదేవుఁడు

ఇ పుం విద్వాంసుఁడు, పండితుఁడు, జ్ఞాని

ఇ ఈ స్త్రీ 1 యజ్ఞవేదిక-యజ్ఞమునకై యేర్పఱుపఁబడిన వేదిక-(తిన్నె) 2 మధ్యభాగము సన్నముగా నుండునట్లు వేయఁబడిన యొక విధమగు తిన్నె. 3 రాజగృహము యొక్కగాని, దేవాలయము యొక్క గాని యావరణలోఁ జదరముగా నేర్పఱచిన యరుగు 4 ముద్రిక, ముద్దుటుంగరము 5. సరస్వతి.

**వేదించు** సం అ క్రి వేదనపడు, నొచ్చు.

క. ఆ దురవస్థకు నోర్వక, యో దైవము మరణ ఫలము యొసఁగవె యనుచున్, వేదించు నృపతి వద్దకు, నాదర మతి నారదుఁడు రయమ్మున వచ్చెన్. భోజరా 6 171.

**వేదిక** సం వి అ స్త్రీ 1. యజ్ఞవేదిక, యజ్ఞము నిమిత్త మేర్పఱుపఁబడిన తిన్నె 2 మంగళ కార్యములకై యింటి ముంగిటఁ జదరముగా, నెత్తుగా వేసిన తిన్నె. 3 ఆసనము, పీఠము

**వేదిజ** సం వి అ స్త్రీ ద్రౌపది

**వేదిత** సం విశ (పు స్త్రీ. పు) 1 తెలిసినవాఁడు. 2 బుద్ధిమంతుఁడు, చదువుకొన్న వాఁడు.)

**వేదితము** సం విశ (అ అ అ) తెలుపఁబడినది.

**వేదు** వి 1 దుర్గంధము

ఆ వెగటు వేదునాఁగ వికట గంధం బొప్పు ... ఆం భా 1 109

2. గంధము

క ఆ దండ జడఁ దండను, వేవండఁ జెలంగఁ జెరివి వేదఁడ గతిన్, వేదండముచే పీచుచు, నా దండధరారి పోలె నాడుచువచ్చెన్ వి పు. 1 136

3 వైరస్యము, వెగటు. (శ ర.)

4 బ వెగటుమాటలు

ఉ వేదులు పల్కినన్నదర వేయఁగఁజూచెద విందునంతయం, బేదలు లేరు ... సారం 3 56.

విశ దుస్సహము, వెక్కసము

ఉ. వేదన మించు నీ విరహ వేదన తాళఁగఁజాలఁ గంతునిన్, సాదన రాదుగా తనదు సాదన చూపఁ దొడంగె గాడ్పు దా, నీఁదన వచ్చు వేమొదల నీదనలాంభ్రశి వేఁడి సూపుచున్, బోదనఁ జెల్లు నా డకుఁ బ్రోధనయంబు శుకంబు ప్రేలుచున్ సారం. 2 125.

**వేదోక్తము** సం. విణ (అ ఆ అ) వేదములయందుఁ జెప్పఁబడినది.

ఇట్లే వేదోదితము. మొ

**వేద్యము** సం విణ (అ ఆ అ) 1. తెలియఁ దగినది 2. బోధింపఁదగినది 3 పెండ్లాడఁదగినది.

**వేధ** సం వి న్ పుం 1. సృష్టికర్త, బ్రహ్మదేవుఁడు 2 బ్రహ్మ వెనుక సృష్టి కావించు ప్రజాపతి (దక్షుఁడు, కశ్యపుఁడు. మొ) 3 శివుఁడు. 4 విష్ణువు 5. సూర్యుఁడు 6. తెల్ల జిల్లేడు. (వ్య వి) 7 పండితుఁడు 8 పురోహితుఁడు. 9. కవి

**వేధకము** సం వి అ పుం 1 నరకభేదము 2 కర్పూరము

వ ఎన్నులోనున్న వరిగి జ, కంకెలోనున్న ధాన్యము

**వేధనము** సం వి అ న 1 గ్రుచ్చుట, కుట్టుట. 2. తూర్చుట, చొరఁజేయుట 3 ఉత్తరిగాఁ జేయుట, శూన్యముగాఁజేయుట 4. కన్నము చేయుట 5 కన్నముయొక్క లోఁతు.

**వేధని** సం వి ఈ స్త్రీ 1. ఏనుఁగు చెవిమీఁదఁ బొడిచెడి సాధనము 2 రత్నములు మొదలగు వానికి తొలివేసెడి సూదివంటి పనిముట్టు 3 లోఁతు.

**వేధనిక** సం వి ఆ స్త్రీ. రత్నములు మొదలగు వానికి రంధ్రము చేసెడి సూదివంటి సాధనము.

**వేధము** సం వి అ పుం 1 గ్రుచ్చుట, కుట్టుట, తొలివేయుట, రంధ్రము చేయుట 2 గాయము చేయుట, గాయము 3 రంధ్రము, బిలము. 4 (బిలము యొక్క) లోఁతు 5 కాల పరిమాణ విశేషము

**వేధసము** సం వి అ న కరతలము, అఱచేయి.

**వేధి** సం విణ (న్ జీ న్.) 1 గ్రుచ్చునది, కుట్టునది 2 తొలివేయునది, రంధ్రము చేయునది. 3. లక్ష్యమును భేదించునది.

**వేధించు** సం స క్రి 1. బాధించు 2 ఆకర్షించు

సం విధ్ బాధించు

శా భావివేళ మహిషున్ వేధించి సర్వామర స్తోమత్రాసము మాన్పఁ బంపువడి .. వరాహ. 12 50.

**వేధితము** సం విణ (అ ఆ అ) 1 గ్రుచ్చఁబడినది, కుట్టఁబడినది 2. తొలివేయఁబడినది, రంధ్రము చేయఁబడినది

**వేధిని** సం. వి ఈ స్త్రీ జలగ, జలూక.

**వేధ్యము** సం వి అ న లక్ష్యము, గుఱి

**వేనలి** వి (సం వేణీ) 1. జడ, వేణి.

మానిని. ఆనన లీల సుధాకర బింబ నవాంబురుహంబుల చెల్వగుటన్, వేనలిఁ గృష్ణ భుజంగ కలాపి సవిస్తర భాసురమై చనుటన్ ... కు. సం 7. 840.

ఉ. విక్క ప్రసూనముల్ గురియు వేనలి వీడిచి కొప్పువెట్టుచోఁ, జొక్కులఁ బెట్టె భూవరుని చూపులఁ గ్రోమలి బాహుమూలముల్ ... నైష. 7. 194.

క ధరణి భరణ దీక్షకు వా, విరిఁ బూనిన గెలుపు లచ్చి వేనలి లీ-న్, బరగు కరాళ భవచ్ఛుభ, కరనందక మద్ధి కన్యకా చిత్తేశా ప్రబంధ 142.

2 సిగ, జుట్టు

సీ. వేనలి కప్పుపర్విన మీఁదు నీల దుకూలంబు మేల్కట్టు కొమరు వడయ . భార. విరా. 1 308

సీ. నిడుద వేనలి నూనె ముడివీడఁ జిగురాకుఁ బొదఁదూఱఁ గార్చిచేఁ గదియ కరణి ... మనుచ 3. 31

సీ. డంబాగ నెమ్మిపింఛె బు లిచ్చుటఁ గన్న నవబోఁడి నీదు వేనలియొ తలఁచి ... నీలా. 3 106

3 కొప్పు, ధమ్మిల్లము

మ చెలువ ల్గొందఱు హేమకుంభములతోఁ జేసేనొనంగ న్వి ని,ర్మల దోర్మూల రుచుల్వెలింబొరయఁ దోరంబైన చన్దోయి సం, బొలయ న్వేనలి జాఱ ... పారి 2. 11

చ. విరి సరి వేనలిన్ గళభువిన్ మణివల్లరియంఘ్రి వజ్రపున్, సరిపణినాఁ ద్రిలోకియను చానకు. చం రా. 3 9

సీ చాన వేనలితోడ సరిగాక యొడలి చూపుల బొరతనము ల్బారి గఱచె ... నీలా 2. 20.

**వేనవేలు** న ఐ (వేలు+వేలు) పెక్కువేలు, అనేకములు (హల్లు పరమగునపుడు దీని తుది యుకారమునకు వికల్పముగ లోపము)

గీ విబుధ యువతులు సాక్షింప వేనవేలు, వర్షములు నరుఁడూఁదు దివ బునంను . హరి ఉ 10 284

గీ వేనవేల్యోజనంబుల విరివి నొప్పు, అనకకోటి శలాకి కాలంకృతంబు . కాశీ 4. 294.

గీ, ... వేనవేల్పత్యములు వల్కి వినకయున్న .. ఆము 6 42

గీ. అబ్జనాథుని తూగుటుయ్యాలలు గంటె, వేనవేలు పద్మరాశి పిచి ఘటలు .. భీమ 3 52

ద్వి. వేనవే ల్విధముల వేదాంతములకుఁ, గానంగ జాలని ఘన లింగమూర్తి ... పండితా. దీక్షా 52.

**వేనోళ్లు** వి. ఐ. (వేయి+నోళ్లు) సహస్ర ముఖములు.

గీ. అత్త మామలు మక్కువ నాదరింప, మగఁడు నీమీఁదఁ జాల ప్రేమంబు నెఱపఁ, జల్లదనముగ మిగుల వర్థిల్లు మెపుడు, సకల జనములు వేనోళ్ల సన్నుతింప. ఇందు 2. 82

**వేనోళ్లచిలువ** వి వేయి నోరులు గల సర్పము, శేషాహి

గీ. పొసఁగి యున్నట్టి పొన్నారిఁ బొగడఁ దరమె, నలువకైనను వేనోళ్ల చిలువకైన ... ప్రబంధ. 298.

**వేన్నీరు** వి. (వేఁడి+నీరు) ఐ వేన్నీళ్లు, వేన్నీటులు, వెన్నీరులు-ఉష్ణోదకము.

గీ అగయ నుపహతి వాటిల్లి నట్టిచోట. నాజ్య తైలాభ్యుపేత భాండానలులకు, నేళ్ళనీటుల నొండె వేన్నీళ్ళ నొండె, గడువఁజూతఁదోమిన నొండెఁ గలుగు శుద్ధి మార్క. ౪ 264.

గీ పట్టి కూడును వేన్నీళ్లు పెట్టి యొట్టి, గలుగు పీడ్యంబు లిప్పించి వలఁతియైన, వెజ్జు నెనరించి యరయించె విప్ర సుతుని, కంట వత్తిడుకొని సైరిక గ్రహుండు. పాండు 3. 56.

సీ దినముఁ జన్నీళ్ళ మజ్జనమాడఁ జలిదాఁకు నీకంచు వేన్నీళ్ళు నెమ్మిఁగాఁచు ... వైజ 8 51.

క ఒడలంటఁ గాళ్లు పిసుకం, గడివెఁడు వేన్నీళ్ళ నీయఁ గంచము వెట్టన్... శుక 8 344.

సీ. అలఁదు నలుంగు దేహమున వేన్నీళ్లార్చుఁ దడియొత్తు మెత్తని ధవళ వస్త్రమున... కాళ. 4 11

**వేపథువు** నం వి ఉ పుం కంపము, వణఁకు, ఒకానొక సాత్త్వికభావము.

**వేపనము** నం వి అ న కంపము, వణఁకుట

**వేపారి** వి. (నం వ్యాపారి) మధ్వ మతస్థుఁడైన ఉద్యోగస్థుఁడు

క. నిలువంగి యోర మెలికల, తలపాగ ఖలీతి శాలుశాలి మెయిం బూఁతలు పోఁగులం గ్రొమ్మ రతులు, వెలయఁగ వేపారి మీఱి వెలఁదుక కడకున్ హంస. 3 99

**వేపారికుడుకలు** వి స్త్రీభూష.

**వేబరము** విశ శూన్యము.

గీ ..సంపద లుబ్బనేని, వేబరము కాదె బిడ్డలు లేని బ్రతుకు, ఉ హరి. 2 16

**వేమము** నం వి అ న సాలీలు నేఁత సరి దట్టెడు పలక, వాయ దండము

**వేమఱు** = **వేమాఱు** క్రి విశ పలుమాఱు

ఉ వేమఱు శత్రునిం బరిభవించుట రిత్తకు రిత్త వైరముం, బా మదిఁ బెట్టికోలు సుఖతంత్రము గాదు భార శాం 3 22

ఉ విష్ణుని మూల తత్త్వమును వేమఱు నయ్యెయి జన్మకర్మ న, త్రిష్ణత లాదరించుటలు దేవకికిన్ వసుదేవుకున్ ధరన్, గృష్ణుఁ డనంగఁబుట్టె . హరి. ఉ. 8. 304

చ సింహ భూధర, ప్రభు తిరునాళ్ళకుందిగు సుప్రకరంబు కళింగ మేదినీ, విభునపకీర్తి కజ్జలము వేమఱుఁ బెట్టి పరించు నిచ్చలున్ మనుచ. 1. 89

**వేమాఱు** = **వేమఱు** విశ ద్ర (వేయి+మ ఱులు) మాటి మాటికి

క మీటిన మౌనుల కినుకకు, మాఱులుగకయున్న మీ సమగ్రతను వేమాఱుఁ గొనియాడఁగాఁ దగు, గీయునె సాత్త్వికుల బుద్ధిఁ గిల్బిష చయముల్. నృసిం 1 95.

శా ...పటీరగిరి వన్యాభుంద వాతూలముల్,
వేమాఱుం గల శీతసూభవు వధూవేణీ ధరాతః
ప్రసూనామోదగ్రహయాళువుల్ పొలసె దణా
రామ మధ్య బునన్. భీమ 5. 94

సీ కామ శాస్త్రంబులు వేమాఱు నియతిమైఁ
జదువకు డిన పుష్పశరుని యాన .. విక్ర
1 98

**వేము** వి (త వేఁబు) వేపచెట్టు, నింబము (వృ.వి)
దీని భేదములు కరివేము, తురకవేము

క గురివెంద వేము నడరిన, పరుసున ... దశకు
7. 44.

వ వెలఁగల మొలగల బీరల గారల వేములఁ
బ్రేముళ్ల.. పి శకుం 2 14.

ఆ అనఁగ వనఁగ రాగ మతిశయిల్లుచు నుండుఁ,
దినఁగఁ దినఁగ వేము తీయనుండు, సాధక
మునఁ బనులు సమకూరు ధరలోన .. వేమన
1. 93

వేములఁ గలుపు = విడిచి పెట్టు.

ద్వి. నోములు గీములు వేములఁ గలిపి, నీ మర్వు
సొచ్చితి నిఖిలంబు నెఱుఁగ ... బస. పు.
1 356 పం.

**వేయంచులకైదువు** వి (వేయి+అంచుల+కైదువు)
సహస్రారము, విష్ణుచక్రము.

ఉ. అంచులు నూట నుగ్ర నిబిడానల కీలలు గ్రక్కు-
కొంచు నే,తెంచు రయంబు చూచి పరతెమ్మిక
నెన్నఁడు విష్ణుచక్రమా,యంచు నతండు భక్తి
వశుఁడై నగుచుండఁగఁ దత్క్షణంబ వే,యంచుల
కైదు వడ్డుపడి యార్చి పవింబడఁ గొట్టెఁగొట్టె
వన్ కకు 5. 203.

**వే(యి)యంచులవాలు** వి విష్ణు చక్రము, సహస్రా
రము

సీ వేయి యంచులవాలు మ్రోయుచుద్ధతిడాయు
నపుడు పైకొనిన భయజ్వరంబు ... ఉ రా
2 214.

**వేయి** = వే బ వేలు న బొ పదినూఱులు, సహ
స్రము, అనేకము, పెక్కు (బ వేలు. హల్లు
పరమగునపు 'డుత్వ' లోపము)

క న్యాయార్జిత మగు నన్నము, వేయింటికిఁ బెట్ట
వలయు...భార. అను 4. 271

క్వి మున్నీటి మొలనూలి ముదితతో వేయి,
కన్నుల మేటి సంగడివారు దాను . అ మ క
1 11 పా 12 పం

గీ. వెలఁది మిన్నలు పదియాఱులు వేలుగొలువ...
ఉ రా 1 14

క. ముదిమియుఁ దెవులును నెఱుఁగక, పదివేల్
సంవత్సరములు బ్రతుకుదురు ప్రజల్ ..
వరాహ. 10 152

క . పలుకులు వేయేల యధిక బలసౌఖ్యనిధీ
నైష 2 18.

ఉ . వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు
నిత్యనిబంధముల్, పాయక చెప్పిరిట్లు...విక్ర.
1 12

వేయగుపాలు = సహస్రాంశము, వేయవవంతు

చ పుడమి ధనంబు నాకము విభూతియుఁ జేరెవ
యేని నల్లన,వ్వెడు నభిమన్యు నెమ్మొగము
వేయగు పాలును బోల నేర్చునే భార.
ద్రోణ 2 145

**వేయించు** స. క్రి (√వేయు.) 1. వేయునట్లు చేయు,
పడవైచునట్లు చేయు

క. కొలఁదిగన కెట్టివారుం, బెలుచన దవుదవ్వు
లందు బెదరించియు మూ,లల వేయించి కొనం
గాఁ, దలఁచెదరిది కాల గుణమొ దైవ ఘట
నయో రాఘవ 4 93

2 ప్రతిష్ఠించు, నెలకొలుపు

సీ వేయించె శీతల చ్ఛాయానపాయాభి రామ
ద్రుమా వృతారామ సమితి ఘటికా 1.48.

3 మ్రోగింపఁ జేయు

గీ మించి ప్రస్థాన భేరి వేయించి దండు, వెడలి
రసురలు జేజేల పీటి మీఁద . ఉ రా 2 23.

వ బ్రహ్మాండ భాండంబు లదరఁ బ్రస్థానభేరి
వేయించి వందిజనకైవారంబును మాగధ
మంజుల గానంబును .. మై 3 56

**వేయిక(గ)న్నులవాఁడు** వి (√వేయి.) సహ
స్రాక్షుఁడు, దేవేంద్రుఁడు.

సీ వేయి కన్నులవాఁడు విమల వర్తనుఁడైనఁ దర
మగు వైభవ స్ఫురణ నీకు . విక్ర 8. 11

ఇట్లే వేయి కన్నులవేల్పు

గీ వేయికన్నుల వేల్పుతో విగ్రహించి, వనిత
యింకేమి గానున్న వాఁడో మరుఁడు .. నైష
4. 28.

గీ వెలయు వల వేయి గన్నుల వేల్పువోలెఁ,
కెంపుతో నిచ్చ కడలేని సొంపు మెఱయఁ,
పుడమి నాతోడి సవతిగా నడపవయ్య యయా.
4. 56.

**వేయిచేతులఱేఁడు** వి (వేయి+చేతులు+ఱేఁడు)
1 సహస్ర కిరణుఁడు, సూర్యుఁడు.
గీ వేయి చేతుల ఱేఁడు వెలుఁగుల యొకిమీడు ...
ఆ సం దేవ 16.
2 కార్తవీర్యార్జునుఁడు
సీ నినుగెల్చుకొని వాఁడి నొవరెడి వేయిచేతుల
ఱేనిఁ గెడపిన బలియు గెలిచె ... అచ్చ రా.
సుం. 157.

**వేయిచేతుల యెకిమీఁడు** వి (వేయి+చేతులు+యెకి
మీఁడు.) సహస్రబాహుఁడు,కార్తవీర్యార్జునుఁడు.
ఆ. ... చెఱనుబెట్టి వేయిచేతుల యెకిమీఁడు, విడు
చుటయును జయము వెల్లి విరిసె అచ్చ. రా.
యు 500

**వేయిచేతులవాఁడు** వి. (వేయి+చేతులు+వాఁడు)
సహస్రబాహుఁడు, కార్తవీర్యార్జునుఁడు,
సీ అడుగిడి త్రైలోక్య మాక్రమించుట యొక్కొ-
వేయిచేతులవాని వేయు టొక్కొ...సం నార.
17.

**వేయిచేతులసామి** వి. (వేయి+చేతులు + సామి)
సూర్యుఁడు, సహస్రకరుఁడు
గీ. ఇపుడు నీ దొడ్డతన మీవె యెఱిఁగికొనుచు,
వడరి మీవఁగడంబున కొడయఁడైన, వేయి
చేతుల సామిని వేడుకొనుము . అచ్చ రా
యు. 528.

**వేయిమోములవాఁడు** వి. (వేయి + మోములు+
వాఁడు) శేషుఁడు, సహస్ర ముఖుఁడు
సీ వేయి మోములవాఁడు విషముక్తుఁడైన నను
ప్రతియగు నీకు భూ భరణ శక్తి . విక్ర
6. 11

**వేయివేలు** వ. (వేయి+వేలు) పదిలక్షలు
మత్తకోకిల. వేయుఁ కాలును దేనెయుం గుడునిండి
పాఱెడు వేఱులున్, వేయివేలు దలిరవ
కొప్పెడు విప్రభోజనమున్ ... హరి పూ.
7. 152

**వేయు** స. క్రి 1. క్రింద పడవైచు, పడవైచు
సీ. ఆయుధంబులు వేసి హాంకారములు రోసి
మ్రొక్కువారును బట్ట లెక్కువారు, సాహ
సంబులు మాని స త్రాసములు పూని పఱచు
వారును వ్రేళ్లు గఱచువారు వరాహ 3 47.
చ .. పెనంగి లా, వెదలఁగఁ బట్టి వేయుటకు
నెత్తెవనం జను మల్లుపోరునన్ ఆము 2 9.
సీ. అమర తిర్యగ్జాతు లందైన వేయక వరజన్మ
మేల యందఁగ నొవరెచ్చె . . హంస. 5 281
(ఇట 'పుట్టించు' అని భావము.)
2 ఉంచు, నిక్షేపించు
ఉ. చేసె వనేక యాగములు జీవన సౌఖ్యము
నెమ్మనంబువన్, రోసె విపస్వదాహ్వయ తమా
జునిపై నిజరాజ్య భారమున్, వేసె వివేక
విస్ఫుర వవిత్రముచే నఘపాశ బంధముల్గోసె...
వరాహ 2. 87
3 ఉంచు, పెట్టు, చొనుపు.
సీ కడవటఁ జుట్టాల గరితల పైఁటలోఁ జెయివేసి
యేమేమొ చేసె ననుచు ...
గీ కృష్ణకథ లందు నిటువంటి వెల్లవినఁడు.. శుక.
2 547
గీ. చంద్ర భీత ఘనధ్వాంత సంచయమున, కథయ
మొనఁగి వేణీభరంబను నెపమునఁ, దన వెనుక
వేడికొన్నది తరుణీమొగము . ప్రభా 2 67.
(వెనుక వేసికొను = ఒకని కథయమిచ్చి వానిని
దనవెనుక నుంచుకొని వాని పక్షమువఁ దాను
పోరాడుటకు సిద్ధపడు)
4 తోఁట—మొ. ప్రతిష్ఠించు, మొక్క - మొ
నాఁటు
సీ ... సకల మార్గంబులఁ జల్లగా వనములు
వేయించె వేమంత్రి వేడ్కమీఱ దశా 1 51
మ. అలమాకందము కుండ్ల దింపఁదగు నియ్యం
ట్లొక్కచో వేయఁగా, వలె సంపంగికిఁ ద్రవ్యటం
బిడవలెన్ . . వానిఁ జూచి రెలతాగ్రల్ విప్ర
నారాయణున్. విప్రవ. 3. 62 ..

5 మూయు.

గీ. చూచెఁ గనుఱెప్ప వేయక సోమయాజి .. కాశీ. 4. 99

ఉ. .. సవుల కస్తనిదై కనుఱెప్ప వేయక, కాంత మహోఖిలామఁదటకాపడి చూచెఁ గుమార శేఖరున్. సారంగ 2. 37

చ. ఇపుడు గదా తపంబు ఫలియించె నటంచు మహోమరక్తి భా,వపరత రేఁబవల్లు తలవాకిలి వేసిన యట్టు లుండ శుక. 2 218.

6. తెగఁగొట్టు, నఱుకు, ఖండించు

గీ సుప్తుఁ డగుచుండి వానరుఁ జూచి నన్ను, డాయ వచ్చిన జీవుల వేయు ఖడ్గ,ధారఁ దునియంగ వని చెప్పి కూరె నిద్రఁ, గపియుఁ బనిపూని భూపతిఁ గాచి యుండె కేయూర. 3 199

క. ధరయెల్లను గశ్యపునకు, వరవరమును ధారవోసి నాఁడఁ జరింతున్, బోరిఁ బోకి మహేంద్ర శిఖరిన్, జరణము వేయకుము సుకృత శాలివి తలఁపన్ రామా 4 145.

7. (బాణమును) ప్రయోగించు.

మ కడుగోపించి దశాననుం డతని వక్షః పీఠమున్ జొచ్చి పో,యెడు నట్టుగ్ర శరంబు వేయుటయు ఉ. రా. 3 51.

8. కొట్టు, ప్రహరించు.

మ గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్ .. హర 7. 77.

9. పందెము వైచు, పాచికను దొరలించు.

సీ. నవలయ ధ్వనిగాఁగ సారె వేయు నదల్పు యతినైన గుండె ఝల్లునఁ గలంప ... పాత్రముల్ నెత్తమాడు ఆము 1 59.

10. ఎగురవైచు.

సీ. చూపి వేసిన వేగ చోపి లేపినపుల్లు మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగ...శకు 4 98.

11 వఱచు, ఒగ్గు.

గీ. వృక్షశాఖాంచలంబుపై వ్రేలుచున్న, కోటి సంఖ్యల నీరాకావి గోవణములు, విఘ్న మృగములఁ బట్టంగ వేసినట్టి, చీరతెరలను సంసన్నృతిఁ జిగురు గొల్పు కాశీ 2. 55.

మ...ఘూరమణు అత్యంత ప్రమోదమ్మునన్, గవఁగాఁ బల్లకిలోన నిందుమతి శృంగారాంగ సంపత్కళల్, దనరం బంగరుతళుకు పావడలు చెంత న్నెచ్చెలుల్ వేయఁగన్ ఇదు, 5. 107.

12. విసరు, ప్రక్షేపించు.

చ వనుల వధించియున్ మునల వర్గములంబడ మోఁది వాలుకల్, మనఁక వేసి వంచియును మందల తిత్తులు గాల్చి వైచియన్...రా. వి. 5. 30

13 (వింజామరము—మొ.) విసరు, వీచు.

క దురముం గమఁగొవియెడు నిర్జర వరులకు వేయు చామరంబులవలె నం,బరమున నాడె శిలీముఖ, పరిఖండిత విమతకేతు పటపల్లవముల్. వరాహ 5. 57.

14 కప్పు, ఆచ్ఛాదించు

చ భయపడి లేచి వేయదురు పాటునఁగట్టియుఁ గట్టుకున్న నీ,వియు నెలవంక చన్నొనల వేసియు వేయని పైఁటకొంగు...సారంగ. 3. 154

15. ధరించు.

ద్వి మహిమ తోడను భూతి మైనిండ నలఁది,యరుదైన రుద్రాక్ష హారమువ్వేసి .. ద్వి నల. 1. 13.

16 తొడుగు, ధరింపఁజేయు,

చ శశిశశిక్షమెచ్చవచ్చు, నిఁక బ్రహ్మను దీని సృజించినప్పుడే, వెలయఁగఁ జేతికిన్ బిరుదు వేయఁగ వచ్చును...దశా. 2. 305

17 (సిగ) ముడుచు

సీ మందుల ముడిత్రాట మలఁచి వేసిన సిగ బొల్పు గానఁగనీని బొడిమికంబు ... దశా. 1. 260.

18 తాంబూలము నములు.

క సోగలగు వెండిఱేకుల, లాగువఁ దెలనాకు మడిఁచి లలవ యొసంగన్. బాగాలు వేసికొని తన, బాగాలువున్నట్టి మేడ వజ్జకు వేఁగెన్. సారంగ. 2 194.

19. ప్రయోగించు, కొట్టు, తముకువేయు, తముకు వాయించు.

సీ. తముకు వెసిన వెన్కఁదాఁ జరి చినఁ బట్టియను పకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి శుక 4 111.

20 గణించు

సీ. జముల శర్మశరీర సంఖ్యలెల్ల దినాంతకము వెసి లిఖయించు కంణికులను...దశా 1. 264

**వేరకము** సం. వి అ పుం కర్పూరము

**వేరము**[1] = **వేరిమి** వి (సం వైరం.) 1. విరోధము. పగ

ఉ. వీరును పాండుపుత్రులును వేరము దక్కిపొసంగి మన్కికై, పోషితమాడి యేనటులు బుద్ధులు సెప్పిన భంగియున్ ... భార. ఉద్యో. 4 8

శా వేరంబె త్తిన రాత చెయ్యి యుడుపన్ వెజ్జెవ్వఁడూహింపఁగన్.. దశకు. 2. 89

క వారిరువురు. దమలోపల, వెరము గొని రాజ్యకాంత విజిగీషువులై ...ఆము. 3. 15

2. వేగము.

సీ. వైరవేగములగు వెరమనఁగ ... ఆం భా. 3 48.

**వేరము**[2] సం. వి అ పుం న 1 శరీరము 2. కుంకుమ పువ్వు. 3 వంగచెట్టు (వృ వి.)

**వేరిమి** = **వేరము** వి విరోధము, పగ (ఇది నేరిమి వంటిది.)

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యులన్న నెవ్వారికిఁ బోలదే ... భార ఉద్యో 3. 74

('వేరమి' అని శ ర. = గ్రహించిది)

**వేరు**[1] వి బ వేరులు, వేళులు, వేళ్ళు (క బేరు త. వేర్) వృక్షలతాదుల మూలములు.

ఉ. పాయక వేరు వెల్లఁకియుఁ బండులు నొండులుఁ గూరగాయలుం, గోయుచు...కు సం. 6 692

సీ వానలు సకవితో వర్షించె సస్యముల్ వేళ్ళ గొల్పుగ విజ్జువీఁగి పండె ... మనుచ 6. 121.

చ....కలవములుండ ...తృష్ణలోఁ, దలకొన వంగి ముప్ జలముఁ ద్రావెడు క్రిందటి వేళ్ళ మీఁదట, న్నిలిపి...ఆము 1. 67.

**వేరు**[2] స. బ. వేఁడువకు బహువచన రూపము, ఎవరు.

మ. పరకాంతన్ మదిలోన నైనఁ దలఁపంబాపంబు దుఃఖంబువన్, బరివాదంబును నొంది ఘోర నరక ప్రాప్తవ్యథల్ పెక్కు వత్సరముల్ చెందుదు రట్టి యన్య వనితా సంభోగ దోషంబు దా, వంనాథో త్తమయింత యంతయని యెన్న న్వచ్చునే వేరికిన్. వి. పు. 4 223

**వేరుపనస** వి (వెరు[1] + పనస) వేళ్లయందుఁ బండ్లు పండెడు పనస (వృ వి)

సీ పరిపాకమున వేరు పనసపండుల తావి యొందిం దిరములకు విందు సేయ...భీమ. 2. 54

సీ పొదరుఁ బొన్నలరాలు పుప్పొడి యిసుముపైఁ బగిలి యొప్పెడు వేరుపనస పంటి నీటి కాల్వలఁ ద్రోచి చంద్రికా 2 20

సీ వేరుపనస గుత్తి వెజ్జినారువ రేల పనస కరక కొమ్మి పలుక రేణి. .హంస 4 11.

**వేరుపురుగు(వు)** వి (వేరు[1] + పురుగు.) 1 కృమి విశేషము, వృక్షలతాదుల మూలమునఁబుట్టి వానిని నశింపఁజేయు పురుగు

ఆ. వేరుపురుగు చేరి వృక్షంబు జెఱుచును, చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు, కుత్సితుండు చేరి గుణవంతుఁ జెఱుచురా ...వేమన 1 17

గీ గ్రామ నికటంబు గాక దూరంబు గాక, చౌటి పొరగాక చిట్టాట చోటుగాక వెల్లి తలగాక క్రీఁ జెదల్వేరు పురుపు, రాతిపోటును లేని బారాటినేల విప్ర 2 18.

2. నాశకము, నాశకుఁడు.

ద్వి బలుగాలియును జండభాను రశ్మియును, బొలయ లోఁగెడు మత్తపోవనంబునకు...భూప కీటము వేరు పురుగవై తీవు ... ద్వి హరిశ్చ. పూ 1232

**వేరువాఱు** అ. క్రి (వేరు[1] + పాఱు) వెరుఁగు, నాటుకొను.

ఉ నీటను దేమయెక్కి ససినిల్చి యొకించుక వాడుదేఱి యప్పాటున వేరువాఱి ధృతి పాటవ మొప్ప నతఁడొనర్చు నప్పాటునఁ జెన్నుమీఱి పరిపాటిగఁ గెంజిగు రెక్కడక్కడన్, మోటిక లొత్తి క్రొవ్విరులు మొగ్గలు వెగ్గలమయ్యె నెయ్యెడన్ విప్ర 2. 28

చ. కితి నుదయంబుఁ జెంది బలిగీమునకున్ వడి వేరువాటి యున్నతమగు రూపుఁ బూనిగగన స్థలిలోఁ గొని యచ్చటం దరు, ప్రతతి చెలంగు ... చం రా. 2 82

వేరువి(రి)త్తు విజ (√వేరు[1]) సమూలముగ నశింపఁ జేయువాఁడు, నశింపఁ జేయునది

క. అనిన విని నవ్వి నాతో, నని సేఁతకుఁ దెంపు సేసి యడరెదు రథికుం, గనుట యది నాకుఁ బందువు,వినవే మీకెల్ల వేరువిత్తని నన్నున్. భార ద్రో. 4 259

గీ విరహి జనముల పాలింటి వేరువిత్తు, దురితముల కేల వాయొడుఁ దహివకరుఁడు ... పి శకుం 3 182.

సీ ...నోరి, వాకట్టు మందు గర్వలతాలవాలంబు వినయ కృత్యంబుల వేరువిత్తు ... రాజ చ. 2 21

ద్వి చివురుఁబోఁడులు తపశ్శీల వృత్తులకు, వివరింపఁగా వేరువిత్తులు గారె .. ద్వి పరమ. 2 61 పా.

(వైరాగ్యము.)

సీ. బలవదంతర్విరోధులకును వేర్విత్తు శ్రేయో వధూటికి జీవగఱ్ఱ...విప్ర 1. 84.

వేరి న (వేరు2+ఈ.) ఏరీ, ఎక్కడ నున్నారు.

క ఆ వచ్చిన వారలు వే,రీ వేరీ యనుచు సారె ప్రియ సుత నడుగుం, రావెతఁ బడు వారిని మీ,రే వారుం గనరె యనుచు నితరులఁబలుకున్. పర 5. 146

వేర్పడు = వేఱుపడు అ॰ క్రి. భేదపడు, ఏకీభవింపకుంటు.

క ...ఈ, పురుషులు గూడిన సృష్టికి, వెరువరులది సంఘటిలదు వేర్పడిరేనిన్. భా॰. శాం 5. 61.

మ ...నాభియు న్నిర్విషం,బును దోఁబుట్టువు లయ్యు వేర్పడ గుణంబు ల్నాపఁగాఁజూడమే. అము. 2. 67.

వేర్పఱచు = వేఱుపఱుచు స. క్రి (√వేర్పడు.) (వేఱు+పఱచు.) వేఱువడఁ జేయు, వేఱుచేయు, ఎడఁ బెట్టు

సీ. జను నవిశ్వాసంబు గమఁగొని మెలఁగుట విశ్వసనీయుని వేర్పఱచుట...వలదు పతికి ఆము 4. 252

ఉ ఇందునిఁ గందువేర్పఱిచి యిందునిచే సతిమోము చేసి యా,కందును గుంతలంబులుగఁ గంజభవుం డొనరించె ..విప్ర 8. 84.

చ తిరుపతి కొప్పు అందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వే,ర్పఱచిన మించువట్టి రుదురక్కల పేరులు. గావికోకలున్, హర శివ శబ్దము ల్దగ మృగాంక కళాధరు గేహ సీమ క్కేగిరి గుడిమేళము లొప్పదలఁ గిన్నర కంఠియు దాని తల్లియున్ శుక. 3 91

వేర్పాటు వి (√వేర్పడు) 1. భేదము

క ప్రకృతికి నాకును నుదకము,నకు మత్స్యంబు నకుఁ బోలె నైసర్గికమై, ప్రకటంబైనది వేర్పా, టకట యహంకారవశత నదియే నంటన్. భార శాం 6 50.

సీ. ద్వైపయ్యంబు ప్రియమను వేర్పాటు లేదు భూతముల యందెల్లను సముఁడ . భార. శాం. 4. 242

2 విరోధము

సీ..... అడవికేఁగి, తాపస వాక్యామృతములు వీనులఁ గ్రోలి చెలిమి వేర్పాటను చిరమర లకుఁ, బోరక.. భార. శాం. 1. 58

వేర్వాయు అ క్రి (వేరు[1]+పాయు) మొదలూడు.

గీ పండ్లు వేర్వాసి కదలు చూపకయమున్న.. కాశీ 3 84.

వేఱగు అ. క్రి (వేఱు+అగు) 1. తొలఁగు, దూరమగు.

ఉ...వేఱగుం, దాము ప్రకాశసంపదకు ... భార. శా, 5 530

2 మఱియొక విధమగు, మాఱు

క. ఉల్లము వేఱైన మరు, ద్వల్లభుఁ గని రంభ యపుడు దప్పకరామా, పల్లవ కర ముఖవీణా, వేల్లితతాన ప్రతాప వినిమయ ఫణితిన్. కవిక. 6 48.

వేఱడము వి (√వేఱు[1]) భేదము.

క.. మాయి, ల్మియిల్లని వేఱడ మిటు, సేయుదురే యిది నతత్వ శీలము తెలఁగే. మార్క. 3. 60.

క. ఒక నాఁడై నను మాతో నొక యాలోచనముఁ జేయ కూరక మో, మెత్తి కొనక పోదురు మీ రాం, ద్రకు మగలకు నిట్టి వేఱడంబులు గలవే భో. జరా 6 128.

**వేటిఁడి=వీటిఁడి** వి.శ. (వేఱు+ఇఁడి) అవివేకి.

గీ. అడవిఁ గూరలు దుంపలు గుడుచుచుండు, కూళ మానిసిక మ్మద్దరాలి వోలెఁ. దగులఁ గట్టిన వేటిఁడి తమ్మి చూలి, చెయ్యులకు నెద్ది యుఁక గుటి నేయవచ్చు. అచ్చ. రా అర. 30

**వేటిఁడించు** స క్రి (√వేటిఁడి.) అవివేకమువఁ జెలుచు.

మ....పేరు వ.క్క..జవుం బెంపును వేటిఁడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్ భార. కర్ణ 1 36,

**వేటిఁడితనము** వి అవివేకము

క. నీ తెఱవ వలుని తోడవ, యాటె మదీయోగ్ర రోష మవనీశ్వర నీ, వేటిఁడి తనమున వచ్చిన, కాటియ వడకేల పోవఁగా నగు నీకున్. మార్క. 7. 238.

**వేటిమి** వి. (√వేఱు¹,) భేదము

చ. వానిది గాక జన్మమను వాఁము నీ రమణీ లలామ య, యోగ్య వగుటాటుగా వతని యొద్దకు నెచ్చెలిఁ బంచి పంచినం, దానిటురాక వేటిమి యొవర్చునో నావల పంచు నించు విల్, కానికి లొంగి నెమ్మదిఁ దలంచుకొముట్ వలపించె నెవ్వఁడో కువల. 3 38.

**వేఱు¹** వి (క బేఱ్; త వేఱు, మ. వేఱు)

1. భేదము, అన్యత

మ త్తకోకిల వేఁడు చెంతయుఁ గష్టమైనను వేఱు లేని సుహృజ్జనున్ .. భార ఆది. 5. 218.

గీ. విషము సత్త్వాది గుణముల నవఘ యాత్మ, త త్త్వమున శివములఁ జేయఁ దన్మయత్వ, దర్శ నము దాన నవి మహోదధి వడంగు, నేఱు లట్టుల రూపఱు వేఱు లేక. భార. శాం.4 356.

సీ ... మాలోన నిట్లు.

గీ. వేఱు లేకుంట తెలియక కాఱులాడు, పతు పాతులు నరక కూపానఁ గూలుదురు ... వరాహ. 10 78.

గీ అర్ధ శశిభూషణుండు స్వయంప్రభుడుఁ, దున్న తుండు నిత్యోర్జిత జ్యోతి యతని, సంతతా నంద శక్తియా నంసిజాతి, విశ్వ జనయిత్రి వారికి వేఱులేదు కాశీ. 5. 99

2 భేదోపాయము

సీ. .. కొంటలు నవలఁ, జతురుపాయంబుల సంజ్ఞ లైయె మంచీగ్గి వేఱుకొట్టన నాల్గు వేఱువేఱ ఆం. భా. 2. 190.

**వేఱు²** క్రి విశ ప్రత్యేకముగా (దీని యామ్రేడిత రూపము వేఱువేఱు, వేర్వేఱు)

వ నీ చిత్తంబున వర్తించు మా కృతార్థత్వంబు వేఱె వర్ణింపనేల ... హర 4 45.

సీ. ఇమ్మలై మరుహజారమ్మలై పొదలుండఁ బూజవికెలు వేఱె పూవ వలదు...వసు 1 141.

వేఱు వేఱు.

గీ విఘ్న రాజేశ్వరులఁ జూడు వేఱువేఱ ... కాశీ. 5. 179.

ఆ ... కనుమలందు నిలువ వేఱువేఱ యేర్చి విలుమందిఁ బనిచి ... ఆము 3. 27.

వేర్వేఱు.

మ. . . తదాస్థానంబులోఁ జారకుల్, వినుత ప్రౌఢి వసుంధరాధి పతులన్ వేర్వేఱ కీర్తించుచో ... నైష. 1 72

ద్వి. ... వారిఁ, గొమరారు భూషించుకొంటకు భూషాంబరములు జలములుఁ జూర్ణములు మాలికలు, వేర్వేఱఁ బూని సవిస్మయాకృతుల, పర్విన యచ్చర పడఁతు లేనూఱు .. ద్వి. పరమ. 12. పొ.

**వేఱు³** స. వి అన్యము, ఇతరము, (క బేఱ్, త.వేఱు, మ. వేఱు.)

ఆ. ... అలిగి బకుఁడు, వీనిజాగు నూడవేఱంచు డాసిన, తరువుఁ బెటికికొనుచు ... భార ఆది. 6. 292.

ఉ. ఆటు రసంబులం జవులయందుల క్రొత్తలు పుట్ట నిచ్చలున్, వేఱొక భంగిఁ బాకములు విన్నను హొప్పఁగఁ జేసిచేసి ... భార విరా 1. 77.

గీ అతివ యతఁడొండు కోదండ మందికొన్న నటకె వేఱె విల్లెత్తిన విఱుగనేసె .. ఉ. హరి. 1. 165.

మ సుడి వాల్దాలుపుకన్న వేఱు కలరే చుట్టంబు లేవంకలన్ ... నీలా. 1 95.

వేఱుప(వ)డు = వేర్పడు అ. క్రి (వేఱు+పడు)

1. వేఱగు, విడిపోవు.

ఆ. అలిమాటలు విని యన్న దమ్ములఁ బాసి, వేఱుపడెడు వాఁడు వెఱ్ఱివాఁడు వేమ. 2. 133.

వ. పొలంబులన్ బులుగులన్ జోపుచు డేగ వేఁట కాండ్రు వేఱు పడి వేఁటాడన్ దొడంగిరి. మనుచ. 4. 55.

2. దూరమగు.

క వాకం బెట నళినాసన, లోకంబెట నిఖిలమౌని లోకేశ్వర యీ, లోకములలోన భవదవ, లోకమునకు వేఱు పడిన లోకముగలదే కకు 2 52

వేఱుపాటు = వేర్పాటు వి (√ వెఱుపడు) వేఱగు.

వేఱుపెట్టు స. క్రి (వేఱు²+పెట్టు) వేఱుచేయు, అన్యులఁగాఁ జేయు.

ఆ. పెక నిశ్చయమున నిట యేగుదెంచితి, మనఘ నీవు నేము నధిపు పనికి, నిట్టి మమ్ము వేఱుపెట్టి యొక్కటి కార్య, మాచరించువాఁడ వగుట దగునె భార. సౌప్తి. 1 33.

వేఱుపోవు అ. క్రి (వేఱు¹+పోవు.) వేఱుపడు (శ. ర వా.)

వేఱుబందము వి. (√ వేఱు) భేదము, వేఱుపాటు, పక్షపాతము (చి. ని; శ. ర, ప్రౌ. వా.)

వేఱువాయు అ క్రి. (వేఱు¹+పాయు.) వేఱుపడు.

క పలువురు యువతులఁ బుత్రులు, పలువురుఁగల యతఁడు వేఱువాయఁ దలఁచివన్, లలనలఁ బుత్రులఁ దావహ, తలకొని మెయిపాలు గొనుట ధర్మంబెందున్. విజ్ఞా. వ్య 124.

వేఱుసేయు అ. క్రి (వేఱు¹+చేయు.) భేదము నొందు.

క. పాంచాల రాజపుత్రియు, నంచితముగ నిమ్నఁ బొందు నార్వుర తరువన్, సంచిత పుణ్యుఁడ వీ వాక, యిఁచు యును వేఱుసేయకే తెమ్మెల మిన్. భార ఉ 4. 31.

గీ. క్రమము దప్పక యుండ నా రాజ వరుఁడు, సకల లౌకిక వైదికాచార సరణిఁ, బ్రియ ముతో విప్రపరునకుఁ బెండ్లి సేసె, వేఱు సేయక ... విక్ర. 1. 160.

ఉ వానిదవంధ్య జీవనము వానిది జన్మము వేఱు సేయక, వ్వాని గృహాంతరంబున భవాద్భుత యోగి జనంబు పావన, స్నాన విధాన్న పాన ములఁ సంతస మందుచుఁ బోవు నిచ్చలున్ . . మనుచ. 1 63.

అ శంభు వేఱు సేసి సాగింప వచ్చునే, క్రియలు వెఱ్ఱి వేలయయితి సెపుమ . కాశీ. 7 72

వేల వి (త. వేలై) దాస్యము.

చ అనుపమ రూప యౌవన మహాగుణ వైభవలీల నెవ్వరిం, గనుఁగొని మెచ్చకున్న వర కన్యక గల్గిన దానిఁ జెప్పు నీ, వనిచిన వాని వేల గొని పైఁబడఁ జేసెద . కు, సం 4 399.

సీ హరిఁ దెత్తుమే నీకు నమ్ముడు పడియుండ ... దేవేంద్రుఁ దెత్తుమే నీవేల గొనియుండ .. కు సం. 6. 674

ఉ. దండుగు లిచ్చి వేలగొని దానిపయిం జెఱ లిచ్చి .. కు సం. 10 528

సం. వి అ. స్త్రీ 1 చెలియలికట్ట. 2 కాలము, సమయము. 3 అదను, తఱి, యుక్తసమయము. 4. తెఱపి, విశ్రాంతి. 5 సముద్ర జల ప్రవాహము. 6. సముద్రతీరము. 7. మేర, హద్దు 8 వాక్కు. 9 రోగము 10. అనాయాస మరణము 11. బంక, జిగురు. 12. అనురాగము. 13 ఈశ్వర భోజనము. (మే. ని) 14. కాలవిశేషము, హోర. (ఒక గంట కాలము)

శ్లో. చతుర్వింశతి వేలాభి రహోరాత్రం ప్రచక్షతే (వాచ.)

వేలము¹ వి (సం వేలా) 1. శిబిరము, స్కంధావారము, దండు విడియు చోటు

ద్వి అప్పుడు మగ్రీవుఁ డాదిగాఁ గపులు, చెప్ప రప్పను లెల్ల శ్రీరాముతోడఁ, జెప్పి వేలము నకుఁ జెచ్చెర నేఁగి, యొప్పెడు సుఖనిద్ర ను కి యారాత్రి, గడపుటయును ... రం రా యు 314. పా 22. పం.

చ వెనుక నృపాలురంగవుల వేలము చొచ్చినవధి గ... మున్న య, జ్జనకజఁ ద్రుంతుఁగాక ... కామం. 8. 183.

చ. ... బో,రనఁ గటకంబు వెల్వడి నృపాత్మజు వేలముఁ జొచ్చి ... దశకు 4 22.

2. విడిది, బస

గీ. అమృత కుంభంబుఁ గైకొని యసుర వరులు, వేఱ యొకచోట వేలంబు విడిసియుండి, రి . హర. 6 96.

ద్వి గూడారములు డెంద్లొల్లవల్ బన్ని, వేరము ల్దప్పక విడిసె నుత్సుకత ... పండితా. పర్వ 350 పొ, పండితా పర్వ. 326 పొ

3 సేన, సైన్యము

ఉ. ... నికేఁద,మ్మాలము లంద నాతప సమూహము పేరిటి యిర్లవేలముల్ వసు. 4. 5

చ. ... చ,క్కని వని వేడ్క వేలముడిగన్ ఘటియించె జనేంద్రుఁ డయ్యేడన్ చంద్రి.1 168.

(జలచరములు )

ద్వి గాలంబునకు నైనఁ గలఁగక క్రొవ్వి, దూలంబుల నవతి స్థూలంబులగుచు, వేలంబు విడిసిన విధమున నెరసి, వాలంబు లల్లార్చి వారి విహార, శీలంబులై విరసించి యొండొంటి నాలంబులై డాయు నప్పురంబులను .. వన 5 238. పొ. 28. పం.

4. గుంపు, సమూహము

చ ... ఓ వయస్య యీా, విడువని వేలమైకురియు వెన్నెల చిచ్చున కేమిసేయుదున్.కవిక.4.146.

క. వెడఁగుఁదనంబున నీళ్ల,న్నడు మడఁచిన రెండుగాని నలువున జలి భి,న్నన్నడు రెందు వేటు గారని, విడువని వేలంబు చాటు వేదాంతంబుల్. వరాహ. 9 57

5 (త. వేలై.) దాస్యము

సీ. విడువని వేలంబు నుడిగంబులు గొనంగ నిచ్చలు నిద్రలే దచ్చురలకు .. వరాహ. 10. 15.

6. వేగము.

సీ. వేగంబు పాకెంబు వెలయు వేల మనంగ ... ఆం. భా 3 48.

క. ఈ లీల వెండి మలకడఁ, జాకెముడిగి వేల ముడిగి పరిసరవర కం,కేళీ వనసాళిఘన, కేళీవన దర్శనేచ్ఛ గిటికొన మెలఁగెన్. ఉ.రా 4.147.

7. మండలాగ్రము, ఖడ్గము, కత్తి.

చ. చలిమిరి గాడ్పుచే నెగసి సన్నపు సుళ్ళగు చాక సంపు మం,దల వికసిల్లెఁ బుప్పొడులు దట్టముగా మఱిఁ గ్రమ్మ కూర్మిచేఁ, గలిగి విరాలిఁ గుందు తెలిగంటి నెలంతల మీఁదఁజొన్పు పూ, విలుతునిపైఁడి చుట్టలుఁగు వేలముఖం బలె సొంపు పెంపువన్. యయా 4. 10

వేలము² = ఏలము¹ హిం వి. అమ్మటలో నొక విధము, విక్రయ భేదము.

నం వి ఆ న. ఉద్యానము, చిన్నతోట

వేలముపట్టు వి (వేలము¹+పట్టు) శిబిర ప్రదేశము.

చ. చిలుకలు కమ్మ దెమ్మెరలు శీతమయూఖుఁడు దేఁటు లాదిగాఁ,గల నవవిల్తుసాధన నికాయము వేలము పట్టనంగ నా,కులమటుగాన దాని విడ గొట్టక తృప్తిక దొట్ట పీతరాఁగల మని విజ్జి వీఁగెదరు కొందఱు బోదలు నావగండలై. పాండు. 5. 182

వేలాటము వి చెర్లాటము,

ద్వి తరులతో నతి శోభితంబగు నందు, హరిణముల్ పులులు వేలాటంబు లాడు, ముంగుల కెలుకలు ముద్దులు పెట్టు ... ప్రభు 4 130 పొ.6 పం.

వేలార్చు న క్రి. కుమ్మరించు

గీ. ఘన పయోధర పదవి నక్షత్ర మాలికా రుచులు పర్వశ్యామ యొకర్తు చంద్ర, కలికఁ బూని నవామృతమ్ములఁ జకోర, చపలనయనకు వేలార్చు సమ్మదమున చంద్రి 6 19

వేలిమి = వేల్మి వి (√వేలుచు) 1. హోమము.

ఉ. వేలిమి యన్ మహారార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె . మనుచ. 2 53

క. శాలిమి మీఱఁగ నెప్పటి, మాలిమితో దేవగురుఁడు మంత్రము దెలుపన్ వేల్మిచేసె ... దశా. 5. 75. ఆం. భా. 2. 171.

2 హోమకుండము.

వ .. అతని వధంబునకై పాంచాల విభుని వేలిమిం బుట్టిన వాఁడగుట నప్పార్షతుండు . భార. ద్రోణ. 5 321.

సీ. అగ్నిదేవ స్వాహా యటంచు వేలిమి యందు నొకఁడైన నాహుతి నొసఁగఁబోఁడు .. దశా. 1. 257.

3 అగ్ని
సీ వెత్తంబు క్రిందటి నెత్తమ్మి కెంపుజూగని పెంపు వేలిమి కన్నుగాఁగ యయా 2 36.

**వేలిమికట్టి(ట్టె)య** వి (వేలిమి+కట్టియ) సమిధ
సీ విటకచా కృషికి విసువు నొక్క లతాంగి వేలిమి కట్టియ ల్వ్రెలిచి తెచ్చు కవిక 6. 95

**వేలిమిబొట్టు** వి (వేలిమి+బొట్టు) హోమకుండమందలి భస్మముతోఁ బెట్టుకొనిన బొట్టు, రక్ష.
సీ తూలాడు సిగయును వ్రేలు మాఱటగోఁచి వేలిమి బొట్టును వ్రేళ్లదర్భ, దవర .. భాగ 10 ఉ 1253.
సీ. నొసటి వేలిమిబొట్టు మసి మీఁద మృగనాభి తిలకఁబు బటువుగాఁ దీర్చవచ్చు రామా 2 110

**వేలిమియొజ్జ** వి (వేలిమి+ఒజ్జ) పురోహితుఁడు
సీ మానితంబైన హోమద్రవ్యములు గొని వేలిమి యొజ్జయై వేధ రాఁగ...కు సం. 9. 227

**వేలు=వ్రేలు** అ. క్రి వ్రేలాడు.
గీ చులకఁ గాల్వట్టియాడ్చినఁ జూరువట్టి, వేలు దురు గాక తనవారి విడుతురెట్లు కాశీ 5 293
ద్వి ఉడుపంక్తి చెదరె సూర్యుని వేగ మడరె, వడఁకె శేషుఁడు ధరావలయంబు వేలె . . ద్వి. పరమ 2 115 పొ.
వి బొ అంగుళి.
సీ.... వేల్ వ్రేలన నంగుళియగు...సాం. నిమాన. 17
సీ. వేల్ వేలనా నంగుళీ సంజ్ఞ లెనంగు వెంక. మావ. 39.
సీ. వాలు డాలును ముగ్ధ చేలు ప్రాలుమ వేల్పు చాలు మేలును గల వెలివాఁడ . . ప్రబంధ. 224

**వేలుచే=వేల్చు** స క్రి (అగ్నిహోత్రము నందు అజ్యాది హవిస్సులను) హోమము చేయు
ఆ ధర్మనఁగరమున ధర్మజుచేఁ జచ్చి, పొలిచెఁ జూడ మద్ర భూవిభుండు, విధియుతంబుగాఁగ వేలిచి విడిచిన, నాతియున్న యగ్నినసుకరించి భార. శల్య. 1. 287.
ఉ ధర్మరాజులో, దాలి మనోభవాగ్నిఁ దన తాలిమి నాహుతిగాఁ గ్రమఁబునన్, వెలుచు చున్నవాఁడభినివిష్టసుఖైక ఫలాభి కాంక్షయై నైష 4 35.
ద్వి ఓలి శివాగ్ని కాహుతులుగా నిట్లు, వేలుతు నిదియ తా విధి దీనికనుచు పండితా పురా. 109 పొ

**వేలుపించే** స క్రి (√ వెలుచే) హోమము చేయించు
ద్వి. నవరని గంధపు సమిధ అమర్చి, జాతిముత్తియపు లాజలు వేలుపించి ... ద్వి పరమ. 5. 380 పొ

**వేలుపు=వేల్పు** వి (√వేలుచే) 1 దేవత.
సీ తొలి వేలుపుల వెలుపుల పనుల్ గొనుఁతేఁడు . మనుచ 5 47.
వ . అక్కక్క మ్రొక్కవే మనపాలి వేలుపని బుజ్జగించియు ఆము 4. 35
2. దేవతా స్త్రీ
చూ వేల్పు.
3 జోస్యము.
ద్వి ఆహికంబులఁ బెట్టి యప్పులు వార,వృద్ధి కొసంగుదు వేలువు చెప్పు, పద్ధతి నేర్తు నవ. 3 153 పొ 18. పం.

**వేలుపుఁగత్తళాని** వి (వేలువు + కత్తళాని) దేవతాశ్వము, ఉచ్చైశ్శ్రవము
ఉ. ఉప సుధర్మాస్థాని నున్న వేలుపుఁ గత్తళానికిఁ బట్టు తలాట మనఁగ... వరాహ 4 165.

**వేలుపుఁగమ్మరి=వేల్పుఁగమ్మరి** వి (వేలుపు + కమ్మరి,) దేవశిల్పి, విశ్వకర్మ.
క వేలుపుఁ గమ్మరి ప్రొద్దుం, బోలె నలుఁగమిని మేను బోరిఁబోరిఁ దునియల్, ప్రిలఁగ సానవట్టిన, పోలిక.. అచ్చ తా. 5 90.

**వేలుపుఁజాన** వి (వేలుపు+చాన) అప్సర స్త్రీ
క అడిరి వేలుపుఁ జానలు, పాడిరి గంధర్వ సతులు ప్రమదం బెసఁగన్, బ్రోడలగు మింటి తెరువుఁ చేడియ లటు రలరు సేసలు పేడ్కన్ జాహ్న 1 188

**వేలుపుఁజెట్టు** వి (వేలుపు+ చెట్టు) కల్పవృక్షము, దేవతరువు. (శ ం)

**వేలుపుఁజేడె** వి. (వేలుపు + చేడె.) దేవతా స్త్రీ, అచ్చెర.

మధురగతి రగడ. వేలుపుఁ జేడెల వెలఁగొను వేశ్యలు, శ్రీలఁగుబేరునిఁ గెనకెడు వేశ్యలు... కుచేల 1. 28

**వేలుపుఁదిప్ప** వి (వేలుపు+తిప్ప) మేరు పర్వతము.

ఉ. చెప్పెడి దేమి నవ్వుచు రచించిన మాటలు గాము బాణముల్, దపివఁ దవఁ డాశ్రిత కామ కామ్యముల్, కలాపము ముంగిట నున్న వేలుపుం దిప్ప వివేక శాలి యువతీ జన చిత్త విమోహ్న దర్పకుం, డప్పన మంత్రి వానిఁ దరమా నుతియింప నిలింప కోటికిన్. రాజ. చ 1 35.

**వేలుపుఁదెరువు** వి. (వేలుపు+తెరువు.) సుర పథము, ఆకాశము. (శ ర)

**వేలుపుఁదేజి** వి. (వేలుపు+తేజి) ఉచ్చైశ్శ్రవము

సీ. అనికి వేలుపుఁదేజి నలరుకై జామోరి లల్లార్పు చేఁ జీరువాయకులముల. చంద్రి. 6. 65.

**వేలుపుఁద్రోవ** వి (వేలుపు+త్రోవ) ఆకాశము.

క...మల్లియు, విరులవఁగారికి తెసఁగె వేలుపుఁ ద్రోవన్...నీలా. 3 6.

**వేలుపుఁబెద్ద** వి (వేలుపు + పెద్ద) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

ఉ. బుద్ధుల ప్రోడ నాల్గు మొగముల్గల విశ్రుత మూర్తి తమ్మిపూ, గద్దియ మీఁద నుండి త్రిజ గంబులు నేలుచు నుండు వేలుపుం, బెద్ద వచో వధూటి వలపించిన సర్వగుణైక శాలియు,దద్ద యఁ బ్రోచుఁ గాత మగుణాంబుధిఁ దిమ్మయ మంత్రియప్పనిన్. రాజ. చ. 1. 3.

క. తద్దయుఁ బోగడెద వేలుపుఁ, బెద్దయవన్ జగములెల్లఁ బెంచుచుఁ బలుకుం,ముద్దియతో నెఱతామర, గద్దియఁ గొలువుండు నలొమ్మ గంబుల ప్రోడన్. నీలా. 1. 5.

**వేలుపుఁబొన్న** వి. (వేలుపు+పొన్న.) సురపొన్న. (వ్ర వి)

వ. బలు వేలుపుఁ బొన్నలం దొలఁగఁ ద్రోయు మిన్నేఁటి నీటి వరదపోటువ ... అచ్చ. భా. 2. 31 పా.

**వేలుపు గమికాఁడు** = వేల్పుగమికాఁడు వి. (వేలుపు + గమికాఁడు) 1. కుమారస్వామి (శ ర) 2. బ్రహ్మదేవుఁడు, సురజ్యేష్ఠుఁడు

వ అంతలోన నజీవు-డు నజీవుఁడైన తెఱఁగున నెనిమిది కన్నులుగల వేలుపుగమికాఁడు తేటి తెప్పిలి కాలుఁగేలుఁ గదలించి కన్నులు విచ్చి చూడ సమర్థుండై. భాగ 10. పూ. 542.

**వేలుపుగాణ** = వేల్పుగాణ వి (వేలుపు + గాణ) గంధర్వుఁడు (శ. ర)

**వేలుపుగిడ్డి** = వేల్పుగిడ్డి వి (వేలుపు+గిడ్డి) కామధేనువు, దేవతల గోవు.

ఉ వేలుపు గిడ్డియుం బరుసవేదియుఁ గల్వ కుజంబుఁ దోడరా .. భీమ 2. 1[?]

**వేలుపు జక్కర** వి (వేలుపు+జక్కర.) ఆకాశ గంగ, సురదీర్ఘిక, స్వర్ణది.

క జక్కుల దొర చెలికానికిఁ, గొక్కుపాలుమాఱోడు నయ్యతుం జొక్కపు లేఁ, జక్కల తేనిని వేలుపు, జక్కర నాదలకు చాల్చు జగవేలుపనకున్. అచ్చ రా బాల, 21

**వేలుపుజడదారి** వి. (వేలుపు+జడదారి) సురమౌని, నారదుఁడు.

సీ వేలుపు జడదారి విందారగించుచో నానంద బాష్పంబు లడ్డపడును ఉ హరి 6 139.

**వేలుపుటిల్లు** వి (వేలుపు+ఇల్లు) మేరుపర్వతము

ఉ వేలుపుటిల్లు విల్లు వెడవీకల పోకల నారి రెడుచే,దోల వెలుంగు తూపెచటఁ దోలిన బాణని తేరుమాటలై, గ్రాలెడు తేజులెవ్వనికిఁ గల్గునతఁడు చళుక్య విశ్వభూ,పాలు మనం బునం బర వికంజనుఁడై విహరించుచుండెడిన్. కావ్యా. 5. 98.

**వేలుపుటేఱు** = వేల్పుటేఱు వి ఔ. సురదీర్ఘిక, ఆకాశగంగ.

ఉ. వేలుపుటేఱుఁ గప్పురము వెన్నెల లంచలు ముత్తియంబులుం, బోలును మించు నద్దములుఁ బయ్యెర మేపుడు బేఁడు గల్వ రా, బాలును రేవెలుంగు మగబాలును టెక్కలుఁ దమ్మిచూలి యిల్లాలును జోడుగాఁగఁ దనరారు ననంబునఁ గేరు దయ్యమా. అచ్చ. రా. బాల 214.

ఉ ... కీలు జారువా, మేలిపసిండి బొమ్మచను
మిట్టలకున్ దెలిచల్వ సైరిణీ, చేలచెఱంగులై
యచటఁ దెల్వగు వేలుపు లేటిపెందెరల్
ఉ రా 1 58

**వేలుపు(ల్పు)బొజ్జ** వి (వేలుపు+ఒజ్జ) సురాచార్యుఁడు, బృహస్పతి, (శ ర)

**వేలుపుటొడయఁడు = వేల్పుటొడయఁడు** వి. (వేలుపు+ఒడయఁడు,) దేవేంద్రుఁడు
సీ మును గౌతముఁడు సాఁగ నావరు పంట వలంతి జేజే నిరాహారి సింగమునకు, గారాబు టిల్లాలఁ జే రహల్యయటంచు రోసనాఁడు వేలుపుటొడయఁ డెమ్మె, నమఁగోరి పుంజు రూపునఁ జేరి నడురేయి తఱి నిఁటిదరిఁ బొంచి యఱచుటయును .. అచ్చ రా. బాల 146

**వేలుపుదాయ=వేల్పుదాయ** వి. (వేలుపు+దాయ) సురద్విషుఁడు, అసురుఁడు.
చూ వేల్పుదాయ.

**వేలుపుబానిస=వేల్పుబానిస** వి (వేలుపు+బానిస) వేశ్య (శ. ర.)

**వేలుపుమానికము=వేల్పుమానికము** వి. (వేలుపు+మానికము) చింతామణి
క దాన సముగ్రత వేలుపు, మానికమును బోలు నమదు మహనీయమణిన్, గానుక యిచ్చి నగేంద్రుని, వేనోళ్లం బ్రస్తుతించి వీడ్కొని చని యెన్. విక్ర. 2 257

**వేలుపుమావు=వేల్పుమావు** వి (వేలుపు+మావు.) ఉచ్చైశ్శ్రవము, దేవాశ్వము
సీ వింట జవ్వన నేఁగు వివిధాశ్వకంధరల్ దగ్గరి వేలుపు మావు నెలుఁగు బూన చంద్రా. 6 92

**వేలుపుమిన్న** వి (వేలుపు+మిన్న) దేవతాశ్రేష్ఠుఁడు
సీ. . . వేలుపు మిన్నల వివిధ భూషణ కాంతి శుక్ర చాప స్ఫూర్తి నవదరింప ... దశా 1. 266

**వేలుపు ముద్దరాలు=వేల్పు ముద్దరాలు** వి (వేలుపు+ముద్దరాలు.) దేవతాస్త్రీ.
క ఈ విధమున నయ్యిరువురు భావజ తంత్రైక నరత బహుకాలము సౌఖ్యావహ లీలల నుండంగా వేలుపు ముద్దరాలు గర్భము దాల్చెన్. మను చ. 3 118

**వేలుపు(ల్పు)మొదవు** వి (వేలుపు+మొదవు) కామధేనువు, దేవతల యావు
క ... కోర్కులు, పొలుపొదవఁగఁ బిదుకు వేలుపు మొదవునకున్ నీలా. 1 21

**వేలుపురాచిల్కు = వేలురాచిల్కు(లుకు)** వి. (వేలుపు + రా + చిల్కు.) ఐంద్రాస్త్రము, ఇంద్రుఁ డధిదేవతగాఁ గల అస్త్రము
సీ రాచూలి వేలుపు రాచిల్కు నిగిడించి యా చెయ్యి దెగవైచి యపుడె సాము, నెల ముల్కిదోయి నిచ్చలముగాఁ బఱగించి కాళ్లు రెండును ద్రుంచి ... అచ్చ రా యు 248.

**వేలుపురాపురువు** వి (వేలుపు + రా + పురువు) ఇంద్రగోపము, ఆరుద్ర పురుగు
ఉ. ... జడిగొన్న మంకెనన్, విప్పుగఁ జేయునట్లు దగె వేలుపురాపురువుంగముల్ దటిన్. అచ్చ. భా 3 51.

**వేలుపుఱేఁడు** వి (వేలుపు+ఱేఁడు) ఇంద్రుఁడు.
ఉ. . వేలుపు ఱేని గెల్చు టొక విక్రమమే బలి దైత్య వల్ల భా. దశా 2. 428.
ఉ. ... జాబిలి రాల మేడలో, వేలుపుఱేఁడు నవ్వ యును వెన్నుఁడు గొల్వఁగ .. నీలా 1 1.
ఇట్లే వేలుపుటేలిక, వేలుపురాయఁడు. మొ.

**వేలుపుచెట్టు** వి. (√వేలుపు) కల్పవృక్షము.
శా ఏఁడీ పేదలపాలి వేలుపులచెట్టు ... అచ్చ రా అయో 88

**వేలుపులదారి** వి. (√వేలుపు) ఆకాశము
చ తడయక వచ్చె వేలుపుల దారిని శాముఱపేఁట కాఁ డొగిన్ ... అచ్చ. రా యు 162.

**వేలుపులపెద్ద** వి (√వేలుపు) బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.
సీ. కెందమ్మి గద్దె యెక్కిన వేలుపుల పెద్ద పలుకుఁ బూఁబోఁడికిఁ బ్రాణపదము . . దశా. 2 62.

**వేలుపులపెద్ద కొమరుఁడు** (√వేలుపు.) నారద మహాముని.

క అని పుట్టఁ బుట్టువునకుం, గొనకొని వేలుపుల పెద్ద కొమరుఁ డెటింగిం, చిన నాలకించి యతఁడా, యన నవ్వలి కతయుఁ దెలుపుడని వేడుటయున్ అచ్చ. రా బాల 218

**వేలుపుల ప్రోలు** వి (√వేలుపు) అమరావతి, స్వర్గపట్టణము

గీ. కూడు నిదురయు నెపుడుం జేకూఱకుండు, వేలుపుల ప్రోలు నమ్మేటి పీటికెనయె...అచ్చ రా. బాల. 81.

**వేలుపువడ్రఁగి** వి. (వేలుపు+వడ్రంగి) విశ్వకర్మ, దేవశిల్పి.

క వేలుపు వడ్రఁగి పెట్టిన, కీటనఁ బలుకాట మాట క్రియ గనుపట్టుం, గాలోచితముగఁదద్ది, వ్యాలయరత్న స్త్రీప్రతిమల కనురూపముగన్. కళ. 2. 10.

**వేలుపువెలఁది** వి (వేలుపు+వెలఁది) దేవతా స్త్రీ అప్సరస స్త్రీ

అని యాన గలుగఁ బలికిన, విని వేలుపు వెలఁది మోము వికసిల్లంగాఁ, దనచేతి చెఱఁగు విగియన్, వెవచుచుఁదలవాంచి నగవు బెరయఁగఁ బలికెన్ మనుచ. 3. 106.

**వేలుపుసాని** = వేల్పు(ల)సాని వి (వేలుపు+సాని.)

1 జ్యోస్యము చెప్పు స్త్రీ, సోదెచెప్పు నాఁడుది, దైవజ్ఞ.

సీ...తగు దైవజ్ఞ సోదక త్తె, యనఁగ వేలుపు సాని యన అం భా 2 110

**వేల్చు** స క్రి అగ్నిహోత్రమందు ఆజ్యాదికము సమర్పించు, హోమము చేయు

ఉ...ప్రయోగ దక్షుఁడగ్ని, ముఖము సేసి వేల్వ మొనసి వివాహహోమ, కరణ వస్తుచయము గాచి యుండె. భార. ఆది 7 167

గీ హృదయ వేదికయందు సమిద్ధ మూర్తి, వెలుఁగుచుండు తేజమునందు వేల్చుఁబ్రాణ,ములను యాజి యుల్లంతరమున హొనర్పు, యాగమున వీతకల్మషుఁడై వెలుంగు భార శాం. 5 149

సీ రేపు సూర్యుండును మాపు చుక్కలుఁ దోఁచు వంతదాఁకను జపమాచరించి, యటుమీఁద నాత్మ గృహ్యోక్త రూపంబుగా విహిత తముగనగ్ని వేల్వవలయు...విజ్ఞా. 1 63

ఉ పంకజనేత్ర గౌతముని పంపున లాజలు దోయిలించి ఘూ,మాంకుని యందు వేల్చె దరహాసము చిప్పిలలోన దాఁచుమన్...నైష 6 102

ఆ అనిన సాహసాంకుఁ డంబిక నెల్లెని,ప్రమదితాత్మఁ జేయఁ బ్రబిన వట్టి, మధు నిషిక్త మైన మాలూర సత్ఫల, వితతిఁ దాను వట్ల వేల్వఁ దొడఁగె విక్ర 5. 78

2 కాల్చు, తగులఁ బెట్టు.

గీ అతని ముఖ గహ్వరంబుల నద్భుతముగ, నుగ్రదహన శిఖావళు లుద్భవించి, వేల్పు మూఁకల నరికట్టి వేల్వఁ దొడఁగె, నంత నెంతయు సంభ్రాంతు లగుచు సురలు భార అర. 5 218.

గీ మాడుగులు వేల్చె నొడ్డాది మసి యొనర్చె... ఆము. 1. 56

3 భర్జించు

వ పర సంతాపకారి కటుక వచనుండగు కుటిల బుద్ధిని నిఁగలంబున వేల్వఁడు ... కాశీ. 3. 154.

**వేల్పించు** స క్రి (వేల్చు) హోమము చేయించు

క వేలుపుల జేఁడు గురుచే, వేతిమి వేల్పించి బలిమి వెలయఁగ ..భాగ 9 505

క పోలఁ దొలి మినుకు దెఱఁగున, వేల్పించిన పిదప రాచ విరివింటి దొంన్, వేల్పులకున్ మ్రొక్కించిరి...యయా 4. 113.

**వేల్పు¹** = **వేలుపు** వి (√వెలుచు) 1 దేవత

క...పొలుపుగ ధర్మం, దలఁపుము మఱి యాతఁడె వేల్పులలోపలఁ బెద్ద ధర్మువున సత్యమువన్ భార ఆది 5 92.

క...వేంకటపతి యిష్టమయిన వేల్పగుటఁ...ఆము. 1. 16

క వీఁడే చిలిప భూపతి, వాఁడి తనంబునసె కాన వచ్చునె మరుచేఁ, బోఁడిమి యుఱియున్నప్పుడె, వేఁడె మెయింబట్టి తెత్తు వేల్పులు బెగడన్. సుధ 5 6

ఉ .ఈకుమం,త్ర బన వేల్పు వ్రేల్చి ... దశకు. 7 121.

**వేల్పు²** = **వేల్పిల్పు** వి. (√వేలు) వ్రేల వేయుట,

గీ. ముదిసి ముప్పునఁ బెండ్లికై మొగము వేల్పు, దగవు గాదని రాఁడయ్యెఁ దాతవేల్పు... నైష 4 129

**వేల్పుఁగన్నియ** వి (వేల్పు[1]+కన్నియ) దేవతా స్త్రీ

సీ ముకెమి యెన్నఁడు లేని కొదమ ప్రాయపుఁ జెల్వు నేర్పులు వేలుఁ గన్నియలకు నమరు... ఉ రా. 4 90.

**వేల్పుఁగమ్మరి=వేలుపుఁ గమ్మరి** వి (వేల్పు[1]+కమ్మరి) దేవశిల్పి, విశ్వకర్మ

ద్వి బొమ్మర వోయి వేల్పుల మూఁక వేల్పుఁ, గమ్మరిఁ బిలిచి యక్కజము చూచితివే ..ద్వి పరమ. 1. 27. పొ

**వేల్పుఁగలువకంటి** వి (వేల్పు[1] + కలువకంటి) దేవతా స్త్రీ.

వ వేల్పుఁ గలువ కంటులు క్రొమ్ముడులు వీడ... ఉ రా. 3. 78

**వేల్పుఁగొండ** వి. (వేల్పు[1]+కొండ) వేలుపు కొండ, మేరుపర్వతము

గీ కొండ మరధనమని వేల్పుఁ గొండ మహిమకిఁ, దెచ్చి దానంబు లొనరించు తెఱఁగుదనర, నాశ్రితుల కర్థమొసఁగెఁ బెదప్పవిభుని, భార్య కొండమ్మ తనదు వంపద వెలయ ఇందు. 1. 70

**వేల్పుఁజెట్టు** వి (వేల్పు[1]+చెట్టు,) కల్ప వృక్షము, సురతరువు

వ వేల్పుఁజెట్టు పూవండల దండితనంబున . ఉ రా 4 163

**వేల్పుఁ(లుపుఁ)దపసి** వి (వేల్పు[1] + తపసి ) దేవ ఋషి, నారదముని.

గీ. వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి, పల్కె రా చందమామ అప్పగిదిఁ బంప, కడ మెలంగఁగ నద్దరి గట్టుమీఁద, నుండి కన్గొని ప్రొద్దు కుట్టుండు దలఁకి అచ్చ రా కిష్కిం. 2.

**వేల్పుఁ(లుపుఁ)దెరవు** వి. (వేలుపు[1] + తెరవు ) సురవర్త్మము, ఆకాశము

క. పొంగుచు వరదముపైఁ బోలఁతిం గూరిమి మునిచి వేల్పు తెరవునఁ బఱచెన్, బంగరు పిచ్చికఁ గొంచున్, నింగికి సాళువపుఁ బులుఁగు నెగయు తెఱఁగునన్ అచ్చ. రా. అర. 62.

**వేల్పుఁ(లుపుఁ)దెఱవ** వి (వేల్పు+తెఱవ ) దేవతా స్త్రీ

గీ కలికి చూపులఁ జుపటంబుగా నొనర్చి, తిల కమునఁ బూవులొక వేల్పుఁ దెఱవగో నె.. పి. శకు 2 138

**వేల్పుఁదొయ్యలి** వి (వేల్పు[1] + తొయ్యలి,) అప్సర స్త్రీ, అచ్చర

చ. .. పెన్నిధిగతిన్ బ్రతికిన్ బొడకట్టె వేల్పుఁ దొయ్యలి చిఱుసాన బట్టిన యనంగుని మోహాన బాణమో యనన్ మనుచ 6 31.

**వేల్పుఁబెద్ద** వి (వేల్పు+పెద్ద ) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు.

మ పురుషుం డంచుఁ బరేశ్వరుం డనుచు వేల్పుం బెద్ద యంచున్ ... ఉ రా. 1. 280

రగడ చిలువరాయఁడు ప్రొద్దు చూలియు జింక తాల్పును వేల్పుఁ బెద్దయు...అచ్చ.రా.యు.64.

**వేల్పుఁబెద్దన=వేల్పుఁబెద్ద** వి సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ.

క మనసున సిగ్గును వెఱపుం, బెనఁగొని నిండార వేల్పుఁ బెద్దన యపు డల్లన నేలమీఁద నొలికిన, తన శుక్లము వామపాద తలమునఁ బమ రెన్. జాహ్నవి. 1 165.

**వేల్పుకూఁటికుండ** వి (వేల్పు+కూఁడు+కుండ.) అమృత కలశము.

సీ కొని పోవు నావేల్పు కూఁటికుండ సువర్ణుఁడీ తేనె మావియుం జెట్టఁగెనేని...రా వి 3 88.

**వేల్పుగట్టు** వి (వేల్పు[1]+గట్టు,) మేరుపర్వతము.

ఆ అంత వేల్పుగట్టు వలవి మీఱఁగ నొక్కొ, దెసలఁ జూచు నిచ్చ దివుటనొక్కొ, విన్ను దాఁట నొక్కొ గన్నదిపొడవున, నిక్కుమంచు గొండఁ కెక్కె నతఁడు అచ్చ భా 2 26 పొ.

**వేల్పు(లుపు)గాణ** వి (వేల్పు+గాణ ) 1 దేవ గాయని, అప్సర స్త్రీ

వ వేల్పుగాణలు పాడు లక్ష్మి నారాయణుల కల్యాణంపుఁ బాటలన్ ... మనుచ 5. 71.

2. గంధర్వుఁడు.

చూ వేల్పుగాణ తూపు

వేల్పుఁగాణతూపు వి (వేల్పుగాణ+తూపు) గంధర్వాస్త్రము.

గీ మయుఁడు దబ్బరఁ మీఁఅసేమమునఁజేసి, యిడిన ముల్కిగడంక నీరేమతలల, తోడి వేలుపు నిమ్మినఁ దోవ వేల్పు, గాణతూపేసిదొంం దానిఁ గ్రమ్మరించె అచ్చ. రా. యు, 381.

వేల్పు(లుపు)గిడ్డి వి (వేల్పు¹+గిడ్డి) కామధేనువు

సీ. దొడ్డిఁ బెట్టిన వేల్పుగిడ్డి కాఁపు మనుచ 1. 66.

వేల్పు(లుపు)గుబ్బలి వి (వేల్పు¹+గుబ్బలి) మేరుపర్వతము.

ఉ ముంగు పసిండి తమ్మిజలు మొగ్గలమొగ్గర మావరించు మేల్, చింజెడు వేల్పుగుబ్బలి వజీరుని జీరు వధఃకరింపఁగాఁ, గ్రొందలిరాకు బాకు దొంకున్ దొడఁకించు భవంబు చెల్లరే, చందన గంధి చన్నుఁగవ చంద్రుఁడొ యింద్రుఁడొ యా యుపేంద్రుఁడో కృశకుం 2. 12.

వేల్పు(లుపు)గొంగ వి (వేలుప+గొంగ) దేవద్వేషి, రాక్షసుఁడు.

గీ. వేలుపగొంగయుఁ గడలేని వేడ్కతోడ, నవుడె తపదివి సేఁగి చెయ్యమున నింటి, చెంత పూఁదోఁటలోన నచ్చెలువ నునిచి, కఱకు రాకాసి కొమ్మలఁ గావుపెట్టె. అచ్చ రా అర 77.

వేల్పుజడదారి=వేలుపుజడదారి వి నారదుఁడు, సురమౌని.

గీ. వినుము కత వేలుపజడదారి విన్నచూలి, మేన రుల నట్టు పుట్టవు మేటితపసిఁ, గాంచి యిట్లను నంత నగ్గట్టు మీఁద దఁటి రాఁగవుల వలికి దాటి చనుచు అచ్చ రా అర 2.

వేల్పు(లుపు)టావు వి (వేలుప¹+ఆవు. కామధేనువు

సీ వేదాది విద్యలు విశ్రమించిన తావు విబుధకోటి... వేలుపటావు... రాజ చ. 8 7.

శా ప్యాన్ మోచి కొమాళ్లు నన్నఁగఁ దదీయ గ్రాంతి యెతో మనస్యోర్థ్వైకనిపింప లపట్టఁజెన్ సతాన బాహుళ్య మాంగల్యం

కొందియు వేలుపటావనఁగ నింకం బుత్రశోకంబు కౌసల్యా దేవికి నేఁపుత్రకుఁ దరించన్ శక్యమా యక్కటా చం. రా 4. 94

వేల్పు(లుపు)టూరు వి (వేలుప¹+ఊరు.) దేవపురి, అమరావతి.

ద్వి. ధారుణీ స్థలి సంపదలచేత వేలుపటూరు గేలించు కోడూరు నా వెలయు ... ద్వి పరమ 3. 168. పా.

వేల్పు(లుపు)టేనిక వి (వేలుప¹+ఏనిక.) ఐరావతము.

సీ. వేలుప టేనికలయ్యెఁ బోలప నేనుఁగులెల్లఁ గొండలన్నియు వెండి కొండలయ్యె .. అచ్చ. రా అయో. 20

వేల్పుటేఱు=వేలుపుటేఱు వి బొ (వేలుప¹+ఏఱు) దేవనది, ఆకాశగంగ.

మ కినుకం బుట్టిన యట్టి మౌని హృదయక్లేశంబు శాంతంబుగా, ముని శిష్య ప్రకరంబుతోడ గమనౌన్ముఖ్యంబునన్ ముచ్చటల్, తనియం జెప్పుచు వేలుపటేటి నికటస్థానంబు నందుండఁగాఁ, వనజాతాప్తుని మండలంబుదిగియె న్వారాశి దిక్సీమకున్ భీమ. 2 23

ద్వి శ్రమము దీరఁగ నిల్పి జననాథ తిలకుఁ, డటఁజని ముందట నా వేలుపటేటి, తటమున .. ద్వి మారిచ్చ ఉ 47 పం

వేల్పు(లుపు)టొడయఁడు వి (వేలుప¹+ఒడయఁడు) దేవేంద్రుఁడు

ఉ అత్తటి జోగి వేలుపటొడయండెద నాతని మెచ్చి కూర్మితో, నెత్తి కవుంగిలించుకొని హెచ్చుగ వేలుపులెల్ల సొంపు దల్పొత్తఁగఁ జేరి వ్రేలుముల నోరెపుఁ బాట్లగొనంగ గిత్తరా, శత్తడి హేఁడెదం దనియఁ దవ్వశజన్న మొసర్చి యంతటన్ అచ్చ. రా బాల. 128

వేల్పు(లుపు)డిగ్గియ వి (వేలుప¹+డిగ్గియ) సురదీర్ఘిక, గఁగానది.

క వేఁమి యగ్గి బొగల్దగు, వేలుపుడిగ్గియ మునింగి వెలువడు నమరీజాలము తిన్నని పెన్నెఱి, వాలుఁగురుల కగరు ధూపవైఖరి యగుచున్. కువల 2. 67.

వేల్పుడు వి (√వేల్చు) పూజ

గీ .. క్రూర మృగంబులఁ గాఱ్చిక ప్రముక్త నారాచములఁ గూల్చి భక్తితోడ, జనకునకు వేలుపు డొనరించి సకలలోక,సమ్మతము లగు కార్యముల్ నల్పుచుండ. అధ్యా బాల 12 పొ.

వేల్పుఁ(లుపు)దపసి వి (వేలుప¹+తపసి.) దేవ ఋషి, నారదముని

గీ వినుము వాల్మీకిఁ జూచి యవ్వేల్పుఁ దపసి, వత్కి రా చందమామ లప్పగిదిఁ బంప, కడ మెలంగఁగ నద్దరి గట్టుమీఁద నుండి కన్గొని ప్రొద్దు కుఱ్ఱండు దలఁకి అచ్చ రా కిష్కిం 2.

వేల్పు(లుపు)దొర వి. (వేల్పు¹ + దొర) దేవేంద్రుండు.

సీ. మిగులఁ గుపవనము పన్నగ లోకభర్తకు వేఱొక్క వెరిమావు వేల్పుదొరకు .. రామా 1 47.

గీ సూర నిభుఁడైన పింగలి సూరవిభుని, దొరయ. లోఁ డొరుఁడల వేలుపు దొరయ కాని . వభా. 1 26

వేల్పు(లుపు)దొరగౌరు వి (వేలుపదొర + గౌరు) ఐరావతము

చ కనఁదగు తెల్లమారికవుఁ గప్పుల నొప్పెడు చప్పరాలలో., దన పాదమైన నీకఁగని తాళక యేనుఁగటంచుఁ గొమ్ములన్, జెనకఁగ వచ్చి కోటవయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిన్, గనుఁగొని పాలువేలుప దొర గౌరతఁ డొదల మస్తరింపగన్ యయా 1 5

వేల్పు(లుపు)దొరమానికము వి. (వేలుపదొర+మానికము.)

గీ.. కోట, కొమ్మలం దాడు తెలగంటి కొమ్మలి దెదు, వేలుపదొరమానికములు నవ్వీటఁ దనరు నీలా. 1 31.

వేల్పు(లుపు)దొరవిల్లు వి ఔ. (వేలుపదొర+విల్లు) ఇంద్ర ధనుస్సు.

వ. కొంత వడికి మెల్లన వల్లుట తునకలగు వేలుప దొరవిల్లు నీ వెండికొండ తుదల బలువన్నె రత వంబుల...అచ్చ భా 2. 60 పొ

వేల్పు(లుపు)ప్రోయాలు వి. (వేలుప¹+ప్రోయాలు) దేవతా స్త్రీ, అచ్చర.

ఉ హా! సువర్ణ వేత్రకరు లంతకమున్న పరాకు దేవ నీ, పాలి కనంగ రాజ్యరమ భంగి వెలుంగుచు వచ్చె వేలుప ప్రోయాలు...పె కకుం. 1. 224

వేల్పు(లుపు)ప్రోలు వి. (వేలుప+ప్రోలు) స్వర్గము

ఆ అపుడు మునలి వేలుప¦ టతివయై తనతొంటి కతయు వచటనున్న కల్ల తపసి, తెఱఁగు వతని తోడ నెఱిఁగించి పసిఁడి తే,రెక్కి వేలుప ప్రోలి కేఁగె నంత అచ్చ రా యు. 418

వేల్పుఁ(లుపు)బడవాలు వి (వేలుప¹ + బడవాలు. కుమారస్వామి, దేవతల సేనానాయకుఁడు

గీ తపసి యిల్లాండ్ర చెలువంబు దల చి తలఁచి, మున్ను ముచ్చిచ్చును విరాలి గొన్న చోటు, కనుపపులు వేల్పుఁ బడవాలుఁ గన్నచోటు, హర్ష మునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన మనుచ. 2 9.

సీ అలవేలుపఁ బడవాలు నలరు పొందొగడాలు కాసిల్లు కెందమ్మి కేసరాలు...ఇందు 1 130

వేల్పు(లుపు)బాస వి (వేలుప¹+బాస.) దేవభాష సంస్కృతము

ఆ. పుట్టఁ బుట్టినట్టి దిట్టయు దీనిని, తొడమినట్టి పున్నెములగనియును, మొదలుగాఁగఁ గబ్బములు వేలుపబాసను, గూర్చినట్టి వారిఁగోరి తలఁతు. నీలా 1 8.

వేల్పు(లుపు)బువ్వ వి (వేలుప¹ + బువ్వ) చంద్రుఁడు, అమృతము

గీ భోగముల కండ యలవేలుప బువ్వదండ, పతితులకు కొండ పేదలపైఁడికుండ, తమము రేయెండ విబుధామృతంపుటుండ, కొండ మాత్రంబె తిమ్మనప్ఁ డుండుకొండ రా. వి. 1 31.

వేల్పు(లుపు)బోనము = వేల్పుల బోనము వి (వేలుప¹+బోనము) 1 అమృతము

సీ నెలదాలుప నోవళఁబులకునై వేలుపబోనమ్ము దెచ్చిన వారు వమ్ముదాఁడు...రా. వి. 1. 71.

2 చంద్రుఁడు.

చ నెల ..జా,బిలి చలివెల్గు చందురుఁడు వెన్నెల రాయఁడు చందమామ రే,పొలఁతి మగండు వేలుపుల బోనము...చంద్రుఁడగు మహేశ్వరా. ఆం. భా 1 77

**వేల్పు(లుపు) మన్నీఁడు** వి (వేలుపు$^{1}$+మన్నీఁడు.) దేవేంద్రుఁడు.

గీ. పగలు రేలును పౌలస్త్య భటులొవర్చు, దుడుకుచే వేలుపు మన్నీని కొడుకుఁ గుట్టు, కక్కట క్కట పూవ శక్యంబె వజ్రధరున కిటువంటి యంబేద దొంతనంబు చం రా, 2 25.

సీ. వేలుపు మన్నీనికై వెఱచి పెర్వాదలలోనొదుగు కాటుక కొండ కొదమలనఁగ . యయా 2 13

ఇట్లే వేలుపు మన్నెవాఁడు

వ తలంపు ఱామిన్న గద్దియపై నెలకొన్న వేలుపు మన్నె వాని చెన్నున నున్నతిఁ గని... ఉ రా 6. 159.

**వేల్పు(లుపు)మల** వి (వేలుపు$^{1}$+మల) మేరు పర్వతము.

చ. కదలి దశాననుఁడు లయకాల ఘనాఘన గర్జిత భ్రమ, ప్రద భట సింహ గర్జనలపార గుహా కుహరంబులానిసన్, బదులుగ మ్రోయు వేలుపుమల పజ్జకుఁబోయెఁ దదీయ పాదముల్, చిదురుపలై ధరం గలయఁ జేయుచు సేనలు గొల్వ నుద్ధతిన్. ఉ రా 4 256

**వేల్పుమల వింటిదేవర** వి శివుఁడు, మేరు ధన్వుఁడు.

గీ ఎపుడుఁ బాయకయున్న మిన్నేఱు దనరఁ, బేర్మి గొండల ఱేఁడను పేరుమెఱయ, వేలుపు మల వింటి దేవర పొలుపు దాల్చి, జన్నపుం దీని విడిమట్టు చలువగట్టు యయా 2 36.

**వేల్పు(లుపు)మిన్న** వి (వేలుపు$^{1}$ + మిన్న) సురశ్రేష్ఠుఁడు, బ్రహ్మదేవుఁడు

సీ సృష్టికర్తనటంచుఁ జెలఁగి నిన్ సృజియించి విడిచెనో మీ యన్న వేలుపు మిన్న .. ఇందు. 4 49.

**వేల్పు(లుపు)రాతోఁట** వి (వేలుపు$^{1}$ + రాచ + తోఁట) నందనవనము

సీ విహరించు నొకపూఁట వేలుపురాతోఁటలఁ బొదలు గొజ్జఁగ పూవుఁ బొదలయందు.. ఉ రా 8. 100.

**వేల్పు(లుపు)రాయఁడు** వి (వేల్పు$^{1}$+రాయఁడు) దేవేంద్రుఁడు

సీ పౌరుషంబున మించి పౌలోమి నెదనుంచి యలరెడు వేలుపురాయని విలాసము . ఉ. రా 6 159

**వేల్పు(లుపు)రారాణి** వి (వేలుపు+రాచ+రాణి) శచీదేవి, ఇంద్రాణి

గీ వేలుపురారాణి సుతునకు వేడ్కసేయ, సంతరించిన వజ్ర పంజరమునందుఁ, దేఱిరిల్లెడు శారికా రాజమనఁగ, జంద్రబింబాంతరాళ లాంఛనము దనరె. భాను 3 17

**వేల్పు(లుపు)రాఱాలు** వి (వేలుపు+రాచ+ఱాయి.) ఇంద్రనీలము

ఉ. వేల్పు,రాఱాల జయించు వేనలితెఱంగు హారంగపురయ్య ... రసిక 3 55.

**వేల్పుల గమికాఁడు** వి (వేలుపులు+గమికాఁడు) ఇంద్రుఁడు

ద్వి నీరధి సురనర నికరశైలాధి, ధారిణియై నయాధారిణి వగచి, కనలి వేల్పులగమికాని చెంగటికిఁ, జని యింద్రునిఁ జూచి వెచ్చని యూర్పుతోడ అ. మ క 1. 11 పా 3 పం.

**వేల్పులదొర** వి (వేలుపులు+దొర) ఇంద్రుఁడు

చూ వేల్పుల దొరవాలు

**వేల్పుల దొరవాలు** వి. (వేల్పులదొర+వాలు.) వజ్రాయుధము

సీ వెన్నుని యన్నన్న వేలుపుల దొరవాలు వఱపది మోముల నలరుసామి

గీ..... గెల్పు.. యశము రామ. 218

**వేల్పుల బువ్వ** వి (వేలుపుల+బువ్వ.) 1 అమృతము

సీ బొడ్డున వెన్నుని బొడ్డు బిడ్డని మెప్పు వలన వేల్పుల బువ్వ గలిగియుండు . అచ్చ. రా యు 553

2. చంద్రుఁడు

మ అలరుం బున్నమరేలు మేల్ హాయలుచే
నవ్వీటిగాటంపు క్రొన్నెలజా మేకల నాడు
చేడియలు పూన్కిన్ జెంతఁ గనవట్టు వేలుపుల
బువ్వం దెలి నిల్పుటద్దమని కేలుందమ్ములం
బట్ట నిమ్ములఁ గంధందెను గాకయందుఁ
గలదే మున్నిట్టియున్ మట్టియున్ అచ్చ రా
బాల 35

**వేల్పుల బోనము** వి (వేలుపులు + బోనము.) అమృతము.

సీ విన్న కేళాకూళి వేలుపులబోనము తడవుల
నిడుపడు పుడుకు దొడుకు . . అచ్చ రా యు
692

**వేల్పుల వెజ్జు** వి (వేలుపు[1]లు + వెజ్జు) దేవవైద్యుఁడు
అశ్వినీదేవతలలో నొకఁడు.

సీ సుఖ భోక్తృల యజీర్తి మానపగా వేలుపల
వెజ్జు మందులసారె వెదకసాగె . దశా 6 63

**వేల్పులేగిద్రా** వి. (వేలుపు + లేఁత + గిడ్డి + రా) కామధేను శ్రేష్ఠము

శా. దొద్రా యూ కులమంచు నెంచఁ దగు సాధు
స్తుత్య వంశంబునం, బొద్రత్నంబునఁ దేజరిల్లు
జననంబుం బొందినన్ వేలుప లే, గిద్రా పోష్య
జన్యాలి కిమెయను సత్కీర్తిం బ్రదీపించినన్,
గొద్రాలైన వధూటి జన్మమది పేరోక్క
నిషపుం బిమ్మహిన్ వైజ 1 63

**వేల్పువెలచాన** వి (వేలుప + వెలచాన) అప్సర స్త్రీ.
దేవవేశ్య.

ఉ చక్కని దంచు వేలుప వెలచావల కన్నను
నాటఁబాట బెంపెక్కె నటంచు . ఉ.
హరిశ్చ 4. 117.

**వేల్పువెలఁది** వి (వేలుప + వెలఁది) దేవతా స్త్రీ.
అప్సర స్త్రీ

ఉ వీనుల కంటి తొయ్యలియొ వేలుపవెలందియొ
జక్కమోర లేఁ, జానయొ పక్కిరా చెలియొ
జక్కుల వంగడపుం బడంతియో ... అచ్చ రా.
బాల 144

**వేల్పువేల్పు** వి (వేలుప + వేలుప) దేవదేవుఁడు.

ద్వి. భువన మోహనమూర్తిఁ బుండరీకాక్షు, నా
వేలుపవేలుప ఔపావరపక మఱియు, సేవించి...
ద్వి పరమ 2 125.

**వేల్పు(ల)సాని = వేలుపుసాని** వి (వేల్పులు + సాని)
1 అప్సర స్త్రీ. రంభ

క .. . సంభసేమున వచ్చ వేలుపసానింగాంచెన్,
అ రా 4 187.

2 లోస్యము చెప్పు స్త్రీ. సోదె చెప్పు నాఁడుది.

చ మన చరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పుల
సాని చెప్పినట్ల నిజముగాఁగ... కళా 3 185

**వేల్మి = వేలిమి** వి (√ వేల్చు.) హోమము.

గీ . . సతియు వాలర్కశాక మంచితము వండ,
నిల్మ కుందున కర్పించి వేల్మిదీర్చి . . ఆము
4 190

ద్వి చదువుచు సంధ్యయు జపముచు వేల్మి, మొదలు
ముట్టఁగఁ బోయి మోటనై బడలి . ద్వి.
హరిశ్చ 125?

క (శ్రీ) కాళేశ్వరు సన్నిధి, నేకాంతము వేల్మి
యాగియు శ్రాద్ధం, బేకైకము ..భీమ 3 118

**వేల్మిబొట్టు = వేలిమిబొట్టు** వి (వేల్మి + బొట్టు)
హోమకుండము నందలి భస్మముతోఁ బెట్టికొనిన
బొట్టు, రక్ష

మ గొనబై దండములందుఁ గ్రొం బసుపు నిగ్గుల్
దేఱు కాపీన బంధనము లున్మంజులు వేల్మి
బొట్లుఁ గడు నందంబొందఁ గృష్ణా జినంబునఁ
గీలించిన జన్నిదంబులు మనోమోదంబు సంధిం
పఁగా, ఘనతం బొల్చు సమిత్కుశా హరణ
రింఖత్ బ్రహ్మచారోఘముల్ విప్ర 1. 70.

**వేల్లనము** సం వి అ న 1 కంపము, వడఁకుట,
కదలుట 2 (గుఱ్ఱములు మొదలగునవి భూమిపై)
దొర్లుట, లుఠనము.

**వేల్లము** సం వి అ పుం. 1. చలనము, కదలిక.
2 కంపము, వణకు 3 వాయువిళంగము.

**వేల్లహలుఁడు** సం వి అ పుం చెడునడత గలవాఁడు,
పోకిరి

**వేల్లి** సం వి ఇ. స్త్రీ పల్లి, తీఁగ, లత

**వేల్లితనము** సం విశ. (అ ఆ. అ.) 1. వడఁకునది,
కంపించునది 2 వక్రము, వంకరయైనది

వి అ న 1 గమనము, చలనము, కదలిక
2 కంపము, వణఁకు.

వేపు¹ = వేగు¹ అ. క్రి. తెల్లవాఱు, ప్రభాతమగు.
క. వేపిన యంతకు నలువురు, జావంకంబులనుఁ
బోలె సైన్యము హాహా, కావములతోడఁ
జూడఁగ, దీవన వడయంగఁ దూర్పు తెల తెల
వాఱెన్ ఉ హరి. 8 84
క. కావున నీ వీ రాతిరి, వేవెడు నీలోనఁబోయి
వెస నౌషధముల్, దేవఁయు. భా రా యు.
1094.
ఉ వేవినమేడపై నలభి వేడిరఁ జంట వహించి
విప్పఁగాఁ, బూవులు.. అము 1. 69
వేపు² = వేగు² వి రాజ్య సమాచారము.
సీ జడనిధి బంధించి కడచి వత్తురు మూర్తురి వార్త
యరయంగ వేపులేద, రాజు లేమటియున్న
రాజనీతిస్థితి సచివు లేమటియుండు టుచిత
మగునే ..భా రా యు 291.
వేవుజాము వి (వేపు¹+జాము.) వేకువజాము, వేగు
జాము, తెల్లవాఱు జాము
ద్వి వేవుజామున నేగి వేఱొక్క రేవు, గావించి
యుదుకుచు ఘట్టనల్ సేసి...బస పు 4. 14
పం.
వేవుర = వేగురు న బ. (వేయి శబ్దమునకు మహన్మ
హాత్యర్థక బహువచన రూపము) వేయిమంది,
సహస్ర సంఖ్యగల వారు, అనేకులు, పెక్కండ్రు
ఉ వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పఁ
బాయసా, హారము భక్తి బెట్టి... భార సభా
1 14.
ఉ వేవురు చంద్రులోలిఁ బదివేవురు సూర్యులు లక్ష
పావకుల్, ప్రోవయి యున్న యట్టిదగు భూరి
తరం బగు తేజము...హరి ఉ. 9. 197
క ఆవేళం బదునాలుగు, వేవురు గొలుపంగ వేఁట
వెంబడి నొక ఖిల్లావని పతి వచ్చుచు.. వరాహ
8 67
చ. విరటుఁడు చూచుచుండ నిను వేవుర ముందట
నట్లు ద్రోవ. భార విరా. 2 257.
క వేవురఁదోలెడు వాని మహావీర్య గుణాఢ్యు
నొక్క యాత్మజుఁ బడయం,గా వలతునవేత
గుణుల్, వేవురు సుతులయ్యునొందు విఫలమ
కాదే. భార ఆర 2. 350.
చ....త,న్వరునిగఁ గోరువారి లలనామణులు బని
యారు వేవుం౦, బరిణయమయ్యె. పారి
1. 37
వేవెలుఁగు వి (వే+వెలుఁగు) వేయి కిరణములు
గలవాఁడు, సహస్రాంశువు, సూర్యుఁడు
చ తిరముగ వింట వేవెలుఁగు దేవునిఁ గన్గొని వట్టి
యాస నిబ్బరముగ నేఁగి చేఁగడమిఁ ఒట్టిన
లావరి నేల చెల్వ కూతురి చలువంపు తేనియెద
తుందుడు కెల్లను దీర్చినట్టి యా,కరువలివట్టి
నాడుమదిఁ గల్గిన కోరికలెల్ల నీవుతన్ బహు.
1. 8
వేవెలుంగుల దొర వి (వే+వెలుఁగులు+దొర)
సహస్రాంశువు, సూర్యుఁడు
గీ వే వెలుంగుల దొర జోడు రేవెలుంగు ..
మనుచ 1 18.
ఇట్లే వేవెలుఁగుల వేల్పు.
క. ఆవేళ దివిజ కానన, దావాగ్ని నభ స్సరోభి
ధాముఁడు రక్షో, దేవుఁడొక మహారథమున,
వేవెలుఁగుల వేల్పు కంటె వెలుఁగుచు నుండెన్.
కకు 2. 94.
వేవే క్రి విశ వే యను దాని యామ్రేడిత రూపము.
మిక్కిలి శీఘ్రముగా, అతి శీఘ్రముగా.
క ఆ యస్త్రము వలన మహా, సాయకములు శత
సహస్ర సంఖ్యంబులు వే,వే యుప్పతిల్లి పొది
వెన్, త్రైయంబక మగు రథం బుదగ్రస్ఫూ
ర్తిన్. హరి ఉ 8 187
క ఆ వసుధాధిప నందను, వేవే దోడ్తెమ్ము
మాధవీ గృహమునకున్. దశకు 7. 74
క కావేరి దరులు గట్టఁగ, వేవే పల్లవుండు దనదు
వెట్టికి రామిన్,దావాని నుదుటి కనువోం,గా
వడిఁ గరికాల విభుఁడు గాలందుడిచెన్. ద. శా.
658, 1146. క.
వేవేగ వి (వేగ+వేగ) అతిత్వర, అతివేగము
క వడముడి యరిగిన తెరు వేర్పడఁ గనివేవేగ
రథము వఱపెం గదియన్ ... భార. భీష్మ.
2. 369.
గీ. పిలువఁ బంపుము వేవేగఁ బెండ్లికొడుకు ...
సైమ. 6. 36.

శా...తమానాయకుల్, వేవేగ న్వినయంబుతోడ నిజతన్వీ మౌళి రత్నాది నానా వస్తువ్రజ మంపి నన్ .కళా. 6 116

వేవేలు న బ (వే+వేయి) పెక్కువేలు, వేనవేలు, అనేకములు

గీ వేదములు నాల్గు వేవేల నిధులఁ బొగడ... నై ష. 8 129.

గీ వలపు టంగడివీథు లేరవఱచి కొంచె, పాటిన డగని నెక్కి యా పాలిమెల్ల, విడియ నియ మించి తిరిగి వేవేలు దివ్వటీల వెలుఁగున సంగీత మేల మమర, కవల 2. 86

శా. కావేరినది మున్నుగా నదుల సంఖ్యల్ విశ్వ విశ్వంభరన్, వేవే లెవ్వరు గ్రుంకినం దలఁచి నన్, విన్నన్ మహాపాతక, గ్రావవ్రాతము వజ్రపాత హతి భగ్నంబౌ గతిన్ బోవుటల్, శ్రీవిష్ణుస్థల వాసనేవనగదా ... శ్రీరం మా 2 6.

వేశంతము నం. వి అ పుం 1 చిన్న సరస్సు, పల్వ లము, నీటిగుంట 2 అగ్ని

వేశదానము నం వి. అ పుం ప్రొద్దు తిరుగుడు పువ్వు

వేశనము నం వి అ. న 1 ప్రవేశించుట, ప్రవేశము. 2 ఇల్లు.

వేశనారి నం వి ఈ స్త్రీ. వేశ్య

వేశము నం వి. అ పుం 1 ప్రవేశము. చొచ్చుట. 2 మార్గము. 3 గృహము, ఇల్లు. 4 వేశ్యా గృహము. 5 వేషము. 6. వస్త్రభూషణా దులచే రూపాంతరము నొందుట, మాఱువేషము 7 కూలి, జీతము

వేశ(శ్వ)రము నం వి అ పుం. వేసడము, కంచర గాడిద

వేశ(స)వాసము నం వి అ పుం వేశ్యా నివాసము, వేశ్యలుండు తావు.

వేశ్మకర్మము నం వి చ్. న ఇల్లుకట్టుట, గృహ నిర్మాణము

వేశ్మభువి నం వి ఈ స్త్రీ నివేశన స్థలము, ఇల్లు కట్టఁదగిన ప్రదేశము.

వేశ్మము నం. వి న్. న ఇల్లు, గృహము, నివాస స్థానము.

వేశ్య నం వి ఆ స్త్రీ భోగముది, పణ్యాంగన

వేశ్యము నం వి అ న వేశ్యాగృహము, వేశ్యా నివాసము

వేశ్యాచార్యుఁడు నం వి అ పుం. 1 వేశ్యలగురువు 2. కుంటెన కాఁడు

వేశ్యాపణము నం వి అ పుం. వేశ్యకిచ్చెడి సొమ్ము.

వేశ్యాశ్రయము నం వి. అ పుం వేశ్యలవాడ, భోగమువారి వీధి

వేషణము నం వి అ. న ప్యాపీన పఱచుకొనుట, భుక్త పఱచుకొనుట

పుం 1. కసివెంద (వృ. వి.) 2 చేఁతిపొట్ల. (వృ వి) 3. ధాన్యము. (వృ వి.)

వేష(శ)ధారి నం విజ (న్ త్. న్.) మాఱు వేషమువాఁడు,

వి న్ పుం 1. వంచకుఁడు, కపట సన్యాసి. 2 నటుఁడు, నాటకమున వేషము వేయువాఁడు

వేషము నం. వి. అ పుం 1. వస్త్రభూషణాద్యలం కారము.

గీ. తగిన వేషంబు దనుఁదాన పొగడు కొనమి, నొచ్చియును గీడు వలుకమి యిచ్చి వగవ, కునికి దనకెంత వడవక యున్నఁ బథము, ధప్పు కుండుట వడవడి కొప్పు సేయు శార ఉదో్య. 2. 45

2 వస్త్ర భూషణాదుల చేత నయిన యొప్పిదము, చక్కఁదనము 3. వస్త్రాలంకారాదులచే మాఱు రూపము నొందుట 4. వేశ్యాశ్రయము, భోగమువారి వీథి.

వేష్టకము నం వి అ పుం 1 ఆవరణము, కంచె, వెలుగు. 2. గుమ్మడికాయ, కూష్మాండము.

న. 1 తలపాగ, శిరోవేష్టనము 2 ఉత్తరీయము. పైబట్ట 3 చెట్టుబంక 4 కర్పూర తైలము

వేష్టపకము నం వి. అ పుం రతిబంధ విశేషము.

వేష్టనము నం వి. అ న 1 ఆవరించుట, వలు వైపులఁ జుట్టుకొనుట 2. చుట్టుకొనుట, చుట్టఁ బెట్టుకొనుట. 3 కప్పు, మూఁత 4. తలపాగ శిరోవేష్టనము 5. ఆవరణము, కంచె, వెలుగు 6 ఒడ్డాణము, నడికట్టు 7. బంధము, కట్టు 8 కర్ణశష్కులి, చెవి.9 గుగ్గులు వృక్షము, గుగ్గిలము. 10 గ్రహించుట, పట్టుకొనుట.

**వేష్టము**¹ వి దేగలలో నొకజాతి
సీ. వలచేత మణిముద్రికల కాంతి దిశలందు
మొనయ వేష్టవు దేగ ముష్టిఁబట్టి . ప్రబంధ
283
**వేష్టము**² సం వి. అ పుం 1 ఆవరణము వేయుట
2. ఆవరణము, కంచె. 3 తలపాగ, శిరోవేష్ట
నము 4. చెట్టుబంక 5 కర్పూర తైలము
**వేష్టసారము** సం వి అ పుం కర్పూరతైలము
**వేష్టవంశము** సం వి అ పుం ఒకజాతి వెదురు
**వేష్టించు** సం స క్రి 1 చుట్టుకొను, చుట్టవాఱు,
వేడించు
క. మునులును వేష్టింప భూతములు విను
తింపన్. భార. శాం. 4 452
గీ ఆ విధాత మునీంద్రులు దేవతలును. దన్ను
వేష్టింప వచ్చె సత్వరముగాఁగ . భార శాం.
6 444.
2. పరివేష్టించు, చుట్టివచ్చు
మ ... విషధరుల్ వేష్టింపఁ గాలూఁదవో ...
వసుచ. 8 30
**వేష్టితము** సం విశ (అ అ అ) 1 చుట్టు వాఱు
కొనఁ బడినది ఆవరింపఁ బడినది. 2. మూయఁ
బడినది 3 అడ్డఁబడినది, అడ్డుపెట్టఁబడినది.
4. ముట్టడింపఁ బడినది
వి అ న చుట్టుముట్టుట, ఆవరించుట
**వేష్టువ** వి (సం. వేష్టనం) ధోవతి
సీ. నీ పుట్టగోచియు నీ కావివేష్టువ ల్వార
కాంతకుఁ బట్టు చీరె లౌనె వై జ 108.
సీ. పెన్నులి త్రాటఁ గీల్కొన్న కౌపీనంబు విత
తంబు నీర్కావి వేష్టువలును . వై జ. 2 5.
**వేష్ప(ష్మ)ము** సం వి. అ పుం జలము, నీరు.
**వేసఁగి**=వేసవి వి (సం వైశాఖః) 1 ఉష్ణ
కాలము, గ్రీష్మర్తువు
ఉ వేసఁగి వెట్టఁ గ్రాఁగి పృథివీతల మంతయు
వేఁడి మంగలం,బై సెకలీనఁ బ్రాణి వివ
హంబులు లాజలు వోలెఁ బ్రేలఁగా ... వై జ.
1. 99
**వేసగాఁడు** విశ (వేసము+కాఁడు. అన్యుల వేష
ములను ధరించువాఁడు (ప్రా.)
స్త్రీలు మున్నగువారి వేషములు వేయువాఁడు
(శ. ర)
**వేసట** వి (√వేసరు) శ్రమము, అలయిక, అలసట.
ఉ వేసటలేక భీమ పృథివీపతి సందడ యాన
నాంబుజో,ల్లాస విరక్తి ముద్ర పదిలంబుగఁ
గన్గొని ... నైష 5 163
క ఈ సరణి ధరణి పతియు వి,లాసవతీమణులు
బహుకళా నిపుణతలన్, వేసటలేక లతాంత
శ,రాసన సుఖవార్ధి నోలలాడుచు నుండన్.
వరాహ. 4 66.
క. ఇటు లెండకు వానకు న,క్కట తరమగు చలికి
వెఱక కంపింపక వే,సటఁ బడక కుంభకర్ణుఁడు,
పటునిష్ఠ ఘటించెఁ దపము పదివేలేడుల్ ఉ.
రా 2. 162.
క. అలపున్ సొలుపున్ వేసట, తలఁపున్ జన్మానల
నలుపు తను మధ్యమునన్, బలుపున్ మై తెలు
పున్ జెలి, పొలుపున్ గాంచి గుసగుసలఁ
బోవుచు గాంతల్. ఉ. హరిశ్చ. 2 92 పం
**వేసటపడు** అ క్రి. (వేసట+పడు) శ్రమమునొందు,
అలయికఁ జెందు.
చ ... వమ్ము మన్నుటకు గురుండ వీవెయని
చొచ్చితి నీ యిలుగాన నింక వే,సట పడనీక నా
కనులు చల్లన నిన్ గనఁజేయు మ్రొక్కెదన్.
చెన్నబ. 371.
**వేసరము**¹ వి శ్యేనవిశేషము, ఒకజాతి డేగ
గీ మృగయు లంతటఁ దెచ్చిరి లడుగు గిడ్డు, జాలె
జలకట్టె కణుజు వేసరము బైరి, కురుజు వారిణ
యను డేగ కొలము సాళు, వముల . పి.
శకుం. 1. 110.
క కఱకు టంగ్రుల నిఱికించి గజ్జె గదలఁ, గఱికి
రెఱిసెఱి కోలెమ్ముకయును విఱుగ, విఱిచె
వఁడిగైజు నొక పెద్ద వేసరంబు.. మనుచ.4 58.
క బలువైన వేసరంబులు. జలకట్టెలు నోరణ
ములు సాళ్వంబులు గి,డ్డులు మొదలుగఁగల విడి
వేఁ,టల పులుగులు పదనుతో మిటారింపంగన్.
యయా. 1 40
**వేసరము**² వి. (సం వేసరః.) కంచరగాడిద, అశ్వ
తరము.

ఆ. హారుల వేసడములఁ గరులను సెక్కి ... భాగ 10. ఉ. 677.

సీ. బలు వేసడములపైఁ బండ్లపైఁ బ్రబలోష్ట్ర పంక్తిపై ముందుగా బరువులేఁగ .. ఉ. రా. 8 186

విశ సంకరజాతిది.

గీ. ఉవిద యధరామృతము గ్రోలుచున్న వాఁడు, కావ విఘ్నంబుగా మోసెఁ గావజాతి, జాతి చండాలమైన వేసడపుఁ గోడి...క్రీడా 1 59.

ఉ. కత్తులతిత్తిఁ దెమ్మనివఁ గావక నాకిది యొంటి కత్తి నీ,వి త్తతి నేలయిచ్చితిది యేమి వరాకువ మున్నదానవో, తొత్తుల తొత్త వేసడము దూల పిసాచి యటంచు ... నా. పంచ 1. 100.

**వేస్డము** వి. ఒకజాతి డేగ.

గీ. వేస్డమును దళుకాదిగ వేలవేలు, మెప్పు డేగల జత గూర్చుకుండుటయును ... ప్రబంధ 191.

చూ. తళుకు² (సూ ని.)

**వేసదారి** వి (సం వేషధారి) మాయలమారి.

గీ ఓసి పాపాత్మురాల నీ వేసదారి, గాయకపు ముద్దులెల్ల నాకాశవాణి, తెలుప వివవచ్చి ... సారం. 3. 204.

**వేసమన్నీఁడు** వి. కొండజాతులలో ఒక తెగవాఁడు.

సీ. వేసమన్నీఁడ నీవెకాన వెరఁజుము గై తసీవా జాడ గవఁగఁ జూవు ... ప్రబంధ 193.

**వేసము** వి. (సం. వేషః త వేసవు) 1. వేషము

సీ. కొంకిలికి వేసంపు గూని మూఁపుల మీఁద మూఁడు పంగల యూఁతె మోపినాఁడు ... మనుచ 4. 73.

సీ సతకాప వాల్దంట కతలానిపాటు వేసముగొన్న బోయ మాజాతిపెద్ద .. ప్రబంధ. 160

క చేసిన నాతఁడు తొల్లిఁటి, దోసంబులఁ కాసి మొగిలు త్రోవను జేశే, వేసంబున నరుగుచు రా,కాముల దొర సన్నదారి క్రన్నవఁ దెలి పెన్ అచ్చ రా. అర. 119.

2. వటనము, లేనిసిగు మొ అభినయించుట.

క వేసాలఁ బోకు రవీన్ద్ర, పూనజ్జుకుఁ బ్రొద్దు పోయెఁ బలియుట చాలున్, వాసవవందన కుసుమ శ,రాసన కేళీ కలా విహారంబులకున్ హార 7 158

సీ . . ఓసి లేవే మల్లి వేసాలు వేయకు మగవార లెఱుఁగని మర్మ మెద్ది ... శుక 2. 422

**వేసరము** సం వి అ పుం కంచరగాడిద, అశ్వతరము. (శ ర)

**వేసరి** విశ (√వేసరు) శ్రమపెట్టువాఁడు, అలయించు వాఁడు.

ఉ పున్నమ వన్నె శంఖు తలపువ్వు ముకుందుని చూపు దట్టపు, న్వెన్నెల దుంప జక్కవల వేసరి చీకటి మూఁకవిస్ఫు వా,రాన్నిధి యుబ్బు తామరల రాయిడి వేల్పుల పంట మింటిపైఁ, దిన్నని పూర్వ చంద్రికలు దిక్కులకు న్వెదజల్లు చుండఁగన్ వి పు 7. 274

**వేసరించు** స క్రి (√వేసరు.) వేసరఁజేయు, విసిగించు, శ్రమ కలిగించు.

ఉ. హోము హిరణ్య దానములఁ బుచ్చుకొనంగ ధనంబు లేమియుం, దేము న వంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా ... భాగ. 1.463.

ద్వి. తనయుఁడ వలదంచుఁ దగు బుద్ధిచెప్ప, వెనుకఁ బిల్లలు నిట్లు వేసరించుటయు . రం. రా. ఉ 67. పా 7. పం.

**వేసరిల్లు(లు)** అ క్రి (√వేసరు) 1 విసుగుకొను.

గీ తపుదేల విరాం మతండె యితఁడు, విడువ కేవేళఁ బవళించి వేసరిల్లి, యుబును పోకల వనవీథి నబలఁ గూడి, మెలఁగు చున్నాఁడు శ్రీరంగ నిలయవాసి. శ్రీరం మా 5 66.

2. శ్రమపడు

గీ. అంధకారంబు గాఢ మోహాంధకార మొక్క మొగి వెలిలోఁ గ్రమ్మి పిక్కటిలఁగ, రేవుదప్పి చరించెడి నావ కరణి, వీడు కలయంగఁ దిరుగుచు వేసరిలఁగ. చెన్న 2 292.

3 చింతించు.

గీ అనుచుఁ దేటపడిన యా వ్రాఁతఁ గనుఁగొని, వ్రాఁత యిట్టులయ్యె వసుధలోన, నమ్మఁగూడ దెంత నమ్మినవారల, మోనమయ్యె ననుచు వేసరిలుచు కృష్ణ 3. 109

**వేసరు = వేసారు** అ. క్రి (క బేసఱు) 1. విసుగుఁ జెందు.

గీ ఉత్తమ క్షత్రియులనెల్ల నుగ్రవృత్తి, నేఁడు పదినాళు లేని నా నిశిత శర చయములఁ గూల్చితి వేసరి నట్టులయ్యె, మేనితోడి పొత్తింకిట మానుటొప్పు. భార. భీష్మ. 3 364.

(కొందఱు దీనిని శకటరేఫముతో ప్రయోగించిరి వా. రా 1. 13.)

చ హరి నరయన్ గురుం డనుప నత్తఱి సాగరులుర్విఁ ద్రోసి వేసరి ధరఁ ద్రవ్వి త్రవ్వి బలి సద్మగులై హరిబుద్ధి దక్కి చిక్కెర ముని ముచ్చటంచు గమకింపులచేఁ గపిలుం గెరల్చి తద్గురుతర కోపదీపమునకున్ శలభాకృతిఁ జెంది రందఱున్. చం. రా 3 14.

క కలకిది నీరసమని వేసఱ కల్లన వినుఁడు తుద రసాయనమగుఁ దాఁ, జెఱకుఁ దుదనుండి నమలిన, తెలుఁగున మదికింపుఁ దనుపుఁ దీపున్ జూపున్ వా రా 1 13

2. శ్రమపడు.

క సరస కవి విట విదూషక, పరిహాసక గాయకాది పరిజనములు వేసరుట వయి మేలుదూఁకెడు, తురగము నడదూఁగఁ గాంతి దొలుఁకాడంగన్ నిర్వ 7. 25

గీ. సోయగపుఁ జిత్రరూపంబుఁ జూచుచోట, వేసరు విలోచనంబులు విస్కృతదైత్య, లక్ష్మీక్షించుటలు మొక్కలంపు గెలుపు, గైకొనియె సత్యభామ సంగ్రామ సీమ ఉ హరి 1. 181.

ఉ. ... పరమేశ్వర నన్నలయింపఁ బూని యే, దిక్కున డాగితో యడవిఁ ద్రిమ్మర వేసరి నాఁడ నాఁకటన్, జిక్కితి దప్పి స్రుక్కితిని నేనొక పల్కఁ కనైనఁ బల్కవే చెన్న. 3 69

3. నొచ్చు, బాధపడు.

క వేసవి వేఁడి సహింపక, వేసరు జీవులకు నెల్ల విశ్రాంతి కరం, (శ్రీ) సంపాదన కరమై, యాసన్నం బయ్యె నంబుదాగమ మంతన్. విక్ర 4 26

సీ. విరతిఁగ సోఁకి వేసరు బాలయొట్టులి కాఱు పూఁ బొదరిండ్లు దూఱనోపె ... రసిక 4 44

వ ... కుక్షింభరిత్వమున క్షుత్క్షాములై తిరిగి తిరిగి వేసరి యోసరిలిన దాసరిగుంపు ... ఆము. 4. 35.

4 చింతిల్లు, విచారము నొందు

క మీ సేగులెల్ల నచ్చెద, వేసరకుఁడు మీరు లేక వేగునె మాకున్, జేసెన్ జేయఁడు బాలకుఁడా సురవుం బసులు నిజము లనియెదరు బలే హరి వు 5. 230.

క. ఈ సామర్థ్యము నీకర, వీసంబును లేదు మగుడి వెసఁజను మనినన్, వేసరిన భంగి భోజుం, డా సింహాసన ముడిగి గృహంబున కరిగెన్. ద్వా. 10 29

సీ. వేసరు నడఁబాఱు లాపామిఁ గన్గొని యొడయఁడ వినుమొక యడవిలోన ... అచ్చ. రా. బాల. 54

**వేసవి = వేసఁగి** వి గ్రీష్మర్తువు, ఎండకాలము

చ అవియని గండశైలమన నంఘ్రుల తోడన యొండకున్న భూ, భవమన నింకి బీఁట గిలఁ బాఱని యేఱన మస్తకం బోగిన్, బవులని మార్గి సంఘమనఁ బట్టదు లోకములోన నిట్టి వేసవి గలదయ్యె నా నఖిల సాధ్వసమయ్యె నిదాఘ ముగ్రమై కు. సం. 6 794

క. వేసవియందును సులభము, ఘాసము గోవులకు .. హరి వు 6. 28

క వేసవివేఁడి సహింపక, వేసరు జీవులకునెల్ల విశ్రాంత కర, (శ్రీ) సంపాదన కరమై, యాసన్నంబయ్యె నంబుదాగమ మంతన్ విక్ర. 4 26.

**వేస(శ)వారము** సం వి అ పుం ఆవ, మిరియము, ధనియము, అల్లము మున్నగు సంబారపు దినుసులు గలిసిన యొకానొక రుచ్యపదార్థము.

(ఇది ఆఁకలి పుట్టించును)

**వేసారికొను** అ క్రి. (వేసారు+కొను స్వార్థమున.)

గీ. విటుల మఱియును వంచించు విధముఁ జూచి, యమ్మునీంద్రుండు కడుఁ బేద యగుటఁ జూచి, తల్లి వేసారి కొడుకు చందంబుఁ జూచి, సఖులు ముదుగుళ్ళఁబోయెడు సరణిఁజూచి విప్ర 4. 16.

**వేసారు** = వేసరు అ. క్రి. 1 అలయు, శ్రమచెందు.

క ఆ సుఖమతి తరుణ వయ, శ్శ్రీ సంగతి నరుల విటులఁ జేరి రతులకున్, వేసారక యుసికొలఁ గఁ, దా సుఖపడి వచ్చునట్టి ధన్యులలోనన్ హంస 4. 88

సీ మోపరి యెంతైన మోవ వేసారఁడు సారిది దా దాయమే చూచుఁ గాని. . నీతి. శ 47

2. విసుగు.

ఉ ఈరలు ప్రేమమీఱ నుతనిచ్చు తెఱంగది విక్క మైన సంసారము రోసి బంధుజన సంఘముఁ బాయుచు వచ్చియుండి వేసారక యెందుఁ బోయెద నిజంబుగఁ దల్లియు దండ్రి వివేకా, గారవమొప్పు రెంచి కలకాలము నిచ్చటనే వసించెదన్ ఉ. హరిశ్చ. 2 76

ఉ తీరని కౌఁగిలింత లెడ త్రెవ్వని కోరిక లంగ కంబులన్, జేరిన చెమ్మటల్ మఱుఁగు బెట్టని కూరుము లొండొకళ్లు వేసారని జిట్టకంబులును శయ్య సమోవరి సంగమంబులన్, నూరట యైన సమ్మనము లొక్కటియైనది యెంచి వెండియున్. ప్రబంధ. 671

3. బాధపడు, నొచ్చు

మ. జడుఁ డజ్ఞానమునన్ సుఖంబనుచు సంసారార్థ కారంబులోఁ, బడి దుఃఖంబుల వెంబడిం బడి సుఖంపన్లేక వేసారి నీ,యడుగుల్ చిత్తములోఁ దలంచి శతినేయన్...దశా. 1 216

**వేసికొను** స. క్రి. (√వేయు) అన్యాయముగాఁ దీసికొను, అపహరించు.

క అరుదెంచి పలికె నిట్లని, గురువుల సతినెట్లు వేసికొంటివి నీకున్, వరుసా కటకట దోషాకర యీ పాతకము సేయఁగాఁ గాదుసుమీ. వరాహ. 7 25.

**వేస్టరిము**¹ = **వేసడము**¹ వి. ఒకజాతి డేగ

గీ. వారణంబును జలకట్టె బైరిగిద్ద, చంచడము సాళువము శని శరము మించు, వేస్టరిముసు తళు కాదిగ వేర వేర, నొప్పు డేగల జతకూర్చు కుండుటయును ప్రబంధ: 191

**వేస్టరిము**² = **వేసడము**² = **వేస్టము** వి ఒకజాతి డేగ (శ ర)

చూ తళుకు². (సూ ని)

**వేహత్తు** సం వి శ్ స్త్రీ గర్భధారణ మైన వెనుక ఆఁబోతెక్కఁగా ఈచుకొని పోయిన యావు. గర్భోపఘాతిని.

**వేహారము** సం వి అ. పుం దేశవిశేషము నేఁడు 'బీహార్' అనఁబడు దేశము.

## వై

**వైకక్షము** సం వి అ న 1 యజ్ఞోపవీతము వలె ధరింపఁబడిన పుష్పమాల, ఎడమ బుజము మీఁద నుండి కుడిచేతిక్రిందికి వ్రేలునట్లు వేసికొనఁబడిన పూలదండ 2 ఉత్తరీయము, పైబట్ట

**వైకక్ష(కీ)కము** సం వి అ. న. యజ్ఞోపవీతమువలె నెడమ బుజముమీఁద నుండి కుడిచేతి క్రిందికి వ్రేలు నట్లు వేసికొనఁబడిన పూలదండ.

**వైకటికుఁడు** సం త్రి అ పుం. స్వర్ణకారుఁడు, కంసాలి

**వైకర్తనుఁడు** సం వి. అ పుం సూర్యపుత్త్రుఁడు. 1 సుగ్రీవుఁడు 2 కర్ణుఁడు

**వైకల్పము** సం వి అ న. 1. వికల్ప భావము, పక్షాంతర ప్రాప్తమగుట 2 ద్వ్యర్థి రెండర్థము లిచ్చుట 3 అనిశ్చయము, నిశ్చయము లేమి

**వైకల్పికము** సం విశ. (అ. ఈ అ) 1. వికల్పముగాఁ బ్రాప్తించునది, పక్షాంతర ప్రాప్తమైనది 2 రెండర్థములు గలది 3. సందేహాస్పదమైనది, నిశ్చితము కానిది

**వైకల్యము** సం. వి అ న. 1 లోపము, తక్కువ యగుట 2 అవయవ లోపము. 3 అసమర్థత, శక్తిలేమి. 4 క్షోభము. కలఁత. 5 లేకపోవుట, అభావము 6. దౌర్బల్యము. శరీరదార్ఢ్యములేమి.

**వైకుంఠ చతుర్దశి** సం వి ఈ. స్త్రీ కార్తిక శుక్ల చతుర్దశి.

**వైకుంఠము** సం వి అ పుం 1 తులసి (వృ వి) న. 1 విష్ణులోకము, 2 అభ్రకము

**వైకుంఠుఁడు** సం వి అ పుం. 1 విష్ణువు 2 ఇంద్రుఁడు

**వైకృతము** సం విణ (అ. ఈ. అ) 1 మాఱినది 2. సవరింపఁబడినది, దిద్దఁబడినది

వి అ న 1 మార్పు, సవరణ, 2 అసహ్యపడుట, రోత, బీభత్సము, 3 స్థితి, రూపు మొదలగునవి మాఱుట, అంగవికారము 4 దుశ్శకునము, రాఁబోవు కీడును సూచించునది

**వైకృతికము** సం విణ (అ ఈ అ) 1. మాఱినది, లేక మార్పఁబడినది, దిద్దఁబడినది 2 (సాంఖ్యమతమున,) వికృతి సంబంధమైనది

**వైకృత వివర్తనము** సం వి అ పుం. దుఃఖస్థితి, కష్టస్థితి

**వైకృత్యము** సం వి అ న 1. మారుపు వికారము. 2 కష్టస్థితి. 3 రోత 4. దుశ్శకునము.

**వైక్రాంతము** సం వి అ న. పుష్యరాగమును బోలు నొకానొక తక్కువజాతి రత్నము

**వైక్లవ(బ)ము** సం వి అ న. 1 క్షోభము. కలఁత, తడఁబాటు 2 అల్లరి, గడబిడ. 3 దుఃఖము, బాధ, వ్యసనము

**వైక్లవ్య(బ్య)ము** సం వి. అ న వైక్లవము.

**వైఖరి**[1] సం వి ఈ. స్త్రీ. 1. అర్థబోధకమగు కంఠాది స్థానములం దుచ్చరింపఁబడు ధ్వని విశేషము "వైఖరీ శబ్దనిష్పత్తిః "2 వాక్శక్తి,మాటదిట్టతనము. 3. వాక్కు.

**వైఖరి**[2] సం వి ఈ స్త్రీ విధము, రీతి. (ఈ యర్థము తెనుఁగునందే కలదు.)

సీ కమఠరూపము నేన కైకొంటి వనెడు వైఖరి బోరగిలు వీఁపుగానరాగ .. దాశరథి వంశ శరధి సుధాకరుండు కేశవ విలాస భాగాత్మశైశవము...రామా. 3 137

సీ. చంద్రమతీ నాథు చందాన వలుని వైఖరిఁ బురుకుత్సుని గతిఁ బురూరవుని మాడ్కి.... శుక 1 10

సీ. మున్ను బంగారు పెంపు వహించు దేహమే వైఖరి నుండు మేల్వలువ వందు...నిర. 2 10.

**వైఖానసము** సం విణ (అ ఈ అ) 1. వానప్రస్థుల సంబంధమైనది, వానప్రస్థు లాచరింప వలసినది

**వైఖానసుఁడు** సం వి అ పుం 1. వానప్రస్థుఁడు, తృతీయాశ్రమమున నున్న ద్విజుఁడు 2 వైఖానససూత్రానుసారమున విష్ణ్వాలయముల యందు బూజచేసెడి యర్చకుఁడు, నంబి.

**వైగుణ్యము** సం వి అ న. 1. గుణములు లేక పోవుట 2. సుగుణములు లేమి, దోషము 3. గుణభేదము, వివిధ గుణములు గలిగి యుండుట, వ్యతిరేకము. 4 హైన్యము, తక్కువతనము. 5 నేరుపు లేమి, చాతుర్యము లేకుండుట.

**వైఘ** సం వి అ. స్త్రీ దక్షిణ మధుర దరినున్న నదీ విశేషము.

క.. మధు,రా విభవము చూడవచ్చి శ్రాంతిమెయి న్మాం,పా వైఘ నీటఁగృతసం,ధ్యా విధియై ... ఆము 2 72

**వైచక్షణ్యము** సం వి అ న నేరుపు, నైపుణ్యము, విచక్షణత.

**వైచిత్త్యము** సం. వి అ న 1. విగత చిత్తత, మనస్సు లేమి 2 దుఃఖము, విచారము, మానసిక క్షోభ

**వైచిత్ర్యము** సం వి. అ న విచిత్రత 1 భేదము, విశేషము 2 నానారూపత్వము, పలువిధములగుట. 3 క్రొత్తఁదనము, వింతయగుట 4. మనసువకు నాటుట, (వాచ్య వైచిత్ర్యము.) 5. అద్భుతము, ఆశ్చర్యము.

**వైచే = వయిచే** స. క్రి. 1. విసరివేయు, విక్షేపించు.

సీ వృత్రుపై గీర్వాణ విభుండమున్ వజ్రంబు వైచిన వది వాని వజ్రకరిన, పటుమస్తకంబునఁ బడి. .భార. ఆది 7 51.

క ఎడఁ జొచ్చి చిత్రసేనుఁడు, వడముడిపై నేయ నతఁడు వైచెం గోపం, బడరఁగ గదనది యగ్రపుఁ, బిడుగు క్రియన్ మెఱసి పఱచె బిట్టుగఁ జదలన్. భార. భీష్మ 3 57

సీ. గవఱులుంకించి వైవ ప్రాంతముల్ నెత్త మూడు...ఆము 1. 59

2 పడవేయు.

సీ. అప్పొలఁతి వారి, నల్లన పుట్టిన యప్పుడ
కొనిపోయి నిర్దయయై గంగ నీరిలోన, వైచిన
నెఱిఁగియ వ్యసుమతీ నాథుండు...భార. ఆది
4 150.

సీ. వంతఁ బానుపుమీఁద వైచె మేను ఘృతాచి..
నైష 3. 36.

మ. హరిజుం డోరి నిశాట వైచితివి నాఁడంభోనిధి
న్నన్ను ఘో,ర రణాంభోనిధి వైతు నిన్ను నిదె
వే రమ్మంచుఁ జీరెన్.. భాగ. 10, 17

సీ. శ్రమ బుర్బుౕతురంగమ నాసికా గళతఎంకంబు
వైచు కర్దమముగాఁగ. మనుచ 1 42

3 ఉంచు, పెట్టు, ధరింపఁజేయు

సీ...మా గురులపై నురగ శవము, వైచుట విని
యల్గి వారి తనూజుండు...భార ఆది 2 180.

ఉ...బేరురంబులం, గ్రాలఁగ లీలమైదివిజ కాంతలు
వైచిన పుష్పమాలికల్ నైష 3. 10.

సీ. వక్షస్థలంబున వైచిన నవకంపుఁ దులసి
దండకు వాడు దోఁపకుండ .. హర 6. 65.

చ. వలిపము గట్టి హారములు వైచి పటీరము మై
నలంది జ్వాదులు నెఱి కొప్పునం దుఱిమిత్రోవనె
పోయితి మేని,...పారి 2 51.

4 కొట్టు.

క. అదియు వృథయైనఁ బార్థుఁడు, వదలక వృక్ష
ములు శాలవైచెను రణ దుర్మదు వనచరు
నవియెల్లం, దరంగముల నడఁగె నద్భుతంబుగ
నంతన్. భార అర. 1. 317.

గీ. ఆ యమూర్ద్వవాదు పై వంగ నది వెరవున, నొడిసి
పట్టి యా బలియుఁ డత్యుగ్రలీల, మగుడ నత
నిన వైచె నమ్మగధ పతియు, సొలసి వేగయా
లోవన తెలిసి నిలిచె. హరి ఉ 1 190.

సీ. గదాదండంబు బిరబిరఁ ద్రిప్పి యా నురవ
రేణ్యు, కరిని వైచిన నది సుర సుర స్రుక్కుచు
...దశా 2. 427.

5. ప్రయోగించు, ఏయు.

శా...అతఁడు సముద్యత్క్రోధుఁడై శక్తి వై,చెం
గంపింపక ద్రుంచెఁ బాతా విభుఁ డన్ శ్రీఘ్రుంబ
మార్దినుతో,త్తుంగ స్యందన మెక్క నొంచెను
....భార. భీష్మ 3. 61.

సీ. .నృపాలుం డిమి, శాత్రవ్రుంబు మంత్రించి
యలుక వైవ, నదియు వెన్నడి నస్త్రమై తోల
నక్కాకి త్రిజగంబు గ్రుమ్మరితి. భా రా
అయో 164

గీ. పెల్లు శరములు వైచె దర్పించి మరుఁడు...
కళా. 4. 97

6. ఎగుర వేయు

ద్వి. నవరత్న మెగసి పోవైచిన పొడవు, ధనము
రాశిగఁబోసి దాన మిచ్చినను ... హరిశ్చ.
పూ. 460

7 పాఱవేయు.

గీ. రవిక బిగియింతు నదియును నవల వైచి,
కుంకుమపుఁబూత చిమచిమ గొనెదు చిన్ని,
పచ్చికొనగోటి శాఁకులు రచ్చసేయ, గుబ్బ
యరగానరాఁ బైటకొంగు వైతు కువల.
4 188

క. కులుకు నెఱవంక కన్బొమ, సొలుపుల నీ యింతి
వాలు చూపులఁ జూడన్, వలరాజు వంటి
వాఁడును, విలునమ్ములు వైచి దాన వృత్తికిఁ
జొరఁడే శశాం. 3. 46.

గీ. వానిలోపల నొక్క పర్వతము వచ్చి, తాను
గొలువున్న కేళి సౌధమునఁ బడినఁ, బగిలి పైఁ
బడఁ జేతులఁ బట్టి యవల, వైచి వెల్వడివచ్చి
నిశాచరుండు దశా 1. 287

8. వదులు, విడుచు

ఆ. పసులు మరలె శత్రు బలములు పీనుంగు,
పెంటలయ్యె రాజుఁ బెద్ద దొరలుఁ, జీర
లొలువఁ బడిరి సిగ్గఱి బిరుదులు, వైచి రింక
మగుడ వలదె మనకు భార. విరా 5. 222.

చ.. .సాహిణీలు మావులఁ బఱవంగ వైచి నెలపు
ల్వొన నాకుచుఁ బోయె...ఆము 3. 22.

సీ. పూరేళ్లపైఁ జెల్లు పొదలు చంచడపు డేగలు
వైచి నెవ్వడి విలుకు మార్చి .రసిక 1. 115

9 తొలగించు

సీ. వలిప చేలము నుంగు వైచి వేమఱు సూచి పో
కంటిఁ గంటి నే వనెదు వారు ... సారంగ.
1. 123

10. వీజనముచేయు

చ మగువలు భూమి పాలురకు మాటికి మాటికి వైచు కుంచెల, న్నెగడిన మారుతౌఘములు... వైష. 4 182.

చ అతులిత భక్తిఁ బూర్వదిశయందున నుగ్రహాయవ్యఘూటి దాఁ, గుతుకము మీఱఁగాఁ బసిఁడి కుంచియ వైచుచు గొల్వుసేయు నం,త తమును హస్తకంకణ ఝుణత్కరణ క్వణనంబు లవ్విభున్, జతన పరాకుస్వామియను శబ్దము లాగున నెచ్చరించుచున్ కళా 8. 236.

క వినయమునఁ బూర్వదిశయం, దనుగ్రహాయను నతియొకతె యనవరతంబున్, గనకంపుఁ గుంచెఁ గైకొని, వనరుహ దళలోచనునకు వైచుచు నుండున్ పరమ. 1 25.

11 (ఉల్లబము) వేయు, ఎత్తిపట్టు.

మ ... సుభటోద్యత్ఖడ్గ కాంతిచ్ఛటల్, వలిపెంపుం దెలిచల్వపావడలు వైవందుందుభుల్ మ్రోయం గన్ దశా 2 67.

12. ఆచ్ఛాదించు, కప్పు

గీ పచ్చి కొనగోటి తాఁకులు రచ్చసేయ గుబ్బ యరగానరాఁ బైట కొంగువైతు ... కువల. 4 188

సీ దృష్టి తాఁకు నటంచుఁ దెరవైచె నని యెంచు బహురత్న భూషణ ప్రభలుగాంచి దశా. 2 275.

13 (కనుఱెప్ప) మూయు

గీ ఎంచి ఱెప్ప, వైవకీక్షించె దైతేయ వల్లభుండు ఆము. 1 59.

14. కట్టు, నిర్మించు

చ కడఁక యెలర్ప దొడ్లకును గ్రంపలు వైచియు నొక్కనాఁటిలోఁ, వడరఁగఁ బ్రాఁత కాఁపు లయి రక్కడ గోపకుటుంబులందఱున్ ... హరి పూ 6 25.

సీ గొనబైన తట్టు పుప్పనను గోడలు వైచి మంచి గందంపుఁ గంబములు నిల్పి . దశా 8 39

15. (అంకె) వేయు.

సీ అలవోకవలె ఖడిల్లని అంకెవైచిన రోదసీ కుహరంబు భేదిలంగ ... భాగ 10 ఉ. 403.

16. అడుము, నొక్కు

చ. అని సుత నొప్పగించిన హలాయుధుఁడెంతయుఁ బ్రేమమీఱఁ ద,ద్వనిత గళంబుపై హలము వైచి యొకించుక వైచునంతలో, మునుపాడ వైన యమ్ముదిత ముద్దుగ వల్లభు నంత మాత్రయై, తనరె ... దశా 9 99

17 అడ్డము పెట్టు

క బాలురు గాన వివేకము, చాలదొ బిసబిసన నెందుఁ జనియెదరంచున్, గోలలు వైచిరి శత ధృతి, బాలుర ముందరను ద్వారపాలకులలుకన్ దశా 3 126

18 నిలుపు, ఉంచు, కాఁపురముపెట్టు

చ నిను నఱచేత మంచుకొని నేఁబది మాళ్ళకుఁ గొన్న తొత్తు మ,ద్వనిత కలంచెనేని పెడవాడ దె వైవనె యింత యేటికిన్ ... శుక. 3 187.

19 ముడుచు

ఉ జ్ఞారమణుం గనుంగొనఁగ గాటపువేడుకఁ బాఱుదెంచె నొయ్యారి యొకర్తు మున్ జలక మాడుచు వైచిన కీలుగంటుతో, సారెకు జంఘలం బెనఁగ నవ్యకరంబునఁ బాయఁబట్టి శ్రుం,గారరసంపు గిండిగల కాముని యూడెపుఁ గత్తెయో యనన్ కళా 8 142

చ కలయఁగ దువ్వుచున్ హొయలుగా సిగవైచి మెఱుంగు ముత్యముం, గులికెడు బాసికంబుఁ దగఁ గుట్టిరు మాలువు గట్టి రంతటన్...కువల 5 91.

20 పన్ను. ఒడ్డు

క వలత్రాళ్లు వైచి యయ్యెడఁ, బలుమాఱును దఱిమి . నీలా 2 65.

21 ఇది కొన్ని సకర్మకముల మీఁద స్వార్థమునను, అకర్మకముల మీఁదణ్యర్థమునను బ్రయుక్త మగును

ఉదా పడవైచు, పాఱవైచు మొ

ఉ దాని నెఱింగి యెంతయు మదగ్రత నా బక వైరి గ్రక్కునన్, వాని నడంగఁ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించె భార విరా 2 350.

చ ... సాంధ్య నవదీప్తి రసంబు హరించి పాఱ వై,చిన వెలిదూదియో యనఁగ శీతకరుం డుద యించె నత్తఱిన్ పారి 2. 43

చ ... దండవుఁ గోలఁగమన్న మాఱుగోఁ, చులు
వెనఁ బుచ్చివైచి కడుసొంపులుగాఁ బొగ
డించుకోఁ జుమీ, తలఁపఁగ నిప్పుడింత తెగు
దారుల మైతిమి భద్రసనావుడున్. ప్రభా 1.102.
సీ చిత్రంబుగఁ ఒదీయ సూత్రంబు లైదును
ఘోరాసిచేఁ ద్రెవ్వఁ గోసివైచి ..విక్ర.2. 44

**వైచుకొను** స. క్రి. (వైచు+కొను. స్వార్థమున.)
1 ఉంచుకొను.
చ నిచుఁ దవ చంకవైచుకొని నీర నిధాన చతుష్ట
యంబువన్, జని చని సాంధ్యకృత్యములు
సల్పెడు నంతకుఁ ద్రిప్పితెచ్చి పొంపున నట
వైచి కొంకుదులు పోయిన నీ మెయి చక్క
నొక్కి పోవనిచిన వాలినందమఁడ నగదుఁడన్
దశకంఠ వింటివే. రామా. 1 25
2. కప్పుకొను.
వ మదన కదనంబున సమదంబు అగు నంగంబు
లనంగ దట్టంబులు మార్పడవైచుకొని. వసు. 4. 23.
3 కాలంచుకొను చేసికొను
సీ వెగడొంది రవితేరి నొగలఁ గట్టినయట్టి
వాహంబులణకలు వైచుకొనియె...విక్ర 4 60

**వైజననము** సం. వి అ పుం. బిడ్డను గనునెల, నూతి మాసము, గర్భధారణము యొక్క తుది నెల.

**వైజయంతము** సం వి అ పుం 1 ఇంద్రుని ప్రాసాదము 2. ఇంద్ర ధ్వజము, ఇంద్రుని టెక్కెము. 3 ధ్వజము, టెక్కెము 4 ఇల్లు 5 ...ల్లిచెట్టు

**వైజయంతి** సం వి. ఈ స్త్రీ 1 ధ్వజము, టెక్కెము, జెండా, పతాక 2 పూలదండ, సరము 3 వనమాల, విష్ణువు ధరించు పూలదండ.

**వైజయంతిక** సం వి ఆ. స్త్రీ. 1 టెక్కెము, ధ్వజము, జెండా 2 ఒక విధమైన ముత్యాల హారము.

**వైజయంతికుఁడు** సం వి అ పుం. ధ్వజధరుఁడు, టెక్కెము పట్టుకొనెడి వాఁడు

**వైజయంతుఁడు** సం వి అ పుం ఇంద్రుఁడు

**వైజాతి** = వయిజాతి వి ఒకానొక తెగ కోమటిజాతి.
రాజిత విప్రాంగనకును, రాజునకుం బుట్టినతఁడు
రథసూతుఁడు వి. భ్రాజిత విప్రాంగనకును, వై
జాతికిఁ బుట్టినతఁడు వ్యవహారియగున్ విజ్ఞా
1 133
వ. అవ్వీటి మేటి సాలె యగసాలె పటు సాలె
వానె వైజాతి సాఁతు వేతుల కోమిరేలు ...
ఆము 4. 35.

**వైజాతి తొండ** వి. ఊసరవెల్లి.
సీ చెల్లు సెల్లముల కీతుంప నిచ్చిన సొమ్ము మగుడ
నీలేని కోమటి గులామ, చేసేత విశ్వసించిన
వారి వెచ్చనచ్చములఁ గీడ్పఱచు వైజాతి
తొండ, తెగి గంటిలేని పోటుగ నొడ్లయుద్దల
గిద్దలఁ బొడుచు వేగినబిగాది .. వేం పంచ.
1 763

**వైజాత్యము** సం వి అ న 1 విజాతిత్వము, వేఱు జాతి దగుట 2 వర్ణభేదము, జాతి భేదము 3. అపూర్వత, వింతయగుట. 4 జాతి నుండి బహిష్కరింపఁ బడుట, వెలియగుట 5. దుర్నీతి, చెడు నడత

**వైజికము** సం విణ (అ ఆ అ) బైజికము.

**వైజ్ఞానికుఁడు** సం విణ (అ ఈ. అ) నేర్పరి, నిపుణుఁడు.

**వైడము** క్రి. విణ వైళము శీఘ్రముగ
ద్వి ఊడిగంబులు సేయు సుతపలాతులను, వైడంబ
పంపి యవ్వనితకు మండ, బంగారు మేడ చప్ప
రముతోఁ గూడ,శృంగార మొనరించి చిగు
రాకుఁ బోఁడిఁ, బిలువ నంపిన మాత్ర. ప్రభు
2 63 పా 6, పం (శ ర పా)

**వైడూర్యము** సం వి అ న. విదూర దేశమునందుఁ బుట్టిన రత్నము, పిల్లికన్రతనము

**వైణవము** సం విణ (అ ఈ అ) వెదురుతోఁ జేయఁబడినది, వెదురునుండి పుట్టినది.
వి అ పుం. వెదురుకఱ్ఱ, వేణుదండము
న వెదురుబియ్యము, వేణుఫలము

**వైణవికుఁడు** సం వి అ పుం వేణువువాయించువాఁడు, పిల్లనగ్రోవి యూఁదువాఁడు.

**వైణవుఁడు** సం వి అ పుం తట్టలల్లుట మొదలగు వెదురుపని చేయువాఁడు, మేదరి

**వైణికుఁడు** సం. వి అ పుం వీణ వాయించువాఁడు

వైణుఁడు సం. వి. అ. పుం. వెదురుపని చేయువాఁడు, మేదరి

వైణుకము = వేణుకము సం. వి. అ. న. ఏనుగులను నడుపుట కుపయోగపడు వెదురు పిడిగల యంకుశము

వైణుకుఁడు సం. వి. అ. పుం. వేణువు వాయించువాఁడు పిల్లనగ్రోవి యూఁదువాఁడు

వైతండికుఁడు సం. వి. అ. పుం. 1. కలహశీలుఁడు, వితండవాదము చేయు మనుష్యుఁడు 2. తప్పుడు స్వభావము గలవాఁడు

వైతంసికుఁడు సం. వి. అ. పుం. మాంసమమ్ముకొని బ్రదుకువాఁడు

వైతథ్యము సం. వి. అ. న. అసత్యము, నిజముకామి

వైతనికుఁడు సం. విణ. (అ. ఈ. అ.) వేతనముచే జీవించువాఁడు 1. జీతము తీసికొని పనిచేసి పొట్ట పోసుకొనువాఁడు 2. కూలిపనిచేసి బ్రదుకువాఁడు
వి. అ. పుం. 1. జీతగాఁడు 2. కూలివాఁడు

వైతరణి సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. నరకమందుండెడి యేఱు 2. కలింగ దేశమునందలి యొక నది.

వైతసము సం. విణ. (అ. ఈ. అ.) 1. వేతససంబంధి, పేముసకు సంబంధించినది 2. వేతసమువలె నుండునది (ప్రబల శత్రువునకు లొంగియుండుట)

వైతానము సం. విణ. (అ. ఈ. అ.) యజ్ఞసంబంధి
వి. అ. న. 1. యాగ సంబంధమైన క్రియ 2. యాగహోమము.

వైతానికము సం. విణ. (అ. ఈ. అ.) యజ్ఞసంబంధి
న. వి. అ. పుం. శ్రౌతవిధిచే అగ్నిని స్థాపించుట

వైతాలికుఁడు సం. వి. అ. పుం. 1. స్తోత్రపాఠకుఁడు, బట్టువాఁడు 2. గారడివాఁడు, వేతాలోపాసన చేయు మాంత్రికుఁడు 3. వేతాలుని భటుఁడు

వైత్రకము సం. విణ. (అ. ఈ. అ.) వేత్రసంబంధమైనది, పేముతో సంబంధించినది, వేత్రముతోఁ జేయఁబడినది

వైత్రకీయము సం. విణ. (అ. ఆ. అ.) వేత్రసంబంధి, పేముతో సంబంధించినది, వేత్రముతోఁ జేయఁబడినది
వి. అ. న. ఏకచక్రపురము
ఉ. .... చెచ్చెరం, బోఁడిగ వైత్రకీయమున భూసు తులాదిగ వచ్చి చూచిరి... భార. ఆది. 6 308.

వైదగ్ధి సం. వి. ఈ. స్త్రీ. వైదగ్ధ్యము

వైద(గ్ధి)గ్ధ్యము సం. వి. అ. న. 1. నేర్పు, నైపుణ్యము, పనివాఁడితనము 2. చక్కఁదనము 3. ఉపాయము, యుక్తి. 4. చమత్కారము.

వైదర్భము సం. వి. అ. పుం. ఇగురునందలి పుండు
న. వాక్కుల కౌటిల్యము, మాటలందలి వక్రభావము

వైదర్భి సం. వి. ఈ. స్త్రీ. 1. దమయంతి 2. రుక్మిణి. 3. లోపాముద్ర 4. కావ్యరచనా భేదము.

వైదర్భుఁడు సం. వి. అ. పుం. విదర్భదేశపు రాజు.

వైదలము సం. విణ. (అ. ఈ. అ.) వెదురుతోఁ జేయఁబడినది, పేముతోఁ జేయఁబడినది
వి. అ. పుం. 1. ఒక విధమైన రొట్టె, పిష్టకభేదము. 2. కాయధాన్యముతో సంబంధించిన శాకము
న. 1. సన్న్యాసి భిక్షపాత్ర 2. తట్ట, బుట్ట మొదలగు వెదురుపాత్రము, వెదురుతోఁ జేసిన తొట్టె మొదలయిన యాసనము

వైదికపాఠకుఁడు సం. వి. అ. పుం. వేదమునందలి జ్ఞానము గలవాఁడు, వేదమునియందుఁ గొంచమే తెలిసిన ద్విజుఁడు

వైదికము సం. విణ. (అ. ఈ. అ.) వేదవిహితము.
వి. అ. న. వేదవిహిత శ్రాద్ధాది కర్మ.
గీ. నాకతంబునఁ బోలిసిరి నందనులును, జెలులుఁ జుట్టంబులును సహాయులును ధైర్య, మెట్లు కలుగు వైదికముల కెట్లు మననుగొలుపు ... భార. స్త్రీ. 1. 12

వైదికుఁడు సం. వి. అ. పుం. వేదాధ్యయనాధ్యాపనములయందు నియుక్తుఁడైన బ్రాహ్మణుఁడు
క. భీరుఁడు కూరుడు జడుఁడు వి,శారదుఁ డబలాత్మకుండు సబలుం డనవే, దేరినయిన మృత్యువు దు,ర్వారంబై యపహరించు వైదికవర్యా భార. శాం. 4 24

వైదుషి సం. వి. ఈ. స్త్రీ. పాండిత్యము

వైదుష్యము సం. వి. అ. న. వైదుషి

వైదూర్యము సం. విణ. (అ. రీ. ర్యా. అ.) విదూరదేశము నుండి తీసికొని రాఁబడినది, విదూరదేశమునఁ బుట్టినది.

వి అ న పిల్లికంటి చాయఁగల రత్నవిశేషము, విదూర గిరియందుఁ బుట్టినది

**వైదేశికము** సం విశ (అ ఈ అ.) పరదేశ సంబంధమైనది

**వైదేశికుఁడు** సం. వి. అ పుం. పరదేశస్థుఁడు, ఇతర దేశ వాస్తవ్యుఁడు

**వైదేహ(హి)కుఁడు** సం వి అ పుం. 1 వణిజుఁడు, వర్తకుఁడు 2 బ్రాహ్మణస్త్రీ యందు వైశ్యునికిఁ బుట్టిన సంకర జాతివాఁడు.

**వైదేహి** సం వి ఈ స్త్రీ 1 సీత 2 వర్తకుని భార్య. 3. ఒకవిధమైన గోరోచనము 4 పసుపు. 5. ఆవు 6 పిప్పలి.

**వైదేహుఁడు** సం. వి అ. పుం 1. విదేహదేశపు రాజు. విదేహ దేశ నివాసి 3 వైశ్యుఁడు, వర్తకుఁడు. 4. బ్రాహ్మణ స్త్రీ యందు వైశ్యునికిఁ బుట్టిన సంకీర్ణ జాతివాఁడు 5. అంతఃపురపుఁ గావలి వాఁడు, కంచుకి

**వైద్యకము** సం వి అ న. వైద్యశాస్త్రము, ఆయుర్వేదము.

**వైద్యక్రియ** సం. వి ఆ స్త్రీ వైద్య వృత్తి, చికిత్స చేయుట

**వైద్యనాథుఁడు** పుం. వి 1. ధన్వంతరి 2. శివుఁడు.

**వైద్యము**[1] సం. విశ (అ ఈ అ) 1. వేదసంబంధమైనది 2. వైద్యసంబంధమైనది.

**వైద్యము**[2] సం వి అ న 1. రోగచికిత్స, మందు

మ పవిసంగంబునఁ దాప మొందిన శచీప్రాణేశు కెంగేలికిం, జివురుం గైదువు జోదు వైద్యముపదేశించెన్ రహస్యంబుగా .. నైష 1 34.

2 రోగ చికిత్సా శాస్త్రము

గీ. కాయ బాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు, శల్యదంష్ట్రి జరావృష సంజ్ఞ నాల్గు నైన యష్టాంగకము రావులారఁ గల్గు, వైద్య మెనిమిది నెలల సర్వమును నేర్చి మనుచ 5 15

**వై(ద్యకుఁ)ద్యుఁడు** సం వి అ పుం. 1. విద్వాంసుఁడు, పండితుఁడు 2. వెజ్జు, మందులిచ్చువాఁడు, భిషజుఁడు 3 బ్రాహ్మణునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టిన సంకీర్ణ జాతివాఁడు 4 (వైశ్యస్త్రీయందు శూద్రునకు బుట్టిన యధమ సంకీర్ణజాతిలోనివాఁడు.

**వైద్యుతము** సం. విశ (అ ఈ అ) వైద్యుత్సంబంధి, విద్యుత్తునుండి పుట్టినది, మెఱపునుండి పుట్టినది.

**వైధము** సం విశ (అ. ఈ అ.) 1. విధిననుసరించినది. 2, ధర్మశాస్త్రీమసారి, న్యాయ్యమైనది

**వైధర్మ్యము** సం వి అ. న 1. విరుద్ధ ధర్మములు గలిగియుండుట, సమాన ధర్మములు లేమి, భేదము 2 గుణభేదము, శీలభేదము. 3. కృత్యభేదము 4. వ్యతిరేకము. 5 అధర్మము, అవ్యయము. 6 భిన్న మతావలంబనము

**వైధవేయుఁడు** సం వి. అ పుం విధవాపుత్రుఁడు, ముండ కొడుకు.

**వైధవ్యము** సం వి అ న విధవాత్వము, ముండమోపితనము

**వైధాత్రుఁడు** సం వి అ పుం బ్రహ్మపుత్రుఁడు, సనత్కుమారకుఁడు

**వైధుర్యము** సం వి. అ న 1 నష్టపోవుట 2 క్షోభము, కలఁత, కదలిక, కంపము

**వైధృతి** సం వి ఇ స్త్రీ వైధృతము

**వైధృతము** సం వి అ న. (జ్యోతి) ఇరువదియేడు యోగములలో నొకటి (ఇది మిక్కిలి యశుభ కరముగా నెంచఁబడినది )

**వైధేయము** సం విశ (అ ఈ. అ.) 1 విధివిహితమైనది, విధి ననుసరించినది 2 తెలివిలేనిది, మూర్ఖము.

**వైధేయుఁడు** సం. వి అ. పుం. మూర్ఖుఁడు, తెలివిలేనివాఁడు

**వైనతేయుఁడు** సం వి అ పుం 1 గరుత్మంతుఁడు 2. అనూరుఁడు.

**వైనము = వయినము** వి (సం. వ్యాఖ్యానము క. వైణవు ) 1. వివరణము

వ్యవ. నీవు వచ్చిన పని వైనముగాఁ దెలుపుము

2 ఉపాయము.

క పురహరుఁ డంతట వగ్గిరి, వరతటమునఁ దపము సేయ వచ్చె నిజేచ్ఛన్, గిరి యతనికి సుత నచ్చటఁ, బరిచర్యకు నిలిపె మంచి వైనము దొరికెన్ పార్వ 2 111 112,

3. కారణము. (శ శ , ప్రా.)

4. క్రమము (శ. ర)
5 విధము. (శ ర)

**వైనయికము** సం విణ (అ ఈ అ) 1. వినయము నకు సంబంధించినది, మంచి నడవడికి సంబంధించినది. 2. యుక్తతను (మితిమించని నడవడిని) బల పఱుచునది

వి అ పుం యుద్ధరథము, యుద్ధమున నుపయో గించు యానము.

**వైనాయకము** సం. విణ. (అ ఈ అ) వినాయక సంబంధి, వినాయకునికి సంబంధించినది

**వైనాయికము** సం వి అ. పుం బౌద్ధమత సిద్ధాంతము.

**వైనాయికుఁడు** సం వి అ పుం బౌద్ధమత సిద్ధాంత మనుసరించినవాఁడు, బౌద్ధమతస్థుఁడు

**వైనాశికము** సం వి అ పుం 1 సాలెపురుగు. 2. బౌద్ధుల సిద్ధాంతము.

న (జ్యోతి) ఒకని జన్మనక్షత్రము నుండి యిరువది మూఁడవ నక్షత్రము.

విణ (అ ఈ అ.) 1. క్షణికము, క్షణకాలముండు నది 2 పరతంత్రము, పరాధీనమైనది

**వైనాశికుఁడు** సం వి అ పుం 1 బానిసవాఁడు, దాసుఁడు. 2 జ్యోతిశ్శాస్త్రవేత్త 3 బౌద్ధమతస్థుఁడు

**వైనీతకము** సం వి. అ పుం న పలువురు మోయఁదగిన యందలము మున్నగు యానము.

**వైపరీత్యము** సం వి అ న 1 వ్యతిరేకము, విపర్యయము 2 పరస్పర విరుద్ధస్థితి

**వైపించే** స క్రి. (√వైచు.) వైవఁజేయు.

వ సముద్రంబున వైపించియు మీఁదఁ బర్వతంబులు ద్రోపించియు ... పద్మ. 7. 90

**వైపు = వయిపు** వి 1 ఉపాయము.

క ఆ రాక్షసు పట్టణ మె,వ్వారికిఁ దదనుజ్ఞ లేక వైరమునఁ జొరం, గారాదఁట ప్రద్యుమ్నుఁడ, వారణఁ దత్పురముఁ జొచ్చువైపు వినుమికన్. ప్రభా 2. 26

సీ కావున తత్కర్మ కలనకు వరియింపవలయు నాతనిఁ దెచ్చు వైపుఁ జూడు తాఘవ 1 58.

చ విరిగిన వైరులం దఱిమి వేగమె వారల సీమ లెల్ల సుస్థిరమతి నాక్రమింప వలదే యనుచా సెఱమంత్రి జక్కె భూవర యిది వేళగాదు పౌరవం జననిచ్చి కెలంకులందు స,త్వరులగు శాత్రవుల్ గదియ వైపు దొరంగదె యెంత వారికిన్. కృష్ణ 3 50

2 ఒడుపు, లక్ష్యము

సీ వైపు దప్పిన మహా కోపంబుతోడన పోయె నవైతం బాత్మఁ బూని డాయ ... కాశీ 6. 294

గీ వైపు దప్పిన చేతుల వాఁడు మొద్దు, వ్రేళ్ళ వంకర కొంకర కాళ్ళవాఁడు, కుఱుచవాఁడు వికారపు గూని వీఁపు,వాఁడు కాలిన కొఱడు భావమున వెడలె వరాహ 2 45

3 విధము.

వ భుజాబల ధురంధరుం డగు నయ్యుగంధరుండు వీతిహోత్రుని వైపున సమిన్మధ్యంబున విజృంభించి ప్రబలతర వారిధర నికాయంబుగతిఁ బ్రబలతర వారిధర నికాయంబుచెదర ... చంద్రా 6 93.

గీ ... మింటఁ, జిక్కటాటివ వైపున జింకదాటు, పగిది బింతి యెగయుదారి పాపములకు, సరవి యంతర పల్లటి వరుస బిరుదు, పాత్రవలె నాడ గల చిత్రపత్రమునకు. ప్రబంధ 181

4 వాసి, అతిశయము

గీ చంద్రు నైదోడు పూఁబోడి జబుకు తళుకు, వాలు గన్నుల బెళుకుల వైపు మాపు, వాలు గన్నుల వలపింప వలయు ననియె ... దశా 1 212.

5. పార్శ్వము, ప్రక్క, పక్షము

ఉదా కుడివైపు, ఎడమవైపు

వ్యవ ఆ పెళ్ళికి రెండువైపుల వారు కలసి నూఱు గురుకంటె ఎక్కువ లేరు

**వైపుకాఁడు** విణ (వైపు+కాఁడు) ఉపాయము కల వాఁడు, ఉపాయశాలి

గీ. ... బుంగల యానవంబు, వడిచికొని తెచ్చు చున్నట్టి వైపు కాఁడు సురా. 57. (శ ర.పా)

**వైపుల్యము** సం వి అ న 1. వైశాల్యము, విస్తృతి, విరివి 2 సమృద్ధి, బాహుల్యము

**వైఫల్యము** సం వి అ న వ్యర్థమగుట, నిష్ఫలత, విఫలమగుట

**వైబోధికుఁడు** సం వి అ న 1 కావలివాఁడు 2 రాత్రిఁ గంటవాయించి (కొట్టి) వేళ దెలుపుచు జనుల మేలుకొలుపువాఁడు, గస్తు తిరుగువాఁడు

**వైభవము** సం వి అ న 1 ఐశ్వర్యము, సంపద. 2. ప్రభుత్వము, మహిమ, గొప్పతనము

**వైభాషికము** సం విణ (అ ఈ అ) విభాషగావచ్చునది, పక్షాంతరమునఁ బ్రాప్తమగునది

**వైభ్రాజము** సం. వి అ న దేవలోకమునందలి యొక యుద్యానము

**వైమత్యము** సం వి అ న 1 అభిప్రాయభేదము, అనంగీకారము. 2 అనిష్టము, ఒప్పమి, ఇష్టములేమి.

**వైమనస్యము** సం. వి అ న 1 మనస్సు చెదరుట, విమనస్కత. 2 చింత, విచారము 3. మనస్పర్థ 4 రోగము, జబ్బు

**వైమాత్ర** సం. వి ఆ స్త్రీ. సవతితల్లి కూఁతురు

**వైమాత్రి** సం వి ఈ స్త్రీ వైమాత్ర

ఇట్లే వైమాత్రేయి

**వైమాత్రుఁడు** సం. వి. అ పుం సవతి తల్లి కొడుకు

ఇట్లే వైమాత్రేయుఁడు

**వైమానికుఁడు** సం విణ (అ ఈ అ) విమానము మీఁద దిరుగువాఁడు, విమానమునం దున్నవాఁడు.

**వైమాలము = వయిమాలము** విణ అధికము

ఉ శ్రీలఁ జగత్యనాథుఁ డొనరించెను నేఁడని గారవించుచో, బాలకు లేఁత నవ్వధర పల్లవకాంతి నలంకరించె వైమాలపు సిగ్గు చూపులకు మాటుగఁ దోఁచెఁ గుచోత్తరీయమున్, గేలొడికంబు సేసెఁ దిలకించిరి నెచ్చెలులట్టి చేష్టలన్ కావ్యా 5 62

**వైముఖ్యము** సం వి అ న 1 విముఖత, విముఖుఁడగుట, పెడముఖము పెట్టుట, వెనుకకుఁ దిరుగుట. 2 అనిష్టము, ఇచ్ఛలేమి, వినుగు

**వైమేయము** సం వి. అ పుం వినిమయము, వస్తువుల మార్పు

**వైయగ్ర(గ్ర్య)ము** సం వి అ న 1 వ్యగ్రత, క్షోభము, కలఁత. 2 తదేకాయత్తత, తన్మయమగుట.

**వైయధికరణ్యము** సం. వి అ న సమానాధికరణము కామి, భిన్నమయిన యాశ్రయములు కలిగి యుండుట

**వైయర్థ్యము** సం వి అ న. వ్యర్థత, నిరుపయోగమగుట

**వైయాకరణుఁడు** సం విణ (అ ఈ అ) వ్యాకరణము చదివినవాఁడు

వి అ పుం. వ్యాకరణశాస్త్రవేత్త, వ్యాకరణ పండితుఁడు

**వైయాఘ్రము** సం విణ (అ ఈ అ) 1 వ్యాఘ్రమును బోలియున్నది 2 వ్యాఘ్రచర్మముతో గప్పఁబడినది

వి అ పుం వ్యాఘ్రచర్మముతోఁ గప్పఁబడిన రథము

**వైయాత్యము** సం వి అ న 1 దిట్టతనము, నిర్లజ్జత, సిగ్గులేమి 2 మోటతనము.

**వైయాసికము** సం విణ (అ. ఈ అ) వ్యాసప్రోక్తము, వ్యాసునిచేఁ జెప్పఁబడినది, వ్యాసవిరచితము

**వైయాసికుఁడు** సం వి అ పుం వ్యాసుని పుత్రుఁడు, శుకయోగి

**వైరంగికుఁడు** సం వి అ పుం కామాది వికారములను జయించిన సన్న్యాసి, బైరాగి

**వైరక(కా)రుఁడు** సం విణ (అ ఈ అ) విరోధము కల్గించువాఁడు, కలహకారుఁడు

వి అ పుం శత్రువు, పగవాఁడు.

**వైరక్త(క్త్య)ము** సం వి అ న 1. విరక్తి, వైరాగ్యము, ప్రాపంచిక విషయములతో సంబంధము వదలుట 2 అసంతుష్టి

**వైరనిర్యాతనము** సం వి అ న పగ తీర్చుకొనుట.

ఇట్లే వైరప్రతీకారము, వైరానృణ్యము మొ

**వైరపడు** మి అ క్రి (వైరము+పడు) విరోధపడు, పగగొను

గీ ఈ సముద్రుఁడు నాతోడ నెట్లు వైర, పడ సమర్థుఁడు తెలియక ఇలికితబల నా పంచ 424

**వైరప్రతిక్రియ** సం వి ఆ స్త్రీ. వైరనిర్యాతనము ఇట్లే వైరయాతన. మొ

**వైరము** సం వి అ. న 1 శత్రుత్వము, పగ, విరోధము 2 ద్వేషము, కపి 3 పీరత్వము, పరాక్రమము.

**వైరల్యము** సం. వి అ న 1 వికలమగుట, అరుదుగా నుండుట, దుర్లభత 2. వదులు, బిగువులేమి 3 సౌకుమార్యము, సున్నితమగుట

**వైరవులు = వయిరవులు** వి కట్టెనిప్పు, అంగారము సీ నిప్పంగలము మల్లె నిప్పుక వైరాలు వైరవు లనఁగ నంగార మొప్పు . ఆం. భా 2.242.

**వైరశుద్ధి** సం వి ఇ స్త్రీ వైర నిర్యాతము, పగ తీర్చుకొనుట

**వైరసాధనము** సం వి అ న వైరనిర్యాతనము

**వైరాగ(గ్య)ము** సం వి అ న 1 విరక్తి, ప్రాపంచిక విషయములతో సంబంధము వదలుకొనుట, విషయవాంఛలు లేకునికి 2 అసంతుష్టి 3 వైమనస్యము 4 చింత, దుఃఖము

**వైరాగికుఁడు** సం వి. అ పుం వైరాగ్యము గల సన్న్యాసి

**వైరాజము** సం విణ (అ ఈ అ) విరాట్పురుష సంబంధి, బ్రహ్మ సంబంధమైనది

**వైరాటము** సం విణ (అ ఈ అ) విరాటసంబంధి, విరటుని సంబంధమైనది.

వి. అ పుం ఇంద్రగోపము, ఆరుద్రపురుగు

**వైరానుబంధి** సం విణ (న్ నీ న్) విరోధము తెచ్చువాఁడు, కలహకారుఁడు

వి న్ పుం 1 వాఁడి మయూఖము, వేఁడియైన సూర్యకిరణము 2 విష్ణువు

**వైరాలు = వయిరాలు** వి వైరవులు, కట్టెనిప్పు.

సి. నిప్పి గలము మల్లె నిప్పుక వైరాలు వైరవు లనఁగ నంగార మొప్పు ఆం. భా 2 242

**వైరి** సం విణ (న్ ణీ న్) పగ గలవాఁడు, శత్రుత్వము గలవాఁడు.

వి న్. పు 1 పగవాఁడు, శత్రువు. 2 వీరుఁడు, పరాక్రమశాలి

**వైరించు** సం అ క్రి పగగొను

సీ వైరింప జమునంత వానినేనియుఁ బోర నద గంటగాఁ బ్రేయుటతని బిరుదు .. భల్లా 4 (శ ర)

**వైరూప్యము** సం వి అ న 1. విరూపమగుట, అనురూపము కామి, తగియుండమి, అంగవికారము, కురూపి యగుట 2 రూపభేదము, వేఱు రూపము నొందుట

**వైరోచని** సం వి ఇ పుం వైరోచనుఁడు

**వైరోచనుఁడు** సం వి అ పుం 1. విరోచనుని పుత్త్రుఁడు, బలిచక్రవర్తి 2. అగ్నిపుత్త్రుఁడు. 3 సూర్యుని పుత్త్రుఁడు

**వైరోద్ధారము** సం వి అ పుం వైరనిర్యాతనము.

**వైలక్షణ్యము** సం వి అ. న విలక్షణత

1. వైశిష్ట్యము, ప్రత్యేకత, అపూర్వత 2 వ్యతిరేకము, ప్రాతికూల్యము 3. భేదము, వ్యత్యాసము

**వైలక్ష్యము** సం వి అ న 1 కలఁత, క్షోభము. 2 స్వభావ సిద్ధము కాకుంట, నైసర్గికము కామి 3 లజ్జ, సిగ్గు 4 చిహ్నము లేమి, గుఱుతు లేకుండుట.

**వైళ** వి శ్యేనవిశేషము, ఒకవిధమగు డేగ (శ, ర.)

**వైళము = వయిళము** వి 1 విధము

క బాలుఁడు తన బాలుండవి, బాలామణి తనదు ధర్మపత్నియని మహీపాలుం డెఱిఁగియు నెఱుఁగని, వైళంబునఁ బలికె లోకవాద చలితుఁడై కృ శకు 3. 131.

2 సమయము.

సీ. తోఁకచుక్కలఁ బోలు తోరంపుఁ దెలికన్నులా వైళమున సిగ్గు నతకరింప క్రీడా 137.

విణ శీఘ్రము, సత్వరము

క అపుడు జడదారి ఱేఁడు, ల్లపుదామర నలరివారలఁ దోడ్కొని వై,ళమ్ము నడకలతోఁ దన జన్న పుటిల్లల యందు దోఁపునకుఁ బరతెంచెన్ అచ్చరా బాల 116

ఉ నాదెసఁగామునమ్ములకు నాఁటుట వైళమ సిగ్గుఁ జిత్తమున్, వాదులు వెట్టుకొన్న యవి... ఉ హరి 5 129

సీ పుడమి నంతక నాకమునఁ జేర్చు వైళంబు రేలు వెలారించు జేలతనము, కృ శకుం పీఠిక 1. 56

**వైవధికుఁడు** సం వి అ. పుం 1 చిల్లర సరకులను కావడిలోఁ బెట్టుకొని వీథులలోఁ దిరుగుచు నమ్ముకొనెడి వర్తకుఁడు 2. కావడి మోయువాఁడు, కావడివాఁడు.

**వైవర్ణ్యము** సం వి అ. న. 1 వివర్ణత, వర్ణము మాఱుట, రంగు మాయుట 2 జాతిభ్రష్టత, జాతి నుండి తొలఁగుట.

**వైవర్తము** సం వి అ పుం సంపూర్ణముగా (సమూలముగా) మాఱుట.

**వైవస్వతి** సం వి ఈ స్త్రీ 1 దక్షిణ దిక్కు, యమునానది

**వైవస్వతుఁడు** సం వి.అ పుం 1 పదునలుగురు మనువులలో నొకఁడు, ఏడవ మనువు, ఇప్పటి మనువు 2. యముఁడు 3. అగ్ని 4 ఏకాదశ రుద్రులలో నొకఁడు 5 శని (గ్రహము)

**వైవాహికము** సం విశే (అ ఈ అ) వివాహ సంబంధమైనది, వివాహమునకుఁ దగినది.

వి పుం అ న. వివాహము, పెండ్లి

**వైవాహికుఁడు** సం. వి. అ పుం వియ్యంకుఁడు, సంబంధి 1. కోడలి తండ్రి 2 అల్లుని తండ్రి

**వైశంపాయనుఁడు** సం వి అ పుం సుప్రసిద్ధుఁడయిన వేదవ్యాసుని శిష్యుఁడు. (జనమేజయ మహారాజునకు మహాభారత సంహితను వినిపించిన ఋషి )

**వైశద్యము** సం వి అ. న 1 పరిశుభ్రత 2 స్పష్టత, తేటఁదనము 3. తెలుపు, ధావళ్యము 4 శాంతత (మనస్సు యొక్క) ప్రసన్నత.

**వైశసము** సం. వి అ న 1 నాశము, ధ్వంసము 2 బాధ, దుఃఖము, కష్టము

**వైశస్త్రము** సం వి అ. న. శస్త్రములేమి, విశస్త్రత, ఆత్మరక్షణ సాధనములేమి

**వైశాఖము** సం వి. అ పుం 1 చాంద్రమాన మాసములలో రెండవది. 2 మంథ దండము, కవ్వము 3 బార్హస్పత్యమానమున నొకానొక సంవత్సరమున వేఁటాడుటలో నొకవిధమైన యొడుపు.

**వైశాఖి** సం వి ఈ. స్త్రీ వైశాఖ శుక్ల పౌర్ణమాసి, వైశాఖ మాసమందలి పున్నమ

**వైశారద్యము** సం వి అ న నేర్పు, దక్షత, నైపుణ్యము

**వైశికము** సం విశే. (అ. ఈ అ) వేశ్యలచే వశ్యసింపఁ బడినది

వి అ న వేశ్యాధర్మము.

**వైశికుఁడు** సం వి అ. పుం వేశ్యలతో సహవాసము చేయు పురుషుఁడు, కామశాస్త్రమునఁ జెప్పఁబడిన యొక జాతి నాయకుఁడు

**వైశిష్ట్యము** సం వి అ న 1 భేదము, తారతమ్యము 2 వైలక్షణ్యము, ప్రత్యేక గుణము, విశేషగుణము 3 శ్రేష్ఠత, ఉత్తమత్వము 4. విశేషగుణములతోఁ గూడియుండుట, ప్రత్యేక గుణములు కలిగియుండుట.

**వైశేషికము** సం విశే (అ. ఈ అ) 1 విశేష గుణములకు సంబంధించినవి 2 కాణాద సిద్ధాంతమునకు సంబంధించినది

వి అ న షడ్దర్శనములలో నొకటియగు కాణాద సిద్ధాంతము.

**వైశేషికుఁడు** సం వి అ పుం వైశేషిక సిద్ధాంతము నెఱింగినవాఁడు, కాణాద శాస్త్రపండితుఁడు.

**వైశేష్యము** సం. వి అ న. 1 వైశిష్ట్యము 2. భేదము. 3 శ్రేష్ఠత, ఉత్తమత్వము.

**వైశ్యుఁడు** సం వి. అ పుం. కోమటి, ద్విజులలో నొకఁడు (ఇతనికి వాణిజ్యము, వ్యవసాయమును వృత్తులుగా నుండెడివి )

**వైశ్రవణాలయము** సం వి అ పుం 1 కుబేరుని నివాసస్థలము 2 వటవృక్షము, మఱ్ఱిచెట్టు (వాచ )

**వైశ్రవణుఁడు** సం వి అ పుం 1. కుబేరుఁడు 2. రావణుఁడు.

**వైశ్వదేవము** సం విశే (అ ఈ అ.) విశ్వదేవతల సంబంధమైనది

వి అ న. 1 విశ్వేదేవత కిచ్చెడి బలి 2 భోజనమునకుఁ బూర్వమున సమస్త దేవతల నుద్దేశించి యగ్నియందు హోమము చేయుట

**వైశ్వదేవి** సం వి ఈ స్త్రీ. మాఘ మాసమునఁ గృష్ణపక్షమందలి యష్టమి

**వైశ్వానరము** సం విశే (అ ఈ అ) సర్వజనులకు సంబంధించినది, సర్వజన సాధారణమైనది.

వి అ. పుం 1 జాఠరాగ్ని 2. (వేదాంత) సమష్టి జ్ఞానము 3 చిత్రకము, చిత్రమూలము, (వృ వి)

**వైశ్వానరుఁడు** నం వి అ పుం 1 అగ్నిహోత్రుఁడు. 2 పరమాత్మ

**వైశ్వాసికము** నం విణ (అ. ఈ అ) విశ్వసనీయము విశ్వసింపఁదగినది నమ్మఁదగినది

**వైషమ్యము** నం వి అ న 1 విషమత్వము, హెచ్చు తగ్గులుగా నుండుట 2 మిట్టపల్లములుగా నుండుట, సమముగా లేకుండుట, కఱకుఁదనము, పరుషత 3 అన్యాయము 4 కష్టము, దుఃఖము 5 ఏకాంతముగా నుండుట, ఒంటరితనము

**వైషయికము** నం విణ (అ ఈ అ) 1 భోగ్యవస్తువులకు సంబంధించినది 2 విషయములవలన, భోగ్య వస్తువులవలనఁ గలిగినది (సుఖాది)

**వైషయికుఁడు** నం వి, అ పుం. విషయలోలుఁడు, ఇంద్రియసుఖములం దాసక్తిగల పురుషుఁడు

**వైషువతము** నం. విణ (అ.ఈ అ) విషువత్సంబంధి, సమరాత్రి దినకాల సంబంధమైనది.

**వైష్టుతము** నం. వి అ న సర్వ్యభస్మము, హోమ సంబంధమైన భస్మము

**వైష్ణవపురాణము** నం వి అ. న. పదునెనిమిది మహా పురాణములలో నొకటి, విష్ణుపురాణము

**వైష్ణవము** నం. విణ. (అ ఈ అ) 1 విష్ణుసంబంధి. 2 విష్ణుదేవు నుపాసన చేయునది, విష్ణునిఁ బూజించునది

వి. అ పుం 1 శైవ శాక్త వైష్ణవములను మూఁడు మతములలో నొకటి 2 శ్రవణ నక్షత్రము

వ. విష్ణులోకము, వైకుంఠము

**వైష్ణవి** నం వి ఈ స్త్రీ విష్ణుశక్తి.

**వైసర** వి మల్లయుద్ధ విశేషము

వ నయన వు పారువలి వరాకడ యే కసర వైసర ఘుంవు పిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ము లెఱింగి. ప్రబంధ. 78.

**వైసరము** వి హెచ్చరిక పదము

వ బెత్తలు సిస్తుగా మోచి నిబ్బదుగు ముడ్కంది యంగాల జడుపు వైసరం బొరడి యడుగులో జతనము ప్రబంధ 605

**వైసారిణము** నం వి అ. పుం చేప, మత్స్యము.

**వైసిక**=**వయిసిక** వి. కపటము.

గి ఉల్లము గరంగ వైసిక పల్లటిలఁగ, ధైర్య మెడలంగ మంత్ర తంత్రములు మఱచి ... షోడ 2

**వైహళి** వి (నం వాహ్యాళి) విహారము

ఉ . బంధు మిత్రాదులు గొల్వ వైహాళికి నంచిత వైభవలీలఁ బోవుచో ...దశకు 7.157.

**వైహాయసము** నం విణ (అ. ఈ. అ.) ఆకాశమునం దున్నది

**వైహార్యము** నం విణ (అ. ఆ. అ) విహరింపఁ దగినది, క్రీడింపఁ దగినది బావమఱఁదితోఁ గాని, భార్య బంధువులతోఁ గాని వేళాకోళముగాఁ బలుకఁ దగినది

**వైహాసికుఁడు** నం వి అ. పుం 1. హాస్యగాఁడు. 2. నటుఁడు

# వో

**వోంటుము** నం వి అ పుం కాఁడ, తొడిమ

**వోద్రము** నం. వి అ పుం 1. ఒకజాతి పాము. 2. ఒకజాతి చేప

**వోద్ర** నం. వి ఈ స్త్రీ పరిమాణ విశేషము, వణములో నాల్గవ వంతు.

**వోఢ** నం వి ఋ పుం 1. బరువు మోయువాఁడు, మోతగాఁడు 2 నేత, నాయకుఁడు 3. భర్త, పెనిమిటి 4 వృషభము, ఎద్దు. 5 సారథి. 6 బండిలాగు గుఱ్ఱము, రథాశ్వము

**వోదము** నం. విణ. (అ. ఆ అ.) చెమ్మగానున్నది, తడిగా నున్నది

**వోదాలము** నం వి అ పుం. మత్స్యవిశేషము, ఒక జాతి చేప.

**వోరకుఁడు** నం. వి అ పుం వ్రాయసకాఁడు, లేఖకుఁడు

**వోరటము** నం వి. అ. పుం. కుందము, మొల్ల. (వృ వి)

**వోలకుఁడు** నం వి. అ. పుం వ్రాయసకాఁడు, లేఖకుఁడు.

**వోలము** నం వి అ. పుం గోపరసము, బాలెంత బోళము.

**వోల్లాహము** సం. వి అ. పుం. తెల్లనిజూలు, తెల్లని తోఁక వెండ్రుకలు గల గుఱ్ఱము.

## వ్య

**వ్యంగము** సం. వి. అ పుం 1 కప్ప 2 చెక్కిలిపై బయలుదేఱెడి మచ్చలు, మాఁగు 3 ముఖరోగ విశేషము.
విణ కొఱవటి

**వ్యంగ్యము** సం విణ (అ ఆ అ) 1 వ్యంజనావృత్తిచేఁ దెలుపఁబడినది, ధ్వనిచే సూచింపఁబడినది (యర్థము) 2. సూచింపఁబడినది, తోఁపింపఁబడినది (అర్థము)
వి అ న. సూచితార్థము, వ్యంగ్యార్థము.
(వాచ్యలక్ష్యవ్యంగ్యములలో మూఁడవది.)

**వ్యంగుఁడు** సం విణ. (అ. ఆ ఈ అ) 1. దేహము లేనివాఁడు, అశరీరి. 2 అవయవము లేనివాఁడు, వికలాంగుఁడు.
వి అ. పుం. కుంటివాఁడు.

**వ్యంగులము** సం వి అ న. అంగుళములో నఱువదియవ వంతు, అతిసూక్ష్మ పరిమాణము.

**వ్యంగ్యోక్తి** సం. వి. ఇ స్త్రీ. గూఢముగాఁ జెప్పుట, సూచన

**వ్యంజకము** సం. విణ. (అ. ఙ్ కా. అ) 1 స్పష్టపఱుచునది, స్పష్టముగాఁ దెలుపునది అర్థమును తోఁపించునది, ధ్వనింపఁ జేయునది.
(వాచక లాక్షణికములు కానిది—పదము)
వి. అ పుం అభినయము. మానసిక భావమును హస్తాది చాలనముచేఁ దెలుపుట.

**వ్యంజన** సం వి ఆ. స్త్రీ 1. శబ్దశక్తి విశేషము, అర్థాంతరమును స్ఫురింప జేయు శబ్ద శక్తి 2. వేళాకోళము, ఎగతాళి. 3. సూచన

**వ్యంజనము** సం వి అ న 1. విశదపఱుచుట, స్పష్టము చేయుట 2 గుఱుతు, చిహ్నము 3 జ్ఞప్తికిఁదెచ్చుట. 4 మాఱువేషము 5 హల్వర్ణము, హల్లు. 6. స్త్రీ పురుషుల గుఱి. (లింగము, యోని.) 7 లాంఛనము, చిహ్నము 8 రజస్వలా చిహ్నము 9. శ్మశ్రువు,గడ్డము 10.అవయవము, అంగము 11 కూర, పులుసు మొ॥గు భోజనోపకరణములు (ఆ) సంభారము, పోపువస్తువులు, 12 అభిధాలక్షణా వ్యంజనములను శబ్ద శక్తులలో మూఁడవది 13 దినము. 14. మఱుగుచోటు, రహస్యస్థలము

**వ్యంజనావృత్తి** సం. వి ఇ స్త్రీ శబ్దశక్తి విశేషము, వ్యంజన, ధ్వని,

**వ్యంజితము** సం. విణ. (అ ఆ అ) 1. విశదపఱుపఁబడినది 2. ప్రత్యేకపఱుపఁబడినది. 3 స్ఫురింపఁ జేయఁబడినది, సూచింపఁబడినది.

**వ్యంసకము** సం. వి. అ పుం. (ఇది సమాసోత్తర పదముగానేఁ బ్రయోగింపఁబడును) ధూర్తము, టక్కరి, మోసము చేయునది (జంతువు) మయూర వ్యంసకము.

**వ్యంసకుఁడు** సం వి అ పుం ధూర్తుఁడు, మోసగాఁడు, వంచకుఁడు.

**వ్యంసనము** సం వి అ న. 1. మోసపుచ్చుట, వంచించుట, 2. వంచిపెట్టుట

**వ్యక్తగణితము** సం వి. అ. న. అంకగణితము.

**వ్యక్తదృష్టార్థుఁడు** సం. వి. అ పుం సాక్షి, కన్నులారఁ జూచినతఁడు.

**వ్యక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1 విశదమైనది, స్పష్టమైనది. 2. స్పష్టపఱుపఁబడినది, వెల్లడింపఁబడినది 3. వృద్ధినొందినది, ప్రకాశితము. 4. ప్రత్యేక పఱుపఁబడినది, భేదపఱుపఁబడినది 5. ప్రత్యేక వ్యక్తికి సంబంధించినది
వి అ న. 1 వ్యక్తపఱుపఁ బడిన పదార్థము. 2 సృజింపఁబడిన వస్తువు

**వ్యక్తి** సం వి ఇ స్త్రీ. 1, స్పష్టమగుట, ప్రకాశము, గోచరమగుట. 2 దృశ్యరూపము, స్ఫుటత్వము 3. సూక్ష్మ భేదము తెలిసికొనుట, భేదజ్ఞానము. 4. స్వాభావిక స్థితి, సత్యస్వరూపము 5 ప్రత్యేకత (వ్య జాతి) 6. (వ్యాక.) లింగము 7. పదరూప వికారము, లింగ విభక్త్యాదుల వలన పదమునకుఁ గలుగు మార్పు (విల్సను.)

**వ్యక్తుఁడు** సం. వి అ పుం. విష్ణువు.
విణ. విద్యావంతుఁడు, చదువుకొనిన వాఁడు.

**వ్యగ్రుఁడు** నం విణ (అ ఆ అ.)[1] వేగిరపడు వాఁడు, తొందరపడువాఁడు 2. కలఁత నొందిన వాఁడు, వ్యాకులత నొందినవాఁడు, 3 (ఒకదాని యందు) మనస్సు తగిలినవాఁడు, మిక్కిలి యాసక్తి గలవాఁడు.

వి అ పుం విష్ణుదేవుఁడు.

**వ్యజనము** నం వి అ న తాళవృంతము, విసనకఱ్ఱ

**వ్యడంబక(న)ము** నం వి అ పుం ఆముదపుఁ జెట్టు (వృ వి)

**వ్యతికరము** నం విణ [1](అ ఆ అ) 1 పరస్పర మైనది, అన్యోన్యమైనది 2 వ్యాపించునది. 3. అంటియున్నది, చేరియున్నది

వి అ పుం 1, సాంకర్యము, కలయిక 2 సంధి, కలియుట. 3. ఒకదానిపైగొట్టుట. 4. నిరోధము, అడ్డంకి 5 సందర్భపడిన విషయము, తటస్థించిన కార్యము. 6 తటి, అదను 7 కష్టదశ, దుర్దశ 8 పరస్పర సంబంధము 9 వస్తువుల వినిమయము—ఒక వస్తువు నిచ్చి వేఱొకదానిం బుచ్చుకొనుట 10. ఒకటి విడిచి యొకటిగా నుండుట.

**వ్యతికీర్ణము** నం విణ (అ ఆ అ) 1 మిశ్రము చేయఁబడినది, కలుపఁబడినది 2 కూడినది, ఏకీభవించినది.

**వ్యతిక్రమము** నం వి అ పుం 1. మంచి మార్గము నుండి తొలఁగుట 2. అతిక్రమించుట, ఉల్లంఘనము, ఆచరింపక పోవుట 3. అశ్రద్ధచేయుట, అలక్ష్యభావము, ఉపేక్ష 4 వ్యతిరేకము, ప్రాతికూల్యము. 5. పాపము, వ్యసనము, దోషము. 6 దురదృష్టము.

**వ్యతిక్రాంతము** నం విణ (అ ఆ. అ.) 1 అతిక్రమింపఁబడినది, ఉల్లంఘింపఁబడినది. 2 ఉపేక్షితము, అశ్రద్ధ చేయఁబడినది. 3. ప్రతికూలము, విరుద్ధము. 4 కడచినది, గతించినది (కాలము)

**వ్యతిరిక్తము** నం విణ (అ ఆ అ) 1 భిన్నమైనది, వేఱయినది 2 మించినది, అతిశయించినది. 3 ఉపసంహరింపఁ బడినది, మరలించుకొనఁబడినది. 4 వినాయింపఁ బడినది, తప్పింపఁబడినది.

**వ్యతిరేకము** నం వి. అ పుం 1 భేదము 2 ఎడఁబాటు, విడిపోవుట 3. బహిష్కరించుట, వినాయించుట. 4 మించుట, అతిశయించుట 5 వ్యత్యాసము, సామ్యములేమి 6 (తర్క) యుక్తి సరిపడకుండుట (అన్వయ వ్యతిరేకములలో రెండవది)

చూ వ్యతిరేక వ్యాప్తి

7. (అలం) అర్థాలంకారములలో నొకటి.

(ఉపమానము కంటె ఉపమేయ మెక్కువదిగా వర్ణించుట.)

**వ్యతిరేకవ్యాప్తి** నం. వి ఇ స్త్రీ (తర్క) యుక్తి నిలువఁబడతుండుట ఇది యన్వయమునకు వ్యతిరిక్తము సాధ్యము లేనిచోట హేతువును లేక పోవుట (యత్ర సాధ్యాభావ స్తత్ర హేత్వభావ ఇతి వ్యతిరేకవ్యాప్తి)

**వ్యతిరేకి** నం విణ (న్ జి న్.) 1 భిన్నము. వేఱైనది 2 మించినది, అతిశయించినది. 3. చేరకుండునది, అభావమును దెలుపునది

చూ వ్యతిరేక వ్యాప్తి.

**వ్యతిషంగము** నం వి అ పుం 1 పరస్పర సంబంధము 2. అన్యోన్యమేలనము, ఒండొంటితోఁ గలియుట 3. కలయిక, కూడిక 4. రెంటిని కలిపి కట్టుట

**వ్యతిషక్తము** నం విణ (అ ఆ అ) 1. పరస్పర మిళితము, ఒకదానితో నొకటి కలిసి యున్నది 2 సంకీర్ణము, మిశ్రమైనది.

**వ్యతి(తీ)హారము** నం వి అ పుం 1 ద్రవ్య వినిమయము, వస్తువులు మార్చుకొనుట. 2. పరస్పరత, ఒండొరు తొక విధమగు పనిని చేయుట. దెబ్బకు మాఱుదెబ్బ కొట్టుట తిట్టునకు మాఱు తిట్టు తిట్టుట

**వ్యతీతము** నం విణ. (అ ఆ అ) 1. గతించినది, కడచినది 2 చచ్చినది, మృతిచెందినది 3 విడువఁబడినది, త్యజింపఁబడినది. 4 నిర్లక్ష్యము చేయఁబడినది, ఉపేక్షింపఁబడినది

**వ్యతీపాత(ము)** సం వి అ. పుం 1 మహోత్పాతము, సర్వనాశనము, మహాప్రళయము 2.సూచింపఁబడు మహోపద్రవము. 3 అగౌరవము, నిర్లక్ష్యభావము 4 విష్కంభాది యోగములలోఁ బదునేడవది 5. పూర్ణిమా సోమవారముల కలయిక, సోమవారమునఁ బున్నమ యగుట. (అమావాస్యా రవివారముల కూడిక యని వాచ)
తే. పరఁగ సంక్రమణ వ్యతీపాతలందు, సకల భక్తిని వినునట్టి సజ్జనులకు .. భాగ 4 333.
6. కార్యాచరణమున కశుభముగా నెంచఁబడిన సూర్య చంద్రుల కలయిక.

**వ్యత్యయము** సం వి అ పుం 1 దాఁటుట, ఉల్లంఘించుట 2 వ్యతిరేకము, ప్రతికూలత 3 వ్యస్తముగా నుండుట, తడఁబాటు. 4 మార్చుకొనుట, ఒకదాని నిచ్చి వేఱొకటి పుచ్చుకొనుట 5 విఘాతము, అవరోధము, అడ్డంకి

**వ్యత్యస్తము** సం. విశే. (అ అ అ) 1. ప్రతికూలము విరుద్ధము. 2 వ్యతిరేకమైనది, ఎదిరియైనది. 3 పరస్పర సంబంధము లేనిది, అసంగతము. 4. అడ్డముగాఁ దిరిగినది, అడ్డముగా నున్నది

**వ్యత్యాసము** సం. వి అ పుం. 1. విపర్యయము 2. వ్యతిరేకము.

**వ్యథ** సం వి ఆ స్త్రీ 1 బాధ, దుఃఖము, కష్టము. 2. భయము, వెఱపు, 3 కలత, క్షోభము 4 రోగము, జబ్బు.

**వ్యథనము** సం. వి అ న బాధించుట, బాధపెట్టుట, నొప్పించుట.

**వ్యధము** సం వి అ పుం 1 గ్రుచ్చుట, కుట్టుట. 2 గాయపఱచుట 3 రంధ్రము చేయుట, బెజ్జము చేయుట, తొలివేయుట. 4. గాయము, క్షతి.

**వ్యథితము** సం విశే. (అ. ఆ. అ) 1 బాధింపఁబడినది, నొప్పింపఁ బడినది 2. భయపడినది, బెదరినది. 3. క్షుబ్ధము, కలఁత నొందినది

**వ్యధికరణము** సం విశే (అ ఆ అ) 1. భిన్నమయిన (వేఱయిన) యాశ్రయము కలది. 2 పూర్వోత్తర పదములు భిన్న విభక్తులతో నుండు సమాసము, (క) తత్పురుషము--రాజపుత్రుఁడు, చోరంభయము మొ॥ (చ) బహువ్రీహిః – చంద్రమౌళి, చక్రపాణి, శరజన్మ మొ॥
(వ్యతి సమానాధికరణము.)

**వ్యధ్వము** సం వి అ పుం చెడుదారి, తప్పుత్రోవ

**వ్యపగతము** సం విశే (అ ఆ. అ) 1. పోయినది 2 తొలఁగిపోయినది, నివృత్తమైనది 3 శూన్యమైనది, రహితమైనది

**వ్యపత్రపుఁడు** సం విశే (అ ఆ అ) సిగ్గులేనివాఁడు, నిర్లజ్జుఁడు

**వ్యపదిష్టము** సం విశే (అ అ అ) 1 పేర్కొనఁబడినది, పేరుతోఁ బిలువఁబడినది 2. చూపఁబడినది, తెలుపఁబడినది 3 మిషపెట్టఁబడినది

**వ్యపదేశము** సం వి. అ పుం 1 తెలియఁ బఱచుట, ఎఱిఁగించుట 2 పేర్కొనుట 3. పేరు, సంజ్ఞ 4. కుటుంబము, వంగడము, తెగ, జాతి 5 ప్రఖ్యాతి, ప్రసిద్ధి. 6 తంత్రము, కపటోపాయము 7. మోసము, వంచన. 8. భావము దాఁచుట

**వ్యపదేష్ట** సం వి ఋ. పుం. వంచకుఁడు, మోసగాఁడు.

**వ్యపరోపణము** సం వి అ న 1 నిర్మూలించుట, పెల్లగించుట 2. నివారించుట, తొలఁగించుట 3. త్రుంచుట, ఖండించుట

**వ్యపాకృతి** సం వి ఇ స్త్రీ 1. నిరాకరణము, త్రోసివేయుట 2 స్వీకరింపకుండుట, గ్రహింపకుండుట 3 కప్పిపుచ్చుట.

**వ్యపాయము** సం వి అ పుం సమాప్తి, ముగింపు

**వ్యపాశ్రయము** సం వి. అ పుం. 1. ఆశ్రయము, ఆధారము. 2 నిరీక్షణము, ఎదురుచూచుట 3.ఆశ్రయము (శరణము)గాఁ గొనుట, నమ్మియుండుట. 4. మతాంతరము నవలంబించుట. (విల్యమ్సు.)

**వ్యపేతము** సం విశే (అ అ అ) 1 విడిపోయినది, వియుక్తము 2.పోయినది, విడిచిపోయినది, లేనిది, శూన్యమైనది. ఈ యర్థమున తఱచు సమాస పూర్వ పదముగా నుండును
ఉదా · వ్యపేత హర్షుఁడు మొ॥
3. విరుద్ధము, ప్రతికూలము, భిన్నము, వేఱు

**వ్యపేక్ష** సం వి అ స్త్రీ 1 ఎక్కువ యాస, సిరీక్షణము, ఎదురు చూచుట 2. ఆలోచన, తలంపు. 3 పరస్పర సంబంధము 4. అన్యోన్యాశ్రయము, ఒక దాని నాశ్రయించి యొకటి యుండుట 5 ఉపయోగము 6 (వ్యాక.) స్వార్థపర్యవసితము లగు పదములకు ఆకాంక్షాదులచే నగు పరస్పరాన్వయము. 7 రెండు సూత్రముల పరస్పరోపయోగము. (ఆ ని)

**వ్యపేక్షణము** సం. వి అ. న. ఎదురుచూచుట, నిరీక్షించుట

**వ్యపేక్షుడు** సం విశ (అ ఆ అ) 1 ఎదురుచూచువాడు, నిరీక్షించువాడు 2. అవ్యాసక్తి గలవాడు, శ్రద్ధాళుడు 3 ఆలోచించువాడు, తలచువాడు

**వ్యపోఢము** సం. విశ. (అ ఆ అ) 1 తొలగింపబడినది, త్రోసివేయబడినది 2 వ్యతిరేకమైనది 3. కదలబఱుపబడినది, నష్టపఱుపబడినది.

**వ్యపోహము** సం వి అ పుం త్రోసివేయుట, తొలగించుట.

**వ్యభిచరించు** సం అ క్రి తప్పి చరించు.
సీ. పతిభక్తి యుడిగి సంతతమును తమ యిచ్ఛవచ్చిన తెరవుల వ్యభిచరించి వి పు. 8 302.
2 అంకుపోవు (శ. ర.)

**వ్యభిచారము** సం వి అ పుం 1. మంచి మార్గము నుండి తొలగుట. 2 ఉల్లంఘించుట, అతిక్రమించుట. 3. అపరాధము, దోషము, తప్పు. 4. విడిపోవుట 5 అంకుతనము, పరస్త్రీ సంగమము. (స్త్రీలకు పరపురుష సంగమము.) 6.(వ్యాక.) ఒకసూత్రమొకచోట వర్తింపకుండుట, 7 (తర్క.) సాధ్యము లేని తావున హేతు వుండుట. (హేతోః సాధ్యాభావవద్వృత్తిత్వం వ్యభిచారః)

**వ్యభిచారి** సం. విశ (న్ ఈ న్) 1. మంచి త్రోవ నుండి తొలగినది . క్రమము తప్పినది 3 అసత్యమైనది, నిజముకానిది 4. వ్యభిచరించువాడు, పరస్త్రీని పొందువాడు. 5 కాముకుడు, విషయాసక్తుడు, 6 అంకుటాలు. 7 ప్రసిద్ధార్థమును విడిచినది-గౌణార్థముగలది (పదము)
వి. న్. పుం. వ్యభిచారి భావము.

**వ్యభిచారిభావము** సం వి అ. పుం రసోత్పాదనమునకు సహకారి యగు భావము
(ఇవి రసోత్పాదనమునకు ముఖ్య సాధనములు కాకపోయినను రస పోషకములు. ఇవి ముప్పది మూడు, ముప్పది నాలుగని కొందఱు)

**వ్యయ** సం. వి అ నం ఒక సంవత్సరము.

**వ్యయము** సం విశ (అ ఆ అ.) నశ్వరము, నశించు స్వభావము గలది.
వి అ పుం. 1 నాశము,నష్టి 2 వెచ్చించుట, పరిత్యాగము. 3 విఘాతము, అడ్డంకి, విఘ్నము 4 క్షయము, తఱుగు, భ్రంశము 5 వెచ్చముకర్చు

**వ్యయనము** సం వి అ న 1. వ్యయపఱచుట, వెచ్చించుట 2 వ్యర్థపుచ్చుట, పాడుచేయుట

**వ్యయపరాఙ్ముఖుడు** సం విశ.(అ ఆ ఈ అ) లోభి, పిసినారి, కర్చుపెట్టనివాడు.

**వ్యయవాదికాడు** మి వి (వ్యయము+వాది+కాడు) వెచ్చము సేయువాడు, వ్యయశీలుడు
సీ. ఎల్లభక్తులను గొల్లగా వేడిన వరములీగల వ్యయవాదికాడు, సచరాచర ప్రపంచమ్మును బాలించు రాచటికము కాణాచికాడు, మిక్కిలి కనుమంట మింటబాఱు పురాలు భస్మంబు చేసిన పంతగాడు . వరాహ. 11 14.

**వ్యయశీలుడు** సం విశ (అ ఆ అ.) కర్చుపెట్టు స్వభావము గలవాడు, అతి వ్యయము చేయువాడు

**వ్యయించు** సం న క్రి వ్యయముచేయు, వెచ్చము చేయు, వెచ్చించు. (శ ర)
చ. ... పరార్థమై తనూ, ధనము వ్యయింగల్గుట కదా జనసైక ఫలంబెఱింగిరి. హ 2 78.

**వ్యయితము** నం విణ (అ ఆ. అ) వెచ్చింపఁబడినది, కర్చుపెట్టఁ బడినది 2 వ్యర్థముచేయఁ బడినది

**వ్యర్థము** నం విణ (అ ఆ అ) నిష్ప్రయోజనము, పనికి మాలినది 2 నిష్ఫలము, లాభములేనిది 3. అర్థము లేనిది

**వ్యళీకము** నం వి అ న. 1 ప్రియము 2 అకార్యము 3. అచ్చెరుపాటు 4 అసత్యము 5 బాధ 6. సిగ్గు 7 మోసపుచ్చుట 8 మన్మథాపేశముచేఁ జేయఁబడిన కామినీ జనాపరాధము

**వ్యవకలనము** నం వి. అ న 1 విడదీయుట విభజించుట 2 (గణిత) తీసివేత (వ్యతి సంకలనము)

**వ్యవకలితము** నం విణ (అ ఆ అ) విడదీయఁ బడినది, విభజింపఁ బడినది. (గణిత) తీసివేయఁ బడినది

**వ్యవక్రోశము** నం. వి అ. న 1. ఒకనినొకఁడు తిట్టుకొనుట 2 నింద, దూఱు

**వ్యవచ్ఛేదము** నం వి అ పుం 1 ఛేదించుట, వఱుకుట. 2 వేఱుపఱుచుట, విభాగించుట. 3 వేర్వేరు భాగములుగాఁ గోసివేయుట. 4 ప్రత్యేకపఱుచుట, విశేషపఱుచుట. 5. భేదపఱుచుట 6 భేదము, వ్యత్యాసము 7. నిర్ణయము 8. (బాణాదులను) ప్రయోగించుట 9 గ్రంథముయొక్క భాగము, పరిచ్ఛేదము.

**వ్యవధ** నం వి. అ స్త్రీ 1 ఒక వస్తువును మఱుగు పఱుచు వస్తువు, (కప్పు, తెర, గోడ మొ) 2. మఱుగు, చోటు.

**వ్యవధానము** నం. వి. అ. న 1. నడుమ వచ్చుట, అడ్డుగా నుండుట 2 అడ్డు, నిరోధము 3 కనఁబడమి, మఱుగగుట 4 తెంగోడ మొ అడ్డు. 5. ఆచ్ఛాదనము, కప్పు 6 అవకాశము, తెఱపి. 7. (వ్యాక.) (అక్షరము) నడుమ నుండుట

**వ్యవధాయకము** నం విణ (అ యికా అ) 1 నడుమ వచ్చునది, అవరోధకము, విఘ్నము చేయునది. 2 అడ్డుగానుండునది, మఱుఁగు పఱుచునది. 3. నడుమనున్నది, మధ్యమన్నది.

**వ్యవధి** నం వి ఇ పుం వ్యవధానము

**వ్యవసాయము** నం వి అ పుం. 1 యత్నము, పూనిక, ఉద్యమము 2. దృఢ నిశ్చయము 3 పని, కృత్యము 4 చేఁత, ఆచరణము. 5 వ్యాపారము, ఉద్యోగము, వర్తకము. 6. వృత్తి, జీవనాధారము, బ్రదుకుఁదెరవు 7 ప్రవర్తనము. నడవడి 8. యుక్తి, ఉపాయము, పన్నుగడ 9 డంబము, బడాయికొట్టుట 10 కృషి, సేద్యము. (ఈయర్థము తెలుఁగు గ్రంథములందె కానవచ్చుచున్నది.)

**వ్యవసాయి** నం విణ (న్. సీ. న్) 1 పూనిక గలవాఁడు, పాటుపడువాఁడు 2 అభినివేశము గలవాఁడు, దృఢనిశ్చయుఁడు 3. చేయువాఁడు, ఆచరించువాఁడు 4 వృత్తిలోఁ బ్రవేశించిన వాఁడు

వి న్ పుం 1 వర్తకుఁడు, బేహారి, వణిజుఁడు

**వ్యవసితము** నం విణ. (అ ఆ అ) 1 యత్నింపఁబడినది 2 అవలంబింపఁ బడినది, పూనుకొనినది. 3 నిశ్చయింపఁబడినది, స్థిరపఱుపఁ బడినది. 4 పన్నఁబడినది, ఆలోచింపఁ బడినది 5 పూనికగలది, దృఢనిశ్చయము గలది 6 బలముగలది, శక్తిగలది 7. వంచింపఁ బడినది, మోసపుచ్చఁబడినది.

వి అ. న నిశ్చయము

**వ్యవస్థ** నం. వి. ఆ. స్త్రీ 1 ఏర్పాటు, కట్టుబాటు. (వర్ణాశ్రమ వ్యవస్థ.) 2. నిర్ణయము, 3 స్థైర్యము, నిలుకడ. 4. సాపేక్షమైన స్థితి, ఒక దానితో సంబంధించి యుండుట 5. శాసనము, చట్టము, శాస్త్ర మర్యాద, సందిగ్ధాంశములయందు పరస్పర విరుద్ధ శాస్త్రవాక్యములు గల చోట్ల వానిని సరిపుచ్చి వ్రాయఁబడిన నిర్ణయము 6 అంగీకారము, ఒడంబడిక. 7 స్థితి, వస్తువుల స్థితి 8 విభజనము.

**వ్యవస్థానము** నం వి అ న వ్యవస్థ.

**వ్యవస్థాపకుఁడు** నం విణ (అ వికా అ) 1 ఏర్పాటు చేయువాఁడు, క్రయమును బెట్టువాఁడు, సరిపుచ్చువాఁడు. 2. న్యాయ్యమైన అభిప్రాయ మిచ్చువాఁడు 3. పని నడిపించు వాఁడు, కార్యనిర్వాహకుఁడు.

వ్యవస్థాపనము సం వి అ. న 1 ఏర్పాటుచేయుట, కట్టుబాటు గావించుట 2 నిశ్చయించుట 3 నిలుపుట, ఉంచుట

వ్యవస్థాపితము సం విశే (అ అ అ) 1. ఏర్పాటు చేయబడినది, ఏర్పఱుపఁబడినది 2. స్థిరపఱుపఁబడినది 3 నిలుపఁబడినది, ఉంచఁబడినది

వ్యవస్థితము సం. విశే (అ అ. అ.) 1 క్రమపద్ధతిలో నుంచఁబడినది, ఏర్పఱుపఁబడినది 2 స్థిరపఱుపఁబడినది. 3 నిశ్చయింపఁబడినది, చేట్టముచే నిర్ణయింపఁబడినది 4. ప్రక్కగా నున్నది. వేఱు చేయఁబడినది 5 ఎత్తివ్రాయఁబడినది 6 (ఒక దానిని)అనుకొని యున్నది,(ఒక దానిపైని) ఆధారపడి యున్నది

వ్యవస్థిత విభాష సం వి అ స్త్రీ (వ్యాక) కొన్నిచోట్లనే ప్రవర్తించునట్లు నిర్ణయింపఁబడిన వికల్పము.

వ్యవస్థితి సం. వి ఇ స్త్రీ వ్యవస్థానము

వ్యవహర్త సం వి ఋ పుం 1 కార్యనిర్వాహకుఁడు, పని నెఱవేర్చువాఁడు, 2. వ్యాజ్యెము వేయువాఁడు, వాది 3. న్యాయాధికారి, తీర్పు చెప్పువాఁడు 4 భాగస్వామి.

వ్యవహారకుఁడు సం వి. అ పుం వ్యాపారము చేయువాఁడు, వణిజుఁడు, వర్తకుఁడు

వ్యవహారజ్ఞుఁడు సం విశే (అ. అ అ) 1 వ్యవహారము తెలిసినవాఁడు 2. వ్యవహారార్హమైన వయసు గలవాఁడు 3 న్యాయ సంబంధమైన వ్యాపార మెఱిగినవాఁడు

వ్యవహార దర్శనము సం వి. అ న వ్యాజ్యెము విచారించుట, న్యాయ సంబంధమైన వ్యవహారమును పరిశీలించుట

వ్యవహారపదము సం వి అ. న, వ్యవహార విషయము

వ్యవహార పాదము సం. వి అ పుం 1 పూర్వపక్షము =(వ్యాజ్యెము) అభియోగము తెచ్చుట, ఉత్తరపక్షము = ప్రతివాదము, (ప్రతివాది చెప్పు సమాధానము) క్రియాపాతము = వాఙ్మూలముగా గాని, వ్రాతమూలముగా గాని సాక్ష్యము పుచ్చుకొనుట, నిర్ణయపాదము =నిర్ణయించుట—(తీర్పు) అను న్యాయసంబంధమైన వ్యవహార స్థితులలో నొకటి 2 నిర్ణయపాదము, తీర్పు చెప్పుట.

వ్యవహార మాతృక సం వి అ స్త్రీ 1 వ్యవహారము నిర్ణయించుటకు న్యాయాధికారులు చేయు క్రియాకలాపము 2. న్యాయ పరిపాలనమునకు సంబంధించిన పని (ముప్పది మంది సభ్యులు గల) న్యాయసభకు సంబంధించిన విషయము

వ్యవహార మార్గము సం వి అ పుం వ్యవహార విషయము.

వ్యవహారము సం వి అ పుం 1 నడవడి, ప్రవర్తనము 2 పని, కార్యము 3 వృత్తి, జీవిక 4. వ్యాపారము 5 వాణిజ్యము, వర్తకము, బేహారము 6 వడ్డీ వ్యాపారము, ఎక్కువ వడ్డీకి సొమ్మునిప్పిచ్చుట. 7. ఆచారము, వాడుక. 8 సంబంధము 9. వ్యాజ్యెము విచారించుట 10. తగవు, అభియోగము, వ్యాజ్యెము వేయుట, దావా చేయుట, 11 వ్యాజ్యెము తెచ్చుట కధికారము. 12. సహాసనము, సహభోజనము మొ॥ (వాచ)

వ్యవహార విధి సం. వి ఇ పుం న్యాయశాసనము, ధర్మశాస్త్రము

వ్యవహార విషయము సం వి అ పుం. తగవునకు దగిన విషయము, వ్యాజ్యెము తీసికొని రాఁదగిన యంశము.

వ్యవహార స్థానము సం వి అ పుం వ్యవహార విషయము.

వ్యవహారాంగము సం వి అ. న న్యాయసభ యొక్కయు, శిక్షాస్మృతి యొక్కయు శరీరము

వ్యవహారాభిశస్తుఁడు సం. విశే (అ అ అ) నేరము మోపఁబడిన వాఁడు, దోషిగా నెంచఁబడిన వాఁడు

వ్యవహారి సం విణ. (న్. జీ న్) స్త్రీ రూ వ్యవహారిణి 1 వ్యవహారము జరుపువాఁడు 2 వ్యాపారము చేయువాఁడు 3 పని చేయువాఁడు 4. వాడుకగా నున్నది, ఆచార ప్రాప్తమైనది,
వి న్ పుం వణిజుఁడు, బేహారి.

వ్యవహారిక సం వి ఆ. స్త్రీ 1. వాడుక, ఆచారము 2 చీపురుకట్ట 3 ఇంగుదీ వృక్షము (వృ. వి)

వ్యవహారికము సం విణ (అ ఆ అ) 1 వ్యాపార సంబంధమైనది 2 పనిలోఁ బెట్టఁ బడినది, అవరణములో నుంచఁబడినది 3 న్యాయసంబంధమైనది 4 వ్యాజ్యెముతో సంబంధించినది 5. వాడుకలో నున్నది, ఆచారమై యున్నది

వ్యవహార్యము సం విణ.(అ ఆ అ) 1. ఆచారమై యున్నది 2 అభియోగము తీసికొని రాఁదగినది

వ్యవహితము సం విణ (అ ఆ అ) 1 వేఱుగా నుంచఁబడినది 2 తెఱ మొదలగు వానిచే మఱుఁగు పఱుపఁబడినది 3 ఆటంక పఱుపఁబడినది, విఘ్నము చేయఁబడినది 4 దాఁచఁబడినది 5. దూరముగా నున్నది 6. దూరస్థము చేయఁబడినది, ఆచరింపఁబడినది 7. త్యజింపఁ బడినది, విడువఁ బడినది 8 మించినది, అతిశయించినది. 9 విరుద్ధము, ప్రతికూలమైనది

వ్యవహృతి సం వి ఇ స్త్రీ. 1 అలవాటు, అభ్యాసము, వాడుక. 2 ఆచరణ, చేఁత.

వ్యవాయము సం వి ఆ పుం 1 విడిపోవుట, భాగములుగా వేర్పడుట. 2. కరఁగుట 3 ఆచ్ఛాదనము, కప్పు, మఱుఁగు. 4. మధ్యవర్తనము, వ్యవధానము, ఎడము 5. విఘ్నము, అడ్డు 6 మైథునము, రతి. 7 పవిత్రత, పరిశుద్ధి
వ తేజస్సు, ప్రకాశము.

వ్యవాయి సం. విణ. (న్. నీ న్) 1. భాగములుగా విడినది, విడిపోయినది. 2 విషయములందత్యాసక్తి కలది, మైథునేచ్ఛ గలది.
వి న్ పుం 1. ఇంద్రియసుఖము కోరువాఁడు, విషయాసక్తుఁడు 2 వీర్యవృద్ధికరమైన

వ్యలీకము సం విణ (అ ఆ అ) 1 అసత్యమైనది, నిజము కానిది 2 అనిష్టము, అప్రియమైనది, కష్టము తోఁపించునది 3 చేయఁదగనిది, అకార్యము 4 అసత్యము కానిది, సత్యమైనది
వి అ న 1 అనిష్ట పదార్థము 2 బాధ, దుఃఖము, వ్యథ 3 అపరాధము, తప్పు, అనుచిత కార్యము 4 మోసము, వంచన. 5 అసత్యము 6 వ్యతిరేకము, ప్రాతిరూప్యము 7 గతి విపర్యయము (వాచ)

వ్యష్టి సం వి ఇ స్త్రీ 1 ప్రత్యేకముగ నుండుట, ఒంటరితనము, భిన్న వ్యక్తిత్వము (వ్యతి సమష్టి) 2 (వేదాంత) భిన్నాభిన్న దేహములతోఁ గూడఁబడిన మొత్తము

వ్యసనము సం వి అ న. 1 త్రోసివేయుట. 2 విభజించుట 3. ఉల్లంఘనము, మీఱుట 4 నాశము, భ్రంశము, పతనము 5 కష్టము, దుఃఖము, ఉపద్రవము 6. ఆపద. 7 సూర్యచంద్రాదుల యస్తమయము, క్రుంకుట 8 దురభ్యాసము, చెడ్డయలవాటు (జూదము, పానము మొ) 9 అత్యాసక్తి 10 మితిమీఱిన యభ్యాసము, అమితాభ్యాసము 11. దోషము 12 అసమర్థత, శక్తిలేమి 13.నిష్ఫల యత్నము 14 ప్రత్యేకత, ఒంటరితనము

వ్యసన ప్రహారి సం. విణ. (న్. జీ న్) 1. కష్ట దశలో శత్రువును గొట్టెడు వాఁడు 2. హాని కలిగించువాఁడు, శ్రమపెట్టువాఁడు

వ్యసనాతి భారము సం. వి అ పుం దుర్భరమైన యాపత్తు, దుఃఖాతిశయము

వ్యసని సం విణ (న్ నీ న్) 1 వ్యసనము గలవాఁడు, దురభ్యాసము గలవాఁడు. 2. దురదృష్టవంతుఁడు (సమాసాంతమున) మిక్కిలి యాసక్తి గలవాఁడు, తత్పరత గలవాఁడు.

వ్యసువు సం. విణ. (ఉ) ప్రాణము పోయినవాఁడు

వ్యస్తపదము సం వి అ న 1 అభియోగమున (వ్యాజ్యెమున) నిర్ణయింప వీలులేని వాదము. 2. విడిమాట, సమస్తము కాని పదము.

వ్యస్తము సం విణ (అ ఆ అ) 1 త్రోసివేయఁబడినది 2 చెదిరినది, రేగినది 3 చెదరగొట్టఁబడినది 4 విడదీయఁ బడినది, విభజింపఁబడినది 5 మొత్తము వస్తువులలో నొక్కొక్కటి, భిన్నము 6 విడిగా నున్నది, సమస్తము కానిది (పదము) 7 నానా ప్రకారమైనది, భిన్న భిన్న విధమైనది 8 త్రోసి వేయఁబడినది. 9 కలఁత నొందినది, తొట్రుపడినది 10 క్రమము తప్పినది, వ్యతిక్రమము 11 విపరీతము, తలక్రిందైనది 12 రెండు సంఖ్యలకు గల సంబంధము, తలక్రిందైనది, లేక విలోమమైనది 13 వ్యాపించినది

వ్యస్తారము సం వి అ పుం ఏనుఁగు కుంభస్థలము నుండి మదము కాఱుట, మదస్రావము

# వ్యా

వ్యాకరణము సం వి అ న 1. (వాక్యము మొదలగు వానిని) విడఁదీయుట. 2. శబ్దనిష్పత్తినిఁ దెలుపు శాస్త్రము, శబ్దశాస్త్రము, వేదాంగములలో నొకటి 3 వివరణము, వ్యాఖ్యానము చేయుట 4 (వేదాంత) నామరూపములచే జగద్వికాసనము.

వ్యాకారము సం వి అ పుం 1 రూపము మాఱుట 2 అంగ వికారము

వ్యాకీర్ణము సం. విణ (అ. ఆ అ) చిమ్మఁబడినది, పలువైపుల విసరివేయఁ బడినది

వి అ న (వ్యాక.) విభక్తుల విపర్యయము

వ్యాకూతి సం వి ఇ స్త్రీ వంచన, మోసము.

వ్యాకులితము సం. విణ (అ ఆ అ) క్షుబ్ధము, కలత నొందినది

వ్యాకులము సం విణ. (అ ఆ అ) 1 క్షోభపడినది, కలఁత నొందినది 2 భయపడినది, బెదరినది 3. పూర్ణముగా నిండినది, లొంగినది, లోనైనది 4 తత్పరము, మిక్కిలి యాసక్తిగలది 5 కదులునది, చలించునది. 6. రోగాదులచేఁ గర్తవ్యము నెఱుఁగనిది.

వ్యాకృతము సం విణ (అ ఆ అ) 1 విడఁదీయఁబడినది (వాక్యము మొ) 2 వివరింపఁబడినది, వ్యాఖ్యాతము 3 కురూపము, అంగవికారము గలది

వ్యాకృతి సం వి ఇ. స్త్రీ 1 (వాక్యాదులను) విడఁదీయుట 2 వివరణము, వ్యాఖ్యానము 3 రూపముమాపు 4 వ్యాకరణ శాస్త్రము.

వ్యాకోశ(ష)ము సం విణ (అ ఆ అ 1 వికసించినది, వి... 2 వృద్ధిపొందినది, పెంపొందినది

వ్యాక్షిప్తము సం విణ (అ ఆ అ) 1 చిమ్మఁబడినది, విసరివేయఁబడినది 2 ముక్కలయినది, ఖండములైనది, విఱిగినది, చెదరినది. (మనసు.)

వ్యాక్షేపము సం వి అ పుం 1. విసరి వేయుట, ఇటునటు చిమ్ముట 2 విఘాతము, అడ్డంకి. 3 విలంబము, ఆలస్యము 4. (మనస్సు) చెదరుట, కలవరపాటు.

వ్యాక్షోభము సం. వి అ పుం. క్షోభము, కలత,

వ్యాఖ్య సం వి ఆ స్త్రీ 1. వివరణము, టిప్పణము. 2 కథనము, చెప్పుట.

వ్యాఖ్యాత సం విణ. (ఋ త్రీ ఋ) వ్యాఖ్యానము చేయువాఁడు, వివరించువాఁడు, విప్పిచెప్పువాఁడు.

వ్యాఖ్యాతము సం. విణ. (అ ఆ. అ) వ్యాఖ్యానము చేయఁబడినది, వివరింపఁ బడినది, విప్పిచెప్పఁ బడినది 2 చెప్పఁబడినది, కథితము

వ్యాఖ్యానము సం వి అ న 1 కథనము, చెప్పుట 2 ఉపన్యాసము 3 వివరణము, సందర్భాదులతోఁ గూడ అర్థమును విశదపఱచుట. (ఇది యైదు లక్షణములు గలది )

శ్లో॥ పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా, ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం పంచలక్షణమ్ )

వ్యాఘట్టనము సం వి అ న 1. మథించుట, త్రచ్చుట 2 రాపిడి, ఘర్షణము.

వ్యాఘాతకము సం విణ (అ ఆ అ) 1 తాఁకునది, 2. ఎదిరించునది, ప్రతిఘటించునది, అడ్డగించునది.

**వ్యాఘాతము** నం వి అ పుం 1 తాఁకుట, కొట్టుట. 2 దెబ్బ 3 విఘ్నము, అంతరాయము 4 ప్రతిబంధము, అడ్డు 5. వ్యతిరేకము 6. ఉల్లంఘనము, చెప్పినట్లు చేయమి 7. (జ్యోతి) విష్కంభాది యోగములలో నొకటి 8. అర్థాలంకార విశేషము

క. ఒండొకటి వేళ నొకపని, యకలంకతఁజేయ దాని నాహేతువుచే, నొకఁడు మఱివేఱ సేయఁగఁ, బ్రకట వ్యాఘాతము . నరస 5 210

**వ్యాఘ్రదలము** నం వి అ పుం 1 ఆముదపుఁజెట్టు.

**వ్యాఘ్రనఖము** నం వి అ. పుం న. పెద్దపులి గోరు, పులిగోరు 2 నఖమను సుగంధద్రవ్య విశేషము 3. నఖక్షతము, గోటిగీఱు.

**వ్యాఘ్రనాయకము** నం వి. అ పుం సృగాలము, నక్క.

**వ్యాఘ్రపా(త్తు)దము** నం. వి అ పుం. ద్ పుం. పుల్లవెలఁగ (వృ వి)

**వ్యాఘ్రపాదుఁడు** నం విఆ. (అ ఆ అ) ద్ పెద్దపులి పాదము వంటి పాదములు గలవాఁడు

వి అ పుం ఒకానొక ముని, (వాచ)

**వ్యాఘ్రపుచ్ఛము** నం వి అ. పుం ఆముదపుఁజెట్టు.

**వ్యాఘ్రము** నం వి అ. పుం 1. పెద్దపులి. 2. (సమాసోత్తర పదమైనపుడు) స్వజాతి శ్రేష్ఠము.

ఉదా పురుష వ్యాఘ్రము,

3 ఎఱ్ఱయాముదపుఁజెట్టు 4. కానుగ, కరంజము. (వృ వి.)

**వ్యాఘ్రశునము** నం. వి. న్. పుం. పెద్దపులిని బోలిన కుక్క.

**వ్యాఘ్రాటము** నం. వి ఆ పుం. భరద్వాజ పక్షి

**వ్యాఘ్రాస్యము** నం వి అ పుం. మార్జాలము, పిల్లి.

**వ్యాఘ్రి** నం. వి. ఈ స్త్రీ ఆఁడుపులి, వాఁకుడు. (వృ. వి.)

**వ్యాజనింద** నం వి ఆ స్త్రీ 1. అన్యాపదేశముగా నిందించుట. 2 అర్థాలంకార విశేషము. (ఒకనింగాని వేఱొక నింద వ్యక్తమగుట.

శ్లో. నిందాయా నిందయా వ్యక్తి ర్వ్యాజనిందేతి గీయతే.)

**వ్యాజము** నం వి అ పుం 1 కపటము, వంచన, మోసము 2 తన పనికై యొకటి చెప్పి ఒకటి చేయుట, అపదేశము. 3. నటనము, లేనిది తెచ్చి పెట్టుకొనుట 4 తంత్రము, పన్నుగడ. 5. దురాగ్రత, చెడ్డతనము.

**వ్యాజస్తుతి** నం. వి ఇ స్త్రీ 1 కపటస్తుతి, పైకి స్తుతించునట్లు నటించుట 2 అర్థాలంకార విశేషము "స్తుతిచే నిందయు, నిందచే స్తుతియు గలుగునట్లు చెప్పుట"

**వ్యాజోక్తి** నం వి. ఇ స్త్రీ 1 కపటముగాఁ జెప్పుట 2. సూచన 3 ఒకానొక యర్థాలంకారము, వేఱు హేతువును జెప్పి నిజస్థితిని గప్పిపుచ్చుట

**వ్యాడ(ళ)ము** నం వి అ. పుం 1 క్రూరమృగము-పెద్దపులి మున్నగు మాంస భక్షక జంతువు. 2 పాము.

**వ్యాడి** నం వి ఇ పుం 1 వ్యాకరణ శాస్త్రమున సంగ్రహ మను గ్రంథమును రచించిన వైయాకరణ శ్రేష్ఠుఁడు 2 ఒకానొక ముని

**వ్యాడు(ళు)ఁడు** నం. విఆ (అ ఆ అ) 1. దురాగ్రుఁడు, 2 మోసగాఁడు, వంచకుఁడు

వి. అ పుం ఇంద్రుఁడు

**వ్యాత్తము** నం విఆ (అ. ఆ అ.) తెఱవఁబడినది, విస్తృతమైనది.

వి అ న తెఱచిన నోరు

**వ్యాత్యుక్షీ** నం వి ఈ స్త్రీ జలక్రీడా విశేషము, ఒకరిపై నొకరు నీరు చల్లుకొనుచు నీటిలో నాడుట

**వ్యాదానము** నం వి. అ. న తెఱచుట, విస్తరింపఁజేయుట

**వ్యాధభీతము** నం వి అ. పుం మృగము, లేడి.

**వ్యాధామ(వ)ము** నం వి అ పుం. వజ్రాయుధము, ఇంద్రుని యాయుధము.

**వ్యాధి** నం విఆ (న్ సి. న్) గ్రుచ్చుకొనునది, గాయపఱుచునది.

సం వి ఇ పుం 1 రోగము, జబ్బు, తెగులు 2 కుష్ఠరోగము

**వ్యాధితుఁడు** సం. విణ (అ ఆ అ) రోగము గల వాడు, రోగి, జబ్బుచేసినవాఁడు

**వ్యాధుఁడు** సం. వి అ పుం 1 వేఁటగాఁడు, బోయ వాఁడు, కిరాతుఁడు 2 సంకరజాతి పురుషుఁడు విణ (అ ఆ అ) దుష్టుఁడు, చెడ్డవాఁడు

**వ్యాధూతము** సం విణ (అ ఆ అ) కంపింపఁ జేయ బడినది, కంపితము, చలింపఁజేయఁ బడినది

**వ్యానతము** సం వి అ న రతిబంధ విశేషము

**వ్యానము** సం వి అ పుం ప్రాణాదివాయువు లయిదింటిలో నొకటి (ఇది సర్వశరీరమును వ్యాపించి యుండును)

**వ్యాపకము** సం విణ (అ విశా అ) 1 వ్యాపించునది, అంతటను బ్రసరించునది 2 (న్యాయ) వాదార్థము అన్నియుఁ గలది 3 నిత్యసంబంధము గలది, ఎప్పుడును విడువకుండునది 4 వ్యాప్యము కంటె అధిక దేశమందుండునది 5. ఆచ్ఛాదనము, సహజగుణము

వి అ పుం స్వాభావిక గుణము, సహజ గుణము

**వ్యాపత్తి** సం వి ఇ. స్త్రీ 1 నాశనము 2 ఆపద, కష్టము. 3 మరణము.

**వ్యాపత్తు** సం వి త్ స్త్రీ 1 కష్టము, ఆపద, దుర్దశ 2. నాశము. 3 మరణము, చావు

**వ్యాపనము** సం వి అ న 1 వ్యాపించుట, అంతటను బ్రసరించుట 2 కప్పుట, ఆచ్ఛాదించుట

**వ్యాపన్నము** సం విణ (అ ఆ అ) 1 చెడినది, పాడైనది 2. తప్పిపోయినది 3 ఆపద నొందినది, దుర్దశలో నున్నది 4 చచ్చినది, మృతినొందినది.

**వ్యాపరించు** సం అ క్రి ప్రవర్తించు, వర్తించు

సీ తన పదాబ్జములపైఁ దరుణి నిశ్చలమైన చూపులు తేటులై వ్యాపరింప ... తపతీ 5 15

**వ్యాపాదకము** సం విణ (అ ఆ అ) హింసించునది, చంపునది

**వ్యాపాదనము** సం వి అ పుం 1 చంపుట, హింసించుట 2 నాశము, ధ్వంసము 3 దుష్టభావము, ద్రోహ చింతనము, పరుల కనిష్టమును గోరుట

**వ్యాపాదితము** సం విణ (అ ఆ. అ) 1 చంపఁ బడినది, నశింపఁ జేయఁబడినది 2 చెఱుపఁ బడినది, పాడు చేయఁబడినది, కీడు కలిగింపఁ బడినది

**వ్యాపారము** సం వి అ పుం 1. పని, వ్యవహారము, కార్యము

క. ఆ పురవర మణిలో గుణదీపక నామమున భూమి దేవుం డలరుం, బూపట్టి వేదశాస్త్ర, వ్యాపారము చేత రెండవ విధాతయనన్ హంస 1 150

2. వృత్తి, జీవిక 3 వాణిజ్యము, వర్తకము 4. (బాణాదుల) ప్రయోగము 5 ఆచరించుట, పనిచేయుట 6 ప్రయత్నము 7 అభ్యాసము, నేర్చుట

**వ్యాపారి** సం విణ (న్ నీ న్) 1 వ్యాపారము చేయువాఁడు, వర్తకుఁడు, వణిజుఁడు 2 అభ్యసించువాఁడు, అలవఱుచు కొనువాఁడు

**వ్యాపారితము** సం విణ (అ ఆ అ.) 1. పని గలిగి యున్నది, నియమింపఁబడినది. 2 ఉంచఁబడినది, స్థిరము చేయఁబడినది

**వ్యాపి** సం విణ. (న్ నీ న్) 1 (సమాసాంతమున) వ్యాపించునది, నిండునది 2 అంతటను నిండునది, సర్వ వ్యాపకము 3 కప్పునది, ఆచ్ఛాదించునది

వి న్ పుం 1 విష్ణువు 2 వ్యాపించు గుణము.

**వ్యాపించు** సం స క్రి పర్వు, అలముకొను

వ. నేత్రాది పంచద్వార ప్రవిష్టుండై సర్వంబును వ్యాపించు...మార్కం 1 89

**వ్యాపృతము** సం విణ (అ ఆ అ) 1 పనిలో నున్నది, వ్యాపారము గలది, పని గలిగినది. 2 ఉంచబడినది, దృఢముగా నిలుపఁ బడినది

**వ్యాపృతి** సం వి ఇ. స్త్రీ 1 వ్యాపారము, పని, కార్యము 2 ఆచరించుట 3 ప్రయత్నము, పూనిక 4 వృత్తి, జీవిక. 5 అభ్యాసము,

**వ్యాపృతుఁడు** సం వి అ, పుం ఉద్యోగస్థుఁడు మంత్రి.

**వ్యాప్తము** సం. విణ (అ ఆ అ) 1. వ్యాపించునది, ప్రసరించునది, క్రమ్మినది 2 అంతటను వ్యాపించునది. 3. నిండినది 4 చుట్టి వాఱినది, ఆవరించినది. 5 ఉంచఁబడినది, కూర్పఁబడినది 6 సంపాదింపఁబడినది, పొందఁబడినది 7, అంతర్గతము, ఇమిడి యున్నది 8 విడువకుండునది 9 ప్రసిద్ధమైనది 10 చేఁపఁబడినది, విస్తృతము

**వ్యాప్తి** సం వి ఇ స్త్రీ 1 వ్యాపించుట, ప్రసరించుట 2 (తర్క) ఎప్పుడును విడువకుండుట, నియత సాహచర్యము ('ఎక్కడెక్కడ పొగ యుండునో అక్కడక్కడ యగ్ని యుండును,' అనెడి సాహచర్య నియమము వ్యాప్తి) 3 సర్వ సామాన్య సూత్రము, సామాన్య నియమము 4 నిండుట, సమృద్ధి 5 సంపాదనము, లబ్ధి లాభము 6 సర్వవ్యాపకత్వము అంతటను నిండి యుండుట, అష్టవిభూతులలో నొకటి 7 పని, కృత్యము

మ...మా యిండ్లలో, సకల వ్యాప్తులు డించి భాగ 10 986

**వ్యాప్యత్వము** సం. వి. అ న ఎప్పుడును విడువకుండుట, నిత్యసంబంధము

**వ్యాప్యము** సం విణ (అ ఆ అ) 1 వ్యాపింపఁదగినది 2, వ్యాపించినది 3 అల్ప దేశవృత్తి' కొంత ప్రదేశమందు మాత్ర ముండునది

వి అ. న 1 (తర్క) అనుమితి సాధనము 2, సాధనము 3 ఓషధీ విశేషము

**వ్యాభ్యుక్షీ** సం వి ఈ స్త్రీ వ్యాభ్యుక్షి

**వ్యామనము** సం వి అ న. వ్యామము.

**వ్యామము** సం వి అ పుం అడ్డముగాఁ జాఁపఁబడిన చేతుల నడిమి కొలత, బార.

**వ్యామిశ్రము** సం విణ (అ ఆ అ) కలసి పోయినది. మిశ్రమైనది

**వ్యామోహము** సం వి. అ పుం 1 అత్యంత మోహము, మిక్కుటంపు ప్రేమ 2 కలఁత, క్షోభము

**వ్యాయతము** సం విణ (అ ఆ అ) 1 పొడవైనది, దీర్ఘమైనది 2 విశాలమైనది, విరివియైనది. 3 వ్యాపారము గలది, పని గలది 4.వినీతమైనది, అలవఱుపఁబడినది, 5 దృఢమైనది, బలము గలది. 6. లోఁతైనది

వి అ. న దైర్ఘ్యము, పొడువు

**వ్యాయామము** సం. వి అ పుం. 1. చాఁచుట 2.శరీర పరిశ్రమము, ఒడలి కష్టము 3.మార్గాయాసము 4 ప్రయత్నము 5 పోరు, యుద్ధము. 6. పని, వ్యాపారము, వృత్తి, జీవిక.7. కష్టము 8 వ్యామము, బార

**వ్యాయామి** సం విణ (న్ నీ న్.) దేహ పరిశ్రమము చేయువాఁడు

**వ్యాయామికుఁడు** సం విణ (అ ఈ అ) దేహ పరిశ్రమము చేయువాఁడు

**వ్యాయోగము** సం వి అ పుం ఏకాంకమగు రూపక విశేషము.

ఉదా నరకాసుర వ్యాయోగము

**వ్యాలంబము** సం వి అ పుం ఒక జాతి, ఆముదపుఁ జెట్టు

**వ్యాలకము** సం. వి అ పుం దుష్టగజము, చెడ్డ యేనుఁగు

**వ్యాలగ్రాహి** సం వి న్. పుం, పాములను బట్టుకొనెడి యొక జాతివాఁడు, పాములవాఁడు

**వ్యాలగ్రాహుఁడు** సం వి అ పుం వ్యాలగ్రాహి

**వ్యాలము** సం విణ. (అ ఆ అ) 1 దుష్టము, లొంగనిది 2 చెడ్డది 3 క్రూరమైనది

వి అ పుం 1 దుష్టగజము 2 క్రూరజంతువు, ఇతర జంతువులను జంపి తిను జంతువు 3. పులి. 4 పాము

**వ్యాలమృగము** సం వి అ పుం 1 క్రూరజంతువు. 2 వేఁటకుపయోగపడు చిఱుతపులి.

**వ్యాలీనము** నం. విణ (అ ఆ అ) సాంద్రము, దట్టమైనది

**వ్యాలుఁడు** నం వి అ పుం 1 రాజు 2 క్రూరుఁడు, దురాత్ముఁడు 3 విష్ణువు

**వ్యాలోలము** నం విణ (అ ఆ అ) 1 చలించునది, కదలునది 2 రేఁగినది, వీడినది, (కేశపాశము)

**వ్యావక్రోశి** నం వి ఈ స్త్రీ పరస్పర నింద, ఒండొరులు నిందించుకొనుట.

ఇట్లే వ్యావభాషి

**వ్యావర్తకము** నం విణ (అ ర్తికా. అ) 1 పరివేష్టించునది, చుట్టువాఱునది 2 ఇతరమునకుఁ జెందకుండ నియమించునది వేఱుపఱుచునది. (ప్రత్యేక లక్షణము) 3. ఒకదాని నుండి మరలునది. 4 గుండ్రముగాఁ దిరుగునది.

**వ్యావర్తనము** నం వి అ న 1. చుట్టువాఱుట, పరివేష్టనము 2. గుండ్రముగాఁ దిరుగుట. 3 మడత

**వ్యావర్తము** నం వి అ. పుం 1 చుట్టు వాఱుట, పరివేష్టించుట 2 గుండ్రముగాఁ దిరుగుట 3. నాభి కంటకము, ఉఱుకు బొడ్డు

**వ్యావర్ణించు** నం వ క్రి. వర్ణించు

వ. తదంశావతారంబుగా వ్యావర్ణించి నా చెప్పం బూనిన దివ్య కథాసూత్రం బెట్టిదనిన .. కు నం 1 67

**వ్యావల్గితము** నం విణ (అ ఆ అ.) కదలినది, తొట్రుపడినది

**వ్యావహారి** నం వి ఈ స్త్రీ పరస్పర హాసము, ఒండొరులు లిచ్చి పుచ్చుకొనుట

**వ్యావహారికము** నం విణ (అ ఈ. అ) 1 వ్యవహార సంబంధమైనది 2 న్యాయసంబంధమైనది 3 వాడుకయైనది, ఆచారములో నున్నది 4 మాయా ప్రపంచ సంబంధమైనది.

వ్యతి పారమార్థికము

వి అ న. 1 ఆచారము, వాడుక 2 వ్యాపారము. (విలక్షణము)

**వ్యావహారికుఁడు** నం వి అ పుం వ్యవహార విషయములను దెలుపువాఁడు, మంత్రి.

**వ్యావహాసి** నం వి ఈ స్త్రీ పరస్పర పరిహాసము, ఒకరి నొకరు వేళాకోళము చేసికొనుట

**వ్యావృతి** నం వి ఇ స్త్రీ కప్పుట, ఆచ్ఛాదించుట

**వ్యావృతము** నం విణ (అ ఆ అ) 1 కప్పఁబడినది, ఆవరింపఁ బడినది 2. ఆటంకపఱుపఁ బడినది 3 తెఱవఁబడినది 4 తొలగింపఁబడినది, బహిష్కరింపఁ బడినది

**వ్యావృత్తము** నం విణ (అ ఆ అ) 1 మరలినది, నివృత్తము 2 విడఁదీయఁ బడినది 3 వేఱైనది, భిన్నము 4 లేనిది, కనఁబడనిది 5 గుండ్రముగాఁ దిరుగునది 6 చుట్టువాఱు కొనినది పరివేష్టించినది, 7 మానుకొనినది, చాలించినది 8 ఆవృతము, కప్పఁబడినది

**వ్యావృత్తి** నం వి. ఇ స్త్రీ 1 ఆచ్ఛాదించుట, కప్పుట 2 విడఁదీయుట, వేఱుచేయుట 3 కనఁబడమి, నష్టి, లేమి. 4 చుట్టువాఱుకొనుట. 5 తిరుగుట, భ్రమణము. 6 మరలుట, స్తుతి, పొగడ్త

**వ్యాసంగము** నం వి. అ పుం 1 మిక్కిలియు వంటియుండుట 2 ఏకాయత్తత, తత్పరత 3. దీక్షగాఁ జదువుట 4 శ్రద్ధ, ఆసక్తి 5 ఎడఁబాటు 6. కలఁత, క్షోభము. 7 సంకలనము, కూడిక.

**వ్యాసము** నం వి అ పుం 1 భాగములుగాఁ బంచిపెట్టుట 2. సమాసము విడఁదీయుట, విగ్రహవాక్యము 3 భేదము, వేఱగుట 4 వ్యాపించుట 5 వైశాల్యము, విరివి 6 వలయాకారమగు వస్తువు, నడిమి కొలత 7 పరిమాణ విశేషము 8 ఉచ్చారణము నందలి దోషము 9 గ్రంథాంతరముల నుండి యెత్తివ్రాయుట, కూర్చుట

**వ్యాసక్తము** నం విణ (అ ఆ అ) 1. దృఢముగా నంటియున్నది, సంలగ్నము 2. తత్పరము, తదేకాయత్తము, ఒకదానియందే దృష్టిగలది. 3. విడఁదీయఁ బడినది, వేఱుచేయఁ బడినది 4. కలఁత నొందినది

**వ్యాసిద్ధుఁడు** సం విణ (అ. ఆ అ) 1 నిషేధింపఁ బడినవాఁడు, బహిష్కరింపఁ బడినవాఁడు 2 రాజాజ్ఞచే నిరోధింపఁ బడినవాఁడు.

**వ్యాసుఁడు** గ్రంథాంతరముల నుండి సంగ్రహించి వ్రాయునతఁడు, కూర్పరి 2. పురాణ, బ్రహ్మసూత్రాది గ్రంథములు రచించిన మహర్షి, పరాశర పుత్రుఁడైన మహర్షి, పౌరాణికుఁడగు బ్రాహ్మణుఁడు

**వ్యాసేధము** సం వి అ పుం. నిషేధము, బహిష్కారము, తొలఁగించుట

**వ్యాహతము** సం విణ (అ ఆ. అ) 1. నిరోధింపఁ బడినది, అడ్డగింపఁ బడినది 2 కొట్టఁబడినది. 3 భంగపఱుపఁ బడినది 4 కలఁత నొందినది, తడఁబడినది.

**వ్యాహతార్థము** సం వి అ స్త్రీ వాక్య రచనయందలి దోషవిశేషము.

**వ్యాహృతము** సం విణ (అ ఆ అ.) 1. పలుకఁబడినది, ఉచ్చరింపఁ బడినది 2 తినఁబడినది, భక్షింపఁ బడినది

వి అ న పలుకుట, మాటాడుట.

**వ్యాహృతి** సం. వి. ఇ స్త్రీ 1 ఉచ్చారణము 2. సంధ్యావందనాది సమయమున ద్విజులచే నుచ్చరింపఁ బడెడి ఊర్ధ్వలోక నామసంకీర్తన రూపమగు మంత్రవిశేషము

**వ్యాహరణము** సం వి అ న 1 ఉచ్చారణము 2 కథనము, చెప్పుట

**వ్యాహారము** సం వి అ. పుం 1 ఉక్తి, వాక్యపదము. 2 వాక్యము 3 కంఠస్వరము 4. హాస్యము, చమత్కార సంభాషణము.

## వ్యు

**వ్యుత్క్రమము** సం వి అ పుం. 1. మంచి మార్గము నతిక్రమించుట, సన్మార్గము నుండి తొలఁగుట 2 అక్రమము, క్రమవైపరీత్యము 3. సంభ్రమము, తత్తరపాటు.

**వ్యుత్క్రాంతము** సం. విణ (అ. ఆ అ) 1 సన్మార్గము నుండి తొలఁగినది, హద్దు మీఱి వర్తించునది 2 విడిచిపోయినది. 3 అశ్రద్ధ చేయఁబడినది, ఉపేక్షితము

**వ్యుత్థానము** సం వి అ న 1. అధికోత్సాహము, మిక్కుటమగు చుఱుకుఁదనము. 2 ఎదిరించుట, ప్రతిఘటించుట 3 తన యిష్టము వచ్చినట్లు చేయుట 4. ప్రతికూలముగాఁ జేయుట. 5 (యోగ) ధ్యాన సంపూర్ణత 6 నృత్యవిశేషము, నాట్యము 7 గజోత్థాపనము, ఏనుఁగును లేచునట్లు చేయుట

**వ్యుత్థితి** సం వి ఇ. స్త్రీ. వ్యుత్థానము.

**వ్యుత్పత్తి** సం వి ఇ స్త్రీ. 1. ఉత్పత్తి, పుట్టుక. 2 శాస్త్రజన్యమయిన శబ్దార్థజ్ఞానము వలనఁ గలిగెడు సంస్కార విశేషము 3 శబ్దములకుఁ గల యర్థావబోధక శక్తి, అర్థమును దెలుపు శక్తి. 3 నైపుణ్యము, నేర్పు 4 వైదుష్యము, పాండిత్యము.

**వ్యుత్పన్నము** సం విణ (అ ఆ అ) 1 పుట్టినది 2 వ్యుత్పత్తిచే నేర్పడినది (శబ్దరూపము) 3 వ్యుత్పత్తి గలది (పదము) 4 సంపూర్ణమైనది.

(వ్యతి అవ్యుత్పన్నము.) 5 నైపుణ్యముగలది

**వ్యుదస్తము** సం విణ (అ ఆ అ) త్రోసివేయఁబడినది, నిషేధింపఁ బడినది

**వ్యుదాసము** సం. వి అ పుం 1 త్రోసివేయుట, నివారించుట 2. (వ్యాక.) నిషేధించుట 3 నిషేధము, బహిష్కారము 4. ఉపేక్ష 5 చంపుట.

**వ్యుష్టము** సం విణ (అ. ఆ అ) 1 తగులఁబెట్టఁబడినది, దగ్ధము 2 పర్యుషితము, పదనుతప్పినది, ప్రాఁచిదైనది, ప్రభాతమైనది, వేకువదైనది 3 స్వచ్ఛము, పరిశుభ్రమైనది 4. నివసించినది 5 దాఁటినది, అతిక్రమించునది

వి అ. న వేకువ, ప్రభాతము, కాలము 2 దివాభాగము, పగలు 3. ఫలితము, పర్యవసానము.

**వ్యుష్టి** సం వి ఇ స్త్రీ 1 వేకువ, ప్రభాతము 2. సమృద్ధి. 3 స్తుతి, పొగడ్త 4 ఫలితము, ప్ర్యవసానము

# వ్యూ

**వ్యూఢము** సం విణ (అ ఆ అ) 1 విశాలమైనది, పృథులము. 2 సంహతము, గృఢమైనది 3 వ్యూహములు పన్ని నిలుపఁబడినది (సేన) 4. క్రమరహితము 5 పెండ్లాడఁబడినది

**వ్యూతము** సం విణ (అ ఆ అ) దారములతోఁ గూర్పఁబడినది కుట్టఁబడినది

**వ్యూతి** సం వి ఇ స్త్రీ 1. నేఁత, కుట్టు 2 నేఁత కూలి

**వ్యూహ = వ్యూహము** సం. వి ఆ స్త్రీ ఒక విధముగా నిలుపఁబడిన సేన, వ్యూహము

లయగ్రాహి ఆ హారతనూజుఁడు...పెక్కులై, వ్యూహాలు బయల్పడి హతాహతిఁజనన్... కు. సం. 12. 951

**వ్యూహనము** సం వి అ న 1 సేనలను బలు విధములుగా నేరపఱిచి నిలుపుట 2 శరీరావయవముల నిర్మాణము

**వ్యూహపార్ష్ణి** సం వి ఇ స్త్రీ వ్యూహములుగా నేర్పడి యున్న సేనయొక్క వెనుక భాగము.

**వ్యూహము** సం వి అ పుం 1 యోధుల సన్నివేశ విశేషము, యుద్ధము కొఱకు సైన్యములను శకటాద్యాకారములు గలుగునట్లు నిలుపుట, శకట వ్యూహము, శ్యేన వ్యూహము, పద్మవ్యూహము. మొ॥ 2 సేన 3 సంఘము, గుంపు 4. భాగము, అంశము 5. శరీరము. 6 నిర్మాణము 7 హేతువాదము, తర్కము 8. విభజించుట, పంచి పెట్టుట

**వ్యృద్ధి** సం వి ఇ. స్త్రీ అభివృద్ధి లేమి.

# వ్యో

**వ్యోకారుఁడు** సం వి అ. పుం లోహకారుఁడు, కమ్మరి

**వ్యోమకేశి** సం వి. న్. పుం శివుఁడు.

**వ్యోమకేశుఁడు** సం వి అ. పుం శివుఁడు

**వ్యోమచారి** సం వి న్ పుం 1. వేలుపు, దేవర 2 పక్షి. 3 ముని 4. గ్రహనక్షత్రాదికము.

**వ్యోమధూమము** సం. వి అ పుం మేఘము, మబ్బు

**వ్యోమమంజరము** సం వి అ న టెక్కెము, ధ్వజము

ఇక్కే వ్యోమమండలము

**వ్యోమము** సం వి న్ న 1 ఆకాశము 2. జలము. 3, సూర్య దేవాలయము. 4 అభ్రకము

**వ్యోమముద్గరము** సం వి అ పుం గాలి దెబ్బ, గాలి పెట్టు

**వ్యోమయానము** సం వి. అ న విమానము, దేవయానము.

**వ్యోమసదుఁడు** సం. వి ద్ పుం. 1 వేలుపు, దేవత 2 గంధర్వుఁడు. 3. ఆత్మ.

**వ్యోమస్పృశము** సం విణ. (శ్) ఆకాశము నంటునది, మిక్కిలి యెత్తైనది

**వ్యోమోదకము** సం వి అ న వర్షోదకము, వాన నీరు

**వ్యోషము** సం వి. అ న సొంటి, పిప్పలి, మిరియాలు, త్రికటుకములు

# వ్ర

**వ్రంత[1] = వంత[1]** వి 1 పటు.

మ అలుకం జేర్చి హాలం బధోముఖముగా నచ్చోటికిం జాఁచి తత్సలిలౌఘం బొక వ్రంతయై తనకునై సర్వంబు నొండొండ యిమ్మల రావింపఁ దొడంగె భూరిభయ సమ్మోహంబు నన్ ధాత్రి యగ్గలపు గంపము నొంద.. హరి ఉ 2, 85.

ఉ. అంతట గోపమూఱక రియంబునఁ గాన్పను బట్టి వాని న,త్యంత బలంబున న్విసరి యంబర వీథికి వైచె వైచినం, గ్రొంతుక క్రిందుగా నిచటి కొండపయిం బడె నాటనుండియున్, వ్రంతలు గట్టి పాఱు రుధిరంబు వినిస్రుతి గైరికాకృతిన్ శౌ॰ జరా. 5. 262.

2 పల్లము, గోయి,

సీ. మడుపులు పసుల కాల్మడిఁ బ్రుచ్చెదొరు గండి వ్రంతలు పెను రొంపి వ్రంతలయ్యె .. హరి పూ 6, 5.

చ. కదిపిన భీతి వావరులు కవ్వ్కనిఁ జాతియు గహ్వరంబులం, దొదిఁగియు వాఁగు వ్రంతఁ బడియుండియు...భా రా యు 912

**వ్రంత² = వంత²** వి (√వ్రందు) మనోవ్యథ

గీ ఎట్టి ఘట్టములను నెట్టి యాపదలను, నెట్టి తీఱ ములను ముట్టఁబడిన, వ్రంతలెల్లఁ బాయ నింతులఁ బ్రజలను, నొనరఁ జూడఁగనిన జనుల కెందు భార ఆది. 4 84 (చి ని. పా.)

గీ వ్రంత దురపిల్లి వెన్నెల వగచి వగచి, గంధవతి పట్టి యొుక భంగిఁ గన్ను మోడ్చె. భీమ 2 46 (చి ని పా.)

ఆ నీదు వ్రంత చూచి నీవారలందఱు, దీనులయిరి వీరిఁ దేర్పవలదె భార ద్రో 2. 258 (చి ని పా.)

గీ. అనుచు నవ్వాలంతి నాగడంబున నాడ, నాల కించి యొుడయఁ డలుక పూని, యిట్టులట్టు లనుచు నేమియు మాటాడ, నోడి వ్రంత నూర కుండె నంత అచ్చ రా అయో 86.

**వ్రందు** అ క్రి. 1 సంతాపించు

సీ దేవి యుపేక్షయ చూచె యీ యమకునిప్పాటు వచ్చుట యని వ్రందువారు . భార. విరా 2. 146

2 తప్తమగు.

మ. అమరాధీశుఁడు రోహణాచల సముద్యద్రత్నముల్ చెక్కి ర,మ్యక్షుమవర్ణాద్రిని మౌళిఁ జేయఁ బరభూషావాప్తికై ఫాల దృ,గ్వసుధాభృన్నఖ లోహముల్ పుటములై వ్రందన్ మణి ప్రాప్తి క,న్ని సముద్రంబులు వెళ్ళఁజల్లఁ దలచున్ మోహానురూపంబుగన్. దశా 2 172

**వ్రక్క** వి (√వ్రచ్చు) ఖండము, ముక్క, తునుక.

క ఎదిరిందము యట్టులకా, మదిఁ దలఁచినఁ బోనఁగుఁ గాక మాకుం గుడిమిం, డిదె మీరు వ్రక్కగొనుఁ డని, చదురడిచిన మనసు పొందు చక్కంబడునే భార ఉద్యో 1 312

ఉ ఈ దనుజుండు కోరిక వహింపని రంభను బల్మిఁ బట్టి వ,ట్టాడట నింక నొప్పని మృగాతుల బల్మిని బట్టెనేని స,మ్మోదము దీఱనంత శిరముల్ పదియున్ బదినూఱు వ్రక్కలై, మేదిని గూలుఁగావుత నిమేషములో భువనంబు మెచ్చఁగన్ ఉ. రా. 4 235.

**వ్రక్కలగు** అ క్రి (వ్రక్కలు + అగు) బ్రద్దలగు, పగులు, భేదిల్లు

సీ దిక్కుంభి కుంభముల్ వ్రక్కలై ముక్తాఫలములు పైకెగయ వాలమునఁ గొట్టు ..దశా 1 225

**వ్రక్కలు చే(సే)యు** స క్రి (వ్రక్కలు+చేయు) ఛేదించు, నఱకు, ఖండించు.

చ అతిశిత చక్రధార నరకాసురు వ్రక్కలుచేసి... ఉ హరి 1 177

ఉ చుక్కల రాణివాసముల సోయగపుం జను దోయి బ్రెక్కున.., జిక్కన యైన యక్కు యదుసింహుడు బాణ పరంపరాహతిన్, వ్రక్కలు సేయఁగాఱు రుధిరంబునఁ దోఁగుచు పారి. 5 10

**వ్రక్కలించు** స క్రి (√వ్రక్క) 1 భేదించు, పగులుచు

ఆ .. పదయుగములు నఱికి ప్రక్కలొత్తి, వ్రక్కలించి మేను చెక్కి పక్షస్థలి, పటుతరాస్త్ర తతులఁ బగులవేసి. భా. రా. యు. 1954.

క వినుకడుపు వ్రక్కలించుచుఁ, జనుదేరఁగ పోలి బడ్డ సరగనె కడకన్, వసుబ్రతికిఁపఁగ నంజీ, వనిఁ జెప్పితిఁ గచున కవుడు వదలని కూర్మిన్ యయా ౭ 140

సీ గంభీర తరగాభిగర్త విభ్రమముల వ్రక్క లింతురు జలావర్తశోభ . . భీమ 1 91.

(ఇట 'జయించు' అని భావము)

ఉ చిక్కితి వెందుఁ బోయెదవు శ్రీహరి యంచు మృగేంద్ర వాహముం, జక్కగఁ బైకి నూకి రథసంఘన శూలము పూని జక్కి యా, పక్కిని వ్రక్కలింపఁ గని పక్కున శూలము నాఁచి త్రుంచె నా,చక్కని కాలనేమి తల చక్ర ధరుండు సురాళి మెచ్చఁగన్. దశా. 2. 401

వ్రక్కలింత వి (√వ్రక్క) భేదనము, చీల్చుట

సీ తత్తడి డెక్క గద్దలి వ్రక్కలింతల నెగసిన దుమ్ము మిన్నెల్లఁ గప్ప .. అచ్చ. రా యు. 184

వ్రక్కలువా(ల్వా)పు స. క్రి (√వ్రక్కలువాయు) భేదించు, పగుల్చు.

సీ బ్రహ్మాండ కుతారకర్పరము వ్రక్కలువాపి యావ ణంబు లందంద చించి శివరా. 1 97.

క. ఊపిరి వెడలక కడుపున, నాపొదవినఁ జాము ప్రాణ వాతంబులు నం,తాపించి శిరము వ్రక్కలు, వాపికొనుచు నెడలి చనియెఁ బలు ఘోషముతోన్. భాగ. 10. పూ. 480.

మ. చ, య్యన రా నిమ్న నగఁవ్ర దుర్విషహా బాహాశక్తి మున్ రాక్షసాం,గవచే నందదుకైన యయ్యేడలు వ్రక్కల్ వాపెదం గ్రమ్మఱన్. హరి ఉ. 1. 15.

వ్రక్క(లు)వాయు అ. క్రి (వ్రక్క+పాయు.) తెగు, ఖండిత మగు.

ఉ త్రొక్కియున్న తీఁగె వ్రక్క వాసిన జాఱి, పడియె గౌరి వాని యొడలి మీఁదఁ, దత్పదాబ్జ యుగము దాఁకి శాపము వీడి, వచ్చెఁ బాణి పాద వనరుహములు భోజరా 5 195.

వ్రక్కవాఱు = వ్రక్కలువాఱు (శ ర)

వ్రక్కలువాఱు = వ్రక్కవాఱు అ క్రి. (వ్రక్కలు + పాఱు) ముక్కలగు, తునకలగు

క ఋతుమతియై యుండిన గుల,సతిఁ గవయక వేఱ యొండు జలజాననతో, రతి సల్పిన భ్రూణఘ్ను, ప్రతుఁ జెఱఁబడఁ ద్రోయలేదు వ్రక్కలు వాఱన్. రుక్మా 2 35.

చ. గునగున వచ్చి లావరులఁ గొమ్ముల వ్రక్కలు వాఱఁ జీలుచున్ ... విక్ర 2. 139

వ్రచ్చు స క్రి (సం వ్రశ్చ) (√వ్రయ్యు.)
1. భేదించు చీల్చు

ఉ వచ్చిన నీవ చూడఁగ నవార్య బలోన్నతిఁ జేసి వారలన్, వ్రచ్చి వధింతుగాక ... భార. ఆది. 6. 199.

ఉ. . . ఘోటక, వ్రాతము నొంచి మైమఱవు వ్రచ్చి శరంబులు మేనగ్రుచ్చి ... భార భీష్మ. 1. 316.

ఉ. ద్వారక సొచ్చెనేనియును వారక యుగ్రతఁ గట్టి పట్టి య,వ్వారిధి దుర్గ మంతయును వ్రచ్చి విరోధి సబాంధవమ్ముగాఁ, బోరవధించి రుక్మిణిఁ బ్రభూత విభూతిఁ దలిర్పఁ దెత్తు ... హరి ఉ. 3. 100.

గీ వ్రత్త మొకని కడుపు వ్రయ్యంగ నందులోఁ, బసిఁడి లేకయున్నఁ బరుని బ్రతికి, యరుగ నిత్తముండి నష్టైన నితరుని, వ్రత్త మిదియె కార్య వృత్త మనుచు కేయూర. 3. 326

2 నఱకు, ఛేదించు, ఖండించు.

ఉ. ... పె,న్వాలుగమై మహార్ణవమునం దొలుఁ బల్కులు దొంగరక్కసున్, వాలిక వంకవాఁడి గటి వ్రచ్చి వెనన్నిగమాలిఁ దమ్మిపూ,చూలికిఁ దెచ్చి యీవె త్రిదశుల్ గొనియాడ మురా సురాంతకా. పారి. 3 28.

ఉ అచ్చటి ద్వారపాలకుల నందఱ బ్రుంగఁగఁ జేసి వీటిలోఁ జొచ్చి రిఁ జేచ్చ రావణ సూను లెఱింగి యథంగురక్రుధన్, వచ్చి విరోధి సైని కుల వాలిక తూపుల ఖడ్గధారలన్, వ్రచ్చి రథా శ్వదంతి భటవర్గములతో వెసఁజేర్చి యార్చినన్. ఉ రా. 3 391.

అ తన తలఁచిన యట్లు మనుజ శార్దూలున,వార్య మన్యు విక్రృత వదనుఁ గాఁగ, నవయవములు వ్రచ్చి యత్రిమ్మునకుఁ జాఱ, నడఁచె వాఁడు పిడుగు నట్ల ప్రోయ. రాఘవ. 4 199.

3. ఊడఁ జెఱుకు, పెకలించు

ఉ. ... నెమ్మదిన్, వచ్చిరె కర్ణనందనుఁడు నా మనుమండును నంచుమేనిముల్, వ్రచ్చి వెడంద గాయములు పాఱితలంఱున నంటి చూచుచున్, జై భా. 3. 7

4. హింసించు, నశింపఁజేయు.

క. విత్తము సంసృతి పటలము, వ్రత్తము కామాది వైరి వర్గంబులనేఁ, డిత్తము చిత్తము హరికిని, జొత్తము నిర్వాణ పదము శుభమగు మనకున్. భాగ. 7. 249

5 పిసుకు

సీ. వలుదలై మెఱయు పార్వణపు ముద్దుల వంటి వలి గుబ్బ లెన్నఁడు వ్రచ్చికొందు ... శుక. 2 481.

**వ్రచ్చుకొను** స. క్రి. (వ్రచ్చు+కొను. స్వార్థమున.) చీల్చు, ఛేదించు

చ ఒక మరి బుడ్డగింప విలయోదకముల్ వయి కుబ్బి చిప్ప వ్రచ్చుకొని మహోద్రభవిధిఁజన... ఆము 4. 21.

**వ్రజకిశోరుఁడు** సం వి. అ. పుం. గొల్లపిల్లవాఁడు, శ్రీకృష్ణుఁడు.

**వ్రజకుండు** సం వి. అ పుం భిక్షువు, సన్న్యాసి.

**వ్రజనము** సం వి. అ. న. 1.సంచరించుట, తిరుగుట, దేశసంచారము. 2. దేశభ్రష్టత, దేశము విడిచి పోవుట.

**వ్రజనాథుఁడు** సం వి అ పుం కృష్ణుఁడు ఇట్లే వ్రజవరుఁడు, వ్రజమోహనుఁడు, వ్రజవల్లభుఁడు మొ॥

**వ్రజము** సం. వి. అ. పుం 1 సమూహము, గుంపు, మొత్తము 2 గొల్లపల్లె 3. గోష్ఠము, గోశాల 4 నివాసము, ఉనికిపట్టు. 5 మార్గము 6.మేఘము 7 మథురాపుర సమీపమందున్న దేశ విశేషము, గోకులము.

అ న సంచారము, తిరుగుట.

**వ్రజాంగన** సం వి. అ. స్త్రీ గొల్లత, గొల్లపడుచు. గోపిక

**వ్రజాజిరము** సం. వి అ న. గోష్ఠము, గోశాల.

**వ్రజ్య** సం వి ఆ స్త్రీ. 1. భిక్షువుగాఁ దిరుగుట, పర్యటనము 2. దాడి వెడలుట, 3. గుంపు, సమూహము, తెగ. 4 రంగస్థలము.

**వ్రణము**[1] సం వి అ పుం. న. 1. గాయము, దెబ్బ. 2. కురుపు, పుండు 3, పగులు, బీట.

**వ్రణము**[2] సం. వి. అ. న. 1 దోషము, తప్పు.

మ. ...హరికిన్ మర్యాద లేదంచు దూషణమున్ జేయఁగ వాని దూషణముఁ గంసధ్వంసి యాలించి యే, వ్రణమున్ న్నాయెడ లెదు నింద గలిగెన్ వారించు చేరీతియో. భాగ 10. ఉ 58.

**వ్రణకృత్తు** సం విశ (త్) 1. గాయపఱుచునది 2. శిథిలింపఁ జేయునది

వి. త్. పుం నల్లజీడి చెట్టు.

**వ్రణహము** సం. వి అ. పుం. ఆముదపుఁ జెట్టు.

**వ్రణారి** సం వి ఇ పుం గోపరసము, బాలెంత బోళము,

**వ్రణితము** సం. విశ (అ. ఆ. అ.) గాయపఱుపఁబడినది.

**వ్రతచర్య** సం. వి. ఆ స్త్రీ వ్రతము చేయుట, వ్రతాచరణము.

**వ్రతచర్యుఁడు** సం. వి. అ. పుం. బ్రహ్మచారి.

**వ్రతతి** సం. వి ఇ ఈ. స్త్రీ 1 లత, తీగ 2 వ్యాప్తి, వ్యాపించుట

**వ్రతపారణ** సం వి ఆ స్త్రీ ఉపవాసానంతర భోజనము.

**వ్రతపారణము** సం వి అ న వ్రతపారణ

**వ్రతప్రతిష్ఠ** సం వి ఆ స్త్రీ వ్రతాచరణము, తా నవలంబించిన వ్రతము కొనసాగించుట,

**వ్రతభంగము** సం వి అ పుం 1 వ్రతము చెడుట. 2 ప్రతిజ్ఞా భంగము, అన్నమాట తప్పుట

**వ్రతభిక్ష** సం వి అ స్త్రీ ఉపనయనమున కంగము గాఁ జేయు భిక్ష.

**వ్రతము** సం వి అ. పుం 1 నోము, పుణ్యసాధనముగాఁ బురాణములందుఁ జెప్పఁ బడిన వ్రతము. 2. శపథము, ప్రతిజ్ఞ

ఉదా సత్యవ్రతుఁడు దృఢవ్రతుఁడు. మొ॥

3 భక్తికి స్థానమగు పదార్థము.

ఉదా పతివ్రత, దేవవ్రతుఁడు, పితృవ్రతుఁడు. మొ॥

4 జీవన పద్ధతి, ప్రవర్తనము, నడవడి 5 శాసనము 6 యజ్ఞము 7 పని, కార్యము. 8 వేద విహితక్రియ, సంస్కారము 9 యుక్తి, పన్నుగడ

**వ్రతముచెడ్డ సుఖము దక్కకుండు** కాని పనిచేసినను ఫలము గలుగకపోవు.

సీ. తురకల యాదునందు ముదంబు గల్గెనో భక్తనిత్యోత్సవ పరత మాని...

గీ. చాంద్రు దుర్మార్గులయ్యెయో వ్రతము చెడ్డ, సుఖము దక్కదు వడి ఢిల్లి చొరఁగఁ దోలు... సిం నార 8

**వ్రతస్నాతకుఁడు** సం వి అ పుం బ్రహ్మచర్యము పూర్ణము గావించిన ద్విజుఁడు.

**వ్రతాదేశము** సం. వి అ పుం. (ద్విజుల) బాలుర కుపనయన సంస్కారము చేయుట

**వ్రతి** సం.. విశే. (న్ సి న్) వ్రతము గలవాఁడు, తపోనియమము గలవాఁడు. భక్తుఁడు

వి న్. పుం. 1 బ్రహ్మచారి 2 సన్న్యాసి. 3. యజమానుఁడు, యజ్ఞము చేయువాఁడు

**వ్రతోపవాసము** సం వి అ పుం వ్రతనిమిత్తమైన భోజనాభావము.

**వ్రప్పు** వి (√వ్రయ్యు,) పరియ, బ్రద్ద, చీలిక.

సీ తలఁ బడ్డ గుదియ వ్రప్పులఁ గాఁత మసియిడి యంటిలి గంజి డ్ల నడుగువారు...ఆము 6 85

**వ్రయించు** సం స క్రి. వ్యయము చేయు, వెచ్చించు

సీ బంగారు తలుపులు పాయంగ ఘట్టించి లావణ్య విత్తమేలా వ్రయించె, లావణ్య విత్త మేలా వ్రయించును గాక.. క్రీడా 2 87.

సీ ముదల వెట్టక వీసమును వ్రయింపఁగరాదు కోపించెదని మదిఁ గుందరాదు...

క ఇఁచుకయు నే వ్రయింపక, సంచితముగ ధనము విభుఁడు సామల కొసఁగెన్ ... రుక్మాంగ. 4 83 105

**వ్రయ్య** వి. (√వ్రయ్యు) వ్రక్క, బ్రద్ద, ఖండము.

సీ. ... పమ్మిన కృష్ణు బీరమ్ములు వొగడుచునున్న నీ నాలుక యొక్కఁడయున్, ...

ఆ. వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ నట్ల యినఁగాని చాల వతనిఁ బొగడ ... భార. సభా 2. 41

గీ. దివిజపతి నీకు నిచ్చిన తీవ్రశక్తి, చేతఁ గవ్వడి వడునని చూతువేని, వాసుదేవునిచే నది వ్రయ్యలయ్యెఁ, దునియలయ్యెను బొడియయ్యె నొరఁగు ధరణి. భార. ఉద్యో 2 272

సీ విమల హేమాకృతి నమరు మహాండమై కర మొప్పఁ దద్భూరి గర్భమూర్తి, యై యుండి బహువత్సరాత్మకం బగు కాలమేగిన నది యవియించు కొనుచు, బుట్టె నజుఁడు క్రిందటి వ్రయ్య భువియు మీఁది, వ్రయ్య దివియును నడుమంబరంబుఁ జేసి, దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్కు, గామరోష రత్యాది సర్గము నొనర్చె. హరి పూ. 1. 53.

శా. అయ్యంబంచుఁ దదార్య దంపతుల నెయ్యంబొప్ప సేవించుచున్, వ్రయ్యల్ గా సకలాఘముల్ హరి వినిర్మాల్యంబు ధమ్మిల్ల స్వాహేయ్యం బొంద. ఘటికా 2 23

వ్రయ్యఁబుచ్చు స క్రి. (√వ్రయ్యఁబోవు) వ్రయ్యఁ బోవఁజేయు, భేదించు, బయలుపఱుచు.

సీ. కడలేని ప్రేమంబు గప్పెద మంటిమా పుల కాంకురంబులు పులుగు చెప్పు, బెడిదంపు వెగడు పాటడఁచెదమంటిమా వైవర్ణ్యభావంబు వ్రయ్యఁబుచ్చు ... వరాహ. 4. 18.

వ్రయ్యఁబడు అ క్రి (వ్రయ్యన్+పడు స్వార్థమున) వ్రయ్య, భేదిల్లు.

శా. ... తదుద్భూత ధ్వనుల్ దాఁకిలోఁ, కాలో కాద్రి గుహల్ ప్రతిధ్వను లొసంగంబోయి వ్రయ్యంబడన్ రామా. 8. 72

వ్రయ్య(లు)వాఱు అ. క్రి. (వ్రయ్య+పాఱు.) భేదిల్లు, తునియలగు.

ద్వి విప్రుండవై యిట్టు విపుల కోపమున, నీ ప్రాణి నొప్పింప నేలనా కనక, తక్కక నీకుక్క తల వ్రయ్యవాఱ, మొక్కలంబుగ నీకు మోదంగఁ దగునె ... రం. రా. ఉ. 185. పొ. 2 పం

వ్రయ్యలు వాపు స క్రి. (√వ్రయ్యలు వాయు.) చీల్చు, భేదించు, పగుల్చు.

సీ. గోరఁ బోఁజివమాడ్కిఁ గొన్నింటిఁ జక్కపాఁ కాలుగా వ్రయ్యలు వాపి వాపి ... భార. విరా 5. 85.

వ పాద జాను జంఘోరు కటి మధ్యోదరాంస కర్ణ నయనంబులు వేఱువేఱు భాగంబులుగా వ్రయ్యలు వాపి యార్చిన .. భాగ. 10. ఉ. 7 42.

వ్రయ్యలు వాయు అ. క్రి. (వ్రయ్యలు+పాయు.) భేదిల్లు, పగులు.

చూ వ్రయ్యలు వాపు.

వ్రయ్యు అ క్రి (సం. వ్రశ్చ్.) బ్రద్దలగు, భేదిల్లు, పగులు.

క సునిశిత తుండహతిని వ్రస్సిన పర్ణపుటంబు వాసి చెదరుచు నృప నందను వీర్యము యము వానది, వన మధ్యము నందు వాయు వశమున బడియెన్ భార. ఆది 8 80

సీ. శ్రవణ పుటంబులు వ్రయ్యంగఁ దాఁకి సంక్షోభంబు గావించె గుణము మ్రోత ... భార విరా 4 160.

గీ రాలు నాకుల కాకున వ్రస్సి యొడళు, లవనిఁ గూలంగఁ గుక్కలు గవిసి కఱవ. మార్కం. 2 69

క ఇయ్యకొని నగరు గట్టుచు, నయ్యెడ నొక చేవ దూల మది పలకలుగా, వ్రయ్యుటకు నాడనాడను, జయ్యనఁ గీలములు గాడఁ జఱిచిన విదపన్ పంచ నా 1. 88.

వ్రశ్చనము సం వి. అ పుం 1 చిన్న ఱంపము. 2 లోహకారుఁ డుపయోగించెడి యాకుఱాయి. 3. చెట్టు గంటు (నఱుకు) నుండి స్రవించు రసము, జిగురు.

వ 1. ఛేదనము, నఱుకుట. 2. నఱుకు, గంటు.

# వ్రా

వ్రాఁకుడు = వాఁకుడు వి కంటకారి. (వృ వి.) (శ. ర.)

వ్రాఁత వి. (√వ్రాయు.) 1. లిపి, లేఖనము, బ్రహ్మలిపి.

సీ. ... వ్రాలునా బ్రాఁతనా లిపియొప్పు ... , ఆం. భా. 2. 187.

ఉ ఆ సరసీ తటాంతిక శిలాక్షర పంక్తిఁ బఠించి చూచి యీ, వ్రాసిన వ్రాఁత యుజ్జయిని రాజ్యము చేరుటఁ జాటి చెప్ప ... విక్ర. 2 55

క హా ధాత వ్రాఁతయని శర, బాధం గలఁగఁ గమువారి పక్షుఁ జనియెన్ ... రాఘవ. 1. 28.

క. మనసు నిలుపఁ జాలక కడు,వునఁ బుట్టిన దోస మునకుఁ బొగులుచు వేఁడఁ, జనుదేర నానఁ బెట్టితి, ఘనిలే దిక వాని వ్రాఁత ఫలమిటు లుండెన్ సారంగ 5 77

2. రేఖ

ద్వి. పసిబిడ్డ నాఁడు నీ పాద పద్మముల, నెసఁగు వ్రాతలు జూచి యెఱిఁగిన వారు,యెన్నిక మీఱ ననేక కాలంబు, చెన్నొంద మనునని చెప్పిరి కాని. నవ 2 99 పా 5 పం

క. అజ్ఞానంబున హరువ క,వజ్ఞ దలఁచి యతని నొసలి వ్రాఁత ఫలమునన్, యజ్ఞము సేసెను సురల యు,నుజ్జంబర వృద్ధి కప్పనులు సమ కొనుసే. భీమ 2 8

3 వస్త్రాదుల యంచుల యందు వేసిన చిత్రము, నకిషీ,

సీ. పసిఁడి వ్రాఁత చెఱంగు మిసిమి దోఁపఁజెలంగు నరుణాంశుకోత్తరీయంబుతోడ మను 3 71

సీ. అవర దిక్పతి కట్టినట్టి సాగరమను పుట్టంబుతుది వ్రాఁత మొగడ యనఁగ ప్రభా 1 54.

మ చెఱుఁగు ల్వ్రాత పసిండి వ్రాఁత మిసిమిం జిత్రాతి చిత్రంబులై ..వసు 5 94.

4 చిత్ర లేఖనము, చిత్తరువు వ్రాయుట.

ఉ. నీ, నెచ్చెలితోడు సుమ్ము సఖ నిక్కము చెప్పుము వ్రాఁత నేర్పుగా, కిచ్చెలువంబు గల్గు ఘనుఁ డెక్కడనే నొకడుండెనేని ... ప్రభా. 1. 144

**వ్రాఁతకాఁడు** వి (వ్రాఁత + కాఁడు) వ్రాయు వాఁడు

సీ. తళుకు బంగారు టెక్కాల వారువము జోదు బ్రతుకుఁ బ్రోద్దుల లెక్క వ్రాఁతకాఁడు .. దశా. 2. 62

సీ...లిపి కారకుండొప్పు లేకరియన వ్రాఁతకాఁడ నఁగను...అం భా 2 187.

**వ్రాఁతచావడి** వి. (వ్రాఁత+చావడి) వ్రాసెడిచోటు, గ్రంథకుటి. (శ ర.)

**వ్రాఁతపని** వి. (వ్రాఁత + పని) వస్త్రాదులయందు వ్రాసెడి చిత్రపుఁ బని, నకిషీపని.

గీ. పికిలి పూఁబంతి దంతపుఁ బిడికడాలి, పోఁత యొరవంక మొలవంక పొంకపఱచి, తమ్మిదో దుమ్మి జోదు సాదనల హాయువు, వ్రాఁతపని దుప్పటీ వలివాటు వైచి కువల. 2 4

చ మినుకు కడాని వ్రాఁతపని మేలరిగల్ పయిపై నటింపఁగన్...దశా 7 28

వ చౌసీతి బంధపు వ్రాఁతపని ప్రతిమల చుట్టంచు చందురుకావి దుప్పటి బంగరు చెఱఁగుల వలె వాటులును. ప్రబంధ 78

**వ్రాఁతబల్ల** వి (వ్రాఁత+బల్ల.) వ్రాయసకాండ్రు కాగితము లుంచుకొని వ్రాసికొనెడి నాలుగు కాళ్ల బల్ల (వా శ. ర)

**వ్రాఁతసాకిరి** వి (వ్రాఁత + సాకిరి) పత్రములు వ్రాసికొను వానిచే వ్రప్పింపఁ బడి పత్రము నందు సంతకము చేసిన సాక్షి (శ ర)

**వ్రాజము** సం వి. అ పుం గమనము, నడక

**వ్రాతము** సం వి అ పుం గుంపు, సమూహము, మొత్తము

వ. 1. శరీరశ్రమము, పాటుపడుట 2. దిన కృత్యము, రోజు కూలి 3. తాత్కాలికోద్యోగము,

**వ్రాతీనుఁడు** సం విణ (అ ఆ అ) 1 రోజు కూలి వలన బ్రదుకువాఁడు, 2 సంఘజీవి, సంఘము వలన బ్రదుకువాఁడు 3 త్రిమ్మరుల గుంపునకు సంబంధించినవాఁడు (విల్యమ్సు)

**వ్రాత్య** సం వి అ స్త్రీ జాతి భ్రష్టురి కూఁతురు

**వ్రాత్యస్తోమము** సం వి అ పుం. విధి విహితము లయిన సంస్కారముల నాచరింపక పోవుట చేతఁ బోయిన యధికారము మరల గలిగించు కొను టకై చేయు యజ్ఞ విశేషము

**వ్రాత్యుఁడు** సం వి అ పుం 1 ఉపనయనాది సంస్కారములు లేని ద్విజుఁడు, జాతి భ్రష్టుఁడైన ద్విజుఁడు 2 నీచపురుషుఁడు. 3. శూద్రునకు క్షత్రియ స్త్రీయందు బుట్టిన పురుషుఁడు

వ్రాయసము వి. (√వ్రాయు.) 1 వ్రాఁత (కర)
2 ఉత్తరము, జాబు

ఆ కూర్మి నతని నెదురుకొని కౌఁగిలించి యే, కాంత మండపమున నధివసించి. యటఁగుశలించు నేమ మరయుచుఁ దండ్రి, వ్రాయసముఁ జూచి భక్తినంది యందు. జై భా. 8 82.

3. ఆజ్ఞాపత్రము.

మ. పితవేంద్రుండు విరూరి శాసన మహో విఖ్యాతి రామానుజ, ప్రభు వేదాద్రి లిఖించు వ్రాయసము లౌరా పెద్ద నంగావనీ, విభుచిత్తంబు నెఱింగి గఁటమురవల్ విద్యావధూ నూపుర, ప్రభవప్రౌఢ ఝుళం ఝుళాంకృతి సౌభాగ్య బు దీపింపగన్. పాండు 1 81

వ్రాయసకాఁడు వి. (వ్రాయసము+కాఁడు,) లేకరి, వ్రాఁతకాఁడు.

సీ. లిపికారకుఁ డొప్పు లేకరి యన వ్రాఁతకాఁడ నఁగను వ్రాయసకాఁడనంగ...ఆం. భా 2. 187.

వ్రాయి వి (వ్రాయు. బ వ్రాలు) 1. అక్షరము, వర్ణము.

క. సుకుమారము శ్రుతి సుఖదము, సకలంకము నైన వర్ణమాద్యక్షర సృష్టికి రెండవ వ్రాయి సుమీ, సుకర ప్రాసంబనంగ సులభము కృతు లన్. కావ్యా. 7. 74.

గీ సకల జగదింద్ర జాలంబు నెఱవు మాయి, యచ్చులకు నెల్ల మొదలియన్నైన వ్రాయి, కొలుచు వారల పాలిఁటి తలఁపురాయి, రావ ణానుజ దాయి శ్రీరంగ శాయి వాల్మీ 2 81

సీ అణి ముత్తెముల సోయగము మించిన వ్రాలు వరుసతో నిరుగేల వ్రాయనేర్చె ... విక్ర 1. 50.

సీ. అల చుక్క లనియెడి వలరాజు గెలుపు వ్రాలై లియఁ బూసిన మషీ లేప మనఁగ...పారి 2 84

2. రేఖ, గీత.

ఉత్సాహ. చేతి వ్రాలు చూచి యిది యశేష రాజ్య విభవ భో,గాతిశయము గలిగి యలరు ననియు ...కళా. 6. 198

వ్రాయించు స. క్రి (√వ్రాయు.) 1. లిఖింపఁజేయు. వ్రాయునట్లు చేయు

క. మించుతమిఁ గణజములన్ దెలి,పించుచుఁ గై జీతములకు వేర్వేరన్ వ్రా,యించుచు నెల కొలు పునకుం, బంచి యిడుచు మండుగు డు బాణము లెల్లన్. కువల 2. 5

2. చిత్రింపఁజేయు

గీ మగని మగువను వ్రాయించి మదిఁ దలంచు, నిషధ రాజును దన్నుఁగా నీరజాక్షి ... నైష 1. 74

క వనిత చతుర్జాతి వయో, వనజాతుల బంధ వైభవము భద్రుని దత్తుని గూచి మారుఁ బాంచాలుని వ్రాయించెన్ గృహంబు లోపలి గోడన్ కాశ. 4 16

వ్రాయు స క్రి 1 లిఖించు.

చ శతధృతి వ్రాసినట్టి లిపిజాల మనర్థము గాని యట్లుగా. నైష. 1 55

గీ వ్రాయ నేర్చినవాఁడె సద్వర్ణసమితి, వర్థి వర్థులు ప్రబల వ్రాయంగ నేర్చె .. విక్ర 1. 49

గీ సకల సీమంతినీ లోక సమితికాయి, భాగ్య వర్ణావళులు వ్రాసెఁ బద్మగర్భుఁ, డనఁగ ... ఆము 5 10

2. గీయు

శా. ఈ లాతంబున వ్రాయఁ బట్టణము తో నీ స్వాదు కల్ మెట్టఁగా, నేలోకంబున నేగ సులభంబు... విక్ర. 2 7.

3. చిత్రించు, (రంగుతో) బొమ్మవేయు.

గీ ఒరగి రతిదేవి పాలిండ్ల నొత్తగిలిన, యించు విలుకాని వ్రాసినారిడుపు నందు ... నైష 7. 150.

చ వనిత కుచద్వయంబు పయి వ్రాసిన కుంకుమ పత్రభంగముల్ ... పారి. 1 113.

చ. అదిమొదలీ వధూటి విరులంటదు కస్తురి గీరు బొట్టు పెట్టదు పువుఁదోట డాయదు పటంబులు వ్రాయదు వీణచెంతఁ జేరదు సెనర్లైన చిల్కనుగరంబున దాలిచి ముద్దటంచుఁ డాఁ, గదియదు కంజకాండ కరకార్ముక కర్మహతా హతాంగియై శువల. 3 78.

4 రాయు, సంఘర్షణము చేయు

క నేల బదాంగుళి వ్రాయుచు, బాలామణి నిల్చెఁ దలిమ పర్యంతమునన్ ... నైష 7 164

ఎ గీ ... నాగకన్యలతోడి కలహమునకుఁ గాల్ ద్రవ్వెదవా లేక బోటవ్రేలఁ, బుడమి వ్రాసెద విదియేల పువ్వుఁబోఁడి దశా 2 324

వ్రాయఁగా రానిది = బూతు.

గీ జపము పన్నంపు తెలుఁగును జరుపు వతనిఁ, జేరి వేఱొక వికచ రాజీవనేత్ర, మొగము మొగమునఁ జేరిచి నగవులొలుక, వ్రాయఁగా రాని పలుకులు పలికెనపుడు చిత్రభా. 3 30.

వ్రాలు[1] వి 1. సంతకము

గీ వ్రాసి నాతండు తుదిఁ దన వ్రాలుపెట్ట, నమ్మఁగల పత్ర మిదియంద్రు నాగరికులు . విజ్ఞా. 3 109.

సీ. కలుగు విద్వజ్జనంబుల నెల్లఁబట్టి తెప్పించి యత్యాగ్రహా భీమకర్ముఁడై, 'శివాత్పరంతరం నాస్తి' యటంచును వ్రాలు పెట్టించు ...పరమ 5 350

(1072) దా. శా 1102.

(1072) దా శా 1104.

2. అక్షరములు (వ్రాయి శబ్దమునకు బహువచన రూపము)

ఆ. నీటి వ్రాలకరణి నేఁటికి దోడ్తోన, సృష్టి నష్టమయ్యెఁ గష్టమనుచు . . వరాహ. 11. 22.

గీ. వెలసె నుభయాన్వయ-ఋలు వృద్ధిఁబొంద వ్రాలుఁ బ్రాలును గల మంత్రి ప్రోలమంత్రి . భీమ 1 45.

3 రేఖలు.

క. అఱచేత వ్రాలు గను వ, త్తఱిఁ బడె నొక యంపకట్టె .. ఆము. 6. 74

క. అఱచేతి వ్రాలుచూచిన, దొరయొందును లేని దొడ్డ దొరఁ జేకొని .. నీలా. 1 87

వ్రాలు[2] అ క్రి 1. పక్షి మొదలగునవి క్రిందికిదిగు.

ఉ. . . పురవరోపవనంబులు సొచ్చి యిచ్చఁ బూ, గుత్తుల వ్రాలి తేనియలు కుత్తుక బంటిగఁ గ్రోలి లీలమై, నొత్తిలి మోయుచింపు దళు కొత్తుచు మండు మదాలి దంపతుల్. విక్ర. 1. 94.

సీ ఘనసాను శృంగ శృంగాటకంబులఁ గాంచి యమరులు హేమాద్రి యనుచు వ్రాల ... మనుచ. 3. 11.

ద్వి పిండాన్న శేషముల్ ప్రిదుకల మెసఁగి, యొండొంద వ్రాలుచు నున్న ఘూకములు .. ద్వి. హరిశ్చ ఉ 1642.

2 దుముకు, ఉఱుకు.

ఉ వాఁడును గంటిఁ జోకుమని వ్రాలె మహిన్ విటపాళి నుగ్గుగా .. ఆము 6. 21

3 పడు

ఉ. క్రంగన ఘంటపైఁ గొడపు వ్రాలుట యెన్నఁడొ నాఁటనుండియున్, సంగరముం గరంబుగ మనంబున భావనసేయనైరి . మహీపతుల్ నైష. 3. 25

సీ. ముడి విప్ప నడుగుఁ దమ్ములపైనె వ్రాలు పెన్నెఱులు దేంట్లగుట సందియము గలదె ... ఆము 2. 50

సీ పై మిన్ను వ్రాలినఁ బదరని ధైర్యంబుఁ గటకటా కలఁచి చీకాకుచేసె .. చంద్రా 4 96.

గీ ముసు గళావంతుఁ డానతిచ్చిన సుభాషి,తము లిఖంచిన చీటి దోర్దండచండ, మండలాగ్రంపు టొఱలోన మాటి యుండెఁ,గాన నద నేల ప్రాలుటఁ గని యతండు. శుక 1 121.

4. కూలు.

ఉ. వాలిక దొడ్డ సారసము వజ్రము శైలముఁ దాఁకు నాకృతిన్, ఫాలము మీఁదఁ దాఁకిన నిభంబు వెసంబడి కొమ్ము లూఁతగా, ప్రాలుడు వర్ధచంద్ర రుచిర ప్రదరంబునఁ ద్రుంచె భాణ వి,ద్యాలసితుండు గ్రిడి భగదత్తుని కంఠ మకుంఠితోద్ధతిన్ భార ద్రోణ. 1 358

చ ఘనశర వేదనల్ బలియఁగా వనకుంభిని ప్రాలి యున్న య మ్మునిని యుగళంబు దొట్టుపడ... రాఘువ 1 27

ద్వి చావుతో సరిపోల్పఁజను మూర్ఛ నొంది, భూవర పుత్రుఁడు భూమిపై ప్రాలె ... ద్వి. హరిశ్చ. ఉ. 1820. వం.

5 ఒఱగు

ఉ. వెట్టన యాదగానుతుఁడు నేలకు ప్రాలెననఁగ విన్న నా, కట్టఁడి వీనులేమి విను కాఱియ కోర్వవు .. భార భీష్మ. 1 65

గీ...తల్లడిల్లి, వారలందఱుఁ దలఁటు ప్రాలవైవ, నింద్రజితుఁ డంత తండ్రితో నిట్టులనియె భా. రా యు. 291.

గీ. పూల పానుపుపై ప్రాలి వాలుగంటి నీలా. ౨ 88

6 వంగు.

గీ నంసి ప్రాలిన కొమలెత్తి పరమవృద్ధు... హర. 2 48.

ఉ ...సాంధ్యవారి భృ,త్కాందళముత్ దమోదళ యుతంబులునై గొల పండి ప్రాలెఁ బూ,ర్ణేం దుని పేరఁ బ్రాచి...పారి 2 41.

క ప్రాలిన ఱెప్పలు వెతఁగై,ప్రాలిన హృద యాంబుజంబు వసుమతి మీఁదన్, ప్రాలిన చూపులు. .సారంగ. 2 255.

7 పక్షపాతము వహించు

క కావునఁ గౌరవ పాండవు, లీ వసుధకునై పినంగు చెగ్గే దైవం, బేవుక ప్రాలె వారిక, పోవుంగా కిది నరేంద్ర భోగులకు మింకన్ భాగ భీష్మ 1 4?.

సీ దేవల సప్తగోదావరీ తీరైక వాసుండు మన వంక ప్రాలెఁ జువ్వె . భీమ 3 215.

8. నమస్కరించు

సీ. అనఘ నేఁ దుర్గంబు గొనివచ్చి నందాఁక నంగ రక్షకుఁడవై యధిపుఁ గాచి...

గీ యుద్ధమని మాద్రి పుత్రుల నుపచరించి, ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి, యడు గులకు ప్రాలి యద్దేవు ననుమతమున, నరిగె ననుమోదమున యౌవనాశ్వ పురికి. జై భా

ఉ...నొసల్ తదంఘ్రులం, దుండరొదన్ మహా గిరులు హోరనఁ బ్రస్తుతి ప్రాలి .. అము 6 47

9. క్రుంకు.

సీ, అతి దరిద్రాణ దేహద్యుతి ప్రాణమై ప్రాలేయ కిరణ బింబంబు ప్రాలె ..నైష 8 5

గీ పూ దెయనఁ గ్రుంకు కడలిలోఁ ప్రొద్దు ప్రాలె . నీలా ౕ ౩

ఉ కూళతనంబునం బ్రభులకుం దను మర్దన మాచరించుచున్, ప్రాలుడు ప్రొద్దుతోడ గృహ వాటికిఁ జేరునతండు నిత్యమున్ ... శుక. 2 563

10 అతిశయించు

క, ఆలోఁ గర్ణుని చేతం, దూలని చతురంగములను దోఁ లను ధరణీ, పాలమన మొనలఁ గావను, ప్రాలిన దర్పమున మెఱయు వడముడిఁ దక్కన్ భార. కర్ణ 2 45.

ఉ తారకు డన్నహాసురుఁడు తామరసాసన దత్తమైన దు,ర్వార వరానుభావమున ప్రాలిత్రిలోకము నేలుచుండు...హర. 3. 3.

క వాలి నిరాతంక మహాః, కేలిని వారింపంగరుణ
క్రేంగంట నిడన్. ప్రాశిన వాంని మీంఁద,
కేలిన వాం డనిచె నను మహీపరుణారా
చంపూరా 6 17

11 విజృంభించు

ఉ. చిచ్చఱ కన్ను మూసికొని చేతి త్రిశూలము
డాంచి శీలమై. వచ్చిన రుద్రుచందమున
ప్రాలుదు వీవ లోన నోర్వంగా, వచ్చెనె నిన్ను
నెట్టి మగవారికి ..భార. భీష్మ 3 300.

సీ. పెనుగొండ కడ ప్రాంలి పిక్కళ్లు మొదలైన ప్రతి
పక్షులను హతాహతముచేసి .. జై భా
1 45.

12 వ్యాపించు

సీ కడలి కరళ్ళ రాయిడిం గీడ్పడి తటాంత వన
శాజిమై నంటి ప్రాలె నవంగ . వసు 5. 86

క మేలిమి పంధ్యారాగము, ప్రాశిన చీంకటియుం
గలసి వరుణుని వంకన్, నీలముం గెంపును
నతికిన, పోలికం జూపట్టె నంనభోమణి తలం
గన్. మొ. రా అయో 7

13 ప్రకాశించు

సీ వలుద చీంకట్లలో ప్రాలు చుక్కలు వోలె వేణీ
భరమ్ములో విరులు ప్రేల. ఉ హరి 5 276

14. ప్రసరించు

సీ. పైపై మహైశ్వర్య పర్యుత్సకంబులై తన
మీంద నృపుల నేత్రములు ప్రాల ... నైష
4. 134.

క... వసుమతి మీఁదన్, ప్రాలిన చూపులు
సారంగ 2. 256

15. సంభవించు.

గీ రాజు లేని కతంబున రాష్ట్రములకు, నన్నిటికి
బాధగా ధరిత్ర్యంతరమున, ప్రాలె వఱువది
యేడులవగ్రహంబు...కాశీ 6. 288

16 ప్రసిద్ధి కెక్కు

ఉ...బోరిలో వాడిమిం గొంతకాల మిలప్రాలుట
లావరి యాట...అము. 6 21

గీ. వ్యసన సప్తక మెప్పుడొప్పం దని యెఱింగి
వాని వర్జించి ధరనెల్ల ప్రాలియేలి. సార్వ
భౌమత్వమందె వజ్జనవిభుండు ... కేయూర.
4. 273

17 తగ్గు, క్షీణించు

క పొంగుచు మూండు జగంబులు రంగెనంగంగ
నేలచు డి ప్రాలని బలరి, వింగెరెదు నీ
కిపుడా, బంగరు చిటిపాప చెలిమి పాటిలవలదే
అ రా. అర. 42

18 మూర్ఛిల్లు

సీ. అరదంబుపై ప్రాలి యాలోన దెలిసి తన్నేని
నాతనిం బడనేయువారు .. భార. విరా.
3 169

19. చచ్చు, మృతినొందు

సీ ఘనభేరికా ధ్వనుల్ విని గుండియలు ప్రేల
ప్రాలు మల్కలకు గోలీలు నేసె వసు 1.46

సీ శత్రు జామాతృ సౌభ్రాత్రాదు లాజిలో
ప్రాలుట కొఱలు విజ్ఞల కతవ .. రంగా
5 266

ప్రాలుచు లు్చ) న ప్రి. (√ప్రాలు ) ప్రాలంజేయు.
క్రిందికి దించు.

ఉ వానపుం డొయ్య నొయ్య నల ప్రాలిచె
ఆప్పలు వేయుం గమ్మలున్ ... నైష 7 48

గీ అనిన వినియును ప్రాల్చె పత్యాశ్రుచలములు,
బాల . నైష 5. 101

ఉ నృపాలు రొండొరుల్, ఆప్పలు ప్రాల్చి
కెంతయు మటిన్ దనివారక చూడ వంతన,
మెఱ్యప్పుల కుప్ప మెప్పగు శుభోదయ వైభవ
లీల రంజిలన్ ఇందు 5 98

2 పడంజేయు

ఆ పుత్ర, నిన్ను వంప ప్రాల్చి నేనేర ననియె
నీ.విట్టు క్రిందు మీఁదు నెఱుంగకునికి భాగ.
పూ 10 377.

సీ వాలాగ్రమున గిరుల్ ప్రాల్చె నీతనిధైర్య సంపద కీఁక నెవ్వి సాటి యనుచు .. ఉ. రా. 1. 8.

3. కూలుచు.

సీ ... వడిఁగల తేజీలఁ బుడమి ప్రాల్చి ... ఉ. రా. 4 350.

4 వంగఁజేయు, వంచు. (మేరువును ధనువుఁగాఁ జేసి వంచినాఁడు )

సీ. బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు దాల్చి నాఁడితండు ప్రాల్చినాఁడు . ఉ హ. 180

గీ ప్రాల్చె సెమ్మోము లజ్జాభరంబు పేర్చి . హర. 3 81.

5 తొలఁగఁజేయు, తొలఁగించు.

మాలిని. .. నీ, యన్నకు మృత్యువు నన్ను నెఱుంగవె ప్రాణము లిప్పుడు ప్రాల్చెద నం,చున్నత శాత కృపాణముఁ ద్రిప్పుచు ... మార్క 1 37.

క. నవలా కుచరేఖలకున్, నవలాకుచ రేఖ లీడు వకు రాకున్నే, యవనీ జనములు మఱి గొ. రవ మెడలఁగ నీవుతోలు ప్రాల్చకయున్నన్. చంద్రా 2 124.

ప్రాలించు స. క్రి (√ప్రాలు ) ప్రాలఁజేయు, వాల్చు.

సీ పాలింద్ల దమవెడ ప్రాలింపఁ జెన్నొందు ననదుఁ గొఁ దీఁగె యల్లాడు చుండ . . భార. విరా. 4. 26

ప్రాసి ప్రాయక అనమా క్రి. సగము ప్రాయుచునే, ప్రాయుట పూర్తి కాకుండఁగనే

సీ. ... కులశైల తనయ చెక్కులయందు మకరికల్ ప్రాసి ప్రాయక వచ్చె వామదేవుఁడు . .దశా. 7. 10.

## ప్రి

ప్రిక్కు వి కలుగు, విరియుట యందలి ధ్వని కనుకరణము,

ద్వి ప్రక్కలై మేనెల్ల ప్రిక్కన విరియ ... బస పు. 7 415 పం.

## ప్రీ

ప్రీడ సం వి అ స్త్రీ 1 లజ్జ, సిగ్గు. 2 అడఁకువ, వినయము.

ప్రీడనము సం వి అ న 1 లజ్జ 2 అడఁకువ

ప్రీడము సం వి అ పుం ప్రీడ.

ప్రీడితము సం విశే (అ ఆ అ ) సిగ్గుపడినది

ప్రీలు అ క్రి. బ్రద్దలగు, భేదిల్లు

క ఒదవిన కినుకం గొదగొని, గదగొని హాల ధరుఁడు రథము కఁడ్లను నొగలుఁ, జదిపి పతాకయు సారథి, విదారణము చేసి మిన్ను ప్రీలఁగ నార్చెన్ ఉ హరి 4 246

చ చటుల కృపీట సంస్థిత రసాస్థలి ప్రీలకయుండ గార యుచ్చుటకును బోలె ... మనుచ 6.108

మ కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు .. , విని యోగంబులు దప్పె భూత చయముల్ ప్రీలెన్ దిశా భాగముల్ హర. 7 157

ఉ మాళవ మాగధుల్ వఱపు మార్గణ మొక్కటి పెక్కురూపులై, ప్రాలిన వాజి రాజి మహి ప్రాలె రథధ్వజ పాళి నుగ్గులై, ప్రేలె భట చ్ఛటాఁగములు ప్రీలె మదావళ దంత కుంతముల్, గూలె . రా వి 7 10

2. నశించు చెడు.

శా ఆలో మాయ ఘటించి యా దితినుతుం డాభీల కాలానల, జ్వాలో దగ్ర విషంబు గ్రక్కుచు ఫణ వ్యాకీర్ణ రత్నప్రభల్, క్రాలన్ క్రూర భుజంగమై యరుగు దేరంజూచి యమ్మాయ వే,ప్రీలం జేసె మునీంద్ర సూచిత మహా విద్యా ప్రభావంబునన్ రాజ. చ. 2, 80,

క. వాలంపవాఁడుకు ధృతి, వ్రీలఁగ పోతాత యనుచు వెలువడు తన్మత్యాలాపమునకు వాజన, పాల కులోత్తంసు గుండె భగ్గునఁ గలఁగెన్ రాఘు 1 23

**వ్రీలి(లు)పడు** అ క్రి (√వ్రీలు) సత్వహీనమగు, దౌర్బల్యము నొందు

క అనల సుతుఁ డనల కణములు, పెనఁగొన వను రారి దూత వ్రీలి పడంగాఁ, గమఁగొని...కు. సం 10, 540

**వ్రీల్చు(లుచే)** స క్రి (√వ్రీలు) చీలుచు, బ్రద్దలు చేయు.

వ. .. మిమ్ము వాలుకలు గోయక సెలవులు వ్రీల్పక ప్రాణంబులు గొనక యెట్లు సైరింప వచ్చు ... నైష 7 88

**వ్రీళ=వీడ** సం వి. అ స్త్రీ లజ్జ, సిగ్గు.

శా. .. బాలా రత్నము కేళికాకుతుక సామర్థ్య క్రియా దూరిత, వ్రీళా సూచక సానురాగ వికస ద్వీక్షారుచుల్ మీఱఁగా ... దశా. 5.66

**వ్రీహి** సం వి. అ పుం 1 వరిధాన్యము (వడ్లు) 2 ధాన్యపు గింజ, వడ్లగింజ

**వ్రీహికాంచనము** సం వి అ. న ధాన్య విశేషము, ఒక విధమగు కాయధాన్యము, మసూరము

**వ్రీహిరాజికము** సం వి అ న. కంగువు, కొఱ ధాన్యము.

**వ్రీహ్యగారము** సం. వి అ. న ధాన్యపుకొట్టు

## వ్రే

**వ్రే** వి. గొల్లకులము, ఆ కులమునకుఁ జెందినవాఁడు

ద్వి పెరపునఁ బాలించు వ్రేపేఁడు నతఁడ .. బస. పు 4 69. పం

గీ వీఁడెపో వ్రేల గిముల వెన్న బున్ను, గములు గొల్లఁగ మెక్కిన గండిదొంగ ... నీలా, 3 52.

**వ్రేఁకటము** వి. వ్రేకము, భారము.

ఉ. వెన్నలి వ్రేలఁగాఁ బిటీఁది వ్రేఁకట మొయ్యనఁ గ్రింది కిడ్వఁగాఁ, జన్నుల మీఁదఁ గ్రిక్కిఱిసి పందెటి దండలు పొంత నిక్కఁగా, సన్నపుఁ గౌనుదీఁగ గడు పన్నముగా ముని వ్రేళ్ళ నిలిపెతాఁ, బొన్నలు గోసెఁ జేతులను బుప్పొడి యొసెపెడు కొమ్మ కొమ్మలన్ ద్వా. 3 184.

**వ్రేఁకటి=వేఁకటి** వి. (వ్రేఁగు+కట్టు) గర్భము, చూలు (సంధిని వర్ణలోప వర్ణాదేశములు)

ఉ. వ్రేఁకని బండివానికిని విప్రునికిం బతికిన్ విపాదికిన్, వ్రేఁకని మోపువానికిని వృద్ధునకుం గడుఁ జిన్నబిడ్డకున్, వ్రేఁకటియాఁడు మానినికి వేఁదుఱు వానికి దప్పిగొంటుకుం, దేఁకువతోఁ దొలంగు నది తెల్లముగా నెదురేగుదెంచినన్ విజ్ఞా 2 16

ఉ. శాశ్వత కీర్తులన్ దిశలు పారణచేయఁ దలంచు నర్వభూ, మీశ్వర భామినీ జనము సెల్లబడుల్ గొన నిచ్చగించు నీ, విశ్వము నేలుకోఁ దివురు వ్రేఁకటి కోరుకులందు నాది గ,రైశ్వరుఁ గుఱితోన ధరియించిన యట్టి మహానుభావతన్ పి. శకుం. 4 67.

**వ్రేఁకఁదనము** వి. (వ్రేక+తనము వృత్తిని వర్ణవికారము) 1 గౌరవము, గొప్పతనము

క. కని కొలువు సేసికొని మాఁలిని వాఁ జనిసాధ్వి యిది మలిమసవృత్తం, బున పొంతఁ బోవ దెన్నఁడు, నను వ్రేఁకఁ దనంబు దోఁచువట్లు చరింతున్ భార విరా 1 186.

2. బరువు, భారము

ఉ. ఒక్క శరాసనంబు దగ నున్నది యెక్కుడు లావు చూడ్కికిన్, వెక్కసమైన రూపమును వ్రేఁకఁ దనంబును గల్గి చేవమై, నెక్కుడదివ్వ సెవ్వరికి నేగతి మానముగాక . భా రా బాల. 300.

సీ భారాచలము వేఁకఁదనమొంత వింశతి బాహుని చే నెత్తువడియె నట్టె . కు. సం. 3 248.

(ఇది 1 2 అర్థముల కుదాహరణము.)

ప్రేక విశ 1 భారవంతము, బరువైనది. (కర్మధారయమునందు దీనికి నిగాగమము నిత్యముగా నగును )

వ. ... ప్రేగు లాగఁగలేక మూఁగి వీఁగి ప్రేకలగు మ్రాఁకుల క్రోకలకుఁ బేఁటలగు పెన్దోఁటలును భాగ 8 447

క. ...అతఁ, డాఁకగొనక యతని ధమువు,ప్రేఁకని శల్లమువఁ ద్రుంచి వెస దగ్గఱియన్ భా. ద్రోణ. 1 201.

ఉ. వేనలి పాటపాట నర వైంద్రుకతోఁ దిలతండులాన్వయ, శ్రీ నటియింపఁ గై నడలి ప్రేఁకని చన్నులు పాలపంకలై, కౌనసి యార్ప వాలుఁ గెలి కన్నులఁ గల్కితనంబు వీడ్కొనన్, మానిని హస్త మూఁది యొకమంజుల భాషిణి వచ్చె వీథికిన్ కాశీ 7. 159, విజ్ఞా. 2. 16.

2. పెద్దది, అధికము

ఉ అఁక యొకింత లేక విస్ఫురాస్యరటత్స్ఫుట వహ్నికీలముల్, దాఁక దిగంతముల్ గమియ దౌడలు దీటుచు వాఁడికిన్కఁ బే,రాఁకలి నీ జగత్త్రియము నాహుతిచేయఁ దలంచెవో యనన్, వీఁకఁ గడంగి కృత్య యొక ప్రేఁకని శూలముఁ గేలఁ దాల్చుచున్ నృసిం 4.138.

సీ ప్రేఁకని యలుక కలిఎంచి మంచము కోఁడు గాగిలించుచొకమ్మ గాని వింత ... కువల 5. 85

చ. ... సగ్వ భూ,జనములు సన్నుతింప విలసన్మతి బంధులు సంతసింప ప్రేఁ,కని పెళవంబు పెంపెసఁగఁ గట్టె సుతున్ యువరాజ పట్టమున్ పి శకుం 4. 156

సీ. కలదె యీ చందఁబు చెలు లెవ్వరికి నృపోద్భవుల కానోపుదు రవయవముల, తీరునై ప్రేఁకని తేజంబుగసిఁదియై పొలుపారు దర్పంబుఁ బొల్చెఁ జూడ హరి పూ 9 5.

ప్రేఁకన వి (√ప్రేఁక ) భారము

చ...దృష్టికిఁ గడు ప్రేఁకనై తనదు చెల్వులుఁ జుట్టలుఁ దాను సంతసంబు కలిమి నేచి మిన్నడిచి పుణ్య పరావృతుఁడై వెలింగెడున్ భార స్వ 1. 25.

సీ అత్యద్భుతంబు, నగు కృష్ణ దుష్కర వ్యాపార మాత్మకు ప్రేఁకనై వెలసిన విబుధనాథుఁ, డా త్రిదివమున హరి. పూ 7 190

గీ. నిడివి గాఁగ బ్రదుకు విడువంగ ముడువంగ, ప్రేఁకనైన కలిమి వృద్ధిఁ బొందు . కాశీ. 6. 199

ప్రేఁకము వి. భారము, బరువు

ఉ. కాకర పండు వంటి జిగి గల్గిన మేలి పసిండి ధాత్రికిన్, ప్రేఁకము ద్రవ్వి పోసినను వేయి యుగంబులు చెల్లు ధావ్యముల్, శోఁకకుఁబుట్టె డమ్మినను పోనొక కల్పము పట్టుఁజాడ్కి పే, రేఁకటి వీర వైశ్యపతు లిండ్లు గనుంగొననొప్పు నప్పురిన్. రాజ చ 1. 50.

చ. చనుఁగవ ప్రేఁకమున్ జఘన చక్ర భరంబును మోవలేక...పారి 4 24

ఆ కోర్కి ప్రేఁకమునను గులశైలమునుబోలె,నిశ్చలత నతఁడు నిలిచెఁ గాక, శృంగతపంబు వలనఁ గృశుఁ డతం డొకమంద, పవను చేత నెగసి పాఱఁడెట్లు. కవిక 6 40

విశ 1. పెద్దది, గొప్పది

ఉ తాఁకినఁ జూచి వా డతనిఁ దారసిలంగ రథ బు దోలి సీ, యాఁకకు నిల్వ దీ యరద మన్న బిటి దికిఁ బోవఁగా నొగల్, దాఁకెడు దేవదంతిఁ బనఁ బాఁకె దురంబునఁ దొల్లి నావుడున్, ప్రేఁకవు నారసంబుల హరించె నతండు శతాంగ వేగమున్ రామా 8 168.

గీ కౌను గడగడ వడఁక ప్రేఁకవుఁ బిఱుందు, భారమున నెన్నడలు తొట్రువడఁ దటాక, మవని కన్యక వెలువడి యధిపుఁ గూడి, దరిని విల్చిన నళియ అందఱును జేరి. ఉ. రా. 6 114.

చ....యే, వెరవున నిల్చి దీని వగు ప్రేఁకపు గుబ్బల ప్రేఁగునన్ జదల్, దొరసిన యట్టి నెవ్వడుము తోరపు నల్వ కడంక మెచ్చితిన్ యయా. 4 46

2. అధికము (ప్రేఁగు యొక్క రూపాంతరము)

వ. రక్కసి యొడయని బెడిదంబున కోర్చియతని ప్రేఁకంబులైన మూఁకల నేలం గూల్చి యంత యయా 3 36

3. దుర్భరము, దుస్సహము

ఉ. కాఁక నెదిర్చి సంగర ముఖంబున హెచ్చిన రాజ వంశమున్, గూఁకటి వేళ్ళతోఁ జెఱిచి గోత్ర వధంబును జేసినట్టి యా, ప్రేఁకపుఁ గీడుగాక ప్రజవేఁచఁ దలంచిన గోరు చుట్టుపై, రోఁకటిపోటు చందముగ రోసి జనుల్ ననుఁ బూచి తిట్టరే. జై భా. 1. 64.

ఉ. కానఁగ రాని దుఃఖములు గాంచఁగ నయ్యెనుతు మత్త బంభరీ, గానము పూను నీ సురభికాల మదేటికి ప్రేఁక మయ్యెవే.. గంధ 1. 97

ప్రేఁగడరు అ. క్రి. (ప్రేఁగు + అడరు.) భారపడు.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు ప్రేఁగ డరి సొగసి త్రెళ్ళి వివశుఁడై, యఱచిన నోడకుమని హరి, నెఱి నక్కఁగఁ ద్రోచియెత్తె నెనయంగఁ గృపన్ భార ఉద్యో. 3. 301

ప్రేఁగడుపు వి (ప్రేఁక + కడుపు.) స్థూలోదరము, పెద్ద కడుపు

చ...గౌరి ముందఱన్, గురువులు వాఱు ప్రేఁగ డుపుఁ గుజ్జుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడిన్. వీర. 1 5

ప్రేఁగు అ క్రి. 1. తపించు

చ చెదరక నామసంబు వృషశేఖర నీయెడ నిల్చి మన్మథ, ప్రదర పరంపరా నిహతి పాల్పడి ప్రేఁగెడు...మనుచ. 6. 94

సీ. తడవుల నుండియుఁ దపము సేయఁగఁ బూని మణికంఠరుఁడు పాట మాని యునికి, నువవాస ఖేదంబు వపనయింపఁగ లేక ప్రేఁగుచున్నవి నాడు వీను లిపుడు కళా. 2, 53

గీ...దైవకృత్యంబులకును, విఱ్ఱవీఁగుట ప్రేఁగుట వెట్టితనము దశా. 2 418

2. బాధపడు.

గీ విశ్వ మందిర యిందిర వివిధ గతుల, వారిచే విట్లు మదిఁగ్రాఁగి వగల ప్రేఁగి, విరహ శిఖ నావఁ దరమె యే కరణినైన, నీ కరుణ లేక యంచుఁ గన్నీరు నించు. లక్ష్మీవి 4. 105.

వి. భారము, బరువు.

ఉ. ఎందును నెవ్వరుం బడని యెంతయుఁ గష్టము పాటు వచ్చినం, గొందలమంది పాండువిభు కోడలు దవ్వుల నున్న నన్ను గోవిందుఁడ కావుమంచుఁ బిలవిఁచుట యూఁకఁగ రాని యప్పుఁ బో,లెందలపోయ ప్రేగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్ భార. ఉద్యో 2 129

క. రేలుం బగలును మొగమున, ప్రేఁలుచుఁ బతి వాయకున్న ప్రేఁగునవో. అ,శ్వాలిక మొగ మెత్తదు. కు. సం ౯ 650

విశే 1. భాగము కఠిది, బరువైనది.

ఉ వేడుక వేల్పు దొయ్యలుల ప్రేఁగు చనుఁగవ మీఁద మన్మథ, క్రీడల త్రాలి నిద్రల సుఖించి ప్రభాతములందు.. హరి ఉ. 10 291.

2 దుస్సహము

సీ. చూపఱెల్లను దన రూపంబు చూడ్కికి ప్రేఁ గైన నత్యంత విస్మయంబుఁ బొందుచుండ. భార. విరా 1 211

ప్రేఁగుఁదనము వి (ప్రేఁగు + తనము.) బరువు, భారము

వ. ఒక్క యింటి మచ్చెకంటి పంచాశద్వర్ష దేశీయ పలిత పాండురమైన వేణికాభరంబు గైవడ ముదు నలి చక్రవాకంబులతో నెక సక్కెంబాడు వీఁగు చన్నుల ౖవేఁగుదవంబునఁ దవ తనూవల్లి జల దరింప. భీమ. 2. 110

ౖవేఁగుప(వ)డు అ.క్రి. (ౖవేఁగు+పడు) బరు వెక్కు. బరువు కలవగు.

గీ. ఒంటొరుపులఁ లేఁజెమటలు నూని ౖవేఁగు, పడిన చాడ్పున నవయవ భంగులందుఁ, దగిలి మఱ పునఁ దడయు.. భార విరా. ౯ ౹ ౨౫.

క. నీవ నిను నెఱుఁగకుండిన, నే వాఁకిఁ దెలుప వచ్చు నిట నకల శో,భావహ మగు నీ యుగ్ర పు, భావమునకుఁ జాలౖవేఁగు వడినవి జగముల్. హరి ఉ 8 153.

మ జగతీజంబుల శాఖలెక్కి మురళీ శబ్దామృత స్యందమున్, మిగులన్ వీనులఁ ౖద్రావి ౖవేఁగు వడి నెమ్మిం గృష్ణు రూపంబు చి,త్తగమై యుండఁగ... భాగ. 10 పూ 790

ౖవేఁచే=వేఁచే స. క్రి (√ౖవేఁగు.) వేఁగఁజేయు. (శ ర)

ౖవేఁడు వి గొల్ల వాఁడు (బ. ౖవేలు)

ఉ రేపటి పూఁట నెన్నికొని ౖవేఁడు పసింగొని పోయి మేపి తా, మాపటి పూఁట నెన్నిన క్రమంబున నీఁదగుఁ బచ్చెనేనియుం, గోపరిపాల కుంతు చెవిఁ గొమ్ము నిజ బుగఁ జూపి కుద్ధఁ డొఁ, కేవడి ౖముచ్చుకొన్న యెడఁ జెచ్చెరఁ జెప్పకయున్నఁ దప్పగున్. విజ్ఞా. 2. 10

ఉ ౖవేని తమాఱఁ డొక్కరుఁడు వీర్య సముగ్రుఁడ పోలె వచ్చి నా, పూనివ పూన్కి యంతయును బొంకగు నట్లుగఁ జేసె నేను నా. సేనయు దాడి వెట్టెద విశృంఖలతం ౖబతివతువెంట మీ, రి నెఱికిన్ సహాయపడు టిప్పిత మేవిఁ గడంగుఁ డుక్కువన్. హరి. ఉ 3 99

గీ ఆకట యెచ్చోట నున్నవాఁ డతని తంౖడి, వేగ యెఱిఁగింపరే లావు వెంపు గలుగు, ౖవేఱు విడి పింపఁ గలయట్టి విధము లెల్లఁ, జేయఁ దగవు రారే యని కూయుటయును, హరి. పూ 7.28

శా ఆలాపించుచు ౖవేలు ౖవేఁతలుఁ ౖబభూతా శ్చర్యులై రందఱున్... భాగ 10. 257.

ౖవేఁత వి. (√ౖవేయు) 1 దెబ్బ

క ఆ సూర్యభాముఁ డిౖక్రియ, ౖవేసిన యవ్వరిఘ దనుజవిభుఁ డధిక బలో,ల్లాసనమునఁ బుచ్చుకొని పొడి, నేసె నసురు లార్వ నతని శిరమొక ౖవేఁతన్ నిర్వ 4 56.

2 ౖవేయుట

క కొండొక సేపునకుఁ దెలిసి, చండ గదా దండ మున నసహ్య ౖకోధో,ద్దండత బలు ౖవేయఁగ నా,తండా గద విఱుగఁ జేసెఁదనగద ౖవేఁతన్ హరి. ఉ. 1. 129.

భోగినీ దండకము. తల్లి రాజుల్ బహు వ్యాజులే భోజులే చంచల చ్చిత్తులే మత్తులే ౖవేఁతకాయ త్తులే నూతనానక్తులే లోభ సంయుక్తులే దోష సంసిక్తులే. .

ౖవేఁపు=వేఁపు వి. (√ౖవేఁగు) ౖవేఁపుడు, వేఁగఁ జేయుట (శ ర)

ౖవేఁపుడు=వేఁపుడు (శ. ర)

ౖవేటు వి. (√ౖవేయు) 1 (కత్తి మొదలగు వానితో) కొట్టుట, ౖవేయుట.

గీ పోరి రేటును ౖవేటును బోటు నొక్క,యలవిఁ జెలఁగంగ నుభయ సైన్యముల వారు... భార భీష్మ. 3 225

గీ చలము శోభిల్ల నొండొరు నమయఁజేయ, వేగ పడి పెల్లుపొంచుచో ౖవేటుఁ బోటు, సాటు వగ పాటు నొండొరు బోటుపడక, దారుణంబుగఁ బోరి రవ్వీర వరులు. భా. రా ఆది, 2. 137,

